శ్రీరస్తు.

# వావిళ్ల నిఘంటువు

కర్తలు

శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి

బులుసు వేంకటేశ్వరులు, బి., ఏ.



వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

తండయార్పేట, మద్రాసు.

All Rights Reserved.

•

శ్రీః

# వావిళ్ల నిఘంటువు

# పీఠిక

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే,
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ."

శ్రీపార్వతీపరమేశ్వరులవలె వాగర్థము లవినాభావసంబంధము గలవి. శబ్దబ్రహ్మమూలమునఁ బరబ్రహ్మమును బొందుటకు శబ్దస్వరూపమును దత్తదర్థములను మానవుఁడు గుర్తెఱుంగవలయును. ఇందులకుఁ బూర్వగవుల ప్రయోగములును వ్యాకరణమును బ్రజలయుపయోగములును బ్రమాణములు. వీనిని బరిశీలించి యేర్చి కూర్చినవే నిఘంటువులు.

## ఆంధ్ర నిఘంటు చరిత్రము

సంస్కృతభాషలోనిపదముల యర్థపరిజ్ఞానమునకై యమరసింహప్రణీత మగునామలింగానుశాసనము మున్నగు పెక్కునిఘంటువులు వెలసినవి. వీని ననుసరించి యాంధ్రభాషయందును దొలుదొలుత బద్యనిఘంటువులు కొన్ని బయలువెడలినవి. వానిలో మొట్టమొదటిది కవిచౌడప్ప "చౌడప్పసీసము" లనుపేర ముప్పదిసీసములలో రచించిన చిన్ననిఘంటువు.

## చౌడప్పసీసపద్యనిఘంటువు

కవిచౌడప్పపద్యములఁ గొన్నిటి ననుసరించి యీతఁడు కళత్త్రవిజయగ్రంథకర్త యగుమట్లె యనంతభూపాలునకును, విజయవిలాసాదికృతిభర్త యగుతంజావూరి రఘునాథభూపాలునకును సమకాలికుఁడుగాఁ గానవచ్చుచున్నాఁడు. అందుచే నీతఁడు క్రీస్తుశకము ౧౬౫౭-౧౬౩౨ న నుండి యుండవలయును. ఈతనినిఘంటుస్వరూపము నీక్రిందిపద్యము విశదీకరింపఁగలదు.

"విరి యనఁ బుష్ప సీవిరి యనఁ గల్లు వ్రా, విరి యన చెట్టు కావిరియుఁ బొగయుఁ
పరి యన డాలు రూపరి యన సొగసు మే, పరి యన తిండి తేప రన తెగువ
తరు లనఁ బసులు బిత్తరులు నాఁ జెలులు చి, త్తరులు సాబొమ్మ లత్తరులు వలపు
కటి యనఁ గప్పు సాటి యన సాక్షి, బూకరి యన నదలు టక్కరి యన దొంగ
పరి యన చేను లాపరి యన బొంకును, సరి యన పండకేసరులు పద్దు
సూరిజనకల్ప వరదండకూకటల్ప, డంబుకటివేల్ప పిట్టసిడంబు డాల్ప."

దీని తరువాతిది క్రీస్తుశకము ౧౬౭౪ ప్రాంతమునకుఁ జెందినగన్నవరపువేంకటకవిప్రణీత మగు సర్వలక్షణశిరోమణి యను శ్రీవేంకటేశాంధ్రముగాఁ గన్పట్టుచున్నది.

## శ్రీ వేంకటేశాంధ్రము

ఇందు దేశ్యములు తద్భవములు నచ్చతెలుఁగుపదములు గలయఁ గూర్చి దైవతమానవస్థావరతిర్యఙ్నానార్థవర్గ లనువిభజనమున ౧౦౮ సీసపద్యములలో నిఘంటువు కూర్పఁబడినది.

దీనితరువాతఁ జెప్పఁదగిన పద్యమయాంధ్రనామనిఘంటువు పైడిపాటి లక్ష్మణకవిప్రణీత మగు "ఆంధ్రనామసంగ్రహము."

## ఆంధ్రనామసంగ్రహము

ఈయాంధ్రనామసంగ్రహము పూర్వోదాహృత మగు నాంధ్రభాషార్ణవమును బోలినది. ఇందు దేవమానవస్థావరతిర్యఙ్నానార్థవర్గులు కలవు. ఈనిఘంటువును గవి తనయిష్టదైవ మగు కాశీపతి యగు విశ్వేశ్వరున కంకిత మొసఁగియున్నాఁడు.

"ఆంధ్రరత్నాకర" మను పేర నితనిది మఱి యొకనిఘంటువు కలదు.

ఆంధ్రనామసంగ్రహమునఁ జేరక దాఁటిపోయినమఱికొన్నిపదములను జేర్చి "యాంధ్రనామశేష" మను పేర క్రీస్తుశకము ౧౭౫౦ ప్రాంతమున నడిదము సూరకవి యొకసంగ్రహనిఘంటువును రచించెను.

## ఆంధ్రనామశేషము

పైనిఘంటువులవలెఁ జర్వితచర్వణముగాఁ గాక యాంధ్రనామసంగ్రహమున కనుబంధముగా సూరకవి నిఘంటువు వెలయుటచే నీరెండును గలిసి కొంతసమగ్రతను సాధింపఁగలిగెను.

వీనితరువాతఁ జెప్పఁదగిన పద్యాంధ్రనిఘంటువు వెచ్చ కస్తూరి రంగకవికృత మగు "సాంబనిఘంటువు."

## సాంబనిఘంటువు

కస్తూరిరంగకవి క్రీస్తుశకము ౧౭౪౦ - ౫౦ ప్రాంతమునకుఁ జెందినవాఁడు. ఈనిఘంటువు సాంబమూర్తికంకిత మొసంగి యేతత్సంబోధనపూర్వకముగాఁ గవి నిఘంటువు నొనరించినాఁడు. ఆనందరంగరాట్ఛందోగ్రంథకర్త యగు నీకస్తూరి రంగకవి రచించినయీసాంబనిఘంటువును బ్రమాణముగనే యంగీకృతము.

ఆతరువాత పుదుకోటను క్రీ. శ. ౧౭౬౯-౮౯-లో పాలించిన శ్రీరఘునాథతొండమానున యాస్థానమున వెలసినవిద్వత్కవి యగు నుద్దండు పాటి వేంకటనార్యుఁడు "ఆంధ్రభాషార్ణవ" మను పేర నిఘంటువును బద్యరూపముననే రఘునాథభూపాలుని ప్రేరణమున రచించెను.

## ఆంధ్రభాషార్ణవము

పద్యమయనిఘంటువులలో నాంధ్రభాషార్ణవము యొక్క సమగ్రమును మిక్కిలి యుపయోగకరముగాను గన్పట్టుచున్నది. ఈనిఘంటువు రఘునాథభూపాలుని కోరిక ననుసరించి శ్రీ మాతృభూతేశ్వరున కంకితమీయఁబడినది. అమరమువలె బహువర్గవిభజనమున బహుప్రశస్తపదజాలము చాలనీ నిఘంటువున నీయఁబడుటచే నిది మిక్కిలి వన్నె కెక్కినది.

## ఆంధ్రపదాకరము

ఇంకను బద్యాంధ్రనిఘంటువులు కొన్ని యున్నవి. అందు నాంధ్రరత్నాకరము, పైగడప వారికంద పద్యనిఘంటువు మున్నగునవి ముఖ్యములు. ఇంకఁ గ్రీస్తుశకము ౧౮౦౦ ప్రాంతమున వెలువడిన శ్రీరాజా త్యాడి పూసపాటి వీరపరాజవిరచిత మగు "నాంధ్రపదాకర" మనుపద్యాంధ్రనిఘంటువు ముఖ్యమైనది. అముద్రితపద్యనిఘంటువులలో అమలాపురపు సన్యాసికృత మగు "సర్వాంధ్రసారసంగ్రహము"ను ముద్రితములగు వానిలో తూము రామదాసుకవి "ఆంధ్రపదనిధాన"మును గణింపఁదగినవి.

ఈపద్యాంధ్రనిఘంటువులలో ముఖ్య మగునాంధ్రపదజాలము పర్యాయపదమాలికలుగానే కాక నానార్థప్రతిపాదకమునై వచ్చియుండుట సత్యమే కాని యిందలిపెద్దలోప మివి యకారక్రమమున విరచింపఁబడియుండకపోవుటే. ఒకశబ్దముయొక్క యర్థ మెఱుఁగవలెను నన్నఁ బద్యమంతయు వల్లించినఁగాని లభింపదు. అనఁగా నకారాదినిఘంటువులలోఁ గలసౌలభ్య మిందు దుర్లభ్య మని భావము.

ఈపిమ్మట నాంధ్రనిఘంటువులను బహువులు వ్రాసినవారు లేరు. అకారాదిక్రమముకూడ నీపిమ్మటనే నిఘంటురచనమున నెలకొన్నది. క్రీ. శ. ౧౮౧౬-వ సంవత్సరములో మామిడి వెంకయ్య యను నాతఁడు "ఆంధ్రదీపిక" యను లఘునిఘంటు వొకటి రచించెను.

## ఆం ధ్ర దీ పి క

ఈనిఘంటువు ౧౮౪౮-వ సంవత్సరమునఁ జెన్నపురిలో ముద్రిత మయ్యెను. ఇందుఁ జెప్పఁదగినవిశేషము లేమియుఁ గానరావు. ప్రాచీనప్రబంధములలోని పదములనుమాత్ర మకారాదిగాఁ గైకొని వానికి వివిధార్థముల నిచ్చుటయే యిందలివిశేషము.

అటుతరువాత నాంధ్రశబ్దక్రమనిఘంటువుగ నాంగ్లభాషావాదుల కర్థ మగుటకై యాంధ్రశబ్దములకు నాంగ్లార్థములు గూర్చుచు క్రీ. శ. ౧౮౦౭ లో విలియం బ్రౌన్ (William Brown) అనునాతఁడు తెలుఁగు ఇంగ్లీషు నిఘంటు వొకటి ప్రకటించెను. తరువాత క్రీ. శ. ౧౮౨౧ ప్రాంతమున ఎ. డి. కాంబెల్ (A. D. Campbell) అను రాజకీయోద్యోగి యొకనిఘంటువు రచించి ప్రకటించెను.

కాంబెలునిఘంటువు పిమ్మట నంతకంటె విస్తృతము లైన బ్రౌనుదొర (C. P. Brown) క్రీ. శ. ౧౮౫౨-౫౪ వ సంవత్సరమున మూఁడునిఘంటువులు విరచించెను.

## బ్రౌ ణ్య ని ఘం టు వు

ఇం దొకటి యాంధ్రపదముల కాంగ్లార్థములు కలది. ఇదియే మన కత్యంతోపయోగకారి. వేఱొకటి యాంగ్లపదముల కాంధ్రార్థములు గలది. ఇదియు నాంగ్లభాషాపాండిత్యముకై యాంధ్రుల కెంతయు నుపయోగకరమైనది. మూఁడవది మిశ్రబ్రౌణ్యము. ఇది వివిధభాషలనుండి యన్యదేశ్యములై యాంధ్రదేశమున వాడుకలో నెలకొనినపదములకు వివిధార్థవివరణము చూపఁబడినది. ప్రస్తుతము మన మిట వివరింపఁదలఁచినది యాంధ్రపదముల కాంగ్లార్థములు చూపిననిఘంటువే. ఈనిఘంటువున నొక పెద్ద నాంధ్రపదజాలము చేరినది. శబ్దార్థములను స్పష్టపఱుచునట్టి సూక్తులును, పూర్వకవిప్రయోగవిశేషములు ఆశ్వాసపద్యసంఖ్యతో నిందుఁ జాలఁ గలవు. ఈనిఘంటురచనమున నాంధ్రభాష కాతఁ డొనరించినసేవ యపార మనుటలో నతిశయోక్తి లేదు. ఈతని యీనిఘంటువే తరువాతి యాంధ్రనిఘంటువుల కెంతయో యుపయోగించిన దనుట పరమసత్యము. క్రీ. శ. ౧౮౪౭-వ సంవత్సరమునఁ దొలియాంధ్రగ్రంథ మచ్చుపడినను ౧౮౭౦ వఱకు నాంధ్రగ్రంథము లచ్చుపడుటకే నోఁచుకొననిదినములలోఁ బ్రాచీనప్రబంధముల నెన్నిటినో సంపాదించి పండితులచేఁ బరిష్కరింపించి, కొన్నిటికి టీకలు వ్రాయించి, కొన్నిటిఁ బ్రకటించి, యాంధ్రమున వ్యాకరణమును నిఘంటువును జక్కఁగా రచించి యొసఁగిన బ్రౌనుదొరఋణ మాంధ్రులు తీర్చుకొనఁ జాలని దనుటలో నతిశయోక్తి కెడము లేదు.

బ్రౌనుదొరయనంతరము పండితాదరణపాత్రమై యాంధ్రమహాజనుల కుపయోగించుట కొక సమగ్రాంధ్ర నిఘంటువును సమర్థతతో రచింప సమకట్టినవాఁడు శ్రీపరవస్తు చిన్నయసూరి.

## చి న్న య సూ రి ని ఘం టు వు

ఈసంకల్పముతో క్రీ. శ. ౧౯-వ శతాబ్దపూర్వార్థమున నీపండితాగ్రణి బహుశ్రమల కోర్చి యకారాదిక్రమమునఁ బదములపట్టికను ఇదివఱకుఁ దయారుచేసికొని ప్రతిపదమునకును బ్రతి యర్థమునకును సిద్ధాంతము లైనప్రయోగములనుమాత్రమే సేకరింపఁ బూనుకొనె ననుట కీతఁడు సేకరించి యుంచుకొన్న ప్రయోగములే సాక్షిభూతములు. శబ్దస్వరూపనిర్ణయమునకు నిర్ధారకము లగునట్టిప్రాసాదులందు వాడఁబడినప్రయోగములే యాతఁడు గ్రహించియుండెను. ఈతనిచేతిలో నీనిఘంటువు పూర్తియై యున్నచో భాషకు మహోపకృతి జరిగియుండెడిది. ఈకార్యము తుదముట్టకుండనే చిన్నయసూరి పరమపదించుటచే నాతఁడు నిఘంటువు రచింపఁ బూనుకొనె నన్నవిషయము కూడ నెందఱికో తెలియలేదు.

పిమ్మట, సముపలబ్ధము లైన ప్రాచీననిఘంటువు, చిన్నయసూరిపదములపట్టిక, వివిధప్రచురిత ప్రబంధములు నాధారముగాఁ జాలవఱకు సమగ్రమును ప్రామాణికమును ననఁదగిన "శబ్దరత్నాకరము"ను శ్రీబహుజనపల్లి సీతారామాచార్యులవారు రచింపఁగా నది క్రీ. శ. ౧౮౮౫-వ సంవత్సరమునఁ బ్రకటితమయ్యెను. దీనిని శ్రీ చదలవాడ సీతారామశాస్త్రిగారు రచించిరనియు, వారు గతించిన మీదట శ్రీ ఆచార్యులుగారు ఈ నిఘంటువును తమ పేర ప్రకటించుకొనిరనియు ప్రతీతికలదు.

### శబ్దరత్నాకరము

ఈశబ్దరత్నాకరమున శబ్దస్వరూపనిర్ణయము నర్థనిర్ణయమును జాలవఱకు శాస్త్రసమ్మతముగాను సమంజసముగాను జేయఁబడినవి. పలుతావులఁ బదార్థప్రామాణికమును లగు పూర్వకవులప్రయోగములును బహుళముగా నిం దీయఁబడినవి. పూర్వనిఘంటువు లన్నిటికంటె నిది చాల మేలయిన దనుటకు సందియము లేదు. అందుచేతనే యిది నాఁటినుండి నేఁటివఱకును ప్రామాణికనిఘంటు వన్న ప్రశస్తి నందినది. కాని, యిందును జేరనిపదజాల మెంతయో భాషలోఁ గలదు. అందుచే ఇంతకంటెను సమగ్రము సప్రమాణము నగునిఘంటువు రచించునావశ్యకత నెందఱో పండితులు వెల్లడించి యుండిరి.

### ఆంధ్రపదపారిజాతము

ఈపిమ్మట నొకటిరెండుసంవత్సరములలోనే కేవలము శుద్ధాంధ్రనిఘంటు వొకటి యవసర మను తలంపుతో క్రీ. శ. ౧౮౮౮ వ సంవత్సరమున పైనిఘంటువును శ్రీ ఓగిరాల జగన్నాథకవి శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారలు ప్రకటించిరి. ఇం దకారాదిక్రమమున నెన్నియోయాంధ్రపదముల కర్థములు నర్థాంతరములు చూపఁబడినవి. నేఁడు మఱుఁగుపడినదేశ్యపదము లిం దెన్నియో గలవు.

### శబ్దార్థచంద్రిక

దీనితరువాత క్రీస్తుశకము ౧౯౦౬ ప్రాంతమున శ్రీమహంకాళిసుబ్బరాయవిరచిత మగు "శబ్దార్థచంద్రిక" వెలువడినది. ఇదియు నసమగ్రనిఘంటువే యైనను విద్యార్థులకుఁ బాఠశాలలోని యుపాధ్యాయులకు మాత్రము బాగుగా నుపయోగించునదిగా నున్నది.

### లక్ష్మీనారాయణీయము

దీనితరువాతఁ జేర్కొనఁ దగినది ౧౯౦౪-వ సంవత్సరము ప్రచురిత మైన శ్రీ కొట్ర లక్ష్మీనారాయణశాస్త్రిగారి "లక్ష్మీనారాయణీయ" మను శుద్ధాంధ్రప్రతిపదార్థపర్యాయపదనిఘంటువు. ఇదియును గతిపయప్రయోగములతోఁ గొంతయుపయోగకరముగానే వెలసియున్నది.

ఆపిమ్మట ౧౯౧౧ వ సంవత్సరప్రాంతమున చెన్నపురిలో నాంధ్రసాహిత్యపరిషత్తు స్థాపింపఁబడినది. దానియాధ్వర్యమున శ్రీ పీఠికాపురమహారాజునాదార్యమున "శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు" నిర్మాణ మారంభమైనది. నాఁటినుండి నేఁటివఱకు రెండుబృహన్నిఘంటువులు వెలువడ నారంభించినవి. అవి యాంధ్రవాచస్పత్యము, శ్రీసూర్యరాయనిఘంటువు. వీనిలోఁ దొలుత వెలువడిన దాంధ్రవాచస్పత్యము.

### ఆంధ్రవాచస్పత్యము

ఈయాంధ్రవాచస్పత్యనిఘంటువు శ్రీ కొట్ర శ్యామలకామశాస్త్రిగారిచే విరచితమై ౧౯౩౪-౧౯౪౦ లో నాల్గుసంపుటములుగాఁ బూర్తిగాఁ బ్రకటితమైనది.

### శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు

ఆంధ్రదేశమునందలి యనేకసుప్రసిద్ధపండితుల దీర్ఘకాలవిశేషపరిశ్రమమునకు ఫలితముగా శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు ౧౯౩౬-౪౪ లలో నాల్గుసంపుటములు వెలువడినవి. అందు

అ-మొదలు 'ప్రస్థిమాలి' అనుపదమువఱకు కలదు. ఈనాలుగుసంపుటములుఁ గాక మఱిమూఁడునాలుగు సంపుటములలో నీనిఘంటువు పూర్తియగు నని తెలియుచున్నది.

కాని యివి అనేకసంపుటములలో నుండుటచే అందఱకు నందుబాటులో నుండఁజాలవు. కనుక నుత్కృష్ట మగునీనిఘంటుపద్ధతినే తక్కువపుటలలో నెక్కువవైశిష్ట్యముతో నందఱ కందు బాటులో నుండునట్లు రెండుసంపుటములలోనే మఱియొకనిఘంటువు విరచితము కావలసినయావశ్యకత పొడసూపినది. ఈహేతువుచేతనే "వావిళ్లనిఘంటువు" వెలువడినది.

## వావిళ్లనిఘంటువు

క్రీ. శ. ౧౯౩౨, ౧౯౩౩ సంవత్సరప్రాంతముననే యిట్టినిఘంటువును సంస్కృతాంధ్రాద్యనేకభాషా మహోద్గ్రంథ ప్రకటనకర్తలు భాషోద్ధారకబిరుదవిరాజితులు పండితపుంగవులు నగు బ్రహ్మశ్రీ వావిళ్లవేంకటేశ్వరశాస్త్రులుగారు తమసంస్థపేరఁ బ్రకటింప సంకల్పించిరి. అందులకై బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారిని ఏర్పఱిచిరి. వారును నిఘంటు నిర్మాణానుభవము, విశేషపాండిత్యము, భాషాభిరుచి కలవారగుటచే ౧౯౩౩ లో ననఁగా శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువుకాని యాంధ్రవాచస్పత్యముకాని తొలిసంపుటము ప్రకటింపఁబడక పూర్వమే "వావిళ్లనిఘంటు" రచనమునకుఁ గడంగిరి. ౧౯౩౪-వ సంవత్సరమునకే అకారాదిగా 'ఇంచు'వఱకు రచించిరి. అది వెంటనే ౨౮౮ పుటలలోఁ బ్రకటిత మయ్యెను. కాని దురదృష్టవశమున నీపని పూర్తి కాకుండనే వారు పరమపదించుటచే నంతతో నిఘంటురచన మాఁగిపోయెను. కాని శ్రీశాస్త్రులవారు దాని నట్టే విడువక పూర్తిచేయ సంకల్పించి యానిఘంటుకార్యమునకు నన్ను నియోగించిరి. ఇందు అకారాది "ఇంచు" అనుపదము మూఁడవయర్థమువఱకు శ్రీ శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు రచించినది. ఆతరువాతినుండి యనఁగా ౨౮౯-వ పుటనుండి యీనిఘంటువు నేను రచించినది.

## నిఘంటునిర్మాణనియమములు

తత్సమతద్భవదేశ్యాన్యదేశ్యపదము లీనిఘంటువున నుండును. తత్సమపదములు ప్రామాణిక సంస్కృతనిఘంటువులనుండి సేకరింపఁబడినవి. ఆయాపదములకుఁ గొన్నియర్థములకు నర్థవిశేషములకు నావశ్యకత ననుసరించి పూర్వాంధ్రప్రబంధములనుండి సంస్కృతకావ్యనాటకాదులనుండి ప్రయోగములు నీయఁబడినవి. ఉపసర్గశతృంతాదిశబ్దములు తెలుఁగున ప్రత్యేకముగాఁ బ్రయోగింపఁబడకపోయినను సంస్కృతసమాసమధ్యగతము లగుట వానినిఁగూడ నిందు యథావకాశలభ్య ప్రయోగములతోఁ జేర్చితిమి.

దేశ్యవైకృతవిభాగము ప్రామాణికము లగులక్ష్యలక్షణముల ననుసరించి యిందును జేయఁబడినది. వైకృతశబ్దములకుఁ బెక్కింటికి సంస్కృతరూపములను జూపితిమి. ఆయాపదముల కన్యభాషాసజాతీయపదముల నటనటఁ జూపినారము.

శబ్దస్వరూపనిర్ణయముపట్ల వ్యాకరణము యతిప్రాసాదుల వాడఁబడిన నిర్ధారకపూర్వకవి ప్రయోగములు ప్రామాణికములుగా గ్రహించితిమి. ఒక్కొక్కపదమున కొక్కొక్కయర్థమును స్పష్టముగాఁ దెలియఁజేయుప్రయోగమున నెంతవఱ కవసరమో యంతవఱకే యాపద్యమును బద్యముల నుదాహరించితిమి. ప్రతిపదమునకుఁ బూర్వ పూర్వతర పూర్వతమ కవిప్రయోగముల నొసఁగుట యనవసర మనుభావముతో నొండొం డుదాహరణములే యొసఁగి యితరప్రయోగములను గ్రంథాశ్వాసపద్యసంఖ్యలచేఁ జూపితిమి.

శబ్దముల యర్థముల ఛాయాభేదములు తెలుపుటకు ; అను గుర్తును, కేవలపర్యాయపదములే యని తెలుపుటకు , అనుగుర్తును వాడితిమి.

ఇచ్చిన ప్రయోగపద్యములకుఁ గలముఖ్యపాఠాంతరము లవసరము లని తోఁచినచోట్లఁ జూపఁబడినవి. అట్లే తెలుఁగుభారతాదులలోనిపదములయర్థములకు మేము నిర్ణయించినయర్థమే సమంజసమగుటకు సంస్కృతభారతాదిగ్రంథములనుండియు నటనట శ్లోకము లుదాహరించితిమి.

జన్యజనకశబ్దములరూపములు చూపలేదు కాని యే తెలుఁగుపదమున కే తెలుఁగుధాతువో కుండలీకరణములఁ జాలచోట్లఁ జూపెకారము. ఇట్లే యే తెలుఁగుక్రియ యే తెలుఁగుక్రియకుఁ బ్రేరణరూపమో కూడఁ జూపితిమి.

తెలుఁగునాడున నతివ్యాప్తిలో నున్నయన్యదేశ్యము లగు ఉర్దూ, హిందూస్థానీ, ఆంగ్ల పదములను గ్వాచిత్కముగా నాయా వ్యాపృతార్థములతో మాత్రమే యొసఁగియున్నాము.

అర్థవివరణాదులకట్లఁ బూర్వనిఘంటువులయందువలెనే సౌలభ్యముకొఱకు విసంధులనే మేమును భాషలో వాడియుంటిమి.

శబ్దముల కొన్నొక్కచోట వ్యుత్పత్తి ననుసరించి యాయాయర్థములు వచ్చినచోట నాయాయర్థములలోఁ బూర్వకవిప్రయోగములు కానరానిచోటుల నాయాయర్థముల కాధారములు వాని వ్యుత్పత్తులే యని తెలుపుటకు 'వ్యు' అని కుండలీకరణములఁ జూపితిమి.

అసంయుక్తాక్షరములు గలపదములకుఁ గొన్నిటికి సంయుక్తాక్షరములు గలపదములు రూపాంతరములు గలయప్పుడు లభించినప్రయోగముల ననుసరించి యక్షరక్రమమున రెండురూపములును జూపఁబడినవి.

ఒక్కపదమే సాధురేఫముగను శకటరేఫముగనుగూడ నిర్ధారకప్రయోగములతో నున్న పక్షమున అకారక్రమము ననుసరించి ముందు సాధురేఫ గలపదములను అర్థములతోడను బ్రయోగములతోడను దరువాత నట్లే శకటరేఫయుక్తపదముల నర్థాదులతోడను నిచ్చితిమి. ఒక్కొక్కచోట సాధురేఫముప్రక్కఁ గుండలీకరణమున శకటరేఫాక్షర ముంచి మిగిలినపదాక్షరములు వ్రాసి చూపితిమి. అపు డాపదము లుభయరేఫయుతము లని యెఱుంగవలయును.

శబ్దరత్నాకరము ననుసరించి 'ళ' నంత్యాక్షరముగనే గ్రహించి యాపదక్రమముననే యది గలపదము లన్నియుం వానివానియంతములందే చూపితిమి.

సమానార్థకములై యల్పాక్షరవిభేదములతోఁ గలపదముల నంపలియొకపదాంతమున "ఇట్లే:" యని యిచ్చి వానికిఁ గలిగెనేని ప్రయోగములను నిచ్చితిమి. ఈనియమము సంస్కృతాంధ్ర పదముల రెండింట నున్నది.

సమానార్థప్రతిపాదకము లగుపదములకు సమచిహ్నము ( = ) ను, వ్యుత్పత్తులఁ దెలుపుపట్లఁ (—— ——) దీర్ఘరేఖలును వాడఁబడినవి. ఇంకను మిగిలిననియమములు విస్పష్టములు. ఇందుఁ జేరనిపదములఁ గొన్నిటినిఁ జేర్చి చివర ననుబంధముగా నకారాదిక్రమమున నొసఁగియున్నాము.

## కృతజ్ఞత

భాషోద్ధారక బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు తమసహజోదారహృదయముతో నా కీమహావకాశము నొసఁగి యీరూపముననే నాంధ్రభాషామాత నారాధించుటకు హేతుభూతులైనందులకు వారికి నాహృదయపూర్వకకృతజ్ఞతావందనము లర్పింతును. ఈమహాకార్యమున నాకుఁ బ్రోత్సాహ మొసఁగుచువచ్చినమిత్రవరులకుఁ బండితులకు నావందనములు.

ఇట్లు, బుధజనవిధేయుఁడు,

౭-౧౧-౧౯౪౯.

బులుసు వేంకటేశ్వరులు, బి. ఏ.

కాకినాడ.

# వావిళ్ల నిఘంటువు సంజ్ఞావివరణ పట్టిక

| సంజ్ఞలు. | వివరణము. |
|---|---|
| అ | అకారాంతము. ఇక్కడ అ, ఇ, ఈ, ఉ, ఊ, న్ మున్నగునవి ఆయా అంతములుగా గ్రహింపనగును. |
| (అ. ఆ. అ) | పుంలింగ విశేషణమైనపుడు అకారాంతము, స్త్రీలింగ విశేషణమైనపుడు ఆకారాంతము, నపుంసక లింగవిశేషణమైనపుడు అకారాంతము. |
| (అ. ఆ, ఈ. అ) | స్త్రీలింగ విశేషణమైనపుడు ఆకారాంతము మఱియు ఈకారాంతమును. |
| (అ. ఈ. అ) | స్త్రీలింగ విశేషణమైనపుడు ఈకారాంతము. స్త్రీలింగములలో విశేషము లున్నపుడవి స్పష్టముగా సూచింపఁబడినవి. తుది అచ్చులనుబట్టి అవి ఆయా అంతము లని గ్రహింపనగును. ఉదా:—1. ఏకకుఁడు. సం. విణ. (అ. కికా. అ.) ఇట స్త్రీలింగ రూపము ఆకారాంతమగు 'ఏకికా' అని గ్రహింపనగును. 2. ఋణదాత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ఇట స్త్రీలింగరూపము ఈకారాంతమగు ఋణదాత్రీ యని గ్రహింపనగును. 3. ఋణి. సం. విణ. (న్. నీ. న్.) ఇట స్త్రీలింగరూపము ఈకారాంత మగు ఋణినీ యని గ్రహింపనగును. 4. అపటువు. సం. విణ. (ఉ. ఉ, ట్వీ. ఉ.) ఇట స్త్రీలింగరూపములు ఉకారాంతమగు 'అపటువు' ఈకారాంతమగు 'అపట్వీ' యని గ్రహించునది. 5. ఉదర్చి. సం. విణ. (న్) ఇట మూఁడులింగములలో నొకటే రూప మని గ్రహింపనగును. |
| అ. క్రి. | అకర్మకక్రియ. |
| అనౌ. | అనౌపవిభక్తికము. |
| అప. | అపపదము. (అగమము మొదలగునవి) |
| అలం. | అలంకారశాస్త్రము. |
| అవ్య. | అవ్యయము. |
| ఆ. | ఆట వెలఁది. |
| ఆం. | ఆంగ్లము. |
| ఆమ్రే. | ఆమ్రేడితరూపము. |
| ఉ. | ఉత్పలమాల; ఉర్దూభాష. |
| ఉదా. | ఉదాహరణము. |
| ఉప. | ఉపపదము. |
| ఉభ. | ఉభయము. (తెలుఁగును సంస్కృతమును) |
| ఏ. | ఏకవచనాంతము. |
| ఔ. | ఔపవిభక్తికము. |
| క. | కన్నడము; కందపద్యము. |
| క్రి. | క్రియ. |
| క్రి. విణ. | క్రియావిశేషణము. |
| గణిత. | గణితశాస్త్రము. |
| గీ. | గీతపద్యము. |
| చ. | చంపకమాల. |
| చూ. | చూడుఁడు. |
| ఛంద. | ఛందశ్శాస్త్రము. |
| జ్యోతి. | జ్యోతిశ్శాస్త్రము. |
| త. | తమిళము. |
| దే. | దేశ్యము. |
| ద్వ. | ద్వయము. [వైకృతమును దేశ్యమును గలిసిన పదము.] |
| ద్రు. | ద్రుతాంతము. |
| ధా. | ధాతువు. |
| న. | నపుంసకలింగము. |
| పీఠి. | పీఠిక. |
| పుం. | పుంలింగము. |
| పుం. న. | పుం నపుంసకలింగము. |
| పుం. స్త్రీ. | పుం స్త్రీలింగము. |
| ప్ర. | ప్రత్యయము. |
| ప్రా. | ప్రాకృతము. |
| ప్రే. | ప్రేరణరూపము. |
| బ. | బహువచనాంతము. |
| మ. | మళయాళము, మత్తేభవృత్తము. |
| మి. | మిశ్రము. [సంస్కృతపదము సంస్కృతేతర పదముతోఁగాని తెలుఁగు కృత్ప్రత్యయముతోఁగాని తద్ధిత ప్రత్యయముతోఁగాని కలిసిన పదము.] |

| సంజ్ఞలు. | వివరణము. | సంజ్ఞలు. | వివరణము. |
|---|---|---|---|
| మొ. | మొదలైనవి. | శా. | శార్దూలవృత్తము. |
| యు. | యుగళము. | శ్లో. | శ్లోకము. |
| | [కొన్ని యర్థములందు దేశ్యము కొన్నిట వైకృతమునైన పదము.] | సం. | సంస్కృతము. |
| | | స. | సర్వనామము. |
| రూ. | రూపాంతరము. | స. క్రి. | సకర్మకక్రియ. |
| వా. | వాడుక. | సా. | సామెత. |
| వి. | విశేష్యము. | సీ. | సీసపద్యము. |
| విణ. | విశేషణము. | స్త్రీ. | స్త్రీలింగము. |
| వై. | వైకృతము. | హిం. | హిందూస్థానీభాష |
| వ్యతి. | వ్యతిరేకార్థకపదము. | = | సామ్యచిహ్నము. |
| వ్యవ. | వ్యవహారము. | ❦ | వృక్షలతాదిసూచకము. |
| వ్యాక. | వ్యాకరణశాస్త్రము. | ... | వీని నడుమఁ గొన్ని యక్షరము లున్నవని తెలుపును. మిగిలినవి స్పష్టము. |
| శత్రం. | శత్రంతము. [దీనికి తెలుఁగున వ్యస్తప్రయోగము లేదు.] | | |

# గ్రంథసంకేత వివరణ పట్టిక

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 1 | అచలా. | అచలాత్మజా పరిణయము | ఆ. 3 | వేంకటాచార్యకవి | ౧౮ శ | మంజువాణీప్రెస్సు 1939-1906సం॥ |
| 2 | అచ్చ. | అచ్చ తెలుఁగు రామాయణము | కాం. ౬ | కూచిమంచి తిమ్మకవి | ౧౯ శ | వావిళ్లప్రెస్సు 1930 |
| | ,, బాల. | బాలకాండము | | | | |
| | ,, అయో. | అయోధ్యాకాండము | | | | |
| | ,, అర. | అరణ్యకాండము | | | | |
| | ,, కిష్కిం. | కిష్కింధాకాండము | | | | |
| | ,, సుం. | సుందరకాండము | | | | |
| | ,, యు. | యుద్ధకాండము | | | | |
| 3 | అధ్యా. | అధ్యాత్మరామాయణము | కాం. ౭ | కోటమరాజు నాగయ్య | ౧౭ శ | వావిళ్లప్రెస్సు |
| | ,, ఉ. | ఉత్తరకాండము | | | | |
| 4 | అధ్యా. సం. | అధ్యాత్మసంకీర్తనలు | ౪౧౩ సం. | తాళ్లపాక అన్నమాచార్యులు | ౧౫ శ | దేవస్థానముప్రెస్సు, చెన్నపురి 1936 |
| 5 | అని. | అనిరుద్ధ చరిత్రము | ఆ. ౫ | కనుపర్తి అబ్బయ | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1924 |
| 6 | అప్ప. | అప్పకవీయము | ఆ. ౫ | కాకునూరిఅప్పకవి | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1924 |
| 7 | అ. మ. క. | అష్టమహిషీ కల్యాణము (ద్విపద) | | తిరువేంగళనాథుఁడు | ౧౫ శ | టి. టి. డి. ప్రెస్సు చెన్నపురి 1937 |
| 8 | అహ. | అహల్యాసంక్రందనము | ఆ. 3 | సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడు | ౧౮ శ | శృంగారగ్రంథమండలి 1938 |
| 9 | ఆం. చం. | ఆంధ్రచంద్రాలోకము | | అడిదము సూరకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు |
| 10 | ఆం. పదా. | ఆంధ్రపదాకరము | | | ౨౦ శ | |
| 11 | ఆం. పారి. | ఆంధ్రపదపారిజాతము | | ఓగిరాల జగన్నాథకవి. గురుజాడ శ్రీరామమూర్తి | ౧౯ శ | శారదానిలయ ముద్రాక్షరశాల 1888 |
| 12 | ఆం. భా. | ఆంధ్రభాషార్ణవము | కాం. 3 | నుదురుపాటి వేంకన | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1931 |
| 13 | ఆం. శా. | ఆంధ్రశబ్దానుశాసనము | పరి. ౬ | చిన్నయసూరి | ౧౯ శ | కాకినాడప్రెస్సు 1931 |
| 14 | ఆం. శే. | ఆంధ్రనామశేషము | | అడిదము సూరకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1929 |
| 15 | ఆం. సం. | ఆంధ్రనామసంగ్రహము | వర్గులు ౫ | పైడిపాటి లక్ష్మణకవి | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1929 |
| | ,, దేవ. | దేవవర్గు | | | | |
| | ,, మాన. | మానవవర్గు | | | | |
| | ,, స్థా. | స్థావరవర్గు | | | | |
| | ,, తిర్య. | తిర్యగ్వర్గు | | | | |
| | ,, నా. | నానార్థవర్గు | | | | |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 16 | ఆనంద. | ఆనందరంగరాట్ఛందము | ఆ. ౪ | కస్తూరిరంగయ్య | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1922 |
| 17 | ఆము. | ఆముక్తమాల్యద | ఆ. ౬ | కృష్ణదేవరాయలు | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1930 |
| 18 | ఇందు. | ఇందుమతీపరిణయము | ఆ. ౬ | కుమారధూర్జటి | ౧౭ శ | చంద్రికాప్రెస్సు 1912 |
| 19 | ఉద్భ | ఉద్భటారాధ్యచరిత్రము | ఆ. 3 | తెనాలిరామకృష్ణుఁడు | ౧౬ శ | భవానీప్రెస్సు బెజవాడ 1928 |
| 20 | ఉ. రా. | ఉత్తరరామాయణము | ఆ. ౧౦ | కంకంటిపాపరాజు | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1926 |
| 21 | ఉ. హరి. | ఉత్తరహరివంశము | ఆ. ౫ | నాచనసోమన | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1919 |
| 22 | ఉ. హరిశ్చ. | ఉత్తర హరిశ్చంద్రోపాఖ్యానము | ఆ. ౪ | తక్కెళ్ల పాటి లింగన | ౧౭ శ | సరస్వతీనిలయ ముద్రాక్షరశాల, నెల్లూరు 1891 |
| 23 | కకు. | కకుత్థ్సవిజయము | ఆ. ౫ | మట్ల అనంతభూపాలుఁడు | ౧౬ శ | బాలసరస్వతీ ముద్రాక్షరశాల, కాకినాడ 1904 |
| 24 | కలు. శ. | కలువాయిశతకము | | డబ్బీరు నరసకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1926 |
| 25 | కవిక. | కవికర్ణ రసాయనము | ఆ. ౬ | సంకుసాల నృసింహకవి | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1925 |
| 26 | కవిచౌ. | కవిచౌడప్పశతకము | | కవిచౌడప్ప | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1926 |
| 27 | కవిజ. | కవిజనరంజనము | ఆ. 3 | అడిదము సూరకవి | ౧౮ శ | పియర్లెస్ ప్రెస్సు మద్రాసు 1932 |
| 28 | కవిజనా. | కవిజనాశ్రయము | అధి. ౪ | వేములవాడ భీమకవి | ౧౨ శ | సుజనరంజనీ ముద్రాక్షరశాల కాకినాడ 1932 |
| | ,, సంజ్ఞా. | సంజ్ఞాధికారము | | | | |
| | ,, వృత్తా. | వృత్తాధికారము | | | | |
| | ,, జాతి. | జాత్యధికారము | | | | |
| | ,, దోషా. | దోషాధికారము | | | | |
| 29 | కవిరా. | కవిరాజమనోరంజనము | ఆ. ౫ | కనుపర్తి అబ్బయ | ౧౮ శ | వావిళ్లప్రెస్సు |
| 30 | కవి. సం. | కవిజనసంజీవని | తరం. ౪ | ముద్దరాజు రామభద్రకవి | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1929 |
| 31 | కవిసం. | కవిసంశయవిచ్ఛేదము | తరం. 3 | అడిదము సూరకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1925 |
| 32 | కళా. | కళాపూర్ణోదయము | ఆ. ౮ | పింగళి సూరన | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1930 |
| 33 | కావ్యా. | కావ్యాలంకారచూడామణి | ఉల్లా. ౯ | విన్నకోట పెద్దన | ౧౨ శ | కేసరిప్రెస్సు చెన్నపురి 1929 |
| 34 | కాశీ. | కాశీఖండము | ఆ. 7 | శ్రీనాథుఁడు | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1933 |
| 35 | కాళ. | కాళహస్తిమాహాత్మ్యము | ఆ. ౪ | ధూర్జటి | ౧౬ శ | బ్రిటిష్ మాడల్ ప్రెస్సు చెన్నపురి 1930 |
| 36 | కాళ. శ. | కాళహస్తీశ్వరశతకము | | ధూర్జటి | ౧౬ శ | కళ్యాణిప్రెస్సు తెనాలి 1949 |
| 37 | కాళిందీ. | కాళిందీకన్యాపరిణయము | ఆ. ౬ | అహోబలపతి | ౧౭ శ | కాకినాడప్రెస్సు 1929 |
| 38 | కుచేల. | కుచేలోపాఖ్యానము | ఆ. 3 | గట్టుప్రభువు | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1924 |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 39 | కువల. | కువలయాశ్వ చరిత్రము | ఆ. ౫ | సవరము చిననారాయణ | ౧౭ శ | బాలసరస్వతి ముద్రాక్షరశాల కాకినాడ 1903 |
| 40 | కు. సం. | కుమారసంభవము | ఆ. ౧౨ | నన్నెచోడుఁడు | ౧౪ శ | వావిళ్లప్రెస్సు 1949 |
| 41 | కృ. క. | కృష్ణకర్ణామృతము | ఆ. 3 | వెలగపూడివెంగన | ౧౯ శ | వావిళ్లప్రెస్సు 1943 |
| 42 | శకుం. | శకుంతలాపరిణయము | ఆ. 3 | కృష్ణకవి | ౧౯ శ | వావిళ్లప్రెస్సు 1926 |
| 43 | కృష్ణ. | కృష్ణశతకము | | నృసింహకవి | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1925 |
| 44 | కృష్ణా. | కృష్ణాభ్యుదయము | ఆ. ౫ | గొంతేటి సూరన | ౧౮ శ | వావిళ్లప్రెస్సు |
| 45 | కేయూర. | కేయూరబాహుచరిత్రము | ఆ. ౪ | మంచన | ౧౩ శ | సరస్వతీప్రెస్సు కాకినాడ 1902 |
| 46 | క్రీడా. | క్రీడాభిరామము | ఆ. ౧ | వల్లభరాయఁడు | ౧౪ శ | పద్మాప్రెస్సు 1929 |
| 47 | గంధ. | గంధవహము | ఆ. ౧ | మంచెర్ల వాసుదేవకవి | ౧౮ శ | సరస్వతీప్రెస్సు కాకినాడ 1911 |
| 48 | గాథే. | శృంగారగాథయోపాఖ్యానము | ఆ. ౧ | అనంతనార్యుఁడు | ? | కేసరీప్రెస్సు చెన్నపురి 1929 |
| 49 | చంద్ర. | చంద్రభానుచరిత్రము | ఆ. ౫ | తరిగొప్పుల మల్లన | ౧౬ శ | బ్రిటిష్ మాడల్ ప్రెస్సు చెన్నపురి 1922 |
| 50 | చంద్ర. వి. | చంద్రరేఖావిలాపము | ఆ. 3 | కూచిమంచిజగ్గకవి | ౧౮ శ | 1931 |
| 51 | చంద్రా. | చంద్రాంగదచరిత్రము | ఆ. ౬ | పైడిమఱ్ఱి వేంకటపతి | ౧౭ శ | సరస్వతీనిలయ ముద్రాక్షరశాల, నెల్లూరు 1897 |
| 52 | చంద్రి. | చంద్రికాపరిణయము | ఆ. ౬ | సురభి మాధవరావు | ౧౬ శ | ఆనందముద్రాక్షరశాల 1908 |
| 53 | చం. రా. | చంపూరామాయణము | ఆ. ౮ | ఋగ్వేదకవి వేంకటాచలపతి | ౧౮ శ | కాకినాడప్రెస్సు కాకినాడ |
| 54 | చక్ర. | చక్రవాళమంజరి | | తాళ్లపాక పెద తిరుమలయ్య | ౧౫ శ | దేవస్థానముప్రెస్సు 1935 |
| 55 | చమ. | చమత్కారమంజరి | ఆ. 3 | సింహాద్రి వేంకటాచార్యులు | ౧౬ శ | వేణుగోపాల ముద్రాక్షరశాల, విశాఖపట్టణము 1884 |
| 56 | చారు. | చారుచర్య | | అప్పన మంత్రి | ౧౪ శ | వావిళ్లప్రెస్సు 1949 |
| 57 | చిత్రభా. | చిత్రభారతము | ఆ. ౮ | చరిగొండ ధర్మన్న | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1934 |
| 58 | చెన్న. | చెన్నబసవపురాణము | ఆ. ౫ | ఆత్మకూరి పాపకవి | | వావిళ్లప్రెస్సు 1925 |
| 59 | ఛందో. | ఛందోదర్పణము | ఆ. ౪ | అనంతామాత్యుఁడు | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1947 |
| 60 | జాహ్నవీ. | జాహ్నవీమాహాత్మ్యము | ఆ. ౪ | ఏనుఁగు లక్ష్మణకవి | ౧౮ శ, | ఆంధ్ర భాషావిలాసినీ ప్రెస్సు చిత్రాడ 1923 |
| 61 | జై. | జైమినిభారతము | ఆ. ౮ | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1941 |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 62 | తపతీ. | తపతీసంవరణో పాఖ్యానము | ఆ. ౫ | అద్దంకి గంగాధరకవి | ౧౬ శ | సుజనరంజనీ ముద్రాక్షరశాల, కాకినాడ 1896 |
| 63 | దశ. | దశకుమారచరిత్రము | ఆ. ౧౨ | కేతన | ౧౩ శ | వావిళ్లప్రెస్సు 1925 |
| 64 | దశా. | దశావతారచరిత్రము | ఆశ. ౧౦ | ధరణిదేవుల రామయమంత్రి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1926 |
| 65 | దా. శ. | దాశరథీశతకము | | కంచెర్ల గోపన్న | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1925 |
| 66 | దిలీప. | దిలీపచరిత్రము | ఆ. ౪ | కొటికలపూడి వెంకటకృష్ణకవి | ౧౯ శ | మంజువాణీప్రెస్సు ఏలూరు 1902 |
| 67 | ద్వా. | సింహాసనద్వాత్రింశిక | ఆ. ౧౨ | కొఱవి గోపరాజు | ౧౫ శ | కాకినాడప్రెస్సు 1936 |
| 68 | ద్వి. తి. సా. | ద్విపద సారంగధర చరిత్రము | ఆ. ౨ | కూచిమంచి తిమ్మకవి | ౧౮ శ | ఆంధ్రభాషావిలాసినీ ప్రెస్సు. చిత్రాడ 1921 |
| 69 | ద్వి. నల. | ద్విపద నలచరిత్రము | భాగ. ౫ | చక్రపురి రాఘవాచార్యులు | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1949 |
| 70 | ద్వి. పరమ. | ద్విపద పరమయోగి విలాసము | ఆ. ౮ | తాళ్లపాక తిరు వేంగళనాథుడు | ౧౬ శ | కాకినాడప్రెస్సు కాకినాడ 1928 |
| 71 | ద్వి. భాగ. | ద్విపద భాగవతము | స్కం. ౧౨ | కోనేఱునాథుడు | ౧౬ శ | కృష్ణా అండ్ కో ముద్రాక్షరశాల 1914 |
| 72 | ద్వి. భాగ. ద. | ద్విపద భాగవతము దశమస్కంధము | స్కం. ౧ | మడికి సింగన | ౧౪ శ | అముద్రితము |
| 73 | ద్వి. భార. | ద్విపద భారతము | పర్వ. ౧ | తిమ్మయ బాలసరస్వతి | ౧౬ శ ,, | సరస్వతీ పవర్ ప్రెస్సు రాజమండ్రి 1943 |
| | ,, ఆది. | ఆదిపర్వము | ,, | | | |
| | ,, సభా. | సభాపర్వము | ,, | | | |
| 74 | ద్వి. శ. సా. | ద్విపద సారంగధర చరిత్రము | ఆ. ౩ | బాణాల శంభుదాసుడు | ౧౮ శ | జ్యోతిష్మతీ ముద్రాక్షరశాల, చెన్నపురి 1914 |
| 75 | ద్వి. హరిశ్చ. | ద్విపద హరిశ్చంద్ర చరిత్రము | భాగ. ౨ | గౌరన | ౧౫ శ | జ్యోతిష్మతీప్రెస్సు చెన్నపురి 1912 |
| 76 | ధర్మ. | ధర్మఖండము | ఆ. ౯ | ఈదులపల్లి భవానీ శంకరుడు | ౧౭ శ | విద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షరశాల, పిఠాపురము |
| 77 | నరస. | నరసభూపాలీయము | ఆ. ౫ | మూర్తికవి | ౧౬ శ | ఓరియంటు ముద్రాక్షరశాల, సికింద్రాబాదు 1945 |
| 78 | నవ. | నవనాథచరిత్రము (ద్విపద) | భా. ౫ | గౌరన | ౧౫ శ | ఆనందప్రెస్సు మద్రాసు 1937 |
| 79 | నా. పంచ. | పంచతంత్రము | ఆ. ౫ | నారాయణకవి | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1939 |
| 80 | నార. ఉ | నారసింహపురాణము ఉత్తరభాగము | ఆ. ౫ | హరిభట్టు | ౧౬ శ | కాకినాడప్రెస్సు కాకినాడ |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్తనామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 81 | నిరం. | నిరంకుశోపాఖ్యానము | ఆ. ౪ | కందుకూరి రుద్రకవి | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1925 |
| 82 | నిర్వ. | నిర్వచనోత్తర రామాయణము | ఆ. ౧౦ | తిక్కన | ౧౩ శ | వావిళ్లప్రెస్సు 1925 |
| 83 | నీతి. | నీతిసీసపద్యశతకము | | తాళ్లపాక తిరుమలయ్య | ౧౫ శ | దేవస్థానముప్రెస్సు చెన్నపురి 1935 |
| 84 | నృసిం. | నృసింహపురాణము | ఆ. ౫ | ఎఱ్ఱాప్రెగ్గడ | ౧౪ శ | వావిళ్లప్రెస్సు 1924 |
| 85 | నైష. | శృంగారనైషధము | ఆ. ౮ | శ్రీనాథుఁడు | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1941 |
| 86 | పండితా. | పండితారాధ్యచరిత్రము | ప్రక. ౫ | పాలకురికి సోమనాథుఁడు | ౧౩ శ | ఆంధ్రపత్రికప్రెస్సు 1939 |
| | ,, దీక్షా. | దీక్షాప్రకరణము | | | | |
| | ,, పురా. | పురాతనప్రకరణము | | | | |
| | ,, వాద. | వాదప్రకరణము | | | | |
| | ,, మహిమ. | మహిమప్రకరణము | | | | |
| | ,, పర్వ. | పర్వతప్రకరణము | | | | |
| 87 | పద్మ. | పద్మపురాణము ఉత్తరఖండము | ఆ. ౧౦ | మడికిసింగన | ౧౫ శ | వర్తమానతరంగిణీ ముద్రాక్షరశాల మదరాసు 1898 |
| 88 | పరత. | పరతత్త్వరసాయనము | ఆ. ౫ | ఈశ్వరఫణిభట్టు | | లా జర్నల్ ప్రెస్సు చెన్నపురి 1941 |
| 89 | పరమ. | పరమయోగివిలాసము | ఆ. ౫ | తిమ్మనృపాలుఁడు | | |
| 90 | పల్నా. | పల్నాటి వీరచరిత్రము (ద్విపద) | | శ్రీనాథుఁడు | ౧౩ శ | శ్రీరామప్రెస్సు 1934 |
| 91 | పాంచా. | పాంచాలీపరిణయము | ఆ. ౫ | కాకమాని మూర్తికవి | ౧౬ శ | మంజువాణిప్రెస్సు ఏలూరు 1932 |
| 92 | పాండు. | పాండురంగ మాహాత్మ్యము | ఆ. ౫ | తెనాలి రామకృష్ణుఁడు | ౧౬ శ | ఆంధ్ర పబ్లిషింగ్ హౌస్ చెన్నపురి 1945 |
| 93 | పారి. | పారిజాతాపహరణము | ఆ. ౫ | నందితిమ్మన | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1933 |
| 94 | పార్వ. | పార్వతీపరిణయము | ఆ. ౬ | రఘునాథ భూపాలుఁడు | ౧౮ శ | సరస్వతీముద్రాక్షరశాల కాకినాడ 1908 |
| 95 | పిన. శకుం. | శకుంతలాపరిణయము | ఆ. ౪ | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1923 |
| 96 | పె. శకుం. | | ఆ. 3 | పెద్దాడనాగరాజు | ౧౮ శ | ఆనందప్రెస్సు 1900 |
| 97 | ప్రబంధ. | ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము | ఆ. ౧ | గణపవరపు వేంకటకవి | ౧౭ శ | నెల్లూరు 1892 |
| 98 | ప్రబోధ. | ప్రబోధచంద్రోదయము | ఆ. ౫ | నందిమల్లయ ఘంట సింగయ | ౧౫ శ | చింతామణీముద్రాక్షరశాల రాజమహేంద్రవరము 1900 |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వా సాదులు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 99 | ప్రభా. | ప్రభావతీప్రద్యుమ్నము | ఆ. ౫ | పింగళి సూరన | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1939 |
| 100 | ప్రభు. | ప్రభులింగలీల (ద్విపద) | ఆ. ౫ | పిడుపర్తి సోమన | ౧౬ శ | వేణుగోపాలముద్రాక్షరశాల విశాఖపట్టణము 1884 |
| 101 | బస. | బసవపురాణము | ఆ. ౭ | పాలకురికి సోమనాథుఁడు | ౧౩ శ | ఆంధ్రపత్రికప్రెస్సు 1926 |
| 102 | బహు. | బహుళాశ్వచరిత్రము | ఆ. ౫ | దామరల వేంగళ భూపాలుఁడు | ౧౬ శ | సరస్వతీప్రెస్సు కాకినాడ |
| 103 | బాలగో. | బాలగోపాలవిలాసము | ఆ. ౩ | ఒడ్డియకవి | ౧౭ శ | కాకినాడప్రెస్సు 1941 |
| 104 | బిల్హ. | బిల్హణీయము | ఆ. ౩ | పండిపెద్ది కృష్ణస్వామి ? చిత్రకవి సింగరార్యుఁడు? | ౧౯ శ | ఆనందప్రెస్సు చెన్నపురి 1910 |
| 105 | బ్రహ్మో. | బ్రహ్మోత్తరఖండము | ఆ. ౫ | శ్రీధరమల్లె వేంకటరామకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1922 |
| 106 | బ్రౌ. | బ్రౌణ్యనిఘంటువు | | సి. పి. బ్రౌను | ౧౯ శ | 1852 |
| 107 | భర్తృ. | భర్తృహరిశతకము | శ. ౩ | ఏనుఁగు లక్ష్మణకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1931 |
| | ,, నీతి. | నీతిశతకము | | | | |
| | ,, శృం. | శృంగారశతకము | | | | |
| | ,, వై. | వైరాగ్యశతకము | | | | |
| 108 | భల్లా. | భల్లాణచరిత్రము | ఆ. ౫ | చితారు గంగాధరకవి | — | సుదర్శనీప్రెస్సు చెన్నపురి 1928 |
| 109 | భాగ. | భాగవతము | స్కం. ౧౨ | పోతనాదులు | ౧౩ శ | వావిళ్లప్రెస్సు 1949 |
| 110 | భాను. | భానుమతీపరిణయము | ఆ. ౪ | రెంటూరి గంగరాజు | ౧౬ శ | మదరాసు 1872 |
| 111 | భార. | భారతము | పర్వ. ౧౮ | కవిత్రయము | | వావిళ్లప్రెస్సు 1949 |
| | ,, ఆది. | ఆదిపర్వము | ఆ. ౮ | నన్నయ | ౧౧ శ | |
| | ,, సభా. | సభాపర్వము | ,, ౨ | | | |
| | ,, అర. | అరణ్యపర్వము | ,, ౭ | నన్నయ, ఎఱ్ఱయ | ౧౪ శ | |
| | ,, విరా. | విరాటపర్వము | ,, ౩ | తిక్కన | ౧౩ శ | |
| | ,, ఉద్యో. | ఉద్యోగపర్వము | ,, ౪ | ,, | | |
| | ,, భీష్మ. | భీష్మపర్వము | ,, ౫ | ,, | | |
| | ,, ద్రోణ. | ద్రోణపర్వము | ,, ౫ | ,, | | |
| | ,, కర్ణ. | కర్ణపర్వము | ,, ౩ | ,, | | |
| | ,, శల్య. | శల్యపర్వము | ,, ౨ | ,, | | |
| | ,, సౌ. | సౌప్తికపర్వము | ,, ౨ | ,, | | |
| | ,, స్త్రీ. | స్త్రీపర్వము | ,, ౨ | ,, | | |
| | ,, శాం. | శాంతిపర్వము | ,, ౬ | ,, | | |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసదులు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| | భార. అను. | అనుశాసనికపర్వము | ఆ. ౫ | తిక్కన | | వావిళ్లప్రెస్సు 1949 |
| | ,, అశ్వ. | అశ్వమేధపర్వము | ఆ. ౪ | ,, | | |
| | ,, ఆశ్ర. | ఆశ్రమవాసపర్వము | ఆ. ౩ | ,, | | |
| | ,, మౌ. | మౌసలపర్వము | ఆ. ౧ | ,, | | |
| | ,, మహా. | మహాప్రస్థానికపర్వము | ఆ. ౧ | ,, | | |
| 112 | భా. రా. | భాస్కరరామాయణము | కాం. ౬ | భాస్కరాదులు | ౧౧ శ | వావిళ్లప్రెస్సు 1930 |
| 113 | భా. శ. | భాస్కరశతకము | | మారదవెంకయ్య | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1929 |
| 114 | భీమ | భీమఖండము | ఆ. ౬ | శ్రీనాథుఁడు | ౧౩ శ | బ్రిటిష్ మాడల్ ప్రెస్సు చెన్నపురి 1929 |
| 115 | భో. | భోజరాజీయము | ఆ. ౭ | అనంతామాత్యుఁడు | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1928 |
| 116 | భోజసు. | భోజసుతాపరిణయము | ఆ. ౫ | కోటేశ్వరుఁడు | | వై. జయంతీప్రెస్సు 1903 |
| 117 | భోగి. | భోగినీదండకము | | పోతన | ౧౫ శ | జి. ఆర్. ప్రెస్సు చెన్నపురి 1916 |
| 118 | మల్ల. | మల్లభూపాలీయము | శత. ౩ | ఎలకూచి బాలసరస్వతి | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1924 |
| 119 | మల్హణ. | శృంగార మల్హణ చరిత్రము | ఆ. ౩ | ఎడపాటిఎఱ్ఱన | ౧౬ శ | ఆంధ్రపత్రికప్రెస్సు 1927 |
| 120 | మార్క. | మార్కండేయ పురాణము | ఆ. ౮ | మారన | ౧౪ శ | వావిళ్లప్రెస్సు 1939 |
| 121 | ముకుం. | ముకుందవిలాసము | ఆ. ౩ | కాణాదము పెద్దన | ౧౮ శ | గద్వాల 1896 |
| 122 | మై. | మైరావణచరిత్రము | ఆ. ౩ | మాడయకవి | ౧౬ శ | విద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షరశాల, పిఠాపురము 1911 |
| 123 | మొ. రా. | మొల్లరామాయణము | కాం. ౬ | మొల్ల | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1928 |
| 124 | య. | యయాతిచరిత్రము | ఆ. ౫ | పొన్నిగంటి తెలగన | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1930 |
| 125 | రంగా. | రంగారాయచరిత్రము | ఆ. ౩ | దిట్టకవి నారాయణకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1914 |
| 126 | రం. రా. | రంగనాథరామాయణము (ద్విపద) | కాం. ౬ | రంగనాథుఁడు | ౧౩ శ | వావిళ్లప్రెస్సు 1941 |
| 127 | రత్న. | రత్నపరీక్ష | | భైరవకవి | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1925 |
| 128 | రస. | రసమంజరి | గుచ్ఛము ౩ | సురతాని కోదండకవి | ౧౭ శ | విద్యానికేతనప్రెస్సు 1827 |
| 129 | రసిక. | రసికజనమనోభిరామము | ఆ. ౭ | కూచిమంచి తిమ్మకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1927 |
| 130 | రామ. క. | రామకర్ణామృతము | | సిద్ధకవి | ౧౯ శ | వావిళ్లప్రెస్సు 1930 |
| 131 | రాఘవ. | రాఘవపాండవీయము | ఆ. ౪ | పింగళిసూరన | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1929 |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసములు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 132 | రాజ. చ. | రాజశేఖరచరిత్రము | ఆ. ౩ | మాదయగారి మల్లన | ౧౬ శ | చింతామణిప్రెస్సు 1908 |
| 133 | రాజ. వి. | రాజశేఖరవిలాసము | ఆ. ౩ | కూచిమంచి తిమ్మకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1913 |
| 134 | రాధా. | రాధామాధవసంవాదము | ఆ. ౩ | వెలిదిండ్ల వెంకటపతి | ౧౮ శ | శ్రీపతిప్రెస్సు కాకినాడ 1937 |
| 135 | రాధికా. | రాధికాసాంత్వనము | ఆ. ౪ | ముద్దుపళని | ౧౮ శ | రామాఆర్టుప్రెస్సు బందరు 1936 |
| 136 | రామ. | రామరాజీయము | ఆ. ౧ | వెంకయ్య | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1923 |
| 137 | రామ. లిం. | రామలింగేశ్వరశతకము | | కూచిమంచి తిమ్మకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1926 |
| 138 | రామా. | రామాభ్యుదయము | ఆ. ౮ | అయ్యలరాజు రామభద్రుడు | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1931 |
| 139 | రా. వి. | రాజవాహనవిజయము | ఆ. ౫ | కాకమాని మూర్తికవి | ౧౬ శ | మంజువాణిప్రెస్సు ఏలూరు 1937 |
| 140 | రుక్మ. | రుక్మవతీపరిణయము | ఆ. ౫ | రేకపల్లిసోమన్న | ౧౮ శ | కాకినాడప్రెస్సు 1940 |
| 141 | రుక్మా. | రుక్మాంగదచరిత్రము | ఆ. ౫ | ప్రౌఢకవిమల్లన | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1938 |
| 142 | రుక్మి. | రుక్మిణీపరిణయము | ఆ. ౪ | సత్యవోలు భగవత్కవి | ౧౮ శ | సుజనరంజనీ ముద్రాక్షరశాల, కాకినాడ 1904 |
| 143 | రుక్మిణీ. | రుక్మిణీపరిణయము | ఆ. ౫ | కూచిమంచి తిమ్మకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1922 |
| 144 | ల. సం. | లక్షణసారసంగ్రహము | ఆ. ౩ | చిత్రకవిపెద్దన | ౧౬ శ | కాకినాడప్రెస్సు కాకినాడ 1940 |
| 145 | వరాహ. | వరాహపురాణము | ఆ. ౧౨ | నందిమల్లయ ఘంటసింగయ | ౧౫ శ | కాకినాడప్రెస్సు కాకినాడ 1940 |
| 146 | వసి. | వసిష్ఠజనకసంవాదము | ఆ. ౩ | యాముజాల శేషయ | ౧౯ శ | వావిళ్లప్రెస్సు 1926 |
| 147 | వసు. | వసుచరిత్రము | ఆ. ౬ | రామరాజ భూషణుడు | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1926 |
| 148 | వా. రా. | వాసిష్ఠరామాయణము | ఆ. ౫ | మడికిసింగన | ౧౫ శ | చంద్రికాప్రెస్సు 1935 |
| 149 | వాల్మీ. | వాల్మీకిచరిత్రము | ఆ. ౩ | రఘునాథ భూపాలుడు | ౧౭ శ | శ్రీరామవిలాస ప్రెస్సు చిత్రాడ 1919 |
| 150 | విక్ర. | విక్రమార్కచరిత్రము | ఆ. ౮ | జక్కన | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1926 |
| 151 | విజ. | విజయవిలాసము | ఆ. ౩ | చేమకూర వేంకటకవి | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1924 |
| 152 | విజయ. | విజయనందనవిలాసము | ఆ. ౩ | మంగళగిరి ఆనందకవి | ౧౮ శ | శ్రీరామవిలాస ప్రెస్సు చిత్రాడ 1919 |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 153 | విజ్ఞా. | విజ్ఞానేశ్వరీయము | కాండ. 3 | కేతన | ౧౩ శ | చింతామణీముద్రాక్షరశాల 1896 |
| 154 | విప్ర. | విప్రనారాయణ చరిత్రము | ఆ. ౫ | చెదలువాడ మల్లయ | ౧౬ శ | శ్రీపతిప్రెస్సు కాకినాడ 1938 |
| 155 | వివే. | వివేకసింధువు | ఆ. ౫ | కొండనార్యుడు | " | వావిళ్లప్రెస్సు 1924 |
| 156 | విష్ణు. | విష్ణుపురాణము | ఆ. ౪ | కలిదిండి భావనారాయణ | ౧౬ శ | ఆనందప్రెస్సు 1931 |
| 157 | విష్ణు. నా. | విష్ణుమాయానాటకము | | చింతలపూడిఎల్లన | ౧౭ శ | ఆనందప్రెస్సు 1934 |
| 158 | వీథి. | వీథినాటకము | | శ్రీనాథుడు | ౧౫ శ | |
| 159 | వీర. | వీరభద్రవిజయము | ఆ. ౪ | పోతన | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1924 |
| 160 | వేంక. | వేంకటేశాంధ్రము | వర్గులు. ౫ | గణపవరపు వేంకటకవి | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1933 |
| 161 | వేంక. శ. | వేంకటేశ్వరశతకము | | తా. పెద తిరుమలయ్య | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1949 |
| 162 | వే. పంచ. | పంచతంత్రము | ఆ. ౫ | వేంకటనాథుడు | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1924 |
| 163 | వేం. మా. | వేంకటాచల మాహాత్మ్యము | ఆ. ౬ | తరిగొండ వెంకమ్మ | ౧౯ శ | వావిళ్లప్రెస్సు 1937 |
| 164 | వేమన. | వేమనపద్యములు | | వేమన | ౧౫ శ | వావిళ్లప్రెస్సు 1949 |
| 165 | వై. జ. | వైజయంతీవిలాసము | ఆ. ౪ | సారంగుతమ్మయ | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1949 |
| 166 | శతకంఠ. | శతకంఠరామాయణము | ఆ. ౪ | మర్దనకవి | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1949 |
| 167 | శ. ర. | శబ్దరత్నాకరము | | బ. సీతారామాచార్యులు | ౨౦ శ | డైసీసియన్ ప్రెస్సు మదరాసు 1912 |
| 168 | శశాం. | శశాంకవిజయము | ఆ. ౫ | శేషము వెంకటపతి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1926 |
| 169 | శశి. | శశిరేఖాపరిణయము | ఆ. ౫ | అప్పకవి | ? | వావిళ్లప్రెస్సు 1922 |
| 170 | శివరా. | శివరాత్రిమాహాత్మ్యము | ఆ. ౪ | శ్రీనాథుడు | ౧౫ శ | రాజమండ్రి 1930 |
| 171 | శివలీ. | శివలీలావిలాసము | ఆ. ౭ | కూచిమంచి తిమ్మకవి | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1930 |
| 172 | శివ. సా. | శివతత్త్వసారము | ౪౧౬ పద్యములు | మల్లికార్జునపండితారాధ్యులు | ౧౨ శ | బ్రిటిష్ మాడల్ ప్రెస్సు చెన్నపురి 1922 |
| 173 | శుక. | శుకసప్తతి | ఆ. ౪ | కదిరీపతి నాయకుడు | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1935 |
| 174 | శృం. మం. | శృంగారమంజరి (ద్విపద) | | తా. అన్నమయ్య | ౧౫ శ | దేవస్థానముప్రెస్సు 1935 |
| 175 | శృం. సం. | శృంగారసంకీర్తనలు | ౬౬౪ సం | తాళ్లపాకఅన్నమాచార్యుడు | ౧౫ శ | దేవస్థానముప్రెస్సు చెన్నపురి 1937 |
| 176 | శైవ. | శైవధర్మము | ఆ. ౫ | తామరపల్లితిమ్మయ | ౧౮ శ | వావిళ్లప్రెస్సు 1927 |
| 177 | శ్రీరం. | శ్రీరంగమాహాత్మ్యము | ఆ. ౫ | భైరవకవి | ౧౫ శ | హిందూరత్నాకరం ప్రెస్సుచెన్నపురి 1929 |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 178 | శ్రీరం. మా. | శ్రీరంగమాహాత్మ్యము | ఆ. ౧౦ | కట్టావరద రాజేంద్రుఁడు | ౧౬ శ | హిందూరత్నాకరం ప్రెస్సుచెన్నపురి 1929 |
| 179 | శ్రీరాధా. | శ్రీరాధామాధవ సంవాదము | | చింతలపూఁడిఎల్లన | ౧౬ శ | కాకినాడప్రెస్సు కాకినాడ 1936 |
| 180 | శ్రీవేం. | శ్రీవెంకటేశోదాహరణము | పద్యము లం. ౬౬ | తాళ్లపాక పెదతిరుమలాచార్యుఁడు | ౧౫ శ | దేవస్థానముప్రెస్సు 1935 |
| 181 | ష. చ. | షట్చక్రవర్తిచరిత్రము | ఆ. ౭ | మల్లారెడ్డి | ౧౬ శ | సుజనరంజనిప్రెస్సు కాకినాడ 1896 |
| 182 | సత్య. సా. | సత్యభామాసాంత్వనము | ఆ. ౪ | లింగనమూషి కామేశ్వరకవి | ౧౨ శ | శ్రీరామాఆర్టుప్రెస్సు బందరు 1935 |
| 183 | షోడ. | షోడశకుమార చరిత్రము | ఆ. ౭ | వెన్నెలకంటి అన్నయ | ౧౮ శ | సిటీప్రెస్సు కాకినాడ 1941 |
| 184 | స. శ. | సర్వేశ్వరశతకము | | యథావాక్కుల అన్నయ్య | ౧3 శ | వావిళ్లప్రెస్సు 1926 |
| 185 | సప్త. | సప్తపదులు | | ముద్దుపళని | ౧౭ శ | రామాఆర్టుప్రెస్సు బందరు 1936 |
| 186 | సర్వ. సం. | సర్వలక్షణసార సంగ్రహము | ఆ. 3 | కూచిమంచి తిమ్మకవి | ౧౦ శ | మంజువాణీప్రెస్సు ఏలూరు 1927 |
| 187 | సమీర. | సమీరకుమార విజయము | ఆ. ౨ | పుష్పగిరి తిమ్మన | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1929 |
| 188 | సా. | సారంగధరచరిత్రము | ఆ. 3 | చేమకూర వేంకటకవి | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1922 |
| 189 | సాం. ని. | సాంబనిఘంటువు | వర్గులు. ౫ | కస్తూరిరంగకవి | ౧౯ శ | వావిళ్లప్రెస్సు 1929 |
| 190 | సాంబో. | సాంబోపాఖ్యానము | ఆ. ౫ | రామరాజు రంగప్పరాజు | ౧౬ శ | కాకినాడప్రెస్సు కాకినాడ 1930 |
| 191 | సానందో. | సానందోపాఖ్యానము | ఆ. ౫ | శివరామకవి | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1922 |
| 192 | సావి. | శృంగారసావిత్రి చరిత్రము | ఆ. ౨ | తంజావూరి రఘునాథరాయలు | ౧౬ శ | ఇండియాప్రెస్సు చెన్నపురి 1928 |
| 193 | సిం. నార. | సింహాద్రినారసింహ శతకము | | గోగులపాటి కూర్మదాసుఁడు | | వావిళ్లప్రెస్సు |
| 194 | సీతారా. | సీతారామాంజనేయ సంవాదము | ఆ. 3 | పరశురామపంతుల గురులింగమూర్తి | ౧౭ శ | వావిళ్లప్రెస్సు 1934 |
| 195 | సుగ్రీ. | సుగ్రీవవిజయము (యక్షగానము) | | కందుకూరి రుద్రకవి | ౧౬ శ | కాకినాడప్రెస్సు కాకినాడ 1940 |
| 196 | సుద. | సుదక్షిణాపరిణయము | ఆ. ౫ | తెనాలిఅన్నయ్య | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1941 |
| 197 | సుభద్రా. | సుభద్రాపరిణయము | ఆ. ౬ | కూచిమంచి జగ్గకవి | ౧౭ శ | శ్రీపతిప్రెస్సు కాకినాడ 1935 |
| 198 | సురా. | సురాభాండేశ్వరము | ఆ. ౧ | గట్టుప్రభువు | | అమెరికన్ డైమండు ప్రెస్సు చెన్నపురి 1915 |

| సంఖ్య | గ్రంథ సంకేతము | గ్రంథనామము | ఆశ్వాసాదులు | గ్రంథకర్త నామము | కాలము | గ్రంథస్వరూపము |
|---|---|---|---|---|---|---|
| 199 | సు. శ. | సుమతిశతకము | | బద్దెన ? | | వావిళ్లప్రెస్సు 1928 |
| 200 | సూ. ని. | సూర్యరాయనిఘంటువు | సంపుటములు ౪ | | ౨౦ శ | కాకినాడప్రెస్సు కాకినాడ |
| 201 | స్వా. | సారోచిషమనుచరిత్ర | ఆ. ౬ | అల్లసాని పెద్దన | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1920 |
| 202 | హ. న. | హరిశ్చంద్ర నలోపాఖ్యానము | ఆ. ౫ | రామరాజ భూషణుఁడు | ౧౬ శ | వావిళ్లప్రెస్సు 1930 |
| 203 | హర. | హరవిలాసము | ఆ. ౭ | శ్రీనాథుఁడు | ౧౩ శ | ఆనందప్రెస్సు 1939 |
| 204 | హరి. | హరివంశము | | ఎఱ్ఱయ | ౧౪ శ | వావిళ్లప్రెస్సు 1926 |
| | ,, పూ. | పూర్వభాగము | ఆ. ౯ | ,, | ,, | |
| | ,, ఉ. | ఉత్తరభాగము | ఆ. ౧౦ | ,, | ,, | |
| 205 | హరిశ్చ. | హరిశ్చంద్రోపాఖ్యానము | ఆ. ౫ | శంకరకవి | | వావిళ్లప్రెస్సు 1924 |

మిగిలినవి స్పష్టము.

# ఇందుపయుక్తములైన సంస్కృతగ్రంథములపట్టిక

| సంఖ్య | గ్రంథనామము | గ్రంథకర్తనామము | గ్రంథమందలిసర్గాదులు |
| --- | --- | --- | --- |
| 1 | అప్తుని సంస్కృతాంధ్రనిఘంటువు | వామన శివరామాప్తుఁడు | |
| 2 | ఉత్తరరామచరితము | భవభూతి | ౭ అంకములు |
| 3 | కల్పద్రుమకోశము | సర్. రాజారాధాకాంతదేవ బహాదరు | |
| 4 | కాదంబరి | బాణుఁడు | ౨ భాగములు |
| 5 | త్రికాండశేషము | పురుషోత్తముఁడు | 3 కాండములు |
| 6 | ధనంజయనిఘంటువు | ధనంజయకవి | ౨ పరిచ్ఛేదములు |
| 7 | నానార్థార్ణవసంక్షేపనిఘంటువు | కేశవమిశ్రుఁడు | ౬ కాండములు |
| 8 | మనుస్మృతి | మనువు | ౧౨ అధ్యాయములు |
| 9 | మేదినినిఘంటువు | మేదినికరుఁడు | |
| 10 | రాజనిఘంటువు | నరహరిపండితుఁడు | ౨౧ వర్గములు |
| 11 | వాచస్పత్యనిఘంటువు | తారానాథతర్కవాచస్పతి | |
| 12 | విశ్వనిఘంటువు | మహేశ్వరసూరి | |
| 13 | వైజయంతీనిఘంటువు | యాదవప్రకాశుఁడు | ౮ కాండములు |
| 14 | సంస్కృతభాగవతము | వ్యాసుఁడు | |
| 15 | సంస్కృతభారతము | వ్యాసుఁడు | |
| 16 | సంస్కృతరామాయణము | వాల్మీకి | |
| 17 | సర్వశబ్దసంబోధిని | | |
| 18 | సాహిత్యదర్పణము | విశ్వనాథకవిరాజు | ౧౦ పరిచ్ఛేదములు |
| 19 | హలాయుధనిఘంటువు (అభిధానరత్నమాల) | హలాయుధుఁడు | ౫ కాండములు |
| 20 | హారావళి | పురుషోత్తమదేవుఁడు | |
| 21 | హితోపదేశము | నారాయణపండితుఁడు | ౪ భాగములు |
| 22 | హేమచంద్రనిఘంటువు (అనేకార్థసంగ్రహము) | హేమచంద్రుఁడు | ౭ కాండములు |

ఇంకను పెక్కు కావ్యనాటకాదులు.

# తప్పొప్పుల పట్టిక

| పుట | ప్రక్క | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 17 | 1 | 3 | పా. | పారి. |
| ,, | 2 | 16 | ఉ. హ. | ఉ. హరి. |
| 19 | 1 | 14 | ప్రుక్కి | గ్రుక్కి |
| 134 | 2 | 10 | సికారు, వాహ్యాళి. | అబిసీనియాదేశస్థులు; కోతులు. |
| 222 | 2 | 2 | ఆగ్రహము, | 1. ఆగ్రహము, |
| ,, | ,, | 9 | ఆము, | 2. ఆము, |
| 223 | 2 | 6 | అఁడుతనము. | ఆఁడుతనము. |
| 263 | 2 | 26 | 3. ఆఱెబొట్టె. | 3. బొట్టె, ఆం. భా. ద్వి. ౯_౧ |
| 289 | 2 | 30 | ౽ అ. | ౽ ఆ. |
| 292 | 1 | 5 | ఈకొలఁదివాడు | ఈకొలఁదివాఁడు |
| 294 | 1 | 29 | ఏఱుమద్ది | 1. ఏఱుమద్ది |
| 304 | 2 | 16 | ఇతోధికము అనుపదము లేదనుకొనవలయును | |
| 306 | 1 | 15 | ఇనాము అనుపదప్రయోగము ఈనాముక్రింద చేర్చుకొనవలయును | |
| 307 | 2 | 7 | యోర్తు | నోర్తు |
| ,, | ,, | 15 | ఈపదము ప్రయోగముతో సహితము లేదనుకొనవలయును | |
| 311 | 1 | 28 | నడచె | నడచెఁ |
| 315 | 2 | 4 | ఇఱుకుఁడు | ఇఱుకుడు |
| 316 | 2 | 6 | సం. ఆ. | సం. వి. ఆ. |
| 320 | 2 | 27 | నేయుంటకు | నేయుంటకు |
| 321 | 2 | 6 | బసపు. | బసు. |
| ,, | ,, | 9 | “సీ. బలదేవుఁ డొకనాఁడు...ఈ ప్రయోగము ఇష్టగోష్ఠిక్రింద నుండవలయును | |
| 323 | 1 | 18 | ఇస్మ=ఇసుము(ఇసుక) [యును | రూ. ఇస్మ |
| ,, | ,, | 24 | పద్యప్రయోగము లేదనుకొనవల | |
| 325 | 1 | 1 | ఈచ | ఈఁచ |
| 330 | 2 | 6 | ఈతలాఁతల | ఈతలాతల |
| 337 | 1 | 27 | శ్వర. విణ. మధ్యగలవిషయము లేదనుకొనవలయును | |
| 346 | 1 | 19 | ఉక్కుతునక | ఉక్కుతునుక |
| 359 | 2 | 11 | ఉపాయము | ఉపాయనము |

| పుట | ప్రక్క | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 359 | 2 | 14 | ఉత్క్రోచుఁడు | ఉత్క్రోచుండు |
| 370 | 1 | 12 | సిరిపట్టికివి | సిరిపట్టికిని |
| 380 | 2 | 2 | బడయాళు | బతయాళు |
| 425 | 2 | 14 | చవికుండ | చరికుండ |
| 440 | 1 | 2 | ఎకసక్క్యము | ఎకసెక్క్యము |
| ,, | ,, | 3 | ఎకపక్క్య | ఎకసెక్క్య |
| ,, | ,, | 14 | ౧, ౫, | ౧, ౫ |
| ,, | ,, | 15 | సఁ. విశరి. | సం. విశ. |
| ,, | ,, | 17 | వెలింగింపు | వెలిఁగింపు |
| ,, | ,, | 19 | వెలుఁగు | వెలుంగు |
| 456 | 1 | 2 | నొవ్వచాడు | నొవ్వసాడు |
| 461 | 1 | 4 | ఆనఘు | అనఘు |
| ,, | 2 | 23 | ఈడు. 1 | 1. ఈడు, |
| 462 | 1 | 19 | నేను | ఏను |
| 464 | 1 | 2 | అప్పాజే | అప్పాపజే |
| 465 | 2 | 15 | లాక | లాక్క |
| 466 | 1 | 9 | యచ్చ | యచ్ఛ |
| ,, | 2 | 13 | ఒరగలి | ఎరగలి |
| 467 | 1 | 35 | మున్నఁగు | మున్నగు |
| 468 | 2 | 2 | మెఱుగారు | మెఱుఁగారు |
| 471 | 2 | 11 | బోదలసెల | బోదలసెల్ల |
| 476 | 2 | 19 | గుము | ఏఁగుము |
| 488 | 2 | 22 | అత్యయంబగు | అత్యయ్యంబగు |
| 489 | 2 | 29 | నేర్పరిచి | నేర్పగించి |
| 495 | 2 | 17 | చేసెదో అదిచేసెదో | చేసెదొ అది చేసెదొ |
| 496 | 1 | 35 | నొజ్జలును | నొజ్జలునున్ |
| 516 | 2 | 15 | కనిమి | కలిమి |
| 518 | 2 | 9 | కాపాడు | కాపాడుఁ |
| 519 | 2 | 19 | పఱుపగల | పఱుపంగల |
| 532 | 1 | 19 | కడగండ | కడగంట |
| 538 | 1 | 30 | విన్నది లేని | లేని |
| 540 | 2 | 5 | స. వి. | సం. వి. |
| 547 | 2 | 5 | లానికటన్ | లానికలున్ |

# వావిళ్ల నిఘంటువు



అ. అచ్చులలో మొదటియక్షరము. దే. అవ్య. 1. అవధారణమును తెలుపును, అన్యవ్యవచ్ఛేదము (వేఱొకవస్తువుగాని, విధముగాని, క్రియగాని లేదు, లేక కాదు అనుభావమును) తెలుపును. సంస్కృతమునందున్న ఏవ అనుదానియర్థమును తెలుపుటచే ఏవార్థకము, ఏవకారార్థకము అని వాడుదురు. ఎ, ఏ అనువానికి పర్యాయము. "క. ...పంద్రెండగుపర్వం,బ కడుక మేలనఁగ శాంతిపర్వము వెలయుక్." భార.ఆది.౧,ఆ.౫౭. "చ. ఇది శతవృద్ధ మాజనని యిప్పుడుమృత్యువుఁ బొందె నిట్లు నే, యిదియ కులప్రయుక్తమగుచున్న సనాతనధర్మ మిత్తెఱం, గ దహన కర్మ మొల్లము." భార. వి. ౧, ఆ. ౧౭౯. (ప్రాచీన ప్రయోగములందు ఎ, ఏ లకు మాఱు ప్రాయికముగా ప్రయుక్తము.); 2. స్వయముగా, పరుల ప్రోత్సాహముగాని, సహాయముగాని లేకుండఁగ అను భావమును తెలుపును. "ఉ. అమ్మ సరస్వతీ పరమహత్త్వమునక్ జనియించి తీవు నా,కిమ్ముగ సర్వధర్మములు నీవ యెఱుంగుదు వంశమెల్లఁ బూ,తమ్మగు నీదుచర్య నని ధాతపడంతియె యానతిచ్చె." కళా. ౪, ఆ. ౧౨౬; 3. వ్యతిరేక వాచకములగు క్రియాపదములమీఁద నను ప్రయుక్తమై వ్యతిరేకమునే ధ్రువపఱచును. "ఆ. కులము పాడినడపఁ దలఁపఁడ పతి సెడఁ, దలఁచె నేని గొడుకు వలచినట్టి, వాఁడుగాన యతని వక్రత మాన్పలేఁ, డింతకంటెఁ గలదె యెడరు మాకు." భార. ఉ. 3, ఆ. ౯; (తలఁపఁడ = తలఁపనే తలఁపఁడు అని తాత్పర్యము.) "చ. పెక్కుభంగులఁ బురికొల్ప నెవ్వరును గోల్తలసేయర యేమిసెప్పుదున్." భార. ద్రో. ౨, ఆ. ౫౯; (కోల్తలసేయర = కోల్తల సేయనే చేయరు); 4. నిరసనము, ఆశ్చర్యము, మొదలగువానిని తెలుపును. నిరసనము : "చ. అంతట మూర్ఛదేఱి పులియా యెలుఁగా యెను పోత సింగమా, కాంతుము నీనిగర్వ మని క్రక్కునఁ బైఁబడఁ బాఱువేఁటకా, ఱంతకు ప్రోలికిం బఱచునంతకుఁ జూడక." కవు. ౪, ఆ. ౧౦౬; 5. ప్రశ్నమును తెలుపును; అందు కాకుస్వరమున వ్యతిరేకార్థమును తెలుపును; వ్యతిరేక క్రియపై నుండి కాకుస్వరమున వ్యతిరేకమునకు వ్యతిరేకమును తెలుఁపును: అనఁగా ధాత్వర్థమును ధ్రువపఱచును. "ఉ. ......ఇట్టి నా, యాస నిరాకరింపఁదగవా మగవాఁడవు కావ యర్జునా!" హర. ౭, ఆ. ౧౨౯; 6. ప్రార్థనార్థక క్రియలపై అను ప్రయుక్త మగునది. "క. కనుఁగొండ యితనిధైర్యము, పెనుఁగొండగు నవని నెదిరి..." పాండు. ౧, ఆ. ౫౭; (కనుఁగొండ = కనుఁగొనుఁడీ.);7. అంగీకారమును తెలుపును,(అవును అనుట.) "నిన్న నీవిక్కడ నుంటివా అని యాతని నడుగ 'అ, అ, ఉంటి' నని యాతఁడు సమాధానము చెప్పెను." (అ, అ=అవునవును.) ఇది సానునాసికముగాను, నిరనునాసికముగాను గూడ నుచ్చరింపఁబడును; 8. ప్రశ్నమును సూచించును: అనఁగా ఏమి అనుభావమును దెలుపును. "అ, మరలఁ జెప్పు."

—ప్రత్యయము. భావార్థమును తెలుపుటకు క్రియలపైవచ్చు ప్రత్యయము : గీఱ, పాయ, తునియ, మొ.—ప్ర. ద్రు. (అను, అన్.) ఉద్దేశార్థమును తెలుపుటకు క్రియలపై వచ్చు ప్రత్యయము. 1. నిమిత్తము, కొఱకు అనెడి యర్థము

లను తెలుపును. సంస్కృతమున తుమున్ అను ప్రత్యయము ఈయర్థమును తెలుపుటచే దీనిని తుమున్నర్థకము అని వాడుదురు. 'నేను మీ గ్రంథము చదువవచ్చితిని' అనుచోట చదువన్ = చదువునిమిత్తము, చదువుటకొఱకు అని యర్థము; 2. భావార్థమును తెలుపును. "ఆ. క్షమయ తాల్చియుండఁ గాదెల్ల ప్రొద్దుఁదే, జంబ తాల్చియుండఁ జనదు పతికి, సంతతక్షముండు సంతత తేజుండు, నగుట దోషమందు రనఘమతులు." భార, అర. ౧, ఆ. ౨౧౭. (ఉండన్ = ఉండుట); ఇట "జనదెల్ల ప్రొద్దు" అనుపాఠము నన్నయ నియమమునకు విరుద్ధమైనది.

అ. సం. వి. అ. పుం. (ఇది తెనుఁగున వ్యస్తముగాఁ బ్రయోగింపఁబడదు.) 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు; 4. తాఁబేలు; 5. అంగణము; 6. యుద్ధము; అవ. సంస్కృతసమాసమున వ్యతిరేకాద్యర్థములను బోధించు "నఞ్" అను దానికి హల్లు మొదటఁ గలపదము పరమగునపుడు నిల్చెడిరూపము. "నఞ్" అనుదానికి అజాది పదము పరమగునపుడు అన్ అనెడి రూపము కలుగును. 'అధర్మము, అనవసరము.' నఞ్ విశేషార్థములు:—1. సాదృశ్యము, సాటి. "అబ్రాహ్మణుఁడు" (=బ్రాహ్మణచిహ్నము లున్నను నిజముగా బ్రాహ్మణుఁడు కానివాఁడు), "అనిక్షువు" (= పైకి చెఱకువలె నున్నను నిజముగ చెఱకు కానిది); 2. అభావము, లేమి. "అజ్ఞానము" (= జ్ఞానములేమి), "అక్రోధుఁడు" (=క్రోధము లేనివాఁడు); 3. వేఱగుట, అన్యత్వము. "అపటము" (= పటముకానిది); 4. అల్పత్వము. "అనుదర" (=అల్పమైన ఉదరముగలది); 5. అప్రాశస్త్యము, అనుచితత్వము. "అకాలము" (=అప్రశస్తకాలము, అనుచితకాలము), "అకార్యము" (=అప్రశస్తకార్యము, అనుచితకార్యము); 6. విరోధము, వ్యతిరేకము. "అసితము" (=నలుపు). ఈభావములు గలశ్లోకము.— "తత్సాదృశ్య మభావశ్చ తదన్యత్వం తదల్పతా, అప్రాశస్త్యం విరోధశ్చ నఞర్థాః షట్ప్రకీర్తితాః." అనుత్తమము=దేనికంటె ఉత్తమమైనది లేదో అట్టిది, అత్యుత్తమము అని యన్వయము గ్రహించునది. ఇట్లే అమూల్యము, అనర్ఘ్యము మొ.; (కాలవిలంబము లేమిని తెలిపెడి అనునర్థముతో సంస్కృతపదముగా అ అను దానిని శబ్దరత్నాకరకారుఁడు గ్రహించి యీక్రింది యుదాహరణ మిచ్చెను. "సీ. వడి జిఱ్ఱఁదిరిగి మ్రొగ్గెడు మదావళములఁ దోన రూపఱిన యాధోరణులును." జై. ౫, ఆ. ౧౯౨. ఇట తోన=తోడనే, వెంటనే అని యర్థము. కాలవిలంబము లేమిని తోన్ అనుపదము తెలుపును. అ అనునది ఏ అనునర్థమును తెలుపును. అది దేశ్యము. సంస్కృతమనుటయు, కాలవిలంబము లేమిని తెలుపు ననుటయు చింత్యములు.)

అంక. దే. వి. 1. (అణకయొక్క సంక్షిప్తరూపము). అణక; 2. ('వంక'లో మొదటి యక్షరము లోపించినరూపము.) ప్రక్క, వైపు. "సీ. అంతంతఁ బసిబిడ్డ లడ్డంబుసుడిసిన జంకించి మిన్నంకఁ జూకళించు." భో. ౬, ఆ. ౨౫. ఇది శ.ర. పాఠము. (మిన్నంక అనుచోట మిన్నంట అని పాఠముగలదు. వ్యాకరణప్రకారము, మిన్ను నంక అని యుండఁదగును. ఈ యర్థమున ఈ రూపము చింత్యము.)

అంకకాఁడు. మి.విణ. (అంకము+కాఁడు=యుద్ధము కోరువాఁడు, ఎదిరి.—క. అంకకాఱు = మొనగాఁడు. కోపకాఁడు, కార్యకాఁడు, విటకాఁడు మొ. వానికి వలె దీనికి సాధుత్వము గ్రాహ్యము. చూ. కాఁడు.) 1. యుద్ధశీలుఁడు, యోధుఁడు, కలహశీలుఁడు. "ద్వి.గరిడికెక్కినయంకకాఁడును బోలె, నెడవిడిపడ్డ మత్తేభంబువోలె, వడిమృగంబులగన్న వ్యాధుండు వోలె, పరగంగఁబంతంబు బంటునువోలె." పండి. పాద. ౧౭౬-పు; బస. ౪, ఆ.౧౧౩-పు; బస. ౨ఆ. ౪౫-పు; 2. ఖడ్గవాది. "ఆ. ప్రతినవలదువైరిపట్టున నృపతికి, దండువెడలఁదీఱ కుండుఁ దీఱుఁ, గాక యుండి యుండి కాలాంతరముననుఁ, గార్యకాఁడొయంకకాఁడొ నృపుఁడు." ఆము.౪, ఆ. ౨౬౩; 3. కేవలము పట్టుదలగలవాఁడు, చలపాది. "తే.ఎలసి యేబ్రొద్దుఁగనువొందనీక మరుఁడు, కలహమున కంకకాఁడయి కాలుద్రవ్వఁ, బొండుబహుళక్షపాపరంపరలు వెడల, కింట్లిలో నేఁదుమ్ముల్లయ్యె నిందు

ముఖికి." ఆము. ౫, ఆ. ౧౪; **4.** కళంకముగలవాఁడు. "చ. హిమకరుఁ డంకకాఁడు మధు వెప్పుడు జాతివిరోధి. కవిక. 3, ఆ. ౭౧. (ఇట యుద్ధశీలుఁడు లేక కలహశీలుఁడు అని యర్థాంతరము స్ఫురించును.)

అంకకారము. సం. విణ. (అ. ఈ-రీ. అ.) (యుద్ధము చేయునది.) ప్రతిఘటించునది, లేదా కళంకము గలిగించునది. (ఔపమ్యవాచకము.) "చ. సకియ యితండు నీవలుఁద చన్నులక్రేవల నొత్తుఁగాతఁగిం, శుకముకుళాభిరామములు సుంకము పట్టు నఖాంకురాంకముల్, ప్రకుపితశాంకరీచరణపంకజకుంకుమ పంకసంకర, ప్రకటనిరంకశంకరకపర్దశశాంకకళాంకకారముల్." నై. ౫, ఆ. ౧౦3.

అంకణము. వై. వి. (సంస్కృతమున 'అంకణము' గలదని కొందఱు.) **1.** ముంగిలి,మండువా, నలువైపులను ఇంటివసారాలు గలిగిన యింటినడిమి భాగము; **2.** కఠ్య. తొట్టికట్టు. ఇంటి రెండు దూలముల లేక స్తంభముల నడిమిప్రదేశము అని కొందఱు.

అంకన. సం. వి. ఆ. స్త్రీ. స్తుతి. "ద్వి. అఖిలభర్తా నీక మంకనల్ సేయ." పండి. మహి. ౨౯౪-పు; "ద్వి. ఇల విదూషకుభాతి నిరువుర వలపు, లలర నన్యోన్య గుణాంకన ల్సేయు." బసవ. ౪, ఆ. ౧౨౭-పు.

అంకనము. సం.వి. అ. న. (గుర్తించు సాధనము.) **1.** గుఱుతు, చిహ్నము; **2.** గుర్తించుట; **3.** చిహ్నములు పెట్టు సాధనము. "స్నేహాంకనములు, చక్రాంకనము."

అంకనీయము. విణ.=అంక్యము. విణ.

అంకపరివర్తనము. సం. వి. అ. న. =అంకపరివర్తము.

అంకపరివర్తము. సం. వి. అ. పుం. **1.** (అంక+పరివర్తము.) రెండవవైపునకుఁ దిరుగుట; **2.** (అంక+పరి+వర్తము.) ఒడిలోఁగాని, శరీరముమీఁదగాని దొర్లుట; **3.** (వక్షఃస్థలమున నంతట నుండుట.) ఆలింగనము, కౌఁగిలి.

అంకపరివర్తి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) (అంకపరివర్తముగలవాఁడు) కౌఁగిలిగలవాఁడు. (అంకపరివర్తిని = కౌఁగిలిగలది, కౌఁగిలించుకొన్నది.)

అంకపాలి. సం.వి. ఇ. ఈ. స్త్రీ. **1.** ఒడిపైభాగము; **2.** తొడపైభాగము; **3.** వక్షఃస్థలము, ఱొమ్ము; **4.** ఆలింగనము, కౌఁగిలించుకొనుట; **5.** (అంకమున నుంచుకొని పాలించునది.) ఉపమాత,దాది; **6.** వేదియను గంధద్రవ్యము. (ఇట కొందఱు వేదియనఁ దిన్నెయని గ్రహించిరి.)

అంకపాళి = అంకపాలి. ఒడిపైభాగమునకు—"తే. మూరురాయరగండ పెండారమణిమ, రీచిరింఛోళిఁ గలయ నావృతములగుచు, నంకపాళి నటద్దుకూలాంచలములు, చిత్రమాంజిష్ఠవిభ్రమ శ్రీవహింప." స్వా. పీఠిక. ౧౨; "తే. ...మృగిరైవహించునక్షిద్వయంబు, భాసురంబుగఁ దనయంకపాళిలోన, మించుక్రొమ్మించు నుపమించుమెలఁత యగుచు." స్వా. ౬, ఆ. ౭౬.

అంకపాళిక. సం. వి. ఆ. స్త్రీ. **1.** ఒడి పైభాగము; **2.** వక్షఃస్థలము; **3.** ఆలింగనము; **4.** వేదియను గంధద్రవ్యము; **5.** ♠ ఏఱుమద్ది **6.** కోటి, అంచు; **7.** శంఖిని, కట్లతీగె. ♠

అంకపీఠము.సం. వి.అ. పుం. పీఠమువలెనుండు తొడపైభాగము."తే. ముదితకాంక్షించె నేనిక మోము కొడుకు, నంకపీఠమునందుంచి యాదరింప, నహరహంబును గర్భంబునందుఁ బెరుగు, కాలకంఠుని యనుభావ గౌరవమున." కాశీ. ౪, ఆ. ౫.

అంకపొంకములు. దే. వి. బ. (అంకము+పొంకము.) **1.** కోపము; **2.** విరోధము.—విణ. ఉగ్రము. చూ. అంకాపొంకములు.

అంకము. ఉభ—దే. వి. ఆక్షేపము. (ఈయర్థమునఁ గూడ సంస్కృత మనవచ్చును.) "ఉ. పొంకపుఁ గావ్యలక్షణముపోక డెఱుంగక దిట్టకూళ్లై, కొంకక వంకరర్థములు గూర్చి సభాస్థలిఁ బ్రాఢులట్లు ని, శ్శంకఁ జరించుచుం సుకవిసంఘము పల్కులమెచ్చకూరకే, యంకము సేయవచ్చునల యయ్యల మున్నుగఁ బ్రస్తుతించెదన్." హై. ౧, ఆ.—సం. వి. అ. పుం. **1.** అంకె (౧-౨-3 మొ. అంకెలు); **2.** ఉత్సంగము, ఒడి; **3.** (పిల్లలిందుఁ గూర్చుందురు.) తొడ పైభాగము, ఊరు ప్రాగ్భాగము, తొడ; **4.** చిహ్నము,గుఱుతు; **5.** కళంకము, మచ్చ; **6.** దోషము, తప్పు; **7.**

పాపము; **8.** ప్రక్క, భాగము; **9.** స్థానము, చోటు; **10.** అలంకారము, కైసేఁత; **11.** చిత్రయుద్ధము, వినోదార్థమగు యుద్ధము; **12.** వక్షఃస్థలము; **13.** రూపకభాగము (ఆశ్వాసము, పరిచ్ఛేదము, వంటిది). అందు నాయకుని యొక్క నాఁటిచర్య రంగమునఁ జూపఁదగును. అలంకారాదులతో రసభంగము గలిగింపరాదు. అతి విస్తారముగాని పాత్రలతోఁ జరిత్రమును జూపవలెను. దూరప్రయాణము,వధము, యుద్ధము,రాజ్యదేశాద్యుపద్రవము, సంతోషము, భోజనము, స్నానము, సురతము, అనులేపనము, వస్త్రము కట్టుకొనుచుండుట మొదలగునవి రసభంగకరములుగాన చూపరాదు.నాయకవధము సామాన్యముగఁ గల్పింపరాదు. నాటకాది రూపకముల నంకసంఖ్య వేఱువేఱుగ నుండును; **14.** దశవిధరూపకములలో నొకటి. ఇందు చరిత్ర ప్రసిద్ధముగా నుండవలెను. కొందఱు కల్పితము గా వచ్చునందురు. కరుణమురసము. దివ్యేతరజనులు నాయకులు గావలెను. స్త్రీవిలాపము, వాగ్యుద్ధము ప్రదర్శింపవచ్చును; **15.** యుద్ధము. "ద్వి.తనువు లేకున్నఁ బూఁతకురాకయున్న, నునువు గాకున్న వాసనకుఁ దేకున్న, మఱికదా శివునకు మాకు నంకంబు, అఱిముఱితన మిప్పు డడిరియేల." బస. ౪, ఆ. ౧౩౪-పు.; "దండ్లువచ్చెను మీఁదఁ దల్లడంబేల, యంకాన కేఁగెద రార్పు బొబ్బలను, శంకరభక్తుఁడు సచ్చెనో యిట్లు, పోలంగఁ గొంగనిఁ బొడిచి." బస. ౭, ఆ. ౨౧౪-పు.; **16.** సమీపము; **17.** మంత్రము; **18.** గ్రుద్దులాట; **19.** తొమ్మిది సంఖ్యకు సంకేతపదము; **20.** బుద్ధి; **21.** కవచము; **22.** (దోషాదులు) ఆరోపించుట; **23.** గొల్లది ధరించుకంకణము; **24.** పాపము; **25.** దుఃఖము; **26.** స్తోత్రము. సీ. "లీల నీశ్వరు నంకమాలికల్ వాడుచో గీతభేదంబులరీతు లెఱిఁగి." కు. సం. ౨, ఆ. ౨౮౧.

అంకముఖము=అంకాస్యము.

అంకమ్మ. ద్వ. వి. ఒక గ్రామదేవత.

అంకలోపము. సం. వి.అ. పుం. **1.** అంకముయొక్క లోపము; **2.** (గణి.) తీసివేఁత, పెద్ద అంకెలో నుంచి చిన్నఅంకె తీసివేయుట, 9—5=4.

అంకపన్నియ. ద్వ. వి. (=అంకపన్నె, అంకెపన్నియ, అంకెపన్నె).—(గుఱ్ఱమును ఎక్కునప్పుడు ఆనుకొనుటకై ప్రక్కనుంచెడు పన్నె. చూ. పన్నె క. అంగవడి; త. అంగపడి; అంగవడి=గుఱ్ఱమున కొక ప్రక్కనుండునది.) గుఱ్ఱమునెక్కుట కిరుప్రక్కల నమర్చిన మెట్టు, రికాబు.

అంకపన్నె = అంకపన్నియ. "తే. హయము డిగ్గఁ బ్రద్యుమ్నుఁ డంకపన్నె, యొకటి సాహిణి యవ్వల నూఁదిపట్టఁ, దనయనుఁగు చెలికాఁడు కైదండ నొసఁగ." ప్రభా. ౨, ఆ. ౩౮; "మ. ఇలఁ బాదద్వయి రాయ నక్కొసఁగు నెందేపాఱుచోనంకప,న్నెలురెండై." ఆము. ౨, ఆ. ౨౭.

అంకవిద్య. సం. వి. ఆ. స్త్రీ. గణితము, లెక్కలు.

అంకాంకము. సం. వి. అ.న. (అంక=మధ్యమందు+అంక=పద్మాదిచిహ్నములుగలది) జలము, నీరు.

అంకాపొంకములు. దే. వి. బ. (అంకము+పొంకము.) **1.** కోపము. "క. కింకరులచేతనంతన్, లంకకువేగంబె నందినన్ విని యంకాపొంకాలు దరికొనంగ నిరంకుశ సాహససమర్థుఁ డగుదశముఖుఁడున్." రామా. ౭, ఆ. ౪౯; **2.** విరోధము. "సీ. బెడిదమౌశృంగార బీభత్సములకు నంకాపొంకములు."కవిస.౧,ఆ. ౪.౧.—విణ.ఉగ్రము. "జ్వరము అంకాపొంకములుగా వచ్చినది."

అంకారించు. హిం.అ.క్రి. ఓడచాఁప యెత్తిపోవు.

అంకాలమ్మ. ద్వ. వి. గ్రామదేవత. (మహాకాళి, మహాకాళమ్మ, మాంకాళమ్మ, అంకాళమ్మ, అంకాలమ్మ, అంకమ్మ అని రూపములు క్రమముగా అవతరించి యుండును. భయంకరదేవతగా భావింపఁబడినది.) "నీవు దాని నేమయిన నంటే అంకాలమ్మవలె మీఁదఁబడి కొట్టఁబోవును."

అంకావతారము. సం. వి. అ. పుం. (అంక+అవతారము; ఇందు అంకప్రవేశము చూపఁబడును.) నాట్యమున రూపకములయందు సూచింపఁదగిన వస్తువునుసూచించు కథాభాగము. పూర్వాంకమునకు నుత్తరాంకమునకు విచ్ఛేదము లేనపుడు పూర్వాంకము చివరను వచ్చిన పాత్రలచే సూచింపఁబడినదే యుత్తరాంకమున వచ్చును. దానిని సూచించుకథాభాగము.

అంకాస్యము. సం. వి. అ. న. (అంక+ఆస్యము; నాటకమున అంకముఖము.) పూర్వాంకాంత పాత్రముచే విచ్ఛిన్నమగు నుత్తరాంకవస్తువును సూచించు కథాభాగము. (అంకావతారమున వస్తువునకు విచ్ఛేదము లేదు. ఉత్తరాంకపాత్రముల పూర్వాంకమున నున్నపాత్రలే సూచించును. అంకాస్యమున పూర్వాంకాంతమున నూతనపాత్ర ప్రవేశించి యుత్తరాంకారంభ పాత్రలను సూచించును.)అన్నియంకముల కథాభాగమును సూచనముచేయు భాగము అని కొందఱు.

అంకి. సం.విణ. (న్. ఈ-నీ.న్.) అంకముగలవాఁడు. —వి.న్. పు. (ఒడిలోనుంచి వాయింపఁబడినది.) మద్దెల మొదలగు వాద్యము.

అంకించు. ఉభ—దే. అ. క్రి. (క. అంకిసు.) **1.** ప్రకాశించు, ఉల్లసిల్లు;**2.** ఒప్పు. "వ. పంకజభవాండమండపంబు సంకుచేసినపొంకంబున నంకించుచు." వసు. ౪, ఆ. ౨౩; **3.** ఊహించు. "ద్వి. సెలకొని పాలలోపల నుదకములు,గలసినపద్ధతిగణనాథుఁగలసి,యంకింపఁ దప్తలోహంబున జలము, లింకిన ట్రీశుపై నింకి వెండియును, దివిదీవులాడక దెసలకుఁ జనక." పండి. దీక్షా. ౬౧-పు; **4.** భావనచేయు,భావించు."సీ...అంకించి తనలోన నఖిలప్రపంచంబు, శ్రీవిష్ణుమయ మని చెలఁగువాని."భాగ. ౮,స్కం.౧౬౦.—స.క్రి.**1.** (అంకుసట్టు చేసికొను.) పట్టుకొను,తాల్చు. "తే. అట్టు లెడలేని కడిమిఁ గయ్యం బొనర్చు, జడబ్రతుకుగూఁడుపుట్టువు సామిమీఁదఁ, గినిసి క్రైదువ కేల నంకించి రక్క,సుండు గాల్లను డెక్కలు చెండివైచె." అచ్చ. రా. అర. ౮౫; "శా. కాంచన్ గామిని కామనీయము బలాత్కారంబునం గేలఁ గీ, లించన్ వేనలి చెక్కునొక్కకడుబల్మింగుబ్బపాలిండ్ల నం, కించుం గౌఁగిట శయ్యకుం దిగిచి సొక్కించుం గళావైఖరిన్, గించిన్మధ్యఁ గరంచి యీసరణి భోగించెన్ విభుం డయ్యెడన్." శకుం. కృ. ౩, ఆ. ౪౮; **2.** ఆడించు; **3.** జళిపించు. "వ. మనయోధులాయుధంబు లంకించుచు నొండొరులతోడ బిరుదులు వలుకుచు నర్జునుండు దడసె గోవిందుండు దఱిమికొనిరాఁడు." భార. ద్రోణ. ౩, ఆ. ౩౧; "ముద్గర ముసలాదిసాధనంబు లంకించుచు నవ్వీరునిఁ జుట్టుముట్టిన." జై. ౨. ఆ. ౩౧; "వ. గదాదండ ధనుర్బాణ కృపాణకరపత్రముఖనిఖిలసాధనంబు లంకించుచుఁ బెడబొబ్బలిడుచు వెడనవ్వులు నవ్వుచు." సానం. ౨, ఆ. ౧౨౭; **4.** త్రిప్పు. "సీ. కురులు గన్నవమీఁద నెరసిన నెమ్మొగ, మడ్డమంకించి చూపలవరించి." నిర్వ. రా. ౭, ఆ. ౩౭; **5.** వశపఱుచుకొను, స్వాధీనము చేసికొను. "క. సంకెలలఁ బడ్డవారే, యంకింతురు నీదురాజ్య మర్థము నసువుల్." కృష్ణా. ౨, ఆ. ఇట అపహరించు అని. శ.ర.—సం.స.క్రి.**1.**స్తుతించు. "ద్వి.హరలీలరుద్రసహస్రనామాదు, లరుదొందఁ జదువుచు నంకించువారు." పండి. పర్వ. ౩౬౮-పు; "వ. అనిమఱియును సముచిత సంభాషణంబుల నంకించుచున్న యప్పరమవైష్ణవీరత్నంబును సాదర సరససల్లాపమందహాస పూర్వకంబుగా నాలింగనంబుఁగావించి." భాగ.౭, స్కం. ౧౩౪; **2.** పఠించు. "ద్వి. తవిలి నూతనపురాతన భక్తమహిమ, లంకించుచును నిజాపాంగహర్షాశ్రు, కంకణంబు లురాలఁ గరుణ నం జూచి."పండి. దీక్షా. ౩-పు.

అంకితము. సం.విణ. (అ. ఆ. అ.) (అంకముగలదిగాఁ జేయఁబడినది.)చూ.అంకము.**1.** గుర్తులుగలదిగాఁ జేయఁబడినది; **2.** కళంకముగలదిగాఁ జేయఁబడినది; **3.** ఒకనిపేరితో గుర్తుపెట్టఁబడినది. (గ్రంథాది.)—అంకితముచేయు= ఆశ్వాసముల యాద్యంతములయందు గౌరవముగలదేవరాజాదుల నామసుగుణాదులు తెలుపుపద్యాదులు గలదిగాఁజేయు.—అంకితమొనర్చు (=అంకితముచేయు.) "తే. అంకితమొనర్తుఁ దెనుఁగుపేళ్లరసి కూర్చి, గరిమతో నాంధ్రనామసంగ్రహమనంగ." ఆం. నా. దే. ౩.

అంకితవ్యము. విణ = అంక్యము. విణ.

అంకియ. వై. వి. **1.** ఒకటిమొదలగు సంఖ్యలను దెలుపుగుర్తు; **2.** పశము. చూ. అంకె.

అంకియము. దే. వి. ఎద్దు మొదలగువానిపై వేసెడి యొక ప్రక్కబరువు, అంకెము.

అంకిలి. దే. వి. 1.శోకము, దుఃఖము. "వ. అజ్జనపతి శోకంబు శాంతంబు సేయుటకు సంజయుండి ట్లనియె....వ. సంజయు పలుకులకుం జెవియొడ్డి ధైర్యంబు చిక్కఁబట్టి యంకిలి దేఱిన యవ్విభు నాలోకించి." భార. స్త్రీ. ౧, ఆ. ౨౩; "క. అనుచరులలోని భూసురు, లనునయ వచనములఁ దేర్ప నతఁ డంకిలిదే,ఱిన మతితో నశ్రులు మఱియును గ్రమ్మం గరతలమున నొత్తుచుఁ జూచున్." భార. మౌస. ౧, ఆ. ౧౬౪; 2. క్షోభము. "చ. అరయఁగ నెల్లలోకములు నంకిలి నొంద మహార్ణవంబులో, నొరగి నిమగ్నమైన ధర నుద్ధతిఁ గొమ్మున నెత్తినట్టి." భాగ. ౬, స్కం. ౩౦౪; 3. ఆపద. "క. ఇంకనిజలములుగలిగిన, యింకొక్కయగాధసరసి నిడినం జాలున్, సంకోచింపకమము నీ, యంకిలిఁ బాపుటకు నీవ యర్హుఁడ వనినన్." పంచ. నా. ౧, ఆ. ౨౩౦; 4. నిరోధము, అడ్డు. "తే. చిలుకలును బోలె హేమాద్రిశిఖరశృంగ, కల్పవృక్షాటవీవాటికలఁ జరించె, మహీధరము సేయు నంకిలిమానుటయును, వనజవనబాంధవుని తేరువారువములు." కాశీ. ౩, ఆ.౧౧; "ఉ. అంకిలి చెప్ప లేదు చతురంగబలంబులతోడ నెల్లి యోపంకజనాథ." భా. ౧౦, స్కం. పూ. ౧౭౦౫; 5.భంగము. "సీ. మొసల కైదువఁబూని మొసల వానిఁగలంచి తులువకత్తిని సోఁకుఁ దులువనొంచి, వంకిలిబ్బి దొరలా వంకిలి నొందించి కొంగవాలున గట్ల గొంగ గెలిచి." అచ్చ. రా. యు. ౪౭౪; 6. కిటుకు, కీలు, మర్మము. "ఉ. అంకిలెఱింగి యాసరసుఁ డంత వివాహవిధిజ్ఞుఁడైనమీ,నాంకుఁ డొనర్చినాఁ డిది శుభైక ముహూర్తము రమ్మటంచుఁ బర్యంకము మీఁద నచ్చెలిఁ గరగ్రహణం బొనరించె." విజ. ౧, ఆ. ౧౦౫; "ఆ. అంకిలెఱిఁగి మాటలాడ నేర్చినపుడు, పిన్నపెద్దతనము లెన్న నేల, పిన్న చేతి దివ్వె పెద్దగా వెలుఁగదా, విశ్వదాభిరామ వినురవేమ." వేమన. ౧-౧౨౧; 7. దౌడకీలు (బ. వ. అంకిళ్లు). "తే. పిక్కయంకిలి చంకిలి ప్రక్కడొక్క, మూఁపువీఁపన గాళ్లేలు ముక్కుఁ జెక్క, కన్ను వెన్నన కుండఁ జీకాకుపఱచె." రంగా. ౩, ఆ.౯౦; 8.దౌడక్రింద భాగము; 9. అరమరిక, భేదము. "మ. అంకిలి లేక యప్పు డరుణాధరపల్లవనిర్గతంబులై పంకరుహాయతాక్షి నునుఁబలుకులు తేనియ లొలుకన్ శ్రవో, లంకృతులై, నృపాలుమది లగ్నములయ్యె వినోదలీలకై, మంకెన పూవు బాణమున మన్మథుఁ డేసిన తూపులో యనన్." సై. ౪, ఆ. ౧౩.

అంకిలిపడు. ద్వి. అ. క్రి. అడ్డుపడు. "క. దైవికమై, యంకిలిపడియెడి పనులకు, సంకటపడుటదియు నొకవిచారమెచెప్పుఁడా." భో. ౬, ఆ. ౩౭౬.

అంకిలిపెట్టు. దే. స. క్రి. అడ్డగించు, నిరోధించు. "ఉ...వాఁ, డాయతశక్తి నన్నుసిటఁ నంకిలిపెట్టిన యప్డు." రా. సుం. కాం. ౭౧.

అంకిళ్లు. దే. వి. బ. (అంకిలి-బ. వ.) దవుడక్రిందిభాగము. అంగిలి+కీళ్లు=దవుడక్రిందికీళ్లు అని శ. ర.

అంకు. దే. అ. క్రి. లభించు, దొరకు. "వాఁడు చేతి కంకినదంతయుఁ బట్టుకొనిపోయెను." "వాఁడు అంకకుండఁగఁ బాఱిపోయినాఁడు."

అంకుటము. సం. వి. అ. పుం. 1. గడియదీసెడి వంకరయినుపకమ్మి, కుంచెకోల; 2. తాళపుఁజెవి.

అంకుఁడు. దే. వి. దేవుఁడు. (చూ. వియ్యంకుఁడు) అని శ. ర.

అంకుడు. దే.వి. ఒకానొకచెట్టు. ✤

అంకురకము. సం. వి. అ. పుం. 1. మొలక; 2. (గడ్డి మొదలగువానితో కూర్పఁబడినది.) పాక, గోష్ఠము; 3. (పక్షుల) గూఁడు.

అంకురము. సం. వి. అ. పుం. 1. మొలక. "కులాంకురము, అన్వయాంకురము" ఇత్యాదులయందు లాక్షణికముగ పుట్టినశిశువుఅను భావము సూచితము; 2. కొన. "దర్భాంకురము, దంష్ట్రాంకురము, నఖాంకురము, దీపాంకురము" మొ.; 3. జలము; 4. రక్తము; 5. రోమము.

అంకురారోపణము. సం. వి. అ. న. 1. అంకురములు బయలుదేఱుటకు గింజలుచల్లుట; 2. శుభకర్మములయందు మంత్రసంస్కారముతో పాలికలలో నవధాన్యములు చల్లుట; 3. ప్రారంభము.

అంకురార్పణము. సం. వి. అ. న. (అంకురములు ఉంచుట) = అంకురారోపణము.

అంకురాళి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. మొలకల సముదాయము, నాఱు.

అంకురించు. సం. అ. క్రి. మొలచు, మొలకలెత్తు.

అంకురితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మొలకెత్తినది, మొలచినది; 2. పుట్టినది.

అంకుశగ్రహుఁడు. సం. వి. అ. పుం. (అంకుశమును పట్టుకొనువాఁడు.) మావటివాఁడు.

అంకుశదుర్ధరము. సం. విణ. (అ. ఆ. అ.) అంకుశమున ఆఁపరానిది(ఏనుఁగు).—వి.అ. పు. అంకుశమునకు లొంగని యేనుఁగు (మదపు టేనుఁగు.)

అంకుశధారి. సం. విణ. (న్. ఈ-ణీ.న్.) 1. అంకుశము ధరించువాఁడు; 2. ఏనుఁగునడపువాఁడు.

అంకుశము. సం. వి. అ. పుం. న. 1. (ఏనుఁగును త్రోలుట కుపయోగించునది లేక, చివర వంపుగ నుండునది.) ఏనుఁగుకుంభస్థలమునందుఁ బొడిచెడి యాయుధము,అంకుసము; 2. నిరోధము, అడ్డు, ప్రతిబంధము. "నిరంకుశాధికారము. కవులు నిరంకుశులు."

అంకుశరేఖ. సం. వి. ఆ. స్త్రీ. (సాముద్రికమున) అంకుశమువలె చేతిలోనుండు రేఖ. (ఇది సుఖ వృద్ధిని, సర్వాకర్షణమును సూచించును.)

అంకుశితము. సం. విణ. (అ. ఆ. అ.) (అంకుశము గలదిగాఁ జేయఁబడినది.) 1. అంకుశముతోఁ బొడువఁబడినది; 2. ప్రతిబంధముగలది.

అంకుసంబుమాద్రి. ద్వ. వి. (అంకుశమువలె నుండునది.) మూలానక్షత్రము.

అంకుసము. వై. వి. అంకుశము.

అంకూరము. సం.వి.అ. పుం.=అంకురము.కొనకు— "క. ఆవాక్యంబులు విని కప, టావనిదారంబు దంష్ట్రికాంకూరవిభా, ధావళ్యంబులు దిక్కుల, పై వెన్నెల వెదలుచల్లఁ బకపక నగినన్." వరా. ౧, ఆ. ౫౪.

అంకూరితము. సం=అంకురితము.

అంకె. వై.వి. 1. ఒకటిమొదలగు సంఖ్యలను దెలుపునట్టిగుర్తు, అంకము; 2. వశము. "ఉ. అంగన నమ్మరాదు తనయంకెకురాని మహాబలాఢ్యు వే, భంగుల మాయ లొడ్డి చెఱుపం దలపెట్టు." భాస్కరశతకము. శ. ౧.

అంకెగొను. ద్వ. స. క్రి.(అంకె+కొను.) 1. వశము చేసికొను; 2.ఆక్రమించు, క్రమ్ము. "తే. మబ్బు, లదరి పూత్కృతి రవిమధ్య మంకెగొనఁగఁ, జిక్కువడక చరించు నందొక్కకరటి." రా. వి. 3, ఆ. ౪౯.

అంకెన. దే. వి. ఒకానొక ఫలవృక్షము.

అంకెము. దే. వి. 1. ఎద్దుమొదలగువానిపై వేసెడి యొకప్రక్క బరువు, అంకియము; 2. రికాబు, అంకవన్నియ.

అంకెవన్నియ. ద్వ. వి. (అంకెము+వన్నియ)=అంకవన్నియ. "సీ. గోమేధికంబులఁ గొమరొందు కళ్లెంబు వజ్రాల మేలంకెవన్నియలును." ఉ. రా. ౭, ఆ. ౩౯౭.

అంకెవన్నె. ద్వ. వి.=అంకెవన్నియ. "క.వడిఁగట్టికవారలు పా, వడ మిడి హెచ్చరికరాయ వరగండ యనన్, బెడయంకెవన్నెపైఁ గా, లిడకపుడుచివుక్కుమనఁగ నెక్కెం దేజిన్." కుసల.౨,ఆ. ౫౬.

అంకోటము
అంకోఠము
అంకోడము
అంకోరము
} =అంకోలము. ✿

అంకోలము. సం. వి. అ. పుం. ఊడుగు. ✿

అంక్యము. సం. వి. అ. పుం. అంకమున నుంచుకొని వాయింపఁదగిన మృదంగవాద్యము.—విణ. (అ. ఆ. అ.)= అంకనీయము, అంకితవ్యము. 1. గణనీయము. ఎంచఁదగినది; 2. అంకములు వేయుటకుఁ దగినది; 3. అంకమున కర్హము.

అంగ. దే. వి. కాలు చాచిపెట్టినయడుగు."అంగలు వేయుచు పోయినాఁడు."

అంగకము. సం. వి. అ. న. 1. శరీరము; 2. రవిక; 3. చొక్కాయ.

అంగజ. సం. వి. ఆ. స్త్రీ. (శరీరమువలనఁ బుట్టినది.) కూఁతురు.—అ. న—ము. నెత్తురు.—పుం. 1. మదము; 2. వెండ్రుక.—విణ. (అ.ఆ.అ.) శరీరమున పుట్టినది.

అంగజవైరి. సం. వి. ఇ. పుం. (అంగజ+వైరి = మన్మథునకు శత్రువు.) శివుఁడు.

అంగజాంతకుఁడు. సం. వి. అ.పుం. (అంగజ+అంతకుఁడు=మన్మథునిఁ జంపినవాఁడు.) శివుఁడు.

అంగజాతుఁడు. సం. వి. అ. పుం. =అంగజుఁడు.

అంగజారి. సం. వి. ఇ. పుం. (అంగజ+అరి=మన్మథునికి విరోధి.) శివుఁడు.

అంగజుఁడు. సం.వి. అ.పుం. **1.**(శరీరమువలనఁబుట్టినవాఁడు.) కొడుకు; **2.** (శరీరమునందుఁబుట్టువాఁడు లేక మనసునందుఁ బుట్టువాఁడు.)మన్మథుఁడు.

అంగజోల. దే. వి. కంచుకి, రాణివాసపుకావలివాఁడు, సౌవిదల్లుఁడు. "వ. పాదపాదమని సౌవిదల్లులు హస్తపల్లవంబులు పట్టి తివిచిన నప్పంకజాక్షికంకణ ఝుణఝుణత్కారంబుగాఁ గెంగేలు గుదిలిచి తివిచికొని వికటకుటిలభ్రుకుటినటకభీషణ ఫాలఫలకయై కలకలం గటికినగవు నగి కన్నుల నిప్పు లురుల హుంకారంబు సేసిన...అంగజోలలు కాలుకాలం బెనఁచుకొని చాఁపకట్టు పడంగూలిన." కాశీ. ౬, ఆ. ౨౨౭.

అంగడి. దే. వి. (క.అంగడి. త. అంగాడి.); **1.**సరకులమ్మెడుచోటు, ఆపణము, దుకాణము. "చ. కొనుఁడు పరార్థ్య రత్నములు గోరినవానిన యిత్తుమన్తెఱంగునఁ బచరింతు రంగడులఁ గోమటులప్పురి నిద్ధరత్నముల్." భార. ఆది. ౮, ఆ. ౭3; **2.** స్వర్ణకారుఁడు మొదలగువారు పనిచేయుచోటు. "మ. జేతసౌన్నారి తెఱంగునందనరె వర్షావేళ మిన్నంగడిన్." చంద్రా. ౪, ఆ. ౧౭; **3.** రాజసభ. "క. పవనజు గదయును నీగాం, డివమును నెటఁబోయె నంగడికి బొంచాలిం, దివిచికొని వచ్చునెడ." భార. ఉ.౪, ఆ.౧౯౯; **4.**వ్యవహారములు నెఱవేర్చుచోటు. "తే. గ్రామకార్యంబుదీర్చు నంగడికివచ్చె." పాండు. 3,ఆ. ౪౬; **5.** న్యాయాన్యాయములు విచారణచేయు చోటు, కచ్చేరి (కోర్టు). "ఉ .అంగడి మూఁడు మాడలును నడ్డుగ దండుగ వానిపైఁ బడున్." విజ్ఞా. ప్రా. కాం. ౪౨.

అంగడిఁబెట్టు. దే. స. క్రి. వీథిఁబెట్టు, బయలుపఱచు. "చ. తలఁపున నెంత మోహపరితాపము గల్గిన దాఁచుకొందురో, యలయిక లేకయీ కరణి నంగడిఁబెట్టుదురో వధూటులొఁ, బలుకవు నిన్నువంటి కులభామలఁ గానవొ వారి కాత్మసా, థులపయి బాళిలేదొ తమిఁబుట్టిన పట్టున మట్టుపెట్టరో." కువల. 3, ఆ. ౪3.

అంగడికాఁడు. దే. వి. (క. అంగడికాఱ.) దుకాణదారు, సరకులు అమ్మెడువాఁడు.

అంగడికెక్కు. దే. అ. క్రి. వీథికెక్కు, పదిమందికిఁ దెలియు. "ఉ. మారునిచేతి ఘాత నభిమానము వోవ సఖీజనంబుచే, నారడిగప్పిన న్వలపు లంగడికెక్కక కోరినప్పుడే, కూరిమివల్లభుం గలసి కోర్కి ఫలించి సుఖించు కన్నియ, ల్భారపునిష్ఠఁ బూని తొలుబాముల నోముల నేమి నోఁచిరో." కవిక. 3, ఆ. ౮౨.

అంగడివాఁడు=అంగడికాఁడు.

అంగణము. సం. వి. అ. న. (=అంగనము. అంకణము అనియును కొందఱు.); **1.** అజిరము, ముంగిలి; **2.** ఆకాశము.

అంగద.ఉభ—దే. వి. (త. అంగదం=పినుఁగుయొక్క ఆఁకలి, క్షుద్బాధ, దుఃఖము.) **1.** ఆఁకలి. "సీ. ప్రేవులు గండలు పెఱికి పేటాడి యంగదఁ గొని మెదళు లగల్చికొనుచు, రాగిలి రక్తంబు ద్రావుచు లోచన గుళికల నొలిచి మ్రింగుచును..." భార. స్త్రీ.౧,ఆ.౯; "చ.అఱుగునె యుక్కుగుండు కడునంగద మ్రింగిన." రా. అర. కాం. ౨, ఆ.౧౨౧; **2.** కోపము. "ఉ. అంగద నాథు మ్రింగినవృకావలి దన్ వెసముట్టుకొన్న స, ర్వాంగములుం జలింప వెగడందుచు దిక్కులుసూచుచున్న సారంగియపోలె." భార. ద్రోణ.౧, ఆ. ౧౭; "చ. పనిచిన నాతఁడుం జనియె బాహుబలంబున నేచి వాసవుం, డని కెదురేఁగుదెంచెనిటు లద్భుత సంగరమైన చోట న, య్యనిమిషనాథుఁ బట్టుకొని యంగద వృత్రుఁడు మ్రింగె దేవతల్, మనమున బెగ్గలింపఁగఁ జలంబుబలంబును జూపి యుగ్రుఁడై." భార. ఉ. ౧. ఆ, ౧౨3; "అపాకృష్యాత్మీప ద్వక్త్రే శక్రం కోప

దుఃఖించు. "శా. ఆకంఠమ్ముగ నీవు మాధుకర భిక్షాన్నంబు భక్షింపఁగా, లేకున్నం గడునంగలార్చెదవు మేలే! లెస్స!" కాశీ. ౭,ఆ. ౧౬౨; "సీ. అనువుదప్పిరి నొచ్చి రలసి రాపద నొంది రదవదలైరి చీకాకుపడిరి, యంగలార్చిరి విచ్చి రారడిఁ బొందిరి." హర. 3, ఆ. ౧౦; 2. భీతి చేనఱచు. "చ. వాలభుజగింగని గోంద్రని యంగలార్చుచున్." ఆము. 3, ఆ. ౧౯.

అంగలార్పు. దే. వి. =అంగలారుపు. (క. అంగలాపు; త. అంగలాయ్.) **1.** విలాపము, ఏడ్పు. "సీ. ఆలానముల వారణావలిఁగానని హస్తిపకుల యంగలార్పుకతన." రంగా. 3, ఆ. ౨౩౬; **2.** దుఃఖము.

అంగలేపము. సం. వి. అ. పుం. **1.** (శరీరమునందు పూయఁబడినది.) పరిమళద్రవ్యము; **2.** శరీరమునకు పరిమళద్రవ్యమును పూయుట.

అంగవస్త్రము. సం. వి. అ. న. **1.** ఉత్తరీయము, పైని వేసికొనువస్త్రము; **2.** అప్రధానవస్త్రము, స్నానాదిసమయముల తుడుచుకొనుట కుపయోగించు చిన్నబట్ట. (విశాఖపట్టణప్రాంతమున గావంచా యనియుఁ, గొన్నిచోట్ల కొల్లాయగుడ్డ యనియు వాడుక. అంగోస్త్రమని, అంగాస్త్రమని భ్రష్టరూపములు వాడుకలోఁ గలవు.)

అంగవించు. దే. అ. క్రి. (క. అంగవిసు.) ఉత్సహించు. "తే. నింగినేలయుఁ దాటింప నంగవించు, పగిది." నై. ౭, ఆ. ౪౬.—స. క్రి. అతిక్రమించు. "సీ. ఈక్షణజితపద్మ నితని నేత్రము మున విమతపద్మము లంగవింపఁజాలు." నై. ౫, ఆ. ౧౪౫. (అంగలించు అని కొన్ని ప్రతుల యందుఁగల పాఠము యతివిరుద్ధమును, సంప్రదాయవిరుద్ధమును. సోదరభాషలో అంగవిసు అని యే కలదు.)

అంగవిక్షేపము. సం. వి. అ. పుం. అభినయము, భావానుకూలముగ అవయవములను తగినప్రదేశములం దుండునటుల సవిలాసముగఁ బ్రసరింపఁ జేయుట, అవయవములను త్రిప్పుట.

అంగవిద్య. సం. వి.ఆ. స్త్రీ. **1.** (అంగముల జ్ఞానము.) వేదాంగములగు వ్యాకరణాదుల పరిజ్ఞానము; **2.** (అంగమైనవిద్య.) అప్రధానవిద్య.

అంగసంస్కారము. సం. వి. అ. న. (అంగ+సంస్కారము.) **1.** శరీరము నలంకరించుట; **2.** దేహమునందలి ముఱికి పోఁగొట్టుట.

అంగసంహతి. సం.వి.ఇ.స్త్రీ. (అంగ+సంహతి.) **1.** అవయవము లెక్కడెక్కడ నట్లుండవలయునో అక్కడక్కడ నట్లుండుట; **2.** శరీరము.

అంగహారము. సం.వి.అ. పుం. (చూ. అంగవిక్షేపము.) "ద్వి. అరుదగు వింశతియంగహారములు, ధర నిరువది రెండు దానకంబులును." పండి. పర్వత. 3 ౭౦-పు.

అంగహారి. సం. వి. ఇ. పుం. **1.** అభినయము; **2.** అభినయము చూపుస్థలము, నాట్యరంగము.

అంగాంగీభావము. సం. వి. అ. పుం. అంగమునకు అంగికిఁగల సంబంధము, పరస్పరము పోషకత్వముగ లిగియుండుట. (గౌణముఖ్యభావము, ఉపకార్యోపకారకభావము, అనుగ్రాహ్యానుగ్రాహకత్వము.)

అంగారకము. సం. వి. అ. పుం. **1.** నిప్పు; **2.** బొగ్గు; **3.** చిన్ననిప్పు, చిన్నబొగ్గు; **4.** గుంటగలగర ⚜; **5.** పచ్చగోరంట, మహాసహ ⚜.

అంగారకర్పరము. సం. వి. అ. పుం. సువర్ణాదిలోహములు కరఁగుమూస.

అంగారకవారము. సం. వి. అ. పుం. మంగళవారము.

అంగారకిత. సం. వి. ఆ. స్త్రీ. **1.** కుంపటి; **2.** లత; **3.** నదీవిశేషము.

అంగారకుఁడు. సం. వి. అ. పుం. నవగ్రహములలో నొకగ్రహము.

అంగారధాని. [illegible] వి. ఈ. స్త్రీ. (అంగార+ధాని= బొగ్గు[illegible]కాధారమైనది.) హసంతి, [illegible]ము.

అం[illegible]క. సం. వి. ఆ. స్త్రీ. = అంగారధాని.

అంగారపర్ణము. సం. వి. అ. పుం. (ఆందలి ఆకులు అంగారమువలెనుండును.) నిప్పువన్నె గుత్తులకానుఁగు ⚜.

అంగారపర్ణుఁడు. సం. వి. అ. పుం. అంగారపర్ణవనమున కధిపతియ[illegible]డు. ఇతఁడు పాండవులు ద్రౌప[illegible]మునకై ద్రుపదపురమునకు పోయినపుడు మార్గమధ్యమున గంగాతీర

ముగా చేయుటకు వీలుకాలేదు;" 3. సదుపాయము. "ఆయింటికి అంగులేమియు లేవు;" 4. అందము. "క. బంగారు దీవయుంబలె,నంగునఁ దగు పొలఁతిమేన నారు దనర్చుం, బొంగారు మెఱుఁగులోపలి, సింగారపు మిసిమిగ్రమ్ము జీరయ పోలెన్." యయా. ౪, ఆ. ౭౬; 5. విధము. "ఉ. ఆయెకిమీనితోడ నేయంగున మాటలాడితి ధరాధిపుఁడేమని పల్కఁ దెల్పునా, బంగరు ముద్దుచిల్క నినుఁ బ్రాణపదంబుగ నెంచి పెంచితిన్." రసి. మ. ౫, ఆ. ౭౬.—విణ. అనుకూలము, తగినది. "వ. తననగరికింజని తగు పనులు దీర్చి వేఁటకు నంగగు సింగారంబునం బొంగి బేరులు మొదలుగాఁగలుగు నిద్దంబు లగు వాయిదంబుల పెన్నవలి దవిలి.". యయా. ౧, ఆ. ౧౦౭; "ఆయిల్లు మాకు అన్నింటికి అంగుగానున్నది; అది అన్నింటికి అంగయినచోటు."

అంగుటము. వై. వి. బొటనవ్రేలు, అంగుష్ఠము. "వ. తనయంగుటంబు వ్రేలం గీఱిన నందు భస్మంబుగాఱిన." భార. శల్య. ౨, ఆ. ౧౬౧. అంగుళ్యగ్రేణ రాజేంద్ర స్వాంగుష్ఠ స్తాడితో౽భవత్. సం. భా. శల్య.

అంగుడుదుడిపి. దే. విణ. అక్కడిమాటలు ఇక్కడ, ఇక్కడిమాటలు అక్కడ చెప్పెడువాఁడు, కొండెములు చెప్పెడువాఁడు.

అంగుదారు. దే. వి. (అంగుచేయువాఁడు.) 1. భోగపుమేళమునకు అంగుచేయువాఁడు (తాళము వేయువాఁడు.) 2. ఏదేనియొకకార్యమును సాధించుటకు తోడుగనుండువాఁడు, కార్యానుకూల్యమునకై తోడుగనుండి తోటుపడెడి వాఁడు.

అంగులము. సం. వి. అ. పుం.=అంగుళి...(అంగమందు-చేతియందు-లీనమగునది.) అం...ము, బొట్టనవ్రేలు; 2.వ్రేలు; 3.బొట్టనవ్రేలి వెడల్పుగల పరిమాణము, అడ్డముగానుంచిన యాఱు యవలపొడవుగల ప్రమాణము. ఎనిమిది యవల ప్రమాణమని కొందఱు. (ద్విత్రిశబ్దాదులతో సమసించిన యుత్తరపదమగు అంగులశబ్దము యొక్క రూపము. ద్వ్యంగులము,త్ర్యంగులము మొ.)

అంగులి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. వ్రేలు; (అంగుష్ఠతర్జనీమధ్యమానామికాకనిష్ఠికలు అని వ్రేళ్లు ఐదు.); 2. (వ్రేలివలెనుండునది.) ఏనుఁగుతొండముచివర.

అంగులిత్రము. సం. వి. అ. న. (అంగులి+త్ర= అంగులులను రక్షించునది.) హస్తకవచము, వ్రేళ్లను తొడుగుకొను కవచము, అత్తెము. వింటినారి లాగుటవలనఁ గలిగిన చెమ్మటను పోఁగొట్టుటకై చేతికిఁ గట్టఁబడినది అని కొందఱు.

అంగులిత్రాణము. సం. =అంగులిత్రము.

అంగులిముద్ర. సం. = అంగుళిముద్ర.

అంగులిమోటనము. సం. వి. అ. న. (అంగులి+మోటనము.) రెండువ్రేళ్లతో చప్పుడుచేయుట; చిటికె.

అంగులిసందేశము. సం. వి. అ. పుం. వ్రేళ్లసంజ్ఞచేఁ దెలుపుట.

అంగులిస్ఫోటనము. సం. వి. అ. న. (అంగులి+స్ఫోటనము.) రెండువ్రేళ్లతో చప్పుడు చేయుట, చిటికె.

అంగులీయకము. సం. = అంగులీయము.

అంగులీయము. సం. వి. అ. న. (అంగులికి అర్హమైనది.) అంగుళ్యాభరణము; ఉంగరము.

అంగుళము. సం. = అంగులము. "సీ. అంగుళంబుల నల్ల నలకలు గబళించి కెమ్మోవి యాని యెక్కింతుగాయ్యు, మనము మనంబునఁ బెనఁచి" భార. విరా. ౨, ఆ. ౩౧౦. "వ. చతురంబుగఁ జక్కనొక్కత్రాఁడుసుట్టిన నది రెండంగుళంబులు గడమపడియె." భాగ. ౧౦, స్కం. పూ. ౩౮౪.

అంగుళి. సం. = అంగులి.

అంగుళిత్రము. సం. = అంగులిత్రము.

అంగుళిత్రాణము. సం. = అంగులిత్రాణము.

అంగుళిముద్ర. సం. వి. ఆ. స్త్రీ. ముద్దుటుంగరము.

అంగుళిమోటనము. సం. = అంగులిమోటనము.

అంగుళిసందేశము. సం. = అంగులిసందేశము.

అంగుళిస్ఫోటనము. సం. = అంగులిస్ఫోటనము.

అంగుళీమానము. సం. వి. అ. పుం. జేన, మూర మొదలగు కొలత.

అంగుళీయకము. సం. = అంగులీయకము.

అంగుళీయము. సం. = అంగులీయము.

అంగుష్ఠమాత్రుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) (అంగుష్ఠ+మాత్ర.) అంగుష్ఠ ప్రమాణము గలవాఁడు, మిక్కిలి పొట్టివాఁడు.

అంగుష్ఠము. సం. వి. అ. పుం. 1. బొటనవ్రేలు; 2. అంగుష్ఠప్రమాణము.

అంగుష్ఠ్యము. సం. వి. అ. పుం. (బొట్టనవ్రేల నుండునది.) బొట్టనవ్రేలిగోరు.

అంగూరు. దే. వి. ద్రాక్షావిశేషము.

అంఘ్రి. సం.వి.ఇ. పుం. 1. పాదము, కాలు; 2. వేరు; 3. (పశువులకు నాలుఁగుపాదము లుండునుగాన వానిలో నొకటి.) నాల్గవభాగము; 4. (పద్యము లందలి నాలుగవభాగము.) చరణము.

అంఘ్రిజుఁడు. సం. వి. అ. పుం. పాదజుఁడు, శూద్రుఁడు.

అంఘ్రిపద్మము. సం. వి. అ. న. (పద్మమువంటి పాదము.) అడుగుఁదమ్మి.

అంఘ్రిపనస. సం. వి. అ. పుం. వేరుపనస ♣.

అంఘ్రిపము. సం. వి. అ. పుం. (అంఘ్రి+ప = వేరుతో జలముపీల్చునది.) పాదపము, చెట్టు.

అంఘ్రిపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. (అంఘ్రి+పర్ణ= వేరుమొదలుకొనియు ఆకులు కలది.) పృశ్నిపర్ణి, కోలపొన్న ♣.

అంఘ్రిపర్ణిక. సం. వి. ఆ. స్త్రీ. = అంఘ్రిపర్ణి ♣.

అంఘ్రిపానుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కాలి వ్రేలు కుడుచుకొనువాఁడు (= శిశువు.)

అంఘ్రిస్కంధము. సం. వి. అ. పుం. (కాలికి మూఁపువంటిది.) చీలమండ.

అంచత్. సం. శత్రం. (అంచ్+అత్.) (దీనికి తెనుఁగున సమాసపూర్వపదముగానే ప్రయోగము.) ఒప్పుచున్నది.

అంచనము. సం. వి. అ. న. 1. పూజ; 2. ఒప్పుట.

అంచలము. సం. వి. అ. పుం. 1. బట్టకొంగు, చెఱఁగు; 2. కొన. "నేత్ర; 3. మా దృగంచలము" మొ.

అంచించు. దే. అ. క్రి. (ఫ. అంజిత్తల్) ఫలపరిమితిని ఉజ్జాయింపుగా చెప్పు, అంచనవేయు, ఊహించు. "క. చంచత్కాశీనగరీ, పంచక్రోశావనీ విభాగ స్థలిపైఁ, బంచత్వమొందు జనునకు, నంచించి యనుగ్రహించునఁట యమ్మనువుల్." భల్లా. ౨, ఆ. ౪. ౧.

అంచితభ్రువు. సం. వి. ఊ. స్త్రీ. ఒప్పుచున్న కనుబొమలుగలస్త్రీ; లేక, వంపుగల కనుబొమలు గలస్త్రీ.

అంచితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఒప్పినది; 2. పూజింపఁబడినది, ఆదరింపఁబడినది, గౌరవింపఁబడినది; 3. వంగినది, వంపైనది, వంపఁబడినది. "దోర్లీలాంచిత చంద్రశేఖరధనుష్కుఁడు, అంచిత సవ్యజానువు, అంచితలాంగులము" మొ.

అంచియ. దే. వి.=అంచె. జాబులు మొదలగు వానిని మోచుకొని పోయెడు జనులును బండ్లును మార్గమధ్యమునఆఁగుచుండుఘట్టము,మజిలీ, మకాము.

అంచె. దే. వి. 1. అంచియ. "వ. అంచె లంచెలం బంచతాపతిత చమర సృమర కిరి హరిణ రురు మహిష పృషదంశ గోధికా శశ పిశితఖండంబులొండొండ యువ్వెత్తుగా నాకుఁబొత్తరలం గట్టియు." స్వా. ౪, ఆ. ౬౦; 2. వరుస. "సీ. అనిలంబు లేదును నంచెలంచెలుగట్టి యాకాశవీథి నందంద నడవ." కాశీ. ౧, ఆ. ౧౩౨; "ఉ. అంచెలుగట్టి కాళ్లతోడుసై చనసీవుగదమ్మ ప్రోదిరా, యంచలు." స్వా. ౫, ఆ. ౬౧.

అంచే. వై. వి. 1. హంస; 2. చేరువ, సమీపము.

అంచేతత్తడి. ద్వ. వి. హంసవాహనుఁడు, బ్రహ్మ.

అంచేన. దే. వి. 1. ఫలపరిమితినూహించుట; 2. ఊహ, ఆలోచన. "ఉ. ఇంత బెడంగులోకమున కెవ్వరి కున్నది యంబ తా నిజా, త్యంతిక నైపుణీ మహిమ మంచేన వ్రాసెనో యేమొకాక యా, చింతయుఁగూడ దీతని సృజించియెజోడుగఁగోరి సుమ్ము." ప్రభా. ౧, ఆ. ౧౪౨.

అంచేనకట్టు. దే. అ. క్రి. = అంచించు.

అంచేనదారుఁడు. ద్వ. వి. ఫలపరిమితిని అంచన వేయువాఁడు.

అంచేనవేయు. దే. అ. క్రి = అంచించు.

అంచేపదము. మి. వి. 1. హంసయొక్క అడుగు; 2. వ్రాతయందు తప్పుగలచో నుంచెడు హంసపాదాకారమైనగురుతు. హంసపాదు అని వాడుక.

"క. వెలఁదికటిపేర నిల నొక, పులినము దిగఁబడియె సింధుపులినపుఁబంక్తిన్, నలువ యది వడఁగఁగాదే, తెలియుట కం దంచపదము తిరము గనిలిపెన్." ఆము. ౫, ఆ. ౨౯.

అంచయాన. వై. వి. **1.** హంసవంటి నడకగల ఆఁడుది; **2.** ఆఁడుది. "మత్త. అంచయానవరించువేళ." రుక్మాం. ౪, ఆ. ౧౪.

అంచయెనుఁగుమావంతు. ద్వ. వి. (హంసయను గజమును నెక్కువాఁడు.) బ్రహ్మ. (మన్మథుఁడు అని వేంకటేశాంధ్రమునను్నట్లు లక్ష్మీనారాయణీయము. అది ప్రామాదికము.)

అంచరవుతు. వై. వి. హంసవాహనుఁడు, బ్రహ్మ.

అంచెల. దే. వి. ప్రక్క, పార్శ్వము. "ద్వి. జాళువాగిండియంచల దాల్చి శుకుఁడు." విష్ణు. ఉ.౪, ఆ. ౮. ౪.

అంచెలము. దే. వి. అచ్చలము, అగ్రహము, పట్టుదల. "ద్వి. పంచెఁ దామెత్తుక పత్తులు దివికి, నంచలంబున నేగి యందుండి పలికె." నళ. ౩, భా. ౧౦౧౦.

అంచెలవిడిది. దే. వి. (హంసలు నివసించుచోటు.) ఆకాశగంగ, మిన్నేఱు.

అంచు. యు—దే.స. క్రి. అరుగుధా. ప్రే. అరుగఁజేయు, పుచ్చు, పంపు. (పెరుగు అనుదానికి పెంచురూపమువచ్చినట్లు అరుగు అనుదానికి అంచు రావచ్చును. పోవుధాతువు ప్రేరణరూపమగు పంచు అనుదానిలో మొదటియక్షరము లోపింపఁగా సిద్ధించిన రూపమనవచ్చును. త. అనుప్పు. ఆజ్ఞాపించు అనునర్థమున శ. ర. కారుఁడిచ్చిన యుదాహరణమున అరుగఁజేయు అనునర్థమే పొసఁగును. 'అనిచిపుచ్చు, అనిచిపంపు' అనుచోట్ల రెండుపదములును పుచ్చు అనునర్థమునే తెలుపును. లేదా అనుమతించి పంపు అని తాత్పర్యము చెప్పవచ్చును. కాని యిట్లు రెండు పదములును గలసినచోట్లఁ దప్ప భిన్నముగా 'అనుమతించు, ఆజ్ఞాపించు' అనునర్థములందు ప్రయోగములు గానరావు. 'అనుచు - అన్చు, అనుపు-అన్పు'— అనురూపములతో నున్న పాఠములు లేఖనముద్రణభేదములను బట్టి వేఱువేఱుగాఁ గలవు. కావున ఆయుదాహరణము లన్నియు నిక్కడనే గ్రహింపఁబడినవి.) "చ. ...నాపలుకు సమ్మతిఁజేయక తక్కనేనినేఁ, బనిచెద వజ్రముఁన్ జేమునిపాలికి నన్నరనాథు వేగమే, యనుచుట కింతయెల్లిదమె యాతనికిన్." భార. అశ్వ. ౧, ఆ. ౭౧. "చ. అదియును నెల్లభంగి నెరవారసిచూచితి నొండులేదు బె, ట్టిదుఁడగువాఁడు గన్నమిడి డెప్పరమేమియు లేకయుండ నం,చెద ననిపూనె నేని దగఁజేకుఱుఁ గోర్కితోడంగు దానికిన్, మదనునిచేత నమ్మగువమానము దూలకమున్న గ్రక్కునన్."దశకు. ౬, ఆ. ౧౩౧. "వ. అల్లని యుల్లంబు పల్లవింపంజేసి యచిపి యయ్యమాత్యవరుం డత్యాహితంబున." జై. ౭, ఆ.౧౧౧. (అనిచిపుచ్చు)—"ఆ...విజయలక్ష్మిఁ జేకొని రమ్మని, యధిపుఁడనిచిపుచ్చ నతఁడుపోయి." నిర్వ. ౯, ఆ.౧౦౧."చ. అనవుడు నక్కిరీటి దగ నయ్యదువంశవరేణ్యుతోడ నిట్లను నటులేనిఁ బోవలయుఁ హస్తిపురంబున కిత్తెఱంగు సె, ప్పిన నిను ధర్మనందనుఁడు ప్రీతిగ నందుల కన్చిపుచ్చు." భార. అశ్వ. ౩, ఆ. ౪. "ఉ. నీవలనన్ మహాత్మవినునిర్భరచిత్తుఁడనైతిఁ జూడఁగాఁ, బోవుతలంపు పుట్టెడు బ్రభూతగుణుఁన్ బలదేవు వత్సలున్,దేవకి నార్ద్రచిత్తు వసుదేవుని మద్గతరాగసాంద్రసద్భావుల సర్వయాదవులఁ బార్థ ననుం దగ ననిపుచ్చవే." భార.అశ్వ. ౧, ఆ. ౧౪౬. ఇట. శ. ర. ఆజ్ఞాపించు అని అర్థమువ్రాసెను. (అనిచి పంపు)—"తే. చామరచ్ఛత్రములు నిచ్చి సచివతనయుఁ, డనిచి పంపిన నాచంద్రహాసుఁడరిగి." జై. ౭, ఆ. ౧౦౭. అనుచు అనుదానికి ఆజ్ఞాపించు అనియు, పనుచు అనుదానికి పుచ్చు అనియు ఔపచారికముగా అర్థములు వాడఁబడుచున్నవి. ఇది పెరుగుధాతువువంటిది అని శ. ర.— వి. విధము. "క. అంచు మరుత్తుని కథ విని, పించినమునితోడ జనసభీరువులకు నే, యంచున నిహపరములు సిద్ధించు ననుచు నడుగ నయ్యుధిష్ఠిరుతోడన్."జై. ౩,ఆ.౨౬.—వై.**1.** అంచలము, బట్టకొంగు; **2.** జీర; **3.** తుద, చివర, కొన. "ఈ యంచుమట్టని సింగారములేమి." పాంచా. ౪, ఆ. **4.** చనుమొన, చూచుకము.

"అంచులఁ జేఁత నప్పళించి." క్షేత్రయ; 5. బండి కంటెయాకు. "వ. పండ్రెండంచులు నాఱు కమ్ములు మూఁడుతోలులుఁ గలిగి." భాగ. ౫, స్కం. ౨, ఆ. ౮౧; 6. సమీపము, దగ్గఱ.

అంచెలవాఁడు. దే. వి. 1. అంచులు అద్దువాఁడు, బట్టలకు అంచులువేయువాఁడు; 2. చిత్తరువు వ్రాయువాఁడు, చిత్రకారుఁడు.

అంజన. సం. వి. ఆ. స్త్రీ. 1. హనుమంతునితల్లి; 2. ఉత్తరపుదిక్కునందలి యాఁడేనుఁగు.—అ. న.—ము. 1. కాటుక; 2. రసాంజనము; 3. సౌవీరము.—పుం. 1. పడమటిదిక్కునందలియేనుఁగు; 2. బల్లి.

అంజనకాఁడు. మి. వి. (త. అంజనక్కారన్.) అంజనమువేసి పోయినవస్తువులను కనుఁగొను మాంత్రికుఁడు, అంజనము వేయువాఁడు.

అంజనకేశి. సం. వి. ఈ. స్త్రీ. 1. (దీనియుపయోగమువలన కేశములు అంజనమువలె నల్లనగును.) నీలి; 2. (కాటుకవలె నల్లనైన సూక్ష్మమూలములు గలది.) గువ్వగుత్తిగడ్డి, కపోతాంఘ్రి, నలియను గంధద్రవ్యము

అంజనక్రియ. సం. వి. ఆ. స్త్రీ. అంజనము పెట్టుట.

అంజనశలాక. సం.వి.ఆ. స్త్రీ. కాటుక పెట్టుకొనుకడ్డి.

అంజనాచలము. సం. వి. అ. పుం. అంజనపర్వతము, కాటుకకొండ.

అంజనావతి. సం. వి. ఈ. స్త్రీ. ఈశాన్యపుదిక్కునందలి యాఁడేనుఁగు.

అంజని. సం.వి.ఈ. స్త్రీ. 1.హనుమంతునితల్లి, అంజన; 2. కటుక ⚜; 3. కాలాంజనము ⚜.

అంజనిక. సం. వి. ఆ. స్త్రీ. అంజలిక, చిన్నచుంచు.

అంజలి. సం. వి. ఇ. పుం. 1. చేమోడుపు, చేతులు రెండును కలిపిపట్టుట, నమస్కారము. (దేవబ్రాహ్మణ గురువుల నమస్కరించునపుడును వినయసూచనమునందును దీనికి వినియోగము. దేవతలకు నమస్కరించునపుడు శిరసునందును, గురువుల ముఖమునను, బ్రాహ్మణులకు వక్షఃస్థలములను చేమోడ్పు కూర్పవలెను. ద్వి, త్రిశబ్దములతో ద్విగుసమాసము చేసినపుడు అకారాంత మగును. -ద్వ్యంజలము, త్ర్యంజలము మొ.); 2. కుడపము, మానిక; 3. వంపఁబడిన రెండుచేరల చేరిక, దోసిలి; 4. దోసెఁడు పరిమాణము.

అంజలిక. సం. వి. ఆ. స్త్రీ. అంజనిక, చిన్నచుంచు.

అంజలికారిక. సం. వి. ఆ. స్త్రీ. 1. అంజలిచేయుట, చేమోడ్పు; 2. మట్టి, సున్నము మొ. వానితో చేసినయాఁడుబొమ్మ, లేప్యమయ స్త్రీ; 3. లజ్జాలువు, అత్తపత్తి ⚜.

అంజలిపుటము. సం. వి. అ. పుం. దొప్పవలెఁ బట్టిన చేతులు.

అంజి. దే. వి. బాలికాక్రీడావిశేషము. "క. సరిలేని యంజిసోగటా, లరుదగుజూదంబు నెత్త మచ్చన గండ్లున్, దిరమగు నోమనగుంటలు, సరసత మెయి నాడుచున్న సతులం గనియెన్." భో.౫,ఆ.౭౬.

అంజిక. దే. వి. వెఱపు, భయము. "ద్వి. ఆంజనేయుండ భిక్షుకాకృతి నిటకు, నంజిక మీచెంద మరయవచ్చితిని." రా. కిష్కిం. ౨౦౦.

అంజిష్ణుఁడు. సం. వి. అ. పుం. (తనకిరణములచే ప్రపంచమునంతయుఁబూయువాఁడు.)సూర్యుఁడు.

అంజిష్ణువు. సం. వి. ఉ. పుం. = అంజిష్ణుఁడు.

అంజె. దే. వి. 1. అడుగు, పాదము. "సీ. అటరెండుమూఁడంజ లరుగునప్పుడ కాళ్లఁ బంకజాక్షికిఁ దొట్రుపాటు గదిరె." స్వా. 3, ఆ. ౯౧; 2. సమీపము, దగ్గఱ; 3. భయము, జంకు. "క. తరతర మంజెలు దఱికఁగఁ, బరువడి మృదుతర రతములఁ బరిణతులై యా, హరగిరితనయలు సురతా, తురులగుచుం గాయ్వుమిగిలి తోడ్తోన మదిన్." కు. సం. ౯, ఆ. ౧౪౮;

అంజెమెడపట్టు. దే.వి.(పాదము మెడమీఁద పెట్టుట.) మల్లబంధవిశేషము.

అంజెలిగుంజెలి. దే. విశే. గాసినొందినది. "ద్వి.తొండంబుచేపట్టి త్రోచిరాఁదిగిచి, యంజలిగుంజలి యార్చిమెవెంచి, భజించుచును." బస. ౪, ఆ. ౧౦౪-పు. (అంజలిగుంజలియార్చి =అంజలిగుంజలిగా నాడించియనియర్థము.) భాగ. ౪, స్కం. ౪. ౪.

అంజోయించు. దే. అ. క్రి. సందేహించు.

అంజు. దే. అ. క్రి. (త.క. అంజు.) భయపడు. "క. అంజెదవుగాక నను ...

దళింగిన మిరియా, లుం జొన్నలసరి పోవె." ఉ. హరి. ౧,ఆ. ౭౫. "రగడ. అంజెదిదియెలదేఁటికన నేమఱచె మఱచెదమే మనంబున." పా. ౪, ఆ. ౧౬.

అంజోరు. దే. వి. అత్తి, ఉదుంబరము ⚘.

అంట. దే. వి. 1. అనుట. "క. వింటే మృత్యువు మాటలు, గంటే నామీఁదఁ దప్పు గలిగించెదవి, ట్లంటంగట్టం దగునే, యంటకు నగి బోయ యిట్టులనియె నరేంద్రా." భార. అను. ౧, ఆ. ౨౮. "సీ. బ్రహ్మ మానందరూపం బంట తథ్యంబు నానాత్మపరికల్పనంబు మిథ్య." కాశీ. ౬, ఆ. ౧౩; 2. (అంటుకొనిపోవునది.) అడ. "సీ. కలయంగ నంటలుగట్టి మూఁపునవ్రేలు నిడుదపెన్నెఱులు కెంజడలుగాఁగ." అచ్చ. సుం. ౨౮; 3. (అంటించికుట్టినది.) కుట్టుడాకు, విస్తరి; 4. (గుడ్డలఁ అంటవేసి కుట్టినది.) బొంత; 5.—బ. (కలిసియుండునది.)గుంపు. "ఉ. అంటలుగట్టి చెల్కలకు నాంధ్రుని బిడ్డలు కూరగోయఁబోఁ,గంటకముల్ పదాబ్జములఁ గాఁడ నొదర్చిన నొప్పిఁ గూయిడక్, గంటికి నిద్రగాన కొదుఁగంబడి వేఁగెద మిందు నొక్కమా, కంటయకాదు నీవు పడునట్టి యవస్థ వచింప శక్యమే." ఆము. 3,ఆ. 33.—అవ్య. ప్రశంసను తెలుపును. "తే. దాతవఁట నీవు షేము సంఘాతలమఁట, గారవపుఁ బెండ్లికూఁతురు గౌరియంట, శంభుఁడంట పెండ్లికొడుకు సంప్రదాయ, మభినుతింపఁగఁ దగుఁ బర్వతాగ్రగణ్య." హర. ౪, ఆ. ౬౫.

అంటగు. దే. అ. క్రి. 1. అపవిత్రమగు, మైలయగు, అశుచియగు. "ఇల్లు అంతయు అంటయినది." "అగిన్నె అంటయినది;" 2. బహిష్ఠయగు, ఋతుమతియగు.

అంటఁగట్టు. దే. స. క్రి. 1. అంటునట్లు కట్టు; 2. ఆరోపించు, సంబంధింపఁజేయు. చూ. అంట. 1. అర్థము; 3. బలవంతముననఁగాని మోసముననఁగాని చేర్చు. "నలుగురు ఆపిల్లను వానికంటఁగట్టిరి." "ఆఖర్చు అంతయు వానికంటఁ గట్టిరి."

అంటఁబట్టు. దే. స. క్రి. కలియఁబట్టు, నొక్కిపట్టు.

అంటరానితనము. దే. వి. 1. అస్పృశ్యత, ముట్టుకొనఁగూడని దగుట; 2. అంటశక్యముగాని దగుట.

అంటరానిది. దే. విణ. 1. ముట్టుకొనఁగూడనిది; 2. ముట్టుకొన శక్యముగానిది (అగ్ని.)

అంటరానివాఁడు. దే. వి. 1. (స్పృశించుటకు శక్యముకానివాఁడు.) అగ్ని; 2. (తాఁకఁగూడని వాఁడు.) చండాలుఁడు.—విణ. 1. అంటఁగూడని వాఁడు; 2. అంటుటకు శక్యముగానివాఁడు.

అంటరానివేల్పు. దే. వి. (తాఁక శక్యముఁగాని దేవత.) అగ్నిదేవుఁడు.

అంటసిలు. దే. అ. క్రి. తాఁకు, తగులు. "క. నేలకునల్లెఁడు పొడవునఁ, గ్రాలుచు మును మెఱయు గురుని రథచక్రము ల, క్కాలంబున సమరజయ, శ్రీలోపము దెలియ నంటసిలఁ బడియె నృపా." భార. ద్రో. ౫, ఆ. ౩౧౭. "వ. అరదంబు లరదంబులతో నంటసిల నడుచుచు." ఉ. హ. ౪, ఆ. ౨౬౧.

అంటసిల్లు = అంటసిలు.

అంటాకు. దే. వి. 1. (అంటి+ఆకు.) అరఁటియాకు, కదళీపత్రము; 2. (అంటు+ఆకు.) అంటయిన యాకు; 3. తినివిడిచినయాకు, ఎంగిలియాకు.

అంటి. దే.వి. అరఁటి, కదళి ⚘. "సీ. అలరులు ఫణి వీచు లభ్రంబు సుడి రావియాకు సైకత మంటు లకనుదొనలు." రుక్మాం. ౧, ఆ. ౬.

అంటించే. దే. స. క్రి. (అంటు. ప్రే.) 1. అంటునట్లు చేయు, అంటఁజేయు. "పుస్తకమునకు కాకితములు అంటించినాఁడు; తలుపునకు బొమ్మలు అంటించినాఁడు; వాఁడు భార్యకు రోగములు అంటించినాఁడు; వాఁడు కొంప యంటించినాఁడు (తగులఁబెట్టినాఁడు); ప్రొయిలో నిప్పు అంటించినది; ఉన్న నాలుఁగు దినములలోను వాఁడూరంతయు అంటించినాఁడు." మొ.; 2. కొట్టు. "వానిని నాల్గు అంటించెను;" 3. (తేలు, చీమ) కుట్టు.

అంటిస. దే. వి. 1. తృణవిశేషము; 2. సంబంధము, తగులము. "దానికి వానికి అంటిస అయినది."

అంటు. దే. స. క్రి. 1. తాఁకు, స్పృశించు, ముట్టుకొను; 2. రతియందుఁగలయు, తగులుకొను. "ఉ,

అంటకుమీ లతాంగి నను నంటిననేమి మనోహరాంగ నే, నంటుపడంగ లేదనుచు నంటెదఁగాని యటంటగాదు న, న్నంటఁగఁ జెల్లునే జనకు నంటినపిమ్మట నంటివైన నీ, యంటున నంటుగామి నెటులంటును గెంటక మేనఁ బ్రాణముల్." సారం. ౨, ఆ. ౯౪. (పై రెండర్థములకు నిదే యుదాహరణము.); 3. (నూనె) రాచు. "క. సంపెంగనూనె యంటిరి." కళా. ౭,ఆ.౬౩.—అ. క్రి. 1. సక్తమగు, లగ్నమగు, అంటుకొను. "ముఖమున బొట్టు అంటలేదు." "అక్షరములు బాగుగ అంటలేదు." "కన్నులకు కాటుక అంటలేదు." "వానికి రోగములు అంటినవి." "గోడకు వెల్ల బాగుగ అంటినది." "బట్టకు రంగు అంటినది." మొ.; 2. అలవడు, అబ్బు. "వానికి విద్య అంటలేదు." "ఎంతదొర్లినను ఐశ్వర్యమంటదు."— వి. 1. స్పర్శము, తాఁకుట. "ద్వి. ఈనీచమతి నన్ను నిటఁదెచ్చుచోట, వీనియంటున కేను వేఁగుచుండుదును." రా. సుం. ౨౫౪; 2. అంటరానివస్తువుయొక్క స్పర్శము, అంటరాని వస్తువును తాఁకుటవలనఁ గలిగినదోషము, అపవిత్రత, అపరిశుద్ధి; 3. కూడిక, అంటియుండుట; "సీ. శిలతోడ నంటు వానె వాయంబు." జై.౪, ఆ. ౧౦౩; 4. స్నేహము, అనుబంధము. "మ. ...అయ్యేటికో, ఘనముక్తావళులన్న నన్నదినహజ్జంబన్న గోరంతయం, టును నొక్కింత ముఖానురాగమును బూనుక్." వసు. 3, ఆ. ౯౫; 5. ముట్టు; 6. స్నేహితుఁడు; 7. వేరుపట్టుటకయి మట్టిలోపాఁతిన చెట్టుకొమ్మ, మామిడి మొదలగు వానికొమ్మలను రెండిటినంటఁగట్టి తయారుచేసిన మొక్క. "గులాబి యంటుఁగట్టిరి." "మామిడి యంటుఁగట్టిరి;" 8. అంటుఁగట్టఁగా వేళ్లుపాఱి అయినచెట్టు. "సీ. నవకల్పలతికలీనగము పెక్ దీఁగల యం ట్లొత్తి పాఱిన యంటులొక్క." మార్కం. ౧, ఆ. ౯౭. "నాలుగు మామిడి అంట్లు కొని తీసికొనిరా." (ఈతుది రెండర్థములయందు బహువచనమేయని శ.ర.); 9. వండినతర్వాత కడుగనిపాత్ర, అంటుకుండ. చూ. అంట్లు; 10. ఒకరకమయిన పోఁగు, చెవినగ.

అంటుకట్ట. దే. వి. ముట్టుకట్ట, ముట్టుదానిగుడ్డలకట్ట.

అంటుకత్తియ. ద్వ. వి. ప్రియురాలు.

అంటుకత్తె=అంటుకత్తియ.

అంటుకాఁడు. దే. వి. ప్రియుఁడు. "చ. అటువలె నంటుకాఁడు చనినంత." శశాం. ౪, ఆ. ౨౮.

అంటుకుండ. దే. వి. 1. వండినకుండ; 2. అంటుపడినకుండ. (అంట (ట్ల)కుండ అని వాడుక.)

అంటుకొనిపోవు. దే. అ. క్రి. మిక్కిలి అంటుకొను, "వేళ్లు పడకుండఁగనె యొకదానికొకటి అంటుకొనిపోయినవి."—స. క్రి. 1. అపహరించికొను; 2. తగులుకొను. "వాఁడు దానిని అంటుకొని పోయినాఁడు."

అంటుకొను. దే. అ. క్రి. 1. నిప్పు దరికొను, మండు. "కొంపలంటుకొన్నవి;" 2. లోపలికి అణఁగిపోవు. "దౌడలు అంటుకొన్నవి;" 3. లగ్నమగు. "బట్టకొంగు ముళ్లకు అంటుకొన్నది." "కాలికి బురద అంటుకొన్నది." "ఱెప్పలు అంటుకొన్నవి." "వానికి రోగములు అంటుకొన్నవి." "గోడకు వెల్ల అంటుకొన్నది." బట్టకు రంగు అంటుకొ లేదు.— స. క్రి. తగులుకొను, కామించు. "వాఁడు దానిని అంటుకొన్నాఁడు."

అంటుగిన్నె. దే. వి. 1. వండినగిన్నె, మసిగిన్నె; 2. అంటుపడ్డగిన్నె.

అంటుజోడు. దే. వి. అంటుపోఁగులజత.

అంటునూనియ. ద్వ. వి. తలంటుకొను చమురు. "సీ.ఆపాదమస్తంబు నంటునూనియఁగాఁచి నయముగా నుద్వర్తనం బొనర్చు." పాండు.౨,ఆ.౧౯.

అంటునూనె=అంటునూనియ.

అంటుపడు. ద్వ. అ. క్రి. 1. అశుచియగు; 2. ఋతుమతియగు.

అంటుపూస. దే. వి. ముత్తెపుఁజిప్పయందంటి యుండు ముత్తెము.

అంటుపేను. దే. వి. ఒకరకము పేను.

అంటుపోఁగులు. దే. వి. బ. చెవినంటియుండునట్లు పురుషులు ధరించు చెవినగ.

అంటుప్పు. దే. వి. బిడలవణము, ఒకవిధమగు ఉప్పు.

అంటుమెడ. దే. వి. పైకి లేవక క్రిందికి అంటుకొనిపోయిన మెడ.

అంటుతాయి. దే. వి. సూదంటుతాయి, అయస్కాంతము. "ద్వి. ఇను మంటుతాతికి సెగసిన భంగి, ననయంబు నామది హరిఁగూర్చి కదలు." భాగ. ౭, స్కం.

అంటువడు = అంటుపడు. "క. అంటువడి చెప్ప కూరక, యింటం దిరుగాడు వెలఁది." సానం. ౫, ఆ. ౨౦౬.

అంటుళ్లు. దే. వి. సంబంధము, తగులము. "వానికి దానికి అంటుళ్లు అయినది." అని కొన్నిచోట్ల వాడుక.

అంట్రింత. దే. వి. తృణవిశేషము, అంటిస ✤.

అంట్లు. దే. వి. బ. **1.** వండి కడుగని పాత్రములు; **2.** అంటు కట్టినమొక్కలు; **3.** అంటుపేలు. "తే. ఎలయు సీత్కారములతోడ నీళ్లుస్రుక్కియంట్లుసంట్లును పరికించి యంట్లఁబోడిచి." పాండు. 3, ఆ. 30.

అండ. దే. వి. (త. అండై.) **1.** సమీపము. "మత్త. ...చందరుచ్మండలిం గనుఁగొంచు మ్రోసెను మాలకాకుల మూఁకల,య్యండ నిల్చి యదల్చె నప్డు శివాళి యూళల." స్వా. ౪, ఆ. ౬౧; **2.** ఆశ్రయము. "క. గుండియజల్లన మదిలో, నిండుకొనిన భీతి నావినిర్మలచిత్తుం, డుండక నలఁ గడలకు న, య్యండ విడిచి పఱవఁదలఁచునా సమయమునన్." శేష. ౨, ఆ. ; **3.** వెనుక. "సీ. దురమొనర్చు, చుండుము మేము నీయండన పఱతెంచి యతూ్కళిఁ బోనీక యుక్కడంచి." అచ్చ. కిష్కిం. కాం. 3౯; **4.** గోడకువేయు మంటి ముద్ద, గోడ కొంతభాగము పడిపోయినప్పుడు దాని గట్టికై వేయు మంటి ముద్ద. "ఆగోడకు అండ వేసిరి." (అండ బ్రతుకు ముండబ్రతుకు ఒకటి అని సామెత. అండబ్రతుకు ముండబ్రతుకు స్థిరముకానివి అని భావము. ఈయర్థమున అండు అని కొందఱు); **5.** పక్షము. "వారిద్దఱు నొకయండ కాచినారు."

అండకటాహము. సం. వి. అ. పుం. న. బ్రహ్మాండము.

అండకము. సం. వి. అ. పుం. **1.** చిన్నయండము; **2.** అండవృద్ధిరోగము.

అండకోశము. సం. వి. అ. పుం. **1.** వృషణము; **2.** అండవృద్ధిరోగము.

అండగొట్టు. దే. అ. క్రి. (అండ+కొట్టు.) వెనుదీయు, వెనుకాడు. "వ. అమ్మహోత్తు మీఁది చాయం జనవెఱచి యండగొట్టుచు నిలుచుటయు." పర. ౧, ఆ. ౧౭౫. ఆలస్యముచేయు. అని. శ. ర.

అండగొను. దే. అ. క్రి. (అండ+కొను; త. అండై కొళ్.) వెనుఁబడు, వెనుదీయు. "తే. ఇస్సిరో దురాచారుని హీనసత్త్వ,వచను ని స్నేమిచెప్పనా కుచితవృత్తి, నిచ్చి రాజ్యము క్రమ్మఱఁబుచ్చుకొనఁగఁ, దలఁచి నీ వండగొనియెదు నిలిచి యిచట." మార్కం. ౧,ఆ. ౧౮౨.—స.క్రి. ఆశ్రయముగాఁగొను, ఆశ్రయించు. "చ.... ఈ, జని నొకభంగి నండగొని తప్పుదుఁ జావునకు." భార. ఉద్యో. ౪, ఆ. ౨౦౮.

అండజ. సం. వి. ఆ. స్త్రీ. (అండమునఁబుట్టినది.) కస్తూరి.—అ. పుం. ము. **1.** పక్షి; **2.** పాము; **3.** చేఁప; **4.** తొండ; **5.** ఉడుము; **6.** బల్లి; **7.** కోడి.—విణ. (అ. ఆ. అ.) గుడ్డువలనఁ బుట్టినది.

అండనము. సం.వి.అ. న. అర్దనము, కేడెము,డాలు.

అండము. సం.వి. అ. న. **1.** గుడ్డు; **2.** వృషణము.

అండవాయువు. సం. వి. ఉ. పుం. వృషణముల వాఁపురోగము.

అండవృద్ధి. సం. వి. ఇ. స్త్రీ. **1.** అండములు పెద్దవగుట; **2.** అండములు పెద్దవగు జబ్బు.

అండా. దే. వి. లోహకటాహము, కొప్పెర.

అండాకర్షణము. సం. వి. అ. న. **1.** అండములు తీసివేయుట; **2.** పశువులకు బుడ్డకొట్టుట.

అండాలువు. సం. వి. ఉ. పుం. (అండముగలది.) చేఁప.

అండి. దే. వి. నీరు కాఁచుట కుపయోగించు లోహపాత్రము.—వై. అవ్య. దేశ్యమనియు అనవచ్చు. **1.** మధ్యమపురుష బహువచనమునందు ప్రార్థనాద్యర్థమున ఎ, ఆ, అయ్యా మొదలగువానివలె క్రియల కనుప్రయుక్తము. ఇది యనుప్రయుక్తమైనపుడు ఏదాదు లనుప్రయుక్తమైనపుడువలె వ్యతిరేకరూపమువచ్చును. ఒక్కొక్కప్పుడు వ్యతిరేకరూపమందలి 'అరు' లోపించుటయుఁ గలదు. ప్రక్రియ: చేయుఁడు అను

దానికి అయ్యా అనుప్రయుక్త మగునపుడు చేయరయ్యా అనురూపమగును. అట్లే చేయుఁడు+అండి = చేయరండి అని యగును. అందు 'అరు' లోపింపఁగా చేయండి అనురూపము సిద్ధించును. దానిపైని అయ్యా, అమ్మ, ఓయి అనుప్రయుక్త మగుటయుఁ గలదు. చేయరండయ్యా, చేయండయ్యా, చేయరండమ్మ, చేయండమ్మ, చేయరండోయి, చేయండోయి మొ. చేయరండి అనఁగా చేసెదరా! చేయరా! అను నర్థమును గలదు. ఇట్లే ప్రార్థనాద్యర్థమున ఏకవచనము 'రా' వచ్చును. 'రా' వచ్చినప్పుడు వ్యతిరేకరూపము వచ్చును. వినవురా అనియు 'వు' లోపించినచో వినరా అనియు నగును. చేయుఁడి, చేయుండి అనువాని భ్రష్టరూపమనియుఁ జెప్పుకొనవచ్చును. కొన్ని చోట్ల నేఁటికిని వాడుకలోఁగూడ చేయుండి, చూడుండి అనురూపములు గలవు; 2. వాక్యమధ్యమునఁగాని వాక్యాంతమునఁగాని మధ్యమపురుష బహువచనమున ఎదుటివారి గౌరవమును సూచించుటకు ఊఁతపదముగ ననుప్రయుక్తము. ఏకవచనమున 'రా' యును, బహువచనమున 'అండి' అనునదియు ఉపయుక్తములు. "ఏమిరా, ఏమండి, ఏమండోయి, ఏమండమ్మా, ఈ సంగతి విన్నారండి, ఇది న్యాయమాఅండి; నిన్ననురా అది జరిగినది; నిన్ననండి అది జరిగినది." ఏకవచనమయిన 'రా' వలెనే బహువచనమయిన 'రండి' అయినది యనుప్రయుక్తము కాఁగా ఉచ్చారణయందు రేఫము లోపించుటచే 'అండి' యను రూపము ఏర్పడియుండుననియు ననవచ్చును.

అండియ. దే. వి. అండె.

అండియము. దే. వి. ఎద్దు మొదలగువానిమీఁద వేసెడి యొకప్రక్క బరువు, అంకెము.

అండీ. దే. వి. లోహపాత్రవిశేషము, అండి. "గాఁడిపొయ్యిమీఁద అండీ యెక్కించినారు."

అండీరుఁడు. సం. వి. అ. పుం. (బలమైన యండములుగలవాఁడు.) 1. బలవంతుఁడు; 2. సమర్థుఁడు.

అండుకము. సం. వి. అ. పుం. లకుముకిపిట్ట, టిట్టిభము.

అండె. దే. వి. వసంతములాడు క్రోవి, శృంగము. "గీ. కువలయంబున బుట్టుటకొమ్ము నాఁగ, నండె యనఁగ వసంతంబు లాడునట్టి, కొమ్మునకుఁ బేళ్లు." దేశ్యనామార్థకోశము. శ. ర.

అండెము. దే. వి. = అండియము.

అంత. దే. స. (క. అనితు, అనిత్తు. త. అన్నైత్తు.) 1. అపరిమాణముగలది, ఆ కొలఁదిగలది. (ఔప, అనాహ, అంతక్, అంతటక్; అంత, అంతట మొదలగురూపము లుండును.) "క. నీవెఱుఁగకుండ గర్వము,తో విజయుం డాసుభద్రఁ దోడ్కొనిబలిమిం, బోవఁగ నంత సమర్థుఁడె." భార. ఆది. ౮, అ. ౨౦౭. "తే. అట్టివారిని నాతమ్ములంతవారిఁ, గాఁగఁ బాటింతు నెంతయు గౌరవమున." భార. భీ. ౧, అ. ౧౬౭. "తే....మిగుల నీయోగవిభవ, మింతయంతని పొగడ నేనెంతదాన." కళా. ౨, అ. ౧౭౮. "కొండంత, గోరంత;" 2. ఎల్లను, సర్వము. (ఈయర్థమున తఱచు ఉక్ అను సముచ్చయార్థకముతోఁ గలసియుండును.) "వ. అంతకుముందఱ భీమసేనుం డంతకూడును గుడిచి యనంత బలసమేతుండై." భార. ఆది. ౬, అ. ౨౭౬. "క. అంతవియచ్చరుఁడభిమత, మంతయు సమకూరుటయును." స్వా. 3, ఆ. ౧౨౪; 3. ప్రథమేతర విభక్తులు పరమగునపుడు అది అను నర్థమును తెలుపును. "క....మద్రేశుం గూల్ప మంతతోడఁ దెగుం గురుపతిపని జయంబుగొనుము కడంకక్." భార. శల్య. ౧, అ. ౭౪. (అంతతోడ=దానితో)."క....వివేకశూన్యుల,కడనుండెడు నంతకంటెఁ గష్టము గలదే." భా. ఆది. 3, ఆ. ౧౪౯. "ఆ. జలము పృథివికంటె జలముకంటెను దేజ, మంతకంటె వాయువు." భా. శాం. ౪,ఆ. ౧౯3. (అంతకంటె= దానికంటె); 4. అసమయము. (ఈయర్థమున కొన్నివిభక్తి ప్రత్యయములతోఁ గలసియే యుండును. కొన్నిచోట్ల కేవలము సమయము అను నర్థమునే తెలుపును.) "తే. కార్యమగుటయు నరిగెడుఁగాక పిదప, నిల్వుమంతకు ననుటయు."

భార. అను. ౨, ఆ. ౪౦. "క. తనకిష్టగునం తకు దుర్జనుఁ డిష్టుఁడపోలెనుండి సర్పముపోలెం, దనకిష్టగుడును గఱచును." భార. ఆది. ౬, ఆ. ౧౧౨. (ఇట సమయమువఱకు అని యర్థము.) "సీ. నీవు యోగ్యుండవు నీకిత్తు నాపుత్త్రి,నంతకు నుత్తర మరిగిరమ్ము."భార. అను. ౨, ఆ. ౩. "తే. దవుల జల్లనిదూఱ నంతకుమునుపటి జల్లునీరాని వచ్చు." ఆము. ౪,ఆ.౧౩౦. (అంతకు=అప్పటికి, ఆసమయమునకు). "మ. ... అంతలో నతఁడుం దోఁచిన." ఆము. ౫,ఆ. ౧౨౭. (అంతలో=ఆసమయములో). "వ... ప్రమదవనంబున నుండు నంత నంతరిక్ష కాంతాహారావళియుం బోలె హంసావళి యవనీతలంబున కవతరించిన."భార. అర. ౨,ఆ.౧౧. (అంతన్ = ఆసమయమున). "ఉ. అప్పలుకుల్ వినఁబడినయంతన దిగ్గున లేచి." కళా. ౨, ఆ. ౧౬. "క...సుఖమున్నంతన్." భార. ఆది. ౭, ఆ. ౨౯. (ఇట అంతన్=సమయమున అనియే యర్థము; సుఖమున నుండఁగా అని తాత్పర్యము).—అవ్య. ద్రు. **1.** అనంతరము. "తే. వానిపై దితిసుతునకు, వేడ్క పుట్టంగఁ జెప్పి యవ్వీడు చొరఁగ, ముదలగొను మాతఁడై వచ్చు మదనుఁడంత." ప్రభా. ౨, ఆ. ౨౮; **2.** అక్కడను, అచ్చటను. "క. నెఱసి తమ మెల్లయెడఁ గ్రిక్కిఱిసిన మఱిపాసి నిలిచి రింతను నంతన్." భార. విరా. ౩, ఆ. ౧౮౬; **3.** స్వయముగా, తమంతఁదాముగా."తే. విగతశృంఖల లయ్యు నకాలనిద్ర, గనుఁగవలఁ గ్రాలఁ దమయంతఁ గదలవయ్యె...శుండాలఘటలు." పారి. ౪, ఆ. ౬౮. "మీయంతట మీరే యీనిర్బంధము తెచ్చి పెట్టుకొంటిరి;" **4.** స్వేచ్ఛను తెలుపును. (దీనికి సంబంధించిన అంతలు, అంతంతలు, అంతంత, అంతవట్టు మొదలగుపదములు సులభముగా గ్రహించుటకై ప్రధానపదములుగానే గ్రహింపఁబడినవి.)

అంతంత. దే. అవ్య. ద్రు. (అంత+అంత.) అక్కడక్కడ, కొంతదూరమున. అని శ. ర. "నెచ్చెలిపిండునం, తంతనిలువఁబనిచి." భార. విరా. ౧, ఆ. ౨౪౬. "తే. ఒక్కప్రోవుగట్టి,వేఱియం తంతనుండిరి గారవమున." భార. ఉద్యో. ౩, ఆ. ౩౮౪; **2.** కాలక్రమమున. "తే. ఇంతయును నంత నంతంత నెదిగి పొదలు, నిబ్బరపు గబ్బి గుబ్బలయుబ్బుకతన." వసు. ౨, ఆ. ౭౫.

అంతకంతకు. దే. ద్రు. (అంతకు+అంతకు.) క్రమక్రమముగా. "ఆ. అడవిసొచ్చి యంతకంతకు నవులకు, నతి కుతూహలమున నరిగి యరిగి." భార. శాం. ౪, ఆ. ౨౭౫.

అంతంతకు. దే. ద్రు. అంతకంతకు, క్రమక్రమముగా. "తే. అలుక యంతంత కెక్కంగ హాలధరుండు, విమతుఁ బొరిగొందు నిలకొక్క వ్రేటు వ్రేసి, యని తలంచుచు." హరి. ఉ. ౨, ఆ.౬౫.

అంతఃకరణము. సం. వి. అ. న. లోపలి యింద్రియము. (అంతఃకరణచతుష్టయము—మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము.)

అంతఃకలహము. సం. వి. అ. పుం. **1.** మనస్సుల లోని కలహము; **2.** తనపక్షమువారిలో కలహము.

అంతఃకుటిలము. సం. విశే. (అ.ఆ.అ.) **1.** లోపల వలపుగలది; **2.** వక్రమైన అంతఃకరణముకలది.—వి. అ. పుం. శంఖము.

అంతఃకృమి. సం. విశే. ఇ. లోపలపురుగులుకలది (ఫలాది).—వి. ఇ. పుం. మేడిపండు.

అంతఃపశువు. సం. వి. ఉ. పుం. (పశువులు గ్రామమధ్యమున నుండుకాలము.) **1.** ప్రాతఃకాలము; **2.** సాయంకాలము.

అంతఃపాతి. సం. విశే. (న్.ఈ-నీ.న్) **1.** నడుమఁబడునది; **2.** లోపలఁబ్రవేశించునది.

అంతఃపురము. సం. వి. అ. న. **1.** రాణివాసపుస్త్రీలుండెడుచోటు, అంతిపురము; **2.** జనానా, రాజభార్య. (ఇట లక్షణ.)

అంతఃపురసహాయుఁడు. సం. వి. అ. పుం. అంతఃపురమున సహాయముగా నుండువాఁడు, విదూషకుఁడు.— విశే. (అ. ఆ. అ.) అంతఃపురమున సహాయము చేయువాఁడు.

అంతఃపురి. సం. వి. ఈ. స్త్రీ. అంతఃపురము, అంతిపురి.

అంతఃపురికుఁడు. సం.విణ. (అ.ఆ.అ.) అంతఃపురమున నియోగింపఁబడినవాఁడు. (కంచుకి. మొ. వారు.)

అంతఃపుష్పము. సం. వి. అ. న. బాలికలకు పండ్రెండు సంవత్సరముల తరువాతఁగాని కనఁబడకుండ లోపలనుండు రజస్సు.—విణ. (అ. ఆ. అ.) లోపల పుష్పముకలది.

అంతఃప్రజ్ఞుఁడు. సం. వి. (అ.ఆ.అ.) ఆత్మవిషయకజ్ఞానము కలవాఁడు.

అంతఃప్రవాహ. సం.వి. ఆ. స్త్రీ. (పైకి కనఁబడకుండ లీనమైన ప్రవాహముగలది.) సరస్వతీనది.

అంతకము. వై. వి. అంతు, మొత్తము.

అంతకర్మము. సం. వి. అ. న. 1. నాశనము; 2. ఉత్తరక్రియ, చచ్చినపిదప చేయుసంస్కారము.

అంతకారకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నాశము చేయువాఁడు.

అంతకాలము. సం. వి. అ. పుం. 1. నాశకాలము; 2. మృత్యుకాలము; 3. తుదికాలము.

అంతకుఁడు. సం. వి. అ. పుం. (నశింపఁజేయువాఁడు.) 1. యముఁడు, జముఁడు; 2. పరమేశ్వరుఁడు, శివుఁడు.—విణ. (అ. ఆ. అ.) నాశము చేయువాఁడు. "రాక్షసాంతకుఁడు."

అంతకృత్తు. సం. విణ. త్. అంతముచేయువాఁడు.

అంతగుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) అంతమును పొందినవాఁడు, తుదముట్టినవాఁడు. "వేదశాఖాంతగుఁడు."

అంతచరము. సం. విణ. (అ.ఈ_రీ.అ.) 1. కార్యాంతమును పొందునది; 2. చివరసంచరించునది; 3. సమీపమున సంచరించునది.

అంతట. దే. (ద్రు). 1. అంత, అనంతరము; 2. దానితో; 3. సర్వత్ర, ఎల్లచోట్ల.

అంతపాలుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ద్వారపాలకుఁడు.

అంతము. సం. వి. అ. న. స్వభావము.—పుం. న. 1. మధ్యభాగము, తుద, చివర; 2. నిశ్చయము; 3. సమీపప్రదేశము.—పుం. 1. చావు; 2. నాశము.—విణ. (అ. ఆ. అ.) 1. రమ్యము, అందమైనది; 2. దగ్గఱనున్నది.

అంతర్. సం. అవ్య. 1. లోపలివిభాగము; 2. మధ్యభాగము. ఇది తెనుఁగున వ్యస్తముగా నుండదు. "అంతఃకరణము, అంతర్భాగము, అంతర్జాతీయము, జలాంతర్గామి. ఇత్యాదులు."

అంతరంగము. సం. వి. అ. న. 1. హృదయము; 2. (వ్యాక.)బహిరంగమునకు బాధకమగునది."అంతరంగపరిభాష, అంతరంగశాస్త్రము."

అంతరంగుఁడు. సం. వి. అ. పుం. (సమానమైన భావము గలవాఁడు.) అత్యంతప్రియుఁడు, ఆప్తుఁడు.

అంతరగ్ని. సం. వి. ఇ. పుం. దేహములోపలనున్న అగ్ని, జఠరాగ్ని.

అంతరజ్ఞుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. హృదయము ఎఱిఁగినవాఁడు; 2. తారతమ్యము ఎఱిఁగినవాఁడు; 3.లోపలిగుట్టు ఎఱిఁగినవాఁడు.

అంతరచక్రము. సం. వి. అ. న. 1. దేహమందున్నమూలాధారము మొదలగు చక్రము; 2. లోపలనుండు చక్రము; 3 మధ్యనుండు చక్రము; 4. ఆప్తులయొక్క సమూహము.

అంతరతమము. సం. విణ. (అ.ఆ.అ.) 1. మిక్కిలి సామ్యమైనది; 2. మిక్కిలి ఆప్తమైనది.

అంతరదామర. మి. గ్రా. వి. (అంతరము+తామర.) నాఁచు, జలవల్లి.

అంతరపల్లటీ. మి. గ్రా. వి. (అంతరము+పల్లటీ.) 1.ఒకదినుసు పావురాయి; 2.మల్లబంధవిశేషము.

అంతరపూజ. సం. వి. ఆ. స్త్రీ. మానసికపూజ, ధ్యానము.

అంతరప్రభవుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) భిన్నవర్ణులగు తలిదండ్రులకుఁ బుట్టినవాఁడు, సంకరుఁడు.

అంతరము. సం.వి.అ.న. 1. అవకాశము. "మృణాలసూత్రాంతరము." "లబ్ధాంతరుఁడు" (=పొందఁబడిన అవకాశముగలవాఁడు); 2. అవధి; 3. వ్యవధానము; 4. అంతర్ధానము, కనఁబడకపోవుట; 5. భేదము, తారతమ్యము. "హస్తిమశకాంతరము;" 6. రంధ్రము, ఛిద్రము, లోపము, దుర్బలస్థితి."వ.మఱి దాహాభయంబున మనమెందుకడకుంబోయిన నెఱింగి మనయంతరంబరోయుచు నద్దురాత్ముండు దుర్యోధనుండు మన

కపాయంబు సేయు నెట్లనిన." భార. ఆది. ౬, ఆ. ౧౫౬; 7. మధ్యము, నడిమిచోటు. "భుజాంతరము;" 8. కట్టుబట్ట, అంతరీయము.—విశ. 1. ఇతరము, వేఱొండు, అన్యము. ఈయర్థమున సమాసోత్తరపదముగానే యుండును; ఆ సమస్తపదము నిత్యనపుంసకము. "గృహాంతరము = అన్యగృహము." "గ్రామాంతరము = అన్యగ్రామము." "అవస్థాంతరము = మఱియొక అవస్థ." "రాజాంతరము = అన్యరాజు." "కన్యాంతరము = అన్యకన్య." "జన్మాంతరము = అన్యజన్మము." "దశాంతరము = మఱియొక అవస్థ." "యుగాంతరము=అన్యయుగము;" 2. సమానము (అంతరతమము = మిక్కిలి సమానమైనది); 3. లోపలనున్నది. (వ్యతిరేకము: బాహ్యము); 4. ఆత్మీయము, ఆప్తము, తనది.

అంతరశాయి. సం. విశ. (న్. ఈ-నీ. న్.) లోపల పరుండువాఁడు.—వి. న్. పుం. (మనస్సునందు పరుండువాఁడు.) జీవుఁడు.

అంతరస్థుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) మధ్యమున నుండువాఁడు, మధ్యవర్తి.—వి.న్.పుం. (దేహమధ్యమందుండువాఁడు.) జీవుఁడు.

అంతరాత్మ. సం. వి. న్. పుం. జీవాత్మ, జీవుఁడు.

అంతరాపత్య. సం. వి. ఆ. స్త్రీ. (గర్భమున శిశువు గలది.) గర్భిణి.

అంతరాయము. సం. వి. అ. పుం. విఘ్నము, పని చెఱుపు.

అంతరారాముఁడు. సం. విశ. (అ.ఆ.అ.) పరమాత్మయందు ఆనందించువాఁడు.

అంతరాళదిక్కు. సం. వి. శ్. స్త్రీ. విదిక్కు, మూల.

అంతరాళము. సం. వి. అ. న. 1. నడిమిభాగము, మధ్యము. "బిసాంతరాళము, దిగంతరాళము, భూనభోంతరాళము;" 2. ఎల్లదిక్కులకు నడిమిచోటు.

అంతరించు. సం. అ. క్రి. 1. అదృశ్యమగు; 2. నశించు, చచ్చు. "గీ. స్నానమర్దనవేళల మేని చర్మ, మదరువాఁ డైదునెలలకు నంతరించు." జై. ౨,ఆ.౬౮; 3. చెడు, నష్టమగు. "త....కన్యాకావ్రత మంతరించిన నెట్లు మజ్జనకునింటికిఁ బోవనేర్తు." భార. ఆది. 3, ఆ. ౪౦.—స. క్రి. నడచు, అతిక్రమించు. "ఉ. బహుదేశములంతరించుచున్." జై. ౫, ఆ. ౧౦౫.

అంతరింద్రియము. సం. వి. అ. న. లోపలియింద్రియము, అంతఃకరణము. (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము.)

అంతరిక్షచరము. సం. విశ. (అ. ఈ-రీ. అ.) ఆకాశమున సంచరించునది.—వి. అ. పుం. 1. పక్షి; 2. విమానము.

అంతరిక్షజలము. సం. వి. అ. న. ఆకాశమునుండి పడినజలము, వాననీరు.

అంతరిక్షము. సం. వి. అ. న. ఆకాశము, మిన్ను. రూ. అంతరీక్షము.

అంతరితము. సం. విశ. (అ. ఆ. అ.) 1. లోపలనున్నది; 2. మధ్యభాగమును పొందినది; 3. వ్యవధానముకలదిగా చేయఁబడినది, దూరముగాచేయఁబడినది; 4. కప్పఁబడినది; 5. మఱుఁగుపడినది, కనఁబడనిది. "ఉ. అంబురుహాప్తుఁ డస్తశిఖరాంతరితుండగుడున్ సమస్తజీవంబులు నెల్లచో నిజనివాసముఁ బొందునెడం దమిస్రపుం, జంబులపోలె వెల్వడియె." భార. ఆది. ౬, ఆ. ౧౭౬.

అంతరీపము. సం. వి. అ. న. నలువైపులను నీరుగల దిబ్బ. (రెండువైపులను నీరుగలది ద్వీపము, నలువైపులను నీరుగలది అంతరీపము. ఇవి పర్యాయములుగాఁ గూడ వాడఁబడినవి.)

అంతరీయము. సం. వి. అ. న. పరిధానము, కట్టుబట్ట.

అంతరువు. వై. వి. 1. తారతమ్యము. "చ.... పెద్దపిన్నయం, తరువు లెఱింగి." విజ. ౧, ఆ.౧౨౬; 2. మఱుఁగుచోటు, చాటు. "క.అరుగు నెడ నంతిపురమున, నరవిరిపొన్నపయి నొఱగి యాఁగలధరణీ, శ్వరుఁడును నీవల నొకయం, తరువునఁ జిత్రాంగి చెలులుఁ దా నుండంగన్." హం. 3, ఆ. ౪౫; 3. మేడయంతస్తు.

అంతర్గడువు. సం. విశ. ఉ. (మెడమీఁదబయలు దేఱిన కంతివంటిది.) నిరర్థకము, ప్రయోజనము మాలినది.

అంతర్గతము. సం. విశ. (అ. ఆ. అ.) 1. లోపలికిఁబోయినది, లోపలనున్నది; 2. మధ్యభాగ

నేఁటి యెల్లి టిలోనన్." భార. విరా. ౫, ఆ. ౩౦౧; 2. దాఁపఁబడినది, గుప్తము.

అంతలపొంతలవాఁడు. ద్వి. వి. దూరబంధువు. "సీ. చనును బరంపరా సంబంధి యంతలపొంతలవాఁ డందిపొందినట్టి, వాఁ డనంగను." ఆం. భా. ద్వి. మ.

అంతలు. దే.స. (అంత+లు.) చూ. అంత. 1.అపరిమితికలవి, అంతంత. "సీ....విరసభావ, మావహిల్లినఁ బుట్టె నంతలు పనులు." భార. ఆశ్ర. ౧,ఆ.౩౮; 2. అంతంతవారలు, అంతటివారు. "ఉ. ...ఆతనిఁ గావఁబూని య,ట్లంతలు రాజులెల్ల సమయంగని," భార. శల్య. ౧,ఆ. ౩౫౨. "గోరంతలు కొండంతలు చేసినాఁడు."

అంతపట్టు. ద్వి. స. (అంత + పట్టు.) 1. అపరిమితి గలది; 2. అంతయు. "ఆ. పుట్టియంతవెన్న ప్రోవుగఁ బెట్టితిఁ, గడఁగికడఁగి యొక్క గనప చేర, నంతపట్టు మ్రింగె." హరి. పూ. ౫, ఆ. ౨౪౮. "పుట్టయంతవెన్న ప్రోవుగఁ బేర్చితి, గడిగికడిగియొక్క గనపగాదె, నంతపట్టు మ్రింగె." అని పాఠము కలదు. "సీ. ధృతరాష్ట్ర పాండుభూపతులకుమారులు తమలోన నీసున సమరమునకుఁ, దొడఁగిన నీవడ్డపడవైతి తగఁ జాలుమానుసుల్ గలిగియు మాననీయ, వాక్యుండవయ్యును శక్యసమస్తకార్యుండనఁ బేర్కొనియును నుపేక్ష, సేసితి కురురాజుఁ జెఱుపన తిరిగితి నిఖిలరాజులఁ దదనీకములను, ఆ. నామ మడఁచి తెల్లభూములుఁ బాడయ్యె, నంతపట్టుఫలము ననుభవింపు." భార. స్త్రీ. ౨, ఆ. ౧౪౮.

అంతపట్టువారు. ద్వి. వి.బ. 1. అంతపరిమితిగలవారు; 2. అందఱు. "సీ. గాంగేయకుంభజకర్ణశల్యాదులు నీకుఁగాఁ బెనఁగి యనేకబంధుమిత్రులు మడిసిరి ధాత్రీపతులఁ దోడు తెచ్చితి పలువురఁ జచ్చిరంత,పట్టువారునుదోడఁబుట్టువు లెల్లను గూలిరి." భార. శల్య. ౨, ఆ. ౧౩౫.

అంతవాసి. సం. = అంతేవాసి.

అంతవేల. సం. వి. ఆ. స్త్రీ. 1. నాశసమయము; 2. చివరసమయము; 3. చివరయవధి, చివరహద్దు.

అంతశ్శయ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. మరణార్థము పరుండుట; 2. భూశయ్య; 3. శ్మశానము; 4. మరణము, చావు.

అంతశ్ఛిద్రము. సం. వి. అ. న. 1. లోపలిలోపము; 2. స్వపక్షమందలిలోపము; 3. అంతఃకలహము; 4. లోపలనుండు రంధ్రము.

అంతశ్శరీరము. సం. వి. అ. న. స్థూలదేహము నకు లోపలనున్నశరీరము, సూక్ష్మశరీరము.

అంతశ్శల్యము. సం. వి. అ. న. (మనస్సునకు శల్యముపంటిది.) దుఃఖకారణము.

అంతశ్శీతము. సం. విశే. (అ. ఆ. అ.) లోపల చల్లగానుండునది.—వి.అ.న. 1. లోపలనుండు(అంతర్గతమగు) శైత్యము. "వీనికి జ్వరము చాలభాగము తగ్గినది; కాని కొంచెము అంతశ్శీతముకలదు;" 2. మనస్సునందలి భేదము; 3. మిత్రవర్గమునఁ గలుగు భేదము. "వారిపక్షమున అంతశ్శీతములు బయలుదేఱినవని వింటిమి;" 4. అంతఃకోపము, మనస్సులోనిపగ. "వానికిని వీనికిని కొంచెము అంతశ్శీతములు కలవఁట."

అంతసదుఁడు. సం. విశే. (ద్.) సమీపముననుండువాఁడు, దగ్గఱఁ గూర్చుండువాఁడు.—వి. ద్. పుం. అంతేవాసి, శిష్యుఁడు.

అంతస్తాపము. సం. విశే. (అ. ఆ. అ.) లోపలఁ దాపము గలది.—వి. అ. పుం. 1. దేహమందలి తాపము; 2. మనస్సులోనికోపము.

అంతస్తు. వై. వి. 1. మఱుఁగుచోటు; "గీ. ... ఎఱుఁగవలసినయంతస్తు లెల్లఁ జూచె. వ. ఇవ్విధంబున సందుగొందు లొక్కొక్క నెపంబునం బరామర్శించిచూచుచు." పర. ౫,ఆ. శ. ర. ఇట "ఆ. ... అతివిచిత్ర,మైనచాతురికిని నద్భుతం బొనరంగ, నెఱుఁగవలసినంత దిరిగిచూచు." అని పాఠముకలదు. పర. ౫,ఆ. ౧౫; 2. తొట్టికట్టు. "ద్వి. అంతఃపురమువాసి యల్లన నివలి, యంతస్తునకు వచ్చునంతటిలోన." విష్ణు. ఉ. ౮, ఆ.; 3. నిలువు. "రెండంతస్తులయిల్లు;" 4. మేడపైనుండు కక్ష్య, అంతరువు. "అది మూఁడంతస్తుల మేడ;" 5. మనస్సు. "తమ అంతస్తు మంచిది" అని వాడుక. అంతస్సు అని కొందఱు.

అంతస్థ. మ. వి. రహస్యముగా నిచ్చు లంచము. శ. ర.

అంతస్థము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నడుమ నున్నది; 2. లోపలనున్నది.—వి. అ. పుం.య, ర, ల, వ లలో నొకటి; (యరలవలు అంతస్థవర్ణములు.)

అంతస్సంజ్ఞము. సం. విణ. (అ. ఆ. అ.) లోపలఁ జైతన్యము గలది, లోపలఁ బ్రాణములుగలది. (వృక్షము మొ.)

అంతస్సత్త్వ. సం. వి. ఆ. స్త్రీ. (లోపల ప్రాణిగలది.) గర్భిణి, చూలాలు.

అంతస్సన్నిధి. సం. వి. ఇ. పుం. 1. లోపలిసాన్నిధ్యము; 2. మనస్సునందు కలిగించుకొను దేవతాసాన్నిధ్యము. "వ. వీను విన్నపంబు సేయు తెఱంగుగా నంతస్సన్నిధిం గలిగించుకొని యమ్మహాకావ్యంబు నర్థంబు సంగతంబు సేసెద." భార. విరా. ౧, ఆ. ౩౨.

అంతస్స్వేదము. సం. వి. అ. పుం. (లోపలమదజలముగలది.) మదపుటేనుఁగు.

అంతావశాయి. సం. వి. న్. పుం. (గ్రామాంతమున నివసించువాఁడు.) చండాలుఁడు.

అంతావసాయి. సం. వి. న్. పుం. 1. (నఖకేశాంతములను ఛేదించువాఁడు.) నాపితుఁడు, మంగలి; 2. (తన సంతోషమునకై జంతువులను జంపువాఁడు.) చండాలుఁడు; 3. కసాయివాఁడు; 4. (వార్ధకమున తత్త్వనిశ్చయముచేయువాఁడు.) ముని.

అంతిక. సం. వి. ఆ. స్త్రీ. 1. అత్తిక, నాట్యపరిభాషయందు అక్క; 2. శాతలమనెడియోషధి ♣; 3. ప్రొయ్యి.

అంతికతమము. సం. విణ. (అ. ఆ. అ.) అతిసమీపము, మిక్కిలి దాపైనది.

అంతికము. సం. విణ. (అ. ఆ. అ.) 1. సమీపమున నున్నది; 2. (సమాసాంతమందే ప్రయుక్తము.—చివరవఱకు వ్యాపించినది.) అంతవఱకు వ్యాపించినది, అంతవఱకు చేరునది. "బ్రాహ్మణసకు దండము కేశాంతికము; నాసాంతికము."—వి. అ. పుం. సమీపము. "కర్ణాంతికచరము, సింహాసనాంతికచరుఁడు."

అంతికలు. దే. వి. బ. చాఁపవలె నల్లినతడికలు.

అంతిపురము. వై. వి. రాణివాసము, అంతఃపురము.

అంతిపురి. వై. వి. = అంతిపురము.

అంతిమము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కడపటిది; 2. సమీపించినది.

అంతియ. దే. స. అంతే, అంతమాత్రమే, ఆకొలఁదియే. "వ. పదునొకండువేల యోజనంబుల తనర్పును నంతియ పాఁతునుంగల మందరనగంబు." భార. ఆది.౨,ఆ.౧౧. "సీ. పరమాస్త్రవిద్య నప్పరశురాముం డెంతదక్షుఁ డంతియ కడుదక్షుండయ్యె." భార. ఆది. ౮,ఆ. ౧౬౯. "చ. అనుపమదివ్యమూర్తియను నంతియకాదు భవాష్టమూర్తులం...జగజ్జనరాజికెల్లనిం, దనయము దానవృష్టియను నంతియకాదు త్రిలోచనాదిలో,చనమును దానయైనరవి." కు. సం.౧, ఆ. ౬.

అంతు. వై. వి. 1. అంతకము, మొత్తము, వెరసి; 2. అంతము, చివర. "దానికి ఆది అంతు లేదు."

అంతె. దే. స.=అంతియ.

అంతేవాసి. సం. వి. న్. పుం. 1. (సమీపమున నుండువాఁడు.) శిష్యుఁడు; 2. (గ్రామాంతమున నుండువాఁడు.)చండాలుఁడు.—విణ. 1.సమీపముననుండువాఁడు; 2. గ్రామాంతమున నివసించువాఁడు.

అంత్యకర్మము. సం. వి. న్. న. ఉత్తరక్రియ, మరణానంతరముచేయు దహనాది సంస్కారము. (అంత్యకర్మ అనియే వాడుక.)

అంత్యజాతి. సం. వి. ఇ. పుం. 1. (నాల్గువర్ణములలో నంత్యజాతివాఁడు.) శూద్రుఁడు; 2. (చివరజాతివాఁడు.)చండాలుఁడు.—ఇ. స్త్రీ. కడజాతి.

అంత్యజుఁడు. సం. వి. అ. పుం. 1. (నాల్గువర్ణములలోను చివరవర్ణమువాఁడు.) శూద్రుఁడు; 2. రజకాది. (రజకుఁడు, చర్మకారుఁడు, నటుఁడు, వరుడుఁడు, కైవర్తుఁడు, మేదుఁడు, భిల్లుఁడు. ఈ ఏడుగురును అంత్యజులుఅని స్మృతులు.)—విణ. (అ. ఆ. అ.) చివరవానికిఁ బుట్టినవాఁడు.

అంత్యభము. సం. వి. అ. న. 1. మీనరాశి; 2. రేవతీనక్షత్రము.

అంత్యమండనము. సం. వి. అ. న. **1.** చివరఁ జేయు నలంకారము; **2.** శవమునకుఁ జేయు నలంకారము.

అంత్యము. సం. వి. అ. న. **1.** (జ్యోతి.) ద్వాదశస్థానము; **2.** ఫాల్గునమాసము; **3.** రేవతీ నక్షత్రము; **4.** ముస్త, తుంగ ✤.—విణ. (అ. ఆ. అ.) **1.** చివరది, కడపటిది; **2.** దగ్గఱనున్నది; **3.** నీచము, హీనము.

అంత్యావసాయి. సం. వి. న్. పుం. చండాలుని వలన నిషాదస్త్రీకి పుట్టిన సంకీర్ణజాతివాఁడు.

అంత్యాశ్రమము. సం. వి. అ. పుం. కడపటి యాశ్రమము, సన్న్యాసము.

అంత్యాశ్రమి. సం. వి. న్. పుం. చతుర్థాశ్రమము స్వీకరించినవాఁడు, సన్న్యాసి.

అంత్యుఁడు. సం. వి. అ. పుం. **1.** చండాలుఁడు; **2.** మ్లేచ్ఛుఁడు; **3.** చివరజాతివాఁడు.—విణ. (అ. ఆ. అ.) **1.** చివరనున్నవాఁడు; **2.** చివరఁ బుట్టినవాఁడు.

అంత్రకూజము. సం. వి. అ. పుం. ప్రేగులు అర్చుట, ప్రేగులలోని ధ్వని.

అంత్రధమి. సం. వి. ఇ. స్త్రీ. ప్రేగు ఉబ్బుట, అజీర్తి.

అంత్రము. సం. వి. అ. న. ఆంత్రము, ప్రేగు.

అందంద. వై. అవ్య. మఱిమఱి, మిగుల. "క. ...శోషిం, పం దీవ్రశరార్చుల నం, దంద వడిం బఱపి నగుచు నరుగుద మనినన్." భార. ద్రో. ౪, ఆ. ౬౭. "క. చిందములమ్రోఁతఁ బగతుర, డెందంబులతోడ దిక్తటీసంఘులు నం, దంద పగులంగఁ గుంతీ, నందనులకుఁ దోడు మత్స్యనాథుఁడు సూపెన్." భార. ఉద్యో. ౧, ఆ. ౨౨౨.

అందంబుగూడుకొను. దే. అ. క్రి. ఇష్టములేకున్నను పైకి ఇష్టమున్నట్లు కనుపడు. "వ. వీనిం గెలఁకిన బుద్ధి క్షోభంబుగా నింతకంటె నేమియబద్ధంబులు వినఁబడునో మీఁదఁ గార్యంబుగల మాకు దీనిఁ గాదనం బనిలేదని యందంబుగూడుకొని ఛందోఽనువర్తనపరుండై." ఆము. ౬, ఆ. ౩౬. "వ. మునుమున్న యతనిమాటలు మానలేవంటి మని మూఁదలించినం గించిదవనతాననయై నెమ్మొగంబు వెలవెలపాటు లేనగవున నడంచి మఱి మొఱంగ ననువుపడక యందంబుగూఁడుకొని వారికిట్లనియె." ఆము. ౫, ఆ. ౭౧.—(అందము గూడుకొను అనుట యుక్తమైనను ఇతర కవి ప్రయోగములు దొరకకుండుటచేతను, పైరెండు ప్రయోగములే దొరకుటచేతను ఉన్నట్లే స్వీకరింపఁబడినది. ఇట కలసికొను అని శ. ర. కలపికొను అని వేదమువారి వ్యాఖ్య.)

అందకత్తియ. దే. విణ. (అందము+కత్తియ.) సౌందర్యవంతురాలు. (రూ.) అందకత్తె.

అందకత్తె దే. విణ = అందకత్తియ.

అందగాఁడు. దే. విణ. (అందము+కాఁడు.) సౌందర్యవంతుఁడు.

అందగించు. దే. అ. క్రి. అందముగలదియగు, రమ్యమగు. "సీ. పేరురంబున గంధసారకర్దమరుచుల్ చెందఁ గస్తురిపట్టె లందగించ." సాన. ౫, ఆ. ౧౭౯.

అందగింపు. దే. వి. సొగసు.

అందదుకు. దే. విణ. (అదుకు+అదుకు.) **1.** మిక్కిలి యదుకుకలది. "మ. రాక్షసాం, గనచే నందదుకైనయయ్యెడలు వ్రక్కల్వాపెదం గ్రమ్మఱన్." హరి. ఉ. ౧, ఆ. ౧౫; **2.** సంపూర్ణముకానిది, అతుకులుగానున్నది. "కం. కుందనపుఁగాహళంబులుఁ, పొందెఱుఁగక యెన్నిబిరుదములు పలికినఁ ద్వమ్మందదుకు లనుచునాలిక, నిందీవరనయనజంఘ లీరసమాడున్" వరా. ౧౧, ఆ. ౪౪. "అందదుకుపాట."

అందనుక. ద్వ. అవ్య. ద్రు. (అంత+దనుక.) అందాఁక, అంతపర్యంతము.

అందపడు. వై. అ. క్రి. (అందము+పడు.) రమ్యమగు. (ప్రే. అందపఱచు.)

అందము. దే. వి. **1.** చక్కఁదనము, సౌందర్యము; **2.** విధము.

అందఱు. దే. స. **1.** ఎల్లవారు, ఎల్లరు. "సమస్తపురుషులు. సమస్తస్త్రీలు. సమస్త స్త్రీపురుషులు." ఈయర్థమున స్త్ర్యైకముగా "ఉన్"అను సముచ్చయముతోఁ గూడియేయుండును; **2.** అంత సంఖ్యగలవారు. చూ. అందోఱు.

అందలము. వై. వి. (సం. ఆందోళః; క. అంతళవు.) 1. ప్రక్కల మఱుఁగులేని పల్లకి, ఆందోళము. "ఆ. సప్తర్షిగణము నా, యందలంబు మోవ నరుగుచెంతు." భార. ఉద్యో. ౧, ఆ. ౧౭౯. "సీ. పొందుగా నందలంబులు పల్లకీలు దశశత స్థాయితము సేయు శైబికులును." కళా. ౮, ఆ. ౨౯; 2.— బ. బాలక్రీడావిశేషము. "సీ. కోల క్రోఁతులు బిల్లగోల్లు దూరనఁగోల లందలంబులు మఱికుందికాళ్లు." వి. పు. ౭, ఆ. ౨౦౨.

అందాఁక. దే. అవ్య. ద్రు. (అంత+దాఁక.) అంత పర్యంతము. "సీ. అభ్రనుండలిమోచునందాఁక నూరక పెరిఁగినట్లా మేను నరవరేణ్య,..." స్వా. ౫, ఆ. ౨౪.

అందిక. దే. విణ. సమీపము. "చ. ...నిల్చిరో, య్యన మిథిలాపురంబునకు నందికయౌ ముని పల్లె నానిశిన్." అధ్యా. బాల. ౧౭౭.—వి. అందెడుస్థితి. "ఆపాలము మాకు అందికలో లేదు."

అందికోలు. దే. = అందిక.

అందిచ్చు. దే. స. క్రి. (అందు+ఇచ్చు.) 1. అందునట్లు ఇచ్చు. "క....చాపము నాకం,దిమ్మనుడుఁ జేయునది లే క్కముగ్ధుం డమ్మహీజ మలసత నెక్కెన్." భార. విరా. ౪,ఆ. ౧౧౨. "ద్వి. చెఱకురసంబు నీప్సితవస్తువులును, నఱలేక యందిచ్చి కఱకంఠుఁ గొలువ." బస. ౪, ఆ. ౧౨౩. పు; 2. అందుకొని ఇచ్చు.

అందిపొందినట్టివాఁడు. దే. వి. ఇతరులద్వారమున చుట్టమైనవాఁడు, దూరపుచుట్టము. "సీ. చనును బరంపరాసంబంధి యంతలపొంతలవాఁ డంది పొందినట్టి, వాఁడనంగను." ఆం. భా. ద్వి. మ. ౧౧౩.

అందియ. వై. వి. (సం. అందుకః; ప్రా. అందిఅ.) స్త్రీలు కాళ్లను ధరించెడు నగ,అందె, అందుకము.

అందు. దే. స. ఆ, అది,అవి, వాఁడు, ఆమె, వారు మొదలగు నర్థములను తెలుపును. (అందున్, అందునన్, అందులోనన్, అందుకు, అందుకై అను రూపములు గ్రంథములయందుఁ గనఁబడుచున్నవి. అందుచేత, అందువలన అనునవి కొన్ని మండలములలో వాడుకయం దున్నవి. దీనికి ప్రథమావిభక్తియందు ప్రయోగము గానరాదు. అందు అనుదానికి ఆధారాద్యర్థములందు 'నన్' సప్తమీవిభక్తిప్రత్యయము రాఁగా అందునన్ అనియు, సప్తమ్యర్థక ద్వితీయా విభక్తిప్రత్యయ మగు 'ను' రాఁగా అందును, అందున్ అనియు, 'లోనన్, కు, కై' చేర్పఁగా అందులోనన్, అందునకు, అందుకు, అందుకై అను రూపములును సిద్ధించినవి. ఆధారాద్యర్థములందు సప్తమ్యర్థక ద్వితీయావిభక్తి చేర్పఁగా ఏర్పడిన అందున్ అను రూపము దానియందు, వానియందు, ఆపురుషునందు, ఆపురుషులయందు, ఆస్త్రీయందు, ఆస్త్రీలయందు మొదలగు నర్థములను లింగవచనభేదము లేకుండఁగఁ దెలుపుటచేత అవ్యయముగా గ్రహింపఁబడినది. సప్తమ్యర్థక ద్వితీయావిభక్తి సహితముగానే యుండుటచేత ద్రుతాంతావ్యయముగాఁ బరిగణింపఁబడియుండును. అదియే కేవలము ఆధారాదులను తెలుపు సప్తమీవిభక్తి ప్రత్యయముగా వాడఁబడినది. కొన్ని శబ్దములే విభక్తి ప్రత్యయములగు ననుట సమంజసము. "ఇందు ప్రత్యక్షమై" మొదలగు శాసనప్రాఁతలనుబట్టి అచ్చుటను అనునర్థమునఁ గూడఁ గళయని కొందఱందురు. ప్రథమతోఁగూడ నట్లు మొదటఁ బ్రయుక్తమయ్యెనో, లేక ఏకారణమున నట్లు వ్రాఁతలో నున్నదో పరిశీలింపవలసి యున్నది. వ్యుత్పత్తిని; సంప్రదాయమును బరిశీలించిన ద్రుతాంతమనియే తోఁచెడిని.)

—అవ్య. ద్రు. 1. అచ్చుట; 2. ఆ లోకమందు. "క. అనఘులు పరహితచరితులు, జన సంభావ్యులును బుణ్యచరితులు నగునం, దను లను బడయుదు రెవ్వరు, దనరఁగ వా రిందు నందు ధన్యులుగారే." మార్కం. ౫, ఆ. ౨౬౫; 3. విశేషణముమీఁదనున్నపుడు, 'ఆ'యను తచ్ఛబ్దార్థమును వీడి ప్రదేశమున అనునర్థమును తెలుపును. "ఆ. ఇట్టిదేని మనకు నిందుండఁగానేల, యరిగి ముందరున్న యంద యుండి, యెఱిఁగి దీని తోన యిప్పరోచనుఁ గాల్చి, పోదమనిన ధర్మపుత్త్రుఁ డనియె." భార. ఆది. ౬, ఆ. ౧౫౪;

4. (లింగవచనభేదము లేకుండఁగ) దానియందు, వానియందు, వారియందు, దానిలో, వానిలో, వారిలో. "వ. స్త్రీలను గోబ్రాహ్మణులం గూడు వెట్టువారిని విశ్వసించినవారిని వధియించుట మహాపాతకంబని పెద్దలు సెప్పుదు రట్టియందు గోవిందుండు స్త్రీవధయును గోవధయునుం జేసె." భార. సభా. ౨, ఆ. ౪౨. "సీ. కాశి రాజను వానిగాదిలికూఁతులఁ గవలవారల నతి కాంతిమతుల, నమరఁగఁ బెండ్లియై సముమైన ప్రీతి నయ్యిరువురయందు భోగేచ్ఛ సలిపి, తే. యంబపత్యంబు వడయుము నని తలంచి." భార. సభా. ౧, ఆ. ౧౩౬; "సీ. హైహయ దాయాదుఁడైన.........నతనిపుత్త్రు, తే. లల ఘుభుజులు వత్సుండు భర్గాహ్వయుఁండు, నందు వత్సుఁడు పితృభక్తి నతిశయిల్లి." హరి. పూ. ౩, ఆ. ౮౮; 5. అధికరణమును (ఆధారమును) తెలుపుసప్తమీవిభక్తి ప్రత్యయము. ఇందుఁ గల భేదములు:—1. అంతటను వ్యాపించుటకు ఆధారమగు పదార్థమును తెలుపుపదమునకు చేర్పఁబడును. 'తిలలయందు తైలమున్నది' అనుచోట తైలము తిలలయం దంతటను వ్యాపించును గాన తిలశబ్దమునకు అందు చేర్పఁబడినది. దీనినే అభివ్యాపకాధికరణ మందురు. 2. విషయమున— "ఆ. అధికదుష్టచిత్తుఁడై యర్థతృష్ణతో, మిత్ర బంధుసుతకళత్రమాతృ, సహజపితృధనములు చౌర్యంబు గావించు, నతనియందు విష్ణుఁ డలిగి యుండు." వి. పు. ౪, ఆ. ౧౨౫. (ఇదియే వైషయిక సప్తమి); 3. అభివ్యాపకమువలె అంతటను వ్యాపింపక ఏకదేశసంబంధము గలిగి యుండుటను తెలుపును. (ఏకదేశమున ఒద్దను, సమీపమున, మొదలగు నర్థములను తెలుపును.) "తే. రాజసూయాధ్వరము ధర్మరాజు సేయ, నుత్సహించినవాఁడు తదుత్సవమున, కిండు మీయందుఁ గలవస్తువెద్దియైన, నమ్మహీనాథు సామ్రాజ్యమతిశయిల్లు." భార. సభా. ౧, ఆ. ౨౩౯. "ఘటమందు జలమున్నది;" 4. తోన్, చేతన్ అను తృతీయా విభక్త్యర్థమును తెలుపును. ఈయర్థమును లాక్షణికులు గ్రహించి నట్లు కనఁబడదు. నన్ అను విభక్తిప్రత్యయమువలె అందున్ అనునది తృతీయావిభక్త్యర్థమున వచ్చును. ఈక్రింది యుదాహరణముల ననుసరించి ఈవిశేషార్థము గ్రహింపఁబడినది. "శా. బేటం బేటముగా నిభంబు కరిణిం బ్రేమంబుతోఁ జేరి లాలాటం బొత్తుల లాటపట్టమునఁ గేలంగేలు వేష్టించుఁగ్రీ,గోటన్ మే యొరయన్ వరాంగములు సోఁకుం బుష్కరాగ్రంబునం, దాటోపం బొనరించుఁ గూడఁ బ్రియఁ గామాసక్తి నాసక్తిమై." కు. సం. ౧, ఆ. ౧౦౦. "స్వా. అగిరీంద్రసుత హర్షముతో శైవాగమోదిత విధాయితతో సుస్వాగతాభిమత వాక్యములం దభ్యాగతోచితసపర్యలఁ దన్పెన్." కు. సం. ౭, ఆ. ౫౫. "ద్వి. అదిగాక గర్వించినట్టిరావణుని,నదుమఁడే శివుఁడు వాదాంగుష్ఠమంద,మలహరుతో మాఱుమలసి కాముండు, నిలయెల్ల నెఱుఁగ నేఁటేఁటఁ గాలండె." బస. ౬, ఆ. ౨౦౩ పు. "తరలము. కడఁగి బుద్ధి బలంబునంద యకంటకంబుగఁ జేసి యేఁ, బుడమిరాజ్యము సర్వముం దగఁబుచ్చి యిచ్చిన నిమ్ములం,గుడుపనేరక దీని నిచ్చుటఁ గూలఁదన్ని శరీరమున్, విడుతుఁగాకని నిశ్చయించెదు వెఱ్ఱివై తె నరేశ్వరా." భార. అర. ౬, ఆ. ౩౨. "తే. వినిన యప్పుడ ప్రాణముల్ విడువఁగలరు, ముప్పురము గూడ నీశిలీముఖమునందుఁ, దెగితి మేమని దైవంబు తెంపుఁ జెప్పు, నకట! హాతల్లి, హాతండ్రియను చునడలె." రా. అయో. ౩౦౯. ఇతరవిభక్తి ప్రత్యయములతోఁగూడిన అందు అనుదాని రూపములు ప్రయోగములును ఈక్రింద చూపఁబడును; I. అందునన్=అందు (సప్తమీవిభక్తి ప్రత్యయము.) "చ. తలవరులార రంగపతిధామమునందునఁ బైఁడిగిన్నె ముచ్చిలిన దురాత్ములీదురితచిత్తులు నంబులు." విప్ర. ౫, ఆ. ౨౪; II. అందునన్=దానియందు; "తే. కవ్వముగఁ జేసి మందరక్ష్మాధరంబు, వాసుకినిఁ ద్రాడుచేసి దుర్వారశక్తి, జలధి మథియింపుఁ డందునఁ గలుగునమృతం, మబ్జగేహిని పొడము నత్యమ్ము సుమ్ము." దశా. ౨, ఆ. ౮౬; పైవానిని 'అందుల' అని సవరింపవచ్చు. కాని పెక్కు ప్రతులలో నిట్లే యున్నది. III. అందుకు=దానికి. "అందు కచ్చె

రు పూన." చంద్రా. 3, ఆ. ౬; IV. అందుకై= దానికై. "సీ. వెఱయొక్కండుకై విటమోహ మున నూఱు బాగాలు వైచుకప్రంపుబరణి." బహు. ౫,ఆ. ౧౬౬; V. అందులోన్,అందులో నన్ = వారిలో, దానిలో, వానిలో. "క. అని భీష్ముఁడు వెండియు ని, ట్లను నాకన్నిరువురును ధరాధిపయోగ్య,స్వనిరూఢు లెల్లకర్మం, బునకొర సుఁ డందులోన ముఖ్యుం డరయన్." భార. అను. ౨, ఆ. ౨౫౫. "సీ. పటికంపులింగంపుఁ బడమటిదెస సముచిత గిరిజాపదచిహ్నమైన, శిలక్రేవఁ గల దొక్కబిల మందులో రెండుసాధన తామ్రశాసనము లుండు. దశ. 3, ఆ. ౨3; "ఉ. స్కాందపురాణ సంహితకు ఖండము లేఁబది యందులోన నా,నందవనానుభావకథనంబున శ్లోకకు వక్తకున్ శుభా,నందపరంపరావహము." కాశీ. పీఠిక. ౮. అందుచేత, అందుకొఱకు, అందుకోసరము, అందుకోసము, అందువలన: ఈరూపములకు కొన్ని మండలములయందే వాడుక కలదు. ఆధునిక కవుల గ్రంథములయం దును అక్కడక్కడఁ గలవు.

—అందుల=అందు. ఇది అందు అనుదాని బహు వచనరూపముగఁ గనఁబడినను ఏకవచనార్థమునే తెలుపుచున్నది. అందున్ అనుదానికివలెనే లింగ వచనభేదములు దీనికిని లేకుండుటచే దీనిని అవ్య యముగానే గ్రహింపఁదగును. దీనిపైనిని కొన్ని విభక్తిప్రత్యయములు చేరుటయుఁ గలదు. ఇది విశేష్యమైనపుడు 'కు' అను ప్రత్యయముతోఁ గలిసిన ప్రయోగములు కనఁబడుచున్నవి. విశే షణమైనపుడు ప్రాచీనశాసనములయందును, అతి ప్రాచీన ప్రయోగములందును మార్పులేకయును, తరువాతి ప్రయోగములందు అందలి అనురూపము తోను గనఁబడుచున్నవి. కొందఱు లాక్షణికులు సప్తమీవిభక్తిప్రత్యయమైన అందున్ అనుదా నికి 'అలి' ఆగమము వచ్చునని సూత్రించి "అం దలి" అనురూపము సాధించిరి. **1.** అందులకు = అక్కడకు. "క. ఏ నెఱుఁగ నిన్ను నెక్కడి,దా నవు మిన్నకయ యనుచితంబులు పలుకం,గానేల యరుగు మంబురు,హానన యెందుండి వచ్చి తం దులకు వడిన్." భార. ఆది. ౪, ఆ. ౭౭; **2.** అపనికి, దానికి. "వ. అటుగాక చదువ దొరకొనిన నరునకుఁ గాలంబు నాలంబు విఘ్నం బు లఖిలోద్యమఘ్నంబు లందులకు సామగ్రి గిటకిటన గొంతెఱుంగ నగు." ఆము. ౧, ఆ. ౭౮; **3.** అందుల = అందున్న, అందుఁగల. "చ. గురుకుచయుగ్మముల్ గదలఁ గ్రమ్ముడులం దుల పుష్పముల్ పయిం, దొరఁగ." భార. ఆది. ౮, ఆ. ౧౭౫. "అందలి పుష్పముల్." అన వచ్చునుగాని తాళపత్రగ్రంథములందు అందుల అనియే కలదు. చూ. ఇందుల.

—స. క్రి. **1.** పొందు. "ఆ. ...నీవును, వేనుఁజని విదర్భ నిష్టలీల,నుండుదము మృగాకులో గ్రవనంబుల, కరుగనేల యిడుమ లందనేల." భార. అర. ౨, ఆ. ౮౨; **2.** కైకొను, పుచ్చు కొను, పట్టుకొను. "క. ప్రీతి వినోదించుచు నా,భూతలపతి మధురసీధు పూర్ణచషక మ,న్నా తికి నిచ్చిన నందక, యాతని దెసఁ జూడకుం డె నందఱుఁ జూడన్." మార్కం. ౫, ఆ. ౧3౧; **3.** చేరు. "తే. డెందమును వాక్కు నెవ్వాని నందలేవు, కాంతు రెవ్వాని దహరపుష్కరము నందుఁ, బరమయోగీంద్రు లధికతాత్పర్యలీల, నట్టి నీకు నమస్కార మఖిలవంద్య." కాశీ. ౨, ఆ. ౪; **4.** అవలంబించు, పూను. "ఆ. ఇంకనేమియైన నెఱుఁగంగవలయు నం, దేహ పదము నీవు దెలిపెదనుచు, నమ్మి యున్నవార మమ్మ యీవెడమాయ, లందనేల యనిరి కొం దఱంత." కళా. ౬,ఆ. ౧౮3.—అ. క్రి. **1.** లభ్యమగు, దొరకు, ప్రాప్తమగు. "చ. అవు నవు నందినన్ సిగయు నందకయున్నను గాళ్లఁ బట్టుకొం,దువు హరిణాంక వేలకొలఁదుల్ గద నీ నడకల్ దలంపఁగన్." విజ. 3, ఆ. ౫౧. "ఉ. కందిన యన్యకాంత యెడఁ గామము దక్కుము నన్నుఁ జేరరా, దందని మ్రానిపండులకు నక్కలు సాఁతురె." రా. సుం. ౧౯౨. "తే....అనఘు, లార మోక్ష మీపరిపాటి గారవమున, నాద రించు జనంబులకందు ముక్తి." భార. శాం. ౫, ఆ. ౫౪౯; **2.** సాటియగు, సమానమగు; "కాళి దాసునకు ఎవరును అందరు." (అందరు=సమా

నులు కారు.); **3.** సరిపడు. "దానిజుట్టు కత్తిరించుటచేత ముడివేయుటకు అందదు."

అందుకము. సం. వి. అ. పుం. **1.** అందె; **2.** ఏనుఁగుసంకెల; **3.** సంకెల; **4.** కటిసూత్రము.

అందుకొను. దే. స. క్రి. **1.** ప్రతిగ్రహించు, పుచ్చుకొను. "సీ. పచ్చిట్టితోఁ బట్టె చుచ్చాలమెట్లుంది, కొనఁదాన యూఁకెల్ల గుత్తపట్టు." ఆము. ౭, ఆ. ౫. "క. ... మొదలగు కాను కలందుకొనక సుయోధనుని నియమించెన్." భాగ. ౧౦, ఉ. ౪౭౦; **2.** పట్టుకొను; "వ.విచిత్రవేగంబునఁ గల భాషిణి కొప్పుఁబట్టి పట్టెంబు జళిపించి ప్రేయనెత్తుటయు నెత్తిన చెయి తత్క్షణంబ యందుకొని." కళా.3,ఆ. ౧౨౦. "బండి అందుకో;నాపరుగందుకో;"**3.** స్పృశించు, అంటు. "క. ఉదితజ్యాఘోషంబులు, చపలందుకొనంగ..." జై. ౬, ఆ. ౧౭౨; "పైదూలము అందుకో చూతము;" **4.** కలియు,కూడు. "చ....చెపుమ ముద్దియ యేగతి నట్లు రంభరూ,పును ధరియింప నేర్చితివి పొందుగనెమ్మెయి నందుకొంటి వా, యనఘుని నట్లుగూడఁగఁ జిరాభిమతం బిది నీకు నావుడున్." కళా.౮, ఆ. 3; **5.** (కొనసాగింప) ఉపక్రమించు, పూను. "ఆ.ఇటులు నిటల ఘటితకుటిల భ్రుకుటియైన, మొగముతోడ వీరమూర్ఛ నున్న,తండ్రి కయ్య మపుడు తానందికొని సుకు, మారుఁ డట్టహాస ఘోరభంగి." కకు. ౨, ఆ. ౧౮౫.

అందుకోలు. దే. విణ. అందునంతటి సమీపము.—వి. అందుకొనుట.

అందుగు. దే. వి. అందువు, సల్లకి ♆. (ఇది ఏనుఁగులకు మిక్కిలి ప్రియము.)

అందుపాటు. దే. విణ. **1.** అందుకొనఁదగినంత సమీపము; "ద్వి. క్రిందట గాలిగాఁ గేడించి రథము, నందుపాటుగఁ దోలు మనుచుఁ దోలించి, కదియఁబోవుటయు నక్కపటమృగంబు, బెదరి పట్టీక కుప్పించి బిట్టెగసి." హరిశ్చం. ౧, భా. ౮౯౮; **2.** చేతికి చిక్కునది, అందునది.

అందుబడి. దే. విణ. **1.** లభించినది, చేతఁజిక్కినది, ప్రాప్తము; **2.** సమీపము. "ఇక్కడికి ముందు గ్రామముఅందుబడిగ నున్నది."—వి. **1.** ప్రాప్తి; **2.** చేరిక, సమీపము.

అందువు. ఉభ. దే. వి. అందుగు♆.—సం. ఉ. ఊ. స్త్రీ. **1.** శృంఖలము,సంకెల; **2.** గజశృంఖలము, ఏనుఁగునుగట్టు గొలుసు; **3.** నూపురము.

అందూకము. సం. వి. అ. పుం. = అందువు ♆.

అందె. వై. వి. = అందియ.

అందెబందెలు. దే. వి. బ. బాధలు, చిక్కులు.

అందోళు. వై. స. = అందళు. "క. గిలుపునెడ నేయునెడ వడిఁ, బఱచునెడం బెనఁగునెడ నపారబలంబుల్, నె (మె)ఱయునెడ భీమునకు నందోళుగీడ్వడఁదొడఁగి రుద్ధతులు రాజసుతుల్." భార. ఆది. ౫, ఆ. ౧౬౮. "ఆ. తల్లివచనమును విధాతృకృతము, నన్యథాకరింప నలవియే యనిన నం,దోళకు నిట్టులనియె ద్రుపదవిభుఁడు."భార. ఆది. ౭, ఆ. ౨౫౮.

అందోలనము. సం. వి. అ. న. = ఆందోలనము.

అంధంకరణము. సం. వి. అ. న. గ్రుడ్డివానినిగాఁ జేయు పదార్థము.— విణ. (అ. ఈ-ణీ. అ.) గ్రుడ్డివానిఁగాఁ జేయునది.

అంధంభవిష్ణువు. సం. విణ. (ఉ.) గ్రుడ్డివాఁడు కాఁబోవువాఁడు.

అంధకరిపువు. సం. వి. ఉ. పుం. (అంధకాసురునికి శత్రువు.) శివుఁడు.

అంధంభావుకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) గ్రుడ్డియగువాఁడు.

అంధకారమయము. సం. విణ. (అ. ఈ-యీ. అ.) ఎక్కువ చీఁకటిగలది, మిక్కిలి చీఁకటియైనది.

అంధకారము. సం. వి. అ. పుం. (గ్రుడ్డివానిఁగాఁ జేయునది.) ధ్వాంతము, చీఁకటి.

అంధకారి. సం. వి. ఇ. పుం. (అంధకుఁడను రాక్షసునకు శత్రువు.) శివుఁడు.

అంధకారితము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** అంధకారము గలదిగాఁ జేయఁబడినది; **2.**కాంతిలేనిది. "బాష్పజలాంధకారితముఖి."

అంధకుఁడు. సం. వి. అ. పుం. **1.** ఒకానొకరాక్షసుఁడు; **2.** ఒకానొకఋషి.(ఉతథ్యునకు మమత యందుఁ బుట్టినవాఁడు.)—విణ. (అ. ఆ. అ.) గ్రుడ్డివాఁడు.

అంధకూపము. సం. వి. అ. పుం. **1.** (చీఁకటి నుయ్యి.) పాడునుయ్యి; **2.** మోహము; **3.** నరక విశేషము.

అంధతమస. సం. వి. ఆ. స్త్రీ. (చీఁకటిగలది.) రాత్రి.

అంధతమసము. సం. వి. అ. న. **1.** గాఢాంధకారము, కటికి చీఁకటి; **2.** నరక భేదము.

అంధతామసము. సం. వి. అ. న = అంధతమసము.

అంధతామిస్రము. సం. వి. అ. న. పుం = అంధతమసము.

అంధత్వము. సం. వి. అ. న. ఆంధ్యము, గ్రుడ్డితనము.

అంధపూతన. సం. వి. ఆ. స్త్రీ. బాలగ్రహభేదము. (అది శిశువులకు రోగములను గలిగించునని వైద్యశాస్త్రము.)

అంధము. సం.వి. అ.న. (గ్రుడ్డివానిఁగాఁ జేయునది.) **1.** చీఁకటి, అంధకారము; **2.** అజ్ఞానము; **3.** (నీటిలోమునిఁగి కన్ను తెఱచినను ఏమియుఁ గనఁబడదుగాన.) జలము.

అంధమూష. సం. వి. ఆ. స్త్రీ. ఒకప్రక్క సన్నని రంధ్రముగలదియు, మూసివేయఁబడినదియు నగు మూస.

అంధస్సు. సం. వి. స్. న. అన్నము, వంటకము.

అంధిక. సం. వి. ఆ. స్త్రీ. **1.** (అంధునిగాఁ జేయునది.) జూదము; **2.** ఆవాలు, సర్షపి; **3.** నేత్రరోగము; **4.** చీఁకటి.

అంధితము. సం. విణ. (అ.ఆ. అ.) గ్రుడ్డిగాఁ జేయఁబడినది, మూసికొని పోయినది. (దృష్టి, బుద్ధి.)

అంధీకృతము. సం. విణ. (అ. ఆ.అ.) **1.** గ్రుడ్డిగాఁ జేయఁబడినది; **2.** వివేకశూన్యముగాఁ జేయఁబడినది. "అంధీకృతాత్ముఁడు."

అంధీభూతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మొదట అంధుఁడుకానివాఁడై తర్వాత అంధుఁడైన వాఁడు.

అంధుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) **1.** రెండు కన్నులును లేనివాఁడు; **2.** వివేకము లేనివాఁడు. "గర్వాంధుఁడు; స్మరాంధుఁడు; మదాంధుఁడు;" **3.** సన్న్యాసిభేదము.

అంధువు. సం. వి. ఉ. పుం. **1.** కూపము, నుయ్యి; **2.** మగగుఱి, పురుషుని రహస్యావయవము.

అంధ్రము. సం. వి. అ. పుం. ఆంధ్రులు నివసించు దేశము. జగన్నాథక్షేత్రము మొదలుకొని శ్రీశైలమువఱకు నుండు దేశము. త్రిలింగదేశము, తెలుఁగుదేశము - అని కొందఱు.

అంధ్రుఁడు. సం. వి. అ. పుం. = ఆంధ్రుఁడు; **1.** ఆంధ్రజాతినిఁ బుట్టినవాఁడు, తెలుఁగువాఁడు; **2.** వైదేహునకు వారస్త్రీయందుఁ బుట్టిన సంకరజాతివాఁడు అని స్మృతులు. (అంత్యజభేదమ అని కొందఱు; వ్యాధభేదమని మఱి కొందఱు.)

అంప. వై. వి. (అమ్ముశబ్దమునకు వృత్తియందు వచ్చురూపము.) అమ్ము, బాణము. (వ్యస్తపదము గానే కొందఱు గ్రహించిరి. ఇది చింత్యము.)

అంపకము. దే. వి. **1.** అంపుట, ప్రేషణము, పంపుట; **2.** శుభకార్యానంతరము బంధువులను సత్కరించి పంపుట, వీడ్కొల్పుట.

అంపకాఁడు. ద్వ.విణ.(అమ్ము+కాఁడు.) (క. అంపకాఱ.) **1.** విల్లు చేతఁబట్టినవాఁడు, ధానుష్కుఁడు; **2.** గుఱితప్పక అమ్మువేయువాఁడు, కృతహస్తుఁడు. "ఆ. హదనువచ్చుదాఁక నపరాధిపై రోష,మాఁగి హదనుగన్న నడఁపవలయు, లక్ష్యసిద్ధిదాఁకలావునశరమాఁగి, కాఁడవిడుచు నంపకాఁడువోలె." ఆము. ౪, ఆ. ౨౪౬.

అంపకోల. ద్వ. వి. (అమ్ము+కోల.) అమ్ము, బాణము.

అంపగఱి. ద్వ. వి. (అమ్ము + గఱి.) బాణమునకుఁ గట్టినఱెక్క.

అంపతప్పు. ద్వ. వి. (అమ్ము+తప్పు.) బాణమునుండి తప్పించుకొనుట. "ఉ. కానకు నంపత ప్పెఱుఁగు గబ్బిమెకంబులు సేరఁ గారుపో, తేనుఁగుదాయ యెల్లు పులి యేసినయే టుసివోయెఁ బోయినన్, మానితి నిస్సిరోయనుచు మాకులకాయికమైన వేఁటయ,య్యో నెలనుండి తుప్పు దినకుండు నెతూపులు వేయునేటికిన్" కకు. ౪, ఆ. ౫౭.

అంపపెట్టు. ద్వ. వి. (అమ్ము+పెట్టు.) **1.** బాణము పడుట; **2.** బాణము పడునంతదూరము, ఏటలవి. "వ.పతితశేషంబగు నబ్బలం బిరుగెలంకులం

దొలంగి యంపపెట్టునేల కవుల సని చూచు చుండె." భార. ద్రో. ౪,ఆ. ౨౨౮; 3. బాణపు దెబ్బ.

అంపఱ. ద్వ. వి. బాణసమూహము. "క. నెఱెనుఱక వైరివీరుల, నెఱఁకులఁ దూఱంగ నేయున్నపపుం గవునం,పఱ కోర్వక పిఱుసని రని, వెఱచి విష ణ్ణులయి సకలవిషయాధిపతుల్." భా. ఆది. ౪, ఆ. ౨౦౩. "క. తఱచుగఁబఱ పెఁగడిఁదియం, పఱ." హరి. ఉ. ౧, ఆ. ౧౭౦.

అంపసాల. వై. వి. (బాణములుండుసాల.) ఆయుధ శాల.

అంపాచోరము. వై. విణ. 1. ధారగాపడునది; 2. జెడిగలది (వాన). "క. సంపాదితశంపావలిఁ, బెంపారినమేఘచయము పృథివియు నభముం,గం పింపఁగ బెట్టుఱుముచు,నంపాచారంపువాన లప్పు డు కురిసెన్." వి. పు. ౭, ఆ. ౬౭.—వి. జల ప్రవాహము. పైయుదాహరణమున జలప్రవా హము అర్థము అని. శ. ర.

అంపియ. దే. వి. చింపిగుడ్డ, పటచ్చరము.

అంపు. దే.స.క్రి.రూ. అనుపు, అనుచు, అంచు. 1.ఆ జ్ఞాపించు; 2. పంపు.చూ. అంచు.—వి.1.ఉత్సవ విశేషము. "గీ....తద్విశేషంబులొప్పఁ దేవ, తం తుసాకన నంపు జాతర కొలుపన."ఆం. భా.ప్ర. నా.౧౪౩; 2.యుద్ధాదులకు పోవునపుడు చేసెడి యుత్సవము. "తే. అశనికన్నులు పుచ్చువారైరి గాన, నేను నప్పుడె ప్రాణ మీఁబూని యచట, నాయితంబయి పగతుర నంపొనర్చి, తాఁకఁ జూచెద నాభుజదర్ప మొప్ప." దశ. ౮,ఆ.౫౬.

అంపుదోడు. దే. విణ. (అంపు+తోడు.) ప్రయా ణమై పోవువారికి తోడుగా అంపఁబడువాఁడు, సాయముగా పంపఁబడువాఁడు.

అంపె. దే. = అంపియ. "ఉ. అంపెలుగట్టి కేల నొక యష్టి ధరించి." ద్వా. ౧౦, ఆ. ౭౦.

అంబ. సం. వి. ఆ. స్త్రీ. 1. అమ్మ; 2. పార్వతి; 3. కాశిరాజు కూఁతురు; 4. చేఁతిసొరచెట్టు; 5. పులిచింతచెట్టు.

అంబకము. సం. వి. అ. న. 1. కన్ను. "త్ర్యంబ కుఁడు;" 2. బాణము.

అంబకళము. దే. వి. 1. జావవలె చేసెడి ఒక పదా ర్థము. "వ. అంబకళంబులతోడ రసావళులతో డ."కాశీ. ౭, ఆ. ౧౮౫; 2. అంబలి. "ద్వి. అశని నగరఁగాంచు నంబకళంబు, ప్రతివచ్చునే యెన్నిభంగులనైన." బస. ౫, ఆ. ౧౫౨. పు.

అంబటిజోరిగాఁడు. దే. వి. పక్షివిశేషము. "సీ. కాకి యంబటిజోరిగాఁడు మూఁగ." హంస. 3, ఆ. ౧౨. అని శ. ర. ఇట అంబటిదారిగాఁడు అని పాఠాంతరము.

అంబరగుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఆకాశమున సంచరించువాఁడు. (వేల్పు).

అంబరదము. సం. విణ. (అ. ఆ. అ.) వస్త్రము నిచ్చునది.—వి. అ. న. ప్రత్తి.

అంబరమణి. సం. వి. ఇ. పుం. ద్యుమణి, సూర్యుఁడు.

అంబరము. సం. వి. అ. న. 1. ఆకాశము; 2. వస్త్ర ము; 3. వ్యసనము; 4. సుగంధద్రవ్యము; 5. సున్నకు సంకేతము.

అంబరయుగము. సం. వి. అ. న. పంచెలచాపు, పం చెల జత.

అంబరలేఖి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) ఆకాశ మును ఒరయునది, ఆకాశమంటునది.

అంబరశైలము. సం. వి. అ. పుం. ఆకాశమంటు కొండ, మిక్కిలి యెత్తయినకొండ.

అంబరాంతము. సం. వి. అ. పుం. 1. వస్త్రాంచలము, బట్టకొంగు; 2. ఆకాశముచివర, మిన్నులు వద్దచోటు.

అంబరాంబరుఁడు. సం. వి. అ. పుం. (ఆకాశవస్త్రుఁ డు.) దిగంబరుఁడు, శివుఁడు.

అంబరీషము. సం. వి. అ. న. పుం. 1. వేఁపుడుఁ జట్టి, మంగలము; 2. విచారము, దుఃఖము; 3. యుద్ధము; 4. జంతువత్సము. గుఱ్ఱపుఁబిల్లయని కొందఱు; 5. అంబాళముచెట్టు; 6. నరకవిశేషము; 7. పశ్చాత్తాపము.

అంబరీషుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకానొక రాజు; 2. శివుఁడు; 3. సూర్యుఁడు.

అంబరు. వై. వి. సుగంధద్రవ్యము. "తే. చారుశ్రీ గంధ మగరు కేసరి కదంబ, మంబరు పునుంగు జవ్వాది హరిణమదము, ఘుక్క యత్తరు గోవ

గంబూర బోలు, చట్ట కలపంబు పన్నీటం జాంది ఫూసి.'' హంస. ౫, ఆ. ౧౪ అని. శ. ర. అత్తరు పునుంగు అని పాఠాంతరము.

అంబరౌకసుఁడు. సం. వి. స్. పుం. (ఆకాశనివాసి.) వేల్పు, దేవత.

అంబలి. దే.వి. 1. పిండి నూకలు చేర్చి గరిటెజారు గా వండిన పదార్థము; 2. అంబకళము, జావగా చేసినపదార్థము. ''చ. తెలినులి వెచ్చయోగిర ముఁ దీయని చేరులుఁ దిమ్మనంబులున్, బలుచని యంబళుల్ చెఱకుఁబా లెడనీళ్ల రసావళుల్ ఫలం, బులును సుగంధశీతజలముల్ వడపిందెలు నీరు చల్లయున్, వెలయఁగఁ బెట్టుభోజనము వేసవిఁ జందనచర్చమున్నగన్.'' ఆము. ౧, ఆ. ౮౧.

అంబష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. 1. అడవిమొల్ల ✿; 2. చిఱుబొద్ది ✿; 3. పులిచింత ✿.—అ. పుం.-ము. 1. ఒకానొక దేశము; 2. బరుసడ్డసరము ✿.

అంబష్ఠి. సం. వి. ఈ. స్త్రీ. మంగలిది.

అంబష్ఠుఁడు. సం. వి.అ. పుం. 1. బ్రాహ్మణునకు వైశ్య కన్యకయందు జన్మించిన సంకీర్ణజాతివాఁడు. వీనికి చికిత్స (వైద్యకము) వృత్తి అని స్మృతులు; 2. మంగలివాఁడు; 3. మావటివాఁడు.

అంబస్తు. దే. వి. అజ్ఞుఁడు, లోకజ్ఞానము లేనివాఁడు. ''సీ. అజ్ఞుండు తగు దమ్మఁ డంబస్తనంగను గత నాత్ముఁ డొప్పును గడుసరియన.'' ఆం. భా. తృ. వి. ౧౨.

అంబా. దే. అవ్వ=అంబే. ఆవుదూడలయొక్కయు, ఆవులయొక్కయు అఱుపులయందలి ధ్వనికనుకర ణము.

అంబారము. దే. వి. (క. అంబారవు; త. అంబా రమ్.) ధాన్యరాశి, అంబారు.

అంబారి. దే. వి. ఏనుఁగుమీఁది పీఠము, చవుడోలు.

అంబారు. దే. = అంబారము.

అంబారుపిడుంజే. దే. వి. పశువుల యొడలనంటి పట్టుకొని రక్తముపీల్చెడి జంతువిశేషము, గోణుజు.

అంబాలిక. సం. వి. ఆ. స్త్రీ. పాండురాజుతల్లి.

అంబాళము. వై. వి. ఆమ్రాతకము ✿.

అంబిక. సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. ధృత రాష్ట్రునితల్లి; 3. తల్లి; 4. మేనత్త.

అంబికాపతి. సం. వి. ఇ. పుం. పార్వతీపతి, శివుఁడు.

అంబు. వై. వి. 1. అమ్ము, బాణము. ''చ. బిస వల్లిసముద్భవసౌకుమార్య కం,దళముల కంబుజేల్ బుజేలు.'' చమ. ౧, ఆ. అని శ. ర. (ఇది చిం త్యము. అట నీటిజల్లు అని యన్వయింపవచ్చును. వ్యాకరణవ్యాకోపము తప్పదు.;) 2. అమ్మువంటి మేదరవాని యినుపపనిముట్టు.

అంబుకంటకము. సం. వి. అ. పుం. 1. కుంభీరము, మొసలి; 2. శృంగాటకము, పరికెగడ్డ.

అంబుకిరాతము. సం. వి. అ. పుం. కుంభీరము, మొసలి.

అంబుక్రియ. సం. వి. ఆ. స్త్రీ. జలక్రియ, పితృ దేవతలకు జలతర్పణము చేయుట.

అంబుగజము. సం. వి. అ. పుం. 1. మొసలి; 2. నీటి యేనుఁగు.

అంబుచత్వరము. సం. వి. అ. పుం. 1. తటాకము, చెఱువు; 2. సరస్సు.

అంబుచరము. సం. విశ. (అ.-ఈ-రీ. అ.) జలచరము, నీటియందుండునది. (హంస మొ.)

అంబుచామరము. సం. వి. అ. పుం. (నీటిలో చామ రమువలె నుండునది.) శైవాలము, నాఁచు.

అంబుజగర్భుఁడు. సం. వి. అ. పుం. తమ్మిచూలి, బ్రహ్మ.

అంబుజన్మము. సం. వి. న్. న. అంబుజము, పద్మము.— పుం. న. 1. శంఖము; 2. వాన కోయిల, సారసము.

అంబుజము. సం. విశ. (అ. ఆ. అ.) నీటియందుఁ బుట్టినది.—వి. అ. పుం. 1. సారసపక్షి, వాన కోయిల; 2. ఎఱ్ఱగన్నేరు ✿; 3. కర్పూరము.— పుం.న. 1. శంఖము; 2. వజ్రము.—న. పద్మము.

అంబుజాసన. సం. వి. ఆ. స్త్రీ. పద్మాసన, లక్ష్మి.

అంబుజాసనుఁడు. సం. వి. అ. పుం. పద్మాసనుఁడు, బ్రహ్మ.

అంబుజుఁడు. సం. వి. అ. పుం. (నీటియందుఁబుట్టి నవాఁడు.) చంద్రుఁడు.

అంబుతస్కరుఁడు. సం. వి. అ. పుం. (నీటిదొంగ, నీటి నాకర్షించుకొనిపోవువాఁడు.) సూర్యుఁడు.

అంబుదము. సం. వి. అ. పుం. 1. (నీటినిచ్చునది.) మేఘము, మబ్బు. "నవాంబుదశ్యాముఁడు;" 2. ముస్తకము, తుంగ.

అంబుధరము. సం. వి. అ. పుం. 1.(నీటినిధరించునది.) మేఘము; 2. ముస్త, తుంగ.

అంబుధి. సం. వి. ఇ. పుం. (నీటికి స్థానము.) 1. సముద్రము; 2. నీటికుండ; 3. నాల్గుసంఖ్యకు సంకేతము.

అంబుధీషుధి. సం. వి. ఇ. పుం. (సముద్రము అంబులపొదిగాఁ గలవాఁడు.) శివుఁడు.

అంబునిధి. సం.వి.ఇ.పుం. (నీటికి నిధి.) సముద్రము.

అంబుపుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. నీటినిత్రాగువాఁడు; 2. నీటిని పాలించువాఁడు.—వి. అ. పుం. (నీటికిప్రభువు.) 1. వరుణుఁడు; 2. సముద్రుఁడు.

అంబుప్రసాదనము. సం. విణ. (అ.ఆ.అ.)నీటిని తేటగాఁ జేయునది; నీటిని విఱుచునది.—వి. అ. న. కతకఫలము, ఇండుగకాయ.

అంబుప్రసాదము. సం. వి. అ. పుం. = అంబుప్రసాదనము.

అంబుభవము. సం. వి. అ. న. (నీటఁబుట్టునది.) జలజము, పద్మము.

అంబుభృత్తు. సం. వి. త్. పుం. 1. మేఘము; 2. ముస్త, తుంగ; 3. సముద్రము.

అంబుమంతము. సం. విణ. (త్.ఈ.-మతీ. త్.) నీరు సమృద్ధిగాఁగలది (దేశము.)

అంబుమర్కటము. సం. వి. అ. పుం. 1. మొసలి; 2. నీటికోఁతి.

అంబుమాత్రజము. సం. విణ. (అ.ఆ.అ.)నీటియందు మాత్రము పుట్టినది.—వి. అ.పుం. శంబూకము, శంఖుపురుగు.

అంబుముక్కు. సం. వి. చ్. పుం. (నీటిని విడుచునది.) 1. మేఘము; 2. ముస్త.

అంబుముచము సం. = అంబుముక్కు.

అంబురము. సం. వి. అ. పుం. 1. ద్వారమునందలి పైకడపకమ్మి, (లక్ష్మీకమ్మిఅందురు;) 2. మేఘము.

అంబురాశి. సం. వి. ఇ. పుం. నీటిప్రోవు, సముద్రము.

అంబురుహము. సం. వి. హ్. అ. న. (నీటమొలచునది.) పద్మము.—పుం. సారసపక్షి.

అంబురోహి. సం. వి. న్. పు. సారసపక్షి.— న. అంబురుహము, పద్మము.

అంబులపొది. ద్వ. వి. తూణీరము, బాణములుండు పొది.

అంబువాహము. సం. వి. అ. పుం. (నీటిని మోయునది.) 1. మేఘము; 2. ముస్త.

అంబువాహి. సం. విణ. (న్.ఈ.నీ.న్.) నీటిని మోయునది.—వి. పుం. = అంబువాహము.

అంబువాహిని. సం. వి. ఈ. స్త్రీ. 1. నీళ్లుమోయు స్త్రీ; 2.పడవలోనికి వచ్చిన నీరు తోడి పాఱఁబోయుటకేర్పడిన తొట్టి; 3. దోనె, బూఁగా నుండుటకుఁ దొలిచిన తాటిపట్టె. (పల్లమున నుండు నీరు మెఱకనున్న కాలువలోనికి గూడలు మొదలగువానితోఁ దోడి పోయునపుడు మెఱకనున్న కాలువమొదట నుంచెడుపట్టె.)

అంబువిహారము. సం. వి. అ. పుం. జలక్రీడ, ఈఁదుట మొదలగు నీటిలోని యాట.

అంబువు. సం. వి. ఉ. న. ఉదకము, నీరు.

అంబువేతసము. సం. వి. అ. పుం. నీటిప్రబ్బ.

అంబుసర్పిణి. సం. వి. ఈ. స్త్రీ. (నీటిలో ప్రాఁకునది.) జలగ.

అంబుసేచని. స. వి. ఈ. స్త్రీ. 1. నీళ్లుచల్లు స్త్రీ; 2. పడవలోనికి వచ్చిననీరు తోడిపోయుతొట్టి; 3. నీరుచల్లుసాధనము.

అంబూకృతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నీళ్లు గలదిగాఁ జేయఁబడినది; 2. (నీళ్లు నములుట గలది.)స్పష్టముగాఁ బలుకఁబడనిది (మాట).— వి. అ. న. భల్లూకాదులధ్వని.

అంబే. దే.అవ్య.=అంబా. "అఱ్ఱులెత్తి యంబేయని యఱచుచు." వి. పు. ౭, ఆ. ౧౪౭. "ఉ. ఆయతకీర్తిఁ దద్ధ్వని రసాయనమై చెవిసోఁక నప్పుడం, బేయనుచున్ బ్రతిస్వనము పెల్లుగఁ జూపుచుఁ బాఱి ధేనువుల్,డాయఁగఁ బోయి వేడుక నొడల్ కదలించుచు వాలమార్చుచున్,బాయక గుప్పుచుం గుడిచె బాలవృషంబు నిజాంశదుగ్ధముల్." భో. ౬, ఆ. ౨౧.

అంబేద. దే. విశ. దిట్టతనములేనివాఁడు, పిఱికివాఁడు. "ఉ. వేదులఁబల్కి న న్నదర వ్రేయఁగఁ జూచెద విందు నంత యం,బేదలు లేరు." పద్మ. 3, ఆ. 42.

అంభస్సారము. సం. వి. అ. పుం. 1. నీటిలోని సారము; 2. ప్రవాళము, పగడము.

అంభస్సు. సం. వి. స్. న. 1. జలము, నీరు; 2. (జ్యోతి.) లగ్నమునకు నాల్గవరాశి.

అంభా. సం. అవ్య. ఆవులయార్పులకనుకరణము, అంబే. "ఉ. గోవులెల్ల నం, భాయని చీరి హుమ్మనుచుఁ బైపడి మూర్కొని పంచితిల్లె." భాగ. ౧౦, స్కం. పూ. శ. ర. "ఉ....గోవులెల్ల నం,బే యని చీరి హుమ్మనుచుఁ బేరిచి మూర్కొని పంచితిల్లి పెల్లై." భాగ. ౧౦, స్కం. పూ. ౫౧౯. అని పాఠాంతరము.

అంభోజజని. సం. వి. ఇ. పుం. (పద్మమందు పుట్టుకగలవాఁడు.) బ్రహ్మ.

అంభోజన్మము. సం. వి. న్. న. జలజము, పద్మము.

అంభోజము. సం. వి. అ. న. (నీటఁబుట్టినది.) పద్మము. "పాదాంభోజము, ముఖాంభోజము మొ."—పుం. సారసపక్షి.— విశ. (అ.ఆ.అ.) నీటియందుఁ బుట్టినది.

అంభోజయోని. సం. వి. ఇ. పుం. పద్మభవుఁడు, బ్రహ్మ.

అంభోజషండము. సం. వి. అ. న. 1. పద్మసమూహము; 2. పద్మసరస్సు, తామరచెఱువు.

అంభోజిని. సం. వి. ఈ. స్త్రీ. 1. పద్మసముదాయము; 2. (పద్మములతోఁగూడిన ప్రదేశము.) చెఱువు; 3. పద్మలత.

అంభోదము. సం. =అంబుదము.

అంభోధరము. సం. =అంబుధరము.

అంభోధి. స. వి. ఇ. పుం. (నీటికి స్థానము.) సముద్రము, కడలి.

అంభోధివల్లభము. సం. వి. అ. పుం. ప్రవాళము, పగడము.—డు. వరుణుఁడు.

అంభోనిధి. సం. = అంభోధి.

అంభోరాశి. సం. వి. ఇ. పుం. (నీటిప్రోవు.) సముద్రము.

అంభోరుహము. సం. వి.అ.న. పద్మము, తామర.—పుం.సారసపక్షి.—విశ. (అ.ఆ.అ.) నీటియందు మొలచునది.

అంశకుఁడు. సం. వి. అ. పుం. 1. భాగస్థుఁడు; 2. పాలికాఁపు; 3. దాయాదుఁడు, జ్ఞాతి.

అంశము. సం. వి. అ. పుం. 1. విషయము. "సారాంశము;" "ముఖ్యాంశము;" 2. భాగము, వంతు.

అంశుకము. సం. వి. అ. న. 1. ఉత్తరీయము; 2. సన్నవస్త్రము; 3. వస్త్రము.

అంశుధరుఁడు. సం. వి. అ. పుం. (కిరణములు ధరించువాఁడు.) సూర్యుఁడు.

అంశుమంతుఁడు. సం. వి.త్. పుం. సూర్యుఁడు.—విశ. (త్.ఈ.తీ.త్.) కిరణములుగలవాఁడు.

అంశుమతి. సం. వి. ఈ. స్త్రీ. ముయ్యాకుపొన్న ✽.

అంశుమత్ఫల. సం. వి. ఆ. స్త్రీ. (ప్రకాశించు పచ్చనైన పండ్లుకలది.)కదళి, అరఁటి✽.

అంశుమాలి. సం. వి. న్. పుం. (కిరణమాలికకలవాఁడు.) సహస్రకిరణుఁడు, సూర్యుఁడు.

అంశులము. సం. విశ. (అ. ఆ. అ.) కిరణములుగలది, ప్రకాశమానమైనది.

అంశువు. సం. వి. ఉ. పుం. 1. కాంతి; 2. కిరణము; 3. సూర్యుఁడు.

అంసకూటము. సం. వి. అ. పుం. ఎద్దుమూఁపురము, కకుదము.

అంసము. సం. వి. అ. పుం. న. 1. భుజశిరస్సు, మూఁపు; 2. అంశము.

అంసలుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) మాంసలుఁడు, బలముకలవాఁడు.

అంహతి. సం. వి. ఇ. స్త్రీ. 1. దానము, ఈవి; 2. తెవులు, రోగము; 3. విడుపు.

అంహస్సు. సం. వి. స్. న. 1. పాపము; 2.దోషము.

అఁట.దే. అవ్య. (అనుట, అంట, అఁట అని రూపావతారము. లోకులు చెప్పుకొనుట అని భావము.) 1. వృత్తాంతము చెప్పుటను తెలుపును. "క. తామఁటతలఁపఁగఁ దలలఁట." భాగ. ౧౦, స్కం. ఉ. ౧౦౫౪; 2. ప్రశంసను తెలుపును.

"క. ఐనను రావణుఁడఁట రిపుఁ, డానెలకువఁ జొచ్చి పొదివితఁట కయ్యమునం, జేనెత్తురుగాకుండఁగ, వానింజంపితఁట తగదె వర్ణనసేయన్." నిర్వ. ౨, ఆ. ౧౧; **3.** నిరసనమును తెలుఁపును. "వీఁడఁట పదిమందిని కొట్టునఁట." (ఈ యర్థములందు ప్రాచీనభాషలో అటే, అట్టే అను పదములు ఉపయుక్తములు.)

అక. వై. వి. **1.** అక్క; **2.** పూజ్యస్త్రీ.

అకట. వై. = అక్కట.

అకటకట. వై. = అక్కటకట.

అకటకటా. వై. = అక్కటకటా.

అకటవికటము. దే. విణ. (త. అగడవిగడం.) తారుమారైనది, కలవరపడినది.

అకటా. వై. = అక్కటా.

అకటావికటము. దే. విణ. =అకటవికటము."క. అకటా మరుఁ డిపు డుల్లం, బకటావికటముగఁ జేసి యడరూన్చెను." రసి. 3, ఆ. ౭౯.

అకము. సం. వి. అ. న. **1.** దుఃఖము; **2.** పాపము. —విణ. (అ. ఆ. అ.) సుఖము లేనిది.

అకరణి. సం. వి. ఇ. స్త్రీ. కార్యాభావము, కార్య భంగము. "నీకు అకరణియగుఁగాక." దీనికి శాపముననే ఉపయోగము. శాపము, తిట్టు. అని. శ. ర.

అకరు. దే. వి. తామర, కలువ మొదలగువానిలోని కేసరము, కింజల్కము. "సీ. బ్రహ్మసంవేద్యాది బహుతీర్థములు జేకు లకరులు చారుదివ్యస్థలములు." భీ. 3, ఆ. ౫౦. రూ. అకరువు.

అకరువు. దే. =అకరు. "క్రాం. చంచులనాస్వాదించుచు లేఁదూండ్లకరువు ప్రియులకు నలఁదుచుమైరో, మాంచము లోలిం గంచుకితంబై పొడమఁగ నడరుచుఁ." కు. సం. ౧౦, ఆ. ౨౮. "సీ. ఆకాశమండలం బను నల్లకలువకు నకరువా ద్యుండు లోలార్కమూర్తి." కాశీ. ౧, ఆ. ౨.

అకర్మకము. సం. విణ. (అ. ఆ. అ.) (వ్యాక.) కర్మ లేనిది. (క్రియ.)

అకర్మము. సం. వి. పు. న. (న+కర్మ.) **1.** కర్మాభావము, కర్మములేమి; **2.** సోమరితనము; **3.** నిషిద్ధమగుపని; **4.** పాపము, దుష్కర్మము.

అకల్క. సం. వి. ఆ. స్త్రీ. (మాలిన్యములేనిది.) చంద్రిక, వెన్నెల.

అకల్కత. సం. వి. ఆ. స్త్రీ. కాలుష్యములేమి, అకళంకత్వము.

అకల్కనుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) డంబములేని వాఁడు.

అకల్కము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** మడ్డిలేనిది, (చమురు. మొ.); **2.** పాపములేనిది.

అకల్కుఁడు సం. = అకల్కనుఁడు.

అకల్యము. సం. విణ. (అ. ఆ.అ.) **1.** సత్యమైనది; **2.** ఆరోగ్యవంతము కానిది, జబ్బుది.

అకస్మాత్తు. సం. అవ్య. అకస్మాతుగా, ఏకారణమువలనను గలుగకుండఁగా, పూర్వకారణము లేకుండఁగా, హఠాత్తుగా, ఉన్నట్టుండి.

అకా. దే. అవ్య. ద్రు. (అ+కాన్.) 'ఇతి' శబ్దార్థకము, 'అని' అనుదాని భావమును తెలుపును. "వ. కాకుత్స్థకులప్రదీపకుండు వారలముఖ వర్ణవిశేషంబు లుపలక్షించి సీతంగనినవారకా నిశ్చయించె." భార. అర. ౭, ఆ. ౧౨. (వారకాన్ = వారే అని భావము.)

అకాండతాండవము. సం. వి. అ. న. అసమయమందలి నృత్యము. (అసందర్భ ప్రసంగమునకు ఉపమానముగా గ్రహింపఁబడును.)

అకాండము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** ఉచిత కాలముకానిది, తఱికానిది; **2.** అసమయమున జరిగినది, అనుకొననిది. "అకాండ ప్రచండ కలహము;" "అకాండతాండవము;" **3.** కొమ్మలు లేనిది.

అకాయుఁడు. సం. విణ.(అ.ఆ.అ.) శరీరములేనివాఁడు.— వి. అ. పుం. **1.** పరమాత్మ; **2.** (అధఃకాయములేనివాఁడు.)రాహువు; **3.**మన్మథుఁడు.

అకారణము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** కారణము లేనిది; **2.** అవ్యాజము, కృత్రిమము కానిది, సహజము. "అకారణమైత్రి."— క్రి. విణ. నిష్కారణముగా, తగినకారణము లేకుండఁగా. —వి.న. **1.**కారణములేమి; **2.**అనర్హకారణము.

అకారతుగా. వై. క్రి. విణ. (అకారణాత్ అనుదాని యపభ్రంశము కావచ్చును.) కారణము లేకుండఁగా, నిష్కారణముగా.

అకారము. సం. వి. అ. పుం. "అ" అను అక్షరము.

అకార్పణ్యము. సం. విణ. (అ. ఆ. అ.) దైన్యములేనిది.—వి. అ. న. దైన్యములేమి.

అకార్యకరణము. సం. వి. అ. న. 1. చేయఁగూడని పని చేయుట; 2. దుష్కార్యము చేయుట.

అకార్యకారి. సం. విణ.(న్. ఈ-ణీ.న్.)1. అనుచితమగు పనిచేయువాఁడు, తప్పుపనిచేయువాఁడు, 2. పనికుపయోగింపనివాఁడు, ప్రయోజకుఁడు కానివాఁడు, అప్రయోజకుఁడు.

అకార్యము. సం.విణ. (అ.ఆ.అ.) 1. చేయఁదగనిది; 2. చేయఁగూడనిది.—వి. అ. న. 1. తగనిపని; 2. కూడనిపని. 3. నిషిద్ధమగు కార్యము, తప్పుపని; 4. పాపకృత్యము, దుష్కార్యము.

అకాలకూష్మాండము. సం. వి. అ. పు. 1. అకాలమున పుట్టిన గుమ్మడికాయ. (దీనికి రుచి యుండదు కావుననే నిరర్థకజన్మము అనుట కుపమానముగా నుపయోగింపఁబడును); 2. నిరుపయోగజన్మము.

అకాలము. సం. విణ. (అ.ఆ.అ.) (ఉచితకాలము లేనిది.) 1. అనుచితకాలమందలిది; 2. అసమయమున సంభవించినది. ("అకాలమృత్యువు." మొ.)— వి. అ. పుం. 1. అయుక్తకాలము, అనర్హసమయము, తగనివేళ; 2. కానివేళ, తఱికానివేళ, అదనుతప్పినసమయము.

అకాలమృత్యువు. సం. వి. ఉ. పుం. అకాలమందు సంభవించిన చావు, అపమృత్యువు.

అకాలవేళ. సం.వి. ఆ. స్త్రీ. వేళకానివేళ, అసమయము.

అకించనత. సం. వి. ఆ. స్త్రీ. 1. దారిద్ర్యము, లేమి; 2. సర్వధనము వదలుకొనుట, కొంచెమైనను తనకులేకుండఁగ విడిచి దరిద్రుఁడగుట. (ఇది సన్న్యాసాంగములలో నొకటి.)

అకించనత్వము. సం. వి. అ. న. = అకించనత.

అకించనము. సం. వి. అ. న. ఏమియుఁజేయనివస్తువు, విలువలేని వస్తువు.

అకించనుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) కొంచెమైనను లేనివాఁడు, మిగుల దరిద్రుఁడు.

అకించిత్కరుఁడు. సం. విణ. (అ. ఈ - రీ. అ.) కొంచెమైనను చేయనివాఁడు, నిరుపయోగి, ఏమియుఁ జేయలేనివాఁడు, ఏమిచేయుటకు శక్తిలేనివాఁడు.

అకుంఠగతి. సం. విణ. ఇ. అప్రతిహతమైన (అడ్డులేని)గతిగలవాఁడు.—వి. ఇ. స్త్రీ. అడ్డులేనిగతి. "చ....కర్ణుఁడా శిశున,కుంఠగతిం దన తేరిమీఁద నొప్పెడు ఘనచక్రముం గొని యుపేంద్రుఁడు లీల నటించు చాడ్పునన్." భార. ద్రోణ. ౨, ఆ. ౧౧౨.

అకుంఠము. సం. విణ. (అ.ఆ.అ.) 1. మొక్కవోనిది, వాఁడిపోనిది, మొద్దుకానిది. "అకుంఠపరశువు;" 2. అప్రతిహతము,అడ్డులేనిది. "అకుంఠపరాక్రమము."

అకుంఠితము. సం. విణ. (అ. ఆ. అ.) = అకుంఠము.

అకుతశ్చిద్భయుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) = అకుతోభయుఁడు.

అకుతోభయుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ఎవనివలనను లేక దేనివలనను భయపడనివాఁడు. "న్యాయవంతుఁ డకుతోభయుఁడు;" "భారత దేశసంచారమకుతోభయము."

అకుప్యము. సం. వి. అ. న. (రాగి, మొ. వానికంటె వేఱగు లోహము.) వెండి లేక బంగారము.

అకూపారము. సం. వి. అ. పు. 1. సముద్రము; 2. ఆదికూర్మము.

అకృతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చేయఁబడనిది, ఆచరింపఁబడనిది; 2. సిద్ధముకానిది. (అన్నము మొ.); 3. ధన్యముకానిది; 4. పూర్తిగానిది, ఫలితమునకు రానిది.—వి. అ. న. చేయకపోవుట, చేయమి.

అకృతాత్ముఁడు. సం. విణ. అ. 1. ధన్యాత్ముఁడుగానివాఁడు; 2. స్థిరమైన మనస్సు లేనివాఁడు; 3. తెలివిలేనివాఁడు; 4. బ్రహ్మానుసంధానము లేనివాఁడు.

అకృతార్థుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) చరితార్థుఁడుగానివాఁడు, పనిసెఱవేర్పలేనివాఁడు, విఫలుఁడు.

అకృతాస్త్రుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) అస్త్రములు బాగుగా అభ్యసింపనివాఁడు.

అకృతి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) 1. ధన్యుఁడు కానివాఁడు; 2. విద్వాంసుఁడు కానివాఁడు; 3. ఏపనియు నిర్వహింపనివాఁడు.—వి. ఇ. స్త్రీ. పనిలేమి.

అకృత్యము. సం. విణ. (అ.ఆ.అ.) 1. చేయఁదగనిది; 2. చేయఁగూడనిది.—వి. అ.న.1.కూడని పని, తప్పుపని; 2. దుష్కార్యము.

అకృశము. సం. విణ. (అ.ఆ.అ.) (కృశముగానిది.) 1. దుర్బలము గానిది, దృఢమైనది; 2. హీనముకానిది, అధికము.

అకృష్టపచ్యము. సం. విణ. (అ.ఆ. అ.) (అకృష్ట+పచ్య.) దున్ననినేలయందు ఫలించునది. (నీవార ధాన్యము, ఓషధి మొ.)

అకృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. దున్నఁబడనిది; 2. లాగఁబడనిది.

అక్లిష్టకర్ముఁడు. సం. విణ. న్. శుద్ధమైనకార్యములు గలవాఁడు, కళంకములేనిపనులుచేయువాఁడు, మంచినడవడికగలవాఁడు.

అకృష్ణము. సం. విణ. (అ.ఆ.అ.) 1. నలుపులేనిది, తెల్లనిది; 2. కళంకములేనిది; 3. శుద్ధమైనది.

అకో. దే. అవ్య. సందేహమును తెలుపును. (కొన్నివ్రాఁతప్రతులయందు. 'ఒకో' అను దానికి మాఱు 'అకో' అనియే కలదు.) చూ. ఒకో.

అక్క. ఉభ. వై. వి. 1. పెద్దదియగు తోఁడఁబుట్టినది; 2. పూజ్యస్త్రీ, గౌరవముగలస్త్రీ. "క. ఎక్కడికిఁ బాఱిపోయెదఁ, జిక్కుపడక యేను వీనిశీఘ్రగతికి నో, యక్క." కళా.3, ఆ. ౯౬; 3. వంటలక్క. "తే. దర్భపోటులఁదినిలేనితఱులమైత్రి,నంటి పితృశేషము భుజించియదియు నెడల, నక్కవాడల నరకూళ్లు మెక్కిమీఁద, పీనిశేఖర మొకతులా ర్త్విజ్యము గొని." ఆము. ౬, ఆ. ౬౯.—అవ్య. ఆశ్చర్యమును దెలుపును. "అక్క యిదియేమి చోద్యమో." శుక. ౧, ఆ. ౨౯౯.—సం. వి. ఆ. స్త్రీ. తల్లి.

అక్కజేపడు. వై. అ. క్రి. (అక్కజేము+పడు.) ఆశ్చర్యపడు. "చ. గజపతి వచ్చెనంచు నొక గంధగజంబు గుఱించి యొక్కఁ డక్కజపడి పల్కిన న్వెఱచి." హైం. ౫, ఆ. ౧౩౩.

అక్కజేము. వై. విణ. 1. అధికము. "సీ.....బ్రాహ్మణాకృత్రమైన బ్రహ్మరథము, నెక్కి బ్రాహ్మణులకు నక్కజంబగు నవమానంబుసేసినదాన." భార. అర. ౪, ఆ. ౧౧౯; 2. అశక్యము. "సీ. ఇవి ఘనబృందంబు లివిగజయూథంబు లని విచారింపంగ నక్కజంబు, లై." భార. అర. 3, ఆ. 3౫౫. "ద్వి. చూపంగవలెనని చూపితిఁగాని, యాపురి లింగ సహస్రార్బుదములుఁ,జూపఁజెప్పఁగను శేషునకు నక్కజము." పండి. పర్వ. ౪౦3. పు.; 3. ఆశ్చర్యము, వింత. "సీ. వడలక కురుపతి వారణావతమున లక్కయిల్ గావించియక్కజముగ, నందఱఁ జొన్పి యందనలంబు దరికొల్పఁబనిచినఁ బాండునందను లెఱింగి." భార. ఆది. 3, ఆ. ౧౪. "మ. ప్రజలెల్లన్ వినుతింప విందు మొదలం బక్షీంద్ర యూహింప నక్కజ మీ విప్పుడు సంస్తుతింప నది సాక్షాత్కారముం బొందెదుర్." నై. ౨, ఆ. ౨౯.

అక్కజేఁడు. వై. విణ. అధికుఁడు, పరాక్రమవంతుఁడు. "సీ. చంపె నాగాయుతసత్త్వ జరాసంధు నెక్కటి యోర్చిన యక్కజుండు." భార. అర. ౧, ఆ. ౧౦౨.

అక్కజేరాలు. వై. విణ. (అక్కజే+ఆలు.) అధికురాలు, పరాక్రమవతి.

అక్కట. వై. అవ్య. (సం. ఆః కష్టమ్. క. అక్కట.) సంతాపమును దెలుపును, అయ్యో! "ఉ. అక్కట! కన్యకాత్వమిటు లాఱడివోవ నకారణంబ నీ, కెక్కడి చూలు వచ్చె." నిర్వ. ౨, ఆ. ౨౪. (కొన్ని ప్రతులలో అక్కల అని కలదు. చూ అల.) రూ. అకట, అకటకట,అకటకటా, అకటా, అక్కటకటా, అక్కటా.

అక్కటకటా. వై. = అక్కట. "[illegible]క్కటకటా, దైవంబ, నీకంటికిం బేలగింజయురే [illegible]యయ్యో నే." నై. ౧, ఆ. ౧౧౦.

అక్కటా. వై. = అక్కట. "తే. కుంభసంభవుఁ డబ్ధితోఁగూడఁ గ్రోలి, తజ్జలముతోడ వెడలింపఁ దలఁపఁడేని,విరహిజను లింతపడుదురే వీని చేత, నక్కటా దైవమటుసేయఁ డయ్యెఁగాక." నై. ౭, ఆ. ౧౨3.

అక్కటిక. దే.వి.దయ,కనికరము."సీ.ఆదివరాహాంబ

వగుచు రసాతలగతమైన నన్ను నక్కటికతోడ, నుద్ధరించితివి." భాగ. ౪, స్కం. ౪౮౬.

అక్కటికము. దే. = అక్కటిక. "ఉ. చక్కటి లేని యాలమునఁ జంపె ననర్కవల దీదురాత్మకుం, డక్కటికంబు లేక సతి నంతలుసేసి..." భార. శల్య. ౨, ఆ. ౩౨౧. "క. అక్కటనాహ్లాదయము గడు, నక్కటికము లేని దయ్యె." భార. అర. ౫, ఆ. ౯.

అక్కడ. దే. వి. (ఆ+కడ.) (వృత్తియందే ఔపవిభక్తికము. అక్కడివార్త.) **1.** ఆదిక్కు, ఆవైపు; **2.** ఆవలివైపు. "వ. ఇక్కడలి గడచి చక్కనుత్తరాభిముఖుండ వై చనంజన హిమవంతంబు, అక్కొండకక్కడ బహుకూటశోభితంబగు హేమకూటంబు, అన్నగంబునకవల ఋషభాచలంబు." రా. యు. కాం. ౧౦౯౫. శ.ర. ఆకడ అని పాఠాంతరము; **3.** ప్రదేశము, చోటు. "ఉ. మ్రొక్కి కరాంబుజద్వయము మోడ్చి లలాటమునన్ ఘటించి మా, యక్కడ మీరు నీముసలి యవ్వయు నేఁడు శివార్చనంబు స, మ్యక్కృతిఁ జేసి." హర. ౨, ఆ. ౪౭.

అక్కరము. వై. వి. **1.** అకారాదివర్ణము; **2.** తెలుఁగునను కన్నడమునను గల పద్యవిశేషము. మహాక్కర, మధ్యాక్కర, మధురాక్కర, అంతరాక్కర, అల్పాక్కర యని అయిదువిధములు తెలుఁగునఁ గలవు.

అక్కఱ. దే. వి. (క. అక్కఱె. త. అక్కఱై.) **1.** అపేక్షితమగు కార్యము, ఆవశ్యకకార్యము. "వ. కౌంతేయులు నీదేశంబుననుండి నీయాజ్ఞవలనం గృతార్థులైయున్నవా రగుటంజేసి వారు నీకింకరులు. నీకునైన యక్కఱ దీర్చుట వారి కర్హకృత్యంబు. దీని కింతవనరనేల?" భార. అర. ౬, ఆ. ౩౦; **2.** అపేక్ష, కోరిక. "మ. చిఱునవ్వొప్పఁగఁ జూడనీక పులకల్ సెల్వొంద నిక్ గ్రుచ్చి య, క్కఱదీఱంబొరినక్కనంగరము వీఁకం జేర్పనీకిప్డెయిక్, వఱవంద్రోవఁగఁ జేసెనే." భార. అర. ౭, ఆ. ౩౪౩; **3.** శ్రద్ధ. (శ. ర.)

అక్కఱకాఁడు. దే. విణ. అక్కఱగలవాఁడు, ఆవశ్యకతగలవాఁడు, "అక్కఱకాఁడవైయుందంద ప్రేరేఁచి." క్షేత్రయ.

అక్కఱగండఁడు. దే. విణ. ఆవశ్యకతగనిపట్టువాఁడు, అవసరమును గ్రహించువాఁడు. "ద్వి. అక్కఱగండఁడై యప్పటప్పటికి, వెక్కసంబుగ నూర్లువేలునప్పిచ్చి." హరిశ్చం. ౨, భా. ౪౮౦. ఇట శ్రద్ధగలవాఁడు అని శ. ర. ఈయర్థము చింత్యము.

అక్కఱగొను. దే. స. క్రి. అపేక్షించు.

అక్కఱపడు. ద్వ. అ. క్రి. అక్కఱగొను, ఆసనొందు. "చం. ...నన్నున, క్కఱపడి నీవు వేఁడుటిది కర్జమె." భార. అర. ౭, ఆ. ౩౬౭.

అక్కఱపాటు. ద్వ. వి. అక్కఱపడుట.

అక్కలకర. దే. వి. అక్కలకఱ్ఱ, జ్వరదోషము పోఁగొట్టు మూలికావిశేషము. "సీ. అన్నభేదియు వస యక్కలకర." హంస. ౨, ఆ. ౨౨౭.

అక్కలకఱ్ఱ. దే. = అక్కలకర.

అక్కలి. దే. వి. అల, తరంగము. "క. తగులువడి యపుడు వడిసెడి, గగనమణిరథంబుదొరగలువడి నిలిచెన్, బొగరుమొగకడలియక్కలిఁ, దగిలి నిలువఁబడిన ఘనవితతియుంబోలెన్." కాశీ. ౧, ఆ. ౧౩౩. "వ. కడలిమొగ యక్కలిం దగులఁవడిన జోగునుంబోలె." కాశీ. ౨, ఆ. ౯౦.

అక్కళించె. దే. అ. క్రి. (క. అక్కళిసు. అక్కళిసు. (ఆఁకలి మొదలగువానిచేత కడుపు) లోపలికిఁబోవు, దించుకొనిపోవు, సంకుచితమగు. "సీ. ఐణేయమైన యొడ్డాణంపు లవణిచే నక్కళించినపొట్ట మక్కళించి." స్వా. ౧, ఆ. ౫౯.—స. క్రి. దించుకొనిపోవునట్లు చేయు. "నీకడుపు అక్కళించు."

అక్కవాడ. దే. వి. వంటలక్కలు ఉండువీథి. "తే. అక్కవాడల నరకూళ్లు మెక్కిమీఁద." ఆము. ౬, ఆ. ౬౭.

అక్కసము. దే. వి. (క. అక్కస.) **1.** సంతాపము, దుఃఖము. "ఉ. అక్కమలాక్షిఁ జూచి యలకాధిపనందనుఁ డోపడంతి నీ, వెక్కడనుండి వచ్చి తిది యేటికి నుస్సురుమంటి నీకు నీ, యక్కసమేల వచ్చెను." కళా. ౩, ఆ. ౧౭౯; **2.** కోపము, అక్కసు. "తే. ...బూచి, గములకామెకలొసఁ గెనక్కస మెసంగి, రావణుఁడు దద్దయొఱలి బీరమ్ము హెచ్చు." అచ్చ. యు. ౨౦౧.

అక్కసి. దే. విణ. అక్కసుగలవాఁడు, ఆగ్రహవంతుఁడు.

అక్కసు. దే. వి. ఆగ్రహము, కోపము, కసి.

అక్కసుకాఁడు. దే. విణ. అక్కసి, ఆగ్రహవంతుఁడు.

అక్కసెల్లెండ్రు. దే. = అక్కాసెల్లెండ్రు.

అక్కస్సు. దే. = అక్కసు. "వానిమీఁద నాకక్కస్సు తీఱలేదు."

అక్కాసెల్లెండ్రు. దే. వి. బ. అక్కయుఁ జెల్లెలును. "క. అక్కాసెల్లెండ్రయ్యును, దక్కరునాతోడి పోరు దానుఱ్ఱ దిటియున్."భాగ. ౮, స్కం. ౪౭౦.

అక్కి. దే. వి. చర్మరోగవిశేషము.

అక్కిబిక్కిదండ. దే. వి. బాలక్రీడావిశేషము. "సీ. పిల్లమెఱము లక్కిబిక్కిదండ." హంస. 3, ఆ. ౧౪౬.

అక్కిలి. దే. వి. అంకిలి, కలఁత, కలవరము. "ఉ. అక్కిలి మాయఁ గన్నుఁగవ లాననము ల్వెలసిల్లఁ బెంజెమర్, గ్రిక్కిని పర్వమానములు గీడ్పడ." కు. సం. ౧౦,ఆ. ౩౪. "ఉ.... మాపుగనన్నియు వచ్చెనేని నే, నక్కిలి దేఱి తత్కుశల మారయుచుండుదు." మార్కం. ౮, ఆ. ౬౬.

అక్కిలిపడు. ద్వ. అ. క్రి. 1. కలఁతపడు. "ద్వి. అక్కిలిపడి ఱెప్ప లల్లమోడ్చుచును." భాగ. ౭, స్కం.; 2. చెడు, నశించు. "ద్వి. గ్రక్కునం బఱతెంచి కాళ్లపైఁబడిన, నక్కిలిపడునె నీయయగారితనము." పండి. పురా. ౧౦౧ పు.

అక్కు. దే. వి. 1. ఱొమ్ము, వక్షము. "ఉ...... అక్కునఁ జేర్చె భుజాయుగాంకపా, ళీవలయంబు లోనఁ దవిలించి." సై. ౭,ఆ. ౧౬౯; 2. గుండె. "ద్వి. అక్కుమాలిన భంగి నగ్రహారంబు, చక్కన మీకెట్లు చనఁ జేరవచ్చు."బస. ౭,ఆ. ౨౧౪పు.

అక్కుఁగొట్టు. దే. వి. (అక్కు+కొట్టు.) హృదయశల్యము."ద్వి.అవనీశులకునెల్ల నక్కుఁగొట్టగుచు." బస. ౪. ౧౩౬ పు. "ఉ. ఈయసురేంద్రుఁ గూల్చుటకు...... వేల్పుల యక్కుఁగొట్టు." హరి. పూ. ౪, ఆ. ౧౭౮.

అక్కుపక్షి. మి. వి. బక్కవాఁడు. (వాడుక.)

అక్కుముల్లు. దే. వి. హృదయకంటకము.

అక్కుళ్లు. దే. వి. బ. ధాన్యవిశేషము, ఒకరకము వడ్లు.

అక్కెత్తుకొను. దే. అ. క్రి. ఱొమ్ము ఎత్తుకొను. "వ. ఇట్లుందఱు నక్కెత్తుకొనక చేయుం శిశిరోపచారంబు లగజ కుష్ణోపచారంబులైనం దనసఖులం బదరుచు." కు. సం. ౯, ఆ. ౧౯౧. (ఇట అక్కుఎత్తుకొనక అనునది 'వంచిన మెడ యెత్తకుండఁగా,' 'నడ్డి యెత్తకుండఁగా' అను వాని వంటిది. "తదేక దృష్టితో" అనుభావము.)

అక్తము. సం. విణ. (అ.ఆ.అ.) 1. పూయఁబడినది. (తైలాక్తము,శోణితాక్తము మొ.); 2. వ్యక్తము, స్పష్టమయినది; 3. చేరినది; 4. పోయినది.

అక్రమము. సం. వి. అ. పుం. 1. క్రమములేమి, వరుసలేకపోవుట; 2. సంచారము లేమి; 3. న్యాయవిరోధము, న్యాయమునకు వ్యతిరేకము. —విణ. (అ. ఆ. అ.) 1. క్రమములేనిది, వరుసలేనిది; 2. క్రమము (=పాదము) లేనిది, పాదశూన్యము; 3. సంచారములేనిది; 4. ఆక్రమణములేనిది; 5. న్యాయవిరుద్ధము.

అక్రియుఁడు. సం విణ. (అ.ఆ.అ.) (క్రియలేనివాఁడు.) 1. చేయవలసిన పనిచేయనివాఁడు, సోమరి; 2. అప్రయోజకుఁడు; 3. యాగాదికర్మలుచేయనివాఁడు; 4. యాగాదికర్మలు లేనివాఁడు; 5. నిష్క్రియుఁడు, (సర్వసంపూర్ణుఁడుగాన) చేయవలసినపని లేనివాఁడు. (దేవుఁడు.)

అక్రూరుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) (క్రూరుఁడుగానివాఁడు.) సౌమ్యుఁడు.—వి. అ. పుం. యాదవులలో నొకఁడు; కంసుని కుటిలప్రవర్తనము కృష్ణునకుఁ దెలిపి వానిఁ జంపఁ బ్రేరించినవాఁడు.

అక్రోధనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) క్రోధములేనివాఁడు, కోపములేనివాఁడు.—వి. అ. పుం. ఒకానొకరాజు. (ఇతఁ డయుధాయువనువాని కుమారుఁడు.)

అక్లిష్టకర్ముఁడు. సం. విణ. న్. 1. (అక్లిష్ట+కర్మ.) శ్రమలేని పనిగలవాఁడు; 2. (అ+క్లిష్టకర్మ.) పనివలన శ్రమపడనివాఁడు.

అక్లిష్టకారి. సం. విశే. (న్. ఈ-ణీ. న్.) శ్రమపడకుండ పని చేయువాఁడు, ఆయాసములేకుండఁగఁ బనిచేయువాఁడు.

అక్లిష్టము. సం. విశే. (అ. ఆ.అ.) (క్లిష్టముగానిది.) 1. క్లేశము నొందనిది, శ్రమముచెందనిది; 2. తక్కువగానిది. "అక్లిష్టకాంతియగు రూపము;" 3. సులభము (పద్యము.)

అక్లిష్టవర్ణము. సం. విశే. (అ. ఆ. అ.) (అక్లిష్టమగు వర్ణములుగలది.) 1. కలసిపోనిరంగులుఁగలది, ఏ రంగున కారంగు స్పష్టముగా నున్నది. (చిత్తరువు మొ.); 2. కలసిపోని (స్పష్టమైన) అక్షరములు గలది. (ఉచ్చారణము.); 3. (బ్రాహ్మణాది) వర్ణ సాంకర్యము లేనిది.

అక్లిష్టవ్రతుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. చెడని వ్రతము గలవాఁడు; 2. వ్రతాచరణమందు ఆయాసము లేనివాఁడు.

అక్షగ్లహము. సం. వి. అ. పుం. పాచికలతో నాడెడి యాట, జూదము.

అక్షచక్రము. సం. వి. అ. న. 1. ఇంద్రియసముదాయము; 2. బండి యిరుసు చక్రము; 3. పాచికలసజ్జు.

అక్షజము. సం. విశే. (అ. ఆ. అ.) (అక్షమువలనఁ గలుగునది.) నేత్రమువలనఁ గలుగునది. "అక్షజజ్ఞానము" (=ప్రత్యక్షజ్ఞానము, కంటితో చూచుట.)—వి. అ. న. 1. (ఎమ్ముకవలనఁ గలిగినది.) వజ్రాయుధము. (ఇది దధీచిముని ఎమ్ముకతోఁ జేయఁబడినదని పురాణగాథ;) 2. వజ్రము, నవరత్నములలో నొకటి.

అక్షణికము. సం. విశే. (అ.ఆ.అ.) క్షణికముగానిది, స్థిరము.

అక్షత. సం. వి. ఆ. స్త్రీ. పురుషసంభోగము పొందని స్త్రీ.

అక్షతము. సం. వి. అ. న. 1. హానిలేమి; 2. శుభము; 3. నడిమికి విఱుగని బియ్యపుగింజ.—విశే. (అ.ఆ.అ.) 1. గాయము నొందనిది, ఖండింపఁబడనిది, బాధనొందనిది; 2. విఱుగనిది. (బియ్యపుగింజ మొ.)

అక్షతయోని. సం. వి. ఇ. స్త్రీ. పురుషసంభోగము పొందని స్త్రీ, కన్య.

అక్షతలు. సం. వి. అ. పుం. బ. = అక్షింతలు. విఱుగని బియ్యము. "దూర్వాక్షతలు; ఆర్ద్రాక్షతారోపణము; సాక్షతపాత్రహస్తుఁడు."

అక్షదర్శకుఁడు. సం. వి. అ. పుం. 1. న్యాయానుసారముగా వ్యవహారములు తీర్చువాఁడు, న్యాయాధికారి (జడ్జి); 2. జూదమున న్యాయాన్యాయములు కనుపెట్టి చూచువాఁడు.

అక్షదృక్కు. సం. వి. శ్. పుం. = అక్షదర్శకుఁడు.

అక్షదేవి. సం. వి. న్. పుం. పాచికలాడువాఁడు, కితవుఁడు, జూదరి.

అక్షద్యువు. సం. వి. ఉ. పుం=అక్షదేవి.

అక్షద్యూతికము. సం. వి. అ. న. జూదమునందలి జగడము.

అక్షధరుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) 1. చక్రము ధరించువాఁడు; 2. పాచికలు చేతఁబట్టుకొనువాఁడు.—వి. అ. పుం. చక్రపాణి, విష్ణువు.

అక్షధురము. సం. వి. ర్. స్త్రీ. బండిబరువు.

అక్షధూర్తిలము. సం. వి. అ. పుం. వృషభము,ఎద్దు.

అక్షధూర్తుఁడు. సం. వి. అ.పుం. కితవుఁడు,జూదరి.

అక్షపటలము. సం. వి. అ. న. 1. న్యాయసభ; 2. అక్షిపటలము.

అక్షపటలుఁడు. సం. వి. అ. పుం. న్యాయాధికారి.

అక్షపాటకుఁడు. సం. వి. అ. పుం. (వ్యవహార ధర్మము బాగుగా నేర్చినవాఁడు.) న్యాయాధికారి.

అక్షపాదుఁడు. సం. వి. అ. పుం. (కాలియందుఁ గన్నుగలవాఁడు.) గౌతమఋషి, (ఈతఁడు తర్కము రచించినవాఁడు. తనమతమును దూషించిన వ్యాసుని ముఖము చూడనని ఈతఁడు ప్రతిజ్ఞచేసెను. వ్యాసుఁడు పలువిధముల ప్రసన్నునిఁ గావించుకొనఁగా నతఁడు తుదకు దయదలఁచి తన పాదమునఁ గంటిని గల్గించుకొని దానితో వ్యాసుని చూచెనని ప్రసిద్ధి.)

అక్షమ. సం. వి. ఆ. స్త్రీ. 1. క్షమలేమి; 2. కోపము.

అక్షమము. సం. విశే. (అ.ఆ.అ.) 1. ఓరిమిలేనిది; 2. సమర్థముకానిది.

అక్షమాల. సం. వి. ఆ. స్త్రీ. 1. (తంత్ర.)అక్షమల (=అకారాది క్షకారాంతమయిన యేఁబది వర్ణముల) మాల; 2. (దానికి ప్రతినిధిగా రుద్రాక్షములతోఁ గాని ముత్తెములతోఁ గాని స్ఫటికములతోఁ గాని కూర్చినమాల.) జపమాల; 3. (నక్షత్రచక్రమునకు మాలవలె నలంకారమైనది.) అరుంధతీనక్షత్రము.

అక్షము. సం. వి. అ. పుం. 1. తాండ్రచు; 2. పాచిక; 3. బండి; 4. బండిచక్రము; 5. బండియిరుసు; 6. బండికన్ను; 7. రుద్రాక్షము; 8. ఇంద్రాక్షము (రుద్రాక్షమువలెనే మాల కుపయోగించునది); 9. పదునాఱు మాషములయెత్తు; 10. వ్యవహారము; 11. జ్ఞానము.— అ. పుం. న. 1. ఇంద్రియము; 2. నేత్రము.(కమలాక్షుఁడు మొదలగు సమాసములయందు అక్షిశబ్దము అక్షశబ్దముగా మాఱినరూపము.)—న. 1.తుత్థము;2. సౌవర్చలవణము.—డు. పుం. రావణునికొడుకు.

అక్షయ. సం. వి. అ. పుం. (మువర్ణలోపము.) సంవత్సరములలో నొకటి. (దీనికే క్షయ అనియుఁ బ్రసిద్ధి. ఇదియే యుచితము.)

అక్షయతృతీయ. సం. వి. ఆ. స్త్రీ. (అక్షయమైన పుణ్యముగల మూఁడవతిథి.) వైశాఖ శుక్లపక్షమందలి తదియ.(ఆనాఁడొనర్చిన పుణ్యకర్మముల ఫల మక్షయమగును.)

అక్షయము. సం. విశే. (అ.ఆ.అ) 1. తఱుఁగు లేనిది, తఱుఁగనిది. "వ. తనతూణీరంబు లక్షయ బాణంబు లగుటం జేసి."భార. విరా. ౫,ఆ.౧౭౪; 2.నాశములేనిది; 3. ఇల్లులేనిది. "సన్యాసి అక్షయుఁడు" (= ఇల్లులేనివాఁడు.)—వి. అ. న. బ్రహ్మము.

అక్షరచణుఁడు. సం. విశే. (అ.ఆ.అ.)లిపికారుఁడు, వ్రాఁతకాఁడు, లేఖకుఁడు, చూచి వ్రాఁతవ్రాయువాఁడు.

అక్షరచుంచుపు. సం. విశే. ఉ. = అక్షరచణుఁడు.

అక్షరచ్ఛందము. సం. విశే. చూ. అక్షరచ్ఛందుఁడు. —వి.న్.న.అక్షరసంఖ్యతో నేర్పడిన ఛందస్సు. (ఛందస్సు) వృత్తము జాతి అని రెండువిధములు. వానిలో వృత్తము అక్షరసంఖ్యతో నేర్పడినది. దానికి పాదమున కిన్నియక్షరము లనునియమము. జాతి మాత్రలతో నేర్పడునది. అందక్షరసంఖ్య హెచ్చవచ్చును; తగ్గవచ్చును. జాతి ననుసరించి జనించినది ఉపజాతి.)

అక్షరచ్ఛందుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) చలింపని యభిప్రాయముగలవాఁడు, దృఢనిశ్చయుఁడు.

అక్షరచ్యుతకము. సం. వి.అ. న. ఒకపదములో నొక యక్షరము తీసివేయఁగా శేషించి, అర్థాంతరమును తెలుపు భాగము. (కరేణువులో 'క' తీసివేయఁగా మిగిలిన 'రేణువు' అనుపదము.)

అక్షరము. సం. వి. అ. న. 1. బ్రహ్మము; 2. అకారాదివర్ణము; 3. పదము, వాక్యం. "ప్రతిషేధాక్షరవిక్లబాభిరామము;" 4. మోక్షము; 5. ప్రణవము; 6. ధర్మము; 7. ప్రకృతి; 8. తపస్సు; 9. క్రతువు; 10. జలము; 11. ఆకాశము; 12. నాశములేమి.— విశే. (అ.ఆ.అ.) నశింపనిది, నాశములేనిది.

అక్షరముఖుఁడు. సం. విశే. (అ.ఈ.ఖీ. అ.) (అక్షరములు ముఖమందు గలవాఁడు.) 1. చదువు వచ్చినవాఁడు; 2. పండితుఁడు.

అక్షరాస్యుఁడు. సం. (అ.ఆ.అ.)=అక్షరముఖుఁడు.

అక్షరార్థము. సం. వి. అ. పుం. (అక్షర+అర్థ.) ప్రతిపదార్థము, శబ్దశక్తిచేతఁగలిగిన అర్థము.

అక్షరుఁడు. సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. శివుఁడు.—విశే. (అ.ఆ.అ.) నాశములేనివాఁడు.

అక్షవతి. సం. వి. ఈ. స్త్రీ. జూదము.

అక్షవాటము. సం. వి. అ. పుం. 1. జూదపుబల్ల; 2. జూదమాడెడి యిల్లు; 3. (జెట్లు పట్లుపట్టగా రథచక్రము నడచిన చోటువలె నలఁగిననేల.) జెట్లు సాదనచేయు చోటు.

అక్షాంతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఓర్వలేనితనము, ఈరసము; 2. ఓర్పులేమి.

అక్షావాపనము. సం. వి. అ. న. పాచికలు వేయుట.

అక్షావాపుఁడు. సం. వి. అ. పుం. అక్షములు వేయువాఁడు, జూదమాడువాఁడు.

అక్షి. సం. వి. ఇ. న. నేత్రము, కన్ను. (బ. సమాసమందు అకారాంతమగును. జలజాక్షుఁడు మొ. స్త్రీలింగమున ఈకారాంతమగును. జలజాక్షి మొ. అవ్యయీభావసమాసమందు అకా

రాంతమగును. సమక్షము, పరోక్షము, మొ.)

అక్షింతలు. వై. గ్రా. వి. బ.=అక్షతలు, "మ. పర దేశంబు విభుండు చన్న పిదపం బ్రాణేశ్వరార్కన్ నిరం, తరముం గోరుచు మేనుమాసి చెవులన్ లక్కాకులుం జేతులన్, సొరిదింగాజులు నల్ల పూసలు మెడన్ జూపట్టుచుండంగ సుం, దరి యక్షింతల బొట్టునుం బసుపు మోదంబందఁ దాల్పందగున్." రుక్మాం. ౪, ఆ. ౮౯.

అక్షికూటము. సం. వి. అ. పుం. కనుగ్రుడ్డు, నేత్ర తార.

అక్షిగతుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. కనఁబడు వాఁడు, కన్నులయెదుట నున్నవాఁడు. 2. (స్వరూపముతో కంటియెదుట లేకున్నను భావనావశమున కంటనున్నవాఁడు, లేక కంటిలో ముల్లువలె నున్నవాఁడు.) ద్వేషింపఁదగినవాఁడు. (శత్రువు.)

అక్షిగోళము. సం. = అక్షికూటము.

అక్షిజాహము. సం. వి. అ. పుం. (అక్షి+జాహ.) కంటిమొదలు.

అక్షితము. సం. విణ. (అ.ఆ.అ.) నశింపనిది.

అక్షితి. సం. వి. ఇ. స్త్రీ. 1. భూమిలేమి; 2. నాశములేమి.—విణ. (క్షితిలేనిది.) 1. నాశము లేనిది; 2. భూమిలేనిది.

అక్షిపటలము. సం. వి. అ. న. 1. కంటిపొర; 2. కంటిపొరకు సంబంధించిన రోగము.

అక్షీబము. సం. వి. అ. పుం. మునగ✤.

అక్షిభేషజము. సం. వి. అ. న. కంటిమందు. —పుం. న. (కంటిమందున కుపయోగించునది.) పట్టికాలోధ్ర, ఎఱ్ఱలొద్దుగ✤.

అక్షిభ్రువము. సం. వి. అ. న. కన్నును కనుబొమ్మయును. "వ. అనిన విని యయ్యంబుజాక్షి యక్షిభ్రువవిక్షేపవిభ్రమంబున ననాదరంబు దెల్పుచు నలవోకగా దిగీశసందేశం బాకర్ణించి యూరాజకుమారున కిట్లనియె." వై. ౪,ఆ. ౪౭.

అక్షీవము. సం. వి. అ. పుం. శోభాంజనము, మునగ ✤.

అక్షీబము. సం. వి. అ. న. తనకుఁదాన కలిగెడు సముద్రపు ఉప్పు.—పుం. మునగ ✤.—విణ. (అ.ఆ.అ.) క్రొవ్వనిది, బలియనిది.

అక్షుణ్ణము. సం. విణ. (అ.ఆ.అ.) (క్షుణ్ణముగానిది.) 1. బ్రద్దలు కొట్టఁబడనిది; 2. పరాజితముకానిది, జయించినది; 3. త్రొక్కఁబడినది. (మార్గము); 4. అభ్యస్తముగానిది; 5. అనుభవములేనిది.

అక్షోటము. సం. వి. అ. పుం. కొండగోనుగు✤.

అక్షోభము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగునుకట్టు కంబము; 2. కలఁతలేమి.—విణ. (అ.ఆ.అ.) క్షోభములేనిది.

అక్షోహిణి. సం. వి. ఈ. స్త్రీ. (అక్ష+ఊహ= అక్షోహ, అక్షోహ+ఇని.) = అక్షౌహిణి. "క. బాహుబలఘనుఁడు భీముఁడు, సాహసరసికాత్ముఁడయిన సాత్యకియుం మహోగ్రాహవభూమి సహస్రాక్షోహిణులట్లగుట మీరు సూడరె యెందున్." భార. ఉద్యో. ౧, ఆ. ౨౩౬.

అక్షౌహిణి. సం. వి. ఈ. స్త్రీ. (అక్ష + ఊహిని.) ఇరువదియొక్కవేలు నెనమన్నూట డెబ్బదిరథములు, అన్నియేనుఁగులు, అఱువదయిదువేలు నార్నూటపదిగుఱ్ఱములు, లక్షయుఁ దొమ్మిదివేల మున్నూటయేఁబండ్రు కాల్వురునుగల సేనావిశేషము. చూ. అక్షోహిణి.

అఖండము. సం. విణ. (అ. ఆ. అ.) 1. సమస్తము; 2. ఖండముకానిది, ముక్కలుగానిది, సంపూర్ణము. "అఖండ పుణ్యఫలము; అఖండసామ్రాజ్యము; అఖండతపస్సు."

అఖండితము. సం. విణ. (అ.ఆ.అ.) ఖండితముకానిది, ముక్కలుచేయఁబడనిది, సంపూర్ణము.

అఖండుకము. సం. వి. అ. పుం. పొట్టిటెంకాయ చెట్టు, చెన్నంగి ✤.

అఖాతము. సం.వి.అ.పుం. (మనుష్యులచేత) త్రవ్వఁబడని కోనేఱు మొ.—విణ. (అ.ఆ.అ.) త్రవ్వఁబడనిది.

అఖిల. సం.వి.ఆ.స్త్రీ. దున్నిననేల, బీడుపెట్టనినేల.

అఖిలము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అశేషము, అంతయు, సమగ్రము, సంపూర్ణము. "అఖిల శత్రుమండలము, అఖిలరాత్రి;" 2. ఖిలము కానిది. (వేదము మొ.); 3. భ్రష్టము కానిది.

అఖేటికము. సం. వి. అ. పుం. అనోకహము, వృక్షము, చెట్టు.

అగచరము. సం. వి. అ. పుం. వానరము, కోఁతి. —విణ. (అ.ఈ-రీ.అ.) **1.** చెట్టుపైఁ దిరుగునది; **2.** కొండపైఁ దిరుగునది.

అగచేట్లపోతు. దే. విణ. ఆపదలు పొందుటయే స్వభావముగాఁ గలవాఁడు, కష్టాత్ముఁడు. "సీ. ఆకతాయ బికారి యడిబండ గుండఁడు మొండి కట్టె గులాము మొప్పె గోప్పపోలె వాఁ డగచే ట్లపోతు దుర్మార్గుండు పడిసేటును గరాసు పంద లండి." హంస. ౫, ఆ. ౧౧౩.

అగచేట్లమారి. దే. = అగచేట్లపోతు.

అగచేట్లు. దే. వి. బ. (అగ్గము+చేటులు.) ఇడుమ, ఆపద, కష్టము. "వ. దైవమా,యిటువంటి యగచాట్లు పగవారికైనన్ దగవుసుమీ యని కన్నీరు నించువారును." ఉ. రా. ౬,ఆ. ౩౪౩. "వ. నిర్లజ్జనై యెట్లు మాటలాడుదు ననుభయం బునన్ బొడమ స్వేదకంపంబులతో నిన్నియగ చాట్లకు లోనయ్యుఁ దనవలెఁ బ్రాణంబుపై నాసం బూనిన మానవతులు గలరే." ఉ. రా. ౨, ఆ. ౨౧.

అగజ. సం. వి. ఆ. స్త్రీ. (పర్వతమునకుఁ బుట్టినది.) పార్వతి.

అగజము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** పర్వతమువలనఁ బుట్టినది; **2.** పర్వతమందుఁబుట్టినది.—వి. అ. న. శిలాజతువు, సిలాజిత్తు.

అగజాత. సం. వి. ఆ. స్త్రీ. పార్వతి, పర్వతపుత్రిక.

అగడిత. వై.వి.(సం.అఖాతము. క.అగల్త,అగటిత.) కోటచుట్టు త్రవ్వఁబడిన జలాధారము, పరిఖ.

అగడు. దే.వి. **1.** దూఱు, నింద. "సీ...ఆఱడియవ సడి యగ డారుదూఱు దూఱు దిసంతు...నా నపవాదసంజ్ఞ." ఆం. భా. ౧,కాం. వా. ౧౧౫; ఇట (ఆంధ్రపద పారిజాతకారుఁడు 'అగడారు' ఏకపదముగా గ్రహించెను. ఇది చింత్యము.); **2.** తొట్రుపాటు, కలఁత; **3.** నీటిదయ్యము, సెగడు.—విణ. నింద్యము. "తే. మగువకావున నిపుడు నన్నగడు సేసి." పంచ. నా. ౪, ఆ. ౪౬. శ. ర. చూ. అగడుసేయు.

అగడుఁగాకి. దే. వి. నింద్యుఁడు, పొగరుఁబోతు. "తే. ఆగడీలు మహాధూర్తు లగడుఁగాకు, లుద్ధతులుఁ గొంట్లు పలుగాకు లుదురుమిడుకు, లాక తాయలు." హర. ౫, ఆ. ౧౦.

అగడుపడు. ద్వి. అ. క్రి. **1.** దూఱుపడు, నింద పడు. "తే. గుట్టు నానయు విడనాడి కొంగు పఱచి, యగడుపడి పడిచి పడసినట్టి పసిఁడి, కటకటా! యేమిటికి నెక్కెఁ గడనవంక, నేమి గంటిని దొడుసు నాకేల యనుచు." వి.ప్ర. ౩, ఆ. ౧౭; **2.** తొట్రుపడు, కలఁతనొందు. "క. బెగడు వలదనుచు బెట్టిద, మగు నెవ్వగ నగడు పడుచు నాఁడుపడుచు లే,పగ వారికి వలదన నా, పగవారికి నేల యొసఁగెఁ బద్మజుఁ డనుచున్." వసు. ౬, ఆ. ౬౯.

అగడుసేయు. దే. స. క్రి. **1.** నిందించు; "తే. మగువ కావున నిపుడు నన్నగడుసేసి, యేమి పన్నెనో." పంచ. నా. ౪, ఆ. ౪౬; **2.** నిరాక రించు, నిరసించు. "వ. వేదంబు ప్రమాణంబు గాదనియును నాగమంబుల నగడుసేసియు ధర్మం బుల మర్మంబు లుచ్చిపోనాడియు." నై. ౭, ఆ. ౨౨.

అగడ్త. వై. = అగడిత.

అగణేయము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** లెక్కింప శక్యముకానిది. "మ. తగు విద్వద్గుణరూపశోభి తునిఁగా ధన్యంబులై యెవ్వరిం, బొగడున్ లోక ము లట్టి సంయమికులాంభోరాశి పూర్ణేందువు, న్నిగమైకేశ్వరు నేమెఱింగితిమి నిన్ శ్రీజాను దగున్న య్యండుగా, నగణేయరబులు నీ ప్రభావములు భవ్యంబుల్ సుధాసేవ్యముల్." హరి. ఉ. ౧, ఆ. ౩౫; **2.** ఎంచఁదగనిది, గణింపఁదగనిది; **3.** పనికిమాలినది.

అగణ్యము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** గణింపశక్యము గానిది; **2.** గణింపఁదగనిది, ఎంచఁదగనిది; **3.** అకించిత్కరము, ఎందులకును బనికిరానిది.

అగతి. సం. విణ. ఇ. **1.** సంచారములేనివాఁడు; **2.** ఉపాయములేనివాఁడు; **3.** జీవనాధారము లేనివాఁడు; **4.** ఉత్తరగతి లేనివాఁడు.—వి. ఇ. స్త్రీ. **1.** గమనము లేమి; **2.** ఉపాయములేమి; **3.** జీవనాధారము లేమి.

అగతికము. సం. విణ. (అ.ఆ.అ.) చూ. అగతి

కుఁడు. **1.** వేఱొకగతిలేనిది, ఉపాయాంతరములేనిది; **2.** తప్పనిది, ఆవశ్యకము.

అగతికుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) **1.** వేఱొకగతి లేనివాఁడు, ఉపాయాంతరము లేనివాఁడు; **2.** జీవనాధారము లేనివాఁడు; **3.** గమనము లేనివాఁడు.

అగత్యము. వై. విణ. (సం. అగతికమ్. ప్రా. అగతి అ. దీనినుండి అగత్తెము, అగత్తియము, అగత్యము, అనురూపములు తెనుఁగున నేర్పడియుండును. ఇవి వాడుకలోనివి.) ఆవశ్యకము.—వి. ఆవశ్యకత.—క్రి. విణ. తప్పక.

అగదంకారుఁడు. సం. వి. అ. పుం. (రోగము లేనివానినిగఁ జేయువాఁడు.) వైద్యుఁడు, వెజ్జు.

అగదగులు. దే. అ. క్రి. **1.** సమావేశమగు, కలియు, తటస్థమగు; **2.** కనఁబడు.

అగదము. సం. వి. అ. పుం. ఔషధము, మందు. —విణ. (అ. ఆ. అ.) **1.** రోగము లేనిది; **2.** మాటలాడనిది, సంభాషింపనిది.

అగప. దే. వి. **1.** కొయ్యగరిఁటె, అబక, డోకి; **2.** తెడ్డు.

అగపడు. ద్వి. అ. క్రి. (అగ్గము+పడు.) **1.** అధీనమగు, లోనగు. "ద్వి. భవబాధలకు నగపడకుండు బొస, విషయేంద్రియములకు వెన్నీని బొస." బస. ౨, ఆ. 33 పు. "వ. పాంచాలివలనితగులు చిత్తంబు నుత్తలపఱుపం దలరి నెవ్వగల కగపడి తలపోఁతలకుం జొచ్చి." భార. విరా. ౨, ఆ. ౮౨. "క. ముంగికి గూబకు నగపడి, యంగంబులు వడఁకుచున్న యవి." భార. శాం. 3, ఆ. ౨౦౨; **2.** లభించు, అందు, దొరకు. "క. తగు సంతసింపఁ గుజనుల, కగపడని విశిష్టగతికి నస్మద్దివ్యా, శుగములచేఁ బోఁగను టకు, విగతభయత్వంబు సమరవిధి కొప్పఁగదా." భార. ద్రో. ౧, ఆ. ౨3౭; **3.** కనఁబడు, గోచరమగు. "సీ. బంధుల కగపడ్డఁ బాయు నన్వయమను కలఁకమైఁ జేమటలు గ్రమ్ము దేఱ." భార. విరా. ౨,ఆ.౭౦. "ద్వి. బగుతుల పాదుకాప్రతతులు నాకు, నగపడె నంచు నందండ మ్రొక్కుచును." బస. ౧, ఆ. ౨3 పు.

అగపాటు. ద్వి. వి. (అగపడుట.) **1.** లొంగుట. "క. తన యగపా టొరు లెఱుఁగుదు, రని సూతుఁడు సమయభంగ మగుటకు భీముం,డును గొంకుచుఁ జప్పుడు సే, యని గూఢవిమర్దన ప్రహారములఁ దగన్." భార. విరా. ౨, ఆ. 3౪౫; **2.** కనఁబడుట, గోచరమగుట. "క. మనశస్త్రాస్త్రంబులు ద,క్కినయవి యొకభంగి పీటికిని గాండివముం, గొనిపోయితి మేని సుయో,ధనునకు నగపాటు నిశ్చితం బూహింపన్." భార. విరా. ౧, ఆ. ౧౫౮.

అగమము. సం. వి. అ. పుం. (ఉన్నచోటనుండి జరుగనిది.) **1.** కొండ; **2.** చెట్టు; **3.** (వక్రముగా పోవునది.) పాము; **4.** వసనాభి.

అగము. సం. = అగమము.

అగమ్యగోచరము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** పొందశక్యము గానిది; **2.** తెలియశక్యము గానిది; "దేశభావిస్థితి అగమ్యగోచరముగా నున్నది." (అగమ్యాగోచరమని వాడుక. అగమ్యము, అగోచరము అని యన్వయించుకొనవచ్చును.)

అగమ్యము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** సంచరింపఁదగనిది; **2.** సంచరింపశక్యముకానిది; **3.** పొందఁదగనిది; **4.** పొందశక్యముగానిది.

అగరి. సం. వి. ఈ. స్త్రీ. **1.** దేవతాడము ⚘; (ఇది ఎలుకవిషమును హరించును.) **2.** విషమునకు విఱుగుడైన పదార్థము.

అగరు. దే. వి. పొగరు, గాటు. "ఈమందుయొక్క అగరు తగిలి కన్నులు మండుచున్నవి."

అగరువు. సం. వి. ఉ. న. చందనవిశేషము, అగలు.

అగలము. దే. వి. (క. అగల.) విస్తృతి, వైశాల్యము. "క.అప్పర్వతంబు యామ్యక,కుప్పునఁ బురికామరూపకోటుల కిరవౌ, ముప్పదినలువదిరెండును, నప్పురికిని యోజనంబు లగలముఁ జూపున్." వరా. ౧౦, ఆ. ౧౪౨.

అగలు. దే. అ. క్రి. **1.** భేదిల్లు; **2.** వెల్లగిల్లు. (చూ. అగలుచు.)—వై. వి. అగరువు.

అగలుచే. దే. ప్రే. = అగల్చు.

అగలుసత్తు. వై. వి. గంధద్రవ్యవిశేషము.

అగలుసొంటి. వై. వి. పాఠ ⚘.

అగల్చు. దే. ప్రే. 1. భేదించు. "ఉ. గర్వమెలర్పఁ జేరుర మగల్చిన...." జై. ౬, ఆ. ౧౪౫; 2. వెల్లగించు."సీ....అం,గద గొని మెదళు లగల్చి కొనుచు......" భార. స్త్రీ. ౨, ఆ. ౯.

అగవాళ్లు. దే. వి. బ. ఒంటి అట్టచెప్పులు.

అగవు. దే. వి. వివాహాదులందు తెచ్చెడు కానుక లేక బహుమానము."సీ....వధూటుల కల్లుఁడను చు,నగవు దగవులటంచు నెయ్యంబులంచు, నంపకములంచు మఱియెన్నియైన కలవు." కువల. 3, ఆ. ౬౫. "తే. అల్లుఁడని యాఁడుబిడ్డని యగ వుకగవు, లంపకము శుభశోభనమని." దశా. ౯, ఆ. (అగవునకు ప్రత్యేక ప్రయోగము కనఁబడలేదు.) ఇట 'కార్యము, పని' అని శ. ర.

అగసాలి. ద్వ. = అగసాలె.

అగసాలె. ద్వ. వి. (అగ్గము+సాలె.) (తనవశము ననే తనదుకాణ ముంచికొని పనిచేయువాఁడు. పరులయిండ్లకుఁ బోక స్వతంత్రముగా జీవించు వాఁడు అనియుఁ జెప్పవచ్చును.) కమసాలె, బంగారునగలు, వెండినగలు చేయువాఁడు. "తే. బొమ్మయను పేరి యగసాలె పూఁటచెలిని, గోరి యలరించుటకుఁ జద ల్గుదుటఁగాఁచి, నీటముంచిన మేటివన్నియపసిండి, పూదెయనఁ గ్రుంకుఁగడలిలోఁ బొద్దు వ్రాలె." నీలా. 3, ఆ. 3.

అగస్తి. సం. వి. ఇ. పుం. 1. అగిసె✤.; 2. =అగస్త్యుఁడు.

అగస్త్యము. సం. వి. అ. పు. అగిసె✤.

అగస్త్యమూత్రము. సం. వి. అ. న. సముద్రము, కడలి. (అగస్త్యుఁడు సముద్రమును ఆచమించి మూత్రద్వారమున విడిచిపెట్టెనని పురాణగాథ.)

అగస్త్యుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకముని. (ఇతఁడు వింధ్యపర్వతము నణఁచెను; సముద్రము నాచమనము చేసెను.)

అగస్త్యోదయము. సం. వి. అ. పుం. దక్షిణదిక్కునందు నక్షత్రరూపముగానున్న యగస్త్యుని యుదయము. భాద్రపదమాసమున జరుగును. అగస్త్యోదయమయినపుడు నదులలోని జలము తేటగా నగును.

అగాడీ. హిం. క్రి. విణ. ముందర.—వి. గుఱ్ఱము ముందుకాళ్లకు కట్టు త్రాడు. అని శ. ర.

అగాదు. దే. వి. 1. అగాధమగుధ్వని, గంభీరధ్వని; 2.తుపాకి, ఫిరంగిలోనగు నవి ప్రేలుట. "చ.ఒకతి యను లోహకారకుఁ డుదగ్రతఁ బశ్చిమశైల శృంగముం, గుఱిగొని వేలుపుంజెరువు గొప్ప ఫిరంగిని జాయమందుతోఁ, గొఱలెడు విన్ను మానికపుగుండు ఘటించి యగాదుచేసినన్, దఱచుగఁ గ్రమ్ముకొంబొగ లనంగ జగంబునఁ బర్వెఁ జీఁకటుల్." రసి. ౪, ఆ. ౯౫. ఇట తుపాకి, ఫిరంగి లోనగువానియందు నిప్పుఁ దగిలించుట అని శ. ర.

అగాధము. సం. వి. అ. పుం. న. లోఁతైనరంధ్రము.—విణ. (అ.ఆ.అ.) 1. అతిగంభీరము, మిక్కిలి లోఁతైనది: 2. దుర్బోధము, తెలిసికొనశక్యము గానిది.

అగారము. సం. వి. అ. న. గృహము, ఇల్లు.

అగావు. దే.వి. 1. కువవ,అధి. అసి. శ.ర; 2. నింద. "లేనిపోని అగావులు వేయుట మంచిదికాదు." —అవ్య. అకస్మాత్తుగా. "దొంగ లూరిమీఁద నగావుగా వచ్చి పడిరి."

అగిని. వై. వి. అగ్ని. "ద్వి. దిగనిలభానువార్ధిపులు నశ్వినులు, నగిని యింద్రుఁ డుపేంద్రుఁ డమిత్ర విధులు." భాగ. ౨, స్క౦.

అగిసియ. వై. వి. అగిసె, అగస్తి✤.

అగిసె. వై. వి. అగిసియ.

అగు. దే. అ. క్రి. (క. అగు, ఆగు. త. ఆ.) 1. విధేయవిశేషణమునకు అనఁగా విశేష్యము తరువాత నుపయోగించెడు విశేషణమునకు అన్వయసంపూర్తికి నుపయోగించు క్రియ. "వాఁడు సదాచారుఁ డయ్యె;" 2. విశేషణమునకు విశేష్యమునకు అన్వయము కలుపుటకై యుపయోగించును. అప్పుడు క్రియాజన్య విశేషణముగానే యుండును. "ధర్మపరుండగురాజు;" 3. పరిణమించు, మాఱు; "సీ. ఒకమాటతప్పు గావక యహల్యాదేవి నష్టపాదుఁడు ఱాయి యగు మనండె." శివ. మా. 3, ఆ. ౧౭౯; 4. తగు, అర్హమగు; ఆవశ్యకమగు; "క...కార్యజ్ఞానో,దారుఁడ వగు నీ వొచ్చి, త్యారూఢముగాఁగఁ జెప్పు మగుసమయమునన్." భార. అశ్వ. ౧, ఆ. ౧౪౭; "తే. అగ్రమూర్ధజాగ్రన్నిభృతాపదంధు, బంధుసంరక్షణముపాడి

బాంధవులకు, సైనకార్యంబుఁ గానికార్యమును దెలిసి, యూఁడుఁడా యేను." సై. 3, ఆ. ౧౪౧; **5.** కలవాఁడగు. "తే. ధర్మజుఁడు రాజసూయం బుఁ జేర్మిఁజేసి, నంతనుండియు నమ్మహితాధ్వర మున,యం దభిప్రాయమైయుండు నొంద నాకు, నమ్మఖంబు సేయింపవే యనఘ నన్ను." భార. అర. ౬,ఆ. ౬౮; అభిప్రాయమైయుండు = అభి ప్రాయము కలవాఁడయియుండు. ఇట్టిచోట సకర్మకక్రియగాను అన్వయింపవచ్చును; **6.** నెఱవేఱు, సిద్ధించు. "తే. కార్యమగుటయు నరిగె దుగాక పిదప, నిల్వు మంతకు ననుటయు నీవు నన్నుఁ, గదియకుండెదవేని నిల్చెద నధర్మ, వృత్తి వగుమని వారించె నత్తపస్వి." భార. అను. ౨, ఆ. ౨౦; **7.** సిద్ధమగు. సీ.... శిఖి... రాజిన రవులుకోల్ వాసాలఁగాని కల్గదు మఱి దానఁ గలిగె, నేనిఁ గూడగుట మం దయినఁ బెన్బొగ సుఖభుక్తి సేకూరదు...." ఆము. ౪, ఆ. ౧౨౭; **8.** సంపూర్ణమగు. "పుస్తకము వ్రాఁత యైనది; భోజనములైనవి; చదువులయినది" (అయినది= పూర్తియైనది;) **9.** ఓపు, సమర్థుఁడగు, చాలు. (పాండవులు) "క. పరిచారకులై యుండుదు, రరివర్గవ్యతికరమున కగుదురు పీరిన్, నరిఁ దన కొడుకుల మెలపిన, తెరువున మెలఁగింపవలదె ధృతరాష్ట్రునకున్." భార. ఉ. ౧, ఆ. 3౪౯; **10.** ఉండు, జీవించియుండు. "వ. అనిన విని కర్ణుండు గమలనాభునిపెంపును బార్థుబలిమియు నెఱుంగక యేనేల వారిఁ దోడరెద నెట్లు సెప్పి నను దోడరుదుఁ దోడరి వారొండె నేనొండె నగుదు మింతియ నీవు వెడమాటలాడక యుండుగు మని పలికి." భార. కర్ణ. ౨, ఆ. ౮౭; **11.** జరుగు. "వారియింట పెండ్లియగుచున్నది." —స. క్రి. **1.** కలుగు. "క. అఱువుఁడుఁ గావిముసుంగును,విఱిగినదండంబుఁ దునిసి వ్రేలెడు గోచిక్, బఱియలయినకరకమునయి, చుఱచుఱఁ జూఁడెడు తెఱంగుచూపులతోడక్." ఉ. హరి. ౪, ఆ. ౭౯. (ఇట్టిచోట కలవాఁడగు అని అ. క్రి. గాను అన్వయింపవచ్చును;) **2.** పొందు, ప్రాపించు. "సూర్యుఁడుదయమయ్యె" (=సూర్యుఁ డుదయమును పొందెను). ఇట్టిచోట ఉదయము కలవాఁడగు అని అకర్మకముగాను అన్వయింప వచ్చును. ఉదితుఁడగు అని భావము. రూ. అవు, ఔ.—అవ్య. ద్రు. అంగీకారమును తెలుపును, అవును, ఔను, ఔ. "క. అగునదియట్టిద." భార. విరా. ౧, ఆ. ౬౩. వ్యతి. కా.

అగుఁగదే. దే. అవ్య. (అగును+కదే.) **1.** ఆశ్చర్యమును తెలుపును; చూ. ఔఁగదే; **2.** అవును కాదా (నిశ్చయార్థము తెలుపును.)

అగుఁగాక. దే. అవ్య. (అగును+కాక.) ఆశీరాద్యర్థములను తెలుపును.

అగుఁగాత. దే. = అగుఁగాక.

అగుఁబొమ్ము. దే. అవ్య. (అగును+పొమ్ము.) సరే, అంగీకారమును తెలఁపును, సరేపో. "క. అని చెప్పిన విని యగుఁబొ, మ్మని కైకొని." భార. విరా. ౧, ఆ. ౧౧౪.

అగుగామి. దే. వి. అగుటయు కాకపోవుటయును. అగుగాములు అనుట యుక్తము. "వ. అతండు ముక్తుండగుగామి గని కొనుతలంపున." భార. శాం. ౬,ఆ. ౧౭౧. 'అగుటయుం గామియుం' అని పాఠాంతరము.

అగుణము. సం. విణ. (అ. ఆ. అ.) గుణము లేనిది. —వి.అ. పుం. **1.** గుణము లేమి; **2.** దోషము. "గుణాగుణములఁ పరిశీలింపకుండఁగ మాటలాడ రాదు."

అగుదెంచు. దే. అ. క్రి. (అగు+తెంచు.) **1.** అగు. "అంతసరోరుహాప్తుఁ డుద,యంబగుదెంచె." నిర్వ. ౬, ఆ. ౮౭. (అరుదెంచె పాఠాంతరము.) "చ. తడ వగుదెంచె జమ్మికిఁ బ్రదక్షిణవృత్తిగఁ జేరు వోవని, మ్మెడఁ గలుగంగఁ బోయె." భార. విరా. ౪, ఆ. ౧౭౧. (ఇట స్వార్థమున తెంచు;) **2.** కావచ్చినదియగు, కానున్నది యగు. "మధ్యాక్కర. ఏ నేఁడు లగుదెంచె నర్జునుండేఁగి యింత కేతెంచుఁ, బూని దివ్యాస్త్రముల్ వడసి యమ్మహాభుజు భూరిసత్త్వు, నానతరిపువర్గుఁ జూడఁగాంతు." భార. అర. ౪, ఆ. 3.

అగుర. దే. అవ్య. (అగును+ర.) ఆశ్చర్యమును తెలుపును. రూ. అవుర, ఔర.

అగురగుర. దే. అవ్య. (అగుర + అగుర.) అగుర యొక్క ఆమ్రేడితరూపము. "క. అగురగుర

ముఖరముఖుఁడై, జగము వినం దనబలంబు చాటె సముద్రుం, డొగి బిరుదు దక్కఁడయ్యెఁ, సగర కుమారులుగదా ప్రశంసార్హతముల్." రామా. ౭, ఆ. ౩౯. రూ. అవురవుర, ఔరౌర.

అగురా. దే. అవ్య.=అగుర. రూ. అవురా, ఔరా.

అగురు. దే. వి. అవురుగడ్డి, వీరణము.

అగురువు. సం. వి. ఉ. న. ఇరుగుడు♆.—పుం. న. అగలు, చందనవిశేషము. "మ....రత్నవ్రాతముల్ చందనా,గురుకాష్ఠాదులు గప్పముల్ గొనియోఁ బెక్కుల్ పేర్మితో నుర్వరా, మరలక్ష్మీకరుఁడైన." భార. సభా. ౧,ఆ. ౨౬౪.—విణ. (ఉ. ఈ-ర్వ్. ఉ.) **1.** గురువుకానిది, బరువులేనిది, తేలికయైనది; **2.** గురువులేనివాఁడు; **3.** గురువుకానివాఁడు; **4.** (దేనికంటె గురువైనది లేదో అది.) మిగుల బరువైనది.

అగురుశింశుప. సం. వి. ఆ. స్త్రీ. (తేలికయైన రసము గల శింశుప.) ఇరుగుడులో భేదము ♆.

అగుర్వు. దే. విణ. (క. అగుర్వు. అగుర్వ.) **1.** గొప్పది, అధికము. "చ....అరుణపరాగ మంబరమునందుఁ గడల్కొన్నఁ బుష్పవృష్టిపైఁ, గురిసెఁ బురారిసూతికి నగుర్వుగఁ దారకు నోర్చి మాకుఁదా, నిరతము దారకాహ్వయము నిల్పినవాఁడని రాగభాతి విస్తరముగఁ బెల్లుతో నెఱఁగు తారకపంక్తియొ నా వెలుంగుచుక్." కు. సం. ౧౨, ఆ. ౧౮౯; **2.** భయంకరము.

అగుర్వ. దే. = అగుర్వు. "ఉ. అక్కజమై మహార్థనివహంబు సదుక్తులు మెచ్చఁ జూచినం, గ్రుక్కిఁడమైన సత్కృతి యగుర్వగుఁ గా కిలఁజీకు లావుకక్, ద్రొక్కినయట్లు నోరఁగొలఁదు ల్పురికొల్పఁగ నందులోన నొక్కొక్కఁడు సక్కనైనకృతియుం గృతియందురె వాని మెత్తురే." కు. సం. ౧, ఆ. ౩౮.

అగులు. దే. అ. క్రి. ఊడు. "వ. శిరంబుల నొగిలించియు సీసకంబుల నగిలించియు." భాగ. ౬, స్కం. ౩౭౦.

అగూఢగంధము. సం. విణ.(అ.ఆ.అ.) రహస్యముగా దాఁపశక్యముగాని గంధము గలది, అణఁచిపట్ట వీలులేనివాసనగలది.—వి. అ.పుం.హింగువు.

అగోచరము. సం. విణ. (అ. ఆ. అ.) గోచరము కానిది, కానరానిది.

అగౌకసము. సం. వి.స్. పుం. **1.** పక్షి; **2.** సింహము; **3.** శరభము.—విణ. స్.**1.** చెట్టు నివాసముగాఁగలది; **2.** పర్వతము నివాసముగాఁ గలది.

అగ్గపడు. ద్వ. (అగ్గము+పడు.) = అగపడు.

అగ్గపాటు. ద్వ. = అగపాటు.

అగ్గము. దే. విణ. **1.** అధీనము, చేతికి అందినది. "మ. పెనుపారక్ వరమిచ్చి పట్లు గడిమిక్ భీమాగ్రజుండాజిఁ గిట్టినఁబట్టం గడు నగ్గమైనయెడఁ గ్రేడిం తెప్పు నిట్లైనఁ జా,లని వాఁడందురు నిన్ను నన్నుఁ గుటిలాలాపంబులక్ వెట్టఁజే,సిన నీకైనది యేమి యాశ్రితగుణశ్రేష్ఠుండు వంచించునే." భార. ద్రోణ. ౧, ఆ. ౩౧౧. "క. ఈయెడ ననుఁ గని వారణ, సేయుడు నితఁ డగ్గమైనఁ జిచ్చుఅపిడుగై,పోయి పయిఁ బడుదు నీ వర,వాయించుకలేక పఱపవలయు రథంబుక్." భార. విరా. ౫, ఆ.౧౪; **2.** అనుకూలము, వీలు. "ఆ. వినమె యిట్లువడిన వీరలు పదపడి, తమకు నగ్గమైనతఱి జయింప, రెట్లు ప్రబలి రిపుల నీవును నాపద, కోర్చి భంగపాటు దీర్చికొనుము." భార. విరా.౧, ఆ. ౫౪; **3.** కనఁబడినది, దృష్టము. "సీ. ఇది దుశ్చరిత్రనా నెవ్వత చరియించు నట్టి బ్రాహ్మణి మీకు నగ్గమైన."భో. ౩, ఆ. ౧౧౭; **4.** సమావేశమయినది, అగదగిలినది.

అగ్గలము. దే. విణ. వెగ్గలము, అధికము. "చ..... ఆమునీంద్రుఁ డ, త్యలఘుఁడు వారిమాటకు భయంపడ కెంతయుఁ బ్రీతితోడ న,గ్గలముగఁ జేసె భోజనముఁగంతముదాఁతనకుంతవీర్యుఁడై."భార. అర. ౨,ఆ. ౩౪౪. "సీ. కుక్షింభరిత్వంబు కొలఁదికగ్గలముగాఁ, గూడెంత పెట్టినఁ గుడుచువారు." సై. ౭, ఆ. ౫౩. "క. విలువిద్యనొరులు నీక,గ్గలముగ లేకుండ నిన్నుఁ గఱపుదు." భార. ఆది. ౫,ఆ. ౨౩౯. ఇట 'అధికుఁడు, మించినవాఁడు' అని భావము.

అగ్గలించు. దే. అ. క్రి. **1.** అతిశయించు; **2.** పూను, ఉత్సహించు. "ఉ....అ,క్షీణబలంబునం గవియు సేనకు మార్కొన నగ్గలించితే." భార. విరా. ౫, ఆ. ౨౭౯.

అగ్గలిక. దే.వి. 1.ఆధిక్యము,అతిశయము. "ఉ. అచ్చెరువైన విక్రమము నగ్గలికన్." భార.విరా.౪,ఆ. ౧౮౧;2. పూనిక, ఉత్సాహము, విజృంభణము. "వ.అక్కుమారుండును నాయతంబైన నొగలెక్కి పగ్గంబు లమర్చికొని యగ్గలికతోడం దురగంబు లయంగంబులు దొడయుచు." భార. విరా. ౪, ఆ.౧౭౦. "ఆ.అనినసట్లకాక యని సర్వసేనాధి, పత్యభారపట్టబంధమునకు, నియ్యకొనియె భీష్ముఁ డయ్యగ్గలికఁ గొని,యాడె విభుఁడు ప్రముదితాత్ముఁడగుచు." భార. ఉద్యో. ౪, ఆ. ౧౫౫; 3. శౌర్యము. చూ. అగ్గలికము.

అగ్గలికము. దే.=అగ్గలిక. "సీ.... పేర్చిన యగ్గలికంబున నాసూతనందనుఁ డతనిసూతుఁ, జంపి కేతువుఁద్రుంచి శాతశరంబుల నంగంబు నొప్పించె." భార. కర్ణ. ౨, ఆ. ౧౯౧. ఇట శౌర్యము అని అర్థము.

అగ్గి. వై. వి. నిప్పు, అగ్ని. "క. అగ్గలిక దూఁడి దరికొను, నగ్గి తెఱం గమర." భార. భీష్మ. ౨, ఆ. ౧౬౩.

అగ్గించు. వై. స. క్రి. పొగడు, స్తుతించు.

అగ్గింపు. వై. వి. అగ్గించుట, స్తుతి.

అగ్గికంటి. ద్వ. వి. ముక్కంటి, శివుఁడు.

అగ్గిచూలి. ద్వ. వి. అగ్నిపుత్రుఁడు, కుమారస్వామి.

అగ్గువ. వై. వి. వెలతక్కువ, చౌవుక అని శ. ర. అధికము, ఎక్కువ అని కొన్నిచోట్ల వాడుక.

అగ్నాయి. సం. వి. ఈ. స్త్రీ. అగ్నిభార్య, స్వాహాదేవి.

అగ్ని. సం. వి. ఇ. పుం. 1. పంచభూతములలో మూఁడవది; 2. దివ్యము, జలము మొదలగు వానినుండిపుట్టు బడబాగ్ని పిడుగు మొదలయినది; 3. జఠరముననుండి తిన్నపదార్థమును జీర్ణము గావించుశక్తి; 4. కఱ్ఱ మొదలగువాని రాపిడివలన పుట్టునిప్పు; 5. యజ్ఞమున అగ్నిహోత్రశాలయం దుంచఁబడు త్రేతాగ్నులలో నొకటి. (త్రేతాగ్నులు : ఆహవనీయము, దక్షిణాగ్ని, గార్హపత్యము. వీనితో సభ్యము, అవసథ్యము అనునవి కలిసిన పంచాగ్నులనఁబడును.); 6. మూఁడు సంఖ్యకు సంకేతము; 7. బంగారము; 8. చిత్రమూలము; 9. నల్లజీడి.

అగ్నికణము. సం. వి. అ. పుం. స్ఫులింగము, అగ్నినుండి జాఱిన చిన్నచిన్నరవలు, నిప్పుకలు.

అగ్నికాష్ఠము. సం. వి. అ. న. (అగ్నిని ఉద్దీపించునది.) 1. అగరు చెక్క; 2. అగ్గిపుల్ల.

అగ్నికుండము. సం. వి. అ. న. అగ్నిని ఆరాధించుటకై యేర్పఱచిన కుండము (గోయి.)

అగ్నికుమారుఁడు. సం. వి. అ. పుం. (అగ్నికి పుత్త్రుఁడు.) కుమారస్వామి. ఇట్లే అగ్నిసుతుఁడు, అగ్నితనూజుఁడు, మొ.

అగ్నికేతువు. సం. వి.ఉ. పుం. (అగ్నికి జెండావంటి చిహ్నము.) ధూమము, పొగ.

అగ్నికోణము. సం. వి. అ. పుం. అగ్నిదేవతాకమగు దిక్కు, తూర్పుదక్షిణముల నడిమిదిక్కు, ఆగ్నేయదిక్కు.

అగ్నిగృహము. సం. వి. అ. న. అగ్నిహోత్రశాల.

అగ్నిచిత్తు. సం. వి. త్. పుం. 1. మంత్రపూర్వకముగా అగ్నిస్థాపించినవాఁడు; 2. అగ్నిచయనము అను క్రతువుచేసినవాఁడు, చయనులు.

అగ్నిగ్రంథము. సం. వి. అ. పుం. అగ్నిప్రతిపాదకగ్రంథము, అగ్నిహోమాదులను గుఱించి చెప్పు శాస్త్రము.

అగ్నిజ్వాల. సం. వి. ఆ. స్త్రీ. 1. నిప్పుమంట; 2. ఆరెకు.

అగ్నిదృక్కు.సం. వి. శ్.పుం. (అగ్గికంటి.) శివుఁడు.

అగ్నిబీజము. సం. వి. అ. న. 1. బంగారము; 2. (అగ్నిదేవతాకమగు) 'రమ్' అనుబీజాక్షరము.

అగ్నిభట్టారకుఁడు. సం. వి. అ. పుం. (అగ్ని+భట్టారకుఁడు.) అగ్నిదేవుఁడు. "వ. అట్టి యేను సర్వభక్షకుండనై యశుచినైనఁ గ్రియానివృత్తియగుఁ గ్రియానివృత్తియైన లోకయాత్ర లేకుండునని యగ్నిభట్టారకుండు నిఖిల లోక వ్యాప్తంబైన తనతేజోమూర్తి నుపసంహరించిన." భార.ఆది. ౧, ఆ. ౧౪౦.

అగ్నిభువు. సం. వి. ఊ. పుం. అగ్గిచూలి, కుమారస్వామి.

అగ్నిమంథము. సం. వి. అ. పుం. 1. అగ్నిని మథించుట, కఱ్ఱను కఱ్ఱను రాపాడించి నిప్పు గలిగిం

చుట; 2. (కఱ్ఱలరాపిడివలన శీఘ్రముగా అగ్నిని గలిగించునది.) శ్రీపర్ణము, సెల్లి⚘.

అగ్నిమాంద్యము. సం. వి. అ. న. 1. అగ్ని మందకుండుట; 2. (జఠరాగ్ని మందగించుట.) జఠరాగ్నికి జీర్ణము చేయు శక్తి లేమి, అజీర్తి.

అగ్నిముఖము. సం.వి. అ. పుం. న. 1. శుభకార్యాదుల యారంభమున చేయు హోమము. "కం. ఆతనియజ్ఞంబునఁ బురు, హూతపురస్సరమరుద్గణోత్తము లధిక ప్రీతిఁ జనుదెంచి హవ్యము, లాతతహస్తములఁ గొందు రగ్నిముఖమునన్." భార. ఆది. ౫, ఆ. ౭౯. "వ. యాజ్ఞికు లగ్నిముఖంబు సేసి వేల్వం దొడంగిన." భార. ఆది. ౨, ఆ. ౨౧౦; 2. జీడి⚘.

అగ్నిముఖి. సం. వి. ఈ. స్త్రీ. 1. (అగ్నివంటి అగ్రముగలది.) భల్లాతకి, జీడి⚘; 2. (అగ్నివలె మండుచుండు ద్వారము గలది.) మహానసము, వంటయిల్లు; 3. గాయత్రి.

అగ్నిముఖుఁడు. సం. వి. అ. పుం. 1. (అగ్నిముఖముగాఁగలవాఁడు. హోమము చేయఁబడిన హవిస్సును అగ్నిమూలమున గ్రహించువాఁడు.) ఇంద్రాది దేవత, వేల్పు; 2. (అగ్ని ప్రధాన దేవతగాఁగలవాఁడు.) బ్రాహ్మణుఁడు.—విణ. (అ. ఈ-ఇ. అ.) 1. అగ్నిముఖముగాఁగలవాఁడు; 2. అగ్ని మొట్టమొదటివాఁడుగాఁగలవాఁడు.

మగు అగ్నిష్టోమమను సామముతో సమాప్తియగు యాగము). వసంతకాలమున అయిదుదినములు చేయవలసిన యాగవిశేషము. ఈ యాగము చేసినవానికి సోమయాజియని పేరు.

అగ్నిష్ఠము. సం. వి. అ. పుం. (అగ్నిమీఁద నుంచుటకుఁ దగినది.) పెనము మొదలగులోహపాత్ర.

అగ్నిష్వాత్తుఁడు. సం. వి. అ. పుం. పితృదేవతలలో నొకఁడు. ఈతఁడు మరీచికి పుత్రుఁడు. "అగ్నిష్వాత్తాదిపితృదేవతలు."

అగ్నిసాక్షికము. సం. విణ. (అ. ఆ. అ.) అగ్ని సాక్షిగాఁ గలది; అగ్ని సాక్షిగానుంచి చేసినది. "అగ్నిసాక్షికమగు సఖ్యము."—వి. అ.న. అగ్ని సాక్షిగాఁ గలుగుట; అగ్నిసాక్ష్యము. "చ. అనినఁ బ్రతీపుఁడిట్లనియె నంబురుహానన యగ్నిసాక్షికం, బునఁ బరిణీతవైనసతి." భార. ఆది. ౪, ఆ. ౧౩౮.

అగ్నిస్తంభము. సం. వి. అ. పుం. 1. దహనశక్తిని నిరోధించుట; 2. దహనశక్తిని నిరోధించు మంత్రము, ఓషధి, మొ.; 3. దాహకశక్తిని నిరోధించువిద్య.

అగ్నిహోత్రము. సం. వి. అ. పుం. అగ్ని.—న. 1. మంత్రపూర్వకముగా అగ్నిని స్థాపించి అగ్నికొఱకు చేయు హోమము; 2. అగ్నిహోత్ర కర్మమందలి పదార్థము, హవిస్సు.

అగ్రజ. సం. వి. ఆ. స్త్రీ. (ముందుపుట్టినది.) అప్ప, జ్యేష్ఠభగిని.

అగ్రజన్ముఁడు. సం. వి. న్. పుం. **1.** (లోకములకు ముందుపుట్టినవాఁడు.) బ్రహ్మ; **2.** (చతుర్వర్ణములలో మొదటివర్ణమునఁ బుట్టినవాఁడు.) బ్రాహ్మణుఁడు; **3.** (సహోదరులలో ముందుపుట్టుకగలవాఁడు.) అగ్రజుఁడు, అన్న.—విణ. న్. ముందు జన్మముగలవాఁడు.

అగ్రజాత. సం. = అగ్రజ.

అగ్రజాతి. సం. విణ. ఇ. మొదటిజాతిగలవాఁడు. —వి. ఇ. పుం. బ్రాహ్మణుఁడు.—స్త్రీ. మొదటి జాతి. (బ్రాహ్మణజాతి.)

అగ్రజుఁడు. సం. వి. అ. పుం. అన్న, జ్యేష్ఠసోదరుఁడు.—విణ. (అ.ఆ.అ.) ముందుపుట్టినవాఁడు.

అగ్రణి. సం. విణ. ఈ. **1.** శ్రేష్ఠుఁడు; **2.** ముఖ్యుఁడు; **3.** ప్రభువు.

అగ్రతః. సం. అవ్య. (తెనుఁగున సమాసపూర్వపదముగానే యుపయుక్తము.) అగ్రభాగమున. చూ. అగ్రతస్సరుఁడు.

అగ్రతస్సరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) **1.** ముందు నడుచువాఁడు; **2.** మొదటివాఁడు; **3.** శ్రేష్ఠుఁడు; **4.** ముఖ్యుఁడు.

అగ్రతాంబూలము. సం. వి. అ. న. **1.** మొదటి తాంబూలము; **2.** ప్రధానతాంబూలము.

**9.** నాలుగుముద్దలపరిమితిగల భిక్ష. — విణ. (అ. ఆ. అ.) **1.** మొదటిది. "అగ్రమహిషి, అగ్రాసనము." మొ.; **2.** ముఖ్యమైనది; **3.** శ్రేష్ఠమైనది; **4.** చివరది.

అగ్రయాయి. సం. విణ. (న్.ఈ-నీ.న్.) **1.** ముందు నడచువాఁడు. "మాలిని. అసకృదసమధాటీ వ్యాప్తిదృప్తాగ్రయాయీ." హరి. పూ. ౭, ఆ. ౨౪౪; **2.** శ్రేష్ఠుఁడు; **3.** ప్రధానుఁడు, ముఖ్యుఁడు.

అగ్రసరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) = అగ్రేసరుఁడు.

అగ్రహారము. సం. వి. అ. పుం. **1.** పొలమునఁ బండిన సస్యమునుండి బ్రాహ్మణునికై తీసియుంచఁబడినభాగము; **2.** విద్యాపూర్తియైన తర్వాత గురుకులమునుండి మరలివచ్చి గృహస్థధర్మ మవలంబింపఁ దలంచినబ్రాహ్మణున కిచ్చు క్షేత్రగృహాదిపదార్థము; **3.** వేదవేదాంగాది పఠనముచేయు బ్రాహ్మణులు నివసించుగ్రామము. "ద్వి. అక్కుమాలినభంగి నగ్రహారంబు, చక్కన మీకెట్లు చనఁజేరవచ్చు." బస. ౭,ఆ. ౨౧౪పు.; **4.** శ్రేష్ఠమైన హారము, మంచిదండ.—విణ. (అ. ఈ-రీ. అ.) ముందు తీసికొనిపోవునది.

అగ్రామ్యుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) (గ్రామ్యుఁడు కానివాఁడు.) పనులయందు నేర్పరి.

వాఁడు; 2. మొదటివాఁడు; 3. శ్రేష్ఠుఁడు; 4. ముఖ్యుఁడు.—వి. అ.పుం. అగ్రజుఁడు, అన్న.

అగ్రీయుఁడు. సం. = అగ్రియుఁడు.

అగ్రేదిధిషువు. సం. వి. ఉ. పుం. మాఱుమనువుచేసికొనినదానికి మొదటిమగఁడు.—ఊః. స్త్రీ. అప్పకంటె ముందు పెండ్లాడిన స్త్రీ.

అగ్రేదిధిషూపతి. సం. వి. ఇ. పుం. (అగ్రేదిధిషువునకుఁబతి.) అప్పుకంటె ముందు పెండ్లాడినదాని మగఁడు.

అగ్రేసరుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. ముందు నడచువాఁడు; 2. మొదటివాఁడు; 3. శ్రేష్ఠుఁడు, ఉత్తముఁడు; 4. ముఖ్యుఁడు, ప్రధానుఁడు. రూ. అగ్రసరుఁడు.

అగ్ర్యము, సం. వి. అ. న. (అగ్రమున నుండునది.) ఇంటికప్పు.—విశే. చూ. అగ్ర్యుఁడు.

అగ్ర్యుఁడు. సం. = అగ్రియుఁడు.

అఘటమానము. సం. విశే. (అ. ఆ.అ.) 1. ఘటిల్లనిది; 2. అసంభవము; 3.అసాధ్యము. "క. దీని విధానంబెఱుఁగం,గా నింద్ర కుబేర వరుణ కాలాదులకుం, దా నతిగహనం బనినను, మానవులకు నెఱుఁగు టఘటమానముగాదే." భార. అర. ౧, ఆ. ౩౩౦. "వ. మనగూఢ భావంబు మేరువునిగూఢభావంబునుం బోలె నఘటమానం బిట్లేని నివ్వనవాసక్లేశం బెన్నఁడును మనకుఁ బాయనేరదు." భార. అర. ౧, ఆ. ౨౬౬.

అఘాయువు. సం. విశే. న్.(పాపసాధనమైన ఆయువు గలవాఁడు.) సర్వావస్థలయందును పాపము చేయువాఁడు. "అఘాయు రింద్రియారామః." భగవద్గీత.

అఘుఁడు. సం. వి. అ. పుం. పూతనాబకాసురుల సోదరుఁడగు నొక రాక్షసుఁడు. చూ. అఘనాశనుఁడు.

అఘోర. సం. వి. ఆ. స్త్రీ. (శివు నుపాసింపఁదగినతిథి.) భాద్రపదబహుళచతుర్దశి.

అఘోరము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఘోరము కానిది, సౌమ్యము, శాంతము; 2. (దేనికంటె ఘోరమైనది లేదో యది.) అతిఘోరము, అతి భయంకరము. (రుద్రమూర్తి భేదము.)

అఘోషము. సం. వి. అ. పుం. 1. వర్ణోచ్చారణ నిమిత్తమగు ప్రయత్నభేదము; 2. ఆప్రయత్నముగల వర్ణము. (క చ ట త ప ఖ ఛ ఠ థ ఫ గ జ డ ద బ, ఘ ఝ ఢ ధ భ లు, జిహ్వామూలీయోపధ్మానీయములు, విసర్గ శషసలు ఇవి అఘోషములు.)

అఘ్న. సం. వి. అ. స్త్రీ. (చంపఁదగనిది.) ఆవు. ఓడ అని కొందఱు. అఘ్న్య అనురూపముతో కొందఱు గ్రహించిరి.

అచల. సం. వి. ఆ. స్త్రీ. (చలింపనిది.) నేల, భూమి.—అ. పుం.—ము. 1. పర్వతము, కొండ; 2. శంకువు, మేకు.— న. బ్రహ్మము.—విశే. (అ. ఆ. అ.) కదలనిది, స్థిరమైనది.

కాంతి గలది.—వి. స్. స్త్రీ. **1.** అల్పకాలముండుకాంతి; **2.** విద్యుత్తు, మెఱపు.

అచుంబితము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** చుంబనము చేయఁబడనిది, ముద్దుపెట్టుకొనఁబడనిది; **2.** అనుభవము లేనిది; **3.** వినఁబడనిది; **4.** చదువఁబడనిది. "ఇది వానికి అచుంబిత ప్రక్రియ;" **5.** అనుభవింపఁబడనిది.

అచేతనము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** చైతన్యము లేనిది, ప్రాణములేనిది; **2.** జడము (పదార్థము.)

అచ్చారము. అర. వి. సంచకరువు, బయానా.

అచ్చి. దే. వి. దేశవిశేషము. అచ్చిమట్టము అని శ. ర.

అచ్చిక. దే. వి. కొఱఁత. "రాజదూతి—ఉ. ఒక్క సుధాంశురత్నరుచిరోన్నత వేదికమీఁదనిద్దఱున్, మక్కువ మీఱ నుండి యనుమానముతో నొక కొంత కొంకికొం, చక్కట నీకొకందులకు నచ్చిక లేక మెలంగ విన్నదా, సెక్కడిభర్తగాఁగ సృజియించె నజుండు." హంస. ౧, ఆ. ౮౯.

అచ్చికము. దే. = అచ్చిక. "చ. అదె ఘృతతండుల ప్రకర మల్లవె చీరలు భూషణాదిసం, పదలవె రాజురాక కులుపా యొనఁగూర్చిన యట్లు మీఱెదున్, ముదితల కేమియచ్చికము." కళా. ౬, ఆ. ౧౩౩.

అచ్చికబుచ్చిక. దే. వి. (క. అచ్చికముచ్చిక.) కలుపుకొలుతనము, భేదములేమి. "ఉ. అక్కఱఁజూడవేటి కల యచ్చికబుచ్చిక సేయునంచలన్ చెక్కిలిఁ గొట్టెదేమిటికిఁ జేరఁగవచ్చిన ముద్దుచిల్కలన్." విజ. ౩, ఆ. ౩౦.

అచ్చెరియము. వై. వి. అద్భుతము, ఆశ్చర్యము.

అచ్చెరుపడు. వై. అ. క్రి. (అచ్చెరువు+పడు.) ఆశ్చర్యపడు.

అచ్చెరుపాటు. వై. వి. అచ్చెరుపడుట.

అచ్చెరువు. వై. వి. వెఱఁగు, ఆశ్చర్యము. "క. ...నీ క, చ్చెరువుగ నాకల తెఱంగుఁ జెప్పెదఁ బ్రీతిన్." భార. ఆది. ౨, ఆ. ౧౧౮.

అచ్చెరువుపడు. వై. = అచ్చెరుపడు.

అచ్చెరువుపాటు. వై. = అచ్చెరుపాటు.

అచ్యుతాగ్రజుఁడు. సం. వి. అ. పు. **1.** (అచ్యుతుని యన్న); **2.** ఇంద్రుఁడు. (విష్ణువు కశ్యపునికి అదితియందు జన్మించినపుడు ఇంద్రునికి తమ్ముఁడై పుట్టెను.)

అచ్యుతుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు.—విణ. (అ. ఆ. అ.) స్థిరుఁడు.

అచేటు. దే. = అచ్చటు.

అచోటము. దే. విణ. విరివియైనది, పృథులము. ఆం. పా.

అచోటు. దే. వి. (ఆ+చోటు.) ఆ స్థానము. శ. ర.

అచ్చే. వై. విణ. (అచ్ఛము అనుదానిలో వృత్తియందు వర్ణము లోపింపఁగా మిగిలినది అని శ. ర.) **1.** స్వచ్ఛము, నిర్మలము. "ఘనముగఁజేయ నచ్చె తెలిగన్నుల ఱెప్పల నశ్రుబిందువుల్, వనరుహకేసరస్థహిమవారిలవంబుల పెంపు డింపఁగాన్." హరి. ఉ. ౭, ఆ. ౧౨౨; **2.** కేవలము, సాంకర్యములేనిది, కలగలుపు లేనిది.

అచ్చెన. దే. వి. అచ్చనగాయ, బాలికలాటలో నుపయోగించెడు గోళీకాయవంటి కాయ. చూ. అచ్చనగండ్లు, అచ్చనగుండ్లు, మొ.—వై. వి. (సం. అర్చన. క. అచ్చన.) అర్చించుట, పూజించుట. "ద్వి. అచ్చ నయెల్లి మాయయగారి నగరఁ జెచ్చెరఁ బిల్వ వచ్చెద నారగింపు." బస. 3, ఆ. పు. ౭౧. ఈయర్థమున తెనుఁగుసంప్రదాయము ననుసరించి దంత్యసహితముగ గ్రహింపఁబడినది. కాని, తాలవ్యసహితముగ గ్రహించుట న్యాయ్యము. కవి అభావముతోనే చెచ్చెర అను పదముతో ప్రాసముఁ గూర్చెను. ఆతఁడు కన్నడ సంప్రదాయము ననుసరించియుండును.

అచ్చెనగండ్లు. దే. వి. బ. 1. బాలికాక్రీడావిశేషము. "మ. దినముల్ కొన్ని చనంగ నంతఁగడు నర్థిం బొమ్మపెండ్లిండ్లు గుజ్జెనగూళ్లచ్చనగండ్లు పింపిళులు కుచ్చెళ్లీ గీరనంగింజ లో,మనగుంటల్ కనుమూసిగంతనలు కంబాలాట లోనైనఖే, లన ముల్ మీఱఁగ బోట్లతో నలరె బాలారత్నమెల్ల ప్పుడున్." కళా. ౬, ఆ. ౨౦౨; 2. అచ్చనగండ్లాటలో నుపయోగించు గోళీలు, గిరీయకములు. "తే. కొండ లచ్చెనగండ్లయి నిండు చెఱువు, లెల్ల నద్దంపు బిళ్లలై యేర్లు ముత్తి,యంపు సరులై యరణ్యంపు గుంపులెల్ల,నారులై తోఁచుఁ బొడవున నారులార." వసు. ౪, ఆ. ౫౯.

అచ్చెనగాయలు. దే. వి. బ. బాలికాక్రీడావిశేషము, అచ్చనగండ్లు. "సీ. కరకంకణధ్వనుల్ గలుగల్లుమని యింపు గావింప నచ్చనగాయ లాడు." రుక్మి. ౧, ఆ. ౭౬.

అచ్చెనగుండ్లు. దే. వి. బ. 1. అచ్చనలాడుగుండ్లు, గిరీయకములు, గోళీలు. "సీ. ముదురు వెన్నెల గాయు ముత్యాలదిన్నెపైఁబ్రేఁడి యచ్చనగుండ్లు పాఱవైచి." య. 3, ఆ. ౧౫౧; 2. అచ్చన గుండ్లాట.

అచ్చెనపుచ్చు. దే. స. క్రి. ఓడఁబెరుకు, ఆటలో అచ్చనకాయఁదీసినట్లు తీయు. "చ....తద్గణాధిపుల్,కలుషముతోడ ముట్టి భగు కన్నొకఁ డచ్చన పుచ్చి రుగ్రులై, బలువిడిఁ జుట్టి పూషముని ఫండులు డుల్లఁగ వ్రేసి రీసునన్." కు. సం. ౨, ఆ. ౭౬, 'కన్నొకచ్చన' అని ముద్రితము. 'కన్నొకఁడచ్చన' అని ప్రాఁతప్రతి.

అచ్చెనలాడు. దే. అ. క్రి. గంతులువేయు. "క.దీర్ఘతరంబై, హెచ్చినశోకము మదిలో, నచ్చనలాడంగ." జై. ౧, ఆ. ౫౫.

అచ్చెనలు. దే. వి. బ. బాలికాక్రీడావిశేషము. చూ. అచ్చనలాడు.

అచ్చెము. వై. విశ. 1. స్వచ్ఛము, నిర్దుష్టము. "సీ. ఒండువిధంబులఁ, బడయంగరాని యెక్కుడుప దంబు, లచ్చమైనతపంబున వచ్చుఁబడయ." భార. అశ్వ. ౨, ఆ. ౨౦౩; 2. కేవలము; 3. తెల్లనిది; 4. దట్టము. చూ. అచ్చె.

అచ్చెర. వై. వి. అప్సరస్త్రీ, దేవవేశ్య.

అచ్చెరము. వై. = అక్షరము.

అచ్చెరు. వై.= అచ్చెరువు. "చ....అవతంస విభూతిగఁ దాల్చి చాల న,చ్చెరునఁ బిశాచకాంతులు పిశాచములం దవిలించి రొప్పులన్." కు. సం. ౧౧, ఆ. ౧౯౭.

అచ్చెరువడు.వై. =అచ్చెరువుపడు. "చ....ఒకయించుక పెంపున గెల్చె వేల్పు ల,చ్చెరువడి పిచ్చలింప భుజశక్తియు షణ్ముఖు నుగ్రశక్తియున్." కు. సం. ౧, ఆ. ౧౧౯.

అచ్చెలము. దే. వి. 1. అభినివేశము, పట్టుదల. "క. బలహీనులయినవారలు, బలవంతుల నొడు చునపుడు బహుమాయల న,చ్చలమునఁ జేయుట యెందును, గలయదియ జయంబ కాదె కర్తవ్య మిలన్." భార. సభా. ౨, ఆ. ౧౭౦. "వ. డెందంబునం గ్రందుకొనునచ్చలంబును మచ్చరంబునుం బెచ్చువెరుఁగఁ." జై. ౫,ఆ. ౪౨; 2. ఉత్సాహము. "క. అందఱు నన్నిముఖంబుల, నందంద గిరిద్రుమాదు లచ్చలమున నీ, నందు కొను నలునియరుదుం, జందము గని మఱియు వృక్షచరులు గడంకన్." రా. యు. ౨౫౦.

అచ్చెలించు. దే. అ. క్రి. పట్టుదలనొందు, పట్టుపట్టు.

అచ్చోడి. దే. విశ. 1. స్వచ్ఛమైనవాఁడు, స్వచ్ఛమైనది; 2. శ్రేష్ఠుఁడు, శ్రేష్ఠమైనది.

అచ్చోణి. దే. = అచ్చోడి.

అచ్చోవునెయ్యి. దే. వి. కలగలుపులేని యావు నెయ్యి.

అచ్చోళు. దే. విణ. (అచ్చేము+ఆళు.) జంజాటము లేనివాఁడు. "ద్వి. చారుశీలాముఖ్యజలజలోచ నలఁ, జేరికొంబంధులఁ జెలులనీక్షణమె, పగఱకుఁ జొరరాక బహుదుర్గమార్గ, మగు కోహళమహర్షి యాశ్రమస్థలిని, జేరిచి మనము నిశ్చింత నేతెంచి, యారూఢబలయుక్తి నచ్చోళుగాఁగ, ననికి సన్నద్ధులమై యుంద మవల." పతివ్రతామాహాత్మ్యము అసి. శ. ర. ఇట ధైర్యవంతుఁడు అనఁదగును.

అచ్చొ. దే. అ. క్రి. అప్పుపడు, ఋణపడు, ఋణస్థుఁడగు, బాకీయుండు. "ద్వి. అచ్చి నా యెదుర బ్రహ్మకుఁ బోవరాదు." హరిశ్చ. ౨, ఆ. ౨౭.—స. క్రి. 1. ఇచ్చొ. "గీ. కలనఁబడిన వారిఁ గయికొని పోట్లపుం, డ్లోమి మగుడఁ బుచ్చు టొప్పుఁ బంత, మడుగ మగుడ బవర మచ్చుట యొప్పుఁగా, కించుకేని దాన యేలు టొప్పు." ఉ. హ. ౫, ఆ. ౨౬౭. అని శ.ర. "పంత మడిగి మగుడ బవరమిచ్చుట యొప్పు." అని పాఠాంతరము; 2. దండుగగా చెల్లించు. "క. ప్రీతిఁ గులశ్రేష్ఠునిపై, నాతతముగలేని బ్రహ్మహత్యాదిమహా, పాతకము వెట్టి తిట్టిన, నాతండే నూటనాలు గచ్చుఁ బణంబుల్." విజ్ఞా. ప్రా. కాం. ౪౭.—వై. వి. 1. ముద్ర, ముద్దర. "సీ. నెత్తమ్మిరేకుల మెత్తఁదనము దెచ్చి యచ్చునఁ బెట్టిన ట్లంద మొంది." భార. విరా. ౨, ఆ. ౫౨; 2. విధము. "ఉ. మీ, మెచ్చు న కెంతవాఁడ నను మీపదభక్తులలోనఁ గూర్చి యీ, యచ్చున నానతిచ్చుభవదాదరణం బిది కోటి సేయదే." భో. ౭, ఆ. ౧౫; 3. సామ్యము. "చ. మనసిజుఁ డావిలాసవతిమానధనం బెడ యూఱగొన్నక్రం,దునఁ గుటిలాలకద్యుతులుఁ దుమ్మెద లంగవిభాతిఁ దీగ లా, ననకిరణాళిరాజు సిఱునవ్వు వెలుంగుసితాబ్జముల్ విలో,చనరుచు లుత్పలల్ మగుడఁ గైకొనియెం దమయచ్చు వాఱినన్." కు. సం. ౫, ఆ. ౧౬౬; 4. ఉదాహరణము, దృష్టాంతము. "కవిరాజ. అనఘ సుదుస్తరమైన భవంబున కచ్చెగునీయితిహాసము బో, ధనమహనీయవిధంబునఁ జెప్పి రుదాత్తగుణాశ్రయతా మహితా." భార. స్త్రీ. ౧, ఆ. ౫౧. "ఆ. మగలఁ గోరి తొల్లి మగువలు తపములు, నేసి నవసిరనిన చెట్టలెందుఁ,గలవె దీనికచ్చు నిలిపితి నీమన, వలన సతులఁ బరులు వొలిసెఁగాక." కు. సం. ౭, ఆ. ౩౫; 5. నియమము. "క. ఇచ్చునది ధనము పాత్రున, కచ్చుగ నొరు వేఁడకుండునది యభిముఖులై, వచ్చిన యాశార్థుల వృథ, పుచ్చకచేయునది సర్వభూతప్రీతిన్." భార. ఆది. ౩, ఆ. ౨౦౪; 6. బెల్లము మొదలగువాని యచ్చు; 7. ఇటికలు పెంకులు మొదలగునవి దీయుటకై కఱ్ఱ మొదలగుదాని తోఁ జేసిన చట్రము మొ.; 8. పోఁతపోసిన అక్షరములు మొ.; 9. నాణెము. చూ. అచ్చొకుప్ప. 10. రూపు. "సీ. కూటము లైదరంగ కొండవీ డగలించె, బెల్లముకొండయ చ్చెల్లఁ జెఱిచె, దేవరకొండయుద్వృత్తి భంగము సేసె." పారి. పీఠిక. ౧, ఆ. ౨౩. ఇట బెల్లపుటచ్చు అని అర్థాంతరము తోఁచును; 11. సాలెవానిసాధనవిశేషము.—విణ. శుద్ధుఁడు, నిర్దోషి. "క. ముచ్చును బట్టినమాత్రన, చెచ్చెర దండింప కతనిచేఁ దెలిగొని వాఁ, డచ్చైనవిడుపు నిక్కపు, ముచ్చైన నం దగినదండమును గొనవలయున్." విజ్ఞా. ప్రా. కాం. ౯౧. "వ. వీరల కందఱకుం దేట తెల్లంబుగా భాగవతుల యచ్చుందనం బేర్పరించి పిమ్మట నెట్లుగావలయు నట్లుచేసెద." పర. ౩, ఆ. ౬౭.

అచ్చొఁగూటము. ద్వ. వి. (అచ్చు+కూటము.) ముద్రాక్షరశాల.

అచ్చొకట్టు. ద్వ. స. క్రి. 1. వేఱువేఱుగాఁ జేయు, ఏర్పఱచు. "తే. అబ్ధులన గిరులన దీవులనఁగ నేఱు, లనఁగ నడవులనఁగ నూరులనఁగ వరుస, నచ్చుకట్టి." లక్ష్మీ. ౫, ఆ. ౬౩; 2. మళ్లుమళ్లుగ చేయు. "తే. అది మఱియు మెత్తగా దున్ని యచ్చుకట్టి." వై. ౧, ఆ. ౭౫.

అచ్చొకుప్ప. దే. విణ. నాణెములరాశి, ధనవంతుఁడు. "సీ. ఆఢ్యుఁడు విలసిల్లు నాస్తికాఁడు, నాఁగఁ గలవాఁడనంగను నచ్చుకుప్ప, యనఁగ విడిముడి కలవాఁడటన్న." ఆం. భా. తృ. వి. ౩.

అచ్చుకొను. దే. అ. క్రి. ఒక రీయవలసిన ఋణము తానిచ్చుటకు ఒప్పుకొను, అవార్తీపడు. "నేను వానియప్పు నచ్చుకొన్నాను."

అచ్చుటెద్దు. ద్వ. వి. (అచ్చు+ఎద్దు.) అచ్చుపోసి విడిచిన యెద్దు, ఆఁబోతు.

అచ్చుదల. దే. వి. **1.** అచ్చుకొనుట; **2.** అచ్చి వచ్చుట.

అచ్చుపడు. వై. అ. క్రి. **1.** ఉపయోగపడు; **2.** ముద్రితమగు; **3.** మూర్తీభవించు, రూపమొందు. "క. నెచ్చెలులు దన్నుఁగొలువఁగఁ, బచ్చవిలుతు కలిమియెల్లఁ బద్మాననయై, యచ్చుపడినట్లు మెఱయుచు, నచ్చటికే తెంచె భూవరాత్మజ నెమ్మిన్." భార. అర. ౭, ఆ. ౧౭౫; **4.** సార్థకమగు. "తే. మలసి అంకెలు వైచుచు మాఱుకొనిన,వృషభములభంగి నక్కురువృషభు లిట్లు, సమదగతిఁ జేరునెడఁ జూచి రమరు లర్థి,ననిమిషత్వంబు దమకప్పు డచ్చుపడఁగ."భార. విరా. ౫, ఆ. ౧౬౫; **5.** నిరూపితమగు, ఏర్పడు. "తే. మ్రుచ్చిమియకాదె యిది పాప మచ్చుపడియె, నృపతిచే దండితుండవై నీఁగికొనుము." భార. శాం. ౧, ఆ.౧౬౦; **6.**సుప్రసిద్ధమగు. "ఉ. పొచ్చెములేని నెయ్యమునఁ బూని విపద్దశ నొందకుండఁగా, నెచ్చెలిఁ గావఁజూచు మహనీయున కిట్టిద కాలమిప్పుడీ, వచ్చుపడంగ నీభుజబలాతిశయంబున నద్భుతంపురె, ల్పచ్చి కృతార్థుఁజేయు నను నేనినుఁజెందియుఁ దూలఁబోదునే." భార. శల్య. ౧, ఆ. ౮౨.

అచ్చుపఱచు. వై. స.క్రి.ప్రే. ఏర్పఱచు,నియమించు. "క. ఇచ్చట నొకకయ్యంబునఁ, జచ్చె మదీయాగ్రజన్మసారథి తగువాఁ, డెచ్చోట లేమి నాతం, డచ్చుపఱుపఁడయ్యె నీక్రియతు నొండొకనిన్." భార. విరా. ౪, ఆ. ౨౮.

అచ్చుపాటు. వై. వి. అచ్చుపడుట, ఏర్పాటు.

అచ్చువేయు. ద్వ. స. క్రి. ముద్రించు, అచ్చొత్తించు.

అచ్చోటు. దే.వి.వి. (అ+చోటు.)రూ. అచ్చోటు, అచోటు, అచ్చొటు, అచొటు, అచ్చటు, అచటు - వీనినుండియే సప్తమీవిభక్త్యంతరూపమున 'అచ్చోటన్, అచోటన్, అచ్చొటన్, అచొటన్, అచ్చటన్, అచటన్, అచ్చోటన్, అటన్' అనురూపములు గలిగినవి. **1.** అస్థానము. "క. కటకట పేరిన పెన్నెత్తుట జొత్తిలియున్న మేనితోఁ గొడుకు కేచక్కటిఁ బడి యున్నాఁడో య, చ్చోటు సూపెడువారు లేరె చూచెద వానిన్." భార. ద్రో. ౨, ఆ. ౨౫౧; **2.** ఆవైపు, ఆదిక్కు; **3.** ఆఁడుగుఱి, గుహ్యావయవము. "క. తూ డమ్మికొండ్రు జనములు, బొడబు లాగమము లమ్మి బ్రదుకుదు రెందుం, జేడియ లమ్ముదు రచ్చోటు, గాడుపడిన కలియుగమునఁ గౌరవముఖ్యా." హరి. ఉ. ౯, ఆ. ౪౨. 'జేడియల నమ్ముదురెచట' అని పాఠాంతరము. (ఉద్దేశించిన చోటును తెలుపుపద ముపయోగించినచో అశ్లీలమగునని దానిని తెలుపుటకయి అచ్చోటు అని యుపయోగింపఁబడినది.)

అచ్చొత్తు. ద్వ. స. క్రి. (అచ్చు+ఒత్తు.) అచ్చువేయు, ముద్రించు.

అచ్చో. దే. ద్ర. ఆచోటన్. చూ. అచ్చోటు. "క. స్త్రీసంతోషించు తెఱం, గాసపడని మనసు గలుగునట్టి యధముఁ డి, చ్చో సడిఁగనుఁ జనియచ్చో, గాసింబడు జమునిభటులు గాఱియ వెట్టన్." భార. అశ్వ. ౪, ఆ. ౨౨౮.

అచ్చొటు. దే. = అచ్చోటు.

అచ్ఛదనుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ఇల్లులేనివాఁడు.—వి. అ. పుం. యతి, సన్న్యాసి.

అచ్ఛపిండ. సం. వి. ఆ. స్త్రీ. ముద్దఖర్జూరము.

అచ్ఛభల్లము. సం. వి. అ. పుం. ఎలుఁగుగొడ్డు. అచ్ఛము, భల్లము అని రెండు వ్యస్తపదములని కొందఱు. చూ. అచ్ఛము.

అచ్ఛము. సం. వి. అ. పుం. **1.** ఎలుఁగుగొడ్డు; **2.** పటికపుఱాయి. (చూ. అచ్ఛభల్లము.)—విణ. (అ.ఆ.అ.) **1.** స్వచ్ఛము, తెల్లనిది; **2.** కలఁగలుపులేనిది, మిశ్రము కానిది.

అచ్ఛాచ్ఛము. సం. విణ. (అ.ఆ.అ.) మిక్కిలి స్వచ్ఛమైనది.

అచ్ఛావాకుఁడు. సం. వి. అ. పుం. యజ్ఞమునందు సహాయముచేయు పదియార్వురు ఋత్విక్కులలో నొకఁడు.

అచ్ఛిద్రము. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఛిద్రము లేనిది, రంధ్రములేనిది; 2. లోపములేనిది; 3. సంపూర్ణము.—వి. అ. న. ఛిద్రములేమి.

అచ్ఛిన్నము. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఛిన్నము కానిది, చీల్పఁబడనిది; 2. ఎడతెగనిది, సంతతము.

అచ్ఛీకృతము. సం. విణ. (అ.ఆ.అ.) నిర్మలముగాఁ జేయఁబడినది.

అజ. సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రకృతి; 2. ఆఁడు మేఁక. —అ. పుం.—ము. 1. మేఁక; 2. గొఱ్ఱె.

అజంభము. సం. వి. అ. పుం. 1. (దంతములురానిది.) శైశవము; 2. కప్ప.—విణ. (అ.ఆ.అ.) దంతములు లేనిది.

అజంభుఁడు. సం. విణ. చూ. అజంభము.—వి. అ. పుం. 1. (దంతములురానివాఁడు.) శిశువు; 2. (దంతములు పోయినవాఁడు.) సూర్యుఁడు.(దక్షాధ్వరధ్వంసకాలమున సూర్యునిదంతములు వీరభద్రుఁ డూడఁగొట్టెను అని పురాణగాథ.)

అజక. సం. వి. ఆ. స్త్రీ. 1. అజాగళస్తనము, మేఁక మెడయందు వ్రేలాడు మాంసఖండము; 2. మేఁక పెంటిక.

అజగంధిక. సం. వి. ఆ. స్త్రీ. వాయింట✠.

అజగరము. సం. వి. అ. పుం. (అజమును మ్రింగునది.) పెద్దపాము, కొండచిలువ.

అజగర్దము. సం. వి. అ. పుం. నీరుపాము.

అజగవము. సం. వి. అ. న. (విష్ణువు బాణముగాఁ గలది. అజగవముయొక్క అస్థివికారము అని లింగాభట్టీయము.) శివునివిల్లు.

అజఘన్యుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) అధముఁడు గానివాఁడు; ఉత్తముఁడు.

అజజీవికుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) (అజములు జీవనాధారముగాఁగలవాఁడు.) మేఁకలను గొఱ్ఱెలను కొనుట అమ్ముటయు, పాలనాదికమును జీవనాధారవృత్తిగాఁ గలవాఁడు.— వి. అ. పుం. గొల్లవాఁడు.

అజన్యము. సం. వి. అ. న. (లౌకికకారణములచేఁ గలుగనిది.) అశుభసూచకము, దైవకృతమునగు భూకంపాద్యుపద్రవము.—విణ. (అ.ఆ.అ.) జన్యముకానిది.

అజప. సం. వి. ఆ. స్త్రీ. (న+జప = సహజముగానే యుచ్చరింపఁబడుటచే ప్రయత్నపూర్వకముగాఁ జపింప నక్కఱలేనిది. హంస అనునది శ్వాసములు పైకిఁ బోవునపుడును లోపలికి వచ్చినపుడును ఏర్పడును.) 1. హంసః, సోహం అను మంత్రములకు పేరు; 2. సగము ఆఁడుపోలికయు సగము మగపోలికయుఁ గలరూపము, అర్ధనారీశ్వరరూపము.

అజపుఁడు. సం. వి. అ. పుం. (స్పష్టముగా జపింపనివాఁడు.) 1. కుపాఠకుఁడు, బాగుగాఁ జదువలేనివాఁడు; 2. వేదేతరగ్రంథములు చదువువాఁడు, అని కొందఱు; 3. (అజ+ప.)అజములను పాలించువాఁడు; 4. (న+జప.) జపము లేనివాఁడు, జపము చేయనివాఁడు; 5. జపమున కర్హతలేనివాఁడు.

అజభక్షము. సం. వి. అ. పుం. 1. వాయింట✠; 2. బొబ్బలి✠.

అజమారము. సం. వి. అ. పుం. (అజమారులకు నివాసమగు దేశము.) ప్రకృతము అజ్మీరు అనఁబడు దేశము. (ఇచట పూర్వమందు కసాయివాండ్రు పెక్కండ్రు నివసించియుందురు అని యూహింపఁబడినది.)

అజమారుఁడు. సం.వి. అ. పుం. (అజములను చంపువాఁడు.) గొఱ్ఱెలను మేఁకలను జంపి వానిమాంసము విక్రయించి జీవించువాఁడు, కసాయివాఁడు.

అజముఖుఁడు. సం. వి. అ. పుం. (అజముఖమే ముఖముగాఁగలవాఁడు.) దక్షప్రజాపతి. (దక్షాధ్వర సమయమున దక్షుఁడు శివనిందచేయుటచే వీరభద్రుఁ డాతనితల నఱకెను. తర్వాత శివుఁడు ప్రసన్నుఁడయి వీరభద్రుని మరల ముఖము నేర్పఱుపుమన, అజముఖము తీసికొనివచ్చి దక్షునికి ముఖముగా నేర్పఱచెను అని కథ.)

అజమోద. సం. వి. ఆ. స్త్రీ. (అజ+మోద = అజమును సంతోషపెట్టునది లేక గొఱ్ఱెవాసనగలది.) ఓమము.

అజయ. సం. వి. ఆ. స్త్రీ. (మత్తుచేయుటచే జయము లేనిది.) భంగు అను మాదకద్రవ్యము.

అజయ్యుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) జయింప నశక్యుఁడు, జయింపరానివాఁడు. "క. తగనిపని యని తలంపక, పగగొంటి వజయ్యులైన పాండుసుతులతోఁ, దెగి యింక నీవు రణమున, మగఁటిమి వాటింపు రిత్తమాటల నగునే." భార. భీష్మ. 3, ఆ. ౧౭౮.

అజర్యము. సం. విణ. (అ.ఆ.అ.) 1. జీర్ణము కానిది; 2. క్షీణింపనిది, నశింపనిది.—వి. అ. న. సౌహార్దము, మైత్రి.

అజశృంగి. సం. వి. ఈ. స్త్రీ. (మేఁకకొమ్ములవంటి కాయలు గలది.) జెట్టుపుల్ల. దుష్టపు అని వా.

అజస్రము. సం. విణ. (అ.ఆ.అ.) విచ్ఛిత్తిలేనిది, ఎడతెఱపి లేనిది. "అజస్రదీక్షాప్రయతుఁడు."—క్రి. విణ. అ. న. ఎల్లపుడు.

అజహ. సం. వి. ఆ. స్త్రీ. దూలగొండి.

అజహత్స్వార్థ. సం. వి. ఆ. స్త్రీ. (విడువనిస్వార్థము గలది.) తనయర్థమును విడువకుండఁగ పరార్థమును బోధించు శబ్దశక్తి, లక్షణా భేదము. "కత్తులు నఱకుచున్నవి" అనుచోట కత్తులుగలవారు అని యర్థము. కత్తులుఅన కత్తులు గలవారు అని లక్షణ. స్వార్థమును అనఁగా కత్తియను నర్థమును విడువకయే కత్తులుకలవారు అనునర్థము తెలుపుట. (వ్యతి. జహత్స్వార్థ.)

అజహల్లింగము. సం. వి. అ. న. తనలింగమును విడువనిపదము. విశేష్యానుసారము లింగము మార్పుచెందని పదము. ("ఈవిషయమున ప్రభువే ప్రమాణము." అనుచోట ప్రమాణము అనునది ప్రభువునకు విశేషణమైనను ప్రమాణుఁడు అన నక్కఱలేదు. ప్రమాణము అనియే యుండును.)

అజాగ్రత్త. సం. వి. ఆ. స్త్రీ. జాగరూకతలేమి, ప్రమాదము.

అజాజి. సం. వి. ఈ. స్త్రీ. జీలకఱ్ఱ.

అజాజీవి. సం. వి. ఇ. పుం. = అజాజీవుఁడు.

అజాజీవుఁడు. సం.వి.అ.పుం. (అజ+ఆజీవ=అజముల చేత అనఁగా వాసిరక్షణముచేతను వాని క్రయవిక్రయాదులచేతను జీవనము చేయువాఁడు.) 1. గోపాలకుఁడు; 2. గొల్లవాఁడు, గొఱ్ఱెలవర్తకము చేయువాఁడు.

అజాతవ్యవహారుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) (అజాత+వ్యవహార = వ్యవహారాధికారము గలుగనివాఁడు.) వ్యవహారాధికారమురాని వయస్సు గలవాఁడు, వ్యవహారార్హమగు వయసురానివాఁడు. (మైనరు).

అజాతశత్రువు. సం. వి. ఉ. పుం. (పుట్టనిశత్రువు కలవాఁడు, శత్రువు లేనివాఁడు.) ధర్మరాజు.—విణ. శత్రువులు లేనివాఁడు.

అజాని. సం. వి. ఇ. పుం. భార్యలేనివాఁడు, జాయాశూన్యుఁడు.

అజానికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) (అజముతో జీవనముగలవాఁడు.) = అజాజీవుఁడు.

అజితాత్ముఁడు. సం. విణ. న్. 1. జయింపఁబడని యాత్మగలవాఁడు,ఆత్మను (తనను) వశముచేసికొనలేనివాఁడు; 2. బుద్ధినివశము చేసికొననివాఁడు.

అజితుఁడు. సం. వి. అ. పుం. (రాగాదులచే జయింపఁబడనివాఁడు.) 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు; 4. బుద్ధదేవుఁడు.—విణ. (అ.ఆ.అ.) గెలువఁబడనివాఁడు, జయింపఁబడనివాఁడు.

అజితేంద్రియుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ఇంద్రియములను జయింపనివాఁడు, ఇంద్రియములను వశపఱచుకొననివాఁడు, ఇంద్రియలోలుఁడు.

అజినపత్ర. సం. వి. ఆ. స్త్రీ. జతుక, చీకురువాయిపిట్ట.

అజినము. సం. వి. అ. న. చర్మము, తోలు.

అజిరము. సం. వి. అ. న. 1. ముంగిలి. "గృహాజిరము," "రణాజిరము;" 2. కప్ప; 3.వాయువు, గాలి; 4. శరీరము; 5. శబ్దాదివిషయము.

అజిహ్మగము. సం. వి. అ. పుం. (తిన్నగాఁ బోవునది.) బాణము,అమ్ము.—విణ(అ.ఆ.అ.)=అజిహ్మగామి.

అజిహ్మగామి. సం. విణ. (న్.ఈ-నీ.న్.) 1. తిన్నగాఁబోవునది. (బాణము); 2. కుటిలత్వములేనిది, సరళము; 3. న్యాయముగా సంచరించువాఁడు.

అజిహ్మము. సం. వి. అ. పుం. కప్ప.—విణ. కుటిలముగానిది, సరళము.

అజిహ్వము. సం. వి.అ.పుం. (నాలుకలేనిది.) కప్ప, మండూకము, (రసాతలమున దాఁగియున్న అగ్ని జాడ కప్పలు దేవతలకు తెల్పినవి. దానిచేత అగ్ని కోపించి కప్పలకు నాలుక లేకుండఁగ శాప మిచ్చెనని కథ.)—విణ. (అ. ఆ. అ.) నాలుక లేనిది, జిహ్వలేనిది.

అజీగవము. సం. వి. అ. న. అజగవము. రూ. అజీ గావము.

అజీర్ణము. సం.వి. అ. న.=అజీర్ణి—విణ.(అ.ఆ.అ.); 1.జీర్ణముకానిది, అఱుగనిది, (అన్నాది;) 2. శిథి లముకానిది, పటుత్వము తగ్గనిది.

అజీర్ణి. సం. వి. ఇ. స్త్రీ. 1. అజీర్ణము, అఱుగక పోవుట, జఠరాగ్ని మందగించుట. "సీ. ఒక తఱి మునివర్యు లొక్కటఁ...తమ కఱుగమి పుట్టుటయును పితృదేవతల్ ...అరిగి పద్మజునిఁ గాంచి యజీర్ణిదశ యెఱుంగ విన్నవించిన." భార. అను. 3, ఆ. ౧౫౬; 2. అఱుగకపోవుట యను రోగము.

అజీర్తి. సం.=అజీర్ణి. (ఇది వ్యాకరణవిరుద్ధమయినను వాడుకలో సుప్రసిద్ధము.)

అజుఁడు. సం. వి. అ. పుం. (పుట్టనివాఁడు, పుట్టుక లేనివాఁడు.) 1. బ్రహ్మ; 2.విష్ణువు; 3. శివుఁడు; 4.(అ=విష్ణువువలన, జుఁడు=పుట్టినవాఁడు.)మన్మ థుఁడు; 5. (అజముహూర్తమునఁబుట్టినవాఁడు.) అజమహారాజు; దశరథునితండ్రి; రామునికిఁ బితామహుఁడు.—విణ. (అ.ఆ.అ.) పుట్టని వాఁడు.

అజేయుఁడు. సం. విణ.(అ.ఆ.అ.) 1.జయింపఁదగని వాఁడు; 2. జయింపశక్యముగానివాఁడు, అజ య్యుఁడు. "క. కృపుఁడును గురుఁడు నయో నిజు, లపరిమిత భుజాబలాఢ్యు లాహవకేళీ, నిపు ణు లజేయులు వీరలు, కుపితాత్మకులైన మాఱు కొనునే వారుఁడుక్." భార. ఉద్యో. ౨, ఆ. ౨౧౧.

అజ్ఝటి. సం. వి. ఆ. స్త్రీ. నేలయుసిరిక.

అజ్ఞత. సం. వి. ఆ. స్త్రీ. అజ్ఞత్వము, తెలివిలేనితనము.

అజ్ఞాతచర్య. సం. వి. ఆ. స్త్రీ. ఇతరులచే తెలియఁ బడకుండ చరించుట, అజ్ఞాతవాసము.

అజ్ఞాతవాసము. సం. వి. అ. పుం. ఇతరులచే ఎఱుం గఁబడకుండఁగ నివసించుట. (పాండవులు ఒక సంవత్సర మజ్ఞాతవాసముచేసిరి.)

అజ్ఞానము. సం. వి. అ. న. తెలివిలేమి; జ్ఞానము లేమి, జ్ఞానాభావము. "అజ్ఞానాచరితము; అజ్ఞానోచ్చరితము" మొ. (వేదాంతిమతమున అవిద్య, మాయ మొదలగుపదములకు పర్యాయ మగు పదము.)—విణ. (అ.ఆ.అ.)జ్ఞానములేనిది.

అజ్ఞాని. సం. సం. విణ. (న్.ఈ.నీ.న్.) జ్ఞానములేని వాఁడు, తెలివితక్కువవాఁడు.

అజ్ఞుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. తెలియని వాఁడు, జ్ఞానశూన్యుఁడు, తెలివిలేనివాఁడు; 2. కించిజ్జ్ఞుఁడు, కొంచెము తెలివిగలవాఁడు; 3. మూర్ఖుఁడు; 4. చైతన్యశూన్యుఁడు.

అజ్మాయిషీ. హిం. వి. పరిశోధన, పరీక్ష, సరిగా నున్నదియు లేనిదియు చూచుట.

అజోరము. దే. వి. 1. నగరి తలవాకిటి చావడి, హజారము, మొగసాల; 2. ఆస్థానమండపము, "లయగ్రాహి. నృప, పుంగవుఁ డజారమున కుం గదలివచ్చెక్." రా. వి. ౨, ఆ. ౩౯.

అజ్జ. దే. వి. అడుగు, పాదము. "ద్వి. త్రొ క్కనయజ్జలఁ దోఁపకుండుటయు" పండి. ౫, పర్వ. ౩౪౧ పు.—వై. "తే. అజ్జపాటించి మదివెఱ పుజ్జగించి." భార. శల్య. ౧,ఆ. ౩౨౦. "లజ్జ పాటించి మది వెఱ యుజ్జగించి."అని పా ఠాంతరము.—వై.అవ్య. బళి. "ద్వి. అజ్జగాఁ దిల కంబు హావణించి నుదుట." (అజ్జగా—అజ్జయను శబ్దము పుట్టఁగా బళియనఁగా ననుట.) భద్రరాజ పుత్రచరిత్రము. (శ. ర.) రూ. అజ్జా.

అజ్జెము. వై. వి. (సం. అధ్యాయః.) అనువాకము. (అధ్యాయమువంటిది. అందుఁ గొన్ని పనసలుం డును.) "ఉ...ఈ, యజ్జెములోన నాపనసయ న్నవసిష్ఠులు మీరు శ్రాతమం,దు." పాంచా. ౪, ఆ. ౨౫.

అజ్జెరె. వై. అవ్య. (అజ్జె+రె.) బళిరె, ఆశ్చర్యో త్సాహాదులు కలిగినపుడు పలికెడుమాట. "ఉ. అజ్జెరెయంచుఁ బంచుకొని రందఱు వ్రేల్చుచు ద్రవ్యదక్షిణల్." పాంచా. ౪, ఆ. ౨౫.

అజ్జేరే. వై. = అజ్జేర.

అజ్జెలువెట్టు. దే. అ. క్రి. 1. అడుగులను వేయు; 2. పూను, కడఁగు. "ఇట్లు చనుదెంచి తదీయవివాహవేదికాతలోపరి దుకూలాంబరాలంకృతమణిపీఠాసనాసీనుండై యున్నంత హైమవతి దేహార్థంబునైకొన నజెలువెట్టునట్లు తత్పితార్థంబు నలంకరించుచు మరునారాధన రత్నపాంచాలికయుం బోలె వెలుంగుచు." కుమా. ౯, ఆ. ౨౨౮.

అజ్జెవాలు. ద్వ. వి. (పాదమే ఆయుధముగాఁ గలది; దీనిపాదములకు కత్తులు కట్టి పోరింతురు కావున చరణముల నాయుధములు గలది.) కోడి, చరణాయుధము. "ఉ. ఇంక నీ, యాటలు డించి వే జరగుమంచును వెన్నెలజేని కేర్పడం, జాటె ననంగఁ గూఁత లిడఁ జాగెఁ దుటారపు టజ్జవాల్గ ముల్." అచ్చ. అ. కాం. ౩౮.

అజ్జో. వై. = అజ్జె.

అజ్జోరె. వై. (అజ్జో+రె.) = అజ్జేరె. రూ. అజ్జోరే. "శా. ఆహా విలాసంబు ల, జ్జోరే జవ్వనమద్దిరా పగలు మజ్జోరే తనూవిభ్రమం,బు." శశాం. ౩, ఆ. ౨౩.

అట. దే. అవ్య. ద్రు. 1. అచ్చటను, ఆస్థలమందు. చూ. అచ్చోటు. (వి.వి. అని. శ.ర.) "క. అంత నట నక్కుమారుం, డెంతయుఁ గరుణమ్ము దోఁప నేడ్చుచునుండన్." నిర్వ. ౨, ఆ. ౫౮. "చ. అలరి యటన్ సహస్రశిఖరావళి కాంచనదీప్త మండలిన్, గలబహుకేతునామగిరిఁ గ్రాలుచు నుండును." రా. కిష్కిం. ౫౭౭. "సీ. అట... నందునాఁదత్తార్థమయిపిరాజిల్లుచుండు." ఆం.భా. ౩. అవ్య. ౬౬; 2. అనంతరము, అవుల, ఆవల. "వ...వీరెవ్వరయి ననుదమవార్తలడిగి రేని ద్వైతవనంబున మమ్ము విడిచిపోయి రట నెఱుంగమనం గలవారని చెప్పి." భార. విరా. ౧, ఆ. ౧౧౫. ఇది కళయని కొందఱు. తక్కువ, మున్నుశబ్దము మొదలగువానితో దీనికి సమాసముగలదు. అపుడు తచ్ఛబ్దార్థము (అ) మాత్రము నిలిచియుండును. "సీ....నృపునకుఁ, దనకులంబున నట తక్కువ కులములు రెంటను బరిణయ శ్రీవహింపఁ,జను." భార. ఆను. ౨, ఆ. ౨౭. (అట తక్కువ, అటమున్ను.) అర్వాచీనప్రయోగములలో దీని పయి 'కున్' అను విభక్తిప్రత్యయము కనుపడుచున్నది. "శా. ఆవిప్రాత్మజుతోడ సూనశరపీద్యాక్రీడ లింపార రా,జీవాక్షీస్థితు లిచ్చలోఁ దెలిసి వర్జింపంగఁ జింతించు నా, భూవర్యుం డొక నాఁడు సర్వవిభవంబుల్మిఱఁ గొల్వుండఁగా, నా వేళం బొడఁగానవచ్చి రటకున్ వ్యాధుల్ వినోదంబుగన్." సాసం. ౫, ఆ. ౧౦౪. అవ్యయములపయి నీప్రత్యయము చేరుట కొన్నిచోట్ల కలదు. వీని ననుసరించి విశేష్యమనుటకంటె ప్రాచీనప్రయోగముల ననుసరించియు, వ్యుత్పత్తి ననుసరించియు, అవ్యయమనుటయే యుక్తమని తోఁచెడిని.

అటకలి. దే. వి. ఉత్పాదనము, బిడ్డను పోఁగొట్టుటకయి రుద్దుకొను నలఁగుపిండి, కుంకుడుకాయ పులుసు మొ. పదార్థము.

అటకాయించు. హిం. క్రి. నిరోధించు, అడ్డగించు.

అటకావు. హిం. వి. ఆటంకము, అడ్డు.

అటతాళము. సం. వి. అ. పుం. (సంగీత.) పదునాలు గక్షరములకాలము గలతాళము.

అటనము. సం. వి. అ. న. సంచరించుట, తిరుగుట "భిక్షాటనము"=భిక్షకైతిరుగుట. "దేశాటనము."

అటని. సం. వి. ఇ. ఈ. స్త్రీ. నారి తగిలించెడిధను రగ్రము, వింటికొప్పు, వింటికొన.

అటమట. దే. వి. 1. వంచన; 2. దుఃఖము. "చ. కటకట రాజచంద్ర, యిటు కర్జమె నిర్జరకన్యకామణిం, దటుకున ఘోరమార నిశితప్రదరంబులపాలుచేసి యి,చ్చటికి కిటుచేరి నీవును విశంకటతాపభరాలసుండవై, యటమటఁ జెందెదేల పదమా ముదమార నెలంతచెంతకున్." రసి. ౫, ఆ. ౩౩. —విశే. 1. అసత్యము; 2. వ్యర్థము; 3. మోసము. చూ. అటమటము.

అటమటకాఁడు. దే. విశే. అటమటీఁడు, వంచకుఁడు. "ద్వి. ఘుటికసిద్ధుఁడు తాయిఁగొట్టిన గొడ్డ, లటమటకాఁడు మహామాయలాఁడు" హరిశ్చ. ద్వి. ౨, భా. ౬౪౬ ప.

అటమటము. దే. వి. 1. వంచన; 2. దుఃఖము. చూ. అటమట.—విశే. 1. అసత్యము. "క. ఇటుచూచినఁ జెలిపైఁ దృష్టుటుచూచిన సుతుని నేర మవుఁ

గాదనఁగా, నెటువలె వచ్చునో మీఁదట, నటమ టమో లేక నిజమొ యని యెఱుఁగముగా." సా. ౨, ఆ. ౨౫3. **2.** వ్యర్థము. "క. ఇటు వలె వెదకియుఁ దమత్రి, ప్పట గురువిరహితుల మంత్రపఠనం బెటు ల, ట్లటమటమై పోఁజూచిన." రామా. ౬, ఆ. ౬౫. **3.** మోసము. "చ. తటుకున నియ్యకొంటి మతివప్పి మరుద్గురు నంతవానితో, నటమట మింకఁ బోక యడియా సల నుండుటఁ బాపు దైవమా." కాశీ. 3, ఆ. ౧౧౧.

అటమటించు. దే. స. క్రి. ధిక్కరించు, మించు; (ఔపమ్యమును దెలుపును.) "వ. మెఱుంగుఁ జన్నులఁ గన్నెతమ్మి మొగ్గలవన్నె నటమటించి పెన్నెఱుల మెఱుంగుఁదుమ్మెదవన్నెఁ దటమటించి నెన్నడుముల విన్ను వెన్నుదన్ని." స్వా. ౫, ఆ. ౧౦౧.—అ. క్రి. **1.** చలించు. "వ. మెఱుఁగుతుమ్మెదవన్నె పెన్నెఱుల నటమటించు నెన్నడుముల విన్నువెన్ను దన్ని." స్వా. ౫, ఆ. ౧౦౧. అని శ. ర. ఈపాఠము, అర్థమును ప్రామాదికములు; **2.** వంచించు. "తే. యతిననుచు వేషభాషల నటమటించి, పొంచి తఱివేచి కన్నియఁ గొంచునరిగె." విజ. 3, ఆ. ౧౬౨; **3.** అపహరించు లేక దాఁచు. "క. తమ్ముఁడవని నిన్నెగతి, నమ్మంగావచ్చు నిట్లు నా కొసఁగక ర, త్నమ్మటమటించుకొంటివి, పొమ్మిఁక నీతోడి పొత్తు పోరపొచ్చెమగుఁ గా." వి. పు. ౬,ఆ. 3౦౫.

అటమటీఁడు. దే. విశే. (అటమట+ఈఁడు.) అటమట చేయువాఁడు, మోసకాఁడు. "సీ. శితికంఠున కును నెచ్చెలికాఁడు గాఁడొకో యటమటీఁడైన యీయక్షభర్త." కాశీ. ౭, ఆ. ౬౦.

అటమర. దే. విశే. వ్యర్థము.—వి. పలాయనము, పాఱిపోవుట.

అటమరింపు. దే. వి. పలాయనము.

అటరూషము. సం. వి. అ. పుం. అడ్డసరము♆.

అటవి. సం. వి. ఈ. స్త్రీ. వనము, అడవి.

అటాట్య. సం. వి. ఆ. స్త్రీ. పర్యటనము, తఱచు త్రిమ్మరుట

అటి. దే. విశే.=అట్టి. "రగడ. ఏకాంతమని తొలఁగె దెందు నీవటివేరు, చేకొనవె మున్నాడి చెలువ యీవటివేరు." స్వా. 3, ఆ. ౮౪. ('అన్ని'కి 'అని' రూపమువలె 'అట్టి'కి 'అటి' అని రూపముండవచ్చును. 'నీవఁటె వేఱు' అని ముద్రిత పాఠము. ఈపాఠమున అనుప్రాసము సరిపడదు, ప్రయోగాంతరము కానరాదు.)

అటిక. దే. వి. ఒకదినుసుమంటిపాత్రము, అట్టిక.

అటికమామిడి. దే. వి. మండలచ్ఛదము♆.

అటు. దే. వి. (అచటులో చవర్ణము లోపింపఁగా మిగిలినరూపము.) **1.** ఆచోటు, ఆవైపు. "క. ...అటుచూ పిటు, నిటుచూ పటు పటురయమున నేసె..."విజ.౨, ఆ. ౨౦౨; **2.** ఆప్రకారము, ఆరీతి. "క. ఊరక యటు మిముబోఁటుల, చేరువఁ జరియింపఁగనిన సిద్ధింపవె యే, కోరికలైన." కళా. ౧, ఆ. ౮౭. (అట్టువోలెమొ. ప్రయోగముల ననుసరించి యిది విశేష్యముగా గ్రహింపఁబడినది.) అవ్య. అని, శ. ర. (దీనికి సమాసమందు తచ్ఛబ్దార్థవివక్ష లేదు.) రూ. అటులు, అట్లు, అట్టు, అట్టులు.

అటుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) (సమాసోత్తర పదముగానే యుండును.) తిరుగువాఁడు, సంచరించువాఁడు. "నిశాటుఁడు"(=రాత్రిసంచరించువాఁడు) రాక్షసుఁడు; "నీరాటము, వనాటము" మొదలగునవి.

అటుక. దే. వి. అట్టుక ఇంటిలోపల గోడలమీఁద నడ్డముగా బల్లలు, కఱ్ఱలు మొదలగువానిచే మంచెవలె నమర్చినది.

అటుకులు. దే. వి. బ.=అడుకులు. వా.

అటులు. దే.=అట్లు "చ.అని యుచితంబుగాఁ బలికియంగనహస్తముఁబట్టి తత్కరం, బునఁ గదియించి నీగురువుఁ బొల్తి తగం గొనియాడు మెట్లు నెప్పటులు భక్తిమై నడువు." భార. విరా. ౧, ఆ. ౨౫౨. (వృత్తియందు) ప్రకారము, రీతి.

అటువంటి. దే. విశే. అట్టి, ఆరీతిగలది. "చ. అటువంటి నీపురాతనమగు దివ్యమూర్తి విదితంబుగఁ జూపితివి." వి. పు. ౭,ఆ. 3౭౦. ఇది ప్రాచీన కావ్యములందుఁ గనుపడదు.

అటువలె. దే. అవ్య. ద్రు. అట్లు, ఆరీతి. "క. తుహినధాముఁడు వెడలెఁ గా." "చ. అటువలె నంటుకాఁడు చనినంత." శశాం. ౪, ఆ. ౨౮.

అటె. దే. అవ్య. 1. నిశ్చయము తెలుపును. "క. మాకును జిత్తంబుల మృగ,యాకౌతుక మతిశయిల్లినది గోగణర,క్షాకరణము గార్యంబటె, యేకీడును నేల పొందు నిందు మహీశా. భార. అర. ౫, ఆ. ౩౭౦; 2. ఉత్కర్షము (మహత్త్వము)ను తెలుపును. "తే. సాధనము గాండీవం బటె సమరకర్త, యర్జునుండటె సారథి యబ్జనాభుఁడటె మరల్పఁగవచ్చునే యారథంబు, హరునకైనను నెఱుఁగక యంటిగాక." భార. ద్రోణ. ౨,ఆ. ౩౧౪; 3. ఉల్లసము, పరిహాసమును తెలుపును. "వ. అనిన విని దరహసితవదనుం డగుచు పురుహూత పురోహితుండు. క. నహుషుండు పనుచువాఁడటె,విహితానుష్ఠానపరులు వీరటె పోలో, కహితంబటె యిది మనకుక్, మహనీయమ కాకయెట్లు మానఁగవచ్చుక్. వ. అని యుల్లసంబాడి." భార. ఉద్యో. ౧, ఆ. ౧౪౯. ఇట "ఆశ్చర్యము తెలిపెడి" నని శ. ర; 4. దుఃఖమును తెలుపును. "సీ. ధర్మసుతుఁడు, భీమసేనుండును బీభత్సుఁడును దనకడుపునఁబుట్టిన కొడుకు లట్టె, యెగ్గతంబునఁ దాను గార్గి ఁగాలె, నటె యనాథయై." భార. ఆశ్ర. ౨, ఆ. ౧౬౩. రూ. అట్టె. చూ. అఁట.

అట్ట. దే. వి. 1. కబంధము, మొండెము. "క. తురగంబునట్టపయి నరు, శిరమును నరునట్టఁ దురగశిరమది కె వడిక్,పురుషమృగంబులతోఁ గి,న్నరులొగిఁ బోరాడు క్రియ రణంబున నొప్పెక్." కు.సం. ౧౧,ఆ. ౧౭౭; 2. చెప్పులకు గట్టికొఱకు అడుగునపెట్టుట కేర్పఱచిన తోలు ముక్క. "ఒంటి అట్టచెప్పులు;" 3. పుస్తకములు మొదలగువానికి గట్టికొఱకు పైనివేసెడు (కట్టెడు) దృఢమగు కాకితము, తోలు మొదలైనది. "ఈపుస్తకమునకు మంచిఅట్టవేయుము(కట్టుము);" 4.ఒకదానితో నొకటి అంటుకొనిపోయినపదార్థము.

అట్టచెమ్మ. ద్వ. వి. నాలుగుగవ్వలతో నాడెడు దాయమువంటి యొకానొక ఆట. శ. ర.

అట్టడి. వై. వి. శత్రువులను కనిపట్టుటకును, వారిపయి నాయుధములను ప్రయోగించుటకును అనువగునట్లు ప్రాకారమంటపముమీఁదఁ గట్టినగది. "సీ. కోట సింగారించి కొత్తళంబులనెల్ల నట్టళ్ల పన్నించి యాళువరికిఁ బందిళ్లు వెట్టించి ..." ఉ. హరి. ౨, ఆ. ౯౨.

అట్టనము. సం. వి. అ. పుం. (శత్రువును అనాదరించుసాధనము.) ఫలకము, డాలు.—న. అనాదరము.

అట్టము. సం. వి. అ. పుం. 1. అన్నము; 2. అతిశయము; 3. ఎత్తు; 4. మేడ, హర్మ్యము; 5. అట్టడి (దీనికి 'క్షౌమము' అని పేరు.)—విణ. (అ. ఆ. అ.) 1. ఎండినది; 2. వండఁబడినది. (అన్నము.)

అట్టహాసకము. సం. వి. అ. పుం. (పెద్దనవ్వువలె ప్రకాశించునది. తెల్లనిపువ్వులచే నవ్వువలె ప్రకాశించునట్లు పోల్పఁబడినది.)కుందము, మల్లి.

అట్టహాసము. సం. వి. అ. పుం. 1. అతిశయముతోఁ గూడిన హాసము, పెద్దనవ్వు; 2. ఆడంబరము, ఆటోపము, (అడావుడి అని వాడుక.) "ఈ స్వల్పకార్యమునకు వారెంతో అట్టహాసముచేసినారు."

అట్టాలకము. సం. వి. అ. పుం. 1. మేడమీఁదిగది; 2. కోటబురుజు; 3. మేడ, హర్మ్యము.

అట్టాలము. సం. = అట్టాలకము.

అట్టాలిక. సం. వి. ఆ. స్త్రీ. రాజగృహము.

అట్టి. దే. విణ. అటువంటిది, ఆరీతిగలది.

అట్టిఁడు. దే. విణ. (అట్టి + వాఁడు.) అటువంటివాఁడు. "సీ. ఆత్మవిజ్ఞానంబునందు సనత్కుమారాదుల యట్టిఁడ యనఘమూర్తి." భార. ఆది. ౪, ఆ. ౧౬౯.

అట్టిక. దే. = అటిక.

అట్టియ. దే. వి. గుంపు, సమూహము. "క. అట్టియెడఁ జెలిమికత్తియ, లట్టియలుగఁ గూడి చేడియంగని యనిరి." సీలా. ౨, ఆ. ౪౬.

అట్టిరు. దే. విణ. (అట్టిఁడు బ. వ.) అట్టివారు. "చ. . . మృదులానిలాపవర్జితకుసుమాక్షతావళులు సేసలు వెట్టినయట్టిరైరి." భార.ఆది. ౪, ఆ.౧౭.

అట్టు. దే. వి. 1. అపూపవిశేషము. "మినపట్టు, పెసరట్టు;" 2. అటు.

అట్టుక. దే. = అటుక. "క. తలవం గడగడ వడఁకినఁ, గలఁగకుమని పీఁపుఁ జఱచి ఘనురాలతనిన్, నిలిపి యొకమూల నట్టుక, నెలమిని వాఁకిలి సడల్చి హిత మలరారన్." హంస. ౩, ఆ. ౯౧. "అటుకను" అని ముద్రితము.

అట్టుపుట్టానవాళ్ళు. దే. వి. బ. పుట్టుక మొదలుకొని చెప్పగుర్తులు, పుట్టు పూర్వోత్తరములు. "వారా వృత్తాంతము అట్టుపుట్టానవాళ్లతో చెప్పినారు."

అట్టుప్పు. దే. వి. పాక్యము, వంటయుప్పు.

అట్టులు. దే. = అటు.

అట్టువ. దే. వి. అటుక.

అట్టువోలె. దే. అవ్య. ద్రు. (అట్టు+పోలె.) ఆరీతిని బోలి. "సీ. ఏనుంగునంజలో సెల్లసత్వంబుల యంజ(హ్వజ్జ)లు నడఁగినయట్టువోలె." భార. శాం. ౨, ఆ. ౨౩౯.

అట్టె. దే. = అటె. "తే. నలునకాని నలినదళనేత్ర పరియింప, దట్టె చూతమనుచు నమరవరులు." భార. అర. ౨, ఆ. ౫౨. ఇట పరిహాసమును, ఉల్లసమును తెలుపును. 'ఆశ్చర్యమును తెలిపెడి' అని శ. ర.

అట్టెడ. దే. వి. 1. నూతిలోనిమన్ను మొదలగునవి పయికి తీయుటకు సాధనమగు బద్దలతట్ట; 2. నెరసులు మట్టిపెల్లలు తీసివేయుటకై కూర్చిన జల్లెడవంటితడిక; 3. పంతెన.

అట్ఠము. వై. గ్రా. వి. వేదభాగము, అష్టకము. "ఆయన ఏడట్ఠాలసంహితయు పారాయణచేసినాఁడు." "వాఁడు ఎనిమిదవ అట్ఠము పారాయణ చేయుచున్నాఁడు"=బూతులు తిట్టుచున్నాఁడు. (వేదము ఏడట్ఠములే కాన ఎనిమిదవఅట్ఠము, తొమ్మిదవ అట్ఠము అనువానికి బూతులు, తిట్లు అని వాడుక గల్గినది.

అట్లు. దే.=అటు. "క. అమరవరులందుఁ బురుషోత్తముఁ డెట్లు విశేష మట్లు ధరణింగలతీర్థములందును బుష్కరతీర్థముఁ గరము విశేష మభిమతార్థప్రదమై." భార. అర. ౨, ఆ. ౨౮౯.

అట్లువోలె. దే. = అట్టువోలె. "తే. ...ఉచ్చారణదక్షుచేత, నభిహితంబగుశబ్దంబు నట్లువోలె." భార. ఆది. ౩, ఆ. ౧౨౭. "వ. అని యిట్లెఱుంగనివాఁడయి యడిగెడు నట్లువోలె నిందాగర్భంబుగాఁ బలికిన. భా. అశ్వ. ౩, ఆ. ౩౦. 'అట్లపోలె' ముద్రితపాఠము. "తే...గుహుఁడు, శరధిచోరఁబాఱ ధారిణీధరము పిఱుఁద, నంటఁ దగులు మహాశని యట్లువోలె." కు. సం. ౧౦, ఆ. ౭౩.

అడ. దే.వి. 1. ముద్ద; "సీ. అడలవెన్నెలఁ జక్కెరిడి చొక్కవెన్నెలఁ బూనిక నాళీలుగానుగూర్చి." య. ౨, అ. ౮౩. ఇట ఎడలవెన్నెల అని పాఠాంతరము; 2. చింతపండు మొదలగునవి త్రొక్కిచేసిన ఉండ; 3. పోఁకచెక్క; చూ. అడకొత్తు, అడగొంటు; 4. ఆకృతి. చూ. అడపొడ.

అడఁకువ. దే. వి. అణఁకువ, అడఁగియుండుట, నమ్రత.

అడఁగారు. దే. అ. క్రి. 1. అడఁగు, ఉపశమిల్లు, తగ్గు; 2. క్రుంగు, అడుగంటు, నశించు.

అడఁగు. దే. అ. క్రి. 1. తగ్గు; 2. ఉపశమిల్లు; 3. నశించు; "చ. అడఁగఁగనీక శంతనునియన్వయముం గలిగించి తీవ యిప్పుడు దగ నీమతంబునన పొం దొడఁగూడఁగఁ జేర్చి పౌత్రులన్, సడికిన ధర్మవృత్తికిని జావునకుం దొలఁగించి మన్చినం, బుడమిజనంబు రాజులును భూసురులున్ నినుఁ బ్రస్తుతింపరే." భార. ఉద్యో. ౧, ఆ. ౩౭౩; 4. లోఁబడు, విధేయమగు, లొంగు; 5. నమ్రమగు.

అడంగు. హిం. వి. 1. మొదటిచోటు. "మొన్ననే అడంగున బయలుదేరితిమి. త్రోవలో ఆఁగవలసివచ్చినది;" 2.—బ. అడంగులు, గ్రామసంబంధమగు మొదటి లెక్కలు మొదలగునవి. "అడంగులు తయారుచేయవలెను నాకు తీరికలేదు." —విణ. తగులుబడియైనది. అని శ. ర.

అడఁచు. దే. ప్రే. 1. అడఁగఁజేయు, అడఁగించు, అడఁగునట్లుచేయు; 2. అపహరించు. "సీ. క్రయవిక్రయంబులఁ గపటంబుదఱచగుఁ గడఁగి యిల్లడసొమ్ము లడఁచికొంద్రు, సాధుచరితులైన జనులు దుర్గతుల రోగములఁ జెగుదు రల్పకాలమునన." భార. అర. ౪, ఆ. ౨౯౪. 'అనుప్రయుక్తమైన అడఁగుధాతువునకును రూప మిట్లె యుంగునది.' అని శ. ర. స్వతంత్రముగాను గలదు,

అడకత్తు. దే. = అడకత్తెర. కొన్నిచోట్ల వాడుక.

అడకత్తెర. ద్వ. వి. (అడ+కత్తెర) పోఁకలు కత్తిరించుకత్తెర. చూ. అడకొత్తు.

అడకము. దే. విశే. లోపలనణఁగినది, అంతర్భూతము. "ద్వి. నానామరేంద్రబృందముమాయ లెల్ల, హరిమాయలోపల నడకముల్." విష్ణు. పూ. ౧, ఆ.

అడకించు. దే. స. క్రి. 1. ఉల్లసమాడు, ఉడికించు. "చ. పలికిన నట్లయున్నదియె పత్రికలో నడకించెనో ననున్, జెలి యిటు చూపుమా యనుచుఁ జేరఁగఁ బోవుచుఁ జేయిసాఁచె నా, యలినిభవేణి తత్సఖియు నట్టిటుపాఱుచు దేవునానయోఁ, గలయదియంతయుం జదువఁగా విను చూచెదుగాని నావుడున్." ప్రభా. 3, ఆ. ౧3౫; 2. వంచించు, మోసపుచ్చు. "గీ. అకట నీవునన్నునడకించి పోఁజూచె, దేను మోసపోనుగానిగోవ, యడవిలోన నున్న యంతసె పులి యింత, యెఱుకలేనిదయ్యెనే తలంప." భో. ౬, ఆ. ౬.

అడకొత్తు. దే. వి. (అడ+కొత్తు; క. అడకొత్తు. కొత్తు = ఖండించు అని కన్నడము. అడకాయ+ఒత్తు అని శ. ర.) శంకుల, పోఁకలు కత్తిరించు కత్తెర, అడకత్తెర. "ఉ. ఓర్వదు బంధుజాలమడకొత్తున నొత్తును మామగారు." శశాం. 3, ఆ. ౬౭.

అడఁగుబొద్దు. దే. వి. బేలుదారి లోపల నణఁగియుండునట్లు గోడయంచులయందు గీటి యేర్పఱచెడు బొద్దు. అని శ. ర.

అడగొంటు. దే. వి. 1. పోఁకచెక్కముక్క; 2. పుప్పిచెక్క. "క. గడెతడవు వేసటలచే, నుడివడకటు తనదు ప్రాఁతసుద్దులు విన్నన్, వడి నిచ్చు నొక్కపుచ్చిన, యడగొంటుం బడుకక్రింది యాకులు రెండున్." శుక. 3, ఆ. ౨౨.

అడగొను. దే. అ. క్రి. (అడ+కొను.) అడకట్టు, ముద్దకట్టు.—స. క్రి. ముద్దగాఁజేయు, ప్రోగుచేయు. "క. కడతలయుద్ధంబులుసెర, విడి నొండొరు నంటఁదాకి ప్రేసిరి పెలుచన్, గడిఖండము లడగొని చక్కడిచినక్రియ నుర్వు నూఁచమై పడఁ బోరన్." కు. సం. ౧౧, ఆ. ౧౫౦.

అడగోలుకొను. దే. స. క్రి. (అడ+కోలుకొను.) 1. వశముచేసికొను, వశపఱచుకొను. "ఉ. అవె శంకరార్ధదే, హంబడగోలుకొన్న సతియప్పుశరూపవిలాసగేయముల్." హరి. ఉ. ౬, ఆ. ౧౯. 'అఱగోలు' పాఠాంతరము. "క. నాయింటి మొల్లము నకును, నాయొడలికిఁ బ్రాణములకు నావారికిఁ దా, నాయికయై వలనేర్పడ, నాయంబుజనేత్ర నన్ను నడగోల్కొనియెన్." దశ. ౫, ఆ. ౫౫; 2. అపహరించు. "సీ. ఇల్లడసొమ్ము, నడగోలుకొని త్రోచుపతసిగతికి." భో. ౬, ఆ. ౧౪.

అడచిపడు. దే. అ. క్రి. అడిచిపడు, ఎగిరిపడు, గర్వించు. "వ. నీవిట వలని పెద్దఱికంబున నడచిపడకుండుమనియె." కాశీ. ౫, ఆ. ౮౯.

అడజెడి. దే. వి. అలజడి, దుఃఖము.

అడజెడిపెట్టు. దే. స. క్రి. దుఃఖపెట్టు. "చ. న, న్నడజడిపెట్టుమాట యిటు లాడఁగఁగూడునె యీాయకార్యముల్, విడువు లతాంగి." మార్క. ౧, ఆ. ౧౯౯.

అడదడి. దే. వి. ప్రభుత్వము. శ. ర.

అడది. వై. వి. పచ్చెదనము, హరిద్రావర్ణము.

అడప. దే. వి. 1. అడపకత్తియ. "చ. కలికివరాటరాజడప కప్పురపీడెము వెట్టె వంచనన్, నలునడపంబువానికి ఫణాధరపల్లి దళాంతరంబునన్, బలితపుఁదేలు మైనమునఁ బన్ని యతం డదిసూచి భీతిఁ దమ్ముల మిలవైచిన న్నగిరి మూఁగిన రాజకుమారులందఱున్" వై. ౬, ఆ. ౧౪౧. 'రాజపుడు' అని పాఠాంతరము; 2. అడుప, పశుపాదరోగవిశేషము.

అడపకత్తియ. దే. వి. (అడపము+కత్తియ.) అడపముఁ బట్టుకొనెడి యాఁడుది, తములపాకుల సంచి పట్టుకొను స్త్రీ, అడప.

అడపకత్తె. దే.= అడపకత్తియ. "తే. కప్పురపుఁదావి చిలుకు బాగాలొసంగ, నడపకత్తెలు తెలనాకు మడుపు లొసఁగ, నందియలు మ్రోయ వాస్థాని కరుగుదెంచె, దింతు లలకంతు పట్టపు దంతు లనఁగ." వైజ. ౧, ఆ. ౧౧3.

అడపకాఁడు. దే. వి. అడపముఁ బట్టుకొనియుండువాఁడు, తమ్ములపుసంచి పట్టుకొనువాఁడు.

**అడపట్టియ.** ద్వ. వి. **1.** పొలములో విస్తరములు చల్లి చదును చేయుటకై ఎడ్లనుకట్టి యీడ్పించు బల్ల; **2.** దమ్ముఁజేసిన పిదప నారు ఊడ్చుటకై మళ్లు సమమగుటకు ఎడ్లను కట్టితోలెడు బల్ల.

**అడపట్టె.** ద్వ. = అడపట్టియ.

**అడపతడప.** దే. అవ్య. = ఎడపదడప. ఇది వాడుక లో ప్రసిద్ధము.

**అడపది.** దే. వి. అడపము పట్టుకొనెడి స్త్రీ. "సీ. హెచ్చువాసనవక్కలిచ్చి చుట్టినయాకు మడుపు లీఁ దివిరెడు నడపదాని." ఉ. రా. ౪, ఆ. ౨౨౩.

**అడపము.** దే. వి. (క. అడపవు; త. అడ్డైప్పం.) **1.** తములపాకులు, వక్కలు మొదలగునవి పెట్టుకొనెడి సంచి, వక్కలాకులతిత్తి; **2.** మంగల తిత్తి.

**అడపొడ.** దే. వి. జాడ, స్వరూపము. "చ. అతండు ...వారియీసుచే నడపొడలేకపోయె." కళా. ౭, ఆ. ౪౪. "చ....ధూర్జటికంటి కడిందిమంటలో, నడపొడ గానరాక తెగటాఱియు." స్వా. 3, ఆ. ౪౬. (అడ అనునది వ్యస్తముగాఁ గనఁబడ లేదు.)

**అడబాల.** దే. వి. (క. అడబళ, అడవాళ్ల, అడవళ. హట్టపాల శబ్దభవమని కొందఱు. కన్నడమందలి రూపమునుబట్టి అడబాళ్లు అను రూపము ఏక వచనమే అనఁదగునుగాని అడబాలలు అను ప్రయోగముండుటచేతే అడబాల అను రూపము ఏకవచనముగా గ్రహింపఁబడినది.) వంటవాఁడు. వంటలక్క అనియు శ. ర. "ద్వి. బండారులను నడబాళ్లఁ బ్రెగ్గడల, వండనాయకులనుఁ దంత్రపాలకుల. బస. ౭, ఆ. ౨౩, పు. "క. రాజునగరి యడబాలలు, రాజీవము కడుపు వ్రచ్చి రాజనిభాస్యున్, రాజశిశువుఁ గని చెప్పిరి." భాగ. ౧౦, స్కం. ఉ. ౭.

**అడరు.** దే. అ. క్రి. **1.** అతిశయించు, హెచ్చు. "క. ఆపాదమస్తకము తద్రూపము వీక్షించుచుం గుతూహలమడరన్." భార. విరా. ౧, ఆ. 3౧౧; **2.** విజృంభించు; "వ. కాలరుద్రులం బోలెనడరుచు." వీర. ౪, ఆ. ౧౫౨; **3.** వర్ధిల్లు; "క. ఈరీతి నౌబళేశము, హీరమణునివంశ మడరె." రామా. ౧, ఆ. ౪౪; **4.** వ్యాపించు, ప్రసరించు. "క. వఱపులు మనచేరువఁ బె, ల్లఱచుట బెట్టైదురుగాలి యడరుట." భార. కర్ణ. ౨, ఆ. ౧౧౬; **5.** కలుగు. "క. కడులజ్జయుదైన్యంబును, నడరి." భార. అర. ౬, ఆ. ౧౪; **6.** పూను. "క. మీరాఁకలిపెల్లున నా, హారంబుగ శవముఁగొనుట కడరితిరి. భార. అను. 3, ఆ. ౨౧౨. "తే. ఇట్టి గోరత్న మొక్కనాఁ డేకతంబ,పోఁకమేయుచు నుండబెబ్బులియొకండు, దానిఁగని పొంచి యొడలెల్లదాఁచి వాల,మవనిఁ దాటించుచును వ్రేయ నడరుటయును." భో. ౪, ఆ. ౧౭౯.—వి. ఆధిక్యము. "క. గొనముల సంద్రమ.యిత్తెఱఁగునఁ జాలుపుఁదేర్ల జేఁదు కొదయొదవనిపెం, పున నడరొందుచు." అచ్చ. అయో. కాం. 3.

**అడరించు.** దే. ప్రే. **1.** అడరఁజేయు; **2.** బాణాదులు ప్రయోగించు. "చ. హయములమీఁద సూతుపయి నాతనియంగములందు నస్త్రసంచయ మడరించి." భార. ద్రోణ. ౨, ఆ. ౫౪.

**అడరుచు.** దే. ప్రే.=అడరించు. "ఉ. వెండియు నాగ్రహంబున సువేగునిమధ్యము ద్రెవ్వ నొక్కబల్, కాండ మడర్చె." జై. ౭, ఆ. ౧౦.

**అడరుదెంచు.** దే. అ. క్రి. (అడరు+తెంచు.)= అడరు. "ఆ. రెండుదరులుముంచి యొండొండ వెల్లువ, యగ్గలింప నురువు లడరుదేర, నతిరయమునఁ బఱచునయ్యేటిపఱ్ఱోడి, పోయె దవ్వుఁగాఁగ భూమిభుండు." మార్క. ౫, ఆ. ౨3౦. ఇట "విజృంభించు" అని అర్థము.

**అడలడి.** దే. వి. **1.** అలజడి, కలవరము. "వ. ఇట్లు దలంబగు నడలడిం బడి కదలుచు నింకందడయుటుచితంబుగాదు." కు. సం. ౧౦, ఆ. ౪౧; **2.** దుఃఖము. "చ. అడలడిఁ బొందఁగాఁ దగని యట్టిది ద్రోవది మేరుకల్పులం, గొడుకులసేవు రన్ జముఁడుగొన్న నలందురఁ జూడనేర్తునే." భార. శాం. ౧, ఆ. ౨౦౨. 'అడజడి' పాఠాంతరము.

అడలు. దే. అ. క్రి. 1. ఏడ్చు, విలపించు. "క. అనుచుం దొరఁ గెడునశ్రుల, మునిఁగిన మోముతనవక్షమునఁ జేరిచి య, వ్వనితయవస్థయ తాల్చుచు, ననిలను తుం డడలె దేహ మలమటఁ బొందన్." భార. విరా. ౨, ఆ. ౨౨౨. "సీ. అని విలాపింప నూరార్చియేటికిఁ గ్రేపుఁ బాసి గో డ్డొ అలెడి పగిది నడలె, దు." జై. ౬, ఆ. ౨౬౫; 2. శోకించు. "క. కొడుకులదెస సెప్పఁగఁ జే, డ్పడి వందురియు న్నయా నృపాలునడుగులం, బడి భీష్మపాటు సెప్పుచు, నడలి కడున్నాద మెసఁగ నాక్రందించెన్." భార. భీష్మ. ౧, ఆ. ౪౫; 3. భయపడు.— వి. 1. శోకము. "వ. ధర్మనందనుండు వెడవెడఁ దెలిసియు మగుడనిగుడునడలున." సం. "తత స్తత్ర మహాన్ శోకః ప్రాదురాసీ న్మహాత్మనః." భార. సౌ. ౨, ఆ. ౨౨; 2. భయము. "సీ. పల్లెరంబిడులోనె పాఱుపత్తెము సేయు నతివకా యిందఱ కడలుఁగుడుపు" పాంచా. 3, ఆ. ౨౨. "వాని పేరుఁ జెప్పిన అందఱకును అడలు."

అడలుకొను. దే. అ. క్రి. 1. అడలు, శోకించు. "తే. అత్తెఱంగెల్ల నాలించి యపుడు చాల్పు, టరద ములదొర తద్దయు నడలుకొనుచు." అచ్చ. అయో. కాం. ౧౭; 2. భయపడు.

అడవి. వై. వి. అటవి, అరణ్యము.

అడవికంద. ద్వ. వి. సర్పనాళము ♣ ఒకదినుసుకంద.

అడవికాఁకర. ద్వ. వి. వనకారవెల్లము♣.

అడవికిక్కిస. ద్వ. వి. దేవనాళము♣.

అడవికుక్క. వై. వి. తోఁడేలు, అరణ్యశునకము.

అడవికోడి. ద్వ. వి. వనకుక్కుటము.

అడవిగెనుసు. ద్వ. వి. పిండాంశుకము♣.

అడవిచెఱకు. ద్వ. వి. కాంతారము♣.

అడవిచేమ. ద్వ. వి. శకుటము♣.

అడవితిరుగుడు. ద్వ. వి. కోఁతి, వనచరము.

అడవితొగరి. ద్వ. వి. తువరిక♣.

అడవితొలసి. వై. వి. క్షవకము♣.

అడవిదున్న. ద్వ. వి. వనమహిషము.

అడవిదోమ. ద్వ. వి. దంశి, అరణ్యమశకము.

అడవినట్టు. ద్వ. వి. అడవితిరుగుడు. (ఇట్లు అడవి సెలవు, అడవిమనికి, మొ.)

అడవినువ్వులు. ద్వ. వి. జర్తిలము.

అడవిపంది. ద్వ. వి. వనసూకరము.

అడవిపెసలు. ద్వ. వి. వనముద్గము.

అడవిప్రత్తి. ద్వ. వి. భారద్వాజీ♣.

అడవిబచ్చలి. ద్వ. వి. వనోపోదకి♣.

అడవిబీఱ. ద్వ. వి. కోశఫల♣.

అడవిమల్లె. వై. వి. అస్ఫోట♣.

అడవిమామిడి. ద్వ. వి. ప్రియాలము♣.

అడవిమామెన. ద్వ. వి. శారిబా భేదము♣.

అడవిమునగ. ద్వ. వి. వనశిగ్రువు♣.

అడివిమేఁక. ద్వ. వి. ఇడిక్కము♣.

అడవిమొల్ల. ద్వ. వి. యూథిక♣.

అడవియులవలు. ద్వ. వి. వనకుళుత్థము.

అడవిసదాప. ద్వ. వి. శాలేయము♣.

అడవీఁగ. ద్వ. వి. దంశము.

అడవిపిల్లి. ద్వ. వి. వనమార్జాలము. "సీ. కుంజమంట పసుటీ క్రోడమధ్యంబున నాఖుతోఁ జెలులాడు నడవిపిల్లి." కాశీ. ౨. ఆ. ౪౩.

అడసాల. వై. వి. వంటయిల్లు, మహానసము.

అడావుడి. హిం. వి. 1. ఆటోపము; 2. తొందర; 3. కలవరపాటు, తొట్రుపాటు.

అడి. దే. విశ. 1. అధికము. "క. అడిసిగ్గులు తమ కంబులు, నుడివోవఁగ." మార్క. ౮, ఆ. ౧౮౫; 2. వ్యర్థము. "క. అడివీరపుఁదులువ గెలుచు నటె పాండవులన్." భార. ద్రో. ౪, ఆ. ౧౮౪.—వి. (త. క. అడి.) తెనుఁగున వృత్తి యందే కనఁబడుచున్నది. 1. పాదము. "అడి గట్టు;" 2. క్రిందిభాగము. "అడిగండ్లు."

అడిగండ్లు. దే. వి. బ. (అడి+కండ్లు. అడుగు+కండ్లు అని శ. ర.) బియ్యము మొదలగునవి నేమఁగా అడుగున నిలిచిన రాళ్లు. "ఆ. అడిగండ్లు మలి గండ్లు, తిరిపమిడెడు కటికిదే బెల్లె." వేమన-3, 34.

అడిగము. దే. వి. భారవిశేషము, పరిమాణభేదము. "చ. తఱగము లాసు కంట్లములు తండిగముల్

సలకల్ డడెల్ కుతూ, గణములు చెక్కుగుంపు లడిగంబులు." హంస. ౫, ఆ. ౯౭.

**అడిగట్టు.** దే. వి. (అడి+కట్టు. అడుగు+కట్టు. అని శ. ర.) పావ, పాదుక, పాదములకుఁ దొడుగు కట్టుజోడు. "ద్వి. హరగణంబులకెల్ల నడిగట్టు ననిన." ప్రభు. ౮, ఆ. ౧౮౮. పు.

**అడిగికొను.** దే. స. క్రి. = అడుగుకొను. **1.** ప్రార్థించు. "తే. పశువుఁబట్టినకైవడిఁ బట్టి తెచ్చి, బందిగములోన శృంఖలాబద్ధుఁ జేసి, పెక్కు వత్సరములు చెఱఁబెట్టి విడిచె, నాపులస్త్యాది మౌనీంద్రు లడిగికొనఁగ." వి. పు. ౬, ఆ. ౨౦౦. "తే. హరికి సఖుఁడును రథమును నగు గరుడుఁడు, దొరకినమృతంబు సురలకు మరల నిచ్చి,యహులు గూడుగ వరమున నడిగికొనఁడె? యమృతమైనను జవుల జాత్యస్నసమమె?" ఆము. ౬, ఆ. ౩౪. "సీ. బలిమాలినను బయల్పడసేనియంగముల్ సోరిది ముచ్చట దీఱఁజూచి చూచి, ప్రార్థించినను...... వేఁడుకొన్నను.... ...అడిగికొన్నను మొగం బిడసేని చెక్కిళ్లు ప్రేమదీఱఁగ ముద్దుపెట్టిపెట్టి." కవిరాజ. ౫, ఆ. ౧౮౮; **2.** యాచించు. "వాఁడు ఊరూర డబ్బుడబ్బుచొప్పున అడిగికొని పదివేలు గడించినాఁడు;" **3.** ముష్టియెత్తుకొను, యాయావరము చేయు. "ఇప్పుడు చదువుకోక పోయినచో పెద్దవాఁడవై అడిగికొని బ్రదికెదవా?" "అంత లేక పోయినచో అడిగికొనియెదఁ గాని నే నిట్లు చేయను."

**అడిగికోలు.** దే.=అడుగుకోలు.

**అడిగొంటు.** దే. విణ. (అడి+గొంటు)=అడిగొట్టు.

**అడిగొంటుతనము.** దే. విణ. కుజనత్వము, కుత్సితుఁడగుట.

**అడిగొట్టు.** దే. విణ. (అడి+గొట్టు.) కుజనుఁడు, కుత్సితుఁడు. "గీ. కటఁటి యడిగొట్టు పలువ ...యేకరి గరాసు, ... కుజనాఖ్యనాఁజెలంగు." ఆం. భా. తృ. వి. ౭.

**అడిచిపడు.** ద్వ. అ. క్రి. **1.** తమకించు, త్వరపడు. "క. జడనిధిచందంబున ని, మ్మడువొప్పఁగ నిప్పడేమి మాఁడెను నిష్ఠై,నడిచిపడ రిత్త సెప్వగ,లుడుగుఁడు మఱిచూచికొంద మెయ్యనతఱితోన్." భార. శాం. 3, ఆ. ౧౮౯. (మాఁడెనెయి నిష్ఠై, మాడీననిష్ఠై నడిచిపడియెదరు సెప్వగ, మాలెను నిష్ఠై నడిచిపడ రిత్త సెప్వగ-అని పాఠభేదములు కలవు); **2.** కోపగర్వాదులవలన ఎగిరిపడు. "ఆ. నీకు వృద్ధసేవ లేకున్కి యెఱుఁగంగ, నయ్యో రిత్త యిట్టు లడిచిపడుటఁ,బట్టి ధర్మవిధి విభాగజ్ఞులైనవా, రేలచేయఁజొత్తు రిట్టిదాని." భార. కర్ణ. 3, ఆ. ౭౧. "వ. దైవోపహతంబులగు కార్యంబులు సిద్ధిఁబొందునె యడిచి పడవలదు." భార. సౌప్తి. ౧. ఆ,౪౪; **3.** మండిపడు. "తే. అడిచిపడు నాజ్యహోమ మంత్రాహుతులకు." నై. ౪, ఆ. ౩౨.

**అడిచిపాటు.** ద్వ. వి. అడిచిపడుట, తొందర, త్వర. "సీ. సమర ముపేక్షించి శాంతిమైనుండెద నడిచి పాటేటికి." భార. భీష్మ. 3, ఆ. ౩౯౬; **2.** గర్వము, ఎగిరిపడుట.

**అడితి.** దే.వి. (త. అడిత్తి=లాభము.) **1.** ఇతరుల సరకులు అమ్మిపెట్టుటకును, వారికి కావలసినవి కొని పెట్టుటకును ఏర్పఱచుకొనిన లాభము, "పరులవలన నీవు పుచ్చుకొను వాడుకచొప్పున నడితి పుచ్చుకొనుము." నీతి. పు. ౧౯౬; **2.** కట్టులు మొదలగు వాని నమ్ము చోటు. "కట్టు లయడితి."

**అడితిదారు.** దే. వి. అడితి పుచ్చుకొని సరకులమ్ము వాఁడు.

**అడిత్రాగుడు.** దే. వి. (అడి+త్రాగుడు = అడుగున మిగిలినది త్రాగుట. అడిగి+త్రాగుడు. శ. ర.) **1.** చాలనితిండి, అర్ధాన్నము; **2.** కఱవు, దుర్భిక్షము. "క. అడిత్రాగుడనక యిప్పటి, కడిఁదికినే మాంసమైన గ్రక్కునఁ గొసిరం, డెడసేయ కనుచు ననిపినఁ, గదువడి నలఁవురును బోయి గహనములోనన్." పంచ. నా. ౧, ఆ. ౩౯౫; శ. ర.—ఇట "పడిఁ బోయినార లిప్పటి, కడిఁదికి." అని పాఠాంతరము. శ. ర. పాఠమునను 1-వ అర్థమే సరిపడును.

**అడిదపుమెకము.** ద్వ. వి. (అడిదము+మెకము.) ఖడ్గమృగము.

అడిదము. దే. వి. కత్తి, ఖడ్గము.

అడిబంద. ద్వ. వి. అధముఁడు, దుష్టుఁడు.

అడియఁడు. దే. వి. (త. అడియర్.) (అడి+అఁడు, అడుగు+అడు. అని శ. ర.) పాదసేవకుఁడు, దాసుఁడు. "సీ. దండంబు దర్పితోద్దండ రక్షోహర్త కడియండ జాతరూపాంబరునకు." రుక్మాం. ౧, ఆ. ౧౨౩.

అడియరి. దే. వి. (అడి+అరి.) కింకరుఁడు, పరిచారకుఁడు. "సీ....ఇంక, నడియరితనమున నప్పాండవుల నాశ్రయింపఁగఁజాల." సం. "కథమస్య భరిష్యామి ప్రేష్యభూతో దురంతకృత్."భార. సౌ. ౧, ఆ. ౭. (ఇట కడుపు కక్కుఱితివాఁడు అనియర్థము చెప్పవచ్చును.)—విణ. పిసినిగొట్టు, కడుపు కక్కుఱితి వాఁడు, లోభి. "క. యాగార్థ మడిగినర్థము, యాగమునకుఁ బెట్టవలయు నడియరియై తా, భోగార్థముగా దాఁచిన, యాగమ బాహ్యుండు కాకియై జన్మించున్." విజ్ఞా. ఆచా. కాం. ౪౭. "ఆ. వాదులానితోడ వాట్లీనితోడను, బూతుతోడఁ దిండిపోతుతోడ, నటమటీనితోడ నడియరితోడను, వెలకు నెత్తమాడ వెరవుగాదు." ఉ. హరి. 3, ఆ. ౧౧౨.

అడియాలము. దే. వి. (అడి+ఆలము.) చిహ్నము, ఆనవాలు. "వ. అందఱకు సంజ్ఞలు నడియాలంబులుం గల్పించి దొరలదెసం గనుంగొని మన మీరణంబునందు ధరణీ రాజ్యంబు వడసెదము." భార. భీ. ౧, ఆ. ౧౨౨.

అడియాస. వై. వి. (అడి+ఆస.) వచ్చునసెడి యాశ, ప్రత్యాశ. "ఉ. అక్కట మోసపోయి యడియాసలఁ జావకయున్నదాన." భార. విరా. ౨, ఆ. ౨౭౬.

అడియొత్తు. దే. వి. (అడి+ఒత్తు.) అడిగట్టు. "ద్వి. జన్నిదంబులు చిక్కుజడలును బెట్టి, యడియొత్తు నుంచి." భాగ. ౫, స్కం. అని శ. ర. "జన్నిదంబులువెట్టి జడలను బెట్టి, యడిపొత్తి సంచి కచ్చడము సంధించి." అను పాఠముతో బస. ౫, ఆ. ౧౬౨ పు. లో నున్నది.

అడిసాటా. దే. వి. (అడితి+సాటా.) వచ్చిన సొమ్ములో కొంత తగ్గించుకొనెడి యేర్పాటుగల బేరము.

అడుకు. దే. స. క్రి. దొంతరగాఁ బేర్చు, ఒకదానిపై నొకటి పెట్టు.—వి. 1. దొంతి; 2.—బ. చిపిటములు, నీటిలో నానఁబెట్టి వేఁచి దంచిన వడ్లు; అటుకులు అని వా. "క. అడుకులు దిన్నట్లగునే, కడుపునఁ గుట్టెత్తినపుడు." భార. ద్రో. ౪, ఆ. ౪౯.

అడుగంటు. దే. అ. క్రి. (అడుగు+అంటు.) 1. అడుగునమాఁడు; 2. ఇగురు, పట్టు; 3. మొదలు తాఁకు; 4. మొదలు నశించు.—విణ. బ. 1. అడుగున నిలిచినవి. (రాళ్లు మొ.); 2. అధమములు. "ఉ. లేకి నిధివ్రజంబు లవలేశము కాంచనభూధరంబు ర,త్నాకరరత్నరాసు లడుగంట్లు మరున్మణికామధుక్సురా, నోకహముల్ క్రయోచితవినూతనవస్తువు లిట్టివట్టివన్, వాకల కంచరాని పురవైశ్యులసంపద లెన్ని చూపు చోన్." కవిక. ౧, ఆ. ౧౧. పైరెండర్థములకు నిదియె యుదాహరణము.

అడుగు. దే. స. క్రి. 1. ప్రశ్నించు; 2. యాచించు; 3. కావలెనని చెప్పు, కావలెనని కోరు. "వాఁడు పుస్తకము నన్ను అడిగి తీసికొనెను."—వి. 1. అడుగువైపు, క్రిందు; 2. పాదము, అంఘ్రి. "సీ. ఆకురాలుపుగండ్ల నానెడు నాస నిం, తడుగూది బంకంటి యంగలార్చి." ఆము. ౫, ఆ. ౧౧౭. చూ. విణ. ఉదా.; 3. పాదప్రమాణము, పద్యచరణము, పద్యపాదము.—విణ. అధమము. "ఆ. కొమ్మ, యడుగులకును జిగురు లడుగులయ్యె." అని. ౧,ఆ. ౪౪.

అడుగుఁదమ్మి. దే. వి. పాదపద్మము.

అడుగుఁబుట్టువు. ద్వ. వి. (విష్ణుపాదమునఁ బుట్టినది.) 1. ఆకాశగంగ; 2. శూద్రుఁడు.

అడుగుకొను. దే. = అడిగికొను.

అడుగుకోలు. దే. వి. 1. ప్రార్థన; 2. యాచన; 3. ఆయవారమెత్తుట.

అడుగుతాటించు. ద్వ. స. క్రి. 1. కాళ్లతోఁ దన్ను. "తే. తన్నెఁ దాఁచె, నడుగుతాటించెఁ గాళ్లఁ జే నడఁచెననఁగ, నమరుఁ బదతాడనాభిధానములు సాంబ." సాం. మా. 3౪; 2. (బాధచే) కాళ్లు తన్నుకొను, కాళ్లుకొట్టుకొను.

అడుగుపడు. ద్వి. అ. క్రి. 1. క్రిందగు; 2. అధమమగు.

అడుగు పఱచు.— దే. ప్రే. అడుగుపడఁజేయు. "క. లలిఁ గొప్పెక్కించితి మధు, పుల శుకులను నడుగుపఱచి పుష్పాస్త్రా మా, లలకను మంచంబులు బోఁ, పలుకును బీఁట లనుమాట బళి నిజమయ్యెన్." చంద్రా. ౫, ఆ. ౯౧.

అడుగుపెట్టు. ద్వి. అ. క్రి. 1. పాదముంచు; 2. ప్రవేశించు; 3. (గిన్నె మొ. దానికి) అడుగు భాగము అమర్చు.

అడుగుమాలిపోవు. దే. అ. క్రి. నిర్మూలమగు, మొదటికి నశించు. "తే. అనుజతనుజులుం జెలులు వియ్యములు నడుగు, మాలిపోదురు." భార. ఉ. 3, ఆ. "నడుమ, మడిసి పోదురు." అని పాఠాంతరము.

అడుగుముట్టు. దే. అ. క్రి. 1. నిర్మూలమగు; 2. అట్టడుగుతాఁకు, అడుగంటు. "సీ. కడలిఱేని బిడార మడుగుముట్టఁ గలంచి." వసు. ౪, ఆ. ౧౨. (పైరెంటికి నిదియే ఉదాహరణము.)

అడుగువాలుపులుఁగు. ద్వి. వి. చరణాయుధము, కోడి.

అడుచు. దే. స. క్రి. కొట్టు. "క. క్షితినాథ కడు నకరుణాన్వితులై సీతమ్ము లతివివేకవిదూరుల్ మతిఁ దలఁపక నాపుత్రకు,నతిబాలకు ననపరాధు నడిచిరి పెలుచన్." భార. ఆది. ౧, ఆ. ౨౫. "క. మదమున పెలుచన యొకగా, డిదకొదమం గోలఁగొని యడిచె." భార. అను. ౧, ఆ. ౨౯.

అడుజు. దే. వి. ఒకజాతిడేగ, అణుజు.

అడుప. దే. వి. పశువులకాళ్లయందుఁ గలిగెడు వ్యాధివిశేషము. "సీ. పశుపాదరోగంబు పరఁగు నడుపయన." ఆం. భా. ద్వి. మ. ౧౨౫.

అడుపు. దే. వి. అడుచుట, దెబ్బ, తాడనము.

అడువ. దే. విశ. (అడుగు పట్టినది.) ప్రాఁత, పురాతనము. "అడువసరకులు." శ. ర.

అడువు. దే. స. క్రి.=అడుగు. "తే. అనుచు మన్యువేగంబున నడువ." (ఇట అడుగుట యనియు, కొట్టుట యనియు రెండు అర్థములు.) హంస. ౫, ఆ. ౧౩.—వి. అడుగు, పాదము.

అడువుఁబుట్టువు. దే. వి. (అడువు+పుట్టువు.) = అడుగుఁబుట్టువు.

అడుసు. దే. వి. బురద, పంకము. "అడుసు త్రొక్కనేల కాలు కడుగనేల?" (సామెత.)

అడుసుపుట్టువు. దే. వి. (బురదలోఁ బుట్టినది.) పంకజము, తామర.

అడ్గు. దే. స. క్రి. = అడుగు. "ద్వి. హరుఁడు ప్రత్యక్షమై యడుగడ్గుమనిన." పండి. పర్వత. ౩౨౭ పు.

అడ్డ. దే. వి. గుంటక లోనగువానిదిండు. (గుంటక = విత్తనములు చల్లిన తరువాత నేల సరిచేయు సాధనము.)—వై. వి. 1. కుంచములో సగము; 2. అడ్డము. ఈ యర్థమున వృత్తియందే కాన్పించుచున్నది.

అడ్డంకి. దే. వి. అడ్డి, నిరోధము.

అడ్డకట్ట. దే. వి. (అడ్డ + కట్ట.) ఏఱులోనగువాని నీళ్లు వెలికిఁ బోకుండునట్లు కట్టినకట్ట, ఆనకట్ట.

అడ్డకట్టు. దే. స. క్రి. (అడ్డ+కట్టు.) అడ్డగించు, నిరోధించు, అరికట్టు. "తే. అపరకాలుఁ డడ్డ, కట్టుకొని యున్నవిపినమార్గమున." పర. ౪, ఆ. ౨౦౪.

అడ్డకత్తి. దే. వి. (అడ్డ+కత్తి.) పట్టాకత్తి, పట్టిసము.

అడ్డకమ్మి. ద్వి. వి. (అడ్డ+కమ్మి.) లత్తుకమ్మి, గుమ్మముకమ్మి, నాస.

అడ్డకఱ్ఱ. దే. వి. (అడ్డ + కఱ్ఱ.) 1. అడ్డు, విఘ్నము. "వాఁడు ఏపనికైనను అడ్డకఱ్ఱ వేయక మానఁడు." (అడ్డకఱ్ఱ వేయు=విఘ్నము చేయు); 2. సుఖరోగవిశేషము. (వానికి అడ్డకఱ్ఱలు తగిలినవి. బాధపడుచున్నాఁడు.)

అడ్డకొడమ. దే. వి. (అడ్డ+కొడమ.) చేఁపలఁబట్టు సాధనవిశేషము. "తే. కొడమ తి ఱ్ఱడ్డకొడమ ద్రొబ్బుడుపటంబు." హంస. ౪, ఆ. ౧౨౪.

అడ్డగాలు. దే. వి. (అడ్డ+కాలు.) అడ్డముగాఁబెట్టిన కాలు, అడ్డకఱ్ఱ. "క. తలగలిగినఁగుఱ్ఱాయలు, గల వేవగనైన నీవు గలిగినఁ దాద్య, క్కలరవము లెన్నియైనం, గలిగెడుఁ బోకుమని యడ్డగాల్ వేయంగన్." సా. ౨, ఆ. ౧౬.

అడ్డగించు. దే. స. క్రి. అడ్డు, నిరోధించు.

అడ్డగింత. దే. వి. అడ్డము, నిరోధము.

అడ్డచాఁపు. దే. వి. (అడ్డ+చాఁపు.) ఇంటి నిర్మాణమునకయి గోడలపై అడ్డుగావేయు దూలము, అడ్డువాసపు దూలము.

అడ్డణము. దే. = అడ్డనము. "ద్వి. హిమకర రవి మండలము లడ్డణములఁ, గ్రమమున నిడియాడు గణనాథుఁ డొకఁడు." పండి. వాద. ౨౩౪పు.

అడ్డతలవాఁడు. దే. వి. అడ్డముగానున్న (గుండ్రముగాలేని) తలగలవాఁడు.

అడ్డదిడ్డము = అడ్డాదిడ్డి. దే. విణ. తాఱుమాఱుగా, క్రమము లేకుండఁగా, సందర్భము లేకుండఁగా; "వాఁడు నాదగ్గఱకు వచ్చి అడ్డదిడ్డముగా మాటలాడిపోయినాఁడు."

అడ్డన. దే. వి. పళ్లెములు మొదలగునవి యుంచుటకేర్పఱచినపీఁట. "సీ. వెండియడ్డనలపై వెలచి తెచ్చినపైఁడి, పళ్లెంబు లాయత్తపఱచువారు." సై. ౬, ఆ. ౧౦౮.

అడ్డనము. దే. వి. (శత్రువులు ప్రయోగించు ఆయుధములను అడ్డునది. (ఇది కొన్ని సంస్కృతనిఘంటువులలో అడ్డధాతువు కృదంతరూపముగాపై వ్యుత్పత్తితోనే కలదు.) కేడెము, డాలు. "సీ. ... ఆరోహణాశ్వికుల్, రథికులు సెక్కసారథులతోడఁ, గవదొనల్ విండ్లును గత్తలంబులుఁ గుంతములు గరవాలముల్ బలక లీఁట, లడ్డనములుఁ గొని రయంబునఁ గాల్వురు, వన్ని నిలిచి" కు. సం. ౧౨, ఆ. 3. "వ. అంతఁగ్రోధనుండు గరవాలంబు నడ్డనంబును గొని." రా. యు. కాం. ౧౧౯.

అడ్డపట్టియ. ద్వ. వి. అడ్డపట్టె, మడి చేదును పఱచెడి పలక. (ఇది యొకానొక వ్యవసాయపు పనిముట్టు.)

అడ్డపట్టు. దే. స. క్రి. (అడ్డ+పట్టు.) (శిశువును) చేతులమీఁద అడ్డముగా పట్టు. "ద్వి. అడ్డపట్టెడు బాలుఁ డటవె యోయమ్మ." సా. ౨, భా. ౩౦౪.

అడ్డపట్టె. ద్వ. = అడ్డపట్టియ.

అడ్డపడు. ద్వ. అ. క్రి. (అడ్డ+పడు.) (అడ్డముగా నిలఁబడు.) **1.** కార్యమునకు అడ్డువచ్చు, విఘ్నము సేయు; **2.** కష్టము మొదలగువాని బాఱిఁ బడకుండ నడ్డముగ నిలుచు, రక్షించు. "తే. చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు, డడ్డపడి వారితోడఁ గొట్లాడియైన, దాని నుడుపంగఁ జొరకున్నవానిఁ గ్రూర, కర్ముఁడని చెప్పుదురు కర్మకాండవిదులు." భార. ఉద్యో. 3,ఆ. ౨౮౨.

అడ్డపాటు. ద్వ. వి. అడ్డపడుట.

అడ్డపాప. దే. వి. (అడ్డ+పాప.) **1.** అడ్డపట్టుపాప; **2.** దూరవస్తువును చూడఁజాలనివాని కన్నులలోనిపాప.

అడ్డపెట్టు. దే. స. క్రి. (అడ్డము+పెట్టు.) **1.** అడ్డకట్టు, నిరోధించు; "గీ. అడ్డపెట్టెదఁగాక తీవ్రాంశురథము." కాశీ. ౧, ఆ. ౧౧౬; **2.** ఈడుపెట్టు, కుదువఁబెట్టు.—వి. అడ్డగింత,నిరోధము. "అడ్డపె ట్టభిసారికాంగనలకు." చంద్ర. శ. ర.

అడ్డబాస. దే. వి. నాసాభూషణవిశేషము, బులాకి.

అడ్డబొట్టు. దే. వి. స్మార్తులు శైవులు మొగమున అడ్డముగా ధరించు బొట్టు, తిర్యక్పుండ్రము. వ్యతి.—నిలువుబొట్టు, ఊర్ధ్వపుండ్రము.

అడ్డమాడు. దే. అ. క్రి. అడ్డుచెప్పు, వ్యతిరేకముగా చెప్పు.

అడ్డమాను. దే. వి. (అడ్డ+మాను.) అడ్డపట్టె.

అడ్డము. దే. వి. **1.** నిరోధము; **2.** చోటు; **3.** తాకట్టు; **4.** పూఁట; **5.** పిల్లలను అడ్డముగఁ బట్టుకొనుటకై వంపుగాఁ బట్టిన రెండుచేతుల నడిమిభాగము. "అడ్డాలలోనుండఁగా పిల్లలుగాని గడ్డాలు వచ్చినతరువాత పిల్లలా?" (సామెత.) —విణ. నిరోధకము, అడ్డునది.

అడ్డరిక. సం. వి. ఆ. స్త్రీ. భక్ష్యవిశేషము.

అడ్డవాట్లు. దే. వి. బ. (అడ్డ + వాట్లు.) **1.** అడ్డు దెబ్బలు; **2.** అడ్డకట్టు, విఘ్నము.

అడ్డవాతియమ్ము. ద్వ. వి. (అడ్డ+వాయి + అమ్ము.) వాయి అడ్డముగాఁ గల ఒకరకముబాణము.

అడ్డవేడెము. ద్వ. వి. (అడ్డ+వేడెము.) అశ్వగతి విశేషము, ఒకరకము గుఱ్ఱపునడక. "ఉ. రవగాలునుజోడనయడ్డవేడెముల్, దొక్కుడువాళిజిల్గు నడలుం గనిపించుచు." సా. ౧, ఆ. ౮౨. "క. అలోనటుదొడరిన పది, వేలరథమ్ములకు నడ్డ వేడెము లెసఁగం, దోలెఁ గకుత్స్థుఁడు బసువని, వేలుపు లన్న ప్పులఁ బొదువ విడిచి త్రికర్ణున్." కకు. ౫, ఆ. ౧౬౧.

అడ్డపరము. వై. వి. అటరూషము.

అడ్డసారె. ద్వ. వి. పాచిక.

అడ్డసాళులు. ద్వ. వి. బ. (అడ్డ+సారెలు.) పాచికలు. "ఆ. అతఁడు గాండివమున నడ్డసాళులు వైవఁ, డురుల నంపవాన గురియుఁగాని." భార. విరా. ౪, ఆ. ౧౯౭. సం. "నాక్షాన్ క్షిపతి గాండీవమ్." రూ. అడ్డసాళ్లులు, అడ్డసాళ్లు.

అడ్డసాళ్లు. ద్వ.=అడ్డసాళులు. "క. మాయలు జూద మతోడన, పోయెంగా కింక నిచటఁ బొసఁగునె యవి మ,తాస్రాయకము లడ్డసాళ్లే, నీయాచవిలేదు పొమ్ము నిలువక మామా." భార. ద్రో. ౧, ఆ. ౩౬౨.

అడ్డసాళ్లులు. = అడ్డసాళులు. "ఆ. శకుని చేతి యడ్డ సాళ్లులు నేఁడుగాం,డీవముక్త బహుపటిష్ఠబాణ, మూర్తిఁగవిసి నీకు నార్తియొనర్పంగ, నాఁక గొనఁగనెట్టులగుఁ గుమార." భార. ద్రో. ౫. ఆ, ౭౯.

అడ్డాదిడ్డి. దే. విణ. (అడ్డము+దిడ్డి.) **1.** వక్రము; **2.** వ్యతిరేకము. "సీ. వినయంబుతోఁ జేరిపని యేమి యనువాఁడె యరయ కడ్డాదిడ్డు లనుపసాగెఁ." కువల. ౨, ఆ. ౨౪.

అడ్డాయుధము. మి. వి. ఆయుధవిశేషము. "ద్వి. వారమహత్వంబను నడ్డాయుధమునఁ, బరవాదులను మృగోత్కరముఁ గీటడఁచి." బస. ౫, ఆ. ౧౭౯ పు.

అడ్డి. దే. = అడ్డు.

అడ్డిగలు. దే. వి. బ. స్త్రీలు మెడనుంచుకొనెడు ఒకానొకనగ.

అడ్డిపడు. ద్వ. అ. క్రి. ఆఁగిపోవు, నిలిచిపోవు, ఆడ్డిపోవు.

అడ్డిపోవు. దే. అ. క్రి. ఆఁగిపోవు, నిలిచిపోవు. "వారింట్లో పెండ్లి అడ్డిపోయినది."

అడ్డీ. దే. వి. అనుకైన వస్తువుయొక్క పూఁత. (అప్ర.)

అడ్డు. దే. స. క్రి. అడ్డగించు. "జగమడ్డఁదగుదొడ్డ సత్తియై." సీలా. ౧, ఆ. ౫౨.—వి. నిరోధము, అడ్డి. "సీ....పౌర నేత్రముల కడ్డు చొరకమున్న." కాశీ. 3, ఆ. ౮౪.—విణ. **1.** నిరోధకము, ప్రతిబంధకము. "నీవు అక్కడ ఉండుటయే వాని ఉత్సాహమునకు అడ్డు అయినది;" **2.** నిరోధకుఁడు, ప్రతిబంధకుఁడు. "ఈపనికి వాఁడు అడ్డు అయినాఁడు."

అడ్డుకొను. దే. = అడ్డుగొను, వాడుకలో ప్రసిద్ధము.

అడ్డుగ. వై. వి. రూకలోసగము, అర్ధపణము.

అడ్డుగట్టు. దే. వి. (అడ్డు+కట్టు.) **1.** అడ్డకట్టు, విఘ్నము, అడ్డి; **2.** అర్గళము, కట్టుగడియ.—విణ. విఘ్నకరము. "క. నీయడ్డుగట్టుమాటలు, కీయెడఁ బనియేమి." రుక్మాం. ౫, ఆ. ౯౦.

అడ్డుగొను. దే. అ. క్రి. (అడ్డు+కొను.)=అడ్డపడు. "తే. అడ్డుగొని సోఁకుదొరకుఁ బ్రహస్తుఁడని యె." అచ్చ. యు. కాం. ౩౬.

అడ్వాన్సు. ఆం. వి. ముందుగా నిచ్చుసొమ్ము, బయానా.

అణఁకువ. దే. = అడఁకువ.

అణఁగారు. దే. = అణఁగు.

అణఁగు. దే. అ. క్రి. **1.** తగ్గు; **2.** ఉపశమిల్లు; **3.** నమ్రమగు; **4.** నశించు; **5.** లోపడు.

అణఁచు. దే. = అడఁచు.

అణక. దే. వి. ఎడ్లు మొదలగునవి మెడమీఁదనున్న కాఁడి మెడక్రిందికి వచ్చునట్లు చేసికొనుట. "సీ. వెగడొంది రవితేరి నొగలఁ గట్టినయట్టి వాహంబులణకలు వైచికొనియె." విక్ర. ౪, ఆ. ౫౨.

అణకించు. దే. స. క్రి.=అడకించు. "ద్వి. అణకించు నొకటి రెండడుగులవానిఁ, బ్రణుతవిఖ్యాతిసంపద పెంపు గలిగి." భాగ. ౧, స్కం. శ. ర.

అణకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అధముఁడు, కుత్సితుఁడు, నింద్యుఁడు. "అణక కులాలుఁడు."

అణవీనము. సం. విణ. (అ. ఆ. అ.) అనువులు పండఁదగినది. (పొలము.)

అణవ్యము. సం. = అణవీనము.

అణా. హిం. వి. రూపాయలో పదాఱవభాగము.

అణి. సం. వి. ఇ. పుం. ఇ. ఈ. స్త్రీ. 1. ఇఱుసుతుదిచీల; 2. అంచు; 3. ఎల్ల, హద్దు; 4. ఆణి, కొఱ్ఱు.

అణిమ. సం. వి. న్. పుం. 1. అణుస్వరూపుఁడగుట, అణువంత యగుట. ఇది అష్టైశ్వర్యములలో నొకటి; చూ. ఐశ్వర్యము; 2. మిక్కిలి చిన్నది యగుట.

అణీయము. సం. విణ. (న్. ఈ - సీ. న్.) అత్యల్పము, మిక్కిలిచిన్నది.

అణుకము. సం.విణ. (అ.ఆ.అ.) 1. అణువు, మిక్కిలి చిన్నది, సూక్ష్మము; 2. సన్ననిది.—వి. అ. పుం. అనువులు (ధాన్యవిశేషము.)

అణుకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. అల్పుఁడు; 2. నేర్పరి.

అణుజే. దే. వి.=అడుజే. "తే. సాళువము గిద్ద కడుజు వేసడము కురుజు, బాఁజు సెలకట్టె జాలియ బైరి యణుజు,నోరణంబును నాదిగాఁ బేరువడిన, వేఁటడేగల గిఱికొన విడిచి కడిమి." హరిశ్చ. ౨, ఆ. ౨౨.

అణువాదము. సం. వి. అ. పుం. ప్రపంచమునకంతకు పరమాణువులే కారణములు అనియు, అవి నిత్యములనియుఁ దెలుపువాదము, కణాదమతము.

అణువీక్షణము. సం. వి. అ. న. 1. స్వల్పవిషయములుగూడ చూచుట; 2. సూక్ష్మముగా పరిశీలించుట; 3. మిక్కిలి చిన్నవగు వస్తువులు గూడఁ బెద్దవిగాఁ గనఁబడునట్లు చేయుయంత్రము, సూక్ష్మవస్తుదర్శిని.

అణువు. సం. వి. ఉ. పుం. 1. లేశము; 2. జగత్కారణమగు సూక్ష్మవస్తువు, సూక్ష్మాంశము; 3. అనువులు.—విణ. (ఉ.ఊ. ఈ-ణ్వీ.ఉ.) అల్పము.

అణ్వంతము. సం. వి. అ. పుం. 1. సూక్ష్మవస్తునిర్ణయాంతమగు ప్రశ్నము; 2. అత్యల్పవిషయమును గుఱించిన ప్రశ్నము. (వెండ్రుక చివర చీల్చుట వంటిది.)

అతఁడు. దే. స. అమనుష్యుఁడు, ఆయన. (ప్రాయికముగా పూజ్యుని గుఱించినపుడే ఉపయుక్తము.)

అతకరించు. వై. స. క్రి. 1. క్రిందుపఱచు, మించు, అధఃకరించు; "తే. అధికులగు తాపసుల నెల్ల నతకరించి, తాన యఖిలలోకాధిపత్యంబునొందె." హరి. పూ. ౪, ఆ. ౨౬; 2. ఉల్లంఘించు. "సీ. ఆచార్యులరు మిమ్ము నతకరించుట దోసమైనను నొకమాట యాడవలసె." లక్ష్మీ. ౪, ఆ. ౯౭.

అతకుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ఎప్పుడును సంచరించువాఁడు.— వి. అ. పుం. బాటసారి, పథికుఁడు.

అతగుఁడు. వై. వి. (సం.హాతకః, లేదా అతజ్ఞః.) దేశ్యమని శ.ర. అవివేకి, తెలివి తక్కువవాఁడు. "క. అతగులచే ద్రుపదుఁడు బల,హృతుఁడై పట్టువడ నంత హీనుఁడె." భార. ఆది. ౬, ఆ ౬౯. "ద్వి......సురలు......శరణంచు నందికేశ్వరునిఁ గీర్తింప, అతఁడు దయామతి నల్లన నగుచు, నతగులౌ సురలను నరవిరి కంటఁ, జూచె...." బస. ౧, ఆ. పు. ౧౧.

అతనము. సం. వి. అ. న. సంతతము సంచరించుట.

అతనుఁడు. సం. వి. ఉ. పుం. (శరీరములేనివాఁడు.) మన్మథుఁడు.— విణ. అల్పుఁడు కానివాఁడు, గొప్పవాఁడు.

అతజ్ఞుఁడు. సం.విణ. (అ.ఆ.అ.) 1. అది యెఱుఁగనివాఁడు; 2. బ్రహ్మ మెఱుఁగనివాఁడు; 3. ఎఱుఁగనివాఁడు, తెలివిలేనివాఁడు.

అతంత్రము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తంత్రములేనిది; 2. శాస్త్రసమ్మతముకానిది,అశాస్త్రీయము.

అతర్కణము. వై. వి. మట్టుమీఱినకార్యము. శ. ర.

అతర్కితము. సం. విణ. (అ.ఆ.అ.) తలఁచుకోఁబడనిది, అనుకొననిది. (అతర్కితగమనము; అతర్కితోపనతము = అనుకొనకుండఁగ లభించినది. అతర్కితోపపన్నము = అనుకొనకుండఁగ దొరకినది.

అతర్క్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఊహింప శక్యముగానిది; 2. ఊహింపఁ దగనిది.

అతలము. సం. విణ. (అ. ఆ. అ.) అడుగుభాగము లేనిది.—వి. అ.పుం. సప్తపాతాళలోకములలో నొకటి.

అతలసు. హిం. వి. వస్త్రవిశేషము,ఒకరకముపట్టుబట్ట.

అతలస్పర్శము. సం. విణ. (అ. ఆ. అ.) = అతలస్పృక్కు.

అతలస్పృక్కు. సం. విణ. శ్. 1. తలస్పర్శములేనిది,అడుగులేనిది, మిక్కిలిలోఁతైనది; 2. అతలమును స్పృశించునది.

అతలస్పృశము. సం. = అతలస్పృక్కు.

అతసి. సం. వి. ఈ. స్త్రీ. 1. నూనెయగిసె⚘; 2. నల్లయగిసె⚘.

అతఃపరము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఇంతకంటె ఇతరమైనది; 2. ఇంతకుఁబైది.

అతి. సం. ఉప. (సమాసమునఁగాని, క్రియయందుఁగాని పూర్వపదముగానే యుండును.) ఆధిక్యమును, అతిక్రమించుటను తెలుపును. చూ. అతిదూరము, అతిక్రమించు. మొ. దీనికి సంస్కృతమునను తెనుఁగునను గూడ వ్యస్త ప్రయోగమును గలదు."అతి సర్వత్ర వర్జయేత్." "నీవు అతిగా మాటలాడకు." "అతిగా తినకు."

అతిక్రమణము. సం. వి. అ. న.=అతిక్రమము.

అతిక్రమణీయము. సం. విణ. (అ. ఆ. అ.) అతిక్రమింపఁదగినది.

అతిక్రమము. సం. వి. అ. పుం. మీఱుట, అతిక్రమించుట.

అతిక్రమించు. సం. స. క్రి. మీఱు.

అతిక్రాంతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అతీతము, మీఱినది; 2. గతించినది.

అతిక్రాంతి. సం. వి. ఇ. స్త్రీ. = అతిక్రమము.

అతిగండము. సం. వి. అ. పుం. ఒకయోగము. (చూ. యోగము.)—విణ. (అ.ఆ.అ.) పెద్ద గండస్థలము గలది.

అతిగము. సం. విణ. (అ.ఆ.అ.) (సమాసముననే ప్రయుక్తము.) అతీతము, అతిక్రమించినది. "సంపదలు సంఖ్యాతిగములు."

అతిచర. సం. వి. ఆ. స్త్రీ. మెట్టదామర⚘.

అతిచరణము. సం. వి. అ. న. 1. మితిమీఱి సంచరించుట; 2. మితిమీఱి చేయుట.

అతిచారము. సం. వి. అ. పుం. 1. శీఘ్రగమనము; 2. అతిక్రమించి వెళ్లుట; 3. నియమాదులను ఉల్లంఘించుట; 4. (జ్యోతి.) కుజాది గ్రహములు రాశిభోగకాలము ముగియకుండగనే తరువాతి రాశియందు ప్రవేశించుట.

అతిచ్ఛందము. సం. విణ. స్. 1. కోరికలులేనిది; 2. ఆలోచనకు మీఱినది, మనస్సుకు అందనిది; 3. వేదసంప్రదాయము నుల్లంఘించినది.— వి. స్. న. 1. వృత్తానుసారి వర్ణవిన్యాసము లేని ఛందస్సు (జాతి, ఉపజాతి;) 2. అత్యపేక్ష.

అతిచ్ఛత్ర. సం. వి. ఆ. స్త్రీ. సదాప⚘.—అ.పుం. —ము. ఛత్రాకము, కుక్కగొడుగు⚘.—విణ. (అ. ఆ. అ.) ఛత్రము నతిక్రమించునది.

అతిజగతి. సం. వి. ఈ. స్త్రీ. (పాదమునకు పండ్రెండక్షరములుగల జగతి -అను ఛందస్సును మించినది.) పదుమూఁడవ ఛందస్సు. ఇందు పాదమునకు పదుమూఁడక్షరములుండును.

అతితృష్ణ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఎక్కువ దప్పిక; 2. అత్యాశ.

అతిథి. సం. వి. ఇ. పుం, స్త్రీ. (ఆపూటమాత్ర ముండిపోవువాఁడు.) భోజనసమయమునకు వచ్చు పరదేశి, విందు.—పుం. కుశుని కొడుకు.

అతిథిక్రియ. సం. వి. ఆ. స్త్రీ. అతిథి సత్కారము, అతిథిపూజ.

అతిథిపతి. సం. వి. ఇ. పుం. అతిథిని ఆదరించు గృహస్థు.

అతిదానము. సం. వి. అ. న. మితిమీఱినదానము.

అతిదిష్టము. సం. విణ. (అ.ఆ.అ.) అతిదేశముచేత ఏర్పఱుపఁబడినది. (ధర్మము.)

అతిదేశము. సం. వి. అ. పుం. ఒకవిషయమున చెప్పిన నియమమును సామ్యము ననుసరించి ఇతర విషయమునఁగూడ నుపయోగించుట.

అతిధృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. (పాదమునకు పదునెనిమిది అక్షరములుగల ధృతి అను ఛందస్సును దాటినది.) ఒక ఛందస్సు. ఇందు పాదమునకు

పందొమ్మిది అక్షరములుండును; 2. అతిసంతోషము; 3. అతిధైర్యము, ఇరువదియొకటవ ఛందస్సు.—విణ. అత్యంత ధృతిగలవాఁడు, అతిధైర్యశాలి.

అతిపత్తి. సం. వి. ఇ. స్త్రీ. దాఁటిపోవుట. "కాలాతిపత్తి."

అతిపథము. సం. వి. న్. పు. (అత్యుత్కృష్టమయిన పథము.) సుపథము, మంచిత్రోవ.— విణ. (అ. ఆ. అ.) మార్గము నతిక్రమించినది.

అతిపన్నము. సం. విణ. (అ.ఆ.అ.) దాఁటిపోయినది, గతించినది.

అతిపరిచయము. సం. వి. అ. పుం. 1. అధికపరిచయము; 2. మితిమీఱిన పరిచయము. "అతిపరిచయమున అవజ్ఞ గలుగును."

అతిపాతము. సం. వి. అ. పుం. 1. అతిక్రమణము, దాఁటిపోవుట. "కాలాతిపాతము;" 2. భంగము. "అన్యకార్యాతిపాతము;" 3. (దుఃఖాదికము) అధికముగా సంభవించుట.

అతిప్రసంగము. సం. వి. అ. పుం. 1. మితిమీఱిన తగులము; 2. అధికప్రసంగము, మర్యాద మీఱి మాటాడుట; 3. అప్రస్తుత ప్రసంగము.

అతిబల. సం. వి. ఆ. స్త్రీ. 1. ముత్తవపులగము ♣; 2. అడవిప్రత్తి; 3. (రామునకు విశ్వామిత్రుఁ డుపదేశించిన) విద్యలలో నొకటి. (ఇవి క్షుత్పిపాసలను శ్రమమును గలుగనీయదు); 4. గాలితోఁగూడినవాన.

అతిభరము. సం. = అతిభారము.

అతిభారగము. సం. వి. అ. పుం. (అతిభారమును మోయుచుఁబోవునది.) కంచరగాడిద, వేసడము.

అతిభారము. సం. వి.అ. పుం. 1. మితిమీఱిన బరువు, మోయలేని బరువు; 2. దుర్భరత్వము, దుస్సహత్వము. "సంతోషాతిభా(భ)రము; దుఃఖాతిభా(భ)రము."

అతిభూమి. సం. వి. ఇ. స్త్రీ. 1. అతిశయము, ఆధిక్యము; 2. మర్యాద, హద్దు.—విణ. ఇ. హద్దుమీఱినది.

అతిమాత్రము. సం. క్రి. విణ. అ.న. పెల్లు.—విణ. అధికము.

అతిమితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అధికపరిమాణముగలది; 2. (అ+తిమితము.) తడిలేనిది, శుష్కము.

అతిముక్తము. సం. వి. అ. పుం. 1. తినాసము♣; 2. పువ్వులగురివింద♣.

అతిరథుఁడు. సం. వి. అ. పుం. పెక్కువిలుకాండ్రతో యుద్ధముచేయు యోధుఁడు.—విణ. (అ. ఆ.అ.) రథమును దాఁటినవాఁడు.

అతిరభసము. సం. వి. అ. పు. 1. అతివేగము; 2. (కార్యాదులయందు) మిక్కిలి తొందర.

అతిరసము. సం. వి. అ. పుం. భక్ష్యవిశేషము, అరిసె. "సీ. అలివేణి నీచేతియతిరస రుచి రసజ్ఞానందమయ్యె నేమనఁగవచ్చు." ఆని. ౧, ఆ. ౧౦౬.—విణ. (అ.ఆ.అ.) అధికమైన రసముగలది.

అతిరిక్తము. సం. వి. అ. న. 1. అతిశయము, ఆధిక్యము; 2. భేదము.—విణ. (అ. ఆ. అ.) 1. అతిశయించినది, శ్రేష్ఠమైనది; 2. భిన్నమైనది, శూన్యమైనది.

అతిరేకము. సం. వి. అ. పుం. 1. ఆధిక్యము, హెచ్చు, అతిశయము. "మదాతిరేకము, పౌరుషాతిరేకము, వీర్యాతిరేకము, గుణాతిరేకము మొ;" 2. భేదము; 3. ప్రాధాన్యము.

అతిరోగము. సం. విణ. (అ. ఆ. అ.) అధికమైన రోగముకలది.—వి. అ. పుం. 1. అధికమైనరోగము; 2. క్షయరోగము.

అతిరోమశము. సం. వి. అ. పుం. 1. అడవిగొఱ్ఱె; 2. పెద్దకోఁతి; 3. నీలబుఱ్ఱ♣.—విణ. (అ. ఆ.అ.) ఎక్కువరోమములు గలది.

అతివ. దే. వి. ఆఁడుది, స్త్రీ. "క. ద్యుతిదఱిఁగి నిజనియోగ, చ్యుతిఁ బొందను మీకు నొండుచోటికి నరుగం, గతమేమి యనిన విని య, య్యతివకు సురనదికి నిట్టులని రప్పసువుల్." భార. ఆది. ౪, ఆ. ౧౨౭.

అతివక్త. సం. విణ. (ఋ. ఈ-స్త్రీ. ఋ.) 1. అతిగ సంభాషించువాఁడు, వాఁగువాఁడు; 2. బాగుగ మాటలాడువాఁడు, గొప్పవక్త.

అతివర్తి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) 1. అతిక్రమించి సంచరించునది; 2. అతిక్రమించి యుండునది; 3. శ్రేష్ఠుఁడు.

అతివర్తించు. సం. స. క్రి. మించు, మీఱు. "క. సుత విను శబ్దబ్రహ్మము, నతివర్తించి భువన త్రయమునను యోగా,న్వితుఁడగుముని గను." భార. శాం. ౫, ఆ. ౧౭౩.

అతివస. వై. వి. ఒకమందుదినుసు, అతివిష.

అతివాతము. సం. వి. అ. పుం. 1. అధికమైనగాలి; 2. అధికమైన వాతగుణము, వాతరోగము. —విణ. (అ. ఆ. అ.) 1. అధికమైనగాలిగలది; 2. అధికమైన వాతగుణముగలది.

అతివాదము. సం. వి. అ. పుం. 1. ఎక్కువగ చెప్పుట; 2. కఠినమైనవాక్యము; 3. అప్రియ వాక్యము.—విణ. (అ.ఆ.అ.) 1. అధికమైన వాదముకలది; 2. వాదమును మీఱినది.

అతివాది. సం. విణ. (న్. ఈ-నీ.న్.) 1. అధికముగ వాదించువాఁడు, మితిమీఱి వాదించువాఁడు; 2. అందఱిని మించి వాదించువాఁడు.

అతివాసము. సం. వి. అ. పుం. శ్రాద్ధదినమునకు పూర్వదినమం దుపవసించుట.—వై.వి. శ్రాద్ధదినమునకు ముందుదినము అని. (శ. ర.)

అతివాహకుఁడు. సం. వి. అ. పుం. ఒకదేహము నుండి జీవుని మఱియొకదేహము పొందించుటకు ఈశ్వరునిచే నియోగింపఁబడిన దేవత.

అతివాహనము. సం. వి. అ. న. 1. పంపుట; 2. తప్పించుకొనుట.

అతివాహము. సం. వి. అ. పుం. 1. ఒకచోటనుండి మఱియొకచోటకుఁ దీసికొనిపోవుట; 2. ఒక జీవుని ఒకదేహమునుండి మఱియొకదేహమును పొందించుట.

అతివాహికము. సం. వి. అ. పుం. అతివాహమునకు తగిన సూక్ష్మశరీరము.

అతివాహితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. పంపఁబడినది; 2. కడపఁబడినది, అతిక్రమింపఁబడినది.

అతివాహ్యము. సం. విణ. (అ.ఆ.అ.) అతివాహమునకు తగినది.

అతివికటము. సం. విణ. (అ.ఆ.అ.) మిక్కిలి వికటమైనది.—వి. అ. పుం. దుష్టమైన యేనుఁగు.

అతివిష. సం. వి. ఆ. స్త్రీ. అతివస.

అతివిషము. సం. విణ. (అ.ఆ.అ.) 1. మిక్కిలి విషముగలది; 2. విషమును అతిక్రమించునది, విషమునకు విరుగుడైనది.

అతివృత్తము. సం. విణ. (అ.ఆ.అ.) 1. అతిశయించినది, అధికము; 2. అతిక్రమించినది, కడచినది.

అతివృద్ధు. = అతివృద్ధుఁడు.

అతివృద్ధుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిగుల పెరిఁగినవాఁడు; 2. అధికవార్ధకముకలవాఁడు, మిగులవృద్ధు.

అతివృష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. మితిమీఱినవాన; 2. సస్యములను పాడుచేయునట్టి అధికమైన వాన.(ఇది ఈతిబాధలలో నొకటి. వ్యతిరేకము: అనావృష్టి).

అతివేధము. సం. వి. అ. పుం. 1. దగ్గఱసంబంధము; 2. ఏకాదశికి దశమితోఁగల సంబంధభేదము. (అతివేధగల ఏకాదశి ఉపాసనార్హముకాదు.)

అతివేలము. సం. విణ. (అ.ఆ.అ.) (వేలను అతిక్రమించినది.) 1. మర్యాదను మీఱినది; 2. ఒడ్డును మీఱినది. (సముద్రము మొ.)—క్రి. విణ. అధికముగా, మితిమీఱునట్లు.

అతివ్యాప్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. మిక్కిలి వ్యాపించుట; 2. లక్ష్యముకానిచోటఁ గూడ లక్షణము ప్రవర్తించుట (గోవునకు శృంగములు కలుగుట లక్షణమన్నచో గోభిన్నమహిషాదులకును శృంగములుండుటచే అతివ్యాప్తి.)

అతిశయనము. సం. వి. అ. న. అతిశయించుట, ఆధిక్యము.

అతిశయము. సం. వి. అ. పుం. 1. ఆధిక్యము, అగ్గలిక. "వీర్యాతిశయము, పరాక్రమాతిశయము;" 2. గర్వము. "నేనే చక్కనిదానని ఆమెకు అతిశయము." "మిక్కిలి ధనవంతుఁడవైనను అంత అతిశయముకూడదు."(వా.)—విణ.(అ.ఆ.అ.) అతిశయము గలది. "అతిశయదయాశాలి."

అతిశయాళువు. సం. విణ. ఉ. అతిశయించు స్వభావము కలది.

అతిశయి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) 1. అతిశయముగలది; 2. అతిక్రమించినది.

అతిశయితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. అతిక్రమింపఁబడినది; మీఱఁబడినది. "చ. అతిశయి

తామరోత్తముఁ డహార్పతి లేజుఁ డజాతశత్రుఁ డూర్జితుఁ డజితుండు." భార. అర. ౧, ఆ. ౫౧;
2. అధికము.

అతిశయిల్లు. సం. అ. క్రి. అతిశయించు, అగ్గలించు.

అతిశయోక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. అతిశయముగఁ జెప్పుట, కొంచెమును గొప్పచేసి చెప్పుట; 2. అర్థాలంకారములలో నొకయలంకారము.

అతిశాయనము. సం. వి. అ. న. అతిశయనము, ఆధిక్యము.

అతిశాయి. సం. విశే.(న్.-ఈ.-నీ.న్.) అతిశయించినది.

అతిసంచయము. సం.వి. అ. పుం. 1. కావలసినదాని కంటె ఎక్కువ సంపాదించుట; 2. ఎక్కువ నిలువచేయుట.

అతిసంధానము. సం. వి. అ. న. 1. మోసము చేయుట; 2. కష్టముచేత కూర్చుట.

అతిసంధుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) 1. మర్యాద మీఱినవాఁడు; 2. సంధానములేనివాఁడు.

అతిసంధేయము. సం. విశే. (అ.ఆ.అ.) 1. అత్యంతము సంధానము చేయఁదగినది; 2. మోసము చేయఁదగినది.

అతిసర్గము. సం.వి. అ.పుం. దానము, ఈవి.—విశే. (అ.ఆ.అ.) 1. సృష్టిని అతిక్రమించినది; 2. నిత్యము; 3. ముక్తినొందినది.

అతిసర్జనము. సం. వి. అ. న. 1. దానము; 2. అధిక దానము; 3. వధము; 4. మోసము.

అతిసాంతపనము. సం. వి. అ. న. సాంతపనవ్రతముకంటె అధికమయిన యొకానొకవ్రతము.

అతిసామ్యము. సం. వి. అ. న. ఎక్కువపోలిక.

అతిసారకి. సం. విశే. (న్. ఈ.-నీ. న్.) అతిసార రోగముగలవాఁడు.

అతిసారము. సం. వి. అ. పుం. మలమును ద్రవముగా చేయు రోగభేదము, నీళ్లవిరేచనములగుట.

అతిసృజ్యము. సం. విశే. (అ.ఆ.అ.) 1. సృజింపఁ దగినది; 2. విడువఁదగినది; 3. ఈయఁదగినది.

అతిసృష్టము. సం. విశే. (అ.ఆ.అ.) 1. ఈయఁబడినది; 2. ప్రేరింపఁబడినది.

అతిసౌరభము. సం. విశే. (అ.ఆ.అ.) మిక్కిలి పరిమళముగలది.—వి. అ. న. ఎక్కువ పరిమళము.—పుం. మిక్కిలి పరిమళముగల తియ్యమామిడి, సహకారము ✤.

అతిసౌహిత్యము. సం. వి. అ. న. అత్యంతతృప్తి.

అతిస్తుతి. సం. వి.ఇ.స్త్రీ. మితిమీఱి స్తోత్రముచేయుట.

అతిహసితము. సం. వి. అ. న. పెద్దనవ్వు.

అతిహాసము. సం. పుం. = అతిహసితము.

అతీంద్రియము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఇంద్రియముల నతిక్రమించినది; 2. ఇంద్రియములకు లొంగనిది; 3. ఇంద్రియములచే తెలిసికొన శక్యముకానిది.

అతీతము. సం. విశే. (అ. ఆ. అ.) (అతిక్రమించినది.) 1. మీఱినది. "కాలాతీతసంధ్య;" 2. కడచినది. "అతీతకాలము."

అతుకు. దే. అ. క్రి. 1. అంటుకొను, అత్తుకొను; 2. అత్తు, అనుకూలమగు, సరిపడు, కలియు; "అత్తకు కోడలకు అతుకదు. ఆమాట అక్కడ అతుకలేదు. కతికితే అతుకదు."— స. క్రి. (అం. ప్రే. అని శ. ర.) అతికించు, కలిసిపోవునట్లు చేయు; "అర్థము అతికినట్లు సరిపోయినది. ఆబంగారు ముక్కలురెండును అతికి వస్తువుచేయుము. వాఁడు ఆరెండుముక్కలు అతుకలేదు. 'ఆగిన్నె చిల్లునకు ముక్క అతుకుము."—వి. 1. అతుకుట; 2. అతికినచోటు. "చెంబు అతుకులో కాఱుచున్నది." రూ. అదుకు.

అతులము. సం. వి. అ. పుం. తిలకము ✝.— విశే. (అ. ఆ. అ.) సరిలేనిది, సామ్యములేనిది. "అతులపరాక్రమము."

అతులితము. సం. విశే. (అ. ఆ. అ.)—పై.—

అతుహినరశ్మి. సం. వి. ఇ. పుం. (వేఁడికిరణముల వాఁడు.) సూర్యుఁడు.

అతుష్టి. సం. వి. ఇ. స్త్రీ. సంతోషములేమి, సంతృప్తి లేకపోవుట.—విశే. ఇ. సంతోషము లేని వాఁడు, సంతృప్తిలేనివాఁడు.

అతుష్టుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) సంతోషింపని వాఁడు, అసంతృప్తుఁడు.

అత్త. ఉభ. దే. వి. 1. మగనియొక్కతల్లి; 2. భార్యయొక్కతల్లి; 3. (విటులకు అత్త,) వేశ్యా

మాత. (చూ. అత్తగంతు.)—సం. ఆ. స్త్రీ. 1. అక్క; 2. తల్లి; 3. శ్వశ్రువు, అత్త.—వి. బు. పుం. పరమేశ్వరుఁడు.— విణ. (బు. ఈ-త్రీ. బు.) 1. అనుభవించువాఁడు; 2. తినువాఁడు.

అత్తగంతు. దే. వి. వేశ్యామాతల సముదాయము. వేశ్యామాతృవర్ణనము. "తే. కడవ నేర్పుగలిగి కందువు మానెడ్రై, కత్తిగొంటులయిన యత్త గంతు." కు. సం. ౮, ఆ. ౧౩౫.

అత్తగారు. దే. వి. శ్వశ్రువు (1. భార్యతల్లి; 2. భర్త తల్లి.) "తే. నిద్రమేల్కాంచి రేపాడి నియమ పరత, నహిమభానుని వీక్షింపకటకుమున్న, తగదు వీక్షింప నరునకుఁ దల్లి వదినె, నత్తగారిని దప్పించి యన్యవిధవ." కాశీ. ౨, ఆ. ౮౩.

అత్తడము. దే. వి. ఆట్ట, కాగితపుఅట్ట.

అత్తడి. దే. వి. =అత్తళువు.

అత్తపత్తి. దే. వి. సోఁకుడుముడుఁగు, లజ్జాళువు✝.

అత్తమిల్లు. వై. స. క్రి. ఆను "వ. కృష్ణుని వెనుక దెసఁ దదీయోన్నతపీఠంబునఁ గరం బత్తమిల్లి యుండె." భార. ఉద్యో. ౩, ఆ. ౨౫౨.—అ. క్రి. 1. అస్తమించు, క్రుంకు; "సీ. ప్రాలేయ కిరణబింబంబు వెల్వెలఁబాఱి యస్తాచలంబుపై నత్తమిల్ల." కాశీ. ౧, ఆ. ౧౨౨; 2. ఒఱగు, అవనతమగు; "సీ. కాయ లుత్తుంగకుచపాళి నత్త మిల్ల." స్వా. ౨, ఆ. ౨౭; 3. వ్యాపించు, క్రమ్ము. "వ. అంగళ్లముంగిళ్ల నత్తమిల్లిన ముత్తి యంపురంగవల్లుల మీఁద." జై. ౨, ఆ. ౯౭; 4. పరుండు,శయనించు; "సీ. పెనుఁబాఁపనునుఁ బానుపునఁ దమ్మియింటితొయ్యలి యజ్జ లోత్తం గ నత్తమిలిన, వెన్నునకు." అచ్చ. బాల కాం. ౧౫౬; 5. ఉపశమించు; 6. నశించు,అంతరించు.

అత్తము. దే. వి. (అత్తుకొన్నది, లేదా హస్త శబ్ద భవమనవచ్చు.) 1. అరఁటిపండ్లగెల; 2. పువ్వు, కాయ లోనగు వానిగుత్తి; 3. గెలలోని యొక భాగము; 4. సమూహము.

అత్తమ్మ. దే. = అత్తగారు.

అత్తయ్య. దే. = అత్తగారు.

అత్తరము. వై. వి. ఆతురత,త్వర, తొందర, సంభ్రమము. "తే. పాండ్యభూపాలుఁ డీతండు పద్మ నయన, యితని వీక్షింపు నిజకటాక్షేక్షణ ముల, మానశాలిని శాలీన తానతమగు, నాన నాంభోజమెత్తు మీ యత్తరమున." నై. ౫, ఆ. ౧౧౭; "వ. అప్పుడమిఱేఁడు రెండువెడంపవాలి తూపుల నతనికాళ్లు గత్తరించి యయ్యత్తరము నొత్తరము కుఱుచపఱచిన." రామా.౮,ఆ.౧౫౪.

అత్తరు. దే. వి. సుగంధతైలము, ప్రబోధనము.

అత్తరువు. = అత్తరు. "తే. తమ్మపడిగము మంచి గందంపుఁగోర, తబుకు చిన్నారి యడప మత్త రువుకుప్పె, మొదలుగాఁగల వస్తుసంపదలుపాద లు, నమలమణిమయపటకుటీరాంతరమున." రసి. ౫, ఆ. ౧౪౮.

అత్తలము. దే. వి. 1. కుంతము, ప్రాసము. "క. పెనుఁగడఁత దొడ్డయత్తల, మున వైచిన." సం. "ప్రాసేన సహదేవస్య శిరసి ప్రాహర ద్భృశమ్." భార. శల్య. ౧, ఆ. ౩౮౧; 2. బల్లెము. "ఉ. ఈఁటెల డొంకెనలఁ గటార్ల బల్కుత్తుల నత్తలంబులను." కళా. ౮, ఆ. ౫౭.

అత్తవారు. దే. వి. అత్తగారి కుటుంబము, శ్వశుర కుటుంబము. "తే. అంబికకుఁ బుట్టినిల్లు నీహార శిఖరి, యత్తవారిల్లు కాశీ మహాపురంబు, హిమ కరోత్తంసునకుఁ బుట్టినిల్లు కాశి, యత్తవారి గృహంబు నీహారశిఖరి." కాశీ. ౭, ఆ. ౧౦౦.

అత్తళము. దే. = అత్తలము.

అత్తళువు. దే. వి. ఎదకువచ్చిన ఆఁడుగుఱ్ఱము. "వ. అత్తళువైన యమ్మత్తకాశినిఁ గించి దున్నిద్రపా రిభద్రకలికాచ్ఛాయామ్ముద్ర కుద్దియగు ముద్ర విరియించుచు మొగుచుచుం గదలకుండె." కాశీ. ౪,ఆ.౨౪౨.—విణ. ఎదకువచ్చినది. (ఆడుగుఱ్ఱము.) "తే. అనుచు విప్రుండు తమకించి యంటు కొనియె, సమ్మతించియ యుండె నాచంద్రవదన, కూకలాశ్వంబు నన రేపఁ జొచ్చినప్పు, డనుమతింపదె యత్తళువైన బడబ." శివ. ౩, ఆ. ౯౯.

అత్తి. దే. వి. మేడి, ఉదుంబరము✝.—వై. వి. హస్తి, ఏనుఁగు.

అత్తిక. సం. వి. ఆ. స్త్రీ. (నాట్యపరిభాషయందు) అక్క, జ్యేష్ఠభగిని.

అత్తు. దే. అ. క్రి. 1. కలుగు. "క. ఉత్తరమునఁ

బోడమును బ్ర, త్యుత్తర ముత్తరములేక యుత్తర మగునే, యత్తినసువృష్టివలనన్, పిత్తులకుంబోడ మినట్టిపిత్తులపోలెన్." పంచ. నా. ౧, ఆ. ౧౯౯; 2. కలసిమెలసియుండు, ఏకీభవించు, కూడు; "లయగ్రాహి. ఒండొరుల నెత్తికొని మాంసం, బత్తితినుటన్ వికటవృత్తులగు రాక్షసుల, మొత్తము పరిక్షుభితచిత్తత యొనర్పన్." భార. స్త్రీ. ౨, ఆ. ౮. "క. ఉత్తమమగుద్రవ్యంబును, విత్తంబును నగ్రజునకు వింశాంశంబున్, బొత్తున నిచ్చి సహోదరు,లత్తి సమాంశంబు గొనుట యర్హం బెందున్." విజ్ఞా. వ్య. కాం. ౧౨౬; 3. యుక్తమగు.—వి. మైనపుగుడ్డ.

అత్తుకొను. దే. = అత్తు.

అత్తెము. వై. వి. హస్తకవచము. "గీ. డేగ, తెగలఁ దగ నేర్పరించి యత్తెముల నుంచి, కదలె నృపు వెంబడిన యూడిగములగములు." ఉ. రా. ౭, ఆ. ౪౦౨.—దే. వి. = అత్తము.

అత్తెసరు. దే. వి. (అత్తు + ఎసరు.) గంజివార కుండ నన్నముతో సిమిడిపోవునట్లు పెట్టెడియెసరు.

అత్యంతగామి. సం. విణ. (న్. ఈ. నీ. న్.) ఎప్పుడును తిరుగువాఁడు.

అత్యంతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అంతము నతిక్రమించినది, నాశములేనిది. "అత్యంతసుఖము;" 2. అధికమైనది. "అత్యంతవైరము;అత్యంతమైత్రి;" 3. అవధిలేనిది.—క్రి. విణ. 1.మితిమీఱునట్లు, మిగుల; 2. బొత్తిగా, సుతరాము.

అత్యంతాభావము. సం. వి. అ. పుం. బొత్తిగా లేమి, సుతరాములేకపోవుట.

అత్యంతికము. సం. వి. అ. పుం. 1. (అతి(=మిక్కిలి)+అంతికము.) అతిసమీపము; 2. (అంతికము నతిక్రమించినది.) అతిదూరము.— విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి దగ్గఱనున్నది; 2. దూరమైనది; 3.మిగుల నడచుస్వభావము గలది.

అత్యంతీనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) గమనశీలుఁడు, మిక్కిలి నడచువాఁడు.

అత్యయము. సం. వి. అ. పుం. 1. అతిక్రమించుట; 2. అభావము; 3. నాశము; 4. దోషము; 5. కష్టము; 6. అతిక్రమించిపోవుట; 7. అపరాధికి విధింపఁబడిన దండువు. (జరీమానా.)

అత్యయి. సం. విణ. (న్. ఈ. నీ. న్.) 1. అత్యయము కలవాఁడు; 2. అతిక్రమించువాఁడు.

అత్యర్థము. సం. క్రి. విణ. అ. న. మిగుల, మిక్కిలి.—విణ. (అ. ఆ. అ.) ఉండఁదగిన స్థితినిమించినది, అధికము.

అత్యర్థి. సం. వి. (అతి+అర్థి) (చూ. అర్థి.) అధిక భక్తి."ద్వి. అత్యర్థిమై సమభ్యర్చితుఁజేసి."పండి. పర్వత. పు. ౩౮౭. "ద్వి. అహాలాయుధుఁడు నత్యర్థిఁదులాక్కడ,మాహేశ్వరులకు సమ్మతిఁ జాగి మ్రొక్కి."బస. ౪, ఆ. పు. ౧౨౨. "ద్వి. జంగమకోటి కత్యర్థి, ననయంబుఁ బరిచర్య లాచరింపుచును." బస. ౫, ఆ. పు. ౧౪౯. చూ. అర్థి.

అత్యల్పము. సం. విణ. (అ.ఆ.అ.) మిక్కిలి స్వల్పమైనది, చిన్నది.

అత్యష్టి. సం. వి. ఇ. స్త్రీ. పదునేడవ ఛందస్సు. ఇందు జనించినవృత్తమున పాదమునకు పదునేడక్షరములు.

అత్యాకారము. సం. వి. అ. పుం. 1. తిరస్కారము, ఈసడింపు; 2. మితిమీఱిన ఆకారము.— విణ. (అ. ఆ. అ.) ఉండఁదగిన ఆకారమును మించినది. (దేహము మొ.)

అత్యాచారము. సం. వి. అ. పుం. 1. మితిమీఱిన ఆచారము; 2. ఆచారమును అతిక్రమించుట; 3. అనుచితమైనదిచేయుట,విరుద్ధముగా ప్రవర్తించుట.—విణ. (అ. ఆ. అ.) 1. అధికాచారము కలది; 2. ఆచారమును అతిక్రమించినది.

అత్యాదరము. సం. వి. అ. పుం. అధికమగు నాదరము. "వ. అనిన విని ధర్మనందనానుజుం డత్యాదరంబున." భార. విరా. ౪, ఆ. ౧౧౦.

అత్యాదానము. సం. వి. అ. న. ఎక్కువగా గ్రహించుట.— విణ. (అ.ఆ.అ.)1. ఆదానమును అతిక్రమించినది; 2. ఎక్కువగా గ్రహించునది.

అత్యారూఢము. సం. వి. అ. న. 1. మిక్కిలి పైకెక్కుట; 2. గొప్పస్థితిని పొందుట.—విణ. (అ.ఆ.అ.)1.మిక్కిలి పైకి ఎక్కినది; 2.మిక్కిలి ప్రసిద్ధి కెక్కినది; 3. మిక్కిలి అధికమైనది.

అత్యారూఢి. సం. వి. ఇ. స్త్రీ. 1. మిక్కిలి పైకి ఎక్కుట; 2. గొప్పస్థితిని పొందుట.

అత్యాలము. సం.వి. అ. పుం. ఎఱ్ఱచిత్రమూలము.

అత్యాశ. సం. వి. ఆ. స్త్రీ. మితిమీఱిన యాశ, తగనియాశ.

అత్యాహితము. సం. వి. అ. న. **1.** గొప్పయుపద్రవము; **2.** మహాభయము; **3.** ప్రాణాపాయము కలిగించుపని, సాహసకార్యము.

అత్యుక్త. సం. వి. ఆ. స్త్రీ. రెండవఛందస్సు. ఇందలివృత్తమున పాదమునకు రెండక్షరములు.

అత్యుక్తి. సం. వి. ఇ. స్త్రీ. **1.** అతిశయముగా చెప్పుట; **2.** అసంభవవిషయమును చెప్పుట; **3.** అత్యద్భుతముగా చెప్పుట; **4.** అద్భుతాతథ్యవిషయవర్ణనముగల ఒక యలంకారము.

అత్యుగ్రము. సం. వి.అ.న. (మిక్కిలి గాటుగలది.) ఇంగువ.—విణ. (అ. ఆ. అ.) **1.** మిక్కిలి తీక్ష్ణమైనది; **2.** మిక్కిలి భయంకరమైనది.

అత్యుచ్ఛ్రితము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** మిక్కిలి యెత్తయినది; **2.** మిక్కిలి హెచ్చైనది.

అత్యుత్కటము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి హెచ్చైనది, అత్యధికము. "క. పటువిశిఖపంక్తి యత్యుత్కటరయమున నిగుడఁజేయఁగా." భార. విరా. ౫, ఆ. ౧౪౭.

అత్యుత్కృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** ఎక్కువ ఉత్కర్షము కలది; **2.** మిగులగొప్పది.

అత్యుదీర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** మిక్కిలి పైకి లేచినది; **2.** ఉద్ధతము, విజృంభించినది. "క. ఒక్కటఁ గడంగి శల్యునిఁ, బెక్కమ్ముల నొంచుటయును భీష్మద్రోణుల్, గ్రక్కునఁ దఱిమిన నయ్యిరు, దిక్కుల సైన్యములు నత్యుదీర్ణత బెరసెన్." భార. భీ. 3, ఆ. ౨౪3; **3.** మిక్కిలి గొప్పది.

అత్యుపధుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) **1.** పరీక్షకు ఆఁగినవాఁడు; **2.** పరీక్షించి గ్రహింపఁబడిన వాఁడు. (మంత్రి, సేవకుఁడు మొ.)

అథర్వణము. సం. వి. అ. పుం. = అథర్వము.

అథర్వణి. సం. వి. ఇ. పుం. **1.** అథర్వవేదము బాగుగా తెలిసిన బ్రాహ్మణుఁడు; **2.** పురోహితుఁడు.

అథర్వణుఁడు. సం. వి. అ. పుం. **1.** శివుఁడు; **2.** అథర్వవేదము తెలిసిన బ్రాహ్మణుఁడు; **3.** పురోహితుఁడు.

అథర్వము. సం. వి. న్. పుం. వేదములలో నాలుగవది. (ఇందు ధనుర్వేదాయుర్వేదశాంతికపౌష్టిక కర్మాదివిషయము లుండును.)

అథర్వుఁడు. సం. వి. న్. పుం. **1.** శివుఁడు; **2.** బ్రాహ్మణుఁడు; **3.** ఋషిభేదము; **4.** ఋత్విక్కులలో నొకఁడు; **5.** వశిష్ఠఋషి.

అథవా. సం. అవ్య. అట్లు కానినాఁడు, లేక, పక్షాంతరమున. "సీ. వసుమతిపై నథవా నన్నుఁ బుట్టింప నూహ గల్గిన ధర్మయుగమునందు, పుట్టింపు మద్వంశమున జనించినవారి విజ్ఞానపరులఁ గావింపు" వరా. ౨, ఆ. ౧౫౬.

అదంతము. సం. వి. అ. పుం. యూకము, పేను.—విణ. (అ. ఆ. అ.) **1.** దంతములులేనిది; **2.** దంతములురానిది. (శిశువు); **3.** (అత్ + అంత.) హ్రస్వమగు అకారము అంతమందుఁ గలది. (శబ్దము).

అదంత్రము. వై. విణ. (సం. అర్థాంతరమ్=నడుమ విఘ్నమైనది, భగ్నమైనది. అర్థాంత్రమని వాఁడుక కలదు. అతంత్రశబ్దభవమనిన ననపచ్చు.) **1.** నడుమభగ్నమైనది, సగములో చెడినది. "ఉ. మా, తామహు యాగతంత్రము న దంత్రము చేసి, శివాజ్ఞ విక్రమోద్దాముఁడు వీరభద్రుఁడు పదంపడి యందఱఁ గాచె..." కాశీ. ౭, ఆ. ౯౭. (తంత్రమునఁ దంత్రము అని ముద్రితము. ఇది చింత్యము.)ఇట స్వాతంత్ర్యము తప్పినదిఅని శ. ర.; **2.** స్వాతంత్ర్యములేనిది, పరాధీనము. ఈయర్థము కొన్నిచోట్ల వాడుకలోఁ గలదు.

అదక. దే. వి. ప్రాఁతచెప్పు.

అదటు. దే. వి. **1.** అదరిపడుట, ఎగిరిపడుట, త్రుళ్లిపాటు, గర్వము. "వ. అని గర్వించిపలికిన కాళరాత్రిఁ జూచి కనలి రాత్రించరేశ్వరుండు. "సీ. అట్టహాసము చేసి యోరోరి ప్రతాపోక్షులాఁటదానికి నింతయదటు వలదు." కాశీ. ౬, ఆ. ౨౧౧; **2.** మదము, పొగరు. "తే. అఖిలజగములు మ్రింగునం తాఁకలియును, నబ్ధి లేడును జెడఁగ్రోలునంత తృషయు, నచలచాలనచణ

మైన యపటు గలిగె, నసురభావంబు ననుఁజెందు నవసరమున." స్వా. ౫, ఆ. ౨౪.

అదత్తము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** ఈయఁబడనిది; **2.** ఈయఁబడినను న్యాయముగా నీయఁబడనిది; **3.** విధిప్రకారము ఈయఁబడనిది.

అదనము. దే. విణ. కావలసినదానికంటె హెచ్చైనది. "వ. అదనంబుగా ధనంబు గూడఁబెట్టి యీఁగకుం గాటీక పాముసకుం బలిపెట్టక." వరా. పు. ౯, ఆ. ౧౨౩.

అదను. దే. వి. తఱి,యుక్త సమయము.రూ. హదను.

అదపు. దే. వి. (అదల్చుధాతువు కృ.—అదల్పు. అదపు. హిం. అని శ. ర.) అదలించుట, బెదరించుట, తర్జనము. "పిల్లలు అదపు ఆజ్ఞ లేకుండ తిరుగుతున్నారు."

అదభ్రము. విణ. (అ.ఆ.అ.) అల్పము కానిది, అధికము.

అదమ్యము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** శిక్షింపఁదగనిది; **2.** కాఁడికట్టఁదగనిది (గిత్త.)

అదయుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దయలేనివాఁడు.

అదరము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** భయములేనిది; **2.** గొయ్యిలేనిది.

అదరవైచు. దే. స. క్రి. అదలించు, గద్దించు. "వ. ఇట్టట్టు సేయుటకంటె నమంగళంబు గలదే యని యదరవైచియు బుజ్జగించియు బోధించియు వారించె." ప్రభా. ప్ర. 3, ఆ. ౧౪౨.

అదరిపడు. ద్వ. అ. క్రి. (కోపభయాశ్చర్యాదుల వలన) ఉలికిపడు, త్రుళ్లిపడు, ఎగిరిపడు. "వ. అనిన విని ద్రోణుం డదరిపడి వానిం జూతము రమ్మని యర్జునుం దోడ్కొని." భార. ఆది. ౫, ఆ. ౨౪౧. "క. విరోధి,చనుఁ జూచి బొమలు నటియింప నిజక్షమ చెదర నదరిపడి యిట్లని యెన్." వరా. ౫, ఆ. ౧౪.

అదరిపాటు. ద్వ. = అదిరిపాటు.

అదరు. దే. అ. క్రి. **1.** చలించు; **2.** భయాదుల వలన సంభ్రమము నొందు, త్రుళ్లు. "ఆ. కౌరవేశ్వరుండు గనువిచ్చి దిక్కులు, గలయఁజూచి పార్థుఁ గాంచి కడఁగి, యదరిచూచుటయును." భార. విరా. ౫, ఆ. ౨౧౪. (శ్లో...పార్థం నిరీక్ష్యాథ మహేంద్రకల్పం,...రణా త్ప్రిముక్తం పురుషప్రవీరం, స ధార్తరాష్ట్ర స్త్వరితో బభాషే." సం.)—వి. **1.** చలనము; **2.** భయాదుల వలన కలుగు సంభ్రమము, త్రుళ్లిపడుట. "ద్వి. అదరును బెదరు నెయ్యంబు తియ్యంబు."భాగ. ౮, స్క౦. ఇట 'చలనము' అని శ. ర.—బ. మిడుఁగుఱులు. "క. వెలిఁగిరి బలములు దూర్యం,బులు నార్పులుఁ జెలఁగ రెండుఁ బురికొని చతురం,గలసద్గతు లొప్పఁగ వడిఁ, దలపడియెం గైదువుల నదరు లెగయంగాన్." భార. భీ. ౨,ఆ. ౧౭౧. "ఆ. అసుర వీఁక నొక్క మహాచలశృంగంబు, విఱిచివైచె నమరవిభునిమీఁద, గోత్రవైరి ఘోరకులిశాభిహతి వ్రయ్య, నడిచె దానిఁ జదల నదరు లెగయ." భార. అర. ౫, ఆ. ౧౫౧. (వృత్తియందు ఏకవచనాంతమగు. అదరుటగ్గిమొ.)

అదర్శనము. సం. వి. అ. న. **1.** కనఁబడకపోవుట; **2.** నాశము; **3.** లోపించుట; **4.** దృష్టిలేమి; **5.** చూడమి, చూడకపోవుట; **6.** కల, స్వప్నము.—విణ. (అ. ఆ. అ.) **1.** దర్శనములేనిది, కనఁబడనిది; **2.** దృష్టిలేనిది.

అదలు. దే. అ. క్రి. భయపడు, బెదరు.

అదలుచు. దే. ప్రే. అదలించు. రూ. అదల్చు.

అదలుపు. దే. వి. అదలించుట. రూ. అదల్పు.

అదల్చు. దే. ప్రే. **1.** అదలించు, భయపెట్టు; **2.** ధిక్కరించు. "తే. అతండు రాజ,ధర్మమూఁది చలింప కదల్చె నధిప."భార. కర్ణ. ౨, ఆ. ౧౮౮.

అదల్పు. దే. = అదలుపు.

అదవద. దే. వి. **1.** కలఁత, కలవరపాటు. "తే. కీలిఁ గబళించి యాశమ్మిచూలి మించి, ఘాలిఁ గదలించి యుగ్రగ్రహాళి నొంచి, యెందు నున్నను దెత్తు నీయిందువదన, నదన ననుఁజూడు మదవదల్ వదలి యధిప." రామా. ౫, ఆ. ౧౭౭; **2.** పరాభవము, అవమానము. "చ. మదిమదినుండి యేను బలవంతుఁడనై బెడిదంపుఁ గయ్య మె, ట్లొదవునొయంచు నాప్తసచివోత్తుల కెన్నఁడు నీను లొగ్గకి,య్యదవదఁ బొందఁ బాలయితి నక్కట. "హరి. ఉ. ౮, ఆ. ౧౯౯.—విణ. వ్యత్యస్తము, తాఱుమాఱైనది. "చ.

అదవదలైనపయ్యెదలు నందముతప్పిన హారవల్లులుఁ." విక్ర. ౫, ఆ. శ. ర. ఈపాఠము ముద్రితమున కనుపడదు.

అదపదపడు. ద్వి. అ. క్రి. కలఁతపడు, తొట్రుపడు. "క.పదపద రాఘవ నిలునిలు,వదవదపడ వలదు దశరథాధిప నీకుఁ, ముదమొదవఁ దెత్తు మఖరిపు,మదవదసురవధ యొనర్చిమగుడఁగ సుతులన్." రామా. ౪, ఆ. ౧౯.

అదసీయము. సం. విశే. (అ.ఆ.అ.) 1. దీనిసంబంధమైనది. "శా. మంత్రీశుఁ డ,త్యాసంగం బొనరించె ముద్దుగొనె మృత్స్నాస్వాదనప్రక్రియా, వ్యాసంగంబునఁ గమ్మనైన యదసీయంబైన బింబోష్ఠముఁ." శివ. ౨, ఆ. ౪౭; 2. వీని సంబంధమయినది.

అదాటు. వై. అవ్య. ఉన్నట్టుండి.

అదాటుగా. వై = అదాటు.

అది. దే. స. తచ్ఛబ్దార్థకమగు ఆశబ్దమునకు అమహదర్థకప్రథమైకవచనరూపము. కొంచెముదూరమం దున్నదానిని తెలుపునది, స్త్రీవాచకమును, పశుజడవాచకమును అగు సర్వనామము. అదియనునది భారతమున పూజ్యస్త్రీవాచకము నగును. నేఁటివాడుకలో నీచస్త్రీని దెలుపును. పుంవాచక మయినపుడు 'వాఁడు' అగును. "ఆయోఁదుది, ఆపశ్వాది, ఆజడవస్తువు." చూ. ఆ.

అదిగొ. అవ్య. దే. = అదిగో. "తే. పూని కర్ణాత్మజుఁడు వృషసేనుఁ డాత్మ, హయము దాఁటించి నట్టి వాఁ గల్లయదిగొ." కళా. ౮, ఆ. ౧౩౩.

అదిగో. దే. అవ్య. (అది + కొను = అదిచూడు.) ఎదుట కొంచెముదూరముగా నున్నదానిని చూపుటను తెలుపును. (కళాపూర్ణోదయమున ద్రుతాంతముగఁగలదు. దాని ననుసరించియే కాఁబోలు ద్రుతాంతమని శ. ర. చూ.ఇదిగో.) "సీ. రామానుజుండదిగొ మహాయతిరాజు నాయకుండనఁగ నున్నాఁడు వెలసి." పర. ౫, ఆ. ౨౮౧.

అదితి. సం. వి. ఇ. స్త్రీ. 1. పార్వతి; 2. భూమి; 3. దేవతలతల్లి; 4. పునర్వసునక్షత్రము.

అదితినందనుఁడు. సం. వి. అ. పుం. అదితికొడుకు, వేలుపు.

అదిర. దే. అవ్య. (అది+ర.) ఔరా, అద్దిర.

అదిరా. = అదిర. "క. మదిరాక్షికి నేసురుమగ, లదిరా." పాంచా. ౫, ఆ. ౬౭.

అదిరిపడు. ద్వి. అ. క్రి.= అదరిపడు. "వ. నే నపహాసార్థంబు తృణమయసర్పం బమ్మునిపై వైచిన నతం డదిరిపడి నా కలిగి నీవు నిర్వీర్యుంబైన యురగంబ వగుమని శాపం బిచ్చిన." భార. ఆది. ౧, ఆ. ౧౫౭.

అదిరిపాటు. ద్వి.వి. అదరిపడుట, గర్వము.—అవ్య. అదరిపాటుగా, ఉన్నట్టుండి, అకస్మాత్తుగా. "తే. అప్రభావంబుగాదె నన్నదిరిపాటు, కాశి వెడలంగఁ ద్రోచె నిష్కారణంబ." కాశీ. ౨,ఆ. ౧౫౭. "ఆ. అదిరిపా టెవ్వఁ డీక్షించె నాకసమున, హాటకపుఁ గృష్ణపింగళుఁడైనపురుషు, నాతనికి వత్సరద్వయం బవధిసూవె, ప్రాణధారణమున కిల్వలాసురారి."సం. "అకస్మా ద్వీక్షతే యస్తు పురుషం కృష్ణపింగళం, తస్మిన్నేవ క్షణే రూపం సజీవేద్వత్సరద్వయమ్." కాశీ. ౫, ఆ. ౨౨౭.

అదీనము. సం.వి. అ.పుం. ఏనుఁగు.—విశే. (అ. ఆ. అ.) దీనముకానిది.

అదీర్ఘసూత్రి. సం. విశే. (న్.ఈ-ఊ.న్.) దీర్ఘకాలము ఆలోచింపనివాఁడు, శీఘ్రముగా పనిచేయువాఁడు.

అదీర్ఘసూత్రుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) దీర్ఘకాలము ఆలోచింపనివాఁడు, శీఘ్రముగా పనిచేయువాఁడు.

అదుఃఖనవమి. సం. వి. ఈ. స్త్రీ. భాద్రపద శుద్ధనవమితిథి. (ఈదినమున స్త్రీలు రాఁబోవుసంవత్సరమందు దుఃఖములు పోవుటకై దేవుని పూజింతురు.)

అదుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) (సమాసోత్తరపదముగానే ఉపయుక్తము). తినువాఁడు. "మాంసాదుఁడు, మత్స్యాదుఁడు, క్రవ్యాదుఁడు" మొ.

అదుకు. దే. అ.క్రి. = అతుకు. (చం...మహోపలంబుతో, నదికినరీతినున్న సవనాశ్వము." జై. ౪, ఆ. ౭౭.)

అదుము. దే. స. క్రి. అణఁచు. "క. ద్రౌపదియు సుభద్రయు సం, తాపం బందుదురు పాండుతనయులు దలరఁ, భూపాల భవజ్జనకుని, చూపం

దఱమానసముల శోకము నదుమున్." భార. ఆశ్ర. ౨, ఆ. ౧౮.

అదుముడు. దే. వి. అదుముట, పీడనను, ఒఱపిడి.

అదురు. దే. అ. క్రి. చలించు, కదలు. "క. అదురుదురే పగదాయకుఁ, బెదరుదురే ధైర్యమెడలి జీవితవాంఛన్, ముదురుదురే మూలల నరి, కెదురుదురే కాక శూరు లెచ్చోటనయినన్." చంద్ర. (శ.ర.)—వి. 1. చలనము; 2. భయము. రూ. అదరు.

అదురుఁగ్రోవి. దే. వి. (అదురు + క్రోవి.) అదురుపేటు; మ్రానియందు ఇనుపగొట్టములు నాటించి వానియందు మందు గట్టించి అదురునట్లు వేసెడు వేటు. శ. ర.

అదురుఁద్రిక్క. దే. వి. (అదురు+త్రిక్క.) పశురోగవిశేషము. "వ. ఆఁబోతు పంచితంబు మూర్కొనినను బైగాలి వీచినను గోడ్డునకైనం జూలు నిలుచు నుంగిడి యదురుఁద్రిక్క యనువానికి నాపేరు సెప్పినంజోలుఁ." భార. విరా. ౧, ఆ. ౨౮౬. "ఆ. నరిడి పుప్పు కప్పు నావురుకడుపూఁద, యదురుఁద్రిక్కయనఁగ నడరి మఱియుఁ, దెవుళు లెన్నియేని తవిలి యెంతయు మహా, గ్రంబులయ్యెఁ బశుగణంబునందు." హరి. పూ. ౬, ఆ. ౪౬.

అదురుగడ. దే.వి. అదిరిపాటు. "చ. అదురుగడన్ సురారిభటు లాజయశంఖరవంబు వీనులన్, గదిసిన గుండియ ల్పగులఁ గంపముతోఁ దలలెత్తి." ఉ. రా. ౨, ఆ. ౪౮. (శ. ర.) ముద్రితమున "చ. అదిరికదున్ సురారి," అని కలదు.

అదురుగుండియ. దే. విశ. భయపడు స్వభావము గలవాఁడు, భీరువు, హృదయస్థైర్యము లేనివాఁడు.

అదురుగుండె. దే. = అదురుగుండియ.

అదురుచే. దే. అ. క్రి. చలించు, రూ. అదురుచు. అద్రుచు.

అదుర్చు=దే. అదరుచు. "మ. ధరణీచక్రము దిర్దిరన్ దిరిగె మార్తాండుండు కుంభీభవ, త్కిరణుం డయ్యె దిశావితానము వడంకెన్ మిన్నదిర్చెన్ మహీ, ధరసంతానము గ్రక్కసంగదలె నుద్భ్రాంతంబులై యంబుధుల్, ఘోరలెన్ గట్టలమీఁద బిట్టుపిడుగుల్ మ్రోసెన్ మహోదగ్రతన్." భార. ద్రో. ౫, ఆ. ౩౭౭.

అదురువేటు. దే. 1.=అదురుఁగ్రోవి; 2. అదురునట్లు కొట్టెడు దెబ్బ.

అదుర్గము. సం. విశ. (అ.ఆ.అ.) 1. దుర్గముకానిది, ప్రవేశింప శక్యమైనది; 2. కోటలు లేనిది. "అదుర్గవిషయము = కోటలు లేని దేశము."

అదువ. వై. విశ. (సం. అధ్రువం. త. అదవ. దే. అని శ.ర.) 1. అస్థిరుఁడు, స్థిరుఁడుకానివాఁడు. "వ.సదనంబులువిడిచి యదువలై యదువులు పదువులువదలి." భాగ. ౧౦, స్కం. పూ. ౫౬; 2. స్థిరముగానిది. "కెడసిన గరిసెలక్రింద లాఁగులఁ గ్రుస్సి యదువ గాఁపురముండు నాఖుతతుల." ఆము. ౬, ఆ. ౧౩. "యదవ" అని వే. వేం. పాఠము.

అదూరము. సం. వి. అ. న. సమీపము.—విశ. (అ. ఆ.అ.) దూరముకానిది, దగ్గఱగా నున్నది.

అదృక్కు. సం. విశ. శ్. 1. గ్రుడ్డివాఁడు, కన్నులు లేనివాఁడు; 2. చూడనివాఁడు.

అదృప్తుఁడు. సం. విశ. (అ.ఆ.అ.) గర్వింపనివాఁడు.

అదృశ్యకరణము. సం. వి. అ. న. కనఁబడకుండఁగఁ జేయుట, మాయము చేయుట.

అదృశ్యము. సం. విశ. (అ.ఆ.అ.) 1. చూడ శక్యముకానిది; 2. చూడఁదగనిది; 3. కనఁబడనిది; 4. మాయమయినది.

అదృశ్యుఁడు. సం. విశ. కనఁబడనివాఁడు.

అదృష్టచరము సం. = అదృష్టపూర్వము.

అదృష్టపూర్వము. సం. విశ. (అ.ఆ అ.) ఇదివఱ కెప్పుడును చూడఁబడనిది.

అదృష్టము. సం. వి. అ. న. సుఖదుఃఖనిమిత్తమయిన పుణ్యపాపరూపమగు కర్మఫలము.— విశ. (అ. ఆ.అ.) 1. చూడఁబడనిది; 2. అనుభవింపఁబడనిది. "అదృష్టవిరహావ్యథుఁడు."

అదృష్టవంతుఁడు. సం.విశ. (త్.ఈ-వ.త్.) అదృష్టముకలవాఁడు, సంపన్నుఁడు.

అదృష్టశాలి. సం. విశ. (న్. ఈ-సీ. న్.) అదృష్టముచే ప్రకాశించువాఁడు.

అదృష్టహీనుఁడు. సం. విశ. (అ.ఆ.అ.) అదృష్టము లేనివాఁడు.

అదృష్టి. సం. వి. ఇ. స్త్రీ. **1.** దృష్టిలేమి, దృష్టి లేకపోవుట; **2.** క్రూరదృష్టి.—విణ. ఇ. దృష్టి లేనివాఁడు.

అదేయము. సం. విణ. (అ. ఆ. అ.) ఈయఁగూడనిది, ఈయఁదగనిది.

అదేవమాతృకము. సం. విణ. (అ.ఆ.అ.) వర్షాధారముకానిది, నదీమాతృకము, నద్యాదులజలమున ఫలించుసస్యముగలది (దేశము).

అదేశ్యము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** ఉపదేశింపఁదగనిది; **2.** దేశమందులేనిది; **3.** దేశ్యము కానిది.

అదైవము. సం. విణ. (అ.ఆ.అ) **1.** దైవములేనిది, అదృష్టములేనిది; **2.** వైశ్వదేవస్థానము లేనిది (శ్రాద్ధము.)

అద్ద. వై. వి. **1.** అర్థము, సగము; **2.** అరసోల. "సీ. అద్దయం చనఁగఁ దదర్థ మొప్పు." ఆం,భా. ద్వి. వై. ౨౭౦; **3.** సూర్చుకవేసినకుప్పయొక్క క్రింది సగముభాగము. శ. ర. (దీనికి సగమను అర్థమున వ్యస్తముగాఁ బ్రయోగము కనఁబడ లేదు.)

అద్దకము. దే. వి. వస్త్రమునకు వేయురంగు. "అద్దకపుఁజీర."

అద్దగోడ. వై. వి. సగముగోడ, వంటయింటిలో వంటపదార్థముల మఱుఁగుకై పెట్టెడి పొట్టిగోడ.

అద్దమరేయి. వై. వి. (అద్ద+రేయి.) నిశీథము, అర్థరాత్రము, రాత్రి పండ్రెండుగంటలకు సమమగు కాలము.

అద్దము. వై. వి. ముఖముచూచుకొనుటకై వెనుక రసముపూసిన గాజుబిల్ల, ఆదర్శము. (ఆదర్శశబ్దభవమని కొందఱు. అబ్దశబ్దభవ మనవచ్చును.)

అద్ది. దే. స.=అది. రూ. అయ్యది, అయది.

అద్దించు. దే. స. క్రి. **1.** ఊహించు; **2.** ఫలపరిమితి నూహించు; **3.** రంగువేయునట్లుచేయు; **4.** ముంచు, తోఁచు; **5.** అద్దుడు కాకితముతో సిరా ఇంకించు.

అద్దికము. దే. వి. కావలి, రక్షణము. "తే. వాటి వాటిలోనింత తాటోటుచేసి, యటమటించక యయుండఁ బైయద్దికముగ, నేపఁ దిరుగాడువిశ్వాసు లెపుడు మాకు, జాగిలంబులు సుమ్ము మాసామి కాన." సా. ౧, ఆ. ౭౩.

అద్దియ. దే. వి. **1.** నెలకు ఇంతయని ఏర్పఱచుకొని ఇంటిలో కాఁపురమున్న కుటుంబమువారు యింటివారి కిచ్చెడుబాడుగ; **2.** బండియెక్కినవారు బండివానికిచ్చు సొమ్ము, బండిబాడుగ. రూ. అద్దె.

అద్దిర. దే. అవ్య. (అద్ది+ర.) అదిర. "చ. తాయి య, ద్దిర స్ఫురితంబు లమ్మ యన." ఉ. రా. ౬, అ. ౧౩౪. (దీనికి అన్నఅయ్యలు అనుప్రయుక్తము లగును. "అద్దిరన్న; అద్దిరయ్య.")

అద్దిరపాటు. ద్వి. వి. ఆశ్చర్యము. "ఉ. అద్దిరపాటున వానిఁజూచి." సా. ౩, ఆ. శ. ర. ఈపాఠము ముద్రితమున కనుపడదు.

అద్దిరా. దే.=అద్దిర. "సీ. అద్దిరా నీకుఁ గ్రొవ్వఱుగ దేఁజూతుగాకని తలసూపక యడఁగువారు." భార. విరా. ౩, ఆ. ౩౭. "శా. ఆహా విలాసంబు ల, జ్జారే జవ్వన మద్దిరా వగలు మజ్జారే తనూవిభ్రమం, బీరామామణితోడ నీడుగలరా యీరేడు లోకంబులన్." శశాం. ౩, ఆ. ౨౩.

అద్దు. దే. స. క్రి. **1.** తోఁచు, తోఁగఁజేయు, ముంచు. "చ. నరవరవాసవుం డడిగినన్ గురుఁడిట్లని చెప్పె బుద్ధితోఁ, బొరయని పాతకంబులు సబుద్ధిక పుణ్యములన్ నశించు నం,బరమునఁ బట్టి నట్టి మలపంకము గారములోన నద్దఁగా, విరిసిన యట్లు నమ్ము మిది వేదము సెప్పిన నేను జెప్పితిన్." భార. శాంతి. ౩, ఆ. ౩౬౪; "ద్వి. భవుఁడవు నీవ సచ్ఛక్తుండ వీవ, భువిలోన మఱి సెప్పఁ బోల్పంగ గలరె; నిద్దంబుగా నీట నద్దుము వాల, నద్దుము మా కింక నన్యథా లేదు." బస. ౫, ఆ. పు. ౧౪౮; **2.** రంగువేయు. "ఈచీర అద్దుటకు రంగుల వాని కిచ్చినాను;" **3.** నీరు, సిరామొదలగునవి గుడ్డ, కాకితము మొదలగువానిచే పీల్చుకొనునట్లు చేయు; "ఆమె అంగవస్త్రముతో నీరు అద్దినది; అద్దుకాకితముతో సిరా అద్దితిని."

అద్దుకాకితము. దే. వి. సిరాను పీల్చుకొనెడు కాకితము.

అద్దువ. దే. విణ. = అదువ.

అద్దె. దే. = అద్దియ.

అద్దెకాఁపు. దే. వి. **1.** అద్దెకు కాఁపుర మున్నవాఁడు; **2.** కూలికి పనిచేయుకాఁపు; **3.** ఉద్దారుగ నున్నకాఁపు; **4.** పాలికాఁపు, పాలేఱు.

అద్ధా. సం. అవ్య. సత్యముగా. తెనుఁగున ననుకరణమున నె యుపయుక్తము. "శా. అద్ధా వాగ్విబుధమ్మహోవచన కవ్యాహార మాహోవచస్సిద్ధమ్మాకృతతాంగతః." ఆము. ౪, ఆ. ౬.

అద్భుతము. సం. వి. అ. న. ఆశ్చర్యము.—విణ. ఆశ్చర్యకరము.

అద్మరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) భక్షణశీలుఁడు, తిండిపోతు.

అద్యతనము. సం. వి. అ. పుం. నేఁటికాలము, ప్రస్తుతకాలము. (అద్యతన మనఁగాఁ గడచిన రాత్రియొక్క తుది సగముభాగమును రాఁబోవు రాత్రియొక్క పూర్వార్ధమును కలసిన దివసము.)—విణ. (అ. ఈ. సీ. అ.) నేఁడు ఉండునది, ప్రస్తుతకాలమున నుండునది.

అద్యతనీయము. సం. విణ. (అ.ఆ.అ.) = అద్యతనము.

అద్యశ్వీన. సం. వి. ఆ. స్త్రీ. (నేఁడో రేపో ప్రసవించునది.) ఆసన్నప్రసవసమయముగల స్త్రీ, పూర్ణగర్భవతి.

అద్రి. సం. వి. ఇ. పుం. **1.** కొండ; **2.** చెట్టు; **3.** సూర్యుఁడు.

అద్రికన్య. సం. వి. ఆ. స్త్రీ. పార్వతి.

అద్రికాకము. సం. వి. అ. పుం. కొండకాకి.

అద్రికీల. సం. వి. ఆ. స్త్రీ. భూమి, పుడమి.

అద్రికుక్షి సం. వి. ఇ. స్త్రీ. కొండగుహ.

అద్రిజ. సం. వి. ఆ. స్త్రీ. **1.** సైంహలి♣; **2.** పార్వతి.

అద్రినందన. సం. వి. ఆ. స్త్రీ. పార్వతి.

అద్రినందని. సం. వి. ఈ. స్త్రీ. పార్వతి.

అద్రినందిని. సం. వి. ఈ. స్త్రీ. పార్వతి.

అద్రుచె. దే. = అదుర్చు (ఇందు మొదటిది (అకారము) లఘువు. "ఆ. సురదుందుభిధ్వనుల్, సెలఁగె సకలభువనవలయ మద్రువ." భార. ఆది. ౫, ఆ. ౧౨౪. "తే. రథము లొక్కటఁ బఱపిరి పృథివి యద్రువ." భార. విరా. 3, ఆ. ౨౧౫.

అద్వయము. సం. వి. అ. న. **1.** రెండవదిలేమి; **2.** అభేదము.

అద్వయవాది. సం. వి. న్. పుం. బుద్ధుఁడు.—విణ. (న్. ఈ. నీ. న్.) అద్వైతమును వాదించువాఁడు, అంతయు జ్ఞానాత్మకమని వాదించువాఁడు.

అద్వితీయము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** రెండవదిలేనిది; **2.** సహచరుఁడులేనిది; **3.** సజాతీయమైన వస్తువులేనిది (పరబ్రహ్మము.)

అద్వైతము. సం. వి. అ. న. **1.** భేదములేమి; **2.** జీవేశ్వరుల యైక్యమును బోధించు మతము; **3.** పరబ్రహ్మము.— విణ. (అ. ఆ. అ.) భేదములేనిది.

అద్వైతి. సం. వి. న్. పుం. జీవేశ్వరుల కైక్యముఁ జెప్పెడి మతముగలవాఁడు.

అధఃకరణము. సం. వి. అ. న. **1.** క్రిందుపఱచుట; **2.** తక్కువపఱచుట.

అధఃకరించు. సం. స. క్రి. **1.** క్రిందుచేయు, అతకరించు; **2.** తక్కువచేయు; కొంచెపఱచు.

అధఃకారము. సం. వి. అ. పుం. **1.** క్రిందుచేయుట; **2.** తక్కువచేయుట, కొంచెపఱచుట.

అధఃకృతము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** క్రిందుగాఁ జేయఁబడినది; **2.** తక్కువచేయఁబడినది.

అధఃక్రియ. సం. వి. ఆ. స్త్రీ. క్రిందుపఱచుట, అగౌరవము చేయుట.

అధఃపాతి. సం. విణ. (న్. ఈ. నీ. న్.) **1.** క్రిందఁబడువాఁడు; **2.** అధోలోకమునఁబడువాఁడు; నరకమొందువాఁడు. "వ...కాలుండు మూషికవ్యాజంబునం దరతరంబ కొఱికిన నొక్క వేర తక్కియున్నయది యదియును జరత్కారుం డనపత్యుండయినం దెగు నే మధఃపాతుల మగుదు మా తండపత్యంబు వడసెనేని యూర్ధ్వగతుల మగుదుము." భార. ఆది. ౨, ఆ. ౧౪3.

అధన్యుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) **1.** ధన్యుఁడుకాని వాఁడు; **2.** సుఖవంతుఁడు కానివాఁడు.

అధమభృతకుఁడు. సం. వి. అ. పుం. బరువుమోసి జీవించువాఁడు. (ఆయుధీయుఁడు ఉత్తమభృత

కుఁడు; కృషీవలుఁడు మధ్యమభృతకుఁడు; భార వాహి అధమభృతకుఁడు.)

అధమము. సం. విశే. (అ. ఆ. అ.) 1. హీనము, తక్కువైనది; 2. నిందింపఁబడినది. (వ్యతి. ఉత్తమము, మధ్యమము.)

అధమర్ణుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఋణము పుచ్చుకొన్నవాఁడు. (వ్యతి. ఉత్తమర్ణుఁడు.)

అధమాధమము. సం. విశే. (అ.ఆ.అ.) 1. మిక్కిలి తక్కువది; 2. మిక్కిలి నీచము.

అధరము. సం. వి. అ. పుం. 1. క్రిందిపెదవి; 2. పెదవి.—విశే. (అ. ఆ. అ.) 1. క్రిందిది; 2. తక్కువైనది, అధమమైనది. (వ్యతి. ఉత్తరము.)

అధరామృతము. సం. వి. అ. న. అధరోష్ఠమందలి యమృతమువంటి రసము.

అధరితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. క్రిందు చేయఁబడినది; 2. తక్కువచేయఁబడినది.

అధరీణము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అధరమందున్నది; 2. క్రిందిభాగమున నున్నది; 3. హీనము.

అధరీణుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) ధిక్కృతుఁడు, పరులచేత నిందింపఁబడ్డవాఁడు.

అధరుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) నీచుఁడు.

అధరోష్ఠము. సం. వి. అ. పుం. క్రిందిపెదవి.—వి. అ. న. మీఁదిపెదవి, క్రిందిపెదవియును.

అధర్మము. సం. వి. అ. పుం. 1. ధర్మములేమి; 2. పాపము.—విశే. (అ.ఆ.అ.) ధర్మములేనిది, ధర్మమునకు విరుద్ధమైనది.

అధస్తనము. సం. విశే. (అ. ఈ. నీ. అ.) క్రిందిభాగమందున్నది.

అధి. సం. ఉప. (దీనికి వ్యస్తముగఁ బ్రయోగములేదు. ఈక్రిందియర్థములను సూచించును.) 1. ఆధిక్యము. "అధిదంతము; అధిమాసము;" 2. అతిశయము. "అధీశ్వరుఁడు;" 3. పైభాగము. "అధిజిహ్వక; అధిత్యక."

అధికప్రసంగము. సం. వి. అ. పుం. 1. సంబంధములేని సంభాషణము; 2. మితిమీఱిన సంభాషణము.

అధికమాసము. సం. వి. అ. పుం. మలమాసము. చూ. అధిమాసము.

అధికము. సం. వి. అ. పుం. ఒకయర్థాలంకారము. చూ. అలంకారము.—విశే. (అ. ఆ. అ.) 1. ఎక్కువయైనది. (వ్యతి. ఊనము.) "అధికక్రోధము; ప్రమాణాధికశ్వాసము; పయోధికుఁడు;" 2. ప్రధానము; 3. అసాధారణము, సర్వసామాన్యము కానిది, అందఱకు దొరకనిది.

అధికరణము. సం. వి. అ. న. 1. ఆధారము. (వ్యాక. క్రియాశ్రయమగు ఒక కారకము;) 2. (అధిక+రణము.) గొప్పయుద్ధము.

అధికరణికుఁడు. సం. వి. అ. పుం. వ్యవహార విచారణమునకు నియమింపఁబడిన అధికారి, తీర్పుఁ జెప్పువాఁడు.

అధికరించు. సం. స. క్రి. 1. చదువు; 2. సంపాదించు, నేర్చు. "సీ. పురవైరికరుణ నిర్జరులవలన, నధికరించితివస్త్రదాచార్యకంబునం జతురంబు లగు దివ్యసాధనములు." హర. 2, ఆ. ౧౪౪.

అధికర్మికుఁడు. సం. వి. అ. పుం. పన్నువసూలు చేయుటకు ఏర్పడినవాఁడు.

అధికాంగము. సం. వి. అ. న. 1. అధికమైన అవయవము; 2. కవచము తొడిగికొని తర్వాత నడ్డికి బిగించికట్టెడు కట్టు, సారసనము.—విశే. (అ. ఈ. గీ. అ.) అధికమైన అవయవములు గలది.

అధికారము. సం. వి. అ. పుం. 1. అర్హత, యోగ్యత. "కర్మాధికారము, వేదాధికారము;" 2. విహితకార్యము, నియమితమగుపని, విధి, విహితధర్మము. "నిర్ణయాధికారము, లోకతంత్రాధికారము;" 3. ప్రభుత్వము, పరిపాలనము, ఏలుట; 4. స్వామ్యము, హక్కు; 5. గణన, ఎన్నిక; 6. అధికరణము, గ్రంథభాగము. "ప్రాయశ్చిత్తాధికారము;" 7. (వ్యాక.) ముందు సూత్రములలోనికి అనువృత్తిగావచ్చు మొదటి సూత్రము.

అధికారి. సం. విశే. (న్. ఈ.ణీ. న్.) అధికారము కలవాఁడు.

అధికృతి. సం. వి. ఇ. స్త్రీ. = అధికారము.

అధికృతుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) అధికారమున నియమింపఁబడినవాఁడు.—వి. అ. పుం. అధికారముగల పురుషుఁడు.

అధిక్రియ. సం. వి. ఆ. స్త్రీ.=అధికారము.

అధిక్షిప్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తిరస్కరింపఁబడినది, నిందింపఁబడినది; 2.ఆక్షేపింపఁబడినది; 3. త్రోసివేయఁబడినది.

అధిక్షేపము. సం. వి. అ. పుం. 1. నింద,తిరస్కారము; 2. ఆక్షేపణము, దోషములు చూపుట; 3. త్రోసివేయుట.

అధిక్షేపించు. సం. స. క్రి. 1. దూఱు; 2. బెదరించు.

అధిగంత. సం.విణ. (ఋ.ఈ-త్రీ.ఋ.) 1. పొందువాఁడు; 2. తెలిసికొనువాఁడు; 3. చదువువాఁడు.

అధిగంతవ్యము. సం. = అధిగమ్యము.

అధిగతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందఁబడినది; 2. తెలిసికొనఁబడినది. "అధిగతపరమార్థుఁడు;" 3. చదువఁబడినది.

అధిగమనము. సం. వి. అ. న. = అధిగమము. "శాస్త్రాధిగమనము" మొ.

అధిగమము. సం. వి. అ. పుం. 1. పొందుట; 2. లాభము; 3. స్వీకరించుట; 4. చదువుట; 5. జ్ఞానము.

అధిగమించు. సం. స. క్రి. 1. పొందు; 2. చదువు; 3. తెలియు.

అధిగమ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందఁదగినది; 2. తెలిసికొనఁదగినది; 3. పఠింపఁదగినది.

అధిగుణము. సం. వి.అ. పుం. అధికమైనగుణము.—విణ. (అ.ఆ.అ.) 1. అధికమైన గుణములుగలది; 2. ఎక్కుపెట్టఁబడిన నారిగలది (ధనుస్సు.)

అధిజిహ్వక. సం. వి. ఆ. స్త్రీ. 1. కొండనాలుక; 2. నాలుక వాపు అను రోగము.

అధిజ్యధన్వుఁడు. సం. విణ. న్. ఎక్కుపెట్టఁబడిన విల్లుగలవాఁడు, వింటిని ఎక్కుపెట్టినవాఁడు.

అధిజ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ఎక్కుపెట్టఁబడిన నారిగలది. "అధిజ్యకార్ముకుఁడు."

అధిత్యక. సం. వి. ఆ. స్త్రీ. 1. కొండపైభాగము; 2. కొండమీఁది సమమైనచోటు, సెత్తము. (వ్యతి. ఉపత్యక.)

అధిదంతము. సం. వి. అ. పుం. జంటపన్ను, దంతముమీఁద బయలుదేరిన దంతము.

అధిదేవత. సం. వి. ఆ. స్త్రీ. అధిష్ఠానదేవత.

అధిపతి. సం. విణ. ఇ. ప్రభువు, ఏలిక, రాజు.

అధిపుఁడు. సం. విణ. (అ. ఆ. అ.)=అధిపతి.

అధిభువు. సం. విణ. (ఊ. ఊ. ఊ.) = అధిపతి.

అధిమాంసకము. సం. వి. అ. పుం. దంతప్రాంతములయందు కండపెరుగుట, ఇగుళ్లుబ్బుట.

అధిమాంసము. సం. వి. అ. పుం. కంటి తెల్లగుడ్డుపైని మాంసపుకండ పెరుగుట యను రోగము.

అధిమాసము. సం. వి. అ. పుం. అధికమాసము, మలమాసము, సూర్యునకు రాశ్యంతర సంక్రమణము లేని చాంద్రమాసము, (సూర్యుఁడు ఒక రాశియందుండఁగా చాంద్రమాన ప్రకారము రెండవ నెల ప్రారంభమయినపుడు ఆ రెండుమాసములకును ఒక్కటియే నామము. అందు మొదటిది మలమాసము. అదే అధికమాసము. మేషమందు సూర్యుఁడుండఁగ చాంద్రమాన మాసము ప్రారంభ మయినచో వైశాఖమని పేరు. సూర్యుఁడు ఆరాశియందుండఁగనే చాంద్రమానమాసము రెండవది ప్రారంభమైనచో దానికిని వైశాఖమనియే పేరు. ఆ రెంటిలో మొదటిది అధికమాసము.)

అధిరోపణము. సం. వి. అ. న. పైకి ఎక్కించుట.

అధిరోహణము. సం. వి. అ. న. ఆరోహణము, పైకెక్కుట. "రథాధిరోహణము."

అధిరోహము. సం. వి. అ. పుం. పైభాగమునకెక్కుట.

అధిరోహి. సం. విణ. (న్. ఈ. ణీ. న్.) 1. పైభాగమున కెక్కువాఁడు; 2.అభివృద్ధికి వచ్చువాఁడు.

అధిరోహించు. సం. స. క్రి. ఆరోహించు, ఎక్కు.

అధిరోహిణి. సం. వి. ఈ. స్త్రీ. పైకెక్కుటకుఁదగిన సాధనము, నిశ్శ్రేణి, నిచ్చెన.

అధివసించు. సం. అ. క్రి. నివసించు, ఉండు. "తే. అంబరీషతీర్థంబున నధివసింతుఁ, గేవలం

బన నాదిత్యకేశవుఁడనఁ, బాతకధ్వాంతవిధ్వంస పాటనమునఁ, జేయుదు శుభంబు తత్తీర సేవకు లకు." కాశీ. ౬, ఆ. ౧౭౨.

అధివాసము. సం. వి. అ. పుం. 1. ఉనికి, నివాసము; 2. పరిమళము; 3. గంధమాల్యాదులతో పరిమళింపఁజేయుట, వాసెనకట్టుట; 4. యజ్ఞారంభమునకు పూర్వదినమునఁజేయు దేవతాస్థాపన మొ. కర్మ; 5. నారింజ చె.

అధివాసరము. సం. వి. అ. పుం. న.= అతివాసము.

అధివాసి. సం. విణ. (న్.ఈ-సీ. న్.) 1. నివసించువాఁడు; 2. పరిమళింపఁజేయువాఁడు.

అధివిన్న. సం. వి. ఆ. స్త్రీ. భర్త మఱియొక స్త్రీని వివాహము చేసికొనుటచే కోపించి వెడలిపోయిన మొదటిభార్య.

అధివేత్త. సం. వి. ఋ. పుం. భార్యయుండఁగ మరల వివాహము చేసికొన్నవాఁడు.

అధివేదనము. సం. వి. అ. న. భార్యయుండ మఱియొకతెను బెండ్లియాడుట.

అధిశ్రపణము. సం. వి. అ. న. పాచనము, వండుట.

అధిశ్రయణము. సం. = అధిశ్రయము.

అధిశ్రయణి. సం. వి. ఈ. స్త్రీ. (వంటచేయుటకు ఆధారమైనది.) ప్రొయ్యి.

అధిశ్రయము. సం. వి. అ. పుం. పాకము, వంట.

అధిశ్రవణము. సం. వి. అ. న. 1. శ్రాద్ధకాలమందు వేదపఠనము వినుట; 2. శ్రాద్ధకాలమందు వేదపాఠము.

అధిషవణము. సం. వి. అ. న. 1. సోమరసము తీసెడు చర్మమయపాత్ర;2.సోమరసముతీయుట.

అధిష్ఠాత. సం. విణ. (ఋ.ఈ-త్రీ. ఋ.) (అధిష్ఠించువాఁడు.) 1. అధికారి, అధ్యక్షుఁడు; "వ. నన్ను విరాటుండు మున్ను నీ వెందుండుదని నిరూపించె నేని యుధిష్ఠిరు గోష్ఠంబున కధిష్ఠాతనై యుండు దుననియెద నని పలికిన." భార. విరా. ౧, ఆ. ౧౦౨; 2. నియమిత కార్యమును కనిపెట్టి చూచువాఁడు; 3. అధిష్ఠాన దేవత. "ఇంద్రియాధిష్ఠాత."

అధిష్ఠానము. సం. వి. అ. న. 1. సన్నిధి; 2. ఆశ్రయము. "ప్రాణాధిష్ఠానము దేహము;" 3. నివాసము. "పట్టణము రాజాధిష్ఠానము;" 4. ఆధారము; 5. ప్రాభవము; 6. నియమితకార్యము కనుపెట్టిచూచుట, ఉపదర్శనము; 7. కూర్చుండుట.

అధిష్ఠించు. సం. స. క్రి. 1. ఆశ్రయించు; 2. కూర్చుండు. (ఆసనంబధిష్ఠించి యని ద్వితీయతో నన్వయించును.)

అధిష్ఠితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఆధారముగఁ జేసికొనఁబడినది; 2. అధిష్ఠింపఁబడినది, నివసింపఁబడినది (పురము మొ.); 3. కాపాడఁబడినది. "రాజపురుషాధిష్ఠితము."

అధీకారము. సం. = అధికారము.

అధీతము. సం. వి. అ. న. అధ్యయనము, చదువు. —విణ. (అ. ఆ. అ.) చదువఁబడినది. "అధీత వేదవేదాంగుఁడు."

అధీతి. సం. వి. ఇ. స్త్రీ. అధ్యయనము, చదువుట. "అధీతి బోధాచరణ ప్రచారణములు." విణ. (న్. ఈ- తీ. న్.) అధ్యయనము చేసినవాఁడు, చేదివినవాఁడు.

అధీనము. సం. విణ. (అ. ఆ. అ.) ఆయత్తము, వశమం దున్నది. "భవదధీనము."

అధీర. సం. వి. ఆ. స్త్రీ. 1. నాయికాభేదము. చూ. నాయిక; 2. మెఱుపు.

అధీరుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. చంచలుఁడు; 2. భయశీలుఁడు; 3. (రోగాదులచే) వ్యాకులత గలవాఁడు.

అధీశుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. సార్వభౌముఁడు; 2. అధిపతి, రాజు. "అంగాధీశుఁడు"మొ.

అధీశ్వరుఁడు. సం. విణ. (అ.ఈ-రీ. అ.)=అధీశుఁడు.

అధీష్టము. సం. వి. అ. న. సత్కారపూర్వకముగ నియోగించుట.

అధీష్టుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) గౌరవపూర్వకముగ నియమింపఁబడినవాఁడు.

అధునాతనము. సం. విణ. (అ. ఈ-నీ. అ.) ఇపుడున్నది, నేఁటికాలపుది.

అధృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ధైర్యములేమి; 2. సంతోషములేమి; 3. ధరింపకపోవుట.—విణ.

ఇ. 1. ధైర్యములేనివాఁడు; 2. సంతోషములేని వాఁడు; 3. ధరింపనివాఁడు, ధారణలేనివాఁడు.

అధృష్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. దరి చేరరానివాఁడు; 2. తిరస్కరింప రానివాఁడు; 3. గర్వి; 4. లజ్జాశీలుఁడు.

అధైర్యము. సం. వి. అ. న. ధైర్యములేమి.—విశే. (అ. ఆ. అ.) ధైర్యము లేనిది.

అధోక్షజుఁడు. సం. వి. అ. పుం. (ఇంద్రియములచే గ్రహింప నలవికానివాఁడు.) విష్ణువు, వెన్నుఁడు.

అధోగతి. సం. వి. ఇ. స్త్రీ. 1. క్రిందుగాపోవుట; 2. హీనత్వము నొందుట.

అధోగతుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1 క్రిందికిఁ బోయినవాఁడు; 2. తక్కువస్థితిని పొందినవాఁడు, హీనత్వమును పొందినవాఁడు.

అధోజిహ్విక. సం. వి. ఆ. స్త్రీ. కొండనాలుక.

అధోదృష్టి. సం.వి.ఇ.స్త్రీ. క్రిందుగాఁ జూచుట.—విశే. ఇ. క్రిందుగాఁజూచువాఁడు, క్రిందుభాగమునకు దృష్టికలవాఁడు.

అధోభువనము. సం. వి. అ. న. క్రిందిలోకము, పాతాళము.

అధోముఖుఁడు. సం. విశే. (అ. ఈ-ఖీ. అ.) క్రిందుగావంచిన ముఖముగలవాఁడు.

అధోయంత్రము. సం. వి. అ. పుం. తైలను మొదలగునవి తీయుటకేర్పఱచిన బట్టీ.

అధోలోకము. సం. వి. అ. పుం. ఈభూలోకమునకు క్రిందిభాగమున నుండు లోకము (పాతాళము.)

అధౌరేయుఁడు. సం.విశే.(ఆ. ఈ-యీ.అ.) 1.భారవాహకుఁడు కానివాఁడు; 2. అసమర్థుఁడు; 3. అప్రధానుఁడు.

అధ్యక్షము. సం. వి. అ. న. ప్రత్యక్షజ్ఞానము.—పుం. క్షీరిక ✿.

అధ్యక్షించే. సం. స. క్రి. పాలించు, ఏలు.

అధ్యక్షుఁడు. సం. వి.అ. పుం. 1. అధికారి, ప్రభువు. "గ్రామాధ్యక్షుఁడు" మొ.; 2. రాజకార్యాదులయందు ప్రధానుఁడగు రాజపురుషుఁడు.—విశే. (అ.ఆ.అ.) ప్రత్యక్షమైనవాఁడు, ఇంద్రియగోచరుఁడు.

అధ్యగ్నికృతము. సం. వి. అ. న. వివాహవేళ అగ్నిహోత్రుని సన్నిధిని ఇయ్యఁబడు స్త్రీధనము.

అధ్యధీనుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) జన్మావధి పరాధీనుఁడుగ నున్నవాఁడు, గర్భదాసుఁడు.

అధ్యధోభువనము. సం. వి. అ. న. పాతాళలోకము, క్రిందిలోకము. "క. బహువర్షసహస్రంబులు, ద్రుహిణుండును హరియు నధ్యధోభువనములన్, బహులక్రియ శోధించిరి." శివ. ౧, ఆ. ౧౦౧.

అధ్యయనము సం.వి.అ.న. గురుసన్నిధినిఁ జదువుట, చదువుట. "వేదాధ్యయనము." ఇది షట్కర్మలలో నొకటి.

అధ్యయనించే. సం. స. క్రి. అధ్యయనముచేయు, చదువు.

అధ్యవసాయము. సం. వి. అ. పుం. 1. ఇది ఇట్లు అను నిశ్చయము; 2. ఉత్సాహము, పూనిక.

అధ్యవసాయి. సం. విశే. (న్. ఈ-నీ. న్.) 1. నిశ్చయముగలవాఁడు; 2. ఉత్సాహముగలవాఁడు.

అధ్యవసితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. నిశ్చయింపఁబడినది; 2. యత్నింపఁబడినది.

అధ్యవసేయము. సం. విశే. (అ. ఆ. అ.) 1. నిశ్చయింపఁదగినది; 2. యత్నింపఁదగినది.

అధ్యవహననము. సం. వి. అ. న. ఊఁక చెఱిగిన బియ్యము మరల దంపుట, చేబియ్యము దంపుట, తెల్లబియ్యము చేయుట.

అధ్యస్తము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆరోపింపఁబడినది; 2. పైనుంచఁబడినది.

అధ్యాక్రాంతము. సం. విశే. (అ.ఆ.అ.) ఆక్రమింపఁబడినది.

అధ్యాఖ్యానము. సం. వి. అ. న. కల్లజగడము.

అధ్యాఖ్యానుఁడు. సం. వి. అ. పుం. లేనిదోషము నారోపించువాఁడు.

అధ్యాత్మము.సం. వి. అ.న. పరబ్రహ్మము.—విశే.న్. ఆత్మనుగుఱించినది. (ఉపనిషత్తు మొ. గ్రంథము.)

అధ్యాత్మయోగము. సం. వి. అ. పుం. మనస్సును విషయములనుండి మరలించి ఆత్మయందు అనుసంధానము చేయుట.

అధ్యాపకుఁడు. సం. వి. అ. పుం. 1. అధ్యయనము చేయించువాఁడు, వేదము చెప్పుగురువు; 2. ఉపాధ్యాయుఁడు, చదివించువాఁడు, చదువుచెప్పు

వాఁడు. "వ్యాకరణాధ్యాపకుఁడు, భృతకాధ్యాపకుఁడు," మొ.

అధ్యాపనము. సం. వి. అ. న. వేదముఁజదివించుట. (ఇది బ్రాహ్మణ విహిత షట్కర్మలలో నొకటి.)

అధ్యాపయితృ. సం. వి. ఋ. పుం. వేదము చెప్పు గురువు.

అధ్యాపితము. సం. విణ. (అ. ఆ. అ.) చదివింపఁబడినది.

అధ్యాయము. సం. వి. అ. పుం. **1.** అధ్యయనము. "స్వాధ్యాయము;" **2.** గ్రంథభాగ విశేషము, పురాణాదులయందలి విభాగము. (సర్గము, ఆశ్వాసము, పరిచ్ఛేదము వంటిది.) "మంత్రాధ్యాయము."

అధ్యారూఢము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** ఆక్రమించినది; **2.** పైకి ఎక్కినది.

అధ్యారోపణము. సం. వి. అ. న. **1.** ధాన్యాదులను జల్లుట; **2.** విత్తుట; **3.** పైకి లేవఁదీయుట; **4.** ఆరోపించుట.

అధ్యారోపము. సం. వి. అ. పుం. **1.** ఒకపదార్థమును మఱియొక పదార్థముగ గ్రహించు మిథ్యాజ్ఞానము. (భ్రాంతి); **2.** పైకెక్కించుట.

అధ్యావాహనికము. సం. వి. అ. న. అత్తవారింటికి వెళునపుడు కూఁతునకు తల్లిదండ్రు లిచ్చుధనము, స్త్రీధనము, అరణము.

అధ్యాసనము. సం. వి. అ. న. **1.** నివాసము, ఉండుట; **2.** కూర్చుండుట; **3.** అధిష్ఠానము.

అధ్యాసము. సం. వి. అ. పుం. అయథార్థజ్ఞానము, భ్రాంతి, ఒకవస్తువును మఱియొక వస్తువుగా గ్రహించుట. (రజ్జుసర్పభ్రాంతి మొ.)

అధ్యాసి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) కూర్చుండువాఁడు. "మ. శ్రీ, చిటి పెద్దప్రభుఁ డొప్పె విక్రమపురీ సింహాసనాధ్యాసియై." సై. ౧, ఆ. ౨౨.

అధ్యాసితము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** అధిష్ఠింపఁబడినది; **2.** ఆక్రమింపఁబడినది.

అధ్యావాహనికము. సం. వి. అ. న. పుట్టినింటనుండి చొచ్చినింటికి పోవునపు డియ్యఁబడునట్టి స్త్రీధనము. శ. ర.

అధ్యాహారము. సం. వి. అ. పుం. **1.** వాక్యమున నన్వయము పూర్ణమగుటకై లేనిపదములు కొన్నిటిని దెచ్చుకొనుట, ఆకాంక్షావిషయమగుపదములను దెచ్చుకొనుట; **2.** బదులు, ప్రతినిధి. (ఔపమ్యమును దెలుపును.) "సీ. ప్రతిబింబ మోకాని రజనివల్లభునకధ్యాహారమోకాని యమృతరుచికి, వినిమయంబో కాని." కాశీ. ౪, ఆ. ౧౯౧. "మ. కైలాసభూధరకూటస్ఫటికోపలప్రతతి కధ్యాహార మిమ్మేదినీశ్వరదేవేంద్రుని సాంద్రనిర్మలయశో జాలంబు లీలావతీ." సై. ౫, ఆ. ౧౪౪.

అధ్యుషితము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** అధిష్ఠింపఁబడినది; **2.** నివసింపఁబడినది. (స్థానము మొ.)

అధ్యూఢ. సం. వి. ఆ. స్త్రీ. భార్య యుండఁగా రెండవ వివాహముచేసికొనినవాని ప్రథమభార్య.

అధ్యూఢుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

అధ్యూధ్ని. సం. వి. ఈ. స్త్రీ. పెద్దపొదుగుగల గోవు.

అధ్యేత. సం. వి. ఋ. పుం. **1.** చదువువాఁడు, పాఠకుఁడు; **2.** వేదము చదువువాఁడు.

అధ్యేతవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) అధ్యయనము చేయఁదగినది, పఠింపఁదగినది.

అధ్యేషణ. సం. వి. ఆ. స్త్రీ. అధికమైన ప్రార్థన; (పూజ్యులను సత్కారపూర్వకముగ నొకకార్యమున నియోగించుట, అడిగికొనుట. అని కొందఱు అని. శ. ర.)

అధ్యేషణము. సం. వి. అ. న. **1.** గౌరవపూర్వకముగా ఆచార్యాదులను ప్రేరించుట, నియోగించుట; **2.** అధికమగు ఏషణ, మిక్కుటమగు కోర్కె.

అధ్రువము. సం. విణ. (అ. ఆ. అ.) (ధ్రువము కానిది.) **1.** అస్థిరము; **2.** చంచలము; **3.** నిశ్చయముకానిది.

అధ్వగ. సం. వి. ఆ. స్త్రీ. **1.** ఆకాశగంగ, మిన్నేఱు; **2.** ఒంటె.

అధ్వగము. సం. వి. అ. పుం. **1.** ఒంటె; **2.** కంచరగాడిదె.—విణ. (అ. ఆ. అ.) మార్గమందుఁ బోవునది.

అధ్వగుఁడు. సం. వి. అ. పుం. 1. త్రోవనడచువాఁడు, బాటసారి; 2. సూర్యుఁడు.

అధ్వనీనుఁడు. సం.=అధ్వగుఁడు.

అధ్వన్యుఁడు. సం.=అధ్వనీనుఁడు.

అధ్వము. సం. వి. న్. పుం. 1. త్రోవ, మార్గము; 2. ఆకాశము; 3. శాస్త్రము; 4. కాలము; 5. నాలుగుమార్గములు కలియుదారి, చేదుకము, చతుష్పథము.

అధ్వరము. సం. వి. అ. పుం. యాగము, జన్నము.

అధ్వరుఁడు. సం. వి. అ. పుం. ఒక వసువు, గణదేవత.

అధ్వర్యుఁడు. సం. వి. ఉ. పుం. యజుర్వేదతంత్రము తెలిసి నడపు ఋత్విక్కు.

అధ్వాంతరము. సం. వి. అ. న. మార్గమధ్యము, నడిత్రోవ.

అధ్వానము. సం. వి. న్. పుం.రూ.అధ్వము. (శ్వన్ శ్వానము అయినట్లు సంస్కృతమందలి ద్వితీయాంతమును ప్రకృతిగ గ్రహింపవచ్చును. కన్నడమున అధ్వశబ్దభవ మనిరి.) 1. మార్గము, దారి; 2. ఎటునుగానిచోటు (శ. ర. లో అకారాంతముగా అపమార్గము అను నర్థముతోఁ గలదు. చింత్యము)—విణ. (న+ధ్వానము.) 1. ధ్వనిలేనిది, నిశ్శబ్దము, అరణ్యప్రాయము; 2. దురవగాహము, ఏమియుఁ దేలనిస్థితిలో నున్నది, కష్టదశలోనున్నది. (వ్యవహారమంతయు అధ్వానముగానున్నది = ఎటును తేలని స్థితిలోనున్నది. అని భావము. పైనున్నవిశేష్యార్థము ననుసరించి నడిత్రోవలోనున్నదనిగాని, విశేషణార్థమునుబట్టి అడవిలో నున్నది, ఏమగునో తెలియకున్నది అని గాని భావము చెప్పవచ్చును.) అధ్వానపుఁబట్టు. = త్రోవ ప్రదేశము, నడుదారి; "మ. ప్రతికూలాచరితంబు నావలన నల్పంబైననుం గాంచితే, ప్రతికూలాచరితంబు నీవలన నల్పంబైన నేఁగంటినే, క్రితమెన్నండును లేని చందమిది లక్ష్మీపుత్ర! నీయందున, న్నతిదుఃఖాన్వితడించిపోవఁ దగవా యధ్వానపుంబట్టునన్." హర. 3, ఆ. ౧౬.) అర్ధాన్నము, అర్థాన్నము, అర్థాంతరము మొ. వాడుకలోఁ గలవు.

అన. దే. వి. 1. అన్ను; "క. క్రేపులు వర్ధించుటయును, నోపి పసులు పాలు గురియుచునికియు నన్నం, బేపార మనకుఁ గలిమియు, నా పరమేశ్వరుని యీఁగియని యెఱుఁగుమనా!" హరి. పూ. ౭, ఆ. ౧౨౭; 2. పాఱుచుండు నీటిని నిలువచేసికొనుటకయి త్రవ్వినపల్లము. 'అనకట్ట' అని శ. ర.; 3. చాఁగునట్టి మిక్కిలి లేఁతకొమ్మ. "క. అనలుంగొనలుం బాఱుచు, మనమున నాకోర్కి తీఁగె మగువకు మిగులన్." కళా. ౬, ఆ. ౨౧౧.

అనంకుశుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) నిరంకుశుఁడు, అడ్డులేనివాఁడు, (కవి.)

అనంగము. సం.వి. అ. న. (శరీరములేనిది.) 1. ఆకాశము; 2. హృదయము, మనస్సు.

అనంగలేఖము. సం. వి. అ. పుం. మన్మథలేఖ, వలపుజాబు.

అనంగీకారము. సం. వి.అ.న. సమ్మతిలేమి, అసమ్మతి.

అనంగుఁడు. సం.వి. అ.పుం. (దేహము లేనివాఁడు.) మన్మథుఁడు.—విణ. అంగములేనివాఁడు.

అనంత. సం వి. ఆ. స్త్రీ. 1. భూమి; 2. పార్వతి; 3. ఉసిరిక♣; 4. కరక♣; 5. గఱిక♣; 6. తరిగొట్టు♣; 7. తిప్పతీఁగ♣; 8. తీఁటకసింద♣; 9. నీరుపిప్పలి♣; 10. మామెన♣; 11. నెల్లి♣; 12. శ్యామలత♣; 13. నీలదూర్వ♣; 14. శ్వేతదూర్వ♣; 15. అనంతమూల♣; 16. పిప్పలి♣; 17. ఒకటి అను అంకె; 18. నాఁగటిచాలు; 19. నాయవ్యమూల; 20. పూర్ణిమ.—అ. న. ము. 1. మేఘము; 2. పరబ్రహ్మము; 3. ఆకాశము.—విణ. (అ. ఆ. అ.) 1. నాశము లేనిది; 2. మేరలేనిది, హద్దులేనిది.

అనంతచతుర్దశి. సం. వి. ఈ. స్త్రీ. భాద్రపద శుద్ధచతుర్దశి. (నాఁడు అనంతవ్రత మాచరింతురు.)

అనంతతృతీయ. సం. వి. ఆ. స్త్రీ. భాద్రపద మార్గశీర్ష వైశాఖమాసములలోని తదియ.

అనంతదేవుఁడు. సం. వి. అ. పుం. 1. శేషుఁడు; 2. నారాయణుఁడు, విష్ణువు.

అనంతరము. సం. క్రి. విణ. అ. న. పిమ్మట.—విణ. (అ.ఆ.అ.) 1. వ్యవధానములేనిది; (కాలము, దేశము.) 2. తరువాతిది.

అనంతవిజయము. సం. వి. అ. పుం. ధర్మరాజు శంఖము.—విణ. (అ.ఆ.అ.) అనంతమైన జయములుగలది.

అనంతవ్రతము. సం. వి. అ. న. అనంతుని పూజించువ్రతము చూ. అనంతచతుర్దశి.

అనంతశయనుఁడు. సం. వి. అ. పుం. ఆదిశేషునిపై శయనించువాఁడు, ఆదిశేషుఁడు శయ్యగాఁగలవాఁడు, విష్ణువు.

అనంతుఁడు. సం. వి. అ. పుం. **1.** శేషుఁడు; **2.** విష్ణువు.—విణ. (అ. ఆ. అ.) అంతము లేనివాఁడు.

అనంశుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) **1.** దాయభాగము లేనివాఁడు; **2.** వాటాలేనివాఁడు; **3.** వాటాకు అర్హుఁడు కానివాఁడు.—ఉ. కిరణములు లేనివాఁడు.

అనఁగా. దే. ద్ర. (అనన్ + కాన్) అనుధాతువు తుమున్నర్థకాంతము. **1.** అనినతర్వాత; **2.** కథారంభమును తెలుపును. "మ. అనఁగా మున్నుశమంతపంచకము నయ్యక్షౌహిణీసంఖ్యయున్, వినఁగా మాకెఱిఁగించి భారతకథావిఖ్యాతికిం గారణం, బును దద్భారతవిస్తరోక్తి విభవంబుం బాండవాడంబరం,బును భీష్మాదికురుప్రవీరచరితంబుం జెప్పుముద్యన్మతిన్." భార. ఆది. ౧, ఆ. ౭౫. ఇట 'అనఘా' అని పాఠాంతరము. "అనఁగా అనఁగా ఒకరాజు. ఆరాజునకు ఏడుగురు కొడుకులు. మొ."

అనఁగిపెనఁగియుండు. దే. అ. క్రి. స్నేహముగలిగియుండు, కలసిమెలసియుండు.

అనఁగు. దే. అ. క్రి. కలయు. "ఉ. మునో, మోదము సేయువిద్యలకు ముప్పురుఁజాలననంగియున్నచోన్." ఉ. హరి. ఆ. ౧౮.

అనఁటి. దే. వి. అరఁటి, కదళీవృ. "క. ఈలోకము నిస్సారం, బాలోకింపంగ ననఁటియట్టుల యనితా,లోలతఁ బొందని పురుషుం, డేలా నెవ్వగలఁ జెందనిచ్చు మనంబున్." భార. స్త్రీ. ౧, ఆ. ౩౨.

అనకట్ట. దే. వి. ఏఱులోనగువాని నీరు పైకిఁ బోకుండుటకై కట్టెడుకట్ట.

అనక్షరము. సం. వి. అ. న. నిందావచనము, తిట్టు, చెడ్డమాట.—విణ. (అ.ఆ.అ.) **1.** నిందను తెలుపునది; **2.** ఉచ్చరింపఁగూడనిది; **3.** అక్షరములు లేకుండఁగఁ (సైఁగతోఁ) దెలుపఁబడినది.

అనక్షరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) **1.** అక్షరములు లేనివాఁడు. "అనక్షరకుక్షి;" **2.** (అక్షరజ్ఞానము లేనివాఁడు) మూర్ఖుఁడు.

అనక్షుఁడు. సం. విణ. (అ. ఈ-క్షీ. అ.) **1.** కన్నులేనివాఁడు; **2.** దృష్టిపాటవములేనివాఁడు, చూపు ఆననివాఁడు.

అనగ్నిక. సం. వి. ఆ. స్త్రీ. **1.** ప్రత్తివృ.; **2.** నగ్నికకాని స్త్రీ.

అనఘము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** నిర్దోషము; **2.** నిర్మలము; **3.** మనోజ్ఞము.

అనఘుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు.—విణ. (అ. ఆ. అ.) (అఘము లేనివాఁడు.) **1.** పాపములేనివాఁడు, పవిత్రుఁడు; **2.** దుఃఖము లేనివాఁడు; **3.** వ్యసనములేనివాఁడు; **4.** పరిశుద్ధుఁడు.

అనడుహి. సం. వి. ఈ. స్త్రీ=అనడ్వాహి.

అనడ్వాహము. సం. వి. హ్. పుం. వృషభము, ఎద్దు.

అనడ్వాహి. సం. వి. ఈ. స్త్రీ. ఆవు.

అనద. వై. విణ. (సం. అనాథః) **1.** నాథుఁడు లేనిది, విధవ; **2.** నాథుఁడుగానివాఁడు, అసమర్థుఁడు; పౌరుషహీనుఁడు; "ఆ. అతఁడు పూజనీయుఁడగు నేనెఱుంగుదు, నైన ధనము లేఁగ ననదతనము, వచ్చుఁ బెచ్చువెరిఁగి." భార. ఉద్యో. ౩, ఆ. ౧౬౪; **3.** అల్పుఁడు, బలహీనుఁడు. "గీ. పలువు రొకని కోడిపాఱుట బల్లిదు, లనద చేతఁ జెడుటయును ఘటిల్లు." భార. ఉద్యో. ౩, ఆ. ౧౭. "ఆ. బలియుఁ డనద నడఁచు వలచినయవియెల్లఁ, బాడిలేక చేయుఁ బ్రభుజనంబు, వేళ వేచి యొరుని యాలి నర్థంబును, నపహరింతు రేచి యాగడీలు." దశ. కు. ౧౧, ఆ. ౧౧౨.

అనద్యతనము. సం. విణ. (అ. ఈ-నీ. అ.) (వ్యాక.) అద్యతనముకానిది (కాలము). (అద్యతనమనఁగా కడచిన రాత్రియొక్క తుదిసగము భాగమున్ను రాఁబోవురాత్రియొక్క పూర్వార్ధమును కలసిన దివసము.)

అనధికారి. సం. విణ. (న్. ఈ-ణీ. న్.) అధికారి కానివాఁడు. చూ. అధికారి.

అనధ్యయనము. సం. వి. అ. న. 1. చదువులేనిదినము; 2. వేదము చదువఁగూడని దినము; 3. అధ్యయనము లేకపోవుట, చదువులేమి.—విణ. (అ.ఆ.అ.) చదువులేనిది (దినము మొ.)

అనధ్యాయము. సం. వి. అ. పుం. 1. వేదాధ్యయనము చేయఁదగనిదినము; 2. చదువులేనిదినము, ఆటవిడుపుదినము, సెలవుదినము; 3. వేదాధ్యయనములేమి; 4. అధ్యాయములులేమి.—విణ. (అ.ఆ.అ.) 1. వేదాధ్యయనము లేనిది; 2. వేదాధ్యయనము చేయఁగూడనిది; 3. చదువులేనిది, (ఆటవిడుపుదినము.) 4. అధ్యాయములు లేనిది (గ్రంథము మొ.)

అనుపస్థలము. సం. వి. అ. న. (అనూపముగాని స్థలము.) జలప్రాయముగాని ప్రదేశము, నీరులేని చోటు. "ఆ. పలుఁగురాల కుడ్యములరుచుల్ గప్పిన, జలము లున్నయెడలు వెలయఁజూచి, యననుపస్థలంబులని జను లెఱుఁగక, యుండు నట్లు నామయుండు సేసె." భార. సభా. ౧,ఆ. ౧౩. (అనుపమస్థలమని పాఠాంతరము గలదు. గాని నీరులేనిచోటు అనుట ఆవశ్యకము. పాణినీయమున అననూపస్థలము అనురూపము కావలెనుగాని ఇది ప్రయోగమననుసరించి గ్రహింపఁబడినది. కొన్నినిఘంటువులలోను గలదు.

అననురూపము. సం. విణ. (అ.ఆ.అ.) అనురూపము గానిది, ఉచితముగానిది, తగనిది. "క. అనుపలు కులకును భీష్ముం,డును ద్రోణుఁడు ద్రోణసూనుఁడును గృపుఁడును మే,లని యియ్యకొనిరి హృదయా,ననురూపములైన తెలువు లాస్యముఁ బొందన్." భార. విరా. ౪, ఆ. ౧౦౩.

అనన్యగతికుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) మఱియొక గతి లేనివాఁడు.

అనన్యచిత్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఇతర విషయమందు మనస్సులేనివాఁడు, ఒకేవిషయము నాలోచించువాఁడు.

అనన్యజుఁడు. సం. వి. అ. పుం. (ఇతరునివలనఁ బుట్టనివాఁడు.) ఆత్మభువు, మన్మథుఁడు.

అనన్యదేవుఁడు. సం. వి. అ. పుం. (ఎవనికంటె భిన్నమైనదిలేదో అట్టిదేవుఁడు) విష్ణువు.

అనన్యధనము. సం. వి. అ. న. ఇతరుల కుపయోగింపనిసొమ్ము; ఇతరు లనుభవింప వీలుఁలేనిధనము. "చ. అసదృశ యౌవనం బిది యనన్యధనం బగు నొక్కొ-నాకు ని, క్కుసుమసముద్గమంబును నగోచరదుర్గమదుర్గవల్లరీ, కుసుమసముద్గమంబగు నొకో పతిలాభము లేమిఁజేసి." భార. ఆది. 3,ఆ. ౧౭౦.

అనన్యప్రకాశనీయము. సం. విణ. (అ.ఆ.అ.) ఇతరులకుఁ దెలుపఁదగనిది. "సీ. అటమీఁదఁదెలియనాయము కాదు మనకు ననన్యప్రకాశనీయంబులైన." ప్రభా. ౪, ఆ. ౪౫.

అనన్యమనస్కుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ఇతరమునందు మనస్సులేనివాఁడు, ఏకాగ్రమనస్సుగలవాఁడు, ఒకేదృష్టి గలవాఁడు. "క. ధన్యుండవైతి నీ కీ, కన్యక నీఁగాంచి యైనఁ గలతెఱఁగు జగ,న్మాన్య యెఱిఁగింపవలయు న, నన్యమనస్కుండవయి దయన్ విను మనఘా." భార. ఆది. ౧, ఆ. ౧౪౧.

అనన్యము. సం. విణ. (అ.ఆ.అ.) 1. అన్యముకానిది, స్వకీయము, తనది; 2. ఇతరుఁడు లేనిది, ఇతరుని సేవింపనిది; 3. ఇతరవిషయము లేనిది. "అనన్యభక్తి, అనన్యదృష్టి మొ.)

అనన్యవిషయము. సం. విణ. (అ. ఆ. అ.) ఇతరుల విషయముగానిది, ఇతరులు చేయశక్యముగానిది. (కార్యము.) "వ. నాకుం బరమవిశ్వాస విషయుండ వీవొక్కరుండవ యిది యనన్యవిషయంబయిన కార్యంబు అప్రమత్తుండవు కావునఁగాదనక నీవ దీనిం జేయవలయు." భార. ఆది. ౬, ఆ. ౧౪౦.

అనన్యవృత్తి. సం. విణ. ఇ. 1. ఇతరవృత్తిలేనివాఁడు, ఏకదృష్టిగలవాఁడు, ఒకవిషయమందే మనస్సుకలవాఁడు; 2. ఇతరమైన జీవనోపాయము లేనివాఁడు, ఒకదానివలననే జీవించువాఁడు.

అనన్యవ్యాపారుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఇతర వ్యాపారములు లేనివాఁడు, ఒకేవ్యాపారమున నున్నవాఁడు, ఒకపనియందే యున్నవాఁడు. "వ. నాలుగువత్సరంబు లనన్యవ్యాపారుండై యుండి." భార. ఆది. ౪, ఆ. ౧౭౦.

అనన్యశరణ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఇతరుఁడు రక్షకుఁడుగా లేనివాఁడు; ఇతరుని శరణముఁ గోరనివాఁడు. "వ. అనిన విని బ్రాహ్మణులు పరమదుఃఖితులై మీరు కాని మాకు నొండుగతి లేదు మమ్ము ననన్యశరణ్యుల విడుచుట ధర్మంబు గాదు." భార. అర. ౧, ఆ. ౧౫.

అనన్యసాధారణము. సం. విణ. (అ.ఆ.అ.) ఇతరులకు సులభముకానిది, ఇతరులకు సామాన్యముగ నుండనిది, ఇతరులకు లభింపనిది. "అనన్యసాధారణరాజశబ్దము, అనన్యసాధారణప్రజ్ఞ."

అనన్యసామాన్యము. సం.= అనన్యసాధారణము. ఇతరులకు సామాన్యముగానిది,ఇతరులకు దుర్లభము. "ఆ. అర్జునాంబుదం బనన్యసామాన్యస, ముద్యమమున ముఖపయోరుహముల, కాంతి దఱిఁగి యపుడు కౌరవసేనాస,రోవరంబు దీనభావమొంద." భార. విరా. ౫, ఆ. ౧౦౫.

అనన్యాదృశుఁడు. సం. విణ. (అ. ఈ-శీ. అ.) ఇతరులవంటివాఁడు కానివాఁడు, విశేషగుణములు కలవాఁడు.

అనన్యాశ్రితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఇతరులను ఆశ్రయింపనివాఁడు, స్వతంత్రుఁడు.

అనన్వయము. సం. వి. అ. పుం. ఒక యర్థాలంకారము. చూ. అలంకారము.—విణ. (అ.ఆ. అ.) **1.** అన్వయము లేనిది, శబ్దముల పరస్పరసంబంధము లేనిది; **2.** వంశము లేనిది.

అనపకరణము. సం. వి. అ. న. = అనపకర్మము.

అనపకర్మము. సం. వి. న్. న. **1.** ఋణముతీర్పకుండుట; **2.** అపకారము చేయకుండుట.

అనపకారి. సం. విణ. (న్.ఈ-ణీ.న్.) అపకారము చేయనివాఁడు.

అనపక్రియ. సం. వి. ఆ. స్త్రీ. **1.** ఋణము తీర్పక పోవుట; **2.** అపకారము చేయకపోవుట; **3.** ఉపకారము.

అనపత్యత. సం. వి. ఆ. స్త్రీ. సంతతి లేమి.

అనపత్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) బిడ్డలులేనివాఁడు, సంతతిలేనివాఁడు.

అనపత్రపుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) **1.** సిగ్గులేనివాఁడు; **2.** ఇతరులవలన సిగ్గుపడనివాఁడు.

అనపరాధి. సం. విణ. (న్.ఈ-నీ.న్.) అపరాధికానివాఁడు.

అనపహార్యము. సం. విణ. (అ.ఆ.అ.) అపహరింప శక్యముగానిది. "తే. అనపహార్యంబు లెవ్వాని కదితిదేవి, కుండలంబులు సురలోకమండనములు, గొనియె." హరి. ఉ. ౪, ఆ. ౧౧౭.

అనపాయము. సం. విణ. (అ. ఆ. అ.) అపాయము లేనిది. "చ. ఇందుమౌళి ద, త్పరమతి నాశ్రయించి యనపాయబలోద్భట శౌర్యసంపదన్, గురుతనయుండు గాంచి యధికుండగుటం బగ దీర్చె నమ్మెయిన్." భార. సౌ. ౨, ఆ. ౧౦౫.

అనపాయి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) అపాయము లేనిది.

అనపాశ్రయుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) **1.** అపాశ్రయుఁడు కానివాఁడు, ఆధారముకలవాఁడు, దక్షతకలవాఁడు; **2.** ఆశ్రయము లేనివాఁడు, ఆధారములేనివాఁడు, దక్షతలేనివాఁడు. "క. అవనీతలసామ్రాజ్యో,త్సవమునకును యోగ్యమైన సతి ద్రౌపది పాం,డవధర్మపత్ని నీకం,తవమానము సేయనేమి యనపాశ్రయయే." భార. సభా. ౨, ఆ. ౨౦౩.

అనపేక్షుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అపేక్ష లేనివాఁడు.

అనభ్యావృత్తి. సం. వి. ఇ. స్త్రీ. మరలమరలఁ జెప్పక పోవుట, పునరుక్తిలేమి.

అనభ్రవృష్టి. సం. వి. ఇ. స్త్రీ. మేఘము లేని వాన. (అనుకోనకుండఁగ జరిగినపనికి ఉపమానముగా గ్రహింపఁబడును.)

అనయము. ఉభ. దే. క్రి. **1.** అత్యంతము, మిక్కిలి. "క. అనిన విని యనుచితంబున, కనయము శంకించియును." భార. విరా. ౨, ఆ. ౨౨. "క. మనమునఁగలిగిన వివేకమహిమకు ననయం, బును మెచ్చి." పర. ౪,ఆ. ౭౦; **2.** అవశ్యము, తప్పక. "చ. కనకపుఁగుప్పలున్ మణినికాయములున్ ఘనధాన్యరాసులున్, వినుతగజాశ్వసంఘములు విశ్రుతగోమహిషాదికంబులున్, దన కధికంబుగాఁ గలిగిదాతయు భోక్తయునైనవాఁడు నా, కనయము భర్త గావలయునం చొక భామిని కోరె వేడుకన్." భో. ౨,ఆ. ౨౮; **3.**

మఱిమఱి, పౌనఃపున్యముగా. "సీ. అదియేమి యొఱిఁగింపుమని యాలతాంగి తన్ననయంబు నడుగ నిట్లనియె నతఁడు." కళా. 3, ఆ. ౪౬; 4. సతతము. "సీ. ననయమ్ము వానిఁ గన్ననయమ్ము గలయింతి ననయమ్ముఁ దాల్చువానన్నఁ జెనకి." కా. ౪. ఆ. ౬౮.—సం. వి. అ. పుం. 1. దుర్దైవము, దురదృష్టము; 2. నీతిలేమి.—విశే. (అ. ఆ. అ.) 1. నీతిలేనిది; 2. అయములేనిది, శుభావహదైవము లేనిది.

అనరణ్యుఁడు. సం. వి. అ. పుం. సూర్యవంశపురాజులలో నొకఁడు, అయోధ్యాధిపతి. (ఇతఁడు రావణునిచే పరాభవింపఁబడి మృతుఁడయ్యెనని పురాణము.)

అనరు. దే. వి. 1. బలహీనత, దుర్బలత్వము. "ఆయింటికి నడిమిదూలమున కనరున్నది;" 2. రోగలేశము. "దేహమున అనరుపోలేదు;" 3. దుర్బలస్థితి, సందు, సంకటము. "తే. శరనిధుల మాఘ్యములు దీఱ మరునకిట్టి, యనరున జయింతుమని కదా యద్దినాళిఁ, గ్రూరతిథిఁ గృష్ణరజనిఁ ద ద్వైరిఁ గనియుఁ, బెద్ద లివురాకఁబట్టెన పెట్టు పడిరి." అదరు అనవచ్చును. ఆము. ౫, ఆ. ౧౧౧; 4. సెఱను, జీవస్థానము, మార్గము. "క. నినుఁ బోరిగొనియెద నిదెపో,జనులు మునులు విని ప్రమోదసంపదఁ దేలన్, మనుజాధమ యని తొడిగిన, యనలాస్త్రంబేసె ననరు లంటఁగ నతఁడున్." ఉ. హరి. ౪, ఆ. ౭౮౭. శ. ర. (ఇట అదరులంటఁగ అని పాఠాంతరము గలదు. సెఱకులంటఁగ అనుట యుచితము.)

అనర్గళము. సం. విశే. (అ.ఆ.అ.) 1. గడియలేనిది; 2. అడ్డులేనిది, ప్రతిబంధములేనిది; "శా. శర, వ్యాఘాతంబున శాత్రవుండు వికలస్వాంతుండుగా నారద, శ్లాఘాపాత్రమునై యనర్గళభుజాసంరంభశక్రారాద్ర రే,ఖాఘోరాకృతి యే నచూపెద." భార. విరా. ౪, ఆ. ౨౦౨.

అనర్ఘ్యము. సం. విశే. (అ. ఆ. అ.) వెలలేనిది. (1. విలువలేనిది; 2. దేనికంటె విలువగలది లేదో యట్టిది) మిక్కిలి విలువఁగలది.

అనర్ఘ్యము. సం. విశే. (అ. ఆ. అ.) అర్ఘ్యము కానిది. (అర్ఘ్యము = 1. వెలకుఁదగినది; 2. పూజ కుపయోగించునది.)

అనర్థకము. సం. విశే. (అ. ఆ. అ.) 1. వ్యర్థమైనది; 2. అర్థములేనిది, పరస్పరాన్వయములేనిది. (వాక్యము, పదము).

అనర్థము. సం. వి. అ. పుం. 1. అనిష్టము, హాని, కీడు; 2. ప్రయోజనములేమి.—విశే. (అ. ఆ. అ.) 1. అర్థములేనిది; 2. ప్రయోజనములేనిది; 3. హానిచేయునది, అనిష్టము.

అనర్హము. సం. విశే. (అ.ఆ.అ.) అర్హముకానిది.

అనలము. సం. వి. అ. పుం. 1. అగ్ని,నిప్పు; 2. జఠరాగ్ని; 3. చిత్రమూలము; 4. ఎఱ్ఱచిత్రమూలము; 5. భల్లాతకము; 6. (అగ్ని దేవతాకమగు) రకారము; 7. మూఁడు అను సంఖ్యకు గుర్తు; 8. కృత్తిక; 9. పరమాత్మ.

అనలసము. సం. విశే. (అ. ఆ. అ.) 1. సోమరి కానిది; 2. చుఱుకైనది; 3. సమర్థమైనది; 4. అధికమైనది.

అనలుఁడు. సం. వి. అ. పుం. 1. అగ్నిదేవుఁడు; 2. ఒక వసువు. చూ. వసువు.; 3. జీవుఁడు; 4. విష్ణువు; 5. విభీషణునిమంత్రి.

అనల్పము. సం. విశే. (అ.ఆ.అ.) (అల్పముకానిది.) 1. అధికమైనది; 2. నీచముకానిది, గొప్పది.

అనవకాశము. సం. వి. అ. పుం. అవకాశము లేమి. —విశే. (అ.ఆ.అ.) అవకాశము లేనిది.

అనవగాఢము. సం. విశే. (అ.ఆ.అ.) దురవగాహము, ఆకలింపు లేనిది, అవగాహనములేనిది. "క. రవి శశిగతు లుడుగుడు నిది, దివ మిదిరాత్రి యని వసుమతీజనులకు న,ద్దివిజమునివరుల కెఱుఁగ న, నవగాఢంబయ్యె నంధమయ్యె జగంబుల్." భార. అర. 3, ఆ. ౨౫.

అనవటిల్లు. దే. అ. క్రి. అన్నము పక్వమై చల్లారు. శ. ర.

అనవద్యము. సం. విశే. (అ. ఆ. అ.) 1. నింద్యము కానిది; 2. దోషములేనిది. "సీ. అనవద్యవేదవేదాంగవిశారదు, జపహోమయజ్ఞప్రశస్త సత్య,వచను విప్రోత్తము." భార. ఆది. ౭, ఆ. ౬౧. "క. ఆద్యపురుషోపలాలిత, ముద్యోతిత రోచిరుద్గమోగ్రం బరిని, శ్చేద్యము దివ్యజనన

మన, పద్యం బిది కా ర్ష్మైకపరము గుమారా." భార. విరా. ౪, ఆ. ౧౨౧.

అనవద్యశీలుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. నింద్యముకాని స్వభావము కలవాఁడు; 2. దోషములేని స్వభావము కలవాఁడు, మంచిస్వభావము గలవాఁడు. "చ. అకుటిలుఁ డార్యసమ్మతుఁ డహంకృతిదూరుఁడు నీతినిర్మలా, త్మకుఁ డనవద్యశీలుఁడు సధర్ముఁడు దాంతుఁడు." భార. విరా. ౧, ఆ. ౯౮.

అనవధానత. సం. వి. ఆ. స్త్రీ. జాగరూకతలేమి; ప్రమాదము, (చేయతగినది చేయకపోవుట, చేయతగనిది చేయుట.)

అనవమము. సం. విణ. (అ.ఆ.అ.) హీనముకానిది, శ్రేష్ఠము.

అనవరతము. సం. క్రి. విణ. అ. న. ఎల్లప్పుడు.—విణ. (అ.ఆ.అ.) విరామములేనిది, ఎడతెగనిది.

అనవసరము. సం. వి. అ. పుం. 1. అనుచితకాలము, అసమయము; 2. అనావశ్యకత. (వాడుక.)—విణ. (అ.ఆ.అ.) 1. ఉచితకాలములేనిది; 2. అదనుకానిది; 3. అనావశ్యకము. (వాడుక.)

అనవస్కరము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్మలము, పరిశుద్ధమైనది.

అనవస్థ. సం. వి. ఆ. స్త్రీ. 1. స్థిరములేమి, నిలుకడలేమి; 2. తర్కవాదదోషములలో నొకటి; 3. ఒకస్థలమున నిలుపులేకుండుట.

అనసూయ. సం. వి. ఆ. స్త్రీ. 1. అసూయలేకుండుట; 2. అత్రిమహామునిభార్య; 3. శకుంతలకు సఖులగు తాపసకన్యకలలో నొకతె. (రెండవది ప్రియంవద.)—విణ. (అ. ఆ. అ.) అసూయలేనిది.

అనస్సు. సం. వి. స్. న. శకటము, బండి.

అనాకారము. సం. వి. అ. పు. 1. ఆకారములేమి; 2. వికృతరూపము, అంగవికారము.— విణ. (అ. ఆ. అ.) రూపములేనిది.

అనాకారి. సం. విణ. (న్.ఈ.ణీ.న్.) 1. ఆకారములేనివాఁడు; 2. వికృతాకారుఁడు.

అనాకారుఁడు. సం. వి. అ. పుం. ఈశ్వరుఁడు.—విణ. (అ.ఆ.అ.) 1. ఆకారములేనివాఁడు; 2. సుందరమైన ఆకారములేనివాఁడు; 3. వికృతాకారుఁడు.

అనాకులము. సం. విణ. (అ.ఆ.అ.) 1. వ్యాకులముకానిది; 2. ఏకాగ్రతకలది; 3. స్థిరమైనది; 4. సంకీర్ణముకానిది; "క. నీకారణమున వంశమ,నాకులమై నిలుచుటయు." భార. ఆది. ౪, ఆ. ౨౪౬.

అనాగతము. సం. విణ. (అ.ఆ.అ.) ఆగతముకానిది; భవిష్యత్కాలమందుండునది, రాఁబోవునది.

అనాగతవిధాత. సం. విణ. (ఋ. ఈ - త్రీ. ఋ.) రాఁబోవుకష్టమునకు ముందే పరిహారము చేసికొనువాఁడు.

అనాచారము. సం. వి. అ. పుఁ. 1. దురాచారము; 2. ఆచారములేమి.

అనాచారుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆచారములేనివాఁడు; 2. సదాచారము లేనివాఁడు; 3. దురాచారుఁడు.

అనాతపము. సం. వి. అ. పుం. 1. ఎండలేమి; 2. నీడ.—విణ. (అ.ఆ.అ.) ఎండలేనిది.

అనాతురము. సం. విణ. (అ. ఆ. అ.) (ఆతురముకానిది.) 1. తొందరలేనిది; 2. రోగములేనిది; 3. స్వస్థమైనది.

అనాత్మజ్ఞుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. పరమాత్మస్వరూపము నెఱుఁగనివాఁడు; 2. తన్నుతా నెఱుఁగనివాఁడు; 3. స్వశక్తిపరశక్తివివేకము తెలియనివాఁడు.

అనాదరము. సం. వి. అ. పుం. 1. ఆదరములేమి; 2. పరిభవము, తిరస్కారము.—విణ.(అ.ఆ.అ.) ఆదరములేనిది.

అనాది. సం. వి. ఇ. పుం. 1. ఆది లేకపోవుట; 2. ప్రాచీనకాలము; 3. పరమేశ్వరుఁడు.—విణ. ఇ. 1. ఆదిలేనిది; 2. పురాతనపుది, ప్రాచీనపుది. "ఈ ఆచారము మాకు అనాదిగా వచ్చుచుండెను".

అనాదినిధనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఆద్యంతములు లేనివాఁడు.

అనాదీనవము. సం. విణ. (అ. ఆ. అ.) 1. దోషములులేనిది; 2. అలసటలేనిది, క్లేశములులేనిది.

అనాథ. సం. వి. ఆ. స్త్రీ. నాథుఁడులేనిస్త్రీ, విధవ.

అనాథుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) 1. నాథుఁడు లేనివాఁడు; 2. ప్రభువులేనివాఁడు; 3. సహాయము లేనివాఁడు; 4. దిక్కులేనివాఁడు, రక్షకుఁడు లేనివాఁడు. "ఆ. కర్ణకర్ణ వచ్చి కావు మనాథులమైతిమి." భార. ద్రోణ. ౧, ఆ. ౧౮. "అనాథప్రేతసంస్కారము."

అనాప్తుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆప్తుఁడు కానివాఁడు; 2. పొందఁబడనివాఁడు.

అనామకుఁడు. సం. విశే. (అ.ఆ.మికా.అ.) అనాముఁడు.

అనామతు. హిం. వి. 1. అక్కఱలేనియెడలఁగాని నచ్చనియెడలఁగాని మరల ఇచ్చివేయుపద్ధతిని సరకు తీసికొనిపోవునపుడు జ్ఞాపకముగా వ్రాసికొనెడి పద్దు; 2. నమ్మకముమీఁద అల్పకాలమొకవస్తువు నిచ్చుట.

అనామధేయము. సం. విశే. (అ. ఆ. అ.) పేరు లేనిది. (అనామధేయపుఁదరువు.=పేరులేనిచెట్టు; పేరుప్రతిష్ఠలు లేనివాఁడు అని వాడుక.)

అనామయము. సం. వి. అ. పుం. రోగములేమి, ఆరోగ్యము.—విశే. (అ.ఆ.అ.) రోగములేనిది.

అనామిక. సం. వి. ఆ. స్త్రీ. (పేరులేనిది, విశేషమైన పేరులేనిది.) చిటికెనవ్రేలిప్రక్క వ్రేలు, దర్భవ్రేలు, ఉంగరపువ్రేలు. (శివుఁడు ఆవ్రేలితో బ్రహ్మయొక్క శిరస్సును ఛేదించెను కావున నది యపవిత్రమనియు, దానిని పవిత్రముచేయుటకు దర్భపవిత్రము ధరింపవలయునని యును పురాణాదిప్రసిద్ధి.)

అనాముఁడు. సం. (న్.ఈ.మ్నీ.న్.) 1. పేరులేని వాఁడు; 2. ప్రసిద్ధిలేనివాఁడు.

అనాయకము. సం. విశే. (అ.ఆ-యికా.అ.) నాయకుఁడు లేనిది, అరాజకము.

అనాయాసము. సం. వి. అ. పుం. 1. ఆయాసము లేమి; 2. ప్రయత్నములేమి. "సీ. కలంగి,సాధ్యులనాయాససాధ్యులై పాటిరి పూర్వాభిముఖులయి గర్వమడఁగి." భార. ఆది. ౨, ఆ. ౧౦౦. —విశే. (అ. ఆ. అ.) 1. ఆయాసము లేనిది, శ్రమలేనిది, సులభము; 2. ప్రయత్నము లేనిది.

అనాయుష్యము. సం. వి. అ. న. ఆయుష్యాభావము, ఆయుర్దాయము లేమి.—విశే. (అ.ఆ.అ.) ఆయుష్యమునకు హితముకానిది, ఆయుర్దాయమును క్షీణింపఁజేయునది.

అనారతము. సం. క్రి. విశే. అ. న. 1. ఎల్లప్పుడు; 2. విచ్ఛిత్తిలేకుండఁగ, విరామము లేకుండఁగ. —విశే. (అ.ఆ.అ.) విచ్ఛేదములేనిది, ఎడతెగనిది, విరామములేనిది.

అనారోగ్యము. సం. వి. అ. న. ఆరోగ్యములేమి, జబ్బు.—విశే. (అ.ఆ.అ.) 1.ఆరోగ్యములేనిది; 2. ఆరోగ్యకరముగానిది, జబ్బుచేయునది.

అనార్తవ. సం. వి. ఆ. స్త్రీ. ఋతుధర్మము పొందనిది, రజస్వలకానిది, నగ్నిక.

అనార్తవము. సం. విశే. (అ. ఆ. అ.) (ఋతుసంబంధములేనిది.) 1. అకాలమునఁ బుట్టినది; 2. ఎల్లప్పుడునుండునది. (పువ్వు, పండు మొ.) "సీ. అనలాక్షుఘనజటావనవాటి కెవ్వాఁడు పన్నెవెట్టుననార్తవంపుఁబువ్వు." స్వా. పీఠిక. ౭౮; 3. స్త్రీఋతువునకు సంబంధము లేనిది. (రోగము మొ.)

అనార్యకము. సం. వి. అ. న. (అనార్యదేశమునఁ బుట్టినది.) అగరుచెక్క.

అనార్యజము. సం. వి. అ.న. అగరుచెక్క.—విశే. (అ.ఆ.అ.) అనార్యదేశమునఁ బుట్టినది.

అనార్యతిక్తము. సం. వి. అ. పుం. నేలవేము♆.

అనార్యుఁడు. సం. వి. అ. పుం. 1. శూద్రుఁడు; 2. మ్లేచ్ఛుఁడు.—విశే. (అ.ఆ.అ.) (ఆర్యుఁడు కానివాఁడు.) 1. పూజ్యుఁడు కానివాఁడు; 2. దుష్టుఁడు, నీచుఁడు; 3. ఆర్యజాతియందుఁ బుట్టనివాఁడు.

అనార్షము. సం. విశే. (అ. ఈ-ర్షీ. అ.) 1. ఋషిసంబంధముకానిది; 2. ఋషిచే చెప్పఁబడినది; 3. వేదోపయుక్తముకానిది;4. వేదమునఁ జెప్పఁబడనిది.

అనాలంబము. సం. వి. అ. పుం. ఆలంబములేమి. —విశే. (అ. ఆ. అ.) ఆలంబము (ఊఁత) లేనిది.

అనాలంబి. సం. వి. ఈ. స్త్రీ. శివునివీణె.

అనాలోచితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆలోచింపఁబడనిది; 2. పరిశీలింపఁబడనిది.

అనాలోడితము. సం. విణ. =అనాలోచితము.

అనావర్షము. సం. వి. అ. న. = అనావృష్టి. "తే. విమలవంశంబునను బుణ్యవృత్తమునను, వఱలు నీతనిరక్తంబు వసుమతీశ, ధరణిపై నెన్నిబిందువుల్ దొరఁగె నన్ని,వర్షములు గల్గు నిం దనావర్షభయము." భార. విరా. ౫, ఆ. ౪౬౧.

అనావిద్ధము. సం. విణ. (అ.ఆ.అ.) 1. తొలవేయఁబడనిది. "అనావిద్ధరత్నము;" 2. బాధింపఁబడనిది.

అనావృష్టి. సం. వి. ఇ. స్త్రీ. వర్షము లేకపోవుట, అవగ్రహము, (వ్యతి. అతివృష్టి.) ఈతిబాధలలో నొకటి. "మధ్యాక్కర. భూమి కనావృష్టియైనఁ గడునల్గి పురుహూతుతోడ, భీమసంగ్రామంబుఁ జేసె" భార. అర. 3,ఆ. ౨౦౬.

అనాశ్వాసితము. సం. విణ. (అ. ఆ. అ.) ఓదార్పఁబడనిది. "అనాశ్వాసితదుఃఖితే మనసి సర్వమసహ్యమనా నెఱుంగవే." స్వా. 3, ఆ. ౯౯.

అనాస. దే. వి. మొగలిపనస.

అనాహతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కొట్టఁబడనిది; 2. చింపఁబడనిది; 3. ధరింపఁబడనిది; 4. చేలువచేయఁబడనిది (వస్త్రము).

అనాహార్యము. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఆహరింపఁదగనిది, తినఁదగనిది; 2. కృత్రిమముకానిది, స్వాభావికము.

అనాహూతోపజల్పి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) పిలువఁబడకుండఁగనేవచ్చి మాట్లాడువాఁడు.

అని. దే. వి. (త. అణి.) 1. యుద్ధము; 2. అల్లికమొదలు.—స. ఏ.=అన్ని. "సీ. వినుము ఋగ్వేదాది వేదముల్ నాలుగుఁగల్పాదులైనయంగంబులాఱు, బెరసి విద్యలుపది పేర్చుపురాణంబులనియును నొకవిద్యయధిప ధర్మ, విదులు సెప్పెడు శాస్త్రవితతియంతయు నొకవిద్య."భార. శాంతి. 3, ఆ. ౧౧౯. ఇట 'అన్నియు నొకవిద్య' అనియు పఠింపవచ్చును.—అవ్య. (అను ధాతువు క్త్వార్థకరూపము. సంస్కృతమున ఇతి శబ్దమువలె తెనుఁగున ప్రకారాద్యర్థములను తెలుపును.) 1. శబ్దస్వరూపమును తెలుపును. "రామా,రామా అని భక్తుఁడు స్మరించును;" 2.వాక్యార్థస్వరూపమును తెలుపును. "కం....భారత బద్ధ,స్పృహులగువారికి సెప్పుడు, బహుయాగంబుల ఫలంబు పరమార్థమగుఁగా. వ. అని యానతిచ్చిన విని." భార.ఆది. ౧,ఆ. ౧౭,౧౮; 3. కారణము తెలుపును. "క్రొత్తదని నిందింపరాదు; ప్రాఁతదని ఆదరింపరాదు;" 4. అనుకరణమును తెలుపును. "ధన్యోఽస్మి యని పలికె;" "గల్లని మ్రోగునం దెలు;" 5. ప్రకారమును తెలుపును. "బ్రహ్మక్షత్త్రియవైశ్యశూద్రులని నాలుగువర్ణములవారు కలరు;" 6. తలఁచుటను తెలఁపును. "ఇమ్మహాత్మున కీఁ గాంచితి, కృతార్థుండనైతి నని మనంబున సంతసిల్లె;" 7. ప్రసిద్ధిని తెలఁపును. "ఉజ్జయిని అని యొక పట్టణము కలదు."

అనికి. దే. వి. 1. మూతి వెడలుపుగల నీళ్లకాఁగు, గాబు; 2. అల్లిక.

అనిక్షువు. సం. వి. ఉ. పుం. (చెఱకుతో సమానమైనది.) 1. ఒకవిధమైన రెల్లు✤; 2. అప్రశస్తమైన చెఱకు✤; 3. నల్లచెఱకు✤. శ. ర.

అనితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందఁబడనిది; 2. బ్రతికింపఁబడినది.

అనితరసులభము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఇతరులకు సులభముకానిది; 2. ఇతరులకుఁ జేయ శక్యముకానిది. "క. అనుటయు నాతఁడు దగ నూ, ల్కొని నం దా నుదితనినద కోదండుండై, యనితరసులభోద్యమమున, ధనంజయుం డిట్టులను నతనితో మఱియున్." భార. విరా. ౫, ఆ. ౧౧౫.

అనిత్యము. సం. విణ. (అ.ఆ.అ.) (నిత్యముకానిది.) 1. శాశ్వతముకానిది, నశించునది; 2. స్థిరముకానిది. "అనిత్యరూపము, అనిత్యహృదయుఁడు;" 3. ధ్రువముకానిది, సంశయాస్పదము. "యుద్ధమున జయ మనిత్యము;" 4. (వ్యాక.) సర్వత్ర నియతముగా రానిది. (సూత్రము మొ.)

అనిదంపూర్వము. సం. విణ. (అ. ఆ. అ.) ఇంతకుపూర్వములేనిది, క్రొత్తది, అబ్బురము.

అనిపించుకొను. దే.అ.క్రి. 1. అనుపునట్లు చేసికొను, పంపించుకొను, పొమ్మని చెప్పించుకొను, సెలవు

కొను. "వ. అనుచు గూఢవృత్తిఁ దదిష్టసాధనపర త సూచించి యనిపించుకొని ద్వారకానగరంబున కుం బోయి." ప్రభా. ౪, ఆ. ౭౦; 2. అను నట్లు చేసికొను. "ఒకరిచేత అనిపించుకొనుట మంచిదికాదు."

అనిమకము. సం. వి. అ. పుం. 1. కప్ప; 2. కోకి లము; 3. పద్మకేసరము; 4. మధూకము, ఇప్ప.

అనిమిత్తము. సం. వి. అ. న. 1. కారణములేమి; 2. అశుభశకునము.—క్రి.విణ.అ.న. కారణము లేకుండఁగ.—విణ. (అ.ఆ.అ.) కారణములేనిది.

అనిమిత్తాగమము. సం. విణ. (అ.ఆ.అ.) నిమిత్తము లేక వచ్చునది, కారణములేక సంభవించునది. "క. దుర్నిమిత్తుల,కగునవిమిత్తాగమంబులై నభయం బుల్." భార. ఆది. ౧, ఆ. ౧౬.

అనిమిషము. సం. వి. అ. పుం. (ఱెప్పపాటు లేనిది.) మత్స్యము, చేప.

అనిమిషుఁడు. సం. వి. అ. పుం. 1. దేవత, వేల్పు; 2. విష్ణువు; 3. మహాకాలుఁడు, శివుఁ డు.—విణ. (అ.ఆ.అ.) ఱెప్పపాటులేనివాఁడు, చలింపనివాఁడు.

అనిమీలత్. సం. (శతృం.) (సమాసపూర్వపదము గానే ప్రయోగము.) మూసికొని యుండనిది, వికసించుచున్నది. "లయగ్రాహి. కదళీవనములందు లవలీమా, కందతరుషండములయందు ననిమీల దరవింద సరసీవనములందు." భార. ఆది. ౫, ఆ. ౧౩౯.

అనిమేషుఁడు. సం. = అనిమిషుఁడు.

అనియతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. స్థిరము కానిది; 2. క్రమము లేనిది. "అనియతవేళ."

అనిరుద్ధుఁడు. సం. వి. అ. పుం. 1. గూఢచారుఁడు; 2. ప్రద్యుమ్నుని కొడుకు, ఉషాపతి; 3. విష్ణువు; 4. శివుఁడు.—విణ. (అ. ఆ. అ.) 1. అడ్డ గింపఁబడనివాఁడు, నిరోధింపఁబడనివాఁడు; 2. అడ్డులేనివాఁడు, లొంగనివాఁడు.

అనిరూపణీయము. సం. విణ. (అ.ఆ.అ.) నిరూపింప శక్యముగానిది, ఇట్టిదని చెప్పశక్యము గానిది. "తే. అతనితమ్ముల నొక్కరిసైనఁ దప్పి,పోవనీక యారాత్రియ పొదివి చిత్ర, నిహతిఁ జెఁగఁజూచి యనిరూపణీయదుర్నివారవృత్తిపై నరిగిరి కౌర వేంద్ర." భార. విరా. 3, ఆ. ౧౯.

అనిర్వచనీయము. సం. వి. అ. న. (వేదాంత.) 1. అజ్ఞానము; 2. జగత్తు.—విణ. (అ.ఆ.అ.) నిర్వచింపశక్యముకానిది, ఇట్టిదనిచెప్ప శక్యము గానిది. "అనిర్వచనీయ ప్రభావుఁడు."

అనిర్వచనీయుఁడు. సం. వి. అ. పుం. పరమాత్మ. —విణ. చూ. అనిర్వచనీయము.

అనిర్విణ్ణుఁడు. విణ. (అ. ఆ. అ.) 1. దుఃఖింపని వాఁడు; 2. ఆయాసము లేనివాఁడు.

అనిర్వేశము. సం. వి. అ. పుం. 1. భోగములేమి, సుఖము లేకుండుట; 2. భృతిలేమి, జీతములేకుం డుట.—విణ. (అ. ఆ. అ.) 1. భోగములేనిది, సుఖములేనిది, దుఃఖ; 2. జీతములేనిది.

అనిలము. సం.వి. అ. పుం. 1. వాయువు, గాలి; 2. ఏడుసంఖ్యకు సంకేతము; 3. (వాయుబీజము.) 'య' అనునక్షరము; 4. ప్రాణాదిరూపము గలవాయువు; 5. దేహమందలివాతము; 6. వాత మువలన కలిగినరోగము; (కీళ్లనొప్పులు మొ.); 7. (వాయుదేవతాకము.) స్వాతీనక్షత్రము.

అనిలుఁడు. సం. వి. అ. పుం. 1. వాయుదేవుఁడు, గాలి; 2. వసువులలో అయిదవవాఁడు; 3. విష్ణువు.

అనివార్యము. సం. విణ. (అ. ఆ. అ.) నివారింప శక్యముకానిది.

అనిశము. సం. విణ. (అ. ఆ. అ.) 1. రాత్రిలేనిది; 2. నిరంతరము, ఎడతెగనిది, విరామములేనిది. —క్రి.విణ. అ. న. ఎల్లప్పుడు. "క. మనమునఁ గోరుదు నే నర్జునునకు సమరమున రక్ష్యచోదక భావం, బునఁ బనిసేయ వలయునని, యనిశము విధికరుణ నాకు నది సిద్ధించెన్." భార. విరా. ౪, ఆ. ౧౫౫.

అనిష్టము. సం. వి. అ. న. 1. ఇష్టముకానిపని; 2. హాని, కీడు.—విణ. (అ. ఆ. అ.) 1. ఇష్టము కానిది, అప్రియము; 2. కోరఁబడనిది; 3. యజింపఁబడనిది, (యాగాదులయందు) పూజిం పఁబడనిది.

అనిష్పత్తి. సం. వి. ఇ. స్త్రీ. నెఱవేఱమి, పూర్ణము కాకపోవుట.

అనిష్పన్నము. సం. విణ. (అ.ఆ.అ.) నెఱవేఱనిది, పూర్ణము కానిది.

అనిస్తీర్ణము. సం. విణ. (అ.ఆ.అ.) 1. దాఁటఁబడనిది; 2. తీర్పుచెప్పఁబడనిది; 3. సమాధానము చెప్పఁబడనిది.

అనీకము. సం. వి. అ. పుం. న. 1. యుద్ధము; 2. సైన్యము; 3. సముదాయము. "నవాంబుదానీకము."

అనీకస్థము. సం. వి. అ. పుం. 1. యుద్ధవాద్యము; 2. యుద్ధచిహ్నము; 3. చిహ్నము, అడియాలము; 4. వీరమర్దళము; 5. ఢంక.—విణ. (అ. ఆ. అ.) 1. యుద్ధమందున్నది. (సైన్యము); 2. సైన్యమందున్నది; 3. సముదాయమందున్నది.

అనీకస్థుఁడు. సం. వి. అ. పుం. 1. యుద్ధమునందు నిలిచినవాఁడు, యుద్ధభటుఁడు; 2. ఏనుఁగులకు శిక్ష నేర్పుటయందు నేర్పరియైనవాఁడు; 3. మావటివాఁడు; 4. రాజరక్షకుఁడు, రాజునకు కావలివాఁడు.

అనీకిని. సం. వి. ఈ. స్త్రీ. 1. సేన; 2. అక్షౌహిణిలోఁ బదియవ భాగముగల సేనావిశేషము:—రెండువేలనూటయెనుబదియేడురథములు, అన్నియే యేనుఁగులు, ఆఱువేలు నేనూట యఱువదియొకటి గుఱ్ఱములు, పదివేలుం దొమ్మన్నూట ముప్పదియేపురు కాల్బురును గలసేనావిశేషము.

అనీహ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఇచ్ఛలేమి; 2. ఉపేక్ష.

అనీహమానుఁడు. సం.విణ. (అ.ఆ.అ.) 1. కోరుచుండనివాఁడు, కోరికలేనివాఁడు; 2. ప్రయత్నింపనివాఁడు, ఉపేక్షించువాఁడు. "వ. కర్మఫలంబులు దైవమానుషసిద్ధంబులయిననుం బురుషోత్సాహసముపార్జితంబులయినవి సుస్థిరంబులయి సురక్షితంబులయి వర్తిల్లు ననీహమానుండయి దైవపరుండయినవాఁడు నీరిలోని యానపాత్రంబునుంబోలె నవసన్నుండగు." భార. అర. ౧, ఆ. ౨౩౬.

అనీహుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఇచ్ఛలేనివాఁడు; 2. ఉపేక్షించువాఁడు; 3. అయోధ్యారాజులలో నొకఁడు.

అను. దే. స. క్రి. 1. చెప్పు; "తే. ఇట్టులనియెఁ గరుణతోడ." భార. ఆది. ౧, ఆ. ౯; 2. అని చెప్పు. "చ. విజితేంద్రియుండనఁగ నిమ్మునిఁ బాయక విందునంచు దా, నిది కలరూ పెఱుంగ నవనీపతి యుత్సుకుఁడయ్యె నాత్మలోన్." భార. ఆది. ౪, ఆ. ౩౦; 3. అని తలఁచు, అని తలపోయు; (విందునంచు = విందుననితలఁచుకొనుచు.) చూ. పైయర్థము నుదాహరణము; 4. నిందించు. "వసంతతిలకము. ఈ బాలు నెత్తికొని యింటికిఁ జన్న నన్నున్, నాబంధులందఱు మనంబున నేమనా రె, ట్లీబాలు సూర్యనిభు నిట్టుల డించిపోవం,గా బుద్ధిపుట్టు నని కన్య మనంబులోనన్." భార. ఆది. ౫,ఆ. ౭౯. "అని యనిపించుకొనుట అత్తగారా నీస్వభావమా?"(సామెత;) "ఒకరిననుట యెందుకు? ఊరకుండరాదా." "అన్నవానికంటె పడ్డవాఁడు మంచివాఁడు."(సామెత;) 5.అని ప్రసిద్ధుఁడగు, ప్రసిద్ధమగు. "సీ. వినవయ్య నహుషుఁడన్ జనపతి నేను మీ, పూర్వజులకు నటు పూర్వజుండ." భార. అర. ౪, ఆ. ౧౧౯; 6. చదువు, పద్యము మొదలగునవి చదువు. "ఒకపద్య మనవయ్య;" 7. పాడు. "అనఁగ ననఁగ రాగ మతిశయిల్లుచునుండు." "ఆపాటలో పల్లవి అనవమ్మా;" 8. ఉచ్చరించు. "రామరామ అంటే ముక్తిపొందుదువు;" 9. అని యడుగు. "వ. అంత నగస్త్యుండు విదర్భరాజుపాలికి వచ్చి నాకు లోపాముద్ర నిచ్చునది యనిన విదర్భేశ్వరుండు తనతనూజ నమ్మునికి నీఁపక మనంబున ననుతాపించి యక్కన్యకం జూచి యాత్మగతంబున." భార. ఆది.౨, ఆ. ౩౭౮. "ఏను మీకిష్టంబుగా దూతనై యేమి సేయుదు ననిన." భార. అర. ౨, ఆ. ౩౪.

అనుఁగు. దే. విణ. 1. ఆప్తుఁడు, ప్రియుఁడు, ముఖ్యుఁడు. "క. తనకుం గాశిమహీపతి, యనుఁగుం జెలి యగుటఁజేసి." హరి. ఉ. ౬, ఆ. ౧౯౪; 2. సుందరము, మనోహరము. "క. చను దెంచి సర్వజనములుఁ, దనుఁ గౌతూహలతరంగతరళతరవి

లో, చనులై కనుఁగొనఁగ నగరి, యనుంగు మొగసాలగపని కవతీర్ణుండై." హరి. ఉ. 3, ఆ. ౧౭. ఇట 'మొదటిది' అని శ.ర. 'మొగసాల' శబ్దము చేతనే నగరునకు ముందటిది అను నర్థము సూచితము; 3. ఇంపు, శ్రావ్యము. "సీ. వనవిహంగములయనుఁగుటెలుంగు లాహ్వానంబు చేయు కైవల్యఖగము." లక్ష్మీ. ౫, ఆ. ౧౫౭.

అనుఁగుఁగత్తియ. ద్వ. విణ. (అనుఁగు + కత్తియ.) చెలికత్తె. "క. అత్తఱిఁ బుత్తడిగీమున, బిత్తరిఁ గానక కరంబు పేర్మి ననుంగుం, గత్తియలందఱు నొకచో, మొత్తములై తత్తఱిలుచు మురి సడలం గన్." రసి. ౪, ఆ. ౪౦. రూ. అనుఁగుఁగత్తె.

అనుకంప. సం. వి. ఆ. స్త్రీ. 1. దయ, కనికరము, జాలి; 2. కొంచెము కంపించుట.

అనుకంపకుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) కనికరముగలవాఁడు, దయచూపువాఁడు, జాలిపడువాఁడు. "సర్వభూతానుకంపకుఁడు."

అనుకంపనము. సం. వి. అ. న. దయ, జాలి.—విణ. (అ. ఆ. అ.) దయాళువు, జాలిపడునది. "చ. ధర్మపరుల్ శరణాగతానుకంపను లనఁగాఁ బ్రసిద్ధులగు భారతవీరుల సద్గుణానుకీర్తనముల నొప్పు." భార. ఆది. 3, ఆ. ౧౦.

అనుకంపితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కనికరముగలవాఁడు.

అనుకంప్యము. సం. విణ. (అ. ఆ. అ.) దయఁదలఁపఁ దగినది, కనికరింపఁదగినది.

అనుకథనము. సం. వి. అ. న. 1. అనువాదము, ఒకరుచెప్పినదానిని మరలఁ జెప్పుట; 2. ఒకరు చెప్పినతర్వాతఁ జెప్పుట.

అనుకరణము. సం. వి. అ. న. 1. అనుకరించుట, ఒకరుచేయునట్లు చేయుట; 2. అనుకరణసాధనము; 3. ఒకరుచెప్పినమాటల నట్లే చెప్పుట. "వాఁడు 'జితోఽస్మి' యనియె;" 4. ఒకదాని ధ్వనిని సూచించుశబ్దము. "ఆకాయ కటుక్కుమని కొఱికినాఁడు;" 5. పోలిక.

అనుకరణీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అనుకరింపఁదగినది; 2. అనుసరించి చేయఁదగినది.

అనుకరించు. సం. స. క్రి. 1. అనుకరణముచేయు, ఒకరుచేయునట్లు చేయు; 2. పోలు.

అనుకర్త. సం. విణ. (ఋ. ఈ-స్త్రీ. ఋ.) అనుకరించువాఁడు.—వి. ఋ. పుం. నటుఁడు.

అనుకర్తవ్యము. సం. = అనుకార్యము.

అనుకర్షణము. సం. వి. అ. న. = అనుకర్షము.

అనుకర్షము. సం. వి. అ. పుం. 1. ఆకర్షణము, ముందునకు లాగుట; 2. (వ్యాక.) ఒకసూత్రమందలి పదమును అన్వయముకొఱకు ముందు సూత్రములోనికి గ్రహించుట, అనువృత్తి; 3. బండియిరుసుపైని చట్రము అమర్చుటకు వేసెడి మ్రానితుండు.

అనుకల్పము. సం. వి. అ. పుం. గౌణకల్పము, ప్రధానమునకు బదులుగాఁ జెప్పినవిధి.

అనుకామకృత్తు. సం. విణ. త్. 1. తనకోరిక నెఱవేర్చుకొనువాఁడు; 2. తనకుఁ దోఁచినట్లు చేయువాఁడు; 3. తనకోరికకుఁ దగినట్లు చేయువాఁడు.

అనుకామము. సం. వి.అ.పుం. తగినకోరిక.—అవ్య. కోరికకుఁ దగినట్లు.—విణ. (అ. ఆ. అ.) 1. తగినకోరికగలది; 2. అతికాముకము.

అనుకామీనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. తన కోరికప్రకారము సంచరించువాఁడు, తోఁచినట్లు సంచరించువాఁడు; 2. ఇచ్చకువచ్చినట్లు చేయువాఁడు.

అనుకారము. సం. వి. అ. పుం. 1. అనుకరించుట, అనుకరణము; 2. పోలిక.

అనుకారి. సం. విణ. (న్. ఈ-ణీ. న్.) 1. అనుకరించువాఁడు; 2. పోలువాఁడు.

అనుకార్యము. సం. = అనుకరణీయము.

అనుకీర్తనము. సం. వి. అ. న. 1. కీర్తనము, స్మరణము. "హరినామానుకీర్తనము;" 2. ప్రకటించుట; 3. అనుసరించి చెప్పుట. "చ....ప్రసిద్ధులగుభారతవీరుల సద్గుణానుకీర్తనములనొప్పుదాని విదితంబగుదాని సభాంతరంబులన్." భార. ఆది. 3, ఆ. ౧౦.

అనుకు. దే. విణ. ముద్దగాక పలుచనైనది. "మ. కమ్మని పణ్యారముతోడ బూరెగమితో మండెంగ తండంబుతో, ననుకుంబాసెము." భీమ. ౨, ఆ. ౬౭.

అనుకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఇచ్ఛగల వాఁడు, కోరికగలవాఁడు; 2. కామవికారము గలవాఁడు.

అనుకూలత. సం. వి. ఆ. స్త్రీ. ఆనుకూల్యము, అనుకూలుఁడుగా నుండుట.

అనుకూలము. సం.వి.అ. న. 1. అనుకూలమయినపని; 2. అర్థాలంకారభేదము. చూ. అలంకారము; 3.దంతివృక్షము.—విణ.(అ.ఆ.అ.) (ఆనుకూల్యముగలది.) 1. ప్రతికూలముకానిది, ఎదురుగానిది, ఇష్టముగా నుండునది. "అనుకూలవాయువు;" "సస్యానుకూల వర్షము;" "అనుకూలపరిణామము;" 2. తగినది. "స్వర్గ్యానుకూలము."

అనుకూలించు. సం. అ. క్రి. 1. అనుకూలమగు,ప్రతికూలము గానిదగు; 2. ఉపయోగించు.

అనుకూలుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకే స్త్రీయందు అనురాగముగల నాయకుఁడు. చూ. నాయకుఁడు; 2. సహచరుఁడు, మిత్త్రుఁడు; 3. పరమాత్మ.—విణ. (అ. ఆ. అ.) ఆనుకూల్యము గలవాఁడు, తనపక్షమున నుండువాఁడు, ప్రతికూలుఁడు గానివాఁడు.

అనుకృతి. సం. వి. ఇ. స్త్రీ.=అనుకారము.

అనుకృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) (వ్యాక.) 1. అనుకర్షము చేయఁబడినది, అనువృత్తి చేయఁబడినది. (పదము;) 2. ఆకర్షింపఁబడినది.

అనుక్రమణము. సం. వి. అ. న. 1. వరుసగాఁ బోవుట; 2. అనుసరించుట.

అనుక్రమణి. సం. వి. ఈ. స్త్రీ. = అనుక్రమణిక. "పర్వానుక్రమణి."

అనుక్రమణిక. సం. వి. ఆ. స్త్రీ. (పరిపాటీప్రకారము ఒకదానితర్వాత నొకటి యుండునట్లు ప్రారంభించునది.) 1. వరుసను దెలుపుగ్రంథవిశేషము. "స్మార్తానుక్రమణిక" (=స్మార్తకర్మలపద్ధతిని వరుసగాఁ దెలుపునట్టి గ్రంథము); 2. గ్రంథాదియందుఁగాని, గ్రంథాంతమందుఁగాని గ్రంథమందలి విషయములను క్రమముగాఁ దెలుపుగ్రంథభాగము. (విషయసూచిక మొ.)

అనుక్రమము. సం. వి. అ. పుం. పరిపాటి, వరుస, ఒకదానితర్వాత నొకటివచ్చుట.—అవ్య.అ.న. క్రమము నతిక్రమింపకుండఁగా.—విణ. (అ.ఆ.అ.) క్రమము ననుసరించినది.

అనుక్రోశము. సం.వి.అ. పుం. దయ, జాలి.—విణ. (అ.ఆ.అ.) క్రోసుదూరము ప్రయాణముచేసినది.

అనుక్షణము. సం. వి. అ. న. ప్రతిక్షణము, క్షణక్షణమునందు, ఎప్పుడును.

అనుగంత. సం. విణ. (ఋ. ఈ-త్రీ.ఋ.) వెంబడించువాఁడు, అనుసరించువాఁడు.

అనుగతము. సం. వి. అ. న. అనుసరించుట, అనుగమనము.—విణ. (అ. ఆ. అ.) 1. అనుసరింపఁబడినది; 2. వెనుకనున్నది, వెనుకభాగమున వ్యాపించినది; 3. అనుసరించినది, అనుసరించియున్నది. "పాదన్యాసము లయానుగతము;" 4. అధీనమైనది; 5. సమానధర్మానుసారముగా గ్రహింపఁబడినది. (విషయము మొ.)

అనుగతి. సం. వి. ఇ. స్త్రీ. 1. అనుసరించుట; 2. వెనుకఁబోవుట. "క. మాయందు లేనిగుణములు, మీయనురాగమునఁ జేసి మిగిలి వెలింగెన్, మీయనుగతి మాకు నభిప్రాయము వనవాసదుఃఖభర మోపుదురే." భార. అర. ౧, ఆ. ౮.

అనుగతికము. సం. విణ. (అ. ఆ. అ.)(సమాసోత్తరపదముగానే తెనుఁగున నుపయుక్తము.) అనుసరించునది."గతానుగతికము లోకము;" "గతానుగతిక న్యాయము."

అనుగమనము. సం. వి. అ. న.=అనుగమము.

అనుగమము. సం. వి. అ. పుం. 1. వెనుకఁబోవుట; 2. అనుసరించుట; 3. సహాయమగుట; 4. సహగమనము, చనిపోయినభర్తతో చితిలోఁ బడి చనిపోవుట; 5. సామాన్యధర్మము ననుసరించి విశేషస్వరూపము గలవానిని సంగ్రహించుట.

అనుగమించు. సం. స. క్రి. 1. అనుసరించు, వెంబడించు; 2. అనుకరించు,పోలు. "వ. గరుడనిగతి నన్యవిహంగంబు లనుగమింప నోపనియట్లు మానవులు వీనివీర్యంబు ననుగమింప నోపరు." భార. సభా. ౧, ఆ. ౧౫౮. "వ. మృగయాకుశలులైన మృగయులు విటవిదూషకవంది వైతాళికాదిజను లనేకు లనుగమించి రిట్లు." భార. అర. ౫, ఆ. ౩౭౪.

అనుగమము. సం. విణ. (అ.ఆ.అ.) వెంబడించునది.

అనుగమ్యమానుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అనుసరింపఁబడుచున్నవాఁడు, వెంబడింపఁబడుచున్నవాఁడు. "వ. అంత ననుద్యూతపరాజితులయిన పాండవులు దమరాజ్యోపభోగంబులు విడిచివిప్రసుహృద్బాంధవజనానుగమ్యమానులయి వనంబునకుం బోవ సమకట్టి." భార. సభా. ౨,ఆ. ౨౮౦.

అనుగలము. వై. విణ. (సం. అనుకూలం.) 1. ఆప్తుఁడు, హితుఁడు. "క. అని యప్పురి వెస నెప్పినఁ, జని యాశ్రమం డతనిఁ గాంచి సముచితభంగిన్, వినిపించె రాజధర్మున, కనుగలమగుసఖుఁడ ననియు నతని పనుపునన్." భార. శాం. 3, ఆ. ౪౨౭; 2. అనుకూలము. "తే. అఖిలజగదీశ్వరున కింతయనుగలముగ, నేమి తపమొనరించెనో యిప్పయోధి." లక్ష్మీ. 3, ఆ. ౫౫; 3. అధీనుఁడు, వశమైనవాఁడు. "తే. ఇట్టి, వనితకన్ను మనంబు నెవ్వానిఁ దగిలె, నతఁడె కాఁడె మన్మథునకు ననుగలంబు." దశ. ౧౦, ఆ. ౭౯; 4. సమానము. "క. వై నిగుడు మంచుఁ దువ్వర,వానలచేఁ దడిసి కమలవనలక్ష్మి హరి, ధ్యాననిమీలితలోచన, యానల రాధావధూటి కనుగలమయ్యెన్."పాండు. ౪, ఆ. ౧౦.

అనుగవీనుఁడు. సం. వి. అ.పుం. (గోవువెనుకఁ బోవువాఁడు.) గోపాలుఁడు, గొల్ల, పసులకాఁపరి.

అనుగామి. సం. వి. న్. పుం. = అనుగుఁడు.—విణ. (న్. ఈ- నీ. న్.) అనుసరించిపోవువాఁడు.

అనుగీతము. సం. వి. అ. న. 1. ఒకపాట ననుసరించి పాడుట; 2. ఒకపాట ననుసరించి పాడినపాట.

అనుగీతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఒకపాటను అనుసరించినపాట; 2. ఆర్యావృత్తభేదము. (మొదటి సగమున 27 మాత్రలును, రెండవసగమున 32 మాత్రలును గలవృత్తము.)

అనుగుంఫము. సం. వి. అ. పుం. వాక్యరచన, రచన. "చ. పనివడి నారికేళఫలపాకమునం జవియైన భట్టహర్షనికవితానుగుంఫములు సోమరిపోతులు కొందఱయ్యు లౌనని కొనియాడ నేరరు." నై. ౧, ఆ. ౧౭. అనుగుంభములు అని ముద్రితము.

అనుగుఁడు. సం. వి. అ. పుం. 1. సహచరుఁడు; 2. మిత్రము; 3. సేవకుఁడు. "భూతనాథానుగుఁడు."—విణ. (అ. ఆ. అ.) అనుసరించిపోవువాఁడు, వెంబడించి వెళ్లువాఁడు. (దాసాది.)

అనుగుణ. సం. వి. ఆ. స్త్రీ. తంత్రులతోఁగూడినవీణ.

అనుగుణము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తగినది, అర్హము; 2. సమానగుణములుగలది; 3. గుణముల ననుసరించి యున్నది.

అనుగులము. వై. = అనుగలము. "ద్వి. బసవపురాణైకపాత్రుండవనియు, నచలితప్రీతి మాకనుగులంబనియు,రచియింతు బసవపురాణ సత్కావిత, యవధానవంతుండవై నెమ్మి వినుము." బస. ౧,ఆ. పు. ౪. ఇట అనుగలము అనియు నవచ్చును.

అనుగ్రహణము. సం. వి. అ. న.= అనుగ్రహము.

అనుగ్రహము. సం. వి. అ. పుం. 1. కోరినవాని కోరిక నెఱవేర్పవలయు ననుభావము, దయ. (వ్యతి. నిగ్రహము;) 2. అనుకూలమగుట; 3. దరిద్రాదులను పోషించుట.

అనుగ్రహించు. సం. స. క్రి. 1. అనుగ్రహము చూపు, కనికరించు; 2. పోషించు.

అనుగ్రాహకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అనుగ్రహించువాఁడు.

అనుగ్రాహ్యము. సం. విణ. (అ. ఆ. అ.) అనుగ్రహింపఁదగినది.

అనుచరి. సం. వి. ఈ. స్త్రీ. దాసి.

అనుచరించు. సం. స. క్రి. అనుసరించు. "ఆ. నీవు విరటు నెట్టి చందంబున, ననుచరించువాఁడ వధిప చెప్పుమ." భార. విరా. ౧, ఆ. ౬౭.

అనుచరుఁడు. సం. వి. అ. పుం. 1. సహాయుఁడు, తోడు; 2. సేవకుఁడు; 3.దూత ననుసరించి పోవువాఁడు.—విణ. (అ.ఈ-రీ.అ.) అనుసరించిపోవువాఁడు, వెంటఁబోవువాఁడు. (దాసాది.)

అనుచారకుఁడు. సం. వి. అ. పుం. సేవకుఁడు.—విణ. (అ. ఆ-రికా. అ.) అనుసరించి పోవువాఁడు.

అనుచారిక. సం. వి. ఆ. స్త్రీ. దాసి, సేవకురాలు.

అనుచారిణి. సం. వి. ఈ. స్త్రీ. పరిచారిక, సేవకురాలు. "క. పాంచాలికి నే, ననుచారిణినై తగఁ

బం,చినగరువపుఁబనులు నేర్చి చేయుదు సం దర్భ." భార. విరా. ౧, ఆ. ౧౦౮.

అనుచింత. సం. వి. ఆ. స్త్రీ. ఎడతెగనిచింత.

అనుచింతనము. సం. వి. అ. న. 1. ఆలోచించుట; 2. ఎప్పుడును చింతించుట, ఎడతెగనిచింత.

అనుచితము. సం. విశే. (అ.ఆ.అ.) ఉచితముకానిది, అయుక్తము, తగనిది.

అనుచే. దే. చూ. అంచే.

అనుజ. సం. వి. ఆ. స్త్రీ. చెల్లెలు.

అనుజన్ముఁడు. సం. వి. న్. పుం. = అనుజుఁడు.

అనుజాతుఁడు. సం. = అనుజుఁడు.

అనుజీవి. సం. విశే. (న్.-ఈ-నీ.న్.) 1. ఆశ్రయించి బ్రతుకువాఁడు, ఆశ్రితుఁడు; 2. సేవకుఁడు.

అనుజీవ్యుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) ఆశ్రయింపఁదగినవాఁడు, సేవింపఁదగినవాఁడు.

అనుజుఁడు. సం. వి. అ. పుం. కనిష్ఠసోదరుఁడు, తమ్ముఁడు.

అనుజ్ఞ. సం. వి. ఆ. స్త్రీ. 1. అనుమతి, అంగీకారము; 2. ఉత్తరువు, ఆజ్ఞ.

అనుజ్ఞాతుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆజ్ఞాపింపఁబడినవాఁడు; 2. అనుమతింపఁబడినవాఁడు, అంగీకరింపఁబడినవాఁడు.

అనుజ్ఞానము. సం. వి. అ. న. = అనుజ్ఞ.

అనుజ్జ్వలము. సం. విశే. (అ.ఆ.అ.) 1. ప్రకాశింపనిది; 2. ప్రకటితము కానిది. "సీ. కాళ్లయొప్పిద మాఁడుకట్ట నుజ్జ్వలము సేయంగ సంకులబాహు లందమెడల." భార. విరా. ౧, ఆ. ౨౨౮.

అనుతరము. సం. వి. అ. న. ఆతరము, ఓడకేవు.

అనుతర్షణము. సం. వి. అ. న. 1. మద్యపానము; 2. మద్యపానపాత్ర.

అనుతర్షము. సం. వి. అ. పుం. 1. మద్యము; 2. మద్యపానపాత్ర; 3. మద్యపానము; 4. మద్యపానేచ్ఛ, మద్యము త్రాగవలయు ననుకోరిక; 5. దప్పిక, తృష్ణ; 6. అభిలాషము, కోరిక; 7. కల్లు వడ్డించుట. (శ. ర.)

అనుతాపనము. సం. విశే. (అ. ఆ. అ.) పశ్చాత్తాపము గలిగించునది, విచారము గలిగించునది. —వి. అ. న. పశ్చాత్తాపము గలిగించుట.

అనుతాపము. సం. వి. అ. పుం. పశ్చాత్తాపము, తప్పుచేసితినని నొచ్చుకొనుట.

అనుతాపి. సం. విశే. (న్. ఈ - నీ. న్.) అనుతాపముగలవాఁడు, పశ్చాత్తాపపడువాఁడు.

అనుతాపించే. సం. అ. క్రి. 1. పశ్చాత్తాపపడు; 2. తాపమునొందు, ఉత్తలపాటునొందు; "వ. తనతనూజ నమ్ముని కీనోపక మనంబున ననుతాపించి." భార. అర. ౨, ఆ. ౩౨౮.

అనుత్కము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉత్కంఠ లేనిది; 2. తహతహలేనిది, స్వస్థము. (చిత్తము.)

అనుత్కర్షము. సం. వి. అ. పుం. ఉత్కర్షలేమి. —విశే. (అ. ఆ. అ.) ఉత్కర్ష లేనిది, గొప్పతనము లేనిది.

అనుత్తమము. సం. విశే. (అ.ఆ.అ.) 1. (దేనికంటె ఉత్తమము లేదో అది.) అత్యుత్తమము; 2. ఉత్తమముగానిది, అధమము.

అనుత్తరంగము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఎగురు తరంగములులేనిది, శాంతము. (సముద్రము మొ.) 2. అచంచలము, స్థిరము.

అనుత్తరము. సం. విశే. (అ.ఆ.అ.) 1. (దేనికంటె ఉత్తరము లేదోయది.) అత్యుత్తమము. "క. గురుశుశ్రూషకులును సత్యరతులు శమదమవినిర్మలాత్ములు దుర్భత్స్యరహితులును నిల్తురను,త్తరముగ నచ్చోట గోప్రదానపరులతోఁ." భార. అను. ౨,ఆ. ౪౬౭; 2. (ఉత్తరముకానిది.) అధమము; 3. ఉత్తరములేనిది, సమాధానములేనిది, నిరుత్తరము. (పూర్వపక్షము మొ.); 4. ఉత్తరపువైపుదికానిది, దక్షిణము (దేశము మొ.); 5. స్థిరము.

అనుత్తానము. సం. విశే. (అ. ఆ. అ.) ఉత్తానముగానిది, అధోముఖముగా నున్నది, బోరగిల్లియున్నది.

అనుత్పత్తికము. సం. విశే. (అ. ఆ. అ.) ఉత్పత్తి లేనిది.

అనుత్పాదము. సం. వి. అ. పుం. పుట్టుకలేమి. —విశే. (అ. ఆ. అ.) పుట్టుకలేనిది.

అనుత్పాదము. సం. వి. అ. పుం. 1. నాశములేమి; 2. తెంపులేమి.—విణ. (అ.ఆ.అ.) 1. నాశము లేనిది; 2. తెంపులేనిది.

అనుత్సాహము. సం. వి. అ. పుం. ఉత్సాహము లేమి.—విణ. (అ.ఆ.అ.) ఉత్సాహములేనిది.

అనుత్సిక్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) గర్వములేని వాఁడు.

అనుత్సుకుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ఉత్సుకుఁడు గానివాఁడు, వేడుకలేనివాఁడు.

అనుదగ్రము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎత్తుగా లేనిది; 2. (దేనికంటె ఎత్తైనది లేదో అది.) అత్యున్నతము; 3. తీక్ష్ణముగానిది, మృదువైనది.

అనుదరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అల్పమైన నడుముగలవాఁడు, సన్ననినడుమువాఁడు, కృశోదరుఁడు. (స్త్రీ. అనుదర.)

అనుదాత్తము. సం. వి. అ. పుం. (వేదమందు) ఉదాత్తము కానిస్వరము; క్రిందుగా నుచ్చరింపఁబడుస్వరము. (అచ్చులో దీనికి గుర్తుగా క్రింద గీటుపెట్టెదరు. ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము, అని స్వరములు మూఁడు.)

అనుదారుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఉదారుఁడు గానివాఁడు.) 1. దాతగానివాఁడు; 2. గొప్పవాఁడుగానివాఁడు, అల్పుఁడు, నీచుఁడు; 3. (అను+దార.) భార్య ననుసరించువాఁడు.

అనుదినము. సం. అవ్య. అ. న. ప్రతిదినము, దిన దినమునందు.

అనుదేశము. సం. వి. అ. పుం. 1. క్రమానుసారముగా నుచ్చరించుట; 2. క్రమముగాఁ జెప్పుట; 3. ఉపదేశము.

అనుద్దేశము. సం. వి. అ. పుం. ఉద్దేశములేమి.—విణ. (అ. ఆ. అ.) ఉద్దేశము లేనిది.

అనుద్ధతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. గర్వికాని వాఁడు, విధేయతగలవాఁడు; 2. కలపంచినవాఁడు, నమ్రుఁడు.

అనుద్భటుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ప్రగల్భుఁడు గానివాఁడు, సాధువు.

అనుద్యతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఉద్యమము లేనివాఁడు, పూనికలేనివాఁడు.

అనుద్యమము. సం. వి. అ. పుం. ఉద్యమములేమి, యత్నములేమి, పూనికలేమి.—విణ. (అ.ఆ.అ.) ఉద్యమములేనిది, పూనికలేనిది.

అనుద్యూతము. సం. వి. అ. న. 1. రెండవమాఱాడిన జూదము; 2. భారతమున రెండవమాఱాడిన జూదమునుగుఱించి చెప్పినపర్వము. (సభాపర్వములోని యుపపర్వము.)

అనుద్వాహుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వివాహము కానివాఁడు.

అనుద్విగ్నము. సం. విణ. (అ. ఆ. అ.) వ్యాకులము గానిది, స్థిరము. (మనస్సు.)

అనుద్వేగము. సం. వి. అ. పుం. 1. తొందరలేమి; 2. భయములేమి.—విణ. (అ.ఆ.అ.) 1. తొందరలేనిది; 2. భయములేనిది.

అనుద్యోగము. సం. వి. అ. పుం. ఉద్యోగములేమి, ఒకపనియందు పూనికలేమి.—విణ. (అ.ఆ.అ.) ఒకపనియందు పూనికలేనిది.

అనుధావనము. సం. వి. అ. న. 1. వెనుకఁబఱువెత్తుట; 2. అనుసరించిపోవుట; 3. అనుసంధానము.

అనుధావ్యమానుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) వెనుకఁబఱువెత్తఁబడినవాఁడు, తఱుమఁబడినవాఁడు. "వ. రాజానర్థంబు ముచ్చిలికొని ముచ్చు లారెకులచేత ననుధావ్యమానులై మాండవ్యు సమీపంబు నంబాఱి." భార. ఆది. ౪, ఆ. ౨౬౨.

అనుధ్యానము. సం. వి. అ. న. అనుక్షణమును చింతించుట, ఎప్పుడును ధ్యానించుట.

అనునయము. సం. వి. అ. పుం. 1. వినయము; 2. నమస్కారము; 3. ప్రార్థన; 4. సాంత్వనము, బతిమాలుట; 5. ఊఱడించుట.

అనునయి. సం. విణ. (న్.-ఈ-నీ.న్.) అనునయించువాఁడు, బతిమాలువాఁడు.

అనునయించు. సం. స. క్రి. 1. బుజ్జగించు, సాంత్వనముచేయు. "ఆ దయార్ద్రచిత్తుఁడవు వీనిఁ దేర్పవే, యనునయించి యెట్టులైనఁ గృష్ణ."

భారి. ఉద్యో. 3, ఆ. 3౮; 2. ఊఱడించు. "వ. ఇవ్విధంబునం గేశవుండు గరుణించి గరుడుని ననునయించి." భార. ఉద్యో. 3, ఆ. 3౦౨.

అనునాదము. సం. వి. అ. పుం. 1. మాఱుమ్రోఁత, ప్రతిధ్వని; 2. ధ్వని.

అనునాది. సం. విణ. (న్. ఈ - నీ. న్.) అనునాదముగలది, ప్రతిధ్వనించునది, గంభీరము. (కంఠస్వరము మొ.)

అనునాయకుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. అనునయించువాఁడు, బతిమాలువాఁడు; 2. మంచితనముతో మాటలాడువాఁడు.

అనునాసికము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నాసికననుసరించి యుచ్చరించఁబడునది. (వర్ణము—ఙఞణనమయవలలు); 2. ముక్కుతోఁ బలుకఁబడునది. (ముక్కుమాట.)

అనునీతము. సం. విణ. (అ. ఆ. అ.) అనునయింపఁబడినది, బుజ్జగింపఁబడినది.

అనునీతి. సం. వి. ఇ. స్త్రీ. = అనునయము.

అనునీతుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఊఱడింపఁబడినవాఁడు; 2. బుజ్జగింపఁబడినవాఁడు.

అనునేయము. సం. విణ. (అ.ఆ.అ.) అనునయింపఁదగినది, బుజ్జగింపఁదగినది.

అనుపకారము. సం. వి. అ. పుం. 1. ఉపకారములేమి; 2. అపకారము.—విణ. (అ.ఆ.అ.) 1. ఉపకారములేనిది; 2. ఉపకారము చేయనిది.

అనుపకారి. సం. విణ. (న్. ఈ- ణీ. న్.) 1. ఉపకారము చేయనివాఁడు; 2. అపకారముచేయువాఁడు.

అనుపదము. సం. వి. అ. న. (సంగీత.) పల్లవి.—విణ. (అ.ఆ.అ.) (పదము ననుసరించునది.) 1. అడుగులవెంబడిగ వచ్చునది; 2. మాటవెంబడి వచ్చునది.—అవ్య. అ. న. 1. అడుగడుగున; 2. మాటమాటకు; 3. పదము ననుసరించునట్టుగా; 4. అనంతరముగ, వెంబడిగ.

అనుపదీన. సం. వి. ఆ. స్త్రీ. (కాలికిసరిపడిన చెప్పు) కాలిజోడు.

అనుపనీతుఁడు సం. విణ. (అ. ఆ. అ.) ఉపనయనసంస్కారము కానివాఁడు, వడుగుకానివాఁడు.

అనుపపత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. పొసఁగమి, పూర్వాపరసందర్భములేమి, విరోధము; 2. యుక్తిలేమి; 3. ఉపపత్తి (తగినసదుపాయము) లేమి, దారిద్ర్యము. —విణ. ఇ. ఉపపత్తిలేనిది.

అనుపపన్నము. సం. విణ. (అ. ఆ. అ.) ఉపపత్తిలేనిది.

అనుపమ. సం. వి. ఆ. స్త్రీ. నైరృతి దిక్కునందలి సుప్రతీకమను గజముయొక్కభార్య.

అనుపమము. సం. విణ. (అ. ఆ. అ.) సాటిలేనిది, పోలికలేనిది.

అనుపమేయము. సం. విణ. (అ. ఆ. అ.) ఇతరములతోఁ బోల్పఁదగనిది, పోలికలేనిది, సాటిలేనిది.

అనుపయుక్తము. సం. విణ. (అ.ఆ.అ.) 1. యుక్తముగానిది, అనుచితము, తగనిది; 2. ఉపయోగముకానిది, ఉపయోగింపనిది; 3. ఉపయోగింపఁబడనిది; 4. భుజింపఁబడనిది.

అనుపయోగము. సం. వి. అ. పుం. 1. ఉపయోగములేమి; 2. అనుకూల్యములేమి.—విణ. (అ. ఆ. అ.) 1. ఉపయోగములేనిది; 2. అనుకూల్యములేనిది.

అనుపరి. దే. వి. సుంకరి,పన్నువసూలుచేయువాఁడు.

అనుపలంభము. సం. వి. అ. పుం. 1. ప్రత్యక్షాదిజ్ఞానములేమి; 2.లాభములేమి.—విణ.(అ.ఆ.అ.) 1. ప్రత్యక్షాదిజ్ఞానము లేనిది; 2.లాభములేనిది.

అనుపలబ్ధి. సం. వి. ఇ. స్త్రీ. 1. లాభములేమి; 2. ప్రత్యక్షాదిజ్ఞానములేమి.—విణ. ఇ. ఉపలబ్ధిలేనిది.

అనుపల్లవము. సం. వి. అ. పుం. పల్లవితర్వాతఁ బాడెడిపాట. 'అనుపల్లవి' అని వాడుక.

అనుపసూది. ద్వ. వి. (అనుము+సూది.) గుండుసూది. శ. ర.

అనుపానము. సం. వి. అ. న. ఔషధముతోఁగాని, ఔషధము పుచ్చుకొన్న తర్వాతఁగాని త్రాగఁదగిన కషాయము, మొదలగు పదార్థము.

అనుపాల్యము. సం. విణ. (అ. ఆ. అ.) పాలింపఁదగినది, ఏలఁదగినది. "మ. మమతాగోచర మీ

త్రిలోకములు నస్మద్బాహువజ్రానుపాల్యము లే నింద్రుఁడ నిట్టి నిన్నుఁ బక లీలన్ జూడమా డంగ నుత్తమ సింహాసన మెక్కి నీకుఁ జనునే దర్పించి నాముందటన్." భార. ఆది. ౭, ఆ. ౨౭౧.

అనుపు. దే. స. క్రి. చూ. అంచు.—వి. 1. ప్రయాణమై పోవువారికి తోడు పంపుట; "సీ. తస్కరబాధ నొందకయుండ నెడరైనయటవీ స్థలంబున ననుపుఁబెట్టు." కాశీ. ౪, ఆ. ౬౧. సం. "అనువ్రజతి కాంతారే ప్రాంతరే పథికాన్నధీ." శ. ర.; 2. సుంకము. "తే. తెఱవ లటు నీరు వోయుచుం దిరియ చేరి, యవలఁ గొఱగాక పిచ్చుకుంటయి యనంగుఁ, డనుపు గొనఁ జొచ్చెఁ గల్లగు ట్టమర వారి, కర్వగులు లాసియిడు విడియముల పేర." ఆము. ౨, ఆ. ౫౭. 'లాఁచియిడు. వే. వేం. పా.

అనుపోష్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) (అను+పోష్యుఁడు.) 1. పోషింపఁదగినవాఁడు; "క.అనఘా నీప్రస్తవమున, నని నీల్గిన వీరభటుల యనుపోష్యుల నెల్లను బ్రోతె భోజనాచ్ఛాదనముల వారలకు నెమ్మి దఱుఁగకయుండన్." భార. సభా. ౧, ఆ. ౪౦; 2. ఉపోష్యుఁడు కానివాఁడు, ఉపవాసము చేయఁదగనివాఁడు, పస్తుండఁదగనివాఁడు.

అనుప్రవేశము. సం. వి. అ. పుం. (అనురూపమగు ప్రవేశము.) 1.లోపలఁ బ్రవేశించుట;2.(జయించినవాని యభిప్రాయమునకు) లొంగియుండుట. "బలవంతునిచేఁ బరాజితుఁడగువానికి విదేశగమనముగాని తదనుప్రవేశముగాని నీతి." పంచతం.

అనుప్రసాదనము. సం. వి. అ. న. ప్రసన్నునిగాఁ జేసికొనుట. "ప్రియానుప్రసాదనము" (=భర్తను ప్రసన్నుఁగాఁ జేసికొనుటకు చేయువ్రతము.)

అనుప్రాణనము. సం. వి. అ. న. ఉజ్జీవింపఁజేయుట, జీవింపఁజేయుట.

అనుప్రాణితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉజ్జీవింపఁజేయఁబడినది, జీవింపఁజేయఁబడినది; 2. స్థాపింపఁబడినది. "ఉత్ప్రేక్షానుప్రాణితమైన స్వభావోక్త్యలంకారము."

అనుప్రాసము. సం. వి. అ. పుం. 1. శబ్దాలంకారభేదము. (అచ్చులు భిన్నముగా నున్నను వచ్చినహల్లే మరల వచ్చుట;) 2. సదృశము. (ఔపమ్య వాచకము.) "మ. ఆశీవిషా, భరణోత్తంససుధాంశురేఖకు ననుప్రాసంబు కైలాసభూ, ధరకూటస్ఫటికోపలప్రతతి కధ్యాహారము." నై. ౫, ఆ. ౧౪౪.

అనుప్లవుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. సహాయుఁడు, తోడు; 2. అనుచరుఁడు, సేవకుఁడు.

అనుబంధము. సం. వి. అ. పుం. 1. కట్టు, బంధము; 2. తగులము, సంబంధము. "హృదయానుబంధము, సంసారానుబంధము;" 3. కామపూర్వకముగాఁ జేసినదోషమును మరల మరలఁ జేయుట; 4. ఎడతెగని సంబంధము, అవిచ్ఛిన్నసంబంధము; 5. తర్వాత గలుగుశుభాశుభఫలము; 6. ఉద్దేశము. "పాపానుబంధము" 7. అప్రధానము, ఒకదానికిఁ జేర్పఁబడిన భాగము. "ముఖ్యానుబంధము;" 8. ఒకప్రధానగ్రంథమునకుఁ జివరఁజేర్చిన భాగము, పుస్తకానుబంధము; 9. శాస్త్రము రచించునపుడు ఆదినిఁ జెప్పఁదగిన విషయప్రయోజనాధికారి సంబంధరూపమగు భాగము. "అనుబంధచతుష్టయము." (ఇందు గ్రంథమందలి విషయప్రయోజనము లేవి అధికారి ఎవండు అను విషయములు, అధికారికిని, గ్రంథమునకునుగల సంబంధమును తెలుపఁబడును; 10. (వ్యాక.) ప్రకృతి; 11. (వ్యాక.) ప్రయోజనవిశిష్టమై ఉపదేశమున (ఆద్యోచ్చారణమున) నుండి తరువాత లోపించు వర్ణము, ఇత్సంజ్ఞవర్ణము. (టునది, గముల్. ఇత్యాదులయందలి టుల్ మొదలైనవి;) 12. అనుసరణము; 13. ఆరంభము; 14. దోషము, తప్పు; 15. (గణిత.) భాగానుబంధపూర్ణాంకము.

అనుబంధి. సం. వి. ఈ. స్త్రీ. 1. హిక్క, ఎక్కిళ్లరోగము; 2. తృష్ణ,ఆస.—విణ.(న్.ఈ.నీ.న్.) 1. అనుబంధముగలది, సంబంధముగలది; 2. అనుసరించునది; 3. అవిచ్ఛిన్నముగా నున్నది; 4. వ్యాపించినది.

అనుబంధించు. సం. స. క్రి. అనువర్తించు.

అనుబంధుఁడు. సం. వి. అ. పుం. ముఖ్యుల (తల్లిదండ్రులు లోనగు పెద్దల) ననుసరించి నడుచు కొడుకు లోనగువాఁడు.

అనుబోధము. సం. వి. అ. పుం. 1. తర్వాత జ్ఞప్తికి వచ్చుట, సమయము దాఁటినతర్వాత జ్ఞప్తికి వచ్చుట; 2. మొదటఁ బూసినచందనాదికము పరిమళ మధికమగుటకై నలుఁగు పెట్టుట;3.అత్తరు అని. శ. ర.

అనుభవనీయము. సం. = అనుభావ్యము.

అనుభవము. సం. వి. అ. పుం. 1. ఇంద్రియముల ద్వారమున అంతఃకరణము పదార్థములపై వ్యాపించి యాపదార్థముల స్వరూపమును గ్రహించుట, ప్రత్యక్షజ్ఞానము, వస్తువులను చూచుట, తినుట, తాఁకుట, మొదలగువానివలన కలిగిన జ్ఞానము, నీరు కాలువతూమునుండి మడిలోఁ బ్రవేశించి మడియాకారము నొందునట్లు అంతఃకరణము ఇంద్రియముల ద్వారమున ఘటాదివస్తువులమీఁదఁ బ్రవేశించి తదాకారమునొంది దాని స్వరూపమును తెలిసికొనుట; 2. (కర్మఫలమగు) సుఖదుఃఖాదుల నొందుట. "కర్మఫలానుభవము." "క. తెగునే, యనుభావ్య మెంత యంతయు, ననుభవమునఁ గాక యనుచు నయముఁ గుంచెన్." కళా. 3, ఆ. ౯3.

అనుభవి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) అనుభవముకలవాఁడు.

అనుభవించు. సం. స. క్రి. 1. అనుభవమునొందు, ప్రత్యక్షజ్ఞానము నొందు; 2. సుఖదుఃఖాదుల నొందు, సుకృతదుష్కృతఫలము నొందు. "సీ. ఇచ్ఛానుగుణముల నింద్రియసుఖముల ననుభవింపుఁడు హృదయంబులలర." భార. ఉద్యో. ౨, ఆ. ౧౨౭; 3. భుజించు. "సీ. ఒకతఱి ముని వర్యు లొకటఁ బెక్కండ్రు శ్రాద్ధముల్ సేయ భోజ్యములు పెక్కు, లనుభవించుటఁ దమ కఱుగమి పుట్టుటయును బితృదేవతల్ సనిరి." భార. అను. 3, ఆ. ౧౯౬.

అనుభావము. సం. వి. అ. పుం. 1. ప్రాభవము, రాజుల తేజోవిశేషము. (అది కోశదండాది జాతము); 2. శక్తి, సామర్థ్యము; 3. మాహాత్మ్యము; 4. తేజస్సు; 5. మనస్సులోనిభావమును సూచించు భ్రూవికారాదిచేష్ట; 6. రసోత్పాదనకు సాధనమగు సాత్త్వికాదిభావము; 7. నిశ్చయాభిప్రాయము.

అనుభావి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) 1. అనుభావము గలవాఁడు; 2. సాక్షాత్కారముగలవాఁడు, సాక్షి; 3. కనిష్ఠుఁడు, చిన్నవాఁడు.

అనుభావ్యము. సం. విణ. (అ.ఆ.అ.) 1. అనుభవింపఁదగినది. "క. ధృతిఁబూని బ్రహ్మచర్య, వ్రత మున్నతిఁ దాల్చితిని ధ్రువంబుగననపత్యతయైనను లోకములా,యతిఁ బెక్కులుగలవు నాకు ననుభావ్యములై." భార. ఆది. ౪, ఆ. ౧౯౦; 2. తెలిసికొనఁదగినది, పొందఁదగినది. "చ. షట్ప్రమా,ణపరమదూరగాధ భజనక్రమగత్యనుభావ్యసారదేవ పితృపథప్రవర్తన." భార. విరా. 3, ఆ. ౨3౮; 3. భావింపఁదగినది, మనసునఁ దలఁపఁదగినది; "మాలిని. భరితభువనతేజోభవ్యయోగానుభావ్యా, స్ఫురితగుణసమగ్రశ్రీపుణ్యా నైర్గుణ్యాగణ్యా." భార. భీష్మ. ౧, ఆ. 3౦౬.

అనుభాషణము. సం. వి. అ. న. సల్లాపము, సహభాషణము, కలసిమాటలాడుట.

అనుభుక్తము. సం. విణ. (అ. ఆ. అ.) అనుభవింపఁబడినది.

అనుభుక్తి. సం. వి. ఇ. స్త్రీ. అనుభవము, కుడుపు.

అనుభూతము. సం. విణ. (అ.ఆ.అ.) 1. అనుభవింపఁబడినది, అనుభవగోచరమైనది; 2. తర్వాతఁ బుట్టినది.

అనుభూతి. సం. = అనుభుక్తి.

అనుభోగము. సం. = అనుభవము.

అనుమంత. సం. విణ. (ఋ. ఈ-త్రీ. ఋ.) అనుమతించువాఁడు, అనుమతి యిచ్చువాఁడు.

అనుమఁడు. వై. వి. హనుమంతుఁడు. "క. వినుమనుమఁడ వినుమనుమఁడ, వనఁదనరినసీకు నెందు నడ్డముగలదే." అచ్చ. యు, కాం. ౪౦౬.

**అనుమతము.** సం. వి. అ. న. సమ్మతి, అంగీకారము. "ద్వి... బసవయ్య ఘనభక్తవితతి, యనుమతంబునఁగూడ నతని కిట్లనియె." బస. ౭, ఆ. ౨౮౧.—విణ. (అ.ఆ.అ.) అనుమతింపఁబడినది, సమ్మతమైనది, ఇష్టమైనది. "క. వారలు లేరట పో పెఱ, వారలఁ దగుభంగి మనకు వశ్యులఁ జేయన్, భూరిబలయుతుల మగుటయు, కారణ మను టనుమతంబు గాదే మనకున్." భార. విరా. 3, ఆ. ౧౧౨.

**అనుమతి.** సం. వి. ఇ. స్త్రీ. **1.** అనుజ్ఞ; **2.** సమ్మతి, అంగీకారము; **3.** ఒకకళ తక్కువైన చంద్రుఁడు గల పున్నమ.

**అనుమతించు.** సం. స. క్రి. సమ్మతించు, ఒడఁబడు.

**అనుమతుఁడు.** సం. వి. అ. పుం. ప్రియుఁడు. —విణ. చూ. అనుమతము.

**అనుమరణము.** సం. వి. అ. న. **1.** ఒకరిచావు ననుసరించి చచ్చెడుచావు; **2.** చనిపోయిన భర్త దేహము దొరకనప్పుడు భర్తపాదుకాదులు గ్రహించి చితిపై కెక్కి మృతినొందుట. "చ. అనుమరణంబు నందఁగ మురాంతకు రుక్మిణిసెందె లక్ష్మిని." భార. స్వర్గా. ౭౨.

**అనుమాత.** సం. విణ. (ఋ.ఈ-త్రీ.ఋ.) **1.** అనుమానము చేయువాఁడు, ఊహించువాఁడు; **2.** అనుమాన ప్రమాణమున గ్రహించువాఁడు.

**అనుమానము.** సం. వి. అ. న. **1.** వ్యాప్యము జ్ఞానముచేత వ్యాపకము నిశ్చయించుట. (వహ్ని ధూమమునకు వ్యాపకము. ధూమము వహ్నికి వ్యాప్యము. ధూమమున్నచోట వహ్ని యుండుట పాకశాలాదులందుఁ జూచి యెఱింగినవాఁడు పర్వతమునఁ గనఁబడుచున్న ధూమమును జూచి యచట వహ్ని యున్నదని నిశ్చయించుట; **2.** అట్టి నిశ్చయమునకుఁ గారణమైన ధూమాదికము; **3.** ఊహించుట; **4.** సందేహము. "క. నన్నుం, బనిగొనఁ దలఁచిన నేలెడి, దనుమానము గలిగెనేని నరిగెద నధిపా." భార. విరా. ౧, ఆ. ౨౭౦. "క. మును నీ వచట నచటఁ జేసినబంటుతనంబులెల్లఁ జెప్పఁగ విందుం, గనినఁ గదా నమ్ముదు నవి, యనుమానము నాకు నీకథయస్థితి గనుటన్." భార. విరా. ౫, ఆ. ౧౫. "క. లోకం,బున నెందు లేమి పెల్లం, బనుమానము లేదు తోడరనగునే వానిన్." భార. ఉద్యో. ౨, ఆ. ౧౬౬. "ద్వి. మండలాధిప యనుమాన మింకేల, దండింపఁ బంపు నా తల వరుఁ జూచి." పండి. మహి. పు. ౨౫౦; **5.** ఒక యర్థాలంకారము. చూ. అలంకారము.

**అనుమానించు.** సం. అ. క్రి. **1.** ఊహించు; **2.** సందేహించు. "వ. పాండవులకు మాదిక్కునేఁటి చూడనుం గొలందిగా దనుమానింపకు మిట్లనుం గాక." భార. ఉద్యో. ౩, ఆ. ౨౧౮.

**అనుమాపకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) **1.** అనుమానప్రమాణమున తెలిసికొనువాఁడు; **2.** ఊహించువాఁడు.

**అనుమాసము.** సం. అవ్య. అ. న. ప్రతిమాసమునందు. చూ. అనుమాసికము.

**అనుమితము.** సం. విణ. (అ. ఆ. అ.) **1.** అనుమాన ప్రమాణముచే తెలిసికొనఁబడినది; **2.** ఊహింపఁబడినది.

**అనుమితి.** సం. వి. ఇ. స్త్రీ. **1.** (న్యాయ.) అనుమానమునందు అనుభవభేదము; **2.** ఊహ, ఊహించుట.

**అనుమిత్స.** సం. వి. ఆ. స్త్రీ. అనుమానముచేయు నిచ్ఛ, అనుమానప్రమాణమునఁ దెలిసికొనవలయు ననునిచ్ఛ.

**అనుము.** దే. వి. **1.** ఒప్పు; "క. అమ్మా నే నిన్నేలిన, యమ్ముద్దియగాను బుడమి ననుము దలిర్పన్, ద్రిమ్మరు యయాతియుడిగపుఁ, గొమ్మన్." య. ౫, ఆ. ౧౮౦; **2.** సస్యవిశేషము.—బ. ధాన్యవిశేషము.

**అనుమేయము.** సం. విణ. (అ.ఆ.అ.) **1.** అనుమితి చేయఁదగినది; **2.** ఊహింపఁదగినది. (ప్రారంభములు ఫలానుమేయములు.)

**అనుమోదనము.** సం. వి. అ. న. = అనుమోదము.

**అనుమోదము.** సం. వి. అ. పుం. **1.** సంతోషము; **2.** సమ్మతి, అనుమతి.

**అనుమోదించు.** సం. అ. క్రి. **1.** సంతోషించు; **2.** సమ్మతించు.

అనుయాత. సం. విణ. (ఋ. ఈ-త్రీ. ఋ.) అనుస రించి పోవువాఁడు, వెనుకఁబోవువాఁడు.

అనుయాత్రము. సం. వి. అ. న. సేవకవర్గము, పరి వారము.

అనుయాత్రికుఁడు. సం. వి. అ. పుం. 1. అనుయాయి, అనుచరుఁడు; 2. సేవకుఁడు. చూ. ఆనుయాత్రి కుఁడు.

అనుయానము. సం. వి. అ. న. 1. అనుసరించిపో వుట, వెనుకఁబోవుట. "చ. మన మలరంగ నిల్చి జనమాన్యునిఁగా ననుఁజేసి ప్రీతి నే ననుపఁగ వచ్చి చేయు మనుయానము యజ్ఞతురంగరక్ష కై." భార. అశ్వ. ౪, ఆ. ౯౪.

అనుయాయి. సం. విణ. (న్. ఈ-సీ. న్.) 1. అను సరించి పోవువాఁడు; 2.సమానుఁడు; 3.ముఖ్యుఁ డగు గురువు మొదలగువారిని అనుసరించి ప్రవ ర్తించువాఁడు. (శిష్యుఁడు.)

అనుయుక్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అడుగఁ బడినది, ప్రశ్న చేయఁబడినది; 2. ఆజ్ఞాపింపఁబడి నది.

అనుయోక్త. సం. వి. ఋ. పుం. 1. భృత్యకోపాధ్యా యుఁడు; 2. ఉపాధ్యాయుఁడు.—విణ. (ఋ. ఈ - త్రీ. ఋ.) ప్రశ్న సేయువాఁడు, అడుగు వాఁడు.

అనుయోగము. సం. వి. అ. పుం. 1. అడుగుట, ప్రశ్నము; 2. ప్రయత్నము, పూనిక.

అనుయోగి. సం. విణ. (న్.ఈ-సీ.న్.) ప్రశ్నించు వాఁడు.

అనుయోజనము. సం. వి. అ. న. ప్రశ్నము, అడు గుట.

అనుయోజ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్ర శ్నింపఁదగినది, అడుగఁదగినది; 2. ప్రశ్నింప శక్యమైనది; 3. ఆజ్ఞాపింపఁదగినది.

అనుయోజ్యుఁడు. సం. వి. అ. పుం. (ప్రభువుచేత ఏమిచేసితివి, ఎట్లుచేసితివి, అని అడుగఁదగిన వాఁడు.) 1. సేవకుఁడు; 2. దాసుఁడు.

అనురంగత్. సం. శత్రం. ప్రకాశించుచున్నది. "ద్వి.సంగతపింగళోత్తుంగజటాను, రంగద్భుజంగ విరాజిత సతత, వినతసిద్ధామరావిర్భవమహిమఁ, బొనరు." పండి. వాద. పు. ౨౨౪.

అనురంజకుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. రంజింపఁ జేయువాఁడు; 2. అనురాగము గలుగునట్లు చేయువాఁడు.

అనురంజనము. సం. వి. అ. న. రంజింపఁజేయుట, సంతోషపెట్టుట.—విణ. (అ.ఈ-సీ.అ.) రంజిం పఁజేయునది, సంతోషపెట్టునది.

అనురంజితము. సం. విణ. (అ. ఆ. అ.) రంజింపఁ జేయఁబడినది, సంతోషపెట్టఁబడినది.

అనురక్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అనురాగము గలది, ప్రేమగలది; 2. ఎఱ్ఱనిరంగుగలది, ఎఱ్ఱబడి నది. "కుండలమణిప్రభానురక్తగండస్థలుఁడు."

అనురక్తి. సం. వి. ఇ. స్త్రీ. అనురాగము, ప్రేమము.

అనురణనము. సం. వి. అ. న. 1. ఘంటాదిశబ్దము వలనఁగలిగిన ప్రతిధ్వని; 2. ధ్వని; 3. వ్యంజ నమను శబ్దశక్తి.

అనురతి. సం. వి. ఇ. స్త్రీ. 1. అనురాగము; 2. ఆసక్తి.

అనురతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. అనురాగ మునుపొందినవాఁడు; 2. ఆసక్తిగలవాఁడు.

అనురాగము. సం. వి. అ. పుం. 1. అత్యంతప్రేమ ము; 2. స్నేహము.—విణ. (అ.ఆ.అ.) ఎఱుపు రంగు పొందినది.

అనురాగి. సం. విణ. (న్.ఈ-సీ.న్.) అనురాగము గలవాఁడు.

అనురాగించే. సం. అ. క్రి. అనురాగముగలవాఁ డగు, అనురాగముగలదియగు. "వ. అప్పాండు గురుజనంబులయెడఁ బాటించిన వినయంబు వర్ణించి యనురాగించుచుండిరని చెప్పిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె." భార. భీష్మ. ౧, ఆ. ౧౭౦.

అనురాధ. సం. వి. ఆ. స్త్రీ. (ఇరువదియేడునక్షత్ర ములలో) పదియేడవనక్షత్రము.

అనురుద్ధము. సం. విణ. (అ.ఆ.అ.) 1. అపేక్షింపఁ బడినది; 2. అనుసరింపఁబడినది; 3. నిరోధింపఁ బడినది, అడ్డఁబడినది; 4. తొందఱపెట్టఁబడినది.

అనురుద్ధుఁడు సం. విణ. (అ.ఆ.అ.) **1.** అనుసరింపఁబడినవాఁడు; **2.** అనుసరించువాఁడు. "తే. కామభోగములకు సదేకాంతగృహముఁ, బోలి పొలిచి యుం ధర్మార్థములకు నిధియ, యాస్పదంబు నా పర్గత్రయానురుద్ధు, లైన జనులకెంతయు నొప్పు నప్పురంబు." భార. ఆది. ౮, ఆ. ౭౪.

అనురుధ్యమానుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) **1.** అనుసరింపఁబడుచున్నవాఁడు; **2.** నిరోధింపఁబడుచున్నవాఁడు; **3.** తొందఱపెట్టఁబడుచున్నవాఁడు.

అనురూపము. సం. వి. అ. న. **1.** రూపసామ్యము; **2.** యోగ్యత.—విణ. (అ. ఆ. అ.) **1.** అనుగుణము, తగినది; **2.** రూపమునకుఁ దగినది.

అనురోధము. సం. వి. అ. పుం. **1.** అనువర్తనము, అనుసరించుట; **2.** పెద్దలయిష్టము నెఱవేర్పవలయునని యిచ్ఛ; **3.** ప్రతిబంధము, అడ్డు.

అనురోధి. సం. విణ.(న్. ఈ.నీ.న్.) **1.** అపేక్షించువాఁడు; **2.** అనుసరించువాఁడు; (సమయానురోధి); **3.** ప్రతిబంధించువాఁడు, అడ్డువాఁడు.

అనులాపము. సం. వి. అ. పుం. **1.** ముహుర్భాషణము, మాటిమాటికి చెప్పుట, మరలమరలఁ జెప్పుట; **2.** మాటిమాటికిఁ జెప్పెడుమాట.

అనులిప్తుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) చందనాదులు పూసికొన్నవాఁడు. "స్నాతానులిప్తుఁడు."

అనులేపనము. సం. వి. అ. న.=అనులేపము.

అనులేపము. సం. వి. అ. పుం. **1.** చందనాదుల పూఁత; **2.** పూఁతకు సాధనమైన చందనాది ద్రవ్యము.

అనులోమజుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పైవర్ణమందలి పురుషునకును క్రిందివర్ణమందలి స్త్రీకినిఁ బుట్టినవాఁడు.

అనులోమము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** క్రమమును అతిక్రమింపనిది; పైనుండి క్రిందికి క్రమముగా నున్నది; **2.** రోమములకు ఎదురుకానిది.—అవ్య. అ. న. క్రమము ననుసరించి.

అనువదించు. సం. స. క్రి. **1.** ఒకరనిన దానిని మరల నను; **2.** ఒకభాషలోని విషయమును మఱియొక భాషలోనికి మార్చు.

అనువయించు. సం. స. క్రి. (బట్టలు)నేయు. "అనియిట్లు నాగకులంబునెల్ల స్తుతియించి యందు సితాసితతంతుసంతానపటంబు ననువయించుచున్నవారి నిద్దఱస్త్రీలను." భార. ఆది. ౧, ఆ. ౧౦౯.

అనువరి. దే. విణ. (అనువు+అరి.) **1.** ఉపాయశాలి. "చ. అనుటయుఁ జిత్రరేఖ దనుజాధిపనందనతోడ నిట్లనున్, నినుఁ గలలోనఁ బైఁబడిన నేర్పరి ముచ్చునెఱుంగుదేని నయ్యనువరిరూపుఁ గైవడియు నన్వయమును జరితంబుఁ జెప్పుమా, విని ప్రియుఁ దార్చెదన్ మనము వేడుక దీర్చెదఁ గాము నోర్చెదన్." ఉ. హరి. ౫, ఆ. ౧౦౦. **2.** అనుకూల్యము కలవాఁడు.

అనువర్ణించు. సం. స. క్రి. వచించు, చెప్పు. "క. తొమ్మిది ఖండములై వర్షమ్ములనంజాల నొప్పె సంగు జంబూద్వీపమ్మున జనపదములు విను, మమ్మహితాంశములు దెలియ ననువర్ణింతున్." భార. భీష్మ. ౧, ఆ. ౨౪.

అనువర్తనము. సం. వి. అ. న. **1.** అనుసరించిపోవుట; **2.** అనుసరించుట; **3.** పూర్వసూత్రమునందలి పదము ఉత్తరసూత్రములోనికి అన్వయార్థము వచ్చుట.

అనువర్తించు. సం. స. క్రి. **1.** అనుసరించి నడచు; **2.** అనుసరించు.

అనువాకము. సం. వి. అ. పుం. వేదవిభాగము. (ఆశ్వాసము, ప్రకరణము, మొదలగు వానివంటిది.) "ఒక అనువాకము స్వస్తిచెప్పుఁడు."

అనువాదకుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) (అనువదించువాఁడు) **1.** ఒకఁడుచెప్పినది మరలఁ జెప్పువాఁడు; **2.** ఒకభాషయందలి విషయమును భాషాంతరమున రచించువాఁడు.

అనువాదము. సం. వి. అ. పుం. **1.** ఒకరు చెప్పిన దాని మరలఁ జెప్పుట; **2.** ఒకభాషలో నున్న దానిని మఱియొకభాషలో రచించుట, భాషాంతరీకరణము.

అనువాది. సం. విణ. (న్.ఈ.నీ.న్.) (అనువదించువాఁడు.) **1.** ఒకఁడు చెప్పినదానిని మరలఁ జెప్పువాఁడు; **2.** భాషాంతరీకరించువాఁడు.

అనువారము. సం. అవ్య. న. మాటిమాటికి. "ఉ. వానిదిగాక జన్మ మనువారము నీరమణీలలామ య,య్యో నగుబాటుగా నతనియొద్దకు నెచ్చెలిఁ బంచి పంచినం, దా నిటు రాక వేటిమి యొనర్చు నొ నావల పంచు నించు వి,ల్కానికి లొంగి నెమ్మదిఁ దలంచుకొనక వలపించె నెవ్వఁడో." కుప. 3, ఆ. ౩౮.

అనువిద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) కూడినది, సంసృష్టము, కలసియున్నది.

అనువు. దే. వి. 1. ఉపాయము. 'క. తనువునవిటి గినయమ్ములు, ననువునఁ బుచ్చంగవచ్చు నతినిష్ఠురతన్, మనమున నాటినమాటలు, విను మెన్ని యుపాయములను వెడలునె యధిపా." భార. ఉద్యో. ౨, ఆ. ౬౨; 2. విధము. "క. మనపని దనపని దనపని, మనపనిగా నడతు మతఁడు మనము నొకఁడు మో, చినమో పిద్దఱు మోచిన యనువున నీతోడుపడుట యతనికిఁ గీడే." ఉ, హరి. ౫, ఆ. ౭౯౮; 3. అనుకూల్యము, వీలు, అవకాశము. "వ. కలభాషిణి కంఠంబు నకుఁ దనకంఠంబు నడ్డంబుచేర్చి ప్రేటున కనువీక దాని నిరుగేలం బొదుగఁబట్టుకొని." కళా. 3,ఆ.౧౨౦; 4. సొగసు.—విణ. 1. యుక్తము. "క. విను చనివించినయతఁడుక, దన తండ్రియు నొక్కరూపు తలఁపఁగ నదిగా,వున నీవు నాకుఁ జెల్లెల, వనువగునా యిట్టిమాటలాడఁగ నీకుక." య. 3, ఆ. ౧౫౭; 2. అనుకూలము; 3. సిద్ధము.

అనువుచేయు. ద్వి. స. క్రి. సిద్ధపఱచు, సన్నద్ధము చేయు, సన్నాహముచేయు. "క. కురుపతి పడవాళ్లం దగు, దొరలకడకు సత్వరముగ దురమునకు భటో,త్కరము ననువుచేయుటకై, బరవసము దలిర్పఁ బనిచెఁ బార్థివముఖ్యా." (సం. అబ్రవీత్తావకాన్సర్వాన్ సన్నహ్యస్వాం మహారథాః.) భార. శల్య. ౧, ఆ. ౯౯.

అనువుపడు. ద్వి. అ. క్రి. సరిపడు, తగు.

అనువృత్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. శీలము ననుసరించియున్నది; 2. క్రమముగా వర్తులాకారమైనది; 3. (వ్యాక.) అన్వయార్థము పూర్వసూత్రమునుండి పరసూత్రములోనికి గ్రహింపఁబడినది. (పదము.)

అనువృత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. అనుసరించుట; 2. సేవించుట; 3. (వ్యాక) ఒకసూత్రమునుండి తర్వాత సూత్రములోనికి అన్వయమునకై పదమును గ్రహించుట.

అనువేలము. సం. అవ్య. అ. న. అనుక్షణము, క్షణక్షణమందు, ఎప్పుడును.

అనువేశము. సం. వి. అ. పుం. పెద్దవానికి వివాహము కాకుండఁగనే చిన్నవానికి వివాహము చేయుట.

అనువేశ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ప్రక్కయింట నున్నవాఁడు, ఇరుగుపొరుగువాఁడు.

అనువ్రజనము. సం. వి. అ. న. వెంబడించిపోవుట, ఇంటనుండి బయలుదేరి పోవుచున్న స్నేహితులు మొదలగువారిని సాగనంపుటకు జలసమీపము దాఁకపోవుట.

అనువ్రజ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. అనుసరించిపోవుట; 2. సేవించుట.

అనువ్రతుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. అనుకూలమగు పనిచేయువాఁడు, అనుకూలుఁడు; 2. ఒకరు చేసిన వ్రతము ననుసరించి వ్రతముచేయువాఁడు.

అనుశయము. సం. వి. అ. పుం. 1. పశ్చాత్తాపము; 2. మిక్కిలి ద్వేషించుట; 3. పూర్వవైరము; 4. అనుబంధము.—విణ. (అ. ఆ. అ.) హస్తము ననుసరించియున్నది.

అనుశాయి. సం. వి. న్. పుం. పుణ్యపాపరూపకర్మములకు ఫలభూతములైన స్వర్గనరకాదుల ననుభవించినపిమ్మట శేషించిన పుణ్యపాపములవాసన గలవాఁడు. (శ. ర.)

అనుశాసనము. సం. వి. అ. న. 1. యథార్థస్థితి తెలుపుట; 2. నిరూపించుట; 3. చేయఁదగిన దాని నుపదేశించుట, సలహా; 4. ఆజ్ఞ, అనతి.

అనుశాసి. సం. విణ. (న్.ఈ.నీ.న్.) 1. చేయఁదగినది ఉపదేశించువాఁడు; 2. శిక్షించువాఁడు.

అనుశాసించు. సం. స. క్రి. శిక్షించు, దండించు. "క. ఈసున దుర్యోధనదు,శ్శాసను లొగిఁ బాండవులకు సభలో నెగ్గుల్, సేసిన విని వారల నను,శాసింపఁగ వలవ దనఁగఁ,జనదే నీకుక." భార,

అర. ౧, ఆ. ౩౮౩. "క. మునినాథుఁడు వచ్చి ధర్మమున నాతనిఁదా,ననుశాసించుఁ దిరంబుగ." భార. అర. ౧, ఆ. ౯౦; 2. ఉపదేశించువాఁడు.

అనుశాసిత. సం. విణ. (ఋ.ఈ-త్రీ.ఋ.) చేయఁదగినదాని నుపదేశించువాఁడు.

అనుశాస్త. సం. విణ. (ఋ.ఈ-స్త్రీ.ఋ.) = అనుశాసిత.

అనుశిష్టుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఉపదేశింపఁబడినవాఁడు; 2. దండింపఁబడినవాఁడు.

అనుశీతము. సం. విణ. (అ.ఆ.అ.) చల్లనిది. "మ. అనుశీతాచ్ఛజలంబులోఁ బొలయు మత్స్యశంకఁ బుట్టింప లోచనయుగ్మంబు సుధారస ప్రచలితాబ్జభ్రాంతి సంధిల్ల నాననపద్మం బగజాత నిల్చె." కు. సం. ౭, ఆ. ౬౯.

అనుశీలనము. సం. వి. అ. న. 1. నిరంతరాధ్యయనము, ఎప్పుడును అభ్యసించుట; 2. ప్రాచీనగ్రంథము పరిశోధించుట.

అనుశ్రుతి. సం. వి. ఇ. స్త్రీ. 1. వినికిడి; 2. సంప్రదాయము; 3. ప్రస్తావవిషయము ననుసరించిన యితరజనసంభాషణములవినికి. శ. ర.

అనుషంగము. సం. వి. అ. పుం. 1. దయ, కనికరము; 2. ప్రధానకార్యమునకుఁ బోవుచుండఁగా నడుమ సంభవించు నితరకార్యము; 3. చేరిక; 4. తగులు.

అనుషంగి. సం. విణ. (న్.ఈ-నీ.న్.) (అనుషంగము గలది.) 1. ఎప్పుడును కలసియుండునది; 2. వ్యాపించినది.

అనుషక్తము. సం. విణ. (అ. ఆ. అ.) సంలగ్నము, తగులుకొనినది.

అనుషక్తి. సం. వి. ఇ. స్త్రీ. సంబంధము, కూడిక. "ద్వి. సతతసాన్నిధ్యానుషక్తిమై." బస. ౨, ఆ. పు. ౪.

అనుషక్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అనుషంగము గలవాఁడు, కూడినవాఁడు. "ద్వి. కిన్నరేశ్వరవంద్యుఁ డన్నారదాది, సన్నుతనాదాను షక్తుఁడు మెచ్చి, పరగంగ." బస. ౫, ఆ. పు. ౧౪౨.

అనుష్టుప్పు. సం. వి. భ్. స్త్రీ. 1. ఒక ఛందస్సు. (ఇందు పాదమునకు ఎనిమిదిఅక్షరములుండును;) 2. సరస్వతి.

అనుష్ఠాత. సం. విణ. (ఋ. ఈ-త్రీ.ఋ.) 1. అనుష్ఠానము చేయువాఁడు; 2. చేయువాఁడు.

అనుష్ఠానము. సం. వి. అ. న. 1. విహితకర్మము చేయుట; 2. చేయుట.

అనుష్ఠించు. సం. స. క్రి. 1. ఆచరించు, చేయు. "వ. భూసురోత్తములు దమ్ముం బరివేష్టించి యుండఁ దా రనుష్ఠింపం బూనినపని వారల కెఱింగింపం దలంచి." భార. విరా. ౧, ఆ. ౪౬; 2. పఠించు, చదువు; "ద్వి. నే వేదమంత్రైన నెత్తియం దొక్క,తా వనుష్ఠింపుమా యీవిప్రునెదుర." బస. ౭, ఆ. పు. ౨౧౨.

అనుష్ఠితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. విధిప్రకారము చేయఁబడినది; 2. చేయఁబడినది.

అనుష్ఠేయము. సం. విణ. (అ. ఆ. అ.) అనుష్ఠింపఁదగినది, చేయఁదగినది.

అనుష్ణము. సం. వి. అ. న. ఉత్పలము, నల్లకలువ. —విణ. (అ.ఆ.అ.) (ఉష్ణముకానిది.) 1. చల్లనిది; 2. అలసము, చుఱుకులేనిది.

అనుష్ణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉష్ణములేనివాఁడు; 2. చుఱుకుఁదనము లేనివాఁడు.

అనుసంధాతవ్యము. సం. = అనుసంధేయము.

అనుసంధానము. సం. వి. అ. న. 1. అన్వేషణము, వెదకుట; 2. చింతనము, స్మరణము; 3. కూర్చుట; 4. బోధపఱచుకొనుట, మనసునకుఁ బట్టించుకొనుట.

అనుసంధించు. సం. స. క్రి. 1. నియమించు, ఏర్పఱచు. "వ. ఏ మనుసంధించినపనికి నీకు భయంబేల చతుర్విధభూతకోట్ల నుపసంహరింపుమనిన." భార. ద్రో. ౨, ఆ. ౧౭౫; 2. బోధపఱచుకొను, మనస్సునకుఁ బట్టించుకొను. "వ. భారతరణప్రకారం బనుసంధించి యతండు కతిపయదినంబులకుం జనుదెంచి తగినతెఱంగునం గాంచి." భార. భీష్మ. ౧, ఆ. ౪౪; 3. కూర్చు, సంఘటింపఁజేయు.

అనుసంధేయము. సం. విణ. (అ.ఆ.అ.) అనుసంధానము చేయఁదగినది.

అనుసరణము. సం. వి. అ. న. 1. అనుసరించి పోవుట; 2. పోలుట.

అనుసరించేు. సం. స. క్రి. 1. వెంటఁబోవు, వెంబడించు; 2. అనుకరించు, ఒకరు చేయునట్లు చేయు.

అనుసారణ. సం. వి. ఆ. స్త్రీ. వెంటఁ బరుగెత్తుట.

అనుసారణి. సం. వి. ఈ. స్త్రీ. (సారణిని అనుసరించినది.) రెండవసారణి. (వీణెతీఁగెలలో షడ్జ స్వరము పలుకుతీఁగె సారణి.)

అనుసారము. సం. వి. అ. పుం. 1. అనుసరించుట; 2. తెల్లతుమ్మ*.

అనుసారి. సం. విణ. (న్. ఈ. ణీ. న్.) 1. అనుసరించువాఁడు, వెంబడించిపోవువాఁడు; 2. పోలువాఁడు.

అనుసు. దే. వి. గదాదండాదులకు అమర్చెడు పొన్ను. "తే. తళుకుఁబు త్తడియనుసుబెత్తంపుఁ గట్టెఁ, బట్టి సేనాధిపతి బరాబరులు సేయ." చంద్రా. ౧, ఆ. ౬౯.

అనుసృతి. సం. వి. ఇ. స్త్రీ. అనుసరించుట.—ఈ. కులట, రంకుటాలు.

అనుసృష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఒకదాని ననుసరించి సృజించుట; 2. ప్రత్యుత్పన్నమతియగుస్త్రీ, అప్పటికప్పుడు తగిన సమాధానము చెప్పుటకు యుక్తి తోఁచుస్త్రీ, యుక్తిపరురాలు.

అనుస్మరణము. సం. వి. అ. న. తలంచుట.

అనుస్మృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. తెంపులేకుండఁగా స్మరించుట; 2. స్మరించుట.

అనుస్యూతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కూర్పఁబడినది; 2. గ్రువ్వఁబడినది; 3. నిత్యసంబంధము కలది.

అనుస్వారము. సం. వి. అ. పుం. (స్వరమును (=అచ్చును) అనుసరించి యుండునది.) బిందువు, సున్న.

అనుహారము. సం. వి. అ. పుం. 1. అనుకారము, అనుకరించుట; 2. ఒకదాని తర్వాత తీసికొనిపోవుట.

అనుహార్యము. సం. విణ. (అ.ఆ.అ.) సమానముగాఁ జేయఁదగినది.

అనుహృతము. సం. విణ. (అ.ఆ.అ.) 1. అనుకరింపఁబడినది; 2. సమానముగాఁ జేయఁబడినది.

అనుహోడము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఓడ ననుసరించియున్నది; 2. ఓడయందు దున్నది.

అనూకము. సం. వి. అ. న. 1. కులము; 2. శీలము.—పుం. పూర్వజన్మము.

అనూచానుఁడు. సం. వి. అ. పుం. 1. అంగముల తోడ వేదాధ్యయనము చేసిన బ్రాహ్మణుఁడు; 2. వేదార్థము చెప్పఁగలవాఁడు.—విణ.(అ.ఆ.అ.) వినయముగలవాఁడు.

అనూచ్యము. సం. విణ. (అ.ఆ.అ.) 1. అనువచింపఁదగినది; 2. తరువాత పఠింపఁదగినది.

అనూఢ. సం. వి. ఆ. స్త్రీ. పెండ్లికానిస్త్రీ, కన్యక.

అనూఢుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వివాహము కానివాఁడు, అవివాహితుఁడు.

అనూదితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. అనువదింపఁబడినది, అనుసరించి పలుకఁబడినది; 2. భాషాంతరీకరింపఁబడినది.

అనూనము. సం. విణ. (అ. ఆ. అ.) (ఊనము కానిది.) 1. తక్కువకానిది, పరిపూర్ణము; 2. హీనముకానిది. గొప్పది; 3. (న+నూన.) నిశ్చయము కానిది.

అనూపజము. సం. వి. అ. న. (జలప్రాయప్రదేశమున పుట్టునది.) అల్లము.

అనూపము. సం. వి. అ. పుం. 1. ఒకానొక దేశము; 2. ఎనుఁబోతు.—విణ. (అ. ఆ. అ.) నీటి సమృద్ధికలది. (నద్యాదిసమీపప్రదేశము.)

అనూరాధ. సం. = అనురాధ.

అనూరుఁడు. సం. వి. ఉ. పుం. గరుడుని యన్న, సూర్యసారథియగు అరుణుఁడు.—విణ. ఉ. తొడలు లేనివాఁడు.

అనూరువు. సం. = అనూరుఁడు.

అనూరుసారథి. సం. వి. ఇ. పుం. (అనూరుఁడు సారథిగాఁగలవాఁడు.) సూర్యుఁడు.

అనృజుఁడు. సం. విణ. (ఉ.ఈ.జ్వీ. ఉ.) 1. శఠుఁడు, మూర్ఖుఁడు; 2. కుటిలుఁడు, మోసము చేయువాఁడు.

అనృజువు. సం. = అనృజుఁడు.

అనృణి. సం. విణ. (న్. ఈ.నీ. న్.) ఋణికాని వాఁడు, ఋణములేనివాఁడు.

అనృణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) (ఋణము లేనివాఁడు.) అప్పులేనివాఁడు.

అనృతము. సం. వి. అ. న. **1.** అసత్యము, అబద్ధపు మాట; **2.** కృషి.—విశ. (అ. ఆ. అ.) అసత్యమైనది, అబద్ధమైనది.

అనృతవాది. సం. విశ. (న్. ఈ-నీ.న్.) అసత్యము పలుకువాఁడు.

అనృశంసుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) హింస చేయనివాఁడు, దయాశీలుఁడు.

అనేకపము. సం. వి. అ. పుం. ద్విపము, ఏనుఁగు.

అనేకము. సం. విశ. (అ. ఆ. అ.) **1.** ఒకటికంటె భిన్నమైనది, రెండుమొదలగునది. (సంఖ్య;) **2.** ఒకటిని మించినది. (వస్తువు మొ.)

అనేకాంతము. సం. విశ. (అ. ఆ. అ.) **1.** నియమము లేనిది; **2.** నిశ్చయమైన ఫలము లేనిది.

అనేడమూకుఁడు. సం. విశ. (అ.ఆ.అ.) **1.** చెవిటి మూఁగ, చెవుడును మూఁగతనమునుగూడఁ గల వాఁడు; **2.** మోసకాఁడు.

అనేడుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) అవివేకి, వివేకము లేనివాఁడు.

అనేహము. సం. వి. స్. పుం. = కాలము, సమయము.

అనేహస్సు. సం. = అనేహము.

అనైకాంతికము. సం. విశ. (అ.ఈ-కీ.అ.) (న + ఏకాంతిక.) **1.**నిశ్చితము కానిది; **2.** నియతమగు ఫలములేనిది.

అనైకాగ్ర్యము. సం. వి. అ. న. ఏకాగ్రత లేమి, చంచలత.

అనైక్యము. సం. వి. అ. న. **1.** ఐక్యములేమి; **2.** భేదభావము.

అనోకహము. సం. వి. అ. పుం. (బండియొక్కనడకను అడ్డగించునది.) మ్రాను, వృక్షము.

అన్చు. దే. చూ. అంచు.

అన్న. దే. లేక వై. వి. (సం. జనకః. మ. జన్నో.) **1.** తండ్రి. "తే. తల్లి బోధించుఁ దత్పరత్వంబు గలిగి, యన్న మాయన్న చెప్పినయట్ల చేయు, ధూర్తసంగతి విడువు సాధువులతోడఁ, బరిచయము సేయు మని పుత్త్రు ననుదినంబు." కాశీ. ౪, ఆ. ౧౩; **2.** (తండ్రితో సమానుఁడు.) అగ్రజుఁడు, తనకంటె పెద్దవాఁడగు సోదరుఁడు; **3.** వాత్సల్యమును దెలుపును, పుత్త్రుఁడు తమ్ముఁడు మొదలగువారిని సంబోధించినపు డుపయుక్తము. కుమారుని సంబోధించుటకు: "సీ. కద్రువ కొడుకులకడ కేఁగి యేను మి మ్మందఱ వేఁడెద నన్నలార, నాపంపు సేయుండు నన్ను రక్షింపుఁడు కామచారులకు దుష్కరము గలదె." భార. ఆది. ౨, ఆ. ౩౪. తమ్ముని సంబోధించుటకు: "సీ. అన్న దుశ్శాసన నిన్ను రాజ్యము నకుఁ బట్టంబుగట్టెదఁ బతివి గమ్ము." భార. అర. ౬, ఆ. ౨౩. శిష్యుని సంబోధించుటకు: "సీ. అతని యస్త్రవిద్యాభియోగమునకుఁ, బ్రియశిష్యవృత్తికిఁ బెద్ద మెచ్చి, యన్న ధనుర్ధరు లన్యులు నీకంటె, నధికులు గాకుండునట్లుగాఁగఁ, గఱపుదు విలువిద్య ఘనముగా నని పల్కి." భార. ఆది. ౫, ఆ. ౨౩౧.—అవ్య. ఆశ్చర్యవిషాదాదులను తెలుపును. ప్రాయికముగా అన్నా! అనురూపమున నుండును. "అన్న(అన్నా!) ఎంతపని జరిగినది!" —(వ్యాక.) ప్రార్థనాద్యర్థమును తెలుపు వ్యతిరేక క్రియలమీఁద అనుప్రయుక్తము. ఎదాదుల లోనిది. "ఉ. వెన్నుఁడు ప్రీతిఁజెప్పినసవిస్తర వాక్ప్రచయంబు త్రోవఁ బో, వన్న కుమార యట్లయిన నాయువు శ్రీయును నీకుఁ గల్గు మా,కన్నులు సల్లగా నకట గన్గొనుచుండుదు." భార. ఉద్యో. ౩, ఆ. ౩౪౮.

అన్నకిట్టము. సం. వి. అ. న. అన్నమలము, తిన్నయన్నము జఠరాగ్నిచే పక్వమైన తరువాత యేర్పడినమలము.

అన్నకోశము. సం. వి. అ. పుం. అన్నము జీర్ణమగు తిత్తి.

అన్నగంధి. సం. వి. ఇ. స్త్రీ. ఆమరోగ విశేషము, అజీర్తివలనకలిగిన విరేచనములు.

అన్నగళు. దే. వి. బ. (త. అణ్ణగళ్.) కంచుకి, అంతఃపురపుఁ గావలివాఁడు, కట్టికవాఁడు, వేత్రహస్తుఁడు. (అన్నగళు, అన్నగారు, కట్టికవాఁడు, కంచుకి పర్యాయములుగా నుపయుక్తములు. 'అన్నగళమాట' అని యొకచోఁగలదు. అది షష్ఠీసమాసమని తోఁచెడిని. శ.ర. లో 'అన్నగళ' అని ప్రథమావిభక్తిగా గ్రహింపఁబడెను.) "అన్న

గార్లు వచ్చిరట ఎటువలె: వ. నిడుదకుళ్లాయలు నిండుచొగలుఁబూని నడిసన్న యన్నగార్లు సముఖానకు వచ్చిరి. వ. ఈరీతిని జేరవచ్చిన యన్నగార లన్నరనాథునకు మ్రొక్కి ఏమని విన్నవించుచున్నారు: అన్నగళమాట - సామీ, పరాకు...రారోయికంచుకులారా...కటికవారల మాట......" మన్నారు. పు. ౪. "అన్నగళు మాట - గడియారం గడియారం." మన్నారు. పు. ౩౧.

అన్నగార్లు. దే. 1. = అన్నగళు; 2. పూజ్యులయిన జ్యేష్ఠసోదరులు.

అన్నదమ్ములు. దే. వి. బ. అన్నయును తమ్ముఁడును.

అన్నదాత. సం. విణ. (ఋ.ఈ-త్రీ. ఋ.) అన్నము పెట్టువాఁడు, అన్నదానము చేయువాఁడు.

అన్నన్న. దే. అవ్య. (అన్న+అన్న.) ఆశ్చర్యమును దెలుపునది. "క. అన్నన్న మొగము వెన్నుని, యన్నన్న జయించుఁ గన్ను లన్న న్నలినా, సన్నములు నడుము మిక్కిలి, సన్నము మాటలు సుధాప్రసన్నము లెన్నన్." విజ. ౧, ఆ. ౭౩.—వి. (అన్ను + అన్న.) (నుగాగమాభావము. అన్నునన్న అనుట యుక్తము.) భార్యకు సోదరుఁడు. (చూ. పైయుదాహరణము: వెన్నునియన్నన్న=విష్ణునిభార్యకు సోదరుఁడు. (చంద్రుఁడు).

అన్ననా్న. దే. = అనా్న.

అన్నపానము. సం. వి. అ. న. అన్నపానములసమాహారము. (తినుటకు తిండియును, త్రాగుటకు నీరును.)—బ. అన్నమును, పానమును. (తెనుఁగున బహువచనాంతముగానే ఉపయోగము.)

అన్నప్రాశనము. సం. వి. అ. న. 1. ఆఱవనెలలోగాని, ఎనిమిదవనెలలోఁగాని బిడ్డలకు మొదట అన్నము తినిపించెడి సంస్కారము, స్మృతి విహితము లగు షోడశకర్మలలో నొకటి; 2. అన్నము తినుట.

అన్నప్రాశము. సం. = అన్నప్రాశనము.

అన్నభేది. సం. వి. ఇ. స్త్రీ. (అన్నమును భేదించునది.) అన్నమును జీర్ణముచేసెడి యొకానొక పదార్థము.

అన్నమయము. సం. వి. అ. పుం. పంచకోశములలో నొకటి. చూ. కోశము.)—విణ. (అ. ఈ-యా.అ.) 1. అన్నవికారమైనది; 2. అన్నముతో నిండినది.

అన్నమలము. సం. = అన్నకిట్టము.

అన్నము. సం. వి. అ. న. (జీవింపసాధనమైనది, లేక తినఁబడునది.) 1. ఉడికించిన బియ్యము, వంటకము; 2. ధాన్యము; 3. సస్యము.—విణ. (అ.ఆ.అ.) తినఁబడ్డది.

అన్నరసము. సం. వి. అ. పుం. 1. అన్నముయొక్క సారము; 2. అన్నముయొక్క రుచి; 3. గంజి.

అన్నశాంతి. సం. వి. ఇ. స్త్రీ. అన్నముతో శాంతి చేయుట, అన్నదానముచే తృప్తిపఱచుట.

అన్నసంప్రాశనము. సం. = అన్నప్రాశనము. "సీ. గృహనిష్క్రమంబు సాగించిరి నాల్గవమాసంబునందుఁ గుమారునకును, వత్సరార్ధమునందు వాలాయముగఁ జేసి రన్నసంప్రాశనం బర్భకునకు." కాశీ. ౪, ఆ. ౧౩.

అన్నసూక్తము. సం. వి. అ. న. అన్నమును, అన్నదానమును గుఱించి స్తుతించు మంత్రముల భాగము. (శ్రాద్ధాదులయందు అన్నశుద్ధ్యర్థము దీనిని పఠింతురు.)

అనా్న. దే. = అన్న.

అనా్నదమ్ములు. దే. = అన్నదమ్ములు. "క. సన్నిధిఁ బన్నగహారుఁడు, పెన్నిధిఁ గని పొంగుచున్న పేదల క్రియ న,య్యనా్నదమ్ములఁ గని మీ, కెన్నఁగ." ఉ. హరి. ౪, ఆ. ౧౫.

అన్ని. ద్వి. స. వి. (అంత శబ్దమునకు అమహదర్థక బహువచనరూపము.) 1. అంతసంఖ్యగలవి; 2. సమస్తము. (ఈయర్థమున 'అన్నియు' అనుట ప్రాయికము.)—వి. అల్లిక మొదలు.

అన్ను. దే. వి. 1. ఒడలెఱుంగమి, పరవశమగుట. "ద్వి. నిన్ను నీవెఱుఁగక యన్నెక్కి క్రొవ్వి, మన్నీశ్వరార్థమై యున్నపూవునకుఁ, జాఁచినచెయ్యేది సక్కన నపుడు,చాఁచినట్లే చాఁపు చాఁపు రమ్మనుచు." బస. ౪, ఆ. పు. ౧౨౧. "ఉ. కన్నుల నిద్ర దేఱఁగ నకంపితుఁడై యతఁ డెంత చేసినన్, దన్ను నెఱుంగ కొక్క మొగిఁ దక్కపి

సైన్యచయంబుఁ బోరఁ బే, రన్నున మ్రింగఁ జొచ్చె." భార. అర. ౭, ఆ. ౧౦౦; 2. ఆఁడుది; 3. భార్య. చూ. అన్నన్న. వి.

అన్నుకొను. దే. అ. క్రి. ఒడలెఱుంగకపోవు. "క. సన్నపుఁ దలయేరున మై, యన్నుకొనుచు నాము దిన్నయట్లై రాఁగా." స్వా. ౫, ఆ. ౨౨.

అన్నువ. వై. విణ. (సం. అణు.) 1. సన్నము. "సీ. చపలాక్షిచూపులచాడ్పున కెడ మెచ్చుఁ, జిక్కని చనుఁగవఁ జీఱఁ గోరు, నన్నువకౌఁ దీఁగయందంబు మది నిల్పు, జఘనచక్రం బుపైఁ జలుపు దృష్టి." భార. ఆది. 3, ఆ. ౩౮; 2. అల్పము, చిన్నది. "క. ఇన్నగమునందు గాండీవ, మున్నది యది గాని మద్భుజోద్రేకవిలా, సోన్నతి కోర్వవు పెద్దయు, నన్నువ లీవిండ్లు గుఱుచ లలఁతిబలంబుల్." భార. విరా. ౪, ఆ. ౧౦౫; 3. పిన్న, చిన్నవాఁడు. "ఉ. నన్నును గౌఁగలించుకొని నావదనంబునఁ దన్ నిజాస్య మా, సన్నముఁ జేసి యొక్క మృదుశబ్దము సేసె మనోహరంబుగా, నెన్నఁడు నట్టిశబ్దము మునీశ్వర, ముల్ విని యెఱుంగ, నయ్యన్నువ బ్రహ్మచారిముఖ మం బురుహంబుసమంబు సూడఁగన్." భార. అర. 3, ఆ. ౧౦౭.

అన్నువు. దే. వి. అన్ను, పారవశ్యము. "సీ. నలువ చెందొవల రేకులకు నన్నువు పెట్టఁ గోరి కావించి నగుళిక యనఁగ..."తే. నరుణరుచిఁ దనమండల మతిశయిల్లఁ, బొడిచి దివిఁ బ్రాఁకి దీధితు లడరఁ జేసి, యంతకంతకు నెక్కుచు సంభ్రమసమముఁ, గాలుకొననీక చంద్రుఁడు గ్రాలె నధిప." భార. ద్రోణ. ౫, ఆ. ౨౭౫.

అన్నెకాఁడు. వై. విణ. (అన్నెము + కాఁడు.) అన్యాయకారి, అన్యాయము చేయువాఁడు. "అన్నెకాఁడై వాఁడు నావల పెల్ల నారుదూఱు చేసెనే." క్షేత్రయ.

అన్నెకారి. వై. విణ. అన్యాయకారిణి, అన్యాయము చేయుస్త్రీ. "అన్నెకారిచాడి విన్నాఁడు." క్షేత్రయ.

అన్నెము. వై. వి. అన్యాయము. "ఉ. మున్నొక నాఁడు నంగనలముద్దులసుద్దు లెఱుంగనట్టిచో, నన్నె మిఁకేల." శశాం. ౨, ఆ. (అని శ. ర.) ముద్దులసుద్దు లెఱుంగనట్టిచో, వన్నెలుమీఱు నందమున వావిరి వింతకు వింతయైన." అని ముద్రిత పాఠము. అన్నె మనుటయ సరి. శశాం. ౨, ఆ. ౯౭.—స. అన్యము, వేఱొకటి "నన్నుఁగూడిన నాఁటనుండి యన్నె మెఱుఁగఁడు." క్షేత్రయ. 'ఆమె అన్నెము పున్నెము యెఱుఁగని యమాయకురాలు' మొదలగుచోట పుణ్యేతరము అనఁగా పాపము అని తాత్పర్యము.

అన్ను. దే. = అనుపు. చూ. అంచు.

అన్ము. దే. = అనుము.

అన్యకారుక. సం. వి. ఆ. స్త్రీ. మలములోని పురుగు.

అన్యగామి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) ఇతరులను పొందువాఁడు.

అన్యచిత్తుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఇతరమందు మనస్సు కలవాఁడు; 2. వికలమైన మనస్సు కలవాఁడు.

అన్యతమము. సం. స. (అ. ఆ. అ.) 1. రెంటికంటె నెక్కువవానిలో నొకటి; 2. మఱియొకటి.

అన్యతరము. సం. స. (అ. ఆ. అ.) 1. రెండిటిలో నొకటి; 2. మఱియొకటి.

అన్యత్ర. సం. అవ్య. అన్యస్థలమున, మఱియొకచోట.

అన్యథా. సం. అవ్య. మఱియొకవిధముగ. "ద్వి. అట్లయ్యు, పర్ణనచేసితి వారినకాని, యేయెడ నన్యథా యెఱుఁగ నే ననెడి,యీయొక్క బలిమి మహిమ్మతకలిమి." బస. ౭, ఆ. పు. ౨౪౬.

అన్యథాకరించు. సం. స. క్రి. వేఱుసేయు, మఱియొక విధముగా చేయు, వ్యతిరేకముచేయు. "గీ. గురులలోనఁ బరమ గురువు తల్లియ యట్టి, తల్లి వచనమును విధాతకృతియు, నన్యథాకరింప నలవియె యనిన." భార. ఆది. ౭, ఆ. ౨౫౪. "సీ. ఈశ్వరాజ్ఞాసేతు వెట్లు దాఁటఁగవచ్చుఁ దదధీనులకు నన్యథాకరించి" సై. ౭, ఆ. ౧౦౦.

అన్యథాకలన. సం. వి. ఆ. స్త్రీ. మఱియొక విధముగ అగుట, చెడుట. "చ. తదీయలాభమున

కుం దగు హేతువు లందు రన్యథా,కలనకు సంగ లోపములు గారణమందురు మాంత్రికాథ ముల్." సై. ౭, ఆ. ౭౭.

అన్యథాత్వము. సం. వి. అ. న. వేఱొకవిధముగ అగుట, వ్యతిరేకము. "సీ. నినుఁ బ్రజాసంహారమునకునై కల్పించినాఁడఁ గావున నీమనంబు నందుఁ, బొడము విచారంబు నుడిగింపు మిట్లు గాఁ గలయది యైన యిక్కార్యమునకు, నన్యథాత్వం బెలయగు." భార. ద్రోణ. ౨, ఆ. ౧౭౦. "వ. అప్పశుపతి యతనిపైఁ గరుణార్ద్రంబగు కటాక్షవీక్షణం బొలయ నది యట్లకాక దానికి నన్యథాత్వంబు గలదే యనియె." భార. ద్రోణ. ౨, ఆ. ౩౭౬. "తే. అమ్మ దమయంతి యంతరంగమ్ము లోన, మాను సందియ మీశంపు నగఁడు నీకు, నాఁడె దా నానతిచ్చినవాఁడు బ్రహ్మ, తద్వచనమున కన్యథాత్వంబు గలదె." సై. ౪, ఆ. ౧౦౯.

అన్యథాసిద్ధి. సం. వి. ఇ. స్త్రీ. 1. మఱియొకవిధముగ సిద్ధించుట; 2. తర్కశాస్త్రమునఁ జెప్పిన కారణత్వ ప్రతిబంధక దోషములలో నొకటి (=ఒకవిషయమును సమర్థింపఁ జెప్పు కారణములకు భంగము కలిగించుట.) "మ. అటుగాకద్భుతరామణీయకగుణాఢ్యంబైన సద్వస్తువుల్, బటువాచారసికుల్ ప్రసంగమయినం బారంబు ముట్టక్ రసో,త్కటతం జెప్పక మానఁజాల రనుపక్షం బొండు భావించినన్, ఘటియిల్లు న్వని తాంగవర్ణనకు నిక్కంబ బన్యథా సిద్ధియున్." ప్రభా. ౩, ఆ. ౭.

అన్యదా. సం. అవ్య. మఱియొకప్పుడు. (సదా, సర్వదా వలెనే యిదియు నుపయుక్తము.)

అన్యదీయము. సం. విణ. (అ. ఆ. అ.) ఇతరసంబంధమైనది.

అన్యపదార్థము. సం. వి. అ. పుం. 1. మఱియొక వస్తువు; 2. మఱియొక పదముయొక్క అర్థము: "అన్యపదార్థ ప్రధానము బహువ్రీహి."

అన్యపుష్టము. సం. వి. అ. పుం. పరపుష్టము, కోయిల. —విణ. (అ. ఆ. అ.) ఇతరులచేఁ బోషింపఁబడినది.

అన్యపూర్వ. సం. వి. ఆ. స్త్రీ. 1. వివాహమైనస్త్రీ; 2. వివాహనిశ్చయమైనస్త్రీ; 3. పునర్భువు, మాఱు మనువుఁ జేసికొన్నస్త్రీ.

అన్యమనసుఁడు. సం. విణ. స్.= అన్యమనస్కుఁడు.

అన్యమనస్కుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఇతర విషయములయందు మనస్సుకలవాఁడు; 2. పరధ్యానముగా నుండువాఁడు.

అన్యమాతృజుఁడు. సం. వి. అ. పుం. సపత్నితల్లికొడుకు.

అన్యము. సం. స. (అ.ఆ.అ.) 1. మఱియొక్కటి, ఇతరము, వేఱయినది; 2. సాటిలేనిది, అసాధారణము.

అన్యవాపము. సం. వి. అ. పుం. (మఱియొకచోట గ్రుడ్లు పెట్టునది.) కోకిల.

అన్యసంక్రాంతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఇతరులకు సంక్రమించినది; 2. ఇతరులవలన సంక్రమించినది; 3. ఇతరమందు వ్యాపించినది. "అన్యసంక్రాంత హృదయుఁడు."

అన్యాదృక్కు. సం.(శ్. ఈ-శీ.శ్.)=అన్యాదృశము.

అన్యాదృక్షము. సం. (అ.ఆ.అ.) = అన్యాదృశము.

అన్యాదృశము. సం. విణ. (అ. ఈ- శీ. అ.) మఱియొకదానితో సమానమైనది.

అన్యాయము. సం. వి అ. పుం. అధర్మము. —విణ. (అ.ఆ.అ.) న్యాయవిరుద్ధము.

అన్యాయ్యము. సం. విణ. (అ. ఆ. అ.) న్యాయము నుండి తప్పినది, న్యాయములేనిది.

అన్యార్థము. సం. వి. అ. పుం. 1. మఱియొక అర్థము; 2. ఇతరుని అర్థము. చూ. అర్థము. —విణ. (అ.ఆ.అ.) 1. మఱియొకఅర్థము కలది; 2. మఱియొక ప్రయోజనముగలది; 3. ఇతరుల నిమిత్తమైనది, ఇతరులకొఱకైనది. "మ.... ఇట్టి దానిన్ సుదుర్మతి నన్యార్థము సేసి నీకుఁ జేనునే." భార. అర. ౧, ఆ. ౨౩౯.—క్రి. విణ. ఇతరుల నిమిత్తముగా, ఇతరులకొఱకు.

అన్యుఁడు, సం. స. (అ. ఆ. అ.) 1. పైవాఁడు, లాఁతివాఁడు; 2. వేఱైనవాఁడు, ఇతరుఁడు.

అన్యోన్యము. సం. వి. అ. న. 1. పరస్పరము; 2. ఒక యర్థాలంకారము. చూ. అలంకారము.

అన్యోన్యాశ్రయము. సం. వి. అ. పుం. **1.** ఒకదాని నొకటి ఆశ్రయించుట; **2.** తర్కమున వాద దోషములలో నొకటి.—విశే. (అ.ఆ.అ.) ఒక దానినొకటి ఆశ్రయించినది.

అన్వక్షము. సం. విశే. (అ. ఆ. అ.) **1.** నేత్ర గోచరమైనది; **2.** వెంబడించునది.—అవ్య. **1.** వెంటనే; **2.** కన్నుల ఎదుట, ఎదుట.

అన్వయవంతుఁడు. సం. విశే. (త్. ఈ-వతీ.త్.) **1.** వంశముకలవాఁడు; **2.** మంచివంశము కల వాఁడు.

అన్వయము. సం. వి. అ. పుం. **1.** కులము, వంశము; **2.** పదముల పొందిక, భావమున కనుకూలముగ పదములను చేర్చుట.

అన్వయించు. సం. అ. క్రి. **1.** ప్రవర్తించు, సరిపడు. "ఆసూత్రము ఇక్కడ అన్వయింపదు." "ఆధర్మశాస్త్రవాక్యము లీవిషయమున అన్వయింపవు." **2.** బోధపడు, తెలియు. "ఆశ్లోకము నాకు అన్వయించలేదు." "నీవు చెప్పినవిషయము నాకు అన్వయింపలేదు."—స. క్రి. భావాను కూలముగ పదములను కూర్చు, భావమును వివరించు. "ఈపద్యము అన్వయింపుము."

అన్వర్థము. సం. విశే. (అ ఆ. అ.) అర్థమును అను సరించియున్నది, సార్థకము. "అన్వర్థసంజ్ఞ."

అన్వవసర్గము. సం. వి. అ. పుం. కామచారానుజ్ఞ, విచ్చలవిడిగ విడుచుట.

అన్వవాయము. సం. వి. అ. పుం. వంశము, కులము.

అన్వాచయము. సం. వి. అ. పుం. **1.** రెండిటిలో నొక దానిని అప్రధానముగఁ జెప్పుట; **2.** అప్రధాన పదార్థము.

అన్వాదేశము. సం. వి. అ. పుం. **1.** ఒకపనిచేయు టకు స్వీకరింపఁబడినవానిని మఱియొకకార్యము చేయుటకు మఱలఁ జెప్పుట; **2.** మఱలఁ జెప్పుట; **3.** మరలఁజెప్పఁబడిన పదార్థము, (ఔపమ్యవాచకము.) "సీ. ప్రతిబింబమోకాని రజనివల్లభున కధ్యాహారమోకాని యమృత రుచికి, వినిమయంబోకాని విధున కన్వాదేశమో కాని యత్రినేత్రోద్భవునకు, వీప్సయో కాని." కాశీ. ౪, ఆ. ౧౯౧. నై. ౫, ఆ. ౧౪౪.

అన్వాధి. సం. వి. ఇ. పుం. **1.** పూఁచీపడినవాఁడు, పూఁటకాఁపు; **2.** రెండవతాకట్టు, రెండవమాఱు పెట్టుకుదువ; **3.** ఎడతెగని మనోవ్యథ.

అన్వాధేయము. సం. వి. అ. న. వివాహానంతరము పుట్టింటివారుగాని, అత్తింటివారుగాని, బంధువులుగాని స్త్రీకి ఇచ్చుధనము, స్త్రీధనము.

అన్వాసనము. సం. వి. అ. న. **1.** అనుసరించుట; **2.** సేవ; **3.** ఒకరిని అనుసరించి కూర్చుండుట; **4.** విచారము; **5.** వడ్లవాఁడు మొ. వారు పని చేయుశాల, పరిశ్రమశాల; **6.** వస్తికర్మ, ఆస నము (గుదము) న చమురు మొదలగుదానితో తడిపిన వత్తి ఎక్కించుట.

అన్వాసితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) **1.** అనుస రింపఁబడినవాఁడు; **2.** సేవింపఁబడినవాఁడు.

అన్వాహార్యము. సం. వి. అ. న. **1.** ప్రత్యమావా స్యయందుఁ జేయుశ్రాద్ధము; **2.** శుభకార్యము లకు ముందుఁజేయు నాందీముఖశ్రాద్ధము.

అన్విచ్ఛ. సం. వి. ఆ. స్త్రీ. అన్వేషణము, వెదకుట.

అన్వితము. సం. విశే. (అ.ఆ.అ.) కూడుకొన్నది.

అన్విష్టము. సం. విశే. (అ. ఆ. అ.) అన్వేషితము, వెదకఁబడినది.

అన్వీక్షకి. సం. వి. ఈ. స్త్రీ. తర్కవిద్య.

అన్వీక్షణము. సం. వి. అ. న. మార్గణము, వెదకుట.

అన్వీతము. సం. = అన్వితము. "శా. గ్రీవాలంకృతి పట్టసూత్రలతికా శ్రీకారరేఖాంకితాం, దేవీ యవ్రణవంశ సంభవ గుణాన్వీతన్నిమం గాయజుం, డావిర్భూతరతిం ధనుర్లతికఁగా నంగీకరించుం బలే." నై. ౨, ఆ. ౯౬.

అన్వేషము. సం. వి. అ. స్త్రీ. వెదకుట.

అన్వేషణము. సం. = అన్వేషణ.

అన్వేషించు. సం. స. క్రి. వెదకు. "వ. పాండవుల నన్వేషించుపని యిటమీఁదం జిత్తగించు తెఱం గానతిచ్చునది యనిన విని యట్లచేయుదము గాక యని వారలఁ బోవం బనిచి." భార. విరా. ౩, ఆ. ౯౦.

అన్వేషితము సం. విశే. (అ. ఆ. అ.) అన్విష్టము, వెదకఁబడినది.

అన్వేష్ట. సం. విణ. (బు. ఈ-స్త్రీ. బు.) వెదకెడువాఁడు.

అన్వేష్టవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) వెదుకఁదగినది, పరిశీలింపఁదగినది.

అప. ఉభ. వై. వి. 1. అప్పు; "గీ. అనిశ శివవాసమైన పుణ్యపురమణి వ, ఘూపహస్మృతి వనుచు నాయపకలంక, మానసోత్కర్షయుక్తు లనూన నుతులు, సేసి యందఱుఁ దత్పురస్థితిని బరఁగ." రాఘ. ౨, ఆ. ౪౦; 2. తండ్రి; 3. అక్క, అప్ప; 4. నామాంతముల యందు చేర్పఁబడు పదములలో నొకటి. చూ. అప్ప.—సం. ఉప. విరుద్ధార్థము నిచ్చును. "అపయశము, అపజయము, మొ." కొన్నిచోట్ల అర్థవిశేషము లేకయే ఉండును.

అపంచీకృతము. సం. విణ. (అ.ఆ.అ.) (వేదాంత.) పంచీకరణము చేయఁబడనది, సూక్ష్మము.

అపకర్త. సం. విణ. (బు. ఈ-ర్త్రీ. బు.) అపకారము చేయువాఁడు.

అపకర్ముఁడు. సం. విణ. (న్. న్. న్.) దుష్టాచరణము కలవాఁడు.

అపకర్షణము. సం. వి. అ. న.=అపకర్షము.—విణ. (అ.ఈ-ర్షి.అ.) పోఁగొట్టునది, అపహరించునది.

అపకర్షము. సం. వి. అ. పుం 1. హైన్యము. (ఉండఁదగినదానికంటె తక్కువగుట); 2. వెనుకకు తీసికొనిపోవుట; 3. శ్రాద్ధాదులను ఉచితకాలము కంటె పూర్వము చేయుట; 4. ఒకపదమును పరసూత్రమునుండి పూర్వసూత్రాన్వయమునకై గ్రహించుట; 5. ఆకర్షణము.

అపకలంకము. సం. విణ. (అ. ఆ. అ.) కళంకము లేనిది. "తే. అనిశశివవాసమైన పుణ్యపురమణి వ, ఘూపహస్మృతి వనుచు నాయపకలంక,మానసోత్కర్షయుక్తు లనూననుతులు, సేసియందఱుఁ దత్పురస్థితిని బరఁగ." రాఘ. ౨, ఆ. ౩౮.

అపకారకుఁడు. సం. విణ. (అ. ఆ-రికా. అ.) అపకారము చేయువాఁడు.

అపకారము. సం. వి. అ. పుం. 1. అనిష్టకార్యము చేయుట, కీడుచేయుట; 2. హాని, కీడు; 3. ద్రోహము, కీడు గలుగవలయుననుచింత. (వ్యతి. ఉపకారము.)

అపకారి. సం. విణ. (న్. ఈ-ణీ. న్.) అపకారము చేయువాఁడు. (వ్యతి. ఉపకారి.)

అపకీర్తి. సం. వి. ఇ. స్త్రీ. అపయశము, చెడుపేరు.

అపకృతము. సం. వి. అ. న.=అపకారము.—విణ. (అ. ఆ. అ.) అపకారము చేయఁబడినది.

అపకృతి. సం. వి. ఇ. స్త్రీ. = అపకారము.

అపకృత్యా. సం. వి. ఆ. స్త్రీ. = అపకృత్యము.

అపకృత్యము. సం. వి. అ. న. = అపకారము.

అపకృష్టము. సం. విణ. (అ.ఆ.అ.) 1. అధమము; 2. హీనము; 3. అపకర్షము చేయఁబడినది. చూ. అపకర్షము.

అపకృష్టి. సం. వి. ఇ. స్త్రీ. = అపకర్షము.

అపక్రమణము. సం. వి. అ. న. 1. పరుగిడుట, పలాయనము; 2. వెనుకకుఁబోవుట; 3. తొలఁగిపోవుట.

అపక్రమము. సం. వి. అ. పుం. 1. వెనుకకునడచుట; 2. తొలఁగుట; 3. యుద్ధమునుండి పాఱిపోవుట; 4. క్రమములేమి, క్రమముతప్పుట.—విణ. (అ. ఆ. అ.) క్రమముతప్పినది, క్రమముపోయినది. "సీ. ఇది సంజ యిది రాత్రి యిది వాసరం బను సమయపర్షము లపక్రమము లయ్యె." కాశీ. ౧, ఆ. ౧౩౭.

అపక్రమించు. సం. అ. క్రి. 1. యుద్ధమువలనఁ బాఱిపోవు; 2. తొలఁగిపోవు.

అపక్రోశము. సం. వి. అ. పుం. నింద, దూఱు.

అపక్వము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పండనిది, ఆమము (తండులాది); 2. పచ్చిది, పరువునకు రానిది. (ఫలాది).

అపఖ్యాతి. సం. = అపకీర్తి.

అపగండుఁడు. సం. వి. అ. పుం. చంటివాఁడు, అతిబాలుఁడు.

అపగతము. సం. విణ. (అ.ఆ.అ.) 1. పోయినది; 2. పరుగెత్తినది.

అపగమము. సం. వి. అ. పుం. 1. గమనము, పోక, వెడలిపోవుట; 2. పడిపోవుట, రాలుట. "పురాణపత్త్రాపగమము"(=ప్రాఁతయాకులు రాలుట;) 3. భంగము, చెడుట. "నిద్రాపగమము" (=నిద్ర చెడిపోవుట.)

అపఘనము. సం. వి. అ. పుం. 1. అవయవము; 2. దేహము.—విణ. (అ. ఆ. అ.) మేఘావరణశూన్యమైనది, మేఘావరణ లేనిది.

అపఘాతము. సం. వి. అ. పుం. 1. చంపుట; 2. దుష్టుఁడు కారణముగాఁగల మరణము; 3. హీనముగా చంపుట, పాడుచావు గలుగునట్లు చంపుట.

అపచయము. సం. వి. అ. పుం. 1. హాని; 2. అపహరించుట; 3. వ్యయముచేయుట; 4. తగ్గువల; 5. పూజ; 6. అవచయము, (పువ్వులు)కోయుట. "మ. ఈపగిదిన్ మురారి...పుష్పాపచయప్రమోద భరితాత్ముఁడై చిదిమెన్ లతాంతముల్..." పారి. ౪, ఆ. ౧౩. ఈయర్థమున సంస్కృతనిఘంటువులలో అవచయశబ్దము కలదు. ఆంధ్రసంప్రదాయమునను, కన్నడసంప్రదాయమునను 'అపచయ'శబ్దము కనఁబడుచున్నది. 'ప, వ' అను అక్షరముల పోలిక ననుసరించి యీరూపము తొలుత ప్రవేశించి యుండును.

అపచయించు. సం. స. క్రి. (పువ్వులు)కోయు, చిదుము. శ. ర. చూ. అపచయము.

అపచరితము. సం. వి. అ. న. 1. తప్పుగాఁ జేయుట; 2. చెడుపని, చెడునడత.

అపచాయితుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) పూజింపఁబడినవాఁడు, అపచితుఁడు.

అపచారము. సం. వి. అ. పుం. 1. అహితమును జేయుట, అపరాధము; 2. అపకారము, ఒకరియెడఁ జేసిన హాని; 3. అపథ్యము; 4. వినాశము; 5. కర్మలోపరూపదోషము.

అపచారి. సం. విణ. (న్.ఈ-ణీ.న్.) అపచారము చేయువాఁడు.

అపచికీర్ష. సం. వి. ఆ. స్త్రీ. అపకారము చేయవలయునని యిచ్ఛ, హానిచేయుతలఁపు.

అపచికీర్షువు. సం. విణ. ఉ. అపకారముచేయ నిచ్ఛగలవాఁడు, అపకారము చేయఁదలఁచినవాఁడు.

అపచితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆనందముచే బూజింపఁబడినది; 2. అవయవలోపము గలది; 3. క్షీణించునది; 4. చిక్కినది, కృశించినది.

అపచితి. సం. వి. ఇ. స్త్రీ. 1. పూజ; 2. ప్రాయశ్చిత్తము; 3. వ్యయము; 4. హాని; 5. హైన్యము, క్షీణించుట.

అపచీయమానము. సం. విణ. (అ. ఆ. అ.) క్షీణింపఁజేయఁబడుచున్నది.

అపచ్యుతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నష్టప్రాయము; 2. జాఱిపోయినది.

అపజయము. సం. వి. అ. పుం. పరాజయము, ఓడిపోవుట.

అపటి. సం. వి. ఈ. స్త్రీ. చిన్న తెర.

అపటిమ. సం. వి. న్. పుం. పటుత్వములేమి.

అపటిమము. సం. = అపటిమ.

అపటీకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) (అప+టీక.) 1. టీకాజ్ఞానములేనివాఁడు; 2. (న+పటీక.) పైఁబట్ట లేనివాఁడు, ఉత్తరీయము లేనివాఁడు.

అపటుత్వము. సం. వి. అ. న. = అపటిమ.

అపటువు. సం. విణ. (ఉ. ఈ-ట్వీ. ఉ.) 1. సమర్థత లేనివాఁడు, అసమర్థుఁడు; 2. రోగి; 3. సోమరి.

అపణ్యము. సం. విణ. (అ. ఆ. అ.) విక్రయింపఁగూడనిది. (పదార్థము.)

అపతి. సం. వి. ఇ. స్త్రీ. = అపతిక.

అపతిక. సం. వి. ఆ. స్త్రీ. పతిలేనిస్త్రీ.

అపతోక. సం. వి. ఆ. స్త్రీ. ఈఁచుకపోయినయావు.

అపత్ని. సం. వి. ఈ. స్త్రీ. పత్నికానిస్త్రీ, అవివాహిత, కన్య.

అపత్నీకుఁడు. సం. వి. అ. పుం. 1. భార్యదగ్గఱలేనివాఁడు; 2. యాగాదికర్మకు యోగ్యమైనభార్య లేనివాఁడు; 3. భార్యలేనివాఁడు.

అపత్యపథము. సం. వి. అ. పుం. (సంతతిపయికివచ్చుత్రోవ.) స్త్రీగుహ్యస్థానము, ఆఁడుగుఱి.

అపత్యము. సం. వి. అ. న. పుత్త్రుఁడు, పుత్త్రిక మొదలగు సంతానము.

అపత్యశత్రువు. సం. వి. ఉ. స్త్రీ. (తనసంతతి తనకు నాశకముగాఁగలది.) 1. కర్కాటి, ఆఁడుపీత; 2. వృశ్చికి, ఆఁడు తేలు.

అపత్రప. సం. వి. ఆ. స్త్రీ. 1. పరులవలనఁగలిగిన సిగ్గు; 2. సిగ్గు, లజ్జ.

అపత్రపిష్ణువు. సం. విశే. ఉ. లజ్జపడువాఁడు, లజ్జపడు స్వభావము గలవాఁడు.

అపత్రపుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అపగతత్రపుఁడు, సిగ్గులేనివాఁడు.

అపథము. సం. వి. అ. న. న్. పుం. 1. దుష్టపథము; 2. తప్పుదారి; 3. నింద్యమార్గము.

అపథ్యము. సం. విణ. (అ.ఆ.అ.) 1. పథ్యముకానిది; (పదార్థము.); 2. హితము కానిది.

అపదము. సం. వి. అ. న. 1. (వ్యాక.) సుబంత తిఙంతభిన్నమగు శబ్దము; 2. తగనిపదము, నీచస్థానము.

అపదాంతరము. సం. విణ. (అ.ఆ.అ.) 1. అడ్డుగానను వ్యవధానము లేనిది; 2. కలసియున్నది; 3. దగ్గఱగానున్నది.

అపదానము. సం. వి. అ. న. 1. పరిశుద్ధమగు వృత్తము, మంచినడవడి; 2. కడచినపని; 3. ఖండించుట.

అపదిశము. సం. అవ్య. అ. న. రెండుదిక్కులకు మధ్యభాగము, అయిమూల.

అపదూఱు. మి. గ్రా. వి. 1. మోపినదూఱు, లేనిపోనినింద; 2. నింద.

అపదేశము. సం. వి. అ. పుం. 1. లక్ష్యము; 2. స్వస్వరూపమును కప్పిపుచ్చుట, మిష; 3 నిమిత్తము; 4. స్థానము; 5. ఉపదేశము; 6. అనుచితమైనస్థానము, నీచస్థానము.

అపదేశ్యము. సం. విణ. (అ. ఆ. అ.) మిషచే చెప్పఁదగినది, కప్పి పుచ్చఁదగినది.

అపద్రవ్యము. సం. వి. అ. న. 1. హీనద్రవ్యము, నీచద్రవ్యము; 2. పాడుపదార్థము.

అపద్వారము. సం. వి. అ. న. 1. తప్పుత్రోవ, తప్పుదారి; 2. ప్రక్కదారి, వెనుకవైపు దారి.

అపధ్యానము. సం. వి. అ. న. 1. అనిష్టమాలోచించుట; 2. విపరీతముగ చింతించుట.

అపధ్వంసము. సం. వి. అ. పుం. 1. నాశము; 2. భ్రంశము.

అపధ్వని. సం. వి. ఇ. పు. అపస్వరము, తప్పుధ్వని. —విణ. ఇ. 1. అపస్వరముగలది. "క. మాసె నభోమణి నక్కలు, గూసెం గలయంగ దెసల కుం బలుసాయల్, సేసెం బఱమెయిఱు లడరి, మ్రోసెం దమయంతిఁ దూర్యము లపధ్వనులై." భార. విరా. ౪, ఆ. ౭౬; 2. తప్పైనధ్వన్యర్థము (వ్యంగ్యార్థము) గలది. (శబ్దము.)

అపధ్వస్తము. సం. విణ. (అ.ఆ.అ.) 1. నిందింపఁబడినది; 2. విడిచిపెట్టఁబడినది; 3. చూర్ణముగాఁ జేయఁబడినది; 4. పాడుచేయఁబడినది.

అపనమ్మిక. మి. గ్రా. వి. అవిశ్వాసము, అనుమానము "క. సొమ్మెకచో నుండఁగ నప, నమ్మిక యొక చోట నుండు నరులకు నెపుడున్." హరిశ్చ. ౫, ఆ. ౧౩౬.

అపనయనము. సం. వి. అ. న. 1. తొలఁగించుట; 2. అపకారసాధనము —విణ. (అ. ఆ. అ.) (అప+నయన.) కన్నులులేనిది.

అపనయము. సం. వి. అ. పుం. 1. దుష్టనీతి, దుర్నయము. "క. కుపథప్రవృత్తుఁడయి పీఁ, డపనయమున నీ కనిష్ఠుఁ డయినను గరుణానిపుణుఁడవై నీమఱఁదికి, నపరాధశతంబు సైఁపుమయ్య యుపేంద్రా." భార. సభా. ౨, ఆ. ౫౯; 2. తొలఁగించుట.

అపనయించు. సం. స క్రి. 1. తొలఁగించు. "ఆ. భూతరాశి దొల్లి పుట్టి బుభుక్షాభితప్తమైనఁ జూచి తద్భయంబు, నపనయింపఁ గడఁగి." భార. అర. ౧, ఆ. ౩౪; 2. నివారించు, పోఁగొట్టు. "సీ. దోరంతరన్యస్తతారహారంబుల నంతఃపరీతాప మపనయించు." నైష. ౧, ఆ. ౭౪.

అపనింద. సం. వి. ఆ. స్త్రీ. = అపదూఱు.

అపనీతము. సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగింపఁబడినది.

అపనుత్తి సం. వి. ఇ. స్త్రీ. 1. తొలఁగించుట; 2. పోఁగొట్టుట, నివారించుట; 3. వాదాదులను ఖండించుట.

అపనుదము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఖండించునది; 2. తొలఁగించునది, పోఁగొట్టునది. "జయ

జయ కిల్బిషాపనుద." ఉ. హరి. ౬, ఆ. ౧౯; 3. శోధన చేయునది.

అపనెపము. మి. = అపదూఱు. "ద్వి. అటఁ బోయి నంతలో నపనెప మాను." సా. ౧, భా. 3౮2.

అపనేయము. సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగింపఁ దగినది.

అపనోదము. సం. వి. అ. పుం. 1. తొలఁగించుట; 2. దూరము చేయుట; 3. వాదాదుల ఖండించుట.

అపనోది. సం. విణ. (న్.ఈ.నీ.న్.) 1. తొలఁగించునది; 2. వాదాదుల ఖండించునది.

అపపాఠము. సం. వి. అ. పుం. చెడుపాఠము, తప్పు పాఠము.

అపపాడి. మి. గ్రా. వి. అన్యాయము. "తే. అవనిపతులు పలువు రపపాడి నొక్కనిఁ, దన్నుఁ బొదివికొనినఁ దరల కెదిరి, పోటులాడి నాదు పుత్రుండు పడుట దాఁ, గీర్తికరము కాని కీడు గాదు." మార్క. ౮, ఆ. ౧౧3. శ. ర. 'అవనిపతులు బలియు రందఱు నొక్కని' అని పాఠాంతరము.

అపప్రథ. సం. వి. ఆ. స్త్రీ. చెడుపేరు, అప్రతిష్ఠ.

అపభ్రంశము. సం. వి. అ. పుం. 1. క్రిందపడుట; 2. స్వభావమునుండి భ్రష్టుఁడగుట; 3. అపశబ్దము; 4. ప్రాకృతభాషావిశేషము.

అపమర్దము. సం. వి. అ. పుం. విమర్దనము, బాధ.

అపమానము. సం. వి. అ. పుం. 1. అనాదరము; 2. అవమానము.

అపమానితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అనాదరము చేయఁబడినది; 2. అవమానింపఁబడినది.

అపమార్గము. సం. వి. అ. పుం. కుత్సితమార్గము, చెడుత్రోవ, మాఱుదారి.

అపమార్జనము. సం. వి. అ. న. తుడుచుట, శుద్ధి చేయుట.

అపమిత్యకము. సం. వి. అ. న. (అవమానము నంగీకరించి గ్రహించినది.) ఋణము, అప్పు.

అపముఖము. సం.వి. అ. న. విముఖము, పెడమొగము. —విణ. (అ. ఆ. అ.) పెడమొగము పెట్టినది, విముఖమయినది.

అపమూర్ధము. సం. విణ. (న్.ఈ.ర్ధ్నీ.న్.) శిరస్సు లేనిది. (మొండెము.)

అపమృత్యువు. సం. వి. ఉ. పుం. 1. విషభక్షణాదులవలనఁ గలిగినచావు; 2. అకాలమృత్యువు.

అపయశము. సం. వి. స్. న. 1. అపఖ్యాతి, అపకీర్తి; 2. కీర్తిలేమి.

అపయశస్కరము. సం. విణ. (అ.ఈ.రీ. అ.) అపకీర్తి కలిగించునది.

అపయానము. సం. వి. అ. న. అపక్రమము, పాఱిపోవుట.

అపర. సం. వి.ఆ. స్త్రీ. 1. మావి; 2. పడమరదిక్కు, 3. (వేదాంత.) విద్యాభేదము. (వ్యతి. పర); 4. సాంగవేదాధ్యయనము.

అపరంజి. దే. వి. పదివన్నెబంగారు, ఉదిరి.

అపరక్తుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. రక్తవర్ణము లేనివాఁడు; 2. రక్తము లేనివాఁడు; 3. విరక్తుఁడు, రాగము లేనివాఁడు.

అపరక్రియ. సం. వి. ఆ. స్త్రీ. ఉత్తరక్రియ, చచ్చినవానిగుఱించి చేయుకర్మము.

అపరభాగము. సం. వి. అ. పుం. వెనుకటిభాగము.

అపరము. సం. వి. అ. న. ఏనుఁగు వెనుకభాగము; —బ. (అపరాలు.) పయరధాన్యములు. (కందులు, పెసలు, మొదలగునవి.)—విణ. (అ.ఆ.అ.) 1. భిన్నము; 2. తర్వాతది; 3. ఇతరము, వేఱైనది; 4. క్రిందిది; 5. మీఁదిది.

అపరరాత్రము. సం. వి. అ. పుం. రాత్రి చివరభాగము, తెల్లవాఱుజాము.

అపరాగ్ని. సం. వి. ఇ. పుం. 1. గార్హపత్యము; 2. దక్షిణాగ్ని; 3. అపరకర్మారంభమందు స్థాపించునగ్ని.

అపరాఙ్ముఖుఁడు. సం. విణ. (అ. ఈ. ఖీ. అ.) 1. పెడమొగము పెట్టనివాఁడు; 2. అభిముఖుఁడు, సుముఖుఁడు, సిద్ధముగా నున్నవాఁడు.

అపరాజిత. సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. తక్కిలిచె; 3. విష్ణుక్రాంతముచె; 4. సోమినముచె; 5. దూర్వచె; 6. తూర్పునకు ఉత్తరమునకు నడుమఁగల మూల.

అపరాజితుఁడు. సం. వి. అ. పుం. **1.** విష్ణువు; **2.** శివుఁడు; **3.** ఒకానొకఋషి.—విశ.(అ.ఆ.అ.) పరాజితుఁడు కానివాఁడు, జయించినవాఁడు.

అపరాతిరి. మి. గ్రా. వి. అర్ధపుశేయి, అర్ధరాత్రము.

అపరాధము. సం. వి. అ. పుం. తప్పుచేయుట. (తనకు విహితమగుపని చేయకపోవుట; శిక్షకు అర్హమైనపని చేయుట.)

అపరాధి. సం. విశ. (న్. ఈ-నీ. న్.) అపరాధము చేసినవాఁడు.

అపరాద్ధ. సం. విశ. (ఋ. ఈ-ద్ధీ. ఋ.) అపరాధము చేసినవాఁడు.

అపరాద్ధము. సం. వి. అ. న. అపరాధము.—విశ. (అ. ఆ. అ.) **1.** లక్ష్యమునుండి తప్పినది. (బాణము). "అపరాద్ధపృషత్కుఁడు" =(గుఱి తప్పిన బాణముగలవాఁడు, లక్ష్యమునుండి తప్పిన బాణము కలవాఁడు;) **2.** అపరాధముచేసినది; **3.** అపరాధము చేయఁబడినది.

అపరావర్తి. సం. విశ. (న్. ఈ-నీ. న్.) **1.** మరలనివాఁడు; **2.** పనిపూర్తిచేయకుండఁగ తిరిగి రానివాఁడు.

అపరాహ్ణతనము. సం. విశ. (అ. ఈ-నీ. అ.) అపరాహ్ణమందైనది.

అపరాహ్ణము. సం. వి. అ. పుం. (అపర+అహన్.) పగటిలో చివరభాగము. (వ్యతి. = పూర్వాహ్ణము, మధ్యాహ్నము.) (కొందఱు మతమున దినము రెండుభాగములుగాను, మఱికొందఱు మతమున మూఁడుభాగములుగాను విభజింపఁబడినది.)

అపరిచితుఁడు. సం. విశ. (అ.ఆ.అ.) పరిచయము లేనివాఁడు, పూర్వము ఎఱుఁగనివాఁడు.

అపరిచ్ఛన్నము. సం. విశ. (అ.ఆ.అ.) **1.** కప్పఁబడనిది; **2.** మార్జనాది శుద్ధులు చేయనిది.

అపరిచ్ఛిన్నము. సం. వి. అ. న. బ్రహ్మము.—విశ. (అ.ఆ.అ.) ఇయత్త (ఇంత పరిమితిగలది అను నేర్పాటు) లేనిది.

అపరిచ్ఛేదము. సం. వి. అ. పుం. ఇయత్త (ఇంత యను పరిమితి) లేమి, పరిచ్ఛేదాభావము.—విశ. (అ. ఆ. అ.) **1.** అపరిచ్ఛిన్నము; **2.** పరిచ్ఛేదములు లేనిది. (గ్రంథము)

అపరిజ్ఞానము. సం. వి. అ. న. వివేకములేమి.—విశ. (అ. ఆ. అ.) పరిజ్ఞానములేనిది; వివేకములేనిది.

అపరిమితము. సం. విశ. (అ. ఆ. అ.) పరిమితము కానిది, పరిమితిలేనిది, కొలఁదిలేనిది.

అపరిమేయము. సం. విశ. (అ.ఆ.అ.) **1.** కొలుచుటకు శక్యముకానిది; **2.** ఇంతయని యేర్పఱచుటకు శక్యముకానిది.

అపరిష్కారము. సం. వి. అ. పుం. **1.** అలంకారము లేమి; **2.** మార్జనాది సంస్కారములేమి; **3.** నిర్ణయము లేమి.—విశ. (అ.ఆ.అ.) **1.** అలంకారము లేనిది; **2.** మార్జనాది సంస్కారము లేనిది; **3.** నిర్ణయముకానిది.

అపరిహరణీయము. సం. విశ. (అ. ఆ. అ.) **1.** పరిహరింప శక్యముగానిది; **2.** పరిహరింపఁ దగనిది.

అపరిహార్యము. సం.= అపరిహరణీయము.

అపరూపము. సం. వి. అ. న. **1.** ఆశ్చర్యమైన రూపము; **2.** హీనమైనరూపము, అంగవికారము.—విశ. (అ.ఆ.అ.) **1.** ఆశ్చర్యకరమైన రూపముగలది; **2.** హీనమైనరూపముగలది, అంగవికారమైనది.

అపరోక్షము. సం. వి. అ. న. (పరోక్షము కానిది.) ప్రత్యక్షము, వస్తుసాన్నిధ్యమువలన నింద్రియములకు కలుగుజ్ఞానము, ప్రత్యక్షజ్ఞానము.

అపరోక్షానుభూతి. సం. వి. ఇ. స్త్రీ. **1.** ప్రత్యక్షానుభవము, స్వయముగాఁ జూచుట మొదలగు వానివలనఁ గలిగినజ్ఞానము; **2.** వేదాంతశాస్త్రమున ఒక ప్రకరణము.

అపర్ణ. సం. వి. ఆ. స్త్రీ. (ఈశ్వరునికొఱకు తపస్సు చేసినపుడు ఆకులుకూడ భక్షింపనిది.) పార్వతి.

అపర్యాప్తము. సం. విశ. (అ.ఆ.అ.) **1.** సమర్థము కానిది; **2.** సంపూర్ణముగానిది; **3.** అపరిచ్ఛిన్నము, కొలఁదిలేనిది; **4.** చాలనిది, సరిపోనిది.

అపర్యాప్తి. సం. వి. ఇ. స్త్రీ. **1.** కొలఁది లేమి; **2.** శక్తి లేమి; **3.** అసమాప్తి, సమాప్తిలేమి.—విశ. ఇ. **1.** కొలఁది లేనిది; **2.** శక్తిలేనిది; **3.** సమాప్తి లేనిది; **4.** చాలనిది.

అపలపనము సం. = అపలాపము.

అపలపించు. సం. స. క్రి. మఱుఁగుపఱచి చెప్పు, కప్పిపుచ్చిచెప్పు.

అపలాపము. సం. వి అ. పుం. 1. అపహ్నవము, ఉన్నదానిని కప్పిపుచ్చిచెప్పుట; 2. (అనంతముగా సంభాషింపఁజేయునది.) స్నేహము; 3. ప్రేమము.

అపలాపి. సం. విణ. (న్.ఈ.నీ.న్.) 1. అపలాపము చేయువాఁడు, కప్పిపుచ్చిచెప్పువాఁడు; 2. స్నేహము కలవాఁడు; 3. ప్రేమకలవాఁడు.

అపలాపించు. సం. స. క్రి. 1. నిరసించు; 2. నిందించు. "మ. విపరీతస్థితి నొంది ఘోరవిపినోర్వీవాసులై నిత్యదుఃఖపరాధీనతఁ దూలిరంచు మనలన్ గర్వోద్ధతస్వాంతుఁడై, యపలాపింపఁగ." భార. అర. ౫, ఆ. ౪౦౬; 3. కప్పిపుచ్చిచెప్పు.

అపవనము. సం. వి. అ. న. ఉపవనము, కృత్రిమవనము, ఉద్యానము.

అపవరకము. సం. వి. అ. న. లోపలిగది, అంతర్గృహము.

అపవర్గము. సం. వి. అ. పుం. 1. మోక్షము; 2. దానము, ఈవి; 3. త్యాగము, విడుపు; 4. సమాప్తి,ముగియుట; 5. ఫలప్రాప్తి, నెఱవేఱుట.

అపవర్జనము. సం. వి. అ. న. = అపవర్గము.

అపవర్జితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. విడువఁబడినది; 2. ఇయ్యఁబడినది; 3. పరిహరింపఁబడినది.

అపవర్తనము. సం. వి. అ. న. 1. పరివర్తనము,మరలుట; 2. వంకరగాఁజేయుట; 3. (గణిత.) భాజ్యభాజకముల రెండింటికిని సమానమగు నంకెతో విభజించుట; 4. అపహరించుట.

అపవర్తము. సం. వి. అ. పుం. = అపవర్తనము.

అపవాదకము. సం. విణ. (అ.ఆ.అ.) 1. నిందించునది, అపకీర్తితెచ్చునది; 2. నిరసించునది; 3. సామాన్యవిధిని బాధించునది. (విశేషవిధి.)

అపవాదము. సం. వి. అ. పుం. 1. దూఱు, నింద, అపకీర్తి; 2. మిథ్యావాదము, అసత్యవాదము; 3. కుత్సితవాదము, కృత్రిమవాదము, తప్పువాదము; 4. విశేషశాస్త్రము, విశేషవిధి. (సామాన్యవిధిని బాధించునది;) 5. నమ్మకము, విశ్వాసము; 6. ఆదేశము, ఆజ్ఞ; 7. బాధించువస్తువు; 8. కుత్సితవాద్యము. (సహజముగాని స్వరముతో వాయించువాద్యము;) 9. అపస్వరము; 10. వాదమును నిరసించుట, త్రోసివేయుట.

అపవారణము. సం. వి. అ. న. 1. వ్యవధానము; 2. కప్పిపుచ్చుట, తిరోధానము.—విణ. (అ.ఆ.అ.) 1. వ్యవధానము గలుగునట్లు చేయునది; 2. కప్పిపుచ్చునది; 3. వారణము (నివారణము) లేనిది.

అపవారితకము. సం. క్రి. విణ. (నాటక.) ప్రకటనము గాకుండఁగ, ప్రక్కకు తిరిగి.

అపవారితము. సం. వి. అ. న. 1. కప్పిపుచ్చుట; 2. వ్యవధానముగలదిగాఁజేయుట; 3. తొలఁగించుట.—విణ. (అ. ఆ. అ.) 1. కప్పిపుచ్చఁబడినది; 2. వ్యవధానము గలదిగాఁ జేయఁబడినది; 3. తొలఁగింపఁబడినది.

అపవిత్రుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. పవిత్రుఁడు కానివాఁడు; 2. స్నానాచమనాదులు చేయనివాఁడు.

అపవిద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. విడువఁబడినది; 2. నిరాకరింపఁబడినది, నిరసింపఁబడినది.

అపవిద్ధుఁడు. సం. వి. అ. పుం. తండ్రిచేతఁగాని, తల్లిచేతఁగాని, యుభయులచేతనుగాని విడువఁబడఁగా ఇతరునిచేత పుత్త్రుఁడుగా స్వీకరింపఁబడినవాఁడు.(ఇతఁడుద్వాదశవిధపుత్త్రులలోనొకఁడు.)

అపవిష. సం. వి. ఆ. స్త్రీ. అతివస.

అపవ్యాయుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. అపాయము లేనివాఁడు; 2. నాశములేనివాఁడు, చావులేనివాఁడు. "చ. అతివ యపవ్యాయుని ననల్పవిలోచనపంకజాతుఁ బ్రీ, ణితనిజవీరసేనుని వినిర్జితసర్వమహీభృదావళిన్, హతమదవద్విరోధిబలు నాత్మచమూచరవారణాననన, స్రుతమదగంధియుద్ధమహిఁ జూడుము వీని మహీన్మహేంద్రునిన్." నైష. ౫, ఆ. ౧౬౬.

అపశదుఁడు. సం.విణ. (అ.ఆ.అ.) (తఱచు సమాసాంతమునందే యుండును.) నీచుఁడు, హీనుఁడు.

"రాక్షసాపశదుఁడు, బ్రాహ్మణాపశదుఁడు, క్షత్రియాఽపశదులు."

అపశబ్దము. సం. వి. అ. పుం. 1. తప్పుగా ఉచ్చరింపఁబడినపదము, అపభ్రంశమైనశబ్దము; 2. (సంగీ.) అపస్వరము.

అపష్ఠురము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రతికూలము, విపరీతము.

అపష్ఠువు. సం. వి. ఉ. పుం. కాలము.—విణ. ఉ. ప్రతికూలము, విరుద్ధము, విపరీతము. అపష్టువు. అని. శ. ర.

అపసద్యము. సం. వి. అ. పుం. ఔపాసనాగ్ని.

అపసరణము. సం. వి. అ. న. తప్పుకొనిపోవుట, తొలఁగిపోవుట.

అపసరము. సం. వి. అ. పుం. = అపసరణము.

అపసరిల్లు. సం. అ. క్రి. తొలఁగు, తప్పుకొనిపోవు.

అపసర్జనము. సం. వి. అ. న. 1. విడుపు; 2. ఈవి; 3. వధము. (శ. ర.)

అపసర్పుఁడు. సం. వి. అ. పుం. దేశములలోని వార్తలను తెలిసికొనివచ్చి రాజునకుఁ జెప్పువాఁడు, వేగులవాఁడు, గూఢచారుఁడు.

అపసవ్యము. సం. వి. అ. న. 1. దేహముయొక్క కుడిభాగము; 2. కుడిచేతి తర్జన్యంగుష్ఠముల యొక్క మధ్యభాగము. (పితృదేవతలకు తర్పణములు ఈస్థానముననుండి విడిచెదరు.)— విణ. (అ. ఆ. అ.) 1. కుడివైపుది, దక్షిణము; 2.విపరీతము, ప్రతికూలము.

అపసారణ. సం. వి. ఆ. స్త్రీ. = అపసారము.

అపసారణము. సం. వి. అ. న. = అపసారము.

అపసారము. సం. వి. అ. పుం. 1. తొలఁగించుట; 2. దూరముగాఁజేయుట; 3. త్రోసివేయుట.

అపసారితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. దూరముగాఁ జేయఁబడినది; 2. పైకి త్రోసివేయఁబడినది; 3. తొలఁగింపఁబడినది.

అపస్కరము. సం. వి. అ. పుం. న. చక్రముకాక మిగిలిన రథావయవము.

అపస్నాతుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. చచ్చినవాని నుద్దేశించి స్నానము చేసినవాఁడు; 2. స్నానసంస్కారము చేయింపఁబడినమృతుఁడు.

అపస్నానము. సం.వి.అ.న. 1. చచ్చినవాని నుద్దేశించి చేయుస్నానము; 2. స్నానము చేయఁగా మిగిలిన జలము.

అపస్పశము. సం. విణ. (అ. ఆ. అ.) గూఢచారులు లేనిది. (రాజనీతి.)

అపస్మారము. సం. వి. అ. పుం. 1. జ్ఞాపకశక్తిలేమి, మఱపు; 2. మతిచలించుట; 3. ఒకానొక రోగము.

అపస్మారి. సం. విణ. (న్. ఈ. ణీ. న్.) అపస్మారము కలవాఁడు.

అపస్మృతి. సం. వి. ఇ. స్త్రీ.=అపస్మారము.

అపస్వరము. సం. వి. అ. పుం. 1. తప్పుగాఁపలికిన స్వరము; 2. తప్పుగా ఉచ్చరించుట.

అపహతము. సం. విణ. (అ.ఆ.అ.) 1. నశింపఁజేయఁబడినది; 2. కొట్టఁబడినది.

అపహతి. సం. వి. ఇ. స్త్రీ. 1. నశింపఁజేయుట; 2. కొట్టుట.

అపహము. సం. విణ. (అ. ఆ. అ.) (తఱచు సమాసాంతమందే ప్రయోగము.) పోఁగొట్టునది, నశింపఁజేయునది. "క్లేశాపహము,విషాపహము."

అపహరణము. సం. వి. అ. న. (అపహరించుట) 1. పోఁగొట్టుట;2.ధనాదులను దొంగిలించుట. "పరద్రవ్యాపహరణము, రాజ్యాపహరణము;" 3. మోసపుచ్చి తీసికొనిపోవుట.

అపహరణీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అపహరింపఁదగినది; 2. బలాత్కారముగాఁ దీసికొనిపోఁదగినది; 3. మోసపుచ్చి తీసికొనిపోఁదగినది.

అపహరము. సం. విణ. (అ. ఈ-రీ. అ.) (అపహరణము చేయునది.) 1. పోఁగొట్టునది. "భవభయాపహరము." 2. మోసమునఁ దీసికొనిపోవునది; 3. దొంగిలించునది.

అపహరించు. సం. స. క్రి. 1. (ధనాదులను) దొంగిలించు; 2. మోసపుచ్చి తీసికొనిపోవు. "ఆ. దాని కాత్మఁ బొంగి ధార్తరాష్ట్రుఁడు వారి, నపహరించుకొనిన యట్లు కాఁగ." భార. ఉ. ౧, ఆ. ౭౭; 3. పోఁగొట్టు, తీఱఁజేయు. "తే. తిరిసియేనియు నన్నంబు దెచ్చి శిథిలు, లైనవిప్రుల యాఁకలి యపహరించు, పురుషుఁ డూర్ధ్వలోకం

బుల పురుషవరుల, కర్బనీయుఁడై వెలుఁగుచు నంద యుండు." భార. అను. ౪, ఆ. ౨౭౨.

పహర్త. సం. విశే. (ఋ. ఈ-స్త్రీ. ఋ.) (అపహరించువాఁడు.) **1.** దొంగిలించువాఁడు; **2.** మోసపుచ్చి తీసికొనిపోవువాఁడు; **3.** బలాత్కారముగా వశపఱుచుకొనువాఁడు. "రాజ్యాపహర్త;" **4.** పోఁగొట్టువాఁడు. "రోగాపహర్త, దుఃఖాపహర్త."

పహసించు. సం. అ. క్రి. కంటనీరు క్రమ్మునట్లు నవ్వు.—స. క్రి. గేలిచేయు, పరియాచకము చేయు. "సీ. ఈదురాత్ముఁడు మిమ్ము నిష్వనంబున నితాంతాయాసపీడితు లయినవారిఁ, బరమధర్మాత్ముల భార్యాసమేతుల నపహసింపఁ దలంచి యరుగుదెంచె." భార. అర. ౫, ఆ. ౪౩౦.

పహసితము. సం. వి. అ. న.=అపహాసము.—విశే. (అ. ఆ. అ.) అపహసింపఁబడినది.

పహస్తము. సం. వి. అ. పుం. గళహస్తము, గెంటుటకు మెడమీఁద వేయఁబడిన చేయి.

పహస్తితుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) గళహస్తుఁడు, మెడమీఁద చేయివేసి గెంటఁబడినవాఁడు.

పహస్తుఁడు. సం. = అపహస్తితుఁడు.

పహారకుఁడు. సం. విశే. (అ. ఆ-రికా. అ.) అపహారము చేయువాఁడు.

పహారము. సం. వి. అ. పుం. **1.** చౌర్యము; **2.** పోఁగొట్టుట; **3.** తొలఁగించుట; **4.** క్షయము, క్షీణించుట; **5.** నాశము; **6.** దాఁచుట, కప్పిపుచ్చుట. "ఆత్మనామాపహారము."

పహారి. సం. విశే. (న్. ఈ-ణీ. న్.) అపహారము చేయువాఁడు.

పహార్యము. సం. విశే. (అ. ఆ. అ.) **1.** అపహరింప శక్యమయినది; **2.** అపహరింపఁదగినది. "తే. అనపహార్యంబు లెవ్వాని కదితిదేవి, కుండలంబులు సురలోకమండనములు, గొనియె." హరి. ఉ. ౪, ఆ. ౧౧౭.

పహాసము. సం. వి. అ. పుం. **1.** పరియాచకము, వేళాకోళము. "ఉ. అజ్ఞులుకొందఱప్పు డపహాసము సేయుచు గూఢరూపరే, ఖాజ్ఞత లేమిఁ దద్వికృతకాయముమీఁదను దృష్టి నిల్పి." భార. విరా. ౪, ఆ. ౭౪; **2.** అకారణమైననవ్వు, వెఱ్ఱినవ్వు; **3.** కంటనీరు క్రమ్మునట్లు నవ్విన నవ్వు.

అపహాస్యము. సం. విశే. (అ. ఆ. అ.) అపహసింపఁదగినది.

అపహుతము. సం. వి. అ. న. తప్పుగా చేయు హోమము. "క. క్రమయుక్తము యుక్తముగా, నమరగురుప్రతిములైన యాజ్ఞికులు క్రియా, సముదయము నడపఁగా స్ఖలితము లేక పహుతము సొరక తత్క్రతు వొప్పెన్." భార. అశ్వ. ౪, ఆ. ౧౭౩.—విశే. (అ. ఆ. అ.) తప్పుగాహోమము చేయఁబడినది.

అపహృతము సం. విశే. (అ. ఆ. అ.) అపహరింపఁబడినది.

అపహృతి. సం. వి. ఇ. స్త్రీ. = అపహరణము.

అపహ్నవము. సం. వి. అ. పుం. **1.** అపలాపము, ఉన్నదానిని కప్పిపుచ్చి చెప్పుట; **2.** ఒక అర్థాలంకారము; **3.** నేస్తము, స్నేహము.

అపహ్నవించు. సం. స. క్రి. (ఉన్నదానిని) కప్పిపుచ్చిచెప్పు.

అపహ్నుతము. సం. విశే. (అ. ఆ. అ.) కప్పిపుచ్చి చెప్పఁబడినది.

అపహ్నుతి. సం. వి. ఇ. స్త్రీ. = అపహ్నవము.

అపహ్నువానుఁడు. (అ. ఆ. అ.) ఉన్నదానిని కప్పిపుచ్చిచెప్పువాఁడు.

అపహ్రియమాణము. సం. విశే. (అ.ఆ.అ.) **1.** అపహరింపఁబడుచున్నది; **2.** బలాత్కారముగ తీసికొనఁబడుచున్నది; **3.** మోసపుచ్చి తీసికొనఁబడుచున్నది.

అపాంక్తేయుఁడు. సం. విశే. (అ. ఈ-యా. అ.) పంక్తికి పనికిరానివాఁడు.

అపాంక్తుఁడు. సం. = అపాంక్తేయుఁడు.

అపాంక్త్యుఁడు. సం. = అపాంక్తేయుఁడు.

అపాంగకము. సం. వి. అ. పుం. **1.** ఉత్తరేను♆; **2.** అపాంగము, కడకన్ను. "అపాంగదర్శనము." (=కడకంటితోఁ జూచుట.)

అపాంగము. సం. వి. అ. పుం. **1.** నేత్రాంచలము, కడకన్ను; **2.** తిలకము.—విశే. (అ.ఈ-గీ.అ.) అంగహీనమైనది.

అపాంపతి. సం. వి. అ. పుం. (ఉదకములకు పతి.) సముద్రము, కడలి.

అపాంసుల. సం. వి. ఆ. స్త్రీ. పతివ్రతయగుస్త్రీ.

అపాకరణము. సం. వి. అ. న. 1. తీసివేయుట, తొలఁగించుట; 2. తుడిచివేయుట. "శా. స్వామిద్రోహరగండలాంఛనునకున్ సంగ్రామగాండీవికిన్, వేమక్ష్మాపతి కార్యభారకలనా విఖ్యాత ధీశక్తికిన్, నామామాత్యున కన్యరాజనిటలాంతర్న్యస్తభాగ్యాక్షర, స్తోమాపాకరణప్రవీణునకు మంత్రుల్సాటియే యెవ్వరున్." శైష. ౧, ఆ. 3౦; 3. (ఋణము) తీర్చుట; 4. నిరసించుట.

అపాకరిష్ణువు. సం. విశ. 1. (ఋణము) తీర్చువాఁడు; 2. నిరసించువాఁడు; 3. తొలఁగించువాఁడు.

అపాకర్మము. సం. వి. న్. న. 1. నిరసించుట; 2. తొలఁగించుట; 3. (ఋణము)తీర్చుట.

అపాకృతము. విశ. (అ.ఆ.అ.) 1. తొలఁగింపఁబడినది, తీసివేయఁబడినది. "కం. అపూర్ణ తేజుఁ డపగత, పాపుఁ డపాకృతభవానుబంధుఁడు." భార. ఆది. ౨, ఆ. ౧౬౨; 2. నిరసింపఁబడినది; 3. తీర్పఁబడినది. (ఋణము.)

అపాకృతి. సం. వి. ఇ. స్త్రీ. = అపాకర్మము.

అపాక్రియ. సం. వి. ఆ. స్త్రీ. = అపాకరణము.

అపాటవము. సం. వి. అ. న. 1. పటుత్వములేమి; 2. రోగవిశేషము.—విశ. (అ.ఆ.అ.) 1. పటుత్వము లేనిది. 2. అసమర్థము. "క....మాతలిచేద్పడి రథచోదనమునం దపాటువుఁడైనన్." భార. అర. ౪, ఆ. ౬3.

అపాత్రము. సం.వి.అ.న.1.(దానాదులకు)అర్హుఁడు కానివాఁడు. (నటుఁడు మొ.); 2. విద్యావిహీనుఁడు; 3. ఆచారము లేనివాఁడు.

అపాత్రుఁడు. సం. = అపాత్రము.

అపాదానము. సం. వి. అ. న. 1. (వ్యాక.) భయపడుట మొదలగు క్రియలు దేనివలన జరుగునోఅది, భయపడుటమొదలగు క్రియలకు అవధియగునది. (దీనికి క్రియ నుద్దేశించి పంచమీ కారకము('వలన' అనుప్రత్యయము)వచ్చును."ఆయూరివారు దొంగలవలనభయపడుచున్నారు." ఇత్యాదులయందు దొంగలు అనుపదము అపాదానమనఁబడును;) 2. వెలువడుట, ఎడఁబాసి వచ్చుట.

అపాననము. సం. వి. అ. న. 1. ఊపిరి లోనికిఁ దీయుట, నిశ్శ్వాసము; 2. మూత్రపురీషములను క్రిందికి త్రోసివేయుట.

అపానము. సం. వి. అ. పుం. 1. మూత్రపురీషములను క్రిందికి త్రోసివేయు గాలి. (ప్రాణాదిపంచవాయువులలో నొకటి.) 2. గుహ్యస్థానము, అపానవాయువు పోవుచోటు.

అపామార్గము. సం. వి. అ. పుం. ఉత్తరేను.

అపాయము. సం. వి. అ. పుం. 1. కీడు, చెఱుపు, నాశము; 2. విడఁదీయుట; 3. తొలఁగుట.

అపాయి. సం. విశ. (న్. ఈ.నీ. న్.) అపాయము గలది.

అపారపారము. సం. వి. అ. పుం. సముద్రము,కడలి. శ. ర.

అపారము. సం. వి. అ. న. ఈవలయొడ్డు.—విశ. (అ. ఆ. అ.) 1. ఒడ్డులేనిది; 2. దాఁటశక్యము కానిది; 3. హద్దులేనిది; 4. అధికమైనది.

అపార్థము. సం.వి. అ. పుం. తప్పయినయర్థము.—విశ. (అ.ఆ.అ.) 1. అర్థములేనిది. (శబ్దము); 2. తప్పుఅర్థము కలది. (శబ్దము); 3. వ్యర్థము, ప్రయోజనము లేనిది.

అపావృతము. సం. విశ. (అ. ఆ. అ.) 1. ఆవరింపఁబడనిది, కప్పఁబడనిది, కంచె మొదలగునది లేనిది; 2. స్వతంత్రము, అడ్డులేనిది.

అపావృత్తము. సం. విశ. 1. అంతరించినది; 2. మరలినది.

అపాశ్రయము. సం. వి. అ. పుం. 1. మధ్యభాగము; 2. ఒఱగుదిండు.—విశ. (అ. ఆ. అ.) ప్రాపు పోయినది, ఆశ్రయము లేనిది.

అపాసనము. సం. వి. అ. న. 1. వధము, చంపుట; 2. చిమ్ముట; 3. తొలఁగించుట.

అపాస్తము. సం. విశ. (అ. ఆ. అ.) 1. చిమ్మఁబడినది; 2. నిరసింపఁబడినది; 3. తొలఁగింపఁబడినది.

అపిధానము. సం. వి. అ. న. (అపి+ధానము=పిధానము.) 1. కప్పుట; 2. కప్పుటకు సాధనమైన కత్తియొఱ మొదలైనది; 3. (న+పిధానము.) కప్పకపోవుట.—విణ. (అ. ఆ. అ.) పిధానము లేనిది, కప్పుటలేనిది.

అపినద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) (అపి+నద్ధము.) 1. కట్టఁబడినది, ధరింపఁబడినది. (వస్త్రాది;) 2. (న+పినద్ధము.) కట్టఁబడనిది.

అపిహితము. సం. విణ. (అ.ఆ.అ.) (అపి+హితము=పిహితము.) 1. కప్పఁబడినది; 2. (న+పిహితము.) కప్పఁబడనిది.

అపుడు. దే. = అప్పుడు.

అపుత్రకుఁడు. సం. విణ. (అ. ఆ-త్రికా. అ.) = అపుత్త్రుఁడు.

అపుత్త్రుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) (పుత్త్రులులేని వాఁడు.) 1. అజాతపుత్త్రుఁడు; 2.మృతపుత్త్రుఁడు.

అపుత్త్రిక. సం. వి. ఆ. స్త్రీ. పుత్త్రసంతతి లేని వానికిఁ బుత్త్రికయును తనకుఁ బుత్త్రసంతతి లేనిదియు నగు స్త్రీ, తనతండ్రికిఁగాని తనకుఁగాని పుత్త్ర సంతతి లేని స్త్రీ.

అపునర్భవము. సం. వి. అ. పుం. 1. పునర్భవము లేమి, తిరిగి పుట్టకపోవుట, 2. మోక్షము—విణ. (అ. ఆ. అ.) తిరిగి పుట్టనిది, మరల జన్మింపనిది, పునర్భవము లేనిది.

అపునరున్మీలనము. సం. వి. అ. న. మరలఁ దెఱవకుండుట, (కన్ను) మరల విప్పకుండుట. "తే. మొగుచు జంతువు గాశికానగరిసీమ, నపునరున్మీలనమునకై యక్షియుగముఁ, గాంచు నిక్కల గా నొక్కకలయు నపుడు త్రిణయనుండుఁగఁ దన్ను నద్దీర్ఘనిద్ర." కాశీ. ౬, ఆ. ౨౬౧.

అపురూపము. వై.విణ.అరుదు, తఱచుగాలేనిది. "ఉ. వీణియమట్టుటల్ మిగుల వింతలు పెంపుడుఁ జిల్క బోదతో, రాణ దలిర్పఁ బల్కుట కరం బపురూప మపూర్వమెంతయుఁన్, బ్రాణసఖీరహస్యముల బ్రాఁతియుఁ గ్రీడలు కానివావి యా, యేణవిలోలలోచనకు హెచ్చిన మన్మథచేష్ట నయ్యెడన్." కళా. ౬, ఆ. ౨౧౭.

అపుష్పఫలదము. సం. వి. అ. పుం. 1. పనస♆; 2. ఉదుంబరము♆.—విణ. (అ. ఆ. అ.) 1. పుష్పము లేకుండఁగనే ఫలము నిచ్చునది; 2.కారణము లేకుండఁగ కార్యమును గలిగించునది.

అపూపము. సం. వి. అ. పుం. గోదుమపిండి మొదలగు వానితోఁ జేసిన భక్ష్యము.

అపూర్వవాదము. సం. వి. అ. పుం. 1. అపూర్వమును (=పుణ్యపాపరూపఫలమును) గుఱించిన వాదము, పూర్వమీమాంస; 2. క్రొత్తవాదము.

అపూర్వము. సం. వి. అ. న. 1. (దేనికంటె పూర్వపదార్థము లేదో యది.)పరబ్రహ్మము; 2.యజ్ఞాది కర్మలు ఆచరించుటవలనఁ గలిగెడి పుణ్యపాపరూపఫలము.—విణ.(అ.ఆ.అ.) 1.అపురూపము, వింత."వ.ఇప్పరమేశ్వరి పరమేశ్వరు నగ్రమహిషి యగు టేమియపూర్వం బని నిశ్చయించి." కు.సం. ౭, ఆ. ౧౪౪; 2. తెలియనిది; 3. అసాధారణము; 4. కారణములేనిది; 5. క్రొత్తది.

అపూర్వవాది. సం. వి. (న్. ఈ-నీ. న్.) అపూర్వమును గుఱించి వాదించువాఁడు, పూర్వమీమాంసకుఁడు.

అపృక్తము. సం. వి. అ. పుం. (వ్యాక.) ఏకాక్షరరూపమగు ప్రత్యయము. "అ, న్, జ్, త్." —విణ.(అ.ఆ.అ.) కలియనిది, కూడియుండనిది.

అపేక్ష. సం.వి. ఆ.స్త్రీ. 1. కాంక్ష, కోరిక; 2. ఒకదాని ననుసరించుట; 3. ఆసక్తి; 4. ప్రేమము.

అపేక్షణీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అపేక్షింపఁదగినది; 2. అనుసరింపఁదగినది.

అపేక్షి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) 1. అపేక్షకలవాఁడు; 2. అపేక్షించువాఁడు.

అపేక్షించు. సం. స. క్రి. ఆశించు, కోరు, వేఁడు. "సీ. చనుదెంచి యమ్మహాజనపతి జల మపేక్షించి యచ్చో విశ్రమించి చూచి." భార. ఆది. 3, ఆ. ౧౪౦. "కం. తక్షకుఁ డీకుండలము ల,పేక్షించుచు నుండువాఁ డభేద్యుఁడు." భార. ఆది. ౧, ఆ. ౯౯.

అపేక్షితము. సం. విణ. (అ. ఆ. అ.) అపేక్షింపఁబడినది.

అపేక్ష్యము. సం.విణ.(అ.ఆ.అ.) అపేక్షింపఁదగినది.

అపేతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తొలఁగినది; 2. దూరముగా పోయినది; 3. పరువెత్తినది.

అపేయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. త్రాగఁదగనిది; 2. త్రాగుటకు నిషిద్ధము. (కల్లు); 3. త్రాగననుకూలముగానిది. "సీ. ఒకవిప్రుఁడలిగి పయోనిధిజలము ల,పేయముల్ గాఁగ శపింపఁడెట్లు." భార. అర. ౫, ఆ. ౧౮.

అపైనస్కుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పాపములేనివాఁడు.

అపైనస్సు. సం. విణ. స్. పాపము లేనిది. "శా. పాథోరాశిగభీరు సద్వ్రతరణప్రాగల్భ్యమందారు భూ, నాథాస్థానవిధేయవర్తను నపైనఃపద్ధతీవర్తనున్." సభా. ౪, ఆ. ౧౬౩.

అపోగండుఁడు. సం. వి. అ. పుం. శిశువు.—విణ. (అ. ఆ. అ.) 1. వికలాంగుఁడు; 2. వళులు గలవాఁడు, కడుపునందు ముడతలు గలవాఁడు.

అపోసానము. వై. వి.=అపోశనము. "క. కానీ యీ దివసంబును, నే నిన్నటియట్ల కాక యేమనఁగ నపో, సానంబులు వడ్డించిరి, మానవపతీజనులు లీల మహిదివిజులకున్." భీ. ౨, ఆ. ౧౩౭.

అపోహ. సం. = అపోహము.

అపోహనము. సం. = అపోహము.

అపోహనీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తప్పుగా ఊహింపఁదగినది; 2. విడువఁదగినది.

అపోహపడు. మి. అ. క్రి. (అపోహముపడు.) భ్రాంతిపడు.

అపోహము. సం. వి. అ. పుం. 1. లేనిది ఊహించుట; 2. తప్పైనయూహము, తప్పుగా ఊహించుట; 3. విడుచుట; 4. భ్రాంతి, అనుమానము.

అపోహముపుచ్చు. మి. స. క్రి. భ్రంశముచేయు, పాడుచేయు. "చ. ఎలఁ బొఅవోని మేని నవయించియు రాగరసంబు నిండుఁగుం,డలో యనుపీఁగుఁజన్నులబెడం గెడలించియు మారుపువ్వుఁదూ, పుల నగు లోలదృగ్రుచు లపోహముపుచ్చియు భోగవృద్ధి నిష్ఫలముగఁజేసియున్, దుదిఁ దపంబున నయ్యెడిదేమిసెప్పుమా." కు.సం. ౭, ఆ. ౪౧.

అపౌరుషము. సం. వి. అ. న. పౌరుషములేమి.—విణ. (అ. ఆ. అ.) పౌరుషములేనిది.

అప్చరము. సం. విణ. (అ. ఈ-రీ. అ.) నీటియందు సంచరించునది. (జంతువు మొ.)

అప్డు. ద్వ. = అప్పుడు. "చ. ఆతసిస్థైర్యవృత్తి కప్డరుదుగ మెచ్చి." భార. అర. ౧, ఆ. ౩౨౧.

అప్ప. వై. వి. 1. తల్లి; 2. తండ్రి; "రగడ. అప్పయానతిఁ బూని కానల కరిగి తపసుల వెఅపుఁ దీఱిచి, చుప్పనాకను ముక్కుఁజెవులును సొరిదిఁ గోసి కొఅంతఁజేరిచి." అచ్చ. యు. కాం.౯౪; 3. అక్క. "క. అప్పయుఁ బరిజనములుఁ దనుఁ, దప్పక కనుఁగొనుచునుండ." భార. విరా. ౨, ఆ. ౩౬; 4. వాత్సల్య సంబోధనమును దెలుపును. "క. అప్పా విప్పారెడునగ, వొప్పారఁగఁజూచి పలుకకున్నాఁడవు." అచ్చ. అరో. కాం.౯౨. (పురుషనామాంతములయందుఁ) జేర్చఁబడు పదములలో నొకటి. కోటప్ప,అన్నప్ప.(స్త్రీనామాంతములందు) సుబ్బప్ప, యజ్ఞప్ప మొ.—అవ్య. ఆశ్చర్యమును దెలుపునది.

అప్పప్ప. దే. అవ్య. (అప్ప+అప్ప.) ఆశ్చర్యమును దెలుపునది. "ఉ. అ, ప్పప్ప భపత్స్వభావవిభవాఢ్యత యేమని సన్నుతింపఁగన్." సా. ౧, ఆ. ౩౧. రూ. అప్పా.

అప్పగించు. వై. స. క్రి. 1. ఒప్పగించు; 2. సురక్షితముగ నుంచుటకయి యిచ్చు. "గీ. నీవు చతురమతివి నీకు నిక్కన్నియ, నప్పగింపనేల యైన నాదు,హృదయమతులు దీసియెడఁ గడు నార్ద్రమై,యుండుఁగానఁ జెప్పకుండరాదు." భార. విరా. ౧, ఆ. ౨౪౯.

అప్పగింత. వై. వి. అర్పణము, ఒప్పగింత.

అప్పచి. దే. వి. 1. భక్ష్యము; 2.—బ. ఒకానొక బాలక్రీడ. "ఉ. అప్పచు లాడుచున్ నగవులాడుచు." చంద్రా. ౨, ఆ. ౬. రూ. అప్పచ్చి.

అప్పచ్చి. దే. = అప్పచి.

అప్పటము. దే. విణ. కలపడములేనిది, అచ్చము.

అప్పటి. దే. అవ్య. మరలమరల. "చ. అట్లకా, కనియలభీమనాథునకు నప్పటియుం బ్రణమిల్లి వేడుకన్." రుక్మాం. ౧, ఆ. ౩౩.

అప్పడము. వై. వి. భక్ష్యవిశేషము. "వ. చిఱుగడములుఁ, బడిదెములుఁ, బులుపలు, బులివరుగులు,

నప్పడంబులు, బప్పులు, రొట్టియలును." కాశీ. ౨, ఆ. ౧౮౫.

అప్పతి. సం. వి. ఇ. పుం. (నీళ్లకు రాజు.) **1.** సముద్రుఁడు; **2.** వరుణుఁడు.

అప్పన. వై. వి. **1.** అనుమతి, ఆజ్ఞ. "క. ధనముల జాలెలు రతనపుఁ, బనిఁ దగు నొకవరుసస్సొమ్ముఁ బనిచినగణనా, ఘన కీవచ్చుఁగదా యిపి, యని కోమటికొమిరె వాని యప్పన గొనుచున్." శుక. ౨, ఆ. ౨౧౫; **2.** అప్పనము.

అప్పనము. వై. వి. **1.** అర్పణము; **2.** కానుక; "ద్వి. దొరలు సామంతులు దుర్గాధిపతులు, నరి యప్పనము లీయరని నిశ్చయించి." రా. అర. కాం. ౧౨౮; **3.** పన్ను, శుల్కము.

అప్పన సేయు. వై. స. క్రి. (అప్పనము+చేయు.) ఒప్పగించు. "సీ....పుత్రులకును, దనరాజ్యమెల్ల నప్పన సేసి." భాగ. ౫, స్కం. ౬౬.

అప్పము. వై. వి. (సం. అపూపః.) భక్ష్యవిశేషము. "వ. కుడుములు నప్పంబులు." కాశీ. ౨, ఆ. ౧౮౫.

అప్పళము. వై. వి. **1.** అప్పడము. "చ. వలపులు గ్రమ్మఁగాఁ బొగిచి వండినకారపుఁ గాయగూరల, ప్పళములు." ఉ. రా. ౫, ఆ. ౨౮౮; **2.** ఆస్ఫాలనము.—బ. బాలక్రీడావిశేషము. చూ. అల్లి.

అప్పళించు. వై. అ. క్రి. **1.** యత్నించు, పూను. "ఆ. అనుచుఁ జూచుఁ జేరు నమ్ముగ్ధపలుకులు, వినఁగఁగోరుఁ గేలు తనదుకేలఁ, గీలుకొలుపఁదలఁచుఁ గీచకాధముఁడు ని,జానురక్తిఁ దెలుప నప్పళించు." భార. విరా. ౨, ఆ. ౭౫; **2.** అభిలషించు, కోరు. "తే. వానిఁ గలలోనఁ గానని వనజముఖియు, వాని మార్పడఁ జేరోకనిమానవతియు, వానిఁగా నాత్మభావించి వరునిఁ గవయ, నప్పళింపనిసతియు లేదయ్యె నెచట." నైష. ౧, ఆ. ౬౦.—స. క్రి. **1.** ఆస్ఫాలనము చేయు, చఱచు. "తే. అవనినాథ, యగ్గలించి నాయెదుర బా హుప్పళించి." భార. విరా. ౨, ఆ. ౭; **2.** మోదుకొను, (ఉదరము) కొట్టుకొను; "తే. ముట్టఁబడి మేనఁ గంపంబు పుట్ట నొదిఁగి, యుండువారుఁ గరంబున నుదర మప్పళించి యమ్మరో రక్కసు యంచు." భార. విరా. 3, ఆ. 3౭; **3.** అదుము, నొక్కు. "ద్వి. ఆం దండకౌఁగిట నప్పళింపంగ, ముండట మ్రొక్కుచు మోడ్పుఁగే లమర." బస. ౧, ఆ. ౭౫. పు. ఆక్రమించు; "వ. కడళ్లప్పళించి నెరసి విరిసినం బొలుచుకలుకట్టలుంబోనిది క్తటంబులును." భార. విరా. ౨, ఆ. ౨౮౦; **4.** కప్పు; "చ....లేనగవుఁ బొల్తుకజెప్పల నప్పళించుచున్." స్వా. ౫, ఆ. ౮౫; **5.** గ్రహించు; "చ. పసినికురంగికాపలల పాళి నిజాధరపల్లవంబుపైఁ, బసిగొని చేరఁ బట్టి మునిపండుల నొయ్యన నప్పళింపఁగా." నై. ౬, ఆ. ౧33; **6.** తుడుచు. "తే. చేరఁజేసి, కన్నులను గ్రమ్ము కన్నీరు కరతలమున, నప్పళించుచు." ఉ. రా. ౬, ఆ. ౨౦౭; **7.** మెత్తు; "తే. అప్పళింపు మందారికయడుగులందుఁ, జల్లఁగాఁ బుండరీకకింజల్కధూళి." నై. ౨, ఆ. ౧౪౧; **8.** స్పృశించు. "సీ. తోరంపుటూరులఁ దొడరి యుద్ధతి నితంబములపై నాదటఁ బ్రాకి నాభు, లప్పళించి." హరి. పూ. ౮, ఆ. 3౮.

అప్పళింత. వై. వి. చఱపు, ఆస్ఫాలనము. "ఉ. కింపుఁదనంబు లేక వలకేల నొకించుక యప్పళింత కా, వించినఁ బండ్లు పీడు." రామా. ౭,ఆ. ౧౬౮.

అప్పసము. దే. అవ్య. సతతము, ఎల్లప్పుడు. "చ. పసిరికపాముపంటిదని పల్కుదు రీ యలివేణివేణి న, ప్పసమును నిండుఁగుండలయి భాసిలునీ లలితాంగి గుబ్బల" శుక. ౧, ఆ. 33౯.—వి. చిన్నసీటికాలువ.

అప్పా. వై.=అప్ప. "ఉ. అప్పా యప్పురిఁ జెప్పనొప్పదురు రూపాజీవికారత్నముల్." రా. వి. ౧, ఆ. ౫౮.

అప్పాట. దే. (అ + పాట.) ఆసమయమున నే. "తే. పూర్వజన్మకృతంబైన పుణ్యరాశి, పాకదశఁ బొందు నెప్పు డప్పాటఁగాని, సకలసంసారదురితనిస్తారమైన, శివకథాగోష్ఠి చెవులకుఁ జేలువు గాదు." భీమ. 3, ఆ. ౭౨. (పాటశబ్దము త్రికపూర్వమయినపుడే సమయ మనునర్థమును దెలుపును.)

అప్పిత్తము. సం. వి.అ. న. (నీళ్లకు పిత్తమువంటిది.) అగ్ని.

అప్పీలు. ఆం. వి. క్రిందిన్యాయాధికారి తీర్పులోని దోషములు చూపి విమర్శించి న్యాయము చెప్పఁడని కోరుచు పైయధికారులకు చేసినవిన్నపము.

అప్పు. ఉభ. దే. వి. ఋణము.—సం. వ్. స్త్రీ. బ. నీళ్లు. "వ. నాకు జలంబులు ప్రవేశింపరామి నంద పరికింప నేరనైతి నప్పులవలన నగ్నియు." భార. ఉద్యో. ౧, ఆ. ౧౮౫.

అప్పుడు. దే. వి. వి. ఔప. (అ+ప్రొద్దు.) (త. అప్పొటుదు, అప్పొ;క. అప్పొట్టు.) 1. ఆకాలము. విశేషణము మీఁద నున్నపుడు తచ్ఛబ్దార్థమును విడిచి కేవలము కాలవాచకమగును. "ఎల్లప్పుడు, చూచినప్పుడు;" 2. ఏవార్థకములగు అ, ఎ, ఏలు చేరినపుడు 'తత్‌క్షణమే' అను అర్థమును తెలుపును. (అప్పుడ, అప్పుడె, అప్పుడే.) "క. విషధరపతి యేర్పడ నిజరూపముతో నప్పుడ యహిలోకమున కరిగె భూవివరము నన్." భార. ఆది. ౧, ఆ. ౧౦౩. (సం. తక్షకస్స్వరూపం కృత్వా సహసా ధరణ్యాం వివృతం మహాబిలం ప్రవివేశ. ఆది. 3, అధ్యా.) "క. ఆయసుర నన్ను సూకర,మై యప్పుడ యెత్తికొని రయంబునఁ జనుచోన్." భార. ఆది. ౧, ఆ. ౧౩౮.—అప్పటితో, అప్పటికంటె, అప్పటికి, అప్పటిలో, అప్పటి (స్థితి)—ఇత్యాదులు ఔపవిభక్తికరూపములు గలవు."వ...దుర్యోధనుండు వీరికి రాజ్యంబుపాలిచ్చిన మేలగుఁగాక తక్కినప్పటికిఁ బోలినపని చూచుకొందము." భార. ఉద్యో. ౧, ఆ. ౧౭. "వ. అప్పుడపరాహ్ణంబయ్యెఁ దత్సమయంబున భవత్సూనులు." భార. భీష్మ. ౨,ఆ.౨౩౬. ఇట "అప్పుడు" కాలవాచకమగుటచే సప్తమ్యర్థమున వచ్చినప్రథమగా గ్రహించి 'ఆసమయమున' అను నర్థము చెప్పవచ్చును. రూ. అపుడు, అప్డు.

అప్పులకాఁపు. దే. వి. అప్పుపుచ్చుకొన్నవాఁడు.

అప్పులపోతు. దే. = అప్పులకాఁపు.

అప్పులవాఁడు. దే. వి. అప్పిచ్చినవాఁడు.

అప్పువడు. ద్వ. అ. క్రి. ఋణపడు, బాకీపడు.

అప్పుసప్పులు. దే. వి. బ. అప్పులు. "సీ. అప్పుసప్పులు దీసి యడిగిన నియ్యక బహుఋణంబుల పాలుపడెను వీఁడు." సానం. ౨, ఆ. ౧౦౬.

అప్రకృతము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రకృతము కానిది, అప్పటిప్రసంగమునకు సందర్భింపనిది. "అప్రకృతసంభాషణ."

అప్రగుణము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వ్యాకులమైనది; 2. అనుగుణముకానిది, ప్రతికూలము.

అప్రజస్కుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) సంతతిలేనివాఁడు, అప్రజుఁడు.

అప్రజాత. సం. వి. ఆ. స్త్రీ. సంతతిలేని స్త్రీ, గొడ్రాలు.

అప్రజుఁడు. సం. విణ. న్. = అప్రజస్కుఁడు.

అప్రతికారము. సం. వి. అ. పుం. 1. ప్రతిక్రియలేమి; 2. ప్రతిక్రియచేయమి—విణ. (అ. ఆ. అ.) ప్రతిక్రియలేనిది. "శా. క్రోధం బప్రతికారమై హృదయముం గుందింప నత్యంతచిం, తాధూతాత్ముఁడను."భార. విరా. ౭, ఆ. ౨౭౫.

అప్రతిపత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. నిశ్చయములేమి; 2. పొందకపోవుట, స్వీకరింపమి; 3. గౌరవములేమి.—విణ. ఇ. 1. నిశ్చయము లేనివాఁడు; 2. గౌరవము లేనివాఁడు.

అప్రతిముఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సాటిలేనివాఁడు.

అప్రతిరథుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ప్రతియోద్ధ లేనివాఁడు, శత్రువులేనివాఁడు.

అప్రతిరవము. సం. విణ. (అ.అ.అ.) 1. ప్రతిధ్వని లేనిది; 2. (వ్యవ.) 'ఇది నాది నీవు అనుభవింపఁగూడ'దని ప్రతికూలముగ చెప్పువాఁడు లేనిది, అడ్డులేనిది. (భూమ్యాదులయొక్క అనుభవము.)

అప్రతిరూపము. సం. విణ. (అ.ఆ.అ.) సాటిలేనిది.

అప్రతిష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. ప్రతిష్ఠలేమి, అపకీర్తి.

అప్రతిహతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అడ్డులేనిది. "వ. క్రమ్మఱఁ బండ్రెండు వత్సరంబులు వనవాసంబు సలుపం బుత్త మట్లైన నప్రతిహతంబుగాఁ జతురంతభూచక్రం బాక్రమించి."

భార. విరా. 3, ఆ. ౧౧౮; **2.** అడ్డుపెట్టఁబడనిది; **3.** తిరస్కరింపఁబడనిది.

అప్రతిహన్యమానము. సం. విణ. (అ.ఆ.అ.) (నిరోధింపఁబడుచున్నదికానిది.) నిరోధింపఁబడనిది, అడ్డులేనిది. "చ. అమితజగద్భయంకరవిషాగ్నియు నప్రతిహన్యమానవీ,ర్యముఁ గలయట్టి సర్పముల." భార. ఆది. ౧, ఆ. ౧౨౮.

అప్రతీకము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** అవయవములు లేనిది (బ్రహ్మము); **2.** సంపూర్ణము.

అప్రతీతము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** అప్రసిద్ధము; **2.** తెలియఁబడనిది, అపరిజ్ఞాతము.

అప్రతీతి. సం. వి. ఇ. స్త్రీ. **1.** అజ్ఞానము, జ్ఞానములేమి; **2.** అప్రసిద్ధి.

అప్రతీపము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రతికూలముకానిది, అనుకూలము.

అప్రత్యక్షము. సం. వి. అ. న. ప్రత్యక్షము కాకపోయినది.—విణ. (అ.ఆ.అ.) ప్రత్యక్షముకానిది, పరోక్షము.—క్రి.విణ. అ.న. ప్రత్యక్షము కాకపోవునట్లు, చాటుగా.

అప్రత్యయము. సం. వి. అ. పుం. **1.** విశ్వాసములేమి; **2.** జ్ఞానములేమి; **3.** (వ్యాక.) ప్రత్యయములు లేమి.—విణ. (అ. ఆ. అ.) **1.** విశ్వాసములేనిది; **2.** జ్ఞానములేనిది; **3.** (వ్యాక.) ప్రత్యయము లేనిది. (శబ్దము).

అప్రదక్షిణము. సం. వి. అ. న. ఎడమప్రక్కగా చుట్టివచ్చుట, అపసవ్యముగా తిరుగుట.

అప్రధానము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రధానముకానిది, ముఖ్యముకానిది.

అప్రమత్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) **1.** ప్రమాదము లేనివాఁడు, సావధానముగ నున్నవాఁడు; **2.** మత్తుఁడుకానివాఁడు.

అప్రమాణము. సం. వి. అ. న. **1.** ప్రమాణములేమి; **2.** తప్పుప్రమాణము.—విణ. (అ.ఆ.అ.) **1.** ప్రమాణము లేనిది; **2.** ప్రమాణము కానిది.

అప్రమేయము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** ఇది యిట్టిదని ఊహింపశక్యముకానిది; **2.** పరిమితి చేయ శక్యముకానిది, అపరిచ్ఛేద్యము. (బ్రహ్మము).

అప్రయోజకుఁడు. సం. విణ. (అ. ఈ-జికా. అ.) ప్రయోజకుఁడు కానివాఁడు.

అప్రయోజనము. సం. వి. అ. న. ప్రయోజనములేమి.—విణ. (అ.ఆ.అ.) ప్రయోజనములేనిది.

అప్రవృత్తి. సం. వి. ఇ. స్త్రీ. ప్రవర్తింపకపోవుట, నివృత్తి.—విణ. ఇ. ప్రవృత్తిలేనిది.

అప్రశస్తము. సం. విణ. (అ. ఆ. అ.) (ప్రశస్తముకానిది.) **1.** హీనము, నీచము; **2.** దుష్టము.

అప్రసక్తము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** ప్రసంగములేనిది; **2.** అసంబద్ధము, పొసఁగనిది; **3.** పట్టుదల లేనిది.

అప్రసన్నము. సం. విణ. (ఆ. ఆ. అ.) (ప్రసన్నముకానిది.) **1.** దయలేనిది; **2.** స్వచ్ఛముకానిది; **3.** సంతోషింపనిది; **4.** స్ఫూర్తిలేనిది.(మనస్సు).

అప్రసిద్ధము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** ప్రసిద్ధముకానిది; **2.** సిద్ధముకానిది.

అప్రసిద్ధి. సం. విణ. ఇ. ప్రసిద్ధి లేనిది.—వి. ఇ. స్త్రీ. ప్రసిద్ధిలేమి.

అప్రస్తుతప్రశంస. సం. వి. ఆ. స్త్రీ. **1.** ప్రకృతమునకు సంబంధింపని విషయముచెప్పుట; **2.** ఒకానొక అర్థాలంకారము. చూ. అలంకారము.

అప్రస్తుతము. సం. విణ. (అ. ఆ. అ.) (ప్రస్తుతముకానిది.) **1.** కార్యసాధనముగా పూనుకొనఁబడనిది; **2.** స్తుతింపఁబడనిది; **3.** ప్రకృతముకానిది, అప్పటిసందర్భమునకు సంబంధింపనిది.

అప్రహతము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** క్షుణ్ణముకానిది, దున్ననిది. (నేల); **2.** చలువచేయఁబడనిది. (బట్ట).

అప్రాకృతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) **1.** సామాన్య స్వభావము లేనివాఁడు, అసాధారణుఁడు. (మనుష్యుఁడు;) **2.** ప్రకృతియొక్క కార్యము లేనివాఁడు. (ఈశ్వరుఁడు).

అప్రాప్తము. సం. విణ. (అ. ఆ. అ.) పొందఁబడనిది. "అప్రాప్తకాలము, అప్రాప్తవ్యవహారుఁడు." (= వ్యవహారాధికారకాలము రాని బాలుఁడు).

అప్రామాణికుఁడు. సం. విణ. (అ. ఈ-కీ. అ.) ప్రామాణికుఁడుకానివాఁడు, విశ్వసింపఁదగనివాఁడు.

అప్రాశ్యుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) పఙ్క్తియందు భుజింపఁ దగనివాఁడు, అపాఙ్క్తేయుఁడు, నింద్యుఁడు.

అప్రియము. సం. విశే. (అ. ఆ. అ.) ప్రియము కానిది, ఇష్టముకానిది.—వి. అ. న. అనిష్టవచనము, అనిష్టకార్యము.

అప్సర. సం. వి. ఆ. స్త్రీ. = అప్సరస.

అప్సరస. సం. వి. స్. స్త్రీ. అప్సరఃస్త్రీ, అచ్చెర.

అఫల. సం. వి. ఆ. స్త్రీ. 1. ఘృతకుమారి, కలబంద♆; 2. నేలఉసిరిక♆.

అఫలము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పండులేనిది, గొడ్డుది. (చెట్టు;) 2. నిష్ఫలము, సుఖాదిఫలము లేనిది. (జన్మము;) 3. వృషణములు లేనిది, పిచ్చలు తీసివేసినది.—వి. అ. పుం. మేషము, గొఱ్ఱె. వృషణములుఁబోయిన ఇంద్రుని వృషణములకొఱకై యొకగొఱ్ఱె వృషణములు తీసి యతుకఁబడినవని పురాణగాథ.

అఫలుఁడు. సం. వి. అ. పుం. (గౌతమశాపమువలన వృషణశూన్యుఁ డయినవాఁడు.) ఇంద్రుఁడు.

అఫేనము. సం. విశే. (అ. ఆ. అ.) నురుగులేనిది. (పాలు.)—వి. అ. న. అహిఫేనము, నల్లమందు.

అబందర. వై. విశే. 1. పాడయినది, చెడినది; "వ్యవహారము అబందరగా నున్నది." అని కొన్ని చోట్ల వాడుక." 2. అజ్ఞుఁడు, ఏమియు తెలియనివాఁడు. "వాఁడు వట్టి అబందరవాఁడు." 'అబందన' అనియు కొందఱు.

అబక. దే. వి. = అగప.

అబద్ధము. సం. విశే. (అ.ఆ.అ.) 1. అసంబద్ధము, సందర్భము మాలినమాట; "వ. ఇంతకంటె నేమి యబద్ధంబులు వినంబడునో." ఆము. ౬., ఆ. ౩౬; 2. అశాస్త్రీయము, అప్రమాణము; 3. అసత్యము. "ఉ. విను భానుతనూభవ నిన్ను నీపుర,శ్రీ వివరింప వచ్చుటలు సిద్ధ మబద్ధములాడ మెయ్యెడన్." సాంబ. ౩, ఆ. ౩౩. "సీ. మాయబద్ధవాక్యములకుఁ దప్పు పట్టకుమయ్య." నై. ౭, ఆ. ౬౦.ఈయర్థము వాడుకలో సుప్రసిద్ధము.

అబల. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుది, అతివ.—విశే. (అ. ఆ. అ.) బలములేనిది.

అబాధకము. సం. విశే. (అ.ఆ.అ.) 1. బాధలేనిది; 2. అడ్డపాటులేనిది, నిరర్గళము.

అబాధము. సం. = అబాధకము.

అబాధితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. బాధింపఁబడనిది; 2. నిరోధింపఁబడనిది, అడ్డులేనిది.

అబాధ్యము. సం. విశే. (అ. ఆ. అ.) 1. బాధింపఁదగనిది; 2. నిరోధింపఁదగనిది.

అబిసీలు. దే. వి. బ. సికారు, వాహ్యాళి. "సీ. ఇది గాడ్పుబాబాల సెక్కి క్రొవ్విరితావి యబిసీల్ దువాళించునట్టిబయలు." చంద్రా. ౪, ఆ.౧౯౨.

అబుద్ధము. సం. విశే. (అ.ఆ.అ.) 1. తెలిసికొననిది; 2. తెలిసికొనఁబడనిది.

అబోధము. సం. వి. అ. పుం. 1. తెలివిలేమి; 2. చైతన్యములేమి. "క. అధర్మనందనుఁడు సక్రోధాత్ముఁడగుచు నేసెఁ గోదండము నుగ్గై ధరఁ దొరఁగఁగ నాతఁ డబోధంబునఁ దేరిమీఁదఁ బోలు పటిె వ్రాలెన్." భార. ద్రో. ౫, ఆ. ౫౩.—విశే. (అ. ఆ. అ.) 1. బోధములేనిది, తెలియనిది; 2. చైతన్యములేనిది. వ్యతి. సుబోధము.

అబ్జజుఁడు. సం. వి. అ. పుం. తమ్మిచూలి, బ్రహ్మ.

అబ్జబాంధవుఁడు. సం. వి. అ. పుం. (పద్మబంధువు.) సూర్యుఁడు.

అబ్జభవుఁడు. సం. = అబ్జజుఁడు.

అబ్జము. సం.వి. అ. న. (నీటిలోఁబుట్టినది.) 1. పద్మము; 2. ఉప్పు.—పుం. న. శంఖము.—పుం. 1.ఎఱ్ఱగన్నేరు♆; 2. నిచుళము, నీటిప్రబ్బలి♆; 3. కల్పవృక్షము.—విశే. (అ. ఆ. అ.) నీటియందుఁబుట్టినది.

అబ్జయోని. సం. వి. ఇ. పుం. తమ్మిచూలి, బ్రహ్మ.

అబ్జారి. సం.వి. ఇ.పుం.(పద్మములకువైరి.) చంద్రుఁడు.

అబ్జిని. సం. వి. ఈ. స్త్రీ. 1. పద్మసమూహము; 2. పద్మలత.

అబ్జుఁడు. సం. వి. అ. పుం. (పాలసముద్రమునఁ బుట్టినవాఁడు.) 1. చంద్రుఁడు; 2. ధన్వంతరి.

అబ్దము. సం. వి. అ. పుం. **1.** సంవత్సరము, ఏఁడు; **2.** మేఘము; **3.** ఒకానొకకొండ; **4.** తుంగ; **5.** అద్దము. ఈయర్థమున జైనపురాణములందు ప్రయోగము గలదు.

అబ్దసారము. సం. వి. అ. పుం. (ముస్తలసారము.) ఒకరకము కర్పూరము.

అబ్ధి. సం. వి. ఇ. పుం. (నీరు దీనియందు ఉండును.) **1.** సముద్రము; **2.** జలాశయము, సరస్సు; **3.** (చతుస్సముద్రము లనుటచే)నాలుగు సంఖ్యకును, (సప్తసాగరము లనుటచే) ఏడుసంఖ్యకును వాడఁబడిన సంకేతము.

అబ్ధికఫము. సం. వి. అ. పుం.(సముద్రునికి కఫము వంటిది.) ఫేనము, నురుఁగు.

అబ్ధిజము. సం. వి. అ. న. శంఖము.

అబ్ధిజుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) (సముద్రమునఁ బుట్టినవాఁడు.) చంద్రుఁడు.—బ. అశ్వినీదేవతలు.

అబ్బగించు. దే. అ. క్రి. సహించు, తాళు, ఓర్చు. "వ. ఇట్లతిభీషణశాసనులైన గణాధీశ్వరుల కవిదల కబ్బగింపక సురవరు లతిసంభ్రమంబునం బరిమొగంబు దప్పం గనుకనిం జనునవసరంబున." కు. సం. ౨, ఆ. ౨౦౨. "వ. తదవసరంబున నసురవీరకరయంత్రముక్తముక్తాద్యాయుధ ప్రహతి కసురబలంబు లబ్బగింపక." కు. సం. ౧౨, ఆ. ౮. (వ్యతిరేకక్త్వార్థకముతోనే ప్రయోగము కలదు.)

అబ్ధిమేఖల. సం. వి. ఆ. స్త్రీ. (సముద్రము మొలనూలుగాఁగలది.) భూమి, నేల.

అబ్బ. దే. వి. **1.**తండ్రి; **2.** వాత్సల్యాదులను తెలుపును.—అవ్య.బాధను దెలుపునది. రూ. అబ్బా.

అబ్బకాఁడు. ద్వ. విణ. మొద్దు, మూఢుఁడు. "క. అని చింద రేఁగినట్లు,చ్చెనఁటిధరాసురుఁడు చెంతఁ జేపడిననిధిన్, మునిగాలఁ దన్ని చనుగతి, ఘనజఘనన్ బాసి యబ్బకాఁడుగఁబోయెన్." పంచ. వేం. ౪, ఆ. ౨౬౨.

అబ్బబ్బ. వై. వి. అబ్బకు అబ్బ, పితామహుఁడు. —అవ్య. (అబ్బ ఆమ్రేడితము.) "ఉ. అ, బ్బబ్బ నితాంతకంతుశిఖిఖాగ్నిశిఖాపరితాప మాఱునే." రసి. ౩, ఆ. ౧౯. రూ. అబ్బబ్బా.

అబ్బబ్బా. వై. = అబ్బబ్బ.

అబ్బరము. వై. విణ.=అబ్బురము. "చ.... మెఱుఁగుటమ్ము ల,బ్బరముగఁ బూన్చి యయ్యుఱెయ బంటుల నిద్దపుమేనులెల్ల వా, విరి నలియంగ నేసి." అచ్చ. యు. కాం. ౧౮౯. ఇట 'అద్భుతముగా' అని అర్థము. అపారము అని శ. ర.

అబ్బాటు. దే. వి. సమ్మర్దమువలనఁ గలిగెడుకాఁక. "వ. ఇంపారుకలపంబు లబ్బాటునం జేటులెత్తి యొండొరులయొత్తడిం బొడిపొడియై." స్వా. ౫, ఆ. ౭౧.

అబ్బాయి. దే. వి. **1.** బాలుఁడు; **2.** కుమారుఁడు.

అబ్బాలాడు. దే. అ క్రి. (అబ్బాలు+ఆడు.)తడఁబడు, సంభ్రమించు. శ. ర.

అబ్బి. దే. (అబ్బ శబ్దమునకు వాత్సల్యసంబోధనాదులయందు చివర ఇత్వము గలిగిన రూపమయి యుండును.) **1.** బాలుఁడు; **2.** పుత్త్రుఁడు; **3.** నీచార్థమును తెలుపును. "పీఘులు తుడుచు అబ్బికి జీతము సరిగా ఇవ్వవలెను." "ఆ అబ్బిని ఇటు పిలువుము."

అబ్బు. వై. అ. క్రి. **1.** దొరకు, లభించు. "ఆ. అపుడ వారి నరయ నబ్బునే యద్దశఁ, దలఁచి ముక్తిఁ గోరఁదగదె." భార. శాం. ౫, ఆ. ౪౬౧. "వానికి చదువబ్బలేదు." ౭౫; "క. ననుఁ గానఁబడయ రెవ్వరు, ననఘా యేకాంతికులక యర్హము మద్ద,ర్శన మీ వేకాంతికుఁడవు, నన హంకారుఁడవుఁ గాన యబ్బెం జూడన్." భార. శాంతి. ౬, ఆ. ౩౭౯; **2.** సిద్ధించు, ఈడేఱు. "సీ. వైవస్వతుని కబ్బు వాంఛితంబు" వై. ౪, ఆ. ౭౫.

అబ్బురపడు. వై. అ. క్రి. (అబ్బురము+పడు.) వెఱఁగుపడు, ఆశ్చర్యపడు.

అబ్బురపాటు. వై. వి. అబ్బురపడుట, అద్భుతము.

అబ్బురము. వై. విణ. (సం. అపూర్వమ్.) **1.** అసాధారణము, అరిది. "తే. పావనులయింటఁ బుట్టిన బహిరబహిర, రాతివర్గ జయం బజస్రమును గలిగి, వర్తిలుట యబ్బురముగాన." కళా. ౫,ఆ.౧౮౯; **2.** క్రొత్తది; **3.** వింత, ఆశ్చర్యము.—వి. ఆశ్చర్యము. చూ. అబ్బురపడు. రూ. అబ్రము.

అబ్బె. దే. అవ్య. అనిష్టము, అనాదరము మొదలగు భావములను సూచించును.

అబ్బెంద. దే. వి. వృక్షవిశేషము. "రగడ. అబ్బెందల మాకబ్బెందలఁ జెలి." య. ౪, ఆ. ౨౬.

అబ్బెసము. వై. వి. (సం. అభ్యాసః.) అలవాటు. "తే. మౌనమును శౌచమును యంత్రమంత్రములును, గావు కారణములు యోగకలనమునకు, నిశ్చయంబును నభియోగనిశ్చలతయుఁ, గడఁకయును నబ్బెసముఁగాని కలశజన్మ." కాశీ. ౫, ఆ. ౨౩౨.

అబ్బో. దే. అవ్య. ఆశ్చర్యాదిభావములను తెలుపును. "అబ్బో, వాఁ డెంతవాఁ డయినాఁడు!"

అబ్రపడు. వై. అ. క్రి. (అబ్రము+పడు.) ఆశ్చర్యపడు.

అబ్రము. వై.=అబ్బురము. "క. ఏమీ యిది దేవర కనుఁ,దామరలకు నింతవెఱఁగు దలకొలిపెడు నే, మే మనఁగ సహహ నాక, స్వామికి నబ్రమగు ప్రోలు వసుమతిఁ గలిగెన్." ప్రభా. ౧, ఆ. ౫౬. ఇట 'ఆశ్చర్యము' అని అర్థము.

అబ్రహ్మణ్యము. సం. వి. అ. న. (బ్రహ్మకర్మవిరుద్ధము.) **1.** హింస; **2.** అవధ్యోక్తి, చంపవలదని పెట్టుమొఱ; **3.** మొఱ్ఱ. "వ. ఏమును నిమ్మహోపద్రవంబునకుఁ బ్రశాంతి గోరి యబ్రహ్మణ్యంబు సేయుచు బ్రహ్మశరణు సొచ్చితిమి." కాశీ. ౨, ఆ. ౭౪. "శా. ఈవృక్షవాటంబులో, భామా యేఁ దప మాచరింతు విధి కబ్రహ్మణ్యముం బెట్టుచున్." స్కా. ౩, ఆ. ౧౦౨. "మ. బలభిన్ముఖ్యులు పాహిపాహియని యబ్రహ్మణ్యముం బెట్టఁగన్." దశా. ౨, ఆ. ౪౧౧.

అబ్రాశి. సం. వి. ఇ. పుం. నీటిప్రోవు, సముద్రము.

అభంగురము. సం. విశే. (అ. ఆ. అ.) భంగురము కానిది, నశింపనిది.

అభయ. సం. వి. ఆ. స్త్రీ. కరక్కాయ.

అభయము. సం. వి. అ. న. **1.** భయములేమి; **2.** పరమాత్మ; **3.** పరమాత్మజ్ఞానము; **4.** భయపడకుమని చూపెడి హస్తముద్ర, అభయహస్తము; **5.** రక్షణము, శరణము "అభయమిచ్చు;" **6.** వట్టివేరు.—విశే. (అ. ఆ. అ.) భయములేనిది.

అభయదానము. సం. వి. అ. న. అభయమిచ్చుట, భయములేదని శరణమిచ్చుట.

అభయహస్తము. సం. వి. అ. పుం. భయములేదని సూచించుహస్తము. "అభయహస్తమిచ్చు" (=శరణమిచ్చు.)

అభవుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) పుట్టుకలేనివాఁడు. —వి. అ. పుం. ఈశ్వరుఁడు.

అభాగ్యము. సం. వి. అ. న. భాగ్యములేమి, దురదృష్టము.—విశే. (అ. ఆ. అ.) భాగ్యములేనిది, అదృష్టములేనిది.

అభావము. సం. వి. అ. పుం. **1.** ఏమియులేమి; **2.** (ప్రపంచమున లేకపోవుట.) చావు, మరణము; —విశే. (అ. ఆ. అ.) **1.** భావము లేనిది; **2.** సత్యము లేనిది; **3.** అసత్యము, మిథ్య అయినది.

అభాషణము. సం. వి. అ. న. మాటలేమి, మౌనము. —విశే. (అ. ఆ. అ.) మాటలేనిది.

అభాసము. సం. వి. అ. పుం. **1.** ప్రకాశములేమి; **2.** సరిగా బోధపడకపోవుట; **3.** భ్రంశము, చెడుట.(ఈయర్థము తెలుఁగువాడుకలో కలదు.) "చేసిన పనియంతయు చివరకు అభాసమయినది." 'అభాసు అయినది' అనియు వాడుక. 'అవభాసము'న 'వ' లోపించినరూపము అయినను కావచ్చును.

అభాసు. సం. = అభాసము.

అభి. సం. అవ. **1.** ఆభిముఖ్యము మొదలగువానినిఁ దెలుపును. "అభిముఖుఁడు, అభిగమనము, అభినివేశము, అభిరూపము." **2.** కొన్నిచోట్ల అర్థవిశేషము లేకయే సమాసపూర్వపదముగా నుపయుక్తము. "అభినవము."—ఉప. **1.** క్రియలకు పూర్వమున నుపయుక్తమయి ఆభిముఖ్యాద్యర్థముల సూచించును. "అభిచరించు;" **2.** కొన్నిచోట్ల అర్థవిశేషము లేకయే చేర్పఁబడును. "అభిదర్శించు."

అభికాంక్ష. సం. వి. ఆ. స్త్రీ. అభిలాష, కోరిక.

అభికాంక్షి. సం. విశే. (న్. ఈ-ణీ. న్.) అభిలషించువాఁడు, కోరువాఁడు.

అభికాంక్షితము. సం. విశే. (అ.ఆ.అ.) అభిలషింపఁబడినది, కోరఁబడినది.

అభికామము. సం. వి. అ. పుం. కోరిక, అభిలాష.

అభికాముఁడు. సం. విశే. (అ. ఆ. అ.) కోరుచున్న వాఁడు.

అభికుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. కోరికగల వాఁడు; 2. కాముకుఁడు.

అభికృతి. సం. వి. ఇ. స్త్రీ. ఇరువదియైదవ ఛందస్సు. ఇందు పాదమునకు ఇరువదియైదక్షరము లుండును. (అతికృతి అని కొందఱు.)

అభిక్రమణము. సం. వి. అ. న. = అభిక్రమము.

అభిక్రమము. సం. వి. అ. పుం. 1. ఆరంభము; 2. శత్రువులమీఁద దండెత్తుట; 3. యుద్ధము; 4. ఆరోహణము, ఎక్కుట.

అభిక్రోశకుఁడు. సం. విశే. (అ. ఆ-శికా. అ.) నిందించువాఁడు.

అభిక్రోశము. సం. వి. అ. పుం. 1. నింద; 2. ఏడ్పు, దుఃఖము.

అభిఖ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. నామధేయము, పేరు; 2. కీర్తి; 3. కాంతి.

అభిగంత. సం. విశే. (ఋ.ఈ-త్రీ.ఋ.)=అభిగామి.

అభిగంతవ్యుఁడు. సం. = అభిగమ్యుఁడు.

అభిగతము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పొందఁబడినది; 2. (రతియందు) పొందఁబడినది; 3. సేవింపఁబడినది; 4. ఎదురుగాఁబోయినది;

అభిగమనము. సం. వి.అ. న. 1. పొందు, పొందిక; 2. ఎదురుగాఁబోవుట; 3. (రతియందుఁ) గూడుట. "పరదారాభిగమనము;" 4. సేవించుట. "సర్వతీర్థాభిగమనము."

అభిగమనీయుఁడు. సం. = అభిగమ్యుఁడు.

అభిగమము. సం. వి. అ. పుం.=అభిగమనము.

అభిగమ్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. పొందఁదగినవాఁడు; 2.(రతియందు)పొందఁదగినవాఁడు; 3. ఎదురుగా పోయి చెంతఁజేరుటకు శక్యమైన వాఁడు, సౌమ్యుఁడు; 4. సేవింపఁదగినవాఁడు. "వ. సర్వలోకాభిగమ్యుండగు నమ్మహానుభావు నకు మన మభిగమ్యుల మైతిమి." భార. ఉద్యో. 3, ఆ. ౧౪౯.

అభిగామి. సం. విశే. (న్.ఈ-నీ.న్.) 1. పొందువాఁడు; 2. రతియందు పొందువాఁడు. "పరదారాభిగామి;" 3. సేవించువాఁడు; 4. ఎదురుగాఁబోవువాఁడు; 5. (శత్రువులమీఁదికి) దండెత్తిపోవువాఁడు.

అభిగ్రహణము. సం. వి. అ. న. = అభిగ్రహము.

అభిగ్రహము. సం. వి. అ. పుం. 1. ఎదురుకొనిపోయి యాక్రమించుట; 2. దాడివెడలుట; 3. గౌరవము; 4. దారులుఁగొట్టుట, తెరువాటు, కొల్లపెట్టుట.

అభిఘరించు. సం. స. క్రి. (నెయ్యి) సంస్కారార్థము కొంచెమువేయు, అభిఘారముచేయు. "సీ. అన్నంబు నునిచి నెయ్యభిఘరించి." కాశీ. ౨, ఆ. ౧౪౧.

అభిఘర్షణము. సం. వి. అ. న. 1. రాపిడి; 2. మర్దించుట; 3. దయ్యము సోఁకుట.

అభిఘాతకుఁడు. సం. విశే. (అ. ఆ-తికా. అ.) 1. కొట్టువాఁడు; 2. సమూలనాశనము చేయువాఁడు.—వి. అ. పుం. శత్రువు.

అభిఘాతము. సం. వి. అ. పుం. 1. కొట్టుట, తాడనము; 2. దెబ్బ; 3. సమూలనాశనము.

అభిఘాతి. సం. విశే. (న్. ఈ - నీ. న్.) —వి. = అభిఘాతకుఁడు.

అభిఘారణము. సం. వి. అ. న. = అభిఘారము.

అభిఘారము. సం. వి. అ. పుం. 1. అభిఘరించుట; 2. నేయి హోమముపై వైచుట; 3. తిరుగఁబోఁత. శ. ర.

అభిచరించు. సం. అ. క్రి. 1. చుట్టునుతిరుగు; 2. సంచరించు, తిరుగు.

అభిచరుఁడు. సం. విశే. (అ.ఈ-రీ.అ.) 1. చుట్టును తిరుగువాఁడు; 2. భృత్యుఁడు; 3. సహాయుఁడు.

అభిచారము. సం. వి. అ. పుం. 1. శత్రువులను హింసించుటకయి చేయుహోమాదిక్రియ; 2. చిల్లింగిపెట్టుట, ప్రయోగముచేయుట. 'తోఁడు బోతుపెట్టుట' అనియు కొన్నిచోట్ల వాడుక.

అభిజనము. సం. వి. అ. పుం. 1. జన్మభూమి, పుట్టిన యూరు; 2. తనపూర్వులు నివసించినచోటు;

3. కులము; 4. కులక్రమాగతమయిన టెక్కెము లోనగు చిహ్నము; 5. పొగడ్త; 6. కీర్తి.

అభిజనుఁడు. సం. వి. అ. పుం. 1. (వంశమునకు) మూలపురుషుఁడు; 2. (కులమున) శ్రేష్ఠుఁడు.

అభిజాతి. సం. వి. ఇ. స్త్రీ. ప్రశస్తవంశమున పుట్టుట.

అభిజాతుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. ప్రశస్త కులమునఁ బుట్టినవాఁడు, కులీనుఁడు; 2. పండితుఁడు; 3. తగవరి,న్యాయము తీర్చువాఁడు; 4. సుందరుఁడు.

అభిజిత్తు. సం. వి. త్. స్త్రీ. 1. పగటఁ బదునాలుగు గడియలమీఁద రెండుగడియలకాలము, కుతపకాలము; 2. ఒకనక్షత్రము. చూ. నక్షత్రము. —విణ. త్. 1. ఎదురుగా పోయి జయించువాఁడు; 2. అంతటను జయించువాఁడు.

అభిజ్ఞ. సం. వి. ఆ. స్త్రీ. 1. తెలిసికొనుట; 2. ప్రత్యభిజ్ఞ, ఆనవాలు పట్టుట, గుర్తించుట; 3. స్మృతి, జ్ఞప్తి.

అభిజ్ఞాతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తెలిసికొనఁబడినది; 2. గుర్తు పట్టఁబడినది; 3.స్మరింపఁబడినది.

అభిజ్ఞానము. సం. వి. అ. న. = అభిజ్ఞ.

అభిజ్ఞుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. తెలిసినవాఁడు; 2. పండితుఁడు; 3. నేర్పరి.

అభితస్. సం. అవ్య. (తెనుఁగున సమాసమునందు పూర్వపదముగానే ఉపయోగింపఁబడును.)అంతటను. "అభితోవ్యాప్తము" (=అంతటను వ్యాపించినది.) "అభితోముఖము" (=నలువైపుల ముఖములుగలది.)

అభిదర్శనము. సం. వి. అ. పుం. చూచుట.

అభిదర్శించు. సం. స. క్రి. దర్శించు, చూచు.

అభిద్రవణము. సం. వి. అ. పుం. = అభిద్రవము.

అభిద్రవము. సం. వి. అ. న. 1. వేగముగా పోవుట, పాఱిపోవుట; 2. మాఱుకొనుట, ఆక్రమించుట.

అభిద్రావము. సం. వి. అ. పుం. = అభిద్రవము.

అభిద్రుతము. సం. విణ. (అ.ఆ.అ.) 1. పాఱిపోయినది; 2. మాఱుకొనఁబడినది.

అభిద్రోహము. సం. వి. అ. పుం. 1. నింద; 2. అపకారము; 3. హానిచేయు తలంపు.

అభిధ. సం. వి. ఆ. స్త్రీ. 1. శబ్దముయొక్క సంకేతితార్థము(వాచ్యార్థము)ను తెలుపుశక్తి. (అభిధ, లక్షణ, వ్యంజన అని శబ్దశక్తులు మూఁడు.) చూ. వృత్తి; 2. చెప్పుట; 3. పేరు.

అభిధానము. సం. వి. అ. న. 1. కథనము, చెప్పుట; 2. నిర్దేశించిచెప్పుట; 3. నామధేయము, పేరు, నిఘంటువు, శబ్దకోశము; 4. పదము, శబ్దము. "అభిధానరత్నమాల."

అభిధాయకము. సం. విణ. (అ.ఆ-ఇకా.అ.) వాచకము, చెప్పునది. (శబ్దము మొ.)

అభిధాయి. సం. విణ. (న్.ఈ-నీ.న్.) 1. చెప్పుచున్నవాఁడు, కథకుఁడు; 2. శబ్దము ప్రయోగించువాఁడు.

అభిధావకుఁడు. సం. విణ. (అ.ఆ-వికా.అ.) ఎదురుగా పరువెత్తువాఁడు.

అభిధిత్స. సం. వి. ఆ. స్త్రీ. చెప్పవలయునను కోరిక, ఇచ్ఛ.

అభిధేయము. సం. వి. అ. న. 1. పేరు; 2. అర్థము, టీక.

అభిధ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. పరధనము పుచ్చుకొనవలయుననుకోరిక; 2. గ్రహింపవలయుననుకోరిక; 3. కోరిక; 4. చింతించుట, ఆలోచనము.

అభినందనము. సం. వి. అ. న. 1. సంతోషించుట, సంతోషము, పొంగు; 2. స్తుతించుట; 3. సంతోషపూర్వకముగా ప్రశంసచేయుట,మెచ్చుట. —విణ. (అ.ఆ.అ.) 1. సంతోషపెట్టునది; 2. పొగడునది.

అభినందనీయము. సం. విణ. (అ .ఆ. అ.) అభినందింపఁదగినది. చూ. అభినందించు.

అభినందము. సం. వి. = అభినందనము.

అభినంది. సం. విణ. (న్.ఈ-దినీ.న్.) 1. సంతోషముగలవాఁడు; 2. సంతోషపెట్టువాఁడు; 3. స్తుతించువాఁడు.

అభినందించు. సం. అ. క్రి. సంతోషించు.—స. క్రి. 1. స్తుతించు, పొగడు; 2. సంతోష పూర్వకముగాఁజూచు."వ. అప్పుడు కృష్ణుండు ధనంజయుం

దనచేరువ నునిచికొని చిరకాల దర్శనోల్లాసితం బులైన యాలోకనంబుల నతనియాకారంబత్యా దరంబున నభినందించుచు ధర్మరాజున కిట్లనియె.'' భార. అర. ౪, ఆ. ౧౫౩.

అభినందితవ్యము. సం. = అభినందనీయము.

అభినందితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) (అభినందింపఁబడినవాఁడు) 1. సతోషపఱుపఁబడినవాఁడు; 2. స్తుతింపఁబడినవాఁడు; ''వ. భీమార్జున నకుల సహదేవులం గౌఁగిలించుకొని ద్రౌపది గారవించి ధౌమ్యాది మహీసురులచేత నభినందితుం డయ్యె.'' భార.అర.౪,ఆ. ౧౫౩; 3. సంతోషించినవాఁడు. ''క. ఇందీవరలోచన నీ, యం దే నభినందితాత్మ నైనట్టులు నీ, నందనులయందుఁ బౌత్రుల,యందును నభినంద్య వగుమ యని దీవించెన్.'' భార. ఆది. ౮, ఆ. ౬.

అభినంద్యము. సం. = అభినందనీయము.

అభినయము. సం. వి. అ.పుం. 1. హస్తవిక్షేపాదుల చేతను, రోమాంచాదులచేతను, మనోగతభావమును ప్రకటించుట. నటాదులు రామాదులఅవస్థను అనుకరించునపుడు (హస్తనేత్రవిక్షేపాదుల వలన సూచింపఁబడినది) ఆంగికము, (స్వేదరోమాంచాదులచేత సూచింపఁబడినది) సాత్వికము, (అలంకారాదులచేత సూచితమయినది) ఆహార్యము, (వాక్కుచేత సూచింపఁబడినది) వాచికము అని అభినయము నాలుగువిధములు గలది; 2. (అభినయప్రధానకావ్యము) దృశ్యకావ్యము, రూపకము.

అభినయించు. సం. స. క్రి. అభినయముచేయు.

అభినవము. సం. వి. అ. పుం. ఆనుకూల్యము సంపాదించుటకు చేయుస్తోత్రము.—విణ. (అ.ఆ.అ.) నవీనము, క్రొత్త.

అభినహనము. సం. వి. అ. న. 1. బంధనము, కట్టుట; 2. గట్టిగా కట్టుట.

అభిని. వై. గ్రా వి. నల్లమందు, అహిఫేనము. ''ఆ. చేఁపచేదు నేలవేము నీసరవెల్లి, నభిని ముష్టిపండ్లు నాత్మజలము, గూడ నూఱి కలిపి గొట్టాలతోడఁ బో,యింతు రొకనిచేతఁ జింతిలంగ.'' సానం. ౨, ఆ. ౪౯.

అభినిర్ముక్తుఁడు. సం. వి. అ. పుం. 1. సూర్యుఁడస్తమించువేళ నిద్రించువాఁడు; 2. సూర్యాస్తమయకాలమున నిద్రావశుఁడై సంధ్యాదికర్మలు చేయనివాఁడు.

అభినిర్యాణము. సం. వి. అ. పుం. 1. బయలుదేఱుట, ప్రయాణము; 2. శత్రువుపై దండెత్తిపోవుట.

అభినివేశము. సం. వి. అ. పుం. 1. ప్రవేశము; 2. పట్టుదల, చేలము; 3. ఆసక్తి.

అభినివేశి. సం. విణ. (న్.ఈ.నీ.న్.) (అభినివేశము గలవాఁడు.) 1. పట్టుదలగలవాఁడు, చలము గలవాఁడు; 2. ఆసక్తి గలవాఁడు; 3. అనురాగము గలవాఁడు.

అభినిష్పత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. సిద్ధి, నెఱవేఱుట; 2. సంపత్తి, కూడిక; 3. ఉత్పత్తి, కలుగుట.

అభినిష్పన్నము. సం. విణ. (అ. ఆ. అ.) 1. సిద్ధమైనది, నెఱవేఱినది; 2. సంపన్నము, కూడినది.

అభినీతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. న్యాయముతోఁగూడినది; 2. సంస్కరింపఁబడినది; 3. కోపముగలది; 4. పూజింపఁబడినది; 5. అలంకరింపఁబడినది; 6. ప్రాపితము, పొందింపఁబడినది; 7. అభినయింపఁబడినది.

అభినీతి. సం. వి.ఇ. స్త్రీ. 1. అభినయము, ఒకని ననుకరించుట; 2.పొందించుట, దగ్గఱగాఁ దీసికొనుట; 3. మంచిమాటలతో దరిఁజేరుట, మైత్రి.

అభినుతము. సం. విణ. (అ. ఆ. అ.) స్తుతింపఁబడినది, కొనియాడఁబడినది.

అభినుతి. సం. వి. ఇ. స్త్రీ. స్తోత్రము పొగడ్త.

అభినుతించు. సం. స. క్రి. స్తుతించు, కొనియాడు.

అభినేత. సం. విణ. (ఋ. ఈ. త్రీ. ఋ.) 1. అభినయించువాఁడు, అనుకరించువాఁడు. (నటుఁడు;) 2. ఎదురుగాఁ దీసికొనిపోవువాఁడు; 3. దగ్గఱగాఁ దీసికొనువాఁడు.

అభినేతవ్యము. సం. విణ. (అ.ఆ.అ.) 1. అభినయింపఁ దగినది, అనుకరింపఁదగినది; 2. పొందింపఁదగినది; 3. దగ్గఱగాఁ దీసికొనఁదగినది.

అభినేయము. సం. = అభినేతవ్యము.

అభిన్నపుటము. సం. వి.అ. పుం. నవపల్లవము, క్రొత్త చిగురు, మొవ్వు.

అభిన్నము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఏకస్వరూపముగలది, భేదములేనిది; 2. చీల్పఁబడనిది; 3. పగులఁ గొట్టఁబడనిది; 4. కలసియున్నది, వేఱుగాలేనిది; 5. విభక్తము గానిది, పంచుకొననిది. "సోదరు లభిన్నులు."

అభిన్యాసము. సం. వి. అ. పుం. (దేహములోపలనున్న వేఁడిని పైకి రప్పించునది.) 1. జ్వరభేదము. (ఇందు నిద్రతక్కువ; ప్రలాప మధికమగును. నిట్టూర్పులు విడుచుచు రోగి పరుండును. ముఖము కాంతివిహీనమగును;) 2. అంతటను ఉంచుట.

అభిపతనము. సం. వి. అ. న. 1. దరిఁజేరుట; 2. శత్రువుల నెదిరించుట; 3. వెడలిపోవుట.

అభిపత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. నిష్పత్తి, నెఱవేఱుట, పూర్తియగుట; 2. దగ్గఱగాఁజేరుట.

అభిపన్నుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. అంగీకరింపఁబడినవాఁడు; 2. ఆపన్నుఁడు; 3. తప్పుచేసినవాఁడు; 4. మోమోటమిగలవాఁడు; 5. శత్రువుచే నాక్రమింపఁబడినవాఁడు; 6. శరణుచొచ్చినవాఁడు; 7. దరిఁజేరినవాఁడు.

అభిపరిప్లుతుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. ముంపఁబడినవాఁడు; 2. ఆక్రమింపఁబడినవాఁడు. "శోకాభిపరిప్లుతుఁడు."

అభిపల్లవము. సం. వి. అ. పుం. పగడము, విద్రుమము.

అభిపూరణము. సం. వి. అ. న. పూర్తిగా నిండించుట.

అభిప్రాయము. సం. వి. అ. పుం. 1. ఉద్దేశ్యము, తలఁపు; 2. మనోనిశ్చయము, మతము; 3. భావము, తాత్పర్యము. "వ. అయినను నా హృదయంబున ననవరతంబును శ్రీమహాభారతంబునందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయై యుండు." భార. ఆది. ౧,ఆ. ౧౧.—ఇది కొన్నిచోట్ల అభిప్రేతము, ఇష్టము అనునర్థమున విశేషణముగా నుపయుక్తము. "క. మాయనుగతి మాకు నభి, ప్రాయము వనవాసదుఃఖభర మోపుదుకే." భార. అర. ౧, ఆ. ౮.

అభిప్రేతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉద్దేశింపఁబడినది, తలఁపఁబడినది; 2. మనమున నిశ్చయింపఁబడినది; 3. ఇష్టమైనది, అభిలషితము.

అభిప్రోక్షణము. సం. వి. అ. న. 1. అంతటను చల్లుట; 2. సంస్కారార్థము నీరు మొదలగునవి చల్లుట.

అభిప్లుతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అంతటను తడుపఁబడినది; 2 ముంపఁబడినది; 3. ఆక్రమింపఁబడినది; 4. అంతటను వ్యాపించినది.

అభిభవనము. సం. వి. అ. న. = అభిభవము.

అభిభవము. సం. వి. అ. పుం. 1. తిరస్కరించుట, నిందించుట, తెగడుట; 2. పరాజయము; 3. రోగాదులచే దేహము మొద్దువాఱుట.

అభిభవించు. సం. స. క్రి. 1. తిరస్కరించు, తెగడు; 2. జయించు.

అభిభవిత. సం. విణ. (ఋ.ఈ-త్రీ.ఋ.) =అభిభావకుఁడు.

అభిభావకుఁడు. సం.విణ. (అ.ఆ-వికా.అ.) 1. పరాభవించువాఁడు, తిరస్కరించువాఁడు; 2. జయించువాఁడు.

అభిభావి. సం. విణ. (న్. ఈ - నీ. న్.)=అభిభావకుఁడు.

అభిభాషణము. సం. వి. అ. న. 1. ఎదురుగానుండి మాటలాడుట; 2. మాటలాడుట, పలుకుట. "స్మితపూర్వాభిభాషణము."

అభిభాషి. సం. విణ. (న్.ఈ-ణీ.న్.) సంభాషించువాఁడు, మాటలాడువాఁడు.

అభిభూతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తిరస్కరింపఁబడినది, నిందింపఁబడినది; 2. జయింపఁబడినది.

అభిభూతి. సం. వి. ఇ. స్త్రీ. = అభిభవము.

అభిభూతుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. తిరస్కరింపఁబడినవాఁడు, పరాభవింపఁబడినవాఁడు; 2. జయింపఁబడినవాఁడు; 3. వశీకృతుఁడు, లొంగఁదీయఁబడినవాఁడు. "క. త్రిభువన సామ్రాజ్యశ్రీ, ప్రభుఁడగు ధర్మాత్మజుండు ప్రాకృతజనున, ట్లభిరూక్షతలంబున ని, ట్లభిభూతుం డగు నె నిద్ర నతిఖిన్నుండై." భార.ఆది. ౬,ఆ.౧౭౮.

"ఉ. ఇంతులగోష్ఠి నున్నయతఁ డెంతవివేకము గల్గెనేని యత్యంతమదాభిభూతుఁడగు ధర్మువు దప్పుఁ బ్రియం బెఱుంగఁడు." భార. ఆది. ౭, ఆ. ౫౯.

అభిమంతవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అభిమానింపఁదగినది; 2. తలఁపఁదగినది.

అభిమంత్రణము. సం. వి. అ. న. 1. పిలుచుట; 2. మంత్రముచే సంస్కరించుట.

అభిమంత్రించు. సం. స. క్రి. 1. పిలుచు; 2. మంత్రముచే సంస్కరించు. "వ. ద్రోణుం డొక్కబాణం బభిమంత్రించి దృష్టి ముష్టిసౌష్ఠవంబులొప్ప." భార. ఆది. ౫, ఆ. ౨౧౧. "మ. రభసోదగ్రతఁ బూన్చి దీప్తు లడరం బ్రాగ్జ్యోతిషాధీశ్వరుం, డభిమంత్రించి నిజాంకుశంబు దివిజేంద్రాపత్యవక్షంబు సూచి భుజోల్లాసవిభాసియై పెలుచ వైచెం," భార. ద్రోణ. ౧, ఆ. ౩౫౭.

అభిమంత్రితము. సం. విణ. (అ. ఆ. అ.) అభిమంత్రింపఁబడినది. చూ. అభిమంత్రించు.

అభిమతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అభిమానమునకు విషయమయినది; 2. ఇష్టమైనది, కోరఁబడినది; 3. సమ్మతము, అంగీకరింపఁబడినది; 4. ఆదరింపఁబడినది.—వి. అ. న. 1. అభిమానము; 2. కోరిక; 3. సమ్మతి, అంగీకారము; 4. ఆదరణము.

అభిమన్యుఁడు. సం. వి. ఉ. పుం. సుభద్రార్జునుల పుత్త్రుఁడు. (భారతయుద్ధమునందు పద్మవ్యూహములోఁ బ్రవేశించి శత్రుసంహారము కావించి మృతినొందిన అసహాయశూరుఁడు.)

అభిమరము. సం. వి. అ. పుం. 1. చంపుట; 2. యుద్ధము; 3. కట్టుట, బంధనము; 4. భయము; 5. స్వసైన్యము; 6. ధనాశచేత ప్రాణముపై నాశ విడిచి గజాదులతో యుద్ధము చేయఁబూనుట.

అభిమర్దనము. సం. వి. అ. న. 1. మర్దించుట; 2. చూర్ణముగాఁ జేయుట; 3. రాయిడి.

అభిమర్దము. సం. వి. అ. పుం. 1. యుద్ధము; 2. ఒరపిడి; 3. చూర్ణముచేయుట; 4. నూఱుట, మర్దించుట.

అభిమర్శనము. సం. వి. అ. న. = అభిమర్శము.

అభిమర్శము. సం. వి. అ. పుం. 1. స్పృశించుట, తాఁకుట; 2. తడవుట; 3. ధర్షణము, బలాత్కారముగ నాక్రమించుట. "పరదారాభిమర్శము."

అభిమర్శించు. సం. స. క్రి. 1. స్పృశించు, తాఁకు; 2. తడవు; 3. పొందు, అనుభవించు. "క. క్లేశంబును సౌఖ్యంబును, నాశువునను గుంభజన్ముఁ డభిమర్శించెం, గాశీవిరహము దక్షిణ, కాశీసంగమము వరుసఁ గలిగినకతనన్." కాశీ. 3, ఆ. ౨౬.

అభిమాతి. సం. వి. ఇ. పుం. శత్రువు.

అభిమానకత్తె. మి.వి. అభిమానము గలది. (ఆత్మగౌరవముగలది.) "ద్వి. అభిమానకత్తె దానగుట నీవనుచు, నభిమాన మెడలంగ నతివ పల్కుడును." బస. ౫, ఆ. ౧౭౭. పు.

అభిమానము. సం. వి. అ. పుం. 1. ఆత్మగౌరవము, పౌరుషము, ధనవిద్యాదులచే నుండఁదగిన దర్పము. "అభిమానధనుఁడు." "మానవంతులు అభిమానైకధనులు;" 2. దురభిమానము, దుర్గర్వము; 3. అహంకారము, నేను అను భావముగలిగియుండుట; 4. మమకారము, నాది అను భావము; 5. గౌరవము; 6. ప్రేమము; 7. కోరిక; 8. జ్ఞానము; 9. వధము, హింస; 10. అజ్ఞానము. శ. ర.

అభిమాని. సం. విణ. (న్. ఈ-నీ. న్.) అభిమానము గలవాఁడు.

అభిమానించు. సం. స. క్రి. 1. సమ్మానించు, గారవించు; 2. (తనది అనుభావముతో) పూనుకొను. "నీవు అభిమానించినఁగాని యీపని నెఱవేఱదు."

అభిమానితుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. అభిమానింపఁబడినవాఁడు; 2. (సంజాతాభిమానుడు) అభిమానము గలిగినవాఁడు.

అభిముఖము. క్రి. విణ. అవ్య. అ. న. 1. ఒక వైపునకు తిన్నగానుంచిన ముఖము గలుగునట్లు, ఎదురుగా, నేరుగా; 2. సిద్ధముగా.—విణ. చూ. అభిముఖుఁడు.

అభిముఖుఁడు.. సం. విణ. (అ. ఈ-ఖీ.అ.) 1. ఒక వైపునకు తిన్నగా నుంచినముఖముకలవాఁడు, ఎదురుగా చూచువాఁడు. "పూర్వాభిముఖుఁడు;

శకుంతలాభిముఖుఁడు;" 2. సమీపించినవాఁడు. "యౌవనాభిముఖుఁడు; యౌవనాభిముఖి;" 3. సంసిద్ధుఁడు. "ప్రయాణాభిముఖుఁడు; మరణాభిముఖుఁడు; అస్తాభిముఖసూర్యుఁడు;" 4. సుముఖుఁడు, అనుకూలుఁడు. "కార్యాభిముఖుఁడు." ముఖశబ్దము ప్రాణ్యంగవాచకము కానపుడు స్త్రీలింగమున ఆకారాంత మగును. "శాల రథ్యాభిముఖ."

అభిముఖీకరణము. సం. వి. అ. న. అభిముఖునిఁగాఁ జేసికొనుట.

అభిముఖీభావము. సం. వి. అ. పుం. అభిముఖుఁడగుట.

అభిమృష్టము. సం. విణ. (అ.ఆ.అ.) 1. స్పృశింపఁబడినది, తాఁకఁబడినది; 2. కూడినది; 3. తుడుపఁబడినది.

అభియాచనము. సం. వి. అ. న. 1. ఎదురుగానుండి ప్రార్థించుట; 2. ప్రార్థించుట.

అభియాచ్ఞ. సం. వి. ఆ. స్త్రీ=అభియాచనము.

అభియాత. సం. వి. ఋ. పుం. శత్రువు.—విణ. (ఋ.ఈ-త్రీ.ఋ.) 1. ఎదురుగాఁ బోవువాఁడు; 2. యుద్ధార్థ మెదురుగాఁ బోవువాఁడు; 3. దండెత్తిపోవువాఁడు.

అభియాతి. సం. వి. ఇ. పుం. = అభియాత.

అభియానము. సం. వి. అ. న. 1. ఎదురుగాఁబోవుట; 2. యుద్ధార్థము ఎదురుగాఁబోవుట; 3. దండెత్తిపోవుట.

అభియాయి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) = అభియాత.

అభియుక్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. శత్రువులచే నిరోధింపఁబడినవాఁడు; 2. ఆసక్తిగలవాఁడు, అభిరతుఁడు; 3. (వ్యవ.) ప్రతివాది; 4. పండితుఁడు, విద్యావంతుఁడు; 5. అప్తుఁడు, హితము గోరువాఁడు.

అభియోక్త. సం. విణ. (ఋ. ఈ-త్రీ. ఋ) 1. (వ్యవ.) వాది; 2. శత్రువు నెదిరించువాఁడు.

అభియోక్తవ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1.నిషేధింపఁదగినవాఁడు; 2. (వ్యవ.) ప్రతివాది; 3. సంధానము చేయఁదగినవాఁడు.

అభియోగము. సం. వి. అ. పుం. 1. ఒకఁడు తనకుచేసిన అపకారము రాజునకు విన్నవించుట, (దావాచేయుట;) 2.యుద్ధార్థము శత్రువు నెదుర్కొనుట, మార్కొనుట; 3. అపకారముచేయుటకై మీఁదికి వచ్చుట; 4. శపథము; 5. పట్టుదల; 6. ఉద్యోగము, పూనిక; 7. ఆసక్తి.

అభియోగి. సం విణ. (న్.ఈ-నీ.న్.) 1. అభియోగముచేయువాఁడు, వాది; 2. శత్రువు నెదిరించువాఁడు, మార్కొనువాఁడు; 3. పట్టుదలగలవాఁడు; 4. ఆసక్తిగలవాఁడు; 5. అనుసంధానముచేయువాఁడు.

అభియోగించు. సం. స. క్రి. ఎదుర్కొను, శత్రువు నెదిరించు.

అభిరక్ష. సం. వి. ఆ. స్త్రీ. 1. అంతటనురక్షించుట; 2. రక్షించుట.

అభిరక్షణము. సం. వి. అ. న. 1. అంతటను రక్షించుట; 2. రక్షించుట. "ఆ. ఆదిదేవుఁడైన యవ్విష్ణుఁ డఖిలలోక, కాభిరక్షణార్థమై జనించి, మహితతపము సేసె." భార. ద్రోణ. ౯,ఆ.౪౦౮.

అభిరతి. సం. వి. ఇ. స్త్రీ. అపేక్ష, ఇచ్ఛ.

అభిరతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి యాసక్తిగలవాఁడు. "స్వకర్మాభిరతుఁడు;" 2. అపేక్షగలవాఁడు, ప్రేమగలవాఁడు; 3.మిక్కిలి సంతోషించినవాఁడు.

అభిరామము. సం. విణ. (అ.ఆ.అ.) 1. సంతోషకరము; 2. సుందరము; 3. ప్రియము, ఇష్టము.

అభిరుచి. సం. వి. ఇ. స్త్రీ 1. అధికాసక్తి; 2. జిగి, కాంతి; 3. సంతోషము.

అభిరూక్షము. సం. విణ. (అ. ఆ. అ.) కఠినము, కటికి. (నేల మొ.); "క. త్రిభువనసామ్రాజ్యశ్రీ, ప్రభుఁడగు ధర్మాత్మజుండు ప్రాకృతజనున, ట్లభిరూక్షతలంబున ని, ట్లభిభూతుం డగుచు నిద్రనతిఖిన్నుండై." భార. ఆది. ౬, ఆ. ౧౭౮.

అభిరూపము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అనురూపము, తగియుండునది; 2. ఇష్టమైనది, ప్రియమైనది; 3. సుందరము, మనోహరము.

అభిరూపుఁడు. సం. వి. అ. పు. (ఇది యిట్లని నిరూపించువాఁడు.) 1. పండితుఁడు; 2. మన్మథుఁడు; 3. శివుఁడు; 4. విష్ణువు; 5. చంద్రుఁడు.—విణ. చూ. అభిరూపము.

అభిలషణము. సం. వి. అ. న. = అభిలాషము. "సీ. విషయోపభోగాభిలషణ మింకను నాకు వదలక పెరుగుచున్నదియుఁగాన." భార. ఆది. ౪, ఆ. ౭౫.

అభిలషణీయము. సం. విణ. (అ. ఆ. అ.) అభిలషింపఁదగినది.

అభిలషించు. సం. స. క్రి. కోరు.

అభిలషితము. సం. వి. అ. న. అభిలాష.—విణ. (అ. ఆ. అ.) అభిలషింపఁబడినది.

అభిలషితవ్యము. సం. = అభిలషణీయము.

అభిలాపము. సం. వి. అ. పుం. 1. చెప్పుట, కథనము; 2. మాట; 3. తాను చేయఁదలఁచినపని ప్రతిజ్ఞారూపమున చెప్పుట.

అభిలావము. సం. వి. అ. పుం. లవనము, కోఁత, ఖండించుట.

అభిలాష. సం. వి. అ. పుం. కోరిక. "వ. అయినను నాహృదయంబున ననవరతంబును శ్రీమహాభారతంబునందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయైయుండు." భార. ఆది. ౧, ఆ. ౧౧

అభిలాషము. సం. = అభిలాష.

అభిలాషి. సం. విణ. (న్.ఈ.నీ. న్.) అభిలాషకలవాఁడు. "జలాభిలాషి; విద్యాభిలాషి."

అభిలాషుకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కోరికగలవాఁడు, అభిలషించువాఁడు.

అభివందనము. సం. వి. అ. న. 1. నమస్కారము, 2. ఎదురుగానుండి నమస్కరించుట. "గురుపాదాభివందనము."

అభివర్ధనము. సం. వి. అ. న. = అభివృద్ధి.

అభివాదకుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) అభివాదనము చేయువాఁడు, నమస్కరించువాఁడు.

అభివాదనము. సం. వి. అ. న. 1. గోత్రనామము చెప్పి నమస్కరించుట; 2. పాదములు తాఁకుచు నమస్కరించుట.

అభివాదనీయుఁడు. సం. = అభివాద్యుఁడు.

అభివాదము. సం. వి. అ. పుం.=అభివాదనము.

అభివాదితుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) నమస్కరింపఁబడినవాఁడు. "వ.అనునవసరంబున లోకపితామహుండు సనుదెంచి యార్వునిచేత నభివాదితుండై నీపుత్రున కాహారంబును నివాసస్థానంబును నొసంగెద." హరి. పూ. ౪, ౧౧౫.

అభివాద్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నమస్కరింపఁదగినవాఁడు.

అభివీక్ష్యమాణుఁడు. సం. విణ. (అ.ఆ.అ.)చూడఁబడుచున్నవాఁడు. "సీ. కడువేడ్కతోఁ దన్నుఁ జూచు ఖేచరసిద్ధ సురభుజంగ, గరుడగంధర్వకిన్నరకామినులచేత మానుగా నభివీక్ష్యమాణుఁ డగుచు, మ్రాఁకులుఁ విఱుచుచు." భార. అర. 3, ఆ. 3౧౭.

అభివృద్ధి. సం. వి. ఇ. స్త్రీ. పెంపు, అధికమగుట. "విద్యాభివృద్ధి; ధనాభివృద్ధి."

అభివ్యంజకము. సం.విణ. (అ.ఆ.అ.)1. స్పష్టపఱచునది, స్పష్టముగా తెలుపునది. "గుణాభివ్యంజకములు; రసాభివ్యంజకములు;" 2. వ్యంజనావృత్తిచేత తెలుపునది. (శబ్దము.)

అభివ్యక్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. స్పష్టము, స్ఫుటమైనది; 2. ఆవిర్భవించినది, సూక్ష్మరూపమువిడిచి స్థూలరూపముతోఁ గనఁబడినది.

అభివ్యక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. స్పష్టమగుట, స్ఫుటమగుట; 2. సూక్ష్మరూపము విడిచి స్థూలరూపమునఁ గనఁబడుట; ఆవిర్భవించుట; 3. ప్రతిబింబము. శ. ర.

అభిశంక. సం. వి. ఆ. స్త్రీ. 1. అన్నివిధములను శంకించుట; 2. సంశయించుట, అనుమానపడుట; 3. భ్రాంతి, మిథ్యాజ్ఞానము. "లతాభిశంక" (=లత యను భ్రాంతి.

అభిశంకి. సం. విణ. (న్. ఈ.నీ.న్.) 1. అనుమానపడునది; 2. సంశయించునది, నమ్మికలేనిది. "వ. నాస్తికుల యట్లు ధర్మాభిశంకిని వై దైవదూషణంబు సేసెదు." భార. అర. ౧, ఆ. ౨౨౮; 3. భ్రాంతిపడునది.

అభిశంసనము. సం. వి. అ. న. 1. దూషించుట, నిందించుట, తిట్టుట; 2. దోష మారోపించుట, అపవాదము; 3. చెప్పుట, కథనము. "మిథ్యాభిశంసనము."

అభిశంసి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) 1. దూషించువాఁడు, తిట్టువాఁడు; 2. అపవాదపెట్టువాఁడు, లేనిదోష మారోపించువాఁడు.

అభిశస్తము. సం. వి. అ. న. 1. నిందించుట,తిట్టుట, 2. దోషారోపణముచేయుట, అపవాదముచేయుట; 3. హింసించుట; 4. దోషము, తప్పు.—విణ. చూ. అభిశస్తుఁడు.

అభిశస్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. అపవాదము, దోషమారోపించుట; 2. తిట్టుట, నిందించుట; 3. హింసించుట; 4. ప్రార్థన, వేఁడుట.

అభిశస్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. పరస్త్రీగమనాదిదోషములచే దూఱఁబడినవాఁడు, ఆక్షారితుఁడు; 2. హింసింపఁబడినవాఁడు; 3. ఆక్రమింపఁబడినవాఁడు.

అభిశాపము. సం. వి. అ. పుం. 1. అపదూఱు, లేనిదోషము నారోపించుట; 2. తిట్టుట, శపించుట.

అభిషంగము. సం. వి. అ. పుం. 1. అవమానము, పరాభవము; 2. ఒట్టు, శపథము; 3. తిట్టు, శాపము; 4. దుఃఖము; 5. ఆసక్తి; 6. వ్యసనము; 7. సోఁకుట, భూతాద్యావేశము.

అభిషవణము. సం. వి. అ. న. 1. స్నానము; 2. యజ్ఞాంగస్నానము; 3. సోమరసము తీయు సాధనము.

అభిషవము. సం. వి. అ. పుం. 1. స్నానము; 2. యజ్ఞాంగస్నానము; 3. (రసము)పిండుట, నిష్పీడనము; 4. సోమపానము, యజ్ఞమున సోమలతారసముత్రాగుట; 5. సురోత్పాదనము, కల్లుచేయుట; 6. కల్లుతేట (శ. ర.)

అభిషిక్తము. సం. వి. అ. న. = అభిషేకము (రాజ్యము మొదలగువానియందు అధికారము సిద్ధించుటకై సంస్కారపూర్వకముగా చేయింపఁబడిన) స్నానము. "క. ఇతఁడేమి యన్న నేమగు, ధృతరాష్ట్రుఁడు మాకుఁ బరమదేవత విను సత్స్మృతిఁ దత్ప్రసాదముం బడసితి మేమును దత్కృతాభిషిక్తులమనఘా." భార. ఆశ్ర. ౧, అ. ౧౨౪. "క. కృతాభిషేకులమనఘా." అనియుఁ బఠింపవచ్చును.—విణ. చూ. అభిషిక్తుఁడు.

అభిషిక్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. (రాజ్యమునఁగాని) సైన్యమునఁగాని అభిషేకింపఁబడినవాఁడు, రాజుగా ఏర్పఱుపఁబడినవాఁడు; 2. స్నానముచేసినవాఁడు.

అభిషుతము. సం. వి. అ. పుం. 1. రసముతీసిన సోమము; 2. కాంజికము, కలి, పులియఁబెట్టిన కడుగునీరు.—విణ. (అ.ఆ.అ.) పిండఁబడినది.

అభిషేకము. సం. వి. అ. పుం. 1. స్నానము; 2. మంత్రాదులతో జలము పోయుట, లింగాదులను స్నానముచేయించుట "రుద్రాభిషేకము;" 3. (రాజ్యము, సైన్యము మొదలగువానియందు) అధికారము సిద్ధించుటకై చేయింపఁబడిన స్నానము. "రాజ్యాభిషేకము; పట్టాభిషేకము; పాదుకాభిషేకము;" 4. జలము, ఉదకము.

అభిషేకించు. సం. స. క్రి. 1. స్నానముచేయించు; 2. రాజ్యమునఁ బట్టముకట్టునపుడు స్నానముచేయించు; 3. పట్టాభిషేకముచేయు.

అభిషేక్యుఁడు. సం. = అభిషేచనీయుఁడు.

అభిషేచనము. సం. వి. అ. న. 1. అభిషేకము; 2. అభిషేకమున కుపయోగించు ద్రవ్యము.

అభిషేచనీయుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అభిషేకింపఁదగినవాఁడు.

అభిషేచ్యుఁడు. సం. = అభిషేచనీయుఁడు.

అభిషేణనము. సం. వి. అ. న. శత్రువును మార్కొనుట.

అభిష్టుతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొగడఁబడినది; 2. వర్ణింపఁబడినది.

అభిష్యందనగరము. సం. వి. అ. న. ప్రధాననగరమున జనమెక్కువగుటచేత అధికమగు జనముండుటకై కట్టిననగరము, శాఖానగరము, పేట.

అభిష్యందము. సం. వి. అ. పుం. 1. కంటిజెవులు; 2. మిక్కిలికాఱుట; 3. మిక్కిలివృద్ధి, అధిక

మగుట, ఉండవలసినదానికంటె ఎక్కువయగుట. చూ. అభిష్యందనగరము.

అభిష్వంగము. సం. వి. అ. పుం. 1. అభిరుచి, అత్యాసక్తి; 2. అధికానురాగము; 3. దేహాదులం దాత్మాభిమానము.

అభిసంధ. సం. వి. ఆ. స్త్రీ. 1. మోసము, వంచన; 2. ఉద్దేశము, లక్ష్యము.

అభిసంధకుఁడు. సం. విణ. (అ.ఆ-ధికా.అ.) 1. వంచకుఁడు, మోసపుచ్చువాఁడు; 2. అసహనముచే పరులను ఆక్షేపించువాఁడు; 3. కూర్చువాఁడు, సంధిచేయువాఁడు.

అభిసంధము. సం. వి. అ. పుం. కంటితెవులు.

అభిసంధానము. సం. వి. అ. న. 1. మోసపుచ్చుట; 2. ఉద్దేశము, లక్ష్యము; 3. సంధిచేయుట, కూర్చుట.

అభిసంధి. సం. వి. ఇ. పుం. = అభిసంధానము.

అభిసంపాతము. సం. వి. అ. పుం. 1. యుద్ధము, పోరు; 2. ఎదురుగా పడుట; 3. కలియుట.

అభిసంహితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. వంచింపఁబడినది, మోసపుచ్చఁబడినది; 2. ఉద్దేశముచేఁ జేయఁబడినది; 3. కూర్పఁబడినది, సంధిచేయఁబడినది.

అభిసరణము. సం. వి. అ. న. అభిసరించుట.

అభిసరించు. సం. స. క్రి. 1. ప్రియులొకరొకరి నుద్దేశించు. "గీ. రేయి నిజనాథుల నభిసరించి పోయి." కవిక. ౪, ఆ. ౧౯౨; 2. ప్రియుల నుద్దేశించిపోవు.

అభిసరుఁడు. సం. విణ. (అ.ఈ-రీ.అ.) 1. అనుచరుఁడు, సహాయుఁడు, తోడు; 2. అభిసరించినవాఁడు.

అభిసారము. సం. వి. అ. పుం. 1. యుద్ధము; 2. సహాయము; 3. సాధనము; 4. స్త్రీగాని పురుషుఁడుగాని సంగమార్థము సంకేతస్థలమునకు పోవుట.

అభిసారి. సం. విణ. (న్.ఈ-ణీ.న్.) 1.ఒకస్త్రీ నుద్దేశించిపోవువాఁడు; 2. అనుచరుఁడు.

అభిసారిక. సం. వి. ఆ. స్త్రీ. వలపుకానికై సంకేతస్థలమునకుఁ బోవు నట్టిగాని, వలపుకానిని సంకేతస్థలమునకు రప్పించుకొనునట్టిగాని నాయిక.

అభిసారిణి. సం. వి. ఈ. స్త్రీ.=అభిసారిక.

అభిసృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. విడువఁబడినది; 2. ఇయ్యఁబడినది.

అభిహతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తాడితము, కొట్టఁబడినది; 2. (గణిత.) గుణింపఁబడినది.

అభిహరణము. సం. వి. అ. న. 1. ఎదురుగా తీసికొనివచ్చుట; 2. తీసికొనివచ్చుట. "కార్ముకాభిహరణము;" 3. వివాహమున అరణమిచ్చుట.

అభిహారము. సం. వి. అ. పుం. 1. శత్రువును మార్కొనుట; 2. దొంగిలించుట; 3. ఆయత్తపడుట.(కవచాదిధారణము,యుద్ధసన్నాహము;) 4. అభియోగము. (దావా); 5. కలిసియుండుట, మేళనము.

అభిహితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉక్తము, చెప్పఁబడినది; 2. (అలం.) అభిధావృత్తిచే చెప్పఁబడినది.

అభిహితాన్వయము. సం. వి. అ. పుం. అభిధావృత్తిచేత స్ఫురించినయర్థముల పరస్పరాన్వయము.

అభీకుఁడు. సం. వి. అ. పుం. 1. కవి; 2. ప్రభువు.—విణ. (అ. ఆ. అ.) 1. నిర్భయుఁడు; 2. ఇచ్ఛగలవాఁడు, కోరువాఁడు; 3. కాముకుఁడు; 4. క్రూరుఁడు.

అభీక్ష్ణము. సం. వి. అ. న. క్రియాపౌనఃపున్యము, మరల మరల నొకపనిచేయుట.—విణ. (అ.ఆ.అ.) 1. ఎడతెగనిది; 2. అధికమైనది, మిక్కుటమైనది.

అభీతి. సం. వి. ఇ. స్త్రీ. 1. అభయము, భయములేమి. "ఆ. ఆత్మకాండకారుఁ డగు వసంతునకు నెయ్యంపుఁజుట్టమైన యంగభవుని, నిండు మదిఁ దలంపు చండాలజాతిగా, వానికై యభీతి దాన మెసఁగు." నై. ౪, ఆ. ౧౦౧; 2. (అభి+ఈతి.) పొందుట.—విణ. ఇ. భయములేనివాఁడు.

అభీతుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. (అభి+ఇత.) పొందినవాఁడు; 2. (న + భీత.) భయపడని

వాఁడు, భయములేనివాఁడు; 3. ఉత్సాహవంతుఁడు.

అభీప్సితము. సం. విణ. (అ. ఆ. అ.) అభీష్టము, కోరఁబడినది.

అభీప్సువు. సం. విణ. ఉ. అభిలషించువాఁడు, కోరువాఁడు.

అభీమానము. సం. = అభిమానము.

అభీరి. సం. వి. ఈ. స్త్రీ. గొల్లది, గోపి.

అభీరుఁడు. సం.వి. అ.పుం. గోపుఁడు, గొల్లవాఁడు.

అభీరుపత్రి. సం. వి. ఈ. స్త్రీ. పిల్లపీచర.

అభీరువు. సం. వి. ఉ. స్త్రీ. పిల్లపీచర.—విణ. భీరువుకానిది, భయపడనిది.

అభీలము. సం. వి. అ. పుం. 1. భయానకరసము; 2. కష్టము.—విణ. (అ. ఆ. అ.) 1. భయంకరము; 2. భయానకరసము గలది.

అభీలాపము. సం. = అభిలాపము.

అభీషంగము. సం. = అభిషంగము.

అభీషువు. సం. వి. ఉ. పుం. 1. కిరణము; 2. పగ్గము; 3. కామము; 4. అనురాగము.

అభీష్టము. సం. వి. అ. న. కోరిక.—విణ. (అ.ఆ.అ.) 1. కోరఁబడినది; 2. ప్రియము; 3. మనోహరము.

అభీష్టుఁడు. సం. వి. అ. పుం. 1. ప్రియుఁడు, ప్రేమించిన పురుషుఁడు; 2. పతి.— విణ. చూ. అభీష్టము.

అభుక్తము. సం. విణ. (అ.ఆ.అ.) 1. తినఁబడనిది. (అన్నాది); 2. అనుభవింపఁబడనిది. (పుణ్యాపాపాది;) 3. తిననిది, భుజింపనిది.

అభూతము. సం. విణ. (అ. ఆ. అ.) జరగనిది, కడవనిది.

అభేదము. సం. వి. అ. పుం. భేదములేమి, భేదాభావము.—విణ. (అ. ఆ. అ.) భేదములేనిది.

అభేద్యము. సం. విణ. (అ.ఆ.అ.) 1. భేదింపఁదగనిది; 2. భేదింప శక్యముగానిది.

అభోజనము. సం. వి. అ. న. భోజనములేమి, ఉపవాసము, పస్తు.—విణ. (అ. ఆ. అ.) భోజనములేనిది.

అభ్యంక. సం. వి. ఆ. స్త్రీ. ఒకటి రెండుసార్లు రక్షలువేసిన ఆవు.

అభ్యంగము. సం. వి. అ. పుం. తలంటు. "తైలాభ్యంగము." "అభ్యంగనేపథ్యము" (= తలంటుకొనుటకై ధరించువేషము.)

అభ్యంజనము. సం. వి. అ. న. 1. అభ్యంగము; 2. అభ్యంగసాధనమగు తైలాది.

అభ్యంజనీయము. సం. విణ. (అ.ఆ.అ.) 1. పూయుటకు సాధనమగునది. (చందనాది;) 2. మర్దనము చేయఁదగినది. (తైలాది.)

అభ్యంతరము. సం. వి. అ. న. 1. సమస్తదిక్కులకు నడిమిచోటు; 2. మధ్యస్థలము, నడిమిచోటు; 3. అంతఃకరణము; 4. ఆటంకము, అడ్డు. (ఈ యర్థము సంస్కృతమునఁ గానరాదు.)

అభ్యక్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చేరినది; 2. పోయినది; 3. స్పృష్టమయినది; 4. స్నానము చేసినది; 5. అభ్యంగస్నానము చేసినది. "సీ. అతఁడు తైలాభ్యంగ మడిగినఁ బతిగమ్మనూనియ దెప్పించి మేనుశిరము, నభ్యక్తములు సేయ నమ్ముని సెడనాడి, యంతర్హితుం డయ్యె." భార. అను. ౨, ఆ ౩౦౮.

అభ్యగ్రము. సం. వి. అ. న. దాపు, సమీపము. —విణ. (అ. ఆ. అ.) దాపైనది, సమీపమున నున్నది.

అభ్యనుజ్ఞ. సం. వి. ఆ. స్త్రీ. 1. అనుజ్ఞ, ముదల; 2. అనుమతి.

అభ్యనుజ్ఞానము. సం. వి. అ. న.=అభ్యనుజ్ఞ.

అభ్యమితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. తెవులుగొంటు; 2. పీడితుఁడు.

అభ్యమిత్రీణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) శత్రువును మార్కొనువాఁడు.

అభ్యమిత్రీయుఁడు. సం. విణ. = అభ్యమిత్రీణుఁడు.

అభ్యమిత్ర్యుఁడు. సం. విణ. = అభ్యమిత్రీణుఁడు.

అభ్యర్చన. సం. వి. ఆ. స్త్రీ. అర్చన, పూజ.

అభ్యర్చనీయుఁడు. సం. = అభ్యర్చ్యుఁడు.
అభ్యర్చించే. సం. స. క్రి. పూజించు, అర్చించు.
అభ్యర్చితుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. పూజింపఁబడినవాఁడు; 2. ఆదరింపఁబడినవాఁడు. "క.వనవాసపరిక్లేశం,బున కోపదు కుంతిదేవి భోజాత్మజ గా,వున నాగృహమున నుండెడు, ననవరతము భక్తితో మదభ్యర్చితయై." భార. సభా. ౨, ఆ. ౨౮౧.
అభ్యర్చ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పూజింపఁదగినవాఁడు.
అభ్యర్ణము. సం. వి. అ. న. దగ్గఱ, సమీపము. —విణ. సమీపమైనది, సమీపమున నున్నది.
అభ్యర్థన. సం. వి. ఆ. స్త్రీ. = కోరుట, వేఁడుట.
అభ్యర్థనము. సం. వి. అ. న. = అభ్యర్థన.
అభ్యర్థనీయుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. కోరఁదగినవాఁడు; 2. వేఁడఁదగినవాఁడు.
అభ్యర్థించే. సం. స. క్రి. 1. కోరు; 2. వేఁడు. "వ. దేవా,నిన్ను భక్తి భజియించు నాకు ననన్యసులభప్రభావం బొసంగుమని యాభ్యర్థించుటయు." భార. ద్రో. ౫, ఆ. ౪౧౪.
అభ్యర్థితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. కోరఁబడినవాఁడు; 2. వేఁడఁబడినవాఁడు.
అభ్యర్థ్యుఁడు. సం. = అభ్యర్థనీయుఁడు.
అభ్యర్దితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి పీడింపఁబడినవాఁడు.
అభ్యర్హణ. సం. వి. ఆ. స్త్రీ. 1. పూజించుట; 2. ఆదరించుట.
అభ్యర్హణము. సం. వి. అ. న. = అభ్యర్హణ.
అభ్యర్హణీయుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పూజింపఁదగినవాఁడు.
అభ్యర్హితుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. పూజింపఁబడినవాఁడు; 2. తగినవాఁడు.
అభ్యవకర్షణము. సం. వి. అ. న. 1. నాటికొనిన ముల్లు లోనగువాని నూడఁదీయుట; 2. కలుపు తీయుట.
అభ్యవస్కందనము. సం. వి. అ. న.= అభ్యవస్కందము.
అభ్యవస్కందము. సం. వి. అ. పుం. 1. శత్రువు నెదుర్కొనుట, ముట్టడి; 2. (శత్రుపక్షమువారిని) కొట్టుట; 3. నశింపఁజేయుట; 4. ప్రపాతము, పడుట.
అభ్యవహరణము. సం. వి. అ. న.=అభ్యవహారము.
అభ్యవహారము. సం. వి. అ. పుం. ఆహారము, భోజనము.
అభ్యవహరించే. సం. స. క్రి. ఆహరించు, ఆరగించు. "మ. పవనాహారవిషంబు సోఁకదు యదౌషమ్యంబునం గేకిఁ గే,కి విలాసంబునఁ దాండవారభటి సంక్రీడించుటన్ క్ష్వేళ మ,భ్యవహరించెఁ గపాలి యన్న మఱి యేలా చెప్పఁ దచ్ఛక్తి య, న్నవగారుత్మత భుక్తిపాత్ర యొసఁగె న్రాజాత్మజా భర్తకున్." నై. ౬, ఆ. ౯౯.
అభ్యవహార్యము. సం. విణ. (అ. ఆ. అ.) భుజింపఁదగినది, తినఁదగినది.
అభ్యవహృతము. సం. విణ. (అ. ఆ. అ.) భుజింపఁబడినది, తినఁబడినది.
అభ్యసనము. సం. వి. అ. న. 1. చేసినపని మరల చేయుట; 2. అభ్యాసము, అలవాటు; 3. నేర్చుకొనుట; 4. నేర్పు. "మ. ఖుసిమీఱన్ సురధాణ నిండు కొలువై కూర్చున్నచో నీకరా,భ్యసనంబు న్నుతియించురా." హర. పీఠిక. ౨౨.
అభ్యసనీయము. సం. విణ. (అ.ఆ.అ.) అభ్యసింపఁదగినది.
అభ్యసించే. సం. స. క్రి. 1. (చేసినపని ధ్రువపడుటకై) మరలఁజేయు; 2. (విద్యాదులు వశమగుటకై) మరల మరలఁజదువు; 3. అలవాటుచేయు; 4. నేర్చుకొను.
అభ్యస్తము. సం. విణ. (అ. ఆ. అ.) అభ్యసింపఁబడినది.
అభ్యస్యము. సం. = అభ్యసనీయము.
అభ్యాంతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) రోగి.
అభ్యాకాంక్షితము. సం. వి. అ. న. = అభ్యాఖ్యానము.—విణ. (అ. ఆ. అ.) కోరఁబడినది.

అభ్యాఖ్యానము. సం. వి. అ. న. మిథ్యాభియోగము, అబద్ధపు వ్యాజ్యము, దోషారోపము.

అభ్యాగతుఁడు. సం. వి. అ. పుం. భోజనసమయమున వచ్చినయతిథి.—విణ. (అ.ఆ.అ.) ఎదురుగా వచ్చినవాఁడు.

అభ్యాగమనము. సం. వి. అ. న. 1. ఎదురుగా వచ్చుట; 2. పెద్దలు వచ్చినపుడు లేచి యెదురుగా పోవుట.

అభ్యాగమము. సం. వి. అ. పుం. 1. ఎదురుగాఁ బోవుట; 2. పెద్దలువచ్చినపుడు లేచి యెదురుగాఁబోవుట; 3. కొట్టుట; 4. దెబ్బ; 5. దాపు, సమీపము; 6. విరోధము, పగ; 7. పోరు, యుద్ధము; 8. మరణము, చావు.

అభ్యాగారికుఁడు. సం. విణ. (అ.ఆ-రికా.అ.) కుటుంబపోషణమునందు మిక్కిలి యాసక్తిగలవాఁడు.

అభ్యాగతి. సం. వి. ఇ. పుం. = అభ్యాగతుఁడు. వాడుకలోను శాసనములందును దీనికి ప్రయోగము గలదు. అభి+ఆగతి అని విడఁదీసి బహువ్రీహిగా సాధింపవచ్చును గాని అతిథి, అభ్యాగతి అనువానిలో అతిథిశబ్దసాహచర్యమున అభ్యాగతశబ్దము ఇకారాంతముగా వాడఁబడి యుండును.

అభ్యామర్దము. సం. వి. అ. పుం. 1. పీడించుట; 2. యుద్ధము, పోరు.

అభ్యాశము. సం. వి. అ. న. దాపు, సమీపము.—విణ. (అ.ఆ.అ.) దాపైనది, సమీపమున నున్నది.

అభ్యాసపడు. మి. అ. క్రి. అలవాటుపడు, వాడుకపడు.

అభ్యాసము. సం. వి. అ. న. అభ్యాశము, దాపు.—పుం. (అభ్యసనము.) 1. అలవాటు; 2. పునరుక్తి, చెప్పినది మరలఁ జెప్పుట; 3. చదివినది మరలఁ జదువుట.—విణ. దాపైనది, సమీపమైనది.

అభ్యాసాదనము. సం. వి. అ. న. 1. ముట్టడి, శత్రువునెదుర్కొనుట; 2. శత్రుపక్షము దుర్బలము చేయుట; 3. సమీపమున నుంచుట.

అభ్యాసించు. సం. స. క్రి. = అభ్యసించు. "సీ. బహుదేశభాష లభ్యాసింప వాంఛించు శల్యతంత్రముమీఁదఁ జాఁపు మనసు." శివరా. 3. ఆ. ౧౧౧.

అభ్యుక్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎదుటఁ జెప్పఁబడినది; 2. ప్రకటింపఁబడినది.

అభ్యుచ్చయము. సం. వి. అ. పుం. 1. అభివృద్ధి; 2. ఐశ్వర్యము.

అభ్యుచ్ఛ్రితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి యభివృద్ధి నొందినది; 2. శ్రేష్ఠము, ఉత్తమము.

అభ్యుత్థానము. సం. వి. అ. న. 1. కూర్చుండు చోటనుండి లేచుట; 2. లేచుట; 3. పెద్దలు వచ్చినపుడు గౌరవసూచకముగా లేచి ఎదురుగా పోవుట; 4. బయలుదేఱుట; 5. వృద్ధిలోనికి వచ్చుట; 6. ఉద్యమము, పూనిక.

అభ్యుత్థాయి. సం. విణ. (న్.ఈ-నీ.న్.) అభ్యుత్థానము చేయువాఁడు.

అభ్యుత్థితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. లేచినవాఁడు; 2. పెద్దలువచ్చినపుడు గౌరవసూచకముగాలేచి యెదురుగా పోవువాఁడు; 3. వృద్ధిలోనికి వచ్చినవాఁడు.

అభ్యుత్పతనము. సం. వి. అ. న. మీఁదికుఱుకుట, పైనిపడుట.

అభ్యుదయము. సం. వి. అ. పుం. 1. శ్రేయస్సు, మేలు. "క. అమ్మనుమనృపతి కభ్యుదయమ్ముగ నేఁ జెప్పఁబూని నట్టికథకు నాద్యమ్మయి యయోధ్య యనునా, మమ్మున నెగడిన పురోత్తమము వర్ణింతున్." నిర్వ. ౧, ఆ. ౪౫; 2. అభివృద్ధి; 3. వృద్ధినిమిత్తమగుకర్మ.

అభ్యుదితుఁడు. సం. వి. అ. పుం. సూర్యోదయకాలమున నిద్రించువాఁడు.

అభ్యుదీరితము. సం. వి. అ. న. చెప్పుట.—విణ. (అ.ఆ.అ.) 1. ఎదుటఁజెప్పఁబడినది; 2. చెప్పఁబడినది.

అభ్యుద్గతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎదురుగాఁబోవువాఁడు; 2. ప్రత్యుత్థానము చేయువాఁడు. "ఆ. అదరిపడి లతాంగులెల్ల, నాసనములు డిగ్గి యప్పు డభ్యుద్గత,లై రి మనములందు హర్షమెసఁగ." భార. అర. ౨, ఆ. ౩౬.

అభ్యుద్గమనము. సం. వి. అ. న. = అభ్యుద్గమము.

అభ్యుద్గమము. సం. వి. అ. పుం. 1. లేచుట; 2. పుట్టుట, బయలుదేఱుట.

అభ్యుద్ధరించు. సం. స. క్రి. 1. పెల్లగించు; 2. మీఁదికెత్తు; 3. వృద్ధిలోనికిఁ దెచ్చు.

అభ్యుద్యతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉద్యుక్తము, పూనికగలది; 2. అయాచితముగా లభించినది. (ఫలాది.)

అభ్యున్నతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి యెత్తయినది; 2. పైకివచ్చినది. "అభ్యున్నతాంగుష్ఠనఖప్రభలు."

అభ్యుపగతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందఁబడినది; 2. అంగీకరింపఁబడినది; 3. సమీపమును బొందినది; 4. ఎదురుగా వచ్చినది; 5. తెలిసికొనఁబడినది.

అభ్యుపగమము. సం. వి. అ. పుం. 1. అంగీకారము, ఒప్పుకొనుట; 2. స్వీకరించుట; 3. సమీపించుట; 4. పొందుట; 5. తెలిసికొనుట.

అభ్యుపగమించు. సం. స. క్రి. 1. అంగీకరించు, ఒప్పుకొను; 2. తెలిసికొను. "సీ. ముండకోపనిషత్తుఁ దాపనీయోపనిషత్తు నభ్యుపగమించుఁ, దఱియు నథర్వవేదశిరః ప్రపంచంబు, లారణ్యకము త్రోవ లరసిచూచు." కాశీ. ౨, ఆ. ౧౫౧.

అభ్యుపపత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. అనుగ్రహము, రక్షించుట; 2. సాంత్వనము, బుజ్జగించుట; 3. పొందుట.

అభ్యుపపన్నము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అనుగ్రహింపఁబడినది; 2. అంగీకరింపఁబడినది; 3. పొందఁబడినది.

అభ్యుపాయము. సం. వి అ. పుం. 1. అంగీకారము, స్వీకారము; 2. గొప్పయుపాయము; 3. పొందుట.

అభ్యుపేతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. అంగీకరింపఁబడినవాఁడు; 2. అంగీకరించువాఁడు; 3. పొందినవాఁడు.

అభ్యుషితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎదుట నివసించువాఁడు; 2. నివసించువాఁడు.—వి. అ. పుం. సేవకుఁడు.

అభ్యుషీయము. సం. = అభ్యూషీయము.

అభ్యూషము. సం. వి. అ. పుం. 1. పోళి, గుగ్గిళ్లు; 2. కాల్చినరొట్టె.

అభ్యూషీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. గుగ్గిళ్లకుపయోగించునది. (సెనగలు మొ.) 2. రొట్టెకు పనికివచ్చునది. (యవగోధూమాదులపిండి.)

అభ్యూహనీయము. సం. విణ. (అ. ఆ. అ.) స్వబుద్ధిమాత్రము చేత ఊహింపఁదగినది.

అభ్యూహము. సం. వి. అ. పుం. స్వబుద్ధిమాత్రము చేత ఊహించుట.

అభ్యూహ్యము. సం. = అభ్యూహనీయము.

అభ్యైషీయము. సం. = అభ్యూషీయము.

అభ్రంకషము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆకాశమును ఒరయునది; 2. అత్యున్నతము.

అభ్రంలిహము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆకాశమును అంటునది; 2. మిక్కిలి యెత్తయినది, అత్యున్నతము. "పర్వతము అభ్రంలిహాగ్రము."—వి. అ. పుం. వాయువు.

అభ్రకము. సం. వి. అ. న. కాకిబంగారము, గిరిజము, బేగడ యను ధాతువిశేషము.

అభ్రగము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆకాశమునఁ బోవునది; 2. ఆకాశమును బొందునది.—వి. అ. పుం. విహగము, పక్షి.

అభ్రగంగ. సం. వి. ఆ. స్త్రీ. ఆకాశగంగ.

అభ్రపిశాచము. సం. వి. అ. పుం. (ఆకాశమున పిశాచమువంటిది.) రాహువు.

అభ్రపుష్పము. సం. వి. అ. న. 1. (మేఘమే పుష్పముగాఁ గలది. దానికి నీరు ఫలము.) నీరు, జలము; 2. ఆకాశపుష్పము, అసంభవపదార్థము; 3. ప్రబ్బ ♆.

అభ్రమాతంగము. సం. వి. అ. పుం. (స్వర్గమున నుండు ఏనుఁగు, లేక మేఘాధిష్ఠానమయిన యేనుఁగు, ఇంద్రుని యేనుఁగు.) ఐరావతము.

అభ్రము. సం. వి. అ. న. 1. ఆకాశము; 2. మబ్బు, మేఘము; 3. బంగారు; 4. అభ్రకము; 5. ముస్త; 6. స్వర్గము.

అభ్రమువల్లభుఁడు. సం. వి. అ. పుం. (అభ్రమువనుదానికి పోతుటేనుఁగు.) ఐరావతము.

అభ్రముపు. సం. వి. ఉ. స్త్రీ. తూర్పుదిక్కునందుండెడి ఆఁడేనుఁగు.

అభ్రావకాశము. సం. వి. అ. పుం. ఆవరణము లేని ప్రదేశము, ఆఱుబయలు.

అభ్రి. సం. వి. ఇ. స్త్రీ. 1. నావకర్దమాలను, పడవ లోనిమన్ను మొదలగునవి తుడిచివేయు సాధనముగు కొయ్యగుద్దలి; 2. పండిన ఉప్పును త్రవ్వ పట్టి ప్రోగుచేయు గుద్దలి; 3. గుద్దలి; 4. చివర వాడిగా నుండు లోహము.

అభ్రియము. సం. విణ. (అ. ఆ. అ.) మబ్బుపట్టి నది. (జలాది.)

అభ్రేషము. సం. వి. అ. పుం. 1. న్యాయము, పాడి; 2. తన కుచితమైనధర్మమునం జరుపకుండుట. —విణ. (అ. ఆ. అ.) 1. న్యాయము తప్పనిది; 2. చలనము లేనిది; 3. తగినది.

అమ. ఉభ. వై. వి. అమ్మ.— సం. ఆ. స్త్రీ. అమావాస్య.

అమంగళము. సం. వి. అ. న. 1. అశుభము; 2. ఆముదపుఁజెట్టు.—విణ. (అ. ఆ. అ.) 1. అశుభమైనది; 2. క్షేమము లేనిది.

అమంగళ్యము. సం. విణ. (అ. ఆ. అ.) అమంగళసాధనమైనది, అశుభహేతువైనది.

అమండము. సం. వి. అ.పుం. ఆముదపుఁజెట్టు.—విణ. (అ. ఆ. అ.) 1. అలంకారములేనిది; 2. గంజి లేనిది; 3. మీఁగడలేనిది.

అమంత్రకము. సం. = అమంత్రము.

అమంత్రము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మంత్ర సంస్కారములేనిది; 2. వేదమంత్రపాఠము లేనిది.

అమందము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మాంద్యము లేనిది, చుఱుకైనది; 2. శ్రేష్ఠము; 3. అధికము.

అమడలు. వై. వి. బ. కవబిడ్డలు, కవలు. వృత్తి యం దేకవచనము. "అమడకాయ (=జంటకాయ); అమడపిల్లలు."

అమతి. సం. వి. ఇ. పుం. 1.యముఁడు;2.చంద్రుఁడు. —స్త్రీ. 1. మతిలేమి; 2. మంచిబుద్ధిలేకపోవుట.—విణ. ఇ. 1. మతిలేనివాఁడు; 2. మంచి బుద్ధి లేనివాఁడు.

అమత్రము. సం. వి. అ. న. 1. కంచుపాత్రము; 2. పాత్రము.

అమనస్కుఁడు. సం. విణ. (అ.ఆ.అ.)= అమనుఁడు.

అమనుఁడు. సం. విణ. న. 1. ఆలోచనకుఁదగిన మనస్సు లేనివాఁడు. (బాలుఁడు;) 2. మనస్సు లేనివాఁడు; 3. పరధ్యానముగలవాఁడు; 4. స్నేహములేనివాఁడు; 5. మనస్సును వశము చేసికొననివాఁడు.

అమముఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మమత్వము లేనివాఁడు, నాదియనెడి యభిమానము లేని వాఁడు.—వి. అ. పుం. ఒకానొకజినుఁడు.

అమయు. దే. అ. క్రి. ఉపయుక్తమగు. "వ. సమ రసమయంబున కమయందగు కణయకంపణభిండి వాలప్రముఖప్రహరణంబులు నిండ నొండొండ నడుకొన నిడి." ఉ. హరి. ౪, ఆ. ౨౧౩.

అమర. సం. వి. ఆ. స్త్రీ. 1. అమరావతి; 2. కంబము; 3. గఱిక; 4. తిప్పతీఁగ ♈; 5. మావి.

అమరకము. దే. వి. 1. అమరము; 2. ఈనాములు మొదలగు సాగుబడి పొలములను సేద్యగాండ్రకు సొమ్మునకుగాని, ధాన్యాదుల మక్తాలకుగాని కవులు కద పాలను వ్రాసికొని అమర్చుట.

అమరద్విజుఁడు. సం. వి. అ. పుం. అర్చకుఁడు, పూజారి.

అమరము. సం. వి. అ. పుం. 1. పాదరసము; 2. పొగడ ♈; 3. (అమరుఁడనువాఁడు రచించినది.) నామలింగానుశాసనమను నిఘంటువు.— దే. వి. 1. పాళెపట్టుదొరల కీయఁబడు గ్రామము మొదలగుసన్మానము ఈనామము. "గీ. భటులు వేయిటికెన్న నిర్వదియునాల్గు, వేలుగా లక్ష యర్వదివేల ప్రజకుఁ, జెల్లు నల్వదిలక్షలు జీత మనఘ, యమరమేలెడుదొరల కీక్రమమె సుమ్మి." కృష్ణ. ౨, ఆ. ౭౮; 2. భటులకును రాజపురుషులకు నిచ్చు మాన్యము.

అమరసర్షప. సం. వి. ఆ. స్త్రీ. వాయింట ♈.

అమరావతి. సం. వి. ఈ. స్త్రీ. ఇంద్రునిపట్టణము.

అమరిక. దే. వి. (అమరుట.) 1. అందము; 2. విధము; 3. సరిపోవుట, తగియుండుట.

అమరు. దే. అ. క్రి. 1. ఒప్పు. "క. పురిరాకొమ రులకీర్త్యం, బరవాహిని భుజగపురికి బలువిడిఁ జని యం,దిరవుకొన నెడము చాలమి,మరలినతఱి. బుగ్గలన నమరు సౌధంబుల్." పాండు. ౧, ఆ.

౧౦౭; 2. కుదురు; 3. పొందికపడు, సరిపడు, తగు. "వ. ద్రుపదుండు శిఖకు నమరె దశార్ణకరాససేన కిరాతదేశాధీశులు కంఠాకారంబుఁ దాల్చిరి." భార. భీ. ౨, ఆ. ౨౧; 4. సిద్ధమగు; "వ. మీరింక సాధ్వసగ్రస్తులైన నగునె ధీరమనస్కులయి సమరంబునకు నమరుం డనునవసరంబున." ఉ. హరి. ౬,ఆ.౧౪౭; 5. సిద్ధించు,ఫలించు. "క.ని,క్కముగ నిపు డెల్లకోర్కులు, నమరెంగద మిమ్ముఁ జూచి నంతసె మాకున్." అచ్చ. బాల. కాం. ౧౫౪.

అమరుఁడు. సం. వి. అ. పుం. 1. వేల్పు; 2. నామలింగానుశాసన మను శ్లోకరూపనిఘంటువు రచించినవాఁడు. (అమరసింహుఁడనియుఁ బ్రసిద్ధి.) —ఈ. పుం. అమరుకవి.—విశే. (అ. ఆ. ఆ.) చావనివాఁడు, మరణములేనివాఁడు.

అమరుచే. దే. ప్రే. 1. అమరఁజేయు; 2. చేయు; "ఉ. కాలయాపన మమర్పక యప్పిశితాశిఁ బట్టి పాలార్పఁగనేల." భార. ఆది. ౬, ఆ. ౨౧౬; 3. ఏర్పఱచు; 4. పెట్టు; 5. సిద్ధపఱచు.

అమర్త్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. చావులేనివాఁడు; 2. మనుష్యభిన్నుఁడు.—వి. అ. పుం. వేలుపు, దేవత.

అమర్యాద. సం. వి. ఆ. స్త్రీ. మర్యాదలేమి.

అమర్యాద. సం. విశే. (అ.ఆ.అ.) మర్యాదలేనిది.

అమర్షణము. సం. వి. అ. న. = అమర్షము.

అమర్షణుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) అమర్షము గలవాఁడు. చూ. అమర్షము.

అమర్షము. సం. వి. అ. పుం. 1. కోపము, 2. అసూయ, ఓర్వలేనితనము.

అమర్షి. సం. విశే. (న్.ఈ.నీ.న్.)=అమర్షణుఁడు.

అమర్షితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) = అమర్షణుఁడు.

అమల. సం. వి. ఆ. స్త్రీ. 1. లక్ష్మి; 2. బొడ్డుకాఁడు; 3. నేలయుసిరిక⚘.

అమలము. సం. వి. అ. న. అభ్రకము.—విశే. (అ.ఆ.అ.) 1. నిర్మలము; 2. దోషములేనిది; 3. తెల్లనిది.

అమలినము. సం. విశే. = అమలము. విశే.

అమలు. హిం. వి. 1. అధికారము, ప్రభుత్వము; 2. ఆచరణము. "ఆధర్మ మిపుడు అమలులో లేదు;" 3. విచారణ. "ఆవ్యాజ్య మమలులో నున్నది."

అమలుదారు. హిం. వి. తహశ్శీలుదారు, కొన్నిగ్రామములు కలసిన తాలూకాలో పన్ను వసూలు చేసెడి యధికారి.

అమవస. వై. వి. అమావాస్య. "క. అమవస గావు ననేఁడ,క్కమలజుఁ గొలుపఁగ మహర్షి గణములు పితృసం,ఘములును బోదురు బ్రహ్మం, డమునం గలవారలం దొడంగూడంగన్." భార. ఆను. ౫, ఆ. ౬౬. "క. కలఁగుం దోఁపమి యమవసఁ, గలుగునె యంతటన యమృతకరునకు నాశం, బలఘుపరవస్తువునకుం, గలదె యభావంబు మనసు గానని కలుచన్." భార. శాం. ౪, ఆ. ౧౮౩.

అమసృణము. సం. విశే. (అ. ఆ. అ.) 1. నునుపులేనిది, గఱుకయినది; 2. కఠినమయినది.

అమాంతగాఁడు. దే. వి. (అమాంతము+కాఁడు.) చిల్లరబేరగాఁడు. శ. ర.

అమాంతము. దే. వి. 1. చిల్లరబేరము. శ. ర.; 2. అకస్మాత్తుగా, హఠాత్తుగా. "అంతలో అందఱు అమాంతముగా వచ్చి పడ్డారు."

అమాంసుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) 1. మాంసము లేనివాఁడు; 2. బలములేనివాఁడు, దుర్బలుఁడు.

అమాత్యుఁడు. సం. వి. అ. పుం. (రాజుతోఁగూడ నుండువాఁడు.) మంత్రి.

అమానస్యము. సం. వి. అ. న. (మనస్సునకు కష్టము గలిగించునది.) దుఃఖము, వంత.

అమాని. ఉభ. దే. విశే. దొరతనము వారి స్వతంత్ర విచారణ కలది. శ. ర.—సం. విశే. (న్.ఈ.నీ.న్.) మాని కానివాఁడు, మానములేనివాఁడు.

అమానుదస్తా. హిం. వి. ఔషధము చేయు వస్తువులు, తాంబూలము మొదలైనవి దంచుఇనుపరోలు, రోఁకలి.

అమానుషము. సం. విశే. (అ. ఆ. అ.) 1. మనుష్యకృతము కానిది; 2. మనుష్యులులేనిది, నిర్జనము;

"క. అచ్చోనీ, ద్రుమశాఖ విడువు మని దానవమానుష మగమ్య మీశ్వరాదుల కైనన్." భార. ఆది. ౨, ఆ. ౭౮; 3. మనుష్యసంబంధము గానిది; 4. మనుష్యశక్తికి మించినది. "క. అనినఁ గడు లెస్స యని నెమ్మనమున నూఁబడి విభుం డమానుష తేజో, ధనుఁడగు సహదేవుఁ గనుంగొని యిట్లను పగలు మిగిలి కొండలపఱుపన్." భార. విరా. ౧, ఆ. ౯౭. "చ. అనఘ యమానుషంబయినయట్టివ యైనను నాటపంబు పెంపునకు మునీంద్రు లన్భుతము బొందఁగ మీ కపటీల నిత్తునే వచుటయు." భార. ఆశ్ర. ౨, ఆ. ౬౪. ఇట దివ్యమని తాత్పర్యము. "వానియమానుషకృత్యములు విన భయంకరములు." ఇత్యాదులందు రాక్షసకృత్యములని భావము; 5. పౌరుషములేనిది, అవమానకరమయినది. "వాడు చాల అమానుషముగ మాటాడినాడు." —వి. అ. న. 1. పౌరుషము లేకపోవుట; 2. అవమానము.

అమారు. దే. వి. ఓడలంగరు మోకు.—విణ. తయారు, సిద్ధము; "ప్రయాణమునకు అమారుగానున్నాను; పడ్డనకు పదార్థములు అమారైనవి."

అమావసి. సం. వి. ఈ. స్త్రీ. = అమావాస్య.

అమావాసి. సం. = అమావాస్య.

అమావస్య. సం. = అమావాస్య.

అమావాస్య. సం. వి. ఆ. స్త్రీ. (సూర్యచంద్రులు కలసియుండుతిథి.) బహుళపక్షమున బదునైదవతిథి.

అమాస. వై. = అమావాస్య.

అమిజీ. దే. వి. కూలిలేమి, వెట్టి.

అమితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మితిలేనిది, హద్దులేనిది; 2. తెలియఁబడనిది.

అమితాశనుఁడు. సం. వి. అ. పుం. 1. పరమేశ్వరుఁడు; 2. విష్ణువు.—విణ. (అ.ఆ.అ.) అమితముగాఁ దినువాఁడు, మితిమీఱి తినువాఁడు.

అమిత్రుఁడు. సం. వి. అ. పుం. శత్రువు.—విణ. (అ. ఆ. అ.) మిత్రులులేనివాఁడు; 2. మిత్రము కానివాఁడు.

అమిథ్యా. సం. అవ్య. (తెనుఁగున సమాసపూర్వపదముగానే యుండును.) సత్యము. చూ. అమిథ్యావచనుఁడు.

అమిథ్యావచనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సత్యమైన వాక్యము గలవాఁడు. "క. నాకంటెను మీకంటెను, లోకములో నధికుఁ డతిబలుండు ధనుర్విద్యాకౌశలమున నాతఁడు, మీకుం బ్రియ శిష్యుఁడటె యమిథ్యావచనా." భార. ఆది. ౫, ఆ. ౨౪౦.

అమిషము. సం. వి. అ. న. 1. లౌకికసుఖము; 2. మాంసము; 3. ఆఁడుదాని రాచేటికము, స్త్రీరాజ్యము.—విణ. (అ.ఆ.అ.) మిషలేనిది.

అమీన్. హిం. వి. = అమీనా.

అమీనా. హిం. వి. 1. న్యాయాధికారి తీర్పులలోని విషయములను అమలుజరుపువాఁడు. "అమీనా వచ్చి తీర్పుప్రకారము ఆస్తి అప్పగింతపెట్టినాఁడు;" 2. చిన్నప్రదేశములమీఁద న్యాయాధిపతి; 3. జమీందారీగ్రామములలో శిస్తు వసూళ్లు చేయుగ్రామాధికార్లపై చిన్నఅధికారి; 4. అధికారి.

అముఖ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ముఖ్యము కానిది, అప్రధానము.

అముత్ర. సం. అవ్య. పరలోకమందు. (తెనుఁగున సమాసపూర్వపదముగానే ఉపయుక్తము.) "క. క్షత్రియసంస్కారమునకుఁ, బాత్రముగా నీవు నన్నుఁ బాటింప విహా, ముత్రఫలములకు నీకేఁ, బుత్రుఁడ నని వచ్చు టెంకఁ బోసఁగునె చెపుమా." భార. ఉద్యో. ౪, ఆ. ౬౨. వ్యతి, ఇహ.

అముష్కరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మూర్ఖత లేనివాఁడు. (సంస్కృతగ్రంథములఁ గనఁబడదు. కన్నడమని కిట్టెలు సూచించెను.) "మ. అరయం దప్పు కృతం బెఱుంగు మదలోభావేశముల్ లే వముష్కరుఁ డాత్మస్తుతి లేదు." భార. శాం. ౨, ఆ. ౨౯౬.

అముష్యపుత్రుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మంచి కులమునఁ బుట్టినవాఁడు.

అముష్యాయణుఁడు. సం. = అముష్యపుత్రుఁడు.

అమూదృశము. సం. విణ. (అ.ఆ.అ.) ఇట్టిది.

అమూదృశము. సం. విణ. శ్. (అ. ఈ-శీ. అ.) ఇట్టిది.

అమూర్తము. సం. విణ. (అ. ఆ. అ.) మూర్తము కానిది, రూపములేనిది. (వాయువు మొ.)

అమూలము. సం. విణ. (అ.ఆ.అ.) 1. మూలకారణములేనిది; 2. మూలమున లేనిది; 3. మొదటి ప్రమాణము లేనిది; 4. వేరు లేనిది.

అమూల్యము. సం. విణ. (అ.ఆ.అ.) 1. వెలలేనిది; 2. (దేనికంటె అధికమైనమూల్యము గలది లేదో అట్టిది.) ఎక్కువ విలువగలది.

అమృణాళము. సం. వి. అ. న. 1. నీటిపట్టివేరు; 2. వట్టివేరు.

అమృత. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉసిరిక♣; 2. కరక♣; 3. తిప్పతీగ; 4. పిప్పలితీగ.

అమృతకలశము. సం. వి. అ. న. 1. అమృతఘటము; 2. భక్ష్యవిశేషము. "వ. అతిరసమ్ములు సుకియ లమృతకలశమ్ములు." హంస. ౧, ఆ. ౧౦౫.

అమృతదీధితి. సం. వి. ఇ. పుం. (అమృతమయమగు కాంతిగలవాఁడు.) చంద్రుఁడు.

అమృతద్యుతి. సం. = అమృతదీధితి.

అమృతపత్రము. సం. వి. అ. పుం. పూతికరంజము, నెమిలి♣.

అమృతఫల. సం. వి. ఆ. స్త్రీ. ద్రాక్ష♣.

అమృతఫలము. సం. వి. అ. పుం. చేఁదుగలపొట్ల♣.

అమృతబంధువు. సం. వి. ఉ.పుం. (అమృతమునకుఁ దోఁబుట్టువు.) చంద్రుఁడు.

అమృతము. సం. వి. అ. న. 1. పీయూషము, సుధ; 2. నీళ్లు; 3. నెయ్యి; 4. అయాచితవస్తువు; 5. అయాచితవృత్తి; 6. ముక్తి; 7. యజ్ఞశేషము; 8. పాలు, క్షీరము; 9. రుచిగలపదార్థము; 10. ఆశౌచము; 11. బంగారము.—విణ. (అ. ఆ. అ.) 1. అందమైనది; 2. మృతముకానిది, చావనిది; 3. మృతిలేనిది; 4. రుచ్యమైనది; (పంచామృతములు: ఉదకము, పాలు, పెరుగు, నెయ్యి, తేనె.)

అమృతాంధసుఁడు. సం. వి. స్. పుం. (అమృతము అన్నముగాఁగలవాఁడు.) దేవత, వేల్పు.

అమృతాంశువు. సం. వి. ఉ. పుం. (అమృతకిరణుఁడు.) చంద్రుఁడు.

అమృతాయమానము. సం. విణ. (అ.ఆ.ఆ.) అమృతమువలె నుండునది.

అమృతాశనుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) అమృతము తినువాఁడు; లేక, అమృతము అశనముగాఁ గలవాఁడు.—వి. అ. పుం. వేలుపు, దేవత.

అమృతాశి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) అమృతము తినువాఁడు. "ఆ. ఆది నింద్రుఁ గాంచి యమృతాశి వగుట నీ, కభిమతార్థసిద్ధి యయ్యెనయ్య." భార. ఆది. ౧, ఆ. ౧౧౯.—వి. న్. పుం. = అమృతాశనుఁడు.

అమృతాశుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) అమృతము తినువాఁడు.— వి. అ. పుం. వేలుపు.

అమృతాహరణుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) అమృతము తీసికొనిపోవువాఁడు.—వి. అ. పుం. గరుడుఁడు.

అమృతుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) మృతుఁడు కానివాఁడు, చావనివాఁడు.—వి. అ. పుం. 1. వేలుపు; 2. ధన్వంతరి.

అమృష్యుఁడు. సం. వి. అ. పుం. (సహింపఁదగనివాఁడు.) పగవాఁడు, శత్రువు.

అమేధ్యము. సం. విణ. (అ. ఆ. అ.) పవిత్రముకానిది.—వి. అ. న. పురీషము, మలము.

అమేయము. సం. విణ. (అ.ఆ.అ.) 1. కొలఁదియిడరానిది, లెక్కింపశక్యముకానిది. "చ. తలపడి యంత్యకాలశిఖి దారుణభంగి నమేయమార్గణార్చులు వరఁగించుచుఁ భయము సొచ్చి." భార. భీష్మ. ౨, ఆ. ౩౨౫; 2. తెలిసికొన శక్యము గానిది. "చ. హరుఁ బరమేశ్వరేశ్వరుఁ గృపాతిశయార్ద్రు నమేయమూర్తి శంకరు" భార. సౌ. ౨, ఆ. ౧౦౫.

అమేషా. హిం. క్రి.విణ. ఎల్లప్పుడు. రూ. హమేషా.

అమోఘ. సం. వి. ఆ. స్త్రీ. 1. కరక♣; 2. వాయువిడంగము♣.

అమోఘము. సం. విణ. (అ. ఆ. అ.) వ్యర్థము కానిది, సఫలము.

అమానము. సం. విణ. (అ.ఆ.అ.) మానము లేనిది, మాటలాడునది.

అమ్మ. వై. వి. (సం. అంబా. త. క. అమ్మ.— దేశ్య మనియు ననవచ్చును.) 1. తల్లి; 2. పూజ్య స్త్రీ; 3. స్త్రీ నామాంతములందు చేర్చుపదము. "వెంకమ్మ, సుబ్బమ్మ."—అవ్య. ఆశ్చర్యాదులను తెలుపును. "చ...స్ఫుటకంబు లమ్మ యనఁ జేసియ లొత్తుకొనె జిల్లుపాటలో." ఉ. రా. ౬, ఆ. ౧౩౪.

అమ్మగారు. దే. వి. 1. తల్లి; 2. పూజ్యురాలు.

అమ్మకచెల్ల. ద్వ. అవ్య. (అమ్మ+అక+చెల్ల.) ఆశ్చర్య సంతాపాదులను తెలుపును. "ఉ. అమ్మకచెల్ల నాహృదయ మమ్మక చెల్లదు వీని కియ్యెడన్." విజ. ౧, ఆ. ౭౦.

అమ్మకము. దే. వి. విక్రయము, అమ్ముట.

అమ్మక్క. వై. అవ్య. (అమ్మ+ అక్క.)=అమ్మకచెల్ల. "ద్వి. అమ్మక్కయని సతు లక్కజం బంద." రా. బా. కాం. పు. ౭౪.

అమ్మచెల్ల. ద్వ. అవ్య. (అమ్మ+చెల్ల.) = అమ్మకచెల్ల.
అమ్మనబోంట్లు. దే. వి. బ. బాలికాక్రీడావిశేషము.
అమ్మనములు. దే. = అమ్మనలు.
అమ్మనలు. దే. వి. బ. 1. బాలికాక్రీడావిశేషము; 2. అమ్మనలాడుపరికరములు. రూ. అమ్మనములు.

అమ్మమ్మ. వై. వి. (అమ్మ+అమ్మ.) అమ్మకు అమ్మ, అవ్వ, మాతామహి.—అవ్య. = అమ్మ. అవ్య.

అమ్మయము. సం. విణ. (అ. ఈ. యీ. ఆ.) జల మయము.

అమ్మరో. ద్వ. అవ్య. (అమ్మ + రో.) ఆశ్చర్య సంతాపాదులను తెలుపును. "ఉ. అమ్మరో ధర్మ రాజుఁ గొనియాడఁగఁ జెల్లదె యెల్లదేశముల్." పాంచా. ౫, ఆ. ౭౬. రూ. అమ్మరో. (ఈరూప ములు అమ్మను పిలుచుటయందును వచ్చును.)

అమ్మరో. ద్వ. = అమ్మరో.

అమ్మవారు. ద్వ. వి. బ. 1. స్త్రీదేవత; 2. గ్రామ దేవత; 3. మారి, మశూచి మొదలగురోగము. (ఇవి గ్రామదేవతల కోపాదులవలనఁగలిగిన వికా రములనియు, వారిప్రసన్నతవలన తగ్గుననియు కొందఱ యభిప్రాయము.)

అమ్మాయి. దే. వి. బాలిక, పిల్ల, కూఁతురు.
అమ్మి. దే. వి. 1. అమ్మాయి; 2. హీనజాతిస్త్రీ.
అమ్మిక. వై. వి. (సం. అంబికా.) పార్వతి. "గీ. గట్ల జేనిపట్టి కఱకంఠునిల్లాలు, కొదమసింగ మెక్కి కొన్న జంత, సత్తి సామితల్లి చండి యమ్మిక దుర్గ, యనఁగ నీవెలంత యలరు నభవ." ఆం. భా. ప్ర. స్వ. ౮౦.

అమ్ము. దే. స. క్రి. వెలకిచ్చు, విక్రయించు.—వై. వి. (సం. అంబకమ్.) బాణము. (దీనికి వీఁపునం దలి నఖక్షతియు అర్థమని కొందఱనియెదరు. అప్పుడు బహువచనాంతము అని శ. ర.)

అమ్ముకొను. దే. స. క్రి. విక్రయించుకొను, వెలకు ఇచ్చు.

అమ్ముడు. దే. వి. అమ్ముట, వెలకిచ్చుట.

అమ్ముడువోవు. దే. అ. క్రి. (అమ్ముడు+పోవు.) వెలకు నీయఁబడు, అమ్మకమగు. "మ. అనబా భ్రవ్యుఁడు నిట్ల తప్ప దన నాహా కూటిమాత్రం బునన్, మనమే మమ్ముడు వోతి మో యితనికిం బాపంబు గాదంచు దుర్జనవృత్తిం జనువారలై మునులు నిస్త్రాణంపు గోవున్ సృజించి నియోగించిరి గౌతమాప్తకలమక్షేత్రంబు భక్షింపఁగన్." వరా. ౧౧, ఆ. ౩౭.

అమ్ముపేటునేల. ద్వ. వి. బాణము పోయిపడునంత దూరముగలభూమి. "వ. గ్రామంబునకు నిర్భృతి భాగంబున నమ్ముపేటునేలకంటె దూరంబుగాఁ జని." వి. పు. ౮, ఆ. ౧౯౦.

అమ్రము. సం. వి. అ. పుం. ఆమ్రము, మామిడి♣.
అమ్ల. సం. వి. ఆ. స్త్రీ. చింత♣.
అమ్లకము. సం. వి. అ. పుం. నిమ్మ♣.
అమ్లకలంబము. సం. వి. అ. పుం. పుల్లబచ్చెలి♣.
అమ్లము. సం. వి. అ.పుం. 1. పులుపు; 2. తక్రము, మజ్జిగ.—విణ. (అ. ఆ. అ.) పుల్లనిది.

అమ్లశాకము. సం. వి. అ. పుం. పుల్లచెంచలి♣.
అమ్లానము. సం. వి. అ. పుం. పెద్దఱేకులుగల చేమంతి♣.—న. వనపద్మము.—విణ. (అ.ఆ.అ.) 1. వాడనిది; 2. మాయనిది.
అమ్లామిక. సం. వి. ఆ. స్త్రీ. (ఎక్కువపులుపుగలది.) చింత♣.

అమ్లాయనము. సం. వి. అ. పుం. తెల్లపెద్దగోరంటచెట్టు.
అమ్లిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చింతచెట్టు; 2. పులిచింతచెట్టు; 3. పులుసు; 4. త్రేఁపు; 5. పులిత్రేఁపు.
అమ్లోద్గారము. సం. వి. అ. పుం. పులిత్రేఁపు.
అయ. వై. = అయ్యా.
అయంత్రితము. సం. విశే. (అ. ఆ. అ.) అడ్డము లేనిది.
అయగారు. ద్వ. =అయ్యగారు. "తే. నన్ను బింగేలు పెట్టించునాఁడ యయ్యవారు నిద్రింపఁగాఁ జూచి చేరి యచటఁ, జింతబ్రేల్కామ్మ పంచుక సిగను గట్టి, విడిచి యుంటికిలి నయగారు మిడికికూయ." హంస. 3, ఆ. ౧౪౪. ఇట 'ఉపాధ్యాయుఁడు' అని అర్థము.రూ. అయవారు.
అయత్నము. సం. వి అ. పుం. యత్నములేమి, యత్నాభావము.—విశే. (అ.ఆ.అ.) యత్నము లేనిది.
అయథార్థము. సం. విశే. (అ. ఆ. అ.) యథార్థము కానిది, అసత్యము.
అయథార్థవర్ణుఁడు. సం. వి. అ. పుం. (మాఱువేషము వాఁడు.) గూఢచారుఁడు.
అయనము. సం. వి. అ. న. 1. గమనము, పోక; 2. సూర్యుఁడు దక్షిణ దిక్కునుండి యుత్తర దిక్కునకు ఉత్తరదిక్కునుండి దక్షిణదిక్కునకు పోవుట. (దక్షిణాయనము, ఉత్తరాయణము;) 3.(జ్యోతి.)—సంక్రాంతిభేదము; 4.(జ్యోతి.) అయనమును సాధించుశాస్త్రము; 5. ఆఱుమాసములకాలము; 6. స్థానము; 7. గృహము; 8. ఆశ్రయము; 9. త్రోవ.
అయము. సం. వి. అ. పుం. శుభావహవిధి, మేలు గలుగఁజేసెడికర్మము. 'మేలుగలుగఁజేసెడి దైవము' అని కొందఱు.
అయయొ. ద్వ. = అయ్యో. రూ. అయయో.
అయయో. ద్వ. (అయో+అయో) = అయ్యో.
అయరె. ద్వ. = అయ్యరె.
అయరే. ద్వ = అయ్యరె.
అయశము. సం. వి. స్. న. అపకీర్తి, చెడ్డపేరు.
అయశస్కరము. సం. విశే. (అ. ఈ-రీ. అ.) అపకీర్తి కలిగించునది.
అయశస్కుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) కీర్తిలేనివాఁడు.
అయశస్యము. సం. విశే. (అ. ఆ. అ.) అపవాదము కలిగించునది, అపకీర్తి కలిగించునది.
అయశస్సు. సం. = అయశము.
అయశుఁడు. సం. విశే. స్. = అయశస్కుఁడు.
అయస్తంభిని. సం. వి. ఈ. స్త్రీ. లింగాకారపు దొండచెట్టు.
అయస్కాంతము. సం. వి. అ. పుం. సూదంటు ఱాయి, ఇనుమును ఆకర్షించుఱాయి.
అయస్కారము. సం. వి అ. పుం. (జంతువుల) పిక్కకు ముందటిచోటు, జంఘాగ్రభాగము.
అయస్కారుఁడు. సం. వి. అ. పుం. ఇనుపపని చేయువాఁడు, కమ్మరి.
అయస్సు. సం. వి. స్. న. లోహము, ఇనుము.
అయాచితము. సం. విశే. (అ. ఆ. అ.) ప్రార్థింపఁబడనిది, కోరఁబడనిది. (ద్రవ్యము.)—వి. అ. న. అమృతవృత్తి, ఇతరులను యాచింపకుండఁగ లభ్యమైనదానితో తృప్తిపడియుండెడివృత్తి.
అయాజ్యయాజనము. సం. వి. అ. న. యాగముచే యింపఁగూడనిపతితునిచే యాగముచేయించుట.
అయాజ్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఇతరులచే యాగము చేయింపఁబడుటకు అర్హుఁడు కానివాఁడు, యజ్ఞానర్హుఁడు. (పతితుఁడు.)
అయాథార్థ్యము. సం. వి. అ. న. యథార్థము కామి, అసత్యము.
అయారె. ద్వ. = అయ్యరె.
అయారే. ద్వ. = అయ్యరె.
అయిర. దే. వి. నేత్రరోగభేదము. "ద్వి. మయిల పడ్డదియొ దుర్మాంసదోషంబొ, అయిరయో వెండియు నక్షిరోగంబొ, కానోపు నిట్లనుమానంబు లేదు, దీనికి మందుమాఁ కే నేమెఱుంగ." బస. 3, ఆ. పు. ౭౫.
అయిపజే. హిం. వి. (హిం. ఏవజ్.) 1. పొలమునఁ బండినధాన్యము మొదలగునవి; 2. రాఁబడి. "ఈ సంవత్సరము పదిగరిసెల అయివజు వచ్చినది;" 3. బదులు. "దండకడియమునకు అయివజుగా

ఉంగరము లుంచినాఁడు." (ఆయిపేషే ఆసియు వా.)

అయుక్తము. సం. విశే. (అ. ఆ. అ.) యుక్తము కానిది, తగనిది.

అయుగ్మనేత్రుఁడు. సం. వి. అ. పుం. (బేసికంటి వాఁడు.) శివుఁడు.

అయుగ్మపర్ణము. సం. వి. అ. పుం. 1. ఏడాకుల పొన్న; 2. ఏడాకులయరఁటి.

అయుగ్మము. సం. విశే. (అ. ఆ. అ.) సరిసంఖ్య లేనిది, బేసిది. "అయుగ్మనేత్రుఁడు"(=బేసికంటి వాఁడు.)

అయుగ్మవాహుఁడు. సం. వి. అ. పుం. (బేసి గుఱ్ఱములుగలవాఁడు.) సప్తాశ్వుఁడు, సూర్యుఁడు.

అయుగ్మశరుఁడు, సం. వి. అ. పుం. (బేసి బాణములుగలవాఁడు.) విషమశరుఁడు, పంచబాణుఁడు, మన్మథుఁడు.

అయుతము. సం. వి. అ. న. పదివేలు.—విశే. కూడుకొననిది.

అయొ. ద్వ. = అయ్యో.

అయో. ద్వ. అవ్య. (అయ+ఓ.) = అయ్యో.

అయోగము. సం. వి. అ. పుం. 1. వియోగము, ఎడఁబాటు; 2. కూడికలేమి; 3. విడువనిప్రయత్నము; 4. దుష్టయోగము.

అయోగవుఁడు. సం. వి. అ. పుం. శూద్రునివలన వైశ్యస్త్రీయందుఁ గలిగినవాఁడు.

అయోగ్యత. సం. వి. ఆ. స్త్రీ. అయోగ్యత్వము, యోగ్యుఁడు కాకపోవుట.

అయోగ్యుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) యోగ్యుఁడు కానివాఁడు, అపాత్రుఁడు, అనర్హుఁడు.

అయోగ్రము. సం. వి. అ. న. (చివర ఇనుపపొన్ను గలది.) ముసలము, రోఁకలి.

అయోఘనము. సం. వి. అ. పుం. లోహముద్గరము, కాల్చిన యినుమును సాఁగఁగొట్టెడు సమ్మెట.

అయోజాలము. సం. వి. అ. న. ఇనుపవల.

అయోధ్య. సం. వి. ఆ. స్త్రీ. (ముట్టడింప శక్యము గానిది.) ఇక్ష్వాకువంశస్థుల రాజధాని. (ఇది సరయూతీరమునఁ గలదు. మోక్షదాయకములగు సప్తపురములలో నొకటి.)

అయోధ్యము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ముట్టడింప శక్యము గానిది; 2. జయింప శక్యముగానిది.

అయోనిజుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) యోనిద్వారమునఁ బుట్టనివాఁడు. (ధృష్టద్యుమ్నుఁడు, ద్రౌపది, సీత, మొదలగువారు అయోనిజులు.)

అయోమయము. సం. విశే. (అ. ఈ-యీ. అ.) 1. ఇనుపది, ఇనుముతో చేసినది; 2. కఠినము; 3. దుర్బోధము, తెలియశక్యము కానిది.

అయోముఖము. సం. విశే. (అ. ఈ-ఖీ. అ.) చివర ఇనుముగలది.—వి. అ. న. చివర ఇనుపకట్టును అమర్చిన నాఁగటిదుంప.

అయోహృదయుఁడు. సం.విశే. (అ.ఆ.అ.) (ఇనుమువంటి మనస్సుగలవాఁడు.) కఠినహృదయుఁడు.

అయ్య. వై. వి. (సం. ఆర్యః. ప్రా. అజ్జో. త. అయ్యర్, అచ్చన్. క. అయ్య, అజ్జ.) 1. తండ్రి; 2. వాత్సల్యము, గౌరవము మొదలగువానిని తెలుపును; "వ. ఆరాజర్షి ముఖ్యుం డయ్యా యిట్లేల తడసి తని యడిగిన." భార. అర. ౧, ఆ. ౨౭౧; 3. పురుషసంబోధనమున ప్రశ్నమును తెలుప నుపయుక్తము. (ప్రశ్నమునందు వ్యతిరేక మిమిడియుండును.) "గీ.అఁ, కొనఁగ ముసిఁడి దినినఁ గ్రొవ్వు లావు, కలుగునయ్య." భార. ఉద్యో. 3, ఆ. 333. "గీ. ఎఱిఁగియెఱిఁగి నన్ను నేకార్థసమవేతుఁ, బాడియయ్య యిట్టిపనికిఁ బనుప." భార. అర.౨, ఆ. 3౬; 4. పురుషనామాంతములందుఁ జేరెడిపదము. "వెంకయ్య, సుబ్బయ్య."—విశే. 1. పూజ్యుఁడు; 2. (వ్యతిరేకలక్షణచేత) పరిహాసమును తెలఁపును. "ఉ. తొయ్యలి పీఠ వేలుపులు తూర్పున ముప్పదిమూఁడు కోటు లీయయ్యల నేఱు వేఱుఁ గొనియాడఁగఁ బట్టు సహస్రవర్షములే." నై. ౫, ఆ. ౨౧. "చ. పనివడి నారికేళ ఫలపాకమునం జవిరైనభట్టహర్షుని కవితాను గుంభములు సోమరిపోతులు కొందఱయ్య లౌనని కొనియాడనేర; రది యట్టిద; లేజవరాలు చెక్కుఁ గీఁటిన వసవల్చుబాలకుఁడు డెందమునం గలఁగంగ నేర్చునే." నై. ౧, ఆ. ౧౭.

అయ్యగారు. ద్వ. వి. 1. ఆచార్యుఁడు; 2. ఉపాధ్యాయుఁడు, విద్యాగురువు; 3. పూజ్యుఁడగు

బ్రాహ్మణుఁడు; **4.** బాబుగారు. (అధికారి యను భావమును తెలుపును;) **5.** తండ్రిగారు. రూ. అయగారు.

అయ్యది. దే. స. (ఆ+అది.) అది.

అయ్యయ్యొ. ద్వ. అవ్య. (అయ్యొ+అయ్యొ.) = అయ్యొ. రూ. అయ్యయ్యో.

అయ్యయ్యో. ద్వ.=అయ్యయ్యొ.

అయ్యరె. ద్వ. అవ్య. (అయ్య+రె.) ఆశ్చర్యాదులను దెలుపును. రూ. అయ్యరే, అయ్యారె, అయ్యారే, అయరె, అయరే, అయారె,అయారే.

అయ్యరే. ద్వ. = అయ్యరె.

అయ్యలు. వై. అవ్య. సంతాపమును దెలుపును. "అయ్యలు తాళలేనని యామున్నొన్న ప్రేమతోడ, నియ్యాన యిఁకఁ దమి నిలుపలే ననఁగాను." క్షేత్రయ. పు. ౧౦౪.

అయ్యవారు. ద్వ. వి. అయ్యగారు, ఉపాధ్యాయుఁడు. "అయ్యవారికి చాలు అయిదు వరహాలు."

అయ్యారె. ద్వ. అవ్య. (అయ్యా+రె.) = అయ్యరె.

అయ్యారే. ద్వ. = అయ్యారె. "క. అయ్యారే చెలు వెక్కుడ, నయ్యారే గెలువఁజాలు నంగజు నారిన్." విజ. ౧, ఆ. ౩౮.

అయ్యు. దే.క్రి. (అయి+యు.) అయినను, మీఁద విరుద్ధధర్మము కలుగుటను తెలుపును. "క.అనఘా యీయజ్ఞము విధి, సనాథబుత్విక్ప్రయోగ సంపూర్ణం బయ్యును గడచన నేరదు నడు, మన యుడుగును భూసురోత్తమనిమిత్తమునన్."భార. ఆది.౨,ఆ. ౨౦౦. "గీ.ఉత్తమజ్ఞానవృద్ధు నానుండు నేని, బాలుఁడయ్యును బూజ్యుండు బ్రాహ్మణుండు." భార. సభా. ౨,ఆ. ౨౫. "సీ. చక్రధరుండయ్యు జలరుహనాభుండు గాండీవధరుఁడయ్యుఁ బాండవుండు, నుండి రవ్వనమున సుభయపార్శ్వంబులఁ దొల్లింటియట్టుల పెల్లు రేఁగి." భార. ఆది. ౮, ఆ. ౨౬౧. (ఇట 'యున్' అనుదానికి అర్థవిశేషములేదు.) ఈయన్నిస్థలముల 'నయియు' అనియుఁ జదువవచ్చును. వ్రాఁత ప్రతులయందుఁ బెక్కిఁట 'అయ్యు' అనియేకలదు.

అయ్యొ. ద్వ. అవ్య. (అయ్య+ఒ.) సంతాపాదులను దెలుపును. "ఆ. కటికి, నేలఁ గండ్లులొత్త నిద్ర పోయెదునయ్యొ." భార. ఆ౯. ౬, ఆ. ౧౭౯. రూ. అయ్యో, ఓయొ, అయో.

అయ్యో. ద్వ. = అయ్యొ.

అర. వై. వి. (సం. అర్థమ్.) సగము.

అరంజోతి. వై. వి. = అరుంధతి.

అరఁగు. దే. వి. (క. అరుగు=సమీపము,ప్రాంతము.) అరుఁగు. "ఉ. నీడ సున్నపున్, రంగుటరంగు పచ్చలయరంగయిపో." ఆము. ౫, ఆ. ౪.

అరఁటి. దే. వి. అనఁటి, కదళి.

అరక. దే. వి. నాఁగలి, ఏరు.

అరకము. సం. వి. అ. న. నాఁచే.

అరకాఁడు. దే. వి. (అరక+కాఁడు = అరకకలవాఁడు.) కర్షకుఁడు, దున్నువాఁడు.

అరకూఁక. దే. వి. కూఁత పెట్టినయెడ నెంతదూరము వినిపించునో అంతలో సగము. (అరకూఁక వెట్టు పొడవు.) "తే. ఇంక మణిశైలమునకు వైకుంకమునకు, నడుమ బిల్వవనంబంత నిడుపు వెడల్పును గనుపట్టుఁ బంకజవనము దాని,చెట్టులకు నెల్ల నరకూఁక వెట్టుపొడవు." వరా.౧౦, ఆ. ౧౨౯.

అరఖు. హిం. వి. ద్రవరూపమైన సారము, ద్రావకము. అలగర్థము సుప్రసిద్ధము.

అరగడము. దే. విశే. వయసుచెల్లినది, ముదుసలి.

అరగడి. దే. వి. కుఱచగోడ. శ. ర.

అరగన్ను. ద్వ. వి. (అర+కన్ను.). సగముమూయఁబడినకన్ను.

అరగర్దము. సం. వి. అ. పుం. **1.** నీటిపాము; **2.** నల్లత్రాఁచు అలగర్దము సుప్రసిద్ధము.

అరగలి. ద్వ. వి. (అర+కలిమి.) సందేహము. "చ. నరునకుఁ బూని పల్కితి వినం జవిమాలినయట్టి పల్కులే, నరగలి లేక బెట్టడరినప్పుడు సూడుము నన్ను నాతనిన్." భార. కర్ణ. ౨, ఆ. ౨౮.

అరగలిగొను. ద్వ. అ. క్రి. (అరగలి+కొను.) సందేహించు. "ద్వి. హరుఁడు భక్తులమనం బరయంగఁ దలఁచి, యరుదైనవస్తువు లరుదెంచి వేఁడ, నరగలిగొన కిత్తు రల్లభక్తులును." బస. ౪, ఆ. పు. ౧౨౪."ద్వి.బసవయ్య యిపుడ,యీవస్త్ర మొసఁగెడు నరగలి గొనఁడు" బస. ౩, ఆ. పు. ౫౬. 'అరుగలి', పాఠాంతరము.

అరపది. వై. స. పదిటసగము, అయిదు. "సీ. అరపదిమోముల వేలుపు మినుసిగదయ్యంబు మిత్తిగొంగ." ఆం. సం. దేవ. ౬.

అరమర. ద్వ. వి. 1. సందేహము, అరమరిక; 2. భేదము. రూ. అరమరము.

అరమరము. ద్వ. వి.=అరమర. "ఉ. తా మది నమ్మకున్నది విదర్భనరేంద్రతనూజ నిన్ను సుత్రాముఁడ వంచు నీయరమరంబునఁ బో మనసీదు నీకు." నై. ౪, ఆ. ౭౫. ఇట భేదము అని అర్థము.

అరమరిక. ద్వ. వి.=అరమర. "అరమరికలేనిచుట్టలు." క్షేత్రయ. ౧౫౫. ఇట 'భేదము' అని అర్థము.

అరమీటుమొన. ద్వ. వి. మల్లబంధవిశేషము.

అరము. సం. వి. అ. న. 1. బండికంటియాకు; 2. కోణము, అంచు. (సహస్రారము.)—క్రి. విణ. త్వరితము.

అరముడి. దే. క్రి. విణ. మాటిమాటికి, సారెసారెకు.

అరమోడుచు. దే. స. క్రి. (కన్ను మొదలగునది.) సగము ముడుచు.

అరమోడుపు. దే. వి. అరమోడుచుట.

అరయిక. దే. వి. (అరయుట.) 1. విచారణ; 2. ప్రమాణములచేత విషయమును పరిశీలించుట; 3. వెదకుట.

అరయు. దే. స. క్రి. 1. విచారించు; 2. వెదకు; 3. తెలిసికొను. "సీ. పికభాషలకు విపంచికల మ్రోఁతలభావ మరయఁగాఁ దోడ్పడ మెఱసెనేని" హరి. ఉ. ౭, ఆ. ౧౮౩; 4. రక్షించు. "చ. అనఘవిచార నీ వరయుమన్నఁ దగం గడు నిష్ఠ లోకపాలన మొనరింతుఁ గాన." భార. ద్రో. ౨, ఆ. ౧౬౪.

అరరము. సం. వి. అ. న. 1. తలుపు, కవాటము; 2. అపిధానము, కప్పుట; 3. వంశకోశము, వెదురుగొట్టము.

అరరవిష్కంభి. సం. వి. ఇ. పుం. (కవాటనిరోధము.) తలుపుగడియ.

అరరి. సం. వి. ఇ. పుం. స్త్రీ. కవాటము, తలుపు.

అరరుఁడు. సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. శివుఁడు; 3. చంద్రుఁడు.

అరరె. దే. (అరె+అరె.) ప్రశంసాద్యర్థమును తెలుపును. "చ. వెం,బడి బళిరే పురే యరెరె బాపురె యంచు వచింపవేఁటపల్." చంద్రా. ౨, ఆ. ౧౦౨. రూ. అరరే.

అరరే = అరరె. "ఆ. అరరే దాంతి." చంద్రా. 3, ఆ. ౧౨౫.

అరవరలు. దే. విణ. బ. 1. తునుకలు, చిన్నచిన్నముక్కలు; 2. శుష్కము. "క. ఒక హోగ్నివలన దేహము, లరవరలై హస్తభూషణావళులెల్లన్, హరిఁ గొరె జాతిపడఁగా, నసమగనొకచోటఁ గూడి యందఱుఁ దమలోన్." ఉ. పు. ౭, ఆ. ౩౫౨.

అరవాయి. వై. వి. 1. సగముసగముమాట, అస్పష్టవచనము; 2. సంకోచము, జంకు. "క. ఇట్టఁ దగ్గమైనఁ జిచ్చుఅపిడుగై, పోయి పయిఁ బడుడు నీవర,వాయించుక లేక పఱపవలయు రక్షంబుల్." భార. విరా. ౫, ఆ. ౧౮. "క. కురుసైన్యము నిస్సారం, బరయఁగ మనబలములెల్ల సబివృద్ధములు నీ,వరవాయి గొనక నడపుము." భార. ఉద్యో. ౮, ఆ. ౧౧౧. చూ. అరవాయిగొను.

అరవాయిగొను. ద్వ. అ. క్రి. (అరవాయి+కొను.) సంకోచించు. "సీ. వృష్ణికుమారవరు లనేకు, లట్టి యోధులు పోర నరవాయిఁగొందురే." భార. ఉద్యో. ౧, ఆ. ౨౬౮. "వ. చుట్టంబని యరవాయి గొనుట కర్జంబుగాదు." భార. కర్ణ. 3, ఆ. ౧౨౨.

అరవిందనాభుఁడు. సం. వి. అ. పుం. (పద్మనాభుఁడు.) విష్ణువు.

అరవిందము. సం. వి. అ. న. 1. పద్మము, తామర; 2. నల్లకలువ; 3. రక్తకమలము; 4. ఎఱ్ఱకలువ; 5. తామ్రము; 6. సారసపక్షి.

అరవిందాక్షుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు.—విణ. (అ. ఈ. త్రీ. అ.) అరవిందమువంటి నేత్రములు గలవాఁడు.

అరవిందాలయ. సం. వి. ఆ. స్త్రీ. (పద్మము నివాసముగాఁ గలది.) లక్ష్మీదేవి.

అరవిందిని. సం. వి. ఈ. స్త్రీ. 1. పద్మముల సముదాయము; 2. పద్మలత; 3. పద్మసరస్సు.

అరవిరి. ద్వ. వి. సగమువిరిసినమొగ్గ.

అరసావు. ద్వ. వి. (అర+చావు.) 1, సగముచచ్చు టు; 2. మూర్ఛ. "చ. అతండు సీమఱం, దికి నరసా వొనర్చె." వ. ఇట్లు గాంధారపతి పడు టయుఁ దత్సారథి తేరు దొలంగఁ దోలుకొని పోయె." భార. ద్రో. ౫, ఆ. ౧౭౩, ౧౭౪.

అరసికుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. రసికుఁడు కానివాఁడు; 2. రసము గ్రహింపలేనివాఁడు.

అరసు. దే. వి. రాజు. (సం. రాజన్. త. అరశన్. క.అరసు.) "ద్వి.హరునకుఁ దొల్లియాసురియచొ దరసు, కరమర్థి నంపెచ్చుకరణియుఁ బోలె." బస. ౨, ఆ. ౩౭. పు.

అరళము. సం. వి. అ. న. తలుపు. "వ. కీలాండి పీడిపడ సరళంబులు విరళంబులైన సరళంబులైన మొగ సాలలం గడచి."భాగ. ౧౦, స్కం. పూ. ౧౪౭. (రలలకు అభేద మనుటచే అరరము అరలము అను రూపములు నుండును. లళలకు అభేదమనుటచే అర ళము అని సిద్ధించును. ఇది సంస్కృతగ్రంథముల యందుఁ గనఁబడలేదు.)

అరళువు. సం. వి. ఉ. పుం. దుండిగము♆.

అరాజకము. సం. విశే. (అ.ఆ.అ.) 1. రాజు లేనిది. "చ. అవని యరాజకం బయినయప్పుడ భూప్ర జయందు సర్వధర్మవులుఁ దొలంగు." భార.ఆది. ౪, ఆ. ౨౫౦; 2. కట్టుపాటు లేనిది.

అరాతి. సం. వి. ఇ. పుం. 1. శత్రువు, పగతుఁడు; 2. (అరిషడ్వర్గము ప్రసిద్ధము గావున) ఆఱుసం ఖ్యకు సంకేతము; 3. (జ్యోతి.) శత్రుస్థానము, ఆఱవరాశి.

అరాబు. దే. వి. ఫిరంగి మొదలగునవి యుంచుటకు కోటముందు కట్టిన యెత్తయినగోడ. "సీ. పరఁగఁ బిరంగీలబలుగుండ్లకై డాఁగఁ బలుక లమర్చిన పాఁతరలును, వెలుపటి మందులిత్తులు గూలిన యరాబుకొఱ కమర్చిన పచ్చిగోడగుంపు, లెనసి మార్తురు లగ్గ లెక్క కుండఁగఁ దార్చిన కాంచనంపుదంచనపుఁజేతు,లెదుటి సురంగంబు లెదేఁగి." కువల. ౩, ఆ. ౧౮.

అరాలము. సం. = అరాళము.

అరాళ. సం. వి. ఆ. స్త్రీ. (కుటిలురాలు.) వేశ్య.

అరాళము. సం.వి.అ. పుం. 1. మదపుటేనుఁగు; "ఇది నింద్యము." అని శ. ర; 2. సజ్జరసము; 3. అభి నయహస్తవిశేషము. "బొటనవ్రేలిని వంచి చూ పుడువ్రేలి మొదటఁగూర్చి చూపుడువ్రేలిని వంచి తక్కిన వ్రేళ్లను జక్కఁగాఁ జాఁచిపట్టినది" అని శ. ర.—విశే. (అ.ఆ.అ.) వంకరైనది. "ఉ. వచ, శ్శ్రీలలితుండు వచ్చి నిలిచెన్ హరినీలవినీలవిగ్ర హా,రాళరుచుల్ వెలుంగఁగఁ బరాశరసూనుఁడు తల్లిముందటన్. భార. ఆది. ౪, ఆ. ౨౪౦.

అరి. ఉభ. దే. వి. 1. కప్పము. "క. అరియని విప్రులచేతను, ధరణీశులు రూకయును మొద లుగాఁ గొన రెవ్వరు నిప్పాపుఁడు మానిసి, నరి గొనియెడు భక్షణార్థియై విప్రులచేన్." భార. ఆది. ౩, ఆ. ౨౭౧. "తే. సఖ్యసంబంధములఁ జేసి చక్రధరుఁడు, ద్రుపదుఁడును దక్కఁ దక్కి నన్నృపతులెల్ల, నరియుఁ బెట్టనివారు లే రఖిల జలధి,వలయితక్షోణిలోఁ బాండవులకుఁ బ్రీతి." భార. సభా. ౨, ఆ. ౧౦౬; 2. శరసంధానస్థాన మైన యల్లెత్రాటి నడిమిభాగము. "సీ. దర్పంబున శిరము ద్రుంచు, టకు శర మరిఁ బోయుటయుఁ గృతవర్మ రెం, డమ్ములవిల్లు నయ్యమ్ముదునిమెఁ." భార. ద్రోణ. ౧, ఆ. ౧౬౯. "సీ. బలితంపుఁ గ్రొవ్వాఁడిములుకుల సింగాణిఁ గూరిచి యరి సెవికొనకులాగి." అచ్చ. యు. కాం. ౨౨౨; 3. నిర్బంధము, నిరోధము. చూ. అరికట్టు.— సం. వి. ఇ. పుం. 1. అరములుగలది, చక్రము; 2. శత్రువు; 3. కామాద్యంతశ్శత్రువు. (అరిష డ్వర్గము: కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము;) 4. ఆఱు సంఖ్యకుసంకేతము; 5. (జ్యోతి.) శత్రుస్థానము, లగ్నమునుండి యాఱవరాశి; 6. అరిమేదము, తుమ్మ♆.

అరిందముఁడు. సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. గరుత్మంతుఁడు; 3. వీరుఁడు, బంటు—విశే. (అ. ఆ. అ.) శత్రువులను నడఁచువాఁడు, శత్రువు లను శిక్షించువాఁడు.

అరికట్టు. దే. స. క్రి. 1. చుట్టుముట్టుకొను, నిరో ధించు. "సీ. తెరువుల నరుగంగ నరికట్టి చంపె నాబాలవృద్ధంబుగా బహుజనముల." నిర్వ. ౩, ఆ. ౭౮; 2. పరివేష్టించు, చుట్టువాఱుకొను. "తే. అతనిముఖగహ్వరంబులనద్భుతముగ, నుగ్ర

దహనశిఖావళు లుద్భవించి, వేల్పుమూఁకల నరి కట్టి వేల్వఁదొడఁగె, నంత నెంతయు సంభ్రాంతులగుచు సురలు." భార. అర. ౫, ఆ. ౨౦౮. "సీ. ఆకుశద్వీపంబు నరికట్టుకొని యుండు నెని మిదిలక్షల ఘనఘృతాబ్ధి." భాగ. ౫, స్కం. ౨, ఆ. ౬౫.

అరికట్టుకొను. దే. స. క్రి. అరికట్టు. "చ. వడి నరికట్టుకొన్న జనవల్లభుఁ డంబుదపంక్తి చేతిలోఁ, బడిన హిమాంశుమండలముభంగిఁ దిరోహితుఁ డయ్యె." వరా. ౯, ఆ. ౧౩.

అరిగ. దే. వి. 1. కేడెము, డాలు. "సీ. జెడి దంపుటరిగలు బిఱబిఱఁ ద్రిప్పుచు వడిఁ బిల్ల మెఱములు వైచువారు." కళా. ౮, ఆ. ౪౧; 2. ఛత్రమువంటి యొకానొక రాజచిహ్నము. "సీ. కడువేగమునఁ బెండ్లికొడుకు నెమ్మొగమున కరిగ యడ్డమువట్టెఁ గురువిభుండు." కళా. ౭, ఆ. ౭౨.

అరిగాపు. దే. వి. (అరి+కాపు.) 1. పన్ను చెల్లించు సామంతరాజు. "సీ. పరధరిత్రీనాథు లరిగాపులై భజింపఁగ నేలి." వరా. ౨, ఆ. ౪౮; 2. కట్టుకావలి, గోడ వెలుగు మొదలగు చుట్టుకావలి. "అరిగాపుఁదోఁట."

అరిగాళ్లు. దే. వి. బ. (అరి+కాళ్లు.) ద్వారముప్రక్కలను గుజ్జముల యాకారముతో నుంచు కట్టబల్లలకు బలముగా వెనుక నుంచుకమ్ములు.

అరిగొను. దే. అ. క్రి. (అరి + కొను.) అడ్డపడు. "ద్వి. అలకు బెబ్బులి యరిగొన్నయట్లు." వీరచరిత్రము. శ. ర.

అరిగోలు. దే. వి. (అరి+కోలు.) ఏఱు దాఁటఁదగిన సాధనవిశేషము. "తే. అరడ లరిగోల్లు పడవలు దరులు పుట్టు." హంస. ౪, ఆ. ౧౮౨. 'అరిగలు' అని తుంగభద్రాతీరమున వాడుక.

అరిజే. దే. వి. పొట్టిచేప.

అరిణ. దే. వి. దోనె, కాలెము. (కాలువలోని నీరు మెరక పొలములోనికి పోయుటకై అమర్చిన చోటఁగల తాటిగుల్ల మొదలగునది.)

అరితి. దే. వి. (క.అఱ్త్తి, అర్తి.) చూ. అర్థి. 1. కూరిమి, ప్రేమము. "తే. అరితి, బాళి ప్రేముడి మచ్చిక మక్కువ యనఁ, బ్రేమ పోఁచుచు." ఆం. భా. ప్ర. నా. ౧౩౬; 2. సంతోషము; 3. భక్తి; 4. ఆసక్తి.

అరిత్రము. సం. వి. అ. న. 1. ఓడనడపెడుత్రెడ్డు; 2. చుక్కాని.

అరిదళము. వై. వి. (సం. హరితాళః.) హరిదళము.

అరిది. దే. విశే. 1. అసాధారణము, సామాన్యులకు దుర్లభమయినది, విరళము. "చ. పరమ గురూపదేశమునఁ బార్థుఁడు పార్థివవంశశేఖరుం, డరిది తపంబునన్ భుజబలాతిశయంబున నీశుఁ బన్నగా, భరణుఁ బ్రసన్నుఁ జేసి." భార. అర. 3, ఆ. ౧౮; 2. అపూర్వము, అపురూపము. "సీ. హిమాద్రికన్యపరమునఁ బుట్టిన యరిది కూఁతురు." హరి. ఉ. ౭, ఆ. ౧౦౧; 3. ఆశ్చర్యకరము.

అరిపడు. ద్వి. అ. క్రి. అడ్డపడు. "చ. తద్భుజనాంతరాయత,త్వరమతి మాకు నిప్పు డరిపడ్డదురాత్ముల నేఁడు గంటిరే." భాగ. 3, స్కం. ౫౨3.

అరిపెట్టు. దే. అ. క్రి. కప్పము చెల్లించు.

అరిమి. దే. వి. బిడ్డలకు గొంతునందుఁగలిగెడు వ్యాధివిశేషము. "ద్వి. విలపల్కువు చెప్పవే యన్న నీకు, నరిమియో కోపమో యంగిటిముల్లో." బస. 3, ఆ. పు. ౬౮. 'భల్లా. 3, భా.' అని. శ. ర.

అరిమిలి. దే. వి. = అర్మిలి. "తే. అమరధేనువుల్ సురపురి కరిగి తమకుఁ, దార యరిమిలితోఁ జేఁపి తనుపు మిగుల, నభిమతార్థముల్ గురిసె దేవాలి మీఁద,నెలమి నొదకలి యాఁడెడుచెలువు వోలె." కు.సం. ౧౨, ఆ. ౧౯౨. ఇట 'అర్మిలి' అనియు ననవచ్చును.

అరిమేదము. సం. వి. అ. పుం. దుర్గంధముగల చండ్ర.

అరివాణము. దే. వి. (క. అరివాణ, హరివాణ.) పళ్లెము. (వై. గిన్నె అని. శ. ర.) "క. సతనాల్కలజేజే యపు, డతనికిఁ బొడకట్టి పసిఁడి యరివాణముతో, దుతఁ దెచ్చి పాలయోరెం, బతివలు మువ్వురకుఁబెట్టుమని యిడి చనుదుర్." అచ్చ. బాల. ౪౮. 'హరివాణశబ్దము సంస్కృతమనియు దానికర్థము గుండిగ యని యుఁ దెలియుచున్నది.' అని శ. ర.

అరివి. దే. వి. భగ్నము, కూలినది. "ద్వి. గుడియు ను ప్రస్సిరయుఁ గూలిపోయినది, యదరు మంట పమును నరివియయినది." బస. 3, అ. పు. ౭3.

అరిషడ్వర్గము. సం. వి. అ. పుం. కామక్రోధలోభ మోహమదమాత్సర్యము లనెడు నారు అంత శ్శత్రువుల సముదాయము.

అరిష్టతాతి. సం. విణ. ఇ. క్షేమంకరుఁడు, మేలు చేయువాఁడు.

అరిష్టము. సం. వి. అ. న. **1.** కీడు; **2.** పురిటిల్లు; **3.** మజ్జిగ; **4.** చావుగుఱుతు; **5.** కల్లు; **6.** మేలు.—పుం. **1.** కాకి; **2.** రాపులుఁగు; **3.** వెల్లుల్లి; **4.** కుంకుడు✽; **5.** వేము✽; **6.** మల్లె.

అరిష్టసూదనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) **1.** అశు భమును నశింపఁజేయువాఁడు; **2.** అరిష్టుఁడను రాక్షసునిఁ జంపువాఁడు.—వి. అ. పుం. విష్ణువు.

అరిసియ. దే. వి. = అటిసియ.

అరిసె. దే. వి. = అటిసె.

అరుంతుదము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** మర్మ మును దాఁకునది; **2.** పీడించునది.

అరుంధతి. సం. వి. ఈ. స్త్రీ. వసిష్ఠునిభార్య, అరం జోతి.

అరుంధతీజాని. సం. వి. ఇ. పుం. (అరుంధతి జాయ గాఁగలవాఁడు.) వసిష్ఠుఁడు.

అరుంధతీదర్శనన్యాయము. సం. వి. అ. పుం. అరుం ధతియొక్క దర్శనమువంటి దర్శనముగల దానిని సూచించున్యాయము. ముందు స్థూలమగు పదా ర్థమును చూపించి దాని మూలమున సూక్ష్మవస్తు వును చూపుట. (అరుంధతీనక్షత్రము చిన్నదగు టచే దానిని చూపుటకు దాని ప్రక్కనున్న పెద్దనక్షత్రమును జూపి మొదట నదియె అరుం ధతియని గ్రహింపఁజేసి తరువాతను అది కాదని ఆపెద్దనక్షత్రమునకు ప్రక్కనున్న చిన్నది యగు అరుంధతిని గ్రహింపఁజేయుదురు.)

అరుఁగు. దే. వి. తిన్నె. "అరుంగుమెఱుంగుమెట్టి కల్ మసలిక నెక్కెఁడు." పాంచా. ౪, ఆ. ౨౧ (చూ. అరఁగు)

అరుగు. దే. అ. క్రి. పోవు, గమించు.

అరుగుదెంచు. దే. అ. క్రి. (అరుగు+తెంచు.) **1.** వచ్చు. "క. కాంచి రరుగుదెంచు మహాత్ముల్." భార. ఆది. ౭, ఆ. ౧౬౪. "సీ. ఏనును నకులుండు నేఁగి రోమ,శాదేశమునఁ జేసి యఖిలతీర్థంబులు నాడివచ్చెదము మాయరుగుదెంచు, నంత కెంత యును బ్రయత్నంబుతోఁ గృష్ణఁ,గాచియుండుఁ డనిన ఘనుఁడు భీముఁ, డనియె." భార. అర. 3, ఆ.౨౦౫; **2.** పోవు. "సీ. తైలకటాహ మవగా హనము చేసివెడలు చందమున వెల్వడిన ముగురు, సముచితస్నానకృతపరిష్కారు లగుచు, హంస కేతనుపాలికి నరుగుదేర, శంఖలిఖితద్విజులు సత్య సంధుఁడైన తనయుకథఁ జెప్ప." జై. ౪, ఆ. ౧౩౯. ఈయర్థము ప్రాయికము కాదు.

అరుచము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** రుచితెలియ నిది. "క. పెరుఁగుట ప్రగ్గఁగ రుచులం, బొర యుట యరుచంబు గాఁగఁ బుట్టుట." భార. స్త్రీ. ౧, ఆ. ౨౪; **2.** కాంతిహీనము.

అరుచి. సం. వి. ఇ. స్త్రీ. రుచిలేమి.—విణ. ఇ. రుచిలేనిది.

అరుజు. దే. వి. మత్స్యవిశేషము, శాలము. "సీ. అరుజునిల్లెపుఁజేప యూకుజెల్ల." హంస. ౪, ఆ. ౧౮౭. (కల్లరుజు, పుల్లరుజు.)

అరుణ. సం. వి. ఆ. స్త్రీ. **1.** అతివస✽; **2.** తెల్ల తెగడ✽; **3.** మంజిడి✽; **4.** మామెన✽.

అరుణము. సం. వి. అ. పుం. **1.** ఇంచుకయెఱుపు; **2.** కపిలవర్ణము; **3.** ఎఱ్ఱకుష్ఠము; **4.** సంధ్యా రాగము; **5.** రక్తము. "మ. మహాదేహుని,ర్గత సాంద్రారుణపూర మొక్క మొగి నొల్కం బ్రెప్పి నారాయణో,న్నతదోర్దండవిముక్తచక్రనిహతిన్ నాకద్విషన్మస్తక,ప్రతతుల్ ఘోరరణంబునం బడియె భూభాగంబు గంపింపఁగన్." భార. ఆది. ౨, ఆ. ౨౪. "క. వీరుండు క్షత్త్రియులఁ దన, దారుణ పరశువున జామదగ్న్యుఁడు రౌద్రా, కారుఁడు వధియించి తదీ,యారుణమున నేను మడువు లాపాదించెన్." భార. అర. ౨, ఆ. ౨౬౧.—విణ. (అ.ఆ.అ.) **1.** ఇంచుకయెఱుపు గలది; **2.** కపిలవర్ణము కలది.

అరుణపలాండువు. సం. వి. ఉ. పుం. నీరుల్లి, ఎఱ్ఱ గడ్డ✽.

అరుణావరజుఁడు. సం. వి. అ. పుం. అనూరుని తమ్ముఁడు, గరుత్మంతుఁడు.

అరుణితము. సం. విణ. (అ. ఆ. అ.) ఎఱుపురంగు గలదిగాఁ జేయఁబడినది.

అరుణిమ. సం. వి. న్. పుం. శోణిమము, ఎఱుపు.

అరుణుఁడు. సం. వి. అ. పుం. 1. అనూరుఁడు; 2. సూర్యుఁడు.

అరుణోదయము. సం. వి. అ. పుం. సూర్యోదయము కంటెఁ బూర్వము నాలుగుగడియలకాలము.

అరుణోపలము. సం. వి. అ. పుం. 1. పద్మరాగము, కెంపు; 2. సూర్యకాంతమణి.

అరుదు. దే. వి. ఆశ్చర్యము, వింత. "చ. అరుదుగ సర్వశైలములయంతతనర్పను నార్జవంబు సుస్థిరతయు నోషధీరసవిశేషతయుం గలదుత్తమంబు మందరకుధరంబు గవ్వమగు దానికి నంచును నిశ్చయించి యయ్యిరువురుఁ బంపఁగాఁ బెఱికి యెత్తె ననంతుఁడు తద్గిరీంద్రమున్." భార. ఆది. ౨, ఆ. ౧౦; "క. నిరుపద్రవసుఖనిద్రా, నిరతాత్మకులైనవారినిద్రకు నస్మ,చ్చరణ భుజఘాతశబ్దం, బరుదుగ విఘ్నంబు సేయునని వగచి మదిన్." భార. ఆది. ౬, ఆ. ౨౦౨.—విణ. = అరిది. ఇది విధేయవిశేషణముగనే ఉపయుక్తము. "చ. అరుదిది నీవు నొవ్వక మహాబలుఁ గర్ణు వధించితి." భార. కర్ణ. ౩, ఆ. ౩౫.

అరుదుపడు. ద్వ. అ. క్రి. ఆశ్చర్యపడు.

అరుదెంచు. దే. అ. క్రి. (అరుగు+తెంచు.) 1. వచ్చు; 2. పోవు. "వ. చంపకాపురంబునకరుదెంచువారు ముందట...అధిజ్యధన్వుండు నై వచ్చు సుధన్వుంగాంచి." జై. ౪, ఆ. ౧౨౨.

అరులు. దే. వి. వాత్సల్యము. "సీ. అర్మిలి యంచన నరులునా నర్లన వాత్సల్యసంజ్ఞయై పరఁగుచుండు." ఆం. భా. ప్ర. నా. ౧౩౭. "ఉత్సాహ. ఇక్కుమారుమీఁద నా, యుల్లమునకు నరులు మిగిలియున్నయది నిరూపణం, దెల్లమైన బాంధవంబు తీపు గలుగనోపునే." దశ. ౧౨, ఆ. ౬.

అరులుమరులు. దే. వి. ముదిమియందుఁ గలిగెడు మదితబ్బిబ్బు. రూ. అర్లుమర్లు. శ. ర.

అరుళువు. సం. వి. ఉ. పుం. దుండిగము♥.

అరువరి. దే. వి. అప్పు పుచ్చుకొనువాఁడు.

అరువు. దే. వి. 1. బియ్యము మొదలగునవి సొమ్ము తర్వాత నిచ్చుపద్ధతిని కొనుట; 2. (త. అఱివు.) జ్ఞానము.

అరువుఁద్రిక్క. దే. వి. (అరువు+త్రిక్క.) పశురోగవిశేషము.

అరువుఁబూఁట. దే. వి. (అరువు+పూఁట.) రొక్కపుఁబూఁట. 'అచ్చునకు అరువాదేశము.' ఆ. శ.ర.

అరుష్కరము. సం. విణ. (అ. ఈ-రీ. ఆ.) వ్రణమును కలుగఁజేయునది.—వి. అ. పుం. జీడి♥.

అరుసము. వై. వి. (సం. హర్షః.) సంతోషము. "చ. అరుసముఁ జెంది వచ్చిరఁటయంపఱు ముందటిలీలగుంపులై." ఉ.రా. ౨, ఆ. ౬.

అరుసు. వై. = అరసు. "క. చేపట్టిన ధ్రువులగుదురు, కోపించిన రంభఁ గూడుకొందురు జగతిన్, స్థాపింపఁ బోడువఁజాలని, యూపందలు సాల్వకోనమరుసున కెనయే." అప్ప. ౩, ఆ. ౨౩౦. 'కోన మరసు' అనవచ్చును.

అరుస్సు. సం. వి. స్. న. వ్రణము, పుండు.

అరుహుఁడు. వై. విణ. అర్హుఁడు. "స్ర. దక్షుం, బాపాచారున్ వధాద్యాపదల కరుహుఁ దద్బ్రహ్మబంధున్ దురాత్మున్, జూపుం డెచ్చోటనంచున్ సురలను బ్రమథుల్ చుట్టి దండించిరల్కన్." కు.సం. ౨, ఆ. ౨౧౩.

అరూపము. విణ. (అ. ఆ. అ.) రూపములేనిది.—సం. వి. అ. న. 1. రూపములేమి; 2. కురూపము; 3. బ్రహ్మము.

అరె. దే. (సం. అరే.)=అరరె.

అరే. దే. = అరె.

అరోచకము. విణ. (అ. ఆ. అ.) 1. రోఁతపుట్టించునది; 2. కాంతిలేనిది.—సం. వి. అ. పుం. అన్నాదులమీఁద రోఁత పుట్టించురోగము. "తే. నలునిఁ జూచినపిదప మన్మథునిఁ జూడ, నాకనిలయులనయనంబు లోకిలించు, నయ్యరోచక మమరవైద్యద్వయంబు, దీర్పఁ జాలునో చాలదో తెలియరాదు." నై. ౭, ఆ. ౪౫.

అర్క. సం. వి. ఆ. స్త్రీ. (అర్చింపఁదగినది.) అక్క, పెద్ద తోఁబుట్టువు.

అర్కక్షేత్రము. సం. వి. అ. న. 1. సూర్యునియొక్కస్థానము; 2. (జ్యోతి.) సింహరాశి; 3. జిల్లేళ్లు మొలచెడు పొలము.

అర్కచందనము. సం. వి. అ. పుం. న. (సూర్యునకు ప్రియమగుచందనము.) రక్తచందనము,ఎఱ్ఱచందనము.

అర్కపత్రము. సం. వి. అ. పుం. జిల్లేడు.—న. జిల్లేడు ఆకు.

అర్కపర్ణము. సం. వి. అ. పుం. = అర్కపత్రము.

అర్కపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. కోలపాల, అర్కపుష్పిక.

అర్కపుష్పిక. సం. వి. ఆ. స్త్రీ. = అర్కపుష్పి.

అర్కబంధువు. సం. వి. ఉ. పుం. 1. శాక్యసింహుఁడు (బుద్ధుఁడు); 2. పద్మము.

అర్కబాంధవము. సం. వి. అ. న. (సూర్యునకు బంధువైనది.) పద్మము.

అర్కమందారము. సం. వి. అ. పుం. ఉచ్చింత.

అర్కము. సం. వి. అ. పుం. 1. జిల్లేడు; 2. స్ఫటికము; 3. రాగి.

అర్కరాజము. సం. వి. అ. పుం. తెల్లజిల్లేడు.

అర్కలత. సం. వి. ఆ. స్త్రీ. సురుగుడు.

అర్కవల్లభము. సం. వి. అ. పుం. 1. పద్మము; 2. బంధూకము, మంకెన.

అర్కవివాహము. సం. వి. అ. పుం, అర్కవృక్షమును కన్యకగా నేర్పఱచి చేసికొనెడు వివాహము. (పురుషుఁడు తృతీయవివాహముచేసికొనునపుడు ముందుగా అర్కవృక్షమును కన్యకగా నేర్పఱచి వివాహసంస్కారము చేసికొనుట స్మృతివిహితము.)

అర్కవ్రతము. సం. వి. అ. న. 1. సూర్యునియొక్క నియమమువంటి నియమము, సూర్యుఁడు వర్షోదకరూపముగా మరల నిచ్చుటకే గ్రీష్మకాలమున భూమియందున్న యుదకమును గ్రహించినట్లు ప్రజల యుపయోగమునకయి వెచ్చించుటకే రాజు పన్నుపుచ్చుకొనుట; 2. మాఘశుద్ధ సప్తమ్యాదులయందుఁ జేయఁదగిన సూర్యుని గుఱించిన వ్రతము.

అర్కారా. హిం. వి. హర్కారా, దూత, వార్తాహరుఁడు.

అర్కాశ్మము. సం. వి. న్. పుం. సూర్యకాంతమణి.

అర్కుఁడు. సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. అగ్ని; 3. ఇంద్రుఁడు; 4. పండితుఁడు.

అర్కురము. సం. వి. అ. పుం. జీడి.

అర్కేందుసంగమము. సం. వి. అ. పుం. సూర్యచంద్రులుకలసిన తిథి, అమావాస్య.

అర్కోపలము. సం. వి. అ. పుం. 1. సూర్యకాంతమణి; 2. పద్మరాగము.

అర్గళము. సం.వి. అ. న.; ఆ. స్త్రీ. 1. గడియమ్రాను, తలుపుగడియ, అడ్డుగెడ; 2. నిరోధము; 3. పెద్దయల, కల్లోలము.

అర్గు. దే. అ. క్రి. 1. =అఱుగు."ద్వి. నఱకుచోండొంటితో నఱుగర్గ రాచి, కఱకు దేహము బయల్గాఁ జేయఁ జూచు." పండి. ౨, ఆ. ౧౭౮. పు. 2. = అరుగు."మత్త. ఎన్నఁడుర్గ్మఱి యిట్టటర్గియెఱుంగవు." కళా. 3, ఆ. ౧౭౫. అని శ. ర.

అర్ఘము. సం. వి. అ. పుం. 1. వెల, మూల్యము; 2. చౌక, వెల తక్కువ; 3. పూజించుట. రూ. అర్ఘవు.

అర్ఘవు. సం. వి. అ. పుం. = అర్ఘము. "ఆ. అర్ఘులోలిఁ బెరెఁగె నవనీశులెల్ల నీ,యనుజ వీర్యవిజితులయి త్వదీయ, శాసనస్థు లయిరి." భార. సభా. ౧, ఆ. ౨౬౨.

అర్ఘ్యము. సం. విశే. (అ.ఆ.అ.) 1. పూజకుఁదగినది; 2. పూజకొఱకైనది.—వి. అ. న. పూజాద్రవ్యము. (అష్టార్ఘ్యములు—పెరుగు, తేనె, నెయ్యి, అక్షతలు, గఱిక, నువ్వులు, దర్భ, పుష్పము.)

అర్చ. సం. వి. ఆ. స్త్రీ. 1. పూజ; 2. ప్రతిమ, దేవతావిగ్రహము.

అర్చకత్వము. సం. వి. అ. న. అర్చకధర్మము, దేవాలయాదులయందు పూజచేయువృత్తి.

అర్చకుఁడు. సం. విశే. (అ.ఆ.-ఇకా.అ.) పూజించువాఁడు.—వి. అ. పుం. 1. శివార్చకుఁడు; 2. విష్ణుపూజకుఁడు, నంబి.

అర్చన. సం. వి. ఆ. స్త్రీ. పూజ. (మృగ్గు, సుగంధము, అక్షతలు, పుష్పము, ధూపము, దీపము, ఉపహారము, తాంబూలము అని యెనిమిదివిధములు గలది.)

అర్చనము. సం. వి. అ. న. = అర్చన.
అర్చనీయుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) పూజింపఁదగినవాఁడు.
అర్చి. సం. వి. ఇ. స్త్రీ., స్. స్త్రీ. న. 1. మంట, అగ్నిశిఖ; 2. వెలుఁగు, కాంతి; 3. కిరణము.
అర్చించు. సం. స. క్రి. పూజించు. 'సమర్పించు అనియు.' అని శ. ర.
అర్చితము. సం. విశే. (అ.ఆ.అ.) పూజింపఁబడినది.
అర్చితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) అపచితుఁడు, పూజింపఁబడినవాఁడు.
అర్చిష్మంతుఁడు. సం. వి. త్. పుం. 1. సూర్యుఁడు; 2. అగ్ని; 3. విష్ణువు.—విశే. (త్. ఈ.-ష్మతీ. త్.) కాంతిగలవాఁడు.
అర్చిస్సు. సం. = అర్చి.
అర్చ్యుఁడు. సం. = అర్చనీయుఁడు.
అర్జకము. సం. వి. అ. పుం. తెల్లగగ్గెర ❦.
అర్జకుఁడు. సం. విశే. (అ. ఆ.-ర్జికా. అ.) సంపాదకుఁడు, సంపాదించువాఁడు. (ఆర్జకుఁడు అని వాడుక.)
అర్జనము. సం. వి. అ. న. సంపాదనము, సంపాదించుట. (ఆర్జనము అనియే వాడుక.)
అర్జీ. హిం. వి. లిఖితరూపమైన మనవి, పిటీషను.
అర్జుక. సం. వి. ఆ. స్త్రీ. నాట్యపరిభాషయందు వేశ్య.
అర్జునము. సం. వి. అ. న. 1. కసవు, తృణము; 2. బంగారు; 3. కంటితెవులు.—పుం. 1. ఏఱుమద్ది❦; 2. కరవీరము, తెల్లగన్నేరు❦; 3. తెలుపు; 4. నెమలి.—విశే. (అ. ఆ. అ.) తెల్లనిది.
అర్జుని. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆవు; 2. బాణాసురునికూఁతురు; 3. బాహుద యనునది; 4. కుంటెనకత్తె.
అర్జునుఁడు. సం. వి. అ. పుం. 1. కృతవీర్యుని కొడుకు; 2. పాండురాజుకొడుకు; 3. ఒకతల్లికొక్కకొడుకు, సోదరులు లేనివాఁడు.
అర్ణము. సం. వి. స్. న. 1. ఉదకము, నీరు; 2. వర్ణము, అక్షరము.
అర్ణవము. సం. వి. అ. పుం. సముద్రము, కడలి.
అర్ణోదము. సం. వి. అ. పుం. 1. మేఘము; 2. ముస్త❦.—విశే. (అ. ఆ. అ.) నీటినిచ్చునది.
అర్ణోరాశి. సం. వి. ఇ. పుం. నీరుకుప్ప, సముద్రము.
అర్తనము. సం. వి. అ. న. 1. రోయుట, రోఁత; 2. నింద.
అర్తి. ఉభ. దే. వి. (క. అర్తి, అట్టి.) = ఆసక్తి. చూ. అర్థి.—సం. వి. ఇ. స్త్రీ. 1. దుఃఖము; 2. వింటికొప్పు, ధనుష్కోటి.
అర్థకృచ్ఛ్రము. సం. వి. అ. న. ప్రయోజనము కష్టసాధ్యమగుట.
అర్థగౌరవము. సం. వి. అ. న. చిన్నమాటకు అధికమైన యర్థము గలిగియుండుట. "భారవే రర్థగౌరవమ్."
అర్థజ్ఞుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. అర్థము తెలిసినవాఁడు; 2. ప్రయోజనము నెఱిఁగినవాఁడు.
అర్థన. సం. వి. ఆ. స్త్రీ. యాచన, వేఁడికోలు.
అర్థనము. సం. వి. అ. న. 1. యాచన, వేఁడికోలు; 2. ఇచ్ఛ, కోరిక. "క. నను మోక్షమాది చెఱచెద, నని యెవ్వఁడు దలఁచు వానియందే మోక్షార్థనమై యునికి నవధ్యుఁడ, సనాతనుఁడఁ ద్రోవ నొకఁడుఁ జాలఁడు నన్నున్." భార. అశ్వ. ౧, ఆ. ౧౩౦.
అర్థనీయము. సం. విశే. (అ. ఆ. అ.) వేఁడఁదగినది, కోరఁదగినది, అర్థింపఁదగినది.
అర్థపతి. సం. వి. ఇ. పుం. (ధనమున కధిపతి.) 1. రాజు; 2. కుబేరుఁడు.
అర్థపుఁడు. సం. వి. అ. పుం. = అర్థపతి.
అర్థప్రయోగము. సం. వి. అ. పుం. 1. కుసీదము, వడ్డీతో బ్రదుకుట; 2. రాజ్యతంత్రాదు లుపయోగించుట. (మంత్రిలక్షణము).
అర్థము. సం. వి. అ. పుం. 1. అభిధేయము, శబ్దార్థము; 2. విషయము, ఇంద్రియార్థము; 3. కారణము; 4. విధము; 5. నివృత్తి; 6. న్యాయము; 7. ప్రయోజనము, కార్యము; 8. వస్తువు; 9. ధనము, పురుషార్థములలో రెండవది.
అర్థవంతము. సం. విశే. (త్. ఈ.-వతీ. త్.) 1. అర్థము గలది. (శబ్దము;) 2. ధనముకలది; 3. సార్థకము, సఫలము. "క. అవిరళవిషఘణిదంష్ట్రలు, పవనజువజ్రమయతనువుపయితో లును నొవ్వ

భేదింపఁగఁ బాప, వ్యవసాయులచెయ్యి లర్థ వంతము లగునే." భార. ఆది. ౫, ఆ. ౧౭౬.

అర్థవాదము. సం. వి. అ. పుం. 1. స్తావక వాక్యము, ఒక విధివాక్యమును ప్రవర్తించుటకు చెప్పువిషయము; 2. అసత్యవాక్యము. "తే. కలవు పీఠంబు లానందకాననమునఁ, జెట్టు ప్రేసిన చోట సత్క్షీణపుణ్య,యర్థవాదంబు కాదు సత్యంబ కాని, పెద్దపీఠంబు ధర్మేశపీఠకంబు." కాశీ. ౭, ఆ. ౯.

అర్థశాస్త్రము. సం. వి. అ. న. నీతిశాస్త్రము.

అర్థశౌచము. సం. వి. అ. న. ధనార్జనమునందు అన్యాయము చేయకుండుట.

అర్థసాధనము. సం. వి. అ. పుం. 1. కార్యము సాధించుట; 2. కుంకుడు♆.

అర్థసిద్ధి. సం. వి. ఇ. స్త్రీ. కార్యము నెఱవేఱుట.—పుం. పుత్రజీవి♆.

అర్థహీనుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ధనహీనుఁడు, సొమ్ము లేనివాఁడు.

అర్థాంతరన్యాసము. సం. వి. అ. పుం. ఒక అర్థాలంకారము. చూ. అలంకారము.

అర్థాంతరము. సం. వి. అ. న. 1. మఱియొక యర్థము; 2. మఱియొక విషయము; 3. కారణాంతరము.

అర్థాగమము. సం. వి. అ. పుం. 1. ధనముయొక్క రాఁబడి; 2. ఒకశబ్దమువలన అర్థము స్ఫురించుట.

అర్థాపత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. శబ్దమువలన ఉపస్థితము కానియర్థము సందర్భమునుబట్టి స్ఫురించుట. ("బలిసిన దేవదత్తుఁడు పగలు భోజనము చేయఁడు." అను వాక్యమున బలిసిన యను విశేషణమువలన రాత్రిభోజనము చేయును అని స్ఫురించుచున్నది;) 2. ఒక అలంకారము. చూ. అలంకారము.

అర్థి. సం. వి. న్. పుం. ఈక్రిందియర్థములందు తెనుఁగునను కనఁబడుచున్నది. 1. భక్తి. "సీ. ఇష్ట, సఖులయి వేదముల్ చదివి ధనుర్వేద, మగ్ని వేశులతోడ నర్థిఁ గఱచి." భార. ఆది. ౭, ఆ. ౫; 2. ఆసక్తి. "సీ. భారవహాత్వ, దక్షజనుల్ పెక్కులక్ష లర్థిఁ, గదిసి." భార. అశ్వ. 3, ఆ. ౧౫౬. "ఆ. నీరుపట్టు శ్రమముఁ గూరిన నీమీఁది, కరుణవచ్చినాఁడఁ గాదునాక, యర్థిఁ ద్రావు టొప్పు ననియె." భార. అశ్వ. 3, ఆ. ౫౬. "ఆ. జూదమాడి ధర్మసూనుండు రాజ్యంబు, ననుజులను బ్రియాంగనను బణంబు,గాఁగ నొడ్డి యోడి కాఱియఁబడఁడె య, ట్లగుట దీనితోడి యర్థి గీడు." భార. విరా. ౫, ఆ.౨౪౫; 3. ఇచ్ఛ, అభిలాష, కోరిక. "తే. ఏను నీయింతియును గాని యెఱుఁగ కన్య, లర్థిఁ గణ్వమహామునియాశ్రమంబు,నందు గాంధర్వవిధి వివాహమునఁ గరము, నెమ్మిఁ జేసితి దీనిఁ బాణిగ్రహణము." భార. ఆది. ౪, ఆ. ౧౦౭. "కవిరాజవిరాజితము. అనవుడు నిట్లను నన్నరపాలున కాతఁడు మోక్షము నర్థి." భార. స్త్రీ. ౧, ఆ. ౫౧; 4. వాత్సల్యము. "సీ. అమ్మహీతాత్ముల కర్థితో మఱునాఁడ,నుజ్ఞయిచ్చిన సుమనోజ్ఞములును." భార. ఆశ్ర. ౨, ఆ. ౬౯; 5. సంతోషము. "ద్వి.ఏరాగమున సకలేశున కర్థి, యారాగవీణ దానలరి ధ్వనింప." బస. 3,ఆ. పు. ౪౯. "ద్వి.శంభుండనంగ వృషభమూర్తి దాల్చి, యదియ వాహనముగా నర్థిఁ జరింప." "ద్వి. స్థిరమతి కర్ణాటదేశంబునందు, కరమర్థి హింగుళేశ్వర భాగవాటి, అనునగ్రహారంబునందు." పండి. దీక్షా. పు. ౭౧.—విశే. (న్. ఈ-నీ.న్.) 1. కోరికగలవాఁడు, కోరువాఁడు; 2. యాచకుఁడు; 3.(తెనుఁగుననే) ఇష్టము,ప్రియము,"ద్వి. దేహాంతరమునఁ బొందెడి తత్ఫలంబు, దేహంబుతోడ సంధిలు టర్థిగాదె." పండి. మహి. పు. ౨౫౩; ఈశబ్దమునకు కోరికగలవాఁడు, కోరువాఁడు, మొదలగు అర్థములయందు విశేషణముగానే ప్రయోగముగలదు. కోరిక మొదలగు నర్థములయందు విశేష్యముగా నన్నయభట్టాదికవిత్వమునఁ గనఁబడుచున్నది.ఇట్టిప్రయోగములయందు భావప్రధాన నిర్దేశమని యెంచి విశేషణమునకే విశేష్యార్థముఁజెప్పెడు సంప్రదాయము గలదు. ఇది యొకమార్గము. కన్నడమున అర్తి, అర్తి, అను రూపములు గలవు. అరితియని ఆంధ్రభాషార్ణవమునఁ గనఁబడుచున్నది. అర్తియనుటకు మాఱు "అర్థి" యని లేఖకులచే మొదట గ్రహింపఁబడి యుండును. క్రమముగా అర్థియనురూపము

వాడుకలో నిలిచియుండును. "అర్థి" శబ్దముతో సంబంధములేని సంతోషము, భక్తి మొదలగు సర్థములయందు దీనికి ప్రయోగములు గలవు. శైవకవులలో "ఆత్మర్థి" అని "మోక్షార్థి" అని సమాసమునఁగూడ కనఁబడుచున్నది. చూ. అర్తి, ఆరితి.

అర్థించు. సం. స. క్రి. 1. కోరు; 2. వేఁడు.

అర్థితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కోరఁబడినది; 2. వేఁడఁబడినది. (అర్థితము పదార్థము, అర్థితుఁడు, ధనవంతుఁడు అని రెండర్థములును తెలిసికొనునది.)

అర్థిత్వము. సం. వి. అ. న. 1. యాచకత్వము; 2. కోరిక, కోరుట. "కమయభుజగమోక్షణము ని, ర్ణయముగ నెఱిఁగితి నెఱుఁగ నాకర్థిత్వం,బయినది నలుగురు శార్ఙ్గకు,లయు మోక్షణ మెట్లు నిర్మలజ్ఞాననిధీ." భార. ఆది. ౧, ఆ. ౨౭౪.

అర్థిసాత్కృతము. సం. విశే. (అ.ఆ.అ.) యాచకులకు అధీనముచేయఁబడినది, యాచకులకు ఈయఁబడినది.

అర్థ్యము. సం. విశే. (అ. ఆ. అ.) 1. తెలివిగలది; 2. న్యాయముతోఁగూడినది; 3. అర్థింపఁదగినది, కోరఁదగినది; 4. అర్థమువలన తొలఁగనిది, సార్థకము.—వి. అ. న. సిలాజిత్తు. చూ. అర్థ్యుఁడు.

అర్థ్యుఁడు. సం. వి. అ. పుం. 1. పండితుఁడు; 2. ధనవంతుఁడు.—విశే. చూ. అర్థ్యము.

అర్దన. సం. వి. ఆ. స్త్రీ. 1. అడుగుట, వేఁడికొనుట; 2. హింస; 3. పీడ; 4. గమనము.

అర్దనము. సం. వి. అ. న. = అర్దన.

అర్దితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అడుగఁబడినది, యాచింపఁబడినది; 2. నొప్పింపఁబడినది.

అర్ధకుడ్యము. సం. వి. అ. న. అద్దగోడ.

అర్ధకృతము. సం. విశే. (అ. ఆ. అ.) సగముచేయఁబడినది.

అర్ధగుచ్ఛము. సం. వి. అ. పుం. ఇరువదినాలుఁగు పేటలు గలహారము.

అర్ధచంద్ర. సం. వి. ఆ. స్త్రీ. నల్లతెగడ🌿.

అర్ధచంద్రము. సం. వి. అ. పుం. 1. చంద్రునిలో సగముభాగము; 2. క్షురప్రమనెడి బాణము; 3. మెడపట్టి త్రోయుట కమర్చిన అర్ధచంద్రాకారపు చేయి, గళహస్తము; 4. గోటినెలవంక, నఖక్షతము; 5. అభినయ హస్తవిశేషము. (చూపుడువ్రేలి నెడముగాఁ జాఁచిపట్టినది); 6. స్త్రీలు పెట్టుకొనెడి యొకరకము బొట్టు.

అర్ధచంద్రకము. సం. వి. అ. పుం. నెమిలిపింఛెము నందు అర్ధచంద్రునివలె నుండు భాగము, నెమిలి కన్ను.

అర్ధచంద్రిక. సం. వి. ఆ. స్త్రీ. 1. నాసాభరణవిశేషము, అర్ధచంద్రాకృతిగల నగ; 2. బొల్లిబూసర🌿.

అర్ధజరతీయము. సం. వి. అ. పుం. ఒకానొక న్యాయము. కోడిగ్రుడ్డుసగము కూరగావండుటకును, సగము పిల్లగా పొదుగుటకును పనికిరానట్లు ఒక విషయమున నొకభాగము ప్రమాణమునకును, మిగిలిన భాగము అప్రమాణమునకును ఉపయోగింపవని తెలుపున్యాయము.

అర్ధజాహ్నవి. సం. వి. ఈ. స్త్రీ. కావేరీనది.

అర్ధతూరము. సం. వి. అ. పుం. యుద్ధారంభమున మ్రోగువాద్యములధ్వని.

అర్ధనారీశ్వరుఁడు. (సగము స్త్రీశరీరము గలవాఁడు.) ఈశ్వరుఁడు.

అర్ధపతాకము. సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము.

అర్ధపలము. సం. వి. అ. న. కర్షమెత్తు.

అర్ధమాణవకము. సం. వి. అ. పుం. పది పేటల ముత్యాలహారము. 'పండ్రెండు పేటలుగల హారము.' అని కొందఱు.

అర్ధమాసము. సం. వి. అ. పుం. పక్షము, పదునేను దినముల కాలము.

అర్ధము. సం. వి. అ. న. సగము, సగముభాగము. —పుం. శకలము, తునుక.

అర్ధరథుఁడు. సం. వి. అ. పుం. ఒక్కవిలుకానితో సమముగా నిలిచి పోరలేని యోధుఁడు, సంపూర్ణరథికుఁడు కానివాఁడు.

అర్ధరశ్మి. సం. వి. ఇ. పుం. పండ్రెండు పేటలుగల హారము.

అర్ధరాత్రము. సం. వి. అ. పుం. నడికిరేయి, సగమైనరాత్రి.

అర్ధరాత్రి. సం. వి. ఇ. స్త్రీ.=అర్ధరాత్రము. "ద్వి. మల్లబ్రహ్మాయలన మహి వీరభక్తి,కెల్లయై వర్తిల్లు నెడ నర్ధరాత్రి, నీవార్త విని జగదేవునికడకు, వే వేగఁ జనుదెంచి." బస. ౭, ఆ. పు. ౨౪3.

అర్ధర్చము. సం. వి. అ. పుం. న. 1. ఋక్కులో సగము; 2. శ్లోకములో సగము. (వాడుక.)

అర్ధవిసర్గము. సం. వి.అ. పుం. సగము వ్రాసినవిసర్గము, జిహ్వామూలీయోపధ్మానీయములకు గుర్తుగా నుంచెడు చిహ్నములు. (దుఃఖము, తపఃఫలము మొదలగు వానిలోనివి.)

అర్ధవీక్షణము. సం. వి. అ. న. కటాక్షవీక్షణము, సగము చూపు.

అర్ధశఫరము. సం. వి. అ. న. తిమిని మ్రింగెడు చేప.

అర్ధహారము. సం. వి. అ. పుం. అఱువదినాలుగు పేటలుగలహారము. 'ఏఁబదినాలుఁగు పేటలుఁగల హారము. అని కొందఱందురు.' అని శ. ర.

అర్ధాంగీకారము. సం. వి. అ. పుం. సగము అంగీకరించుట. (సంపూర్ణాంగీకారములేమి.)

అర్ధాంశము. సం. వి. అ. పుం. సగము భాగము.

అర్ధార్ధము. సం. వి. అ. న. సగములో సగము, నాలుగవభాగము.

అర్ధాసనము. సం. వి. అ. న. కూర్చుండు పీఠమున సగము భాగము.

అర్ధేందువు. సం. వి. ఉ. పుం. 1. అర్ధచంద్రుఁడు; 2. అర్ధచంద్రాకారబాణము; 3. మెడపట్టి త్రోయుట కమర్చినచేయి; 4. గోటిసెలవంక, నఖక్షతము.

అర్ధోక్తము. సం. వి. అ. న. సగము చెప్పుట.—విశే. (అ. ఆ. అ.) సగము చెప్పఁబడినది.

అర్ధోరుకము. సం. వి. అ. న. (సగము తొడల పఱకు వచ్చునది.) చండాతకము, చల్లడము.

అర్పటము. సం. వి. అ. పుం. అప్పడము. శ. ర.

అర్పణము. సం. వి. అ. న. 1. ఉంచుట, నివేశనము. "శ్రీవిష్ణుపాదార్పణానుగ్రహపూత పృష్ఠుఁడు గరుడుఁడు;" 2. స్వత్వమువీడి పరునకధీనము చేయుట, ఇచ్చుట, త్యాగము చేయుట, "ఈశ్వరార్పణము; బ్రహ్మార్పణము"; 3. రాజాదులకు కప్పము, కానుక మొదలగునవి సమర్పించుట; 4. త్యాగముచేయఁదగిన ద్రవ్యము.

అర్పణీయము. సం. = అర్ప్యము.

అర్పితి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుగుఱ్ఱము; 2. కుట్టని, దూతి.

అర్ప్యము. సం. విశే. (అ.ఆ.అ.) అర్పింపఁదగినది.

అర్పించు. సం. స. క్రి. అప్పగించు.

అర్పితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉంచఁబడినది; 2. స్థాపింపఁబడినది; 3. త్యాగము చేయఁబడినది, ఇయ్యఁబడినది.

అర్బుదఫలము. సం. వి. అ. పుం. ఒకరకము మామిడి♈.

అర్బుదము. సం. వి. అ. పుం. 1. దశకోటి; 'కోటి అని కొందఱు.' అని శ. ర.; 2. కంటిజబ్బు; 3. దంతరోగవిశేషము; 4. ఒకానొకకొండ; 5. మాంసపుకండ.

అర్భకము. సం. వి. అ. పుం. 1. గర్భము, శుక్లశోణితములు గలసినపిండము; 2. రత్నము; 3. దారిద్ర్యము; 4. గాలి.

అర్భకుఁడు. సం. వి. అ. పుం. బాలకుఁడు.—విశే. (అ. ఆ. అ.) 1. కృశుఁడు, దుర్బలుఁడు; 2. మూర్ఖుఁడు; 3. అల్పుఁడు.

అర్మము. సం. వి. న్. న. నేత్రరోగవిశేషము.'నేత్రపక్ష్మమధ్యకేశము, కొరి' అని శ. ర.

అర్మిలి. దే. వి. 1. అపేక్ష; "చ. చూచుటఁగాని క్రీడిక, ర్మిలి మఱి లేదు భోజనమునీఁది యపేక్ష యొకించుకేనియున్." విజ. ౨, ఆ. ౧౫3; 2. ప్రేమము; 3. వాత్సల్యము.

అర్మె. దే. = అఱుము. "ఉ. ఏటులమ్రొగ్గువారిఁగని యించుక కొంకక యర్మె పెంపునం,బోటులవాతఁ బోవుభటపుంగవులన్ మది మెచ్చుచున్ వడిన్, వ్రేటులఁ గ్రీడ సల్పి." భార. విరా. 3, ఆ. ౧౬౪. (ఇట 'పరాక్రమము' అని యర్థము.) 'అమ్మెపెంపునన్' పా.

అర్య. సం. వి. ఆ. స్త్రీ. కోమటిది.

అర్యమము. సం. వి. న్. పుం. 1. జిల్లేడు♈; 2. మంకెన♈; 3. సూర్యదేవతాకనక్షత్రము, ఉత్తరఫల్గుని.

అర్యముఁడు. సం. వి. న్. పుం. 1. సూర్యుఁడు; 2. పితృదేవతలలో నొకఁడు.

అర్యాణి. సం. వి. ఈ. స్త్రీ. అర్య, వైశ్యస్త్రీ.

అర్యి. సం. వి. ఈ. స్త్రీ. 1. వైశ్యునిపెండ్లాము; 2. వైశ్యుని పెండ్లాడిన శూద్రాదిస్త్రీ.

అర్యుఁడు. సం. వి. అ. పుం. 1. కోమటివాఁడు, వైశ్యుఁడు; 2. ఒడయఁడు, ప్రభువు.—విశే. (అ.ఆ.అ.) 1. పూజ్యుఁడు; 2. యజమానుఁడు; 3. అంతఃపురపుఁగావలివాఁడు.

అర్వము. సం. వి. న్. పుం. 1. గుఱ్ఱము; 2. తులువ గుఱ్ఱము.—విశే. అధమము, తక్కువైనది.

అర్వాక్కాలము. సం. వి. అ. పుం. తరువాతి కాలము.

అర్వాచీనము. సం. విశే. (అ.ఆ.అ.) (ఒకకాలమునకు) తర్వాతి కాలమున నున్నది. వ్యతి. ప్రాచీనము.

అర్వుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) నిందితుఁడు.

అర్శము. సం. వి. స్. న. 1. మూలరోగము; 2. జలగ. రూ. అర్శస్సు.

అర్శసుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) మూలరోగము గలవాఁడు.

అర్శస్సు. సం. = అర్శము.

అర్శోఘ్నము. సం. విశే. (అ.ఈ-ఘ్నీ.అ.) మూలరోగమును పోఁగొట్టునది.—వి. అ. న. మీఁగడపెరుఁగు.—పుం. చారకంద, సారణము♣.

అర్శోఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. 1. నేలతాడి♣; 2. తాటిమోపు, తేగ. (చూ. అర్శోఘ్నము.)

అర్శోహితము. సం. వి. అ. న. జీడి♣.

అర్షము. సం. వి. అ. పుం. చారకంద♣.

అర్హ. సం. వి. ఆ. స్త్రీ. పూజ.

అర్హంతి. సం. వి. ఈ. స్త్రీ. పూజ్యత.

అర్హణ. సం. వి. ఆ. స్త్రీ. అర్చ, పూజ.

అర్హణము. సం. వి. అ. న. = అర్హణ.

అర్హణీయుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) పూజింపఁదగినవాఁడు.

అర్హత. సం. వి. ఆ. స్త్రీ. యోగ్యత, పాత్రత.

అర్హము. సం. వి. అ. పుం. మూల్యము, విలువ. "మహార్హశయ్యాపరివర్తనచ్యుతములఁ పుష్పములు."—విశే. (అ. ఆ. అ.) అనురూపము, తగినది, యోగ్యము.

అర్హాశయ్య. సం. వి. ఆ. స్త్రీ. ఉత్తరేను♣.

అర్హితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) అర్చితుఁడు, పూజింపఁబడినవాఁడు.

అర్హ్యుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) 1. పొందఁదగినవాఁడు; 2. స్తుతింపఁదగినవాఁడు; 3. పూజింపఁదగినవాఁడు.

అఱ. దే. వి. (త. అఱై.) 1. వాసగృహము. "తే. వాసగృహసంజ్ఞ, నఱ యనఁగ నోవరి యనఁగ నలరు." ఆం.భా. అ. ద్వి. పుర. ౧౬; 2. గది. రూ. అఱ్ఱ; 3. పెట్టె,గాదె,మొదలగువానిలో పలకలతో నమర్చినభాగము; 4. గడి; 5. గోడమొదలగువానిలోఁ గొట్టిన రంధ్రము; 6. (కాలుచేతుల) యడుగుభాగము. దీనికి వ్యస్తప్రయోగముకానరాదు. చూ. అఱచేయి, అఱకాలు; 7. (చెఱువు మొదలగువాని కట్టకు) లోపలివైపు. "అఱగాడి;" 8. అడ్డు, ఆటంకము. "క. ఘోరంబగునీ,జఱభి వధియించి సీతో,నఱలేని మనోజకేళి నలరెదనెలమిన్." రా. అర. ౧, ఆ. ౧౪౦; ఇట 'కొఱఁత' అని శ. ర.; 9. భేదము, వ్యత్యాసము. "సీ.పికభాషలకు విపంచికమ్రోఁతలకు భావమఱలేక తోడ్పడి మెఱసెనేని." హరి. ఉ. ౭, ఆ. ౧౦౪; 10. మఱుఁగు,చాటు, దాఁపఱికము. (కర్ణుఁడు కుంతితో) "ఉ.ఈపనిమీఁది భారమున నీవిట వచ్చితి గాన పాండవుల్, నేపడిరేనిఁ జంపనఱసేయక చెప్పెద సవ్యసాచిపైఁ, గోపము పెద్ద వాఁడు సమకూరిన బిట్టుఱఁ జంపుదుర్జుమీ!" భార. ఉద్యో.౪, ఆ. ౮౦. "చ. అనినతండు నెమ్మనమునం దొగి మోదము ఖేదముం బెనం,గొనఁగ ఁబురోహితుం బిలిచి కోమలిజన్మఫలంబు మీకుఁ దోఁ,చిన తెఱఁ గంతయుం దెలియఁ జెప్పుము వీరికి వీరు సమ్మతిం,చిన నెటులైన లెస్స యఱచేసిన దోషము వచ్చు నావుడున్." భో. ౪, ఆ. ౩౦; ఇట 'వంచన' అని శ. ర.; 11. అరమరిక; 12. కీడు. "ఆ. దుర్ణయమున శకుని కర్ణదుశ్శాసనుల్, గఱపఁ బాండవులకు నఱయచేయఁ, గడఁగెఁ బాండవులును గడుధార్మికులు గాన, బొరయరైరి వారిదురితవిధుల."

భార. ఆది.3, ఆ. ౧౨; **13.** చింపి. "ద్వి. అఱల దోవతి మొల నంటఁగా బిగిచి,కుఱుచగా శిఖ ముడి కొని యాడు కఱచి." రా. అ. కాం. ౧౦౮. పు. అని శ. ర. ఇట 'అఱచి దోవతి'అని పాఠాంతరము; **14.** సగము. "సీ. ఆఱచందురుని క్రొత్త మెఱుఁగులు సంచలెక్కలయచ్చు తెలుపులు గల యంబడఁగ." హరి. ఉ. ౭, ఆ. ౧౭. ఈయర్థమున 'అర' అను రేఫసహితరూపమే ఇతరగ్రంథముల యందును,ఇతరభాషలయందును కనుపడుచున్నది. అదియే యుచితము. కాని 'అఱ్ఱాఁకలి' అను పదమునుబట్టి 'అఱ్ఱ'అను రూపాంతర మూహింపఁదగి యున్నది. అపక్షమున శకటరేఫసహితరూపమును గలదనఁదగును. చూ. అఱ్ఱాఁకలి.

అఱక. దే. వి. **1.** అఱ్ఱు, మూఁపు, స్కంధము. "క. నీవేల వచ్చితిచటికి, నేవాఁడవు మోపుటఱక నేపారెడునీ, లావరిపులుఁ గెక్కుడియది." హరి. ఉ. ౪, ఆ. ౧౫౦; **2.** ఎద్దుమెడమీఁద పూన్చిన నాఁగలి; **3.** నాఁగలి. (ఇది వాడుకలోఁగలదు.)

అఱకడ. దే. వి. (అఱక+కడ.) **1.** మూఁపు. "సీ. కడునిద్రగానమిఁ దొడరుచు వడిగొని నడుమంగ నేరక తడుపుచున్న, నెఱిఁగి చెచ్చెరఁ దల్లి నఱకడ నిడి." భార. ఆది. ౬, ఆ. ౧౬౧; **2.** నితంబ పార్శ్వము. (చూ. అఱకలి.)

అఱకడము. దే. = అఱకడ. "గీ. హయంబునేన, గొఱియబలెఁ బెట్టుకొనివత్తు నఱకడమున." జై. ౧, ఆ. ౧౧౧.

అఱకము. దే. వి. అఱకువ, అజీర్తి.

అఱకలి. దే.వి. ఔప. (అఱక+కలను.) స్కంధము, అఱకడ. "క. కడు డస్సి నడవనోపని, యెడ నీక మలాయతాక్షి నీకవలను నేఁ, దడయక నఱకట నిడికొని, కడకం గొనివత్తు విషమగహనాంతము లన్." భార. అర. 3, ఆ. ౨౮౬. ఇట 'అఱకడ'అని పా. కొన్నిప్రతులను బట్టి 'అఱకట' అని గ్రహింపఁబడినది.

అఱకాలు. దే. వి. పాదతలము, కాలియడుగు భాగము.

అఱకువ. దే. వి. **1.** అజీర్తి; **2.** క్షయము, తక్కువ. "ద్వి. మఱచితే యనవుడు నెఱిఁగి సద్భక్తి, యఱకువ గాకుండ సాష్టాంగ మెరఁగి." బస. ౧, ఆ. ౧౭. పు.

అఱగమి. దే. = అఱకువ.

అఱగొండెతనము. ద్వ. = అఱగొడ్డెతనము. "ద్వి. అద్దిర భక్తునియఱగొండెతనము. భల్లా. ౫, భా. ఈపదము ఇంకను విచారింపఁదగినది." అని శ. ర. చూ. అఱగొడ్డెతనము.

అఱగొడ్డియము. దే. వి. అకార్యము, మండగము. రూ. అఱగొడ్డెము.

అఱగొడ్డె. దే. విశ. దుష్టుఁడు, దుండగీఁడు. చూ. అఱగొడ్డెతనము.

అఱగొడ్డెతనము. ద్వ. వి. దుష్టత్వము, దుండగము. ద్వి. అద్దిరభక్తుని యఱగొడ్డెతనము,విద్దెలాడెడుఁ గాక విందుమే తొల్లి, విపరీత మిందఱు వినఁ బలికింతుఁ,త్రిపురారి ననుటెల్లఁ గపటమో నిజమొ, చూతముగాక." బస. ౫, ఆ. ౧౪౬.పు. అందు 'అఱగొండెతనము' అను పాఠాంతరము చూపఁబడినది. 'అఱగొడ్డియము' మొదలయిన పదములను బట్టి 'అఱగొడ్డెతనము' అను పాఠమే యుక్తమని తోఁచెడిని.

అఱగొడ్డెము. దే. వి. అఱగొడ్డియము. "క. ఎఱిఁగి యెఱిఁగి నీముంపట, నఱగొడ్డెము చేసిపోయితి." ఉ. హరి. ౪, ఆ. ౧౦౬.

అఱగొఱ. ద్వ. వి. న్యూనత, కొఱఁత. "చ. భీమనాయకుం,డఱగొఱ లేనివేల్పు నిఖిలాభ్యుదయంబులు నీకు నయ్యెడున్." భీ. ౨, ఆ. ౧౫౬. "ద్వి. కుదుపంగఁ గుడువ నేర్చితిని, అఱగొఱలేక దాసయ్య మచ్చునను, గఱచితి." బస. ౪, ఆ. ౧౨3. పు.—విశ. న్యూనము.

అఱచెయ్యి. దే. వి. ఔప. (త. అఱంగై. "అఱంగై పుఱంగై.") కరతలము. "అఱచేయి, మీఁజేయి." కాశీ. ౫, ఆ. ౨౨౬. "పాణిపృష్ఠం పాణితలం." సం.

అఱచు. దే. అ. క్రి. **1.** కూయు. "క. పసిగొనుచు మేయవచ్చిన, పసిఁగొనుచుంగోలుపులులుబలిసెన్ నృప నీ, యసి యాడునేని యచ్చోట, నసి యాడుం దఱచు వెఱచు నఱచుం బఱచున్." రామా. ౨, ఆ. ౧3; **2.** విలపించు. "క. నెఱి దప్పంబడిపెల్లుగ, నొఱలెడినరవాజికరులయులి

పభిమన్యుం,డఱిముఱిఁబడుటకు వగ మదిఁ, బఱి గొనవిల వెలుచనఱచుభంగిఁ జెలంగెఁ." భార. ద్రో. ౨, ఆ. ౧౩౨; 3. బిగ్గరగా మాటలాడు; 4. ప్రేలు, వాగు; 5. అవు, కప్పు. మొ. అర్చు.

అఱజాతి. మి. విణ. హీనజాతి, భ్రష్టుఁడు. "క. వఱు వాతలేచి నీదగు, కొఱగాములు చక్కఁద్రోచికొనఁ బోయె దినం,బఱుగువడి చనియె నీపను, లఱజాతివి నిన్ను నేమియన నేర్తు సుతా." హరి. పూ. ౫, ఆ. ౨౭౨. "ద్వి. కల్లరి పతితుండు ఖలుఁడు దుర్జనుఁడు, ప్రల్లదుఁ డఱజాతి భక్తిహీనుండు." బస. ౧, ఆ. ౨౭. పు.

అఱడా. దే. వి. 1. కంఠభూషావిశేషము; 2. జడ కుచ్చుమీఁదిపూస. "అపరంజిబంగారుటఱడాలు." భాను. ౪, ఆ. శ. ర.; 3. పల్లకీ బొంగు కొనకు తగిలించుటకయి రేకుతోఁ చేసిన సింహపుఁ దల, సింహతలాటము; 4. ఇంటి దూలముక్రింది భాగమున వేయు స్తంభముచివరఁ దగిలించెడి గుండ్రని కఱ్ఱపూస. రూ. అఱడు.

అఱడు. దే. = అఱడా.

అఱపు. దే. వి. అఱచుట.

అఱపోఱడు. దే. వి. గూను. "క. అఱపోఱడు కుఱుచచేతులు, నొఱవశరీరంబుఁ గలిగి యొరులకుఁ జూడం, గొఱగాకుండియు మన్మథు, నొఱపులఁ బడియెడు నితండు యువతీప్రియుఁడై." భార. అర. ౨, ఆ. ౧౩౫. "సీ. కందుఁబండ్లుఁ బఱికిగడ్డంబులును నఱపోఱడుల నంటురూపులును గుఱుచ, కోఁజేతులు నిఱికిగోళ్లును." కు. సం. ౬, ఆ. ౩౭.

అఱమర. ద్వ. వి. (అఱ + మరలుట. అని శ. ర. 'అఱమఱ' అనుటయే యుక్తమని తోఁచెడిని.) 1. దాఁపఱికము, మఱుగుపఱచుట. "క.మఱియు నొకమాట యెవ్వరు, నెఱుఁగనియది దశరథునకు నేకాంతమునం, దఱమరలేక దృఢంబుగ, నెఱుక పడం జెప్ప వింటి నే నొకరుండన్." నిర్వ. ౯, ఆ. ౫౭. ఇట 'సందేహము' అని శ. ర; 2. భేదము. "క. వెఱవకు నెమ్మది నుండుము, పెఱవారలబుద్ధి నాత్మఁబెట్టుము నె యనఘుం, డొఱపిడి చాడ్పున నామది, నఱమర లే దొండు నమ్ము మనియె నరేంద్రా." విక్ర. 3, ఆ. ౧౦౧. రూ. అఱమరిక.

అఱమరిక. ద్వ. = అఱమర.

అఱవ. దే. వి. లొంగని యావు. "సీ. అఱవలైనను నలవున వెరవున ముట్టి యంటఁగఁబట్టి కట్టి విడువఁ, బిదుక." భార. విరా. ౧, ఆ. ౧౦౧. అని శ. ర. "సీ. తెవులు గొంటులనైనఁ దేర్చు సంకటమున కోపి ముందటియట్ల రూపుసేయ, నఱ్ఱలనైనను నలువైన వెరవున ముట్టె యంటఁగఁ బట్టి కట్టివిడువ." అని ముద్రితమున కలదు. (ఇట అఱవ, నఱవ, అఱ్ఱ, నఱ్ఱ అనుపాఠభేదములునుగ నఁబడుచున్నవి.)—విణ. 1. దుష్టుఁడు. "ఆ. పంగులఱవలై కాలుచే, విఱిచి సాధుజనులఁ బఱచినారు." ఇది ప్రాఁతప్రతులయందలి పాఠము. భార. అను. ౫, ఆ. ౧౦౦. అని శ. ర. ఇట ప్రకృత ముద్రితపాఠము.—"ఆ. ఉలుముగొన్న వాఁడు దొలుమేన నాఘాత, బంధనముల నొరుల ప్రస్పందనము, సెఱచినాఁడు పంగు వొఱవగఁ గాలునే, విఱిచినాఁడు." అని కలదు. "వఱవుగ గాల్సేయి, విఱిచి; వొఱవైనఁ గాల్సేయి, విఱిచి;" అని పాఠభేదములు కలవు; 2. ద్రవిడదేశస్థుఁడు. వృత్తియందే యేకవచనాంతము. "ద్వి. కుమతులై కర్మశాస్త్రముల వెంబడిని, బ్రమసియో యిలఁ గుక్కపాలు ద్రాగుటనో, మఱి నాము మేసియో మలిమాలినట్టి, యఱవపాఱులమాట లవనీశ వినకు. బస. ౬. ఆ. ౨౦౨. పు. "ఇట అఱవ = దుష్టుఁడు." అనియు నన వచ్చును.

అఱవదు. దే. వి. సస్యవిశేషము. "క. అఱవదు గంటె తవిందయు, నఱువదిదినములకుఁ బండునసీ బ్రదుకొనన్, డఱచుగ నేతాలెత్తఁగఁ, బఱి పఱియై యవియు మల్లెవడి చెడిపోయెన్." కాశీ. 3, ఆ. ౨౫౧.

అఱవత. ద్వ. వి. ద్రావిడస్త్రీ. "తే. కంచి యఱవత లసమాస్త్రఖడ్గలతలు." కాశీ. 3, ఆ. ౧౦౯.

అఱవము. వై. వి. (క. అరవ, అరువ = ద్రవిడదేశమున లింగాయతులు వాడెడు భాష. త. అరువ.) (అఱవలు మాటాడునది. 'అఱ+వాయి' అని శ. ర.) ద్రావిడభాష, తమిళము.

**అఱవఱలు.** దే. వి. బ. ఖండములు, తునియలు. "క. అఱవఱలై సరథంబులు, నెఱి దప్పంబడిన యశ్వనికరంబులుఁ బెం, దఱుచుగఁ గూలినకరులున్, గిఱికొనియెన్ సమరమేదినీతలమెల్లన్." భార. భీష్మ. ౨, ఆ. ౧౩౬. "చ. రథస్వివాశ్వములు పాండవమధ్యముతేరి వీక్షియం, దఱవఱలై పడంగని భయంపడి." భార. విరా. ౫, ఆ. ౬౧. "సీ. పటుభల్లనికరంబు పరఁగినఁ బఱియలై, య అవఱలయ్యెడు సరదములును." భార. ద్రో. 3, ఆ. ౧౫౮.

**అఱవఱసేయు.** ద్వి. స. క్రి. (అఱవఱలు+చేయు.) **1.** ఖండించు; **2.** ధ్వంసముచేయు. "అరిగి దక్షాధ్వరం బఱవఱ సేయంగ." హరి. ఉ. ౬, ఆ. ౧౫.

**అఱిముఱి.** దే. వి. **1.** త్వర. "చ. యుధిష్ఠిరుండఱిముఱిఁ జంపె సారథిఁ దదశ్వములం బటుబాణపాణియై." భార. విరా. 3, ఆ. ౨౧౬. సం. "తతో యుధిష్ఠిరో రాజా త్వరమాణో మహారథః." "చ. అఱిముఱిబాణజాలముల నక్కడిసైనికులం దెరల్చెదర్న్, గుఱుకొని నాకు మాఱుకొని కోల్తలఁ జేసిన వీరవర్గమున్, నఱికెద." భార. శల్య. ౧, ఆ.౭౬; **2.** క్షోభము, కలఁత. "క. విఱిగి భవత్సుతనివహం, బఱిముఱిఁ గనుకనిఁ జనంగ ననిలసుతుం డేడ్తెఱ నెగచి వగచె వారం, దఱుఁ దనచేఁ జచ్చు టపుడు తప్పాటనఁ గడున్." భార. భీష్మ. ౨. ఆ. 3౯౦. "క. ముఱిముఱి చీఁకటి యప్పుడు, నఱిముఱి భటు లుడుగ కదరి యని సేయంగా, నెఱసి తమ మెల్లయెడఁ గ్రిక్కిఱిసిన మఱి పాసి నిలిచి రింతను నంతన్." భార. విరా. 3, ఆ. ౧౯౬.

**అఱిమెనకుండలు.** ద్వి. వి. బ. రంగులుపూసిన పెండ్లికుండలు, ఐరేనికుండలు. (కొన్ని ప్రాంతములయందు వాడుక.)

**అఱిసియ.** దే. వి. అఱిసె, అతిరసము, భక్ష్యవిశేషము.

**అఱిసె.** దే. = అఱిసియ.

**అఱు.** దే. అ. క్రి. (త. అఱ్.) **1.** క్షయించు; **2.** నశించు. "క. బలపక్షగేంద్రకోపానలభస్మీభూతుండై క్షణంబున వాఁడున్, బలమఱి క్రాఁగె." భార. ఆది. ౨, ఆ. ౯౮.—వి. ఔప. **1.** కంఠము. "క. తనజనకునఱుతఁ బవనా, శన శవముఁ దగిల్చి రాజసమునఁ బరీక్షిజ్జనపాలుచనుట కృశుఁడను, మునివలన నెఱింగి కోపమూర్చాన్వితుఁడై." భార. ఆది. ౨, ఆ. ౧౭౦. "సీ. ఇందుబింబముఁ జూచి చెందుప్వఁగలు సావి యఱులెత్తి నాకంగ నాసపడిన." కాశీ. 3, ఆ. ౧౨; **2.** సమీపము. రూ. అఱ్ఱు.

**అఱుఁదెవులు.** దే. వి. (అఱు+తెవులు.) క్షయరోగము. "వ. అమ్మహాత్ముండు గోపించి యఱుఁదెవులు గొనుమని శాపంబిచ్చిన నయ్యోషధీనాథుండు నానాఁటికిఁ గృశుండయ్యె నట్లా తెవులుచేత నతండు వోఁడిమిమాలిన నోషధులు పసచెడియె దానఁ బ్రజలు డయ్యం జొచ్చిరి." భార. శల్య. ౨. ఆ. ౧౪౭.

**అఱుకువ.** దే. వి. **1.** అఱకము, అజీర్తి; **2.** పక్వము గామి.—విణ. **1.** జీర్ణముకానిది (అన్నము మొ.); **2.** అపక్వము, సరియగుపరిణామము లేనిది. "సీ. అఱుకువ యెఱుకతో నాశ్రమంబిది మెచ్చి తిరిగాక గృహమేధ మేలయొల్ల, వేపదంబునఁబొందె దిందు మూఢుండవకాక సంసారసౌఖ్యంబు మాని." ఉ. హరి. ౪, ఆ. ౫౦.

**అఱుక్రమ్ము.** దే. అ. క్రి. కవియు, మీఁదికివచ్చు. "ద్వి. పఱచు నెత్తురుటేర్లు బహుమాంసములకు, నఱుక్రమ్ము భూతమ్ములై రణంబొప్పె." రా. సుం. కాం. ౨౬౫. పు.

**అఱుగఁదీయు.** దే. స. క్రి. **1.** అఱుగునట్లు చేయు; **2.** తోము, రాచు.

**అఱుగు.** దే. అ. క్రి. **1.** (అన్నాదులు) జీర్ణమగు; **2.** క్షయించు, తఱుఁగు. "సీ. సత్యంబు నరులకు సంక్షిప్తమగు సత్యహాని నాయువు గడు నఱిగిపోవు, నాయువు దఱిఁగిన నల్పంబులగువిద్య, లల్పవిద్యల విమోహంబు మిగులు." భార. అర. ౪, ఆ. ౨౮౭. రూ. అఱువు. మొదటిరూపము అఱు.

**అఱుగుడు.** దే. విణ = అఱువుడు.

**అఱుగుఁదెవులు.** దే. వి. (అఱుగు+తెవులు.) అఱుఁదెవులు.

**అఱుగుట్లు.** దే. విణ. = అఱువుట్లు.

అఱుగువడు. ద్వ. అ. క్రి. (అఱుగు+పడు.) 1. క్షయించు; 2. నశించు; 3. హీనమగు. "క. వఱువాత లేచి నీదగు, కొఱగాములు చక్కఁద్రోచి కొనఁబోయె దినం, బఱుగువడి చనియె నీపను, లఱజాతివి నిన్ను నేమి యననేర్తుసుతా." "ఇఱులువడి చనియె." అని ముద్రితము. హరి. పూ. ౫, ఆ. ౨౮౧.

అఱుపు. దే. స. క్రి. దక్కించు. శ. ర.

అఱుము. దే. స. క్రి. 1. (యుద్ధమున) ఆక్రమించు; 2. సన్నద్ధుఁడగు. "క. ఎఱుఁగుదు నేను సుయోధను, కొఱగామియు నతనితోడఁ గూడిన నృపులం, దఱుఁ బగ మనమున నిడికొని, యఱుముటయును సంధి పొసఁగదనియు మహాత్మా." భార. ఉద్యో. 3, ఆ. ౨౩౭.—వి. (యుద్ధమున) ఆక్రమణము, మార్కొనుట. "క. ఆతం డఱుమెడలక మఱియు నేసె నధికరయమునన్." భార. భీష్మ. ౨, ఆ. ౩౦౬.

అఱువండ్రు. ద్వ. స. అఱువదిమంది. (పురుషులుగాని స్త్రీలుగాని.)

అఱువది. ద్వ. స. (ఆఱు+పది.) ఆఱుపదులు.

అఱువు. దే. = అఱుగు.

అఱువుడు. దే. విశే.=అఱుగుడు. 1. అఱిగినది; 2. శిథిలము. (బ. అఱువుళ్లు. వృత్తియందే యేకవచనప్రయోగము గలదు.) "క. అఱువుడుఁగావి ముసుంగును, విఱిగినదండంబుఁ దునిసి ప్రేలెడు గోఁచిం, బఱియలయిన కరకమునయి,చుఱచుఱఁ జూఁడెడి తెఱంగు చూపులతోడన్." ఉ. హరి. ౪, ఆ. ౭౯. చూ. అఱువుళ్లు. రూ. అఱుగుడు.—వి. (అఱిగినది.) ఖండము, తునియ.

అఱువుఁదెవులు. దే. వి. అఱుఁదెవులు. "ఉ. ఏను హితంబు చెప్ప నటు లేచి దురాచరణంబు లిమ్మెయిన్, మానవు రోగి చందయిన మం దఱువుందెవు లంటఁదాఁకినం, గాని యెఱుంగఁ డప్డు ప్రతికారముగల్గునె యట్లువోలె నీ,దైనని కృష్టవృత్తిఫల మంది తలంచెదుగాక పిమ్మటన్." నిర్వ. ౪, ఆ. ౬౫. (శ. ర.) ('చేఁదయిన మందఱువుందెవులంటఁ దాఁకినం,గాని' అని ముద్రితపాఠము.)

అఱువుళ్లు. దే. వి. (అఱువుడు బ.) ఖండములు. "క.ద్రోణుఁడు గోపించి తనుత్రాణం బఱువుళ్లు సేసి తనువున రాజద్బాణంబులు గ్రుచ్చిన సంక్షీణబలుండై యతండు సిగ్గఱి తొలఁగెన్." భార. భీష్మ. 3, ఆ. ౨౩౩. (అఱువుళ్లుసేసి = తునియలు సేసి.) ఇట "విశే. బ. శిథిలము" అని శ.ర. రూ. అరుగుళ్లు.

అఱ్ఱ. దే. వి. 1. గది; 2. పెట్టెలోనగువాని లోపలి అఱ; 3. సగము. చూ. అఱ్ఱాఁకలి; 4. ప్రయాసమునఁ బాలుపిండఁదగినయావు, కరటు. "సీ. తెవులుగొంటులనైనఁ దేర్చుసంకటమున కోపి ముంచటియట్ల రూపుసేయ; నఱ్ఱలనైనను." భార. విరా. ౧, ఆ. ౧౦౧. చూ. అఱవ.

అఱ్ఱము. దే. వి. ముండ్లమోపు లోనగునది. శ. ర.

అఱ్ఱాఁక. దే. వి. (అఱ్ఱు+ఆఁక-కంఠముమీఁదికి వచ్చినది.) (ఆఁక+ఆఁక అని. శ. ర.) 1. మిక్కిలి నిర్బంధముకలిగించుట, బాధ. "క. ఆఁకలిగాదో భక్తిం,దేఁకువగల వాఁడఁగానో తినవేల కృషన్, సాఁకఁగదే నన్నిపు డ,ఱ్ఱాఁకలఁ బెట్టక పలాశనాసక్తుఁడవై." కాశి. 3, ఆ. ౯౯. "ఉ. ప్రేఁకఁ దనంబొకింత ప్రభవింపకమున్న ప్రసూనబాణుఁ డ,ఱ్ఱాఁకలఁబెట్టెఁదానఱవనా మెతబాలికకైవిటావళిన్." కళా. ౧, ఆ. ౨౬; 2. మఱుఁగు, దాఁపఱికము. "శా. ఊఁకొఁజెప్పఁగ నెంతయేసిఁ దడవో నోవిప్రశార్దూల నీ,వాఁకొన్నాఁడవు భోజనోత్తరమునం దాస్థానమైయుండ న,ఱ్ఱాఁకం బెట్టక చెప్పెదన్ సకలవృత్తాంతంబునుం దేటగా, వీఁకన్ వేళ యతిక్రమించెఁ గుడువన్ విచ్చేయుమా గ్రక్కునన్." కాశీ. ౭, ఆ. ౧౭౪. (ఇట బాధపెట్టక అనియుం భావము చెప్పవచ్చును.)

అఱ్ఱాఁకలి. దే. వి. (అఱ్ఱ (=అఱ)+ఆఁకలి) అర్ధమయిన ఆఁకలి, సగము ఆఁకలి. (ఆఁకలి+ఆఁకలి. మిక్కిలి క్షుత్తు" అని శ. ర.) "క. సొలయక యన్నం బిడుమీ,జలజభవాన్వయుల కమట చాలదె యఱ్ఱాఁ, కలిసేయకుమని యేలా, పలికితిరనియడుగ సతికిఁ బతి యిట్లనియెన్." "శా. ఆహారాధికమైన మందునిలలో నయ్యగ్ని దేవుండు స్వ, ల్పాహారంబున మందు విప్రుఁడు.

......వ....గృహస్థుండతిథికినల్పాశనంబిడుట యొప్పదు....'' భో. ౬,ఆ. ౧౬౫. 'అర్ధాఁకలి' అని వాడుకలో సుప్రసిద్ధము, కవి యిట 'అర్ధాఁకలి' అనియే ప్రయోగించి యుండునేమో!

అట్టాడు. దే. అ. క్రి. (అట్టు + ఆడు.) చుట్టును తిరుగు. ''సీ. చిగురుజొంపములందుఁదగిలి యట్టాడుచుఁగెరలు కోయిలలసుస్వరములకును.'' మార్క. ౫, ఆ. ౭. ''వ. అనుచుఁ దలంగిపోక యిట్టునట్టుంజుట్టు మెట్టెడు చిట్టిపదుగుల నాకట్టు వ నగవునుంగోపంబుఁ గదుర నదలించుచుం దన మేళగాండ్ర నాలోకించి యిబ్బాలకులు మనవాల కపుసొమ్ములందు నేమేమియు నపహరించుటకు నట్టాడుచున్నవారు. మీర లీముచ్చుల నెచ్చరికం గనుపెట్టుకొనియుండుఁ డనుటయు.'' ప్రభా. ౧, ఆ. ౧౦౭.

అట్టియము. దే. వి. అటకము,అజీర్తి (చూ.అట్టెము.)

అట్టు. దే. వి. ఔప. 1. మెడ, కంఠము; 2. సమీపము; రూ. అటు.

అట్టెము. దే. వి. అట్టియము. ''సీ. అటక మట్టె మన నజీర్తియగు.'' ఆం. భా. ద్వి. మ. ౧౨౮.

అల. దే. వి. తరంగము.—విణ. ('ఆ' అనుదానివలె) 1. ప్రసిద్ధిని తెలుపును. ''మ. అల పర్జన్యుఁడు భానుఁడగ్ని కొలిమిలోనభ్రంపుఁ బెన్గొప్పెరన్, జలమాఁగన్.'' ఆము. ౪, ఆ. ౭౦; 2. ఎదుటనున్నదానినిగాని మనమున నిర్దేశింపఁబడినదానిని గాని తత్పూర్వము చెప్పఁబడినదానినిగాని తెలుపును. ''తే. ప్రాణసఖులార వెన్నెల బయలికిపుడు, మించుటద్దంబుగోలయుఁ గొంచురండు, చోరుఁ డలచంద్రుఁడద్దంబు సొచ్చునపుడు,వంచనములేక వ్రేయుఁడీ పొంచియుండి.' 'శృం. నై. ౨,ఆ. ౧౨౪.రూ.అల్ల. అప. కొన్నిచోట్ల సంబోధనమును దెలుప నసుప్రయుక్తమగునది. ''ఉ. అక్కలకన్యకాత్వ మిటులాఁడివోవ నకారణంబ నీ, కెక్కడిచూలు వచ్చె.'' నిర్వ. ౨, ఆ. ౨౩. 'అక్కట కన్యకాత్వ' మని ముద్రితపాఠము. రూ. అలా.

అలంకరణము. సం. వి. అ. న. 1. అలంకరించుట. ''క. వివిధాలంకరణంబుల, నవకాంతి వహించి.'' భార. విరా. ౫, ఆ.౩౮౩; 2. భూషణము, నగ.

అలంకరణీయము. సం. విణ. (అ. ఆ. అ.) అలంకరింపఁదగినది.

అలంకరించు. సం. స. క్రి. కైసేయు, సింగారించు.

అలంకరిష్ణువు. సం. విణ. ఉ. 1. అలంకరించు స్వభావము కలవాఁడు.

అలంకర్త. సం. విణ. (ఋ.ఈ.ర్త్రీ.ఋ.) కైసేయువాఁడు, అలంకరించువాఁడు.

అలంకర్తవ్యము సం. = అలంకరణీయము.

అలంకర్మీణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పనియందు నేర్పరియైనవాఁడు, కార్యసమర్థుఁడు.

అలంకారము. సం. వి. అ. పుం. 1. అలంకరించుట, కైసేఁత; 2. భూషణము, నగ; 3. రసపోషణసహకారియయి కావ్యమునకు శోభను కలిగించు రచనావిశేషము. (శబ్దనిష్ఠము శబ్దాలంకారము.—యమకాది. అర్థనిష్ఠము అర్థాలంకారము.—ఉపమాది.)

అలంకారించు. సం.=అలంకరించు. ''శా.స్నానంబు హోమంబునుం, గానీ భోజనమైన పిమ్మట నలంకారించుకో నిచ్చెదన్.'' సానం' ౫, ఆ. ౧౮. ''ద్వి. ఆతపత్రముల నలంకారించి మొత్తముల్ గాఁగ.'' పండి. ౪, ఆ. ౭౫౫.

అలంకార్యము. సం. = అలంకరణీయము.

అలంకృతి. సం. వి. ఇ. స్త్రీ. = అలంకారము.

అలంకృతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అలంకరింపఁబడినవాఁడు.

అలంక్రియ. సం. వి. ఆ. స్త్రీ. = అలంకరణము.

అలంగము. దే. వి. కోటగోడకు బలకరముగా వేయఁబడిన మట్టి దిన్నె, వప్రము. ''సీ. అలంగంబన నలవరినా వప్రమగును.'' ఆం. భా. ద్వి. పు. ౧౨.

అలంగామీనుఁడు. సం. వి. అ. పుం. బాటసారి, తెరువరి.

అలంఘనీయము. సం. = అలంఘ్యము.

అలంఘ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. దాఁటశక్యముగానిది; (సముద్రము మొ.) 2. దాఁటఁగూడనిది. (పెద్దలమాట, రాజశాసనము మొ.)

అలంజరము. సం. వి. అ. పుం. మణికము,నీళ్లకాఁగు.

అలంజీవనము. సం. విణ. (అ. ఆ. అ.) జీవనము కొఱకుఁజాలునది, జీవనమునకు సరిపడునది.

అలంజుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వ్యర్థుఁడు, నిరర్థకజన్మముగలవాఁడు. శ. ర.

అలంబుష. సం. వి. ఆ. స్త్రీ. 1. అలంబుషయను నప్సరస; 2. అత్తపత్తి ౘె.

అలంబుషము. సం. వి. అ. పుం. 1. వమనము, డోఁకు; 2. ములుబెండు ౘె.

అలంభూష్ణువు. సం. విణ. ఉ. సమర్థుఁడు. "ఉ. వైష్ణవబాణపావకనివారణభంగికినొండుమై నలం, భూష్ణుత సంభవింపమిఁ బ్రభుండు పురత్రయదాహధుర్యతా, ధృష్ణు వనంగఁ బేర్చిన ప్రదీప్తత రాంబకముగ్ యుగాంతకాలోష్ణకరాభముం బటుబలోద్ధతిఁ గైకొని క్రోధచండుఁడై." హరి. ఉ. ౮, ఆ. ౧౪౮.

అలఁగు. దే. అ. క్రి. 1. వెనుదీయు. "చ. పలికిన నేను నీకలఁపుపద్ధతిగా కిపు డేమిమీఱి వ, ర్తిలితిఁ దొడింబడక్ నిను వధింపఁగవచ్చెదనో యటంచు నా,కలఁగుచు రాక మానుమని యానలువెట్టఁగ." అని. శ. ర. ఇట 'అలుగు.' అని పాఠభేదము; కళా. ౬, ఆ. ౬౬; 2. శోకించు. "ఉ. బాలుర చావుకర్ణములఁ బడ్డఁ గలంగియలంగి యోరుపం, జాలక బాష్పతోయకణజాలము చెక్కుల రాల నేడ్చి."భాగ. ౧, స్కం. ౧౪౨; 3. శ్రమపడు, బాధనొందు. "మ. మలఁగుక్ మెల్లనిగాలికిం బటునట న్మత్తద్విరేఫాలికిక్, దలఁగుక్ గోయిల ప్రోతకై యలఁగు నుద్యత్కీర సంభాషలం, గలఁగుక్ వెన్నెలవేఁడిమిన్నలఁగు మాకందాంకుర చ్ఛాయకుం దొలఁగుం గొమ్మ మనోభవానల శిఖాదోదూయ మానాంగియై." భాగ. ౧౦, స్కం. పూ. ౧౭౩౨; 4. సంకోచించు. "ద్వి. జలకేళి సలుపునిర్జరసతుల్ శుకునిఁ, గలఁగ కూరక యుండి యటుతరువాత." భాగ. ౧. స్కం. (శ. ర.)

అలఁచు. దే. స. క్రి.(అలఁగు ప్రే.) అలయఁజేయు. "క. ర మ్మింద్రపదవి సేకొని, మమ్మెల్లను నరయు మనిన మానవపతి నా, కమ్మహిమకుఁ దగు మాహాత్మ్యమ్ము గలదె నన్ను నేల యలఁచెద రని నన్." భార. ఉద్యో. ౧, ఆ. ౧౪౫. 'ఇట బాధపెట్టు' అని అర్థము.

అలఁత. దే. వి. అలయుట. 1. బాధ. "క. వడి నది పోఁపున వెడలినఁ, బడియోఁ బుడమి నర్జునుండు పడపడి త్రెళ్లెం, గొడుకును మున్నకఁ డేసిన, బెడిదపు టేటులయలంతఁ బృథ్వీనాథా." భార. అశ్వ. ౪, ఆ. ౬౪; 2. శోకము. "తే. తనుజశోకార్తయైన గాంధారిఁ జూచి, యడలు తనదుచిత్తంబున నతిశయిల్ల నలఁతఁ దేర్పంగఁ దలఁచి తా నల్లఁ జేరి, యమ్మహాదేవితోడ నిట్లనియోఁ గృపుఁడు." భార. స్త్రీ.౧, ఆ. ౧౦౭. "క. మున్నిట్టి తెఱఁగు శోకం, బెన్నఁడు దా నను భవించి యెఱుఁగదకట నేఁ, డన్నలఁత యలఁత పెల్లున, నెన్నియవస్థలకు వచ్చి యెట్లయ్యెడినో." భార. సౌ. ౨, ఆ. ౧౯; 3. శ్రమము. "ఉ. చెల్లనిహామిక ల్తరువు సేయని కూటములయ్యె భావముల్ వల్లభునందు వేఁకటియలంత నెలంతకు నాఁటినాఁటికిక్." అని. 3, ఆ.౧౦౨.

అలఁతి. దే. వి. తేలిక, అల్పము. "ఉ. కావరమైన కీచకుఁడు గామనిపీడితుఁడై యలంతులం,బోవక." భార.విరా. ౨,ఆ. ౨౨౮. "సీ.... మున్నవమాన పాటు, దుఃఖపాటు గలిగి తొడరంగవచ్చిన, వారుగాన నలఁతిఁ బోరు." భార. ఉద్యో. ౪, ఆ. ౨౫౭.—విణ. 1. అల్పము; 2. సూక్ష్మము. "తే. నాకు, నావుడును సిగ్గు గదిరి యాననము వాంచి,యలఁతి యెలుఁగున నిట్లను నాలతాంగి." భార. ఆను. ౧, ఆ. ౫౦; 3. చిన్నది. "వ. వీను నీకు హితంబు గోరుచున్నవాఁడ నని నిశ్చయించి నాబుద్ధి వినుము వారల జీవనంబునకుఁ గొన్ని యలంతిపల్లియలైనను దుర్యోధను నొడంబఱచి యేర్పఱచి తెఱంగుపఱచిన లెస్సయని చూచెద." భార. ఉద్యో. ౨, ఆ. ౯౧. "అలఁతి పలుకు; అలఁతినగవు."

అలఁదు. దే. స. క్రి. పూయు.

అలఁదురు. దే. అ. క్రి. ఉమ్మలించు, దుఃఖించు. "లయగ్రాహి. కందళితపుష్ప మకరందరసముం దగులుచుం దనుపుసౌరభము నొంది జనచిత్తా, నందముగఁ బ్రోషితులడెందము లలందురఁగ మందమలయానిల మమందగతి వీచెక్." భార. ఆది. ౫, ఆ. ౧౩౯. "క. కొలఁదికిమీఱిన నెవ్వగ, నలఁదురి." నిర్వ. ౫, ఆ. ౧౧౧.

అలక. ఉభ. దే. విణ. సూక్ష్మము. సం. వి. ఆ. స్త్రీ. కుబేరునిపట్టణము.— అ. పుం. బ. అలకలు, ముంగురులు.

అలకన. దే. వి. సూక్ష్మత.

అలకని. దే. విణ. సూక్ష్మము. "అలకని తెల్వి." హరి. ఉ. ౭, ఆ. ౧౯౩. "అలకని జేబు." స్వా. ౬, ఆ. ౩౧.

అలకప్రియము. సం. వి. అ. పుం. వేఁగిసచెట్టు.

అలకాధిపుఁడు. సం. వి. అ. పుం. (అలకాపట్టణమునకు ప్రభువు.) కుబేరుఁడు.

అలకి. వై. వి. 1. పాత్రవిశేషము. "సీ. యంగ, విలయంబుఁ గలపయుఁ గలశములును, నలకులు గాఁగులు నాదిగాఁగల భాండములును బీఁతములు శయ్యలును లోళ్లు." భార. అశ్వ. ౩, ఆ. ౧౫౬; 2. కుండ. "చ. కలయఁగఁ బాలు పిండి పులకండము వెన్నయుఁ బెట్టి యట్టులై, యలవడ వండితిం బలియు నాత్మజులుం బ్రియపడ్డనాలు గేనలకులఁదొంతి డించి యవియన్నియు నుగ్గులి సీతనూజుఁ డొప్పులవడ మ్రింగెఁ జోద్య మిది బూతములున్నవి గాక కద్దునర్." హరి. పూ. ౫, ఆ. ౨౭. 'అలుగు'లని ముద్రితము.

అలకువ. దే. వి. 1. ఆయాసము; "తెలుప నలకువ దీనర్." భల్లా. ౪. ఆ. (శ. ర.); 2. వైముఖ్యము. "అలకువలేని నిష్ఠలను............" మై. ౧, ఆ. ౬౩.

అలక్తకము. సం. = అలక్తము.

అలక్తము. సం. వి. అ. పుం. యావము, లత్తుక.

అలక్ష్యము. సం. వి. అ. న. 1. లక్ష్యాభావము, గుఱిలేమి; 2. అనాదరము, నిరసనము. "నామాట యందు వానికి అలక్ష్యము." "నీకు నేననిన అంత అలక్ష్యమా? తల్లిమాటయందు అలక్ష్యమెక్కువ."—విణ. (అ. ఆ. అ.) 1. లక్ష్యముకానిది; 2. తెలిసికొనశక్యము కానిది; 3. చూడరానిది.

అలక్ష్యముచేయు. మి. స. క్రి. అనాదరించు, నిరసించు.

అలగర్దము. సం. వి. అ. పుం. నీరుపాము. (రూ. అలగర్ధము, అరగర్దము.)

అలగర్ధము = అలగర్దము.

అలఘువు. సం. విణ. (ఉ.ఉ,ఈ-స్త్రీ.ఉ.) (లఘువు కానిది.) 1. గురువైనది (అక్షరము); 2. బరువైనది; 3. పొడవైనది; 4. పెద్దది; 5. అధికము.

అలజము. సం. వి. అ.పుం.కుక్కుటభము,గంపపులుఁగు.

అలజడి. దే. వి. 1. ఆపద. "ఆ. ఇదియకాని చేయనెద్దియే ననుచు నిర్బంధవృత్తిఁ దలఁపుపట్టికొనిన, నట్టివాని కెందు నలజడి వాటిల్లు, గాలవుండు గుఱియగాఁడె మనకు." భార. ఉద్యో. ౩, ఆ.౩౦౫. "క. అలజళ్లు దీనివలనం, గలిగెడునో కాని శక్తి గలుగ దరిప్పం, బలఘు శుభలక్షణాన్విత, విలసితకనుఁడైన గాండివికి నెయ్యెడలన్." భార. అశ్వ. ౪, ఆ. ౧౫౫; 2. క్లేశము. "చ. అలజడి లేమ చిత్తమున కంగములందుఁ బ్రయత్న మేమియున్, వలవదు." లక్ష్మీ. ౪, ఆ. ౭౭.

అలజేడిపక్షి. దే. వి. పక్షివిశేషము. (అప్రసిద్ధమను గుర్తుతో. శ. ర. లోఁ గలదు.)

అలది. వై. = అళది.

అలపద్మము. సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము. (అయిదువ్రేళ్లను గొనలుకూడకుండునట్లు విల్లువలె వంచి చిటికెనవ్రేలివెంబడి వ్రేళ్లన్ని యెడముగలుగఁ ద్రిప్పఁబడినది-అని శ. ర.)

అలపు. దే. వి. అలయిక, శ్రమము.

అలబలము. దే. వి. కలకలము. "క. అలబలములసంఖ్యములై, యలబలములు సేయుచుండ." విజ. ౩, ఆ. ౧౪౧.

అలభ్యము. సం. విణ. (అ.ఆ.అ.) లభ్యము కానిది, పొందశక్యముగానిది.

అలమట. దే. వి. చింత, వగపు, "క. అనవరత సౌఖ్యసంపదఁ, బెనుపొందుచునుండు మీకు భీకరకాంతారనివాసాయాసంబుల, ననఘా యీభంగినవయ నలమట వొడమెన్." భార. అర. ౧,ఆ. ౨౧౩. "గీ. ధర్మసుతుమాటచొప్పెవ్విధంబొ యెఱుఁగ, కునికిఁ జేసి చింతిల్లితి నోపుదీవు, తెలియఁజెప్పి నాయలమట మలుగఁజేయ." భార. ఉద్యో. ౨, అ. ౨౩.

అలమటపడు. ద్వి. అ. క్రి. వగచు, చింతపడు.

అలమటించు. దే. అ. క్రి. చింతించు, వగచు. "ద్వి. సాహాయ్యమునకు, నందు నెవ్వరిగాన కలమటించుచును." విష్ణు. ఉ. ౫, ఆ. (శ. ర.)

౨అలమరు. దే. అ. క్రి. చింతించు, విచారమొందు. "ద్వి. ఈవిధి నలమరి యేఁగుచుండఁగను." హరిశ్చ. ౧, ఆ. ౧౭౯౬.

౨అలమారుచే. దే. స. క్రి. బండియెడ్లను మార్చికట్టు. (శ. ర.)

౨అలము. ఉభ. దే. అ. క్రి. కవియు, క్రమ్ము. "చ. సులభమొ దుర్లభంబొ యని చూడ నెఱుంగవు గన్నదానిపై, నలముదు కామమా యిదుమ లందఁగఁజేయుదు నిందుటేమిటం,గలుఁగదు నీకు నీతెఱఁ గగాధరపాతలభంగి నీవుస,న్బ్రాలమునఁ బోవకుండి నినుఁ బుచ్చెద బచ్చెనరూపు పోకలన్." భార. శాం. ౪, ఆ. ౫౧. శ్లో. యద్వ్యాదాలం బసే కామ తత్త్వదేవానురుద్ధ్యసే. సం. ౧౭౭-౩౮. —స. క్రి. 1. ఆక్రమించు, క్రమ్ము. "తే. రక్కసులును గుంతఖడ్గ, కార్ముకప్రముఖాయుధకలిత భుజులు, కవచధారులు నయి కోటఁగలయ నలమ." రా. యు. కాం. ౫౦౦. "చ......మి, న్నలము తదీయహేమవరణాంచలచంపక శాఖలందుఁబ,త్తులు రొదసేయ......" ఆము. ౧, ఆ. ౭౪; 2. కౌఁగిలించు. "తే. అతివ యత్యంతవివశయై యలమఁగ్రోవి, తేటతేనియ తెలి నీటఁ దెలివిదెచ్చు." హ. న. ౩, ఆ. ౩౬; 3. దరిఁజేరు, సమీపించు. "తే. అతఁడు మనుమనినందంద ప్రీతి యడర, నలమి యాలింగనముచేసి." మార్క. ౮, ఆ. ౨౦౫; 4. పరివేష్టించు, చుట్టుకొను. "మ. జలజాతాస్యలు సద్వయస్యలు సహస్రంబున్నజస్రంబుఁ దన్నలమన్..." భాగ. ౯. ౫౩౭; 5. కప్పు. "తే..... ఆమించు ముద్దుగుమ్మ, సిగ్గుకడ్డంబుగాఁ బతిచేలమలమి, కొనుచుఁ బలికెను..." హంస. ౨, ఆ. ౬౩; 6. పట్టుకొను. "గీ. అంకటను నేనె పైటకొంగలమి బలిమి, సెజ్జపై దార్చియల కలచిక్కుఁ దీర్చి." కువల. ౪, ఆ. ౮౯౪; 7. పూయు. "చ......లక్క నీటమ,మ్మలిమిన దెంత ముగ్ధయిదియంచు..." ఆము. ఆ. ౫, ౩౪; "గీ. పూసెఁబట్టించెఁ జమరెనాఁ బొలుచునలమె, ననుట..." ఆం. భా. ౩, ౧౨౫.—వి. 1. అఱుము, ఆక్రమణము. "చ. నేర్పలవడ వాహనంబుల్లు మహాస్త్రముల్లున్ సమకట్టి క్రమ్మఱుం,డలమునఁ దున్మివైవుఁడు." భార. అర. ౫, ఆ. ౨౭౧. అని శ. ర. పాఠము. 'అలవున' అని ప్రకృతపాఠము; 2. (అలముకొనునది.) శాకవిశేషము. "క. అలములు దుంపలు నమలుచు." అచ్చ. సుం. కాం. ౩౯.—సం. అ. న. 1. తేలుకొండి; 2. తేలుకొండిముల్లు; 3. అరిదళము.

అలముకొను. దే. అ. క్రి. 1. అలము, క్రమ్ము. "వ. బభ్రువాహనుఁడు దల్లులు దాను నలముకొనిన మూర్ఛలు పర్యాయమునఁ దేఱి దురములోఁ జిక్కిన ప్రద్యుమ్నుచే నెఱింగి." జై. ౭, ఆ. ౧౨౨; 2. పైకొను. "నిచ్చనిచ్చలు లాలించి నేవలముకొనుటేగాని, గ్రుచ్చివాఁడు కౌఁగిలించుకొను టెన్నఁడులేదుగా." క్షేత్రయ; 3. ప్రసరించు. "ఆ. నారచీరయేనిఁ జారు చీనాంబరంబైనఁ గట్టికొనినయపుడు హృదయ, మెఁప్పదొప్పనకయుండు రూపాదుల, నలముకొనవు చక్షురాదికములు." భార. శాం. ౪, ఆ. ౬౦; 4. కలసిపోవు, ఏకీభవించు. "సీ. లలితమాగధలోక కలకంఠగానంబు కలకంఠగానంబు నలమికొనియె." వసు. ౧, ఆ. ౧౪౯.—స. క్రి. 1. క్రమ్ము, ఆక్రమించు; 2. కౌగలించుకొను. "క. అడుగుల కెరఁగినఁ బెండిలి, కొడుకవుగమ్మనుచు నలమి,కొని వజ్రిముదం బడర......బలికెన్." వసు. ౫, ఆ. ౫౭; 3. పొందు. "తే. వెనుక ముందటి సమ్మర్దములఁ గరంబు, దండసిలి మధ్యమున నున్న ధరణివిభుఁడు, యంత్ర సిద్ధార్థభావంబు నలమికొనియు, దనునసిద్ధార్థుఁగా నాత్మఁ దలఁచుచుండు." సై. ౪, ఆ. ౧౨౫; 4. కప్పు. "సీ. ఉడికిన ట్లున్నపుప్పొడిమెట్టఁగాఁ బొక్కు, నడుగుఁదమ్ములు కేల నలముకొనుచు" యయా. ౫, ఆ. ౧౧౮.

అలయిక. దే. వి. అలపు, అలసట, శ్రమము. "వ...అలయిక సొలయికల నొకవింతయొయ్యారంబు..." కళా. ౬, ఆ. ౨౨౪.

అలయు. దే. అ. క్రి. 1. శ్రమపడు. "క. అలయు నెడ డయ్యునెడ నాఁ, కలియుఁ దృషయునైన యెడలఁ గడుకొని ధరణీ, తలనాథ పురుషునకు ని, మ్ముల భార్యయ పాచుఁ జిత్తమున దుఃఖంబుల్." భార. అర. ౨, ఆ. ౭౫. "క. వేఁటనలసి యీా

చెంచెత, యోటమివెట్టం గడంగియున్నట్టి యెడన్." హర. ౭, ఆ. ౯౨; 2. విసుగు. "చ. అలయక నాఁడునాఁటికి లతాంగి యపూర్వములైన భోజనంబులు గడుభక్తిఁ బెట్టుచు." భార. ఆది. ౮, ౧౮౩; 3. తడయు, ఆలస్యము చేయు. "క. కసుఁగొని నాకలఁచినపచ్చి, యనువు పఱచి పఱచియైన యలయక వేగంబున పత్తు పచ్చునంతకు, మనవి జేమరక కాచుమత ముచిత మగుఁన్." ఉ. హరి. ౨, ఆ. ౯౧. ఇట 'విసుగు' అని శ. ర.

అలరమ్ము. వ్యు. వి. (అలరు+అమ్ము) పుష్పబాణము. "ఉ. ఎయ్యది కారణంబుగ మహీపతి యంచిత శైత్యకంచుకంబయ్యతనుండు సించె నలరమ్ములచే నది కారణంబుగాఁ, దొయ్యలి రాజనందనుని తోడనకూర్పఁదలంచుచున్నయా, దయ్యము నెత్తి కోలు తుదిఁదాఁకుట గానఁగనయ్యె నయ్యెడన్." సై. ౧, ఆ. ౮౧.('అలరుటమ్ము' అనియుఁగలదు.)

అలరారు. దే. (అలరు+ఆరు) = అలరు. 1. వికసించు. "సీ. మానసం బలరారమత్స్యకూర్మ వరాహ నారసింహోద్భవతారకథలు వినుమ." దశా. ౧. ౧౧౨; 2. పుష్పించు. "సీ. సౌరభోల్లాసముల్లాలి గ్రుంగఁగఁజేరె నలరారు గొదమ క్రొవ్వులను నెలను." ఆము. ౫, ఆ. ౧౩౯. "ఉ.ఆహారిణాక్షి యిద్దయలరారెడు పువ్వులదండ ..." సై. ౬, ఆ. ౮.

అలరు. దే. అ. క్రి. 1. వికసించు, విరియు. "క. ఇమ్మెయిని నధికపరితాపమ్మునఁబడు సూతుహృదయ పద్మంబలరందమ్మి కొలంకుల మొగుడవ, నమ్ములు సోలంగ దివసనాథుఁడు గ్రుంకెన్." భార. విరా. ౨, ౩౧౬; 2. పుష్పించు. "సీ. నెత్తుటఁ దోఁగియు సిగిడిపోరెడు వీరు లలరిన నడమోదుగుల విధంబు. భార. శల్య. ౧, ఆ. ౧౪౨; 3. సంతోషించు. "సీ. నలనామధేయమైనతృణంబు వినఁబడ్డనధిపతిపేర్విన్నయట్ల యలరు." సై. ౧, ఆ. ౭౬; 4. ఒప్పు, ప్రకాశించు.—వి. 1. వికాసము; 2. పుష్పము. "తే....అలరు, లమ్మదురు పుష్పలావికలప్పురమున." ఆము. ౨, ఆ. ౧౯; 3. సంతోషము. "మిగుల నలరొంది." అచ్చ. సుం. కాం. ౭౬; 4. ఒప్పు, ప్రకాశము.

అలరుఁబోఁడి. దే. వి. (అలరు+పోఁడి. పూవు యొక్క సౌకుమార్యము గలది.) 1. సుకుమారి యగు స్త్రీ. "క. అలరుంబోఁడులలోపల, నలరుంబోఁడుములు నీకు నగ్గలమగుచున్,దలపూవాడక యుండుము, తలపూవు ధరించి వికచతామరసాక్షీ."పారి. ౧, ఆ.౬౪; 2. స్త్రీ. ('అలరు+మేను' అను విగ్రహముతో 'మేను'శబ్దమునకు సర్వాదేశముగా 'బోఁడి' శబ్దము వచ్చినదని కొందఱ మతము. అప్పుడు 'అలరుం బోఁడి' ఇత్యాదులయందు బిందువు వచ్చుట కవకాశము లేదు. మఱియు 'పుష్పమువంటి శరీరముగలది' అనుటకంటె 'పుష్పసౌకుమార్యముకలది' అనుటయే వ్యుత్పత్తి విషయమునను ఉచితము. పోఁడి, బోణి శబ్దములు సౌకుమార్యమును, ఒప్పిదమును తెలుపును.)

అలరుఁబోణి. దే. = అలరుఁబోఁడి.

అలరుచు. దే. స. క్రి. (అలరఁజేయు.) 1. వికసింపఁజేయు. "గీ. కలికిరాచిల్కపల్కుఁ బల్కుల నలర్చి." వేం. పంచ. ౩, ౧౪౩; 2. పుష్పింపఁజేయు; 3. సంతసింపఁజేయు; 4. ఒప్పఁజేయు; 5.చేయు. "క. ఇలావంతుండని, యాచతురుఁడు నామకరణ మలరిచియంతన్."విజ.౧, ఆ.౧౧౨.

అలరువిలుకాఁడు. దే. వి. పుష్పధన్వుఁడు, మన్మథుఁడు.

అలరువిలుతుఁడు. దే. = అలరువిలుకాఁడు. "ఆ. అలరువిలుతుపూవుటమ్ముఁబోలె." భార. విరా. ౧, ఆ. ౨౪౫.

అలర్కము. సం. వి. అ. పుం. 1. తెల్లజిల్లేడు✻; 2. ముండ్లయుచ్చింత✻; 3. వెఱ్ఱిత్తినకుక్క; 4. క్రిమిభేదము. (గురుసేవ చేయునపుడు కర్ణుని తొడ తొలిచిన దీజాతిదేఅని ప్రసిద్ధి.)

అలవ. దే. వి. 1. దడి. "సీ. గందపుఁగూచముల్ పొందించి ఖురువేళ్లనలవగాఁగట్టినయట్టిమహిమ." రా. వి. ౩, ఆ. ౮౧; "సీ. (ఎద్దు.) నీటిలోఁదఱిసినపాఠీనములగతి వెలుగులు సొచ్చి యావలికిఁ బోవు, గోడలలవలు వెసదాఁటుఁ గ్రీడవోలె." "గోడలగళులు వెస దాఁటి" అని పాఠాంత

రము. హరి. పూ. ౬, ఆ. ౧౨౬; 2. గోడ, కుడ్యము..

అలవడు. ద్వి. అ. క్రి. (అలవు+పడు.) 1. చనవు గలుగు. "క. నరనాథుఁ గొలిచి యలవడఁ, దిరిగితి నాకేమి యనుచుఁ దేఁకువ లేక, మ్మరి యాడ దప్పు మెలఁగినఁ, బురుషార్థంబునకు హాని పుట్టకయున్నే." భార. విరా. ౧, ఆ. ౧౨౨; (ఇట 'అభ్యాసపడు, వాడుకపడు' అని శ. ర.) 2. తగు. "క. తలఁపఁగఁ బువ్వులకతనం, దలకెక్కెన్ నార యనువిధంబున హరివా,రల మగుట నిట్టిపేర్మికి, నలవడితిమి ధన్యతముల మైతిమి ధరణిన్." హరి. ఉ. ౮, ఆ. ౩౦౨; 3. సిద్ధించు, అబ్బు. "వ. అందు మీరెవ్వరెవ్వ రెక్కడెక్కడ నెయ్యె రూపంబులం జరియింపం గోరినయట్టిరూపంబు లలవడియెడు." భార. అర. ౭, ఆ. ౪౬౫; 4. స్వాధీనమగు, లొంగు. "క. పురికొనుచుం దెరలుచు నో, హరిసాహరి నొక్కచోట నలవడు నొకచో, విరియు నొకచోటఁ దిరుగున్, దిరుగక యొకచోట రెండుదెఱఁగులుఁ నొచ్చున్." భార. భీష్మ. ౨, ఆ. ౧౭౩; 5. కుదురుపడు. "క. బలరిపుఁ డిచ్చిన కుండల, ములు నుష్ణీషంబుఁ జిత్తమున భక్తిమెయిం, దలఁపనవి వచ్చె నెండ్రుక లలవడఁగాఁ బాచి,ముడిచె నమర దృఢముగన్." భార. విరా. ౪, ఆ. ౧౬౪; 6. ఒప్పు. "క. దడములఁ గొల్వఁగ ధర్మం, బడరఁగ దశరథుఁడు రాజ్యమలవడఁ జేసెన్." రా. బాల. ౭౮౨.

అలవరి. దే. వి. అలంగము, వప్రము. "సీ. అలంగం బన నలవరి నా వప్రమగును." ఆం. భా. ద్వి. పు. ౧౨.

అలవరించు. ద్వి. (అలవడు ప్రే.అలవడఁజేసికొను,)1. అబ్బునట్లు చేసికొను. "సీ. శాస్త్రముల నెల్లఁ దగిన భంగి,నలవరించి మున్న యధ్యయనంబునఁ, జొరవు గలిగి." భార. అను. ౪, ఆ. ౧౨౪; 2. అలంకరించు. "స్త్రీవలెనె యలవరించి." క్షేత్రయ. పు. ౧౦౭; 3 వహించు, పూను. "సీ. జపహోమదాన సంస్కారపూర్వకముగా నధ్వరవ్రతదీక్ష యలవరించి." జై. 3, ఆ. ౧౨౦; 4. సవరించు, దిద్దు. "సీ. ఒక్కింత సడలినయుత్తంసదామకం బభినవంబుగ మాళి నలవరించి." హరి. పూ. ౫, ఆ.౯; 5. సిద్ధపఱచు. "గీ. అలవరించి చతుర్విధాహారములను, దుష్టిచేసి." ఉ. హరి. ౪, ఆ. ౧౧౫. "సీ. స్రుక్స్రువోలూఖలజుహూవ్రలు మొదలైన యజ్ఞసంభారంబులలవరించి." జై. భా. ౮, ఆ. ౧౭౭.; 6. వశపఱచుకొను, స్వాధీనపఱచు. "వ. పాండవులకుఁ బిత్ర్యధనంబగు రాజ్యంబు గపటద్యూతంబున దుర్యోధనుం డపహరించుటయుఁ నది వీరలు దిగ్విజయంబు చేసి యలవరించికొన్న పదంబగుటయు." భార.ఉద్యో. ౧, ఆ. ౧౨; 7. గ్రహించు, పట్టుకొను. "వ. గాండీవంబుఁ బుచ్చికొని యెక్కుపెట్టి ముష్టి నలవరించి గుణధ్వని సేసిన." భార. విరా. ౪, ఆ. ౧౬౮. "సీ. ఏకాదశ, శాస్త్రంబు లొకముష్టి నలవరించి." భార. ద్రో. ౫, ఆ. ౧౭౫; 8. ఒప్పించు "ఆ. ఇంత దలరసేల యెప్పెయినైనను, గొమ్మ నలవరించి కూర్చుటయుచె, యుమ్మలంబు దక్కియాఱటతోడ నీ,వేఁగు మసల వలపదింకనిచట. భా. విరా. ౨, ఆ. ౮౦.

అలవఱచు. స. క్రి. (అలవడు. ప్రే. అలవడఁజేయు) = అలవరించు. "క. అరిత్వము దొలఁగి మైత్రి యలవఱుపుమనిన్." భార. శాం. 3, ఆ. ౨౦౫. ఇట పూను అని యర్థము.

అలవర్చు. = అలవఱుచు.

అలవాటు. ద్వి. వి. 1. అభ్యాసము; 2. సిద్ధి. "తే. ఎట్టికృత్యంబు మేలో యే నెద్దిసేసి, కృశపరాయణధర్మతాస్థితి వహింతు,నొక్కొ యని చింతఁ బొందుచునుండునాత్మ నిష్ఠయలవాటు గాంక్షించి నృపవరేణ్య" శశాం. ౪,ఆ. ౫౪౭.—విణ. అలవరిచినది, సిద్ధము. "చ. గరుడుని డిగ్గి పీడొక్కలివి కంసవిరోధిపురంబులోపలం, దిర పడి దారుకుంబనిచి తేరలవాటుగఁ దేరనెక్కి, సం, గరకుతుకంబుతో వెడలె". ఉ, హరి. 3, ఆ. ౯౧. "సీ. అవనిజ దేవోపహారఫలంబులు చెలువార నలవాటు సేయు చోట."రా. అయో. ౭౯౨.

అలవాలము. = ఆలవాలము.

అలవి. దే. వి. (అలవు.) కొలఁది, పరిమితి. "క. వృత్రుసునబాహుబలంబలవికిమీఱెను." భార.

ఉద్యో.౧,ఆ.౧౨౫.—విణ. శక్యము. "క. బలహీనుఁడైనవానికి, నలవియె మోపెట్టి తివియనక్కార్ముకమున్." భార. ఆది. ౭, ఆ. ౨౩౪.

అలవు. దే. వి. 1. అభ్యాసము, మరలమరలఁ జేయుట. "తే. మాపటిఁ డల్లనల్లన మదగజంబు, నిచ్చలోఁగూడ నోజకుఁ బెచ్చువట్లు, యోగ విద్యాపరుండును నొయ్యనొయ్య, నలవుతోఁ గూడఁ బవనంబు నాఁగవలయు." మార్క. ౩, ఆ. ౩౧౪; 2. బలము; "చ. ...పోటరులైన భర్తలే, వురుగలరంటి వారియలవుం జలముం దగఁ గంటి నింక నెవ్వరు గలరు" భార. విరా. ౨, ఆ. ౨౫౭. "క. బలభద్రుని భరియింపఁగ, నలవుచెడి ప్రలంబదైత్యుఁ డయ్యెడ ధరణిం, దలమునకు వచ్చె" హ. పు. ౭, ఆ. ౨౦౯; 3. శ్రమము, మార్గాయాసము. "క. తురగమును నీరు జలజా, కరమునఁ ద్రావించి తానికచ పుష్పఫలో, త్కర భరవినమ్రచూతాం, తరమరకతవేదె నలవునం బవళింపన్." జై. ౧,ఆ. ౭౧; 4. అలుఁగు, ఖడ్గము. "సీ. పెదులు గంటుల దూఱు భిండివాలంబులు, గ్రమమునవిడు నౌషధములుగాఁగ, నలవులెన్ని గొనిన నప్పటి కప్పటి కలవుబలముఁ జలము నగ్గలింప, నుభయ బలములందు సుభటోత్తములు పోరిరి." కు. సం. ౧౧. ఆ. ౧౨౩. "క. విఱిగిన యలవులతునియలు, మెఱచుచు దివి కెగయఁ దొడఁగె." కు. సం. ౧౧, ఆ. ౧౬౯.

అలవోక. ద్వ. వి. (అల+పోక.) 1. యదృచ్ఛ, అప్రయత్నము. "తే.పొందినారదమునియలవోక నచటి, కరుగుదెంచిన..." భార. శాం. ౬, ఆ. ౧౨౭. "వ. మదాశయుండనువాఁడు రూపానుభూతియను భార్యయుం దానును ధీరభావుండను మంత్రితోడ నలవోకనటుపోలసినమాత్రఁగళాపూర్ణుండాధీరభావుని దనధనుర్విలాసంబునం బలాయనంబ నొందించి మదాయునతని భార్యతోడఁ గూడ నొక్కించుక ప్రవర్తించె" కళా. ౫, ఆ. ౪౦; 2. లీల, విలాసము. "సీ. కెంౙాయరంజిల్లులోచనములలర, నాజగన్నాథుల నలవోకపోలెఁగ,న్గొని దక్షిణమునకుఁజన." భార. ద్రోణ. ౨, ఆ. ౧౬౬. "సీ. నీకతంబునఁగాదె కాకోలవిషవహ్నినలవోకయునుబోలె నార్పఁగలిగె." కాశీ. ౬, ఆ. ౯౬; 3. అశ్రద్ధ; "చ. అనిమిషనాథుతోడి యని యప్పుడు గంటిననంతు నాద్యువిష్ణుని నలవోకఁదన్మహిమ సువ్రతనాకెఱేఁగింపు." భార. శాం. ౫, ఆ. ౪౦౬; 4. నిర్లక్ష్యము. "వ. అనాదరంబుదెల్పుచు నలవోకగా దిగీశసందేశం బాకర్ణించి." నై. ౪, ఆ. ౯.

అలస. సం. వి. ఆ. స్త్రీ. అల్లుడుతీఁగ⚘.

అలసము. సం. అ. పుం. వి. 1. వృక్షవిశేషము హంసపదీలత ⚘; 2. పాదరోగవిశేషము, బోదకాలు.—విణ. (అ. ఆ.అ.) సోమరి, మందము. దీని తర్వాతవలె, బలె, పోలె మొదలగునవి చేర్చుటయుఁగలదు.

అలసందియలు. వై. వి. బ. కాయధాన్యవిశేషము, బొబ్బరలు. "తే. శ్రాద్ధకర్మంబునందు వర్జ్యములు వినుము, పెండలంబును దోస పలాండు వుల్లి,యానుగమ్మింగువలసందియలు విచార, సారప్రత్యక్ష లవణ మసూరములును." మార్కం. ౩,ఆ.౨౦౩.

అలసందెలు. వై. = అలసందియలు.

అలసట. దే. వి. అలయుట, అలపు, ఆయాసము.

అలసత. సం. వి. ఆ. స్త్రీ. అలసభావము, సోమరితనము.

అలసపడు. అ. క్రి. మందమగు. "సీ. కటకారవములకుఁగాళ్ల వ్రేళ్లఁబెనంగునంచలచే నడయలసపడఁగ." దశా. ౨, ౩౦౬.

అలసాంద్రము. సం. వి. అ. పుం. అలసందెలు.

అలసు. దే. వి. తిరస్కారము (వాడుక.)

అలసుఁడు. సం. వి. అ. పుం. ఓపికయుండియుఁ బని చేయనివాఁడు, సోమరి.—విణ. చూ. అలసము.

అలసురాలు. మి. వి. మందురాలు, సోమరియగు స్త్రీ.

అలా. వై. అవ్య. = అల "క. సెలవుల, లాలలు దొరఁగంగ నన్నలాయని యొఱలున్." ఉ,హరి. ౪, ఆ. ౩౦౨.

అలాతము. సం. వి. అ. న. కొఱకచ్చు, ఉల్ముకము, కొఱవి.

అలాబువు. సం. వి. ఉ. ఊ. స్త్రీ. సొర, తుంబి⚘.

అలాయిదా. హిం. క్రి. విణ. ప్రత్యేకము, వేఱుగా.

అలి. సం=అళి.

అలింజరము. సం. వి. అ. న. పెద్దబాన.

అలికము. సం. వి. అ. న. లలాటము, నొసలు.

అలికిడి. దే. వి. చప్పుడు, ధ్వని.

అలిపి. వై. వి. 1. పచ్ఛాదనము, అడవి; 2. తెల్ల తెగడ. ✿

అలిపిరిది. వై. విణ. 1. పలుచనిది; 2. బక్కది.— వి. సన్ననూలువడుకు సాధనము.

అలిపిరి. వై. విణ. 1. అల్పశరీరముగలవాఁడు, దుర్బలుఁడు; 2. మందము, మెల్లనిది. "ద్వి. చల్లనై మెల్లనై సౌరభశ్రీలు నల్లనల్లనవీచె నలిపిరిగాలి. ద్వి. భా. ౨. ౨౪.

అలిప్రియము. విణ. (అ. ఆ. అ.) తుమ్మెదలకు ఇష్టమైనది.—సం. వి. అ. న. 1. ఎఱ్ఱకలువ✿; 2. పాటల✿.

అలిమకము. సం. వి. అ. పుం. 1. కప్ప; 2. కోయిల; 3. తుమ్మెద; 4. ఇప్ప✿; 5. అకరువు, (తామరదుద్దు లోనగువానిచుట్టు నుండునది.) పద్మకేసరము.

అలియు.=అలయు.

అలివేణి. సం. వి. ఈ. స్త్రీ. 1. తుమ్మెదవంటి వెండ్రుకలుకలస్త్రీ; 2. ఆఁడుది.

అలీకము. సం. = అళీకము.

అలుకుగుడ్డ. దే. = అలుకుఁజేట్ట.

అలుఁగు. దే. వి. 1. ఖడ్గము. "ద్వి. మాఘశుక్లబిదుద, మనుచు దగ్గఱుడు వాఁడలుఁగు వెర్కొనను"బస. ౫, ఆ. ౧౪౪-పు; "వలదని వారింప నలుఁగు వెఱికినఁదల ద్రుంచివైచితి" బస. ౫, ఆ. ౧౪౬-పు; 2. బాణముల చివురనుండు సుక్కుముక్కు, ఫలము. "క. తనువున విఱిగిన యలుఁగుల, నను వునఁ బుచ్చంగవచ్చు." భార. ఉద్యో.౨,ఆ.౬౨; 3. ఆయుధము. "సీ. వాఁడిముమ్మొనముల వేఁడి యలుఁగు." పాండు ౧. ఆ. ౧౦౧; 4. చెఱువు నిండిపోయినపుడు నీళ్లు పయికిపోవుటకు పెట్టిన గండిదారి, పరీవాహము.

అలుక. దే. వి. 1. కోపము. "చ. అలుకఁదుపార శైలసుతయవ్వలిమోమయి." హర. ౪. ఆ, ౩౪; 2. ద్రోహచింత. "చ. ధరణిపుఁ డెందునేఁ దగదు తాఁజన నూఱట కొక్కనింపగుం,డొర నొనరించి పంప నరిదుర్బలుచేఁజెడఁ డాతఁ డర్థభూ, కరితురగర్థి లేక కొఱగాఁడటునేయ ద్విజాన్యుఁడల్కకున్, నెరవగు, నాతఁడున్ వలయు నిండినదుర్గబలోర్వియాఁదగున్. ఆము. ఆ. ౪, ౨౫౫. రూ. అల్క.—విణ. "సీ. పురుషున కెందును నిరతంబు మిక్కిలి తేజంబు కర్మంబు దీనివిడిచి. అ. వె. అలుకగాఁడె పురుషుఁడు....."భార. సభా.౨,ఆ. ౨౯౨. "క. అలుకఁదనంబున విప్రున,కలుగఁగాఁదగదు" భార. ఉద్యో. ౪, ఆ. ౩౧౨.

అలుకు. దే. అ. క్రి. 1. భయపడు; 2. జంకు; 3. వెనుదీయు. "తే. ఈతఁ డింతకు మీకుఁ దన్నెఱుఁగఁ జెప్ప,వలవ దని నియమించినఁ జెలియఁబలుక, నలికిరియొక దేవసన్నిభుం డంటిఁగాని, నిన్ను నంత యుంఁదాఁగదా నిర్వహించె." భార. విరా. ౫, ఆ. ౩౩౫.—స. క్రి. 1. ఇల్లులోనగువానినలఁకు గుడ్డతో కలయరాచు, సమ్మార్జనముచేయు; 2. చల్లు; "తే. హర్మ్యములనుండి పణ్యపుణ్యాంగనాని, కరము లక్షతయుత మౌక్తికములనేస, లలుకఁ గల్పలతానిచయములు పుష్ప, వృష్టి పెల్లుగఁ గురిసినవిధము దోఁచె." భార. శాంతి. ౧, ఆ. ౩౫౫. "ద్వి. వీఁకతో నలికినవిత్తులు నీళ్ల, విదళించికొని తెచ్చి." బస. ౪, ఆ. ౧౩-పు; "ద్వి. శివపాదజలములు శిరమునఁదాల్చి, భవుల కాళులనీళ్లు వైనల్కుఁదగునె" బస. ౭, ఆ. ౨౩౭-పు.—వి. 1. భయము; 2. జంకు, వెనుదీయుట. రూ. అల్కు.

అలుకుఁజేట్ట. దే. వి. (అలుకు+చేట్ట.) అలుకుట కుపయోగించు ప్రాతగుడ్డలోనగునది.

అలుకుడు. దే. వి. అలికిడి, ధ్వని. చప్పుడు. "చ. దర్పక పంపుబలంబులోనియల్కుడు కరణిం జెలంగె ... తద్విరావముల్." భార. ఉద్యో. ౨, ఆ. ౧౧౧.

అలుకువ. దే. వి. కోపము. "అలుకువతగ్గె." చంద్రా. ౪, ఆ. ౧౮౦.

అలుగు. దే.అ.క్రి. 1. కోపమునొందు. "క. నీవలిగిన నడ్డమె పురహరాజకేశవులైనన్." భార.ఆది. ౪. ౧౮౫. "ఉ. ఇంతకునేల యేను భుజగేశ్వరు రాకయవార్చినాఁడ నా, కంతవువంతకుంగుడువ

నాఁకలి నీళ్లలుద్రాపఁ దృష్ణ యొక్కింతయు లేదుగా కలిగియే యటపీష్టలి కేఁగుచెంచి" భార. శాంతి. ౬, ఆ. ౧౯౬; **2.** ద్రోహముచేయఁ దలఁచు. "క. తనయునికంటెను నను న,మ్మను జేంద్రుఁడు కరముసెమ్మి మన్నించు మనం, బున నట్టి యగ్రజన్ముని, యనుపమరాజ్యమున కలుగనగునే నాకున్." మార్క. ౮, ఆ. ౭3. (రూ. అల్గు.)

అలుగుల. దే. = అగులము.

అలుఁగులపడు. ద్వి. అ. క్రి. (అలుఁగుల+పడు.) **1.** నలఁగుడుపడు. "వ. ఒండొరుల యలుఁగు లలుగులపడ ప్రేసియు." ఉ, హరి. 3, ఆ. ౨2; **2.** బాధపడు. "క. అలుగులపడి ఖాండవమునఁ, గలయాశీవిషమహోరగములెల్ల విషాగ్నులు గ్రక్కుచు" భార. ఆది. ౮, ఆ. ౨౬2. "క. తలకంటగించుచుండఁగ, బలిమిని సౌషధరసంబు పానము సేయక్, దలకొనురోగార్తుని క్రియ, నల మటతో బెరయు తెగువ నలుఁగులపడుచున్." నిర్వ. ౧౦, ఆ. ౭౯.

అలుఁగులము. దే. వి. **1.** నలఁగుడు; **2.** బాధ. "చ. అలుగులమంది యందుల మృగావలియున్ విహగంబులున్ భయాకులగతిం బొందె." భార. ఆర. ౧, ఆ. 3౦౧. రూ. అలుఁగుల.

అలుచే. దే. విణ. **1.** దుర్బలుఁడు; **2.** అధముఁడు,అల్పుఁడు. "క. అలుఁచైనను బగతుని దెసఁ, దలఁపుగలఁగవలయుననిన దర్పోజ్జ్వలదో, ర్బలులగుకొంతేయుల మన,మెలమికలిమినచ్చి యిట్టు లేమఱ నగునే." భార. విరా. 3, ఆ. ౧౦౮. సం."నావజ్ఞేయో రిపుస్తాత ప్రాకృతోఽపి బుభూషతా, కిం పునః పాండవాస్తాత సర్వాస్త్రకుశలా రణే."

అలుపము. వై. వి. అల్పకార్యము, అలఁతి. "సీ. ఈవెంద్రుకలు పట్టి యీడ్చినయాచేయి తొలుతగాఁ బోరిలోఁ దున్ప నేను, తనువింతలింతలు తునియలై చెదరి రూపఱియున్నఁ గని యందు కాఱుఁగాక, యలుపాలఁబోనుపడునట్టి చిచ్చే యిది." భార. ఉద్యో. 3, ఆ. ౧౧2.—విణ. అల్పము.

అలువు. దే. అ. క్రి. అలుగు. "చ. వినుము నరేంద్ర విప్రుఁడలిగెన్." భార. శాం. ౧, ఆ. 3౫.—వి. అలుఁగు, పరీవాహము. "సీ. గొంతిమొదలైన కౌరవాంగ,నలు మనంబులు నిండి యలువులఁ బాఱెడు నానందపూరంబు లనఁగఁ బొల్చె." భార. అశ్వ. 3, ఆ. ౧౯౬. "తే. అంతరంగంబు నిండి రెండలుఁవులందు వెడలు" భార. విరా. ౫, ఆ. ౨౪౦.

అలేఖము. సం. వి. అ. న. వ్రాయనిపుస్తకము. —విణ. (అ.ఆ.అ.) **1.** వ్రాఁతలేనిది; **2.** లేఖలు (జాబులు) లేనిది; **3.** దేవతలు లేనిది.

అలౌకికము. సం. విణ. (అ.ఈ.అ.) **1.** లోకసంబంధములేనిది; **2.** లోకానుకూలముగానిది; **3.** వేదమందున్నది. (అలౌకిక ప్రయోగము.)

అల్క. దే. విణ. **1.** అలక, సూక్ష్మము, తేలిక. "ఉ. యుద్ధమునీఁది వేడ్కయు మహోగ్రవిరోధుల నల్కఁజేయుద,రోప్పెద్ధతియున్." భార. ఉద్యో. 3, ఆ. ౫౫. "చుల్కఁజేయు" అని పాఠాంతరము; **2.** అలుక, కోపము. "ఉ... అతఁడూర్జితశక్తి నుద్భటుం,డై నెగసెన్ సమీరసుతు నల్కకు బ్రాఁకిడినట్లు వీఁకతోన్." భార. విరా. ౨, ఆ. 3౫౦.

అల్కన=అలకన.

అల్కా. హిం. విణ. **1.** తేలికైనది; **2.** నీచమైనది.

అల్కు. దే.=అలుకు. **1.** భయపడు. "ఉ. ఇమ్మెయి నల్కెదు నీవు మాకుఁ దాఁ,గయ్యముదక్కి." భార. ఉద్యో. ౧, ఆ. 3౦౪. "...మాకుఁ గాఁ; నుల్కెదుమీకు వారితో" అని పాఠభేదము; **2.** నేల అలుకుగుడ్డతో కలయ రాచు. "చ...కస్తురిచే నరుగల్కె నొక్కపైదలి..." యయా. ౨, ఆ. ౮2.

అల్కుడు. దే. = అలుకుడు.

అల్గు. దే. = అలుగు. "మత్త. ఏమికారణమయ్య పాములకేలయగల్గి తిపీవు." భార. ఆది.౧, ౧౫3.

అల్గోజా. హిం. వి. పిల్లనఁగ్రోవి, ఊఁదువాద్యవిశేషము.

అల్పంపచము. సం. వి. అ. న. వండుకొను చిన్న పాత్ర, కొంచెము ఉడికెడు వంటగిన్నె.

అల్పంపచుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) (కొంచెముగా వండుకొనువాఁడు.) అతిలోభి.

అల్పతనువు. సం. వి. ఉ. పుం. చెంచువాఁడు. —విశే. ఉ. అలిపిరి, దుర్బలుఁడు.

అల్పదృష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. తక్కువయైన చూపు; 2. తక్కువయాలోచన; 3. ఔదార్యము లేకపోవుట—విశే. ఇ. (అల్పదృష్టిగలవాఁడు) 1. చూపు తగ్గినవాఁడు; 2. ఉదారమగు ఆలోచన లేనివాఁడు. హీనయినయాలోచనగలవాఁడు.

అల్పప్రాణము. సం. విశే. (అ.ఆ.అ.) 1. కొంచెము ప్రాణము గలది; 2. కొంచెము బలము గలది, దుర్బలము; 3. (వాక్య) ఉచ్చారణయందు ప్రాణవాయు ప్రయత్నము స్వల్పముగాఁ గలది. (వర్ణము) కచటతపగజడదబలు, యరలవలు, ఙ ఞ ణ న, మలు. అల్పప్రాణములు (వ్యతి. మహాప్రాణములు.)

అల్పబుద్ధి. సం. వి. ఇ. స్త్రీ. 1. తేలికయగుబుద్ధి; 2. ఉదారబుద్ధి లేకుండుట.—విశే. ఇ. 1. తేలికయగు బుద్ధికలవాఁడు; 2. ఉదారబుద్ధిలేనివాఁడు.

అల్పమారిషము. సం. వి. అ. పుం. చిట్టికూర.♆

అల్పము. సం. విశే. (అ.ఆ.అ.) సూక్ష్మము, అలఁతి.

అల్పహార్మ్యము. సం. వి. అ. న. (చిన్న మేడవంటిది) అట్టుక.

అల్పాయువు. సం. వి. స్. తక్కువఆయుర్దాయము; —పుం. మేఁకపోతు.—విశే. స్. అల్పమైన ఆయుర్దాయముగలవాఁడు.

అల్పాల్పము. సం. విశే. (అ. ఆ. అ.) 1. మిక్కిలి స్వల్పమైనది; 2. అతినీచము.

అల్పితము. సం. విశే. (అ. ఆ. అ.) అల్పముగాఁ జేయఁబడినది.

అల్పిరి = అలిపిరి.

అల్పిష్ఠము. సం. విశే. (అ.ఆ.అ.) 1. చాలనల్పము, మిక్కిలి కొంచెము; 2. అతినీచము.

అల్పీయము. సం. విశే. (స్.ఈ.సీ.స్.) అల్పిష్ఠము.

అల్మైరా. హిం. వి. సామాను లుంచుటకై గోడలో నమర్చు పెట్టె.

అల్మారు. హిం = అల్మైరా.

అల్ల. ఉభ. దే. విశే. 1. ప్రసిద్ధిని తెలుపును. "అల్లవాఁడు;" 2. ఎదుట కొంచెము దూరముగా నున్నది. అయ్యది. "తే. మల్లయుద్ధంబు సేయుచు నల్లచోట, నున్నవాఁడు మీసుతుఁడు." భార. ఆది. ౬. ౨౧౪. "తే. ఇరులుఁగవియుచు నేరాళమెట్ట యెదుర, నల్లనల్లన నేతెంచె నల్లమంది, గరిమనాకాశచరులకాకాశవీథి, గడచియెదురుగ వచ్చెనో కాక యనఁగ." వై. ౭, ఆ. ౩౯.—వై. విశే. మందము. అల్లనవ్వు. హరి. ఉ. ౬, ఆ. ౧౧౯.—క్రి. విశే. కొంచెముగా, మందముగా. "అల్లనగుచు" "ఆ. మదభరాభిరామ మృదులయానం బొప్ప, నల్లఁ బొలయుచునులతాంతరములఁ, గరములీలఁగమ్మవిరులు గోయుచు నున్న, పువ్వుఁబోఁడి నొక్కపొలఁతి గనియె." భార. ఆర. ౪, ఆ. ౩౨౧. "తే. అపుడ నింధనానలము నట్టల్లఁ బొందు, వికృతివర్జితయైన నిర్వృతి ...." భార. అశ్వ. ౧, ఆ. ౨౦౫.—సం. వి. ఆ. స్త్రీ. 1. తల్లి; 2. పరదేవత.

అల్లకము. దే. వి. 1. గోఁచి, కౌపీనము; 2. అల్లుట, అల్లిక.

అల్లకల్లోలము. దే. విశే. తాఱుమాఱు, వ్యత్యస్తము.

అల్లట. దే. వి. 1. దుఃఖము; 2. కష్టము. "తే. చోదపల్లట మల్లట...బరఁగుఁగష్టము. ఆం.భా. ౧, ౧౫౦.

అల్లటపెట్టు. దే. స. క్రి. కష్టపెట్టు, శ్రమపఱచు. "ద్వి. అల్లనమాదేఁడులయ్యెనన్నెంత, యల్లటపెట్టెనోయయ్య నేనెఱుఁగ." బస.౧, ఆ. ౧౬—పు. (భల్లా. ౧, భా. అని శ. ర.)

అల్లన. వై. వి. 1. తిన్నన; "వ. దివ్యాస్త్రవేదియగు నాసవ్యసాచి యడగించి యల్లనినగవుతో నిట్లనియె." భార. ద్రోణ. ౧, ఆ. ౩౬౧; 2. మెల్లన. "ఉ. అల్లన యింతి యిట్లనియె నారసి వాసవు కల్మిలేమియుం జెల్లముగా నెఱింగికొని తేఁకువలేకిట వచ్చుటొప్పు." భార. ఉద్యో. ౧, ఆ. ౧౬౫. ఇట కుటిలమని అర్థము చెప్పవలసియున్నది. ఇది వైదానికి వ్యతిరేకము. దీనికి "ప్రహసన్నివమబ్రవీత్" అని మూలము. "ఆ. మాటపొందెఱింగి యోటమై నల్లన, చేరి" భార. ఉద్యో. ౧, ఆ. ౨౧.

అల్లవి. దే. విశే. మెల్లనిది.

అల్లది. దే. విశ. (అల్ల+అది) **1.** కొంచెముదూరములో కనఁబడునది; **2.** వెనుకఁజెప్పినది.

అల్లనల్లన. దే. క్రి. విశ. ద్వి. (అల్లన+అల్లన.) మెల్లమెల్లగా. "తే. ఇరులు గవియుచునేరాళ, మెట్టయెమర నల్లనల్లన నేతెంచె." నై. ౪, ఆ. ౩౮.

అల్లము. వై. వి. కారసుగల యొకానొకదుంప, (దీనిలో నీరు ఇగురించిన సొంటి యగును) ఆర్ద్రకము.

అల్లరి. దే. వి. **1.** తప్పు బయలుపడుట; **2.** నింద; **3.** కోలాహలము, రచ్చ.—విశ. **1.** దోషము వలన ప్రకటనమైనది; **2.** నిందపడినది.

అల్లలనాడు. ద్వ. అ. క్రి. (అల్లన+అల్లన+ఆడు.) మిక్కిలి చలించు. "లేనడుమల్లలనాడ." స్వా. ౨, ఆ. ౨౮.

అల్లలాడు. ద్వ. అ. క్రి. (అల్ల+అల్ల+ఆడు.) మిక్కిలి చలించు.

అల్లల్లాడు = అల్లలాడు.

అల్లాటము. ద్వ. వి. అల్లాడుట.

అల్లాడు. ద్వ. అ. క్రి. (అల్ల+ఆడు.) **1.** చలించు. "అవనీచక్రము పాదఘాతమున నల్లాడంగ." భార. ఆది. ౬, ఆ. ౧౭౪; **2.** తిరుగు; **3.** తహతహపడు; **4.** బాధనొందు.

అల్లారుచే. ద్వ. ప్రే. అల్లాడఁజేయు.

అల్లారుపు. వి. (అల్లార్చుట) **1.** విక్షేపణము, ఆడించుట. "వాలంబునల్లార్పుల్ గాడ్పులరేఁచ." రామా. ౬. ఆ. ౨౦౬; **2.** అవయవముల కదలిక; **3.** చలనము; **4.** తిరుగుట.

అల్లారుబెల్లము. ద్వ. విశ. (అల్ల+ఆరు+బెల్లము) మిక్కిలి ప్రియము. "గీ. ఎల్లిబంధువులకు నల్లారుబెల్లమై." కళా. ౬, ఆ. ౧౭౪.

అల్లారుముద్దు. ద్వ. విశ. మిక్కిలి మనోహరము, గారాబమయినది. "మ. అనుఁగుంగ్రీడలనెల్లివారలకు నిట్లల్లారుముద్దైనకూఁతునకున్." వసు. ౩, ఆ. ౩౨.

అల్లార్చు. ద్వ. = అల్లారుచు.

అల్లార్పు. ద్వ. = అల్లారుపు.

అల్లి. దే. వి. **1.** కలువవంటి యొకనీటిపువ్వు; **2.** ఒకానొకచెట్టు; **3.** బాలక్రీడావిశేషము. "సీ. చిఱుగు దువ్వలపోటి చెండుకట్టినబోది యల్లి యుప్పనఁబట్టె యప్పళాలు." కాళ. ౩, ఆ. ౩౩.; **4.** అల్లిక; **5.** చల్లనిది. "అల్లితెమ్మెరలు."

అల్లిక. దే. వి. **1.** (చాప, జడ మొ.)అల్లుట, అనికి; **2.** పదములకూర్పు. "ఆ. అల్లసానివాని యల్లికజిగిబిగి, ముద్దుతిమ్మనార్యు ముద్దుపలుకు."

అల్లికబిల్లిక. దే. = అల్లిబిల్లి.

అల్లితెమ్మెరలు. దే. వి. చల్లగాలి.

అల్లిబిల్లి. దే. వి. **1.** పెనఁకువ. "సీ. అల్లిబిల్లియనంగ నలరుఁ బెనంకువ." అం.భా. ౩,౨౮; **2.** ఒద్దిక, కలసిమెలసి యుండుట. "తే. అరిగి తనకూర్మి చెలువతో నల్లిబిల్లి, యగుచు నెప్పటియట్ల నెయ్యమున నుండె." పర. ౩, ఆ. ౨౭౪.

అల్లిబిల్లిగొను. దే. అ. క్రి. అల్లిగొనియుండు, పెనఁగొను. "మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొనుకాంతారంబునందు." స్వా. ౨, ఆ. ౨౨.

అల్లియ. దే. వి. వింటినారి, మౌర్వి. రూ. అల్లె.

అల్లియము. దే. వి. **1.** అల్లుఁడగుట, అల్లునివరుస; **2.** మనుగుడుపు, పెండ్లియయినతర్వాత అల్లునికి నత్తవారు చేసెడివిందు. రూ. అల్లెము.

అల్లు. దే. అ. క్రి. (తీగ) ప్రాఁకు.—స. క్రి. (చాప మొ.)అల్లికవేయు. "బుట్టలు అల్లుచున్నాఁడు;" **2.** కూర్చు. 'కవి పద్యాలు అల్లుచున్నాఁడు.'

అల్లుఁగుఱ్ఱ. దే. వి. (అల్లు+గుఱ్ఱ) అల్లుఁడు. (ఇది తమ్ముఁగుఱ్ఱవంటిది) "క. గతి నీవు నాకు మత్స్యం, తతికిని నీయల్లుఁగుఱ్ఱతనయుఁడు పుట్టెన్." భార. అశ్వ. ౩, ఆ. ౧౬౮.

అల్లుఁడు. దే. వి. (ఇతరవంశముతో సంబంధమును అల్లువాఁడు) బ. అల్లురు. **1.** కూఁతుమగఁడు, జామాత; **2.** భాగినేయుఁడు, మేనల్లుఁడు. "ఆ. వాసుదేవుతోడి యీసువాఁడల్లుర, విడిచె నిన్నుఁ గూడి విక్రమమునఁ, బేరుకొనఁగఁజాలు." భార. ఉద్యో. ౪, ఆ. ౨౨౧; **3.** విటుఁడు. (చూ. అల్లుతండము.

అల్లుఁడుకొమాళ్లు. ద్వ. వి. బ. (అల్లుఁడు+కొమారుఁడు.) కొంచెము ఇంచుమించుగా దొరతో

సమమైన వేషమును భోజనమును గలిగి దొరకు అంగరక్షకుఁడుగా నుండువాఁడు; బ్రా. శ. ర.

అల్లుడు. దే. వి. = అల్లుట.

అల్లుతండము. మి. వి. విటసమూహము. "తే. పండువులు శోభనంబులు బహువిధంబులైన నోములు సమకట్టు జానుమిాఱి, యల్లుతండంబుచే ధనమెల్లఁ గొనుచు, మెలఁగుటలు వారసతులతల్లులకుఁ బనులు." దశ. ౫, ఆ. ౧౭.

అల్లుఁడనము. దే. వి. అల్లుఁడగుట, జామాతృత్వము. "తే. అసురపతి యొల్లఁ డాతనియల్లుఁడనము, పురమిథనియాజ్ఞ లే కెట్లు చొరఁగరాదు." ప్రభా. ౪, ఆ. ౫౨.

అల్లుబచ్చేలి. దే. వి. అల్లుకొనెడిబచ్చలి, తీఁగబచ్చలి ✿.

అల్లువాఁడు. దే. = అల్లుఁడు. "తే. పేదలయ్యును గడుబిఱ్ఱబిగిసి యఁండ్రు, పట్టి యభిమానములను గర్వములఁబట్టి,యల్లు వానికి నెల్లనీ యవగుణంబు, వెన్నతోఁ బెట్టినది యింత విసువనేల." కాశీ. ౭, ఆ. ౫౦. "చ. వలిమలయల్లువాఁడు తలవాఁకధరించినపూవుగుత్తి." పారి. పీఠిక. ౬.

అల్లె. దే. = అల్లియ.

అల్లెదమ్ము. దే. వి. మత్స్యవిశేషము. "తే. అల్లెదమ్ము ప్వఁజేఁపయు గొల్లదొంఁదు." హంస. ౪, ఆ. ౧౮౭.

అల్లెము. దే. వి. = అల్లియము. "లే. అల్లెమనఁగను ...జామాతృతాఖ్య." ఆం.భా. ౨. ౧౧౧.

అల్లొనేరెడు. దే. వి. 1. రాజజంబువు✿; 2. జంబువు✿. "సీ. హాలాహలంబను నల్లొనేరెడుఁబండు మిసిమింతుఁడునుగాక మ్రింగినాఁడు." భీ. ౧, ఆ. ౧౧౧; 3. పాటలలోనివిశేషము. "శా. నీకేవచ్చు సువాలయుంగ్ ధవళమింతీ యల్లొనేరెళ్ళు గౌరీకల్యాణములంచు." పాంచా. ౪, ఆ. ౨౪; 4. నమస్కారము. (రూ. అల్లొనేరేడు, అల్లోనేరెడు, అల్లోనేరేడు.)

అల్లొనేరేడు. దే. = అల్లొనేరెడు.

అల్లోనేరెడు. దే. =అల్లొనేరెడు. (పాటలలోనివిశేషమునకు) "శా. లావణ్యవతీవితానములు సౌహార్దంబునం బొంగఁగా, నల్లోనేరెడు వాడుచుం జనఁగ రంభాద్యప్సరోభామినుల్." కకు. ౪, ఆ. ౩.

అల్లోనేరేడు. దే. వి. =అల్లొనేరెడు. (రాజజంబువు). "క. ఎల్లెడయుంజేఁకటిచే, నల్లనయయి తోడిమపట్టునాఁ దూర్పునఁ బొ, ల్చిల్లెడు చిఱుగెంపున నభ, మల్లోనేరేడుఁబంటియాకృతిఁ జూపెన్." కవిక. ౪, ఆ. ౧౨౩; (బాలక్రీడావిశేషము) "క. ఎల్లసుఖంబులఁ జేకొనఁ, జెల్లుట యౌవనమునందచిక్కినమఱిపొ, టిల్లునె వెన్నెలదినముల, నల్లోనేరేళ్లుగాక యావలఁగలవే." రా.సుం, కాం. ౧౮౧.

అల్వరించు. ద్వ.=అలవరించు. (అలవాటుచేసికొను) "సీ. ప్రేళులుగ అవంగ వెర నల్వరించిరో నోరఁజేతులు గ్రుక్కినొల్లనాఁడ." సర్వ. ౧, ఆ. ౪౦.

అవ. ఉభ. వై. వి.=అవ్వ. దే. అప. పూరణార్థమును తెలుపును. పదియవది. మొ. దీనికి మూలరూపము. 'అవు' అనునది.—సం. ఉప. ఈక్రింది యర్థములను సూచించును:— 1. వ్యతిరేకము: "అవమానము" "అవగుణము" "అపగణనము;" 2. అల్పత్వము: "అవహననము;" 3. నిశ్చయము: "అవధారణము" "అపధానము" కొన్నిచోట్ల 'అవ' లో 'అ' లోపించుటయుఁ గలదు. "అవధానము. వధానము."

అవంతి. సం. వి. ఇ.పుం. మాలవదేశము.—వి. ఈ. స్త్రీ. 1. పట్టణవిశేషము, ఉజ్జయిని, సప్తపుణ్యక్షేత్రములలో నొకటి "అయోధ్యా మధురా మాయాకాశీకాంచి రవంతికా,పురీద్వారవతీ చైవ సప్తైతా మోక్షదాయికాః" కాశీ కాంచీ అవంతికా అని పాఠభేదము; 2. అక్క.

అవంతిక. సం. వి. ఆ. స్త్రీ. అవంతి, ఉజ్జయిని.

అవంతీసోమము. సం. వి. అ. న. ధాన్యామ్లము, కలి, బియ్యపుకడుగు.

అవంధ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. గొడ్రాలుకాని యాఁడుది; 2. గొడ్డువోనియావు; 3. కర్కోటకి ✿.

అవంధ్యము. సం. విశే. (అ. ఆ. అ.) వంధ్యముకానిది, సఫలమైనది. "అవంధ్యవృక్షము. = గొడ్డువోక ఫలించెడుచెట్టు." "అవంధ్యయత్నము =వ్యర్థముకాక సఫలమైన ప్రయత్నము."

అవకటము. సం. వి. అ. పుం. అర్థదోషములలో నొకటి.—విణ. (అ. ఆ. అ.) 1. విరుద్ధము; 2. భిన్నము, హీనము.

అవకటవక. దే. విణ. సందర్భములేనిది, సందర్భము మాలినది. "అవకటవక సంభాషణ."

అవకరము. సం. వి. అ. పుం. 1. చీఁపురుకట్టతోఁ జిమ్మి చేర్చిన దుమ్ము, కుప్ప; 2. చెడుపని, దుష్టకార్యము. "సీ. ఆత్మలోన, నవకరములెన్ని యన్నియు నాచరించె." శివరా. ౪, ఆ. ౬౭; 3. దోషము, పాపము. "వ. గురునియోగంబున నందఱు నన్నిముఖంబులకుం జని యేయవకరంబునుం బొడఁగానక." కాశీ. ౭, ఆ. ౧౪౪; 4. లోపము.

అవకర్ణించు. సం. స. క్రి. పెడచెవినిఁబెట్టు, నిర్లక్ష్యము చేయు. "వ. అనిన వానివచనం బవకర్ణించి రాజపుయుక్తులయి." భార. ఆది. ౨, ఆ. ౨౧౧. "ద్రోణుపలుకు లవకర్ణించి కర్ణుం డిట్లనియె." భార. ఆది. ౧, ఆ. 3౭. ఈరెండు చోట్ల 'ఆకర్ణించు' అని పాఠము కలదు 'ఆకర్ణించు' అనియు అర్థము చెప్పవచ్చును.

అవకర్షణము. సం. వి. అ. న. 1. వెడలించుట; 2. బలాత్కారముగా ఉన్నచోటునుండి వెడలఁగొట్టుట; 3. బలాత్కారముగా లాగుట; 4. లాగుట.

అవకలితము. సం. విణ. (అ. ఆ. అ) 1. చూడఁబడినది; 2. తెలిసికొనఁబడినది; 3. గ్రహింపఁబడినది.

అవకాశము. సం. వి. అ. పుం. (నడుమనుండు దేశము లేక కాలము) 1. పనికిని బనికిని మధ్యకాలము; 2. స్థలమునకు స్థలమునకు మధ్యభాగము; 3. స్థలము, చోటు; 4. వీలు, ప్రతిబంధములు లేమి.

అవకీర్ణము. సం. వి. అ. పుం. బ్రహ్మచర్యవ్రతభంగము, బ్రహ్మచర్యము చెడుట.—విణ. 1. చిమ్మఁబడినది; 2. వ్యాపించినది; 3. చూర్ణము చేయఁబడినది.

అవకీర్ణి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) బ్రహ్మచర్యవ్రతము చెఱుపు స్త్రీసంగము చేసినవాఁడు, బ్రహ్మచర్యవ్రతమునుండి భ్రష్టుఁడయినవాఁడు.

అవకుంఠనము. సం. వి. అ. న. 1. చుట్టువాఱుకొనుట, నలువైపులఁ గ్రమ్ముట; 2. మేలి ముసుఁగు.

అవకుంఠితము. సం. విణ. (అ.ఆ.అ.) చుట్టఁబడినది, నలువైపులఁ గ్రమ్మఁబడినది.

అవకృష్టము. సం. విణ. (అ.ఆ.అ.) 1. నిష్కాసితము, వెడలింపఁబడినది, తొలఁగింపఁబడినది; 2. దూరీకృతము; 3. నీచము; 4. తుడువఁబడినది.

అవకృష్టుఁడు. సం. వి. అ. పుం. 1. ఇల్లు మొదలగునవి తుడిచి జీవించుదాసుఁడు; 2. నీళ్లు మోయు వాఁడు.—విణ. చూ. అవకృష్టము.

అవకేశి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) 1. గొడ్డుపోయినది; (చెట్టు); 2. తక్కువ వెండ్రుకలు గల వాఁడు.

అవక్రము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వంకర కానిది; 2. క్రూరముకానిది; 3. కుటిలము కానిది; 4. అడ్డులేనిది, అప్రతిహతము. "అవక్ర పరాక్రమము."

అవక్రయము. సం. వి. అ. పుం. 1. బాడిగ, అద్దె; 2. వెల; 3. పన్ను.

అవక్షయము. సం. వి. అ. పుం. 1. నాశమునకు సిద్ధమైన అవస్థ; 2. నాశము.

అవక్షిప్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నిరసింపఁబడినది, త్రోయఁబడినది; 2. చిమ్మఁబడినది.

అవక్షేపణము. సం. వి. అ. న. = అవక్షేపము.

అవక్షేపము. సం. వి. అ. పుం. 1. నిరసించుట, త్రోయుట; 2. చిమ్ముట.

అవఖాతము. సం. వి. అ. పుం. లోఁతైనగొయ్యి.

అవగండము. సం. వి. అ. పుం. గండస్థలమున బయలు దేఱుబొటిమ, పోత్రపుబొటిమ, వరండము.

అవగడము. వై. వి. (క. అవగడ.) 1. అగడము, అకార్యము, చేయఁగూడనిపని; 2. కష్టస్థితి, కష్టము. "ఆ. అనుచుఁ జిలుకపలుక నా ప్రభావతి యిట్టి,యవగడంబు మాన్పనదియెఱుంగు." శుక. ౨, ఆ. ౨౧౧; 3. ప్రమాదము. "క. మణిధరనామకుఁడగునొక, ఫణివరుఁ డవగడము కతనఁ బడియున్నదిలో..." శుక. 3, ఆ. 3౨౪; 4. అసంభవము, అసాధ్యత.—విణ. 1. దుష్టము.

"సీ. పైచేయఁగలిగెనే ప్రహ్లాదుని హిరణ్యకశిపుచే నగు నవగడపుఁబనులు." వి.ప్ర. ౪, ఆ. ౪౯; 2. అసాధ్యము; 3. కష్టమయినది.

అవగణన. సం. వి. ఆ. స్త్రీ. 1. తిరస్కారము, తెగడిక; 2. అనాదరము; 3. నిరసనము.

అవగణనము. సం. వి. అ. న. = అవగణన. (అనాదరము.) "క. పలుకవొకింతయు నాతోఁ, జిలుకవు కరుణామృతంబు చినుకొకటియు లోఁ,నులుకవు నాదగుదైన్యపుఁ, బలుకవగణనమున వినుచుఁ బద్మదళాక్షీ." ప్రభా. ౫, ఆ. ౧౩౩.

అవగణనీయుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) 1. లెక్కపెట్టఁదగనివాఁడు; 2. నిరసింపఁదగినవాఁడు; 3. తిరస్కరింపఁదగినవాఁడు.

అవగణితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. తిరస్కరింపఁబడినది; 2. నిరసింపఁబడినది; 3. అనాదరము చేయఁబడినది.

అవగణితవ్యుఁడు. సం.=అవగణనీయుఁడు.

అవగణ్యుఁడు. సం. = అవగణనీయుఁడు.

అవగతము. సం.—విశే. (అ.ఆ.అ.) 1. తెలియఁబడినది; 2. పొందఁబడినది. (జ్ఞానము.)—వి. అ.న. 1. తెలియుట. "క. అవి వినఁగ నెఱుఁగఁజేయను, నవుపరమబ్రహ్మబోధ మమరులకు ముని,ప్రవరులకును దుర్లభ మ,య్యవగతము జనార్దనునక యలజడి యుండున్." భార. శాం. ౪, ఆ. ౨౬౪; 2. అవగతి, పొందుట.

అవగతి. సం. వి. ఇ. స్త్రీ. 1. బోధము, తెలివి; 2. పొందుట.

అవగదితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. నిందింపఁబడినది; 2. విశేషవిధిగా చెప్పఁబడినది.

అవగథము. సం. వి. అ. పుం. ప్రాతస్స్నానము.

అవగథుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ప్రాతస్స్నానము చేసినవాఁడు.

అవగమము. సం. వి. అ. పుం. 1. తెలిసికొనుట; 2. జ్ఞానము.

అవగాఢము. సం. విశే. (అ. ఆ. అ.) 1. దట్టమైనది; 2. లోపలఁబ్రవేశించినది; 3. మునిఁగినది; 4. దేనిలో మునుఁగుదురో అది. (జలాదికము); 5. తెలిసికొనఁబడినది, బోధపడినది. (చూ. అనవగాఢము); 6. అతికష్టమైనది, పాసికరము. "ఉ. ......అంగజుఁ డప్రతికారచేష్టిత,స్వైరత లోకుఁడట్లగుటఁజేటు పురంబున వారికెప్పుడుం, గాకెటు లుండు నిట్టి యవగాఢపుఁబొత్తు మనంగ వచ్చునే." భార. విరా. 3, ఆ. 33; "క. అవినయనిధానమగునీ, నవయౌవన శైశవముఁబవడిమి వయస్సుం, గవిసిన వ్యసనోద్రేకం, బవగాఢము దీని మానవయ్య తనూజా." కాశీ. ౪, ఆ. ౯౭.

అవగాధము. సం. = అవగధము.

అవగాహనము. సం. వి. అ. న. = అవగాహము.

అవగాహము. సం. వి. అ. పుం. 1. ఆకళింత, బోధపఱుచుకొనుట; 2. మునుక, స్నానము; 3. ప్రవేశము, లోపలఁజొచ్చుట.

అవగాహించు. సం. అ. క్రి. 1. మునుఁగు; 2. ప్రవేశించు, చొచ్చు. "వ. ఇవ్విధంబున లోహదండమహాగహనం బవగాహించి ..." వరాహ, ౨, ఆ. ౧౫౨. (ఇట సప్తమ్యర్థమునఁ బ్రథమ.) — స. క్రి. ఆకళించు, తెలిసికొను. "వ. ధనుర్వేదం బవగాహించి, యాయుర్వేదంబు విచారించి." కాశీ. 3. ఆ. ౭౯.

అవగాహ్యము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ప్రవేశింపఁదగినది; 2. తెలిసికొనఁదగినది; 3. లోపలికిఁ బ్రవేశింపఁదగినది, (జలాదికము.)

అవగీతము. సం. వి. అ. న. 1 దూఱు; 2. వికృతముగా పాడుట.—విశే. (అ.ఆ.అ.) 1. దూఱఁబడినది, నిందింపఁబడినది; 2. దుష్టము; 3. అపస్వరముగా పాడఁబడినది; 4. చెప్పఁబడినది.

అవగీర్ణము. సం. విశే. (అ. ఆ. అ.) పొగడఁబడినది, స్తుతము.

అవగుంఠనము. సం. వి. అ. న. 1. మునుఁగు; 2. మేలుమునుఁగు; 3. కప్పు.

అవగుంఠనవతి. సం. వి. ఈ. స్త్రీ. మేలుమునుఁగు వేసికొనినస్త్రీ.

అవగుంఠితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. మునుఁగు వేయఁబడినది; 2. కప్పఁబడినది.

అవగుంఫితము. సం. = అవగుంభితము.

అవగుంఫితము. సం. విణ. (త. ఆ. అ.) 1. కూర్పఁబడినది. (పద్యము); 2. అల్లఁబడినది.

అవగుణము. సం. వి. అ. పుం. 1. దుర్గుణము, చెడ్డగుణము; 2. దోషము.

అవగ్రహణము. సం. వి. అ. న. 1. అడ్డపాటు; 2. అనాదరము, అగౌరవము; 3. జ్ఞానము, గ్రహించుట.

అవగ్రహము. సం. వి. అ. పుం. 1. వర్షములేమి, వఱపు, అనావృష్టి; 2. అడ్డపాటు, ప్రతిబంధము; 3. ఏనుఁగునొసలు; 4. గజసమూహము; 5. స్వభావము; 6. శాపము.

అవగ్రాహము. = అవగ్రహము.

అవఘట్టనము. సం. వి. అ. న. చలింపఁజేయుట.

అవఘట్టము. సం. వి.అ.పుం. 1. ఛిద్రము, కన్నము; 2. ఘరట్టము, తిరుగలి; 3. చలింపఁజేయుట.

అవఘట్టితము. సం. విణ. (అ. ఆ. అ.) చలింపఁజేయఁబడినది.

అవఘర్షణము. సం. వి. అ. న. 1. రాపుడుచేయుట; 2. నొక్కి తుడుచుట.

అవఘళము. దే. వి. (మ. అవఘడ. క. అవగడ.) 1. ప్రసారము, వ్యాపనము. "తే. ఔర కరవాఁడిచూపులయవఘళంబు,బాపురే! భూరికటిశటీభారమహిమ." పాండు. ౧, ఆ. ౧౧౭. ఇట "ఔఘళంబు." ముద్రితము. ఔఘళము, అవుఘళము అనురూపములు కొందఱు గ్రహించిరి కాని దానికిఁ దగినప్రమాణము గానరాదు; 2. సామర్థ్యము; 3. నేర్పు. "క. ఆరీతి నేర్పుగలిగిన, భూరమణునిఁ జేరు మనుచుఁ బులుఁగుల దొర శౌర్య,జీరఁగ హేమావతివిని, యారా చెలియవఘళం బటంచు గణించెన్." హంస. 3, ఆ. ౧౦. ఇట సామర్థ్యము అని శ. ర. 'అగడము' అని ముద్రితపాఠము.—విణ. (దుష్కరము) 1. చేయఁగూడనిది; 2. చేయ శక్యముగానిది. "ద్వి. వనజాక్షి నిను నాఁడు వనవహ్నిఁ గూల, ననుమలించిన నాకు నవఘళంబెద్ది." హరిశ్చ. ౨, ఆ. ౨౬౨. ఇట 'హెచ్చు' అని శ. ర.

అవఘళించు. దే. అ. క్రి. (క. అవగడిసు.) 1. ప్రసరించు, వ్యాపించు. "సీ. కలయంగనలఁదిన కస్తూరి నెత్తావి యష్టదిక్కులయందు నవఘళింప." కాశీ. ౧, ఆ. ౪౫; 2. స్పర్థ సేయు, ప్రతిఘటించు. ఇది ఔపమ్యమును తెలుపును. "సీ. అవిముక్త దేశస్థుఁ డయ్యెనే బలితుండు నశ్వమేధాధ్వరాహర్త దొరయు, వారణాశీసంభవంబైన శకటంబు నైరావణముతోడ నవఘళించు." కాశీ. ౨, ఆ. ౪౭; "సీ. గగనకల్లోలినీకల్లోలమాలికా, హాళీసకములతో నవఘళించి." నై. ౧, ఆ. ౩౭. —స. క్రి. అతిశయించు, మీఱు. "తే. ఒడలఁ బ్రాయంబు లావును నొప్పిదంబు, నుక్కసంబును విక్రమ మొకటి కొకటి, కనుగుణంబులై యేరికి నవఘళింప, రాక మెఱయంగఁ బటువిహారముల నలరె." హరి. పూ. ౮, ఆ. ౪. "సీ. తాపింఛవిటపికాంతారసంవృతమైన యంజనాచలరేఖ నవఘళించి." స్వా. 3, ఆ. ౧౯.

అవఘసుఁడు. దే. విణ. సమర్థుఁడు. "సీ. వేఁడి పురందరు వేయిమాఱులుదాఁక నాజిలోఁ దఱిమిన యవఘసుండు." మై. 3, ఆ. ౧౪౧. ఇట "వ్యాపకుఁడు" అని శ. ర. (చూ. అవఘళము.)

అవఘాతము. సం. వి. అ. పుం. 1. ధాన్యము మొ. దంపుట; 2. కొట్టుట; 3. చంపుట.

అవఘాతి. సం. విణ. (న్.-ఈ-నీ.న్.) 1. ధాన్యము మొ. దంపునది; 2. కొట్టువాఁడు; 3. చంపువాఁడు.

అవఘూర్ణనము. సం. వి. అ. న. అంతటను తిరుగుట.

అవచయము. సం. వి. అ. పుం. పుష్పఫలాదులు ప్రోవుచేయుట. చూ. అపచయము.

అవచాయము. సం. వి. అ. పుం. చేతితో పుష్పఫలాదులు కోయుట.

అవచితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. ప్రోగుచేయఁబడినది; 2. (చేతితో) కోయఁబడినది. (పుష్పాది).

అవచూడము. సం. వి. అ. పుం. 1. జెండాగుడ్డ క్రిందికుచ్చు; 2. సిగ.

అవచూర్ణనము. సం. వి. అ. న. పొడిచేయుట, నలఁగఁగొట్టుట.

అవచూర్ణితము. సం. విణ. (అ.ఆ.అ.) 1.పొడిచేయఁబడినది, నలఁగఁగొట్టఁబడినది; 2. చూర్ణముగలదిగా చేయఁబడినది, చూర్ణము వేయఁబడినది. (వ్రణము.)

అవచూలకము. సం. వి. అ. న. 1. వింజామరము; 2. జెండాగుడ్డక్రింద వ్రేలాడుకుచ్చు.

అవచూలము. సం. = అవచూడము.

అవచ్ఛదము. సం. వి. అ. పుం. 1. మఱుఁగు; 2.కప్పు.

అవచ్ఛాదము. సం. = అవచ్ఛదము.

అవచ్ఛిన్నము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఛిన్నము, ఛేదింపఁబడినది; 2. వేఱుపఱుపఁబడినది; 3.ఏర్పఱుపఁబడిన పరిమితిగలది, పరిమితము. "ద్రోణావచ్ఛిన్నమగుధాన్యము." "గృహావచ్ఛిన్నమగు నాకాశము."

అవచ్ఛేదకము. సం విశే. (అ.ఆ.అ.) 1. ఛేదించునది; 2. పరిమాణమేర్పఱుచునది; 3. హద్దునేర్పఱుచునది; 4. నిశ్చయించునది.

అవచ్ఛేదము. సం. వి. అ. పుం. 1. భాగము; 2. వేఱుపాటు; 3. ఏర్పఱుపఁబడినపరిమితి.

అవచోటము. వై. క్రి. విశే. హఠాత్తుగా, అకస్మాత్తు. "క. ఖరుఁడగుకంసునిపంపున, నరిగి తృణావర్తుఁడవని కవచాటముగా, సురకరువలియై బిసబిస, నరుదరుదన ముసరి విసరి హరిఁ గొనిపోయెన్." భాగ. ౧౦, స్కం. పూ. ౨౬౪.

అవజయము. సం. వి. అ. పుం. అపజయము, ఓడుట.

అవజ్ఞ. సం. వి. ఆ. పుం. స్త్రీ. 1. అవగణనము, తెగడిక, నిందించుట; 2. అనాదరము.

అవజ్ఞత. సం. వి. ఆ. స్త్రీ = అవజ్ఞ. (అనాదరము, నిరసనము). "క. నీవును భీష్ముఁడు ద్రోణుఁడు, భూవినుతవిశుద్ధధర్మబుద్ధుల రగుటన్, మీవచనముల కవజ్ఞత, గావింపఁగ నంతకార్యగతిమూఢుఁడనే." భార. ఆది. ౮, ఆ. ౫౦. ("అపార్థత" అని పాఠాంతరము.)

అవజ్ఞాతము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పరిభూతము, తిరస్కరింపఁబడినది; 2. అనాదరముచేయఁబడినది.

అవజ్ఞానము. సం. వి. అ. న. 1. అవమానము; 2. తిరస్కారము.

అవజ్ఞుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) అజ్ఞుఁడు, తెలివిలేనివాఁడు.

అవజ్ఞేయము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అనాదరము చేయఁదగినది; 2. తిరస్కరింపఁదగినది.

అవటము. సం. వి. అ. పుం. 1. బొక్క; 2. దేహమున పల్లముగా నుండుభాగము; 3. నూయి; 4. పక్షిపిల్ల; 5. వేముచెట్టు; 6. సిరుల్లిచెట్టు.—విశే. (అ. ఆ. అ.) మోసమున బ్రదుకునది.

అవటీట. సం. వి. ఆ. స్త్రీ. చేప్పటముక్కు.

అవటీటము. సం. వి. అ. న. ముక్కుచప్పట పడిపోవుట.—విశే. (అ. ఆ. అ.) చప్పటముక్కుగలది.

అవటువు. సం. వి. ఉ. పుం. స్త్రీ. 1. పెడతల; 2. పెడతలయందలి మచ్చలిగుంట.(అని కొందఱు.) —పుం. 1.నూయి; 2. పల్లము; 3. దేహమందు పల్లముగా నుండుభాగము.

అవడీనము. సం. వి. అ. న. (పక్షి) క్రిందికి దిగుట. (వ్యతి-ఉడ్డీనము.)

అవడు. దే. వి. 1. సింద్యము; 2. హీనము, నీచము. "ఉ....ప్రసిద్ధిఁ గనుంగలనాకు నీచనిం,బొయక యొమ్మనం దవడుఁబొముల మోపను వారికిం బనుల్,సేయను నేమికారణము సెప్పుము." భార. ఆది. ౨, ఆ. ౪౮. "దెపుడు" అని పాఠభేదము. ఒమ్మనన్ + తవడు అని కొందఱు పదచ్ఛేదము చేయవచ్చును. రూ. అగడు.

అవతంసము. సం. వి. అ. పుం. 1. కర్ణభూషణము; 2. శిరోభూషణము; 3. శ్రేష్ఠవాచకము. "హంసావతంసము; పండితావతంసుఁడు."

అవతంసితము. సం. విశే. (అ. ఆ. అ.) అవతంసముగాఁ జేయఁబడినది. 1. పుష్పము మొ; 2. అవతంసముగలదిగాఁ జేయఁబడినది.

అవతమసము. సం. వి. అ. న. మసమసకగా నుండు చీఁకటి, కొంచెము చీఁకటి.

అవతరణము. సం. వి. అ. న. 1. తీరమునుండి రేవులోనికి దిగుట; 2 నదిమొదలగువానిరేవు, తీర్థము; 3. నదిమొదలగునవి దాఁటుట; 4. రూపాంతరమునఁ బుట్టుట, (దేవతాదులు) భూలోకంబున నవతరించుట.

అవతరణి. సం. వి. ఇ. స్త్రీ. 1. అవతారిక, గ్రంథాదియందు వ్రాయఁబడెడి యుపోద్ఘాతము; 2. పరిపాటి.

అవతరణిక. సం. వి. ఆ. స్త్రీ. = అవతరణి.

అవతరించు. సం. అ. క్రి. 1. తీరమునుండి నదిమొదలగుదానిలోనికి దిగు; 2. (వాహనాదులనుండి) దిగు. "వాహనంబు నవతరించి కక్ష్యాంతరంబులు గడచి." ఉ. హరి. ౧, ఆ. ౫౩; 3. (దేవతాదులు భూలోకమున) జనించు.

అవతరిల్లు. సం. = అవతరించు.

అవతల. ద్వ. వి. (అవల+తల.) ఔప. 1. అవలి ప్రదేశము; 2. (కాలమున) తర్వాయి, పిమ్మట.

అవతానము. సం. వి. అ. పుం. 1. (లతాసముదాయము మొదలగునది) వ్యాపించుట; 2. చాచుట; 3. బోరగిలఁ బరుచుట.

అవతారణము. సం. వి. అ. న. 1. అవతారిక, ఉపోద్ఘాతము; 2. అవతరింపఁజేయుట; 3. భూతాదుల నావేశింపఁజేయుట.

అవతారము. సం. వి. అ. పుం. 1. (తీరమునుండిగాని వాహనాదులనుండిగాని) దిగుట; 2. తీర్థము, రేవు; 3. కోనేఱులోనగునవి; 4. (దేవతాదులు భూలోకమున) పుట్టుట. మత్స్యావతారము మొ. (దశావతారములు.—శ్లో. మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః, రామో రామశ్చ రామశ్చ బుద్ధః కల్కిశ్చ తే దశ. 'కల్కిరేవచ.' పాఠాంతరము); 5. ఆవిర్భావము. "వసంతావతారసమయము;" 6. కంపుఁదుమ్మ.

అవతారించు. సం.=అవతరించు. (దేవతాదులు భూలోకమునఁ బుట్టు.) "మ......ఆశ్రీఁదుర్వీక్ష రంగధామాఖ్యమై, యవతారించెఁ దదంఘ్రిమూలములు నీకొంగాక యాధారముల్." శ్రీరంగ. మా. ౧౦, ఆ. ౧౦౩.

అవతారిక. సం. వి. ఆ. స్త్రీ. 1. గ్రంథముఖమున వ్రాయఁబడు కదుత్పత్తివిధము, ఉపోద్ఘాతము, పీఠిక; 2. వ్యాఖ్యానాదులందు రాఁబోవువాక్యాన్వయము తెలుపుటకై ముందువ్రాయు సందర్భసూచకవాక్యము.

అవతారితము. సం. విశ. (అ. ఆ. అ.) 1. క్రిందికి దింపఁబడినది; 2. అవతరింపఁజేయఁబడినది.

అవతీర్ణము. సం. విశ. (అ. ఆ. అ.) 1. దిగినది; 2. దాఁటఁబడినది; 3. అవతరించినది, పుట్టినది. (అవతీర్ణుఁడు=అవతరించినవాఁడు.)

అవతోక. సం. వి. ఆ. స్త్రీ. = అపతోక, ఈచుకుపోయిన ఆవు.

అవత్తము. సం. విశ. (అ. ఆ. అ.) ఖండింపఁబడినది.

అవదంశము. సం. వి. అ. పుం. (ఉపదంశము) 1. ఊరుఁగాయ; 2. కల్లుత్రాగునపుడు నంజుకొనెడువస్తువు. (మాంసఖండాది.)

అవదగాకి. దే. విశ. పలుగాకి, (దుష్టత్వముకలది; దుష్టత్వముకలవాఁడు.) "ఆ. కూర్చిచెట్టఁబట్టుకొని తెచ్చె లోపలి,కవదగాకి నారి యత్తలారి." పంచ. వేం. ౧,ఆ. ౫౯౫. "క. నరేంద్ర కన్నులారం, గనుఁగొంటివె వీనియవదగాకితనంబుల్." కుచేల. ౨, ఆ. ౭౭.

అవదత్తము. సం. విశ. (అ. ఆ. అ.) ఈయఁబడినది.

అవదాతము. సం. వి. అ. పుం. 1. తెల్లన; 2. పచ్చన. —విశ. (అ. ఆ. అ.) 1. తెల్లనిది; 2. పచ్చనిది; 3. స్వచ్ఛము; 4. శ్రేష్ఠము; 5. ఖండింపఁబడినది. శ. ర. ఈయర్థమున "అవదత్తము" అని యుండును.

అవదానము. సం. వి. అ. న. 1. కడచినపని; 2. జరిగినచరిత్ర; "వ. ఈరెం డవదానంబులు నీవును గొంత యెఱుంగుదు" భార. శాంతి. ౧, ఆ. ౩౮; 3. నఱకుట, ఖండించుట.

అవదాయము. మి. గ్రా. వి. తక్కువదాయము. శ. ర.

అవదారణము. సం. వి. అ. న. చీల్చుట.—పుం. (చీల్చుటకు సాధనమైనది.) గుద్దలి, ఖనిత్రము.

అవదారితము. సం. విశ. (అ.ఆ.అ.) చీల్పఁబడినది.

అవదాహము. సం. వి. అ. న. 1. (తాపము పోఁగొట్టునది.) నీటివట్టివేరు; 2. జ్వరమునకు కారణమైన వేఁడి.

అవదీర్ణము. సం. విశ. (అ. ఆ. అ.) 1. చీల్పఁబడినది; 2. రెండుగాఁజేయఁబడినది.

అవదూఱు. మి. = అపదూఱు.

అవదోహము. సం. వి. అ. పుం. 1. పాలు; 2. పాలు మొ. పిదుకుట.

అవద్యము. సం. వి. అ. పుం. దోషము, పాపము. "తే. తగియె మునివరవాహనత్వంబు నమ్మ,హాద్య

తికి వేయునేల యవద్యరహిత." భార. ఆను. ౮, ఆ. ౩౬. "క. ఆద్యంతంబును నీయన,వద్యకథ వినంగఁగనినవారికిఁ బొయుఁ, సద్యంబ బ్రహ్మహత్యా, వద్యము మొదలైన పాపవర్గంబెల్లన్." భార. స్వర్గా. ౧౬.—విశే. (అ.ఆ.అ.) 1. అధమము, హీనము; 2. పాపముగలది; 3. నిందింపఁదగినది; 4. చెప్పఁదగనిది, వచింపఁదగనిది. (వ్యతి.—అనవద్యము)

అవధరించు. సం. అ. క్రి. ఎచ్చరికపడు, శ్రద్ధవహించు, సావధానుఁడగు. "క. సర్వేశ్వర విని పించెద, సర్వము విన నవధరింపు." దశా. ౨, ఆ.౧౧. —స. క్రి. 1. చిత్తగించు, విను. "వ. దామగ్రంథి యనువాఁడ, నాకు నశ్వవిషయంబయిన విచక్షణత్వంబెల్లనుంగల దవధరింపుమని యిట్లనియె." భార. విరా. ౧, ఆ. ౨౬౨; 2. తలఁచు, ఎంచు. "వ. అనినం దపననందనుం డది యట్లుండె నాకు సహజంబైన కవచంబు నొలిచి యిచ్చిన మదీయ దేహంబు గరంబు వికృతంబగునది యేమని యవధరించి తనిన నింద్రుండు నీ శరీరంబు భవజ్జనకుండైన యరుణకిరణువర్ణం బెట్టి నట్టిదీప్తిం జెలువొందు నని పలికి." భార. ఆ. ౭,ఆ. ౩౭౩; 3. నిశ్చయించు; 4. ధరించు. "సీ. నవపింఛమయభూష లవధరించి నటించు." స్వా. ౩, ఆ. ౧౯.

అవధాతవ్యము. సం. విశే. (అ.ఆ.అ.) 1. హెచ్చరిక గలుగఁ జేయఁదగినది; 2. విషయాంతరము నకుఁ బోకుండఁగనిలుపఁదగినది. (మనస్సు. మొ.)

అవధానము. సం. వి. అ. న. 1. ఎచ్చరిక, పరధ్యానము లేకుండఁగ ఒకేవిషయమున బుద్ధినుంచుట; 2. వేదమున క్రమము, జట, ఘన, మొదలగునవి నేర్చుట; 3. బుద్ధి చెదరకుండఁగ బహువిషయములు ధారణచేయుట."అష్టావధానము."

అవధాని. సం. విశే. (న్.ఈ.నీ.న్.) (అవధానము కలవాఁడు) 1. పరధ్యానము లేకుండఁగ ఒకే విషయమున బుద్ధి నుంచువాఁడు; 2. వేదమునఁ గ్రమము,జట, ఘన,మొదలగునవి నేర్చినవాఁడు; 3. బుద్ధి చెదరకుండఁగ అనేకవిషయములను ధారణచేయువాఁడు. (అష్టావధాని; శతావధాని.)

అవధాయకుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) అవధానము చేయువాఁడు.

అవధారణము. సం. వి. అ. న. 1. నిశ్చయము; 2. అవధరించుట.

అవధారణీయము. సం. విశే. (అ. ఆ. అ.) 1. నిశ్చయించుటకుఁదగినది; 2. నిశ్చయింప శక్యమైనది.

అవధారితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. నిశ్చయింపఁబడినది; 2. అవధరింపఁబడినది.

అవధార్యము. సం. = అవధారణీయము.

అవధారు. వై. ని. (క. అవధారు.) వినుము. (చిత్తగింపుము.)అని హెచ్చరించునపు డుపయుక్తము.) "సీ. అవధారు దేవ దివ్యకిరీటకోటిసందానితవికచమందారదామ, సందోహమకరందబిందుధారాధౌత సందీప్తచరణారవిందుఁడైన, సంక్రందనుండు...." నై. ౩, ఆ. ౧౨౦.

అవధి. సం.వి. ఇ.పుం. 1. హద్దు, మేర; 2. ఎడము, అవకాశము; 3. నియమితమగు వేళ, గడవు; 4. రంధ్రము, బొక్క; 5. దుఃఖము, కష్టము. "క. సిరిగలయప్పుడె దుఃఖముఁ, బొరయక సంతత సుఖంబుఁ బొందు విమూఢే, తరుఁ డటుచేయక చేల కుపురుషుం డాడినము లవధిఁ బుచ్చుచునుండున్." దశకు. ౧౧, ఆ. ౧౦౧. ఈయర్థము సంస్కృతమున కనఁబడలేదు. కన్నడమున ఈయర్థమున 'అవధి' 'అవిధి' శబ్దములురెండును గలవు. 'అవిధి' అనుట యుచితమని తోఁచెడిని. ముద్రితములలోను, వ్రాఁతప్రతులలోను 'అవధి' అని ప్రాయికముగాఁ గనఁబడుచున్నది.

అవధిఁబుచ్చు. మి. స. క్రి. కష్టముతోఁ గడపు. (చూ. అవధి.)

అవధిఁబోవు. మి. అ. క్రి. 1. అంతమునొందు; నశించు, క్షీణించు. "తే. యోగనిద్రాప్రభావ సంయోజనమున, నొలయు షడ్గర్భులను గర్భములుగఁ దాల్చి, ధీరతమయగు వసుదేవుదేవి దనకు, దవులు దేహదుఃఖంబెల్ల నవధిఁబోవ." హరి. పూ. ౫, ఆ. ౧౦౬; 2. కష్టమునొందు, బాధపడు. "ఆ. తండ్రి నీవు నాకు దయతోడ నిచ్చిన, వనముచిత్తగించి వలయుతెఱఁగు, సమయ సముచితముగ, సమకట్టుమయ్య యీ, రాకు

మారు లవధిఁ బోకయుండ." భార.విరా. ౧,ఆ. ౧౮౧. 'అవిధి' ముద్రితము. 'అవధి' వ్రాతప్రతి. చూ. అవధి. "సీ....అటమీఁద నాకుఁగా నా అడి వెలవెట్టరాని రత్నముఁ బోని రాచపట్టి, యవధిఁ బోయెడి జగవంబ యిచ్చినపిదంబ నకును నొకపాపపుట్టు నోక్కో." హరి. ఉ. ౭, ఆ. ౨౧౩.

అవధీరణ. సం. వి. ఆ. స్త్రీ. 1. తిరస్కారము; 2. నింద.

అవధీరణము. సం. వి. అ. న. = అవధీరణ.

అవధీరితము. సం. విణ. (అ. ఆ. అ.) తిరస్కరింపఁబడినది.

అవధుతము. సం. = అవధూతము. "క. మగువయు నాదెస చిత్తము, దగులంగా నృత్తచతురతా వైభవముల్, డీగవిడిచి మదనుబారికి, నగపడి పవనావధుత లతాకృతి యయ్యెన్." దశకు. ౬, ఆ. ౩౧. ఇట 'పవనవధూతలతా' అని వధూతశబ్దముగా గ్రహింపవచ్చును. వ్రాత ముద్రితము అవధుత అనియే కలదు గాన గ్రహింపఁబడినది.

అవధూతము. సం. విణ. (అ.ఆ.అ.) కదలింపఁబడినది. "మ. అవనీచక్రము సంచలింపఁగ దివం బల్లాడ నాశాచయం, బవధూతంబుగ గోత్రశైలనికరం బాకంపముం బొంద న, ర్ణవముల్ ఘూర్ణన మొంద." భార. విరా. ౨, ఆ.౨౮౪.

అవధూత. సం. వి.=అవధూతుఁడు.

అవధూతుఁడు. సం. వి. అ. పుం. సన్న్యాసానంతరము దండకమండలాదులుగూడ విసర్జించిన యోగి.—విణ. (అ. ఆ. అ.) కదలింపఁబడినవాఁడు.

అవధూననము. సం. వి. అ. న. చలింపఁజేయుట.

అవధూలనము. సం. వి. అ. న. గుండ మొదలగునది చల్లుట.

అవధృతము. సం. విణ. (అ.ఆ.అ.) ధరింపఁబడినది.

అవధేయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. స్థాపింపఁదగినది; 2. దేనియందు మనస్సు ప్రవేశపెట్టఁదగినదో యట్టిది; 3. విశ్వసింపఁదగినది.

అవధ్యము. సం. విణ. (అ. ఆ. అ.) వధ్యముకానిది, చంపఁదగనిది.

అవధ్వంసము సం. వి. అ. పుం. 1. పొడిచేయుట; 2. విడుపు, త్యజించుట; 3. దూఱు, నింద; 4. ధ్వంసము, నాశము.

అవధ్వస్తము. సం. విణ. (అ.ఆ.అ.) 1. పొడిచేయఁబడినది; 2. విడువఁబడినది; 3. దూఱఁబడినది; 4. నశింపఁజేయఁబడినది.

అవనతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆనతము, వంగినది; 2. నమ్రము, వినయముగలది.

అవనద్ధము. సం. వి. అ. న. మృదంగాది వాద్యము. —విణ. (అ..ఆ. అ.) 1. ఖచితము, తాపడము చేయఁబడినది; 2. కట్టఁబడినది; 3. చుట్టును వేయఁబడినది.

అవనము. సం. వి. అ. న. 1. కాపాడుట, రక్షించుట; 2. తనివిపఱచుట, తృప్తిపఱచుట; 3. సంతోషము.

అవనమ్రము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి వంగినది.

అవనాట. సం. = అవటీట.

అవనాటము. సం. = అవటీటము.

అవనాయము. ఉభ. వై. విణ. అవన్యాయము, న్యాయమునుండి తప్పినది.—సం. వి. అ. పుం. పడఁద్రోయుట, క్రిందికిఁ ద్రోయుట.

అవని. సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. భూమి, నేల; 2. స్థానము. "ఉ......మోదువ్వకేల్, పావనభక్తిఁ బూనెడు కృపావని పావని నెంతు నామదిన్" హంస. పీఠిక. ౭.

అవసిక్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నీటితో కడుగఁబడినది; 2. శుద్ధిచేయఁబడినది.

అవనీనాథుఁడు. సం. వి. అ. పుం. భూపతి, రాజు.

అవనీశుఁడు. సం. = అవనీనాథుఁడు.

అవనేజనము. సం. వి. అ. న. ప్రక్షాళనము, కడుగుట.

అవపథ్యము. సం. విణ. (అ. ఆ. అ.) అపథ్యము.

అవపాకము. సం. వి. అ. పుం. హీనమైనపాకము, చెడినపాకము.

అవపాడి. మి. వి. అపపాడి, అన్యాయము. "క. అధికారిచయముఁ దత్త్వద్విధముల నవపాడిసేసి

వివిధధనంబుల్, వృథగతి నొకొ్కక వెరపున, నధిపతికిం జెప్ప కంతకంతకుఁ జేఱిచెన్." దశకు. ౧౧, ఆ. ౧౧౬.

అవపాతము. సం. వి. అ. పుం. (పడునట్లు చేయునది.) ఓదము. వేఁటకాండ్రు ఏనుఁగు మొదలగు పెద్దజంతువులను పడగొట్టుటకై పెద్ద గొయ్యి త్రవ్వి పైకి సమప్రదేశముగా కనఁబడునట్లు కట్టెలు, ఆకు, అలము, మన్ను వేసి కప్పినప్రదేశము.

అవపాత్రుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఎవఁడు భోజనము చేసినపాత్ర శుద్ధిచేసినను ఇతరవర్ణస్థులకు భోజనార్థము పనికిరాదో అట్టివాఁడు. (మ్లేచ్ఛుఁడు, పతితుఁడు. మొ.)

అవబుద్ధము. సం. విశే. (అ.ఆ.అ.) 1. తెలిసికోనఁబడినది (విషయము) మొ.; 2. తెలిసికొనినది. గ్రహించినది. (బుద్ధి మొ.)

అవబోధము. సం. వి. అ. పుం. 1. మేలుకొనియుండుట, జాగరణము; 2. బోధించుట; 3. జ్ఞానము.

అవభర్జితము. సం. విశే. (అ. ఆ. అ.) వేపఁబడినది, వేపుడుచేయఁబడినది.

అవభాషణము. సం. వి. అ. న. 1. సంభాషించుట; 2. చెప్పుట; 3. అసందర్భసంభాషణము.

అవభాసము. సం. వి. అ. పుం. 1. మిథ్యాజ్ఞానము, భ్రాంతి, ఒకవిధముగా నున్నది వేఱొకవిధముగాఁ గనఁబడుట; 2. జ్ఞానము; 3. ప్రకాశము.

అవభృథము. సం. వి. అ. పుం. యజ్ఞాంతమందు చేయు స్నానాదికర్మము.

అవభ్రటు. సం. = అవటీటు.

అవభ్రటము. సం. = అవటీటము.

అవమంత. సం. విశే. (ఋ. ఈ-త్రీ. ఋ.) అవమానము చేయువాఁడు, తిరస్కరించువాఁడు.

అవమంతవ్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) అవమానము చేయఁదగినవాఁడు, తిరస్కరింపఁదగినవాఁడు.

అవమతము. సం. విశే. (అ.ఆ.అ.) 1. అవజ్ఞాతము, అవమానింపఁబడినది. "క. పవిత్రచారిత్రులైన పరమద్విజాలి, ట్లవమతులై కోపించిన, నవనీశుల కేల కల్గు నాయువు సిరియున్." భార. విరా. ౫, ఆ. ౨౭౭; 2. అనాదరముఁజేయఁబడినది.

అవమతి. సం. వి. ఇ. స్త్రీ. 1. అవమానము, తిరస్కారము; 2. అనాదరము.

అవమము. సం. వి. అ. పుం. (జ్యోతి) మూఁడు తిథులుగూడిన వారము, తిథిత్రయము.—విశే. (అ. ఆ. అ.) అధమము.

అవమర్దము. సం. వి. అ. పుం. 1. ఒత్తుడు, ఒరయిక; 2. బాధ.

అవమర్యాద. సం. వి. ఆ. స్త్రీ. అమర్యాద.

అవమానన. సం. వి. ఆ. స్త్రీ. అవమానపఱచుట.

అవమాననము. సం. వి. అ. న. అవమానించుట. "ఆ. వైనతేయునింద్రవజ్రావమానన, చండశౌర్యునెక్కి చక్రశార్ఙ్గ, గదలు దాల్చి." హరి. పూ. ౪, ఆ. ౭౪.

అవమాననీయుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) 1. అవమానపఱుపఁదగినవాఁడు; 2. తిరస్కరింపఁదగినవాఁడు.

అవమానపడు. మి. అ. క్రి. భంగపడు, అవమానము నొందు.

అవమానపఱచు. మి. స. క్రి. (అవమానపడు. ప్రే.) అవమానముచేయు, తిరస్కరించు.

అవమానపెట్టు. మి. స. క్రి. భంగపఱచు, అవమానపఱచు, అవమానించు.

అవమానము. సం. వి. అ. న. = అవమతి.

అవమాని. సం. విశే. (న్. ఈ-నీ. న్.) 1. అవమానము కలవాఁడు; 2. అవమానము చేయువాఁడు.

అవమానించు. సం. స. క్రి. అవమానపఱుచు, పరాభవించు.

అవమానితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అవమానపఱుపఁబడినది; 2. నిరసింపఁబడినది.

అవమానితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) తిరస్కరింపఁబడినవాఁడు, అవమానపఱుపఁ బడినవాఁడు. "చ.అనిశముఁ బాండుపుత్రులకు నప్రియకార్యము రోయునట్టిదుర్జనుఁడు సుయోధనుండటులు శత్రులచే నవమానితుండుఁ బేర్చినకృపనొప్పుచున్న" భార. అర. ౬, ఆ. 3.

అవమాన్యుఁడు. సం. = అవమాననీయుఁడు.

అవముఁడు. సం. విశే. (అ. ఆ. అ.) అధముఁడు, తుంటరి.

అవమూర్ధశయుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అధోముఖముగాఁ బరున్నవాఁడు, బోరగిలఁ బరున్నవాఁడు. (శిశువు.)

అవమూర్ధుఁడు. సం. విణ. (న్. ఈ-స్త్రీ. న్.) వంచుకొనిన తలఁగలవాఁడు, తలవంచుకొన్నవాఁడు.

అవమోచనము. సం. వి. అ. న. విడిపించుట. "మ. అనుకూలస్థితిఁ బేర్చి పక్షి-లోకాత్యంతదుఃఖావమోచనకృత్యంబునఁ గర్థితోఁ గడఁగుయుష్మద్విక్రమప్రక్రమం, బవపాయంబు." హరి. ఉ. ౪, ఆ. ౧౦౫.

అవయవము. సం. వి. అ. పుం. 1. దేహము; 2. కరచరణాది. (కాలుసేతులు మొదలగునవి); 3. భాగము, ఏకదేశము; 4. ఉపకరణము, సాధన సామగ్రి; 5. తర్కశాస్త్రగ్రంథములలో నొకటి.

అవయవి. సం. విణ. (న్.ఈ-నీ.న్.) అవయవములు గలది.

అవరజ. సం. వి. ఆ. స్త్రీ. (ఒకని తరువాతగాని ఒక లెతరువాతగాని పుట్టినది) 1. చెల్లెలు; 2. (నాలుగువర్ణములలో తుదివర్ణమునఁ బుట్టినది) శూద్రస్త్రీ.

అవరజుఁడు. సం. వి. అ. పుం. 1. అనుజుఁడు, తమ్ముఁడు; 2. శూద్రుఁడు. చూ. అవరజ.

అవరణము. సం. వి. అ. పుం. ఉలిమిడి.

అవరతము. సం. విణ. (అ.ఆ.అ.) 1. విచ్ఛిత్తిగలది; 2. విశ్రాంతిగలది. (వ్యతిరేకము-అనవరతము.)

అవరతి. సం. వి. ఇ. స్త్రీ. 1. విశ్రాంతి, ఉడుకువ, విరామము; 2. నివృత్తి, మరలుట.

అవరము. సం. వి. అ. న. ఏనుఁగుతొడలలో వెనుకటి భాగము.—విణ. (అ. ఆ. అ.) 1. ఒకదాని తర్వాతిది, వెనుకటిది (దేశము, కాలము); 2. అధమము, నీచము; 3. శ్రేష్ఠముగానిది; 4. అత్యంతశ్రేష్ఠము(దేనికంటె శ్రేష్ఠమగునది లేదో అది.); 5. చిన్నది; 6. కడపటిది.

అవరవర్ణుఁడు. సం. వి. అ. పుం. (ద్విజేతరుఁడు) శూద్రుఁడు.

అవరీణము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ధిక్కరింపఁబడినది, తిరస్కరింపఁబడినది; 2. అధమము.

అవరీయసము. సం. విణ. (న్.ఈ-సీ.న్.) 1. అత్యంతాల్పము, మిక్కిలి చిన్నది; 2. శ్రేష్ఠము కానిది.

అవరుగ్ణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) రోగము గలవాఁడు.

అవరుద్ధ. సం. వి. ఆ. స్త్రీ. అంతఃపురమందుంచఁ బడినస్త్రీ.

అవరుద్ధము. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఉపరుద్ధము, అడ్డగింపఁబడినది; 2. గుప్తము.

అవరూఢము. సం. విణ. (అ. ఆ. అ.) 1. క్రిందికి దిగినది; 2. ఉత్పాటితము, పెకలింపఁబడినది. (చెట్టు.)

అవరోధకము. సం.విణ. (అ.ఆ-ధికా.అ.) 1. నిరోధించునది, అడ్డునది; 2. ఆవరించునది. (కంచె)

అవరోధనము. సం. వి. అ. న. 1. ముట్టడించుట; 2. అడ్డుపెట్టుట; 3. ప్రతిబంధము; 4. రహస్యస్థలము; 5. ఒకవస్తువయొక్క అంతర్భాగము; 6. అంతఃపురమునందు స్త్రీలుండు గది; 7. అంతఃపురస్త్రీ; 8. రాణి; 9. భార్య.

అవరోధము. సం. వి. అ. పుం. 1. అంతఃపురము; 2. అతఃపురకాంత; 3. అడ్డగింత, ప్రతిబంధము; 4. మఱుఁగు; 5. ముట్టడి; 6. చెఱ.

అవరోధి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) 1. నిరోధించువాఁడు; 2. ఆవరించువాఁడు; 3. ముట్టడించువాఁడు.

అవరోధించు. సం. స. క్రి. 1. నిరోధించు, అడ్డగించు; 2. ముట్టడించు. "వ. సాల్వుండనువాఁడు తద్వధప్రవర్తితక్రోధుండయి కామగమనంబయిన తన సౌంభకంబను నగరంబుతో సన్నద్ధుండయి వచ్చి ద్వారవతీ పురంబు నవరోధించి" భార. అర. ౧, ఆ. ౧౫౦, "వ. ధార్తరాష్ట్రు లనేకనృపకుమారసహితులై పాంచాలుపురం బవరోధించినఁ బాంచాలపతి యలిగి యపార చతురంగబల సమేతుండై కౌరవులందాఁకి." భార. ఆది. ౬, ఆ. ౨౦.

అవరోధితుఁడు. సం. వి. అ. పుం. అంతఃపురరక్షణార్థము నియోగింపఁబడిన కంచుకి.

అవరోపణము. సం. వి. అ. న. (చెట్టు మొదలగు దానిని) పెకలించుట.

అపరోపితము. సం. విణ. (అ. ఆ. అ.) పెకలింపఁబడినది. (చెట్టు.)

అపరోహణము. సం. వి. అ. న. దిగుట.

అపరోహము. సం. వి. అ. పుం. 1. (క్రిందికి దిగునది) (మఱ్ఱి) ఊడ; 2. చెట్టుపయి కెగఁబ్రాకు తీగ; 3. దిగుట; 4. (పుణ్యఫలానంతర మిందుండి భూలోకమునకు దిగుదురు.) ఇంద్రునిపట్టణము, స్వర్గము; 5. చంద్రాదిలోకము.

అపరోహి. సం. వి. న్. పుం. వటము.—విణ. (న్.ఈ.నీ.న్.) క్రిందికి దిగువాఁడు.

అపర్ణము. సం.వి.అ. పుం. 1. అపవాదము, దూఱు; 2.అకారము; 3.వర్ణములేమి.—విణ.(అ.ఆ.అ.) వర్ణములేనిది.

అవల. దే. వి. (ఆ + వలను) ఔవ, అనావ. 1. తర్వాతి ప్రదేశము, అవతల. "తే. తద్విరక్తి పరీక్షించి తారుదార, యరిగిరవలకుఁ జతురంత యానధరులు." నై. ౫, ఆ. ౧౭; 2. తర్వాతి కాలము, అనంతరము. "క......వినినవ్వుచు రాముఁ డనలవింశతి భుజుఁడున్, ధనవిభుఁడును బోరినవిధ, మనఘా వినవలతుఁ దెల్పుమని యడుగుటయున్." ఉ. రా. ఆ. ౨, ౩౩౨; 3. దూరము. "సీ. సడలంగ మెడరజ్జుఁగడువడి నిడుతమి, నతిసూత్రావృత్తి యవలఁ జనియె." పాండు. ౫, ఆ. ౨౩౫.—విణ. 1. అవలనున్నది, అవతలిది; 2. ఇతరము. "సీ. ఒక్కయంగమె మున్ను చిక్కులో భావించి, యది దృఢంబగుటయు నవలియంగ,కము మఱచింతింపఁగాఁదగు..." ఆము. ౩, ఆ. ౧౬. రూ. ఆవల, అవ్వల, అవుల, ఔల.

అవలంబనము. సం. వి. అ. న. 1. పడిపోవకుండఁగ కఱ్ఱ మొ. పట్టుకొనుట; 2. పట్టుకొనెడి కఱ్ఱ; 3. ఆశ్రయము.

అవలంబము. సం. వి. అ. పుం. 1. ఆశ్రయము, ఊఁత; 2. ఊఁతగానుండు దండాది; 3. అవలంబించుట, ఆశ్రయముగాఁ జేసికొనుట.

అవలంబి. సం. విణ. (న్. ఈ.నీ. న్) 1. అవలంబించువాఁడు కఱ్ఱ. మొ. పట్టుకొనువాఁడు; 2. ఆశ్రయము గలవాఁడు; 3. వ్రేలాడుచున్నవాఁడు.

అవలంబించు. సం. స. క్రి. 1. ఆశ్రయించు; 2. ఊఁతగాఁగొను.

అవలంబితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అవలంబింపఁబడినది; 2. వ్రేలాడినది.

అవలక్షణము. సం. వి. అ. న. దుర్లక్షణము, పాడు లక్షణము.

అవలక్షము. సం. వి. అ. పుం. తెలుపు.—విణ. (అ. ఆ. అ.) తెల్లనిది. (రూ. వలక్షము.)

అవలగ్నము. సం. వి. అ. పుం. న. నడుము.—విణ. (అ. ఆ. అ.) తగులుకొనినది. రూ. వలగ్నము.

అవలగ్నుఁడు. సం. వి. అ. పుం. పాలుత్రాగుశిశువు.

అవలలము. సం. వి. అ. పుం. కుసూలము, ధాన్యము పోసెడు పాణక, గాదె.

అవలాశము. సం. వి. అ. న. శ్లేష్మము, తెమడ.

అవలిప్తము. సం. విణ. (అ.ఆ.అ.) 1. పూయఁబడినది (చందనాది); 2. గర్వమునొందినది.

అవలేఢము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నాకఁబడినది; 2. ఆస్వాదింపఁబడినది.—వి. అ. పుం. గుఱ్ఱమునకుండెడు ఒకవిధమగు సుడి.

అవలీల. సం. వి. ఆ. స్త్రీ. 1. చులుకన, తేలిక, అనాయాసము; "మ. భవదాజ్ఞాదృఢబంధసంయమితశుంభద్వేగమై కాక నాఁ,డవలీలన్ మనయర్జునద్విపము క్రోధావేశ దుర్దాంతద,ర్పవిలాసోద్భటభంగి నే వడరి కౌరవ్యాంబుజశ్రేణిఁ జిక్కువడం జేయదె" భార. విరా. ౧, ఆ. ౫౬; 2. అనాదరము, తిరస్కారము; 3. విలాసము, ఆట.

అవలుంచనము. సం. వి. అ. న. 1.ఛేదించుట; 2. త్రెంచుట, కత్తరించుట; 3. చెట్టు మొ. దానిని పెకలించుట; 4. జుట్టు మొ. దానిని కట్టకుండుట.

అవలుంచించు. సం. స. క్రి. త్రెంచు, కత్తరించు. "వ. మఱియు నొక్కజట యవలుంచించి వేల్చిన నందు వికృతదంష్ట్రాకరాళంబైన ముఖంబుతో శూలహస్తుండైన యొక్క రాక్షసుండు పుట్టె." భార. అర. ౩, ఆ. ౨౬౭.

అవలుంఠనము. సం. వి. అ. న. 1. పొరలిక, దొర్లుట; 2. దోఁచుకొనుట.

అవలుంఠితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొర్లాడినది, దొర్లినది; 2. దోఁచుకోఁబడినది.

అవలేపనము. సం. వి. అ. న. 1. పూయుట; 2. గర్వము; 3. సంబంధము; 4. పూయుటకు సాధనమైన చందనాదికము.

అవలేపము. సం. వి. అ. పుం. 1. (చందనాదుల) పూఁత; 2. గర్వము; 3. దూషణము; 4. సంబంధము.

అవలేహనము. సం. వి. అ. న. 1. నాకుట; 2. ఆస్వాదించుట.

అవలేహము. సం. వి. అ. పుం. 1. నాకుట; 2. ఆస్వాదించుట; 3. ఆస్వాదింపఁదగిన పదార్థము.

అవలేహ్యము. సం. వి. అ. న. నాలుకతో నాకఁదగిన తేనె మొ. ద్రవ్యము.—విణ. (అ.ఆ.అ.) 1. నాలుకతో నాకఁదగినది (తేనె. మొ.); 2. ఆస్వాదింపఁదగినది.

అవలోకనము. సం. వి. అ. న. 1. చూచుట; 2. దృష్టి, చూచుశక్తి; 3. నేత్రము; 4. పరిశీలనము; 5. అనుసంధానము.

అవలోకనీయము. సం. విణ. (అ.ఆ.అ.) 1. చూడఁదగినది. "తే. అగ్రహంబున సకల జనావలోకనీయబహుమూర్తులై ధాత్రి నిలిచి వెలసె." హరి. ఉత్త. ౪,ఆ. ౧౦౭; 2. పరిశీలింపఁదగినది.

అవలోకము. సం. పుం. =అవలోకనము.

అవలోకి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) 1. చూచువాఁడు; 2. పరిశీలించువాఁడు.

అవలోక్యము. సం. = అవలోకనీయము.

అవలోకించు. సం. స. క్రి. 1. వీక్షించు, చూచు; 2. (గ్రంథాదులను) పరిశీలించు, విచారించు.

అవలోకితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చూడఁబడినది; 2. పరిశీలింపఁబడినది.

అవలోడనము. సం వి. అ. న. 1. పరిశీలించుట, బాగుగా నాలోచించుట; 2. పరామర్శము, గ్రంథముల విచారణము సేయుట.

అవలోడితము. సం. విణ. (అ. ఆ. అ.) అవలోడనము చేయఁబడినది.

అవల్గుజము. సం. వి. అ. పుం. కారుగచ్చ⚘.—విణ. (అ. ఆ. అ.) అసాధువువలనఁ బుట్టినది.

అవవాదము. సం. వి. అ. పుం. 1. నింద, అపవాదము; 2. ఆజ్ఞ, సెలవు; 3. విశ్వాసము, నమ్మిక.

అవశిరస్కుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తలవంచుకొన్నవాఁడు.

అవశకునము. సం. వి. అ. న. దుశ్శకునము, అపశకునము.

అవశము. సం. విణ. (అ.ఆ.అ.) 1. వశముకానిది; 2. పరాధీనము; 3. ఒడలు తెలియనిది.

అవశిష్టము. సం. విణ. (అ. ఆ. అ.) మిగిలినది.—వి.అ.న. మిగిలినపని. "మేమవశిష్టాలు తీర్చుకొని భోజనమునకు సిద్ధముగా నున్నారము."

అవశీభూతము. సం. విణ. (అ. ఆ. అ.) అనాయత్తము, స్వాధీనముకానిది, వశమునలేనిది.

అవశేషము. సం. వి. అ. పుం. మిగులు, అధికము.

అవశేషించు. సం. అ. క్రి. శేషించు, మిగులు.

అవశ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వశమునలేనిది; 2. పరాధీనము.—క్రి. విణ.అ.న. నిశ్చయముగా. "క. చను నీవు హస్తినగరంబునకేనును బాండుభూపపుత్రులఁ బ్రీతిం గని యట వత్తు నవశ్యంబును" భార. ఉద్యో. ౧, ఆ. ౧౦౦. "క. దైవబలంబును వాతనికి నవశ్యముఁ గల్గున్." భార. విరా. ౨, ఆ. ౧౬౪; "క. మోక్షపదముఁ జేర్చుట, గలుగు నవశ్యంబు." భార. శాంతి. ౪, ఆ. ౧౦౮.

అవశ్యాయము. సం. వి. అ. పుం. 1. మంచు; 2. గర్వము.

అవష్టంభనము. సం. వి. అ. న. 1. ప్రయత్నము; 2. ఆలంబనము, ఊఁత; 3. నిరోధము, నిలుపుట.

అవష్టంభము. సం. వి. అ. పుం. 1. అవలంబము, ఊఁత; 2. గర్వము, నమ్రతలేమి, ఉద్ధతి. "శా. పుష్టోదంచితసారవీరరస సంపూర్ణాంగముల్ సంగరావష్టంభోజ్వలవీరలేఖయును" భార. భీష్మ. ౧, ఆ. ౧౧౭; 3. ప్రయత్నము; 4. బంగారు; 5. మ్రానుపాటు, స్తబ్ధత్వము; 6. నిరోధము, ఆఁపుట.

అవష్టబ్ధము. సం. వి. అ. పుం. ఇప్ప⚘.—విణ (అ. ఆ. అ.) 1. ఆక్రమింపఁబడినది; 2. ఆశ్ర

యింపఁబడినది; **3.** అరికట్టఁబడినది, నిరోధింపఁబడినది; **4.** సమీపించినది.

అవసడి. మి. గ్రా. వి. అపవాదము, నింద.

అవసథము. సం. వి. అ. న. **1.** గృహము, ఇల్లు; **2.** బస, మకాము, విడియుచోటు; **3.** గ్రామము; **4.** మఠము; **5.** విద్యార్థులుండు గృహము.

అవసన్నము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** కడముట్టినది; **2.** నశించినది; **3.** విషాదమునొందినది; **4.** స్వకార్యము చేసికొనఁజాలనిది.

అవసరము. సం. వి. అ. పుం. **1.** ఆవశ్యకకార్యము "క. స్వస్తి యొనర్పఁగ నవసర, మాస్తికులకయ్యె" భార. ఆది. ౨, ఆ. ౨౧౯. ఇచట సమయ మని కూడ అనవచ్చును. "ఉ. వావిరి నవ్విలాసవతి వార్తలు పట్టున నెన్నియెన్ని ప్ర, శ్నావసరంబులైన నొకయర్థమునే నడుగంగ." ప్రభా. 3, ఆ. ౧౨; "నాకంతయవసరము వచ్చినపుడు మీసాహాయ్యము గోరెదను;" **2.** తొందర. "అవసరపడకు;" **3.** సమయము, వేళ; **4.** యుక్తసమయము, తఱి. "గీ. నృపసూనునగరి, కేఁగియువరాజునకుఁ దమ్ము నెఱుకసేయుఁ, డనిన నవసరములవారునపుడె పిలువ. సారం. ౨, ఆ. ౨౬౪. (అవసరములవారు = రాజాదుల యుక్తసమయముఁ దెలుపువారు) **5.** కుఱియుట; **6.** మంత్రవిశేషము.

అవసాదకము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** నశింపఁజేయునది; **2.** దుఃఖము కలిగించునది.

అవసాదనము. సం. వి. అ. న. **1.** నశింపఁజేయుట; **2.** క్షీణింపఁజేయుట.

అవసాదము. సం. వి. అ. పుం. **1.** నాశము; **2.** కడ; **3.** దుఃఖము.

అవసాదితము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** క్షీణింపఁజేయఁబడినది; **2.** పోఁగొట్టఁబడినది. "క. సాదరఫణితులనన్నవ, సాదితసమ్మోహుఁగాఁ బ్రసాదింపు తగన్." భార. అర. ౪, ఆ. ౨౬3.

అవసానము. సం. వి. అ. న. **1.** కడ; **2.** ముగియిక, సమాప్తి; **3.** (వ్యాక.) వర్ణాభావము, తరువాత అక్షరములు లేకుండుట; **4.** చావు; **5.** హద్దు; **6.** అశ్వావరోహణముచేయుచోటు.

అవసాయము. సం. వి. అ. పుం. **1.** నిశ్చయము; **2.** ముగియిక, సమాప్తి; **3.** శేషము.

అవసిక్తము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** తడుపఁబడినది; **2.** స్నానముచేసినది.

అవసితము. సం. వి. అ. న. నుఱిచినధాన్యము.— విణ. (అ. ఆ. అ.) **1.** ఎడ్లచే నుఱుపఁబడినది (ధాన్యాది); **2.** తెలియఁబడినది; **3.** ముగిసినది; **4.** నిశ్చయింపఁబడినది; **5.** పక్వమైనది; **6.** కూర్పఁబడినది; **7.** కట్టఁబడినది.

అవసృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** విడువఁబడినది; **2.** ఈయఁబడినది; **3.** పాఱిపోయినది.

అవసేకము. సం. వి. అ. పుం. తడుపుట.

అవసేచనము. సం. వి. అ. న.=అవసేకము.

అవసేయము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** నిర్ణయింపఁబడినది; **2.** సమాప్తిపొందింపఁదగినది.

అవస్కందనము. సం. వి. అ. న. శత్రువుపైని దండెత్తిపోవుట.

అవస్కందము. సం.వి. అ. పుం. **1.** అనర్హసమయములందు శత్రువులపైఁబడుట; **2.** శత్రువులపైని దండెత్తి పోవువారు సేనతో విడిసిన చోటు, పాళెము; **3.** శిబిరము, సేనతోవిడిసిన పటగృహము (డేరా); **4.** అవతరణము, దిగుట.

అవస్కరము. సం. వి. అ. పుం. **1.** వండినపుడు అడుగంటిన అన్నము మొ.; **2.** రథావయవము; **3.** గుహ్యావయవము; **4.** మలము; **5.** తుడిచి ప్రోగు చేసినపెంట.

అవస్త్యము. సం. వి. అ. న. అవసథము, ఇల్లు, నివాసము.

అవస్థ సం. వి. ఆ. స్త్రీ. **1.** అవస్థానము, ఉనికి; **2.** కాలవశమున గలిగెడు స్థితి, శరీరాదుల పరిణామము, దశ, యౌవనావస్థ, మదావస్థ, నిద్రావస్థ మొ.; **3.** కష్టము. "ఆతఁడు తిండిలేక అవస్థ పడుచున్నాఁడు, అట్టి యవస్థ శత్రువునకైనను వలదు."

అవస్థాద్వయము—సుఖము, దుఃఖము.

అవస్థాత్రయము—జాగ్రత్, స్వప్న, సుషుప్తులు.

అవస్థాచతుష్టయము—పైని చెప్పిన యవస్థాత్రయమును మోక్షావస్థయును.ముక్తావస్థకు సుషుప్తి యంతర్భావము, ఇవి జీవావస్థలు;

అవస్థాపంచకము—అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము;

అవస్థాషట్కము—జననము,స్థితి(సత్త),వర్ధనము, విపరిణామము, అపక్షయము, నాశము;

అవస్థాదశకము—నాయికా నాయకులకు గలిగెడు మన్మథావస్థలు—అభిలాషము, చింత, స్మృతి, గుణకథనము, ఉద్వేగము, సంలాపము, ఉన్మాదము, వ్యాధి, జడత్వము, మరణము. కొందఱి మతమున దర్శనము, మనస్సంగము, సంకల్పము, జాగరణము, కృశత్వము, అరతి, లజ్జాత్యాగము, ఉన్మాదము, మూర్ఛ, మరణము వీనికి జ్వరము, సంతాపము జేర్చి ద్వాదశావస్థలని కొందఱందురు. అని శ. ర. శరీరావస్థలు—బాల్య, కౌమార, యౌవన, వార్ధకములు. బాల్యము పంచదశవర్ష పర్యంతము కౌమారము త్రింశద్వర్ష పర్యంతము యౌవనము పంచాశద్వర్ష పర్యంతము తదూర్ధ్వము వార్ధకము. కొందఱిమతమున పంచమాబ్దపర్యంతము కౌమారము, దశమావధిపర్యంతము పౌగండము,పంచదశవర్ష పర్యంతము కైశోరము, తరువాత యౌవనము, డెబ్బదిపైన వృద్ధత్వము. బాల్య, యౌవన, కౌమార, వార్ధకములు, అను వరుస. శ. ర. లో నీయఁబడినది. ఈవరుస లోకమున వినఁబడుచు నున్నది. ఇది ప్రామాదికమనిగాని శబ్దక్రమముకంటె అర్థక్రమము బలీయము అనున్యాయమున కౌమారమును రెండవయవస్థగ గ్రహింపవలయు ననిగాని యెంచుకొనఁదగును. భగవద్గీతయందు 'దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా' అని బాల్య కౌమారములకు, కౌమారశబ్దమునే గ్రహించియవస్థాత్రయమే చూపినాఁడు. ఏమైనను కౌమారము యౌవన పూర్వభావియే యగును. అదియే వ్యుత్పత్తికి సరిపడును.

అవస్థానము. సం. వి. అ. న. ఉనికి.

అవస్థాపనము. సం. వి. అ. న. 1. ఉంచుట; 2. స్థాపించుట.

అవస్థాపనీయము. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఉంచఁదగినది; 2. స్థాపింపఁదగినది.

అవస్థాపితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉంచఁబడినది; 2 స్థాపింపఁబడినది.

అవస్థాప్యము సం. = అవస్థాపనీయము.

అవస్థాయి. సం. విణ. (న్.ఈ-చీ. న్.) ఉండునది.

అవస్థితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఉన్నది. 2. నిలిచినది.

అవస్థితి. సం. వి. ఇ. స్త్రీ. 1. అవస్థానము, ఉనికి; 2. నిలుచుట.

అవస్యందనము. సం. వి. అ. న. క్షరణము, స్రవించుట.

అవస్రంసనము. సం. వి. అ. న. 1. క్రిందఁబడుట; 2. జాఱుట; 3. కాఱుట.

అవహతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. దంపఁబడినది (ధాన్యాది.); 2. కొట్టఁబడినది; 3. చంపఁబడినది.

అవహతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ధాన్యాదులు దంపుట; 2. కొట్టుట; 3. చంపుట.

అవహననము. సం. వి. అ. న. 1. ధాన్యాదులు దంచుట; 2. చంపుట; 3. కొట్టుట.

అవహరణము. సం. వి. అ. న. 1. తొలఁగించుట; 2. సైన్యములను యుద్ధరంగములనుండి శిబిరమునకుఁ బంపుట; 3. అపహరించుట.

అవహరణీయము. సం. విణ. (అ.ఆ.అ.) 1. స్థానాంతరము పొందింపఁదగినది; 2. తప్పక యీయఁదగినది; 3. సమాప్తిపొందింపఁదగినది.

అవహస్తము. సం. వి. అ. పుం=అపహస్తము, వెడచేయి, హస్తపృష్ఠభాగము."చ.... అవ్విషోరగం, బులఁ జరణంబులం జమరి, ముక్కున వాతను సెత్తురొల్కఁగాఁ, దలరఁగ సారథింజఱచెఁ దాన వహస్తమునన్...." భార. ఆది. ౫, ఆ. ౧౭౭.

అవహారకుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. స్థానాంతరమును పొందించువాఁడు; 2. సైన్యములను యుద్ధరంగమునుండి శిబిరమునకు పంపువాఁడు.

అవహారము. సం. వి. అ. పుం. 1. గ్రాహమను జలజంతువు; 2. శ్రాద్ధమున బ్రాహ్మణులు నిమంత్ర

ణముచేయునపుడు వారికిచ్చు పదార్థము తీసికొనిపోవుట, (అట్టిపదార్థమని కొందఱు); 3. యుద్ధమునుండిగాని జూదమునుండిగాని మరలి శిబిరమునకు వచ్చుట; 4. స్థానాంతరముఁ బొందించుట.

అవహారుఁడు. సం. వి. అ. పుం. తస్కరుఁడు, దొంగ.

అవహార్యము. సం. = అవహరణీయము.

అవహాలిక. సం. వి. ఆ. స్త్రీ. ప్రాకారపుగోడ, ఆవరణము.

అవహాసము. సం. వి. అ. పుం. 1. వేళాకోళము; 2. చిఱునవ్వు.

అవహితము. సం. విశే. (అ. ఆ. అ.) (అవధానము నొందినది.) సావధానమైనది, ఇతరధ్యానము లేనిది, తదేకాయత్తము. "క. అక్కురునాథు తోడ నవహితమతివై, వినుమంతయుఁ జెప్పెద." భార. ద్రోణ. ౧, ఆ. ౧౦, "క. ధృతరాష్ట్రకుమారులు నవహితులై పాంచాలుమీఁద నేసిరి." భార. ఆది. ౬, ఆ. ౭౩.

అవహిత్థ. సం. వి. ఆ. స్త్రీ. ఆకారగోపనము, (భయగౌరవ కౌటిల్యములవలన సంతోష విచారాదులను పైకి తెలియకుండఁగ నణఁచుకొనుట, దాఁచుట, గుట్టుగానుండుట.

అవహిత్థము. సం. వి. అ. న. = అవహిత్థ. పుం. అభినయహస్తవిశేషము.

అవహేల. సం. వి. ఆ. స్త్రీ. = అవహేలనము.

అవహేలనము. సం. వి. అ. న. 1. తెగడుట, నిందించుట; 2. అనాదరము.

అవహేలము. సం. వి. అ. పుం. = అవహేలనము.

అవహేలితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అవమానపఱుపఁబడినది; 2. అనాదరము చేయఁబడినది.

అవాంతరదిక్కు. సం. వి. క. స్త్రీ. విదిక్కు, కోణము, మూల.

అవాంతరము సం. వి. అ. న. విఘ్నము, అడ్డు. "ఎన్నియవాంతరములు వచ్చినను తలఁచినపని మానరాదు."—విశే. (అ. ఆ. అ.) 1. లోపలిది; 2. నడుమసంభవించినది.

అవాంత్రము. వై. వి. (సం. అవాంతరమ్. క. అవాంత్రవు.) 1. విఘ్నము, ప్రతిబంధము; 2. కష్టము, ఇడుము.

అవాక్శిరస్కుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) 1. వంచుకొనఁబడిన తలగలవాఁడు; 2. తలక్రిందుగా నున్నవాఁడు.

అవాక్పుష్పి. సం. వి. ఈ. స్త్రీ. (అధోముఖములైన పువ్వులుగలది.) 1. సదాప; 2. బ్రహ్మదండి.

అవాగ్రము. సం. విశే. (అ. ఆ. అ.) 1. క్రిందికి వంగిన యగ్రముగలది; 2. అవనతము, వంగినది.

అవాఙ్మనసగోచరుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) వాక్కునకును మనస్సునకును గోచరముగానివాఁడు, చెప్పుటకుగాని తలఁచుటకుగాని శక్యము కానివాఁడు.

అవాఙ్మానసగోచరుఁడు. సం.=అవాఙ్మనసగోచరుఁడు.

అవాఙ్ముఖుఁడు. సం. విశే. (అ.ఈ.-ఖీ.అ.) 1. అధోముఖుఁడు, తలవంచుకొనినవాఁడు; 2. తలక్రిందుగా నున్నవాఁడు.

అవాచి. సం. వి. ఈ. స్త్రీ. దక్షిణదిక్కు.

అవాచీనము. సం. విశే. (అ. ఆ. అ.) 1. దక్షిణదిక్కునఁ బుట్టినది; 2. వ్యత్యస్తమయినది, తాఱుమాఱయినది.

అవాచ్యము. సం. వి. అ. న. దూఱుమాట, నిందావాక్యము.—విశే. (అ. ఆ. అ.). చెప్పఁదగనిది; 2. చెప్పశక్యముగానిది; 3. నిందింపఁదగినది; 4. అభిధావృత్తిచేత బోధించుటకు శక్యముకానిది; (అర్థము.) 5. ఉచ్చరింపఁగూడనిది. (మాట, పేరు.)

అవాచ్యుఁడు. సం. వి. అ. పుం. (యజ్ఞాదిసమయములందు ఉచ్చరింపఁదగనివాఁడు). 1. చండాలుఁడు, చెప్పరానివాఁడు; 2. పాపాత్ముఁడు.—విశే. చూ. అవాచ్యము.

అవాజా. హిం. వి. వదంతి, ప్రతీతి.

అవానము. సం. వి. అ. పుం. నిశ్వాసము.—విశే. (అ.ఆ.అ.) అశుష్కము, ఎండనిది (వానము = శుష్కము.)

అవాపము. సం. వి. అ. పుం. ఆలవాలము, పాదు,

అవాపితము. సం. విశే. (అ. ఆ. అ.) పొందింపఁబడి నది.

అవాప్తము. సం. విశే. (అ. ఆ. అ.) ప్రాప్తము, పొందఁబడినది.

అవాప్తవ్యము. సం. విశే. (అ.ఆ.అ.) పొందఁదగినది.

అవాప్యము. సం. విశే. (అ. ఆ. అ.) ప్రాప్యము, పొందఁదగినది.

అవాప్తి. సం. వి. ఇ. స్త్రీ. ప్రాప్తి, పొందుట.

అవాయి. దే. వి. ఆకాశబాణము, పైకిపోవు బాణ సంచు. (తారాజువ్వగొట్టము మొ.)

అవారణ. సం. వి. ఆ. స్త్రీ. (అవారణము అనుదాని 'ము'వర్ణము లోపింపఁగా మిగిలినరూపమనవచ్చు.) అవారణము, అడ్డులేమి. "క. ననఫింబడు మేడి పం డ్లవారణ లోలోఁ, దెసచు" వేం. పంచ. ౪-౮౯; "మద్గురుఁడవారణామై" విక్ర. ౨, ఆ. ౬.

అవారణము. సం. వి. అ. న. అడ్డులేమి.—విశే. (అ. ఆ. అ.) అడ్డులేనిది.

అవారణీయము. సం. విశే. (అ.ఆ.అ.) 1. మరలింప శక్యముగానిది; 2. నివారింపఁదగినది.

అవారపారము. సం. వి. అ. పుం. సముద్రము.

అవారపారీణుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) పార మును పొందినవాఁడు, అంతుచూచినవాఁడు.

అవారము. సం. వి. అ. న. (నీటిచే ఆవరింపఁబడ నిది) 1. సముద్రతీరము, సముద్రపుటొడ్డు; 2. ఈవలిదరి.

అవార్యము. సం. = అవారణీయము.

అవారి. వై. విశే. 1. అపారము, అపరిమితము; 2. అవార్యము, అడ్డులేనిది, అప్రతిహతము—క్రి. విశే. 1. అపరిమితముగా; 2. అడ్డులేకుండఁగా. (రూ. అవ్వారి.)

అవారితము. సం. విశే. (అ. ఆ. అ.) (నివారింపఁ బడనిది). 1. అడ్డగింపఁబడనిది; 2. నిషేధింపఁ బడనిది.

అవాసనుఁడు. సం. వి. న్. పుం. జినదేవత, బుద్ధ భేదము.—విశే. 1. వస్త్రములేనివాఁడు; 2. వస్త్రముధరింపనివాఁడు, దిసమొలవాఁడు.

అవాస్తవము. సం. విశే. (అ. ఆ. అ.) నిజము కానిది, అసత్యము.

అవి. ఉభ. దే. స. 'అది' అనుదానికి బహువచన రూపము. "అవి మావి, ఇవి మీవి"—సం. వి.ఇ. స్త్రీ. ముట్టుది. పుం. 1. ఎలుక; 2. కంబళి; 3. కొండ; 4. గొఱ్ఱె; 5. సూర్యుఁడు; 6. గాలి; 7. గుడి మొ. వాని చుట్టుగోడ; 8. కనుబొమ్మ.

అవికటము. సం. వి. అ. పుం. మేషసముదాయము, గొఱ్ఱెలగుంపు.—విశే. (అ.ఆ.అ.) 1. ఉగ్రము కానిది, సౌమ్యము; 2. వంకరకానిది; 3. కుటి లముకానిది. (స్వభావము.)

అవికలము. సం. విశే. (అ.ఆ.అ.) (వికలముకానిది.) 1. విచ్ఛిన్నముకానిది; 2. హీనముకానిది.

అవికిరి. దే. వి. నలికండ్లపాము.

అవిగీతము. సం. విశే. (అ. ఆ. అ.) 1. నిందితము గానిది; 2. స్తుతింపఁబడినది; 3. శ్రేష్ఠము.

అవిఘ్నము. సం. వి. అ. పుం. కలివెలి.

అవిఘ్నము. సం. విశే. (అ.ఆ.అ.) విఘ్నములేనిది. —అవ్య. అ. న. విఘ్నములేమి.

అవిచారితము. సం. విశే. (అ. ఆ. అ.) విచారింపఁ బడనిది, ఆలోచింపఁబడనిది. (అవిచారితరమ ణీయము=అవిచారితమయినపుడే రమణీయముగా నుండునది, విచారణచేసినపుడు రమణీయము గానిది, ఆపాతరమణీయము.)

అవిచ్ఛిన్నము. సం. విశే. (అ. ఆ. అ.) విచ్ఛిన్నము కానిది, ఎడతెగనిది, తెంపులేనిది.

అవిటి. దే. విశే. వికలము, 1. గ్రహణాదిశక్తిలేనిది. (అవిటికన్ను, అవిటిచేయి, అవిటికాలు, మొ.) 2. బలములేనిది, జిగిలేనిది; (ఆ స్తంభము అవి టిగానున్నది, అవిటికఱ్ఱ మొ.); 3. అంగహీ నుఁడు, పోగండుఁడు.

అవిత. సం. విశే. (బు. ఈ-త్రీ. బు.) కాచు వాఁడు, రక్షించువాఁడు.

అవితథము. సం. వి. అ. న. సత్యమైనవాక్యము. —విశే. (అ. ఆ. అ.) 1. అసత్యముగానిది; 2. వ్యర్థముగానిది, సఫలమైనది, ప్రయోజనముతోఁ గూడినది. "క. అవిహతగతులను, సమరమహిం గ్రీడిరథము సను నవితథమై." భార. విరా. ౫, ఆ. ౪౬.

గనెనసి చిట్టాడుచు, నల్లన చను బువ్వఁబెట్టు మవ్వా యనుచున్” భాగ. ౧౦. పూ, ౩౦౩; “ఆ. బలియు సిట్టి భీము బ్రాహ్మణార్థముగా. నసుర వాతఁ ద్రోతునవ్వ యిల్లు” భార. ఆది. ౬, ఆ. ౨౭౧; 2. తండ్రిపత్ని; 3. తల్లితల్లి. “సీ. అవ్వయంచును ప్రేమనిప్పటిల్లఁ జేరి మురిపెంపు మనుమఁడు ముద్దుగునియె.” దశా. ౩. ౫౦; 4. సాధ్వి, పూజ్యురాలు. “ప. ఆవ్వా నీ ప్రశ్నంబు నకు నుత్తరంబయ్యుద్దిష్టిరుండు సెప్పవలయు.” భార. సభా. ౨,ఆ. ౨౮౫. “ఆ. అవ్వ నీవు వేల్ప పగుపని కొందఱు,మెఁగిక కేలు మొగిచి మ్రొక్కి- రంత.” భార. ఆర. ౨, ఆ. ౧౦౩; “క. అవ్వల నెఱుఁగక మువ్వురి,కవ్వల వెలుఁగొందు పరముఁ డర్భకుఁడై యా,యవ్వలకు సంతసంబుగ, నవ్వా యవ్వాయనంగ నల్లన నేర్చెన్.” భాగ. ౧౦. పూ. ౨౯౮; 5. వృద్ధస్త్రీ. “అవ్వవలె వంగిపోతి వేమి” సా. “అవ్వయుఁగావలెను బువ్వయుఁ గావలెను.”

అవ్వల. దే. =అవల 1. “తే. ఇవ్వలవ్వల దైత్యు లట్టిట్టుఁ ద్రోయ.” దశా. ౨. ౧౦౨. “క. ఎవ్వ నితో సెచ్చోటం, జివ్వకుఁ జే సాఁపవలదు చే సాఁచినచో, నివ్వలనవ్వల నెవ్వరు, నవ్వక యుండంగఁ బగర నణఁగింపఁదగున్.” కాశీ. ౧, ఆ. ౧౦౯; 2. “క. ...క్రొవ్వినమాంసంబు గలదు కొనుమాఁకలియున్, నొవ్వియును దీఱు నంకట,నవ్వల నారోగ్యమగు మృగాధిప నీకున్” నా. పంచ. ౧. ౩౯౯.—విణ. “క. అవ్వలి దిక్కు మోమయి...” నై. ఆ. ౬, ౧౧౩; “చ. అలుకఁ దుషారశైలసుత యవ్వలిమో మయి...” హర. ఆ. ౪, ౩౪. (అవ్వలమో మయి=పెడమొగము పెట్టుకొని)—అవ్వల ద్రో యు=తిరస్కరించు.

అవ్వల్. హిం. విణ. మొదటి, శ్రేష్ఠమైన. శ. ర.

అవ్వలకించుకొను దే. స. క్రి. (త్రోసివేయు) చెరుగు. “సీ. ఒడికంబుగా వ్రేసి యొక్కింత నేలపై నెరుసవడ్లను బోసి యెండ నెఱపి, యొయ్య నొయ్యన క్రాసి యుముక నవ్వలకించికొని నేర్పు మైగరకూరవిలిచి.” దశకు. ౧౦, ఆ. ౧౦౫.

అవ్వాటి. వై. విణ. = అవాటి. “సీ. శతశృంగగిరిఁ బర్ణశాలఁ గట్టుకొని సమర్పించుఁ గోటుల కొలఁది మీఱ,వచ్చునతిథుల నెల్ల నవ్వాటిగాఁగ షడ్రసాన్నంబు వరలబ్ధసస్యవృద్ధి, కలిమినంతట నొక కొంతకాలమునకు.” వరా. ౧౦, ఆ. ౨౬.

అశంకితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. సంశయింపఁ బడనిది; 2. భయములేనిది. “క. అనినం జల మునఁ గుంతీ, తనయాగ్రజుఁ డిట్టులనియె దరహా సం బ్యాననమున ముసుఁగువడఁగన, జ్జననాయ కుతోడ ని ట్లశంకితభంగిన్.” భార. విరా. ౫, ఆ. ౨౫౬.

అశక్తము. సం. విణ. (అ. ఆ. అ.) శక్తముకానిది, సమర్థముకానిది.

అశక్యము. విణ. (అ.ఆ.అ.) శక్యముకానిది, చేయ నలవికానిది, అసాధ్యము.

అశనము. సం. వి. అ. న. 1. అన్నము; 2. భోజ నము, తిండి; 3. అసనము, వేగిస♆.

అశనాయ. సం. వి. ఆ. స్త్రీ. (తినవలెననునిచ్ఛ) బుభుక్ష, ఆఁకలి.

అశనాయితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) బుభు క్షితుఁడు, ఆఁకలిగొన్నవాఁడు.

అశని. సం. వి. ఇ. పుం. స్త్రీ. 1. పిడుగు; 2. వజ్రా యుధము; 3. మెఱపు.

అశబ్దవాది. సం. వి. న్. పుం. సాంఖ్యుఁడు, యోగ విశేషముగలవాఁడు.

అశరీరము. సం. వి. అ. న. 1. శరీరములేమి; 2. బ్రహ్మము.—విణ. (అ. ఆ. అ.) 1. శరీరము లేనిది; 2. శరీరాభిమానములేనిది. (అశరీరుఁడు= జీవన్ముక్తుఁడు.)

అశరీరవాక్కు. సం. వి. చ్. స్త్రీ. శరీరము కనఁబడ కుండఁగనే పలికినపలుకు, ఆకాశవాణి.

అశరీరవాణి. సం. వి. ఈ. స్త్రీ. = అశరీరవాక్కు.

అశర్మము. సం. వి న్. న. అసుఖము, దుఃఖము. “మ. నిశ్శంకం బతిక్రూరకర్మములం దుద్యతు లైన వారికి నశర్మప్రాప్తి గాకుండునే.” భార.ఆది. ౭, ఆ. ౧౩౬.—విణ. న్. సుఖము లేనిది.

అశాలాకము. సం. వి. అ. న. కోలజున్ను, పుట్టలో పెట్టినతేనె.

అశాస్త్రీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. శాస్త్ర సంబంధముకానిది; 2. శాస్త్రసమ్మతముకానిది.

అశితము. సం. విణ. (అ. ఆ. అ.) భక్షితము, తినఁబడినది.

అశిశ్వి. సం. వి ఈ. స్త్రీ. వంధ్య, గొడ్రాలు.

అశిరస్కము. సం. వి. అ. పుం. (తలలేనిది) రాహుగ్రహము.—విణ. (అ. ఆ. అ.) తలలేనిది.

అశీతి. సం. వి. ఇ. స్త్రీ. ఎనుబది.

అశుచి. సం. విణ. ఇ. పరిశుద్ధముకానిది, శుచిగాలేనిది.

అశుద్ధము. సం. వి. అ. న. 1. మలము; 2. మయిల. విణ. (అ. ఆ. అ,) అశుచి, పరిశుద్ధముకానిది.

అశుభము. సం. వి. అ. న. 1. కీడు; 2. చావు గుఱుతు.—విణ. (అ. ఆ. అ.) అమంగళము. శుభముకానిది.

అశూరుఁడు. సం. వి. అ. పుం. శూరుఁడు కానివాఁడు.

అశేషము. సం. విణ. (అ. ఆ. అ.) 1 మిగులు లేనిది; 2. నిఖిలము, అంతయు. "ఉ. చేతుల తీఁటవోనిటు లశేషబలంబుల నుగ్గుసేసి మాం,సాతతపంకమై బహువిధాయుధ మీనము లొప్పు." భార. విరా. ౫, ఆ. ౧౫౭.

అశోక. సం. వి. ఆ. స్త్రీ. కటుకరోహిణి.

అశోకము. సం. వి. అ. న. (శోకము లేకుండఁ జేయునది)పాదరసము. పుం. కంకేళి (స్త్రీపాదతాడనము దీనికి దోహదమని కావ్యప్రసిద్ధి)—విణ. (అ. ఆ. అ.) శోకములేనిది.

అశోకరోహిణి. సం. వి. ఈ. స్త్రీ. కటుకరోహిణి.

అశోకుఁడు. సం. వి. అ. పుం. 1. దశరథుని మంత్రులలో నొకఁడు; 2. క్రీ. పూ. 234-198 సం॥ కాలమున హిందూసామ్రాజ్యము నేలిన మౌర్య చక్రవర్తి. (బౌద్ధమతవ్యాప్తికి మూలకారకుఁడు.) —విణ. చూ. అశోకము.

అశ్రైవుఁడు. సం. వి. అ. పుం. శైవుఁడుకానివాఁడు.

అశౌచము. సం. వి. అ. న. 1. శుచిత్వములేమి; 2. విహితకర్మ లాచరించుటకు అనధికారిత్వము ను గలిగించు అధర్మవిశేషము (మైల, పురుడు.)

అశ్మంతము. సం. వి. అ. న. 1. ప్రొయ్యి; 2. చావు; 3. దుఃఖము.—విణ. (అ. ఆ. అ.) మేరలేనిది.

అశ్మకుట్టకము. సం. వి. అ. పుం. కాసెయులి.

అశ్మకుట్టకుఁడు. సం. వి. పుం. 1. రాతిపనివాఁడు; 2. వానప్రస్థుఁడు.

అశ్మగర్భము. సం. వి. అ. పుం. మరకతము, పచ్చ.

అశ్మగర్భజము. సం. వి. అ. పుం. 1. పిండిబండ; 2. మరకతము, పచ్చ.

అశ్మజతువు. సం. వి. ఉ. న. సిలాజతు.

అశ్మజము. సం. వి. అ. న. గిరిజము, సిలాజిత్తు.

అశ్మదారణము. సం. వి. అ. పుం. టంకము, రాతియులి.

అశ్మపుష్పము. సం. వి. అ. న. 1. రాతిపువ్వు; 2. శిలాజతు.

అశ్మభాలము. సం. వి. అ. న. పదార్థములు గుండ కొట్టుకొనుట కుపయోగింపఁబడు ఇనుపపాత్ర, హమానదిస్తే, అమానుదస్తా.

అశ్మము. సం. వి. న్. పుం. ఉపలము, రాయి.

అశ్మరి. సం. వి. ఈ. స్త్రీ. నీరుకట్టురోగము, మూత్రకృచ్ఛ్రము.

అశ్మరీఘ్నః. సం. వి. ఆ. స్త్రీ. ఉలిమిరి.

అశ్మసారము. సం. వి. అ. పుం. న. లోహము, ఇనుము.—విణ. (అ. ఆ. అ.) రాతివలె కఠినమైనది.

అశ్రద్ధ. సం. వి. ఆ. స్త్రీ. శ్రద్ధలేమి, అసడ్డ.

అశ్రద్ధేయము. సం. విణ. (అ. ఆ. అ.) విశ్వసింపఁదగనిది.

అశ్రమము. సం. విణ. (అ. ఆ. అ.) శ్రమములేనిది, సులభము. "ఆ. కీర్తిలేనివానికిని జీవనంబుని, రర్థకంబ చూవె యవనిమీఁది, నిత్యమయినధనము నిర్మలకీర్తియ, యట్టికీర్తి వడయుటశ్రమంబె." భార. ఆది. ౮, ఆ. ౩౧.

అశ్రము. సం. వి. అ. న. 1. అశ్రువు, కన్నీరు; 2. కత్తిలోనగువాని వాదర, అశ్రి.

అశ్రాంతము. సం. విణ. (అ. ఆ. అ.) ఎడతెగనిది, విరామములేనిది.—క్రి.విణ. అ. న. ఎల్లప్పుడు, విరామము లేకుండఁగ.

అశ్రి. సం. వి. ఇ. స్త్రీ. 1. కోటి, అంచు; 2. కొంగు; 3. ఆయుధధార.

అశ్రీకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సంపదలేని వాఁడు.

అశ్రుపాతము. సం. వి. అ. పుం. 1. కన్నీరు కార్చుట; 2. ఏడుపు.

అశ్రువు. సం. వి. ఉ. న. 1. అశ్రము, కన్నీరు; 2. పుసి; 3. సాత్త్వికభావభేదము.

అశ్లీలము. సం. వి. అ. న. 1. అర్థదోషవిశేషము; 2. శబ్దదోషవిశేషము.—విణ. (అ. ఆ. అ.) అసభ్యము. సిగ్గునుగాని రోఁతనుగాని కలిగించునది. (మాట, వాక్యము.)

అశ్లేష. సం. = ఆశ్లేష.

అశ్వ. సం. వి. ఆ. స్త్రీ. 1. పెన్నేరు ♣; 2. ఆఁడు గుఱ్ఱము.

అశ్వకర్ణము. సం. వి. అ. పుం. 1. ఇనుమద్ది♣; 2. గుఱ్ఱముచెవి.

అశ్వఖరజము. సం. వి. అ. పుం. (గుఱ్ఱమునకు గాడిదెకు పుట్టినది.) వేసడము, కంచెరగాడిదె.

అశ్వఖుర. సం. వి. ఆ. స్త్రీ. తెల్లదింటెన♣.

అశ్వగంధ. సం. వి. ఆ. స్త్రీ. పెన్నేరు ♣.

అశ్వఘ్నము. సం. వి. అ. పుం. (గుఱ్ఱమునుచంపునది) ఎఱ్ఱగన్నేరు♣.

అశ్వచికిత్స. సం. వి. ఆ. స్త్రీ. గుఱ్ఱములవైద్యము.

అశ్వతరము. సం. వి. అ. పుం. 1. కంచరగాడిద; 2. ఒకానొకపాము. (ఇది వరుణలోకమున నుండునది.)

అశ్వతిక్తము. సం. వి. అ. పుం. వేము♣.

అశ్వత్థ. సం. వి. ఆ. స్త్రీ. పున్నమ.

అశ్వత్థము. సం. వి. అ. పుం. రావి♣.

అశ్వత్థాముఁడు. సం. వి. న్. పుం. కృపీసుతుఁడు, ద్రోణాచార్యుని కొమారుఁడు. (భారతయుద్ధమున సుప్రసిద్ధుఁడు.)

అశ్వదంష్ట్ర. సం. వి. ఆ. స్త్రీ. పల్లేరు♣.

అశ్వద్ధుఁడు. సం. వి. అ. పుం. 1. నారాయణుఁడు; 2. సూర్యుఁడు; 3. అగ్ని.

అశ్వద్రువు. సం. వి. ఉ. పుం. తుమ్మ♣.

అశ్వభత్య. సం. వి. ఆ. స్త్రీ. ముద్దఖర్జూరము♣.

అశ్వమహిషిక. సం. వి. ఆ. స్త్రీ. 1. గుఱ్ఱమునకును ఎనుబోతునకును గల విరోధము; 2. సహజవైరము; 3. కరవీరము, గన్నేరు♣.

అశ్వము. సం. వి. అ. పుం. తురగము, గుఱ్ఱము. (అశ్వవిశేషములు.—ఇంద్రాయుధము, మల్లికాక్షము, కోణము, శ్రీవృక్షకి, హారితము, హాలహాలము, హేమము ఇత్యాదు లనేకములు. దీని ఉత్పత్తి సప్తవిధము. దీని బొడ్డుసుడి శ్రీవృక్షకము. మెడసుడి రోచమానము. నిలువుసుడి పురుషకము. దీని యగ్రభాగము వంకము. ఖురము పుటము. గతి విక్రాంతి. కవచము ప్రఖరము. మునికోల ప్రతోదము. పగ్గము రశ్మి. పొర్లిక ఉపతనము. శ. ర.)

అశ్వముఖుఁడు. సం. వి. అ. పుం. (గుఱ్ఱపు ముఖము వంటి ముఖముగలవాఁడు) కిన్నరుఁడు.

అశ్వమేధము. సం. వి. అ. పుం. అశ్వమును పశువుగా నేర్పఱిచిచేయు క్రతువు. (ఆగుఱ్ఱమును దిగంతర్యంతముపంపి యడ్డువచ్చినవారిని జయించిన సార్వభౌముఁడు చేయవలసిన యాగము.)

అశ్వమేధికము. సం. వి. అ. న. అశ్వమేధమును గుఱించి భారతమునఁ జెప్పిన పదునాలుగవ పర్వము.

అశ్వమేధీయము. సం. విణ. (అ. ఆ. అ.) అశ్వమేధమున కుపయోగించు గుఱ్ఱము.

అశ్వయుక్కు. సం. వి. జ్. స్త్రీ. అశ్వినీనక్షత్రము.

అశ్వరోహుఁడు. సం. వి. అ. పుం. గుఱ్ఱపురౌతు.

అశ్వలాల. సం. వి. అ. పుం. నలికండ్లపాము.

అశ్వవాలము. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱపుతోఁక. 2. గుఱ్ఱపుతోఁకవెంద్రుక; 3. ఱెల్లు ♣.

అశ్వహృదయము. సం. వి. అ. న. 1. గుఱ్ఱము యొక్క మనస్సు; 2. గుఱ్ఱముయొక్క కోరిక; 3. గుఱ్ఱముయొక్క అభిప్రాయము తెలిసికొనుటకు సాధనమైన విద్య. (ఈవిద్యయందు నలుఁడు సుప్రసిద్ధుఁడు.)

అశ్వాతరము. సం. వి. అ. పుం. 1. అడవి; 2. ధాన్యమునకు పట్టుకీటకము, చిలకపిట్ట; 3. అశ్వపంక్తి; 4. అశ్వమేధము.

అశ్వారి. సం. వి. ఇ. పుం. మహిషము, దున్నపోతు.

అశ్వారోహ. సం. వి. ఆ. స్త్రీ. పెన్నేరుగడ్డ.

అశ్వారోహుఁడు. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము నెక్కువాఁడు, గుఱ్ఱపురౌతు; 2. గుఱ్ఱము నెక్కి యుద్ధము చేయువాఁడు.

అశ్వికుఁడు. సం. వి. అ. పుం. ఆశ్వికుఁడు, గుఱ్ఱపు రౌతు.

అశ్విని. సం. వి. ఈ. స్త్రీ. అశ్వయుక్కు, ఇరువదియేడు నక్షత్రములలో మొదటిది.

అశ్వినీకుమారులు. సం. వి. అ. పుం. బ. అశ్వినీ దేవతలు, దేవవైద్యులు.

అశ్వినులు. సం. = అశ్వులు. "ఆ. పతికిఁబరమభక్తిఁ బరిచర్య సేయుచు, నొనరఁగా సుకన్య యుండు నంత, నాలతాంగికడకు నశ్వినులేతెంచి, తమ్మెఱుంగఁజెప్పి దానికనిరి." భార. అర. 3, ఆ. ౧౭౩.

అశ్వీనము. సం. వి. అ. న. గుఱ్ఱముచేత ఒకదినము పోఁదగినదారి.

అశ్వీయము. విం. వి. అ. న. గుఱ్ఱపుసమూహము.—విశే. (అ. ఆ. అ.) గుఱ్ఱమునకు హితమైనది.

అశ్వుఁడు. సం. వి. అ. పుం. అశ్వజాతిపురుషుఁడు.

అశ్వులు. సం. వి. న్. పుం. ద్వి. అశ్వినీసుతులు, అశ్వినీకుమారులు.

అశ్వేతరము. సం. వి. అ. పుం. అశ్వతరము, కంచెరగాడిదె.

అశ్వోరసము. సం. వి. అ. న. ముఖ్యమైనగుఱ్ఱము.

అషడక్షీణము. సం. విశే. (అ. ఆ. అ.) (ఆఱు కన్నులఁబడనిది. మూఁడవవాఁడెఱుఁగనిది.) ఇద్దఱికంటె నన్యులెఱుఁగనిది. (మంత్రము మొ.) "మకరకేతనుఁడు అషడక్షీణషాడ్గుణ్యమంత్రి."

అషాఢ. సం. వి. ఆ. స్త్రీ. అశ్విన్యాదినక్షత్రములలో నిరువది యిరువదియొకటవ నక్షత్రము.

అష్ట. సం. వి. ఆ. స్త్రీ. ఎనిమిదితలలుగల వీణె.—విశే. న్. ఎనిమిది. (తెనుఁగున సమాసపూర్వపదముగనే ప్రయోగము. "అష్టదిగ్గజములు."

అష్టక. సం. వి. ఆ. స్త్రీ. 1. అష్టమీతిథి; 2. హేమంత శిశిరఋతువులలోని బహుళాష్టమీతిథులయందు చేయు శ్రాద్ధవిశేషము.

అష్టకము. సం. విశే. ఎనిమిది యవయవములు కలది.—వి. అ. న. 1. ఎనిమిది అధ్యాయములుగాని, ఎనిమిది శ్లోకములుగాని కల గ్రంథవిశేషము. "గంగాష్టకము;" 2. ఎనిమిది. (అంకె); 3. పాణిని రచించిన యష్టాధ్యాయి; 4. ఎనిమిదింటి సమూహము; 5. వేదమందుఁగల భాగము, అట్టము.

అష్టకర్ణుఁడు. సం. వి. అ. పుం. (ఎనిమిది చెవులు గలవాఁడు) చతుర్ముఖుఁడు, బ్రహ్మ.

అష్టకష్టములు. సం. వి. అ.న.బ. ఎనిమిదికష్టములు— 1. దేశాంతరగమనము; 2. భార్యావియోగము; 3. ఆపత్కాలమున బంధుదర్శనము; 4. ఉచ్ఛిష్ట భోజనము; 5. శత్రుస్నేహము; 6. పరాన్న ప్రతీక్షణము; 7. అప్రతిష్ఠ; 8. దారిద్ర్యము.

అష్టగుణము. సం. విశే. (అ.ఆ.అ.) 1. ఎనిమిదిగుణములు కలది; 2. ఎనిమిదిరెట్లుగలది.

అష్టక్యము. సం. విశే. (అ. ఆ. అ.) ఎనిమిదితో కొనఁబడినది.

అష్టతయము. సం. విశే. (అ. ఈ. అ.) ఎనిమిదియవయవములు గలది.

అష్టత్రికము. సం. వి. అ. న. (ఎనిమిదిమూఁడులు) ఇరువదినాలుగు.

అష్టదిక్కులు. సం. వి. శ్. స్త్రీ. బ. తూర్పు, ఆగ్నేయము, దక్షిణము, నైరృతము, పడమర, వాయవ్యము, ఉత్తరము, ఈశాన్యము అను దిక్కులు.

అష్టదిగ్గజములు. సం. వి. అ. పుం. బ. ఎనిమిది దిక్కులయందలి ఏనుఁగులు. (ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతీకము.) ఇవి క్రమముగా పూర్వాదిదిక్కులయందుండు గజములు.)

అష్టదిక్పాలురు. సం. వి. అ. పుం. బ. ఎనిమిది దిక్కులను పాలించువారు (ఇంద్రుఁడు, అగ్ని, యముఁడు, నిరృతి, వరుణుఁడు, వాయువు, కుబేరుఁడు, ఈశానుఁడు. వీరు పూర్వాదిదిక్కులకుఁ బాలకులు.)

అష్టధాతువులు. సం. వి. ఉ. పుం. బ. బంగారు, వెండి, రాగి, తగరము, తుత్తినాగము, సీసము, ఇనుము, పాదరసము—అను ఎనిమిది ధాతువులు.

అష్టనాగములు. సం. వి. పుం. బ. వాసుకి, అనంతుఁడు, తక్షకుఁడు, శంఖపాలుఁడు, కుళికుఁడు, పద్ముఁడు, మహాపద్ముఁడు, కర్కోటకుఁడు. అను నాగములు.

అష్టపత్రిక. సం. వి. ఆ. స్త్రీ. నాగమల్లె♣.

అష్టభాగ్యములు. సం. వి. అ. న. బ. రాజ్యము, భండారము, సైన్యము, ఏనుఁగులు, గుఱ్ఱములు, ఛత్రము, చామరము, ఆందోళిక. అనునవి.

అష్టభోగములు. సం. వి. అ. పుం. బ. 1. గృహము, శయ్య, వస్త్రము, ఆభరణము, స్త్రీ, పుష్పము, గంధము, తాంబూలము; 2. నిధి, నిక్షేపము, జల, పాషాణ, అక్షీణ, అగామి, సిద్ధ, సాధ్యములు.

అష్టమంగళము. సం. వి. అ. పుం. మొగము, తోఁక, జూలు, ఱొమ్ము, గొరిజలును, తెల్లగానున్నగుఱ్ఱము.—బ. 1. సింహము, వృషభము, నాగము, కలశము, వ్యజనము, వైజయంతి, భేరి, దీపము; 2. బ్రాహ్మణుఁడు, గోవు, అగ్ని, బంగారు, నేయి, ఆదిత్యుఁడు, జలము, రాజు.

అష్టమకాలికుఁడు. సం. విణ. (అ.ఈ.అ.) (ఎనిమిదవ కాలము భోజనకాలముగాఁగలవాఁడు) మూఁడు దినములఁ నొకపూఁటయు నుపవాసముండి నాల్గవ నాఁటి రాత్రి భుజించువాఁడు. (ఇతఁడు వానప్రస్థులలో నొకఁడు.)

అష్టమదములు. సం. వి. అ. పుం. బ. భోజనము, అర్థము, స్త్రీ, విద్య, కులము, రూపము, ఉద్యోగము, యౌవనము అనువానివలనఁ గలుగు మదములు.

అష్టమము. సం. స. (అ. ఈ. అ.) ఎనిమిదవది.

అష్టమి. సం. వి. ఈ. స్త్రీ. ఎనిమిదవతిథి.

అష్టమూర్తి. సం. వి. ఇ. పుం. (ఎనిమిది స్వరూపములు గలవాఁడు, శివుఁడు. (పంచభూతములును, సూర్యచంద్రులును, యాగముచేయు యజమానుఁడును శివుని యష్టమూర్తులు.)

అష్టశ్రవణుఁడు. సం. = అష్టకర్ణుఁడు.

అష్టశ్రవుఁడు. సం. వి. స్. పుం. = అష్టకర్ణుఁడు.

అష్టస్వామ్యములు. సం. వి. అ. న. బ. విక్రయ, దాన, వినయ, జల, తరు, పాషాణ, నిధి, నిక్షేపములు.

అష్టాదశ. సం. విణ. న్. పదునెనిమిది. (తెనుఁగున దీనికి సమాసపూర్వపదముగనే ప్రయోగము) "1. అష్టాదశపురాణములు; 2. అష్టాదశోపపురాణములు; 3. అష్టాదశధాన్యములు; 4. అష్టాదశవిద్యలు; 5. అష్టాదశవివాదస్థానములు; 6. అష్టాదశవర్ణనలు; 7. అష్టాదశస్మృతులు."

అష్టాదశము. సం.విణ. (అ.ఈ.అ.) పదునెనిమిదవది.

అష్టాపదము. సం. వి. అ. పుం, న. 1. నెత్తపలక; 2. బంగారు.—పుం. 1. మీఁగండ్లమెకము; 2. వెండికొండ; 3. సాలెపురుగు; 4. పూర్వాభాద్ర.

అష్టాపది. సం. వి. ఈ. స్త్రీ. మల్లె ♣.

అష్టాపదుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) చదరంగ మాడువాఁడు.

అష్టారక్తము. సం. వి. అ. పుం. ఎఱ్ఱఉత్తరేణి♣.

అష్టావక్రము. సం. విణ. (అ. ఆ. అ.) ఎనిమిదివంకరలు గలది, అసందర్భము, అడ్డాదిడ్డమయినది. "శా. దుష్టాచారులు మిమ్ము గన్గొనఁగ నెంతో దోషముల్ వచ్చు మీ,రష్టావక్రపుఁగూఁతలియ్యెడలఁ గుయ్యంగారణంబేమి." సానం. ౨, ఆ. ౩౧. అష్టావక్రపుఁగూఁతలు = వంకరటింకర మాటలు, అసందర్భపుమాటలు.

అష్టావక్రుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకఋషి, ఏకపాదుని పుత్త్రుఁడు.

అష్టావధానము. సం. వి. అ. పుం. భిన్నములగు నెనిమిది విషయములందొక్కమాఱు నిలఁబడు మేధాశక్తి. చూ. అవధానము.

అష్టావధాని. సం. వి. న్. పుం. అష్టావధానము గలవాఁడు.

అష్టావింశతి. సం. వి. ఇ. స్త్రీ. ఇరువదియెనిమిది.

అష్టి. సం. వి. ఇ. స్త్రీ. భోజనము.—వి. ఈ. స్త్రీ. పదునాఱవ ఛందస్సు.

అష్టీవత్తు. సం. వి. త్. పుం. జానువు, మోఁకాలు.

అష్టైశ్వర్యములు. సం. వి. అ. న. బ. అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశత్వ, వశిత్వములు అను నెనిమిదిశక్తులు.

అష్టోత్తరశతము. సం. వి. అ. న. నూటయెనిమిది.

అసంఖ్యాతము. విణ. (అ.ఆ.అ.) 1. లెక్కింపఁబడనిది; 2. అధికసంఖ్యగలది; 3. ఇంతయనుపరిమాణము లేనిది.

అసంఖ్యేయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. లెక్కపెట్టఁదగనిది; 2. లెక్కపెట్టశక్యముగానిది.

అసంగతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కూడనిది; 2. పొసఁగనిది, పరస్పరవిరుద్ధము.

అసంగతి. సం. వి. ఇ. స్త్రీ. 1. అర్థాలంకారభేదము; 2. కూడికలేమి.

అసందర్భము. సం. వి. అ. పుం. సందర్భములేమి. —విణ. (అ.ఆ.అ.) సందర్భములేనిది, పొసఁగనిది.

అసంపూర్తి. సం. వి. ఇ. స్త్రీ. పూర్తిలేమి.—విణ. ఇ. పూర్తిలేనిది.

అసంబద్ధప్రలాపము. సం. వి. అ. పుం. 1. పరస్పరసంబంధము లేనిమాట, పొసఁగనిమాట; 2. అప్రస్తుతప్రసంగము, ప్రస్తుతముగానిదానిని చెప్పుట; 3. ప్రయోజనము మాలినసంభాషణము.

అసంబద్ధము. సం. సం. విణ. (అ.ఆ.అ.) 1. పరస్పరసంబంధములేనిది, పొసఁగనిది, అసంగతము; 2. సంబంధములేనిది, కూడనిది. "క. వృద్ధని జాత్యంధుండని, బుద్ధివిహీనుఁ డని నన్నుఁ బుత్త్రుఁడు బలద,ర్పోద్ధతుఁడై మెచ్చఁ డసం, బద్ధంబులె కాని వినఁడు పలికినపలుకుల్." భార. ఆర. ౧, ఆ. ౩౦౨.

అసంబాధము. సం. వి. అ. న. 1. సమ్మర్దము లేమి; 2. బాధలేమి.—విణ. (అ.ఆ.అ.) 1. ఇఱుకులేనిది, విశాలము, సమ్మర్దములేనిది; 2. బాధలేనిది.

అసంభవము. సం. వి. అ. పుం. 1. సంభవములేమి; 2. లభింపమి. "వ. నిత్యంబు నొక్కొక్క వనస్పతియందు నొక్కొక్క వన్యఫలంబు భిక్షగొనియసంభవం బయిననాఁ డుపవాసంబు సేసి" భార. ఆది. ౫, ఆ. ౫౯.—విణ. (అ. ఆ. అ.) 1. కలుగనిది, సంభవములేనిది; 2. లభింపనిది.

అసంభావన. సం. వి. ఆ. స్త్రీ. 1. సంభవింపమి; 2. ఊహింపమి.

అసంభావనీయము. సం. = అసంభావ్యము.

అసంభావ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఊహించుటకు శక్యముకానిది; 2. ఊహింపఁదగనిది; 3. సంభవింపనిది, అసంభవము.

అసంశయము. సం. వి. అ. పుం. సంశయములేమి. —విణ. (అ. ఆ. అ.) సంశయములేనిది.—క్రి. విణ. సంశయము లేకుండఁగ.

అసంహతము. సం. వి. అ. పుం. (కలియనిది) బలములు వేఱువేఱుగాఁదీర్చిన వ్యూహము.—విణ. (అ. ఆ. అ.) కూడియుండనిది, వేఱువేఱుగానున్నది.

అసకృత్. సం. అవ్య (తెనుఁగున సమాసపూర్వపదముగానే దీనికి ప్రయోగము) అనేక పర్యాయములు. (అసకృదుపదేశము=అనేక పర్యాయము లుపదేశించుట.) "మాలిని. అసకృదసమఘాటీవ్యాప్తి దృప్తాగ్రయాయీ, ప్రసభజనితవిద్వేట్పట్టణోద్దాహ వేగో,ల్లసితవిచలదుల్కాలంఘితోద్ధ్వాంతవాసీ, వ్యసన విశదలీలావర్ధమానప్రతాపా." హరి. పూ. ౭, ఆ. ౨౪౪.

అసక్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆసక్తిలేనివాఁడు; 2. (కర్మఫలమును) అపేక్షింపనివాఁడు.

అసద్ద. వై. వి. 1. అశ్రద్ధ, లక్ష్యములేమి; 2. నిరసనము. "ఆ. సరకుసేయవను చసద్దమాటలు గొన్ని, యాడినంత నేమి యయ్యెనింద్ర, నీదు శక్తి యింతయే దైవవశమున, నెట్టిపాటివారు నెట్లుఁగారె." భార. శాంతి. ౪, ఆ. ౪౨౬.

అసద్దమాట. = నిరసనవాక్యము.

అసత్. సం. విణ. శత్రంతము (త్. ఈ-సంతీ. త్.) (తెనుఁగున సమాసపూర్వపదముగానే ప్రయోగింపఁబడును) 1. సాధువుగానివాఁడు, దుష్టుఁడు. (అసజ్జనుఁడు, అసత్పథము); 2. లేనిది. "మ. సదసత్సంశయగోచరోదరి శరత్సంపూర్ణచంద్రాననన్." నై. ౩, ఆ. ౨౦.

అసతి. సం. వి. ఈ. స్త్రీ. (సతికానిది) కులట, ఱంకుటాలు.

అసత్యము. సం. వి. అ. న. బొంకుమాట, అనృతము.—విణ. (అ. ఆ. అ.) బొంకు, అబద్ధము.

అసదు. వై. విణ. 1. అల్పము. "అసదుఁగొము." పా. ౨, ఆ. ౯; 2. నికృష్టము. "సీ. గాంగేయ

కుంభజకర్ణులమిగి లేదుఁగాఁ జేసి సముఁడగుఁగాని యసదు, గాఁ దలంపఁగరాదు." భార. శల్య. ౧, ఆ. ౯౧; 3. దుర్బలము; "క. మూలబలము సంతుష్టం,బై బాలిశమగుచున్న యప్పు డసమఁ జోటాలోకించి నడవభూ,పాలకునకు దండమతి శుభంబొనరించుక్." భార. శాంతి. ౨, ఆ. ౪౧3. "డసుమఁజో." అని పాఠభేదము; 4. అల్పుఁడు, తక్కువవాఁడు. "సీ. విరాటుండు నాశసితమ్ములు నాత్మజులును, నసదులే సాత్యకి యలంతులఁబోయెడువాఁడె వృష్ణికుమారవరు లనేకు,లట్టియోధులు పోర నరవాయిఁగొందురే." భార. ఉద్యో. ౧, ఆ. ౨౬౮. "లే. పాండవులు గౌరవులతోడి పగకునొల్ల, క్షోణిభూప్రజానాశన మగుటఁ జేసి, వార లస వసి తలఁపంగపలసనధిక, ధర్మపరులైన కతమునఁ దగవు నడచె." భార. ఉద్యో. ౧, ఆ. ౨3౪.

అసదృశము. సం. విశ. (అ. ఈ. అ.) 1. సమము కానిది, సాటికానిది; 2. సాటిలేనిది.

అసన. సం. వి. ఆ. స్త్రీ. ఉసిరిక*.

అసనపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. సోమిదము*.

అస్యసము. సం. వి. అ. న. విక్షేపము, చిమ్ముట.— పుం. వేఁగిస*.

అసభ్యము. సం. విశ. (అ. ఆ. అ.) 1. సభయందు పచింపఁదగనిది, అశ్లీలము. (వర్ణనాది); 2. సభకుఁ దగనిది. (అసభ్యుఁడు. = సభకర్హుఁడు కానివాఁడు.)

అసమంజసము. సం. విశ. (అ. ఆ. అ.) 1. అసంగతము, పొసఁగనిది; 2. అయుక్తము, తగనిది, మంచిదిగానిది.

అసమగ్రము. సం. విశ. (అ. ఆ. అ.) పూర్ణము కానిది, అసంపూర్ణము.

అసమనేత్రుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, బేసి కంటివాఁడు.

అసమబాణుఁడు. సం. వి. అ. పుం. (బేసిబాణములు గలవాఁడు) పంచబాణుఁడు, మన్మథుఁడు.

అసమము. సం. విశ. (అ.ఆ.అ.) 1. సమముగానిది. 2. సమమయినదిలేనిది; 3. విషమము, బేసిసంఖ్య గలది "అసమశరుఁడు; అసమలోచనుఁడు."

అసమయము. సం. వి. అ. పుం. 1. అనుచితకాలము యుక్తముగానికాలము, అకాలము; 2. దుష్టకాలము.—విశ. (అ.ఆ.అ.) 1. సమయమున లేనిది, యుక్తకాలమునలేనిది; 2. అకాలమునఁ బుట్టినది. (ఫలాది)

అసమర్థము. సం. వి. అ. పుం. కావ్యదోషములలో నొకటి.—విశ. (అ. ఆ. అ.) సమర్థముకానిది.

అసమర్థుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) సామర్థ్యము లేనివాఁడు, సమర్థుఁడు కానివాఁడు.

అసమశరుఁడు. సం. వి. అ. పుం. (బేసితూపుల వాఁడు.) మన్మథుఁడు.

అసమాధానము. సం. వి. అ. న. 1. ప్రత్యుత్తరము లేమి; 2.సమ్మతిలేమి,అసమ్మతి.—విశ.(అ.ఆ.అ.) (సమాధానములేనిది) 1. ప్రత్యుత్తరములేనిది; 2. సమ్మతిలేనిది.

అసమీక్ష్యకారి. సం. విశ. (న్.ఈ.ణీ.న్.) చక్కఁగా నాలోచింపక చేయువాఁడు.

అసము. దే. వి. 1. చనవు; 2. దర్పము, గర్వము. "చ. అసమున మీఁదెఱుంగకమహోగ్రవావృత్తిఁ గడంగి చెచ్చెరన్, బసులకుఁ గూయిగాఁ జనియెఁ బాఁపఁడు." భార. విరా. ౫, ఆ. ౨3౪— వై. కీర్తి, ప్రసిద్ధి. "ఉ. చెన్నగుమానికంబులును జెల్వగుగుఱ్ఱములేనుఁగుల్ పదా, ర్వన్నియపైఁడి కోర్కిఁగడపంగనుబాఁఉలకిచ్చి యెన్నియే, జన్నములెన్నఁ జేయుచు నసంబునమీఱెడు షారుసాటి యే, కన్నియయల్కలేక యొడికంబుగనుండెడు ప్రోడకెయ్యెడన్." య. 3, ఆ. 3౭.

అసమ్మతము. సం. విశ. (అ. ఆ. అ.) 1. అంగీకరింపఁ బడనిది; 2. ఒప్పుకొననిది.

అసరచేయు. దే. అ. క్రి. ఆలస్యముచేయు. శ. ర.

అసరు. దే. వి. ఆకుపసరు, శాకరసము. "సీ. ఒక్కఁ నాఁడ త్తపస్వి వ్రేల్నాటిదర్భ, గంటఁగూరయసరు గాఱినన్ద్రించె." సం. "కుశేన కిల కరే రాజన్ స్తస్యశాకరసోऽస్రవత్." భార. శల్య. ౨, ఆ. ౧౬౦.

అసలారు. దే. అ. క్రి. అతిశయిల్లు. "క. వసియించు నమ్మునితఁ బ్రియ, మసలారఁగఁ గాంచి వచ్చు

నప్పుడ ప్రమదం,బెసఁగంగఁ బెండ్లి సేసెద." భార. ఆను. ౨, ఆ. ౬.

అసలు. దే. వి. అడుసు, పంకము, బురద. హిం. హాసలు, మూలధనము.

అసలుఁబుట్టువు. దే. వి. (అసలు+పుట్టువు.) పంకజము, తామర.

అసలుకొను. దే. అ. క్రి. పంకిలమగు, బురదయగు.

అసహత. సం. వి. ఆ. స్త్రీ. ఓర్వమి. చూ. అసహత్వము.

అసహత్వము. సం. వి. అ. న. సహింపమి, అసహనము, అసూయ. "ఉ. దేవగురుద్విజప్రకరతృప్తికరుఁ వరరాజసూయయజ్ఞావభృథాభిషేకవిమలాంగువిశుద్ధయశోనిధిఁ జగత్పావను ధర్మనందను సభాస్థితుఁ జూచి మువంబు నెందిరింద్రాపరజాదిమిత్రులసహత్వముఁ బొందిరి ధార్తరాష్ట్రులుఁ." భార. సభా. ౨. ఆ. ౭౩ "మిత్రులు నమర్షముఁ బొందిరి." అని పాఠభేదము.

అసహనపడు.మి. అ. క్రి. ఈర్ష్యపడు, అసూయపడు.

అసహనము. సం. వి. అ. న. (సహనములేమి,) 1. ఓర్పులేమి; 2. అసూయ.

అసహనీయము. సం. = అసహ్యము.

అసహనుఁడు. సం. అ. పుం. శత్రువు.—విశ. (అ. ఆ. అ.) ఓర్వనివాఁడు.

అసహమానుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) 1. ఓర్పులేనివాఁడు; 2. సహించనివాఁడు, అసూయనొందువాఁడు.

అసహాయత. సం. వి. ఆ. స్త్రీ. సహాయులులేమి.

అసహాయశూరుఁడు. సం. వి. అ. పుం. ఇతరులసాహాయ్యము లేకయే యుద్ధముచేయువాఁడు.

అసహాయుఁడు. సం. విశ. (అ.ఆ.అ.) 1. సహాయులులేనివాఁడు, తోడులేనివాఁడు; 2. తోడుకానివాఁడు.

అసహిష్ణుఁడు. సం. విశ. ఉ. ఓర్వనివాఁడు, అసహనుఁడు

అసహ్యత. సం. వి. ఆ. స్త్రీ. 1.అసహనము, అసూయ. "చ. కపటములేనివారొరులకల్మి కసహ్యతఁ బొందకున్నవారు." సానం. 3, ఆ. ౧౩౪; 2. అసహ్యమగుట.

అసహ్యపడు. మి. అ. క్రి. రోఁతపడు.

అసహ్యము. సం. విశ. (అ. ఆ. అ.) 1. సహింపఁగూడనిది; 2. సహింపశక్యముకానిది. "శా. ఫుల్లమల్లికలికా గర్వాంధమై పర్వె సర్వాసహోర్ధ్వతియయ్యె." హరి. పూ. ౬, ఆ. 3౭; 3.రోఁతకలిగించునది.—వి. అ. న. 1. సహింపలేమి; 2. అసహనము, అసూయ. "సీ. ప్రముదిత భక్తిదీపములు నిత్యంబు, వేయేసి ముట్టించి విశ్వేశునీశుఁ,బాయకరేయును బగలును గొల్వ, నాయూరఁగల జైను లత్యసహ్యమున,నేయిగరంటెడున్ బోయకయున్న" పండి. 3, ౨౦3. పుట.

అసహ్యించు. సం. అ. క్రి. అసహ్యపడు.

అసహ్యుఁడు. సం. వి. అ. పుం. (సహింపఁదగనివాఁడు) శత్రువు.

అసాంప్రతము. సం. విశ. (అ. ఆ. అ.) యుక్తముకానిది.

అసాదు. దే. హిం. అవ్య. బళీ,హాసాదు. "క.బుధుల్, సాదన శాత్రవులెల్లన, సాదనజేగ జెట్లదొడరి సాదనసేయుఁ." రామా. 3, ఆ. ౧౪౯.

అసాధారణము. సం. విశ. (అ. ఆ. అ.) (సాధారణముకానిది.) 1. అందఱకులభ్యముకానిది; 2. విశేషమైనది. "అసాధారణప్రజ్ఞ."

అసాధువు. సం. విశ. (ఉ. ఈ-ద్వి.ఉ.) 1. సాధువుకానిది,దుష్టము; 2. వ్యాకరణవిరుద్ధము, తప్పయినది (శబ్దము.)

అసాధ్యము. సం. విశ. (అ. ఆ. అ.) సాధ్యముకానిది, అశక్యము.

అసారము. సం.వి.అ.పుం. 1. సారములేమి; 2. సారములేనిభాగము.—విశ. (అ.ఆ.అ.) 1. సారములేనిది; 2. ప్రయోజనములేనిది; 3. దుర్బలము.

అసి. దే. విశ. (క. ఆసి.) (ఉప. అని శ. ర.) సూక్ష్మము, చిన్నది, కొంచెము. చూ. ఆసికోఁత. –క్రి. విశ. సూక్ష్మముగా, కొంచెముగా. చూ. అసియాడు. కొన్నిచోట్ల అర్థవిశేషము కానరాదు. చూ. అసివోవు. ["మఱియు నిదియొకానొకచో ఇత్యర్థకముగాఁ గానఁబడియెడి. "చ. అసియఱచేత నాతఁడటు లాపొసవంబును బట్టు

కొన్నన,య్యసుకటె చేటలం జెరిగి యింపగు బియ్యముచేసి......"భో. ౬, ఆ." అని. శ.ర. ఇట. "క. ఆని యఱచేశనె యాపో, శనముం బట్టుకొనియున్న చలమఁెఁగని య, క్వనిశ చలిం పని సెమ్మన,మున ఓప్రల కర్ఘ్యపాద్యములు దగ నిచ్చె.౯." భోజ. ౬, ఆ. ౧౫౩. "చ. అసదృశ లీల నవ్వనిశయంబుఘటాకళిక్రింద నున్నయ, య్యసుకటు చేటలం జెరిగి యింపగు బియ్యము చేసి......"భో. ౬, ఆ. ౧౫౪. అని ముద్రిత పాఠము. ఈపక్షమున ఇత్యర్థకమునకుఁ బ్రమాణము కనఁబడదు.]—సం. వి. ఇ. పుం. ఖడ్గము, కత్తి.—ఈ. స్త్రీ. కాశికి దక్షిణమునందుండు నొకనది.

అసిఁబోవు. దే. అ. క్రి. (అసి+పోవు.) తప్పిపోవు. "సీ. అసిఁబోవుటెట్లునాయసిఁబోవుమెకములఁ జెంచునాచేయమ్ముచిలుకుటమ్ము." రామా. ౨, ఆ. ౨౪.

అసికము. సం. వి. అ. న. అధరోష్ఠమునకును గడ్డమునకును నడిమిభాగము.

అసికోఁత. దే. వి. చిన్నకోఁత, ముక్కముక్కలుగాఁ గోసినకోఁత. "ద్వి. సెట్టనమొలనున్న నెఱికత్తిఁ దివిచి, కొన్నింటిముక్కులుఁ గొన్నింటిచెవులుఁ, గొన్నింటి చెక్కులుఁ గోఁతలుపెట్టి, యసికోఁతలుగఁ గోయ;...నంతనవ్విభుని, యసికోఁత లసిఁబోవ నప్పిశాచములుఁ, బేతాళపతికిఁ జెప్పిన........." హరిశ్చ. పూ. ౨౦౪౦.

అసిక్ని. సం. వి. ఈ. స్త్రీ. 1. శరీరాయాసముచే జీవనముచేయుచు అంతఃపురమునందు మెలఁగెడి యుపలి, దాసి; 2. ఒకానొకయేఱు.

అసిజీవి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) 1. కత్తివలన జీవించువాఁడు, ఖడ్గజీవి; 2. యుద్ధభటుఁడు.

అసితము. సం. వి. అ. పుం. నలుపు,—విణ. (అ. ఆ. అ.) నల్లనిది.

అసితమృగము. సం. వి. అ. పుం. కృష్ణసారము, లేడి.

అసితాంగము. సం. వి. అ. పుం. కత్తి.—విణ. (అ. ఆ. అ.) నల్లనిదేహముగలది.

అసితాననము. సం. వి. అ. న. (నల్లనిమొగము గలది.) కొండముచ్చు.

అసితార్చి. సం. వి. స్. పుం. అగ్నిహోత్రుఁడు.

అసితాశ్మము. సం. వి. అ. న. (నల్లనిమణి) ఇంద్రనీలమాణిక్యము.

అసితుఁడు. సం. వి. అ. పుం. శనిగ్రహము—విణ. (అ. ఆ. అ.) నల్లనివాఁడు.

అసితోత్పలము. సం. వి. అ. న. నీలోత్పలము, నల్లకలువ♣.

అసిదంష్ట్రము. సం. వి. అ. పుం. (కత్తివంటి కోఱలు గలది.) మకరము, మొసలి.

అసిధార. సం. వి. ఆ. స్త్రీ. కత్తియొక్కవాఁడియైన యంచు.

అసిధారావ్రతము. సం. వి. అ. న. 1. కత్తియొక్క వాఁడియైనయంచుమీఁదనడచినట్లు కొంచెమైనను తొట్రుబాటులేకుండఁగఁ బ్రవర్తించు నియమము; 2. కఠినవ్రతము, ఏమాత్రము హెచ్చు తగ్గులువచ్చినను బాధగలిగించు నియమము; 3.ఏకశయ్యాగతులగు స్త్రీపురుషులు మనమునసంగమాభిలాషయున్నను దానిని నిరోధించి కలియకుండుటకై యిద్దఱిమధ్యను వాఁడియగుకత్తిని ఉంచుకొని పరుండుట; 4. ఏకశయ్యాగతులయ్యు దంపతులు భోగము నొందకుండుట.

అసిధావకుఁడు. సం. వి. అ. పుం. కత్తిసానపెట్టు వాఁడు.

అసిధేనుక. సం. వి. ఆ. స్త్రీ. అసిపుత్రి, మొలను ప్రక్కగా ధరించునట్టి చూరకత్తి, ఛురిక, చిన్నకత్తి.

అసిపత్రము. సం. వి. అ. పుం. 1. కత్తియొఱ; 2. (కత్తివంటి యాకులు గలది.) చెఱకు; 3. నరక విశేషము.

అసిపత్రవనము. సం. వి. అ. న. 1. చెఱకుతోఁట; 2. నరకవిశేషము.

అసిపుత్రి. సం. వి. ఈ. స్త్రీ. = అసిధేనుక.

అసిపుత్రిక. సం. = అసిధేనుక.

అసిమి. దే. వి. ఒకరకము చిన్నసంచి, చిన్నగోనె.

అసిమిగొల్లెన. దే. వి. గొలవలె గోనెలతో వర్తకులు వేసికొను గుడారము. "గీ. మునుపుగానేగి యసిమిగొల్లెనలుపన్ని." కళా. ౧, ఆ. ౪౨.

అసిమేచకము. సం. వి. అ. పుం. తుమ్మ ♣.

అసియాడు. దే. అ. క్రి. (అసి+ఆడు.) 1. చలించు, వడఁకు. "ఉ. కంకణనిక్వణంబు మొగకట్టఁగఁ గొనసియాడ రత్నతా, టంకవిభూషణంబులు వడఁక..." నై. ఉ, ఆ.౧౦౨; 2. చెదరు, సడలు. "ఉ. గుట్టసియాడ గబ్బిచనుగుట్టలపైఁ బులకాంకురావళుల్, తెట్టువగట్ట" విజ. వి. ౧, ఆ. ఉ౧; 3. తిరుగు, సంచరించు. "క. పనిగొనుచు మేయ వచ్చిన, పసిఁగొనుచుం గోలుపులులు బలిసెన్ నృపసీ,యసి యాడునేని యచ్చట, నసియాడం దఱచు వెఱచు నఱచుం బఱచున్." రామా. ౨, ౧౩.

అసియార్చు. దే. స. క్రి. అసియాడుధా. ప్రే. కదలునట్లు చేయు, అసియాడఁజేయు. "ఉ. వేసవి పాటుపాటు నరవెంద్రుకతోఁ దిలతండులాన్వయ, శ్రీనటియింపఁ గైసడలి వ్రేఁకని చన్నులు పాలవంకలై, కొనసియార్చ......" కాశీ. ౭.౧౫౫.

అసిలేరు. వై. వి. ఆశ్లేషనక్షత్రము.

అసివాఱు. దే. వి. (అసి+పాఱు.) విహారము, స్వారి. (ఇది ఏగు,తిరుగు మొదలగువానితోసహచరితమయియే యుండును) "సీ. ఎవ్వఁడు నలువ తేరెక్కి యష్టాదశ, ద్వీపాది నసివాఱు దిరిగె లీలఁ..." కాశీ. ౪.౧౭౫. "సీ....అపంచగౌడ ధాత్రీపదం బెవ్వాని, కసివాఱుగా నేఁగునట్టి బయలు." మను. పీఠి. ౧౧.

అసివోవు. దే. అ. క్రి. 1. పోవు, నశించు. "క. అస దృశపాపఫలంబున, నసివోవని బ్రహ్మహత్యలై దు దగిలె......" వరాహ. ౮. ౨౫; 2. తప్పిపోవు. "సీ. జిఱజిఱఁ ద్రిప్పివైచిన శూలమసిఁ బోవఁ దొలఁకువేడుక సునందుండు దొలఁగె." దశా. ౪. ౧౦౫.

అసిహేతి. సం. విణ. ఇ. కత్తియాయుధముగా గలవాఁడు, కత్తితో యుద్ధము చేయువాఁడు.

అసుకరము. సం. విణ. (అ.ఆ.అ.) సుకరముకానిది, దుష్కరము, చేయఁగష్టమయినది.

అసుక్షణము. సం. వి. అ. న. 1. తెగడిక, అవహేలనము; 2. అనాదరము.

అసుఖము. సం. వి. అ. న. 1. సుఖములేమి; 2. దుఃఖము—విణ. (అ.ఆ.అ.) సుఖములేనిది.

అసుధారణము. సం. వి. అ. న. ప్రాణము ధరించుట. జీవనము, బ్రదుకు,

అసుమంతుఁడు. సం. విణ. (త్. ఈ.టీ. త్.) ప్రాణములు గలవాఁడు.

అసుభృత్తు. సం. విణ. త్. ప్రాణములు ధరించువాఁడు.

అసుర. సం. వి. ఆ. స్త్రీ. 1. రాత్రి; 2. వేశ్య.

అసురము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగు; 2. మాలకాకి.

అసురసంధ్య. సం. వి. ఆ. స్త్రీ. (అసురలకు బలము మిగలిగించు కాలము.) సాయంసంధ్యాకాలము.

అసురాహ్వాయము. సం. వి. అ. న. కంచు.

అసురి. వి. ఈ. స్త్రీ. 1. నల్లావలు; 2. అసురుని భార్య.

అసురుఁడు. సం. వి. అ. పుం. 1. దైత్యుఁడు, రాక్షసుఁడు; 2. సూర్యుఁడు; 3. రాహువు.

అసురుసురు. దే. వి. శ్రమమునందగుధ్వన్యనుకరణము. "క. ముసురుకొనుజరభరంబున, నసురుసురై యున్నమమ్మునడకించితి." స్వా. ౪, ఆ. ౮౪.

అసురుసురగు. దే. అ. క్రి. నలఁగు, శ్రమమొందు. (చూ. అసురుసురు.)

అసుర్క్షణము. సం. = అసుక్షణము.

అసువులు. సం. వి. ఉ. పుం. బ. ప్రాణములు, ఉసురు.

అసూక్షణము. సం. = అసుక్షణము.

అసూయ. సం. వి. ఆ. స్త్రీ. 1. మంచిగుణములుగల దానియందు దోషము నారోపించుట, ఇడుగడ; 2. అసహనము, ఓర్వలేమి; 3. కోపము, దుష్టమగుబుద్ధి. "చ. అడలున రాజధర్మములయందు జనించె నసూయ నీకు" భార. శాంతి. ౧, ఆ. ఉ౨; 4. (అలం) వ్యభిచారిభావభేదము.

అసూర్క్షణము. సం. = అసుక్షణము.

అసూర్యంపశ్య. సం. వి. ఆ. స్త్రీ. (సూర్యునిఁ జూడనిది.) 1. రాణివాసపుస్త్రీ; 2. రాజుభార్య.

అసూర్యంపశ్యము. సం. విణ. (అ.ఆ.అ.) సూర్యునిఁ జూడనిది, ఎండ కన్నెఱుఁగనిది.

అసృక్కు. సం. వి. జ్. న. రక్తము, నెత్తురు.

అసృగ్ధర. సం. వి. ఆ. స్త్రీ. (రక్తమును ధరించునది.) త్వక్కు, తోలు.

అసృగ్వర. సం. = అసృగ్ధర.

అసౌమ్యము. సం. విణ. (అ. ఆ. అ.) సౌమ్యము కానిది, వక్రము.

అస్ఖలితబ్రహ్మచారి. సం. వి. న్. పుం. 1. వేదము చదువుచు స్ఖాలిత్యము (వ్యభిచారదోషము) లేక బ్రహ్మచర్యవ్రతము జరపువాఁడు; 2. స్త్రీలతో విహరించుచున్నను వీర్యస్ఖలనములేక యుండు వాఁడు. "శ్రీకృష్ణుఁడస్ఖలితబ్రహ్మచారి యండ్రు"

అస్ఖలితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తొట్రుపాటు లేనిది, జాఱనిది; 2. భంగములేనిది. "సీ. నిత్యవ్రతంబుగా సత్యంబు పాలించు నిష్ఠ యస్ఖలితగా నెఱపె నితఁడె." భార. శాం. ౧, ఆ. ౩౫౭.

అస్తంగతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అస్తమయమును పొందినవాఁడు. (సూర్యుఁడు.)

అస్తమనము. సం. వి. అ. న. 1. సూర్యాస్తమయము, ప్రొద్దుక్రుంకుట; 2. సూర్యాస్తమయకాలము.

అస్తమయము. సం. వి. అ. పుం. 1. అస్తమించుట; 2. ప్రళయము; 3. (జ్యోతి.) ఇతరగ్రహములు సూర్యునితో కలిసియుండుట.

అస్తమానము. వై.వి. 1. అస్తమయము, సాయంకాలము. "క. ఉదయాస్తమానవేళల, మదమున నిద్రించుచున్న" సానం. ౨, ఆ. ౧౦౦. (వైరి సమాసము); 2. ఎల్లప్పుడును.

అస్తమించు. సం. అ. క్రి. 1. అడఁగు; 2. కనఁబడకపోవు.

అస్తమితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అస్తమించినది; 2. నశించినది.

అస్తము. సం. వి. అ. పుం. సూర్యుఁడు అస్తమించు కొండ.—విణ. (అ. ఆ. అ.) 1. త్రోయఁబడినది; 2. ముగిసినది; 3. క్రుంకినది. (సూర్యమండలము.) వై. (అని శ. ర. హస్తశబ్దభవమన వచ్చును.) —గ్రా. వి. అత్తము. గెలలో నొక భాగము.

అస్తరు. హిం. వి. 1. ఒక గుడ్డకాశ్రయముగా లోప్రక్కఁ జేర్చికుట్టెడు మఱియొకగుడ్డ. అని శ. ర; 2. అతుకువేసినగుడ్డ. "సీ. అస్తరు నతుకు నానలరుసంధానవసనఖండనామంబు" ఆ. భా. ౪, ౨. ౧౫౮.

అస్తవ్యస్తము. సం. విణ. (అ.ఆ.అ.) వ్యతిరేకమయినది, తాఱుమాఱైనది. "క. అస్తమయమునకు మును రిపుమస్తకముం దునుమవలయు మనకిది సాలక్, దుస్తరమునునగు నస్తవ్యస్తంబగునేని నాకు వగపుగదికెదుర్." భార. ద్రోణ. ౨. ఆ, ౩౦౩. "వ. ఇవ్విధనంబున ననంతవర్మరాజ్యం బస్తవ్యస్తంబగుటయు." దశకు. ౧౧, ఆ.౧౦౮.

అస్తరువు. హిం. = అస్తరు.

అస్తాచలము. సం. వి. అ. పుం. అస్తాద్రి, క్రుంకు మెట్ట, సూర్యచంద్రులు అస్తమించుకొండ.

అస్తాద్రి. సం. వి. ఇ. పుం. = అస్తాచలము.

అస్తి. సం. ని. కలదు అనునర్థమును తెలుపును (తెనుఁగున దీనికి సమాసపూర్వపదముగానే ప్రయోగము. "అస్తివాంఛము.")

అస్తికంపము. సం. విణ. (అ. ఆ. అ.) వణఁకుగలది. చూ. అస్తివాంఛము.)

అస్తికౌతూహలము. సం. విణ. (అ. ఆ. అ) వేడుక కలది. చూ. అస్తివాంఛము.

అస్తిక్షీర. సం. వి. ఆ. స్త్రీ. ఎక్కువ పాలుగల యావు.

అస్తినాస్తివిచికిత్స. సం. వి. ఆ. స్త్రీ. కలదులేదు అను సంశయము. "మ. రమణింబల్లవపాణిఁబద్మనయనన్ రాకేందుబింబాననన్, సమపీనస్తని నస్తినాస్తివిచికిత్సాహేతుశాతోదరిన్." వై. ౨, ఆ. ౨౧.

అస్తిభీతి. సం. విణ. ఇ. భయముగలది. చూ. అస్తివాంఛము.

అస్తిమంతుఁడు. సం. విణ. (త్.ఈ.త్.) కలవాఁడు, ధనవంతుఁడు.

అస్తివాంఛము. సం. విణ. (అ. ఆ. అ.) కోరికగలది. "తే. అస్తివామ్యభార మస్తికౌతూహలం, బస్తిమర్మసలిల మస్తికంప, మస్తిభీతి మస్తిహర్ష మస్తివ్యథం, బస్తివాంఛ మయ్యె నపుడు రతము." వై. ౭, ఆ. ౧౭౭.

అస్తివ్యథము. సం. విణ. (అ. ఆ. అ.) బాధగలది. (చూ. అస్తివాంఛము.)

అస్తిహర్షము. సం. విణ. (అ. ఆ. అ.) సంతోషము గలది. చూ. అస్తివాంఛము.

అస్తుంకారము. సం. వి. అ. పుం. అంగీకారము. ఇయ్యకోలు, సమ్మతి, సరేయనుట.

అస్తోకము. సం. విణ. (అ.ఆ.అ.) అల్పముకానిది.

అస్త్రకంటకము. సం. వి. అ. పుం. బాణము.

అస్త్రకారకుఁడు. సం. విణ. (అ.ఆ-రికా.అ.) = అస్త్రకారుఁడు.

అస్త్రకారుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) శస్త్రములు చేయువాఁడు.

అస్త్రచికిత్స. సం. వి. ఆ. స్త్రీ. శస్త్రవైద్యము, శస్త్రముతోఁ గోసి శరీరమునుండి దుష్టభాగమును వ్రణాదులను తీసివేయుట.

అస్త్రజీవి. సం. వి. న్. పుం. (అస్త్రములవలనజీవించువాఁడు) యుద్ధభటుఁడు.

అస్త్రజీవుఁడు. సం. వి. అ. పుం. = అస్త్రజీవి.

అస్త్రమార్జుఁడు. సం. వి. అ. పుం. శస్త్రములు సానఁబెట్టువాఁడు.

అస్త్రము. సం. వి. అ. న. 1. బాణము, అమ్ము; 2. శస్త్రము, ఖడ్గము, కత్తి; 3. చాపము, విల్లు; 4. మంత్రప్రయోగాదులవలన శక్తినొంది శత్రువులను జంపి తిరిగివచ్చు ఇషీకాదికము. "ఇషీకాస్త్రము, ఆగ్నేయాస్త్రము;" 5. మంత్రము, గాయత్రిలోనగునది; 6. యజ్ఞప్రయోజ్యమంత్రవిశేషము.

అస్త్రవిదుఁడు. సం. వి. ద్. పుం. శస్త్రముల ప్రయోగము తెలిసినవాఁడు.

అస్త్రవిద్య. సం. వి. ఆ. స్త్రీ. అస్త్రములను ప్రయోగించుటయు ఉపసంహరించుటయుఁ దెలుపు శాస్త్రము.

అస్త్రాగారము. సం. వి. అ. న. ఆయుధములుంచు శాల.

అస్త్రి. సం. విణ. (న్. ఈ-ణీ. న్.) (అస్త్రములుగలవాఁడు) ధానుష్కుఁడు, విలుకాఁడు.

అస్థానము. సం. వి. అ. న. 1. తగనిచోటు, అనర్హప్రదేశము; 2. హీనమైనస్థానము; 3. తగని సందర్భము. "అస్థానసంరంభము"

అస్థాయము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి లోఁతుగలది, అగాధము.

అస్థి. సం. వి. ఇ. న. కీకసము, ఎముక.

అస్థితుండము. సం. వి. అ. పుం. (ఎముకపంటిముట్టె గలది.) పక్షి.

అస్థిపంజరము. సం. వి. అ. పుం. కంకాళము, శరీరమందున్న ఎముకలుమాత్రముగల మనుష్యాకారము, ఎముకలగూడు.

అస్థిభక్షము. సం. వి. అ. పుం. (ఎముకలతినునది) కుక్క.

అస్థిమాల. సం. వి. ఆ. స్త్రీ. ఎముకలతోఁగూర్చిన మాల. "కిమస్థిమాలాం కిముకౌస్తుభం వా." భార, విరా. ౧, ఆ. ౧౧.

అస్థిమాలి. సం. వి. న్. పుం. (ఎముకలతోఁగూర్చిన మాలలను ధరించినవాఁడు) శివుఁడు.

అస్థిరము. సం. విణ. (అ. ఆ. అ.) స్థిరముకానిది. చంచలము.

అస్థిరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎందును నిలుకడలేడివాఁడు; 2. నశ్వరుఁడు.

అస్థివిగ్రహుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఎముకలు మాత్రము శరీరమందున్నవాఁడు, మిక్కిలి చిక్కిన శరీరము గలవాఁడు.—వి. అ. పుం. భృంగీశ్వరుఁడు, శివానుచరులలో నొకఁడు.

అస్థిసంచయనము. సం. వి. అ. న. దహనము చేయఁబడినవాని యెముకలను ప్రోవుఁజేయుట.

అస్థిసంహారము. సం. వి. అ. న. నల్లేరు♣. "వజ్రవల్ల్యస్థి సంహారో హస్తి శుండీ వనాలికా" హారావళి.

అస్థిహారుఁడు. సం. వి. అ. పుం. (ఎముకలు హారముగాగలవాఁడు) శివుఁడు.

అస్పష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. స్పష్టము కానిది, అవ్యక్తము; 2. గూఢముగానుండునది.

అస్పృశ. సం. వి. ఆ. స్త్రీ. 1. నీలి♣; 2. పుల్లతీఁగె♣.

అస్పృశి. సం. వి. ఈ. స్త్రీ. వాఁకుడు♣.

అస్పృశ్యత. సం. వి. ఆ. స్త్రీ. అంటరానిదగుట, అంటరానితనము.

అస్పృశ్యము. సం. విశే. (అ. ఆ. అ.) 1. స్పృశింపఁగూడనిది, తాఁకరానిది; 2. స్పృశింప శక్యముగానిది. (అగ్ని.)

అస్ఫీతము. సం. విశే. (అ. ఆ. అ.) హీనము, నీచము. "ఉ. నీతిపథంబునన్ బ్రదుక నేర్పుట యుత్తమభంగి శౌర్యసంజాతములైన సంపదలొందుట మధ్యవృత్తి య, స్ఫీతములైన భారవహాజీవనముల్ దలఁప గనిష్ఠముల్, నీతికి బాహ్యులైన ధరణీవరమెత్తురె వారి నుత్తముల్." భార. ఉద్యో. ౨, ఆ. ౭౧.

అస్ఫుటము. సం. = అస్పష్టము.

అస్మత్. సం. ద్. స. (తెనుఁగున సమాసపూర్వపదముగనే యుపయుక్తము) మేము, మాయొక్క, మనము, మనయొక్క, మొదలగు అర్థములను దెలుపును. "క. ప్రస్తుతఫణిసత్త్రభయ, త్రస్తాత్ములమైనయస్మదాదులకెల్లన్" భార. ఆది. ౨, ఆ. ౨౧౯. "శా...అ, స్మద్బోధావలి మానసంబున రణోత్సాహంబు రెట్టింప." భార. ఉద్యో. ౨, ఆ. ౧౪౩. "క. ననుఁగుచ్చికంపుఁ బనులకుఁ, బనుపక యెంగిలికిలోను పఱుపక తగు మన్ననతోడ నరయువారల, కనురాగము నెఱపి నడతురస్మత్పతులున్" భార. విరా. ౧, ఆ. ౩౯౯. "అస్మదాదులు"

అస్మదీయము. సం. విశే. (అ. ఆ. అ.) 1. మాసంబంధమైనది; 2. మనసంబంధమైనది.

అస్మద్విధుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. మనవంటివాఁడు; 2. మావంటివాఁడు.

అస్మాదృశుఁడు. సం. విశే. (అ. ఈ-శీ. అ.) 1. మావంటివాఁడు; 2. మనవంటివాఁడు.

అస్యుద్యతుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) (ఎత్తఁబడిన కత్తిగలవాఁడు.) కత్తి యెత్తినవాఁడు.

అస్రప. సం. వి. ఆ. స్త్రీ. (రక్తము త్రాగునది.) 1. జలగ; 2. పిశాచి.

అస్రపుఁడు. సం. వి. అ. పుం. (రక్తమును త్రాగువాఁడు) 1. రాక్షసుఁడు; 2. నైరృతుఁడు.

అస్రము. సం. వి. అ. న. 1. కన్నీరు; 2. నెత్తురు. —పుం. 1. మూల; 2. వెండ్రుక.

అస్రార్జకము. సం. వి. అ. పుం. 1. రక్తమును కలిగించురసము; 2. శ్వేతతులసి. —విశే. (అ.ఆ.అ.) రక్తమును పుట్టించునది.

అస్రు. సం. = అశ్రువు.

అస్వంతము. సం. వి. అ. పుం. 1. చావు; 2. అశ్మంతము, పొయ్యి.

అస్వప్నుఁడు. సం. వి. అ. పుం. దేవుఁడు, వేల్పు. —విశే. (అ. ఆ. అ.) 1. నిద్రలేనివాఁడు; 2. కలలురానివాఁడు.

అస్వరుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) అసౌమ్యస్వరుఁడు, అపస్వరముగా పాడువాఁడు.

అస్వస్థత. సం వి. ఆ. స్త్రీ. అస్వాస్థ్యము.

అస్వస్థుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఆరోగ్యములేనివాఁడు, సహజమగు స్థితియందులేనివాఁడు.

అస్వాతంత్ర్యము. సం. వి. అ. న. స్వాతంత్ర్యములేమి, పరాధీనత. —విశే. (అ. ఆ. అ.) స్వాతంత్ర్యములేనిది.

అస్వాధీనము. సం. విశే. (అ.ఆ.అ.) 1. స్వాధీనముకానిది; 2. స్వాధీనులు లేనిది.

అస్వాస్థ్యము. సం. వి. అ. న. స్వస్థతలేమి, నెమ్మదిలేమి, రోగాదిబాధ. — విశే. (అ. ఆ. అ.) స్వస్థతలేనిది, నెమ్మదిలేనిది.

అహఃపతి. సం. వి. ఇ. పుం. = అహర్పతి.

అహఃకరుఁడు. సం. = అహస్కరుఁడు.

అహంకరణము. సం. వి. అ. న. (=అహంకారము) 1. గర్వము, అభిమానము. "చ. వెరవరిగాకవీఁడు కురువీరులకుం బొడసూపువాఁడె య, చ్చెరువొక మ్రానిపేరనిట సేరఁగవచ్చుచునున్నవాఁడహం, కరణము కాని యొండొకటి గాఁడు." భార. విరా. ౪, ఆ. ౯౧; 2. కోపము.

అహంకరించు. సం. అ. క్రి. గర్వించు. "సీ. పతులాత్మ నొండొక్క పడఁతులఁ గలసిన నలుగ నెయ్యెడల నహంకరింప మదముఁ బ్రమాదంబు మాని." భార. అర. ౫, ఆ. ౩౦౦. "ఉ. ఏనఖిలేశ్వరుండనని యెవ్వరునుం బ్రతికోటిలేమిఁదాఁ, దాన యహంకరించెను విధాత సదాశివుమాయ మెంపునన్." శివరా. ౧, ఆ. ౭౦.

అహంకారము. సం. వి. అ. పుం. 1. గర్వము; 2. కోపము; 3. అంతఃకరణచతుష్టయములలోనొకటి.

అహంకారించు. సం. = అహంకరించు.

అహంకారి. సం. విణ.(న్.ఈ.ణీ.న్.)అహంకారము గలవాఁడు. "ద్వి. కావున మాభక్తగణముల నడుమ, నీవహంకారించి నిలువ నెవ్వఁడవు." బస-పు. ౪. ౧౪౪.

అహంకృతి. సం. వి. ఇ. స్త్రీ. = అహంకారము.

అహంకృతుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. గర్వము గలవాఁడు; 2. అభిమానముగలవాఁడు.

అహంత. సం. వి. ఆ. స్త్రీ. అహంభావము.

అహంపూర్విక. సం. వి. ఆ. స్త్రీ. యుద్ధాదులయందు నేనుముందు నేనుముందని యొకరినొకరు మీఱి పలుకుట, అహమహమిక.

అహంప్రథమిక. సం. = అహంపూర్విక.

అహంభావము. సం. వి. అ. పుం. 1. నేననుట, గర్వము; 2. అవిద్య.

అహంయువు. సం. విణ. ఉ. = అహంకారి.

అహతము. సం. వి. అ. న. చలువచేయని క్రొత్త వస్త్రము.—విణ. (అ. ఆ. అ.) 1. కొట్టఁబడనిది; 2. చంపఁబడనిది.

అహమహమిక. సం. = అహంపూర్విక.

అహమించు. సం. అ. క్రి. గర్వించు. "చ. లెక్క కుఁ, మిగిలిన సేననొక్కఁ డహమించి వధిం చుట యెట్లు." జై. ౨, ఆ. ౪3.

అహము. సం. వి. న్. న. దినము, పగలు.

అహమ్మతి. సం. వి. ఇ. స్త్రీ. 1. అవిద్య, అజ్ఞానము; 2. నేను అనెడి యభిమానము.

అహరహము. సం. అవ్య. ప్రతిదినము. "క. మహ నీయమధురఘురీసం,గ్రహమునఁ గాలువలు వఱపి గనిమలుగ రజం, బహరహము నెఱపి మారుఁ, సహకారములయ్యె నచటి సహకారంబుల్." వసు. ౧, ఆ. ౧3౧.

అహరాది. సం. వి. ఇ. పుం. దినముఖము, ప్రభాతము.

అహర్గణము. సం. వి. అ. పుం. నెల, మాసము. "మాసో వర్షాంశకః శ్రామో వర్షాంగ స్స్యా దహర్గణః." హారావళి.

అహర్దానము. సం. వి. అ. న. మృతులకొఱకుఁ జేయఁబడు పిండజలాదిదానము.

అహర్దివము. సం. వి. ఆ. న. ప్రతిదినము.

అహర్నిశము. సం. వి. అ.న. పగలును రాత్రియును. "చ. అలయక మాకునందఱ కహర్నిశముం బ్రియకారి." భార. ఆర. ౨, ఆ. ౨౭౦. "మ. దేహం బహ, ర్నిశమున్ సాంద్రనిరంతరస్మృతిసముత్కర్షంబునం గాంతపుం, దశచిత్తలయందుఁ గానఁ బడియెం దద్రూపచిత్రావళుల్." జై. ౨, ఆ. ౧౧౫.

అహర్పతి. సం. వి. ఇ. పుం. 1. సూర్యుఁడు, పగలింటిదొర; 2. జిల్లేడు.

అహర్మణి. సం. వి. ఇ. పుం. దినమణి, సూర్యుఁడు.

అహర్ముఖము. సం. వి. ఆ. పుం. దినముఖము, తెల్లవాఱువేళ, ప్రభాతము.

అహల్య. సం. వి. ఆ. స్త్రీ. 1. గౌతమునిభార్య; 2. దున్ననినేల. చూ. అహల్యాజారుఁడు.

అహల్యము. సం. విణ. (అ. ఆ. అ.) నాఁగలితో దున్నుటకు శక్యముకానిది. (నేల.)

అహల్యాజారుఁడు. సం. వి. ఇ. పుం. అహల్యకు విటుఁడైనవాఁడు, ఇంద్రుఁడు.(గౌతమునిభార్య యగు నహల్యను కామించి గౌతముని మోస పుచ్చుటకై కోఁడిరూపమును ధరించి కూసెనని పురాణము. (దున్నని నేలయందు వర్షించు వాఁడు అని కొందఱందురు.)

అహస్కరుఁడు. సం. వి. ఆ. పుం. (పగటినిచేయు వాఁడు) సూర్యుఁడు.

అహస్సు. సం. = అహము.

అహహ. వై. అవ్య. 1. ఔర, ఆశ్చర్యమును తెలుపును; 2. ప్రశంసను తెలుపును.

అహహా. వై. = అహహ.

అహా. వై. అవ్య. అహహ. "భూతివిభవపంచాస్యు లహా." పంచా. ౧, ఆ. 3౧.

అహారె. వై. అవ్య. (అహా+రె.) అహా. రూ. అహారే.

అహార్యము. సం. వి. అ. పుం. కొండ, పర్వతము. —విణ. (అ. ఆ. అ.) 1. దోఁచఁదగనిది, అపహరింపఁదగనిది; 2. భేదింపఁదగనిది.

అహి. సం. వి. ఇ. పుం. 1. పాము; 2. వృత్రాసు

రుఁడు; 3. వజ్రాయుధము; 4. నక్షత్రభేదము; 5. దుష్టుఁడు; 6. రాహువు.

అహింస. సం. వి. ఆ. స్త్రీ. (హింసింపమి) 1. చంప కుండుట; 2. బాధపెట్టకుండుట.

అహిక. సం. వి. ఆ. స్త్రీ. శాల్మలి, బూరుగుచెట్టు.

అహికము. సం. వి. అ. పుం. ధ్రువనక్షత్రము.

అహిచ్ఛత్రము. సం. వి. అ. న. భూస్ఫోటము. పుట్ట గొడుగు.

అహిజిత్తు. సం. వి. త్. పుం. 1. (సర్పమును జయించినవాఁడు) కృష్ణుఁడు, కాళింగమర్దనుఁడు; 2. (వృత్రాసురుని జయించినవాఁడు.) ఇంద్రుఁడు.

అహితము. సం. విణ. (అ. ఆ. అ.) హితముకానిది, పథ్యముకానిది.

అహితుండికుఁడు. సం. వి. అ. పుం. పాములవాఁడు.

అహితుఁడు. సం. వి. అ. పుం. శత్రువు.—— విణ. చూ. అహితము.

అహిద్విషము. సం. వి. ష్. పుం. (పాములకు వైరి.) 1. నెమలి; 2. ముంగిస.

అహిద్విషుఁడు. సం. వి. ష్. పుం. 1. (పాములకు శత్రువు) గరుత్మంతుఁడు; 2. (వృత్రునకుశత్రువు) ఇంద్రుఁడు.

అహినకులిక. సం. వి. ఆ. స్త్రీ. 1. పామునకు ముంగిసకుఁ గలవిరోధము; 2. సహజవైరము.

అహినిర్మోకము. సం. వి. అ. పుం. పాముకుబుసము.

అహిపుత్రకము. సం. వి. అ. పుం. పామువంటి యాకారముగల నౌకావిశేషము.

అహిఫేనము. సం. వి. అ. న. (పాముగరళమువలె తీక్ష్ణమైనది.) 1. అభిని, నల్లమందు; 2. పాము యొక్క నోటిచొంగ; 3. గరళము.

అహిభయద. సం. వి. ఆ. స్త్రీ. (పామువలని భయము బోఁగొట్టునది.) భూమ్యామలకి, నేల యుసిరికచెట్టు.

అహిభయము. సం. వి. అ. న. 1. స్వపక్షభయము, రాజునకు పుత్రదాయాదప్రభృతి స్వపక్షము వారివలని భయము. (మూలబలము, మిత్రబలము, సమాశ్రితుఁడు, సంబంధజుఁడు, కార్యసముద్భవుఁడు, భృత్యుఁడు, ఉపచారగృహీతుఁడు అను వారు స్వపక్షమువారు.); 2. పామువలని భయము.

అహిభుక్కు. సం. వి. జ్. పుం. 1. గరుత్మంతుఁడు; 2. నెమలి; 3. ముంగిస.

అహిభుజము. సం. = అహిభుక్కు.

అహిభూషణుఁడు. సం. వి. అ. పుం. (పాముల భూషణములుగా కలవాఁడు.) శివుఁడు.

అహిర్బుధ్న్య. సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరాభాద్ర నక్షత్రము.

అహిర్బుధ్న్యుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

అహిహుఁడు. సం. వి. న్.పుం. 1. (వృత్రునిఁ జంపువాఁడు) ఇంద్రుఁడు; 2. (పామును జంపువాఁడు) గరుత్మంతుఁడు.

అహీంద్రుఁడు. సం. వి. అ. పుం. 1. ఆదిశేషువు; 2. శత్రుశ్రేష్ఠుఁడు.

అహీనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) (న+హీన) 1. హీనుఁడు కానివాఁడు; 2. (అహి+ఇన) పాములలో శ్రేష్ఠుఁడు, సర్పరాజు. (వాసుకి.)

అహేతుకము. సం. విణ. (అ. ఆ. అ.) హేతువు లేనిది.

అహేరువు. సం. వి. ఉ. స్త్రీ. పిల్లపీఁచరచెట్టు.

అహైతుకము. సం. విణ. (అ. ఈ-కీ. అ.) 1. హేతువు లేకుండఁగ వచ్చినది; 2. ఉద్దేశము లేకుండఁగఁ జేయఁబడినది.

అహో. సం. అవ్య. అహాహా.

అహోపురుషిక. సం. వి. ఆ. స్త్రీ. గర్వముచేఁ గలిగెడి ఆత్మగౌరవము, ఆహోపురుషిక.

అహోరాత్రము. సం. వి. అ. పుం. పగలును, రాత్రియును, దివారాత్రము.

అహోరాత్రులు. సం.వి.ఇ. స్త్రీ.బ. పగలురాత్రియు, "క. ఎడఁబడక యహోరాత్రులు, వడిఁగొని చదివింప నిట్లు వలయునె శిష్యుల్, గడునిద్ర లేమి నెంతయు జడమతులై చదువుదప్పఁ జదువుచునుండర్." భార. అర. 3, ఆ. ౨౩౮. (ఎల్లరాత్రులు పాఠాంతరము. అహోరాత్రము అనవచ్చు.)

అళఁది. వై. వి. హారిద్రావర్ణము, పసుపురంగు.

అళము. దే. వి. ఉప్పుపంట పెట్టెడియేఁబడిపాదుల కొలఁదినేల. ఉప్పుమ్మెడుచోటు. (అని కొందఱు.) అని శ. ర.

అళాకు. దే. వి. పడిలో యెనిమిదవవంతు.

అళి. సం. వి. ఇ. న్. పుం. **1.** తుమ్మెద; **2.** తేలు; **3.** మద్యము.—వి. ఇ. స్త్రీ. **1.** పంక్తి; **2.** సఖి; **3.** అడ్డకట్ట; **4.** నొసటి యెముక.

అళికము. సం. వి. అ. న. నుదురు.

అళిపకము. సం. వి. అ. పుం. **1.** తుమ్మెద; **2.** కోయిల; **3.** కుక్క.

అళిమకము. సం. వి. అ. పుం. **1.** కోయిల; **2.** ఇప్పచెట్టు; **3.** కప్ప; **4.** తుమ్మెద.

అళిందము. సం. వి. అ. పుం. ఆళిందము, తలవాకిఁటి ప్రక్క నుండెడు చిన్నగది.

అళిగర్దము. సం. వి. అ. పుం. అలగర్దము, నీరుపాము.

అళిని. సం. వి. ఈ. స్త్రీ. **1.** ఆఁడుతుమ్మెద; **2.** ఆఁడుతేలు.

అళీకము. సం. వి. అ. న. **1.** అప్రియము; **2.** అళికము, నొసలు; **3.** బొంకు; **4.** ఆకాశము; **5.** బాణము; **6.** శుకమైథునము.

అళుకరి. దే. విశే. భయశీలుఁడు. "సీ. భయశీలుఁడౌ వెఱపరియళుకరి." ఆం, భా. తృ. వి. ౯.

అళుకు. దే. వి. వెఱపు, భయము.

ఆ.

ఆ. ఒకయక్షరము. ఉభ. దే. స. **1.** పూర్వపరామర్శకము, పూర్వము చెప్పఁబడినదానిఁ దెలుపును. "ఆ వరము;" **2.** కొంచెముదూరముగానున్నదానిఁ దెలుపును; **3.** ఉద్దేశింపఁబడినదానిఁ దెలుపును. "క. ఏకథలయందుఁ బుణ్యశ్లోకుఁడు హరిచెప్పఁబడును సూరిజనులచే, నాకథలు పుణ్యకథలని, యాకర్ణింపుదురు పెద్ద లతిహర్షమునన్." భాగ. ౧, స్కం. ౫౧.—అవ్య. **1.**ఆశ్చర్యప్రశంసాదులను దెలుపును;" చ. మదగజవైరివంటి నడుమా కమలంబులవంటికన్నులా, యదనుశశాంకువంటి మొగమా ముకురంబులవంటి చెక్కులా, మదనునివంటిచక్కఁదనమా మధురాధరవానిరూపునా, హృదయపటంబునందు లిఖియించినకైవడిఁ గానవచ్చెడిన్." ఆ. ౧.౨,ఆ. ౯౩; **2.** ప్రశ్నమును (అడుగుటను) దెలుపును; "ఉ. ...బకారికి భద్రమె యస్త్రశస్త్ర విద్యాసిప్రుణుండు క్రీడిసుఖియా వినయాభరణుల్ గవల్ సమాధానసమేతులే." భార. ఉద్యో. ౩, ఆ. ౧౮౬. "చ...సోమదత్తనం, దనుఁ డలఁద్రుంపవె మఱచి తాయిసిరో..." భార. మా. ౪౪; **3.** ప్రశ్నార్థమున కాకూక్తిచేత వ్యతిరేకమును సూచించును. "ఇస్సిరో, యాంపను దేవసూను సరియా యితఁడు." ఉ, హరి. ౩, ఆ. ౭౨; "మ. అరయన్ శూరుఁడు బభ్రువాహనుఁడు గాఁడా పెట్టు ముక్తామణుల్." జై. ౭. ఆ. ఇట అంగీకారమును దెలుపును అని శ. ర.; **4.** ప్రార్థనార్థముపై అనుప్రయుక్తము నగునది. "క. అని చెప్పిన వైశంపాయనునకు జనమేజయుఁడు ప్రియంబారఁగ ని, ట్లను మురవైరి పరాక్రమ, మనఘా వినవలతుఁ జెప్పుమా." ఉ. హరి.౨,ఆ.౭౨; **5.** ఆక్షేపమును దెలుపును. "క. కనువిడి నీవుసుబోటరి, పనియేదానవులఁ జేనసెదాగానీపో,టునుజూతము. కు. సం. ౧.౨. ౮౦౧. "నీవా నన్నుఁగొట్టుట!" "కొట్టెదవా! రారా!;" **6.** "అన్ననో." "అంటె" అనఁగా అనుభావమును దెలుపును. "శా. ఓసర్వేశ్వర దృప్తుఁడై మహిషదైత్యుం డష్టదిక్పాలసే, నాసందోహముఁ దోలి నిన్నుఁజెనకున్ సన్నద్ధుఁడైవచ్చె మా,కాసామర్థ్యములేదు వానిఁ గెలువంగా నీవె దిక్కంచునా,చే సర్వంబును విన్నవించి పనిచెంజేకొమ్ము తత్ప్రార్థనల్" వరాహ. ౧౧, ఆ. ౯౪. "తినుటకా తిండిలేదు ఉండుటకా కొంపలేదు. వర్షాలా హెచ్చుగానున్నవి.బీదలగతియేమి? ధనవంతులకా ఆబాధ తెలియదు;" **7.** "ఏనియు, చో, యెడల, పక్షమున" అను దానియర్థమును దెలుపును. "ఉ. ఆనతియిచ్చెనా యది శిలాక్షర మెక్కనినేని మెచ్చెనా వానిఁ గృతార్థుఁజేయుఁ" విజ. వి. పీఠిక.౫౧. "ధర్మమార్గము తప్పి నారా

పరాజయము పొందినారన్నమాటే" "పెద్దల మాట విన్నావా బాగుపడుదువు. లేదా చెడి పోవుదువు;" **8.** సందేహమును తెలుపును. "ఉ. అంతట మూర్ఛఁ దేఱి పులియా యెలుఁగా యెరు పోతు సింగమా, కాంతుము పిలిగర్వము." కళా. ర, ఆ. ౧౦౬. చూ. 'ఆ' ఈయర్థము; **9.** (అదాదులలోనిది) ప్రార్థనార్థకక్రియపై నను ప్రయుక్తము. చూడుమా! రమ్మా; **10.** స్వరభేదమున అవలించుటను, నిషేధమును, జ్ఞప్తిని అంగీకారాదులను సూచించుట కుపయుక్తము. ఇది హ్రస్వముగాను దీర్ఘముగాను గూడ నుపయుక్తము. ఇది కొందఱు సానునాసికముగాఁ బలుకుదురు. చూ. 'అ' "ఆ! ఆఁగు" "ఆ! ఆ! చెప్పితే వినవా? చేయవద్దంటే మానవా?" "ఆ! జ్ఞప్తికి వచ్చినది" "ఆ అట్లు చేయుము. ఆఁ! నే నన్నానా? మిగిలినది వ్యవహారమునుండి గ్రహించునది.—సం. ఉప. **1.** ఒక విశేష్యమునకు ముందుండి ఈ క్రింది యర్థములను తెలుపును:— 1. అభివిధి (మొదలుకొని అను భావమును) ఆజన్మ శుద్ధులు. = జన్మము మొదలుకొని శుద్ధులు; 2. మర్యాద. (వఱకు అను భావమును) ఆఫలోదయ కర్ములు.=ఫలోత్పత్తివఱకు పనిచేయువారు. ఆచంద్రతారకము = చంద్రుఁడు నక్షత్రములు నున్నంతవఱకు. ఆకంఠము=కంఠమువఱకు; **2.** క్రియాపదములకు ముందుండి యీ క్రిందియర్థములను తెలుపును:—1. వ్యతిరేకము. "ఆగమనము, ఆనయనము, ఆదానము;" 2. విశేషణములకుఁ బూర్వముండి కొంచెము; అధికము. అను భావముల తెలుపును. "ఆపాండురము" "ఆకంపితము."

**ఆంకుశికుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) (అంకుశము ప్రహారణముగాఁ గలవాఁడు) అంకుశముతో పొడుచువాఁడు, అంకుశము ఆయుధముగా నుపయోగించువాఁడు.

**ఆంగము.** సం. విణ. (అ. ఈ. అ.) అంగమునకు సంబంధించినది.

**ఆంగవిద్యుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) **1.** వ్యాకరణాది వేదాంగములు తెలిసినవాఁడు; **2.** శరీరావయవలక్షణములనుబట్టి భాగ్యాభాగ్యములను తెలిసికొనువాఁడు, సాముద్రికవిద్య నెఱిఁగినవాఁడు.

**ఆంగారము.** సం. విణ. (అ. ఈ. అ.) అంగారసంబంధమైనది.—వి. అ.న. బొగ్గుల సమూహము.

**ఆంగికము.** సం. విణ. (అ. ఈ. అ.) అంగముచేతఁ గలిగినది.—వి. అ. పుం. **1.** అభినయవిశేషము, నటాదుల కనుబొమ లెగురవైచుట మొదలగునది; **2.** స్త్రీల చేష్టావిశేషము, హావము.

**ఆంగిరసుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) **1.** అంగిరసునకు సంబంధించినవాఁడు; **2.** అంగిరసునిపుత్త్రుఁడు; **3.** అంగిరసుని వంశములోనివాఁడు.—వి. అ. పుం. (అంగిరసునిపుత్త్రుఁడు) బృహస్పతి, వేల్పుటొజ్జ. (అంగిరసునకు బృహస్పతి, ఉతథ్యుఁడు, సంవర్తుఁడు అను ముగ్గురు కొడుకులు.)

**ఆంగీరస.** సం. వి. అ. పుం. ప్రభవాదిసంవత్సరములలో నొకటి.

**ఆంగీరసము.** సం. వి. అ. పుం. పుష్యమీనక్షత్రము.

**ఆంజనము.** సం. విణ. (అ. ఈ. అ.) అంజనసంబంధమైనది.—వి. అ. న. కాటుక.

**ఆంజనిక్యము.** సం. వి. అ. న. అంజనమునకుఁ బనికి వచ్చు వస్తువు.

**ఆంజనుఁడు.** సం. వి. అ. పుం. ఆంజనేయుఁడు.

**ఆంజనేయుఁడు.** సం. వి. అ. పుం. అంజనాదేవి పుత్త్రుఁడు, హనుమంతుఁడు.(రామునికి సహాయుఁడును భక్తుఁడును నయినవానరజాతివాఁడు.)

**ఆండము.** సం. విణ. (అ. ఈ. అ) **1.** అండసంబంధమైనది; **2.** అండమువలనఁ బుట్టినది (పక్షి); **3.** అండమునందుండునది.

**ఆండీరము.** సం. విణ. (అ. ఈ. అ.) (అండేరము) **1.** అండములు (గుడ్లు) గలది; **2.** బలిసిన వృషణములుగలది. (ఎద్దు మొ.); **3.** బలము గలది.

**ఆండ్రెబ్బ.** దే. వి. **1.** గారాబముగా వదలిపెట్టిన పిల్లలు చేసెడి యల్లరి; **2.** సాధారణముగా

లోంగని పెంకెతనము. "భయభక్తులు పోయినవి అందఱకు ఆంద్రెబ్బ బలసిపోయినది."

ఆంతరము. సం. విణ. (అ. ఈ. అ.) 1. లోపల నున్నది; 2. రహస్యము.—వి. అ. న. 1. లోపలి స్వభావము; 2. లోపలిభావము. (ఆంతరజ్ఞుఁడు= ఆంతరము తెలిసినవాఁడు.)

ఆంతరాగారికము. సం. వి.అ. న. అంతఃపురపుఁగావలి వానిపని.

ఆంతరాళము. సం. విణ. (అ.ఈ.అ.) 1. అంతరాల మందున్నది; 2. అంతరాళ సంబంధమైనది.

ఆంతరిక్షము. సం. విణ. (అ.ఈ.అ.) 1. అంతరిక్షము వలనఁగలిగినది; 2. అంతరిక్ష సంబంధమైనది; 3. అంతరిక్షమందున్నది.

ఆంతరీక్షము. సం. = ఆంతరిక్షము.

ఆంతర్గేహికము. సం. విణ. (అ.ఈ.అ.) గేహమధ్య మందున్నది.

ఆంతర్యము. సం. వి. అ. న. 1. లోపలనుండుట; 2. (లోపలనున్నది) అభిప్రాయము, తలఁపు; 3. అక్షరముల యేకస్థాన జన్యత్వాదిసాదృశ్యము; 4. దగ్గఱనుండు సంబంధము.

ఆంత్రము. సం. విణ. (అ. ఈ. అ.) అంత్రమునకు (పేగునకు)సంబంధించినది.—వి. అ. న. అంత్రము, ప్రేగు.

ఆందోళకుఁడు. సం. విణ. (అ.ఆ-ళికా.అ.) ఆందోళనము చేయువాఁడు.

ఆందోళన. సం. వి. ఆ. స్త్రీ. = ఆందోళనము.

ఆందోళనము. సం. వి. అ. న. 1. ఊఁగుట, ఉరియాట; 2. ఇటునటు ఆడించుట. (చామరాందోలనము); 3. (మనసు) ఊఁగులాడుట, చలించుట.

ఆందోళనీయము. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఊఁపఁదగినది; 2. ఆడింపఁదగినది.

ఆందోళము. సం. వి. అ. పుం. 1. అందలము; 2. ఇటునటు కదులుట, ఊఁగుట.

ఆందోళాయితము. సం. విణ. (అ. ఆ. అ.) ఊఁగులాడునది; 2. నిశ్చయములేనిది.—వి. అ. న. 1. ఊఁగులాట; 2. సంశయము, నిశ్చయములేమి. "మ. చిత్తమున నాందోళాయితంబేటికిన్." దశ. 2, ఆ. 23.

ఆందోళించు. సం. అ. క్రి. 1. ఊఁగు, ఉరియాడు; 2. (మనస్సు) చంచలమగు; 3. సంశయించు.

ఆందోళిక. సం. వి. ఆ. స్త్రీ. ఆందోళము.

ఆందోళితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఊఁపఁబడినది; 2. ఆందోళనముగలది, వ్యాకులము. (మనస్సు.)

ఆంధసము. సం. విణ. (అ. ఈ. అ.) అన్నసంబంధమైనది.—వి. అ. పుం. గంజి.

ఆంధసికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) (అన్నము, శిల్పముగాఁగలవాఁడు) వంటవాఁడు, బానసీఁడు. "ఉ. వి, జ్ఞాపనసేసె నాంధసికసంఘము మెల్లనఁ గొంకి." కాశీ. ౫, ఆ. ౩౦౫.

ఆంధ్యము. సం. వి. అ. న. 1. అంధత్వము, గ్రుడ్డితనము; 2. (మదాకులచే)కన్నుగానరాకుండుట. "క. ఇమ్మహిఁ ద్రయోదశద్వీ, పమ్ములు దనశౌర్య శక్తిఁ బాలించి మదాం,ధ్యమ్మున విప్రోత్తమ వి,త్తమ్ములు దా నపహరించె ధనలోభమునన్." భార. ఆది. 3, ఆ. ౯౦.

ఆంధ్రము. సం. విణ. (అ. ఈ. అ.) ఆంధ్రసంబంధమైనది.—వి. అ. పుం. 1. ఆంధ్రదేశము, తెలుఁగుదేశము; 2. తెలుఁగుభాష.

ఆంధ్రి. సం. వి. ఈ. స్త్రీ. ఆంధ్రజాతిస్త్రీ. "క. ఆంధ్రీస్తనాపహాసులు కు. సం. ౨.

ఆంధ్రుఁడు. సం. వి. అ. పుం. 1. ఆంధ్రదేశస్థుఁడు; 2. ఆంధ్రజాతివాఁడు.

ఆంబష్ఠుఁడు. సం. వి. అ. పుం. అంబష్ఠాపుత్రుఁడు, మంగలిదానికొడుకు.

ఆంబికేయుఁడు. సం. వి. అ. పుం.(అంబికాపుత్రుఁడు) 1. ధృతరాష్ట్రుఁడు.(అంబిక విచిత్రవీర్యునిభార్య, కాశిరాజు కన్యకలలో నడిమిది, ఆమెయందు వ్యాసునివలన నియోగమున జన్మించినవాఁడు. దుర్యోధనాదులతండ్రి); 2. పార్వతీపుత్రుఁడు, కుమారస్వామి.

ఆంభసికము. సం. విణ. (అ. ఈ. అ.) నీటిలో నుండునది.—వి. అ. పుం. మత్స్యము.

ఆంక్షు. వై. వి. వెలివేయుట, సంఘమునుండి బహిష్కరించుట.

ఆఁక. దే. వి. ఆఁగుట. **1.** అడ్డగింత, నిరోధము. "గీ. ఆఁకలేక యెవ్వాని జలాశయమున, మందు లేసవియందును మనుజకోటి, యపక్ష్మక్షస్నానంబు లాచరించు." భార. అను. ౭, ఆ. ౩౯౬; **2.** ఆసేధము, ఋణస్థుని ఋణమిచ్చి కదలుమని నిల్పుచేయుట. "సీ. కినుకించి రిచ్చి ప్రచ్చి కొనుచోటులవారలాఁకకు లోనుగాకప్పుడ్రోచి." స్వా. ౩, ఆ. ౧౭౯; **3.** చెఱ; "చ. హృదయంబున రోషముపట్టి తేక వధ్యకకు విధింపనేల యికఁ డాఁకకుఁబాత్రము." ఉ. హరి. ౫, ఆ. ౨౬౨; **4.** నిషేధము; **5.** హద్దు, మేర. "ఉ. నేనాఁకకు మీఱు వార్ధిక్రియన్ రిపుసేనల నాక్రమించితిన్." దశ. ౧౨, ఆ. ౩౪. (ఇట చెలియలికట్ట అని భావము.)

ఆఁకట్టు. దే. స. క్రి. (ఆఁక+కట్టు.) **1.** అడ్డగించు, నిరోధించు. "తే. పొల్లనీరంబు నాఁకట్టఁ జెల్లఁగాక, పొల్లుగుణమది మాన్పంగఁ జెల్లనెట్లు." కవిక. ౪, ఆ. ౧౯౯. "దం. మూడంజేలన్ ముజ్జగంబుల్ కరంబబ్బురంబొప్పనాఁకట్టి." నీలా. ౨, ఆ. ౪౧. ఇట వ్యాపించు అనవచ్చును; **2.** ఉపయోగింపక నిలువయుంచు. "ఆపదార్థమంతయు నీకై ఆఁకట్టి యుంచితిని."

ఆఁకత్రాడు. దే. వి. కవ్వమును దగిలించుటకై తరిగంబమునందుఁ గట్టెడుత్రాడు. "సీ. ఆహవ ప్రవహోదులగుమారుతంబులు తగులఁగట్టినయాఁక త్రాళ్లుగాఁగ." భీ. ౪, ఆ. ౫౯.

ఆఁకపడు. ద్వి. అ. క్రి. అడ్డునొందు, ప్రతిహతమగు. క. ఇలఁ బాతాళమున నభ, స్థ్సలి నంబుధి నాఁకపడక చరియింపఁగశ, క్తులుగలవానరవీరులు, ల రెన్న ననేకు లేనుగలనీపనికిన్." రా. కిష్కిం, కాం. ౪౦౩.

ఆఁకపెట్టు. దే. స. క్రి. ఆఁకిడు, అడ్డగించు. "క. మంత్రులుతా, రెద్దియునుబల్కకుండిరి, పెద్దతడవు వింజేమాఁకపెట్టిన భంగిన్." రా. యు, కాం. ౨౩.

ఆఁకయిల్లు. దే. వి. ఔప. నిరోధగృహము, చెఱసాల. "సీ. ఆఁకయింటికావలివాఁడు." భాగ. ౧, స్కం. పు. ౧౪౮.

ఆఁకరము. వై. వి. (సం. అహంకారః త. ఆంకారం ఆగ్రహశబ్దభవమనియుఁ జెప్పవచ్చును.) ఆగ్రహము, పట్టుదల. "క. వీఁకఁ బఱతెంచి నల్గడఁ, దాఁకినఁ గడునల్గి ఘోరతరశరహతి నమ్మూఁకలు విరియఁగ నర్జునుఁ, డాఁకరమున నేసె నుగ్రుఁడయి రణభూమిన్." భార. ఆది. ౮, ఆ. ౨౦౦. "క. ఆఁకరముతోడ నప్పెను, మూఁకలపైకుఱికి కఠిన ముష్టినిహతులన్." రా. యు. కాం. ౫౩౫. ఆము, గర్వము. "ఆమునాఁగ విరాజిల్లు నాఁకరంబు" ఆం. భా. ౧, కాం. ౧౩౩.

ఆఁకలి. దే. వి. ఔప. అనౌప. అంగద, క్షుత్తు "ఆఁకటి పెలుచననిలువలేక." భార. ఆది. ౬, ఆ. ౧౯౧. "క. వీఁక మెయిఁ గ్రీడికొడుకుం, దాఁకఁగ నీకొడుకు తలఁచి తఱిమి కవిసెఁ బే, రాఁకలితో నున్నహరిం, జేఁకువనెడి చేరు కరిగతిం గురుముఖ్యా." భార. ద్రోణ. ౨, ఆ. ౧౯.

ఆఁకిడు. దే. స. క్రి. అడ్డగించు, ఆఁకపెట్టు. "క. ఆకొలువువారు కరమచ, లాకృతి నొకపలుకు లేక యందఱు వింజం, బాఁకిడినకరణి నవశ, ముదాకారితచిత్తప్రవృత్తులైయుండంగన్." భార. ఉద్యో. ౩. ౨౫౫. "తే. వింధ్యమాఁకిడినట్లుండె విశ్వసభయు." కాశీ. ౭, ఆ. ౫౫.

ఆఁకొను. దే. అ. క్రి. (ఆఁకలి + కొను.) ఆఁకలిఁ జెందు. "ఆ. ఆఁకొని ముపిండి దినినఁ గ్రొవ్వులావు, గలుగునయ్య" భార. ఉద్యో. ౩, ఆ. ౩౩౩. "శా. అమ్మా మన్ను దినంగ నే శిశువనో యాఁకొంటినో వెఱ్ఱినో" భాగ. ౧౦, స్కం. పు. ౩౩౮.

ఆఁగాఁకర. దే. వి. (ఆకు+కాఁకర) ఒకరకము కాఁకర, కర్కోటకి. ఇది అడవిప్రాంతమున నుండును.

ఆఁగికొను. దే. స. క్రి. అడ్డుకొను, నిరోధించు. "సీ. పురుడుసూపినసైనఁ బుడుక నేరనివాని నంగడిఁ బుచ్చెపో నాఁగికొనుచు." దశ. ౫, ఆ. ౧౭.

ఆఁగు. దే. అ. క్రి. **1.** నిరుద్ధమగు, అణఁగు; **2.** తాళు, ఓపు. "ఆబాధకు వాఁడాఁగలేక పాఱిపోయె;" **3.** సమర్థుఁడగు; **4.** నిలఁబడు. "తే. కలిసివ్రేసిన గ్రక్కున గద యమర్చి, యాఁగి

వజ్రప్రహారంబు ననుకరింప." భార. భీష్మ. ౨, ఆ. ౧౯౪. "సీ. లలినుల్లసిల్లుచు లలితలోచనదీప్తు లడరనుంకించిన నాఁగి యాఁగి." భార. విరా. ౩, ఆ. ౭౬.—స. క్రి. 1. అడ్డగించు, ఆఁపు. "ఉ. గోవులసెట్టు లాఁగితివి." భార. విరా. ౭, ఆ. ౨౮౩. "క. మ్రోఁగుచుఁ దూపులు దూపుల, నాఁగుచు." రామా. ౮, ఆ. ౧౧౭; 2. నిషేధించు. "గీ. ఆఁగఁబడినవాని లోఁగకచేయుట, యధమగతికి మార్గమనిరి బుధులు." భార. ఆది. ౩, ఆ. ౨౨౦; 3. రాజపురుషాజ్ఞచేత నిలుపు సేయు, పోకుండనాఁపు. "క. ఆఁగిన నిలుఁవనియాతం,డాఁగఁదగనివాని బలిమినాఁగినయతఁడుక్ ...దండ్యుఁడు...విజ్ఞా." వ్యవ. ౧౪; 4. మోచు,వహించు. "సీ.... వేలసంఖ్యలదైత్య విభులు దన్ను,నాక్రమించిన భారమాఁగఁజాలక భూమి గోరూపయై బ్రహ్మఁ జేరఁబోయి." భాగ. ౧౦, స్కం. పూ. ౧౪. 5. కాపాడు.

ఆఁగుదెంచే. దే. = ఆఁగు. "ద్వి. అడ్డమే మన కేల యాఁగుదే ననుచు." పండి. ౭,ఆ. ౩౨౮.

ఆఁచికొను. దే. స. క్రి. నాఁచికొను, అపహరించుకొను. "సీ. పురిలోనఁజొచ్చివిస్ఫురితగేహంబుల యర్థసంచయమును నాఁచికొనుఁడు." హరి. ఉ. ౬, ఆ. ౧౩౮. చూతాడికొనుఁడు. పాఠాం.

ఆఁచికోలు. దే. వి. ఆఁచికొనుట.

ఆఁచే. దే. ఆఁగుధా. ప్రే. ఆఁగఁజేయు. "సీ. ఆదిత్యుపసనాఁచి హాలహాలంబును లోఁచి హూతవహు గర్వముట్టూఁతలూఁచి." కళా. ౧, ఆ. పీఠిక,౭౬. ఇట అణఁగించు అని యర్థము. రూ. ఆఁపు.

ఆఁటది. దే. వి. ఆఁడుది. "క. ఏటికి నీరాచటికం, బాఁటది మొఱవెట్టఁ బశువులాతురపడనో, యాఁటదనిలేచి దొంగల, గీఁటవు వెడలంగ శవము క్రియ నుండెదిదే." భాగ. ౯, స్కం. ౪౦౮. "ద్వి. మాటిమాటికిఁ జూచు మక్కువలేక, యాఁట దానిని జంపుటవినీతి యనక." పండి. ౨, ఆ. ౯౬. పుట.

ఆఁటు. దే. అ. క్రి. 1. చాలు, సమృద్ధమగు. "ఉ. నాడెపుఁబాఱుల కీనియాళ్లు నీ,రాఁటనిరాటపుంజెఱువులారయనబ్బుర మెంచి చూడ నష్మేటి యయాతి యేలుపుడమిక్." య. ౧, ఆ. ౯౪; 2. తాఁకు. "స్రగ్ధర. నాచేతికాఁటం గ్రాశేష్వా సంబులేదొక్కొఁడు." రాఘ. ౨, ఆ. ౧౦౬; 3. సరిపడు, సరిపోవు. "ఎక్కువజనము వచ్చిన పుడున్నసరకులు ఆఁటవు." (ఆఁటివచ్చు = సరిపోవు.)—వి. ఆఁడుతనము.

ఆఁడంగి. దే. వి. ఆఁడుదాని స్వభావముగలపురుషుఁడు. ఆఁడంగి అబ్బన్న = ఆఁడుదానివలె నుండువాఁడు. ఆడంగిమాట = స్త్రీవలె మాటలాడు మాట. ఆఁడంగులు—బ. ఆఁడువారు. "సీ. అద్రిరామనియించిరాడంగులంతఱుఁ జనియఁగొట్టిన నంచు గదధరించి." పరాహ. ౧౧, ఆ. ౧౦౩.

ఆడంగివాఁడు. దే. వి. స్త్రీరూపముకలవాఁడు, స్త్రీల ధోరణి గలవాఁడు. "నాటకములో తఱచు ఆఁడువేషము వేసినవాఁడు ఆఁడంగివాఁ డగును."

ఆఁడది. దే. వి. ఆఁడుది, ఇంతి. "క. అదెతాటకి యను రక్కసి,గాదగాని యేతెంచె దీనిఁ గూల్పము గడుబెట్టిదమగుతూఁపుల నిదియాఁడది యని చూడకుము మిగుల డాయఁగవచ్చెన్."యయా. ౩, ఆ. ౮.

ఆఁడి. దే. అప. కల అను నర్థమునందు వచ్చెడియొక స్త్రీప్రత్యయము. "పగలాఁడి పగలుగలస్త్రీ."

ఆఁడు. దే. అప. కల. అను నర్థమునందు (మత్వర్థమున) వచ్చెడియొక పుంలింగప్రత్యయము"ముద్దులాఁడు."—వి. 1.ఆఁడుతనము; 2.ఆఁడుది. ఈ యర్థము వృత్తియందే కనఁబడును, "ఆఁడుమొఱ, ఆఁడుబిడ్డ."

ఆఁడుకట్టు. దే. వి. ఆఁడుదికట్టుకొనుకట్టు. "సీ. కాళ్ల యొప్పిద మాఁడుకట్టనుజ్జ్వలముచేయంగ." భార. విరా. ౧, ఆ. ౨౨౮. (ఆఁడుకట్టుపంచెలు= ఆఁడుది కట్టుకొనుటకు ఉపయోగించు పంచెలు.) ఆఁడుకట్టు మొదలగుచోట ఆఁడుఁగట్టు అని యుండఁదగియున్నను వ్యవహారము ననుసరించి సమాగమనకారాదేశములు లేని రూపములే గ్రహింపఁబడినవి. శ. ర. కారులుగూడ నట్లే గ్రహించిరి. వ్యవహారమున ఆఁడకట్టు మొదలవే ప్రసిద్ధములు. ఆఁడది అనురూపమువలెనే వాడఁబడియుండును.

ఆఁడుకూఁతురు. దే. వి. ఆఁడుది, ఇంతి. "క. పడసెఁ

గాదె శంకర, గొనకొనఁ బుంస్త్వమ్మునాఁడు కూఁతురు సీచేర్. శివ. సా. ౪౦౭.

ఆఁడుతోడు. దే. వి. 1. తోడఁబుట్టినది, సహోదరి. "బోయవె యాఁడుతోడునకు బుట్టవె." స్వా. ౪, ఆ. ౮౭; 2. ఆఁడుదానిసహాయము.

ఆఁడుఁదనము. దే. వి. స్త్రీత్వము, స్త్రీధర్మము. "ఉ. ఆఁడుఁదనంబు సిక్కుటయు నా కొకసీ చూచినఁలేదు పుంస్త్వము, బోఁడిమిఁ జిక్కి యున్నది." భార. విరా. ౧, ఆ. ౨౩౮.

ఆఁడుది. దే. వి. ఆఁడది, స్త్రీ.

ఆఁడుపడుచు. దే. వి. 1. కూఁతురు. "సీ. కొడుకు మన్మథుఁ డాఁడుపడుచు భాగీరథి యిల్లాలు భూకాంత యిల్లు కొండ." రా. వి. ౧, ఆ. ౩౮; 2. భర్తృసోదరి.

ఆఁడుపాప. దే. వి. పడుచు, కన్యక, ఆఁడుపిల్ల.

ఆఁడుపిల్ల. దే. వి. ఆఁడుపాప, కన్య.

ఆఁడుపుట్టువు. దే. వి. 1. ఆఁడుది. "గీ. చదువు నెయివ్వాటలాడసజ్జనులకాఁడు, పుట్టువులతోడ నీవును, బుట్టినాఁడ, వు." భార. విరా. ౨, ఆ. ౫౦; 2. స్త్రీజన్మము, స్త్రీయైపుట్టుట.

ఆఁడుబిడ్డ. దే. వి. 1. కూఁతురు. "సీ. క్రొత్తగాఁ జేయించుకొనిన ముక్కరకుఁగానడలు దుర్వారయై యాఁడుబిడ్డ." పాండు. 3, ఆ. ౫౦; 2. మగనితోడఁబుట్టినది.

ఆఁదోఁక. దే. వి. (ఆవు+తోఁక.) 1. ఆవుతోఁక, గోపుచ్ఛము; 2. ఆవుతోఁకవలె మొదట లావును క్రమక్రమముగా సన్నమునైనయాకృతి.

ఆఁదోఁకపాటు. ద్వ. వి. ఆవుతోఁకవలె నగుట, ఆఁదోఁకపడుట. "గీ. కదళితిమియించెనగ్రాంఘ్రికంపుఁదొడల, మెనపు సెట్లున్నఁ బొరలశోధ సనడంచు, కొన్న యాఁదోఁకపాటునుగొప్పవిప్ప, మెఱయుగోర్ ముచ్చులును గెంపుగుఱులు గావె." ఆము. ౫, ఆ. 3౦.

ఆఁపు. దే. ఆఁగుధా. ప్రే. ఆఁగఁజేయు. "ద్వి. పట్టిన వాఁడవో పడయనంగల్ల, నాఁపినవాఁడవో యటుకొన్నిదినము, లేపినవాఁడవో యే నిన్ను వలవ". పండి. పురా. ౧౫౫. పుట.—వి. అడ్డగింత, చూ. ఆపుసేయు.

ఆఁపుసేయు. స. క్రి. 1. నిరోధించు, అడ్డగించు. "తే. పట్టుకొని యాఁపుసేయించె బాణుఁడతని." అని. 3, ఆ. ౧౨౧; 2. నిలుపు, నిల్వఁజేయు.

ఆఁబసి. దే. వి. (ఆవు+పసి.) గోవు. "సీ. బలుదామలఁగుచు బెబ్బులుల బిడ్డలనిచ్చు విసువక పెంచు నాఁబసులకదుపు." య. ౨, ఆ. ౪౮.

ఆఁబెయ్య. దే. వి. ఆవుపెయ్య, లేగదూడ. "సీ. ఒక్క యాఁబెయ్య యుఁటికి వాయజ్ఞానముననం పతాడునఁగూలుడు దానిఁగలుగు." భార. కర్ణ. ౨, ఆ. ౯౦.

ఆఁబోతు. దే. వి. (ఆవు+పోతు.) 1. అచ్చుపెద్దు, అచ్చుపోసి విడిచినయెద్దు; 2. ఎద్దు. "ఆంకె వేసె నొకచో నాఁబోతు కాల్ ద్రవ్వుచున్." పంచ. నా. ౧, ఆ. ౮౨.

ఆఁబోతురౌతు. ద్వ. వి. వృషభవాహనుఁడు, శివుఁడు.

ఆఁబోతుసొరము. ద్వ. వి. ఋషభస్వరము, సప్తస్వరములలో నొకటి.

ఆకంపనీయము. సం. విణ. (అ. ఆ. అ.) ఆకంపింపఁదగినది.

ఆకంపించు. సం. అ. క్రి. 1. మిక్కిలికంపించు. "క. అతిశయమునఁ దిరుగునహార్పతి తేజము దరువఁ దరువ బలవద్భ్రమణోగ్రత నాకంపించె జగత్త్రితయము త్రుటితాంశుపవనతీవ్రత్వమునన్" మార్కం. ౭, ఆ. ౧౧౬; కొంచెము కంపించు.

ఆకంపితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పూర్తిగాఁ గదలింపఁబడినది; 2. కొంచెము కంపింపఁబడినది.

ఆకంపితవ్యము. సం. = ఆకంపనీయము.

ఆకంప్యమానము. సం. విణ. (అ.ఆ.అ.) 1. కొంచెము కంపింపఁజేయఁబడుచున్నది; 2. మిక్కిలి కంపింపఁజేయఁబడుచున్నది.

ఆకంప్యము. సం. = ఆకంపనీయము.

ఆకంప్రము. సం. విణ. (అ. ఆ. అ.) బాగుగా కదలు స్వభావముగలది.

ఆకట. దే. అవ్య. (రూ.) అక్కట. "క. ఆఁకొంటి రిన్నిదినములు, పోఁకంతయు భిక్షపెట్టఁబుట్టక యునికిన్, ఆకటదూఁకటనలఁగితి, రేఁకటవా

యంగ భిక్షలిడియెదరండీ." భీ. ౨, ఆ. ౧౨౪. ఇట ఆఁకటిదూఁకట అన్నచో ఆఁకటిబాధచే అని యనవచ్చును.

ఆకతాయ. వై. విశే. ఆతతాయి, తుంటరి. "సీ. ఆకతాయలు మూఁకలై దేశమంతయుఁ జెఱచి పుణ్యస్త్రీలఁ జెఱలుగొనిరి." వి. పు. ౨, ఆ. ౧౨౬.

ఆకరము. సం. వి. అ. పుం. **1.** రత్నములులోనగునవి పుట్టునట్టిచోటు, గని; **2.** సమూహము; **3.** ఉత్పత్తిస్థానము. "పుష్పాకరము, కమలాకరము;" **4.** భాష్యాదిప్రమాణగ్రంథము.

ఆకరికుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) గనులలో నియోగింపఁబడినవాఁడు, గనులపై నధికారిగా నేర్పడినవాఁడు.

ఆకర్ణనము. సం. వి. అ. న. శ్రవణము, వినికి.

ఆకర్ణనీయము. సం. విశే. (అ. ఆ. అ.) వినఁదగినది.

ఆకర్ణయత్. సం. (శత్రంతము.) (త్. ఈ-ంతీ.త్.) వినుచున్నవాఁడు.

ఆకర్ణించు. సం. స. క్రి. ఆకర్ణనముచేయు, విను. "క. ఆకథలు పుణ్యకథలని, యాకర్ణింపుదురు పెద్దలతిహర్షమునన్." భాగ. ౮, స్కం. ౨౧.

ఆకర్ణితము. సం. విశే. (అ. ఆ. అ.) ఆకర్ణింపఁబడినది, వినఁబడినది.

ఆకర్ణితవ్యము. సం. = ఆకర్ణనీయము.

ఆకర్ణ్యమానము. సం. విశే. (అ. ఆ. అ.) వినఁబడుచున్నది.

ఆకర్ణ్యము. సం. = ఆకర్ణనీయము.

ఆకర్షణము. సం. విశే. (అ. ఈ. ఆ.) ఆకర్షించునది. —విశే. అ. న. ఆకర్షించుట.

ఆకర్షణీయము. సం. విశే. (అ. ఆ. అ.) ఆకర్షింపఁదగినది.

ఆకర్షము. సం. వి. అ. పుం. **1.** ఆకర్షించుట; **2.** ఇంద్రియము; **3.** జూదము; **4.** జూదమాడెడు పలక; **5.** పాచిక; **6.** వింటినభ్యసించెడువస్తువు; **7.** సూదంటురాయి మొదలగునది, లోహాదులను ఆకర్షించువస్తువు.

ఆకర్షయత్. సం. (శత్రంతము.) (త్. ఈ-ంతీ. త్.) ఆకర్షించుచున్నది.

ఆకర్షయితవ్యము. సం. = ఆకర్షణీయము.

ఆకర్షి. సం. విశే. (న్. ఈ-ణీ. న్.) (ఆకర్షించువాఁడు.) **1.** వశముచేసికొనువాఁడు; **2.** లాఁగువాఁడు; **3.** (వింటినారి) ఎక్కుపెట్టువాఁడు.

ఆకర్షించు. సం. స. క్రి. ఆకర్షణముచేయు, లాగు.

ఆకర్షితము. సం. విశే. (అ. ఆ. అ.) ఆకర్షింపఁబడినది.

ఆకలనము. సం. వి. అ. న. **1.** అవగాహనము; **2.** గణనము, ఎన్నిక; **3.** కోరిక; **4.** బంధనము; **5.** సమూహము; **6.** వ్యాపించుట; **7.** సంగ్రహించుట.

ఆకలనీయము. సం. విశే. (అ. ఆ. అ.) **1.** వ్యాపింపఁజేయఁదగినది; **2.** బోధపఱచుకొనఁదగినది; **3.** కూర్పఁదగినది.

ఆకలించు. వై. స. క్రి. = ఆకళించు.

ఆకలితము. సం. విశే. (అ. ఆ. అ.) **1.** అనుసరింపఁబడినది; **2.** కూర్పఁబడినది, గ్రథితము. (పల్లవాకలితమాళి); **3.** గ్రహింపఁబడినది, ఆక్రమింపఁబడినది, (కుతూహలాకలితచిత్తుఁడు); **4.** కట్టఁబడినది, బద్ధము (సువర్ణసూత్రాకలితాధరాంబర); **5.** వ్యాపింపఁజేయఁబడినది; **6.** వ్యాపించినది.

ఆకల్పము. సం. వి. అ. పుం. **1.** వస్త్రాద్యలంకరణము; **2.** అలంకారము. "శౌర్యాకల్పుఁడు." భార. ఆది. ౨, ఆ. ౯౪; **3.** కల్పనము, పన్నుగడ.—అవ్య. కల్పపర్యంతము.

ఆకల్పితము. సం. విశే. (అ. ఆ. అ.) **1.** బాగుగా కల్పింపఁబడినది; **2.** అలంకరింపఁబడినది. "క. హరిహరనాథునకు మరుత్సరిదాకల్పితమనోజ్ఞచరణశిరస్సుం,దరమూర్తికి..." భార. విరా. ౧, ౬౭.

ఆకషము. సం. వి. అ. పుం. **1.** బంగారు మొదలగుదానిని పరీక్షించుటకై ఒరపిడిచేయురాయి, గీటురాయి, నికషము; **2.** సువర్ణాదులను పరీక్షించుటకై రాతిపై గీటువెట్టుట.

ఆకషికుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) ఆకషమందు నియుక్తుఁడు, బంగారు మొదలగునవి పరీక్షింప నియుక్తుఁడు.

ఆకసము. వై. వి. మిన్ను, ఆకాశము.

ఆకస్మికము. సం. విశే. (అ. ఈ. అ.) ఆకస్మాత్తుగాఁ గలిగినది. (ఆకస్మికభయము.)

ఆకళించు. వై. స. క్రి. అవగాహనముచేసికొను, తెలిసికొను. "ప్రధానపురుషాంతరవర్తన నాకళించుచుఁ." రాఘ. ౧, ఆ. ౪౧. "వ. దాని గుట్టించుకయు నే నెఱుంగనియది కాదు కలియు వినియు సమస్తంబు నాకళించినదానను." ప్రభా. ౪, ఆ. ౭౩.

ఆకళింత. వై. వి. అవగాహనము, తెలిసికొనుట.

ఆకాంక్ష. సం. వి. ఆ. స్త్రీ. 1. కోరిక; 2. వాక్యాన్వయసిద్ధికై పదము మఱియొక పదమును అపేక్షించుట; 3. క్రియాపదమును ప్రధానముగా నుంచుకొని దానికి కర్త యేది? కర్మమేది? అవి యెట్టివి? అని ప్రశ్నపూర్వముగా పూర్తిచేయుట. (ఇది సంస్కృతవిద్యార్థుల కభ్యస్తము.)

ఆకాంక్షణీయము. సం. (అ. ఆ. అ.) కోరఁదగినది, అభిలషింపఁదగినది.

ఆకాంక్షి. సం. (న్. ఈ-ణీ. న్.) అభిలషించువాఁడు, కోరువాఁడు.

ఆకాంక్షించు. సం. స. క్రి. వాంఛించు, కోరు.

ఆకాంక్షితము. సం. విశే. (అ. ఆ. అ.) కోరఁబడినది, అభిలషింపఁబడినది.

ఆకాంక్షితవ్యము. సం. = ఆకాంక్షణీయము.

ఆకాంక్ష్యము. సం. = ఆకాంక్షణీయము.

ఆకాండికము. సం. విశే. (అ.ఈ.అ.) అకాండమునందుఁగలిగినది, అసమయమందయినది.

ఆకారగుప్తి. సం. వి. ఇ. స్త్రీ. హృద్గతభావమును చేష్టలవలనఁ బరులకుఁ దెలియకుండఁగ దాఁచుట, ఆకారము కప్పిపుచ్చుట. (గంభీరలక్షణము).

ఆకారగోపనము. సం. వి. అ. న. = ఆకారగుప్తి.

ఆకారణ. సం. వి. ఆ. స్త్రీ. ఆహ్వానము, పిలుపు.

ఆకారణము. సం. వి. అ. న. = ఆకారణ.

ఆకారము. సం. వి. అ. పుం. 1. రూపము; 2. బొమముడిపాటులోనగు వికారము. (గూఢాకారుఁడు).

ఆకారితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పిలువఁబడినది; 2. సంజాతాకారము, ఆకారముగలది; 3. ఆకారముగలదిగాఁ జేయఁబడినది. "శా. ధ్వాంతాకారితకుడ్యకుట్టిమఘనస్తంభావలీరూపముఁ." భార. విరా. ౨, ఆ. ౩౨౭.

ఆకాలికము. సం. విశే. (అ. ఈ. అ.) 1. (అకాలమందుఁబుట్టినది,) అకాలమందయినది; 2.(ఆద్యంతములు సమానకాలమునఁ గలది,) పుట్టినపుడే చచ్చునది, క్షణికము.

ఆకాశదీపము. సం. వి. అ. పుం. సూర్యుఁడు తులాలగ్నమందున్నపుడు (కార్తికమాసమున) సాయంకాలమున ఎత్తైనచోట పెట్టుదీపము.

ఆకాశము. సం. వి. అ. న. నభము, ఆకసము.

ఆకాశభాషితము. సం. వి. అ. న. 1. ఆకాశవాణి; 2. నాటకములందు ఒకపాత్రమాత్రము ప్రవేశించి ఆకాశమువైపునకు చూచి యెవరోయేవో అనుచున్నట్లు, అది తాను వినినట్లు నటించి పైకి అన్నమాట.

ఆకాశయానము. సం. విశే. (అ. ఆ. అ.) ఆకాశమందు యానము గలది.—వి. అ. న. 1. ఆకాశమున సంచరించుట, ఆకాశమునఁ బ్రయాణము చేయుట, ఆకసమున సంచరించుసాధనము; 2. విమానము.

ఆకాశరామన్న. మి. గ్రా. వి. ఊరును పేరును లేనివాఁడు. (ఊరును పేరును తెలియనివానిని ఆకాశరామన్న అందురు. ఆకాశరామన్న అర్జీలు = ఊరును పేరును లేకుండఁగా ఎవఁడో వ్రాసిన అర్జీలు. అని వాడుక.)

ఆకాశవాణి. సం. వి. ఈ. స్త్రీ. (పలుకువాఁడు గనుపడకయే ఆకసమునుండి వినఁబడినమాట,) బయలిపలుకు. "తే. అన్యులెఱుఁగమిఁ జేసి లోకాపవాద, భీతి నెఱేఁగియు నిత్తన్విఁ బ్రీతిదప్పి, యెఱుఁగనంటిని నిందలఱ కిప్పు డెఱుఁగఁ, జెప్పె నాకాశవాణి యచ్చెరువుగాఁగ." భార. ఆది. ౪, ఆ. ౧౦౮.

ఆకాశస్ఫటికము. సం. వి. అ. పుం. (ఆకాశమందుఁ బుట్టిన స్ఫటికమువంటిది) వర్షోపలము, వడగల్లు.

ఆకించనము. సం. = ఆకించన్యము.

ఆకించిన్యము. సం. వి. అ. న. (అకించనుని భావము) దారిద్ర్యము, కొంచెమైనను లేకుండుట, అకించనత్వము.

ఆకీర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** ఒకటితో నొకటి కలసినది, సంకీర్ణము; **2.** వ్యాపించినది.

ఆకు. దే. వి. **1.** చెట్టునందలియాకు, పత్రము; **2.** తమలపాకు; **3.** నాఱు. 'ఆకుతీఁత;' **4.** విస్తరాకు; **5.** తాటియాకు. (కాకితమువలె పూర్వము వాడఁబడినది.); "ఇందు నీవిపుడు వ్రాలిడుమని యాకుగంటముఁ జేతికిచ్చె." పర. ౫, ఆ. ౩౫౮; **6.** సొమ్ము ఇచ్చినపుడు పుచ్చుకొన్నపుడు వ్రాసికొనెడి పత్రము. "క. అప్పిచ్చినతనియాకును, నప్పుమగుడఁ బెట్టి నతనియాకును కలచో, నప్పిచ్చి నాకు బొంకగు, నప్పుమగుడఁ బెట్టి నతనియాకు నిజమగుఁగా." విజ్ఞా. వ్య. కాం. ౩౮; **7.** వ్రాసిన ఆకుముక్క, చీటి. "సీ. చావులేకుండ నాజము చేత నాకుఁ దెచ్చినవారు గలరె; యీసృష్టి యందు." భో. ౪, ఆ. ౪౭; **8.** జాబు. "వ. ప్రభావతి భావంబునం గోపలజ్జాలోలయగుచు లేఖ నలిపివేయంబోయిన రాగవల్లరి...నీయోజ మేలు మేలు చాలంబది వేలువచ్చె నా చేతికిఁ దెమ్ము తేవేనిం బదిలంబుగాఁ బొదివి దాఁచుము మొదల నీయాకునకు నీకుం బనియేమి." ప్రభా. ౩, ఆ. ౧౪౨; **9.** చెవికమ్మ. "చ. వలపలడాపలన్ వరుస వాలుఁగనుంగొన చూపు లార్చుచున్, దిలకము తీర్చుచున్ గురులు దీటుచు వీనులమాని కంపుటా, కులఁ బొరిఁ ద్రిప్పుచున్." లక్ష్మీ. ౨, ఆ. ౭౦; **10.** (ఆకువంటి పలుచనికఱ్ఱ చెక్క) బండికంటియాకు; **11.** కలుపుల కమర్చెడి ఆకు.

ఆకుంచనము. సం. వి. అ. న. ముడుఁచుట.

ఆకుంచితము. సం. విణ. (అ. ఆ. అ.) ముడువఁబడినది.

ఆకుచిఱుత. ద్వ. వి. ఒకదినుసు చిఱుతపులి.

ఆకుచిలుక. ద్వ. వి. తెల్లబొట్లును పెద్ద ఱెక్కలును గల యొకానొక పురుగు. "సీ. ధర రామచిలుకతో సరియాకుచిలుకైనఁ బడఁతిపలుకులసరి పైకమగును." చంద్రా. ౪, ఆ. ౧౦౫.

ఆకుచెప్పులు. ద్వ. వి. బ. పలుచనియట్టగలచెప్పులు.

ఆకుజెముడు. ద్వ. వి. పత్రస్నుహి.

ఆకుజెల్ల. దే. వి. ఒకదినుసుచేఁప. "అరుజూసిల్లెపు జేఁప యాకుజెల్ల." హంస. ౪, ఆ. ౧౮౭.

ఆకుటెక్కలు. దే. = ఆకుటిల్లు. "సీ. ఆకుటెక్కలు నాడెమైన మాడువులయ్యె మంటిదుంపలు పిండి వంటలయ్యె." ఉచ్చ. రా. ఆర. ౧౦౨.

ఆకుటిల్లు. దే. వి. (ఆకు+ఇల్లు.) ఆకులకప్పుతోఁ గట్టినయిల్లు, పర్ణశాల.

ఆకుతేలు. దే. వి. ఆకులలోనుండు ఆకుపచ్చనికీటకము, ఒకరకము తేలు.

ఆకుతోఁట. దే. వి. తమలపాకులతోఁట. "తే. ఆకుతోఁటలసౌభాగ్య మందెకలదు." విజ. ౧, ఆ. ౧౭.

ఆకుపచ్చ. దే. వి. విణ. హరితవర్ణము.

ఆకుపచ్చన. దే. = ఆకుపచ్చ (విశేషణమయినపుడు 'ఆకుపచ్చని' అని రూపము.)

ఆకుపత్రి. ద్వ. వి. ఒకానొకచెట్టు (దీనియాకు మందున కుపయుక్తము)

ఆకుపాఁచి. దే. వి. కుంభిక, ఒకదినుసుపాఁచి.

ఆకుపీఁకెలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. ఆకుపీఁకెలు జంద్రలాటలు... ఆడుకొనుచు" హంస. ౩, ఆ. ౧౪౬.

ఆకుపురుగు. ద్వ. వి. ఆకులయందు తిరుగు పచ్చ పురుగు, శలభభేదము.

ఆకుపోయు. దే. స. క్రి. **1.** నాఱుపోయు, వరిమొ. వాని మొక్కలు మొలచుటకై మడిలో చల్లు.

ఆకుప్పు. దే. వి. (ఆకు+ఉప్పు.) ఒకదినుసు ఉప్పు.

ఆకుపసరు. దే. వి. ఆకులను నలిపి పిండినచో వచ్చెడు రసము.

ఆకుబుట్ట. దే. వి. = ఆకులతో అల్లినబుట్ట.

ఆకుమడి. దే. వి. ధాన్యాదుల నాఱుపోయు మడి.

ఆకుమడుపు. దే. వి. తమలపాకుల మడుపు, తమలపాకులకు సున్నమువ్రాసి యీనెలు తీసి మడిచిన చుట్ట. "సీ. హెచ్చువాసన పక్క లిచ్చుచుట్టిన యాకుమడుపు లీఁడివిరెడు నడపదాని." ఉ. రా. ౪, ఆ. ౪౨౩.

ఆకుమిడుత. దే. వి. ఆకుపచ్చని ఱెక్కలుగలమిడుత.

ఆకురాయి. దే. వి. పదునుగలుగుటకై ఇనుములో నగువానిని రాచుటకుపయోగించు కఱకులుగల ఉక్కుపనిముట్టు,పత్రపరశువు. "సీ. ఆకురాతను రాచునందాన గసుఁజెె నాటిచిను మెంపు చిక్కొనఁగ." పాస్వ. ౪, ఆ. ౭౧.

ఆకుజాయి. దే. = ఆకురాయి.

ఆకులత. సం. వి. ఆ. స్త్రీ. = ఆకుల్యము.

ఆకులపడు. మి. అ. క్రి. (ఆకులము+పడు.) ఆకులతనొందు, చెదరు, కలవరపడు.

ఆకులపాటు. మి. వి. 1.ఆకులపడుట, కలఁకనొందుట; 2.ఆకులరీతి."ఉ. పరాంగనఁగూడినఁ బాపమంచు న,య్యాకులపాటు చూచి యిపు డాకులపా టెన యంగనేటికిక్." శశాంక. 3, ఆ. ౮౩.

ఆకులము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వ్యస్తము, చెదరినది; 2. ఏమిచేయుటకుఁ దోఁచని స్థితి గలది (మనస్సు).

ఆకులాకులము. విణ. (అ. ఆ. అ.) మిగుల వ్యాకులమైనది, అత్యంతాకులము.

ఆకులితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వ్యాకులమయినది; 2. ఆకులముగాఁ జేయఁబడినది.

ఆకులీకృతము. సం. విణ. (అ. ఆ. అ.) వ్యాకులముగాఁ జేయఁబడినది.

ఆకుల్యము. సం. వి. ఇ. న. 1. నేలతంగేడు♆; 2. ఆకులత్వము, క్షోభము. "క. నీకఖిల నిక్కురు కుల,మాకుల్యముఁ బొందు టేమి యాశ్చర్యము." భార. ఆది. ౮, ఆ. ౪౧.

ఆకుసంబెళ. ద్వ. వి. అడపము, తములపాకులుంచు సంచి,పాన్దాను.

ఆకుసన్నములు. దే. వి. బ. ధాన్యవిశేషము.

ఆకూతము. సం. వి. అ. న. 1. అభిప్రాయము, ఉద్దేశము; 2. కోరిక; 3. భావోద్రేకము; 4. వేడుక. (సర్వాకూతకరము.)

ఆకూతి. సం. వి. ఇ. స్త్రీ. = ఆకూతము.

ఆకృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. రూపము; 2. దేహము; 3. జాతిని తెలిపెడి అవయవములఏర్పాటు; 4. భావము నెఱిఁగించెడి సంజ్ఞ; 5. సామాన్యము; 6. ఒకఛందస్సు.

ఆకృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) (ఆకర్షింపఁబడినది.) 1. లాగఁబడినది (వింటినారి), ఈడ్వఁబడినది; 2. అభిముఖముగాఁ జేసికొనఁబడినది; 3. వశపఱచుకొనఁబడినది. (మనస్సు.)

ఆకృష్టి. సం. వి. ఇ. స్త్రీ. ఆకర్షణము, లాగుట.

ఆకృష్యమాణము. సం. విణ. (అ.ఆ.అ.) ఆకర్షింపఁబడుచున్నది.

ఆకె. ద్వ. స. ఏ. (ఆ+అక్క) ఆమె. "క. నాకంటె నకట యుత్తమ, యాకెయగుట చెప్పవలయునా." ప్రభా. ౫, ఆ. ౧౩౧.

ఆకేకర. సం. వి. ఆ. స్త్రీ. క్రేఁగన్ను కొంచెము తెఱచుటయు కన్ను సగము మూయుటయుఁగల దృష్టివిశేషము, మెల్లచూపు.

ఆకేకరము. సం. విణ. (అ. ఆ. అ.) కొంచెము మూయఁబడినది (నేత్రమునకే విశేషణము) "నిమీలదాకేకరలోలనేత్ర."

ఆకొత్తు. దే. వి. = అడకొత్తు. "తే. కంటికాటుక యొడి వక్కకావిత్తి, ప్రేలియాకొత్తుఁజెంది యవ్వేలవెలంది, తల్లి యేతెంచి." బహు. ౫, ఆ. ౧౧౮. (ఆకులను కత్తిరించుటకు ఉపయుక్తము.) 'అడకొత్తు' అనియు ననవచ్చును.

ఆక్టు. ఆం. వి. చేట్టము.

ఆక్రందనము. సం. వి. అ. న. = ఆక్రందము.

ఆక్రందము. సం. వి. అ. పుం. 1. పిలుపు; 2. మొఱ్ఱ; 3. బిగ్గరగానేడ్చిన ఏడుపు; 4. ధ్వని; 5. భయంకరయుద్ధము.

ఆక్రంది. సం. విణ. (న్. ఈ-నీ. న్.) 1. పిలుచువాఁడు; 2. రోదనపూర్వకముగా పిలుచువాఁడు, మొఱపెట్టువాఁడు; 3. బిగ్గరగానేడ్చువాఁడు; 4. ధ్వనిచేయువాఁడు.

ఆక్రందించు. స. అ. క్రి. 1. మొఱపెట్టు; 2. ఏడ్చు.—స. క్రి. పిలుచు.

ఆక్రందితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పిలువఁబడినది; 2. ఏడిచినది.

ఆక్రందుఁడు. సం. వి. అ. పుం. 1. చెలికాఁడు; 2. తోఁడఁబుట్టినవాఁడు.

ఆక్రమణము. సం. వి. అ. న. ఆక్రమించుట.

ఆక్రమము. సం. వి. అ. పుం. 1. ఆక్రమించుట, స్వాధీనపఱచుకొనుట; 2. యుద్ధమున పైఁబడుట. "ఆ. కర్ణమనము పెద్దగాఁ గొనియాడుదు, మఱని కంటె శల్యుఁ డధికుఁడందు, రతఁడు నతఁడు నిట్టి యాక్రమంబున నాకుఁ, బ్రియము సేయఁ జాలిరే మహాత్మ." భార. సౌప్తి. ౧, ఆ. ౨౩౯.

ఆక్రమకుఁడు. సం. విణ. (అ.ఆ-మికా.అ.) ఆక్రమించువాఁడు.

ఆక్రమించే. సం. స. క్రి. 1. అఱుము, మాఱ్కొను, యుద్ధమునఁ దాఁకు. "చ....ఇంక నెవ్వరికిని జన్నె వీని ననవద్యపరాక్రము నాక్రమింపఁగన్." భార. ఆది. ౭, ఆ. ౨౦౯. "క. పూనుము చమూపతిత్వము, నానమ్మినవాడు నేను నరపతిబలసం, తానంబుతోడఁ బరిజన,మ్మై నడచెద మాక్రమింపు మఱివర్గంబున్." భార. శల్య. ౧, ఆ. ౮౩; 2. బలాత్కారమున పట్టుకొను. "ఆ. అనదనై తినిచట నాలికుయ్యాలింపుఁ,డకట మీరు గలుగ నాక్రమించి, నన్నుఁ గట్టి సూతనందను లిమ్మెయి, వెఱపు లేక భంగపఱచువారు." భార. విరా. ౩, ఆ. ౧౯; 3. వశపఱచుకొను, స్వాధీనము చేసికొను. "తే. అప్పురంబు వడిఁ దాన యాక్రమించి," మార్కండే. ౬, ఆ. ౭౧; 4. అతిక్రమించు, దాటు. "ఆ. దీననేమి తప్పు కానకు నేఁగిన, యతఁడు సమయవృత్తి నాక్రమించి, తండ్రిపాలు మాకుఁ దగునంచు నడియరె, తనము సేసి రాక తప్పుగాక." భార. ఉద్యో. ౧, ఆ. ౨౯౧; 5. సోఁకు, ఆవేశించు; "క. నలుఁ దొల్లి యాక్రమించిన, కలి గర్కోటకవిషంబు గ్రక్కుచు." భార. ఆర. ౨, ఆ. ౧౭౯.

ఆక్రాంతము. సం. విణ. (అ. ఆ. అ.) ఆక్రమింపఁబడినది.

ఆక్రాంతి. సం. వి. ఇ. స్త్రీ. ఆక్రమించుట.

ఆక్రార. సం. వి. ఆ. స్త్రీ. అక్కలకఱ్ఱ.

ఆక్రీడము. సం. వి. అ. పుం. ఉద్యానవనము.

ఆక్రుష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నిందింపఁబడినది, తిట్టఁబడినది; 2. ధ్వనికలదిగాఁ జేయఁబడినది.—వి. అ. న. పరుషసంభాషణము, తిట్టుట.

ఆక్రోశకుఁడు. సం. విణ. (అ. ఆ-కి. అ.) 1. నిందించువాఁడు, తిట్టువాఁడు; 2. శపించువాఁడు.

ఆక్రోశనము. సం. వి. అ. న. 1. తిట్టు; 2. శాపము; 3. అపవాదము.

ఆక్రోశము. సం. వి. అ. పుం. = ఆక్రోశనము.

ఆక్రోశించే. సం. స. క్రి. 1. తిట్టు; 2. శపించు; 3. ఉద్ఘోషించు, చాటు. "క. కాశిక్షేత్రము పంచ, క్రోశము కైవల్యలక్ష్మికులగృహమని యా, క్రోశించు శ్రుతులు." కాశీ. ౫, ఆ. ౧౦౩.

ఆక్రోష్ట. సం. విణ. (ఋ. ఈ-స్త్రీ. ఋ.) (ఆక్రోశించువాఁడు) 1. నిందించువాఁడు, తిట్టువాఁడు; 2. శపించువాఁడు.

ఆక్షారణ. సం. వి. ఆ. స్త్రీ. వ్యభిచరించితివని దూషించుట, వ్యభిచార విషయమగు నపవాదము. (అమ్మకునాలికిఁదిట్టుట. శ. ర.)

ఆక్షారణము. సం. వి. అ. న. = ఆక్షారణ.

ఆక్షారము. సం. వి. అ. పుం. = ఆక్షారణ.

ఆక్షారితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పరస్త్రీగమనాదిదోషములచే దూఱఁబడినవాఁడు, వ్యభిచారవిషయమగు నింద ఎవనిపై మోపఁబడినదో అట్టివాఁడు.

ఆక్షికుఁడు. సం. వి. అ. పుం. 1. జూదగాఁడు; 2. జూదమున జయించినవాఁడు; 3. జూదమున జయింపఁబడినవాఁడు.

ఆక్షిప్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆక్షేపింపఁబడినవాఁడు; 2. త్రోసివేయఁబడినవాఁడు.

ఆక్షీబము. సం. వి. అ. పుం. మునగచెట్టు.—విణ. (అ. ఆ. అ.) 1. బాగుగా మదించినది; 2. కొంచెముగా మదించినది.

ఆక్షేపకుఁడు. సం. వి. అ. పుం. 1. నత్తిగలవాఁడు; 2. బోయవాఁడు.—విణ. (అ. ఆ. అ.) ఆక్షేపించువాఁడు.

ఆక్షేపణము. సం. వి. అ. న. = ఆక్షేపము.

ఆక్షేపము. సం. వి. అ. పుం. 1. అడ్డంకి; 2. ఒక అర్థాలంకారము; (చూ. అలంకారము.) 3. దూఱు; 4. ఆకర్షణము.

ఆక్షేపి. సం. విణ.(న్. ఈ-ణీ.న్.) ఆక్షేపించువాఁడు.

ఆక్షేపించు. సం. స. క్రి. 1. అడ్డగించు; 2. తిరస్కరించు, దూఱు. "సీ. నీలజీమూతంబు లీల నాక్షేపించి నల్లనై తోఁతెంచునల్లగ్రహము, గలహిడింబుండను బలిసంపురక్కసు చెలిఁడుల" భార. ఆది. ౬, ఆ. ౨౧౪; 3. ఆకర్షించు; 4. ఎత్తిపొడుచు, దోషము లెంచుచు నను.

ఆక్షోటము. సం. వి. అ. పుం. కొండగోనుఁగు♆.

ఆక్షౌహిణేయము. సం. విణ. (అ. ఆ. అ.) అక్షౌహిణీ సంబంధమైనది.

ఆఖండలీయకము. సం. విణ. (అ. ఆ. అ.) ఇంద్ర సంబంధమయినది. "సీ. ఆఖండలీయకంబగు ధనుఃఖండంబు నభముపై రేయిఁ గనృట్టెనేని." కాశీ. ౫, ఆ. ౨౬౧.

ఆఖండలుఁడు. సం. వి. అ. పుం. (శత్రువులను లేక పర్వతములనుఖండించువాఁడు.) ఇంద్రుఁడు, వేల్పుఱేఁడు.

ఆఖనికము. సం. వి. అ. పుం. (త్రవ్వునది.) 1. పంది; 2. ఎలుక.

ఆఖనికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) త్రవ్వువాఁడు. —వి. అ. పుం. కన్నపుదొంగ.

ఆఖరు. హిం. వి. చివర, అంత్యము.

ఆఖుకర్ణి. సం. వి. ఈ. స్త్రీ. ఎలుకజీడి♆.

ఆఖుభుక్కు. సం. వి. జ్. పుం. (ఎలుకలను తినునది.) మార్జాలము, పిల్లి.

ఆఖుభుజము. సం. వి. జ్. అ. పుం.=ఆఖుభుక్కు.

ఆఖువాహనుఁడు. సం. వి. అ. పుం. మూషకవాహనుఁడు, వినాయకుఁడు.

ఆఖువు. సం. వి. ఉ. పుం. 1. ఎలుక; 2. పందికొక్కు; 3. పంది; 4. చోరుఁడు; 5. కృపణుఁడు, లోభి.

ఆఖేటకుఁడు. సం. వి. అ. పుం. మృగయుఁడు, వేఁటకాఁడు.

ఆఖేటము. సం. వి. అ. పుం. మృగయ, వేఁట.

ఆఖేటికము. సం. వి. అ. పుం. వేఁటకుక్క.

ఆఖ్య. సం. వి. ఆ. స్త్రీ. ఆహ్వయము, పేరు.

ఆఖ్యాత. సం. విణ. (ఋ. ఈ-త్రీ. ఋ.) చెప్పెడువాఁడు.

ఆఖ్యాతము. సం. విణ. (అ. ఆ. అ.) చెప్పఁబడినది. —వి. అ. న. (వ్యా.) 1.ధాతువులపై వర్తమానాదులు తెలుపుటకు చేర్చు ప్రత్యయము; 2. వర్తమానాదులను తెలుపు ప్రత్యయముతో కూడిన ధాతువు.

ఆఖ్యాతి. సం. వి. ఇ. స్త్రీ. చెప్పుట.

ఆఖ్యానము. సం. వి. అ. న. 1. చెప్పుట; 2. పూర్వచరిత్రము చెప్పుట, పూర్వవృత్తోక్తి; 3. కథ; 4. (భారతాది) గ్రంథము.

ఆఖ్యాయకుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఏదేనొక విషయమును వివరముగా చెప్పెడువాఁడు; 2. ఒకరు చెప్పినవిషయము మఱొకచోటఁ జెప్పెడువాఁడు; 3. దూత.

ఆఖ్యాయి. సం. విణ. (న్.ఈ.న్.) కథ మొ. చెప్పెడువాఁడు.

ఆఖ్యాయిక. సం. వి. ఆ. స్త్రీ. (నాయకచరిత్ర తెలుపునది) నిజముగా జరిగినదానిని తెలుపు గద్యకావ్యము. (ఇందు కవివంశవర్ణనాదికము గూడ నుండును. హర్షచరితము మొదలగునది. కల్పితచరిత్రకల కాదంబరి మొదలగు దానిని 'కథ'యందురు. కొందఱీ భేదము పాటింపలేదు.)

ఆఖ్యేయము. సం. విణ. (అ. ఆ. అ.) చెప్పఁదగినది.

ఆగంతవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందఁదగినది; 2. రాఁదగినది.

ఆగంతుకము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ముందు ఏర్పాటులేకయే వచ్చునది; 2. హఠాత్తుగా సంభవించునది; 3. నడుమవచ్చినది; 4. వచ్చెడి స్వభావముగలది.

ఆగంతుకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) (మార్గవశమున వచ్చినవాఁడు) అతిథి.

ఆగంతువు. సం. విణ. ఉ. అతిథి, విందు.

ఆగడకాఁడు. ద్వ. విణ. (ఆగడము+కాడు.) అకార్యముచేయువాఁడు.

ఆగడపలు. దే. వి. బ. దొంతులుగా నేర్పడు మేఘములు. "సీ. నిడుదలై తిలకించె నీరు కాఱ్పఁబడమట నిరుదెసఁ బ్రతిసూర్యములు దోఁచె నంబరంబునఁ బేర్చె నాగడపలు."హరి.పూ. ౭,ఆ.౧౬౦.

"వ. ఆగడపలంగడియపై౯చి వీచీరేఖలఁ బోఁద్రోచి కుసుమసారాచుకేళాకూళింగల జాళువాసోపానంబులం బ్రతిఘటించు త్రివళీవిభాగంబులును." పాండు. ౩, ఆ. ౧౭౯.

ఆగడము. వై. వి. 1. ధార్‌ష్ట్ర్యము, దిట్టతనము. "తే. తెచ్చి డించి కద్రువ ప్రీతిఁ దేలఁజూపి, తల్లి చెఱవాపికొని పొంగి చెల్లునాగ,డమున మగుడనయ్యమృత్భాండంబు దాన, పుచ్చికొని యెడ గలు గంగఁబోయి నిలిచి." భార. ఆను. ౧, ఆ. ౨౬౧; 2. దుష్టకార్యము, చెడ్డపని, కూడనిపని. "సీ. వేశ్యయొక్కతె దొల్లి విద్వాంసునొకరుని మ్రుచ్చుని కలవరుల్ మోదఁజూచి. గీ. యితఁడు మావాఁడు మీరాగడంబు చేసెదరని మోక్షణంబుసేసి.' భార. ఆను. ౫, ఆ. ౩౧౨; 3. మోసము, వంచన. సీ......వృష్ణి కుమారులు మనముల నవినీతి జనియింప సాంబున,కంగనాలంకార మమరఁజేసి,... ఈభామిని ప్రభునిభార్య ప్రజల. గీ. గనునె యిడియని యడిగినఁ గౌరవేంద్ర,యత్తపోధనపర్యులయ్యాగడమున,కాత్మలందుఁ గ్రోధానల మగ్గలముగ." భార. మౌ. ౧. "క. నుడువులన బయలుపందిరి, యిడహాస్తము బలుసుముంటికెనరై దినముల్, గడపుచుఁ బోమ్మనునయ్యా, గడపున్రుపుం బాయుఁ జేవగలసైన్యంబుల్. వేం. పంచ. ౧, ఆ. ౫౧౯; 4. ఉపద్రవము. "గీ. గగనమణి మాసెఁ బగలె ఘూకములు మ్రోసె, నన్నులక్ష్మణ యిదియేమి యాగడంబో. ఉ. రా. ౬, ఆ. ౨౩౫.

ఆగడించు. వై. స. క్రి. ఆగడముచేయు, బాధించు, ఉపద్రమునొందఁజేయు. "ద్వి. చిక్కయ్య లింగయ్యఁ జిక్కువచ్చితివొ, గజ్జేశు బసవయ్య బుజ్జగించితివొ, యబ్బదాసయగారి నాగడించితివొ, షాడ్డల బాచయ్య లెడ్డువెట్టితివొ" పండి. మహిమ. ౩౦౬ పుట, చూ. పండి.

ఆగడీఁడు. ద్వ. విణ. (ఆగడము+ఈఁడు.) అకార్యముచేయువాఁడు. "సీ. ఆగడీలెగఁద్రోయనగ్రజులను హాస్యభావంబునెఱపి దుర్భాషలాడు." భల్లా. ౩, అ. ౩౪. "ఆ. బలియుఁ డనద నడఁచు వలచిన యవియెల్లఁ, బాడిలేక చేయుఁ బ్రభుజనంబు,పేళపేచి యొరుని యాలినర్థంబును నపహరింతు రేచియాగడీలు." పళను. ౧౧, ఆ. ౧౧౨.

ఆగతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వచ్చినది; 2. పొందఁబడినది.—వి. అ. న. 1. ఆగమనము, వచ్చుట; 2. పొందుట.

ఆగతి. సం. వి. ఈ. స్త్రీ. 1. వచ్చుట; 2. రాబడి; 3. పొందుట.

ఆగమనము. సం. వి. అ. న. 1. వచ్చుట, రాక; 2. ధనముయొక్క రాబడి.

ఆగమనీయము సం. = ఆగంతవ్యము.

ఆగమము. సం. వి. అ. పుం. 1. రాక, ఆగమనము; 2. ధనముయొక్క రాబడి; 3. పొందుట; 4. దేవపూజావిధానమును తత్సంబంధివిషయములను తెలుపునట్టిశాస్త్రము; 5. (వ్యాకరణమున) అధికముగా వచ్చెడు వర్ణము.

ఆగమాపాయి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) ఆగమమును అపాయమును గలది, ఉత్పత్తివినాశములు గలది.

ఆగమించు. సం. అ. క్రి. వచ్చు. "సీ. ఉచితక్రియాకలాపములు నిర్వర్తించి సముపవిష్టుఁడై యుండఁగ వసిష్ఠుఁ డాగమించి సమాచరించు సపర్యలు గైకరించి." కకు. ౧, ఆ. ౧౫౦.

ఆగమిష్యమాణము. సం. విణ. (అ.ఆ.అ.) రాఁబోవునది. "ఆ. పలికి సాదరముగ బభ్రువాహనుఁ జూచి, మానితాగమిష్యమాణచైత్ర, మాసపౌర్ణమాసిమహితాశ్వమేధకా, లంబుదాని దెసఁ దలంపుగలిగి." భార. అశ్వ. ౪, ఆ. ౯౨.

ఆగము. సం. వి. స్. న. 1. తప్పు, అపరాధము; 2. పాపము (రూ. ఆగస్సు.)

ఆగమ్యము. సం. = ఆగంతవ్యము.

ఆగస్సు. సం. = ఆగము.

ఆగస్తి. సం. వి. ఈ. స్త్రీ. 1. దక్షిణదిక్కు; 2. అగస్త్యుని స్త్రీసంతతి.

ఆగాడి. దే. వి. ధాన్యము మొదలగునవి నుఱిచి ఎగురఁబోఁత పోయునపుడు బలువులేక పోవుట చేత అసలు రాశికి వెనుకవైపున పడిన తేలికయగు ధాన్యము మొదలగునవి.

ఆగాత్యము. వై. వి. కొంచెమును గొప్పగాచేసి కావించెడు ఆఱవు విద్యలోనగునది; (ఇది వాడుకలోనిది.) అని శ. ర. తాను తలఁచినట్లు ఇతరులు చేయకపోయినపుడు చచ్చెదననియో చంపెదననియో పట్టుపట్టుకొని చేయు అల్లరి. (అని ప్రకృతము వాడకలోఁ గలదు.)

ఆగామి. సం. విణ. (క్రి.-కా.-సే.క.) రాఁగలది, రాఁబోవునది.

ఆగాయిత్యము. వై. = ఆగాత్యము.

ఆగారము. సం. వి. అ. న. అగారము, గృహము. —విణ. (అ.ఈ.అ.) 1. ఆగారమందుండునది; 2. అగారసంబంధమయినది.

ఆగుబ్బతిలు. దే. అ. క్రి. అతిశయించు. "ఉ. మది లోని కోర్కులా గుబ్బతిలంగ." స్వా. ౨, ఆ. ౨౮. (కోరికల్, గుబ్బతిలంగ. అని పాఠాం.)

ఆగుబ్బు. దే. వి. అతిశయము, ఆధిక్యము. "ఉ. గొబ్బునతిమ్మభూవిభుని ఘోరతరాసిని ద్రెళ్లి వైరులాగుబ్బున నేఁగి." రామా.౧, ఆ. ౪౪.—విణ. అధికము. "క. నిబ్బరపు చప్పిమంటలు, ప్రబ్బిన ధృతిలేక నేత్రపదహస్తంబుల్, గొబ్బున విప్పుతములఁగ నాఁగుబ్బగుచున్నట్టికూఁతఁ గూలెన్ నేలన్." భాగ. ౧౦. స్కం౦పూ. ౨౭౬.

ఆగుబ్బుకొను. దే. అ. క్రి. అతిశయించు. "సీ. ఒక వంకజాలసముద్భూతసుమజాత ఘుమఘుమామోద మాగుబ్బుకొనఁగ." శే. ౨, ఆ. "క. కవకవనై పదనూపుర, రవరవలాగుబ్బుకొన్న రతిపతిగతులం." భాగ. ౭, స్కం. ౧౦౦.

ఆగురి. సం. వి. ఇ. స్త్రీ. ప్రతిజ్ఞాపత్రము.

ఆగువు. సం. వి. ఊ. స్త్రీ. అంగీకారము, ఇయ్యకోలు.

ఆగ్నీధ్రుఁడు. సం. వి. అ. పుం. (అగ్నినిప్రకాశింపఁ జేయువాఁడు.) ఒకఋత్విజుఁడు.

ఆగ్నేయము. సం. విణ. (అ. ఈ. అ.) అగ్ని దేవతాకము.—వి. అ. న. 1. కృత్తికానక్షత్రము; 2. అగ్నిప్రోక్తమగు మహాపురాణము; 3. పాడ్యమితిథి; 4. బంగారము; 5. రక్తము; 6. అగ్నినివృద్ధిచేయుపదార్థము (లక్క మొ.); 7. అగ్నిపర్వతము; 8. అగ్నిని గలిగించునాయుధము; (శస్త్రము, అస్త్రము, మొ.)

ఆగ్నేయి. సం. వి. ఈ. స్త్రీ. 1. కృత్తిక; 2. ఆగ్నేయదిక్కు.

ఆగ్రయణము. సం. వి. అ. పుం. క్రొత్తబియ్యము తినునపుడు చేయఁదగిన యిష్టివిశేషము.

ఆగ్రహము. సం. వి. అ. పుం. 1. అభినివేశము, పట్టుదల; 2. మాత్సర్యము; చలము. "తే. అతని కరంబునఁ బొలుచు చక్రమలంతి తునియలుగా నేసెనాగ్రహమున." భార. ద్రోణ.౨, ఆ. ౧౧౬; 3.కోపము; "సీ. ఆకౌన్నులయరుద్రుఁడాగ్రహంబున జగత్ప్రచయంబు ముట్టెడుభంగిఁ బొదిలి." భార. ఉద్యో. ౨. ఆ. ౧౩౭; "తే. ఓమునీశ్వర! వినవయ్య యున్నయూరుఁ,గన్నతల్లియు నొక్కరూపన్నరీతి, యటు విశేషించి శివుని యర్ధాంగలక్ష్మి, కాశి యివ్వీటిమీఁద నాగ్రహము దగదు. కాశీ. ౭, ఆ. ౧౬౩; ఈయర్థమాంధ్రమున సుప్రసిద్ధము. 4. ఆక్రమణము; 5. ఆసక్తి; 6. పట్టుకొనుట, గ్రహణము; 7. అనుగ్రహము.

ఆగ్రహాయణి. సం. వి. ఈ. స్త్రీ. మృగశిరోనక్షత్రము.

ఆగ్రహాయణికము. సం. వి. అ. పుం. (మృగశిరోనక్షత్రయుక్తపౌర్ణమాసిగలమాసము.) మార్గశీర్షమాసము.

ఆగ్రహారికుఁడు. సం. విణ. (అ.ఈ.అ.) అగ్రహారము పుచ్చుకొనఁదగినవాఁడు. (బ్రాహ్మణుఁడు;)

ఆగ్రహించు. సం. స. క్రి. 1. కోపించు; "చ.... తపోధనసత్తముఁడాగ్రహించిన, న్ననుఁగొని నీవ యస్వల వికారమునన్ జనియింపు వైశ్యవై, వనజదళాక్షి నీవని యవారణ నమ్మునిశాప మిచ్చినన్." మార్కం. ౭, ఆ. ౨౪౫; 2. చలపట్టు, అభినివేశము నొందు. "చ. కనుఁగొని శల్యుఁడిట్లనియెఁ గర్ణునితో నిదియేల ధర్మనందనుపయి నాగ్రహించెదు." భార. కర్ణ. ౨, ఆ. ౩౮౯.

ఆగ్రేయ. సం. వి. ఆ. స్త్రీ. అగ్రజ, అప్ప.

ఆగ్రేయుఁడు. సం. వి. అ. పుం. అగ్రజుఁడు, అన్న.

ఆఘట్టన. సం. వి. ఆ. స్త్రీ. చాలనము, చలింపఁ జేయుట.

ఆఘట్టితము. సం. విశే. (అ. ఆ. అ.) చలింపఁజేయఁ బడినది.

ఆఘాటము. సం. వి. అ. పుం. 1. కొలఁది; 2. మేర; 3. అడ్డు. ('నిరాఘాటము' అని వాడుకలోఁ బ్రసిద్ధము.)

ఆఘాతనము. సం. వి. అ. న. వధ్యస్థానము, వధశిక్ష చేయవలసినవారిని చంపుటకేర్పడిన స్థానము.

ఆఘాతము. సం. వి. అ. పుం. 1. వధస్థానము, చంపుడుగట్టు; 2. కొట్టుట; 3. చంపుట.

ఆఘాతించు. సం. స. క్రి. 1. వధించు, చంపు; 2. కొట్టు, పడఁగొట్టు. "శా. ఈరంగంబున వారు మీకు నెదురై యేమేని చెయ్యంబుమైఁ, జేరం జూతురు మీరు గైకొనమితోఁ జేపట్టి పాలార్చుచుక్,గారింపన్వలదొక్క పూఁపునన యాఘాతించి నాకుక్ మహో, దారంబైన శుభం బొనర్పుఁడు." హరి. పూ. ౭, ఆ. ౫౭. (ఇట చంపు శ. ర.)

ఆఘారము. సం. వి. అ. పుం. 1. నెయ్యి, ఘృతము; 2. నెయ్యి మొ. అభిషురించుట.

ఆఘూర్ణనము. సం. వి. అ. న. (కన్నులు మొదలగునవి) తిరుగుట.

ఆఘూర్ణితము. సం. విశే. (అ. ఆ. అ.) తిరుగుడు పడినది.

ఆఘోషణ. సం. వి. ఆ. స్త్రీ. 1. చాటుట; 2. ప్రకటించుట.

ఆఘోషణము. సం. వి. అ. న. = ఆఘోషణ.

ఆఘోషించు. సం. అ. క్రి. 1. అఱచు. "శా. ఈషాదండము సీరతుండము ననిక్ హేరాళమై మూఁక లాఘోషింపంగ." ఉ. హ. ౬, ఆ. ౬౭; 2. మ్రోయు. "శా. ఆఘోషించు తదుగ్ర శంఖ పటహోద్యద్ధ్వానముల్ దిక్తట,వ్యాఘూర్ణంబులుగా." జైమి. ౬, ఆ. ౨౦౮; 3. చాటు, ప్రకటించు.

ఆఘోష్యమాణము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ప్రకటింపఁబడుచున్నది; 2. చాటఁబడుచున్నది.

"సీ. ...ఖరక్షత్రపాతికన్యారుణీకరోత్సు కతుకంచుక సంరంభమై కొన్నినాళ్లు, లే. ప్రకటఘటితమేఖలాంచలికగుణిత, మణికఘంటారవాఘోష్యమాణమస్పృణ, కుసుమసాయకార్థక్షమై కొన్నినాళ్లు, రతిజపుగఁ జల్పి రతివఁ పకులసేన." ప్రభా. ౫, ఆ. ౧౦౭.

ఆఘ్రాణము. సం. వి. అ. పుం. మూచూచుట, మూర్కొనుట, వాసనచూచుట.

ఆఘ్రాణించు. సం. స. క్రి. మూచూచు, మూర్కొను, వాసనచూచు. "క. స్వఘ్రాణాలిలసౌరభ, మాఘ్రాణింపఁగ..." పాండు ౩, ఆ. ౧౫౭.

ఆఘ్రాతము. సం. వి. అ. న. ఘూషణధ్వని.—విశే. (అ. ఆ. అ.) మూర్కొనఁబడినది.

ఆఘ్రేయము. సం. విశే. (అ. ఆ. అ.) మూర్కొనఁ దగినది, వాసనచూడఁదగినది.

ఆచంద్రతారకము. సం. అవ్య. చంద్రుఁడు నక్షత్రములు నున్నంతవఱకు.

ఆచంద్రతారార్కము. సం. అవ్య. చంద్రుఁడు నక్షత్రములు సూర్యుఁడు నున్నంతవఱకు.

ఆచంద్రార్కము. సం. అవ్య. సూర్యుఁడు చంద్రుఁడు నున్నంతవఱకు.

ఆచక్షాణుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) చెప్పుచున్నవాఁడు.

ఆచమనము. సం. వి. అ. న. ఉపస్పర్శము, ఆచమించుట. చూ. ఆచమించు.

ఆచమనీయము. సం. విశే. (అ. ఆ. అ.) ఆచమించుటకుఁ దగినది. (జలము)

ఆచమము. సం. వి. అ. పుం. = ఆచమనము.

ఆచమించు. సం. స. క్రి. చూపుడువ్రేలు పైకి విడిచి నడిమివ్రేలిమొదలికి బొటనవ్రేలిచివర చేర్చి పట్టినపుడిసిటితో జలము గ్రహించి మూఁడుసార్లు లోపలికి పుచ్చుకొను, ఆచమనముచేయు. "వ. కాళ్లుమొగముఁ గడిగికొని యాచమించి యాళకటంబుపయి కూడుగుడుచుచుండె నట బకాసురుండును." భార. ఆది. ౬, ఆ. ౨౯౨.

ఆచరణము. సం. వి. అ. న. 1. ఆచారము, నడత; 2. చేయుట; 3. కృత్యము, పని. "క. ఆచర

లాక్షికేఁగా మన,కీచకు లంపటను శాస్త్రి గీటడఁచె రహ,స్యాచితవిధము గంధ,స్వాచరణము పేర భీముఁ డతిభీమముగాఁ." భార. విరా. ౫, ఆ. ౩౩౧.—విశే. (అ. ఆ. అ.) చేయునది. "క. దుర్వహపటుతాపత్రయ, నిర్వాపణకరణ బోధనిర్మలజనహృ,త్సర్వాచరణ మహోపక,సర్వ పహారత్వ సంప్రకాశైకరణా." భార. విరా. ౫, ఆ. ౪౦౬.

ఆచరణీయము. సం. విశే. (అ. ఆ. అ.) 1. నడపఁ దగినది; 2. చేయఁదగినది.

ఆచరించు. సం. స. క్రి. నడపు, చేయు. చూ. ఆచారము.

ఆచరితము. సం. విశే. (అ. ఆ. అ.) నడపఁబడినది, చేయఁబడినది.

ఆచరితవ్యము. సం. = ఆచరణీయము.

ఆచాంతము. సం. విశే. (అ. ఆ. అ.) ఆచమింపఁ బడినది.

ఆచాంతి. సం. వి. ఇ. స్త్రీ. ఆచమనము.

ఆచాంతుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఆచమనము చేసినవాఁడు.

ఆచామము. సం. వి. అ. పుం. 1. మాసరము, గంజి; 2. ఆచమనము.

ఆచామ్యము సం. = ఆచమనీయము.

ఆచారము. సం. వి. అ. పుం. 1. ఆచరణము, నడత; 2. కార్యము, పని. "వ. మననగరంబునకు జంఘాలురం బంపుము పురంబున వారలు పోయి భవద్విజయఘోషం బాచరించి శోభనధ్వజోన్నయనంబును మంగళతూర్యనాదంబులును బరస్పర గంధసలిలసేచనంబులును గీతవాద్యనృత్తంబులును నాదిగాఁగల వివిధశుభాచారంబులం బ్రవర్తింప నియోగింపవలయును." భార. విరా. 3, ఆ. ౨౩౭.

ఆచార్యా. సం. వి. ఆ. స్త్రీ. వేదము మొదలగువానిని వ్యాఖ్యానముచేసి బోధించు ఆఁడుది. చూ. ఆచార్యాని.

ఆచార్యకము. సం. వి. అ. న. 1. గురువు, గురుస్థానము. "సీ. ధర్మార్థకామసాధన కుపకరణంబు గృహనీతివిద్యకు గృహము విమల,చారిత్రశిక్షకాచార్యకం బన్వయస్థితికి మూలంబు సద్గతికి నూఁత, గౌరవంబున కేకకారణంబు." భార. ఆది. ౪, ఆ. ౧౫; 2. ఉపాధ్యాయత్వము. ఒజ్జఁదనము. "క. ధైర్యధనుఁ డితఁడు ద్రోణా,చార్యుల కెనవచ్చు దివ్యశరవిదుఁడు కృపా,చార్యుఁడు మఱి కృపసఖుఁ డా,చార్యక మొనరించె మాకు శైశవముకలిక్." భార. విరా. ౫,ఆ. ౭.

ఆచార్యాని. సం. వి. ఈ. స్త్రీ. ఆచార్యుని పెండ్లాము. చూ. ఆచార్యా.

ఆచార్యుఁడు. సం. వి. అ. పుం. 1. వేదము మొదలగునవి వ్యాఖ్యానము చేయువాఁడు; 2. వేదము చెప్పెడువాఁడు; 3. మతస్థాపకుఁడు; 4. ఆచార ప్రకారము తానాచరించుచు పరులను నాచరింపఁజేయువాఁడు, గురువు; 5. ఉపాధ్యాయుఁడు; 6. పూజ్యుఁడు; 7. విద్యాపారంగతుఁడు.

ఆచితము. సం. వి. అ. న. పదిబారువులకోలది.—పుం. బండిబరువు.—విశే. (అ.ఆ.అ.) 1. కప్పఁబడినది; 2. గ్రహింపఁబడినది; 3. పఱపఁబడినది.

ఆచీర్ణము. సం. విశే. (అ. ఆ. అ.) చేయఁబడినది.

ఆచోలము. సం. వి. అ. పుం. జెండాకుచ్చు.

ఆచ్ఛాదకము. సం. విశే. (అ. ఆ-దికా. అ.) ఆచ్ఛాదనము చేయునది, కప్పునది.

ఆచ్ఛాదనఫల. సం. వి. ఆ. స్త్రీ. (కాయపైని కప్పు గలది) ప్రత్తిచె.

ఆచ్ఛాదనము. సం. వి. అ. న. 1. కప్పుట; 2. దోషమునుగప్పుట; 3. వస్త్రము.

ఆచ్ఛాదనీయము. సం. = ఆచ్ఛాద్యము.

ఆచ్ఛాదము. సం. వి. అ. పుం. ఆవరణము.

ఆచ్ఛాది. సం. విశే. (న్. ఈ-నీ. న్.) కప్పునది.

ఆచ్ఛాదించు. సం. స. క్రి. కప్పు.

ఆచ్ఛాదితము. సం. విశే. (అ. ఆ. అ.) ఆచ్ఛాదనము చేయఁబడినది, కప్పఁబడినది.

ఆచ్ఛాదితవ్యము. సం. = ఆచ్ఛాద్యము.

ఆచ్ఛాద్యము. సం. విశే. (అ. ఆ. అ.) కప్పఁదగినది.

ఆచ్ఛురితకము. సం. వి. అ. న. 1. నఖక్షతవిశేషము; 2. పరిహాసపుమాటతోఁగూడినవవ్వు.

ఆచ్ఛోటనము. సం. వి. అ. న. అంగుళిమోటనము, చిటికెవేయుట.

ఆచ్ఛోదనము. సం. వి. అ. న. ఆఖేటము, వేఁట.

ఆచోకి. దే. వి. (ఆ+చోడికి. శ.ర.) పోఁబడి,జోడ.

ఆజకము. సం. వి. అ. న. అజసమూహము (అజ ము=మేఁకపోతు.)

ఆజగవము. సం. వి. అ. న. విల్లు, అజగవము. "ఉ. ఆజగవాఖ్యమై పరగునాద్యశరాసనముఁ సముల్లస,త్తేజము దీప్తబాణములు దివ్యకనత్కవచంబుఁ దాల్చి యుం, ద్వేజితశత్రుఁ డప్రతిమదీర్ఘుఁ తనుండు జనించె." హరి. పూ. ౧, ఆ. ౧౧౨.

ఆజన్మము. సం. అవ్య. 1. జన్మముమొదలు; 2. జన్మము చివరపఱకు, చచ్చువఱకు.

ఆజము. సం. విశ. (అ.ఈ.అ.) అజసంబంధమైనది. (నెయ్యి, మాంసము మొ.)

ఆజవంజవము. సం. వి. అ. పుం. 1. (ఆలుబిడ్డలు మొ. వారుగలది) కుటుంబము; 2. సంసారము, జననమరణములు చెందుట. "సీ. బ్రహ్మలోకో న్నతప్రాసాదనిశ్శ్రేణి యాజవంజవభీతి కభయపాణి" కాశీ. 3, ఆ. ౭౦.

ఆజానుబాహుఁడు. సం. వి. ఉ. పుం. మోఁకాళ్లవఱకు చేతులు గలవాఁడు, దీర్ఘబాహువు.

ఆజానుబాహువు. సం. = ఆజానుబాహుఁడు.

ఆజానేయము. సం. వి. అ. పుం. ఒకానొకదేశమందలి గుఱ్ఱము, మేలుజాతిగుఱ్ఱము.

ఆజి. సం. వి. ఇ. స్త్రీ. 1. యుద్ధము; 2. సమభూమి; 3. క్షణకాలము.

ఆజిహీర్ష. సం. వి. ఆ. స్త్రీ. (ఆహరింపవలయునసెడి యిచ్ఛ.) 1. తీసికొనిపోవఁదలఁచుట; 2. తీసికొనిరాఁదలఁచుట.

ఆజిహీర్షువు. సం. విశ. ఉ. 1. తీసికొనిపోవలయునను నిచ్ఛగలవాఁడు; 2. తీసికొనిరావలయునను నిచ్ఛగలవాఁడు.

ఆజీవనము. సం. వి. అ. న = ఆజీవము.

ఆజీవము. సం. వి. అ. పుం. జీవిక, బ్రదుకుఁదెరువు, జీవనోపాయము.

ఆజువు. సం. వి. ఊ. స్త్రీ. అమిజి, వెట్టి.

ఆజ్ఞ. సం. వి. ఆ. స్త్రీ. ఇది యిట్లు చేయవలసినదని రాజు, గురువు మొదలగువారు చేసెడి ఉత్తరువు.

ఆజ్ఞప్తి. సం. వి. ఇ. స్త్రీ. ఆజ్ఞ, ఆన.

ఆజ్ఞాచక్రము. సం. వి. అ. న. భ్రూమధ్యమందు రెండుదళములుగల చక్రము; (ఇది దేహమందుండు షట్చక్రములలో నొకటి.)

ఆజ్ఞాతుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) ఆజ్ఞాపింపఁబడినవాఁడు.

ఆజ్ఞాపనము. సం. వి. అ. న. 1. ఆజ్ఞాపించుట; 2. ఆనతి, ఆజ్ఞ. "వ. ధృతరాష్ట్రునితోడం దపోమహనీయులైన మిమ్ముం గొలిచి గతకల్మషుండనైతి మీయాజ్ఞాపనంబు దలనిడికొని పురంబునకుం బోయివచ్చెద ననుటయు." భార. ఆశ్ర. ౨, ఆ. ౧౪౨.

ఆజ్ఞాపనముచేయు. మి. స. క్రి. ఆజ్ఞచేయు. "తే. అయిన సిత్తటి నెయ్యదియైన నొక్క, కృత్యమాజ్ఞాపనముసేయుఁ డత్యుదాత్త, హృదయులార యవ్విధి నిర్వహింపనుత్సుకంబులైనవి యంతరంగములు మాకు." హరి. ఉ. ౪, ఆ. ౭౭.

ఆజ్ఞాపించు. సం. స. క్రి. ఆజ్ఞాపనముచేయు, ఆనతిచ్చు.

ఆజ్ఞాపితము. సం. విశ. (అ. ఆ. అ.) ఆజ్ఞాపింపఁబడినది. "ఆ. అవనినాథుచేత నాజ్ఞాపితుండయి,సూతనందనుండు ప్రాతికామి, పాండవాగ్రమహిషి పాలికిఁ జేని భక్తి, వినతుఁడగుచు నిట్టులనియె సతికి." భార. సభా. ౨, ఆ. ౨౦౬.

ఆజ్యము. సం. వి. అ. న. 1. ఘృతము, నెయ్యి; 2. కరఁగిననెయ్యి, (కరఁగినది ఆజ్యము. పేరుకొన్నది ఘృతము); 3. ధూపద్రవ్యము, దేవదారుబంక; 4. తైలము, నూనె. (చూ. ఆజ్యావేక్షణము.)

ఆజ్యావేక్షణము. సం. వి. అ. న. 1. తైలమున శిశువు మొ. వారిప్రతిబింబము చూచుట, (దుష్టనక్షత్రాదులయందు జన్మించిన శిశువులనుగాని, దుష్టనక్షత్రాదులయందు ప్రథమరజస్వలయయినభార్యనుగాని చూచినచో, అరిష్టములు గలుగుననియు, దానిశాంతికై మొట్టమొదట వారిప్రతిబింబము తైలమున చూడవలయునని స్మార్తమతము); 2. అట్టి సంస్కారము.

**ఆట.** దే. వి. (ఆడుట.) **1.** క్రీడ; **2.** నర్తనము, నృత్యము. "క. నిన్నుఁ గొలువంగ వచ్చితిఁ, గన్నియలకు నాట గఱపఁగా నోపుదు విద్వన్నుత మన్నామంబు బృహన్నల యనఁ జేడె నవుడు నరుఁ డిట్టులనియెన్." భార. విరా. ౧, ఆ. ౨౩౩; **3.** వింత. "సీ. ఆటలు పసిబిడ్డయాటలై పెంపఱి యొసఁగలమాటలఁ బడకోరికముగ." లక్ష్మీ. ౨, ఆ. ౯౦; **4.** నువ్వులు చెఱకులు లోనగువాని గానుగలో వేసి త్రిప్పుట. "చ. వరేక్షుపత్త్రికనడుమ యంత్రపుసంపదచేఁ గ్రిందుమీఁదు, జెఱుఁగక సాటిపత్తుల హెచ్చిననాటకుఁ బెట్టఁగుండజే." భాను. ౨, ఆ. ౪. ౪; **5.** స్నానము చేయుట. "ఉ. నిన్నటు పాఱపై చి జగనిర్దర వోయెడు బాలుఁడంచు నే, మిన్నక నీళ్లనాట యనుమిత్తికి నేటికిఁ బోయితి..." హరి. పూ. ౭, ఆ. ౧౭౨; **6.** పలుకుట. "క. అని తను పుల్ల సమాటనుఁ, గినిసి యిగతనూజుఁడు." భార. విరా. ౭, ఆ. ౧౮౨; **7.** పరిహాసము, గేలిసేయుట. "తే. ఆటయనఁ ద్రస్తరి యనఁగ హాళి యనఁగఁ, బొలుచుఁ బరిహాసము." ఆం. భా. ప్ర. నా. ౧౭౮.

**ఆటంకపఱచు.** దే. స. క్రి. ఆఁపు, అడ్డుపఱచు. (వాడుకలోఁ బ్రసిద్ధము.)

**ఆటంకము.** దే. వి. అడ్డంకి, నిరోధము. (సంస్కృతమందలి 'టక్' అనుధాతువునుండిపుట్టినదనవచ్చును. నిరాటంకము అని వాడుకలోఁ గలదు. లేదా ఆశంకశబ్దభవ మనవచ్చును.)

**ఆటకత్తియ.** దే. వి. ఆటఆడునది, నర్తకి, నటి.

**ఆటకత్తె.** దే. = ఆటకత్తియ.

**ఆటకాఁడు.** దే. వి. **1.** ఆటలాడువాఁడు. (దొమ్మరాట, బొమ్మలాట మొదలగునవి చూపువాఁడు). "ఆ. ఓరి యాటకాఁడ యారీతియఱపులా, పొగడుటనఁగ మెచ్చు పుట్టదెందు." ప్రభా. ౧, ఆ. ౧౦౬. ఇట నర్తకుఁడనియు నర్థాంతరము కలదు; **2.** ఆటలలో నేర్పరి; **3.** నర్తకుఁడు, నాట్యముచేయువాఁడు. "తే. ఆలరి తొలుకరి పేరిటి యాటకాఁడు, మిటుపాటిల్ల నెఱరాజు మెచ్చుపదసి, పథికజనమానధనము లపారలీలఁ, గొల్లలాడెను భువనంబులుల్లసిల్ల." రామా. ౬, ఆ. ౧౯.

**ఆటగడలు.** దే. వి. బ. ధాన్యవిశేషము.

**ఆటగొఱ్ఱు.** దే. వి. మూడుకఱ్ఱులుగల గొఱ్ఱు, (వరి మొదలగువానిని విత్తుటకు ఉపయోగించునాఁగలి.)

**ఆటదిగ్గియ.** దే. వి. క్రీడార్థము ఏర్పఱుపఁబడిన నడబావి, క్రీడావాపి. "సీ. దరదవగాహగభీరతర తరంగిణులు నీకాటదిగ్గియ లయ్యెనా మృగాక్షి, చిత్రకూటాదిక గోత్రావనులు నీకుఁ గృతకాద్రు లయ్యెనే కీరవాణి." రామా. ౫, ఆ. ౭౭.

**ఆటతిప్ప.** దే. వి. క్రీడార్థమేర్పఱచిన కొండ, కృతకాద్రి. "సీ. ఆటతిప్పలు ద్రవ్వి పాటబాడులు గూల్చి కట్టువలన్నియుఁ గాడుసేసి." అచ్చ. సుం. ౯౫.

**ఆటతోఁట.** దే. వి. **1.** ఉద్యానవనము. "సీ. నీవును వాలియు నేఁడునునాఁడును నయముతోఁబాటించు చాటతోఁట, మధువనంబు," భార. ఆర. ౭, ఆ. ౯; **2.** ప్రమదావనము, అంతఃపురస్త్రీలు విహరించుతోఁట. "ఉ. పూనిక నాటతోఁట వలపుల్ గఱకప్రపుఁగమ్మతూళిపూఁ, దేనియయేటి కాలువలు తీర్పఁగ నోపికలేని దౌహృదశ్రీనిధి యాధరాధిపతిచేడియ." రామా. ౩, ఆ. ౯౯.

**ఆటపట్టు.** దే. వి. **1.** క్రీడాస్థానము; "సీ. సరసుల కారామసరణి శ్రీరంగదేహ క్రోడవాసిని కాటపట్టు." వసు. ౧, ఆ. ౯౪; **2.** నాట్యస్థానము; **3.** వాసస్థానము. "క. మఱి రామేశ్వరతీర్థము, గఱకంఠున కాటపట్టు." భీమ. ౩, ఆ. ౧౫౫; **4.** విహారస్థలము. "సీ. సత్యలోకముదాఁక సకలలోకంబులు నాటపట్టులు మాకు నబ్జవదన." నైష. ౨, ఆ. ౪౯.

**ఆటపాక.** దే. వి. నర్తనశాల, నాటకశాల.

**ఆటరి.** దే. వి. **1.** ఆటలాడువాఁడు; **2.** ఆటలాడునది; **3.** నర్తకుఁడు; **4.** నర్తకి. "తే....ఆటకత్తె యనంగను నాటరియనఁ, బాతర యనంగ నర్తకి పరగుచుండు." ఆం. భా. ప్ర. నా. ౧౨౯.

**ఆటలాడు.** దే. అ. క్రి. (ఆటలు+ఆడు.) ఆటాడు, క్రీడించు, ఆడుకొను.

**ఆటవికుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) అడవియందుండువాఁడు.—వి. అ. పుం. అడవిమానిసి.

"చ. పనకుంచెయుఁ గృష్ణమృగాజినంబును, జలు
మఱు వీచుచుం గలహబంధుఁడు నారదుఁ డాడె
వేడుకన్." భార.సభా.౨,ఆ. ౩౧; 3. క్రీడించు;
"ఆ. పడుచు లీకలాడ్చి పట్టి యాడెడుపట్టి,
పులుఁగు చంపమయ్యె వలచ నాయ,వస్త." భార.
కర్ణ. ౧,ఆ. ౩౪. 4. సంచరించు."గీ. ఆడెరె పటు
సేనపై గ్రద్దలాడఁజొచ్చె." భార. భీష్మ. ౩, ఆ.
౩౫౫; 5. విహరించు. "సీ.వాహ్యాళిభూమి రేవం
తనై పథులట్లు హయచక్రములఁ నెక్కి యాడనే
ర్చు." భీ. ౧, ఆ. ౬౬; 6. మునుఁగు, స్నానము
చేయుఁ. "ఆ....గంగ నాడవచ్చి నీవు, వలవదనిన
నుడుగువారము గాము." భార. ఆది. ౭,ఆ.౪౨.
"గీ....ఆడఁబోయినతీర్థ మెదురు, గాఁగ వచ్చిన
కరణి." వరాహ. ౧,ఆ. ౧౩౩. "వ. మఱియుంగం
బనుతీర్థంబు సేవించి శతకటిలగోదానఫలంబు వడ
యుదు నుంచేని సగ్నిదేవుండు ప్రత్యక్షంబై
యుండు నట్టి ప్రభాసతీర్థం బాడి యగ్నిష్టో
మాతిరాత్రఫలంబు వడయుదురు దుర్వాసునకు
విష్ణుదేవుండు వరంబిచ్చుటంజేసి వరదానంబనం
బఱఁగిన తీర్థంబాడియు సరస్వతీసాగరసంగమం
బాడియు గోసహస్రదానఫలంబు వడయు
దురు." భార. ఆర. ౨, ఆ. ౨౫౧. "సకల
తీర్థంబులను నాడి." కాశీ. ౭, ఆ. ౧౦౨;
7. నాటు. "క. తోడన హయసూతులనో,
నాడఁగ నేయుటయును నతఁడునలిగి." భార.
కర్ణ. ౨, ఆ. ౨౪౫; 8. భూతకాలికాసమాపక
క్రియలపైని (క్త్వార్థకములపైని.) అనుప్రయు
క్తమయి క్రియయొక్క అతిశయమును తెలు
పును. ఊఁగాడు, వ్రేలాడు, దోఁగాడు,జీరాడు.
(ఆటాడు ఇత్యాదులయందు క్రియామాత్రమును
తెలుపును.)—స. క్రి. 1. పచించు, "క. నిఱు
గుట నొచ్చుట మనదెసఁ, దఱుచుగ నాడెదవు
పాండుతనయులబలమే, ద్వైఱఁదఱుఁగక వెనఁ
గుట పలు,మఱుఁ జెప్పెదవకట యేమిమాయయొ
వలఁపక." భార. భీష్మ. 3, ఆ. ౩౧; 2. నిం
దించు, దూఱు. "మత్త....అతిదైన్యమొందెడు
వానియ,ట్లైన నీదుపలాప మన్యుల కాడఁ బట్టగు
భూవరా." భార.స్త్రీ. ౧,ఆ. ౭౧. "సీ. సత్కీర్తి
చేసుధాకరదేవసరసులనాడియు సరసులనాడకుం
డు." కా. ౧,ఆ. ౭౨; 3. సడపు. "క. ఆత
నితో నలుఁడు జూదమాడఁ గడంగెన్." భార.
ఆర. ౨, ఆ. ౬౦; 4. నువ్వులు చెఱకులోనగు
వాని గానుగలో వేసి నూనె రసము మొ. వచ్చు
నట్లు త్రిప్పు. "ఆ...అతఁడు చేయంత్రానఁ,
జెఱకుఁ గోలలాడి చేసె రసము." హర. ౧,
ఆ. ౨౭. 5. ప్రయోగించు, వేయు. (ఏటులాడు,
గ్రద్దలాడు మొదలగువానిలో సందర్భానుసార
ముగా అర్థము గ్రాహ్యము); 6. నాటు."క....
మ,హాభల్లములస్త్రలమ్ము నాడఁగ నేసెన్." భార.
ద్రో. ౪, ఆ. ౧౨౯.

ఆడుకొను. దే. స. క్రి. 1. దూఱు, నిందించు; 2.
క్రీడలాడుకొను, (ఆత్మనేపదము.)

ఆడుపరి. దే. వి. అలంగము, వప్రము.

ఆడె. దే. వి. గాగితమునందు ఏకదేశము. "సీ...
ఘుట్టితపటంబు వెలయును గడిత మనఁగ, వెలయుఁ
గాకిత మనఁగఁ దద్భేదసంజ్ఞ గూడె యనఁగఁ
దదేక దేశాహ్వయమగు..." ఆం. భా. ద్వి. ఘ.
౧౮౮.

ఆడెలు. వై. వి. పక్షివిశేషము, శరారి.

ఆడేలు. వై. = ఆడెలు.

ఆఢకము. సం. వి. అ. పుం. న. తూము, ధాన్యా
దుల మాన భేదము.

ఆఢకి. సం. వి. ఈ. స్త్రీ. 1. కందిచెట్టు; 2. అడవి
కందితీఁగ; 3. ఒకదినుసుమన్ను; 4. తూము.

ఆఢకికము. సం. విశ. (అ. ఈ. అ.) తూమెఁడు
విత్తులు విత్తఁదగినది. (నేల.)

ఆఢ్యంకరణము. సం. వి. అ. న. ఆఢ్యునిగాఁ
జేయుట.

ఆఢ్యంభవనము. సం. వి. అ న. ఆఢ్యుఁడగుట.

ఆఢ్యంభవిష్ణువు. సం. వి. ఉ. పుం. ఆఢ్యుఁడు కాఁ
బోవువాఁడు.

ఆఢ్యుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) 1. సంపన్నుఁడు;
2. శ్రేష్ఠుఁడు.

ఆణవము. సం. వి. అ. న. అణుత్వము, అల్పపరి
మాణము.

ఆణి. ఉభ. దే. వి. 1. ముత్యపుగుండ్రఁదనము."తే.
సంఘటింప నియోగించి చందనమునఁ, బఱిణయూ

గార మలుకంగఁ బాణియాణి, గలుగుముత్తియ ములమ్రుగ్గుగా నొనర్పఁ, జతురపుణ్యాంగనా జనతతిఁ బొనర్చె." భార. విరా. ౫, ఆ. ౩౦౫. "ఉ.ఇందునిభాస్య రోర్తు గదియించెఁ గుమారు నిపేరురంబునం, గందకయాణి పాణియును గల్గినతోరపుఁదారహారముక్, జిందిలిపాటులేక యెడ సేయుముఖేందువినిర్గళత్సుధా, తుంపెల బిందుబృందములు తోయముఁ గైకొని యుండు నోయనక్." నై. ౬, ఆ. ౫౫; 2. ఒకరకము ముత్తెము. "సీ. తద్విశేషాభిద దనరు దారమనంగ నాణియంచనఁగ సుపాణి యనఁగ." ఆం. భా. ద్వి. వై. ౨౭౬. చూ. ఆణిపూస. 3. మర్మము. —సం. ఇ. పుం, స్త్రీ. 1. ఇరుసుతుదిచీల; 2. అంచు; 3. ఎల్ల.

ఆణికాఁడు. దే. విణ. మర్మజ్ఞుఁడు, గుట్టెఱిఁగిన వాఁడు.

ఆణిపూస. దే. వి ముక్యము. "సీ. వేణుజాతముల్గైన యాణిపూసలనెంతు రూడుగపండ్లకుసీడుగాఁగ." కాళ. ౩, ఆ. ౪.

ఆణిపోటు. దే. వి. జీవస్థానమునందు పొడిచినపోటు.

ఆణిముత్తెము. దే. వి. గుండ్రపుముత్తెము.

ఆణియ. దే. వి. దద్రురోగము, (రూ. ఆణె.)

ఆణియము. దే. వి. దేశము, (చూ. ఆణెము.)

ఆణె. దే. వి.=ఆణియ. "సీ. ఆణెయంచనఁగను నాణె యంచనఁగను దద్దురంచనఁగను దద్దనంగ, దద్రువు వెలయు." ఆం. భా. ద్వి. మ. ౧౩౧.

ఆణెము. దే. వి. = ఆణియము. "సీ. ఆణెమంచనఁగ దేశాహ్వయంబు." ఆం. భా. ద్వి. భూ. ౭.

ఆతంకము. సం. వి. అ. పుం. 1. ఆరాటము; 2. చేమిరి; 3. మద్దెలమ్రోఁత; 4. వెఱపు; 5. వ్యాధి; 6. సందేహము; 7. అడ్డు.

ఆతంకితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. భయము కలవాఁడు, వెఱపరి; 2. రోగము గలవాఁడు; 3. తాపముగలవాఁడు; 4. సందేహముగల వాఁడు; 5. అడ్డుగలవాఁడు.

ఆతంచనము. సం. వి. అ. న. 1. చేమిరి, పాలలోఁ దోడుపెట్టుట; 2. పాలలోఁ దోడుపెట్టిన పదార్థము (మజ్జిగ మొ.); 3. కపుపుట, క్షిప్తపఱచుట; 4. వడి, వేగము; 5. ఉపద్రవము; 6. సందేహము; 7. బంగారము మొదలగు లోహములను జారణముచేయుట.

ఆతఁడు. దే. స. ఏ. (ఆశబ్దమునకు పూజ్యార్థమున వచ్చురూపము.) ఆపూజ్యుఁడు, ఆపురుషుఁడు. (అతఁడు, ఆతగాఁడు మొదలగునవి దీనితో సంబంధించినవే.) "సీ. వాసవప్రతిముండు వసువసు నాతండు చేదిభూనాథుండు..." భార. ఆది. ౩, ఆ. ౨౩.

ఆతగాఁడు. దే. స. ఏ. (ఆతఁడు+కాఁడు.)ఆతఁడు (ఇక్కడ స్వార్థమున కాఁడు.)

ఆతతము. సం. విణ. (అ.ఆ.అ.) విరివియైనది, వ్యాపించినది.

ఆతతాయి. సం. విణ. (న్. ఈ.సీ. న్.) చంపనుద్యుక్తుఁడైనవాఁడు. (ఇంట నిప్పుపెట్టువాఁడు,విషము పెట్టువాఁడు, కత్తితో నఱకువాఁడు, ధనము దోఁచుకొనువాఁడు, భూమినపహరించువాఁడు, ఇతరుని భార్యను చెఱపట్టువాఁడు. వీరాతతాయులు.) "శ్లో. అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహః, క్షేత్రదారహరశ్చైవ షడేతే హ్యాతతాయినః." అని స్మృతి.

ఆతపత్రము. సం. వి. అ. న. 1. (ఎండనుండి కాపాడునది.) గొడుగు; 2. (గొడుగువంటి యాకారముగలది.) గుడ్డికామంచి.

ఆతపము. సం. వి. అ. పుం. 1. ప్రకాశము, కాంతి; 2. ఎండ.

ఆతపవారణము. సం. వి. అ. న.(ఎండను నివారించునది) ఆతపత్రము, గొడుగు.

ఆతరము. సం. వి. అ. పుం. ఓడవాని కిచ్చెడుకూలి, కేవు.

ఆతరుఁడు. సం. వి. అ. పుం. ఓడదాటించువాఁడు.

ఆతర్పణము. సం. వి. అ. న. 1. తనివి; 2. శుభసమయములందు సున్నము, రంగుపదార్థములను పూయుట.— విణ. (అ. ఈ. అ.) తృప్తి పొందించునది.

ఆతల. దే. వి. 1. ఆవలిప్రదేశము; "సీ... తనరును బారమద్దరి యవతల, నాతల నావల నవ్వల నవ

లనమోఘుచు నుండును బోరసంజ్ఞ." ఆం. భా. ప్ర. వా. ౧౪౫; 2. సర్వాంత కాలము, అప రకాలము. "క. నై తేయు నఖముఖంబుల, కేతెం చంగున నొవ్వఁ జాలమిఁ గని యఁడుకున్, క్రీతిం గొలుచుచు నుండెను, సూర్యుఁ డీపట్టునుండెనటు నూను పయిన్." హరి. పూ. ౪, ఆ. ౨౭.

ఆతాక్. సం. వి. స్- పుం. 1. పిచుకపిట్ట; 2. చెమ రుఁగాకి.

ఆతి. సం. వి. ఇ. స్త్రీ. ఆడేలు.

ఆతిథేయము. సం. వి. అ. న. అతిథిపూజ, అతిథి సత్కారము.— విశే. (అ. ఆ. అ.) అతిథికి యోగ్యమైనది.

ఆతిథేయుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) అతిథుల యెడ సాధువు, అతిథులఁ బూజించుటయందు ఆసక్తిగలవాఁడు.

ఆతిథ్యము. సం. వి. అ. న. అతిథిసత్కారము, అతిథిపూజ.—విశే. (అ. ఆ. అ.) అతిథికొఱ కైనది.

ఆతుమ. వై. వి. 1. ఆత్మ, జీవుఁడు. "క. మాయ మ్మాన స నీవే, రాయలవై కావ దేవరాజే జేజే, మాయాతుమ లానిన యది, పాయక సంతోష మున్న పల మిలసామీ." కళా. ౬, ఆ. ౧౬౧; 2. పరమాత్మ.

ఆతురత. సం. వి. ఆ. స్త్రీ. ఆతురుఁడగుట "క. భ్రాత మహాత్ముఁడు గర్ణుం,డాతని జంపించియేలు నవనీ రాజ్యం,బాతురత సేయుఁగాక సు,ఖాతిశయము మతికి నొసఁగునయ్యె మునీంద్రా." భార. శాం. ౧, ఆ. ౨౦౦. (ఇట దుఃఖము.)

ఆతురపడు. మి. అ. క్రి. (ఆతురము+పడు.) 1. బాధపడు; 2. తొందరపడు, తహతహపడు.

ఆతురము. సం. వి. అ. న. తొందఱ, సంభ్రమము. (చూ. ఆతురపడు.)

ఆతురసన్న్యాసము. సం. వి. అ. పుం. ప్రాణాపాయ కాలమున సన్న్యాసాశ్రమస్వీకారము చేయ వలయునని స్వీకరించిన సన్న్యాసము.

ఆతురుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. వ్యాధి గ్రస్తుఁడు, తెవులుగొంటు; 2. పీడింపఁబడిన వాఁడు. ("కామాతురుఁడు" మొ.); 3. దుఃఖి. చూ. ఆతురత.

ఆతుర్యము. సం. వి. అ. న. ఆతురత్వము, ఆతురుఁ డగుట.

ఆతోద్యము. సం. వి. అ. న. వాదిత్రము, తతము= వీణాదివాద్యము, ఆనద్ధము = మురజాదికము, సుషిరము = వంశాదికము, ఘనము = కాంస్య తాళాదికము, అనెడు నాలుగు విధములుగల వాద్యము.

ఆత్తగంధము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పోఁగొట్టఁ బడిన పరిమళముగలది (పుష్పము); 2. పోఁగొట్టఁ బడిన మదముగలది (గజము); 3. పోఁగొట్ట బడిన గర్వముగలది (సైన్యము మొ.); 4. తిర స్కరింపఁబడినది.

ఆత్తము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పొందఁబడి నది; 2. అపహరింపఁబడినది.

ఆత్మ. సం. వి. న్. పుం. 1. జీవుఁడు; 2. ఈశ్వ రుఁడు; 3. సూర్యుఁడు; 4. బ్రహ్మము; 5. అగ్ని; 6. వాయువు; 7. బుద్ధి; 8. మనస్సు; 9. స్వభా వము; 10. ధైర్యము; 11. శరీరము; 12. ప్రయ త్నము; 13. తాను, స్వయము. చూ. ఆత్మ బంధువు. (చూ. ఆత్ముఁడు.)

ఆత్మంభరి. సం. విశే. ఇ. తన పొట్టమాత్రము పోసి కొనువాఁడు, కుక్షింభరి.

ఆత్మగుప్త. సం. వి. ఆ. స్త్రీ. (తన్ను తాను కాపాడు కొనునది) దూలగొండితీ.

ఆత్మఘోషము. సం. వి. అ. పుం. 1. (తనధ్వనిచేత నే తన పేరు చాటునది. కాకా అని కాకము ధ్వని చేయును.) కాకి; 2. (కు కు కు అని ధ్వనిచేత తన పేరులో కొంతభాగము తెలుపునది) కుక్కు టము, కోఁడి.

ఆత్మజ. సం. వి. ఆ. స్త్రీ. (తనదేహమువలన పుట్టి నది) పుత్త్రిక, కూఁతురు.

ఆత్మజుఁడు. సం. వి. అ. పుం. (తనదేహమువలన జనించినవాఁడు) పుత్త్రుఁడు, కొడుకు.

ఆత్మదర్శము. సం. వి. అ. పుం. (తనస్వరూపమును చూపునది). 1. దర్పణము, అద్దము; 2. ఆత్మ సాక్షాత్కారము.

**ఆత్మనేపదము.** సం. వి. అ. న. (క్రియాఫలము తననే (కర్తనే) పొందుటను తెలుపునది.) 1. తెనుఁగున 'కొను' అనునది చేర్చినక్రియ. (వండుకొను, తెచ్చుకొను, వ్రాసికొను మొ.); 2. సంస్కృతమున పరస్మైపదమునకు వ్యతిరిక్తమగుక్రియ.

**ఆత్మప్రభవుఁడు.** సం. వి. అ. పుం. 1. (తన దేహమునఁ బుట్టినవాఁడు) కుమారుఁడు; 2. (మనస్సునఁ బుట్టువాఁడు) మన్మథుఁడు; 3. (స్వయంభువు) బ్రహ్మ.

**ఆత్మప్రశంస.** సం. వి. ఆ. స్త్రీ. 1. తన్నుఁ దాను పొగడుకొనుట, ఆత్మస్తుతి; 2. తన్నుగుఱించిన విషయమును తెలుపుట.

**ఆత్మబంధువు.** సం. వి. ఉ. పుం. 1. తనకు ఆప్తుఁడగు బంధువు; 2. పుత్త్రుఁడు; 3. మేనమామకొడుకు; 4. పరమాత్మ.

**ఆత్మభువు.** సం. వి. ఊ. పుం. 1. బ్రహ్మ; 2. మన్మథుఁడు.

**ఆత్మయోని.** సం. వి. ఇ. పుం. 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు; 4. మన్మథుఁడు; 5. తన జన్మస్థానము.

**ఆత్మవంతుఁడు.** సం.విణ. (న్.-ఈ-తీ.న్.) 1. ఆత్మ కలవాఁడు; 2. చిత్తమును వశముచేసికొనినవాఁడు.

**ఆత్మసంభవుఁడు.** సం. = ఆత్మప్రభవుఁడు.

**ఆత్మసాక్షి.** సం. వి. న్. పుం. 1. (వేదాంతాదిమతమందు) బుద్ధిని ప్రకాశింపఁజేయు చైతన్యము; 2. ఆత్మ అనుసాక్షి (ఆత్మసాక్షిగా = తన ఆత్మ సాక్షియగునట్లు.)

**ఆత్మస్తుతి.** సం. వి. ఇ. స్త్రీ = తన్నుఁ దాను పొగడుకొనుట.

**ఆత్మహత్య.** సం. వి. ఆ. స్త్రీ. బలవంతముగ తన ప్రాణమును తాను పోఁగొట్టుకొనుట.

**ఆత్మాపహారము.** సం. వి. అ. పుం. తన్ను దాఁచుకొనుట, మాఱుపేరు చెప్పుట.

**ఆత్మాపహారి.** సం.విణ. (న్.-ఈ-ణీ.న్.) ఆత్మాపహారము చేసికొనువాఁడు. తన పేరు దాఁచికొని మాఱుపేరు చెప్పుకొనువాఁడు.

**ఆత్మారాముఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఆత్మయే ఆరామమువలె రమణస్థానముగాఁ గలవాఁడు, జ్ఞానముకొఱకు ప్రయత్నించువాఁడు (యోగి).

**ఆత్మాశి.** సం. వి. న్. పుం. (తనజాతినే తినునది) మత్స్యము, చేఁప.

**ఆత్మీయము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. తనది; 2. తమది.

**ఆత్ముఁడు.** సం. వి. న్. పుం. (ఆత్మ). 1. పరమాత్మ; 2. జీవాత్మ. "క.వినుమాత్ముఁడు క్షేత్రజ్ఞుం,డన." భార. శాంతి. ౪. ఆ, ౧౨౨. "క. ...మాయా సం, జనితస్వప్నంబై యాత్మునికిం దగుఁ గావలేని మోసముఁ దెచ్చెన్." భార. శాంతి. ౪,ఆ. ౧౨౩.

**ఆత్మోపజీవి.** సం. విణ. (న్.-ఈ-నీ.న్.) 1. స్వదేహకష్టమువలన జీవించువాఁడు; 2. బరువుమోసి జీవించువాఁడు; 3. దాసుఁడు.

**ఆత్మౌపమ్యము.** సం. వి. అ. న. తనతో సాదృశ్యము, తనతో పోల్చుకొనుట.

**ఆత్యంతికము.** సం. విణ. (అ. ఈ. అ.) 1. అత్యంతభవము, అతిశయముగఁ గలిగినది; 2. అంతములేనిది, నిరంతరముగ నుండునది; విచ్ఛిత్తిలేనిది. హద్దులేనిది. (ఆత్యంతికాసిద్ధి = ఎప్పటికిని సిద్ధింపమి. ఆత్యంతికాసిద్ధి విలంబసిద్ధులలో విలంబసిద్ధియే కొంతనయము గదా.)

**ఆత్యయికము.** సం. విణ. (అ. ఈ. అ.) నాశము ప్రయోజనముగాఁగలది, నాశనిమిత్త మగునది (కర్మము).

**ఆత్రగాఁడు.** దే. విణ. (ఆత్రము+కాఁడు.) త్వరపడువాఁడు, తొందరపడువాఁడు.

**ఆత్రము.** దే. వి. ఆతురత, తొందర, సంభ్రమము.

**ఆత్రేయి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఋతుమతి, ముట్టుది; 2. ఒకానొక నది.

**ఆత్రేయుఁడు.** సం. వి. అ. పుం. (అత్రిపుత్త్రుఁడు) చంద్రుఁడు.—విణ. (అ. ఈ. అ.) అత్రివంశమునఁ బుట్టినవాఁడు.

**ఆథర్వణము.** సం. విణ. (అ.ఈ.అ.) 1. అథర్వవేద సంబంధమయినది; 2. అథర్వవేదమందుఁ జెప్పఁబడినది. (ఆథర్వణవిధి) ఆథర్వణము. శ. ర. ప్రమాదము.

**ఆథర్వణికుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) అథర్వవేదము పఠించినవాఁడు. (బ్రాహ్మణుఁడు).

ఆథర్వణుఁడు. సం. వి. అ. పుం. **1.** అథర్వవేదము చదివిన బ్రాహ్మణుఁడు; **2.** అథర్వవేదమందలి కర్మకాండము తెలిసిన పురోహితుఁడు.

ఆద. దే.వి. విచారము. "క. లేదింకం బగయని ధను, రాదుల దెస వాహనములయందును సంక్షేత్రావరులై పగతుర నేఁ, డాదమఱచి నిద్రవోవుకని తఱి పొడుపఁగా." భార. సౌ. ౧, ఆ. ౫౧. "క. విసియిటఁ డెయ్యదియు నెఱుం, గనిముగ్ధుఁడు వోలెఁ బల్కుఁగాఁదొడఁ గె మనం, బునవించఁయాద గల్గిన,నునుమును బొసగొనఁగారణంబేమియొకో." భో. ౪, ఆ. ౩౧౬. ఇది శ. ర. పాఠము. వీప గల్గిన ముద్రితము.

ఆదంశము. సం. వి. అ. పుం. **1.** దంశము; **2.** దంత వ్యాపారము, కొఱకుట.

ఆదట. దే. వి. **1.** ప్రేమము; "క. ఆదట మును వాసినభి, న్నోదరులును సోదరులును నొక్కటి యైనఁగా." విజ్ఞా. వ్య, కాం. ౧౬౧. "విభక్తో యః పునః పిత్రా భ్రాత్రా వైకత్ర సంస్థితః, పిత్ర్యేణాథవా ప్రీత్యా సతు సంసృష్ట ఉచ్యతే." అని మూలము; **2.** భక్తి. "చ. అనఘ యమానుషంబయిన యట్టిదయైనను నాతపంబు పెం,పునకు మునీంద్రు లద్భుతముఁ బొందఁగ మీకపలీల నిత్తునే, ననుటయు నాకురుక్షితిపుఁ డాదటఁ గోరఁగ మీరలిందు వచ్చిన కరుణామయాదర విశేషముకంటెను మేలుఁ గల్గునే." భార. ఆశ్ర. ౨, ఆ. ౧౪; **3.** ఆసక్తి, అపేక్ష, కాంక్ష. "సీ. ... రాగిలి రక్తంబు ద్రావుచు లోచనగుళికల నొలిచి మ్రింగుచును గుండె, కాయ లాదటమెయిఁ గబళించుచును ద్రొవ్వ దెమలిచి నమలుచు నెముకయూట, చవిగొని యానుచు..." భార. స్త్రీ. ౨, ఆ. ౯.

ఆదటవోవు. దే. అ. క్రి. (ఆదట+పోవు.) ఆపేక్ష తీఱు, కాంక్షతీఱు; తనియు, తృప్తిపడు. "చ. ...అ య్యనఘుఁడు దానిఁ జిత్తమున నాదట వోవక చూచె." భార. ఆది. ౪, ఆ. ౧౪౫.

ఆదమఱచు. దే. అ. క్రి. విచారము మఱచు, చింత లేకుండు. భార. సౌ. ౧, ఆ. ౫౧. చూ. ఆద. "గీ. ... కొంతతడ వాదమఱచి నిద్రింతు రపుడు." వరా. ౧౧, ఆ. ౧౭౬.

ఆదరణీయము. సం. విణ. (అ. ఆ. అ.) ఆదరింపఁ దగినది.

ఆదరబాదర. దే. క్రి. విణ. అతిత్వరితముగా.

ఆదరము. సం. వి. అ. పుం. **1.** పాటింపు; **2.** మన్నన, సమ్మానము; **3.** ఆసక్తి, అపేక్ష.

ఆదరించు. సం. స. క్రి. **1.** పాటించు; **2.** మన్నించు.

ఆదరికము. దే. వి. దీక్ష. "ద్వి. ఆది సనేకయుగాదుల నాఁడు, ఆదరికమున శిలాదుఁడనంగఁ, దాపసము ఖ్యుండు దపమొనరించె." బస. ౧, ఆ. ౮ పు.

ఆదరువు. వై. వి. **1.** ఆధారము; **2.** ఆశ్రయము.

ఆదర్తవ్యము. సం. = ఆదరణీయము.

ఆదర్శనము. సం. వి. అ. న. **1.** చూపుట; **2.** అద్దము.

ఆదర్శము. సం. వి. అ. పుం. **1.** అద్దము; **2.** టీక; **3.** మొదటి ప్రతియైన పుస్తకము, మాతృక; **4.** ప్రధానలక్ష్యము, మేలుబంతి. "ఆదర్శప్రాయమైంగనప్పట్టె." "లోకాదర్శమై వెలింగె." "ఆదర్శప్రాయుఁడు" "సర్వశాస్త్రములకు ఆదర్శము."

ఆదర్శితము. సం. విణ. (అ. ఆ. అ.) చూపఁబడినది.

ఆదా. హిం. వి. లాభము, ఆదాయము.

ఆదాత. సం. విణ. (ఋ. ఈ-త్రీ. ఋ.) గ్రహించువాఁడు, స్వీకరించువాఁడు, (దానము) పుచ్చుకొనువాఁడు.

ఆదానము. సం. వి. అ. న. **1.** పుచ్చుకొనుట; **2.** గుఱ్ఱముయొక్క అలంకారము; **3.** నిదానము, రోగకారణము.

ఆదాయము. సం. వి. అ. పుం. **1.** పుచ్చుకొనుట; **2.** లాభము, రాఁబడి; **3.** ధనము; "గీ. ఇవ్విధంబున నాదాయమెల్లఁ జెల్ల, నిచ్చలును వెలయాంధ్రకు నిచ్చియిచ్చి." శేష. ౪, ఆ. శ. ర. —వై. (సం. ఆయుర్దాయః) ఈడు, ప్రాయము. "పిల్లవానికంత బరువు మోయుట కాదాయము చాలదు." "ఆదాయమునకు మించిన పరుగు, ఆదాయమునకు మించిన ఆలోచనలు కూడవు."

ఆది. ఉభ. దే. వి. గుఱి, ధరించువారి యవయవము లకు సరిపడునట్లు నగలు మొదలగునవి చేయుటకై మొదట తీసికొను కొలత. "మురుగులకాది యిచ్చినారు. చెప్పులజోడునకాది తీసికొన్నాఁడు. ఇంకను కుట్టలేదు."—సం. వి. ఇ. పుం. మొదలు. "ఆదిక్ శ్రీసతికొప్పుపై." భాగ. ౮,

స్కం. ౫౯౨.—విశ. మొదటిది, మొదటి వాఁడు. "ఉ. ఆదిజుఁడైన బ్రహ్మయుదయంబున కాస్పదమైనవాఁడు వేదాదిసమస్తవాఙ్మయము లందుఁ బ్రశంసితుఁడైనవాఁడు లోకాది త్రిలోకపూజ్యుఁడని యాత్మ నెఱింగి." భార. సభా. ౨, ఆ. ౧౮. "ఆదికారణము = మొదటి కారణము."—క్రి.విశ. 1. మొదలుగా; 2. సహితముగ, సయితము,కూడ."చ. ... హైహయుఁ సమరవర్తితుఁజంపి యశేషధారుణీపతులను జంపె గర్భగత బాలుర నాదిగ నట్టిచోటఁ దత్సుతులకుఁ దొల్లి ధర్మవిధి సంతతి నిల్పిరె భూసురోత్తముల్" భార. ఆది. ౪,ఆ. ౨౭౬. "క. వాదున నీహరి వేధయుఁ, గాదే యురులింగమూర్తికడ గానక నేఁడాదిగ వెదకెదరట్టి మహాదేవుఁడపూజ్యుఁడనఁగ నగునే నీకున్?" కు. సం.౧,ఆ.౧౬౫. చివరనుండి యెంచుటచే నట్టియర్థము వచ్చియుండును. 'ప్రభృతి' శబ్దమునకును, 'మొదలు' శబ్దమునకుఁ గూడ నిట్టియర్థము గననగుచున్నది. —సం.విశ. (న్. ఈ-నీ.న్.) (సమాసోత్తరపదముగానే ప్రయుక్తమగును) తినువాఁడు. (మాంసాది.)

ఆదికవి. సం. వి. ఇ. పుం. 1. మొదటికవి; 2. హిరణ్యగర్భుఁడు, (ఆతనికి వేదములు మొట్టమొదట స్వయంప్రతిభాతములయినవి గాన నాదికవి యయ్యె); 3. వాల్మీకి. (లౌకికభాషలో మొట్టమొదట శ్లోకమును రచించి రామాయణము రచించినవాఁడు.)

ఆదికావ్యము. సం. వి. అ. న. తొలికావ్యము, వాల్మీకిరామాయణము.

ఆదికొను. దే. అ. క్రి. మార్కొను, అటుము, పైపడు. "వ. వృషభంబున కాదికొను బెబ్బులి యుంబోలె రాధేయుదెసనడచు కవ్వడిం గని" భార. విరా. ౫,ఆ. ౭౩. కన్నువేయు. అని శ.ర. "మ....ఏనుఁగుఁ జంప నాదికొను సింగంబుల్ విడంబించి" ఉ, హరి. ౫,ఆ.౫౧. "తే. అంశుని రథంబు దెసకునై యాదికొనిన, నతఁడు నిలువంగ వెఱచి సురాధినాథు, దెసకు సురిగె రయంబున దేరు డిగ్గి" హరి. ఉ. ౧౦, ఆ.౧౦౭.

ఆదిగొను. దే.=ఆదికొను. "వ. అస్స్నేయ తురంగంబులం బొరిగొని తేజరిల్లి రాజులగములకు నాదిగొను నప్పుడు." భార. ద్రోణ. ౫, ఆ. ౩౦౮.

ఆదితాళము. సం. వి. అ. పుం. తాళభేదము. (ఎనిమిది అక్షరములకాలము.)

ఆదితేయుఁడు. సం. వి. అ. పుం. (అదితిపుత్త్రుఁడు) ఆదిత్యుఁడు, వేల్పు.

ఆదిత్యపురాణము. సం. వి. అ. న. పదునెనిమిది యుపపురాణములలో నొకటి.

ఆదిత్యవారము. సం. వి. అ. పుం. ఆదివారము.

ఆదిత్యసూనుఁడు. సం. వి. ఉ. పుం. (సూర్యపుత్త్రుఁడు) 1. సుగ్రీవుఁడు; 2. కర్ణుఁడు; 3. యముఁడు; 4. శని.

ఆదిత్యుఁడు. సం. వి. అ. పుం. 1. వేలుపు; 2. సూర్యుఁడు. (ద్వాదశాదిత్యులు.—ఇంద్రుఁడు, ధాత, పర్జన్యుఁడు, త్వష్ట. పూషుఁడు, ఆర్యముఁడు, భగుఁడు, వివస్వంతుఁడు, విష్ణువు, అంశుమంతుఁడు, వరుణుఁడు, మిత్రుఁడు.)

ఆదిత్స. సం. వి. ఆ. స్త్రీ. గ్రహింపనిచ్ఛ, పుచ్చుకొనవలెనను కోరిక.

ఆదిత్సువు. సం. విశ. ఉ. గ్రహింప నిచ్ఛగలవాఁడు, పుచ్చుకొనవలెనని యిచ్ఛగించువాఁడు.

ఆదిపురాణము. సం. వి. అ. న. పదునెనిమిది పురాణములలోను పదునెనిమిది యుపపురాణములలోను మొదటిపురాణము.(బ్రహ్మోక్తము. నాల్గులక్షల గ్రంథముగలది)

ఆదిమంతము. సం. విశ.(త్. ఈ-తీ. త్.)ఆదిగలది, మొదలుగలది.

ఆదిమము. సం. విశ. (అ. ఆ. అ.) మొదటిది.

ఆదివారము. సం. వి. అ. పుం. తొలివారము, ఆదిత్యవారము.

ఆదివెలమలు. మి. వి. బ. వెలమలలో నొకతెగవారు.

ఆదిష్టము. సం. వి. అ. న. 1. ఎంగిలి; 2. ఆజ్ఞ. —విశ. (అ. ఆ. అ.) 1. ఆనతియ్యఁబడినది; 2. ఉపదేశింపఁబడినది; 3. ఏర్పఱుపఁబడినది; 4. (వ్యాక.) ఆదేశముగఁ జెప్పఁబడినది.

ఆదీనవము. సం. వి. అ. పుం. 1. క్లేశము, అలసట; 2. దోషము.

ఆదీపకుఁడు. సం. విణ. (అ. ఆ-పికా. అ.) ఉద్దీపకుఁడు; ఉద్రేకింపఁజేయువాఁడు.—వి. అ. పుం. పరగృహములు ఁగులఁబెట్టువాఁడు.

ఆదీపనము. సం. వి. అ. న. 1. ఉద్దీపనము, ఉద్రేకింపఁజేయుట; 2. పంచులాదిచూర్ణముతోఁగలిపినసీళ్లతో చిత్రములు వ్రాయుట, గోడలమీఁద చిత్తరువులు వ్రాయుట, ముగ్గులు పెట్టుట మొదలగుపని.

ఆదుకొను. దే. అ. క్రి. 1. ఆసికయగు; 2. హెచ్చు, అతిశయించు. "ఉత్సాహ. ఆదుకొన్న కావరమున నకట మనుజమాత్రుఁ డీ, మేదినిపయి సింధురాజు మీఱివచ్చి." రాఘ. ౪, ఆ. ౧౪౭; 3. ఆశ్రయమగు, ప్రాపగు. "కష్టకాలమున బంధువులు నలుగురు ఆదుకొన్నారు గావున వారికుటుంబము నిలఁబడినది" —స. క్రి. 1. పోషించు, ప్రోచు. "క. దాదులు పెనుపఁగనిటు జగ, దాదుల కాదియగుమగువ యనిశము సిడులం, బాదుకొని నృపతిలిలకం, బాదుకరాఁ బెరుగుచుండెనంతఁ గడంకన్." రుక్మి. ౧, ఆ. ౮౪; 2. రక్షించు. "గీ....ఓపక్కి మిన్న, యక్కఱలు దీర్చి యిపుడు నన్నాదికొనుము." రసిక. ౫, ఆ. ౧౦. ఇట ఆదరించు. అని. శ. ర.

ఆదుర్దా. అన్యదే. వి. తొందర, ఆతురత, కలవరపాటు, తొట్రుపాటు.

ఆదృతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆదరింపఁబడినది; 2. మన్నింపఁబడినది; 3. పూజింపఁబడినది.—వి. అ. పుం. 1. ఆదరించుట; 2. మన్నించుట; 3. పూజించుట.

ఆదృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఆదరము, పాటింపు; 2. మన్నన; 3. పూజ.

ఆదేయము. సం. విణ. (అ. ఆ. అ.) గ్రహింపఁదగినది, పుచ్చుకొనఁదగినది.

ఆదేవకుఁడు. సం. విణ. (అ. ఆ-వికా. అ.) జూదమాడువాఁడు.

ఆదేవనము. సం. వి. అ. న. జూదమాడుట.

ఆదేశకుఁడు. సం. విణ. (అ. ఆ-శికా. అ.) ఆదేశించువాఁడు.

ఆదేశనము. సం. వి. అ. న. = ఆదేశము.

ఆదేశము. సం. వి. అ. పుం. 1. ఆజ్ఞ; 2. ఉపదేశము; 3. (వ్యాకరణమున) ఒకటిని బోఁగొట్టి దానిస్థానమునవచ్చు మఱియొకవర్ణములోనగునది.

ఆదేశి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) (ఆదేశించువాఁడు.) 1. ఆజ్ఞాపించువాఁడు; 2. ఉపదేశించువాఁడు; 3. ప్రకటించువాఁడు.

ఆదేశించు. సం. స. క్రి. 1. ఆజ్ఞాపించు; 2. ఉపదేశించు; 3. బోధించు.

ఆదేష్ట. సం. విణ. (ఋ. ఈ-ష్ట్రీ. ఋ.) 1. ఆజ్ఞాపించువాఁడు; 2. అధ్వరతంత్రము నుపదేశించువాఁడు.

ఆద్యమాషకము. సం. వి. అ. పుం. అయిదు గురిగింజలయెత్తు. శ. ర.

ఆద్యము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రథమము, మొదటిది, ఆదియందున్నది.

ఆద్యూనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఔదరికుఁడు, లిండిపోతు, ఏపనియుఁ జేయక తిని తిరుగువాఁడు.

ఆధమర్ణ్యము. సం. వి. అ. న. అధమర్ణత్వము, అప్పులుచేయుట.

ఆధర్షణము. సం. వి. అ. న. 1. తిరస్కరించుట; 2. బలాత్కారమునఁ బీడించుట.

ఆధానము. సం. వి. అ. న. 1. ఉంచుట; 2. సంస్కారపూర్వకముగా అగ్ని మొ. వి యుంచుట; 3. కలిగించుట. "వ. ఇక్ష్వాకుమారునందు గుణాధానంబు సేయను నాకొలంది గాదు." భార. ఆది. ౬, ఆ. ౨౪౮; 4. కప్పుట; 5. ధరించుట.

ఆధాయకుఁడు. సం. విణ. (అ. ఆ-యికా. అ.) (ఆధానము చేయువాఁడు.) 1. ఉంచువాఁడు; 2. మంత్రపూర్వకముగా అగ్ని మొదలగునవి స్థాపించువాఁడు; 3. కలిగించువాఁడు.

ఆధారకుండము. సం. వి. అ. న. కుండలులోనగునవి యుంచెడు కుదురు. శ. ర.

ఆధారము. సం. వి. అ. పుం. 1. ఆధరువు; 2. జలాదులుంచుపాత్రము; 3. పాదు; 4. చెఱువు, జలాశయము; 5. (వ్యాకరణమున) అధికరణము, (అధికరణవాచకమగు పదమునకు సప్తమీవిభక్తి వచ్చును.)

ఆధారాధేయసంబంధము. సం. వి. అ. పుం. ఒక దానిపై నుంచఁదగినది ఆధేయము. అది యుండుటకు స్థానమైనది ఆధారము. వానికి పరస్పరముగల సంబంధము. (భూతలమున ఘటమున్నది. అనుచోట భూతలము ఆధారము ఘటము ఆధేయము.)

ఆధారిక. సం. వి. ఆ. స్త్రీ. జెట్టి.

ఆధి. సం. వి. ఇ. పుం. 1. మనోవ్యథ; 2. కుదువ, తాకట్టు; 3. ప్రత్యాశ,కలుగుననునాశ; 4. వ్యసనము; 5. ఉనికిపట్టు, స్థానము.

ఆధిక్యము. సం. వి. అ. న. అధికత్వము, గొప్పఁదనము.

ఆధిదైవికము. సం. విశే. (అ. ఈ. అ.) దైవము వలనఁ గలిగినది.

ఆధిపత్యము. సం. వి. అ. న. అధిపతిత్వము, దొరతనము.

ఆధిభోగము. సం. వి. అ. పుం. 1. తాకట్టుపెట్టినది యుపయోగించుట; 2. మనోవ్యథననుభవించుట.

ఆధిభౌతికము. సం. విశే. (అ. ఈ. అ.) పృథివ్యాది భూతములవలనఁ గలిగినది.

ఆధిరాజ్యము. సం. = ఆధిపత్యము.

ఆధివేదనికము. సం. విశే. (అ. ఈ. అ.) అధివేదన నిమిత్తమైనది. (మొదట నొక స్త్రీని వివాహమాడి తరువాత మఱియొక స్త్రీని వివాహమాడఁదలఁచినవాఁడు మొదటిభార్యను సంతోషపెట్టి యొప్పించుట కిచ్చు ధనము.)

ఆధీన్యము. సం. వి. అ. న. అధీనమగుట, అగ్గపాటు.

ఆధుతము. సం. విశే. (అ. ఆ. అ.) కదలింపఁబడినది, చలింపఁజేయఁబడినది.

ఆధునికము. సం. విశే. (అ. ఈ. అ.) 1. అధునాతనము, ఇప్పటిది; 2. క్రొత్తది.

ఆధూతము. సం. విశే. (అ. ఆ. అ.) కంపితము, కదలింపఁబడినది.

ఆధేయము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉంచఁదగినది; 2. కలిగింపఁదగినది.

ఆధోరణుఁడు. సం. వి. అ. పుం. హస్తిపకుఁడు, మావటివాఁడు.

ఆధ్మాతము. సం. విశే. (అ. ఆ. అ.) 1. రోగము వలన ఉబ్బినది (ఉదరము); 2. ఊదఁబడినది.

ఆధ్మానము. సం. వి. అ. న. 1. ఉబ్బుట; 2. ఉబ్బురోగము; 3. కడుపుబ్బుట; 4. వరికయను గంధద్రవ్యము; 5. ఊదుట. "వ. అక్షౌహిణీయుశ్వ కర్ణరంధ్రాధ్మానంబు సేయుమనిన వల్లెయని." భార. ఆది. ౧, ఆ. ౧౧౧.

ఆధ్యక్ష్యము. సం. వి. అ. న. 1. అధ్యక్షత్వము, అధ్యక్షుఁడగుట; 2. ప్రత్యక్షమగుట.

ఆధ్యాత్మికము. సం. విశే. (అ. ఈ. అ.) ఆత్మవలనఁ గలిగినది. (దుఃఖము.)

ఆధ్యానము. సం. వి. అ. న. స్మృతి, తలఁపు.

ఆధ్యాపకుఁడు. సం. = అధ్యాపకుఁడు.

ఆధ్యాసికము. సం. విశే. (అ. ఈ. అ.) అధ్యాసమున (భ్రాంతిజ్ఞానమున) కల్పింపఁబడినది. (శుక్తియందు రజతత్వము ఆధ్యాసికము.)

ఆధ్వనికుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) మార్గకుశలుఁడు, మార్గము బాగుగా ఎఱిఁగినవాఁడు.

ఆధ్వర్యవము. సం. విశే. (అ. ఈ. అ.) అధ్వర్యు సంబంధమైనది. (కర్మ-)

ఆన. వై. వి. (సం. ఆజ్ఞా; క.ఆణె.త.ఆణై) 1. ఉత్తరువు. "సీ...మీ శ్రీచరణాంభోజధూళి నాకహారహంబు,సర్వాంగరక్షయైసంధిల్లుచుండఁగ మృత్యువెబ్భంగి నామీఁదఁ గవయుఁ, గవిసెనేనిఁ గఠోరకంఠహుంకారంబు నొనరించి మీయాన వొడుచువాఁడ, తే.నానయును ద్రోచి వచ్చెనే నాగ్రహమున ..... వామపదపార్ష్ణిఘట్టనమున, దానిపండ్లన్ని రాలంగఁ దన్నువాఁడ." కాశీ. ౪, ఆ. ౩౭; 2. ఒట్టు. "చ....ఈ,యెడ నొకకీడు గల్గదిఁక నేమనినన్ మఱి నీకు నాన సూ,బడలికదీఱ నిత్తనువుఁ బారణసేయుము మైత్రి గల్గినన్." ఆముక్త. ౬,ఆ. ౫౨. "శా. నామీఁదాన సుమీ మఱేమియనినన్." సారంగ. ౩, ఆ. ౮౫; 3. సాక్షి. (ఈయర్థమున ప్రతిజ్ఞాదులను దెలుపునపుడే యుపయుక్తము) "ఆ.గురునియలవుఁ జలము వెరవును గలఁచి నీ,యాన గాండివంబునాన దివ్య, శరములాన యెల్లి సైంధవుతల యెల్ల, భంగిఁ దునిమివైతుఁ బగఱు దలఁక." భార.ద్రోణ.

౨,ఆ. ౩౧౧. "చ.... ఓదివిజశంభళియింకటఁబట్టి నీకు మా, యనిమిషరాజుపాదములయాన సుమీ మఱియేమి పల్కినన్." వై. 3, ఆ. ౧౭౪. (ఇట "అనిమిషరాజుపాదములయాన= దేవేంద్రునిపాదములపై ఒట్టు-అనఁగా ఆయనపాదములే కెగ్గుపలంచినపాపము నీకుఁ గల్గుననుట." అని వేదం. వేం. వ్యాఖ్య. ఇంద్రునిపాదముల యాజ్ఞ అది నీకు దాఁటరాదుగదా అని తాత్పర్యము); **4.** ప్రమాణము, (కార్యనిర్ణయము చేయు) అధికారము. "ఆ. ఈశఁ డనెడుమాటలెల్ల బూటకములు, కూలిసేయుచుండి కుక్కఁ జెంచె, సింతెకాని పూజలేమియు మేమటఁ, గాన లేదు తమకె యానయనిన." 'దేవపాదాః ప్రమాణమ్' అను సంస్కృత వాక్యమునకు తెనుఁగు. చెన్న. 3, ఆ. ౪౨౮; **5.** అన్యదే. క్రీస్తుశక సూచన. శ. ర. (ఆన్ అనెడి ఇంగ్లీషుపదమునకు భ్రష్టరూపము.)

ఆనంతర్యము. సం. వి. అ. న. అవ్యవధానము, వ్యవధానములేమి, తర్వాతిదగుట.

ఆనంత్యము. సం. వి. అ. న. అనంతత్వము, అంతములేమి.

ఆనంద. సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

ఆనందథువు. సం. వి. ఉ. పుం. **1.** ఆనందము, సంతసము; **2.** సుఖము.

ఆనందనము. సం. వి. అ. న. ఆనందింపఁజేయుట, చుట్టములు మొదలగువారి నాలింగనాదులచేత సంతోషపఱచుట.

ఆనందమయము. సం. విశే. (అ.ఈ.అ.) **1.** ఆనందప్రచురము, అధికానందము గలది; **2.** ఆనందవికారమైనది.

ఆనందము. సం. వి. అ. పుం. **1.** సంతోషము, సంతసము; **2.** సుఖము.

ఆనందవిపినము. సం. వి. అ. న. ఆనందవనము, కాశీపురము. "సీ. ఆనందవిపినంబునందు దాఁడిమబ్రహ్మ దపమాచరించె నత్యంతనిష్ఠ." కాశీ. ౬, ఆ. ౨౪౧.

ఆనందించు. సం. అ. క్రి. సంతోషించు, సంతసించు. — స. క్రి. **1.** ఆనందింపఁజేయు. "సీ. రోదసీకుహరంబు రుచిరాంశుతతిఁ జేసి యర్కుండు వెలిఁగించునట్టు లమృత, సందోహనిష్యందచంద్రికఁ జేసి శీతాంశుఁ డానందించునట్టు." భార. సభా. ౨, ఆ. ౬; **2.** స్తుతించు "మ. ... గంధర్వకి, న్నరరూపంబులు దాల్చి సారెకవి యానందించుఁ దచ్చాతుర్యమున్." వసు. ౧, ఆ. ౭౦.

ఆనందితము. సం. విశే. (అ. ఆ. అ.) **1.** సంతోషమునొందినది; **2.** సంతోషపెట్టఁబడినది.

ఆనకట్ట. దే. వి. (త. అణైక్కట్టు.) ఏటియడ్డకట్ట. ప్రవాహరూపమున నీరంతయుసముద్రములోనికిఁ బోకుండఁగ నిల్వచేయుటకై నదికి అడ్డముగాఁ గట్టినకట్ట.

ఆనకదుందుభి. సం. వి. ఇ. పుం. కృష్ణునితండ్రి, వసుదేవుఁడు.

ఆనకము. సం. వి. అ. పుం. **1.** తప్పెట; **2.** భేరి; **3.** మద్దెల; **4.** ఉఱుముమబ్బు.

ఆనడుహము. సం. విశే. (అ. ఈ. అ.) వృషభసంబంధమైనది (చర్మాది)

ఆనతము. సం. విశే. (అ. ఆ. అ.) **1.** వంపఁబడినది, అవనతము; **2.** నమస్కరించినది; **3.** అధోముఖముగా నున్నది.

ఆనతి. ఉభ. వై. వి. ఆజ్ఞ. — సం. ఇ. స్త్రీ. **1.** నమ్రమగుట, నమ్రత్వము; **2.** వంగుట; **3.** నమస్కారము, మ్రొక్కు.

ఆనతిచ్చు. ద్వి. స. క్రి. (ఆనతి+ఇచ్చు.) సెలవిచ్చు, దయతోఁ జెప్పు. "ఉ. వంశమెల్లఁ బూ, తమ్మగు నీమచర్యనని ధాతపడంతిరొ యానతిచ్చె." కళా. ౪, ఆ. ౧౨౬.

ఆనతియిచ్చు. దే.=ఆనతిచ్చు. "క. ధరణీసురవిరహితమగు, నరణ్యదేశంబు నాకు నానతియిం డీ, త్తరుశాఖ విడువవలయును." భార. ఆది. ౨,ఆ. ౭౭.

ఆనద్ధము. సం. వి. అ. న. మద్దెలలోనగు చర్మవాద్యము.—విశే. (అ.ఆ.అ.) **1.** కట్టఁబడినది; **2.** కూర్పఁబడినది, గ్రథితము; **3.** వ్యాపించినది.

ఆననము. సం. వి. అ. న. **1.** మొగము; **2.** నోరు.

ఆనప. దే. వి. అనుగు, సొర. ఆనపకాయ అని వాడుక.

ఆనపెట్టు. దే. స. క్రి. ఆజ్ఞాపించు, ఆజ్ఞపెట్టు.

ఆనపొడుచే. దే. స. క్రి. ఆజ్ఞపెట్టు, ఆజ్ఞాపించు. "క. నిలువక యటు పోచున్నా, రలిఖుంతల చేలుల నేల యానపొడిచె దేఁ,జెలికాఁడఁ గానె యని పై,దలిచెవిలోఁ జెక్కు చెక్కుఁ దార్కొ నఁ బలికెన్." ప్రభా. ౫, ఆ. ౩౯.

ఆనమితము. సం. విణ. (అ. ఆ. అ.) వంపఁబడినది.

ఆనము. సం. వి. అ. పుం. ఉచ్ఛ్వాసము, ఊపిరి పీల్చుట.

ఆనయనము. సం. వి. అ. న. = ఆనయము.

ఆనయము. సం. వి. అ. పుం. 1. పొందించుట; 2. తెచ్చుట.

ఆనయించే. సం. స. క్రి. 1. తెచ్చు; 2. తెప్పించు. "ఉ. యజ్ఞగృహాయూపతతుల్ సమకట్టఁబంపు వి,భ్రాజిత భక్ష్యభోజ్యవిధి భవ్యపదార్థము లాన యింపుము. భార. ఆర. ౬, ఆ. ౭౦.

ఆనర్తము. సం. వి. అ. పుం. 1. నాటకశాల; 2. నీరు; 3. యుద్ధము, పోరు; 4. దేశవిశేషము. (దీనికి ద్వారకరాజధాని. ఈదేశమునకు సౌరాష్ట్ర మనియుఁ బేరుండెడిది. ఇప్పుడది కథియావార్ అని వాడఁబడుచున్నది. ఇందు ప్రభాసతీర్థము కలదు.)

ఆనర్థక్యము. సం. వి. అ. న. (అనర్థకమగుట.) 1. ప్రయోజనములేమి; 2. హానికరమగుట.

ఆనవాలు. దే. వి. 1. అడియాలము, గుఱుతు. "సీ.... మునివల్లభనాకానవాలు దెమ్ము, నృపుపాలననియె నన్నెలఁత యుదంకుండు సనుదెంచి విభునభిజ్ఞాన మడిగె." భార. అశ్వ. 3, ఆ. ౯౫; 2. (ఆన వాలుపట్టు = గుర్తించు; ఆనవాలుపెట్టు=గుర్తు పెట్టు) (ఆన+పాలు.) ఇవురఁగాఁచినపాలు, కూర్చిక. "సీ. అమృతరసోపమంబైన కమ్మని యానవాలపాయసము జంబాలమయ్యె," నైష. ౬, ఆ. ౧౨౪. "సీ. ... పాలఁబోల్వయసునీ పాలు నేయుట కిదె యానవా లన్నట్టు లాన వాలు, నెమ్మి నీరీతి నా కెమ్మోవి గ్రోలుమీ పూని నీవన్నట్టు పానకంబు, తనవచోమాధుర్య మెన యునా యివి చూడు మన్నట్టు మేలిరసాయన ములు, తే. నొప్పుగా గిన్నియలనుంచి యుపచ రించి....." శశాం. 3, ఆ. ౧౫.

ఆనసము. సం. విణ. (అ. ఈ. అ.) శకటసంబంధ మయినది, బండిసంబంధమైనది.

ఆనాయము. సం. వి. అ. పుం. 1. చేఁపవల; 2. వల.

ఆనాయ్యము. సం. వి. అ. పుం. గార్హపత్యమునుండి యెత్తి దక్షిణాగ్నియందుంచఁబడిన అగ్ని.

ఆనాలు. దే. = ఆనవాలు. "మ. కలమాన్నంబు ఘృతంబుఁబాయసము శాకవ్రాతముల్ పిండివం, టలుఁబాల్ తేనియ జున్ను వెన్నయిడి యానాలు క్కెరల్ చక్కెరల్, ఫలముల్ పానకముల్ రసాయనము లంబళ్లారుఁబిండ్లారుఁగా, యలు బజ్జుల్ దధిపిండఖండములు నందావిస్ఫురించెఁ గా వెసగా." రాజశేఖరచరిత్రము. అని శ. ర. ఇది మాదయ్యగారిమల్లనది.

ఆనాహము. సం. వి. అ. పుం. 1. నిడుపు; 2. మల మూత్రబంధము; 3. బంధము.

ఆనిక. దే. వి. 1. ఉపాశ్రయము, ఆనుకొనుట; 2. దార్ఢ్యము.

ఆనియ. దే. వి. ఆణియ, (చూ. ఆనె.)

ఆనీతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందింపఁ బడినది; 2. తేఁబడినది.

ఆనీతి. సం. వి. ఇ. స్త్రీ. 1. తీసికొనివచ్చుట; 2. పొందించుట.

ఆను. దే. అ. క్రి. 1. ఆనికయగు, అంటియుండు. "ఆదూలము గోడలమీఁద ఆని యున్నది." 2. ఒఱగు. "ఆతలగడమీఁద ఆని కూర్చుంటిని;" 3. ఊఁతగాఁగొను. "కఱ్ఱమీఁద ఆని నడచి నాఁడు;" 4. గోచరమగు, తెలియు. "దూరపు వస్తువులు కంటికి ఆనవు; చిన్నయక్షరాలు కంటి కానవు;" 5. ప్రసరించు. "దూరానకు చూపు ఆనదు."—స. క్రి. 1. అదుము, నొక్కు. "క... కెమ్మోవి పంట నానఁగ." రసిక. ౫, ఆ. ౧౬౯. "వ... మోఁకాళ్లు వక్షఃస్థలంబుననాని." కళా. 3, ఆ. ౨౬౬; 2. అణఁచు, నిరోధించు, ఆపు. "ఆనఁగరాని కోపమున." కా. ౨, ఆ. ౪౭. "ఉ...ఆనఁగరాని మనోరథంబుతో." వసు. 3, ఆ. ౭౯; 3. ఆశ్రయముగాఁ గొను, నివాసము చేసి కొను. "మ. వనజంబానెడి తేఁటి యన్యకుసుమా వాసంబపేక్షించునే" భాగ. ౯, స్కం. ౫౨౯;

4. [illegible] "[illegible]... [illegible] [illegible]" [illegible] 5. పొందు. "[illegible] [illegible] [illegible] [illegible] కట్టి [illegible] [illegible] చేయుచున్నారు." [illegible] 6. [illegible] "[illegible] [illegible] [illegible]" [illegible] "[illegible] [illegible] ప్రా [illegible] [illegible] కోకిలమి [illegible]." భాగ. [illegible] 7. [illegible] "ఉ... [illegible] [illegible]." భాగ. అను. [illegible] "ఉ. అక్కట [illegible] [illegible] [illegible] [illegible]." భాగ. [illegible] 8. నాలుక, ముక్కు, చెవి మొదలగువానితో రుచి, పరిమళము, మాట మొదలగునవి గ్రహించు. "మోపిరుచు లాన వలవదే నాలుక గలుగుఫలము" దశా. [illegible], ఆ. ౩౦౭. "చ... సౌరభమానుట" స్వారో. [illegible], ఆ. [illegible] "కర్ణలాపకర్ణములు" భాగ. ౧౦.ఉ.[illegible]౩.

అనుకట్టు. దే. వి. అనుకొనెడికట్టు, పోటకోల.

అనుకూల్యము. సం. వి. అ. న. అనుకూలభావము, ఒద్దిక.

అనుకొను. దే. స. క్రి. 1. ఆశ్రయముగాఁ జేసికొను; 2. పోటకగాఁజేసికొను.

అనుగము. దే. వి. సొర, అలాబువుళీ. "ఆ. మునగ యుల్లి యడవిమునగ దుర్గంసము, లానుగమ్ము లీనమైనయుచ్చు, గఱియ జీలకఱ్ఱ గఱివేముగురు జయుంగువ ప్రవర్జనీయకోటి యగుట." భార. అను. ౩, ఆ. ౧౮౯. సింగుద్రవ్యేషు శాకేషు పలాండులశునం తథా; శోభాంజనః కోవిదార స్తథా గృంజనకాదయః, కూశ్మాండ జాత్యలా బుంచ కృష్ణం లవణ మేవచ." అని మూలము.

అనుగు. దే. = అనుగము.

అనుగుణ్యము. సం. వి. అ. న. అనుగుణభావము, ఇమ్ము, అనుకూలమగుట.

అనుగ్రామికము. సం. విశే. (అ. ఈ. అ.) గ్రామము నకు వెనుకభాగమున నున్నది.

అనువుబిల్ల. దే. వి. ఒఱగుదిండు, అనుకొనుదిండు.

అనుపూర్వి. సం. వి. ఇ. న. ఈ. స్త్రీ. అనుక్రమము, సాదివి, వరుస, మొదటినుండియు వచ్చు క్రమము.

అనుపూర్వ్యము. సం. వి. అ. న. = అనుపూర్వి.

అనులోమ్యము. సం. వి. అ. న. 1. అనుక్రమము; 2. అనుకూలమగుట.

అనువు. దే. వి. అనిక. "వ. జానువునానువునవిమి యుంగదిమియు." ఉ, హరి. ౬, ఆ. ౧౧౮.

అనుషంగికము. సం. విశే. (అ. ఈ. అ.) ఉద్దేశము లేకుండఁగనే ప్రసంగవశమున సంభవించి నది, అప్రధానము. "నేపాలమునకు నీవు పొమ్ము. తిరిగివచ్చునపుడు మాదూడ కనఁబడినచో తోలి కొనిరమ్ము." ఇట దూడను తోలికొనివచ్చుట అనుషంగికము.

అనూపము. సం. విశే. (అ. ఈ. అ.) అనూప దేశ మునఁ గలిగినది, జలప్రాయప్రదేశమునఁబుట్టినది.

అనృణ్యము. సం. వి. అ. న. అనృణత్వము, అప్పులు లేకుండుట.

అనృశంస్యము. సం. వి. అ. న. అక్రూరభావము, సౌమ్యత్వము.

అనె. దే. = అనియ.

అనేశ. సం. విశే. (ఋ.ఈ.త్రీ.ఋ.) 1. పొందించు వాఁడు; 2. తెచ్చువాఁడు, తీసికొనివచ్చువాఁడు.

అనేయము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పొందింపఁ దగినది; 2. తేఁదగినది, తీసికొనిరాఁదగినది.

అన్వయికుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) గొప్పవంశ మునఁ బుట్టినవాఁడు.

అన్వీక్షకి. సం. వి. ఈ. స్త్రీ. 1. వైశేషికాదితర్క విద్య; 2. రాజవిద్యలు నాలుగింటిలో నొకటి, దండనీతి.

అపక్వము. సం. వి. అ.న. గుగ్గిళ్లు — విశే. (అ.ఆ.అ.) కొంచెము పక్వమయినది.

అపగ. సం. వి. ఆ. స్త్రీ. నది, ఏఱు.

ఆపగేయుఁడు. సం. వి. అ. పుం. (నదీ పుత్త్రుఁడు) భీష్ముఁడు.

ఆపణము. సం. వి. అ. పుం. 1. నివస్య, అంగడి, దుకాణము; 2. బజారు, అంగడివీథి, సంత.

ఆపణికుఁడు. సం. వి. అ. పుం. వణిజుఁడు, బేహారి.

ఆపతనము. సం. వి. అ. న. 1. పొందించుట; 2. వచ్చుట; 3. దైవవశమునఁబడుట; 4. దైవవశమున సంభవించుట; 5. జ్ఞానము.

ఆపతితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. హఠాత్తుగా వచ్చినది; 2. దైవవశమున సంభవించినది; 3. దైవవశమునఁబడినది.

ఆపత్కల్పము. సం. వి. అ. పుం. ఆపత్కాలమందు అనుసరింపవలసినవిధి.

ఆపత్కాలము. సం. వి. అ. పుం. ఆపత్తుగలిగిన సమయము.

ఆపత్కాలికము. సం. విణ. (అ. ఈ. అ.) 1. ఆపత్కాలమున జరిగినది; 2. ఆపత్కాలమున ఉన్నది.

ఆపత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఇడుమ, ఆపద; 2. పొందించుట.

ఆపత్తు సం. = ఆపద.

ఆపద. సం. వి. ద్. స్త్రీ. విపత్తు, ఇడుమ.

ఆపద్ధర్మము. సం. వి. అ. పుం. ఆపత్కాలమందు అనుసరింపవలసిన ధర్మము.

ఆపన్నము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆపదనొందినది; 2. పొందఁబడినది.

ఆపన్నసత్త్వ. సం. వి. ఆ. స్త్రీ. (గర్భమునఁ బొందఁబడిన ప్రాణి గలది) గర్భిణి, చూలాలు.

ఆపమిత్యకము. సం. వి. అ. న. ఒకవస్తువునిచ్చి దానికి మాఱుగా పుచ్చుకొన్న మఱియొకవస్తువు, వినిమయముగా పుచ్చుకొన్నవస్తువు.

ఆపము. దే. వి. అప్పము, భక్ష్యవిశేషము. —సం. వి. న. అప్‌సమూహము, జలసముదాయము.

ఆపరాహ్ణికము. సం. విణ. (అ.ఈ.అ.) 1. అపరాహ్ణమందున్నది; 2. అపరాహ్ణమువఱకు వ్యాపించునది.

ఆపసోపాలుపడు. దే. అ. క్రి. ఉస్సురస్సురను. (పీఁడు పొట్టనిండ మెక్కి ఆఁకసి ఆపసోపాలు పడుచున్నాఁడు.)

ఆపస్తంబుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకఋషి. ఈతఁడు కల్పసూత్రము రచించెను. ధర్మశాస్త్రకర్త.

ఆపాణము. సం. వి. అ. పుం. క్రయవిక్రయ వ్యాపారము, కొనుట అమ్ముటగలవ్యవహారము.

ఆపాతము. సం. వి. అ. పుం. 1. పడుట; 2. తేలిక; 3. ఉన్నట్టుండి అనుభవించుట; 4. మంచిచెడ్డ లాలోచింపక గ్రహించుట. ఆపాతరమణీయము= గుణదోషవిచారణము చేయనపుడు రమణీయముగా నుండునది, విచారింపఁగా రమణీయత లేనిది. అని భావము; 5. అనుకోనకుండఁగ సంభవించుట; 6. అప్పుడు. శ. ర.

ఆపాదకము. సం. విణ. (అ. ఆ. అ.) కలిగించునది.

ఆపాదనము. సం. వి. అ. న. ఉత్పాదనము, కలిగించుట.

ఆపాదమస్తకము. సం. అవ్య. పాదము మొదలు తలవఱకు. "క. ఆపాదమస్తకము తద్రూపము వీక్షించుచుం గుతూహల మడరన్." భార. విరా. ౧, ఆ. ౩౧౧.

ఆపాది. సం. విణ. (న్. ఈ. న్.) (సమాసోత్తరపదముగా ప్రయుక్తము) కలిగించునది, చేయునది. "మ. ప్రమదాపాది పయఃప్రపూర్ణమిది యో పద్మాకరంబచ్చు." భార. ఆది. ౬, ఆ. ౧౭౩.

ఆపాదించు. సం. స. క్రి. 1. ఆపాదిల్లఁజేయు, కలిగించు; 2. చేయు. "వ....ఆయుధంబుల విరోధి వధంబాపాదించి వేవేగవిరాటు విడిపింపుము..." భార. విరా. ౩, ఆ. ౨౦౮.

ఆపాదితము. సం. విణ. (అ.ఆ.అ.) కలిగింపఁబడినది.

ఆపాదిల్లు. సం. అ. క్రి. కలుగు.

ఆపానము. సం. వి. అ. న. 1. అనేకులు కూడి కల్లు త్రాగెడిచోటు; 2. కల్లంగడి.

ఆపితము. సం. విణ. (అ.ఆ.అ.) పొందింపఁబడినది.

ఆపీడ. సం. వి. ఆ. స్త్రీ. 1. మిగుల బాధపెట్టుట; 2. నలఁపుట.

ఆపీడము. సం. వి. అ. పుం. 1. నొప్పించుట; 2. సిగ యందలి పూదండ; 3. శిరోభూషణము, కిరీటము; 4. నొక్కుటచేఁ గలుగు పీడ మొదలగునది.

ఆపీడితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. నలుగఁబడినది; 2. పీడింపఁబడినది, బాధపెట్టఁబడినది.

ఆపీతము. విణ. (అ. ఆ. అ.) 1. త్రాగఁబడినది; 2. కొంచెము పచ్చనైనది.—వి. అ. పుం. 1. కొంచెము పచ్చనిరంగు; 2. మాక్షికధాతువు.

ఆపీనము. సం.వి. అ.న. పొదుగు.—విణ. (అ.ఆ.అ.) మిక్కిలి బలిసినది.

ఆపుచేయుట. దే. క్రి. నిలుపుదలచేయుట.

ఆపూపికము. సం. వి. అ. న. 1. అపూపముల సమూహము; 2. అపూపములు పిండివంటలు తోడుగా నుపయోగించు బెల్లము మొ. పదార్థము.

ఆపూపికుఁడు. సం. విణ. (అ.ఈ.అ.) 1. పిండివంట చేయువాఁడు; 2. పిండివంటపదార్థములు అమ్మి జీవించువాఁడు; 3. అపూపములు తినువాఁడు.

ఆపూప్యము. సం. వి.అ. పుం. అపూపముల కుపయోగించు పిండి.

ఆపూరణము. సం. వి. అ. న. = ఆపూరము.

ఆపూరము. సం. వి. అ. పుం. 1. మిక్కిలి పూరించుట; 2. కొంచెము పూరించుట; 3. అంతటను వ్యాపించుట; 4. జలాదిప్రవాహము.

ఆపూరితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అంతట నింపఁబడినది; 2. అంతటను వ్యాపించునది.

ఆపూర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) నిండినది "శా. ...చాపంబు లాకర్ణాంతయుగముగా వడిం దిగిచి యుగ్రక్రోధులై యేసి రాపూర్ణంబయ్యెఁ బడియ బాణతతి నంభోభృత్పథంబెల్ల..." భార. అర. 2, ఆ. ౧౫౮.

ఆపూర్తి. సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలినింపు, మిక్కిలి పూర్తియగుట.

ఆపూర్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి నింపఁబడుచున్నది; 2. అంతటను వ్యాపించుచున్నది.

ఆపృచ్ఛ. సం. వి. ఆ. స్త్రీ. = ఆప్రచ్ఛనము.

ఆపృచ్ఛనము. సం. వి. అ. న. = ఆప్రచ్ఛనము. (ఆపృచ్ఛనము అనురూపము. శ. ర. లోను అనురూపమునను గలదు. పరవస్తు రంగాచార్యుల వారి లఘుశబ్దార్థసర్వస్వమున ల్యుట్ ప్రత్యయాంతమని గలదు. కాని అప్పుడు ఆప్రచ్ఛనమనుట వ్యాకరణ సమ్మతము. ఈరూపము చింత్యము.)

ఆపె. దే. స. వి. (ఆ+అవ.) ఆమె.

ఆపోసనము. వై. వి. ఆపోశనము. ("చ. అసియఱ చేతనాడఁదటు లాపోసనంబును బట్టుకొన్నన, య్యసుకటెచేటలం జెరిగి యింపగుబియ్యము చేసి వేడ్కతో, నెసరులు వోసిపండి పెరవేర్పడన య్యశనంబు భూదివో, కసులకుఁ బెట్టెఁగాదనిసి గ్రక్కున నాకలి తీఱునట్లుగన్." భో. ౬, ఆ. ౧౫౪. అని శ. ర. ఇట "అసదృశలీల నవ్వనిత యంబుఘటావళి క్రిందనున్న యయ్యసకటు" అని ముద్రితము. దీనిపయి, పద్యమున. "క. అని యఱచేఁ ద నె యాపోశనముం బట్టుకొనియున్న" అని కలదు. అపక్షమున ఇది పనికిరాదు.)

ఆపోక. దే. వి. ఆపోవుట, తనివి, తృప్తి.

ఆపోవు. దే. అ. క్రి. (ఆవట+పోవు.) తనియు, తృప్తిపడు. "క. శ్రీపతి కడునెయ్యంబున, నాపోవక పార్థునొద్ద నారాత్రి ప్రియాలాపములం దగిలియుండెను." భార. ఆశ్వ. ౧, ఆ. ౧౭౨. "క. కోపము నుబ్బును గర్వము, నాపోవకయునికి యును దురభిమానము ని, ర్వ్యాపారత్వము నను నివి, కాపురుషగుణంబులండ్రు కౌరవనాథా." భార. ఉద్యో. ౨, ఆ. ౩౨.

ఆపోశనము. సం. వి. అ. న. 1. భోజనాదిని పుడిసిటఁ బోసికొనినజలమును మంత్రముతో నభిమంత్రించి త్రాగుట; 2. త్రాగుట. "క....త్వ, ద్భృత్పాదకౌశికసలి, లాపోశన మెపుడు సుతులకాయుష్మ మగున్" కాశీ. ౪, ఆ. ౧౯; 3. లోఁబఱచుకొను, స్వాధీనపఱచుకొను. "వ.... అక్కజంబుగాఁ గూడి పరదేశం బాపోశనంబు గొనం దమకించు తనబలంబులగజిబిజి యుడిపికొని...." భార. విరా. ౩, ఆ. ౧౩౨.

ఆపోశనించె. సం. స. క్రి. ఆపోశనముపట్టు, త్రాగు. "క... ...మెలఁగుచు నాపోశనించె మిహికాజలధిన్." ఆము. ౫, ఆ. ౧౦౨.

ఆపోశానము. సం. వి. అ. న. = ఆపోశనము.

ఆపోసనము. వై. = ఆపోశనము. "ఉ. ఈసున నేక హేలన మహీసురుఁ డొక్కరుఁడొక్కవార్ధియా, పోసనమెత్తుచో......" సై. ౫, ఆ. ౬౮.

ఆప్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందఁబడినది; 2. క్షేమముకోరునది; 3. సత్యమైనది.

ఆప్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. కలిమి; 2. పొందుట; 3. కూడుట; 4. సంబంధము; 5. లాభము; 6. రాఁబోవు శుభకార్యము, 7. ఆప్తత, క్షేమాభిలాషిత్వము, బంధుత్వము. "తే. నీవివేకంబునాప్తియు నెఱపితీవు." భార. ఉద్యో. 3, ఆ. ౨౩౬.

ఆప్తుఁడు. సం. వి. అ. పుం. క్షేమము కోరినవాఁడు, హితుఁడు. "ఆప్తులమాట వినందగును."—విణ. చూ. ఆప్తము.

ఆప్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. జలమయము; 2. పొందఁదగినది.

ఆప్యాయనము. సం. విణ. (అ. ఆ. అ.) ఫలతృప్తి గలిగించునది. "వ...ఆప్యాయన మధుపానంబున నెలమిం బొంది..." భార. ద్రోణ. 3, ఆ. ౩౦౫.—వి. అ. న. 1. వృద్ధి; 2. ప్రీతి; 3. తృప్తి; 4. వృద్ధిపొందించుట; 5. తృప్తిపఱచుట, సంతోషపెట్టుట.

ఆప్యాయము. సం. వి. అ. పుం. తృప్తి, తనివి.

ఆప్యాయిత. సం. విణ. (ఋ. ఈ-త్రీ. ఋ.) 1. తనియువాఁడు; 2. తనియఁజేయువాఁడు.

ఆప్యాయితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. తనిసినవాఁడు, తృప్తిపొందినవాఁడు; 2. తృప్తి పొందింపఁబడినవాఁడు.

ఆప్రచ్ఛనము. సం. వి. అ. న. 1. బంధువులు, మిత్రులు మొదలగువారిని కుశలప్రశ్నముచేయుట; 2. గమనసమయమున పోవుటకు బంధువుల యనుమతి వడయుట, వీడ్కోలు; 3. ఆనందము గలిగించుట.

ఆప్రపదీయము. సం. విణ. (అ. ఆ. అ.) మీఁగాళ్లదాఁక వ్రేలాడునది. (అంగి, పావడ. మొ.)

ఆప్లవనము. సం. వి. అ. న. = ఆప్లవము, స్నానము.

ఆప్లవము. సం. వి. అ. పుం. స్నానము, మునుక.

ఆప్లావము. సం. = ఆప్లవము.

ఆప్లావితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. జలాదిప్రవాహముచేత ముంపఁబడినది; 2. స్నానము చేయింపఁబడినది.

ఆప్లుతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. స్నానము చేసినవాఁడు, మునిఁగినవాఁడు; కర్మాంగస్నానము చేసినవాఁడు. "అవభృథాప్లుతుఁడు;" 2. స్నాతకుఁడు; గుర్వాజ్ఞచే వేదములు పూర్తిగాఁ జదివి బ్రహ్మచర్యము విడి గృహస్థాశ్రమమునఁ బ్రవేశించుటకై స్నాతకవ్రత మాచరించినవాఁడు; 3. తడిసినవాఁడు, జలాదులతో సించఁబడినవాఁడు. "వ...ఆకాశగంగాజలంబుల నాప్లుతదేహుండయి..." భార. ఆది. ౭, ఆ. ౨౯౯. "బాష్పాప్లుతముఖి" "రుధిరాప్లుతుఁడు." "వ్యసనాప్లుతుఁడు."

ఆఫీసు. ఆం. వి. కార్యస్థానము, కార్యాలయము.

ఆబ. దే. వి. 1. కంటిపాప; 2. కనురెప్పలవాపు. "వానియాబ లణఁగుటకు కంటిచుట్టు నల్లమందు గారవేసిరి." "వాని ఆబలణఁగ"అని తిట్టెను.(వానియాబ లణఁగెను. శ. ర.); 3. ఆత్రము, తిండి మొదలగువానిపై ఆశ, అత్యాశ. "ఆబచే పొట్టనిండుగ తినుచున్నాఁడు."

ఆబంధనము. సం. వి. అ. న. ఆబంధము, గట్టిగాఁ గట్టుట.

ఆబంధము. సం. వి. అ. పుం. 1. గట్టికట్టు; 2. పలుపు; 3. ప్రేమము; 4. ఆభరణము.

ఆబద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. బాగుగాఁ గట్టఁబడినది, దృఢబంధముగలది, 2. ప్రతిరుద్ధము, అడ్డగింపఁబడినది.—వి. అ. న. ప్రేమము.

ఆబాధ. సం. వి. ఆ. స్త్రీ. 1. దుఃఖము; 2. తాపత్రయము.

ఆబాధము. సం. వి. అ. పుం. = ఆబాధ.

ఆబిడ. దే. స. (ఆ+బిడ్డ.) ఆమె.

ఆబూతి. వై. వి. (సం. ఆభుక్తి) 1. మెనుతిండి; 2. తిండి.

ఆబూతికాఁడు. వై. విణ. తిండిపోతు, ఘస్మరుఁడు.

ఆబ్దికము. సం. విణ. (అ. ఈ. అ.) 1. సంవత్సరము నుండునది; 2. ప్రతిసంవత్సరమునను జరుగునది.

—వి. అ. న. ప్రతిసంవత్సరమును మృతతిథి నాఁడు పితృదేవతల నుద్దేశించి చేయు శ్రాద్ధము, ప్రాతిసాంవత్సరికము. ఆబ్దికము అని కొన్నిచోట్ల వాడుక; (స్మృతిశాస్త్రములఁ బ్రసిద్ధము.) సంవత్సరాంతమున చేసినకర్మము, ... అ. శ. ...

ఆభ. సం. వి. ఆ. స్త్రీ. మిక్కిలికాంతి, ప్రభ.

ఆభరణము. సం. వి. అ. న. భూషణము, తొడవు.

ఆభాషణము. సం. వి. అ. న. 1. ఆలాపము, ఒండు మాట; 2. పరస్పరము మాటలాడుట; 3. పలుకరించుట; 4. సంబోధనముగ పిలుచుట.

ఆభాష్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. పలుకరింపఁదగినవాఁడు, మాటలాడింపఁదగినవాఁడు; 2. సంబోధనచేయఁదగినవాఁడు; 3. పిలువఁదగినవాఁడు.

ఆభాసము. సం. వి. అ. పుం. 1. ప్రకాశము; 2. ప్రతిఫలనము, ప్రతిబింబము.—విశే.(అ.ఆ.అ.) వాస్తవము కాకపోయినను పయికి వాస్తవమయినదానివలెఁ గనఁబడునది. (హేతువు మొదలగునవి. ఈయర్థమున సమాసోత్తరపదముగా నుండును. "హేత్వాభాసము, విరోధాభాసము.")

ఆభిజనము. సం. విశే. (అ. ఈ. అ.) 1. వంశము నుండి వచ్చినది, వంశపరంపరగా వచ్చినది; 2. వంశసంబంధమైనది.

ఆభిజాత్యము. సం. వి. అ. న. (అభిజాతభావము.) 1. సత్కులమునఁ బుట్టుట; 2. పాండిత్యము; 3. సౌందర్యము; 4. అభిమానము. (వాడుక.)

ఆభిజితము. సం. విశే. (అ. ఈ. అ.) అభిజిన్నక్షత్ర సంబంధమైనది. "ఉ.... అష్టమిఁ, మిత్రముఖ గ్రహప్రతతి మేలుఁగ నాభిజితోదయంబునం, బుత్త్రుఁడు ధర్మవంశమునఁ బుట్టె నతిస్థిరధర్మమూర్తియై." భా. ఆది. ౫, ఆ. ౯౪.

ఆభిముఖ్యము. సం. వి. అ. న. అభిముఖభావము, అభిముఖుఁడగుట.

ఆభిరూప్యము. సం. వి. అ. న. సౌందర్యము.

ఆభిషేచనికము. సం. విశే. (అ. ఈ. అ.) రాజ్యాభిషేకమున కుపయోగించునది (ద్రవ్యము).

ఆభీక్ష్ణ్యము. సం. వి. అ. న. అభీక్ష్ణత్వము, విచ్ఛిత్తి లేకుండుట, ఎడతెగకుండుట.

ఆభీరపల్లి. సం. వి. ఈ. స్త్రీ. గొల్లపల్లె.

ఆభీరము. సం. వి. అ. పుం. ఒకానొక దేశము.

ఆభీరి. సం. వి. ఈ. స్త్రీ. 1. గొల్లది; 2. గొల్లవాని పెండ్లాము.

ఆభీరుఁడు. సం. వి. అ. పుం. 1. గొల్లవాఁడు; 2. చెంబడివాఁడు, బెస్తవాఁడు.

ఆభీలము. సం. వి. అ. న. బాధ.—విశే. భయంకరము.

ఆభుక్తి. సం. వి. ఇ. స్త్రీ. పెనుతిండి, ఆబోతి.

ఆభోగము. సం. వి. అ. పుం. 1. పరిపూర్ణత; 2. ప్రయత్నము; 3. పూర్ణముగా అనుభవించుట; 4. వరుణునిగొడుగు.

ఆభ్యుదయికము. సం. విశే. (అ. ఈ. అ.) వృద్ధినిమిత్తమైనది (కర్మము) అభ్యుదయము ప్రయోజనముగాఁ గలది.

ఆమండము. సం. వి. అ. పుం. ఆముదపుచెట్టు.

ఆమంత్రణ. సం. వి. ఆ. స్త్రీ. = ఆమంత్రణము.

ఆమంత్రణము. సం. వి. అ. న. 1. పిలుపు; 2. సంతోషపెట్టుట, అభినందనము; 3. కామచారానుజ్ఞతో (చేసిన చేయవచ్చు లేకున్న మానవచ్చును అనుభావముతో) కార్యమున నియోగించుట; (అవశ్యకకార్యమందు నియోగించుట నిమంత్రణము. ఆకార్యము చేయనిచోఁ బ్రత్యవాయము గలుగును); 4. వెడలిపోవునపుడు బంధుమిత్రాదులయనుజ్ఞ పొందుట, సెలవు పుచ్చుకొనుట; 5. పీడ్కొలుపుట.

ఆమంత్రణముసేయు. మి. స. క్రి. 1. సాగనంపు, వీడుకొలుపు. "వ... దామోదరుండు... నిజవిశ్వరూపప్రపంచంబు నుపసంహరించి మునీంద్రుల నామంత్రణంబు సేయ సమ్మహాత్ము లంతర్ధానంబు సేసిరి. దానును సముత్థానంబు సేసి... వెడలె." భార. ఉద్యో. 3, ఆ. ౪౧౧; 2. (ప్రయాణకాలమున) అనుమతి నొందు. (పాండునందనాదులు) "వ. ఇట్లు సని యమ్మహాదేవి (=ద్రౌపది) నామంత్రణంబు సేసి తత్పుత్రభృతిపుణ్యస్త్రీకరకలితలలితా

క్షతంబులు వైకొని విప్రాశీర్వాదంబు లాదరించుచు...వెడలునప్పుడు." భార. ఉద్యో. ౪, ఆ. ౧౧౯; 3. ఆమంత్రించు, వీడ్కొను. "వ...ధృతరాష్ట్రవిదురుల నామంత్రణంబుసేసి యద్దేవముని యంతర్ధానంబునొందె..." భార. ఉద్యో. ౨, ఆ. ౧౦౬.

ఆమంత్రించు. సం. స. క్రి. 1. ఆమతించు, పిలుచు; 2. వీడ్కొను, పోయివచ్చెదమని చెప్పి విడిచిపెట్టు. "వ. వివాహతిథి నేఁటికి నాలవనాఁడని ముహూర్తనిశ్చయంబు సేసి సారుంధతీకులై హిమాచలంబు నామంత్రించి చని." హర. ౪, ఆ. ౭౧.

ఆమంత్రితము. సం. విశే. (అ. ఆ. అ.) పిలువఁబడినది.

ఆమంత్రితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. పిలువఁబడినవాఁడు; 2. ఆమంత్రణము చేయఁబడినవాఁడు.

ఆమంత్ర్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. పిలువఁదగినవాఁడు; 2. ఆమంత్రణము చేయఁదగినవాఁడు.

ఆమడ. దే. వి. నాలుగుకోసులదూరము, యోజనము. "వ...అచటికి రెండామడయగు సరస్వతి...." భార. శల్య. ౧, ఆ. ౭౪.

ఆమతించు. వై. స. క్రి. 1. పిలుచు. "ఉ. రాజులఁ బిల్వఁబంపుము ధరాసురసంఘమునామతింపు..." భార. ఆర. ౬, ఆ. ౭౦; 2. సత్కరించు, పూజించు. "తే. ఓలిఁ దగుచోట్ల వారిఁ గూర్చుండఁబెట్టి, తమ్ములమ్ములు మంచిగంధములు జింక, పొక్కిలియుఁ గప్పురము గందవొడి మొదలగు, మంచి సరకులచే నామతించి యంత." అచ్చ. బాల. ౧౪౧; 3. అప్పనముసేయు. "మత్త. ఏమిచెప్పుదు మేము నీకు మునీంద్ర యిప్పుడు తండ్రి మ్మ్మామిషంబుగ నాఖగంబున కామతింపఁ దలంచి తాఁ, బ్రేమపంతుఁడు వోలె క్షుద్రతఁ బిల్చి యెంతయు మాగుణ, స్తోమముం గొనియాడి యిట్లను దుష్టనిష్ఠురభాషలన్." మార్క. ౧, ఆ. ౭౬.

ఆమతింపు. వై. వి. ఆమతించుట.

ఆమతిల్లు. వై. అ. క్రి. ప్రట్టు. "ఉ...ధావానలతెలంగ నిల్చి..." య. ౧, ఆ. ౩౧.

ఆమనస్యము. సం. వి. అ. న. 1. దుఃఖము; 2. ప్రసవవేదన, బిడ్డకట్టు.

ఆమని. దే. వి. 1. వసంతఋతువు. "చ...గుల్మి పడఁజేయు నామనిని రేయుఁబవల్ జడిఁ గూయుఁ గోయిలల్." క. సం. ౪, ఆ. ౧౮౬; 2. ఫలసమృద్ధి; 3. సమృద్ధి. "ఉ. ఆమని పేసి యామకొని యాపటఁ జేర్చి చెలంగు గోధన, స్తోమముఁ గొంచు." హరి. పూ. ౭, ఆ. ౯౧; 4. పంటయొబ్బిడిచేయించుట. "సీ....పంట యొబ్బిడిసేయించుపని వసంతమును విభాసిల్లుచుండు నామని యనంగ." ఆం. భా. ప్ర. నానా. ౫౧.

ఆమపాత్రము. సం. వి. అ. న. కాల్పని మృణ్మయపాత్ర.

ఆమము. సం. వి. అ. పుం. 1. రోగము; 2. రోగవిశేషము.—విశే. (అ. ఆ. అ.) 1. అపక్వము; 2. పచ్చిది.

ఆమయము. సం. వి. అ. పుం. రోగము, తెవులు.

ఆమయావి. సం. విశే. (న్. ఈ-నీ. న్.) ఆతురుఁడు, తెవులుగొంటు.

ఆమరణాంతికము. సం. విశే. (అ. ఈ. అ.) మరణము వఱకు నుండునది. (ప్రాయశ్చిత్తము; శిక్ష.మొ.)

ఆమర్షము. సం. వి. అ. పుం. 1. కోపము; 2. అసహనము; 3. మంచివివేకము.

ఆమలకము. సం. వి. అ. న. ఉసిరికకాయ. పుం. న. ఉసిరిక✿.

ఆమలకి. సం. వి. ఈ. స్త్రీ. ఉసిరిక✿.

ఆమవడ. వై. వి. (సం. ఆమ్లపటికా. మహా. అంబోడీ. క. ఆమవడె. త. ఆమవడై) పోచినపుల్లని పెరుగులో నానబెట్టిన మినుపవడ. మొ. "సీ....కలవంటకంబు లప్పడములు వడియంబు లతిరసంబులు వడ లామవడలు, పరమాన్నములు..." బ్రహ్మో. 3, ఆ. ౨౪౯. మజ్జిగపులుసులోనగువానియందు నానవేసినవడ. శ. ర.

ఆమశ్రాద్ధము. సం. వి. అ. న. భోజనమునకు మాఱు బియ్యము మొదలగు వండనిపదార్థము లిచ్చి యాచరించు శ్రాద్ధము.

ఆమానస్యము. సం. వి. అ. న. దుఃఖము.

ఆమాశయము. సం. వి. అ. పుం. దేహమందు నాభికిఁ బైస్థానమున తినఁబడినదియుండు పక్వముకాని యన్న పదార్థము ఉండు స్థానము.

ఆమి. వై. వి. 1. ఆమ. మదము; 2. గర్వము. "సీ...గర్వాయి మేనులు గర్వట్టులుండెడు గోకల మామిక లెంపఁ బొలసిపోయె." పా. పు. ౪౭.

ఆమిష. సం. వి. ఆ. స్త్రీ. పాలకూరచెట్టు, కోరిక.

ఆమిషము. సం. వి. అ. పుం. న. 1. మాంసము; 2. లంచము; 3. ఆహారము; 4. భోగము; 5. భోగించఁదగిన వస్తువు, భోగ్యవస్తువు. 6. యుద్ధమున జయించి తీసికొనఁదలఁచినవస్తువు, పణము. "చ...ఘనముగ నామిషంబుఁ గొని మార్గముపట్టిన తుచ్ఛసైన్యముల్, వెంట జని ముట్టి గోధనము గొని మల్లడముగాక." భార. విరా. ౪, ఆ. ౫౭. "క....అకటంబు గోవ్రజం గొనిపోయెనో పురి ఆమిషంబయిన యీసేనతో గని సేయంబడలేను..." భార. విరా. ౪, ఆ. ౨౫౦.

ఆమిషాశి. సం. విశే. (క్రి. ఈ-వి.న్.) మాంసము తిను వాఁడు.—వి. ఈ. పుం. రాక్షసుఁడు.

ఆమిషి. సం. వి. ఈ. స్త్రీ. జటామాంసి✤.

ఆము. వై. వి. 1. అమిక, మదము. "సీ. ఆము లేనుఁగు మోముసామి." వసి. ౧, ఆ. ౨. "వ. కమ్మఁదనంబు లీని ... ... ... నాముపలచున నుండును." భీమ. ౨, ఆ. ౫౩; 2. గర్వము, (గజ)మదోదకము. "చ. ఎనిమిదితావులందొడరి యేప్రగలెప్పుడు నాము జాఱఁగా, నెనయుచుఁ గెంపురేకలఁ బయింబొలుపొందఁగ నందు నేనుఁగుల్ తనరుచు నుండు నాకసముఁ దాఁకెడు నిక్కులఁ జూపఱబ్బురం, బన నెలయేర్లతోడ నడ యాడెడు శేగురుఁగొండలో యనన్." య. ౧, ఆ. ౭౩.

ఆముకపడు. దే. అ. క్రి. 1. మదించు, మద మెక్కు. "సీ. కాఱుపుల్ దిని యాముగవిసి మర్ పోతులు కాఱుపోతులనైనఁ గదియఁ జూచు." సా. ౧, ఆ. ౭౫; 2. మిక్కిలి క్రమ్ముకొను. "తే. అంతఁ బడమట నెఱసంజ యాముకవిసె, నళిని కనమూసె." రామా. ౬, ఆ. ౧౦౭.

ఆముకొను. దే. అ. క్రి. 1. మదించు. "ఉ. ఆమని మేసి యాముకొని యాదటఁ జేర్చి చెలంగు గోధన స్తోమము..." హరి. పూ. ౭, ఆ. ౯౧; 2. హెచ్చు, అతిశయించు. "ఆముకొన్న ప్రేమచే నలరుచునుండెను." క్షేత్రయ. శ. ౭; 3. కవియు, పైకొను. "కా. లేమా! లేమరులేమరల్పక విరాళిం దూలి నీమూర్ఖ్యదుర్దామునన్ గోముననాము కొంటినఁటనేతా నైహితాలాపముల్, ప్రేమం గోమలకోమలాక్షరముగాఁ జెక్కాడి సొక్కింప న్క్మాంమిం గామిని కామినీమనసిజుం గైకొంటి నాకౌఁగిటన్." కృ. శకుం. ౩, ఆ. ౯౨.

ఆముక్తమాల్యద. సం. వి. ఆ. స్త్రీ. 1. తాను ధరించినమాల్యమును దేవునకిచ్చిన భర్తరాలు. (చూడి కుడుత్త నాచ్చారి); 2. ఆమెచరిత్రముగల యాంధ్రప్రబంధము (కృష్ణదేవరాయరచితము.)

ఆముక్తము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కట్టఁబడినది; (వస్త్రము.) 2. తొడుగఁబడినది; (కవచము.) 3. ధరింపఁబడినది.

ఆముక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. ధరించుట; 2. (వస్త్రాదికము) కట్టుట.

ఆముఖము. సం. వి. అ. న. (నాటక) నటిగాని విదూషకుఁడుగాని పారిపార్శ్వకుఁడుగాని సూత్రధారునితో స్వకార్యవిషయములు సంభాషించుచుండఁగ ప్రకృతనాటకవిషయములను సూచించుట గల నాటకభాగము, ప్రస్తావన.

ఆముటేనుఁగు. దే. వి. మదపుటేనుఁగు. "ఉ. మించిన యాముటేనుఁగులమీఁదికిఁ జెంగున దాఁటి." య. ౨, ఆ. ౩౭.

ఆముత్రికము. సం. విశే. (అ. ఈ. అ.) పరలోక సంబంధమైనది.

ఆముదపుఁజెట్టు. దే. వి. ఏరండము✤.

ఆముదము. వై. వి. (సం. ఆమండః) ఏరండతైలము*.

బ. ఏరండబీజములు, ఆముదపువిత్తులు, ఆముదాలు.

ఆముష్మికము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పరలోక సంబంధమైనది; 2. పరలోకమందున్నది.

ఆముష్యాయణుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) 1. ప్రసిద్ధకులుఁడైన తండ్రివలనఁబుట్టినవాఁడు; 2. ప్రసిద్ధవంశమునఁబుట్టినవాఁడు.

ఆమూలము. సం. క్రి. విశే. అవ్య. మూలముట్టుగ, వేఱు మొదలుకొని, సమూలము.

ఆమూలాగ్రము. సం. క్రి. విశే. అవ్య. మొదటనుండి చివరదాఁక.

ఆమె. దే. స. వి. (ఆ+అమ.) 1. ఆస్త్రీ; 2. ఆ పూజ్యురాలు.

ఆమెత, వై. వి. 1. భోజనము. "క. విధుము సపిండీకరణమ్మున నేకోద్దిష్టమునను భోజనవిధి వర్జన మొప్ప నామతింపక, చనదా మెత గుడవఁబోవ సజ్జనవినుతా!" భార. అను. ౪, ఆ. ౧౨౫; 2. విందు. "వ....అనేక దేశాధీశులగురాజులు మహనీయులగు మహీదేవతలును నరుగు దెంచుచున్నారు. పెక్కు దినంబు లామెతలొనర్పవలసి యుండు...దధిక్షీరఘృతంబులు తెచ్చునట్లుగా నాజ్ఞాపింపుము." హరి. పూ. ౮, ఆ. ౭౪. "మ......కొనిరండా మెతకుఁ ఘృతప్రముఖముల్..." హరి. పూ. ౮, ఆ. ౧౪౪. "సీ.... పరిపరివిధంపు జన్నంపుఁబరికరంపు, సొంపు సంపద నిఖిలపిలింపసభయు, నప్పటప్పటికిని జిహ్వాత్రుప్పు డుల్ల, నా మెత లెటెం గె నీతుషారాద్రికతన." స్వా. ౨, ఆ. ౧౧. "తే. నేటి తుమ్మెదగములకా మెతలు వెట్టు." రసి. ౪, ఆ. ౧౫౪.

ఆమోచనము. సం. వి. అ. న. = ఆమోచము.

ఆమోదమానము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పరిమళించుచున్నది. "తే... దివ్యగంధ,మందగంధవహామోదమానకుసుమ,వృష్టియును." భార. ఆది. ౭, ఆ. ౨౮౭; 2. సంతోషించుచున్నది.

ఆమోదము. సం. వి. అ. పుం. 1. దూరముగా వ్యాపించెడు పరిమళము; 2. వాసన; 3. సంతోషము.

ఆమోది. సం. విశే. (న్. ఈ.నీ. న్.) 1. ఆమోదము గలది, సువాసనగలది; 2. ఆమోదించువాఁడు, సంతోషించువాఁడు.

ఆమోదించు. సం. అ. క్రి. 1. సంతోషించు, సంతసించు; 2. పరిమళించు.

ఆమ్నాతము. సం. విశే. (అ. ఆ. అ.) 1. బాగుగాఁ బఠింపఁబడినది (వేదము); 2. చెప్పఁబడినది.

ఆమ్నాయము. సం. వి. అ. పుం. 1. వేదము; 2. ఉపదేశము; 3. సంప్రదాయము; 4. బాగుగా పఠించుట; 5. కులమర్యాద జనశ్రుతి, అభ్యాసము.

ఆమ్రము. సం. వి. అ. పుం. చూతము, మామిడిచెట్టు.

ఆమ్రవణము. సం. వి. అ. న. చూతవనము, మామిడితోఁట.

ఆమ్రాతకము. సం. వి. అ. పుం. అంబాళము.

ఆమ్రేడించు. సం. అ. క్రి. ద్విరుక్తము. "వ...సంయమిస్వరతిలకంబులవిక స్వరస్వరంబుల నామ్రేడించు వేదమంత్ర పఠనంబులవలన.." పాం. ౪,ఆ. ౭౪.

ఆమ్రేడితము. సం. వి. అ. న. 1. రెండుమూఁడు పర్యాయములు చెప్పినమాట; 2. స్తుతించుట; 3. (వ్యాకరణమున) ద్విరుక్తముయొక్క పరరూపము.—విశే. (అ. ఆ. అ.) 1. రెండు మూఁడుమారులు చెప్పఁబడినది; 2. పలుమాఱు చెప్పఁబడినది, స్తుతింపఁబడినది. "ఉ....ఓజనసంఘములార సజ్జనా, మ్రేడితకీర్తి నిమ్ముని నమిత్రనిమూఢను నాశ్రయించెదఁ." భార. అర. ౪, ఆ. ౩౧౭.

ఆమ్లం. సం. వి. ఆ. స్త్రీ. చింత, తింత్రిణి.

ఆమ్లము. సం. వి. అ. పుం. 1. ఒకరసము, పులుసు; 2. పులితేఁపు.—విశే. (అ. ఆ. అ.) పులుపు రసముగలది, పుల్లనిది.

ఆమ్లలోణిక. సం. వి. ఆ. స్త్రీ. పులిచింత.

ఆమ్లవేతసము. సం. వి. అ. పుం. పుల్లప్రబ్బ.

ఆమ్లిక. సం. వి. ఆ. స్త్రీ. చింత.

ఆయక. దే. స. (ఆ+అక.) ఆకె. "క...ఆనారదుఁడట్లయగుదురని యాయకతోఁ." కళా. ౧, ఆ. ౬౮.

ఆయకట్టు. మి. గ్రా. వి. (ఆయము+కట్టు.) 1. కొంత ఆయము వచ్చుట కేర్పఱుపఁబడిన భూపరిమితి. "తే. సరవి గుడికట్టుగా చెంగసరసి వ్రాసి, యంత కములేసి కులవర్గు లాయకట్లు, దీర్చి దినవహీనపర గతి ప్రతీర, నారవణి నిర్ణయింప శేషాహి యతఁడు." హంస. ౪, ఆ. ౭౯; 2. కాలువ మొదలగువాని నీటిపాఱుదలకు నిర్ణయింపఁబడిన భూమి పరిమితి; 3. ధనమురాబడి యొక్క నిర్ణయము.

ఆయకము. దే. వి. కుసుమ, తాకట్టు, ఆధి.

ఆయకాఁడు. మి. గ్రా. వి. (ఆయకము+కాఁడు.) వస్తురాఁబట్టువాఁడు. పన్ను వసూలుచేయు కరణములోనైన పెద్దయుద్యోగస్థుఁడు.

ఆయగము. వై. వి. (క. ఆయగ. 1. ఖడ్గముష్టి, కత్తిపిడి. "వ....అనేకాలంకారాలంకృతుఁ జేసి, పసిఁడి యాయగంబుల నొఱయ సురగంబుగాఁ దొంగలి కట్టినసంగట్టి చెప్పుమిగులం బైకొనిన." హ. సం. ౯, ఆ. ౨౯; 2. గజాశ్వాదుల యలంకారవిశేషము. "సీ. ఘల్లుఘల్లనియాయగములు పల్లి యాయతముగా గజవాజివితతికిఁ బక్కెరలు నెఱయ." హ. సం. ౧౩, ఆ. ౩.

ఆయతచ్ఛద. సం. వి. ఆ. స్త్రీ. (పొడువైన యాకులుగలది) కదళి, అరఁటిచెట్టు.

ఆయతనము. సం. వి. అ. పుం. 1. ఇల్లు; 2. గుడి; 3. విశ్రమము; 4. స్థానము; 5. విశ్రమస్థానము; 6. యజ్ఞస్థానము.

ఆయతము. సం. విశే. (అ. ఆ. అ.) దీర్ఘము, నిడుపైనది.

ఆయతి. సం. వి. ఇ. స్త్రీ. 1. నిడుపు, పొడవగుట; 2. ప్రభావము; 3. రాఁగలకాలము; 4. వచ్చుబడి; రాబడి. "క. వినికి గలిగి రక్షించుచు, నను వున దయతోడి పాడి నాయతులెల్లన్, గొనుచుఁ బగసేలి పొగడొం,దెనరాజున కుర్వి గామధేనువు గాదే." భార. భీష్మ. ౧, ఆ. ౪౧.

ఆయతికాఁడు. మి. విశే. ధనార్జనముచేయువాఁడు. "వ...ధర్మజుండు ధనార్జనం బేమిటఁ బ్రస్ఫుటం బైనదగు నని యడిగిన నతనికి భీష్ముం డిట్లనియె. "క. ఆయతికాఁడు వలయుం నర,నాయకునకు." భార. శాం. ౨, ఆ. ౩౬౨, ౩౬౩. "ఉ.ఆయతికాని కీకు మమరాలయముఖ్యము లాతఁడర్థతృష్ణాయుతుఁడై నిజోర్వి నగు నష్టికిఁ దద్ధనముం దొరల్చి రాజ్యాయతనంబుఁ జేస్పు." ఆము. ౪, ఆ. ౨౧౮.

ఆయత్తపడు. మి. అ. క్రి. సిద్ధమగు, సిద్ధపడు. "ద్వి. మీకులం బెల్లఁ,బాయకరోషాగ్ని భస్మీకరింతు, నాయత్తపడియుండు మనిన." రం. రా. ఉ ౧౪౫౯.పు. "ద్వి. కాయంబు కడఁజేసి కన్నులు మూసి,యాయత్తపడియుండె నారాజసుతుఁడు." సా. ౭, ఆ. ౧౨. పు.

ఆయత్తము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అధీనము, అగ్గము, వశ్యము; 2. సిద్ధము.

ఆయత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. లోఁకువ; 2. ఎల్ల; 3. చెలిమి; 4. దినము; 5. సామర్థ్యము; 6. ప్రభావము; 7. ఉపాయము; 8. శయనము.

ఆయది. దే. స. (ఆ+అది.) అది.

ఆయన. దే. స. (ఆ+అన.) అతఁడు. "చ....ఆ, యన మెయిఁ బోయి హీనగతినైన ఘటించిన నెంత యొప్పునో." భార. ఉద్యో. 3, ఆ. ౪౧.

ఆయప. దే. స. (ఆ+అప.) ఆపె, ఆమె.

ఆయపఱచు. దే. స. క్రి. సాగుబడిచేయు.

ఆయమ. దే. స. (ఆ+అమ.) ఆమె.

ఆయమనము. సం. వి. అ. న. 1. దీర్ఘత్వము, పొడుపు; 2. పొడువైనదానినిగాఁ జేయుట; 3. నియమించుట.

ఆయము. ఉభ. వై.వి. జీవస్థానము, మర్మము. "తే.... అలుక యంతంత కగ్గలించి యాయముల్ నొంచి దోర్లీల నెఱపి." భార. విరా. ౨, ఆ. 3౪౭.
—సం. అ. పుం. 1. వచ్చుబడి, ఆదాయము. "ఆయవ్యయములు;" 2. రాజునకీయవలసినపన్ను.

ఆయలె. దే. అవ్య. (ఆ+ఆ+లెమ్ము. శ. ర.) అనాదరమును తెలిపెడిని. "చ. అలరెఁ బ్రియాళు వోర్తు ప్రియమాట వసంతముఁ బాడనప్పుడ, వ్వెలఁది సపత్నిభక్తికిని వేల్పులు మెత్తురుగాన రాగమన్, ఛలమునఁ దన్నుఁ బాడఁగ వసంతుఁడు తాదయ చేసెఁగాక యా,యలె నిజశక్తినాయనుచునాపస కుంగొదవెట్టెపేసునన్." ఆము. ౫, ఆ. ౧౩౩. ("ఆ,యెలె నిజశక్తినాయనుచు నీపసకుంగొద వెట్టె" అని వావిళ్ల ముద్రితపాఠము.)

ఆయల్లకము. సం. వి. అ. న. 1. తహతహ, ఉత్కంఠ. "ఉ...పుష్పదామముల్, పల్లవపాటలంబయిన పాణిసరోజమునన్ ధరించి యా, యల్లకతీవ్రసంజ్వరభరాలసకోమలగాత్రవల్లియై, యల్లన నేగుదెంచు కమలాననఁ జూచి విభుండు దవ్వులన్." నై. 3, ఆ. ౧౦౮. "వ. నీవల్లభుండు భవదాయల్లకభరంబునం బరితప్తుండగుచు,

నిన్ను వరియించుటకు నీకంటెను వేగురించునని తోఁచుచున్నయది." ప్ర. భా. 3, ఆ. ౧౧౯; 2. విరహము, ఎడఁబాటు.

ఆయవారము. వై. వి. యాయావరము, ముష్టి. (బిడి కెడు ద్రోసెడు చొప్పున బియ్యము, ధాన్యము, మొ. యాచించుట.) "ద్వి. పాయక పంచాంగ పఠనంబుఁ జేసి, యాయవారము లెత్తి యతిదైన్య వృత్తి." హరిశ్చ. ౨, భా. ౪౯౨.

ఆయసము. సం. వి. అ. న. ఇనుము.—విణ. (అ.ఈ.అ.) ఇనుపది. (కవచము మొదలయినది.)

ఆయస్తము. సం. విణ. (అ.ఆ.అ.) 1. కొట్టఁబడ్డది; 2. కోపమునొందినది; 3. త్రోయఁబడ్డది; 4. దుఃఖమునొందినది, ఆయాసము నొందినది; 5. వాఁడిచేయఁబడినది.

ఆయస్థానము. సం. వి. అ. న. 1. లాభము గలుగు స్థానము; 2. రాజులకు పన్నువచ్చెడిస్థానము. (గనిమొ. వి); 3. (జ్యోతి.) జన్మలగ్నము నుండి పదునొకండవలగ్నము.

ఆయా. హిం. వి. సేవకురాలు.

ఆయాతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వచ్చిన వాఁడు, ఆగతుఁడు.

ఆయానము. సం. వి. అ. న. ఆగమనము, రాక.

ఆయామము. సం. వి. అ. పుం. దైర్ఘ్యము, నిడుపు.

ఆయాసపడు. మి. అ. క్రి. (ఆయాసము+పడు.) శ్రమపడు.

ఆయాసపాటు. మి. వి. ఆయాసపడుట.

ఆయాసపెట్టు. మి. స. క్రి. (ఆయాసము+పెట్టు.) శ్రమపఱచు.

ఆయాసము. సం. వి. అ. పుం. 1. శ్రమము; 2. ఉత్సాహము, అతియత్నము; 3. అలసట; 4. కష్టము, కష్టదశ. "క....పనవా, సాయాసము నిస్తరించి...." భార. ఉద్యో. ౧, ఆ. ౨౬౦.

ఆయాసి. సం. విణ. (న్. ఈ-నీ. న్.) ఆయాసము గలవాఁడు.

ఆయి. సం. విణ. (న్.ఈ.న్.) ఆయముగలవాఁడు.

ఆయిటి. దే. వి. ఖారుగు ♆. "గీ. ఊఁతసీరుచెలఁది నేఁతమాటాయిటి, దూదియెండపసుపు తొట్టి యక్క, రంబు మేనుదీనిరహిఁబుణ్యమమ్ముట, కప్పు రంబు పెట్టియుప్పుగొనుట." ఆము. ౬. ఆ. ౬౮. (ఇట "పూఁతసీరు, ఈఁతసీరు" అని పాఠాంతరములు గలవు. "ఆయిటిదూది = ఎండకాలము గాలిలోనుంచిన దూది." అని వావిళ్ల ప్రతివ్యాఖ్య. ఇదియే యుచితము. 'చెలఁదినేఁతమాటాయిటి' వికసమాసముగా గ్రహించి చెలఁదిచేత మాటలో కట్టినదూది. అని వేదం వేంకటరాయశాస్త్రిగారి వ్యాఖ్య.

ఆయితపడు. దే. అ. క్రి. (ఆయితము + పడు.) సిద్ధమగు.

ఆయితపాటు. దే. వి. ఆయితపడుట, సిద్ధమగుట.

ఆయితపెట్టు. దే. స. క్రి. (ఆయితము + పెట్టు.) సిద్ధముచేయు. "సర్వము నాయితపెట్టి." విజ. ౨, ఆ. ౦౯.

ఆయితము. దే. విణ. సిద్ధము. "తే. ...వికచహృదయుఁడై తలచీర యాయితముచేసి...." భార. విరా. ౨,ఆ. ౩౨౩—వి. సిద్ధమగుట. "క. సమరమునకుఁ దగునుద్యోగమునఁ బ్రవర్తిల్లి చెలిమిఁ గౌంతేయులు మత్స్యమహీనాథుఁడు సన్నాహము సేసెక్ ద్రుపదవిభుఁడు నాయితమయ్యెన్." భార. ఉద్యో. ౧, ఆ. ౪౯.

ఆయిత్తపడు. దే. అ. క్రి. (ఆయిత్తము+పడు.) ఆయితపడు. "క. ...ఆయిత్తపడి వెస రెండను చున్." సా. ౧, ఆ. ౭౭.

ఆయిత్తపాటు. దే. వి. ఆయిత్తపడుట. "గీ. సేవకులకు, విష్ణుసారూప్యసౌభాగ్యవిలసనంబు, లెప్పుడపుడె సృజింపనాయిత్తపాటు, వెలయనున్నది." పర. ౨, ఆ. (శ. ర.)

ఆయిత్తము. దే. విణ. ఆయితము, సిద్ధము.

ఆయుగము. వై. ఆయగము.

ఆయుధజీవి. సం. విణ. (న్. ఈ. న్.) ఆయుధము చేత జీవించువాఁడు, యోధుఁడు.

ఆయుధము. సం. వి. అ. పుం. న. శస్త్రము, ఖడ్గాది యుద్ధసాధనము (ఇది త్రివిధము:—1. ప్రహారణము = చేతనుంచుకొనియే ఇతరులను కొట్టు సాధనము, కత్తి, ఈటె మొ.; 2. హస్తముక్తము=చేతితో విడువఁబడినది. (చక్రము మొ.); 3. యంత్రముక్తము. (బాణము మొ.)

**ఆయుధి.** సం. విణ. (గీ. ఈ. గీ.) ఆయుధముగలవాఁడు, ఖడ్గధారి.

**ఆయుధికుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) ఆయుధముచేత బ్రదుకువాఁడు, యోధుఁడు.

**ఆయుధీయుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) = ఆయుధికుఁడు.

**ఆయుర్దాయము.** సం. వి. అ. పుం. **1.** (జ్యోతి.) సూర్యాదిగ్రహములు ఆయుస్సు నిచ్చుట; **2.** ఆయుస్సు, జీవితకాలము. (ఇది వ్యవహారము.)

**ఆయుర్వేదము.** సం. వి. అ. పుం. వైద్యశాస్త్రము, చికిత్సదెలుపుశాస్త్రము.

**ఆయుర్వేది.** సం. విణ. (గీ. ఈ. గీ.) ఆయుర్వేదము తెలిసినవైద్యుఁడు.

**ఆయువు.** సం. వి. స్. న. ఆయుస్సు, జీవితకాలము.

**ఆయుష్కరము.** సం. విణ. (అ. ఈ. అ.) ఆయుస్సును వృద్ధిచేయునది.

**ఆయుష్కర్మము.** సం. వి. అ. న. **1.** ఆయుష్కరమగు కార్యము; **2.** క్షౌరము, మంగలిపని. (వాడుక).

**ఆయుష్మంతము.** సం. వి. త్. పుం. ఒకగ్రహయోగము.—విణ. చూ. ఆయుష్మంతుఁడు.

**ఆయుష్మంతుఁడు.** సం. విణ. (త్. ఈ-మతీ. త్.) ఆయువు గలవాఁడు, చిరంజీవి, చిరకాలము బ్రదుకువాఁడు.

**ఆయుష్యము.** సం. వి. అ. న. ఆయువు. — విణ. (అ. ఆ. అ.) ఆయువునకు హితమైనది; ఆయువు నిచ్చునది.

**ఆయుస్సు.** సం. = ఆయువు.

**ఆయోగము.** సం. వి. అ. పుం. **1.** గంధమాల్యముల కానుక; **2.** తెలివి; **3.** వ్యాపారము; **4.** మంచి సంబంధము.

**ఆయోగవుఁడు.** సం. వి. అ. పుం. వైశ్యస్త్రీయందు శూద్రునకుఁ బుట్టినవాఁడు.

**ఆయోజితము.** సం. విణ. (అ.ఆ.అ.) **1.** కూర్పఁబడినది, సంపాదింపఁబడినది. (కుసుమాయోజిత కార్ముకము); **2.** తీసికొనిరాఁబడినది.

**ఆయోధనము.** సం. వి. అ. న. **1.** యుద్ధము; **2.** యుద్ధస్థానము; **3.** వధము.

**ఆర.** ఉప. దే. అప. సంబోధనమునందు బహువచన స్థానమున వచ్చెడి యాగమము. "ఓజనులార! వినుఁడు." —ద్రు. అవ్య. ఆరుధాతువుక్త్వార్థక రూపము. చూ. ఆరు.—సం.వి. ఆ. స్త్రీ. మాదిగవానిసూది, ఆరె.

**ఆరంగపువక్క.** దే. వి. ఒకరకము వక్క.

**ఆరంజోతి.** వై. వి. (సం. అరుంధతీ) **1.** అరుంధతీదేవి; **2.** అరుంధతీనక్షత్రము. "క. చీరచెఱంగులఁ ముడియిడి, కూరిమిచిటికెనలుపట్టికొనఁగ నూరిచి తా, రారంజోతిని గనుమని, పారఁగ మ్రొక్కించిరప్పుడాలికి మగనికి." నీలా. 3, ఆ. ౧౫.

**ఆరంభకుఁడు.** సం. విణ. (అ. ఆ-భికా. అ.) ఆరంభించువాఁడు.

**ఆరంభణము.** సం. వి. అ. న. = ఆరంభము.

**ఆరంభణీయము.** సం. విణ. (అ. ఆ. అ.) ఆరంభింపఁదగినది.

**ఆరంభము.** సం. వి. అ. పుం. **1.** ప్రయత్నము; **2.** ఉపక్రమము, మొదలు; **3.** ప్రస్థాపనము, ప్రారంభము; **4.** గృహాదిసంపాదన వ్యవహారము; **5.** త్వర; **6.** గర్వము; **7.** వధము; **8.** సంకల్పము. "క. మీరేమిసేయుదురు దైవారంభము గాక శుభము నశుభంబును సంసారులఁ దనలనకటి నని, వారణఁ బొందంగ మాన్పవచ్చునె దానిన్." భార. విరా. ౨, ఆ. ౨౨౭. ఇట ప్రయత్నమనియు ననవచ్చును; **9.** సస్యము, ఆరబము. (ఇది ఆరబము అనువ్యావహారికపదమును ఆరంభము అని వాడి యాయర్థమున గ్రహించి యుందురు.)

**ఆరంభించు.** సం. అ. క్రి. ప్రారంభించు, యత్నించు, కడఁగు, మొదలుపెట్టు, ఉపక్రమించు.

**ఆరకాటి.** దే. వి. ఓడనడపువాఁడు, నావికుఁడు.

**ఆరకూటము.** సం. వి. అ. పుం. న. ఇత్తడి.

**ఆరక్ష.** సం. వి. ఆ. స్త్రీ. రక్షణము.

**ఆరక్షము.** సం. వి. అ. పుం. **1.** రక్షణము, కాపాడుట; **2.** (రక్షించునది) సేన; **3.** ఏనుఁగుకుంభముల క్రిందిచోటు; **4.** గజకుంభములసంధి. —విణ. (అ. ఆ. అ.) రక్షించునది.

ఆరక్షుఁడు. సం. వి. అ. పుం. తలారివాఁడు, గ్రామ రక్షకభటుఁడు.

ఆరగించు. వై. స. క్రి. (ఆహరించు) 1. భుజించు. "తే...చతుర్విధహృద్యాన్న మారగించె." భార. ఉద్యో. ౩, ఆ. ౨౮౯; 2. త్రాగు. "చ. మును జనస్తనంబులకు మోపఁగ వ్రేఁగయి యున్న యట్టి య,వ్వనుతపయస్సులన్నియును వేడుకతోఁ గడు పార నారగించినఁ బ్రియమంది నందసతి చెక్కు లు నక్కను మస్తకంబు మూ,ర్కొనుచును ముద్దులాడి మఱి కొండొకసేపునకుం బ్రియం బునన్." హరి. పూ. ౫, ఆ. ౨౪౦. "సీ.ఎవ్వరు జలదాతలిలమీఁదనాఘనుల్ క్షీరపూరములార గింతురచట." శేష. ౩. ఆ. శ. ర.

ఆరగింపు. వై. వి. 1. ఆహారము, భోజనము. "గీ. ఇతఁడు పెక్కేండ్లఁబట్టియో యిందువదన, వైష్ణవసహ స్రమునకు నన్వహము నార, గింపు సేయించికాని భుజింపనొల్లఁ, డాత్మసతియును దాను నేమని నుతింతు." పర. ౪, ఆ, ౧౯౯. (ఇంప్వంతము ప్రాచీనకవిసమ్మతము కాదు. అని శ. ర.); 2. దేవతకు అన్నాదులు నివేదనము చేయుట, నైవేద్యముచేయుట అని వాడుక.

ఆరగ్వధము. సం. వి. అ. పుం. ఱేలచె. న. ఱేలపండు.

ఆరఘట్టము. సం. వి. అ. పుం. కపిల, నూతినుండి నీళ్లు పైకితోడుట కేర్పఱచినయంత్రము, ఏతము.

ఆరజము. సం. వి. అ. పుం. వాద్యవిశేషము. "చ. కొలఁదికి మీఱఁగానమరుగోముఖడిండిమమడ్డు శంఖకా,హళమురళీమృదంగపణవానకదుందుభిఢక్కకాంస్యమ, ర్దళమురజారజాదివివిధధ్వను లేపున భూనభోంతరం,బులఁ జెలఁగన్." భాగ. ౧౦, స్కం. ఉ. ౧౧౦౦. "ఉ. సంచితభూరిబాహు బలసంపదపెంపున నారజంబు వా,యించి యనేకభంగుల నుమేశుఁ ద్రిలోకశరణ్యు నాత్మ మె,చ్చించి ప్రమోదియై నిజవశీకృతనిశ్చలితాంత రంగుఁ గా,వించి తదాననాంబురుహవీక్షణుఁడై తగ మ్రొక్కి యిట్లనున్." భాగ. ౧౦, స్కం. ఉ. ౩౧౪. (ఈపదప్రయోగమపూర్వము, ఇంకను విచారింపఁదగినది. అని శ. ర. ఇది సంస్కృతనిఘంటువులందుఁ గానరాదు. దేశవ్యవహారమున నున్న వాద్యము పేరు కావచ్చును. తాలవ్యాత్వసహితముగా సంజ్ఞావాచకమగుట చే సంస్కృతసమాసమధ్యమున వాడియుండును.)

ఆరజము. దే. వి. 1. ఇంపు. "గీ. ప్రస్ఫుటచిహ్నం బులవఘనవంబునఘటింప, సిగ్గువడఁగాని కేరడఖరీఖరలసిత, జాతనూత్న క్షతాంకముల్ సమ్మతించు నారజము మీఱియాడుర్వహారహారి." పాండు. ౩, ఆ. ౧౭; 2. కలధ్వని. "గీ. పావురములారజం బులు పలుకుచోట." స్వా. ౩, ఆ. ౧౧౧; 3. శృంగారచేష్ట, విలాసము, కులుకు. "ఉ....ఆరజ ముట్టిపడన్ మెలంగుచున్." శుక. ౭,ఆ.౧౬౦. "తే. ప్రథమసంగమకేళి నప్పటికినంత ముగ్ధయని పించి కిదప నమ్మోహనాంగి, జాతివారాంబుజేక్షణల్ సైరమింత, నేరరసికించెఁ గలయికయారజ జములు." శుక. ౪, ఆ. ౨౬.చూ. ఆరజము.— విశే. 1. కలము, అవ్యక్తధ్వని గలది. "రగడ. ఇంతి పావురపురొద యేల వినెదారజము." స్వా. ౩, ఆ. ౬౪; 2. మనోజ్ఞము, అందమైనది. "సీ.హైక సడల్చియారజపుఁబైఁట ఘటించి యది మేలో యిది మేలో యనుచునడుగు." శశాం. ౨, ఆ. ౬౧. "తే. ఆత్తెఱంగున నదికి పాటార జంపు,పన్నెఁబోవకట్టి తాఁ బాడుసన్నరపళి, పాట లళిఝంకృతిశ్రుతిఁ బాడుకొనఁగ..." స్వా. ౬, ఆ. ౩౭.

ఆరటపడు. దే. అ. క్రి. (ఆరటము+పడు.) వందు, పరితపించు.

ఆరటపాటు. దే. వి. ఆరటపడుట, సంతాపము. "క.... ..అని పలికె మనసు చుఱ్ఱుమనంగన్. ఉ. ఆవ్వచనంబు చిత్తమున నారటపాటొదవింప నెంతయున్, నివ్వెఱఁగంది యొండుపమనేఱక యూఱకయుండె." వి, పు. ౭, ఆ. ౯.

ఆరటపెట్టు. దే. స. క్రి. (ఆరటము + పెట్టు.) పరితపింపఁజేయు. "చ. అని పలుమాట లాడుట యు నమ్మను జేంద్రుసితోడ నాకఁ డిట్లను నిష మెత్తి క్రోలి యది యంగము నారటపెట్ట నన్యు లం, గినిసినయట్లు మీఁదు పరికింపక యమ్మెయి నీవు పాండునం, దనులకుఁ జెట్టవై హృదయతాపము వచ్చినఁ బల్కె దొండులన్." భార. ద్రో. ౪, ఆ. ౨౦౯.

**ఆరటము.** దే. వి. వంత, సంతాపము, బాధ. "తే. విగ్రహంబునఁ దాపఁ గార్కొఁ గాళికటె యనా కరమై దీనికి నంతరంగ, మఱుఁగుచేఁ దల్లడిల్లక యారటమున, నుడుక కొలుపుటఁబడకె యెట్లుఁ జెప్రుము." భాగ. అష్ట. ౭, ఆ. ౧౬౩. "క... పటునఖరశైత్యమున నారటముడిగె నురగి రేఁలు రసికు నృసింహుఁడాక." పాండు. ౫. ఆ. ౨౭౩.

**ఆరటించు.** దే. అ. క్రి. ఆరటపడు, పరితపించు. "ఆపద్రాగినవానికరణి నారటించుచు." సా. ౩, ఆ. ౨౯.

**ఆరట్టజము.** సం. విశే. (త్రి. ఆ. అ.) ఆరట్ట దేశమునఁ బుట్టినది.—వి. అ. పుం. ఆరట్టదేశపుగుఱ్ఱము.

**ఆరట్టము.** సం. వి. అ. పుం. హిందూదేశముయొక్క పశ్చిమోత్తరమునందు దేశవిశేషము. శ. ర. పంజాబులో ఉత్తరపూర్వదిక్కునఁ గలదేశము. (రాపన్స్టెండిలోని ప్రజలువారి దేశమును అయిర ట్టదేశమని వారిడిపడు) అని అప్టేనిఘంటువు; 2. ఆరట్టదేశపుగుఱ్ఱము. (ఇందు ప్రశస్తమగుగుఱ్ఱములు పుట్టును.)

**ఆరడము.** దే. వి. పూనిక, ఉత్సాహము. "క. వెలివాఱును గాలురులును, వలలుం జెరలుదీమములు నుపడేఁ దీసినకు, క్కలునాలెగోలలును నుం, డల క్రోవులు వేఁటకాడంబులు పెనుపఱ." ఉ. హరి. ౪, ఆ. ౭౭.

**ఆరణాలు.** వై. వి. బ. ఆరణ్యకములు, వేదమందలి భాగములు. అవి అరణ్యమందు పఠింపఁదగినవి. "సీ. త్రిపరకాస్వాదభవమదోద్రేకలహరి, ధరణి దేవుఁ డామోజ మత్తావహించి, యారణాలు పఠింపంగ నాలకించి, శంబరారాతి రతి చేయి చఱచి నవ్వె." శివరా. ౩, ఆ. ౧౪.

**ఆరణ్యకము.** సం. విశే. (అ. ఈ. అ.) 1. అరణ్యమునఁ బుట్టినది; 2. ఆరణ్యసంబంధమైనది. (అధ్యాయ, మనుష్య, న్యాయ, పథి, విహార, హస్తిపదములకు విశేషణమగునప్పుడు ఈరూపము వచ్చును. తదితరములకు విశేషణమగునపుడు ఆరణ్యమని రూప ముండును.—వి. అ. న. అరణ్యమునఁ బఠింపఁ దగిన వేదభాగము. (తైత్తిరీయారణ్యకము మొ.)

**ఆరణ్యకుఁడు.** సం. వి. అ. పుం. అరణ్యమందుండు వాఁడు, అరణ్యనివాసి. (ఆరణ్యకోపాత్తఫల ప్రసూతి.)

**ఆరణ్యము.** సం. విశే. (అ. ఈ. అ.) 1. అరణ్యమునఁ బుట్టినది. (వ్యతిరేకము గ్రామ్యము. ఆరణ్యపశువులు >< గ్రామ్యపశువులు) చూ. ఆరణ్యకము; 2. అరణ్యమున నుండునది, అరణ్యసంబంధమైనది. (ఆరణ్యపర్వము = అరణ్యమున జరిగిన భారతకథను తెలుపుభాగము. ఆరణ్యకాండము= అరణ్యమునఁ జరిగినరామాయణకథను తెలుపు భాగము.—వి. అ. న. అడవిసస్యము, విత్తులు చల్లకయే మొలచు సస్యము (నీవారిధాన్యాది.)

**ఆరతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉపరతము; 2. విరతము, ఉడిగినది.

**ఆరతి.** ఉభ. వై. వి. హారతి, నీరాజనము. "ఉ. ఆదరణీయరామకథనాంకశుకోక్తులతోడఁ దీపము, త్తై దువచాలు శోభనపుటారతులెత్తె సదాగతిం గిరి, క్షోదవినోదికిం జిగురుజొంపపుఁ గెంపులపళ్లెరంబులం, బ్రోడిఁ దనర్చునగ్గలపుమొగ్గలు ముత్తెపు ముగ్గలీనఁగన్." వసు ౧, ఆ. ౧౧౩.—సం. వి. ఇ. స్త్రీ. విరతి, ఉడుగుట, నివృత్తి.

**ఆరనాళకము.** సం. వి. అ. న. కాంజికము, పులియఁ బెట్టిన కడుగునీళ్లు, కలి.

**ఆరనాళము.** సం. = ఆరనాళకము.

**ఆరబము.** వై. వి. 1. తొలకరిపైరు; 2. పైరు. "శా...ఆకీడునకా వానల్ కల్గకమానె నారబము లెండంజొచ్చె..." వి.పు. ౨, ఆ. ౧౦౬. "తే.... వరపుదోసంబు వాయంగ వానఁ గురియుఁ గొండ్ర లంబండు నారబకోటులెల్ల." ఆరబకోటులు—మిశ్రసమాసము. భీమ. ౩, ఆ. ౧౪౩.

**ఆరబ్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆరంభింపఁబడినది; 2. యత్నింపఁబడినది.

**ఆరబ్ధవ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రారంభింపఁదగినది.

**ఆరభటము.** సం. వి. అ. పుం. 1. ఆటోపము, దిట్టతనము; 2. ధైర్యము. (ఆర్భాటమునకు మొదటి రూపము కావచ్చును.) ప్రయోగ. శ. ర.

ఆరభటి. సం. వి. ఈ. స్త్రీ. 1. కావ్యవృత్తులలో నొకటి; 2. ప్రౌఢి, దిట్టతనము; 3. మ్రోఁత. శ. ర.

ఆరభటుఁడు. సం. వి. అ. పుం. ధీరుఁడు, దిట్టరి.

ఆరభి. సం. వి. ఇ. స్త్రీ. (సంగీత) ఒకరాగము.

ఆరభ్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) ఆరంభింపఁబడుచున్నది. "సీ. అనఘు వేదాధ్యయనాసక్తు నారభ్యమాణ మహాధ్వరు మనుచరిత్రు......" భార. ఆది. ౫, ఆ. ౯౭.

ఆరభ్యము సం. = ఆరంభణీయము.

ఆరయు. దే.స. క్రి.=(అరయు.) 1. వెదకు. "ఉ.అంబురుహంబులం గలయ నారసి చొచ్చి యొకండు నాళసూత్రంబున నున్నయిుద్రుఁ గని." భార. ఉద్యో. ౧, ఆ. ౧౯౫; 2. విచారించు, ఆలోచించు. "ఉ...భూవర రెండు తెఱంగులందు నీ, కారయఁ బథ్యమేది యగు నవ్విధ మేర్పడ నిశ్చయింపుమా." భార. ఉద్యో. 3, ఆ. ౨౮౪; 3. తెలిసికొను, గ్రహించు. "తే. ఇందు సుఖముండితిమి యొరు లెఱుఁగకుండ, నేలొకో యిప్పుడీవిప్రునింట నార్తరవము వీతెంచె దీని నారసి యెఱుంగ, వలయుఁ దత్ప్రతీకారంబు వలయుఁ జేయ." భార. ఆది. ౬, ఆ. ౨౪౨; 4. చూచు; 5. రక్షించు, కాపాడు. "క. జయ నీచే నుత్పాదితు, లయినసుతులు దన్మెఱుంగునంతకు భీష్ముం, డయనయశాలి సమర్థుం, డయి చేకొని రాజ్యభార మారయుచుండున్." భార. ఆది. ౪, ఆ. ౨౫౧.

ఆరవము. సం. వి. అ. పుం. నినదము, మ్రోఁత, ధ్వని.

ఆరాటము. దే. వి. ఆరటము, సంతాపము. "శా.... ఆరాటముం, బోరాటంబు ఘనంబులైన." కాశీ. ౪, ఆ. ౫౧.

ఆరాటించు. దే. అ. క్రి. సంతాపపడు, తపించు. "మ....బొప్పుపూరము లొక్కుమ్మడిఁ గన్నులం దొరఁగనారాటించుచున్."వి, పు.౧, ఆ. ౧౪౭.

ఆరాత్. సం. అవ్య. సంస్కృతసమాసమునఁ బూర్వపదముగానే యుండును. 1. దూరము, వ్యవధానమున, పరంపరగా. "వ. శ్రీశైలకటకంబునందు సకలతీర్థంబులం గాశీప్రాపణద్వారంబున నారాదుపకారకంబులై మోక్షంబు నిచ్చు, కాశి యవ్యవధానంబునమ ముక్తి నిచ్చునను నర్థంబు జెటకుఁజెచె." కాశీ. ౪, ఆ. ౨౦౦; 2. సమీపమున; 3. అవ్యవధానమున.

ఆరాత్రికము. సం. వి. అ. న. నీరాజనము, ఆరతి.

ఆరాధకుఁడు. సం. విణ. (అ. ఆ-ధికా. అ.) ఆరాధించువాఁడు.

ఆరాధన. సం. వి. ఆ. స్త్రీ. = ఆరాధనము.

ఆరాధనము. సం. వి. అ. న. 1. ఆరాధించుట; 2. సంతోషింపఁజేయుట; 3. ప్రాప్తి; 4. వంట.

ఆరాధనీయము. సం. విణ. (అ. ఆ. అ.) ఆరాధింపఁదగినది.

ఆరాధయిత. సం. విణ. (ఋ.ఈ-త్రీ.ఋ.) (ఆరాధించువాఁడు.) 1. పూజించువాఁడు; 2. పరిచారము చేయువాఁడు; 3. సేవించువాఁడు; 4. సంతోషపెట్టువాఁడు.

ఆరాధయితవ్యము. సం. = ఆరాధనీయము.

ఆరాధించు. సం. స. క్రి. 1. సంతోషపఱచు; 2. పూజించు; 3. సేవించు.

ఆరాధితము. సం. విణ. (అ. ఆ. అ.) ఆరాధింపఁబడినది.

ఆరాధ్యము. సం.విణ. (అ.ఆ.అ.) ఆరాధింపఁదగినది.

ఆరామము. సం. వి. అ. పుం. ఉపవనము, ఉద్యానము, తోఁట.

ఆరామికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ఆరామమందు నియోగింపఁబడినవాఁడు, ఉద్యానవనాధికారి.

ఆరాముఖము. సం. వి. అ. న. బాణవిశేషము, ఆరెగోల.

ఆరాళికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) 1. వంటవాఁడు, బానసీఁడు; 2. కుటిలుఁడు.

ఆరావము. సం. వి. అ. పుం. ధ్వని, మ్రోఁత.

ఆరావి. సం. విణ. (న్. ఈ-ణీ. న్.) బిగ్గరగా ధ్వనిచేయునది.

ఆరిందా. హిం. వి. 1. పెద్దమనుష్యుఁడు; అనుభవముగలవాఁడు "అతఁడు వ్రాఁతలో ఆరిందా" "ఆరిందా కొలగాఁడు." (మూఁటలు మోయువాఁడు, ఆడితిదారుఁడు. అని శ. ర.)

ఆరుఁడు. సం. వి. అ. పుం. 1. అంగారకుఁడు; 2. శని.

ఆరుగ. దే. వి. సస్యవిశేషము. "క. ఉఱకగు నారుగపంటలు, గొఱియలపాఁడియును దఱచగుం బురుషులకుం, దెఱవలు సుట్టము లయ్యెద, రెఱచియు భుజియింతు రర్థి నెల్లజనంబుల్." భార. అర. ౪, ఆ. ౨౯౫. ("అరికెపంటలు" అని పాఠాంతరము.) "ఆరుగన్నునుజిత్తమల రెడు." రసి. ౧, ఆ. ౪౮.—బ. వ. ఆర్లు. ధాన్యవిశేషము, (అరిక, అరికె అని కొన్నిచోట్లఁ గలదు. "అయితే ఆరుగ కాకపోతే కంది" అని సామెత. ఆరుగయు కందియుఁ గలిపి చల్లెదరు. బయలుదేరినచో ఆరుగయే బయలుదేరును. లేనిచో కంది తప్పక బయలుదేరును. రెండు పంటలకు యత్నించి యేదియో యొకటి యైనను ఫలించినఁ జాలునని సంతృప్తిపడుట తెలుపఁబడును.)

ఆరుచు. దే. స. క్రి. అనుధా. ప్రే. 1. ఆడించు; "క. ఏలినవానిధనంబులు, బాలురు బంధువులుఁ దారు బ్రదికినదినముల్, వేలారిచి తింద్రాకని, యోలము గని పిదప భీతినొందుఁగుదు రాజిన్." భార. విరా. ౪, ఆ. ౨౧౭. (అనుధాతువు మరొకదానిపై అనుప్రయుక్తమైనపుడును ప్రేరణమున ఈ రూపమునొందును); 2. విసరు. (చూ. ఆర్చు మూఁడవ అర్థము.

ఆరుదూఱు. దే. వి. అల్లరి. "ఆరుదూఱుచేసినన్నల యించిన మంచిదే." క్షేత్రయ. ౧౪౨. పుట.

ఆరుదొండ. దే. వి. తుజాలకము⚘.

ఆరుద్ర. వై. వి. (సం. ఆర్ద్రా) ఆర్ద్రానక్షత్రము.

ఆరుద్రపురుగు. వై. వి. ఇంద్రగోపము. ఎఱ్ఱనిపట్టువలెనుండి వర్షాకాలమున బయలుదేరు పురుగు. ఆరుద్రకార్తెలో పుట్టుటచేనట్లు వ్యవహరింపఁబడియుండును. "ఆర్ద్రము అనుపదము ఆరుద్ర అని అయినట్టు తోఁచుచున్నది." అని. శ. ర. ఆర్ద్ర ఆరుద్రగా అయియుండును.

ఆరుపోరు. దే. వి. ఎడతెగనికలహము.

ఆరురుక్షువు. సం. విణ. ఉ. 1. ఎక్కనిచ్ఛగలవాఁడు; 2. మోక్షమునిచ్ఛగలవాఁడు; ఆరూఢావస్థను పొందఁదలఁచినవాఁడు.

ఆరుషేయము. వై. విణ. ఆర్షేయము. (ఋషులు చెప్పినది.) "ద్వి. ఋషి ప్రోక్తమంత్రంబులో యారుషేయకవితలో ప్రతీక్షకలిత వాక్యములో." పండి. మహిమ. ౨౮౬-పు. (ఆరుషేయకవిత—వైరిసమాసము.)

ఆరూఢము. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఎక్కినది; 2. కలిగినది, ఉత్పన్నము.—వి. అ. న. 1. ఎక్కుట, ఆరోహణము; 2. ఏనుఁగుమొదలగువానిపై నెక్కుట. "క. ఘోరాస్త్రశస్త్రవిద్యల, నారూఢములందు నిపుణులైరి కుమారుల్..." భార. ఆది. ౬,ఆ. 3; 3. (జ్యోతి.) ఆరూఢచక్రము.

ఆరూఢి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఆరోహణము, ఎక్కుట; 2. ప్రసిద్ధి. "క. శ్రీరామునిదయచేతను,నారూఢిగ సకలజనులు నౌరా యనఁగా, ధారాళమైన నీతులు,నోరూరఁగఁ జవులుపుట్ట నుడివెద సుమతీ." సుమతి. ౧.

ఆరె. దే. వి. ధాతకి⚘. —వై. 1. చెప్పులుకుట్టెడు సూది. "ద్వి. కాళ్లచెప్పులు ముమ్మగ్రక్కనఁ దివిచి, సెరివినదదె చూడు సెంబళికోల, నరుగుపై నదె చూడు మాఱెయుఁ గత్తి, యదె చూడు వారెనలాచిల్కకొయ్య." పండి. దీక్షా. ౪౨-పు; 2. బాణవిశేషము. "వ. పేరెలమిం దలపడిన వీరుల నారెలం జిఱి నాఱులుఁబోసినట్లు చేసియు." ఉ. హరి. ౬, ఆ. ౬౬; 3. ఆరెబొట్టె. "క. చరణములు నేత్రములుఁ గడు, నరుణము లారెలును ముక్కు నాయతములు కంధరములు దొడలును సన్నము, లరయఁగ నొకజాతి కవి భయంపడుఁ బోరన్." దశ. ౯, ఆ. ౩౦.— విణ. మహారాష్ట్రదేశపువాఁడు. "సీ. మానిసి మనిసి నా మనుజసామాన్యంబు మందియం చనదగు మమ జవికతి, యారె మరాటివాఁ డన మహారాష్ట్రుఁడౌ..." ఆం. భా. ద్వి. మ. ౧౦౩.

ఆరెకుఁడు. వై. వి. (సం. ఆరక్షి) 1. తలారి, ఆరక్షుఁడు. "వ. ...రాజునర్థంబు ముచ్చిలికొని, ముచ్చులారెకులచేత ననుధావ్యమానులై మాండవ్యుసమీపంబునం బాఱి. ..." భార. ఆది. ౪, ఆ. ౨౬౨.

ఆరుఁడు. సం. వి. అ. పుం. 1. అంగారకుఁడు; 2. శని.

ఆరుగ. దే. వి. సస్యవిశేషము. "క. ఉఱవగు నారుగపంటలు, గొఱియలపాఁడియును దఱచగుం బురుషులకుం, దెఱవలు సుట్టము లయ్యెద, రెఱచియ భుజియింతు రర్థి నెల్లజనంబుల్." భార. ఆర. ౪, ఆ. ౨౯౫. ("ఆరికెపంటలు" అని పాఠాంతరము.) "ఆరుగన్ను నుజిత్తమల రెడు." రసి. ౧, ఆ. ౪౮.—బ. వ. ఆర్లు. ధాన్యవిశేషము, (ఆరిక, ఆరికె అని కొన్నిచోట్లఁ గలదు. "అయితే ఆరుగ కాకపోతే కంది" అని సామెత. ఆరుగయు కందియుఁ గలిపి చల్లెదరు. బయలు దేరినచో ఆరుగయే బయలు దేరును. లేనిచో కంది తప్పక బయలు దేరును. రెండు పంటలకు యత్నించి యేదియో యొకటి యైనను ఫలించినఁ జాలునని సంతృప్తిపడుట తెలుపఁబడును.)

ఆరుచే. దే. స. క్రి. ఆడుధా. ప్రే. 1. ఆడించు; "క. ఏలినవానిధనంబులు, బాలురు బంధువులుఁ దారు బ్రదికినదినముల్, వేలారిచి తిండ్రాతని, యోలము గని పిదప భీతినొదుఁగుదు రాజిన్." భార. విరా. ౪, ఆ. ౨౧౭. (ఆడుధాతువు మరొకదానిపై అనుప్రయుక్తమైనపుడును ప్రేరణమున ఈ రూపమునొందును); 2. విసరు. (చూ. ఆర్చు మూఁడవ అర్థము.

ఆరుదూఱు. దే. వి. అల్లరి. "ఆరుదూఱు చేసినన్నల యించిన మంచిదే." క్షేత్రయ. ౧౪౨. పుట.

ఆరుదొండ. దే. వి. తుజాలకము ⚘.

ఆరుద్ర. వై. వి. (సం. ఆర్ద్రా) ఆర్ద్రానక్షత్రము.

ఆరుద్రపురుగు. వై. వి. ఇంద్రగోపము. ఎఱ్ఱనిపట్టు వలెనుండి వర్షాకాలమున బయలు దేరు పురుగు. ఆరుద్రకార్తెలో పుట్టుటచేనట్లు వ్యవహరింపఁబడి యుండును. "ఆర్ద్రము అనుపదము ఆరుద్ర అని అయినట్టు తోఁచుచున్నది." అని. శ. ర. ఆర్ద్ర ఆరుద్రగా అయియుండును.

ఆరుపోరు. దే. వి. ఎడతెగనికలహము.

ఆరురుక్షు. సం. విశే. ఉ. 1. ఎక్కనిచ్ఛగలవాఁడు; 2. మోక్షమునిచ్ఛగలవాఁడు, ఆరూఢావస్థను పొందఁదలఁచినవాఁడు.

ఆరుషేయము. వై. విశే. ఆర్షేయము. (ఋషులు చెప్పినవి.) "ద్వి. భువి నిదానీంతనంబులో యారుషేయ,కవితలో ప్రతీప్తకలిత వాక్యములో." పండి. మహిమా. ౨౭౯-పు. (ఆరుషేయకవిత—వైరిసమాసము.)

ఆరూఢము. సం. విశే. (అ.ఆ.అ.) 1. ఎక్కినది; 2. కలిగినది, ఉత్పన్నము.—వి. అ. న. 1. ఎక్కుట, ఆరోహణము; 2. ఏనుఁగు మొదలగువానిపై నెక్కుట. "క. ఘోరాస్త్రశస్త్రవిద్యల, నారూఢములందు నిపుణు లైరి కుమారుల్..." భాగ. ఆది. ౬,ఆ. 3; 3. (జ్యోతి.) ఆరూఢచక్రము.

ఆరూఢి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఆరోహణము, ఎక్కుట; 2. ప్రసిద్ధి. "క. శ్రీరామునిదయ చేతను,నారూఢిగ సకలజనులు నౌరా యనఁగా, ధారాళమైన నీతులు,నోరూరఁగఁ జవులువుట్ట నుడివెద సుమతీ." సుమతి. ౧.

ఆరె. దే. వి. ధాతకి ⚘.—వై. 1. చెప్పులుకుట్టెడు సూది. "ద్వి. కాళ్లచెప్పులు మునుగ్రక్కునఁ దివిచి, సెరివినదదె చూడు సెంబళికోల, నరుగుపై నదె చూడు మాఱెయుఁ గత్తి, యదె చూడు వారెనలాచిల్కకొయ్య." పండి. దీక్షా. ౪౨-పు; 2. బాణవిశేషము. "వ. పేరెలమిం దలపడిన వీరుల నారెలం జీఱి నాఱులువోసినట్లు చేసియు." ఉ. హరి. ౬, ఆ. ౬౬; 3. ఆరెబొట్టె. "క. చరణములు నేత్రములుఁ గడు, నరుణము లారెలును ముక్కు నాయతములు కంధరములు దొడలును సన్నము, లరయఁగ నొకజాతి కది భయంపడుఁ బోరన్." దశ. ౯, ఆ. ౩౦.— విశే. మహారాష్ట్రదేశపువాఁడు. "సీ. మానిసి మనిసి నా మనుజసామాన్యంబు మందియం చననగు మనుజవితతి, యారె మరాటివాఁ డన మహారాష్ట్రుఁడా..." ఆం. భా. ద్వి. మ. ౧౦౩.

ఆరెకుఁడు. వై. వి. (సం. ఆరక్షః) 1. తలారి, ఆరక్షుఁడు. "వ. ...రాజునర్థంబు మ్రుచ్చిలికొని, మ్రుచ్చులారెకులచేత ననుధావ్యమానులై మాండవ్యుసమీపంబునం బాఱి. ..." భార. ఆది. ౪, ఆ. ౨౬౨.

ఆరెకొట్టె. దే. వి. కోడికాలి వ్రేళ్ళకు వెనుకతట్టున సూదివలె మిక్కిలి వాఁడియై యుండెడు ఒంటి గోరు. శ. ర. "సీ....ఆరెకొట్టె యనఁ బదాంఘ్రి జన్య, కంటకాకృతిసితాంగం బొప్పు. ..." ఆం. భా. ద్వి. సిం. ౯౭.

ఆరెము. దే. వి. (ఆరెసంబంధమైనది.) మహారాష్ట్రభాష. "గీ. ఆరెబిపాకసిగుజరాతియూరెమచ్చ, తెనుఁగు కన్నోజమొదలుగాఁ దెలిసి ప్రాయ, దారి గన్నట్టివాఁడు." య. ౧, ఆ. ౪౨.—వై. ఆరామము. "ఉ. ఆరెముఁ జొచ్చి కంపువకునర్గడు నంలకుమున్న." షో. ౪, ఆ. శ. ర.

ఆరెపట్టు. దే. వి. బ. సూదులవంటి తోఁకలుగల ఒకపెనుసుపట్టు. శ. ర.

ఆరేచితము. సం. విణ. (అ.ఆ.అ.) కొంచెము ముడుపఁబడినది. (ఆరేచిత భ్రూచతుకములు కటాక్షములు.)

ఆరేవతము. సం. వి. అ. పుం. ఱేలచె.

ఆరోగణము. వై. = ఆరోగిణము.

ఆరోగిణము. వై. వి. (క. ఆరోగణ.) భోజనము. "క. ఈకీతి శిరసు మజ్జన, మారోగిణమయి మణిమయపుఁబాదుక లొ, య్యారముగ మెట్టి యుండి గపునీరజముఖ కేలు పట్టి నృపుఁ డింపెసఁగన్." సా. ౨, ఆ. ౯౩. "ద్వి. హరునకు నిత్యంబుఁ గరికాలచోడ, నరపతియారోగిణము నెమ్మిఁ జలుప." బస. ౫, ఆ. ౭౨౩-పు.

ఆరోగ్యము. సం. వి. అ. న. ఆరోగభావము, రోగములేమి, జబ్బులేమి.

ఆరోగ్యశాల. సం. వి. ఆ. స్త్రీ. చికిత్సకై కట్టించు వైద్యశాల.

ఆరోగ్యస్నానము. సం. వి. అ. న. రోగము విడిచిన తర్వాతఁ జేయుస్నానము.

ఆరోపకుఁడు. సం. విణ. (అ.ఆ-పికా.అ.) చెట్లు మొదలగునవి పాఁతువాఁడు. (వృక్షారోపకుఁడు.)

ఆరోపణము. సం. వి. అ. న. ఆరోపించుట.

ఆరోపణీయము. సం. విణ. (అ. ఆ. అ.) ఆరోపింపఁదగినది.

ఆరోపము. సం. వి. అ. పుం. = ఆరోపణము.

ఆరోపయిత. సం. విణ. (ఋ. ఈ-త్రీ. ఋ.) ఆరోపించువాఁడు.

ఆరోపించు. సం. స. క్రి. 1. ఇతరులపైని లేనిది మోపు. "క. ఆరోపింతువు నాపైఁ నేరము విపరీతముగను నీపై రారా, యూరకె యిఁకైన రాజకుమారక నామాట వినుట మంచిది సుమ్మీ." సా. ౨, ఆ. ౧౩౬; 2. ఒకపదార్థమును మఱియొకపదార్థముగాఁ జెప్పు.

ఆరోపితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆరోపింపఁబడినది; 2. ఎక్కింపఁబడినది.

ఆరోప్యము. సం. = ఆరోపణీయము.

ఆరోహకుఁడు. సం. విశే. (అ. ఆ-హికా. అ.) 1. ఎక్కెడువాఁడు; 2. ఏనుఁగుపైనిగాని గుఱ్ఱముపైనిగాని ఎక్కువాఁడు.

ఆరోహణము. సం. వి. అ. న. 1. ఎక్కుట; 2. (ఎక్కుటకు సాధనము.) నిచ్చెన; 3. (బయలుదేఱునది.) మొలక.

ఆరోహము. సం. వి. అ. పుం. 1. ఎక్కుట; 2. చెట్టుమొదటనుండి కొనకెగఁబ్రాఁకెడితీఁగ; 3. నిడుపు; 4. స్త్రీపిఱుఁదు; 5. పొడవు, ఉన్నతి.

ఆరోహి. సం. విణ. (న్. ఈ-ణీ. న్.) ఎక్కువాఁడు.

ఆరోహించు. సం. స. క్రి. ఎక్కు. "వ....రెండవ యుచ్చైశ్శ్రవంబునుం బోలిన యాపవాహ్యంబు నారోహించి." నై. ౧, ఆ. ౯౨.

ఆరోహింపించు. సం. స. క్రి. ఆరోహింపఁజేయు, ఎక్కించు. "వ. మాతంగతురంగశవంబు లారోహింపించి." కవి. ౨, ఆ. ౯౯౨.

ఆరోహుఁడు. సం. వి. అ. పుం. 1. మావటివాఁడు; 2. గుఱ్ఱపురౌతు.

ఆర్కి. సం. వి. ఇ. పుం. (అర్కపుత్త్రుఁడు.) 1. యముఁడు. "సీ. తనయొద్దనున్న వాతాపితాపసునిచే, నినునార్కి వరముగాఁగొనిన నెట్లు, కాంక్షించి యడిగినఁ గామధేనువు నిన్నుఁ ద్యాగంబుగా నీదె యంబుపలికె." నై. ౪, ఆ. ౧౫; 2. సుగ్రీవుఁడు; 3. కర్ణుఁడు. "తే. అమరపతిసూను నిర్జించి తార్కి గూడి, దైత్యమర్దన రామావతారవేళ, నామనఃక్లేశ ముడుగనే యార్కినణఁచి, తమరపతిసూనుఁ గూడికృష్ణావతార." నై. ౯, ఆ. ౧౩౪; 4. వైవస్వతమనువు.

ఆర్గ్వధము. సం. = ఆరగ్వధము.

ఆర్చు. దే. అ. క్రి. అఱచు:—1. (జంతువులు) కూయు; 2. (ఉత్సాహాదులవలన) బిగ్గరగాఁ జెప్పు; కేకలు వేయు. "ఉ. ఉత్తరపుణ్యగర్భమున నుండి భవజ్జనకుండు పూరుషవం,శోత్తముఁ డాదిరాజ గుణయోగి పరిక్షితుఁ డుద్భవించినం, జిత్తమెలర్పఁ బుత్త్రుఁ డని చెప్పిరి వెల్పలివారి కింటిలో, నత్తఱి నున్న వృద్ధసతు లార్చి జనం బఖిలంబు నుబ్బ నన్." భార. అశ్వ. 3, ఆ. ౧౬౬; 3. యోధులు మొదలగువారు బొబ్బలు పెట్టు, బొబ్బరించు, ఘోషించు. "ఆ. ఆర్చి నెత్తురుట్ట నమ్మస్తకము పట్టి,కొని యతం డుదాత్తఘోరభంగి, భ్రమరివాఱె కురునృపాలకునరదంబు,నందు వైచి యిట్టు లనియె నధిప." భార. ద్రో. ౫, ఆ. ౨౦౫. "క. కలయ నసిముసలదండం,బులు గొని కాంపిల్యనగరమున జను లెల్లన్, నలి రేఁగి యార్చి కౌరవ,బలసుభటులఁ బొడిచి రాజి బడలుపడం గన్." భార. ఆది. ౬., ఆ. ౭౨.—స. క్రి. 1. ఆడు ధాతువుయొక్క ప్రేరణరూపము. ఆడించు:— 1. కదలునట్లు చేయు; 2. నాట్యమాడఁ జేయు. "చ. చలమున దుస్ససేనుఁడును సౌబలుఁడున్ మిముఁబట్టి యార్ప బొ,మ్మలక్రియ నాడుచుండుదురు." భార. ఉద్యో. ౨, ఆ. ౧౧. "క. నేర్పరి పెక్కువిధంబుల, నార్పఁగ బొమ్మలు గడంగి యాడెడుచందం, బేర్పడఁ గాన్పించు కాలస, మర్పితకార్యకరులైన మానవులదెసన్." భార. శాం. ౧, ఆ. ౨౮౩; 3. విసనకఱ్ఱ మొదలగునవి వీచు, విసరు. "ఉ. ... సురభిశ్వసనంబు నించెఁ గాం,తాలసవక్త్రసీమ విటులార్చు నుశీరపుఁదాళవృంతముల్." ఆము. ౨, ఆ. ౬3; 4. జూదమాడించు. "చ. మదమడఁగించి భూపతి సమాజము సెల్లను నిన్నుఁ గొల్వఁ జే, యుదునని పూని దిగ్విజయ మున్నతిఁ జేసి మహావిభూతితో, మదిమది నుండ నీసుతుఁడు మంత్రులు సౌబలు జూద మార్చి సం, పదగొని యంతఁ బోవక సభన్ ద్రుపదాత్మజ భంగపెట్టరే." భార. ఉద్యో. 3, ఆ. ౨౮౦; 5. పలుకునట్లు చేయు. "సీ. కెంగేలు గేలితోఁ గీలించి నెయ్యంపుమాటలఁ దగు మఱుమాట లార్తు...." భార. విరా. ౨, ఆ. 3౧౦; 6. (బాణములు) ఏయు, ప్రయోగించు. "చ. బవరము సేయుచుండియుండు భాషణముల్ దగఁ బల్కుచుండఁగా, నవినయవృత్తిమై వలవ దాయుధమార్చుటఁ దాఁకిపడ్డఁ గ్రే,ముడు వడినం దొలంగినను దోర్బలమేది భయంబుఁ బొందినన్, గవియక పెఱువోయినను గాదు వధింపఁగ నెట్టి శత్రునిన్." భార. భీష్మ. ౧, ఆ. ౧౪౮.—2. ఆఱు ధాతు (ప్రేరణము.) ఆఱుచు, ఆఱఁ జేయు:— 1. (దీపము) ఆఱిపోవునట్లు చేయు. "సీ. ఒకదీప మార్చిన నున్నదీపంబులు నప్పుడ తమకుఁ దా మాఱుటయును...." సై. ౭, ఆ. ౧౬౯; 2. తడిలేకుండఁగఁ జేయు. "సీ. కొనగోళ్ల నెఱుల చిక్కులువాపి మెలపున, శిరసార్చి నొక్కలేఁ జిగురుఁబోఁడి." పారి. ౨, ఆ. ౧౨; 3. అణఁగించు, క్షీణింపఁ జేయు. "తే. నరుఁడు నారాయణుఁడు మహాత్తరము సువ్వె, యితని తేజ మెవ్వరికిని నెట్లు దాని, నార్పవచ్చు మీవగ పెల్లఁ దీర్పనిపుడ, యుత్థితుండగు నీకౌరవోత్తముండు." భార. అశ్వ. ౮, ఆ. ౮౨.

ఆర్జకుఁడు. సం. విణ. (అ. ఆ-ర్జికా. అ.) సంపాదించువాఁడు, గడించువాఁడు.

ఆర్జనము. సం. వి. అ. న. సంపాదనము, గడన.

ఆర్జవము. సం. వి. అ. న. 1. ఋజుభావము, చక్కన, సరళత; 2. పొడువుగానుండుట; పొడువు. "చ. అరుదుగ సర్వశైలములయంత తనర్చును నార్జవంబును,స్థిరతయు నోషధీరసవిశేషతయుం గలదు...." భార. ఆది. ౨, ఆ. ౧౦.

ఆర్జించు. సం. స. క్రి. సంపాదించు, గడించు.

ఆర్జితము. సం. విణ. (అ. ఆ. అ.) సంపాదింపఁబడినది, గడింపఁబడినది.

ఆర్జుని. సం. వి. ఇ. పుం. అర్జునునిపుత్త్రుఁడు. అభిమన్యుఁడు.

ఆర్డరు. ఆం. వి. 1. క్రమము; 2. ఆజ్ఞ.

ఆర్తగళము. సం. వి. అ. పుం. నల్లగోరంట*.

ఆర్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. దుఃఖము నొందినది; 2. పీడింపఁబడినది.

ఆర్తవము. సం. వి. అ. న. 1. స్త్రీఋతువు; 2. పుష్పము.—విణ. (అ. ఈ. అ.) 1. ఋతుసంబంధమైనది; 2. ఋతువులోనున్నది.

ఆర్తి. ఉభ. వై. వి. కోరిక.—సం. వి. ఇ. స్త్రీ. 1. దుఃఖము, పీడ; 2. వింటికొన.

ఆర్త్విజ్యము. సం. వి. అ. న. 1. ఋత్విజునిభావము; 2. ఋత్విక్కుపని.

ఆర్థి. సం. వి. ఈ. స్త్రీ. సదృశార్థశబ్దప్రయోగము గల పూర్ణోపమాభేదము.

ఆర్థికము. సం. విణ. (అ. ఈ. అ.) 1. (అర్థమునుండి వచ్చినది.) ధనమునుండి వచ్చినది; ధనసంబంధమయినది. (ప్రస్తుతము దేశమున ఆర్థికస్థితి అనుకూలముగ లేదు); 2. ప్రయోజనమునుబట్టి వచ్చినది; 3. అర్థము (పదముల యొక్క అర్థము)ను బట్టి వచ్చినది (భావము.)

ఆర్థికుఁడు. సం. వి. అ. పుం. 1. ధనము పుచ్చుకొనువాఁడు; 2. పన్ను మొదలగునవి ప్రజలనుండి రాఁబట్టువాఁడు.

ఆర్దము. దే. వి. (ఆఱు+తూము.) ఆఱుతూములు.

ఆర్ద్ర. సం. వి. ఆ. స్త్రీ. ఒకనక్షత్రము.

ఆర్ద్రకము. సం. వి. అ. న. (తడిగలది, జలముగలది.) శృంగబేరము, అల్లముపీ.

ఆర్ద్రము. విణ. (అ. ఆ. అ.) 1. తడిసినది; 2. చెమ్మగలది.

ఆర్ధరాత్రికము. సం. విణ. (అ. ఈ. అ.) అర్ధరాత్రమందయినది.

ఆర్నెల్లు. దే. వి. బ. ఆఱునెలలు. "తే. జలక మాడిన పిమ్మటఁ జనెనములను, హృదయమున నీళ్లు వేగంబ యిగురఁబోఱు, దర్పణమునీడ దోఁచు నాతామ్రకాంతి, నెవ్వనికి వాఁడు నార్నెల్ల కేగు దివికి." కాశీ. ౫, ఆ. ౨౬౭.

ఆర్పు. దే. = ఆఱుపు.

ఆర్భటము. సం. వి. అ. పుం. మ్రోఁత.

ఆర్భటి. సం. వి. ఈ. స్త్రీ. మ్రోఁత.

ఆర్మొదగు. దే. = ఆర్మోఁడగు.

ఆర్మోఁడగు. దే. = ఆఱుమోఁడగు.

ఆర్య. సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. పదునాలేండ్లప్రాయముగల యాఁడుది. "శా. ఆమందాకిని మాళిఁ బూని నను నర్ధాంగీకృతం జేసితో, నామేల్ మేలని యార్య యల్లఁ బ్రణతుండై...." వసు. ౧, ఆ. ౫; 3. పూజ్యురాలు; 4. సంస్కృతఛందో భేదము.

ఆర్యకము. సం. వి. అ. న. పితృకార్యము. (శ. ర.)

ఆర్యత్వము. సం. వి. అ. న. 1. ఆర్యునిభావము; 2. ప్రాభవము, అధికారము, పెద్దఱికము. "క. దురాత్మధమునింటందగు, కార్యమునకు ఖడ్గమునకుఁ గలవాఁడై చాతుర్యంబు మెఱయు కర్ణుని, యార్యత్వము సెల్లుచున్నయదియే నెమ్మిక్." భార. ఉద్యో. ౧, అ. ౨౦౧.

ఆర్యపథము. సం. వి. అ. పుం. ఆర్యులమార్గము, ఆర్యులపద్ధతి.

ఆర్యపుత్త్రుఁడు. సం. వి. అ. పుం. 1. (నాట్యపరిభాషయందు) పెనిమిటి; 2. ఆర్యునికుమారుఁడు.

ఆర్యమిత్రులు. సం. వి. అ. పుం. బ. వ. పూజ్యులు, గౌరవవంతులు.

ఆర్యావర్తము. సం. వి. అ. పుం. వింధ్యహిమవంతములకు మధ్యదేశము, ఆర్యులు సంచరించిన దేశము, పుణ్యభూమి.

ఆర్యుఁడు. సం. వి. అ. పుం. 1. (నాట్యపరిభాషయందు) పెనిమిటి; 2. సౌవిదల్లుఁడు; 3. స్వామి, ప్రభువు; 4. గురువు; 5. మిత్రుఁడు; 6. ఉదారుఁడు; 7.(నాట్యోక్తియందు) గౌరవింపఁదగినవాఁడు, మాన్యుఁడు; 8. సత్ప్రవృత్తిగలవాఁడు.—విణ. (అ. ఆ. అ.) 1. పూజ్యుఁడు; 2. మంచివాఁడు; 3. దస్యుదాసానార్యేతర జాతికి సంబంధించినవాఁడు.

ఆర్వేరము. వై. వి. (=ఆరివేరము) 1. కలహము. "గీ. విభునితమకంబుతో నిట్లు వెలఁదిసిగ్గు, పోరుటెల్లను వట్టి యార్వేరమయ్యె." అని. ౧, ఆ. ౧౧౪; 2. ద్వేషము. "గీ. వట్టియార్వేరమున బలవంతుతోడి, సాటికిఁ బెనంగుటెల్ల నిష్ఫలము గాదె." అని. ౧, ఆ. ౭౯; 3. కలఁత—(చూ. ఆరివేరము.)

ఆర్షభ్యము. సం. వి. అ. పుం. (ఋషభము గాఁదగినది.) ఆఁబోతుగా విడువఁదగిన లక్షణములుగల కోడెదూడ.

ఆర్షము. సం. వి. అ. పుం. ధర్మార్థము వరునివలన గోమిథునము పుచ్చుకొని కన్యక నిచ్చి యథాశాస్త్రముగాఁ జేయు వివాహము.—విశే.(అ.ఈ.అ.) 1. ఋషిసంబంధమైనది; 2. ఋషిప్రోక్తము, ఋషిచెప్పినది.

ఆర్హంతి. సం. వి. ఈ. స్త్రీ. యోగ్యత.

ఆర్హతము. విశే. (అ. ఈ. అ.) జైనసంబంధమైనది.

ఆఱడి. దే. వి. 1. హాని, భంగము. "తే. నిత్యనైమిత్తికములైన నిఖిలకర్మములకు నాఱడి యిట్టులు పుట్టె వెడఁగనైతి నింటికిఁ జనునుపాయంబు వేఁడి, కొనఁగ నిచ్చుట నొకతపోధనుఁడు లేఁడె." మార్క. ౪, ఆ. ౨౨౪; 2. నింద, దూఱు. "క. పరు లెఱిఁగిన నాఱడికిం, గరియగు నను తలఁపులేక గతధృతి నవనీశ్వరసుత విరివేనలితోఁ, బురపురఁ బడి యేడ్చుచుండె భూభాగమునన్." దశకు. ౪,ఆ. ౬౯. "సీ. రక్తార్తమార్తికారాతి మూర్ధాబ్జఝ శాలి నాఱడి రిత్త చంపుకొంటి."జై. ౭, ఆ. ౩౪.—విశే. 1. వ్యర్థము. "సీ. గలిమాలి బిగియారు కౌఁగిలి లేనియాఱడికూర్మి కేనేల అట్టు వడితి...." ఉ. హరి. ౫, ఆ. ౧౧౭; 2. దుష్టము, చెడ్డది, పాడు. "ఉ. అక్కరు లామొగంబుచెలువాకను దమ్ములసోయగంబునా, యక్కను జేతులానడుము నాపిఱుఁ దాతొడ లాయొయారపుం, బిక్కలు మెట్టుఁదమ్ములును బ్రేముడి నామదిఁ బాయకుండఁగా, నక్కుచు నెట్టుగా మఱతు నాఱడి దయ్యమ యింతచేసితే." య. ౩, ఆ. ౧౨౭.

ఆఱడిఁబోవు. దే. = ఆఱడిపోవు.

ఆఱడిపడు. దే. అ. క్రి. 1. దూఱుపడు, నిందపడు; 2. వ్యర్థమగు. "ద్వి. నూఱువేలేండ్లు సన్నుతగతిలేక, యాఱడిపడి భస్మమైయున్నవారు." రా. బా. ౪౨-పు; 2. నాశముఁ జెందు, హానిఁ జెందు. "ద్వి. నినుఁ జంపవచ్చిన నీపాలిమృత్యువనక రామునిచేత నాఱడివడితి." రా. కిష్కి. ౨౧౭-పు.

ఆఱడిపుచ్చు. దే. స. క్రి. 1. ఆఱడిపోవఁ జేయు; 2. వ్యర్థముచేయు. "ఉ. ఆలము నేసి నాతగుల మాఱడిపుచ్చఁగ నేల." భార. విరా. ౨,ఆ. ౨౫౩; 3. భంగపఱచు. "ఉ. అక్కట భర్తఁ గాపురము నాఱడిపుచ్చి నృపాలమాళితోఁ, జొక్కి రమించు నందులకుఁ జొచ్చినఁ దావకబంధువర్గముల్, వక్కువ చేతురమ్మ...." హంస. ౧, ఆ. ౧౭౪.

ఆఱడిపోక. దే. వి. ఆఱడిపోవుట. "ఉ. ఆఱడిఁబోకయుఁ గా ఫలమునందుటయుఁగని పల్కనేరమిన్...." భార. ఉద్యో. ౩, ఆ. ౧౦౭.

ఆఱడిపోవు. దే. అ. క్రి. 1. నిందపడు, దూఱుపడు; "ఉ. అక్కట కన్యకాత్వమిటులాఱడిపోవనకారణంబనీ, కెక్కడిచూలువచ్చె." నిర్వ. ౨,ఆ.౨౪; 2. వ్యర్థమగు. "చ. అనవుడుఁ గృష్ణుఁ డిట్టులను నాఱడిఁబోయెఁ బ్రయత్నమెల్ల..." భార.అశ్వ. ౩, ఆ. ౫౯; 3. చెడు, భగ్నమగు. "క. ధనురాచార్యుఁడు దగఁ బన్నినపద్మవ్యూహ మెరుఁగు నేరరు చొరుమం, చనుమానింప కతనిఁ జొరు, మనరు గదా మీయుపాయ మాఱడిఁబోవన్." భార. ద్రో. ౨, ఆ. ౨౩౪; 4. చచ్చు. "ఆ. అవ్విధమునఁ గర్ణుఁ డాఱడిఁబోయిన, వాడు మానసంబు వోదు నూఱు, వఱియరై తలంప బలుతాఁ జేసిన, వారుగాఁగ వలయు వంశవర్య." భార. ఆశ్ర. ౧, ఆ. ౧౫౪. "ఆ. లేచి యడలి సవ్యసాచిఁ గౌఁగిటఁ జేర్చి, గద్గదిక నెలుంగు గదలుకొనఁగ, నడరి పెలుచ నేడ్చె నాఱడిఁబోయిన, ప్రజలఁ బేరు గ్రుచ్చి పనవి పనవి." భార. మౌ. ౧, ఆ. ౧౦౭.

ఆఱడివోవు. దే. = ఆఱడిపోవు.

ఆఱు. దే. అ. క్రి. 1. ఉపశమిల్లు. "క. కాఱడవిఁ బఱచు మృగముల, నూఱడకం దిగిచి దస్సియున్నతనిశ్రమం, బాఱఁగ నెడఁ బరితాపము, దీఱఁగఁ బై వీచె నన్నదీపవనంబుల్." భార. ఆది. ౪, ఆ. ౯౯; "ఉ. ఈతనిపౌరుషం బరయ నెందు నమానుషకృత్య మప్రతీ, ఘాతమనేకమద్భుతము గర్వితులౌ ధరణీశ్వరుల్ నిజం, బీతనినాజిలోఁ జెనయ నెవ్వరు నోడుదు రిమ్మహాభుజుం, డాతతరోషుఁడైనఁ బ్రళయానలు పట్టిఁడ యాఱఁడేమిటన్." భార. అర. ౬,ఆ. ౨౧౦; 2. తడిలేకుండనగు, ఎండు; 3. నశించు.—వ. ఐదునొకటి.— వి. నూగారు, రోమావళి, ఆరు.

ఆలక్షి. సం. విణ. (న్. ఈ-ణీ. న్.) 1. చూచువాఁడు; 2. తెలిసికొనువాఁడు.

ఆలక్షించు. సం. స. క్రి. 1. పాటించు; 2. చూచు, కనుఁగొను.

ఆలక్షితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చూడఁబడినది; 2. పరిశీలింపఁబడినది; 3. తెలిసికొనఁబడినది.

ఆలక్ష్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) చూడఁబడుచున్నది. "వ. పునఃపునరాలక్ష్యమాణవక్షోజకుంభతటవిజృంభణాభోగయు." ప్రభా. ౫, ఆ. ౩౨.

ఆలక్ష్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చూడఁదగినది; 2. పరిశీలింపఁదగినది; 3. తెలిసికొనఁదగినది.

ఆలగోఁడుబాలగోఁడు. దే. వి. పెడబొబ్బలు.

ఆలతి. వై. వి. ఆలప్తి, రాగాలాపము. "క. సోలుచు సమ్మదరసమునఁ, గ్రాలుచు వనపాలబాలికలు నవలతికాం, దోలముల వేడ్క సలుపుచు, నాలతులొగిఁజేసి పాడిరభినవలీలన్." కు. సం. ౪, ఆ. ౧౧౨. "చ. అలరులుకోసి కోసినవయస్యలఁ బల్మఱుఁ గౌఁగిలించి కోయిలలయెలుంగులొలిఁగొని యింపుగఁ జిల్కలతోడ నెమ్మిమై, నలవడి మాటలాడి యళులాలతి సేయఁగఁ బాడి డాఁగురిం,తలు హరితోడ నాడుదురు తద్వనవీథులయందు గోపికల్." హరి. పూ. ౮, ఆ. ౩౫.

ఆలన. దే. వి. ఆలించుట, (మొఱ) వినుట. 'ఆలనలేదు పాలనలేదు' అని వాడుక.

ఆలపించు. వై. స. క్రి. రాగమాలాపించు, రాగము పాడు. "ఉ. ఉద్యన్నఖరప్రఘాతములఁ దంత్రులు మీటుచు నాలపించునా, తిన్ననియెల్గు నాచెవులఁ దేనియలొల్కుచవుల్ దలంచెదన్." పాండు. ౩, ఆ. ౯౪.

ఆలపుటాలము. దే. వి. వినోదార్థమగుయుద్ధము. "సీ. ద్వారకానగరంబు చేరువ ఘోటక మరుగంగఁ బ్రీతులై యదుకుమారు, లాలపుటాలంపు ననువున నయ్యింద్రనందనుఁగని పూజనంబొనర్చి, నభినందనము సేసె." భార. అశ్వ. ౪, ఆ. ౧౧౪.

ఆలపోతు. దే. వి. ఆఁబోతు, వృషభము. "సీ. అభ్రంకషంబైనయాలపోతు నితండు త్రుంచినాఁడీతండు పెంచినాఁడు...." ఉ. హరి. ౨, ఆ. ౧౮౦.

ఆలప్తి. సం. వి. ఇ. స్త్రీ. రాగాలాపము, ఆలతి.

ఆలబ్ధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. స్పృశింపఁబడినది; 2. కూడినది; 3. హింసింపఁబడినది; 4. పొందఁబడినది.

ఆలబ్ధి. సం. వి. ఇ. స్త్రీ. 1. స్పర్శము; 2. హింస; 3. పొందుట.

ఆలభనము. సం. = ఆలంభనము.

ఆలభనీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. స్పృశింపఁదగినది; 2. హింసింపఁదగినది; 3. మర్దింపఁదగినది.

ఆలభ్యము. సం. = ఆలభనీయము.

ఆలము. ఉభ. దే. వి. 1. ఉపేక్ష. "ఉ. ఆలముసేసి నాకగులమాఱడిపుచ్చఁగనేల చేల." భార. విరా. ౨, ఆ. ౨౫౩. "ద్వి. అభయంబు వేఁడిన నాలంబు సేఁత, యభయార్త్ము యిది మీకు విభవమే దేవ." పండి. పురాతన. ౧౫౦-పు; 2. యుద్ధము. "క. కాలంబగుటయుఁ నృపులకు,నాలము సమకూడె." భార. భీష్మ. ౧, ఆ. ౬. "మ....కురుముఖ్యయింకనిట నీవాలంబు సాలింపవే." భార. భీష్మ. ౩, ఆ. ౧౭౦; 3. వినోదము. చూ. ఆలపుటాలము.— సం. అ. న. 1. తేలుకొండి; 2. హరిదళము.

ఆలముసేయు. దే. స. క్రి. (శబ్దపల్లవము) ఉపేక్షించు, ఉపేక్షసేయు. "ఉ. ...కేకయరాజపుత్త్రి యత్యాదరవృత్తితో ననునయం బొనరించిన నయ్యసహ్యసం, వాదినిపూన్కి పాండుసుతవల్లభ యాలముసేసి యిట్లనున్." భార. విరా. ౨, ఆ. ౧౬౦.

ఆలమెకము. దే. వి. జంబుకము, నక్క.

ఆలయము. సం. వి. అ. పుం. 1. గృహము, ఇల్లు; 2. స్థానము, చోటు; 3. కోవెల, గుడి. (దేవాలయమనియు, ఆలయమనియు వాడుక.)

ఆలరి. దే. విణ. దుశ్శీలుఁడు, హాళకుఁడు. "ఉ. ...బాలికఁ దొల్లి యేపురకు భామినిగా సృజియించియున్న య,య్యాలరి బ్రహ్మచెద్ది పరమార్థము గాకది యేల యొండగున్." భార. ఆది. ౭, ఆ. ౨౧౩. "ఉ. చాలుఁ బురే సరోజభవ సత్పథ

ప్రవృత్తిఁ బోలంగ సూతుని, ట్లూఁటపై బమింప హృదయంబునఁ గోరుట ప్రర్తి కీలియే." భాగ. ౩, స్కం. ౯౭౦.

ఆలక్ష్యము. సం. విణ. (అ.ఆ.అ.) అలక్ష్యసంబంధమైనది, చిహ్నితకర్మాది. (విషము)

ఆలతేఁడు. దే. వి. వృషభరాజు, బసవఁడు.

ఆలవట్టము. వై. వి. 1. ఆలావర్తము, గుడ్డతో గుండ్రముగాఁ గూర్చిన విసనకఱ్ఱ. "తే. కనకబహురత్నమయపీఠమున వృగాక్షు, లాలవట్టంబు లిడఁ జెంబవమువట్టి, కౌరవేంద్రుండు పెనుసేలఁ గంకపత్త, పవనహతుఁడయ్యెఁ జూచితె పవనాథ." భార. స్త్రీ. ౨, ఆ. ౩౯; "తే. కమలదళము మృణాళికాండమునఁ జేర్చి, యాలవట్టంబు గావించి కేల మెఱయ, విసరు నల్లన రామభూవిభుఁడు జనక, రాజనందనమన మరు రాగ మొందు." నిర్వ. ౯, ఆ. ౬౨; 2. దేవోత్సవములందును రాజాద్యుపచారములందు నుపయోగించు గుడ్డగొడుగు. "సీ....వ్యజనము, విసనకఱ్ఱ సుకటి వీవన యంచన నవి యొండమఱుఁగిడ నాలవట్టమున విరాజిలుచు,..." ఆం. భా. ద్వి. మ. ౧౬౯. "సీ. అచ్చరవిరిఁబోఁడు లాలవట్టములూన విసుటెంకిచెలులు వీవనలు వైవ..." ఆచ్చ. సుం. ౩౫.

ఆలవాలము. సం. వి. అ. న. 1. ఆవాలము, పాదు, నీరు నిలుచుటకై చెట్టుచుట్టు చేసినపల్లము, బోదె; 2. స్థానము. "సుగుణాలవాలము." ('సుగుణాలవాలుఁడు' అనియు కలదు.)

ఆలసము. వై. వి. ఆలస్యము, జాగు.

ఆలసించు. వై. అ. క్రి. ఆలస్యముచేయు, తడయు. "సీ....దానికొలఁది, యెఱుఁగునంతకు నేను నిన్ని వాళ్లాలసించితి...." కళా. ౨, ఆ. ౧౬౪.

ఆలస్యము. సం. వి. అ. న. 1. సోమరితనము, మాంద్యము. "వ. అని మెత్తన యయ్యకొని గర్జించి గజాలస్యంబునం బ్రాంగణంబు సొచ్చి భూపాలుని ముందట భుజాస్ఫాలనంబు సేసి మ్రొక్కి." భార. విరా. ౨, ఆ. ౧౮౪; 2. విలంబనము, జాగు; "క. అరయఁగనయ్యెడు తెఱఁగుల, నరయుంట కార్యంబు వారివాలస్యములేకరయునది పెక్కు భంగుల, నరసినఁ దోఁచెదరు గాక యది యట్లుండెన్." భార. విరా. ౩, ఆ. ౧౦౬. "వ. చతురంగబలంబుల నాయికేంబు గావించుచు దొరలం బురికొల్పి కొనుచు నాలస్యంబు లేక సమరంబునకు సన్నాహంబు సేయుచుండవలయునని పలికిన విని వృకోదరుండు దామోదరున కిట్లనియె." భార. ఉద్యో. ౩, ఆ. ౪౭.

ఆలస్యుఁడు. సం. విణ.(అ.ఆ.అ.) సోమరి, అలసుఁడు.

ఆలాజ్యము. సం. వి. అ. న. ఇంధనము, వంటచెఱకు.

ఆలానము. సం. వి. అ. పుం. న. 1. ఏనుఁగునుకట్టు స్తంభము; 2. త్రాడు, పగ్గము, రజ్జువు.

ఆలానిక. సం. వి. ఆ. స్త్రీ. తమలపాకుతీఁగె.

ఆలాపనము. సం. వి. అ. న. 1. పరస్పరసంభాషణము; 2. రాగము విస్తరించి పాడుట.

ఆలాపము. సం. వి. అ. పుం. 1. ఆభాషణము, పూర్తిగాఁజెప్పుట; 2. మాట; 3. రాగాలాపము, రాగము విస్తరింపఁజేయుట.

ఆలాపించు. సం. స. క్రి. 1. రాగము విస్తరింపఁజేసి పాడు; 2. సంభాషించు.

ఆలాపిని. సం. వి. ఈ. స్త్రీ. 1. వీణె; 2. ఆలాపము చేయుస్త్రీ.

ఆలాప్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆలాపింపఁదగినది, విస్తరించి పాడఁదగినది (రాగము); 2. సంభాషింపఁదగినది; 3. చెప్పఁదగినది.

ఆలాబువు. సం. వి. ఊ. స్త్రీ. అలాబువు, సొరతీఁగె.

ఆలాయము. వై. వి. పాత్రము.

ఆలావము. సం. వి. ఆ. పుం. పైర్లు మొదలగు వానికోఁత, అభిలావము.

ఆలావర్తము. సం. వి. అ. న. = ఆలవట్టము.

ఆలి. ఉభ. దే. వి. 1. అపహాసము. చూ. ఆలిగొను; 2. అవమానము. చూ. ఆలిఁబుచ్చు.— విణ. హీనము. "మ. మగఁడా నీవు జగంబుచొప్ప మిగులన్ మానంబువాటించితువా, లిగ సెగ్గంబగు మాటవాటిలెనె." నిర్వ. ౫, ఆ. ౧౦౩. "ఉ. ఇయ్యాలితనంబు వావెదఁ బ్రియంబొనరించెద నీకుఁ దండ్రికిన్." భార. శల్య. ౨, ఆ. ౩౫.—సం. వి. ఇ. స్త్రీ. 1. పఙ్క్తి; 2. చెలికత్తె.

ఆలింగనము. సం. వి. అ. న. ఉపగూహనము, కవుఁగిలింత.

ఆలింగి. సం. విణ. (న్. ఈ. న్.) ఆలింగనముచేయు వాఁడు, కౌఁగిలించుకొనువాఁడు.

ఆలింగితము. సం. విణ. (అ. ఆ. అ.) కవుఁగిలింపఁ బడినది.

ఆలింగ్యము. సం. వి. అ. పుం. గోపుచ్ఛమువంటి ఆకారముగల మృదంగము.—విణ. (అ. ఆ. అ.) కవుఁగిలింపఁదగినది.

ఆలించే. వై. స. క్రి. (=ఆలకించే) 1. విను. "క... ఆలింపుము నావిన్నప, మేలింపు మనోజరాజ్య మెంతయు నింతిక్." విక్ర. ౧. ఆ. ౧౪౨; 2. ఆదరించు. "గీ. ఇంకనైన నన్ను నేల యాలింపవు, నాకు శరణమగుము నాథ." భార. ఆర. ౨, ఆ. ౭౭. "గీ....లిఖితుఁ డిట్లను శంఖుఁడాలించి వినఁగ." జై. ౪, ఆ. ౧౨౬.

ఆలింజరము. సం. వి. అ. పుం. పెద్దమట్టిబాన, మంటి కడవ.

ఆలిఁజేయు. దే. స. క్రి. భగ్నముఁజేయు, చెఱచు. "తే. శూలి సేకొన్నతపమెల్ల నాలిఁజేసి, యతని దేహంబునందు సామాలిఁ జేసి, కామకింకరుఁజేసి నాకడిమి నెఱపఁ, గంటి నీప్రస్తవము దీర్పఁ గంటి నెలమి." కు. సం. ౪, ఆ. ౫౩. కీడ్పఱచు, నిరసించు, చులకనఁగాఁ జేయు. "ద్వి. పొలఁతి జలంబులు పోయకున్నంత, నాలిఁజేసితి గదా హరమూర్తి ననుచు, నాలిచేతులు రెండు నప్పుడ నఱికె." బస. ౪, ఆ. ౧౩౭-పు. ('ఆలి సేయు' ముద్రితము.)

ఆలిఁబుచ్చు. దే. స. క్రి. ఆలిఁబఱచు, అవమాన పఱచు. "ద్వి. నాచిదేవయగారి నవ్వ చేసితివొ, యాచెన్నబసవన్న నాలిఁబుచ్చితివొ" పండి. మహిమా. ౩౦౬-పు. "ఆలఁబుచ్చితివొ" ముద్రితము. ఆలిఁజేయు మొదలగువానినిబట్టి ఆలిఁ బుచ్చు అని గ్రహింపఁబడినది.

ఆలిఖించే. సం. స. క్రి. వ్రాయు. "సీ...కమలచందన మాలికలును నిర్మించిరి స్తంభించి రుత్తమదర్పణములు, తే. నాలిఖించిరి గేహకుడ్యములయందు, సర్వతోభద్రమకరికాస్వస్తికములఁ..." శివరా. ౨, ఆ. ౫౩.

ఆలిఖితము. సం. విణ. (అ. ఆ. అ.) వ్రాయఁబడినది.

ఆలిగొను. దే. స. క్రి. (ఆలి+కొను.) 1. అవహసించు. "తే. అకట సైరంధ్రి నన్ను నిట్లాలిగొనఁగ,నేల చక్కఁగఁ గనుపిచ్చి యేచు దేడిఁ, జూడ రోయుదు రణమున సూతకృత్యభరము దాల్చుట కెమ్మెయిఁ బనుచువాఁడ." భార. విరా. ౪, ఆ. ౧౭. "గీ. అట్టివికృతాననను గాంచి యిట్టు లనియె,నోనిశాటి యీయొప్పుతో నున్న నిన్నుఁ, గన్ననార్తిని దూలరే కాముచేత, దేల నీకింత వలవనిబాళి యేల. వ. అని. క. ఈలీల సుమిత్రాసుతుఁ, డాలిగొనఁగ." రా. ఆర. ౩౭౫; 2. తక్కువపఱచు, తేలికగాఁ జూచు, అవమానించు. "చ......అమరుల్ జగద్భోజ్యము లెల్ల మ్రింగి మోపుగొనుచు మిమ్ము నాలిగొని పోయిరి." నిర్వ. ౫, ఆ. ౧౩౪.

ఆలిచిప్ప. దే. వి. కప్పచిప్ప, శంబూక.

ఆలిప్తము. సం. విణ. (అ. ఆ. అ.) పూయఁబడినది.

ఆలిప్స. సం. వి. ఆ. స్త్రీ. పొందనిచ్ఛ.

ఆలిప్సువు. సం. వి. ఉ. పుం. పొందుటకు ఇచ్ఛగించినవాఁడు.

ఆలీఢము. సం. వి. అ. న. విలుకాఁడు బాణము విడుచునపుడు కుడికాలు ముందఱకు చాఁపి నిలుచుట.—విణ. (అ. ఆ. అ.) నాకఁబడినది, ఆస్వాదింపఁబడినది.

ఆలు. దే. వి. 1. భార్య. "ఉ...నరేశ్వర భర్తవు గాన నాకునుం, బోలఁగ భర్త వీవ యిది భూనుతధర్మపథంబు నిక్కువం,బాలును దాసియుఁన్ సుతుఁడు నన్నవి వాయనిధర్మముల్ మహిన్." భార. ఆది. ౩, ఆ. ౧౭౪; 2. స్త్రీ, ఆఁడుది. "క. ఆలవు బాలవు కడుఁగొమ,రాలవు." కు. సం. ౬, ఆ. ౧౫. "జవరాలు, ధీరురాలు" మొ.; 3. (ఆవు. బ. రూపము.) గోవులు.—బ. వ. ఆండ్రు, ఆండ్రురు.

ఆలుక. సం. వి. ఆ. స్త్రీ. 1. గిండిచెంబు; 2. అవబు, సారశ్రీ.

ఆలుకము. సం. వి. అ. పుం. న. గెనుసు॰.

ఆలుగడ్డ. దే. వి. ఉరలగడ్డ, బంగాళాదుంప.

ఆలుఠితము. సం. విణ. (అ. ఆ. అ.) అంతట పొర్లింపఁబడ్డది.

ఆలుడి. దే. వి. మంచినడత, శీలము. "సీ...ఆలుడి యనఁగను శీలంబు విలసిల్లు బత్తి యనంగను భక్తి చెలఁగు..." ఆం. భా. ప్ర. పా. ౧౩౬.

ఆలుబ్ధుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) అతిలోభి.

ఆలువ. సం. వి. ఉ. స్త్రీ. సన్నమెడగలచెంబు, గిండి.—న. 1. గెనుసుగడ్డ; 2. పడవ.

ఆలూనము. సం. వి. అ. న. అంతట కోయఁబడ్డది.

ఆలెగాఁడు. దే. వి. క్రిందికొలువువాఁడు, శ. ర. ఇల్లు తుడుచుట మొదలగు పనులుచేయునౌకరు.

ఆలెప్రొయ్యి. దే. వి. ఒకసారిగా నాలుగైదు పాత్రములు వేఱువేఱుగాఁ బెట్టి వండునట్లేర్పఱచిన పొయ్యి. శ. ర.; పెడప్రొయ్యి అందురు.

ఆలేఖకుఁడు. సం. విశే. (అ. ఆ-ఖికా. అ.) 1. వ్రాయువాఁడు; 2. చిత్తరువు వ్రాయువాఁడు.

ఆలేఖనము. సం. వి. అ. న. 1. వ్రాయుట; 2. చిత్తరువువ్రాయుట.

ఆలేఖనము. సం. వి. అ. పుం. 1. బాగుగావ్రాయుట; 2. వ్రాసినపత్త్రము, (అకు కాకితము మొ.)

ఆలేఖని. సం. వి. ఈ. స్త్రీ. 1. చిత్తరువువ్రాసెడు తూలిక; (కలము, కుంచె మొ.); 2. (వ్రాఁతకు సాధనము) సీసపుపోఁతపుల్ల, మొదలగునది.

ఆలేఖ్యకృత్తు. సం. వి. త్. పుం. చిత్తరువు వ్రాయువాఁడు, మచ్చెవాఁడు.

ఆలేఖ్యము. సం. వి. అ. న. 1. చిత్తరువు; 2. వ్రాఁత. —విశే. (అ. ఆ. అ.) 1. వ్రాయఁదగినది; 2. చిత్రింపఁదగినది.

ఆలేఖ్యశేషుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) చిత్తరువు మాత్రము మిగిలినవాఁడు, మృతుఁడు. ('కీర్తిశేషుఁడు'వంటిది.)

ఆలేపము. సం. వి. అ. పుం. 1. (చందనాదుల) పూఁత; 2. బొమ్మపలె గోడ మొదలగువానిమీఁద పూఁత పూయుట.

ఆలేహ్యము. సం. విశే. (అ. ఆ. అ.) ఆస్వాదింపఁదగినది.

ఆలోకనము. సం. వి. అ. పుం. 1. చూపు; 2. ఎండ.

ఆలోకనీయము. సం. విశే. (అ. ఆ. అ.) చూడఁదగినది, దర్శనీయము.

ఆలోకము. సం. వి. అ. పుం. 1. చూపు; 2. ఎండ; 3. ప్రకాశము, కాంతి. "సూర్యాలోకము, చంద్రాలోకము;" 4. బట్టువాఁడు చేయుస్తోత్రము.

ఆలోకి. సం. విశే. (న్. ఈ-నీ. న్.) ఆలోకించువాఁడు, చూచువాఁడు.

ఆలోకించు. సం. స. క్రి. వీక్షించు, చూచు. "క. కాలంబగుటయు నృపులకు, నాలము సమకూరె దీని కడలకు మది నీ,వాలోకింపఁగ వలసిన, నే లోనికి దివ్యదృష్టి నిచ్చెదఁ బుత్త్రా." భార. భీష్మ. ౧, ఆ. ౬.

ఆలోకితము. సం. విశే. (అ. ఆ. అ.) చూడఁబడినది.

ఆలోక్యము. సం. = ఆలోకనీయము.

ఆలోచకుఁడు. సం. విశే. (అ. ఆ-చికా. అ.) ఆలోచించువాఁడు.

ఆలోచన. సం. వి. ఆ. స్త్రీ. అ. న. యోచన, ఆలోచించుట.

ఆలోచనము. సం. వి. అ. న. = ఆలోచన.

ఆలోచనీయము. సం. విశే. (అ. ఆ. అ.) ఆలోచింపఁదగినది.

ఆలోచించు. సం. స. క్రి. యోచించు, మంచిచెడ్డలు పరామర్శించు.

ఆలోచితము. సం. విశే. (అ. ఆ. అ.) ఆలోచింపఁబడినది.

ఆలోచ్యము. సం. విశే. (అ. ఆ. అ.) ఆలోచింపఁదగినది.

ఆలోడనము. సం. వి. అ. న. విచారించుట, ఆలోడించుట.

ఆలోడించు. సం. స. క్రి. 1.కలఁగఁజేయు; 2.బాగుగా విమర్శించు, పరిశీలించు; 3. మథించు; "ఆ. సర్వశాస్త్రవాక్యసమితి నాలోడించి, మఱియు దృఢవిచారమహిమ దెలిసి, నిశ్చయింపఁబడియె నిష్ఠ నారాయణు, డెపుడుఁ దలఁపవలయు నిది యొకండ." భార. అను. ౪,ఆ. ౩౬౮. "వ. అతండు వేదంబులు సదివి, తదర్థంబు నెఱింగి, ధర్మశాస్త్రంబులు పఠించి,పురాణంబు లధిగమించి, యంగంబు లభ్యసించి, తర్కంబు లాలోడించి, మీమాంసాద్వయం బాలోకించి." కాశీ. ౩, ఆ. ౭౯.

ఆలోడితము. సం. విణ. (అ. ఆ. అ.) ఆలోడింపఁ బడినది.

ఆలోలము. సం. విణ. (అ.ఆ.అ.) 1. కొంచెము చలించునది; 2. మిక్కిలి చలించునది. "సీ. గాలినవ్విటపమాలోల మగుడుఁ దగులెడలి యయ్యజినంబు పుడమిఁబడినఁ, గని యొక్క నాగంబు గ్రక్కునఁ జనుదెంచి...." భార. అశ్వ. 3, ఆ. ౧౦౫.

ఆలోలితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి చలించినది; 2. కొంచెము చలించినది.

ఆవ. దే. వి. 1. సర్షపము;—బ. సర్షపబీజములు. (ఆవాలు అని వాడుక.) ఆవంత = ఆవగింజంత, కొంచెము అని తాత్పర్యము. "ఉ. ... మనంబులోన నావంతయు శంక లేక ...." భార. కర్ణ. 3, ఆ. ౨౦౭; 2. సస్యరోగము, చీడ; 3. వరి పండునేల; 4. మిక్కిలి పల్లపుప్రదేశము, బాడవ, ముంపునేల.

ఆవకాయ. దే. వి. ఆవాలగుండ, మిర్చిగుండ, ఉప్పుగుండలు నూనెతో కలిపి కొంచెము మెంతులు వేసి పసుపు కలిపి మామిడికాయముక్కలతో గ్రుచ్చి యెత్తిపెట్టిన యూరుఁగాయ (ఇట్లె దోసకాయ ముక్కలతోను పెట్టుదురు.)

ఆవగింజె. దే. వి. సర్షపబీజము. "సీ. ఇపుడేమి గంటె నాకెక్కడి సిద్ధసంకల్పత గుమ్మడికాయలోన, నావగింజయుఁ బోదు వాంసినాచింతాభరంబులో లేశమాత్రము నుడుగుట, గలదె." ప్రభా. ౪, ఆ. ౫౨.

ఆవజము. వై.వి. వాద్యవిశేషము. "చ....అ, య్యావు మతిగాంచి డండియ యుపాంగము మద్దెలతాళ మావజం, బును గొని...." రామా. ౨,ఆ. ౭౯.

ఆవటము. దే. వి. పొందిక.— విణ. పొందికైనది. "గీ. ...వలయుసంపదలందనావటము వటము." భాగ. ౪,స్క౦. ౧౩౬. "వ....ఈశ్వపీటయోని యతని వివాహంబునం గూటసాక్షియై కైలాటంబు వేసి యప్పాటం దనకుం బెండ్లి ఘటింపఁజేయ నావటం బైయుండునట్లు సేయక హుంకంబెట్టు పరిగ్రహించె...." నైష. ౭, ఆ. ౧౦౩.

ఆవటముచేయు. దే. స. క్రి. పొందికపఱచు. "సీ. ... మోఁచేతివంపుగా ముడిచిపట్టినకేల వరదాభయంబులావటముచేసి..." పాండు. ౨,ఆ.౨౪.

ఆవటించు. దే. స. క్రి. (ఆవటిల్లఁజేయు) 1. పొందుపఱచు; "మ. చికురంబు ల్మొనసలంటనున్నచెమటల్ జెక్కుల్లలిర్పఁగ ఘటో, దకభారమ్మునఁ గెంపుహస్తయుగ ముద్ధారింప నంసంబులిం, చుక జాఱు జనుదోయి యూర్పుపడి సంక్షోభించి కంపింపఁ దా, నొకకేలం దుఱుమావటించు చెలువంబుల్లంబుఁ గొల్లాడదే." శివ. శకుం. ౨, ఆ. ౧౬౧; 2. కలిగించు.

ఆవటిలు. దే. అ. క్రి. 1. పొందుపడు. "గీ. అతఁడుఁ గొఱప్రాణములనుండి వారువుడెరువు, లావటిలఁ డెల్పె." రామా. ౮, ఆ. ౧౭౫; 2. కలుగు.

ఆవటిల్లు. దే. = ఆవటిలు.

ఆవట్టజము. సం. వి. అ. పుం. పారసీకాశ్వము. "పారసీకాః పరాదనా ఆవట్టజశ్చ." త్రి. శే. ష.

ఆవడ. దే. వి. 1. చేఁదుగలబీజ; 2. ఆమవడ యొక్క భ్రష్టరూపము. (వా)

ఆవడి. దే. వి. హావడి, ఉపద్రవము. "క. మానుగ జగములయావడి, మానుపఁగాఁ గోరి...."అచ్చ. సుం. ౧౩౮.

ఆవపనము. సం వి. అ. న. 1. (కాఁగు మొదలైన) పాత్రము; 2. (ధాన్యాదులు పోయు)గోనె; 3. విత్తనములు చల్లుట; 4. గొఱుగుట.

ఆవపాఱు. దే. అ. క్రి. 1. జ్ఞప్తికివచ్చు; 2. తోఁచు. 'యావపాఱు' అని వాడుక.

ఆవము. వై. వి. (కుమ్మరి కుండలులోనగునవి కాల్చుట కేర్పఱచిన) కావు, ఆవాపము.

ఆవరణము. సం. విణ. (అ. ఈ-ణీ. అ.) ఆవరించునది.— వి. అ. న. 1. ఆచ్ఛాదనము, కప్పు; 2. చుట్టుకొనుట; 3. ప్రాకారము. (సప్తావరణములు,—పృథివ్యప్తేజోవాయ్వాకాశాహంకార మహత్తత్త్వములు ప్రకృతితోడఁ గూడ అష్టావరణములగు. శ. ర.)

ఆవరించు. సం. స. క్రి. 1. చుట్టుకొను, ఆక్రమించు, క్రమ్ము; 2. కప్పు.

ఆవరించుకొను. మి. స. క్రి = ఆవరించు.

ఆవర్జనము. సం. వి. అ. న. 1. ఆకర్షణము; 2. క్రిందికివంచుట; 3. ఇచ్చుట.

ఆవర్జా. హిం. వి. వర్గు, దినచర్య లెక్కచూచి పద్దుల వారీనిర్ణాయము అసామీలవారీ లెక్క, లెఢరు.

ఆవర్జితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఇయ్యఁబడినది; 2. వంపఁబడినది.

ఆవర్తకము. సం. వి. అ. పుం. మేఘాధిపతులలో నొకటి(పుష్కలావర్తకాదులు మేఘాధిపతులు.)

ఆవర్తనము. సం. వి. అ. న. 1. మరలుట; 2. పాఠముయొక్కవల్లె, ఆవృత్తిఁజెప్పుట, వప్పు; 3. ఆలోచనముచేయుట; మథించుట.

ఆవర్తనీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మరలఁ దగినది; 2. మరలింపఁదగినది; 3. వల్లింపఁదగినది; (పాఠము) 4. మథింపఁదగినది (పెరుగు); 5. గుణింపఁదగినది. (అంకె.)

ఆవర్తము. సం. వి. అ. పుం. 1. గుణ్ణపుసుడి; 2. నీటిసుడి; 3. మరలుట; 4. పాఠముయొక్కవల్లె, దుప్పు.

ఆవర్తి. సం. విణ. (న్.ఈ-సీ.న్.)మరలివచ్చువాఁడు.

ఆవర్తించు. సం. స. క్రి. 1. (పాఠమును) వల్లించు. "సీ....నవవిల్లుశాస్త్రంబు మినుకులావర్తించుపని వెన్నతోఁ బెట్టినది మాకు. "స్వా ౨, ఆ. ౪౩; 2. పలుమార్లు చెప్పు. "క. మృతుఁడట బుట్టుఁ జెఱుంగును, మృతుఁడట వేల్పోకఁడు గుదువ, మేకొనఁ దృష్టికి మృతునకునట కర్మఫలం,బతిధూర్తులవార్తలేటి కావర్తింపక." నై. ౭, ఆ. ౭౫; 3. వర్తించు, ఉండు, కలుగు. "క. నీవడఁగినమం బ్రాణముఁ, గావఁగ మాయంద బోధకం బగు ద్రవ్యం,బావర్తింపఁగఁ జేయుట, గావించును నీవుఁ దెలిపుఁగనికొమ మిదియుక్." భార. అశ్వ. ౨,ఆ.౩౭; 4. మరలు. "వ. కుండినావనిపురందర ప్రియనందనయును దూష్ణీంభావంబుల నవ్విశ్వంభరాభర్తమీఁదఁ గటాక్షవీక్షణం బావర్తింపఁ దయ్యె." నైష. ౫, ఆ. ౬౬.

ఆవర్తితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మరలినది; 2. మరలింపఁబడినది; 3. వల్లింపఁబడినది; 4. మథింపఁబడినది, గుణింపఁబడినది. (అంకె.); 5. సుడిగలది, ఆవర్తముగలది.

ఆవల. దే. వి. (ఆ+వలను.) ఔప. 1. దేశమున అనంతరము. "సీ. రౌరవంబనఁగ ధరాస్థలిక్రింద మహారౌరవంబన నవుల దావి,కావల విను కంట కావనంబన నుండు..." భార. అను. ౫, ఆ. ౧౭౦; 2. కాలమున అనంతరము. "చ. అకట నితాంతలోభమున నావలఁ బాటిలుకీడు గానఁజాలక...." భార. భీష్మ. ౧, అ. ౧౯౬. "చ. అమరవరేణ్యునన్నయిన నావల నెయ్యది యైన నిప్డు ధర్మమహితుఁడైన ధర్మజుసమక్షము నం జెతఁగించి..." భార. అర. ౫,ఆ. ౪౩౨. 3. అవ్వైపు, అప్రక్క. "సీ. ...అవల నిషధరాజకులలోకేశ్వరుం, డీవలఁ బరమేష్ఠిహితుఁడ నేను..." నై. ౨, ఆ. ౬౬; 4. దూరము. "చ. అచిరములైన యన్యరుచులన్నియు నావలఁ ద్రోచి...." విక్ర. ౧, ఆ. ౯.

ఆవలి. ఉభ.దే.వి. ఆవడి. ఉపద్రవము. "సీ....మురహయగ్రీవాంత్ర మూలఫేనావలినావలిదలఁగఁ జీకాకుపఱచె...." ఉ. హరి. ౪, ఆ. ౧౨౪. ముద్రితమున "ఫేనావలి, నావలీవలఁగఁ జీకాకు పఱచె."అని కలదు; "క. ఆవేళ మంజువాణి య, నావిలగతిఁ జేరి దుస్సహామిళిందపుళిం, దావలి కావలికరువలి, యావలి కావలితహృదయయగు సతిఁ బలికెక." వసు. ౩, ఆ. ౧౨౬. 'అవల' అనుదాని విశేషణరూపము. 'ఆవలివాఁడు.'— సం. ఇ. స్త్రీ. పఙ్క్తి.

ఆవలించు. దే. = ఆవులించు.

ఆవలింత. దే. = ఆవులింత. "సీ....ఆవలింత యనంగ నావులింత యనంగ జృంభణసంజ్ఞయై చెలఁగుచుండు...." ఆం. భా. ప్ర. నా..౧౪౧.

ఆవలినాఁడు. ద్వ. వి. ఎల్లుండికి పరదినము.

ఆవలిమొన్న. ద్వ. వి. మొన్నటికి పూర్వదినము.

ఆవలియెల్లుండి. ద్వ. వి. = ఆవలినాఁటికి పరదినము.

ఆవశ్యకత. సం. వి. అ. స్త్రీ. ఆవశ్యకమగుట. చూ. ఆవశ్యకము.

ఆవశ్యకత్వము. సం. వి. అ. న. = ఆవశ్యకత.

ఆవశ్యకము. సం. వి. అ. న. అక్కఱ. శ. ర.— విణ. (అ. ఈ. అ.) తప్పక చేయఁదగినది, అవశ్యము జరుపవలసినది.

ఆవసథము. సం. వి. అ. పుం. 1. వసతిస్థానము, బస; 2. విశ్రమస్థానము, విశ్రాంతి తీసికొను చోటు; 3. గ్రామము.

ఆవసథీయుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ఆవసథమం దుండువాఁడు. చూ. ఆవసథము.

ఆవసానికము. సం. విణ. (అ. ఈ. అ.) అవసాన కాలమందయినది, అంతకాలమందున్నది.

ఆవసితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నులిచినది. (ధాన్యము); 2. నిర్ణయింపఁబడినది; 3. పూర్తి చేయఁబడినది, సమాప్తము.

ఆవహము. సం. విణ. (అ. ఆ. అ.) (దీనికి సమాసోత్తరపదముగానే ప్రయోగముండును.) 1. కలిగించునది. "క. ఆవేశ్యాజనులధికర,సావహ భక్ష్యములు విలసదనులేపనమా,ల్యావళులుఁ గొనుచు నరిగిరి..." భార. అర. 3,ఆ. ౯౫; 2. పొందించునది.—వి. అ. పుం. వాయుస్కంధ భేదము. చూ. వాయువు.

ఆవహించే. సం. స. క్రి. (ఆవహిల్లు. ప్రే). 1. (స్నేహము, దుఃఖము, ప్రీతి, మొ.) కలిగించు. "తే. అలుకఁ బురి నూర వవమున నగ్నియిడుట, పాపశీలతమై బొంకి బ్రాహ్మణునకు, నధికతర మగుశోకంబు నావహించు,టంచితాచార బ్రహ్మహత్యాసమములు." భార. అను. ౨, ఆ. ౬౯. "వ. అని యిత్తెఱంగునఁ బెక్కులు చింతించి తలంచుకొని కర్ణునకుం బుట్టువు దెలిపి సహోదర స్నేహం బావహించెద." భార. ఉద్యో. ౪, ఆ. ౫౦. "సీ.... ఫలమూలమధుమాంసములును మేలి, కూడుగూరలు దొరకొల్పి వారికిఁ దృప్తి యావహించుచు...." భార. శాం. 3, ఆ. ౧౭౭; 2. చేయు. "ఉ. ఆ త్తను భక్తిగల్గి మదినాయమ సెప్పిన మాడ్కి జీవికా, వృత్తము లావహింతు గురువిప్రజనాతిథిపూజనంబుల,త్యుత్తమభక్తినేన తగనోపి యొనర్తు...." భార. అర. ౫, ఆ. ౩౦౪; 3. ఆవాహనముచేయు, మంత్రమూలమున పిలిచి రప్పించు. "క. కని యిది గన్యక దోషం, బని తలఁపక బాల్యసంభృతాజ్ఞానము వే, డ్కనొనర్ప నావహించితి, మునిమంత్రబలమున సూర్యు మునినాథవరా." భార. ఆశ్ర. ౨, ఆ. ౯౦. "సీ. మణికర్ణికావారి మజ్జనంబొనరించి యవిముక్తములయందు శివుని నిల్పి, యాశివలింగంబు ననిశంబు సేవించి యందు విశ్వేశ్వరు నావహించి...." కాశీ. ౪, ఆ. ౨౮౬; 4. ఆవేశించు, సోఁకు. "ఆమెను అప్మరా రావహించినది" "ఆమెను గ్రహమావహించినది. మొ." (ఈయర్థమునందు అకర్మకముగాను వాడుక గలదు. ఆమెకు గ్రహమావహించినది; నిద్ర ఆవహించినది.")

ఆవహిల్లు. సం. అ. క్రి. కలుగు. "వ. ...అట్లుడావహిల్లిన రుధిరసాగరంబునకు రత్నాకరత్వం బలవరించె.... " భార. విరా. ౫, ఆ. ౧౩౩.

ఆవహుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. కలిగించువాఁడు. చూ. ఆవహము; 2. శ్రేష్ఠుఁడు. "క. అవ్వృద్ధక్షత్త్రతపము, వానిరి నోర్వంగ నీకు వచ్చిన నటుల పీ,రావహునిఁ గర్ణు నోర్వం,గా వచ్చిన గాదె నాకుఁ గడుఁ బ్రీతి యగున్." భార. ద్రో. ౫,ఆ. ౮. (ఇది 'ఉద్వహుఁడు' అను దానిననుసరించి యతిప్రాసానురోధమునఁ గవి కల్పించుకొనినపదమని తోఁచెడిని. నిఘంటువులలో ఈయర్థమునఁ గానరాదు.)

ఆవళి. ఉభ. దే.=ఆవడి. "చ. అ,త్యలఘుతరంగసంపదలకావళులావళులుత్పలచ్ఛదో, జ్జ్వలతకు గోల్గొ గోల్గొ" చమ. ౧, ఆ. ౨౫. (ఇట బౌపమ్యము తెలుపును)—సం. వి. ఇ. స్త్రీ. పఙ్క్తి, ఆవలి.

ఆవాపకము. సం. వి. అ. పుం. 1. అఁదుదానిచేతి మట్టిగాజు, సూడిగము; 2. ముంజేతిమురుగు.

ఆవాపము. సం. వి. అ. పుం. 1. పాదు; 2. విత్తులు చల్లుట; 3. ఆవము; 4. పరరాష్ట్రచింతన. (స్వరాష్ట్రచింతన తంత్రమనఁబడును); 5. చిమ్ముట; 6. తాళప్రాణక్రియాభేదము; 7. ఓడదాఁటించినకూలి; 8. వ్యథ; 9. క్షౌరము, మంగలిపని.

ఆవాయకము. సం. వి. అ. పుం. ఆవాపకము. శ. ర.

ఆవాలము. సం. వి. అ. న. 1. ఆలవాలము, పాదు; 2. సంచారము.

ఆవాసము. సం. వి. అ. పుం. సదనము, ఇల్లు.

ఆవాసించే. సం. అ. క్రి. 1. ఆవాసముచేయు, నివసించు; 2. జీవించు. "శా. వన్యాహారములన్ జితేంద్రియత నావాసించు నాకజ్ఞుఁడే, కన్యారత్నము నేగతిన్ గనియెడిన్......". భాగ. ౯, స్కం. ౬౧౦.

**ఆవాహనము.** సం. వి. అ. న. 1. ఆహ్వానము, పిలుపు; 2. దేవతలను విగ్రహాదులయందు సన్నిధి చేయుండని కోరుట.

**ఆవాహితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. పిలువఁబడినది; 2. ఆవాహనము చేయఁబడినది (దేవతాది.)

**ఆవి.** దే. వి. 1. శ్వాసము, ఊపిరి. "తే. ఆపయోధనముముక్కున నావిగలుగఁ బడమిపీకెడు...." భార. ఉద్యో. ౩, ఆ. ౪౧; 2. తాపము. "మ. విహరించుచున్ మలయానిలంబచటఁ దావిం జిక్కి నెమ్మేనియావి హరించుం బికనాదముల్ చెవికిఁ గావించుం జవుల్ మోదమా..." విజ. ౨, ఆ. ౫౩; 3. ఆవిరి. చూ. ఆవించే

**ఆవించే.** దే. స. క్రి. ఆవికలిగించు, ఆవిరి మీఁద కండు. "వ. కీచకతండులంబులం బిండిగొట్టి కొట్రఁబోసి యుప్పుగొప్పలుగాఁజేసి యావించిన కుడుములబానలు." శాశ. ౩, ఆ. ౩౬.

**ఆవిగ్నము.** సం.వి.అ.పుం. కలివి చె.—విశే. (అ.ఆ. అ.) ఆవేగమునొందినది, ఉద్రేకము నొందినది.

**ఆవిధము.** సం. వి. అ. పుం. తొలివేయుసాధనము, తొరపణము, బెజ్జము వేయు పనిముట్టు.

**ఆవిద్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. చక్కఁగా తొలుపఁబడినది, బెజ్జము వేయఁబడినది; 2. వంకరయినది.

**ఆవిరి.** దే. వి. 1. ఊష్మము, కాఁగిననీటిమీఁద పొగవలెఁ బైకిలేచు ఉష్మ; 2. చెఱువు మొదలగువాని నీటిమీఁద శీతకాలమునఁ బైకిలేచు పొగవంటిది; 3. నోటనుండియు ముక్కులనుండియు పొగవలె వచ్చునది. "మ. గురుగుంజెంచలి దుమ్మి లేఁడగికిసాకుం దంత్రిణీపల్లవో, త్కరముం గూడఁ బొరంటి నూనియలతోఁ గట్టావికట్టారికో, గిరముల్నెక్కి తమిం గొమల్పాలమువో గ్రేఁపుల్మెయుల్నాక మేఁ, కెరువుంగుంపటి మంచమెక్కి రి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్." ఆము. ౪, ఆ. ౧౩౪; 4. చీడ అను సస్యరోగము. "గీ. ఆవియనఁ జీడ యనఁగను నలరు సస్యరోగము." ఆం.భా.ద్వి. మ. ౧౨౪.

**ఆవిర్లు.** దే. అ. క్రి. చెమర్చు, శ. ర., ఆవిరిగలది యగు.

**ఆవిర్భవత్.** సం. (శతృంత.) ఆవిర్భవించుచున్నది. "ఉ....తన నెమ్మది దీఁటుకొనంగ జోటి యావిర్భవ దార్తియై చనియె...." నిర్వ. ౨, ఆ. ౨౨.

**ఆవిర్భవించే.** సం. అ. క్రి. ప్రభవించు, పుట్టు.

**ఆవిర్భవిలు.** సం. అ. క్రి.=ఆవిర్భవించే. "క. వంశపతియై జగత్పతి, యంశంబున వీని కొకరుఁ డావిర్భవిలున్...." కళా. ౨, ఆ. ౬౬.

**ఆవిర్భవిల్లు.** సం. = ఆవిర్భవిలు.

**ఆవిర్భావము.** సం. వి. అ. పుం. 1. ప్రభవము, పుట్టుక; 2. బయటఁబడుట, పయికివచ్చుట.

**ఆవిర్భూతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ప్రభూతము, పుట్టినది; 2. బయటఁబడినది.

**ఆవిలము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. కలఁకఁబాఱినది, కలుషము. (జలము); 2. వ్యాకులము. (మనస్సు).

**ఆవిలి.** దే. వి. మాంత్రికుఁడు ఉపయోగించెడు కాచపాత్రవిశేషము. శ. ర.

**ఆవిష్కరణము.** సం. వి. అ. న. 1. ప్రకటనము, వెల్లడిచేయుట; 2. బయటఁబెట్టుట, ప్రకటించుట.

**ఆవిష్కరించే.** సం. స. క్రి. 1. ప్రకటించు, వెలయించు; 2. బయలుపఱచు.

**ఆవిష్కర్త.** సం. విశే. (ఋ.ఈ-స్త్రీ.ఋ.) ఆవిష్కరింపఁజేయువాఁడు, ప్రకటించువాఁడు.

**ఆవిష్కృతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ప్రకటింపఁబడినది, వెలయింపఁబడినది; 2. బయలుపఱుపఁబడినది.

**ఆవిష్కృతి.** సం. వి. ఇ. స్త్రీ. = ఆవిష్కరణము.

**ఆవిష్క్రియ.** సం. వి. ఆ. స్త్రీ. = ఆవిష్కరణము.

**ఆవిష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆవేశమునొందినది; 2. చొచ్చినది, ప్రవేశించినది; 3. వ్యాపించినది.

**ఆవీతము.** స. విశే. (అ. ఆ. అ.) 1. బాగుగా కట్టఁబడినది (బట్ట); 2. బాగుగా ధరింపఁబడినది.

**ఆవు.** దే. వి. గోవు.—బ. వ. ఆవులు, ఆలు. "తే. ఆలనేయి ముఖ్యము..." భార.అను. ౪,ఆ.౨౨. (వృత్తియందు అంత్యవర్ణలోపము వికల్పముగ

నగు, ఆఁబెయ్య, ఆవుపెయ్య, ఆదూడ, ఆవు దూడ. మొ.)

ఆవుకుఁడు. సం. వి. అ. పుం. (నాట్యపరిభాష యందు) తండ్రి.

ఆవుత్తుఁడు. సం. వి. అ. పుం. (నాట్యపరిభాష యందు) బావ.

ఆవురు. దే. వి. 1. ఏడ్పునందగు ధ్వనికనుకరణము. "ఉ. దేవుఁడో హాని యో యని మదిందలపోఁతలు నాకెకానినిన్, వేవురు వేయిచందముల నిండయొ నర్చెదరిష్ట మూగయన్, పావులనోరు నీయెడను పాదతలంబునఁ దన్నినట్లుగా, నీవొకయింత యావురని యేడ్వఁగదన్న కుమారరత్నమా." పర. ౨,ఆ. ౧౭౬; 2. తహతహపడుటను తెలుపును. "ఆతఁడు పొలము తిరిగివచ్చి అన్నమునకు ఆవు రావురని కూర్చుండియున్నాఁడు."

ఆవులించే. దే. అ. క్రి. 1. ఆవులింతవిడుచు, జృంభించు. "తే. అసురనాథుండు నలసతయడర నీల్గి, యావులించిన నత్తఱినమరవిభుఁడు, దనశరీరంబు సంకుచితంబు సేసి, కడుజవంబునఁ గుప్పించి వెడల నుఱికె." భార. ఉద్యో. ౧, ఆ. ౧౨౫; "చ....ఆయ్యసురాధముండు బి,ట్టొడలు గద ల్చి నీల్గి వివృతోగ్రముఖుం డయి యావులించి నన్." భార. ఆర. ౪, ఆ. ౪౦౯; 2. వికసించు, తెఱచుకొను. "సీ. మొనలావులించి వాసన సల్లఁ బసిగొని లేఁదేఁటిగము లెంగిలింప కుండ......పసిఁడితామరల......" కు. సం. 3, 3౫౧; 3. నోరుతెఱచు. "ఆ. ఆవులించు తలయు నదరెడునట్టియుఁ, జూచి ప్రీతుఁడగుచు సురవిరోధి." నిర్వ. ౪, ఆ. ౪౦; 4. నోరువెళ్లఁ బెట్టు, సమాధానము చెప్పలేక నోరుతెఱచు కొనియుండు. "వానిని నిలఁబెట్టి గట్టిగా అడుగఁగా నోరావలించినాఁడు" అని వాడుకకలదు; 5. ఊపిరివిడుచు,చచ్చు. "వాఁడు నోరావులించినాఁడు, ఆవులించినాఁడు" అనియు వాడుక.

ఆవులింత. దే. వి. ఆవులించుట, జృంభణము. "ఆ. ఆవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవనంబు గుప్త వర్తనములుగాఁగఁ, జలుపవలయు నృపతి గొలువున్నయెడల బాహిరములైనఁ గెలని కెగ్గులగుట." భార. విరా. ౧, ఆ. ౧౩౭.

ఆవృతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆవరింపఁబడినది, వలయితము, చుట్టుకొనఁబడినది; 2. రక్షింపఁబడినది. "మత్త. ఆపిఁగోలెను గృష్ణుచే దయ నావృతుండయి ధౌమ్యుతో, వేదమంగ యుతంబుగాఁ జదివెన్...." భార. ఆది. ౮, ఆ. ౨౨౭.

ఆవృత్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తిరుగుడు పడినది; 2. ఆవృత్తిచేయఁబడినది, మరల మరల అభ్యసింపఁబడినది; 3. తిరిగిచేయఁబడినది.

ఆవృత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. తడవ, పర్యాయము, సారి; 2. తిరుగుడు; 3. వల్లె, మరల మరలఁ జదువుట.

ఆవృత్తు. సం. వి.త్. స్త్రీ. న. అనుక్రమము, సొరిది.

ఆవేగము. సం. వి. అ. పుం. 1. సంభ్రమము, తొట్రుపాటు, ఉద్రేకము; "వ. ... ఈయావేగంబున నొండుపాయంబు గలుగనేరదు...." దశ. ౫,ఆ. ౧౧౭; 2. కోపము.

ఆవేగి. సం. వి. ఈ. స్త్రీ. వృద్ధదారకము, బొద్దికూర ✻. —విణ. (న్. ఈ. న్.) ఆవేగముగలవాఁడు.

ఆవేదకుఁడు. సం. విణ. (అ. ఆ-దికా. అ.) 1. తెలిపెడువాఁడు; 2. విజ్ఞాపనముచేయువాఁడు; 3. వ్యాజ్యెము తెచ్చినవాఁడు, వాది.

ఆవేదనము. సం. వి. అ. న. 1. తెలుపుట; 2. విజ్ఞాపనము చేయుట, మనవి; 3. వ్యాజ్యెము వేయుట.

ఆవేదనీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తెలుపఁదగినది; 2. మనవిచేయఁదగినది, విజ్ఞాపనచేయఁదగినది; 3. (వ్యవహారమున) వాదిచే తెలుపఁదగినది.

ఆవేదించే. సం. స. క్రి. 1. తెలుపు, చెప్పు. "వ... సత్యవతీనందనుం డాగామిశుభంబు లావేదించి చనిన...." భార. ఆది. ౭,ఆ. ౧౬౫; 2. విజ్ఞాపనముచేయు మనవిచేయు; 3. వ్యాజ్యెము వేయు.

ఆవేదితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తెలుపఁబడినది; 2. విజ్ఞాపనము చేయఁబడినది; 3. దావా చేయఁబడినది.

ఆవేద్యము. సం. = ఆవేదనీయము.

ఆవేశనము. సం. వి. అ. న. 1. కమ్మరము చేయు

సాల, పట్టడ; 2. ప్రవేశము; 3. ఒడలెఱుఁగమి, పరవశత్వము; 4. గ్రహాదులు సోఁకుట.

**ఆవేశము.** సం. వి. అ. పుం. 1. ఒళ్లెఱుఁగమి, సమావేశము; 2. గ్రహాదులు సోఁకుట; 3. వేగిర పాటు; 4.అభినివేశము, పట్టుదల;5. ఉద్రేకము.

**ఆవేశించు.** సం. అ. క్రి. 1. ప్రవేశించు, చొచ్చు; 2. కలుగు. "క. నీవట్టిఁడ వగు టెఱుఁగవు, భావంబున సంశయమును భయమును బొల్యం, బావేశింపఁగఁజేయ న,భావితనిశ్చయుండ వగుటఁ బరమమునీంద్రా." భార. శాం. ౬, ఆ. ౨౪౯; 3. (గ్రహము) సోఁకు.

**ఆవేశికుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. అతిథి; 2. బంధువు.

**ఆవేశితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉంచఁబడినది, స్థాపింపఁబడినది; 2. ఆవేశింపఁజేయఁబడినది.

**ఆవేష్టకము.** సం. వి. అ. పుం. 1. ముండ్లకంచె; 2. చుట్టును పెట్టుగోడ. ప్రహరి.

**ఆవేష్టనము.** సం. వి.అ. న. 1. ఆవరించుట, చుట్టును చుట్టుట; 2. కంచె, ఆవరణము.

**ఆశ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆపేక్ష; 2. దిక్కు.

**ఆశంక.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆశాంతి; ప్రశ్నించుట; 2. శంక, భయము.

**ఆశంకనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. శంకింపఁదగినది, భయపడఁదగినది; 2. ప్రశ్నింపఁదగినది.

**ఆశంకి.** సం. విణ. (న్.ఈ.న్.) ఆశంకించువాఁడు.

**ఆశంకించు.** సం. అ. క్రి. 1. శంకచేయు, ప్రశ్నించు; 2. భయపడు.

**ఆశంక్యము.** సం. = ఆశంకనీయము.

**ఆశంస.** సం. వి. ఆ. స్త్రీ. 1. కోరుట; 2. ఇచ్ఛ, అభిలాష; 3. చెప్పుట.

**ఆశంసనము.** సం. వి. అ. న. 1. కోరుట; 2. చెప్పుట.

**ఆశంసి.** సం. విణ. (న్. ఈ. న్.) 1. కోరువాఁడు. 2. చెప్పువాఁడు.

**ఆశంసిత.** సం. విణ. (ఋ.ఈ.సిత్రీ.ఋ.) 1. కోరువాఁడు; 2. చెప్పువాఁడు.

**ఆశంసితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కోరఁబడినది; 2. చెప్పఁబడినది.

**ఆశంసువు.** సం. విణ. ఉ. = ఆశంసిత.

**ఆశపడు.** మి. అ. క్రి. అపేక్షపడు, కోరు.

**ఆశపాశలు.** సం. గ్రా. (ఆశాపాశములు అను దాని భ్రష్టరూపము.) ఆశానుబంధములు. "సీ. సమ్ముఖమ్మునుండి చనుదెంచు నలవ్రాయసమువారి కాశపాశలు ఘటించి." కుప. ౪, ఆ. ౬౧.

**ఆశపెట్టు.** మి. స. క్రి. అపేక్షపెట్టు, ఆసకలిగించు.

**ఆశము.** సం. విణ. (అ.ఆ.అ.) తినునది. (సంస్కృత సమాసోత్తరపదముగానే యుండును.)(ఆశ్రయాశుఁడు, హుతాశుఁడు మొ.)— వి. అ. పుం. 1. తిండి; 2. అన్నము; 3. అగ్ని; 4. వ్యాపించుట.

**ఆశయము.** సం. వి. అ. పుం. 1. అభిప్రాయము; 2. ఆధారము; (మహాశయుఁడు.) (జలాశయము.) 3. మనస్సు; 4. విభవము; 5. పనస✥; 6. సంస్కారము; 7. శయనము; 8. స్థానము; 9. మృగములను పట్టుకొనునప్పుడు పడగొట్టుటకు త్రవ్వెడు గోయి.

**ఆశయిత.** సం. విణ. (ఋ.ఈ-త్రీ.ఋ.) తినిపించువాఁడు.

**ఆశరుఁడు.** సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. రాక్షసుఁడు.

**ఆశాబంధము.** సం. వి. అ. పుం. 1. ఆశయనుబంధము; 2. సాలెపట్టు.

**ఆశాసనము.** సం. వి. అ. న. ఆశీర్వాదము.

**ఆశాసించు.** సం. స. క్రి. 1. ఆశీర్వదించు; 2. కోరు. "తే. వారలకు శ్రీయు నాయువు వైరిజయము, మానసమున నాశాసించు మానవేంద్ర ... ." భార ఆశ్ర. ౧, ఆ. ౧౪.

**ఆశాస్తి.** సం. వి. ఇ. స్త్రీ. ఇచ్ఛ, కోరిక.

**ఆశాస్యము.** సం. విణ. (అ. ఆ. అ.)1. ఆశీర్వదింపఁదగినది; 2. ప్రార్థింపఁదగినది. "క. ఆశాస్యములైన యనే,కాశీర్వాదంబు లొసఁగి." సై. ౫, ఆ. ౧౪.—సం. వి. అ. న. కోరిక. "సీ. ... సాధింపరానియాశాస్యంబు గలుగునే..." సై. ౬, ఆ. ౨౮; 3. ఆశీర్వాదము, దీవన.

ఆశి. సం. వి. ఈ. స్త్రీ. పాముయొక్క కోఱ.—విణ. (న్. ఈ. న్.) తినువాఁడు. (సమాసాంతముననే ప్రయోగము) తినువాఁడు. (అమృతాశి మొ.)

ఆశించే. సం. స. క్రి. అపేక్షించు, ఆసించు, కోరు. "మ....నిరాహారుఁడై, తను వాశింపక యేండ్లు వేయుఁ గడపెఁ ద్రైలోక్య మారాయవన్." ఉ. రా. ౧, ఆ. ౧౬౭.

ఆశితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తినఁబడినది; 2. గవీనము, అంతకుముందు ఆవులను మేపినది. (పొలము.)

ఆశిరము. సం. వి. అ. పుం. 1. పాలవిఱుగుడు, క్షీర వికృతము; 2. పీయూషము, జున్ను; 3. అగ్ని; 4. భోజనము, తిండి.

ఆశీర్వచనము. సం. వి. అ. పుం. దీవన, ఆశీర్వాదము.

ఆశీర్వచించే. సం. స. క్రి. ఆశీర్వదించు, దీవించు.

ఆశీర్వదించే. సం. స. క్రి. దీవించు.

ఆశీర్వాదము. సం. వి. అ. పుం. దీవన.

ఆశీవిషము. సం. వి. అ. పుం. సర్పము, పాము.

ఆశీస్సు. సం. వి. స్. స్త్రీ. 1. హితముకోరుట; 2. దీవన; 3. పాముయొక్క కోఱ.

ఆశుగము. సం. వి. అ. పుం. (వేగముగాఁబోవునది) 1. బాణము; 2. గాలి.

ఆశువు. సం. వి. ఉ. పుం. 1. అఱువదిదినములలో పండు ధాన్యము; (ఆశువ్రీహి); 2. ఎఱ్ఱజిలమ వడ్లు.—క్రి.విణ. న.వేగ.—విణ. వేగముగలది.

ఆశుశుక్షణి. సం. వి. ఇ. పుం. (శుష్కింపఁజేయునది) అగ్ని, నిప్పు.

ఆశౌచము. సం. వి. అ. న. అశుచిత్వము, పరిశుద్ధి లేమి.

ఆశ్చర్యము. సం. వి. అ. న. అచ్చెరువు.—విణ. అచ్చెరువైనది.

ఆశ్మనము. సం. = ఆశ్మము.

ఆశ్మము. సం. విణ. (అ. ఈ. అ.) శిలామయము, ఱాతితోఁ జేసినది.

ఆశ్రపణము. సం. వి. అ. న. పాకము.

ఆశ్రమము. సం. వి. అ. పుం, నం. 1. పర్ణశాల; 2. బ్రహ్మచర్యాది; (ఇవి నాలుగు.—బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము.) 3. తపోవనము; 4. మఠము.

ఆశ్రమి. సం. విణ. (న్. ఈ. న్.) ఆశ్రమములుగల వాఁడు.

ఆశ్రయణము. సం. విణ. (అ. ఈ. అ.) ఆశ్రయించునది.—వి. అ. న. 1. ఆశ్రయించుట; 2. సేవించుట; 3. అవలంబించుట; 4. ఆశ్రయము.

ఆశ్రయణీయము. సం. విణ. (అ. ఆ. అ.) ఆశ్రయింపఁదగినది.

ఆశ్రయము. సం. వి. అ.పుం. 1. అండ; 2. ప్రాపు, అవలంబనము. "తే. ఇతనియాశ్రయమున మన మెల్ల బ్రదికి, యున్నవారము గావున నుగ్రరిపుల, పాలువడకుండ విడిపింపఁ బాడి..." భార. విరా. 3, ఆ. ౨౦౪. "సీ...జమదగ్నిసుతుకృపాశ్రయమునఁ బడసినవిలువిద్య గలరూపు వెలయఁజేయ..." భార. విరా. ౪, ఆ. ౨౦౫; 3. ఆశ్రయించుట, "మహదాశ్రయము; నీచాశ్రయము;" 4. ఇల్లు.

ఆశ్రయాశి. సం. వి. న్. పుం. విణ. (న్.ఈ.న్.)= ఆశ్రయాశుఁడు.

ఆశ్రయాశుఁడు. సం. వి. అ. పుం. (ఉన్నచోటు తినివేయువాఁడు.) అగ్ని.—విణ. (అ. ఆ. అ.) ఆశ్రయించినచోటు ధ్వంసముచేయువాఁడు.

ఆశ్రయాసిద్ధము. విణ. (అ.ఆ.అ.) 1. ఆశ్రయము లేనిది, ఆధారములేనిది; 2. అసంభవము. "తే. ...అభ్రకుసుమసౌరభసాధనార్థహేతు, వాశ్రయాసిద్ధమనియెడియయ్యలెల్ల." ప్రభా. ౩, ఆ. ౮౪.

ఆశ్రయాసిద్ధి. సం. వి. ఇ. స్త్రీ. సాధింపఁబోవువిషయమునకు ఆధారము లేకపోవుట (ఇది తర్కదోషములలో నొకటి.)

ఆశ్రయి. సం. విణ. (న్. ఈ. న్.) ఆశ్రయముగలవాఁడు.

ఆశ్రయించే. సం. స. క్రి. ఆశ్రయముచేయు, అండగొను.

ఆశ్రవము. సం. వి. అ. పుం. 1. అంగీకారము; 2. క్లేశము.

ఆశ్రపుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మాటదాఁటని వాఁడు, చెప్పినట్లు వినువాఁడు.

ఆశ్రి. సం. వి. ఇ. స్త్రీ. కత్తివాదర, కత్తియంచు.

ఆశ్రితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆశ్రయింపఁబడినది; 2. ఆశ్రయించినది.

ఆశ్రుతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అంగీకరింపఁబడినది, సమాహితము; 2. బాగుగా వినఁబడినది.

ఆశ్రేయము. సం. = ఆశ్రయణీయము.

ఆశ్లిష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆలింగితము, కవుఁగిలింపఁబడినది; 2. బాగుగాఁ గలిసియున్నది.

ఆశ్లేష. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక నక్షత్రము, ఆశ్లేషము, ఆసిలేరు.

ఆశ్లేషము. సం. వి. అ. పుం. 1. ఆలింగనము; 2. ఆశ్లేషానక్షత్రము.

ఆశ్లేషించు. సం. స. క్రి. 1. కవుఁగిలించు. "మ. అతఁడుం గౌరిపదాబ్జముల్ గడియ సాష్టాంగంబుగా మ్రొక్కి యూర్జితసౌహార్దము గానరా బిగియ నాశ్లేషించి ప్రద్యుమ్ను క, ర్ణితసూజాతులు తోడుగా వరుగుమన్నన్ దల్లికిన్ దేవకీ, పతికిన్ వందనమాచరించి కదలెన్ జంచద్రథారూఢుఁడై." శై. 3, ఆ. ౧౨3; 2. క్రమ్ము.

ఆశ్వత్థము. సం. వి. అ. న. అశ్వత్థఫలము, రావిపండు.

ఆశ్వము. సం. వి. అ. న. 1. గుఱ్ఱములసమూహము, ఆశ్వీయము; 2. గుఱ్ఱపుబండి.—విణ. (అ. ఈ. అ.) అశ్వసంబంధమయినది.

ఆశ్వయుజము. సం. వి. అ. పుం. అశ్వినీనక్షత్రయుక్తపౌర్ణమిగల మాసము.

ఆశ్వయుజి. సం. వి. ఈ. స్త్రీ. అశ్వినీనక్షత్రయుక్తపౌర్ణమి, ఆశ్వయుజపౌర్ణమి.

ఆశ్వలాయనుఁడు. సం. వి. అ. పుం. 1. ఋగ్వేదసంబంధమగు శ్రౌతసూత్రము రచించిన యొకానొక ఋషి; 2. ఆశ్వలాయనసూత్రమును అనుసరించు బ్రాహ్మణుఁడు.

ఆశ్వసించు. సం. స. క్రి. 1. ఊఱడిల్లు; 2. ఊఱడించు.

ఆశ్వసితము. సం. విణ. (అ. ఆ. అ.) ఊఱడిల్లినది, ఊఱడింపఁబడినది. శ. ర.

ఆశ్వాసనము. సం. విణ. (అ. ఆ. అ.) ఓదార్చునది.—వి. అ. న. ఓదార్చుట.

ఆశ్వాసము. సం. వి. అ. పుం. 1. ఊఱడిల్లుట; 2. సాంత్వనము, ఊఱడించుట; 3. పైకి ఊపిరివిడుచుట; 4. ఎగయూపిరి; 5. ఆఖ్యాయికలపరిచ్ఛేదము; 6. ఆంధ్రప్రబంధములలోని పరిచ్ఛేదము.

ఆశ్వాసి. సం. విణ. (న్. ఈ. న్.) 1. ఓదార్చువాఁడు; 2. ఓదార్పుగలవాఁడు; 3. ఆశ్వాసములు గలది.

ఆశ్వాసించు. సం. స. క్రి. 1. ఊఱడిల్లు; 2. ఊఱడించు, ఓదార్చు. "వ...అతి త్వరితంబునం జని యాసురగృహీత యై యాక్రోశించుచున్న కన్యకం గని దాని నాశ్వాసించుచు." మార్క. ౮, ఆ. ౧౬౨.

ఆశ్వాసితము. సం. విణ. (అ. ఆ. అ.) ఊఱడింపఁబడినది.

ఆశ్వాస్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఓదార్పఁదగినది; 2. బతిమాలఁదగినది, సాంత్వనీయము.

ఆశ్వికుఁడు. సం. వి. అ. పుం. గుఱ్ఱపురౌతు.

ఆశ్వినము. సం. వి. అ. పుం. ఆశ్వయుజమాసము.

ఆశ్వినులు. సం. వి. బ. ఆశ్వినేయులు, అశ్వినీపుత్రులు. "తే. కవలవారు సూర్యేందుప్రకాశతేజు, లాశ్వినులయంశములఁ బుట్టి రమరగుణులు." భార. ఆది. ౫, ఆ. ౧33.

ఆశ్వినేయులు. సం. వి. అ. పుం. బ. అశ్వులు, అశ్వినీదేవతలు.

ఆశ్వీనము. సం. విణ. (అ. ఆ. అ.) గుఱ్ఱము ఒకదినము నడవఁదగినది. (త్రోవ.)

ఆశ్వీయము. సం. వి. అ. న. ఆశ్వము, అశ్వసమూహము.

ఆషాఢి. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకనక్షత్రము.

ఆషాఢము. సం.వి. అ.పుం. 1. ఆషాఢానక్షత్రయుక్తపూర్ణిమగల మాసము; 2. బ్రాహ్మణ బ్రహ్మచారి పట్టుకొనెడు మోదుగుకోల; 3. మలయపర్వతము.

ఆషాఢి. సం. వి. ఈ. స్త్రీ. ఆషాఢశుద్ధపౌర్ణమి (ఉత్తరాషాఢా నక్షత్రయుక్తపూర్ణిమ.)

ఆషామూషీ. హిం. అవ్య. 1. అశ్రద్ధ; 2. వివరణము లేమి. "ఆషామూషీగా చూచినాను. పరిశీలింప లేదు."

ఆష్కార్ఖానా. హిం. వి. సత్రము. శ. ర.

ఆష్ఠీవనము. సం. వి. అ. న. అంతటనుమ్మి వేయుట, ఉమ్మి వేయుట.

ఆస. వై. వి. 1. ఆశ, ఇచ్ఛ, అపేక్ష; 2. దిక్కు.

ఆసంగము. సం. వి. అ. పుం. 1. ఆశ్రయము; 2. ఆసక్తి, తగులము; 3. పట్టుదల.

ఆసంగిని. సం. వి. ఈ. స్త్రీ. సుడిగాలి.

ఆసంది. సం. వి. ఇ. పుం. 1. శవవాహనము, కటువు; 2. చౌకమగుమంచము; 3. చేవరపుపీట.

ఆసకప్పెరగాడు. ద్వ. వి. పక్షివిశేషము. శ. ర.

ఆసక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. అపేక్ష, ఆస; 2. తగులము.

ఆసక్తుడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. అపేక్షించువాడు, ఆసగొన్నవాడు; 2. కూడియున్నవాడు.

ఆసచేయు. వై. స. క్రి. ఆశించు, అభిలషించు. "ఉ. ఇంద్రపదంబు గోరఁడు దిగీశులరాజ్యము లాసచేయఁడు." వి. పు. ౨, ఆ. ౬౫.

ఆసత్తి. ఉభ. వై. వి. ఆశ.—సం. ఇ. స్త్రీ. 1. లాభము; 2. దగ్గఱసంబంధము; 3. ప్రత్యక్షజనకమగు సన్నికర్షము, ఇంద్రియసన్నికర్షము.

ఆసదనము. సం. వి. అ. న. 1. ప్రాప్తి, పొందుట; 2. సమీపసంబంధము.

ఆసన. సం. వి. ఆ. స్త్రీ. 1. కూర్చుండుట; 2. స్థితి.

ఆసనము. సం. వి. అ. న. 1. (కూర్చుండుట కాధారము.) పీఁట, మె; 2. స్వస్తికాది; (స్వస్తికాసనము, గోముఖాసనము, బద్ధాసనము, పద్మాసనము, వీరాసనము, సింహాసనము, భద్రాసనము, ముక్తాసనము. (దీనికి సిద్ధాసనమని, వజ్రాసనమని, గుప్తాసనమనియు నామాంతరములు గలవు.) మయూరాసనము. మొ. శ. ర.); 3. బలాదులలోపము చేత శత్రువుపై దండెత్తి పోవక నిలుచుట, యుద్ధమునకుఁ బోవక తన దుర్గమున నుండుట. (ఇది రాజనీతియందు షడ్గుణములలో నొకటి. యానమునకు వ్యతిరేకము.) 4. ఏనుఁగుమూఁపు.—పుం. వేఁగిస.

ఆసని. సం. వి. ఈ. స్త్రీ. 1. విపణి, అంగడివీథి; 2. మర్యాద, హద్దు.

ఆసన్నము. సం. వి. అ. న. దాపు.—విశే. (అ. ఆ. అ.) 1. దాపైనది; 2. సిద్ధమైనది.

ఆసన్నించు. సం. అ. క్రి. ఆసన్నమగు, సమీపించు. "మ. స్వకులంబెల్ల నశింపఁ గాలమిపు డాసన్నించె నింకైన మల్లిక గావింపుము మానసంబొడల యాలిక్ దేర సత్కీర్తియే." అధ్యా. యుద్ధ. ౧౭౬.

ఆసపడు. వై. అ. క్రి. కోరు, అపేక్షపడు.—స. క్రి. ఆశించు. "క. ... ధరణీశ పాండుపాలిక, ధరావలయమాసపడుట దగదే నీకున్." భార. శాంతి. ౧, ఆ. ౧౧౨. "క. స్త్రీసంతోషించు తెఱంగాసపడని మనసుగలుగునట్టి యధముఁడు. ..." భార. అశ్వ. ౪, ఆ. ౨౮౯.

ఆసపాటు. వై. వి. అపేక్షపడుట, ఆశించుట. "సీ. ...ఆసపాటును నవజ్ఞతయు నెందున లేక..." భార. అశ్వ. ౧, ఆ. ౨౦౩.

ఆసరా. వై. వి. ఆశ్రయము, ప్రాపు, అండ.

ఆసవము. సం. వి. అ. పుం. 1. పక్వము చేయని చెఱకురసముతోఁ జేసిన మద్యము; 2. ద్రాక్షాదిరసముతోఁ జేసినమద్యము; 3. కల్లుతేట; 4. పూఁదేనె.

ఆసాదకుఁడు. సం. విశే. (అ. ఆ-దికా. అ.) పొందించువాఁడు.

ఆసాదనము. సం. వి. అ. న. 1. ప్రాప్తి, పొందుట; 2. పొందించుట; 3. సిద్ధము చేయుట; 4. దగ్గఱనుంచుట.

ఆసాది. దే. వి. 1. మాదిఁగ. "సీ. ...ఆసాదిగోసంగి మాదిఁగ గూబరి యన, మాతంగుఁడగు..." ఆం. భా. ద్వి. కాం. ౨౮౯; 2. =ఆసాదివాఁడు.

ఆసాదించు. సం. స. క్రి. 1. ప్రాపించు, పొందు; 2. పొందించు; 3. సిద్ధము చేయు; 4. దగ్గఱనుంచు.

ఆసాదితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ప్రాప్తము, పొందఁబడినది; 2. సిద్ధము చేయఁబడినది; 3. దగ్గఱనుంచఁబడినది.

ఆసాదివాఁడు. దే. వి. గ్రామదేవతగుడిలో అర్చన చేయువాఁడు. "అట్టుపెట్టు ఆసాదివానిది రట్టు రవ్వ గంగానమ్మది" అని సామెత.

ఆసాద్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రాప్యము; పొందఁదగినది; 2. దగ్గఱగానుండఁదగినది; 3. సిద్ధముచేయఁదగినది; 4. శిక్షింపఁజేయఁదగినది.

ఆసాము. హిం. వి. ఆధారము.

ఆసారము. సం. వి. అ. పుం. 1. జడివాన, ధారా సంపాతము; 2. మిత్రబలము; 3. సేన వ్యాపించుట; 4. వ్యాపించుట; 5. ముసుగళ్ళు; 6. జిల్లేడుళ్ళు; 7. వేగము.

ఆసాసలు. వై.వి.బ. అభిలాషలు. "క. ఆసాసలవచ్చితి నను, గాసింబెట్టి యిది యడలఁగలసెను...." భార. శాం. ౩, ఆ. ౧౫౩. "ఉ....మూసికొనంగ వత్తురొక మోహాదమ్ముల మ్రగ్గనేని నా,సాసల నొక్కఁడుండయను నాగ్రహవృత్తి బలంబువైఁ బడున్." భార. విరా. ౫, ఆ. ౨౮౦.

ఆసించు. వై. అ. క్రి. ఆసపడు. "ద్వి. సీతఁ దెచ్చుట కు నాసించి వచ్చుటయు." రా. అర. ౧౭౮-పు.—స. క్రి. అపేక్షించు, కోరు. "తే...నీగురుండో రునాసించునే మహేంద్ర." భార. అశ్వ. ౧, ఆ. ౩౬. "శా. ఆహా! లెస్స! వివేకమే! పురహరుం డాసించియున్నాఁడె నీ, స్వావాకారము? శంభుఁబాసి యిట నీపత్రంబునందేను మృష్టాహారంబు భుజింపవచ్చితినె మోహాంధుండవై యీ శ్వరద్రోహంబేటికిఁ జేసెదంచు హితబుద్ధుల్ సెప్పఁగా వచ్చితిన్." కాశీ. ౭, ఆ. ౭౨.

ఆసికుఁడు. సం. వి. అ. పుం. (అసినుపయోగించువాఁడు), ఖడ్గాయుధుఁడు.

ఆసితము. సం. వి. అ. న. 1. ఉనికిపట్టు; 2. కూర్చుండుట; 3. కూర్చుండుచోటు.—విణ. (అ.ఆ.అ.) కూర్చుండినది.

ఆసిద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. (వ్యవహారమున) అడ్డగింపఁబడినది; 2. కట్టాయితమయినది, సిద్ధమైనది.

ఆసీనుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) కూర్చున్నవాఁడు.

ఆసు. దే. వి. బట్టలు నేయునపుడు పడుగుదారము కూర్చుట కుపయోగించు పనిముట్టు. (దీనిలో కండె యుంచెదరు.) "ఆసులో కండెవలె వాఁడు వాని మిత్రునితోఁ దిరుగుచున్నాఁడు." అని వాడుక.

ఆసుఁగ్రోవి. దే. వి. (ఆసు+క్రోవి.) నేతగాఁడు ఆసుపోయునపుడు) నూలుచొప్పించెడు గుల్ల, ఆసుపుల్ల అనియు వాడుక.

ఆసుమ్రాను. దే. వి. నేతనేయువాని పనిముట్టులలో నొకటి. (నూలుపోఁగువాటించుటకై వరుసకు మూఁడువంతునఁగాని అయిదువంతునఁగాని నాలుగైదువరుసలుగా మొలలుగూర్చిన కొయ్య చట్టము అని శ. ర.) (ఆసు నే కొందఱు ఆసుమ్రానని వాడుదురు.)

ఆసురము. సం. విణ. (అ. ఈ-రీ. అ.) అసురసంబంధమైనది.—సం. వి. అ. న. 1. ఇంతయని నియమితమగు ధనమిచ్చి కొన్నకన్యకను పెండ్లాడుట; (ఆసురవివాహము.) 2. బొంతకాకి; 3. చేవు టుప్పు; 4. భయంకరత్వము; ఈయర్థమున ఆంధ్ర గ్రంథములలోఁ గనఁబడుచున్నది. "సీ....వారలలో బలవంతుండు బకహిడింబాసురులనువారి నాసురమునఁ జంపె. ..." భార. అర. ౧, ఆ. ౧౦౨. "క. ... శతానీకుఁడెదిర్చి నతనినాసుర భంగిన్...." భార. భీష్మ. ౩, ఆ. ౩౮౯. "చ. ...కరుణ యొకింతలేక యెఱగందుల దేవకిగన్న యార్వురం, బరుషవిశాలఘోరశిలపైఁ గడకాళులు పట్టి వ్రేసి యా,సురముగఁ జంపెఁ గంసుఁ డురుశోణితముల్చెదరంగఁ జెచ్చెరన్." హరి. పూ. ౫, ఆ. ౧౦౭.

ఆసురి. సం. వి. ఈ. స్త్రీ. 1. కృష్ణిక, నల్లావలు; 2. రాక్షసస్త్రీ.

ఆసురీణము. సం. విణ. (అ. ఆ. అ.) నల్లావలుపండునది. (పొలము.)

ఆసురుఁడు. సం. వి. అ. పుం. 1. అసుర, రాక్షసుఁడు; 2. నిర్బృతి, మూలచేఁడు.

ఆసువోయు. దే. స. క్రి. (ఆసు+పోయు.) (ఆసుమ్రాని మొలలకునూలు) పోఁగువాటించు. శ. ర. ఆసున నూలుతోడు.

ఆసేకము. సం. వి. అ. పుం. 1. చల్లుట; 2. తడుపుట.

ఆసేచనకము. సం. విణ. (అ. ఆ-నికా. అ.) ఎంత

చూచినను తృప్తితీఱనిది. (నయనయుగాసేచనకము రూపము.)

ఆసేచనము. సం. విణ. (అ. ఈ. అ.) 1. చల్లునది; 2. తడుపునది; 3. ఎంతచూచినను తృప్తితీఱనిది. (కోరఁబడినది అని శ. ర.)

ఆసేద్ధ. సం. విణ. (ఋ. ఈ-ద్ధ్రీ. ఋ.) (వ్యవహారమున) రాజాజ్ఞచే ప్రతివాదిని నిరోధించువాది (వారంటు అమలు జరిపినవాఁడు.)

ఆసేధము. సం. వి. అ. పుం. (వ్యవహారమున) నిరోధము, అడ్డగింత, వ్యవహారమున వాది ప్రతివాదిని రాజాజ్ఞచే అడ్డగించుట, వారంటు అమలు జరుపుట.

ఆసేధించే. సం. స. క్రి. (వ్యవహారమున) నిరోధించు, అడ్డగించు. వ్యవహారమున వాదిని రాజాజ్ఞచే అడ్డగించు, వారంటు అమలు జరుపు.

ఆసేధ్యము. సం. విణ. (అ. ఆ. అ.) అడ్డగింపఁదగినది. (వ్యవహారమున) రాజాజ్ఞచే ఆఁపఁదగినది.

ఆస్కందనము. సం. వి. అ. న. 1. యుద్ధము; 2. ఇంకుట; 3. తిరస్కారము; 4. ఆక్రమణము, మైఁబడుట, మార్కొనుట.

ఆస్కందము. సం. వి. అ. పుం. = ఆస్కందనము.

ఆస్కందితము. సం. వి. అ. న. గుఱ్ఱపునడకలలో సమమైన నడక, అతివేగమును అతిమందమును గాక నడితరముగాఁ బాఱెడి యొక యశ్వధార, రవగాలు. శ. ర. "నిశ్చలమై అతివేగము అతి మందమునుగాక సమమైనగతి ఆస్కందితము" అని గురుబాలప్రబోధిక. "పూర్ణవేగమునఁబోవు గుఱ్ఱపునడక" అని సంస్కృతనిఘంటువు. ఆస్కందితము, ధోరితకము, రేచితము, వల్గితము, ప్లుతము. అనునవి అశ్వగతి విశేషములు, వీనికి పంచధారలని పేరు.—విణ. (అ.ఆ.అ.) ఆక్రమింపఁబడినది, మార్కొనఁబడినది.

ఆస్కారము. దే. వి. 1. బలము, శక్తి; 2. ఆధారము, ప్రాపు. "ఏదైన వ్యాపారముచేయుటకు ఇంటిలోను ఒడలిలోను గూడ ఏమియు ఆస్కారము లేదు."

ఆస్తరణము. సం. వి. అ. న. 1. పఱచుట; 2. (పఱపఁబడినది) ఆసనము; (చాఁపమొదలగునది) 3. పఱుపు; 4. ఏనుఁగుమీఁదపఱచెడి యెఱ్ఱకంబళి; 5. ఎఱ్ఱకంబళి.

ఆస్తరణికము. సం. విణ. (అ. ఈ. అ.) ఆస్తరణమున కుపయోగించునది. (వస్త్రము మొ.)

ఆస్తరము. సం. వి. అ. పుం. 1. పఱుపు; 2. ఆసనము; 3. ఎఱ్ఱకంబళి.

ఆస్తి. దే. వి. కూడఁబెట్టినధనము. (స్థిరాస్తి, చరాస్తి అని వైరి సమాసమున వాడుక.) "సీ....ఆస్తినా సర్వస్వమలరుచుండు...." ఆం. భా. ద్వి. వై. ౨౭౫.

ఆస్తికత. సం. వి. ఆ. స్త్రీ. ఆస్తికునిభావము, ఆస్తికుఁడగుట.

ఆస్తికత్వము. సం. వి. అ. న. = ఆస్తికత.

ఆస్తికాఁడు. దే. విణ. ధనవంతుఁడు. "సీ...ఆఢ్యుఁడు విలసిల్లు నాస్తికాఁడు నాఁగ...." ఆం. భా. తృ. వి. 3.

ఆస్తికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) 1. శ్రద్ధగలవాఁడు; 2. పరలోకమును జన్మాంతరము నున్నవని నమ్మువాఁడు; 3. వేదవాక్యములందు ప్రామాణ్యముకలవాఁడు; 4. భగవంతుఁడున్నాఁడని నమ్మువాఁడు. (దీనికి వ్యతిరేకము—నాస్తికుఁడు.)

ఆస్తిక్యము. సం. వి. అ. న. ఆస్తికునిభావము, ఆస్తికుఁడగుట.

ఆస్తీకుఁడు. సం. వి. అ. పుం. వాసుకి సోదరియగు జరత్కారువను నామెకు జరత్కారునివలనఁ గలిగినవాఁడు. ఈతనికథ భారతమునఁ గనఁబడును.

ఆస్తీర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) పఱుపఁబడినది.

ఆస్తృతము. సం. విణ. (అ. ఆ. అ.) విస్తీర్ణము, పఱచినది.

ఆస్థ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆస్థానము; 2. ప్రయత్నము; 3. శ్రద్ధ, ఆసక్తి; 4. ఆదరము; 5. అపేక్ష; 6. ఆధారము.

ఆస్థానముసు. మి. అ. క్రి. సభచేయు, కొలువుండు. "శా....నీ,వాఁకొన్నాఁడవు భోజనోత్తరమునం దాస్థానమైయుండి యుత్సాఁకం బెట్టక చెప్పెదక్...." కాశీ. ౭, ఆ. ౧౭౮.

ఆస్థానము. సం. వి. అ. న. 1. సభ; 2. రాజసభ.
ఆస్థాని. సం. వి. ఈ. స్త్రీ. = ఆస్థానము.
ఆస్థితుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఉన్నవాఁడు; 2. పొందినవాఁడు; 3. ఎక్కినవాఁడు; 4. ఆశ్రయించినవాఁడు.
ఆస్పత్రి. అం. వి. వైద్యశాల. (ప్రా. ఆస్పిటాలు.)
ఆస్పదము. సం. వి. అ. న. 1. స్థానము, చోటు; 2. పని.
ఆస్పిటాలు. అం. = ఆస్పత్రి.
ఆస్ఫాలనము. సం. వి. అ. న. 1. చఱపు, ఘట్టనము, పందెమొకరికైనవానిపైఁ గొట్టుకొనుట, అప్పళించుట; 2. కదల్చుట.
ఆస్ఫాలము. సం. వి. అ. పుం. 1. = ఆస్ఫాలనము; 2. ఏనుఁగు చెవికొట్టుకొనుట, ఝుఝర్ఝుల.
ఆస్ఫాలించు. సం. స. క్రి. 1.ఆస్ఫోటించు, చఱచు. (భుజాదులు) అప్పళించు; 2. కదల్చు.
ఆస్ఫాలితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చఱవఁబడినది; 2. కదలింపఁబడినది.
ఆస్ఫోట. సం. వి. ఆ. స్త్రీ. 1. అడవిమల్లె; 2. దింటెన.
ఆస్ఫోటము. సం. వి. అ. పుం. 1. చఱచుట, భుజాదులప్పళించుట; 2. పగులఁగొట్టుట; 3. జిల్లేడు.
ఆస్ఫోటనము. సం. వి. అ. న. 1. చఱపు, దెబ్బ; 2. పోటు; 3. చీలిక, భుజాదిక మప్పళించుట; 4. పగులఁగొట్టుట; 5. ప్రకటించుట; 6. బియ్యము మొదలగువానిని చెఱుగుట; 7. అగ్ని మొదలగువానిధ్వని.
ఆస్ఫోటని. సం. వి. ఈ. స్త్రీ. 1. రత్నములకు రంధ్రము వేసెడుసూది, పిడిసాన; 2. తొరపణము, కొయ్యమొదలగువానికి బెజ్జము వేయు సాధనము.
ఆస్ఫోటించు. సం. స. క్రి. 1. చఱచు. "క. మాటికి మదమై నుఱుములు, చాటుచు వేశోటులద్రి చరులఁ గొలఁప నా, స్ఫోటించి నేలఁ గాలం, దాటించుచు నున్నవాఁడు దంభుఁడు కంటే." రా. యు. 3౪3; 2. పొడుచు; 3. చీల్చు, పగులఁగొట్టు. "వ...సోమార్కమయమహాసోపానంబులఁ బ్రవహించి పరివహాపవనఝంఝాసంపాతంబులం దూఁగియాడు కరుళ్లచప్పుళ్ల పెక్కుఘటంబుల నాస్ఫోటింపక...." నై. ౮, ఆ. ౭౮; 4. తన్ను. "సీ. ...మృత్యుప్రకంపనుమే నెల్లఁ జెమరించె దంపుఁ డాస్ఫోటించె ధరణిఁ గాలఁ...."కాశీ. ౭,ఆ.3౧.—అ. క్రి. తరించు. "వ. అతని పితృపితామహు లాస్ఫోటింతురని పెంచియు." కాశీ. ౪, ఆ. ౧౮3.
ఆస్ఫోటితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చఱవఁబడినది; 2. అప్పళింపఁబడినది (భుజాది); 3. చీల్పఁబడినది; 4. పొడువఁబడినది.
ఆస్మాకము. సం. విణ. (అ. ఈ. అ.) మనసంబంధమైనది; మాసంబంధమైనది.
ఆస్మాకీనము. సం. విణ. (అ. ఆ. అ.) = ఆస్మాకము.
ఆస్య. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉనికి; 2. కూర్చుండుట; 3. ఆఁగుట.
ఆస్యంధయుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ముఖము చుంబనము చేయువాఁడు.
ఆస్యము. సం. వి. అ. న. 1. నోరు; 2. ముఖము.
ఆస్రము. సం. వి. అ. న. 1. కన్నీరు; 2. నెత్తురు. —పుం. వెండ్రుక.
ఆస్రవము. సం. వి. అ. పుం. క్లేశము, అలసట.
ఆస్రావము. సం. వి. అ. పుం. (మదాదులు) స్రవించుట.
ఆస్రావి. సం. విణ. (న్. ఈ. న్.) (మదాదులను) స్రవించునది.
ఆస్వదనము. సం. వి. అ. న. (ఆస్వాదించుట) 1. అనుభవించుట; 2. చవిచూచుట; 3. త్రాగుట; 4. తినుట.
ఆస్వదించు. సం. స. క్రి. 1. అనుభవించు; 2. చవిచూచు; 3. త్రాగు; 4. తిను. "తే. హస్తములు రెంట నందంద యదిమి యదిమి, తాటిపండార గించెడు బీటకమున, నత్యయంబున బ్రహ్మాండ మాస్వదించు, భైరవుం డిచ్చుఁగాత శోభనము మనకు." కాశీ. ౫,ఆ. ౮౧. "సీ....ఆబావి తేటనీ రాస్వదించిన...." కాశీ. ౬, ఆ. 3౯.
ఆస్వాదకుఁడు. సం. విణ. (అ.ఆ-వికా.అ.) ఆస్వాదించువాఁడు.

ఆస్వాదనము. సం. వి. అ. న. ఆస్వదనము.

ఆస్వాదించు. సం. స. క్రి.=ఆస్వదించు. "మ. కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవు లనేకుల్ చూచుచుండఁగ నదో, ద్ధురుఁడై ద్రౌపది నిట్లు సేసిన ఖలుఁ దుశ్శాసనుఁ లోకభీ, కరలీలన్ వధియించి తద్విపులవక్షశ్శైల రక్తౌఘనిర్ఝరముర్వీపతి చూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్." భార. సభా. ౨, ఆ. ౨౩౩. ఇట త్రాగు అని యర్థము.

ఆస్వాదితము. సం. విణ. (అ. ఆ. అ.) ఆస్వాదింపఁదగినది.

ఆస్వాద్యము. సం. విణ. (అ. ఆ. అ.) ఆస్వాదింపఁబడినది.

ఆస్విన్నము. సం. విణ. (అ. ఆ. అ.) అంతటను చెమర్చినది.

ఆహాకము. ఉభ. దే. వి. కుదువ, ఆయకము, తాకట్టు. "ద్వి. ఆహాకంబులు వెట్టియు వివక్కమితులు, సాహసంబునఁ బల్కి సాక్షులఁ బెట్టి." హరిశ్చ. ౨, భా.—సం. అ. పుం. ముక్కునఁ గలుగురోగము, నాసాజ్వరము.

ఆహతము. సం. వి. అ. పుం. తప్పెట.—విణ. (అ. ఆ. అ.) 1. కలుగనేరనిది, అసంభవము ('గొడ్రాలి కొడుకు చూచుచున్నాఁడు' లోనగుమాట.) 2. కొట్టఁబడినది; 3. క్రొత్తది; (వస్త్రము.) 4. ఉదికినది, ప్రాఁతది; (వస్త్రము.) 5. రెట్టింపఁబడినది, గుణింపఁబడినది; 6. నలఁగఁగొట్టఁబడినది.

ఆహతలక్షణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) గుణముల చేతఁ బ్రసిద్ధిఁ జెందినవాఁడు, కృతలక్షణుఁడు, పలువురకుఁ బరిచితుఁడు.

ఆహతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. కల్లమాటలాడువాఁడు; 2. కొట్టఁబడినవాఁడు.

ఆహరణీయము. సం. విణ. (అ. ఆ. అ.) (ఆహరింపఁదగినది.) 1. తీసికొని పోఁదగినది; 2. తినఁదగినది.

ఆహరించు. సం. స. క్రి. 1. అపహరించు; "ఉ.... నేఁ, దల్లడమంద భూషణవితానమునర్థము నాహరించి." షో. ౪, ఆ. ౪౭; 2. పయికిలాగు, ఉద్ధరించు. "సీ. విజ్ఞానమునఁ జేసి విషయాదివలన నె మ్మనమాహరించి...." ఆము. ౩, ఆ. ౭౪. ఇట ఆక్రమించు. శ.ర.; 3. తీసికొనిపోవు, ఆకర్షించు. "సీ. ...బ్రహ్మాస్త్రమైన నీ ప్రభావమ్ము యశమెంత పెరిగ యష్టావసుద్వీపములను, తే. నాహరించెద నా రాజ సూనుమాద్భవంబుఁ, బద్మకర మిత్రు త్రైలోక్య దక్షిణమునఁ, జంద్ర నీయుష్ణీషమ్మునఁ జగతిఁ గలఁడె...." కాశీ. ౪, ఆ. ౧౬౭. "సీ.... పద్మాతపము, వ్యయముగా నీకేల వాసవుపైకొన్న నఖిలజగద్ధన మాహరించి, కొనసేల యముక్తేకము భూములఁ గదలి ధాన్యంబు లేల...." భాగ. ఆశ్వ. ౪, ఆ. ౨౬౧: 4. తిను, ఆహారముగాఁగొను. "ఆ. బ్రహ్మచర్యమునకుఁ బరమాయువుపవాస, ములకుఁ జిత్తశుద్ధి ఫలజలంబు, లాహరించి యుంటి కాఫి రాజ్యము పత్ర, భక్షకకు దివంబు ఫలము లధిప." భార. అను. ౧, ఆ. ౧౪౩.

ఆహర్త. సం. విణ. (ఋ. ఈ-స్త్రీ. ఋ.) ఆహరించువాఁడు.

ఆహవనము. సం. వి. అ. న. యజ్ఞము, వ్రేలిమి.

ఆహవనీయము. సం. వి. ఇ. పుం. దక్షిణాగ్నిగార్హపత్యాహవనీయము లనుపేర శ్రుతిప్రకారము స్థాపింపఁబడు మూఁడగ్నులలోను నొకయగ్ని.—విణ. (అ. ఆ. అ.) 1. హోమముచేయఁదగినది; 2. యజ్ఞమున బలియియ్యయోగ్యమైనది.

ఆహవము సం. వి. అ. పుం. 1. యుద్ధము; 2. పిలుపు; 3. యజ్ఞము; 4. నూతియొద్ద గట్టిన నీళ్లతొట్టి.

ఆహాహా. వై. అవ్య. = ఆహా.

ఆహా. వై. అవ్య. 1. (ఆహాశబ్దమును గలిగించునది.) ఆశ్చర్యము, ఔరా. "శా...ఆహా పుట్టెడు లాఁతి చూపఱకు...." భార. శల్య. ౨, ఆ. ౨౪౧. "శా....దివ్యవస్త్రాకల్పంబులు దివ్యగంధములు నాహా పుట్టఁ జేయంగ...." హర. ౬, ఆ. ౧౦౦; 2. సంతోషప్రశంసాశ్చర్యసంతాపాదులను సూచించును; 3. నిందను సూచించును. "శా.... ఆహా వేదంబులు యాగభాగము లమర్త్యశ్రేణికే కాని మా, కే పంకంబని లేకయుండునటుగా నేర్పాటు గావించెఁగా, నీవేగంబ హరించి తచ్ఛ్రుతులు భగ్నీభూతముల్ సేసెదన్." దశా. ౧, ఆ. ౨౪౩.

ఆహారము. సం. వి. అ. పుం. 1. భోజనము; 2. వంటకము; 3. అపహరణము.

ఆహారించు. సం. స. క్రి. 1. ఆరగించు, భుజించు, తిను. "సీ....గ్రహణవేళలయందు రాహువా హారించి తృప్తిమై గజ్జునం ద్రేంచెనేని...." నై. ౨, ఆ. ౧౨౩. "సీ...చిఱుతిండి తనవారి మొఱఁగి యాహారించు నతివ సూకరజాతియందుఁ బుట్టు...." కాశీ. ౭,ఆ. ౮౦; 2.=అపహరించు.

ఆహార్యము. సం. వి. అ. పుం. హారాదిభూషణములచేఁ గలిగెడి అభినయవిశేషము.—విణ. (అ. ఆ. అ.) 1. ఆహరింపఁదగినది; 2. తెచ్చుకోఁదగినది, తెచ్చిపెట్టుకోనఁదగినది.

ఆహావము. సం. వి. అ. పుం. 1. పశువులు నీరు త్రాగుటకై నూతియొద్ద కట్టిన తొట్టి, నిపానము; 2. ఆహవము, యుద్ధము; 3. పిలుపు.

ఆహికము. సం. వి. అ. పుం. 1. వంతుప్రకారము తగులు జ్వరము, పాళీజ్వరము; 2. సుషిరవాద్య విశేషము, (సౌన్నాయివంటిది) అని వాడుక.

ఆహికుఁడు. సం. వి. అ. పుం. 1. పాణినిముని; 2. కేతువు.

ఆహితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉంచఁబడినది, స్థాపించఁబడినది; 2. చేయఁబడినది.

ఆహితాగ్ని. సం. వి. ఇ. పుం. వేదసంస్కారప్రకారము అగ్నిహోత్రము నుంచుకొనియుండువాఁడు.

ఆహితుండికుఁడు. సం. వి. అ. పుం. 1. పాములవాఁడు; 2. పాములఁబట్టువాఁడు, సర్పగ్రాహకుఁడు.

ఆహిషము. సం. వి. అ. పుం. లంచము.

ఆహుతము. సం. విణ. (అ. ఆ. అ.) వేల్వఁబడినది, హోమము చేయఁబడినది.

ఆహుతి. సం. వి. ఇ. స్త్రీ. అగ్నియందు వేల్చుట, హోమముచేయుట.

ఆహూతము. సం. విణ. (అ. ఆ. అ.) పిలువఁబడ్డది.

ఆహూతి. సం. వి. ఇ. స్త్రీ. పిలుచుట, పిలుపు.

ఆహృతము. సం. విణ. (అ. ఆ. అ.) ఆహరింపఁబడినది. చూ. ఆహరించు.

ఆహృతి. సం. వి. ఇ. స్త్రీ. ఆహరించుట.

ఆహేయము. సం. విణ. (అ. ఆ. అ.) అహిసంబంధమైనది, సర్పసంబంధమైనది. (ఎముక, విషము. మొ.)

ఆహేరువు. సం. వి. ఉ. స్త్రీ. పిల్లపీచర.

ఆహోపురుషిక. సం. వి. ఆ. స్త్రీ. అహోపురుషిక, దర్పముచేత తన్ను గొప్పగా నెంచుకొనుట.

ఆహోపౌరుషిక. సం. వి. ఆ. స్త్రీ. = అహోపురుషిక.

ఆహ్నికము. సం. వి. అ. న. 1. పగలు చేయఁదగిన కర్మము; 2. ప్రతిదినము నుండునది; 3. ఆహారము; 4. వ్యాకరణమహాభాష్యమున ప్రకరణము.—విణ. (అ. ఈ. అ.) 1. పగలు చేయఁదగినది; 2. పగలుమాత్రముండునది.

ఆహ్లాదనము. సం. విణ. (అ. ఈ. అ.) సంతోషపెట్టునది.—వి. అ. న. సంతోషపెట్టుట.

ఆహ్లాదము. సం. వి. అ. పుం. సంతోషము, ఎలమి.

ఆహ్లాది. సం. విణ. (న్. ఈ. న్.) 1. ఆహ్లాదము గలిగించునది; 2. ఆహ్లాదముగలది.

ఆహ్వ. సం. వి. ఆ. స్త్రీ. 1. పేరు; 2. పిలుపు.

ఆహ్వయము. సం. వి. అ. పుం. 1. అభిధానము, పేరు; 2. గుఱ్ఱపుఁబందెము కోడిపందెము మొదలగునవి.

ఆహ్వానము. సం. వి. అ. న. హూతి, పిలుపు.

ఆళతి. వై. = ఆలతి.

ఆళి. సం. వి. ఇ. స్త్రీ. 1. పఙ్క్తి; 2. చెలికత్తె; 3. అడ్డకట్ట.—గ. పుం. తేలు.—విణ. ఇ. నిర్మలమయిన మనసుగలది. రూ. ఆలి.

ఆళిందకి. సం. వి. ఇ. స్త్రీ. ఉడుత, చిక్రోడము.

ఆళిందము. సం. వి. అ. పుం. అళిందము.

ఆళుగ. దే. వి. = ఆళువ.

ఆళులు. దే. =అళ్లు. "ఆ. పొడవుచూడమగలపొల్లలు నాళుల, బొల్లలును నిజంబ పోలెయుండుఁ, గలనఁ దూఱనెత్తఁగాఁ బోవునప్పుడు, కాని చూచి యెఱుఁగఁగాదు మున్ను." కు. సం. ౧౧, ఆ. ౪౫. ఇట టిప్పణిలో ఆళులు = స్త్రీలు అని

కలదు. అది సందర్భోచితముగాఁ గనఁబడదు. స్త్రీలనునర్థమున 'ఆళులు' అనురూపము సిద్ధింపదు.

ఆళువ. దే. వి. ముత్తెపుఁజిప్పలవంటి ముండ్లచేతఁ గప్పఁబడిన యెల్ల యంగములుగల యొకవిధమైన పంది, శల్యకము. "ద్వి. కుందేలు నుడుమును గూర్మంబు నేదుఁ,బంది యాళువయును భక్ష్యముల్ గాని, పంచనఖంబని ప్లవగంబుఁ దినరు." సం. "శల్యకశ్శ్వావిధో గోధా శశః కూర్మశ్చ పంచమః." రా. కిష్కిం. ౨౧౩-పు. (కొందఱు దీనిని నఖమృగమందురు.) శ. ర. ఇట సాలువ అని ముద్రితపాఠము.

ఆళువరి. దే. వి. అలంగము, వప్రము. "సీ. కోట సింగారించి కొత్తళంబులనెల్ల నట్టళ్లు పన్నించి యాళువరికిఁ, బాఁబెళ్లు వెట్టించి..." ఉ. హరి. ౨. ఆ. ౯౨. (రూ. ఆడువరి.)

ఆళువారు. దే. వి. హరిభక్తుఁడు. "ఆ. అనిన మాఱు వలుక నళికి యమ్మ్యాళువా, రియ్యకొనియెఁ బోవ..." ఆము. ౨, ఆ. ౯౪.

ఆళ్లకోస. దే. వి. ఒకదినుసుకాకి. శ. ర.

ఆళ్లు. దే. వి. బ. (ఆరుగ+లు.) ధాన్యవిశేషము. కోద్రవము.

ఆళ్వారు. దే. = ఆళువారు. "శా. అంచత్ప్రేమవశం వదుండగుచు నాయాళ్వారిఁ జేరంగ రమ్మంచుం బిల్చి మురారి." పర. ౪, ఆ. ౨౧౬.

ఇ

ఇ. ఉభ. అచ్చులలో మూఁడవ యక్షరము.—స. ఈయనుదానికి అసంయుక్తహల్లు పరంబగునపుడు వికల్పముగా వచ్చు రూపము. ఇకాలము = ఈకాలము.— అవ్య. 1. ప్రార్థనాద్యర్థమున మధ్యమపురుషక్రియకనుప్రయుక్తము. "చేయుము+ఇ=చేయుమి;" 2. మహన్మహత్యర్థమందు ప్రశ్నమును తెలుపు ఏడు, ఏరు మొదలగువానికి అనుప్రయుక్తము; "ఏఁడీ, ఏరి, వేఁడు, వేరి;" 3. కొన్నిక్రియాపదములపై వచ్చు కృత్ప్రత్యయము; "చేయి. (చేయు+ఇ) త్రిమ్మరి. (త్రిమ్మరు+ఇ)" కొన్నిశబ్దములపై మతుబర్థమున వచ్చు ప్రత్యయము; "ఓయారి;" 4. క్త్వార్థకమున (భూతకాలాసమాపకక్రియను దెలుపు) వచ్చు ప్రత్యయము "చేసి, కోసి, చూచి."—సం. మన్మథుఁడు దీనికి వ్యస్తప్రయోగము లేదు. "మా. అశనిధరవిలాసాయత్తుఁ డధ్యాత్మచిత్తుం, డి శరకమలిసి పూర్ణేందుఁ డానందుఁ డెందున్." కు. సం. ౨, ఆ. ౧౦౭.

ఇన్‌స్పెక్టరు. ఆం. వి. పైవిచారణచేయువాఁడు.

ఇంకఁబాఱు. దే. అ. క్రి.=ఇంకు. "క. మేరువు దల క్రిందైనను, బారావారమ్ము లింకఁబాఱిన లోలో, ధారణి రజమైపోయిన...." భాగ. ౬, స్కం. ౫౯౫.

ఇంకు. దే. అ. క్రి. (క. ఇంగు, ఇంకె=ఇంపుట)= ఇనుకు. 1. నీరుమొదలగునవి నేలమొదలగుచోట్ల లోనికిపోవు, ఇనికిపోవు. "క. మూత్రపురీషాదులు దమ,గాత్రములం దింక వారు గారవమెసఁగం, బుత్త్రుండని సంవర్ధిత, గాత్త్రునిఁగాఁ జేసి రింతకాలముఁ గూర్మిన్." భార. ఉద్యో. ౪, ఆ. ౩౪; 2. ఆవిరిగా పైకిపోవు, ఎండిపోవు; "ద్వి.అంకింపఁదప్తలోహములజలమ్ము,లింకినట్లు." పండి, దీక్షా. ౮౧-పు; 3. తడిలేనిదగు; 4. (జలాదికము) ఇగిరిపోవు, కనఁబడకుండఁగఁ బోవు. "వ....తత్కాలజనితం బయిన ఖేదంబునం దొరఁగ సమకట్టు బాష్పజలంబులు మగుడ నింకించుచు నిట్టూర్పు లడంచి ధైర్యం బవలంబించి యిట్లనియె." భార.విరా. ౧, ఆ. ౭౩; 5. జలములేనిదగు,ఎండిపోవు. "ఉ. అక్కట కౌరవాన్వయమహార్ణవ మింకెడునట్లు పుట్టెన్...." భార. ఉద్యో. ౪, ఆ. ౫౪; 6. క్షీణమగు, నశించు. "సీ. ... అతితీక్ష్ణతరమైన యాశుశుక్షణి తేజమింగాల తేజమై యింకిపోయె..." భీమ. ౪,ఆ. ౧౦౭.

ఇంకుడు. దే. వి. ఇంకుట.—విశే. 1. ఇంకినది; 2. ఎండినది. "సీ. ఇంకుడుచన్నులువాఁక చేతులుఁగడు వలమైన గానుగవంటినడుము." హరిశ్చ. ౪, ఆ. ౧౮౯.

ఇంకువ. దే. వి. ఇక్కువ, స్థానము.

ఇంగన. సం. వి. ఆ. స్త్రీ. = ఇంగనము.

ఇంగనము. సం. వి. అ. న. 1. చలనము; 2. తెలివి, జ్ఞానము; 3. చలింపఁజేయుట.

ఇంగము. సం. వి. అ. పుం. 1. అభిప్రాయము, ఇంగి

తము; **2.** ఆశ్చర్యము; **3.** చలనము; **4.** తెలివి; **5.** సంజ్ఞచేయుట.—విణ. (అ. ఆ. అ.) **1.** తిరుగునది, జంగమము; **2.** చలించుస్వభావము గలది; **3.** ఆశ్చర్యకరము.

ఇంగలము. వై. వి. నిప్పు. "క. వంగడపువెదురుం గోపపు, టింగలమున నేర్చికనినయాసిరి." పాండు. ౫, ఆ. ౪౦. "క. అంగుష్ఠము నిల మోపి ప, తంగునిపైఁ జూపు సాఁచి ధగధగ లచ్చి,స్తుంగత నింగులు నాకెడు,నింగలములు నాల్గుదెసల నిడుకొని కడకన్." స్వా. ౬, ఆ. ౨౧. (చూ. ఇంగాలము.)

ఇంగాలము. ప్రా. వి. అ. పుం. (సం. అంగార; ప్రా. ఇంగాలో) బొగ్గు, అంగారము; (సంస్కృతనైషధమున "ఇంగాలమివాశఃపరే." అని ప్రయోగింపఁబడినది. దేశ్యమైనను కవి ప్రయోగించెనని వ్యాఖ్యాత. "ఇంగలస్తు కరీషాగ్నిః." అని ఇంగలము సంస్కృతముగా హారావళీనిఘంటువునఁ గలదు. ఇట "ఇంగాలస్తు" అనియుఁ బఠింపవచ్చును. దీనికి నైషధప్రయోగమె మూలము కావచ్చును. దాని ననుసరించియే కాఁబోలు తెనుఁగున సంస్కృతసమాసమునఁ బ్రయోగింపఁబడినది.) "సీ. అతితీక్ష్ణతరమైన యాశుశుక్షణి తేజమిం గాలతేజమై యుంకిపోయె." భీమ. ౪, ఆ. ౧౦౭.

ఇంగితజ్ఞుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఇంగితమెఱిఁగినవాఁడు, ఎదుటివాని ముఖవికారాదులవలన వానిభావమును గ్రహించినవాఁడు.

ఇంగితము. సం. వి. అ. న. **1.** అభిప్రాయము. "ఇంగితము తెలియక ఇతరులతో మాటలాడకు;" **2.** ముఖమందలి వికారము, లోపలిభావమును తెలుపు చేష్ట.—విణ. (అ. ఆ. అ.) చలించునది, కదలునది.

ఇంగిలము. వై. వి. ఇంగలము. "గీ. కెరలునాఁటేని తూపుటింగిలమునందు." అచ్చ. సుం. (అని శ.ర.) "తే. చుట్టలనుఁగులు బంట్లు తోఁబుట్టువులును, గొడుకు లేనుఁగులరదముల్గుఱ్ఱములును, నలరునాఁటేనితూపుటింగలమునందు, మ్రగ్గిపోవకమున్నె వే మలపుకొనుము." అచ్చ. సుం. ౧౪౭. అని ముద్రణమున.

ఇంగిలాయ. దే. వి. కరదీపిక, చేతిదీపము, దివిటీ.

ఇంగిలాయి. దే. వి. మత్స్యవిశేషము.

ఇంగిలికము. వై. వి. రాగద్రవ్యవిశేషము, హింగుళము. "తే. ప్రాగ్దిశాకాంతనిండుగర్భంబునందు, సూర్యుఁ డుదయింపఁ బ్రొద్దులుచొచ్చియుండ, మొదలఁదీంద్రించులేఁతకొమ్మొలకయొండ, నింగియింగిలికానవభ్యంగమార్చె." కాశీ. ౧,ఆ.౧౨౪.

ఇంగిలీకము. వై.=ఇంగిలికము "సీ. ...తరుణాంగుళీచ్ఛాయ దంతపుసరకట్టు లింగిలీకపువింతరంగు లీన..." స్వా. ౧, ఆ. ౫.

ఇంగిలీషు. ఆం. వి. ఆంగ్లము, "ఇంగిలీషువారు."

ఇంగుది. సం. వి. ఈ. స్త్రీ. గారచెట్టు.

ఇంగులీకు. వై. వి. మృగవిశేషము. "ద్వి. కొమ్ముల గోళ్లను గుక్కనూనలను, ఇంగిలీకులలేళ్ల మంగిసలను నిజాంగనల్ గొనిరో." పండి. పర్వత. 3౪ 3-పు.

ఇంగువ. వై. వి. హింగువు, రామఠము. (ఒకానొక చెట్టు జిగురు. ఇది కూరలు, పచ్చళ్లు మొదలగు వానిలో నుపయోగింతురు.) "ఆ. కటికయజీలకఱ్ఱ గటిపేము గురుజ యిం,గువ ప్రవర్జనీయకోటి యగుట." భార. అను. ౩, ఆ. ౧౮౯.

ఇంగ్లండు. ఆం. వి. ఇంగ్లీషువారి రాజధాని. (యూరపుఖండములోనిది.)

ఇంచించుక. దే. అవ్య. (ఇంచుక+ఇంచుక) కొంచెకొంచెము, కొంచెము కొంచెము.

ఇంచిమంచి. దే. వి. రుచిగలభక్ష్యము. "తే. తనకు ననుకూలయగునొక్కదాసితోడ, మాలిమియొనర్చుకొని యించిమంచిపెట్టి." శుక. ౩, ఆ. ౨౯౫. (ఉంచిమంచి. అని ముద్రితపాఠము.)

ఇంచు. యు. దే. అ. క్రి. **1.** ఇంపగు; "క. కర్ణుండు రేఁచి పెట్టఁగ, దుర్ణయపరులైనశకుని దుశ్శాసనులీ, నిర్ణయమె మేలనఁగ నీకర్ణములకు నించునెట్లు కార్యవచనముల్." భార. ఉద్యో. ౨, ఆ. ౨౪౮; **2.** ఒప్పు. "ఉ....కలితకంకణనాదము లించ రాఘవుత్స్వాపరు సేతు వెంతయును గౌతుకమిచ్చు..." వాల్మీ. ౨, ఆ. ౧౪; **3.** అతిశయించు. "ఉ. ఇరువురు నీలనీరజనిభేక్షణ లించినవేడ్కతోఁ బరస్పర మెదిరించి కాంచనపుబంతులఁ దచ్చునవాటు లాడఁగా..."

నైష. 3, ఆ. ౯౫. 4. ఆనందించు. "గీ. మధుర మంజులరవముల మనము లింప. భా. రా. బాల. ౬౬. స. క్రి. అభిలషించు, కోరు. "క...పులి నమ్ముల నించె లీల భూవరుఁ డచటన్. హ. న. ౨, ఆ. ౨౭. (నలపక్షమున ఇంచె నని భేదము)

వై. వి. (సం. ఇక్షుః. ప్రా. ఉచ్ఛు) 1. చెఱకు ⚘ "సీ. ముసిఁడిమ్రాఁకునఁ బండ్లు పసమీఱఁ గల్గించి యించున కేల పుట్టించఁడయ్యె. సీగా. ౧, ఆ. ౧౧౧. ఆం. శే. ౪౭. 2. ప్రేమము, వలపు. "సీ. అభ్యాసవశమునఁ బ్రాణేశ్వరునిమీఁది యించు గీతములు వాయించు వీణ. నైష. ౧, ఆ. ౭౪. 3. అల్పత్వము. "సీ. చికిలిచూపులవాని సిరి మించుదొర యించుదొరయించు కాంచనాంబరము వాని. వసు. 3, ఆ. ౪౬. అప. సంస్కృత ధాతువులకును, కొన్ని తెలుఁగుధాతువులకును స్వార్థమునను, అన్ని ధాతువులకుఁ బ్రేరణార్థమునను వచ్చుఆగమము. ఉదా:—ఊహించు, అంగలించు, వ్రాయించు, చేయించు మొ.

ఇంచుఁబడఁతి. ద్వ. వి. (ఇంచు+పడఁతి) మనోహారిణి, ప్రేయసి. "గీ. భానుబింబంబు భేదింపఁ బంతమాడి, యించుఁబడఁతులమతులు భేదించువారు. కవిక. ౨, ఆ. ౧౩౨.

ఇంచుఁబోఁడి. ద్వ. వి. మనోహారిణియగు స్త్రీ; స్త్రీ. "సీ. ఇంచుఁబోఁడిరో విలోకించితే మదభృంగ కంపకం బైన యీచంపకంబు. అచలా. ౨, ఆ. ౭౩.

ఇంచుఁబోణి=ఇంచుఁబోఁడి. "వ...ఈయించుఁబోణి నేన వరియించెద..." పరమ. ౪, ఆ. ౬౩.

ఇంచుక. వై. అవ్య. (సం. కించిత్) 1. కొంచెముగా. ఉ. ఇంచుకయేని పాపమున కెన్నఁడు రోయక..." భార. ఆది. ౬, ఆ. ౨౯౪. 2. అణుమాత్రము. "క...దురితం బొరయఁ డొక యించుకయు..." భార. శాం. ౧, ఆ. ౨౯౬. (ఈ పదమునకు ఇంచుకయించుక, ఇంచుకించుక, ఇంచించుక అను నామ్రేడితరూపము లుండును.)

ఇంచుకంత. ద్వ. విశే. కొంచెము పరిమితిగలది. "ఆ. ఇంచుకంతబోనమీశ్వరార్పణమన్నఁ బుణ్య లోకములకుఁ బోవు నతఁడు. వేమన. ౭౨౧.

అవ్య. ఇంచుక, కొంచెము. "చ...ఇంచుకంత నిక్కిన..." ఆము. ౫, ఆ. ౧౧౬.

ఇంచుటలుక. ద్వ. వి. (ఇంచు+అలుక) ప్రణయక్రోధము. ఆ. ఇంచుటలుక గలిగెనేఁ దీర్చి ప్రేయసి, నుల్లమున వరింప కోర్తు రెట్లు, కవిక. ౧, ఆ. ౨౧.

ఇంచుపాలకడలి. ద్వ. వి. ఇక్షుసముద్రము. (శ.ర.)

ఇంచుమించు. ద్వ. వి. 1. న్యూనాధిక్యము. (చూ. ఇంచుమించులాడు.) 2. రమారమి, సుమారు. వ్యవ:—ఆపని యించుమించు పూర్తియైనది. 3. అందమగు మెఱపు. విజ. ౧, ఆ. ౩౬.

ఇంచుమించులాడు. ద్వ. స. క్రి. (ఇంచుమించులు+ఆడు) న్యూనాధిక్యములఁ బలుకు; తిరస్కరించు. "ఆ. నలినసంచులీల నలినలి గావించు, నించు మించులాడు నించుమించు. విజ. ౧, ఆ. ౩౬.

ఇంచుమ్రాను. ద్వ. వి. (ఇంచు+మ్రాను.) చెఱకు మొక్క. (శ్రా.)

ఇంచులాఁడి. ద్వ. వి. (ఇంచులు+ఆఁడి) హితురాలు, చెలి. "గీ. విన్నఁదన మేటికే నీకు వింతలాఁడి యేమి కన్నీరు నించెదే యించులాఁడి. కాళిందీ. ౨, ఆ. ౬౬.

ఇంచు వింటి చెంచు. ద్వ. వి. ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు. (చూ. ఇంచువిల్లు.)

ఇంచువిలు(ల్లు) ద్వ. వి. ఇక్షుధనువు. "ఉ...ఇంచు విలు చేకొని యెక్కిడి కల్వతూపుచా, లెక్కుడు కిన్కతోఁ దొడిగి యేసి మనోభవుఁ డార్చె..." ఉ. రా. ౪, ఆ. ౧౭౧.

ఇంచువిలుకాఁడు. ద్వ. వి. ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు. "గీ. ఇంచువిలుకాని వ్రాసినారిదుపులందు. నైష. ౭, ఆ. ౧౫౦. ఇట్లే: ఇంచువిల్తు(లుతు)ఁడు మొ.

ఇంచువిల్లుదాలుపు. ద్వ. వి. ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు. ఆం. సం. దేవ. ౧౪.

ఇంజేటి. ద్వ. వి. తియ్యకంద ⚘ "గీ...గొట్టె, చెట్లు నింజేట్లు...తిన దొరఁకొనిరె జనము. కాళ. 3, ఆ. ౧౫౧.

ఇంటరము=ఇంత్రము. (చూ. ఒంటరమింటరములు.)

ఇంటాతఁడు=ఇంటియతఁడు. "క...మాయింం, టా తఁ డెప్పుడైనఁ గలసిన, నాతనిగాఁ దలఁతు ముకుళితాక్షిద్వయనై. అహ. 3, ఆ. ౯౮.

ఇంటాయన. దే. వి. (ఇల్లు+ఆయన) భర్త, మగఁడు. (వా)

ఇంటికాఁపు. దే. వి. గృహస్థుఁడు. (శ. ర.)

ఇంటికిఁగాకపోవు. దే. అ. క్రి. ముట్టగు, చెఱఁగు మాయు. సాం. ని. మాన. ౨౭.

ఇంటిగరిత. దే. వి. గృహిణి, భార్య. "గీ. పీడని యపార కారుణ్యవృష్టితోడ, నింపుగ వసింపు నా హృదయంపు మేడఁ, దొంటి చదువుల గమికాని యింటిగరిత." కాళిందీ.౧,ఆ.౧౦.

ఇంటిపట్టు. దే. వి. (ఇల్లు+పట్టు) **1.** గృహస్థ ధర్మము. "సీ... ప్రమథాధిపతియింటిప ట్టైఱిం గె. స్వా. ౨, ఆ. ౧౧. **2.** ఇంటిదగ్గఱ. వ్యవ :—వాఁ డొక్క క్షణ మైన నింటిపట్టున నుండఁడు.

ఇంటిపాప. దే. వి. (ఇల్లు+పాప) వెలకుఁ గొన్న దాసి. (శ. ర.)

ఇంటిపేరు. దే. వి. (ఇల్లు+పేరు) వంశము పేరు. ఊరిపేరింటిపేరుగానొప్పునాకు.సుధానిధి(వా.) "క. ఊరెయ్యది చీఁపురుపలి, పేరో సూరన్న యింటి పేరడిదము వార్"(సూరనచాటువు.)

ఇంటిబిడ. దే. వి. (ఇల్లు+బిడ) దాసి. "సీ. ఇంటి బిడ నాఁ బరగు దాసి. వేంక. మాన. 3౭.

ఇంటిమగఁడు. దే. వి. (ఇల్లు+మగఁడు) వివాహ మైనభర్త. "ఆ...ఇంటిమగనిఁ జూచి యిల్లాలు దుఃఖించి, వెంటవిటునిఁ దగిలి వెతలఁబడును, తుంటరైన దానిఁ దొలఁగింప మేలురా, విశ్వ..." వేమన. ౭౨౩.

ఇంటియతఁడు. దే. వి. (ఇల్లు+అతఁడు) భర్త, మ గఁడు. "గీ...మా యింటియతని, కాసపుట్టింప మెలఁగుదు..." శుక. ౨, ఆ.౧౧౧. ఇట్లే: ఇంటి యాతఁడు : "సీ...కాంతకు మానరక్షకుఁ డింటి యాతండు..." పిన. శకుం. ౪, ఆ. ౭౨.

ఇంటియాలు. దే. వి. (ఇల్లు+ఆలు) గృహిణి, భార్య. "ఆ. ఇంటియాలి విడిచి యిల జారకాంతల, వెంటఁదిరుగువాఁడు వెఱ్ఱివాఁడు. వేమన.౧3.

ఇంటిల్లిపాది. దే. అవ్య. (ఇల్లు+ఇల్లు+పాది) ఇంటి లోనివా రందఱు. వ్యవ :—నిన్నరాత్రి వా రింటిల్లిపాది నాటకమునకు వెళ్లిరి.

ఇంటివాఁడు. దే.వి. గృహస్థుఁడు. "గీ. పాకనాటింటి వాఁడవు బాంధవుఁడవు." భీమ. ఆ, ౧. ౨౩. "సీ...గేస్తు మనికిఁజేఁ డింటివాఁ డన గృహస్థున కగు..." సాం. ని. మాన. ౭.

ఇంటివేలుపు. దే. వి. కులదైవము. కాశీ. పీఠి. ౪౯. ద్వా. ౧౧, ఆ. ౧౫.

ఇంట్రపడు. ద్వ. అ. క్రి. (ఇంట్రము+పడు) సంక టపడు. "గీ...జగముల, నోలిఁ గంజోదరుఁడు నిజోదరమున, నింట్రపడకుండఁగా నిల్పె నెడము లిచ్చి." హరి. ఉ. ౯, ఆ. ౧౪౪.

ఇంట్రము. దే. వి. సమ్మర్దము, ఇఱుకు. "గీ. ఎదు రుగా నేఁగుదెంచుచో నింట్రమయ్యెఁ, బెండ్లి యిరువంక చుట్టంపుఁ బెద్దలకును." నైష. ౬, ఆ. ౭౪.

ఇండి=ఇఁడి. "క. ఇండియనుట లేదనుటయె, యొం డొక యర్థంబు గలుగ నోపదు ధరము, క్కిండి యు వెరవిండియు వ్రా, యిండియు ముప్పిండి యనఁగ నేర్పడి యునికిన్." ఆంధ్ర.భూ.౧౬3.

ఇండుగు=ఇందుగు. (వా.)

ఇండె. దే. వి. **1.** (క. ఇండె. త. ఇండై.) పూల మాల. "ద్వి...ఇండె గట్టెడిది..." బస. ౨,ఆ. ౪౭౦. పండితా. దీక్షా. ౭౦, పు. **2.** చీలిక. (శ. ర.) **3.** ఎముకకీలు. "వ...ముదిరిన మొగలి చెట్టునుం బోలె నేల మోవం జన్ను లుడిగి యొంటనికాఁపు ప్రజయుం బోలె నిండెలు దొలంగి..." కవిక. ౪, ఆ. ౧౧3.

ఇండెవాయు. దే. అ. క్రి. చీలు, ఆస్ఫోటిత మగు. (శ. ర.)

ఇండెవాఱు. దే. అ. క్రి. బీఁటవోవు. (బ్రౌ)

ఇంత. వై. స. బొ. అసా. (సం. ఇయత్). **1.** ఈ కొలఁది. "ఉ...ఇంతలు కన్ను లుండఁ దెరు వెవ్వరి వేఁడెదు..." స్వా. ౨, ఆ. ౪౧.

"ఉ...ఇంతులనేఁచుపాతక మదింతట నంతటఁ బోదు..." వసు. ౪, ఆ. ౨౮. 2. ఈవేళ. "చ. ఉమ్మలికమ్మునఁ గొంతి యింతకున్, బడుగయి పాలలోఁ బడిన బల్లివిధంబున నుండకుండునే." భార. ఉద్యో. 3, ఆ. ౧3౯. ఆము. ౨, ఆ. ౮౧. 3. ఇది. "క...ఏ, నూరక యుండుదుఁ దో డె, వ్వారికిఁ బో నింత నిక్కువం బెబ్బంగిన్. భార. ఉద్యో. ౧, ఆ. ౮3; ౨, ఆ. 3౨౬. ఆము. 3, ఆ. ౮౮. 4. ఈ సమస్తము. "క...ఇంతకు మూలము తృష్ణా, తంతులతయ వత్స వినుము దానికి నడరం, గాంతాజనంబు తొలుప్రాఁ, కింత యొఱఁగి తృష్ణఁ దొఱఁగు టిచ్చు విముక్తిన్." భార. శాం. ౪, ఆ. ౯3. 5. ఈగొడవ. "ఉ...పవనాత్మజ యింత యేటికిన్." భార. ఉద్యో. 3, ఆ. ౬౧. అవ్య. 1. (ఇట నధికముగా ననియు స్వల్పముగా ననియు నర్థము లిచ్చును.) "గీ...ఆ కోడియలను బట్టి, గట్టిచేసెద నిఁక నింతఁ గసరవలవ, దు..." నీలా. ౨, ఆ. ౬౨. "సీ...ఇం తడు గూఁది బంకంటె యంగలార్చి..." ఆము. ౫, ఆ. ౧౧౭. 2. ఇంత వఱకు. "ఉ...పాండవ కౌరవుల్ గలసి... ఉండఁగ దుష్టచేష్టలసుయోధనుఁడింతలు చేసె...." భార. ఉద్యో. 3, ఆ. ౪౭. ప్రా. 1. ఇక్కడ. (ఈ యర్థమున ఈపదము అంత శబ్దముతోఁ గూడియే కనఁబడుచున్నది. ఇంతట నంతటన్, ఇంతటంతటన్, ఇంతంతటన్, ఇంతనునంతన్, ఇంతనంతన్, ఇంతంతన్.) నైష. ౧, ఆ. ౧౦౪; సా. 3, ఆ. ౨౦౦; నైష. ౪, ఆ. ౧౧౭; భార. విరా. 3, ఆ. ౧౯౫; భార. ఆశ్ర. ౧, ఆ. ౧౮; భార. శాం. ౬, ఆ. 3౭౭.) 2. ఇంక. "వ...సుముఖాసక్తిం జూచి యింత నీ వే మనిచెప్పెదో చెప్పు మనుటయు..." కళా. ౪, ఆ. ౧౫౬.

ఇంతంత. ద్వ.విశ.(ఇంత+అంత) పరిమితము. "క...ఇంతంతగాని తమి..." సా.౨, ఆ. 3౯. "ఆ...ఇంటిలోని పోరు ఇంతంత గాదయా..." వేమన. ౨౫3౮.

ఇంతదనుక=ఇందనుక, ఇందాఁక. (వా.)

ఇంతదాఁక=ఇంతదనుక. వ్యవ:—ఆ సంగతి ఇంతదాఁక నాకుఁ దెలియదు.

ఇంతనాఁడు. ద్వ. వి. ఔ. బాల్యము. "క. ఏనింతనాఁటినుండియు, మానవతులలోన నింత మానవతినినై..." శుక. ౧, ఆ. ౧3౪.

ఇంతమాత్ర. దే.వి. ఈకొలఁది, ఈపాటి. "గీ. ఇతఁడు రాజగు రాజగు నింతమాత్ర, గాదు..." భార. విరా. ౧,ఆ.౧౮౬. "గీ.ఇంతమాత్రసుఖంబునకేల యిట్టి, వేళ..." దశా. 3, ఆ. ౯౦.

ఇంత లేసి=ఇం తేసి. "గీ...ఋషుల పాలింటివే యింత లేసిపనులు..." కాశీ. ౨, ఆ. ౧౦౪. "మ...తలఁపంగూడునె యింత లేసి దొరలీదైన్యంబు..." భార. ఉద్యో. ౨,ఆ. 3౦౨.

ఇంతపట్టు. ద్వ. స. 1. ఈమాత్రము. "చ...అతులిత విశ్వశక్తి సముపాహితమూర్తివి కమ్మెమ్ము సం, తతభుజశక్తి నిట్టియవధాన మొనర్పఁగ నీవకాని యీ, క్షితి నొకరుండు లేఁడధికకీర్తియుఁ బుణ్యముఁ జేరు నిన్ను నూర్జితగుణ యింతపట్టు తగఁజేయుము కావుము లోక మంతయున్." భార. ఆర. ౪, ఆ. 3౮౭. 2. ఇది యంతయు. "మ...జనకుండున్ గురుభీష్ములున్ దగినకర్జం బాప్తులై నీకుఁ బ్రీ, తి నెఱింగించుతెఱంగు గాదు తమ బుద్ధిం బోయి సంధాన మి, ట్లొనరం జేయకయున్నఁ గృష్ణునకు ని న్నొప్పించువా రింతవ, ట్టు నిజంబు..." భార. ఉద్యో. 3, ఆ. 3౭౨. "వ...ఇంతపట్టును దేవరకు నెఱింగింప వేగంబ వచ్చితి." భార. ఉద్యో. ౨, ఆ. 3౦౨. 3. ఇంతకాలము. "గీ...ఇట్టినీవు సుట్టమ వయి యింతపట్టు, వారిలో నున్నవాఁడవు వారిజాక్ష." హరి. పూ. ౭, ఆ. ౨33.

ఇంతి. వై. వి. (సం. స్త్రీ. ప్రా. ఇత్థీ.) 1. ఆఁడుది. సాం. ని. మాన. ౨౦. "ఆ...అర్జునుండు... ఇంతిఁ జూచి నగుచు నిట్టు లనియె." భార. ఆది. ౮, ఆ. ౧౨౮. 2. భార్య. "సీ...తా నింతియై యుండఁగా నొరు నర్థించి హరి వేఁడె లక్ష్మీ మాహాత్మ్య మెంత." ను. సం. ౭, ఆ. ౧౨౪. 3. పెండ్లికూఁతురు. "గీ...ఇంతి దో

యిట సేసఁబ్రా లెత్తుచోట." ఆము. ౬, ఆ. ౧౩౩. 4. చెలికత్తె. "గీ. ఇంతి నాఁడుండ కెందుఁబోయితివి నీవు..." ఆము. ౫,ఆ. ౭౧౨. కాళిందీ. ౧, ఆ. ౧౫౧.

ఇంతింత. ద్వ.విశ. ఈ కొలఁదివాడు. "శా. ఇంతింతై వటుఁడింతయై..." భాగ. ౮, స్కం. ౬౨౨.

ఇంతింతలు. ద్వ. వి. బ. అల్పఖండములు. "ఉ...వి ప్రుఁడు...చాప మింతింతలు చేసి..." రుక్మాం. ౫, ఆ. ౨౫. విశ. అత్యల్పమైనది. "క...పలుకయు వాలును నింతిం, తలుదునియ లు సేసె బాణతతిఁ బాండవుఁడు..." భార. విరా. ౫, ఆ. ౧౫౩. "శా...నా తపము పెం పుల్ చూడ నింతింతలే..." ప్రబోధ. ౨,ఆ. ౨౨. ఇట్లే: ఇంతలింతలు. "సీ ..దుస్స సేను, తను వింతలింతలు తునియలై చెదరి రూపఱియున్న.." భార. ఉద్యో. ౩, ఆ. ౧౧౭.

ఇంతియు=ఇంతే. "మ...పెక్కండ్ర కిం, తియ కాలం బగునట్టై నీమనము శాంతిం బొందఁగా నేర్చునే." భార. ఉద్యో. ౪, ఆ. ౪౭. "ఉ...కౌరవుల్ పిదపఁ గూలుదు రింతియ..." భార. ఉద్యో. ౨, ఆ. ౨౭౧.

ఇంతె (తే). ద్వ.స. (ఈ+అంతె.) ఇంతమాత్రము. "ఉ...కూలఁగాఁ, గారణ ముంటఁ జేసి చెడు కార్యముఁ జేసితి వింతె యెమ్మెయిన్." దశా. ౧, అ. ౨౯౫. "శా...నీ కరుణాశరస్సమయ మింతే చాలు..." కాళ. శ. ౧. "శా...మా, కింతే చాలు..." దశా. ౧, ఆ. ౩.

ఇంతేసి. ద్వ. విశ. ఇంతటి, ఇటువంటి. "సీ...ఇం తేసి బలుఘ్రాఁకు లెవ్వఁడు వేయించె..." సావి. ౨, ఆ. ౯౭ పు.

ఇంద. దే. అవ్య. (త. ఇంద.) ఇదిగో తీసికొనుము. "మ...కరముల్ సాఁచి తమిన్ద యింద యని రాగం బొప్పఁగాఁ జీర..." సా. ౧, ఆ. ౫౦.

ఇందకో=ఇంద. "ద్వి...రా యిందకో తమ్మ రతి నొల్లవేని, మా యొడల్ మా కిమ్ము .." పండి తా. మహిమా. ౨౯౭ పు.

ఇందడవు. దే. అవ్య. (ఇంత+తడవు) ఇందాఁక. "క. ఇందడవు నొందు నుండితి, విందుముఖుల్ శాఁగఁ జూడ నేఁగితివో..." మల్హ. ౨,ఆ. ౭౬.

ఇందనుక=ఇంతదనుక. "చ. బడలినవార లింద నుకఁ బాదులు ద్రవ్వియుఁ గారె మెత్తియున్." విప్ర. ౩, ఆ. ౮౪.

ఇందము=ఇంద. "గీ...బొమ్మపాత్తిక లడిగితి కొమ్మ యింద, మనుచు నిచ్చె..." భార. విరా. ౫, ఆ. ౩౦౪. రామా. ౬, ఆ. ౧౯౮.

ఇందఱు. ద్వ. స. బ. (ఇంత+వారు శ.ర.) ఇంత శబ్దమునకు మహన్మహత్వర్థక బహువచనరూప ము. 1. ఇంతమంది. "ఉ. ఇందఱుఁ జూడఁగా నిచట నిమ్మెయి నన్నుఁ బతివ్రతాగుణా, స్పందిత వర్తనం బరమసాధ్వి ననిందితశీలఁ గీచకుం, డొందును నెట్టియంగనల నెవ్వరుఁ జేయనియట్లు సేయఁగా..." భార. విరా. ౨, ఆ. ౧౪౨. 2. అందఱు. "క...ఈపని బంధుజనుల కిందఱి కుఁ గడుఁ, సమ్మతము..." భార. విరా. ౫,ఆ. ౩౫౯. 3. వీరందఱు. "క...నీ, కొడుకని... చూపఁ దత్తె యిందఱు నగఁగాన్." భార. ఆది. ౪, ఆ. ౧౦౦. "చ...ఇం, దఱుమన సా క్షుఁడై చనక తప్పఁగదా..." భార. ఉద్యో. ౪, ఆ. ౧౪౩.

ఇందలి. ద్వ. విశ. ఇందులోపలి, ఇందున్న. "క... ఇందలి పెద్దలు, వినఁగా నను మన్నపలుకువినుము నరేంద్రా." భార. ఉద్యో. ౨, ఆ. ౩౦౦.

ఇందాఁక. ద్వ. అవ్య. ద్రు. (ఇంత+దాఁక) 1. ఇంత వఱకు. "క...ఇందాఁక విశ్రమించితి, మిందు నినుం దడవి కంటి మిప్పు డిచట..." భార. శల్య. ౨, ఆ. ౬౬. 2. ఇంతకుఁ బూర్వము. వ్యవ:—వాఁడిందాఁక నీ కొఱకు వచ్చినాఁడు.

ఇంది. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ఇందిర, లక్ష్మి. సాంబో. ౧, ఆ. ౬౯.

ఇందిందిరము. సం. వి. అ. పుం. తుమ్మెద.

ఇందిర. సం. వి. ఆ. స్త్రీ. లక్ష్మి.

ఇందివరము. సం.=ఇందీవరము.

ఇందీవరము. సం. వి. అ. స. నల్లకలువ.

ఇందు. దే. అ. క్రి. 1. ఒంటఁబట్టు. "చ...కుక్క కు నాజ్య మిందునే." వేం. పంచ. ౨, ఆ. ౨౪౭. 2. స్రవింపక నిలుచు. "ఉ. ఇందని యాముచేఁ బొదలు నేనుఁగు సెక్క..." యయా.

౪, ఆ. ౧౫౫. (బాగుగా స్రవించు అని భావము.) 3. రుచించు. "ఉ...జిహ్వకున్ వంటక మిందునే...శాత్రవుఁ డోకండు తనం తటివాఁడు గల్గినన్." కాశీ. ౧, ఆ. ౧౦౮. అవ్య. ద్రు. 1. దీని (ఈమె, వీని, వీరి) యందు. "సీ...ఇక్కన్య యతిబాల యిం దుద్భవం బగు దౌహిత్రలాభంబు..." భార. ఆది. ౬, ఆ. ౨౪౮. "గీ...ఇందుఁ బుట్టినసుతుఁడు...వంశ విస్తారకుండు గావలయు..." భార. ఆది. ౮,ఆ. ౧౪౪. 2. ఈచోటున."క...ఇందుఁగలఁడందు లేఁ డని, సందేహము వలదు చక్రి..." భాగ. ౭,స్కం. ౨౫. 3. ఈలోకమున. "మ...కృష్ణ కథాసుధారసము సంప్రీతాత్ములై భక్తిఁ గ్రోలిన పుణ్యాత్ములు గాంతు రిందు సుఖముల్..." భాగ. ౧౦ స్కం. ఉ. ౧౩౩౬. 4. ఈ పనికి. "క. నీవిందుకుఁ దగుయత్నము,గావింపుము..." జై. ౫, ఆ. ౧౬౪. "చ...పెనఁగక ప్రాణ రక్షణ ముపేక్ష యొనర్చుట పాప మిందుకై, కనలకు..." ఆము. ౬, ఆ. ౭౮. వి. ఇందుగు, చిల్లగింజ. "సీ...ఇందు గీసినరీతి నించుకించుక చేరి గిలుబాడుఁ దల్లిపైఁ గలపసిండి .." పాండు. 3, ఆ. ౧౬.

ఇందుఁడు. సం. వి. ఉ. పుం. చంద్రుఁడు.

ఇందుకలిక. సం.వి ఆ. స్త్రీ. 1. చంద్రకళ. "చ. కలిత వతంసితేందుకలికా శిఖచే..." భర్తృ. వై. ౧. 2. మొగలిచె.

ఇందుకాంత. సం. వి. ఆ. స్త్రీ. 1. రాత్రి. 2. ఇందు కలిక, మొగలి చె.

ఇందుకాంతము. సం. వి. అ. పుం. చంద్రకాంతము. "స్త్రీ. ఇందుకాంతంబుల నెబ్బంగి వడసెనో ని ష్యంద కీలాల నిర్ఝరములు. నైష. ౮,ఆ.౧౬౭.

ఇందుక్షయము. సం. వి. అ. పుం. 1. చంద్రుని తగ్గుదల. 2. అమావాస్య.

ఇందుగ(గు). దే. వి. 1. కతకము, చిల్ల చె. "సీ...ఇందుగ యనఁ జిల్ల, యనఁ గతకం బగు..." ఆం. భా. ద్వి. ౬3. "గీ...అం దుగులు గేదఁగులు మఱ్ఱు లిందుగులును." అచ్చ. సుం. ౨౫. 2. చిల్లగింజ. (వా)

ఇందుప్పు. ద్వ.వి. (ఇందు+ఉప్పు.) సైంధవలవణము. "సీ...ఇందుప్పనంగ, నడరు సైంధవలవణము." ఆం. భా. ద్వి. ౨౪౯.

ఇందుభము. సం. వి. అ. న. 1. కర్కటరాశి. 2. మృగశిర.

ఇందుమణి. సం. వి. ఇ. పుం. 1. చంద్రకాంతశిల. 2. ముత్యము.

ఇందుమతి. సం. వి. ఈ. స్త్రీ. 1. పూర్ణిమ. 2. అజ మహారాజుభార్య.

ఇందుమౌళి. సం. వి. ఇ. పుం. చంద్రమౌళి, ఈశ్వ రుఁడు.

ఇందులు. దే. అవ్య. ద్రు. 1. ఇందుఁగల. "క...ఇం దుల తాత్పర్యము నీ, డెందము నొందించి...." భార. శాం. ౫, ఆ. ౧౭. 2. ఈచోటున. "క...ఎందుండి వచ్చి తిందులకు..." భార. ఆది. ౪, ఆ. ౨3౧. 3. ఈ లోకమున. "క... ఇం, దుల జీవనమేల నమ్ముదురు తత్త్వజ్ఞుల్." భార. ఆది. ౬, ఆ. ౨౪౫. 4. దీనికి, వీనికి. "వ...ఇందులకుఁ బొందుపడు ప్రత్యుత్తరంబు ల..."ఆము. ౬,ఆ.3౬. 5. ఇందు. "చ...నీకు నెద్దిప్రియ మిందులలో..."జై. ౫, ఆ. ౧33.

ఇందులోహము. సం. వి. అ. న. వెండి.

ఇందువదన. సం. వి. ఆ. స్త్రీ. చంద్రముఖి, స్త్రీ.

ఇందువారము. సం. వి. అ. పుం. సోమవారము.

ఇందువు. ఉభ. దే. వి. 1 చిల్లచె. "ఉ...ఇందువు గింజచే నుదక మెంతయు శీఘ్రముగా ప్రసన్న త గా, జెందువిధంబునన్..." శివయో. ఉ. ౧, ఆ. ౨3౨. 2. చిల్లగింజ. "సీ...నీల్లకలఁక విందువు రాచి తెలుచుభంగి..." వాసిష్ఠ. 3, ఆ. 3౨. సం. వి. ఉ. పుం. 1. ఇందుఁడు. 2. పలమెత్తువెండి. (శ. ర.) 3. మృగశిరా నక్షత్రము. 4. హారతి కర్పూరము. 5. ఒకటి యనుసంఖ్య.

ఇందూరము. సం. వి. అ. పుం. ఎలుక.

ఇంద్ర. సం. వి. ఆ. స్త్రీ. మరువముచె

ఇంద్రకము. సం. వి. అ. న. సభాగృహము

ఇంద్రకీలము. సం. వి. అ. పుం. అర్జునుఁడు తపస్సు చేసిన పర్వతము. బెజవాడదగ్గఱ నున్నది. "ఉ. అర్జునుఁ డింద్రకీలగిరియందు..." హర. ౭,ఆ. 3. రూ. ఇంద్రకీలకము.

ఇంద్రకోశము. సం. వి. అ. పుం. 1. మంచె. 2. నాగదంతము. 3. ఇంటిముందటి చూరు.

ఇంద్రగణములు. సం. వి. అ. పుం. బ. మాత్రాగణములు. (ఇవి పదునాలుగు.)

ఇంద్రగోపము. సం. వి. అ. పుం. ఆరుద్రపురుగు. ఇట్లే: ఇంద్రగోపకము.

ఇంద్రచ్ఛందస్సు. సం. వి. స్. న. వేయిపేఁటలు గలహారము.

ఇంద్రచాపము. సం. వి. అ. న. ఇంద్రధనుస్సు. "ఉ. చాపము లింద్రచాపములచందము..." విక్ర. ౪, ఆ. ౯౫. "గీ. పశ్చిమంబున నింద్రచాపంబు వొడిచె. హర. ౨, ఆ. ౧౮.

ఇంద్రజాలము. సం. వి. అ. న. 1. ఒక విధముగా నున్నదానిని మఱియొకవిధముగా గనఁబఱచు విద్య, కనుకట్టువిద్య. 2. మాయ. "ఉ...రాజ్య తంత్రసున్నాహము జంత్రపుం బ్రతిమనాట్యము లైహిక మింద్రజాలమీ, దేహసుఖంబు." కవిరా. ౧, ఆ. ౧3౨. 3. మోసగించుట.

ఇంద్రజి. సం=ఇంద్రజిత్తు. భార. అర. ౭,ఆ. ౧౨౦.

ఇంద్రజితుఁడు. సం=ఇంద్రజిత్తు. భా. రా. సుం. ౪౯.

ఇంద్రజిత్తు. సం. వి. త్. పుం. ఇంద్రుని గెలిచినవాఁడు, మేఘనాదుఁడు. ఇట్లే: ఇంద్రజిత్తుఁడు. మొ. రా. యు. ౨3.

ఇంద్రతూలకము. సం. వి. అ. న. దూదిప్రోవు.

ఇంద్రద్రువు. సం. వి. ఉ. పుం. ఏఱుమద్దిచె. 2. కొండమల్లెచె.

ఇంద్రధనుస్సు. సం. వి. స్. న. ఇంద్రచాపము, ఇంద్రధనువు, వర్షసమయమున మేఘములపైఁ జిత్రవర్ణములతో ధనురాకారముగాఁ గనఁబడు సూర్యకిరణసముదాయము.

ఇంద్రనక్షత్రము. సం. వి. అ. న. జ్యేష్ఠానక్షత్రము.

ఇంద్రనీలము. సం. వి. అ. పుం. 1. నీలమణి. 2. వస్త్రవిశేషము. బస. 3, ఆ. ౫౯ పం.

ఇంద్రభేషజము. సం. వి. అ. న. సొంటి.

ఇంద్రభోగము. సం. వి. అ. పుం. మహావైభవము. "క. తన కలిమి యింద్రభోగము, తన లేమియె సర్వలోక దారిద్ర్యంబౌ. సు. శ. ౨౨.

ఇంద్రయవము. సం. వి. అ. పుం. కొడిసెవిత్తు.

ఇంద్రలుప్తకము. సం. వి. అ. న. ఇంద్రలుప్తము, బట్టతల. ఇట్లే: ఇంద్రలుప్తము.

ఇంద్రవజ్ర. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక వృత్తము. ఇందు ప్రతిపాదమునందు పదునొకండుఅక్షరము లుండును.

ఇంద్రవల్లి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. పెద్దపాఁపరచె. 2. పారిజాతముచె.

ఇంద్రవారుణి. సం. వి. ఈ. స్త్రీ. పెద్దపాఁపరచె.

ఇంద్రాగ్ని. సం. వి. ఇ. పుం. మెఱపు.

ఇంద్రాణి. సం. వి. ఈ. స్త్రీ. 1. శచీదేవి. 2. దుర్గాభేదము. 3. పెద్దయేలకిచె. 4. నల్లవావిలిచె.

ఇంద్రాయుధము. సం. వి. అ. న. 1. వజ్రాయుధము. 2. ఇంద్రధనుస్సు.

ఇంద్రారి. సం. వి. ఇ. పుం. వేల్పుదాయ, రాక్షసుఁడు.

ఇంద్రావరజుఁడు. సం. వి. అ. పుం. ఉపేంద్రుఁడు, విష్ణువు.

ఇంద్రియము. సం. వి. అ. న. 1. త్వక్కు మొదలగునవి. (త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము— ఇవి జ్ఞానేంద్రియములు. వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థము—ఇవి కర్మేంద్రియములు, మనస్సు పదునొకండవ యింద్రియము.) 2. రేతస్సు. 3. ఐదుసంఖ్య.

ఇంద్రియారాముఁడు. సం. విశే. (అ. ఆ. అ.) విషయలోలుఁడు.

ఇంద్రియార్థము. సం. వి. అ. పుం. శబ్దాది విషయము. (శబ్దము, స్పర్శము, రూపము' రసము, గంధము—అని ఇవి ఐదు.)

ఇంద్రుఁడు. సం. వి. అ. పుం. 1. సురపతి. 2. ఒక ఆదిత్యుఁడు. 3. పరమేశ్వరుఁడు. 4. సమాసోత్తరపదమై "ఇంద్రుఁడు, ఇంద్రము" అను రూపములతో "శ్రేష్ఠుఁడు, శ్రేష్ఠము" అను నర్థముల నిచ్చును. (ఉదా:—నరేంద్రుఁడు, మృగేంద్రము మొ.) 5. ౧౪ అనుసంఖ్య.

ఇంధనము. సం. వి. అ. న. **1.** వంటకట్టె. **2.** వెలిఁగించుట. విణ. (అ. ఈ. అ.) వెలిఁగించునది.

ఇంధము. సం. వి. అ. పుం. వంటకట్టె. విణ. (అ. ఆ. అ.) **1.** వెలిఁగించునది. **2.** వెలుఁగునది.

ఇంధ్యము. సం. విణ. (అ. ఆ. అ.) కాల్పఁదగినది.

ఇంపితము. దే. విణ. (ఇంపు+ఇతము) ఇంపైనది. (ఇది పోరితమువంటిది) (శ.ర.)

ఇంపు. దే.వి. **1.** ఆనందము. "శా ..ఆ యింపే పరబ్రహ్మము..." స్వా. ౨, ఆ. ౬౨. సాం.ని. మాన. ౨౩. **2.** తీపి. "సీ.. అమృతంబునింపు కర్ణములకు..." భార. సౌ. ౧, ఆ. ౨౨౭. **3.** విలాసము. "గీ. ఇంపు దళుకొత్త వీణ వాయింపుచుండి..." స్వా. ౨, ఆ. ౨౮. **4.** ఇచ్ఛ, కోరిక. "సీ. చారువేణికి వింత చవుల నింపులు మీఱఁ గనుపట్టె విశదమై గండరేఖ." వసు. 3, ఆ. ౨౦. **5.** అనురాగము, ప్రేమము. "చ...ఇం,పులతమి దీఱె నక నిదురవోయిరి నన్నుబోఁటులు లత్తఱిన్" కువల. ౨, ఆ. ౧౧౦. **6.** వలపుపని. "ఉ. వెంపునఁ జందమామ ప్రతిబింబముఖంబునఁ జుంబనంబు గా,వింపను రాయఁ దక్కరనవీనరుచుల్ పలితభ్రమంబు వుట్టింపఁగ రోసి పద్మిని మడించెను మో మనఁ దమ్మి మోడ్చె నా, యింపటు సూచి నవ్వె నన నెంతయునుర్వి వికసించెఁ గల్వయున్." విప్ర. 3,ఆ.3౬. **7.** వాత్సల్యము. (కూఁతు రగు కాళిందిని) "చ...ఇనుఁడు కవుంగిలించుకొని యింపుగ మూర్కొని..." కాళిందీ. ౧, ఆ. ౨౩౮. విణ. హితము. "గీ...ఇతము పేరి మిం పన హిత మెసఁగును." సాం. ని. మాన. 33. "గీ...నలుని వరియింపఁ గోరెడు నాకు నిప్పు, డింద్రుపలుకు లయుక్తంబు లింపు గావు." నైష. 3, ఆ. ౧3౧.

ఇంపెసలారు. దే. అ. క్రి. (ఇంపు+ఎసలారు) శోభించు. నైష. 3, ఆ. ౯౯.

ఇంపొందు. దే. అ. క్రి. (ఇంపు+పొందు) **1.** ఆనందించు. "శా...అత్యంత కల్యాణస్ఫూర్తి వెలుంగునిన్నుఁ గని తెల్లం బేను నింపొందెదన్" భా. రా. యు. ౪౦౧. **2.** ఒప్పు, "శా...మా,కింతే చాలు నటంచు సంతసముతో నింపొందు నాభారతీ, కాంతుండు..." దశా. ౧, ఆ. 3.

ఇంబు=ఇంపు. దే. వి. **1.** ఆనందము. "ఉ. ఇంబడరంగ నియ్యకొనియెన్ రజనీచరుఁ డేమి భాగ్యమో, యంబుజనాభ..." ప్రభా. ౧, ఆ. ౯౧. రాఘవ. ౨, ఆ. ౧౧౧. **2.** విలాసము. "శా.. ఇంబుల్ గుల్కెడుచాన .." మల్లభూ. వైరా. ౪౧. "సీ...గురుభట్టవాగ్గుంభగురుతర వనములో నింబు మీఱఁగ విహారంబు చేసి..." కాళిందీ. ౧, ఆ. 3౨. విణ. హితము. "ఉ...ఇంబుగ సర్వలోకజనులు...భారతవాగమృతంబు.. త్రావుదురు .." భార. ఆది. ౧, ఆ. ౭౭.

ఇఁక. దే. అవ్య. ద్రు. **1.** ఈపైని, ఇందుమీఁద. "ఆ ..ఇంకనైన మమ్ము నెఱుఁగంగ నగునొకొ .." భార. ఆది. ౬, ఆ. ౯౦. **2.** మఱియొక. "ఉ...నన్ను నింకొకని కియ్యక తొల్తన..." ఆము. ౫, ఆ. ౭౦. **3.** మఱియు. "మ...ఇమ్మునీ, శ్వరుసామర్థ్యము నింకఁ జెప్పెద .." భా. రా. అర. ౭3. **4.** ఇంతకన్న. "క...నా, కింకను బలువురు తనయులఁ బడయంగవలయు..." భార. ఆది. ౫, ఆ. ౧౧౯. **5.** దీనితో. వ్యవ:—నీ వింక చాలింపుము. **6.** ఇంతవఱకు. వ్యవ:—వాఁ డింకను రాలేదు.

ఇఁకమీఁద=ఇఁక. దే. అవ్య. ద్రు. ఈపైని. "గీ ..తలఁపఁ త్రైలోక్యలక్ష్మియాధన్యుఁ జేరు, నీకు నెయ్యది యిఁకమీఁద నిర్జరేంద్ర..." దశా. ౨, అ. 3౨. ఇట్లే: ఇఁకమీఁదట. దశా. ౪, అ. 3౪.

ఇఁగ=ఇఁక. దే. అవ్య. ద్రు. ఈపైని, "ఉ...నె,మ్మి గదుర వచ్చి పొం డిటకు మీ రన మీఱనయుక్త మిందుపై, నిఁగఁ బసిగోల గోలతన మేలను మే లనుకూల మయ్యెడిన్." శశాం. ౨, ఆ. ౧౪౦.

ఇఁడి. దే. ప్ర. లేనిది; లేనివాఁడు. (ఉదా:—సిగ్గిఁడి, ముక్కిఁడి మొ.)

ఇక్క. దే. వి. (క. ఇక్కె.) **1.** స్థానము. "క...ఎయ్యది సుఖములకు నిక్క యేర్పడఁ జెపుమా." భార. అర. ౭, ఆ. ౪౪౦. **2.** సంకేత

స్థలము. "ఉ...అక్కమలాక్షిపొందు దగ నాడితుదిన్ నిజమేది సేఁటిరే, యిక్కకు రాక తక్కిన..." భార. విరా. ౨, ఆ. ౨౯౬. **3.** ఇల్లు, "ఉ. మనోభవుండు వి, ల్లెక్కిడి చక్రవాకముల యిక్కలు రోయఁగఁ జొచ్చె." భార. విరా. ౭, ఆ. ౩౧౯. **4.** ఆధారము. "సీ...పరహితక్రియ కిప్రపన్నుఁ డిక్క..." ఉ. రా. ౫, ఆ. ౧౪౦. **5.** ఉనికి, నివాసము. (చూ. ఇక్కపట్టు.)

ఇక్కట్టు. దే. వి. (క. త. ఇక్కట్టు.) ఆపద. "ఆ...ఎందుఁ జనఁగ రానియిక్కట్టు ప్రాప్తిం చె..." కృష్ణ. ౩, ఆ. ౪౩. విణ. ఇఱుకైన. "సీ...ఇక్కట్టు త్రోవల నెదురైన నెదురుగా నొయ్యారిమేనుమే నొరయ నేఁగు .." దశా. ౯, ఆ. ౨౧౪.

ఇక్కడ. దే. వి. ఏ. (ఈ+కడ.) **1.** ఈ చోటు. **2.** ఈ లోకము. (వా.)

ఇక్కడక్కడపడు. ద్వ. అ. క్రి. (ఇక్కడ+అక్కడ+పడు.) కలఁగు, క్షోభించు. "క...అదరి మొన లిక్కడక్కడ, వడి దిరిగిన దిశలు బడలుపడ రౌద్రము చూ, ప్పడ బాహు శక్తి యేర్పడఁ, గడిమి ఫొగడ్తపడఁ గుంభ కర్ణుఁడు పోరెన్." నిర్వ. ౬, ఆ. ౧౨౧.

ఇక్కన్ను. దే. వి. ఔ. (ఇరు+కన్ను) నేత్రద్వయము, రెండుకన్నులు. "ద్వి...ముక్కంటి వాని సమ్ముఖముననుండి, యిక్కంటితో నొక్క యింతి యేతెంచ..." బస. ౩, ఆ. ౧౯.

ఇక్కపట్టు. దే. వి. (ఇక్క+పట్టు) ఉనికిపట్టు. "సీ...క్రొక్కారుమెఱుఁగుల యిక్కపట్టైది..." కు. సం. ౩, ఆ. ౧౯.

ఇక్కము. దే. వి. ఇఱుకటము. "ఉ...ఎక్కడివాఁడ వన్న కడు నిక్కపుఁగారడవిం జరించెదు..." ఉ. హరి. ౨, ఆ. ౧౩౨. (శ.ర.పా. 'ఈరపు.' పాఠాంతరము.)

ఇక్కలుపడు. ద్వ. అ. క్రి. (ఇక్కలు+పడు) స్థానభ్రంశము నందు; చలించు. "వ...ఒండొంటిం దాఁకురభసంబున నిక్కలుపడ మ్రక్కం ద్రొక్కుచు మెండుచెడి బెండువడి..."భాగ. ౯ స్కం. ౫౫; ౨౦౯.

ఇక్కలి. దే. వి. మార్దవము. "ఉ. ఇక్కలి దక్కి నిక్కి మెఱుఁ గెక్కి...తగునీ చనుదోయి మాటునన్, జిక్కిన నేమొకాని మరుచేఁ బడరాదికఁ బ్రాణనాయికా." మల్హ. ౩, ఆ. ౧౦౧.

ఇక్కు. దే. వి. **1.** ఇఱుకు. (చూ. ఇక్కుపాటు.) **2.** ఆయుస్థానము, నడినెత్తి. "ఆ. ఇక్కు ముట్టిచక్కి నెక్కంగ మఱచి సం, భ్రమము పొంది పిఱుఁదఁ బ్రమథగణము, లార్వఁ బోతు మీఁద నడ్డంబుపడి యుప్పు, పెటికవోలె వెఱచి పఱచె జముఁడు." కు. సం. ౨, ఆ. ౭౧.

ఇక్కుపాటు. దే. వి. (ఇక్కు+పాటు.) ఇక్కట్టు, కష్టము. "ద్వి...అక్కటా! నీతిజ్ఞుఁడైన నీ కిట్టి, యిక్కుపాటును గల్గెనే తండ్రి యనుచు.." రం. రా. సుం. ౨౩౬ పు. ౪. పం.

ఇక్కువ. దే. వి. **1.** ఇక్క, ఉనికి. "ఉ. ఎచ్చటఁ గంటిరో విజయునిక్కువ నిక్కువ మానె..." విజ. ౨. ఆ. ౧౬౭. **2.** స్థానము. "క....మీ మీ,యిక్కువలకుఁజనుఁడు వానరేశ్వరులారా!" భా. రా. యు. ౨౪౭౯. **3.** సంకేతస్థలము. "ఉ. మక్కువఁ బుష్పగంధి పురమర్దనుసన్నిధి నాటలాడి తా, నిక్కువ కేఁగుదేరఁగ రతీశ్వరు పట్టపుటేనుఁగో యనన్." మల్హ. ౩, ఆ. ౬౯. **4.** కళాస్థానము. "గీ...సొగసుకాఁడు... ఇక్కువ లంటి తుంట, వింటిబలుదంటపనులు గావించునపుడు..." నీలా. ౩,ఆ.౯౪. **5.** జాడ. "గీ. త్వష్టకు సుదాహరకుఁ జతుర్దశి యనంగ, నొక్కకూఁతురు గలిగిన యిక్కు వెలిఁగి, గంధగజములఁ దేలి..." ఉ. హరి. ౧, ఆ. ౯౨. **6.** ఉపాయము. "ఉ. ఎందుకు మందుమంత్రమన నెందుకు దైన్యముతోడ వేఁడుకో, నెందుకు నే వచింతు నొకయిక్కువ యించుక విందు రేని యున్." రాధా. ౩, ఆ. ౧౪౫.

ఇక్కువము. దే. విణ. అనంతము. "మ. అవనీ చక్రము పెద్దయున్ విపుల మిందాశ్చర్యముల్ పెక్కు లి, క్కువమై యిట్టివిధంబు రూపములు గల్గుం గల్గినన్ మేదినీ, ధవునంతఃపురకాంతలైన నినుఁ జెంతం జేరఁగా వచ్చునే, తవులందీరునె నీకుఁ బిమ్మట మనస్తాపంబు శేషింపదే." దశ. ౭,ఆ. ౬౧.

ఇక్షుకాండము. సం. వి. అ. పుం. న. 1. ఱెల్లు. 2. ముంజిగడ్డి. 3. చెఱకుగడ.

ఇక్షుగంధ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఱెల్లు. 2. గొలిమిడి. 3. తెల్లనేలగుమ్మడు. 4. పల్లేరు.

ఇక్షుధన్వుఁడు. సం. వి. న్. పుం. ఇంచువిల్తుఁడు, మన్మథుఁడు.

ఇక్షునాళిక. సం. వి. ఆ. స్త్రీ. నల్లచెఱకు.

ఇక్షుయోని. సం. వి. ఇ. పుం. పుండ్రేక్షువు, నలుపు గలిసిన యెఱ్ఱచెఱకు.

ఇక్షురము. సం.వి.అ.పుం. 1. పల్లేరు. 2. చెఱకు. 3. ఱెల్లు. 4. ముల్లుగొలిమిడి.

ఇక్షువణము. సం. వి. అ. న. చెఱకుతోఁట.

ఇక్షువు. సం. వి. ఉ. పుం. చెఱకు. (పుండ్రము, కాంతారము, శతపర్వము, బంగాళము, నేపాళము మున్నగునవి దీనిభేదములు.)

ఇక్షుశరము. సం. వి. అ. పుం. ఒకజాతిఱెల్లు.

ఇక్షుశాకటము. సం. వి. అ. న. చెఱకు పండెడు పొలము.

ఇక్షూదము. సం. వి. అ. పుం. చెఱకుసముద్రము.

ఇక్ష్వాకువు. సం. వి. ఉ. పుం. సూర్యవంశపు క్షత్రియులలో నొకఁడు. ఉ. స్త్రీ. చేఁదుసొఱ.

ఇగము. వై. వి. (సం. హిమమ్.) 1. చల్లఁదనము. (వా.) 2. మంచు. "గీ ఇవ మిగ మనఁగ మంచన హిమము బొల్చు..." వేంక. దేవ. ౹౩. విశే. శీతము. 'గీ...చల్లన యిమ బిగంబిము చలిమిరి చలి.. అనఁగ శీతంబు .." ఆం. భా. ప్ర. ౮౦. రూ. ఇమము.

ఇగిడించు=నిగిడించు. దే. స. క్రి. ప్రయోగించు, ఏయు. "సీ. దైత్యు లుద్దండించి దండశంకుల శక్తు లిగిడించి రుడిగించె నింద్రసుతుఁడు." హర. ౨, ఆ. ౧౬౪.

ఇగిరించు. దే. అ. క్రి. 1. చిగిరించు. "శా ..గాన సుధచే హేలాకరాంభోజపు, ణాదండం బిగిరించె నా..." రాజ. చ. ౧, ఆ. ౪. 2. కలుగు, పొడము. "వ ..కఱకుటెఱకలు మగుడ నిగిరించిన తెఱంగున..." వసు. ౨, ఆ. ౧౧. 3. ఎఱు

పెక్కు. "క. పట్టికొని కట్టి రావణుం, గట్టెదు టను బెట్టి తోఁకఁ గ్రంపుగఁ గోకల్, చుట్టించి యింగలంబున, ముట్టించిన నుమఁ డలిగి మొగ మిగిరింపన్. య. ౩, ఆ. ౨౫. (శ. ర. పా. ఇగు రింపన్ ముద్రితము) స. క్రి. (ఇగురు. ధా. ప్రే.) 1. ఇగిరిపోఁజేయు. 2. సశేషఁజేయు. "చ... పయోధినాథు జీ, వన మిగిరించి .." పద్మ. ౨, ఆ. ౩౯. (రెండిటికి నిది యుదాహరణము.)

ఇగిరిక. దే. వి. హాస్యము, గంజివార్చినయన్నము. "సీ ..హాదిమ్యంబు చెలఁగు, నిగిరిక యొం చన నిగిరికె యంచన .." ఆ . భా. ద్వి. ౧౭౨.

ఇగిరికె=ఇగిరిక. ఆం. భా. ద్వి. ౧౭౨.

ఇగిలించు. దే. అ. క్రి. ఇగుళ్లు కనఁబడునట్లు చేయు. 'క. ఇగిలించుకొన్న పిమ్మట, నిగి చుకొ కాని కార్య మే మున్నది..." శుక. ౨, ఆ. ౨౯౧. స. క్రి. (పండ్లను) వెలుఁవఱుచు. "సీ... సొ. పుతో నద్దంబుఁజూచి పండ్లిగిలించు..." శుక. ౩, ఆ. ౭౮.

ఇగిలింత. దే.వి. (ఇగిలించు. ధా.) ఇగిలించుట. (శ.ర.)

ఇగురాకు. దే. వి. (ఇగురు+ఆకు) లేఁతయాకు, చిగురు. "సీ. అంధకధ్వంసికి నవ్వించి మఱి కాని కోయిల లిగురాకుఁ గొఱుక వచట." ఉద్భ. ౧, ఆ. ౫౪.

ఇగురాకుఁబోణి. దే. వి. (ఇగురు+ఆకు+పోణి.) మనోజ్ఞురాలగు స్త్రీ; స్త్రీ. "...ఆ యిగురాకుఁ బోణి వినయంబున దగ్గఱి తండ్రి కిట్లనున్." పరమ. ౪, ఆ. ౬౮.

ఇగురు. దే. అ. క్రి. 1. చిగిరించు; ఆనందించు. 'సీ... చిత్తమిగురు..." కాశీ. ౭, ఆ. ౧౪౪. 2. ఇంకు. "క. కూపటప్ని నిగురఁజేసెద, శాతోగ్రాస్త్రముల..." భా. రా. అర. ౨, ఆ. ౩౧౫. వి. 1. చిగురు. 'చ. ఇగురులవంటి నీ యడుగులు..." ఉ. రా. ౭, ఆ. ౪౬౯. 2. పండ్లచుట్టును గల కండ. "గీ...ఇగురు గుట్టి నెత్తురు ద్రాగిన, భంగి..." కు. స . ౧౦, ఆ. ౧౪౬.

ఇగురుఁగైదువుజోదు. ద్వ. వి. (ఇగురు+కైదువు+జోదు.) మన్మథుఁడు. 'సీ. ఏ మంత్రిసౌభాగ్య మిగురుఁగైదువుజోదులాలిత్యసీమకు మేలు బంతి." భీమ. ౧, ఆ. ౧౯.

ఇగురుఁబోఁడి. దే. వి. (ఇగురు+బోఁడి.) మనోజ్ఞ యగు స్త్రీ; స్త్రీ. 'గీ. ఇందిరకు లోకమాతకు నిగురుఁబోఁడి, కలరుచిల్కాని తల్లికిఁ బ్రార్థితార్థ, కల్పవల్లికి మ్రొక్కెదఁ గంటి మాటి." కాశీ. 3, ఆ. ౪౧.

ఇగురుఁబోణి=ఇగురుఁబోఁడి. "గీ. స కలధ్యాత్మ హంసకథాసరసిలోన, నెప్పుడును దేలుచుండు నాయిగురుఁబోణి." కాళిందీ. ౨, ఆ. ౧౯.

ఇగురుకూర. దే. వి. ఉడికించివార్చి పోఁగపులో వేసినకూర. (వా)

ఇగురుకొను=ఇగుర్కొను. దే. అ. క్రి. చిగురించు. "ఆ...వాణి నారదాది వైణికులకు, వీణె యిగురు కొనఁగ వివిధభంగులఁ బాడి." శ్రీరాధా. ౪, ఆ. 3౨౭.

ఇగురుచు. దే. అ. క్రి. 1. చిగిరించు.(చూ. ఇగుర్చు) 2. పొడము. "వ...పగడపుఁజిగురుటధరముల తుదల నిగురుచు చిఱునగవులు..." భీమ. ౧, ఆ. ౧౧౭. 3. ఇగురఁజేయు. "క...చెమట గందవొడి నిగురుచుచున్." శ్రీరాధా. ౪, ఆ. ౨3౫.

ఇగురు విలుతుఁడు. ప్వ. వి. మన్మథుఁడు. (వ్యు.)

ఇగురువెట్టు. దే. అ. క్రి. (ఇగురు+పెట్టు) అనురక్త మగు, మోహముకచు. "సీ. ఏపువ్వుఁబోఁడుల యిసిరింతచూపుల బుఘలగట్టిమనంబు లిగురు వెట్టు." కాశీ. 3, ఆ. ౧౬౯.

ఇగురొత్తు. దే. అ. క్రి. (ఇగురు+ఒత్తు) 1. చిగిరించు. (శ.ర.) 2. అనురక్తమగు. "సీ...ఇగురొత్తు చిత్తంబులు..." భార. విరా. ౨, ఆ. ౨3౮. భార. ఆర. ౭, ఆ. ౨౧౦. 3. అలరు. "క. ఎన మీఱిన వేడ్కఁ జిత్త మిగురొత్తంగన్." అచ్చ. అయో. 3. 4. కలుగు. 'క. కోరిక లిగురొత్తఁగ..." పాం.౫,ఆ.౬3. 5. ప్రారంభ మగు. 'సీ...ఒకదేవి నిగురొత్తునొండుబుతువు." కాశీ. ౧, ఆ. ౧౨౯.

ఇగుర్కొను=ఇగురుకొను. దే. అ. క్రి. చిగిరించు. "ఉ...ఎలమావి నిగుర్కొనుకొమ్మ..." చెన్న. ౧, ఆ. ౨౪౭.

ఇగుర్చు=ఇగురుచు. దే. అ. క్రి. 1. చిగిరించు. "ఉ... కాలినయట్టి మ్రోడుకై, వడి రతిలోచనాంబువులనాన నిగిర్చితె..." స్వా. 3, ఆ. ౪౬. 2. పొడము. "సీ. మది నిగిర్చినమాట మగువ నీపెంపునఁ గుదిసి నాసాలుకతుదికి రాదు..." భార. విరా. ౨, ఆ. ౪౭. స. క్రి. ఇగురఁజేయు. 'క...మేనితడి యిగుర్పఁగ నొత్తన్..." నైష. ౬, ఆ. ౪౨.

ఇగులుచు=ఇగుర్చు. దే. స. క్రి. ఇగిలించు. "క... నగచరుఁ డది విని వెఱఁబా, ణ్గిలిచి..." వేం. పంచ. ౪, ఆ. ౭౬.

ఇగుల్చు. దే. స. క్రి. ఇగిలించు. "గీ...పండ్లిగుల్చుచు..." నైష. ౭, ఆ. ౫౨.

ఇగో. దే. అవ్య. (క. ఇగో.) ఇదిగో. "ఉ...వీఁడిగో, గుజ్జుఘుటోత్కచుండుగ వచ్చె..." జై. 3,ఆ.౧౧౪. (శ.ర.పా. "వీఁడుగో" ముద్రితము.)

ఇగ్గు. దే. అ. క్రి. 1. ఒఱగు. "ఉ...ఇగ్గెడువెన్కకుం బయికి నీడ్చినఁ బైఁటఁ దొలఁగఁజేయఁ గే, లొగ్గెడు రెమ్మి పోఁకముడి యూడ్చినఁ గ్రుంగిలి రెండుకొంగులున్, బిగ్గ నడంచుచున్ విడిచి పెట్టదు..." విజ. ౨,ఆ.3౦. 2. వెనుకకొఱగు. (శ.ర.) స. క్రి. లాగు. "ఉ...అ, ద్దానిచెఱంగు వట్టిన నుదాత్తత నిగ్గక కోప మయ్యెదన్, మానక యున్న దాని..." బిల్హ. 3, ఆ. ౧౦౯. సుభద్రా. ౨, ఆ. 3౦.

ఇగ్గులాట. దే. వి. ఇగ్గులాడుట. (శ.ర.,బ్రౌ.)

ఇగ్గులాడు. దే. అ. క్రి. పెనఁగు. "గీ. వనమృగం బులపాలకుఁ గనుటఁదెలిపె, వేటకాండ్రకుఁ గుఱ్ఱవిశలి యపుడు, పట్టఁ బట్టంగ నిలువక బలిమి నిగ్గు, లాడి యెగురుచుఁ దమకించు జాడ వలన." కవిరాజ. ౨, ఆ. ౯3. స. క్రి. వెనుకకీడ్చు. "చ...చిరగతి నిగ్గులాడకువె సిగ్గ మనంబచలత్వ మొందకే..." రస. 3, గు. ౧౪3 పు. ౧33 ప.

ఇగ్రుచు. దే. అ. క్రి. ఇగురుచు, పొడము. "గీ. ఇగ్రుచుకోర్కులఁ దనడెంద మివతళింప." కళిక. 3, ఆ. ౨౨౨. శివరా. ౨, ఆ. 3౯.

ఇచ్చిపుచ్చుకోలు. దే. వి. ఇచ్చిపుచ్చుకొనుట. (శ.ర.)

ఇచేటు=ఇచ్చోటు. దే. వి. "చ...దివ్యవిహారలీలలం, బరగెదవేల యిం కిచట..." భార. స్వర్గా. ౫౧.

ఇచోటు=ఇచ్చోటు. దే. వి. "గీ...ఇచోటు పుణ్యలోకము..." భార. స్వర్గా. ౭.

ఇచ్ఛ. వై. వి. (సం. ఇచ్ఛా.) 1. కోరిక. "సీ...నా విభవంబు...నాకిచ్చ పుట్టిన నప్పుడ పాలిచి తోంచు..." భాగ. శాం. ౪, ఆ. ౩౯౨. 2. మనస్సు. "చ...అని తనమాట కియ్యకొను నన్న రుపల్కులు కిచ్చ మెచ్చి..." భార. మహా. ౭. క్రి. విశే. యథేచ్ఛముగా. "క...తా, నచ్చట సంతర్పితుండై, యిచ్చం జనియె..." భార. విరా. ౫, ఆ. ౩౦౧. విశే. ప్రియము. "క. సన్నిధిం బన్నగహారుండు, పెన్నిధిం గని పొంగుచున్న పేదలక్రియ న, య్యన్నం దమ్ముని గని మీ, కెన్నంగ నే వరములిచ్చ యిచ్చెద వానిన్." ఉ. హరి. ౪, ఆ. ౧౫.

ఇచ్చకదారి. ద్వ. విశే. (ఇచ్చకము+దారి.) ఇచ్చగొండి, ముఖప్రీతికై పనిచేయువాఁడు. "గీ. చిటిక లిడు జృంభణంబునం జేసి దివిజ, వైరి కగదారి యిచ్చకదారి యగుచు." దశా. ౭, ఆ. ౧౭౯.

ఇచ్చకమాడు. దే. స. క్రి. అచ్చికబుచ్చికలాడు. (వా.)

ఇచ్చకము. వై. వి. (సం. ఐచ్ఛికమ్.) 1. ప్రీతి. "చ... అ, చ్యుతునకు నిచ్చకం బొదవ నూడిద యిచ్చిన నిచ్చుంగాక..." పారి. ౧, ఆ. ౧౪. 2. ఇష్టోక్తి, ప్రియవచనము. "సీ...ఇష్టోక్తి భాసిల్లు నిచ్చక మన..." ఆం. భా. ప్ర. ౧౧౭. 3. స్తుతివచనము. "గీ. అలివ నీకనుబొమల కప్రతి యటంచు, నెట్టి ధర్మంబుపై నాన యిడఁగవచ్చు, నిచ్చకము గాదు సుమ్ము నేఁ డిది నిజమ్ము." సా. ౬, ఆ. ౨౧౪. 4. వ్యామోహము. "సీ...ఇచ్చకం బిగురొత్తఁ బచ్చి దేరంగఁ బల్కు..." హంస. ౨, ఆ. ౧౦౪. విశే. 1. ఎదుటఁ బ్రీతికరము పిదప బాధాకరము నైనది. "ఆ...వారవనితపలుకు, లిచ్చకంబులు..." కళా. ౪, ఆ. ౨౪. 2. ప్రియము. "ఉ...ఎ, ట్టి చ్చక మయ్యె నీకు నివి..." కాళ. ౬, ఆ. ౧౬౦.

ఇచ్చకాలమారి. ద్వ. విశే. 1. ఇచ్చకదారి. 2. ప్రియవాది. "గీ...ఎనఁగుచుండును బ్రియవాది, యిచ్చకాలమారి యన..." ఆం. భా. శృ. ౮.

ఇచ్చకుఁడు. ద్వ. విశే. ఇచ్చకాలమారి. "గీ...కప్పు డిచ్చకు లగుచు బ్రాహ్మణులు గొంద, ఱాత్మజని భూమి విడువ లే కరికభూమి, గడ్డముల నావ డుపరాక లిడ్డనుండి, నూపసంహిత లెఱికించి చూరఁ దొడఁగిరి." ఆము. ౪, ఆ. ౪౬.

ఇచ్చగలవాఁడు. దే. విశే. కాముకుఁడు. (వ్య.)

ఇచ్చగించు. వై. అ. క్రి. 1. ఇష్టపడు. "గీ...ధార్త రాష్ట్రు లున్మత్తులు దగినపలుకు, లేల విని సంధిచే యుట కిచ్చగింతు, రు..." భార. ఉద్యో. ౪, ఆ. ౭౩. 2. ఆనందించు. "గీ...పుండరీకకేదార సేతు, వైఖరికి నిచ్చగించుచు..." వసు. ౨, ఆ. ౯౪. స. క్రి. 1. కోరు. "చ...వేఱొక టిచ్చగింప కే, మని వనిఁ జూడఁగోరితి..." ఉ. రా. ౬, ఆ. ౨౩౮. 2. మెచ్చు. "సీ. భానసౌమిల్లిక ప్రతిభా సమున్మేష హేలావిశేషంబు నిచ్చగించి." నైష. ౧, ఆ. ౭. 3. సమ్మతించు. "ఉ. నాకలఁ బిచ్చగింపు మనినన్ బ్రభుఁ డంచుక యియ్యకోలునన్." హరి. ఉ. ౭, ఆ. ౨౩౨.

ఇచ్చగింత. వై. వి. (ఇచ్చగించు. ధా.) ఇయ్యకోలు, అంగీకారము. "సీ...కమకంబు రెట్టించుతరితీపు తలఁపులు నెనసినమదిలోని యిచ్చగింత." భాగ. ౬, స్కం. ౫౧౮.

ఇచ్చగొండి. వై. విశే. ఇచ్చకములాడువాఁడు, ఇచ్చకాలమారి. "సీ...ఇచ్చగొండుల కిచ్చి యుచ్చ మల్లుల కిచ్చి వారక యుబ్బించువారి కిచ్చి..." విక్ర. ౭, ఆ. ౧౨౪.

ఇచ్చగొను. ద్వ. స. క్రి. (ఇచ్చ+కొను) కోరు. "క. సచ్చంద్రపాండురంబై, యుచ్చైశ్శ్రవ మనఁగఁ దురఁగ మొగి జనియించెన్, బుచ్చి కొనియె బలిదైత్యుం, డిచ్చగొనందయ్యె నింద్రుఁ డీశ్వరశిక్షన్." భాగ. ౮, స్కం. ౨౫౫.

ఇచ్చోటు=ఇచ్చోటు. దే. వి. "క...నినుఁ జూడఁ గనుటఁ బటురయా, తనలం దొటఁగితిమి పరమ ధర్మాత్మక నీ, వనయము దయ నిచ్చోట నిలి, చిన

బ్రసుసుమ మింకఁ గొంతసేపు నిలువవే." భార. స్వర్గా. ౨౨. "గీ. ఎగ్గులను నింక నిచ్చట నేల కలఁప." భార. స్వర్గా. ౭.

ఇచ్ఛానుసారివాఁడు. స్వ. వి. అడ్డుపాటు లేనివాఁడు.

ఇచ్ఛామానికము. వై. వి. (ఇచ్ఛ+మానికము.) చింతామణి. "గీ. ఇచ్ఛమానిక మేయూరి కచ్చు జాయి." చంద్ర. ౨, ఆ. ౬౬.

ఇచ్చు. దే. స. క్రి. 1. ఒసఁగు. "క...ఇంద్రప్రస్థం, బొందెను వెఱ్ఱికపట్టణ, మొందెను మా కిచ్చి యనుచు టుంటిలమకాడే." భార. ఉద్యో. ౧, ఆ. ౩౨౭. 2. స్వాధీనపఱచు. "సీ. మనసు కామక్రోధమదలోభముల కిచ్చి సడలింతు రన్య యాచారసరణి." భీమ. ౪, ఆ. ౧౭౩. 3. చేయు. "ఆ...నా, యిచ్చుబాస కౌరవేంద్ర వినుము." భార. ద్రోణ. ౪, ఆ. ౩౩౮. 4. దానముచేయు. 5. వెల్పుచ్చు. "చ...అడిగిన దిచ్చునర్థులకు నాప్తుల కిచ్చు మనంబు..." కాశీ. ౩, ఆ. ౧౪౭. (ఇదిర, ౪ అర్థముల కుదాహరణము.) 6. అర్పణము చేయు. "క. శ్రీ విష్ణుపురాణము నా, కీవల యు..." వి. పు. ౧, ఆ. ౨౪. 7. కలుగఁజేయు. "గీ...భయములకు బుద్ధి నెడయీఁడు పండితుండు..." భార. శాం. ౧, ఆ. ౧౮౮. 8. వదలిపెట్టు. "ఆ. ఎట్టిరాజులును మహీసురోత్తము లెదు, రరుగుదెంచునప్పు డధికభక్తి, నెరఁగి ప్రియము వలికి తెరువిత్తు, రు..." భార. ఆది. ౭, ఆ. ౧౧౧. 9. సమ్మతించు. "సీ...ముని వృత్తి నడపికెఁ జనియెదనందునే జనకుఁడు నన్నేల చనఁగనిచ్చు." మార్క. ౩, ఆ. ౪౩.

ఇచ్చోటు=ఇచ్చోటు. (శ. ర.)

ఇచ్చో. దే. అవ్య. ద్రు. 1. ఈ ప్రదేశమున. "క... నీ, విచ్చో నునికికి..." భార. స్వర్గా. ౩౬. 2. ఈ సమయమున. (వా.)

ఇచ్చోటు. దే. వి. వి. (ఈ+చోటు.) ఈ స్థలము. "క...పచ్చోట నున్నవాఁ డరయ, డిచ్చోటికి నేల రాఁడొ..." భార. విరా. ౪, ఆ. ౨౦౧.

ఇచ్ఛ. సం. వి. ఆ. స్త్రీ. కోరిక, ఇది నాలుఁ గలుగ వలయు ననుభావము.

ఇచ్ఛత్. సం. శత్రు. కోరుచున్న.

ఇచ్ఛావతి. సం. వి. ఈ. స్త్రీ. కాముక, సంభోగము కప్ప ధనాధికవిషయములయం దిచ్ఛగల స్త్రీ.

ఇచ్ఛావసువు. సం. వి. ఉ. పుం. కుబేరుఁడు.

ఇచ్ఛావృత్తి. సం. వి. ఇ. స్త్రీ. ఇష్టమువచ్చినట్లు సంచరించుట. "క...అన్యోన్యం, బేమాత్రము తెలియ కుండ నిచ్ఛావృత్తిన్..." హంస. ౪, ఆ. ౨౧౧.

ఇచ్ఛించు. సం. అ. క్రి. ఇచ్ఛగించు. "సీ. ఎవ్వనిఁ గరుణింప నిచ్ఛించితిని వానియఖిలవిత్తంబు నే నపహరింతు." భాగ. ౮, స్కం. ౬౬౧. స. క్రి. కోరు.

ఇజ్జలము. సం. వి. అ. పుం. హిజ్జలము, ఎఱ్ఱగన్నేరుచెట్టు.

ఇజ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. యజ్ఞము. 2. పూజ. 3. దానము. 4. సంగమము. 5. కుంటెనకత్తె. 6. ప్రతిమ. 7. ఆవు.

ఇజ్యము. సం. వి. అ. పుం. పుష్యమీనక్షత్రము.

ఇజ్యుఁడు. సం. వి. అ. పుం. 1. బృహస్పతి. 2. గురువు. 3. విష్ణువు. 4. ఈశ్వరుఁడు. 5. అంతఃపురపాలకుఁడు. విశ. (అ. ఆ. అ) పూజ్యుఁడు.

ఇజాఫా. హిం. వి. వృద్ధి, ఎక్కువలాభము.

ఇజారా. హిం. వి. గుత్త.

ఇజారాపాట. మి. వి. కల్లు మొదలగునవి గుత్తకు వేలమున పాడుట.

ఇజారు. హిం. వి. చల్లడము, లాఁగు. "సీ...వడిగ నంగీ యిజార్దొడుగు దట్టీఁ జుట్టు కైజారుదోపు డాల్కత్తిఁ బట్టు..." సిం. నార. ౩౨.

ఇజీకు. దే. వి. 1. శ్రమము. (శ. ర.) 2. సాకటము. (శ. ర.)

ఇట. దే. వి. వి. 1. ఇక్కడ. "ఉ...వాఁ డిట వచ్చువాఁడొ..." భార. అర. ౨, ఆ. ౨౦౨. 2. ఇది. "క. ఇటువంటివి యిట కెక్కుడు, వి..." ఆము. ౬, ఆ. ౬౦. అవ్య. ద్రు. ఈవల. (శ. ర.)

ఇటఁబట్టి. దే. అవ్య. ఇది మొదలు. "చ...ఇటఁబట్టి నీకు మీ, యనిమిషరాజు పాదములయానసుమీ మఱి యేమి పల్కినన్." నైష. ౩, ఆ. ౧౧౮.

ఇటిక. వై. వి. (సం. ఇష్టకా.) బంకమట్టితోఁ జేసి కాల్చినదాయి. ఆం. భా. ద్వి. ౨౬.

ఇటికపగడము. వై. వి. మట్టిపగడము, తిక్కణిక. (శ.ర.)

ఇటీవల. దే. అవ్య. ద్రు. ఈ నడుమను. (వా)

ఇటు. దే. అవ్య. 1. ఈవైపు. "సీ. ఇటు చూడుము ..." కాశీ. ౭, ఆ. ౭౦. 2. ఈప్రకారము. "చ...ఇటు ధార్త్ర్యము నీ వొనరించి..." పారి. ౪, ఆ. ౯౬., కళా. ౧, ఆ. ౯౮. వి. ఇది. ఉదా: ఇటువలె.

ఇటుక=ఇటిక. ఆం. భా. ద్వి. ౨౬.

ఇటులు. దే. అవ్య. 1. ఇటు, ఈప్రకారము. "రగడ...మేల మే లత నిటులు వ్రేయఁగ..." పారి. ౪, ఆ. ౧౬. 2. ఈవైపు. వ్యవ:—ఇటు లేఁగిన మాఱుల్లు వచ్చును.

ఇటువంటి. దే. విశ. ఇట్టి. "క...ఇటువంటివి యిట కెక్కుడు, వి..." ఆము. ౬, ఆ. ౬౦. "క... మగవా, రిటువంటివారి మదిలో, నెటుగా నమ్ముదురు..." విక్రమ. ౭, ఆ. ౧౩౧., కళా. ౩, ఆ. ౮౮.

ఇటువలె. దే. అవ్య. ద్రు. ఇట్లు. "చ. ఇటువలె జవ్వనంపుమద మెచ్చఁగ......" ఉ. రా. ౧, ఆ. ౧౭౨.

ఇట్వరము. సం. వి. అ. పుం. కామముతోఁ దిరుగు నది—ఆఁబోతు, షండము.

ఇట్టటు. దే. విశ. తాఱుమాఱైనది. "సీ. వీఁక నేనిక మూఁక విఱుచు మ్రాఁకుల మ్రోఁత పెటపెటల్ మలల నిట్టటుగఁ జేయ." య. ౧, ఆ. ౧౧౬. అవ్య. ఇటునటు.

ఇట్టలము. దే. వి. అధిక్యము. "వ. అప్పుడు నెఱయ విప్పినకప్పురంపులప్పలచొప్పున నలినభవాండ భాండంబు నిండి మెండుకొన్న మిన్నేటి పెన్నురువుమురువున..., వగవుబిగువున... పాల పెన్నిటి యిట్టలంబున ... వెన్నెలగాయ ..." పరాహ. ౮, ఆ. ౧౯౯. విశ. అధికము. "క. ఇట్ట లముగఁ దగినట్టి యెత్తులుపోరెఁ..." స్వా. ౪, ఆ. ౪౩. "చ...ఇట్టలపుఁరయంబునఁ బొదివి ..." భా. విరా. ౩, ఆ. ౨౦౦.

ఇట్టి. యు. దే. విశ. (ఇట్టు+ఇ.) ఇటువంటి. "క. ఇట్టి దివ్యతేజంబునవాఁడు..." భార. ఆది. ౬, ఆ. ౯౮. వై. వి. (సం. యష్టిః. క. ఇట్టి.) ఒకవిధమగు నాయుధము. "సీ...కరవాలముల్ పలక లిట్టు, లడ్డనంబులు..." కు.సం.౧౨,ఆ.౩. (పూర్వము. పా., 'కరవాలముల్ బలకలీఁటు, లడ్డనములు' అని వావిళ్లవారి పా.) "ఈటెలు" పాఠాంతరము.

ఇట్టిఁడు. దే. విశ. (ఇట్టి+వాఁడు.) ఇటువంటివాఁడు. "గీ. ఎఱుఁగ మే మేవురము నతం డిట్టిఁ డగుట." భార. శాం. ౧, ఆ. ౧౦. "క. భావి భవత్సుతు లిట్టిరె..." భార. ఆది. ౭, ఆ. ౭౩.

ఇట్టిక=ఇటిక. వై. వి. 1. బంకమట్టి మొ. తోఁ చేసి కాల్చిన దాయి. "క...పసిఁడియిట్టికల నిర్మితమై..." విక్ర. ౯, ఆ. ౧౨౭. 2. ఇటికావము. "క. ఇట్టిక సూఁడినవాఁడో, యొట్టిడుకొన్నాఁడొ యనుచు నుల్లసమాడం, బట్టగుచు మగిడి చూడక, పట్టణమున కేఁగె..." ఉ. హరి. ౧, ఆ. ౩౬.

ఇట్టికాఁడు. ద్వి. విశ. (ఇట్టి+కాఁడు.) ఇట్టితో యుద్ధము చేయువీరుఁడు. "సీ. కొని మిట్టిపడ వైచు కొంతంపుగాని బిట్టెడ లుచ్చి పోవైచు నిట్టికాని" కు. సం. ౧౧, ఆ. ౩౯. (పూర్వము ద్రణపా., 'ఈటకాని' అని వావిళ్లవారి పా.)

ఇట్టిపాటి. దే. విశ. ఇటువంటి. "ఉ. కాదన కిట్టి పాటియపకారము...చేసె..." భార. ఆది. ౧, ఆ. ౧౨౮.

ఇట్టు. దే. అవ్య. 1. ఇట్లు, ఈవైపు. "సీ...అట్టిట్టు గద్దొని..." స్వా. ౩, ఆ. ౧౬. 2. ఈరీతి. "ఆ. పరమ ధర్మవిదుఁడు వరచతుర్వర్ణ్యాన్వయా, భరణుఁ డిట్టు లనియెఁ గరుణతోడ." భార. ఆది. ౧, ఆ. ౯. 'ఉ. చుట్టపుమేప వుగ్రరణశోభితుఁ డీద్రుపదుండు నిన్ను నీ, ట్టట్టనవచ్చునే..."

భార. ఉద్యో. ౧, ఆ. ౨౯౭. (ఇట్టట్టను=సామాన్యునిగాఁ జూచు అని భావము.) "సీ. చిత్తంబు తనయాజ్ఞఁ జేసి వర్తించెనే నిట్టట్టనఁగఁ జాల వింద్రియములు." భీమ. ౫, ఆ. ౧౬౦. (ఇట్టట్టను=అపకరించు అని భావము.) "గీ. అనవిధ మెఱిఁగింప నిట్టట్టుపడుచు." ఆము. ౪, ఆ. ౫౪. (ఇట్టట్టుపడు=తత్తఱపడు అని భావము.) "గీ... పట్టణ మిట్టట్టుపడఁ గదల్చి." ఉ. హరి. ౧, ఆ. ౯. (ఇట్టట్టుపడ౯=ఇటునటునూఁగఁగా అని భావము.) "క. అట్టియెడ౯ సురబల మి, ట్టట్టు వడం జేసి..." ఉ. హరి. ౧, ఆ. ౨౦. (ఇట్టట్టు వడఁ జేయు=కలఁచు అని భావము.) "ఉ...ఇ, ట్టట్టన కింకఁ దత్ఫలము లన్నిటి నొందుము..." భార. శల్య. ౨, ఆ. ౧౩౪. (ఇట్టట్టను=ఈరీతి నారీతి పలుకు, మాటాడు అని భావము.)

ఇట్టుక=ఇటిక. ఆం. భా. ద్వి. ౨౬.

ఇట్టులు. దే. అవ్య. ఇట్లు, ఈరీతి. "ఆ. ఇట్టు లనియె.." విక్ర. ౧, ఆ. ౧౦౭.

ఇట్టువోలె. దే. అవ్య. ఈరీతి. "చ...ఇ, మ్మునివరుఁ డిట్టువోలె..." భార. శాం. ౩, ఆ. ౯౫. (శ. గ. పా. 'ఇట్లపోలె' ముద్రితము.)

ఇట్టె. దే. అవ్య. క్షణములో, అతి త్వరితముగా. "గీ...ఈ జగద్ధితచరిత్రుఁ, డిట్టె చని బాల భానునిఁ బట్టె నపుడు." ఉ. రా. ౫, ఆ. ౧౦౦.

ఇట్టే=ఇట్టె. వ్యవ:—అంతదూరమునుండి వాఁ డిట్టే వచ్చినాఁడు.

ఇట్లు. దే. అవ్య. ఈరీతి. "గీ...మీ జన్మములు నిట్ల కావె వినఁగ." భార. ఆది. ౬, ఆ. ౫౯. విణ. ఇట్లైనది. "ఆ...మహాతపంబు చేటు, లేనికృత్య మిట్లుగా నెఱుంగుట..." భార.శాం.౫,ఆ.౫౨౫.

ఇడ. సం.వి.ఆ. స్త్రీ. **1.** ఒకనాడి. **2.** నేల. **3.** గోవు. **4.** వాక్కు. **5.** హవిరన్నము. **6.** దేవీభేదము, మైత్రావరుణి యను బుధునిభార్య. **7.** దుర్గాదేవి.

ఇడి. దే. వి. (త. ఇడి.) సేవియ, భక్ష్యవిశేషము. "వ...అడుకులు నిడియు..." కాశీ. ౭,ఆ.౧౭౫.

ఇడిక. సం. వి. ఆ. స్త్రీ. భూమి.

ఇడికుడక. దే. వి. భక్ష్యవిశేషము. "వ. ఏలకికాయలు వెన్నమెఱుఁగులు నిడికుడకలు...ఆదిగాఁ గల భక్ష్యంబులు..." హంస. ౧, ఆ. ౧౦౫.

ఇడిక్కము. సం. వి. అ. పుం. ఏడకము, పొట్టేలు.

ఇడియఁగొట్టు. దే. స. క్రి. (ఇడియన్+కొట్టు.) పోఁగొట్టు, జాఱవిడుచు. (ఆం. పా.)

ఇడియు. దే. అ. క్రి. **1.** చీలు, బ్రద్దలగు. "సీ. మారుతాహతి రాలునారికేళఫలాళి నిడిసి జల్లించు పుండ్రేక్షురసము." పాండు. ౧, ఆ. ౧౧౭. **2.** నలఁగు. "చ...వానిమే, యిడియ..." ఆము. ౪, ఆ. ౭౫. **3.** విఱుగు. "సీ. ఇడిసిన యిడుపులయెడలఁ బొట్టే నుత్తరేను గసెంద కోరిందపొదల." ఆము. ౬, ఆ. ౧౩. **4.** పోవు. (చూ. ఇడియఁగొట్టు.)

ఇడు. దే. స. క్రి. (క. ఇడు.) **1.** ఇచ్చు. "క... కూడుం, జీరయు నిడి సాకతంబుఁ జేసిన సాలు౯." భార. విరా. ౧, ఆ. ౨౧౯. "సీ. తండ్రికి నిడ్డపత్త్రములు..." పాండు. ౩, ఆ. ౧౬. (వ్రాసియిచ్చిన అని భావము.) "గీ. శక్తి కిడియెడు ననుట నిస్సంశయంబు. కళా. ౨, ఆ. ౬. (బలిగా నిచ్చు అని భావము.) **2.** ఉనుచు. "చ...దుర్జనత్వమునఁ బల్కెడు వీరుల మస్తకంబుపై, నిడియెద..." భార. సభా. ౨, ఆ. ౩౦. "సీ. చేర్చుక్కగా నిడ్డ చిన్ని జాబిల్లిచే..." స్వా. ౧, ఆ. ౫. (ఇట ధరించు అని భావము.) **3.** చల్లు. "క...చవుట నిడినవిత్తులు..." వాసిష్ఠ. ౧,ఆ.౯౧. **4.** నాఁటు, పాఁతు. "ఉ. పొందుగఁ బశ్చిమాబ్ధితటభూస్థలి నంశుమదంశుమత్ఫలా, కందము వాసరాంత హలికప్రవరుం డిడ..." పారి. ౨, ఆ. ౪౧. **5.** విడిచిపెట్టు. "ఉ...తా నెరియ౯ విడిచెం ద్వదంగసం, గానుభవేచ్ఛ యిట్లిడిన యట్టిది యాఁదిగ..." కళా. ౪, ఆ. ౨౦. **6.** ప్రయోగించు. "క. వీనులకు సుధారసముల, సోనలు వర్షించు మృదుల సుస్వరఫణితి౯, దా నిట్టటు గ్రుక్కక పని, లేనిపునఃపదము లిడక.." ప్రభా. ౪, ఆ. ౬౦. **7.** ఆరోపముచేయు. "చ...తమచేయుతప్పు లె, ల్లను మగవారిపై నిడి చలంబున బొంకొనరింతురు..." సా. ౨,ఆ.

౨౪౩. **8.** కట్టు, నిర్మాణముచేయు. "క... గూం డ్లిడు భ్రమలన్." ఆము. ౪, ఆ. ౧౩౨. **9.** (పుట్టలు, గ్రుడ్లు మొ.) పోయు; పెట్టు. "గీ. పుట్ట లిసుమంత లిడ నిడఁ బొదలు బెజెగి." విక్ర. ౨, ఆ. ౧౭౦. "క. తలచూపె నప్పు డళులా, శల దట్టపుటెరలు చిలువజవరాలు నభ, స్థ్సలమండపకోపరి సీ, మల నిడినసితాండపటలి మాడ్కిన్ జుక్కల్." స్వా. ౫, ఆ. ౩౪. **10.** దాఁచియుంచుకొను. "చ. జలరుహమిత్రు డాత్మరుచిసంపదఁ జీకటిబందికానికిన్, గలఁగుచు వీనిలోన నిడి కైకొనె నమ్మికకాఁపు లంచుఁ జూ, క్కలదొర యొండదాడి విని గ్రక్కునఁ దా నునుగాంతి వీనిలో, పల నెలకొల్పె నాఁ బలుకఁబాజె నిశాల నిశాంతదీపికల్. పాంచా. ౨,ఆ.౯౫.(ఈ పదమునకు సందర్భానుసారముగా ననేకములగు నర్థాంతరము లిట్లు గ్రహింపనగును.)

ఇడుగడ. దే. వి. (క. ఇడుగు.) **1.** అసూయ. "చ. తడయక మ్రొక్కి యున్న వినతాసుతు నప్పుడు సూచి యాత్మలో, నిడుగడ సేయుచున్ గడు సహింపక కద్రువ..." భార. ఆది. ౨, ఆ. ౪౨. (ఇడుగడసేయు=అసూయపడు.) **2.** అవమానము. "చ. వెడలఁగనీక గొంది నిడి వేయి విధంబుల భంగపెట్టుచున్..., ఇడుగడ సేయఁగా వలయు నీలువు మాలిన అంకు టాంద్రకున్." విజ్ఞా. ఆచా. ౧౧౧. **3.** బాధ. (చూ. ఇడుగడపడు.)

ఇడుగడపడు. ద్వి. అ. క్రి. (ఇడుగడ+పడు.) బాధపడు, పరితపించు. "క. కడ లేని విరహవేదన, నిడుగడపడుచుండుకంటె నీభర మెల్లన్, మృదుసెయిదఁ దపోవర్తన, నొడ లేర్చెద నరిగిదారుణోగ్రాటవులన్. కు. సం. ౬, ఆ. ౫.

ఇడుపు. దే. వి. **1.** గోడ. "సీ. పొడుపుగుబ్బలి నెల పురుటింటియిడుపునఁ జఱచిన గందంపుఁజట్ట లనఁగ. పారి. ౨, ఆ. ౩౮., ఆము. ౬, ఆ. ౧౩. **2.** ద్వారప్రాంతకుడ్యము. "సీ. పొరకటి యిడుపు నాఁ బొసఁగు ద్వారప్రాంతకుడ్యము..."అం.భా. ద్వి. ౧౩. **3.** చీలిక. (శ. ర.) (చూ. ఇడియు.) **4.** గర్వోక్తి, భీరము. "ఆ. తోలుతిత్తి వడసి తోరంపుఁగాఁప వై, నీవు చిజుమ నేల నేఁటి రాత్రి, కంటఁ బిడుకఁ బ్రామి గర్వాఁబు గిర్వాఁబు, నుడుపనైతి సేని నొట్టఁపెట్టు." వ. అని యిడుపులు సాటుచుఁ జనియె. దశ. ౬, ఆ. ౬౯, ౭౦. **5.** గోడ యిరుపార్శ్వముల మీఁదిచోటు. "దాపువనవీథి...తీర్చి యిడుపులయందుఁ జిత్రించినారు." జైమ. ౭, ఆ. ౧౫౧.

ఇడుము. దే. వి. **1.** కష్టము. "క. ఇడుములు గుడువఁగఁ బుట్టిన, యొడ లిది..." కర్ణ. ౯, ఆ. ౨౩. **2.** వ్యథ. "గీ. ఆడవినుంచిరె రాని సంబరము లొసఁగఁ, గాసువీసంబుచేత సెక్కడను లేక, మగువఁ గోల్పోయి కడు నిడుమలఁ గలంగు, నలుఁతివోరఁ గొల్వఁగడఁగు వెంగలులు గలరె." అచ్చ. సు. ౧౫౪.

ఇడుమపడు. ద్వి. అ. క్రి. (ఇడుమ+పడు.) కష్టపడు. "క...తొల్లి నలుఁ డనుధరణీ, శుఁడు... కరం బిడుమపడఁడె కాననభూమిన్." భార. ఆర. ౨, ఆ. ౬.

ఇడుమపాటు. ద్వి.వి. (ఇడుమ+పాటు.) కష్టపాటు. "చ...ఆ, బడలిక చూడలే కిడుమపాట్లకుఁ జొచ్చి నలంగి రంచు..." కళా. ౪, ఆ. ౯౯.

ఇడుము. దే. స. క్రి. చేర్చు. "గీ. రసికశేఖరుఁ డారాజు రాజవదన, కంది కుందిన సెమ్మోము కళ లెడింగ, కడుఁ బ్రియ మెలర్పఁ గౌఁగిట నిడుముకొని సు, ఖానుభవలీలఁ బవళించె నంబుజాక్షి." శుక. ౧, ఆ. ౩౦౫. వి. దారిద్ర్యము. "సీ...దారిద్ర్యగ్రాసముల్ దనకు లేమి, సెవ్వఁ డేసతికంబు నిష్పుచ్ఛరము లేవడి యిడుమ నాఁగ..." వేంక. మాస. ౫౭.

ఇడుముడి. దే. వి. ఇడుమ, కష్టము. (ఆం. పా.)

ఇడుమ్రాను. దే. వి. (ఇడు+మ్రాను) కల్పవృక్షము. "సీ. నీటుగాఁ గరముమానికపుమాటున మాటుమచ్చవాఁ డిడుమ్రాని మచ్చవాఁడు." చంద్రా. ౧, ఆ. ౭౦.

ఇడ్డెన. దే. వి. వాసెనకుడుము. "సీ. పరమాన్నములు దేనె ఫలరసప్రకరంబు లిడ్డెనల్ పులగంబు లడ్డువములు." బ్రహ్మో. ౩, ఆ. ౪౪౯.

ఇతః. సం. అవ్య. ఇంతకంటె. ఉదా:—ఇతఃపూర్వము, ఇతోధికము మొ.

ఇతఃపరము. సం. క్రి. విణ., అ. న. 1. ఇఁకమీఁద. 2. ఇంతకంటె వేఱు. "శా...నీవే తప్ప నితఃపరం బెఱుఁగ సంరక్షింపం దగుం దీనునిన్." భాగ. ८. స్క. ౯౦.

ఇతఁడు. దే. స. వి. (ఈ+అతఁడు.) ఈతఁడు. "చ...నీ విభవిత్తోడ రణం బొనరించెదేని..." భార. ఆది. ౬, ఆ. ౪౪. "చ. ఇతఁడు దరిద్రుఁడొ..." నైష. ౧, ఆ. ౫౭.

ఇతకరి. వై. విణ. హితముసేయువాఁడు, హితమైనది. "వ...ఇతకరిమాటల మొత్తంబుల వారల చిత్తంబులను గలంచె." భార.అను. ౧,ఆ.౨౫౭.

ఇతగాఁడు=ఇతఁడు. వ్యవ:—ఇతగాఁడే నిన్న వచ్చిన వాఁడు.

ఇతము. ఉభ. వై.వి. (సం. హితమ్.) ఇంగితము, మనోభీష్టము. "గీ. పలుపలుకు లేల యింక సాచెలులు గిలులు, నేఁగుదెంచి విన్నమొనర్తు రిత మెఱుఁగక, కావునం గొనిపొమ్ము శీఘ్రుంబ నీదు, వెనుక నిడుకొని నన్ను మద్విభునికడకు." కళా. 3, ఆ. ౬౧. (కోరిక అని సూ. ని. విణ. హితము అని శ. ర.) సం. వి. అ. న. 1. గతి. 2. జ్ఞానము. విణ. (అ. ఆ. అ.) 1. పోయినది. 2. పొందఁబడినది. 3. పొందినది.

ఇతరము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అన్యము. 2. నీచము.

ఇతరేతరము. సం. విణ. (అ. ఆ. అ.) అన్యోన్యము. "క. ఇతరేతరమతి సంభ్రా, వితలక్షణ కలన మొంది వృషవాహనుతో, నతి నిర్మలసఖ్యము సే, సితి బ్రహ్మాదులును సంతసిల్లిరి విజయా." భార. శాం. ౬, ఆ. ౪౫౪.

ఇతవరి. వై. విణ. (ఇతవు+అరి.) హితము చెప్పువాఁడు. (శ. ర.)

ఇతవు. వై. వి. హితము, ప్రీతి. "క. ఆరామ కపుడు శుభవా, ర్ధారాగతిఁ దెలిపె నొక్కతరుణి వరకళా, వారనిశాంత మితవు నలు, వార నిశాంత మితి రహితహారి విభవమున్." చంద్రి. ४, ఆ. ౧౨౮. విణ. 1. హితవు, ప్రియమైనది. "క. ఏకాంత యెవరి కితవో..." అహ. ౧,ఆ. ౧౧౧. 2. హితము చెప్పువాఁడు. "చ...ఇట్టివా, రితవులు దన్ను డిక్కిన సుతుల కే మన నేర్తుము పెద్దరాజులన్." భార. ఉద్యో. ४, ఆ. ౨౮౦.

ఇతి కర్తవ్యతామూఢుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఏమి చేయుటకుఁ దోఁపనివాఁడు.

ఇతికర్తవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ఇట్లు చేయఁదగినది.

ఇతివృత్తము. సం. వి. అ. న. చరితము, కథ. ఉదా: శ్రీరామేతి వృత్తము.

ఇతిహాసము. సం. వి. అ. పుం. 1. పరంపరగాఁ జెప్పఁకొనెడు పూర్వకథ. 2. చరిత్రాంశము. 3. పూర్వచరిత్ర ప్రతిపాదక గ్రంథము. ఉదా:—భారతేతిహాసము.

ఇతోధికము. పారిభా. ఇంతకంటె హెచ్చు.

ఇత్తడి. వై. వి. (సం. పిత్తళమ్. క. హిత్తాళే.) ఆరకూటము, లోహవిశేషము. "క...ఇత్తడి బంగార మౌనె యిలలో సుమతీ." సు. శ. ౧४.

ఇత్తళి=ఇత్తడి. "సీ...ఇత్తళి శంఖ చక్ర కుండలము లమర." ఆము. ౬, ఆ. ౬. "సీ. త్రపునామ మమరుఁ బిత్తళి యిత్తళి యనంగ..." సాం. ని. స్థా. ౬౫.

ఇత్తిగ. ద్వ. స. (ఇరు+తిగ.) 1. పాచికలమీఁది మూఁడుబొట్లజత, దుందుభి. "మ. చిగురుంబోఁడి యెఱుంగుదే యదుపతి స్త్రీ లెవ్వరే నింద లే, రుగదా యంచును శంకఁ గ్రమ్మటిలిఁ జారు ద్యూతగేహంబు జొ, త్తిగ నీ వొక్కటిఁ జూపఁ దోడ్కొని చనం దచ్చోక చూపంచ యి, త్తిగ బారా దుగ యంచుఁ జిల్కరొద లుద్దీపింపఁ దొదవ్వులన్." కళా. 3, ఆ. ౧3౧. 2. ఆఱు. "సీ. ఇత్తిగ చక్కన నెసఁగును పట్టంబు..." ఆం. భా. ద్వి. 3౦౬., శశాం. ౫, ఆ. ౧3౦.

ఇత్థంవిధము. సం. విణ. (అ. ఆ. అ.) ఇట్టివిధము గలది.

ఇత్యాది. సం. విణ. (ఇ) ఇది మొదలైనది.

ఇత్వము. సం. వి. అ. న. ఇకారము. "గీ. పాంశుజన వాహ మొనరింపఁ బవన నీకుఁ, జెల్లు ననహాభిధానంబు చెల్ల దనిల, శబ్ద మచ్చుట నిత్వ సంసర్గ ఘటన, మహిజనంబుల కెల్లఁ బ్రామాదికంబు." కాళిందీ. 3, ఆ. ౯౯.

ఇత్వరము. సం. వి. అ. పుం. ఇట్వరము, ఆఁబోతు.

ఇత్వరి. సం. వి. ఈ. స్త్రీ. అంకుటాలు, కుంట.

ఇత్వరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. దరిద్రుఁడు. 2. నీచుఁడు. 3. క్రూరుఁడు. 4. బాటసారి.

ఇదమ్. సం. స. (మ్.) ఈ. ఉదా:—ఇదంప్రకారము.

ఇదంతనుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ఇదానీంతనుఁడు, ఇప్పటివాఁడు.

ఇదమిత్థము. సం. (వాక్య.) (ఇదమ్. స+ఇత్థమ్. అవ్య.) ఇది యిట్టిది. "క. ఇదిగాక శమనకృత్యం బిదమిత్థ మ్మనఁగఁ గూడదు..." దశా. ౨, ఆ. ౧౪౭.

ఇదానీంతనము. సం. విణ. (అ. ఈ. అ.) ఇప్పటిది.

ఇది. దే. స. (ఈ యనుదానికి మహత్యర్థమునందును అమహదర్థమునందును ప్రథమైక వచనమున వచ్చురూపము. బ. ఇవి, వీరు.) 1. ఈమె. "చ. ఇది గడు ముద్దరాలు..." భార. విరా. ౧, ఆ. ౧౦3. 2. వీఁడు, ఈతఁడు. "గీ. ఎవ్వఁ డిది యని పల్కెనా నవ్వధూటి, నోరు నొక్కుచుఁ గౌఁగిటఁ జేరఁ దిగిచి, మగువ చెవిలోన నలుకుఁడు మాను మేను, వాసవుఁడ నిన్నుఁ గని కూర్మి వచ్చినాఁడ." జాహ్న. ౪, ఆ. ౮౭. వి. 1. ఈక్షణము. "సీ. ఇది యాదిగా నతు లెన్నండుఁ బరపురుషార్థినుల్ గాఁ జనదు..." భార. ఆది. ౫, ఆ. ౮౫. 2. ఈపని. "ఉ. ఇమ్మహి నీవుఁ బాండవులు నెప్పటియట్ల పరస్పరానురాగమ్మున నేలు చున్కి యిది కార్యము..." భార. సభా. ౨, ఆ. ౧3౬; 3. ఈమాట. "క...ఇది యది యన కూరకునికి యొంతయునొప్పున్." భార. ఉద్యో. ౨, ఆ. ౫౯.

ఇదిగాక. దే. అవ్య. 1. మఱియు. "క. ఇదిగాక శమనకృత్యం, బిదమిత్థమ్మనఁగఁ గూడ దీవృశ దుఃఖాస్పద మగుదేహంబున నెమ్మది సుఖి యింపుగ సులభమా యెవ్వరికిన్." దశా. ౨,ఆ. ౧౪౭. 2. ఇది కానిచో. (వా.)

ఇదిగొ, ఇదిగో. దే. అవ్య. ద్రు. 1. ఇదిగో, ఇది. "గీ. మంచిమేలైన దిదిగోఁ గొమ్మంచుఁ గప్పురంబు నగపాలు సించి వీడెం బొసంగి." సా. ౨, ఆ. ౮౪. 2. ఓహో! వ్యవ:—ఇదిగో! ఎక్కడనుండి రాక? 3. ఇప్పుడే. "సీ. నిలలేక స్వయముగాఁ బిలువఁ బోయినఁ గాని పవరించు నిదిగో యిచ్చెద నటంచు." కుచేల. ౪, ఆ. ౯౪. 4. ఇదియే. "క. ఇది గని మక్షురానగరం, బిదిగోఁ దనవృక్షుఁ గంటిమి..." వాల్మీ. ౨, ఆ. ౧౭. 5. ఇంక. వ్యవ:—ఇదిగో పుచ్చుకొనుము.

ఇదిరో=ఇదిగో. దే. అవ్య. ఇదే. "మ. ప్రమదా పాడిపయఃప్రపూర్ణ మిదిరో పద్మాకరంబు..." భార. ఆది. ౬, ఆ. ౧౭౨.

ఇదె, ఇదే. దే. అవ్య. 1. ఇదిగో, ఇదియే. "చ. ఇదె గోవర్గము నేర వచ్చితిమి..." భార. విరా. ౪, ఆ. ౨౬3. "మ. ఇదె వీక్షించు..." నైష. ౮, ఆ. ౯౧. 2. ఇప్పుడే. "క. ఇదె పోయెదఁ గౌరవ్యులఁ, బవనికి రాఁ బలికి సంధి వాటించెద..." భార. ఉద్యో. 3, ఆ. ౬౯. "ఉ... వార్ధకా, ధీనశరీరతం జెమలి త్రెళ్లె నొకం డిదె నూతిలోపలన్." దశ. ౧౧,ఆ. ౭౫.

ఇద్దరి. దే. వి. (ఈ+దరి.) ఈవలిగట్టు. "సీ. ఇద్దరి యావల నిప్పుల నివల నీతల..." ఆం. భా. ద్వి. ౧౫౫.

ఇద్దఱు. దే. స. (రెండు శబ్దమునకు మహన్మహత్యర్థక బహువచన రూపము) ఇరువురు. "చ...ఇద్దఱు నవలీలఁ బోరి రతిదర్పితులై సమరోత్సవంబుతోన్." భా. రా. యు. ౯౭౫., భార. ఆది. ౬, ఆ. ౨౯౭.

ఇద్ది=ఇది. (శ. ర.)

ఇద్దుగ. ద్వ. వి. (ఇరు+దుగ.) పాచిక మీఁది రెండుబొట్లజత. "క. అత్తీపంచ తిగ దుగయు, సత్తా దచ్చాక పంచ చౌపం చీరై, దిత్తిగ యిద్దుగ బద్రలు, చిత్తంబునఁ దలఁచినట్లు చేతికిఁ దెచ్చున్." ఉ. హరి. 3, ఆ. ౧౨౧.

ఇద్దుము. దే. వి. (ఇరు+తూము) రెండుతూములు. క. చెలఁగుచు నిద్దుము వి త్తన, ములు నేల కుటుంబి కొసఁగు ప్రత్యాత్మునకున్, గలుగు శతహాయ మేధం, బులు గంగాపటిని జేయు పూర్ణఫలం బుల్." దశా. ౫, ఆ. ౧౦౩.

ఇద్ధము. సం. వి. అ. న. **1.** ఎండ. **2.** ప్రకాశము. **3.** ఆశ్చర్యము. విణ. (అ. ఆ. అ.) **1.** ప్రకాశితము. **2.** దగ్ధము. **3.** పరిశుద్ధము. **4.** ఉగ్రము. **5.** అప్రతిహతము.

ఇధ్మజిహ్వుఁడు. సం. వి. అ. పుం. అగ్ని.

ఇధ్మప్రవ్రశ్చనము. సం. వి. అ. పుం. గొడ్డలి, ఇధ్మములు నఱకుసాధనము.

ఇధ్మము. సం. వి. అ. న. **1.** చిదుగు. **2.** యజ్ఞసమిచ్ఛేదము. **3.** కాష్ఠము.

ఇనాము. ఉర్దూ వి. బహుమానముగా నొక వ్యక్తి పేర ప్రభుత్వమిచ్చు ప్రత్యేక భూభాగము: మాన్యము. "సీ...వీర నరసింగరా యని గార లీనా మొసంగిరి భూనుతముగ." అధ్యా. రా. (కంచెర్ల శరభకవి.) ఇట్లే: ఈనాము.

ఇని=ఇన్ని. (శ. ర.)

ఇను. దే. స. (వృత్తియందు హల్లుపరమగుచో రెంటికాదేశముగా వచ్చును. ఇనుమడి, ఇనుమాఱు; అచ్చుపరమగునపుడు ఈరు వచ్చును. ఉదా:– ఈరేడు.) **1.** ఇరు, రెండు. "క. తన యెప్పటి రూపముఁ జే, కొని దీనికి నినుమడుంగగుం బ్రతిబలముం, గనినప్పుడు నారూపం, బనుపమముగ ననిన..." భార. అర. ౩, ఆ. ౩౪౫. **2.** రెట్టి. "క..., మాపిన్నది యినువింతల, చూపుల నఱ గంటవెఱచుచు న్నినుఁ జూచున్." నైష. ౫, ఆ. ౬౧.

ఇనుఁడు. సం. వి. అ. పుం. **1.** సూర్యుఁడు. **2.** రాజు. **3.** భర్త. **4.** పోషకుఁడు.

ఇనుకు. దే. వి. తుషతోఁ గూడిన యల్పధాన్యము. "గీ...తుష యుక్తము లగు నల్పధాన్యములు చింక యినుక నఁదగు..." ఆం. భా. ద్వి. ౨౩౫. అ. క్రి. ఇఁకు. "మ...వార్ధు లినికెన్..." మైరా. ౩, ఆ. ౯౧.

ఇనుపకుండులు. దే. వి. బ. (ఇనుము+కుండులు.) గోడలయందు, తలుపులు తిరుగుటకు నేర్పడిన గుండ్రని యినుపగుంటలు. (క్యాంబెలు)

ఇనుపచిట్టెము. దే. వి. (ఇనుము+చిట్టెము.) మండూరము. (ఆం. పా.)

ఇనుపగోలె. దే. వి. హసంతిక. వేంక. మాన. ౭౦.

ఇనుపతేలు. దే. వి. (ఇనుము+తేలు.) కృష్ణవృశ్చికము, నల్లతేలు. (ఆం. పా.)

ఇనుపదారి. దే. వి. (ఇనుము+దారి.) రైలుపోవు మార్గము.

ఇనుమడి. దే. వి. (ఇను+మడుఁగు.) రెట్టి. పు. "వ... ఒకటి కొకటి యినుమడియై యుండు..." భార. భీష్మ. ౧, ఆ. ౨౭. విణ. రెట్టింపుగలది, ద్విగుణితము. "క. అనినఁ గృపాచార్యుం డీ, యినుమడివిపసములఁ దీర్ప నే నోపుదు..." భార. ఉద్యో. ౪, ఆ. ౪౧౪.

ఇనుమడించు. దే. అ. క్రి. రెట్టిం పగు. "గీ. చేటునకుఁ జావు వగఁ జెందుజనుల, కినుమడింపదె మానసమున నలంత." భార. స్త్రీ. ౨, ఆ. ౧౬౬. స. క్రి. ద్విగుణీకరించు, రెట్టించు. (శ. ర.)

ఇనుమద్ది. దే. వి. (ఇనుము+మద్ది) నల్లమద్ది, అశ్వకర్ణకము. (శ. ర.)

ఇనుమనుమఁడు. దే. వి. (ఇను+మనుమఁడు.) ప్రపౌత్రుని కొడుకు. (ప్రపౌత్త్రుఁడు అని. శ. ర.)

ఇనుమాఱు. దే. వి. (ఇను+మాఱులు.) రెండు పర్యాయములు. "క...కర్ణుం, డినుమా ఱొకశరము దొడుగునే పరులు నగన్." భార. కర్ణ. ౩, ఆ. ౩౧౭.

ఇనుమిక్కిలి. దే. విణ. అత్యధికము. "చ...మందగా, మిని యను టెల్ల నప్పు డినుమిక్కిలిగాఁ దన యందె నిల్వఁగన్." విజ. ౩, ఆ. ౨౦౭.

ఇనుము. దే. వి. కాలాయసము, లోహ విశేషము. "చ. ఇనుమునఁ జేసినం బొలుచు నెన్మిదిగండ్లగు తేరు వేయి పెం, పెనసిన గర్దభంబులు వహింప..." హరి. పూ. ౪, ఆ. ౯౩., వేమన. ౭౨౭. (ఈ పదమునకు వృత్తియందు ముపర్ణమునకు పవర్ణం బగుటయు, ఒకచో ముపర్ణము

లోపించుటయుఁ గలదు. ఉదా :—ఇనుప యినుక. కాశీ. 3, ఆ. ౧౫౨.; ఇనుమడ్డి.)

ఇన్నాళ్లు. ద్వ. వి. బ. (ఇన్ని+నాళ్లు.) ఇన్ని దినములు. (దీనికి 'ఇన్నాళ్' అను రూపముకూడఁ గానవచ్చుచున్నది.) "గీ. తెలప యిన్నాళ్లు నడుగఁ బుత్తేఁడు నిన్ను..." నైష. 3,ఆ. ౧౨3. "శా...ఏలా పుట్టె నీదూఱు నీ, కిన్నాళ్ లేనిది..." సా. 3, ఆ. ౭౭.; విజ. 3, ఆ. ౭౭.

ఇన్ని. ద్వ. స. బ. ఔ. ఇంత శబ్దముయొక్క అమహదర్థక బహువచన రూపము. 1. అధికసంఖ్య గలవి. "ఉ...ఇన్నిదినంబు లేను క్షమియించితి..." ఉ. రా. ౨, ఆ. ౯౭ 2. అల్పసంఖ్య గలది. "గీ. ఇన్ని నీళ్లైన వంటకం బించుకైన." వరాహ. ౧౨, ఆ. ౬౬. 3. ఈ సమస్తము. "క. ఇదె దేహం బిది యర్థం, బిదె నా పరిజన సమూహ మిన్నిటిలోనె, య్యది మీ కిష్టము..." భార. ఆది. ౫, ఆ. ౨౪౨.

ఇన్నుగ. దే. వి. కతకము, చిల్లగింజ॰ (ఆం. పా.)

ఇన్నూఱు. దే. స. ఔ. (ఇరు+నూఱు) రెండు వందలు. "సీ. ఇన్నూఱు మున్నూఱు నేనూఱు కన్నులు గల వేలుపెవ్వానిఁ గన్నతండ్రి." నైష. ౬, ఆ. ౭౨. "సీ. ఇన్నూట మాతలి నిన్నూట రథమును...వేధించె..." భాగ.౧,స్కం.౩౬౬.

ఇన్పగుండు. దే. వి. (ఇనుప+గుండు.) తుపాకి గుండు. "ఉ. తామరతూఁడు నాళములఁ దాల్కొను తుమ్మెద యిన్పగుండు లు, ద్దామతఁ గూర్చి..." కాళిందీ. 3, ఆ. ౧౫౫.

ఇన్మడి=ఇనుమడి. (శ. ర.)

ఇన్మడించు=ఇనుమడించు. (శ. ర.)

ఇన్మాఱు=ఇనుమాఱు. "సీ...ఇన్మాఱు తిర్యగ్విధంబున, నాస్యంబుఁ దొడసి..." భార.అను.3,ఆ.౨౦౪.

ఇన్ము=ఇనుము. "చ...ఇన్పవలలో నమృతంబు సురక్షితస్థితిక్." భార. అను. ౧, ఆ. ౨౧౬.

ఇన్వకలు. సం.=ఇల్వలలు.

ఇన్సాల్వెంటు. ఆం. వి. దివాలాతీసినవాఁడు.

ఇన్సాల్వెన్సీ. ఆ. వి. దివాలాతీయుట.

ఇప్పుడు=ఇప్పుడు. "ద్వి. పాపపాపఁ డిప్డు చేసి పోయె మీ కనుచు." పండితా. పర్వ. ౭౦౯ పు.

ఇప్డు=ఇప్పుడు. "ఉ...నీ, విప్డు నీకు వేగపడి యాలువుపెం పెడలించి పోవ..." భో. ౭, ఆ. ౧౦3.

ఇప్ప. దే. వి. మధూకము॰ "గీ. ఇప్పపూదండ గైసేసె నెలమి యోర్తు. హర. ౪, ఆ. ౭౦.

ఇప్పనూనె. దే. వి. ఇప్పపూవులను పిండి తీసిన నూనె. (క్యాండెలు)

ఇప్పపిండి. దే. వి. ఇప్పనూనె తీయఁగా మిగిలినగుజ్జు. ఇది సబ్బువలె జిడ్డును పోఁగొట్టును. (క్యాండెలు. బ్రౌ.) "చ. కదళిగభీర పుష్పపుటికా చ్యుతఁ జేతుల నిప్పపిండిపైఁ, గుమురుగ నిచ్చి..." ఆము. ౧, ఆ. ౭3.

ఇప్పపూదండ. దే.వి. మధూకదామము."గీ. ఇప్పపూదండఁ గై సేసె నెలమినోర్తు." హర. ౪,ఆ.౭౦.

ఇప్పపూరాజనములు. దే. వి. బ. శాలిధాన్య విశేషము. హంస. ౪, ఆ ౧౨౭.

ఇప్పించు. దే. స. క్రి. (ఇచ్చు. ధా. ప్రే.) ఈఁ జేయు. "గీ. చంద్రునికి బుద్ధిఁ జెప్పి బృహస్పతి ముదిపి, యాలి నిప్పించె సద్యుచద్ధ్యానుజునకు." కాశీ. ౪, ఆ. ౨౨3. రామా. ౮, ఆ. ౨౪౭.

ఇప్పుడు. దే. వి. ఏ. ఔ. ఈ సమయము, ఈ కాలము. "చ...పరంబున కిప్పు డుప్పము బనుపుగఁ జేయఁగా వలయు..." ఆము. ౨,ఆ. ౭౬. "ఉ. ఇప్పటినీతలంచు తెఱఁగిట్టిదయా..." నైష. ౨, ఆ. ౬౭.

ఇబ్బంది. దే. వి. (ఇరు+బందులు) 1. ఇక్కట్టు. వ్యవ :—ఈ కఱవుకాలమున జను లెన్నో యిబ్బందులచే బాధపడుచున్నారు. 2. (త. ఇబ్బంది.) రెండుజాతుల పందులకుఁ బుట్టినపంది. (శ. ర.) విశే. 1. మూర్ఖుఁడు; "ద్వి. చెల్లెఁ బొమ్మని సన్న్యసింపఁ బోవుచును, నిల్లప్పగించు నయ్యిబ్బందియట్లు." బస. 3, ఆ. ౧౧౪౦., పుం. 2. సంకరజాతివాఁడు. "సీ...కసుమాల మిబ్బంది పీచి వాపేభ్యంబు వేరుపురుగు...గీ. ఇతనిఁ జేర్కొని పలుమాట లెన్న నేల." మల్లా.

౧, ఆ. ౯౮. 3. సంకరజాతివి. ఉదా:—ఇబ్బంది గుఱ్ఱము. (బ్రౌ.)

ఇబ్బందిగాఁడు. దే. వి. (ఇబ్బంది+కాఁడు.) జెబ్బులికిని చిఱుతపులికిని పుట్టిన పులి. (శ. ర., బ్రౌ.)

ఇబ్బందిపడు. ద్వం. అ. క్రి. (ఇబ్బంది+పడు.) చిక్కుపడు, శ్రమపడు. ప్ర:—వాఁడు డబ్బులేక యిబ్బందిపడుచున్నాఁడు.

ఇబ్బడి. ద్వ. వి. ఇరుమడి; ఆధిక్యము. "క. నేనై చేయఁగవలసిన, దాని నెఱింగించె మేలు తమ్ముఁడు నెమ్మిఁ, దా నిప్పట్టున మేలంట, నే నేలుటకంటె వేడ్క యిబ్బడి గాదే." ఉ. రా. ౨, ఆ. ౨౮౦., వేం. మాన. ౫౧.

ఇబ్బడించు=ఇమ్మడించు. (శ. ర.)

ఇబ్బడిక=ఇబ్బడి. "వ. ఇట్లగణ్యపుణ్యా లావణ్యాకర కరకంకణ ఝణఝణాత్కార నినాదంబు లెసఁగం గౌఁగిలించుచు నిబ్బడిక నుబ్బి గొబ్బున గుబ్బటిల్లు గబ్బిగుబ్బల నురంబునం బొరయ నురుముదు..." నిరం. 3, ఆ. ౬౧.

ఇబ్బెడ. దే. వి. వృక్షవిశేషము. "సీ. మఱ్ఱి విరెగి తొండ్లి మఱ్ఱితూ కిబ్బెడ పెద్దవిరెగి..." హంస. ౪, ఆ. ౧౧. (శ.ర.పా. 'ఇచ్చెడ' పాఠభేదము.)

ఇభనిమీలిక. సం. వి. ఆ. స్త్రీ. 1. నేర్పు. 2. భంగు అను మత్తుపదార్థము.

ఇభము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగు. 2. ఎనిమిది సంఖ్య.

ఇభి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడేనుఁగు.

ఇభ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. ఇభి. 2. అందుగు ♆.

ఇభ్యుఁడు. సం. వి. అ. పుం. 1. రాజు. 2. మావటీఁడు విశ. (అ. ఆ. ఆ.) 1. ధనవంతుఁడు. 2. పోషకుఁడు, ప్రభువు.

ఇమిడిక. దే. వి. 1. ఇముడుట, అడకము. (శ. ర.) 2. పొందిక. "ఆ. ఇరుగు పొరుగులందు నిమిడిక తో నుండి, తనకుఁ దానె మెలఁగి తలపుఁ జూపి." వేమన. ౭౨౬.

ఇనుంఱు=ఇ. కు. (ఆం. పా.)

ఇముడు. దే. అ. క్రి. 1. అడఁగు, లీనమగు. "గీ. జగము లీరేడు గర్భవాసమున నిముడు." రా. వి. ౧, ఆ. 3౮. 2. నెఱవేఱు, సిద్ధించు. "క. అంతటఁ బోవఁడు గూడెడు, సాహసమున బావికొనియెం జయ్యనఁ గలశా, దాంతయును విష్ణుమాయప, నింతీ యిది శిశువుచేత నిమిడెడుపనియే. హరి. పూ. ౫, ఆ. ౨౨౭. 3. పొందుపడు. (శ. ర.) స. క్రి. అడఁచియుంచు, మఱుగుపఱచు. "సీ. ధవళాబ్జలోచనద్వయి మూయువారును దమగుడాకేశంబు లిముడువారు." దశా. ౪, ఆ. ౧౦౯.

ఇముడుకొను. దే. అ. క్రి. (ఇముడు+కొను. స్వార్థమున) ఇముడు, పొందుపడు. "వ... చెన్నగు చవికెల నిముడుకొన్న కన్నె సురపొన్న గున్నల..." కువల. ౪, ఆ. ౯౨. స. క్రి. 1. ఇముడ్చుకొను. "ఆ. గర్భమందుఁ గమలగర్భాండ శతముల, నిముడుకొని నటించు నీశ్వరేశ." భాగ. ౧, స్కం. ౧౮౧. 2. దాఁచు, మఱుగుపఱచు. "క. ఆవృద్ధనారియును గరు, ణావిల మతి యగుచు నాభయార్త మృగాక్షిం, దా వెనుక నిముడుకొనుచుం, గావుము కావు మని వానికరములు పట్టెక్." కళా. 3, ఆ. ౧౧౮. 3. పోషించు, దగ్గఱ నుంచుకొని కాపాడు. "సీ...కొన్నినాళ్లు. గీ. న న్నిముడుకొమ్ము కరుణ ననాథ ననిన." ప్రబోధ. ౫, ఆ. ౮౧.

ఇముడుచు. దే. స. క్రి. (ఇముడు ధా. ప్రే.) ఇముడఁజేయు. (శ. ర.)

ఇముడ్చు. ఇముడుచు. (శ. ర.)

ఇమురు. దే. అ. క్రి. (క. ఇమురు.) ఇంకిపోవు. (చూ. ఇముఱుకొను.)

ఇమురుకొను=ఇమురు. దే. అ. క్రి. (ఇమురు+కొను. స్వార్థమున.) ఇంకు, హరించు. "ద్వి. ఇమురుక యాఱిపోయిన దీపమునకుఁ, జమురు వోసిన యట్టు..." రం. రా. అయో. ౧౪౧ పు.

ఇమ్మడి. దే. విశ. 1. ఇనుమడి, ద్విగుణితము. "సీ... అఖిలజనులు...ఉత్సవోన్మత్తభావ, మిమ్మడియై ప్రమోదమ్మునం దేలిరి..." భార. అశ్వ. 3, ఆ. ౧౧౯. 2. ద్వితీయుఁడు, రెండవవాఁడు. "వ,

దాన ధర్మపరాయణుండును నిమ్మడిగరుడ నారాయణుండును.” హర. పీఠి. ౭.

ఇమ్మడించే=ఇనుమడించు. (శ. ర.)

ఇమ్ము. దే. వి. (క. ఇంబు. త. ఇంపు.) **1.** స్థానము. చోటు. “మ...అం, బునిధిం గ్రొత్తగ నాశ్రమంబునకు నిమ్ముం గొంటి వీ వమ్మునన్.” పాం. ౩, ఆ. ౩౪. **2.** విరివి, వైశాల్యము. “చ. వినుమిటు లున్నయీజనులవిప్పు గనుంగొన వచ్చినంబురం, బున కెచ టిమ్ము చాలదు...” హరి. ఉ. ౨, ఆ. ౧౫౮. **3.** వీలు, అనుకూల్యము. “క. తన కిమ్మగునంతకు దు, ర్జనుఁ డిష్టుఁడపోలె నుండి సర్పముపోలెం, దన కిమ్మగుడును గఱచును, ఘన దారుణ కర్మగరళ ఘనదంష్ట్రలచేన్.” భార. ఆది. ౬, ఆ. ౧౧౨. శల్య. ౨, ఆ. ౩౭౦. **4.** ఆశ్రయము, ప్రాపు. “గీ. అతుల ధైర్యాంబునకు నీ మహాత్ముఁ డిమ్ము.” ఉ. రా. ౫, ఆ. ౧౪౦. **5.** గృహము, ఇల్లు. “గీ...రతనంపుఁ జిలుకపంజ, రమ్ములును గల యొకమిద్దెటిమ్మునందు.” రసిక. ౪, ఆ. ౪. **6.** ఇంపు, ప్రీతి. “సీ. ఇమ్మహాభారతం బిమ్ములఁ బాయక విహితావధానులై వినుచునుండు, వారికి...” భార. ఆ. ౧,ఆ. ౭౧. **7.** నీతి, ధర్మము. “క. నెమ్మి గలవారి నొల్లరు, త మ్మొల్లనివారి వెనుకఁ దగులుదు రధిక, త్వ మ్మెఱిఁగి యెఱిఁగి తొడరుదు, రి మ్మెఱుఁగని యట్టివార లిభపురనాథా.” భార. ఉద్యో. ౨,ఆ. ౩౪. **8.** యుక్తి, ఉపాయము. “క. అలసినెడ డస్సినెడ నాఁ, కలితృష్ణయు నైనయెడలఁ గడు కొని ధరణీ, తలనాథ పురుషునకు ని,మ్ముల భార్యయ పాచుఁ జిత్తమునదుఃఖంబుల్.” భార. ఆర. ౨, ఆ. ౭౫. **9.** స్వాస్థ్యము, సుఖము. “క. కులపాంసనులై యహితం, బులు సేయుచునుండుచుట్టములఁ బొందక యి, మ్ముల నుండు వాఁడ పుణ్యుఁడు, వెలయఁగ గ్రామస్థితైకవృక్షము పోలెన్.” భార. ఆది. ౬, ఆ. ౧౭౧. (“...సజీవేతసుఖాంలోకే...” సం. భార. ఆది. ౧౬౪. ౧౪౦.) **10.** ఇది వాక్యాలంకారముగాఁ బ్రత్యేకార్థము లేకయే యుండును. “క. ఖలుం నసుర నోర్వనోపెడు, బలయుంతుఁగా నెఱిఁగి కొడుకుఁ బంచితిఁ గాకి, మ్ముల శతపుత్రులు గల ధ, న్యులకైన ననిష్టుఁ డగుకనూజుఁడు గలఁడే.” భార. ఆది. ౬, ఆ. ౨౭౭. **11.** కాపట్యము, మోసము. “క. బలవంతులబల మఱఁగా, మలు పక మ స్వాని పాటమానూఘను వి,మ్ములఁ జేసియు మోపెట్టఁగఁ, గొలఁదియె యపి డాయనైకొంచెఱు దానిన్.” భార. ఆశ్వ. ౭, ఆ. ౧౭౭. **12.** అవకాశము, సందు, “శా. ఆయుక్షేశుఁడు వంక్తికంధరునమాత్యగ్రామణిన్ జూచి యే,మో యం చుండితి నింతమాత్రమున కోపాలో యింత సంకోచమే, లా యీప్రో లాకఁ జెంత నా ధనము నాయైశ్వర్యమున్ బ్రోవఁ డా, నే యర్థుం డగు టేమి మీ రెఱుఁగరే యి మ్మెవి భేదోక్తికిన్.” ఉ. రా. ౨, ఆ. ౨౩౯. విశే. **1.** అనుకూలము. “ఆ. ఎత్తికొని చనఁగ నిమ్మగు నట్లుగా, మెదలుచున్నవ్రయ్య లదెమి...” భార. సభా. ౧, ఆ. ౧౪౭. **2.** మొదలంటునది. “వ...ఇమ్ముగా విచారింపవలయు...” భార. ఆర. ౧, ఆ. ౨౬౮. **3.** ఇంపైనది. “క...ఉద్యోగపర్వ మి మ్మగుసభలన్.” భార. ఆది. ౧,ఆ. ౪౩. **4.** గమనయోగ్యము. “వ...ఇమ్ము గాని యెడల మి మ్మందఱ నెత్తికొని మీ మెచ్చిన చోటికిఁ బోవనేర్తు...” భార. ఆది. ౬, ఆ. ౨౨౨. **5.** యుక్తము. “వ...ఇ మ్మగు నవసరంబున...” భార. ఆది. ౬, ఆ. ౧౪౦. **6.** బాగు. “మధ్యాక్కర. కడు నిమ్ముగా దున్ని బీజములు సల్లి కర్షకు లున్నఁ, దడయక వర్షంబు గురిసి కాపించుఁ దత్ఫలసిద్ధి.” భార. ఆర. ౧, ఆ. ౨౩౫. **7.** స్పష్టము. “గీ. వృక్షశాఖాగ్రమున నున్న పక్షిశిరము, దెల్లముగఁ జూచితే మహీవల్లభుండ, యనిన నిమ్ముగఁ జూచితి ననిన...” భార. ఆది. ౫, ఆ. ౨౪౯. **8.** రుచ్యము. “వ...సూపకారుండు...మనుష్య మాంసంబు తెచ్చి యిమ్ముగా వండిపెట్టిన.” భార. ఆది. ౭,ఆ. ౧౧౫. **9.** సమృద్ధము. “చ...కడుఘోరనిష్ఠతోఁ, దగిలి తపంబు నేసియును దక్షిణ లిమ్మగ నిచ్చి యజ్ఞముల్, నెగడఁగఁ జేసియున్...” భార. ఆది. ౨, ఆ. ౧౫౦.

ఇమ్ముకొను. దే. అ. క్రి. **1.** కలుగు. “గీ. నెమ్మి పురి విచ్చెఁ గాలుమ్మ యిమ్ముకొనెను, హంస జాతంగ

యాతనాయత్త మైన, యతనుశరవర్ష మవిరళం బగుచుఁ బరఁగ." కాళింది. ౨,ఆ. ౪౩. **2.** ఉండు. "సీ. కావున నవ్వీర్యకరితుఁ జాశత్రులయమ్మ నాకులవృత్తి నిమ్ముకొనఁగఁ, జేసె..." రాఘవ. ౨, ఆ. ౨౮. (రామాయణార్థమున 'కలుగు' అనియు, భారతార్థమున 'ఉండు' అనియు రెండర్థములకు నివి యుదాహరణము.) స. క్రి. ప్రాప్తించు, పొందు. "ఆ. తగిలి మిగిలి క్రియలఁ దానయై లింగంబు, నిమ్ముకొని నిరంతరమ్ము నట్లు, నుల్లసిల్లు లింగ యోగానుభవులను, జేర్పవయ్యె నన్నుఁ జెన్నమల్లు." చెన్నమల్లు సీసములు. ౨౩.

ఇయత్త. సం. వి. ఆ. స్త్రీ. **1.** కొలఁది, పరిమాణము. **2.** హద్దు, మేర.

ఇయత్త్వము. సం. వి. అ. న=ఇయత్త.

ఇయ్యా. యు. దే. అవ్య. సరే. "మధ్యాక్కర. ఒనర నా సుతునకు భార్య వగు మన్న నొడఁబడి యియ్య యనియె." భార. ఆది. ౪, ఆ. ౧౪౧; ౬, ఆ. ౨౦౩. వై. వి. (సం. ఈహా.) ఈయ. "క. ఇయ్యఁగ నిప్పింపంగల, యయ్యలకే కాక మీస మందఱ కేలా." కవిచౌడప్ప శతకము. ౧౮.

ఇయ్యఁబడు. ద్వ. స. క్రి. (ఇయ్యక్ +పడు.) ఈయ వలసియుండు. "సీ. వెచ్చాన కేమైన వెస నియ్యఁబడియెడు నని ఫుల్లడీఁగెల కలుగువిటులు." మల్హా. ౨, ఆ. ౩౧.

ఇయ్యకొను. ద్వ. స. క్రి. (ఇయ్య+కొను.) ఈయ కొను, సమ్మతించు. "ఉ...ఇంకఁ బదుమూఁడు దినంబులమాత్రకుక్ భవ, న్మందిరవాస మియ్యకొనినం గడతేఱు మదీయవాంఛ..." భార. విరా. ౩, ఆ. ౬౨. అ. క్రి. అంగీకరించు. "మధ్యాక్కర...నా సుతునకు భార్య వగు మన్న నొడఁబడి యియ్య, కొనియె..." భార. ఆది. ౪, ఆ. ౧౪౨., భార. విరా. ౫, ఆ. ౭.

ఇయ్యకొలుపు. ద్వ. స. క్రి. (ఇయ్యకొనుధాప్రే.) ఒప్పించు. "గీ...ధార్తరాష్ట్రుఁ, గ్రూరశరముల నే నియ్యకొలుపువాఁడ, నవని కొంతేయులకు నిచ్చునట్లుగాఁగ." భార. ఉద్యో. ౧, ఆ. ౨౭. దశ. ౩, ఆ. ౭౪.

ఇయ్యకోలు. ద్వ. వి. (ఇయ్యకొను. ధా.) **1.** అంగీకారము, ఒప్పుదల. "చ...ఇయ్యకోలుమైఁ, జనియె నతండు నెమ్మనము సంతసమొందఁ వయస్యపాలికిక్." ఉష్ప. ౨, ఆ. ౨౨౬. **2.** ఆజ్ఞ, అనుమతి. "గీ. ఏమి సేయుదు నాదైత్యునియ్యకోలు, లేక వీడెవ్వరికిఁ జొరరాక యునికి." ప్రభా. ౪, ఆ. ౮౭.

ఇయ్యది=ఈయది. (శ. ర.)

ఇయ్యన=ఈయన. "క. అయ్యో కర్మంబులదెస, నెయ్యం బెసలారఁ గలిగి నియమనిరూఢుం, డియ్యన యన..." భార. అను. ౩, ఆ. ౩౦౬.

ఇయ్యసేయు. వై. అ. క్రి. (ఇయ్య+చేయు.) సమ్మతించు. రాజశేఖర విలాసము. ౩, ఆ. ౧౯.

ఇర. సం. వి. ఆ. స్త్రీ. **1.** భూమి. **2.** కల్లు. **3.** నీళ్లు. **4.** వాక్కు. **5.** మేర. **6.** అన్నము. **7.** కశ్యపుని భార్యలలో నొకతె.

ఇరమ్మదము. సం. వి. అ. పుం. మేఘమునందలియగ్ని, వజ్రాగ్ని. "గీ. ప్రబలతర బాడబీకృతేరమ్మదములు, భాస్వరేరమ్మదీకృత బాడబములు." ఆము. పీఠి. ౩.

ఇరవందు. దే. అ. క్రి. (ఇరవు+అందు.) ఇరవొందు, ఒప్పారు. "శా...లేఁగలు నీరు ద్రావి యిరవందం బచ్చికల్ మేయుచుక్." భాగ. ౧౦. స్కం. పూ. ౪౯౩.

ఇరవగు. దే. అ. క్రి. నెలకొను, ఉండు. "మ... సౌరభో, త్కరగుంజాతరు సీమఁ దెమ్మెరల రాకక్ వీఁక నల్లాడుక్రొ, వ్విరితీఁగం గని యొక్కరాచిలుకతీవిక్ బోటు లీక్షింప నం, దిరవై యుయ్యెల లూఁగుచున్నది..." విప్ర. ౨, ఆ. ౬౨. నైష. ౧, ఆ. ౫౨.

ఇరవారు. దే. అ. క్రి. (ఇరవు+ఆరు.) స్థిరపడు. "క. నరపతికి నాకుఁ బరిణయ, మిరవారఁగ నాఁడు చేసి యిప్పుడు దేశాం, తరమున. జిక్కిన నన్నును, వరునిం గూర్పంగ నీవ వచ్చితి కరుణక్." భా. రా. సుం. ౨౯౪.

ఇరవు. దే. వి. (క. ఇరవు.) **1.** స్థానము. "క. శరణాగతుండ భక్తుఁడఁ, బరమపదవిఁ గోరెదను - శుభం

బుగ నన్నుం, బరికించి యేది మే ల, య్యిరవు దొరకొనంగఁ దలఁపవే కమలాక్షా." భార. శాం. ౨, ఆ. ౫౪. 2. ఇల్లు. "చ. ఇరవును దప్పివం(డ్రు) లను నెత్తినపెంచినవారిఁ బాసితిన్." విక్ర. ౬, ఆ. ౧౧౦. 3. విడిపట్టు, బస. "గీ. తెరువు నడచెడివారికి నిరవుచేసి ...యాత్రా పదార్థ సమితిఁ, బాయకెవ్వండుపెట్టునాభక్తుఁడతఁడు." భీమ. ౬, ఆ. ౫౨. విణ. 1. స్థిరము. "క...ఇర వుగఁ సిద్ధించు ననఘ యిహపరసుఖముల్." భార. ఆర. ౪, ఆ. ౨౩౪. 2. యుక్తము. "చ. ఇరువురు వాసుదేవులు మహిం గలరే యని మాన్పఁ గోరు నా, కిర వగుకాల మిప్పగిది నింపెసలారఁగ నేఁగుదెంచె..." ఉ. హరి. 3, ఆ. ౧౦౩.

ఇరవుకొను. దే.అ. క్రి. (ఇరవు+కొను.) 1. నెలకొను, ఉండు. "క. పురి రాకొమరులకీర్త్యం, బరవాహిని భుజగపురికిఁ బల్లవిడిఁ జని యం, దిరవు కొన నెడము చాలమి, మరలినతఱి బుగ్గ లన నమరుసౌధంబుల్." పాండు. ౧, ఆ. ౧౦౭. 2. స్థిరపడు. "గీ. కలఁచి కబళించి కడుపడి బలిమి మించి, గెలిచి యార్వేటి వేంకటక్షితిపుతిర్మ, లేంద్రువలమూఁపునను నిల్చి యిరవుకొనియె, రాజనుతు లొప్పు ధరణీవరాహమూర్తి." రామ రా. ౩౮౭. 3. పొడము, జనించు. "సీ. మృగనేత్ర నేత్రలక్ష్మిని గడించినయంత నెవలోనఁ జాంచల్య మిరవుకొనియె." శశాం. ౪, ఆ. ౫౩. స. క్రి. ఆక్రమించు. "క. శిరసు పదుంకఁగఁ దెల్లఁగ, నరసిన గృహమేధినియును నడచెదదంగం, బిరవుకొని పట్టుచాలక, జర కొంత వినిర్గమించి చనుదెంచు క్రియన్." పాండు. ౫, ఆ. ౧౮౮.

ఇరవుకొలుపు. దే. స. క్రి. (ఇరవుకొను ధా. ప్రే.) 1. నెలకొలుపు. "క. కలికీ...నీకరుణ యిరవు కొలుపుము నాపై." రసిక. ౬, ఆ. ౧౫౬. 2. నిలుపు. (చూ. ఇరవుకొల్పు.)

ఇరవుకొల్పు=ఇరవుకొలుపు. (నిలుపు.) "సీ. తెరువులఁ గుక్కల నిరవుకొల్పినఁ జాలు నెఱలె యోదం బులై నిలుపఁగలవు." చంద్ర. ౨, ఆ. ౧౩.

ఇరవుపడు. ద్వ. అ. క్రి. (ఇరవు+పడు.) 1. ఇరవు కొను. (చూ. ఇరవుపఱుచు.) 2. శోభిల్లు. "సీ. శ్రీవత్సకౌస్తుభ శ్రీరమాచిహ్నంబు లురమునఁ దమ్మైమి యిరవుపడఁగ." భాగ. ౫, స్కం. ౧. ఆ. ౪౪.

ఇరవుపఱుచు. ద్వ. స. క్రి. (ఇరవుపడు. ధా. ప్రే.) ప్రతిష్ఠించు, నిలుపు. "సీ...అయ్యతిపకు ముక్త కేశాహ్వయంబు, దయచేసి...అప్పసిఁ గాల్పక బుద్ధి, చిఱుగుబ్బ లాని క్షేత్రరాజమునకు నీశాన దిక్కున నిరవుపఱిచె, వెన్నుండు తను నది ప్రేపల్లెలో రాక తక్కించుదౌష్ట్యంబుఁ దలఁచి నగుచు." పాండు. ౫, ఆ. ౧౫౪.

ఇరవొందు. దే. అ. క్రి. (ఇరవు+ఒందు.) 1. నెల కొను, వసించు. "ఆ. ఎల్ల తనువులందు నిరవొంది తనతోడఁ, బొందు నేసినట్టిపొందుకానిఁ, బొందు వొందలేఁడు పురుషుండు గుణమునా, గుణిని బోలునట్టిగుణి భజింతు." భాగ. ౬, స్కం. ౬౧౫. 2. సంప్రాప్తమగు, కలుగు. "మ...ఇరవొందుం గాకఁ గల్యాణముల్." హరి. ఉ. ౪, ఆ. ౯౯. 3. పొలుపారు, ఒప్పు. "గీ. సూర్యుఁ డిరవొందుఁ దేజోనివార్యుఁ డగుచు." నరస. ౧, ఆ. ౨౯.

ఇరసాలు. హిం. వి. ప్రభుత్వమునకు భూస్వాములు పన్ను చెల్లించుట.

ఇరసాలునామా. హిం. వి. ప్రభుత్వమునకు భూస్వాములు చెల్లించిన పన్నులపట్టిక.

ఇరాంబరము. సం. వి. అ. న. వడగల్లు.

ఇరాచరము. సం=ఇరాంబరము. విణ. (అ. ఈ. అ.) 1. భూచరము. 2. జలచరము.

ఇరాఱు. (ఇరు+ఆఱు) దే. స. ఈరాఱు, పన్నెండు. "ఉ. ఆనగరంబుత్రోవను దినాధిపుఁ డేఁగుచు దారి కడ్డమై, పూనిక నున్నకోటఁ గని పోవఁగ లేక యిరాఱు మేనులం, దానటు దిద్దు దూఱి చనెఁ దథ్యముగా దని యంటిరేని యా, భానుని ద్వాదశాత్ముఁడని పల్కఁగఁ గారణమేమి నిచ్చలున్." రుక్మి. ౧, ఆ. ౪౩.

ఇరిణము. సం. వి. అ. న. ఊషరక్షేత్రము, చౌటి నేల. విణ. (అ. ఆ. అ.) 1. శూన్యము, లేనిది. 2. పాడైనది. 3. ఆలంబములేనిది. 4. చౌటిది.

ఇరియించు. దే. స. క్రి. (ఇరియు. ధా. ప్రే.) **1.** వేష్టించు, చుట్టు. "క. అని కరుణ పుట్ట వేఁడిన, ఘని యొకబలుఁడీవ డిగ్గవిడిచిన నా పృ, ద్ధను నద్దెస మొల సిరియిం, చిన వెరవును గావు మెఱయఁ జేఁదితి వెడలన్." దశ. ౧౧, ఆ. ౭౭. **2.** భస్మముచేయు. "రగడ. నొసల సెసఁగు శిఖి యసమున మసమసమకోభవుమె క్తనిమే నిరియిం యించిరి." ఉద్భ. 3, ఆ. ౨౯.

ఇరిపిలి. దే. వి. పోగరతోఁ జేయఁబడిన రంధ్రము. (శ. ర; గ్రా.)

ఇరు. దే. స. రెండు. (వృత్తియందు హల్లుపరమగుచో 'రెండు' అనుదానికి వికల్పముగా వచ్చు నాదేశము. ఒక్క 'ఇరుగడ'లోఁ దక్క దీనికి వ్యస్తప్రయోగము కానరాదు.) ఉదా:—ఇరుకార్లు, ఇరుగడ, ఇరుగాలు, ఇరుపెఱఁగు మొ.

ఇరుఁబుట్టువు. దే. వి. (ఇరు+పుట్టువు.) **1.** పక్షి.(వ్యు) **2.** బ్రాహ్మణుఁడు. "సీ. తేజునఁ బడగలెత్తియు నిరుఁబుట్టువుదొరలఁ గన్గొని మూలఁ దూఱుకొనుచు." అచ్చ. బాల. ౧౦౬; (రెండర్థములకు నిది యుదాహరణము.) **3.** దంతము.(వ్యు)

ఇరుగడ. దే. వి. (ఇరు+కడలు.) రెండుప్రక్కలు. భార. విరా. ౫, ఆ. ౨౦౪.

ఇరుగన్ను. దే. వి. నేత్రద్వయము. రా.వి.౫,ఆ.౭౧.

ఇరుగాలిపసి. ద్వ. వి. (ఇరు+కాలి+పసి.) ద్విపాత్పశువు. "ద్వి...మి మ్మిరుగాలిపసుల." బస. ౬,ఆ. ౫౨౫, పం.

ఇరుగిల్లు. దే. వి. (ఇరుగు+ఇల్లు.) ఇరుగు, ప్రక్కయిల్లు. "వ్యవ:—మీ యిరుగిల్లు తాళము వేసి యున్నది.

ఇరుగు. దే. వి. (దీనికి వృత్తియం దంత్యవర్ణము లోపించుట గలదు. చూ. ఇరుచెవి.) **1.** ప్రక్కయిల్లు. వ్యవ:—మీ యిరుగున నున్నవారు మాకు బంధువులే. **2.** ప్రక్క. (చూ. ఇరుగిల్లు.) విణ. ప్రక్క నున్నది. (చూ. ఇరుగు పొరుగులు)

ఇరుగుడు. దే. వి. ఇరువుడు, శింశుపా. "గీ. ప్రాఁకి యమ్మేటి యిరుగుడు మ్రాఁకుచివురు, జొంపములలోన నిలికి..." అచ్చ. సుం. 3౧.

ఇరుగు పొరుగులు. దే. వి. బ. (ఇరుగులు+పొరుగులు.) ఇంటి కిరుప్రక్కల నున్నవారు, ఇరుగునను పొరుగునను గలవారు. "క. ఆరాధ మనోజ వ్యధ, నీ రీతుల నిరుగుపొరుగు లెఱుఁగక యుండన్, గారాబు సేయఁ గృష్ణుఁడు, చేరక తా నది పరాకుచేయుచునుండెన్." రాధా.౧,ఆ.33. ఇట్లే: పొరుగిరుగులు, పొరుగిరుగువారు. "క. అనుచుఁ బొరుగిరుగువారున్." హంస.౫,ఆ.౧౧౪.

ఇరుగురు=ఇరువురు. (శ. ర.)

ఇరుచక్కి. దే. వి. రెండుప్రక్కలు; రెండువైపులు. "వ...భ క్తిసంయు క్తినిరుచక్కింజేరి..." హంస. 3, ఆ. ౨౯.

ఇరుచెవి. దే. వి. (ఇరుగు+చెవి.) రెండవచెవి. విణ. రెండవవాఁడు, అన్యుఁడు. "గీ. ఒంటి నే తెంచి మంతనం బుండి నిలిచి, చక్రధరుతోడ హితకార్యచర్చ చేసి, యేఁగె దేవేంద్రుఁ డిరుచెవి యెఱుఁగకుండ." భీమ. ౪, ఆ. ౫౦. "క. ఇరుచెవి యెఱుఁగక యుండం, దరుణీ సుఖ మనుభవింపఁ దలఁచినఁ బదివే, వురకన్ను లెదుటఁ బడితిని..." ఉ. హరి. ౫, ఆ. ౧౯౭.

ఇరుచేయి. దే. వి. బొ. (ఇరు+చేయి.) హస్తద్వయము, రెండుచేతులజంట. భార. మూ. ౧౫౧. భార. అను. ౪, ఆ. ౧౦౨.

ఇరుచొవంచ. దే. స. (ఇరు+చొవంచ.) పది. "క.అనుసెడ విభీషణుఁడు మె, ల్లన నిరుచొవంచయోదలలరక్కసిరా, యనిఁ జూచి..." అచ్చ. యు. ౧౭.

ఇరుదలగ్రుడ్డుకానుపు. దే. వి. ఇరుదలపులుఁగు, గండభేరుండపక్షి. "సీ. ఎక్కుడుమెకపుసూ ళ్లిరుదల గ్రుడ్డుకానుపులు..." అచ్చ. అర. ౪.

ఇరుదలదొర. దే. వి. (ఇరు+తల+దొర.) ద్విశీర్షుఁడు; అగ్ని. (వ్యు)

ఇరుదలదొరతేజి. దే. వి. (ఇరు+తల+దొర+తేజి.) అగ్నిదేవుని వాహనము, మేషము. "సీ. ఇరుదలదొర తేజి యేడిక పొట్టేలు తగరును మేషాఖ్యలగు..." వేంక. తిర్య. ౯౪.

ఇరుదలపాము. దే. వి. (ఇరు+తల+పాము.) డుండుభము, రెండుతలలపాము. (శ. ర.)

ఇరునూఱు=ఇన్నూఱు. "ఉ...ఇరునూఱు హరుల్..." ఉ. రా. 2, ఆ. ౪౬.

ఇరుమాఱ్లు. దే. వి. రెండుసార్లు. "క...వెరుమాఱ్లని యావాచా, లిరుమాఱ్లనొసఁగి." హంస. 3, ఆ. 30.

ఇరుపర్వునేల. దే. వి. (ఇరు+పర్వు+నేల.) రెండు క్రోసుల దూరము. "సీ...ఇరుపర్వునేల ముప్పరువునేల. గీ. యనిన క్రోశద్వయత్రయాఖ్యలు చెలంగు." ఆం. భా. ద్వి. ౯.

ఇరుమూఁడు. దే. స. (ఇరు+మూఁడు.) షట్సంఖ్య, ఆఱు. "క. ఇరుమూఁడు రుచులదోషపు, విరసత మానక జ్వరాది వృష్యాంతంబై, పరగు చికిత్సయుఁ గని..." స్వా. ౫, ఆ. ౧౬..

ఇరులగొంగ. దే.వి. (ఇరుల+గొంగ.) 1. సూర్యుఁడు. 2. చంద్రుఁడు. 3. అగ్ని. ఇట్లే: ఇరులదాయ.

ఇరులు. దే.వి.వి. (క. ఇరుల్. త. ఇరుళ్.) 1. చీఁకటి. "గీ. కొన్ని దేశంబు లిరులచే గుత్తివడియె." కాశీ. ౧, ఆ. ౧3౭. నైష. 3, ఆ. ౯౦. 2. నలుపు. "గీ. మృగమదము మించుతములఁపుటిరుల మోవి, దళముగా..." ఆము. ౪, ఆ. ౧3౫.

ఇరులుకొను. దే. అ. క్రి. (ఇరులు+కొను.) 1. చీఁకటి క్రమ్ము; భయముగొలుపు. "సీ. పార్శ్వభూమి నభిరుభటకదంబకరాళిహేతిచ్ఛటాచ్ఛాయ లిరులుకొనఁగ." స్వా. పీఠి. ౧౬. 2. దట్టముగా నల్లుకొను. "సీ. శైత్యపాండిమలు దుషారాంత మునఁ జేరె నిరులుకొన్దాక్షపందిరుల విరుల." ఆము. ౫, ఆ. ౧3౯.

ఇరులుగొంగ=ఇరులగొంగ. (శ. ర.)

ఇరువంద్రు. ద్వి. స. (ఇరు+వంద్రు.) ఇరువదిమంది. (ఇరువదికి మహన్మహత్యర్థకరూపము.)

ఇరువది. దే. స. ఇరువై. "క. ఇరువది చేతుల..." ఉ. రా. 3, ఆ. ౨౧౮.

ఇరువయి=ఇరువై. (శ. ర.)

ఇరువాయికట్టు. ద్వ. వి. మల మూత్ర బంధరోగము. (శ. ర.)

ఇరువాయిపక్కి. ద్వ. వి. (ఇరు+వాయి+పక్కి.) గండభేరుండపక్షి. (ఆం. పా.)

ఇరువు. దే. వి. 1. ప్రక్కయిల్లు. (శ.ర.) 2. ప్రక్క. "క. అని నియతి చేయుటయు న, మ్ముని పలుకులు కన్యకాసమూహం బెల్లన్, విని యట్లిరువులఁ జేరక, చన నందొక్కర్తు విధివశంబున వినమిన్." నిర్వ. ౨, ఆ. ౨౦. (శ. ర. పా.) 3. స్థానము. "సీ...నెఱనీటు కిరువు పన్నీటి చెఱువు." శశాం. ౪, ఆ. ౫౦., య. ౪, ఆ. ౨౬.

విణ. ఈ ప్రక్క నున్నవాఁడు. "మ...ఇరువుం బొర్వును బల్వలేశుఁడు మృకండేశుండు గానేలె ని, ద్ధరణీమండలి భీమనాథుఁడు..." భీమ. ౫, ఆ. ౭౯.

ఇరువుకొను=ఇరవుకొను. (శ. ర.)

ఇరువుడు=ఇరుగుడు. (శ. ర.)

ఇరువుపడు=ఇరవుపడు. (శ. ర.)

ఇరువురు=ఇరుగురు. "చ. ఇరువురఁ జంకలం దిఱికి.." హరి. పూ. ౫, ఆ. ౨౬. "చ. ఇరువురు నీలనీరజనిభేక్షణలు..." నైష. 3, ఆ. ౯౫.

ఇరువై=ఇరువది. "మ. ఇరువైనాలుగు మూఱ్ల మేర..." కాశీ. ౧, ఆ. ౫3.

ఇరుస. దే. వి. (ఇరు+కుంచము.) రెండు కుంచముల పరిమితిగల మానవిశేషము, అరతూము. "సీ. ఒడికంబుగా వ్రేసి యొక్కింత నేలపై నిరుసవడ్లను బోసి యెండ నెఱపి." దశ. ౧౦, ఆ. ౧౦౫. ఆం. భా. ద్వి. ౨20.

ఇరుసత. దే. స. (ఇరు+సత.) పదునాలుగు. "గీ. ఎపుడు నిరుసత జగముల నెదురులేక, మిక్కుటంబైన తేజున మెఱయుచున్న." అచ్చ. సుం. ౪౭.

ఇరుసు. దే. వి. (త. ఇరుసు.) 1. బండియక్షము. "సీ. ఇనురథంబున నున్నయిరు సొక్కటియ మేరుశిఖరంబునందును జేరియుండు, నొవరఁ జక్రము మానసోత్తరపర్వతంబుదులఁ దిరిగెడు నారథంబు, నిరుసున నున్న రెండిరుసులు దగు

లంగఁ బవనపాశంబుల బడ మగుచు." భాగ. ౫ స్కం. ౨, ఆ. ౭౨. 2. ఏకపుత్రాని నడిమి యడ్డుకొయ్య. (శ. ర.)

ఇర్గడ=ఇరుగడ. "ఉ...కన్పడు నిర్గడఁ దీవ జొంపముల్." కాళిందీ. ౨, ఆ. ౧౭౫.

ఇర్గళము. సం. వి. అ. న. ఇర్గళ, తలుపుగడియ.

ఇర్పలము. దే. వి. (ఇరు+పలము) రెండు పలములు. "సీ...ఇర్పల మనఁగను సెనఁగు ద్విపలి." ఆం. భా. ద్వి. ౨౬౯.

ఇర్లగొంగ=ఇరులగొంగ. (సూర్యుఁడు.) "గీ. మొదలి వెన్నుఁడు పంటలముగువగొడప, లుడుపుకొఱకిర్లగొంగవంగడమునందు, రాముఁడై పుట్టె..." అచ్చ. యు. ౧౯.

ఇర్ల వేఁటకాఁడు=ఇర్లగొంగ. (సూర్యుఁడు.) "గీ. నిను పత్రాక్షుని బయల సెప్పుడుఁ దిరుగుచుఁ, బొసఁగ ముప్పొద్దు మువ్వేసములఁ జెలఁగుచు, వెలుఁగు లెల్లెడఁ గాంచుచు నలరునిర్ల, వేఁటకాఁడప్పు డొంతయుఁ జేటమీఱె." అచ్చ. అయో. ౪౨.

ఇర్లు. దే. వి. ఇరులు, చీఁకటి. "మ. ఎసఁగెన్ సంజయు నిర్లుఁ దారకలు భూమిష్ఠ ప్రకాశంబుగన్." వసు. ౬, ఆ. ౪. బ. ఇఱ్ఱులు, మగజింకలు. "స్రగ్ధర. కండల్గాఁ జేసె నిర్లన్..." య. ౨, ఆ. ౩౨. "చ...ఋక్ష సంఘముల తేజముఁ దూలిచెఁ బుండరీకమం, డలిఁ దెగటార్చె నిర్లద టడంచె...రాజు సైజగుణవిక్రమ చాతురి..." సా. ౧, ఆ. ౧౦౧. (ఇది రెం డర్థములకు నుదాహరణము.)

ఇర్లుగొను=ఇరులుకొను. (చీఁకటిక్రమ్ము.) "సీ. ఉరుతమ పటలంబునుక్కఁ బట్టెదియని, నెఱినిర్లుగొను నింద్రనీలరుచులు." (పాఠాం. ఇరుల్గొను.) కు. సం. ౩, ఆ. ౮౭.

ఇర్వది. ద్వి. స. (ఇర్+పది) ఇరువై.

ఇర్వదేను. ద్వి. స. (ఇర్వది+ఏను.) ఇరువదైదు. కాశీ. ౪, ఆ. ౯౧.

ఇర్వ్వురు=ఇరువురు. (శ. ర.)

ఇఱి. దే. వి. ఇఱ్ఱి, హరిణము. "ఆ...ఎకిరింత యిఱి నోర్వి, గఱికఁ దిగిచి నోరఁ గఱచుకొనియె." కవిక. ౨, ఆ. ౧౨౦. విశ. (దీనికి వ్యస్తప్రయోగము కానరాదు.) 1. ఇఱుకైనది. "ఉ. ఇఱి గొంగిటఁ జేర్చి..." భార. శల్య. ౨, ఆ. ౪౧౬. 2. సన్నమైనది. "సీ. హరిణాక్షి యిఱిగౌను..." అచలా. ౨, ఆ. ౫౭.

ఇఱించు=ఇరియించు, ఇఱియించు. దే. స. క్రి. (ఇఱియు. ధా. ప్రే.) నొక్కిపట్టు. "చ...అని లాత్మజుఁ దబ్బులఁ బట్టి త్రిప్పి గ్ర, క్కన ధర వైచి త్రొక్కి కడకాలఁ గేల నిఱించి..." పద్మ. ౧౦, ఆ. ౨౨౧.

ఇఱికి. దే. వి. బాలక్రీడావిశేషము. (శ. ర.)

ఇఱికించు. దే. స. క్రి. (ఇఱుకు. ధా. ప్రే.) ఇముడఁజేయు. "గీ. అప్పు డిచ్చకు లగుచు బ్రాహ్మణులు గొంద, ఱాత్మజనిభూమి విడువలే కలికభూతి, గడ్డముల నాన రుదురాక లిడ్డసంది, సూత సంహిత లిఱికించి చొరఁదొడఁగిరి." ఆము. ౪, ఆ. ౪౬., స్కాం. ౪, ఆ. ౫౭.

ఇఱియించు. దే. స. క్రి. (ఇఱియు. ధా. ప్రే.) 1. బిగించు. "గీ. హస్త మిఱియించి పట్టిన యపుడు కదిసి, యంగుళులు రంధ్రహీనంబు లయ్యెనేని, యతనిఁ గల్యాణ లక్షణాన్వితుని గాఁగఁ, జెప్పు సాముద్రిక జ్ఞానసిద్ధబుద్ధి." కాశీ. ౪, ఆ. ౩౨. 2. నశింపఁజేయు. (చూ. ఇరియించు.)

ఇఱియు. దే. అ. క్రి. 1. బిగియు. "క. నిఱుపేద యింటి కేటికిఁ, బఱతెంచు నిధాన మట్లు పఱతెంచినయే, నిఱుపేద యభాగ్యతఁ దలు, పిఱియఁగ నిడుఁగాక చొరఁగనిచ్చునె దానిన్." నైష. ౪, ఆ. ౭౩. 2. అధికమగు. "ద్వి. మెఱుఁగుఁగైదువుల క్రొమ్మెఱుఁగులు దిశల, నిఱిసిన చీఁకట్ల నెడలంగ జడియ." ద్వి. హరిశ్చ. పూ. ౧౯౯౭ పం. 3. నలఁగు. (శ. ర.) స. క్రి. చేర్చు, కదియఁజేయు. "చ...కిరణంపుఁగొన ల్గొని మోము మోముతో, నిఱియుచుఁ జేర్చి ప్రేయసుల కిచ్చుచు నాఁడె దివిం జకోరముల్." పిన. శకుం. ౩, ఆ. ౧౫౯.

ఇఱటియుంగౌఁగిలి. దే. వి. ఔ. బిగికౌఁగిలి. "సీ. ఎదురొత్తగా నేర్చి నిఱటియుంగౌఁగిటియందు..." కవిక. 3, ఆ. ౨౨౬.

ఇఱుకటము. దే. వి. 1. ఇఱుకుచోటు. "క. తఱచగు పెనుసందడిలో, నిఱుకటమునఁ బడ్డ నృపతి.." నైష. ౪, ఆ. ౧౨౪. 2. మోసపుమాట. "ద్వి. ఈ చతురోక్తుల కేమి కారణము,...ఈ యిఱుకటములు మాని, లేదు బొంకితి నని లెమ్ము..." ద్వి. హరిశ్చ. పూ. ౧౪౦౨, ౧౪. విణ. ఇఱుకైనది. "గీ. ఎత్తినప్పుడు విడియుచో నిఱుకటంపుఁ, దెరువునందు..., శాత్రవుల బెట్టు పైఁబడి చంపవలయు." భార. సౌ. ౧, ఆ. ౨౭.

ఇఱుకాటము=ఇఱుకటము. (శ. ర.)

ఇఱుకు. దే. అ. క్రి. 1. కొంచెపుతావున నణఁగు. "గీ. ప్రాఁకి యమ్మేటి యిరుగుడు మ్రాఁకుచివురు, జొంపములలోన నిఱికి..." అచ్చ. సు. ౩౧. 2. రెంటిసందునఁ జిక్కి యదుముడువడు, నలఁగు. "గీ. ఎసఁగు వీరుఁడు నీశైల మెత్తఁ బోయి, బాహు లిఱుకంగఁ దాల్మిని బాసి కూసె." హరి. ఉ. ౬, ఆ. ౯. అం. ప్రే. 1. ఇఱికించు. "క. చఱచి యొకచేతఁ గూర్మముఁ, బెఱచేత గజంబుఁ బట్టి పెనఁచి ఖగేంద్రుం, డిఱికికొని గగనవీథిం, బఱచె..." భార. ఆది. ౨, ఆ. ౭౦., నిర్వ. ౭, ఆ. ౯౩. 2. రెంటిసందునఁ బెట్టి నొక్కు. "చ. ఇరువురఁ జంకలం దిఱికి యేపెసలారఁగ బాహుపీడన, స్ఫురణ నొగిల్చి పెల్చఁ దెగఁజూచి జలంబులలోన వైచినన్." హరి. పూ. ౫, ఆ. ౨౬. నా. పంచ. ౧; ఆ. ౨౪౨. వి. 1. ఇఱుకుచోటు. (శ. ర.) 2. మాఱుమూల. "సీ. ధర్మరతుఁడు, గాన సత్యంబను కట్టునఁ దగఁ గట్టువడి పోయి పాతాళ భువనకోటిఁ, గల్లను గ్రందైన యిఱుకున నున్న మాతండ్రి..." హరి. ఉ. ౭, ఆ. ౩౬. 3. కష్టము. "ఆ. ఇఱుకు వచ్చువేళ నీశ్వరుఁ దలఁతురు..." వేమన. ౭౨౫. విణ. 1. ఇఱుకైనది, చాలనిది. వ్యవ:—పదిమంది గలమీయిల్లు చాల నిఱుకుగా నున్నది. 2. బిగువు, దృఢము. "క. ఇఱుకు వలిగుబ్బచన్నుల, యొఱుకుంజవరాలొకర్తె యొఱకో యవ్వా, యొఱకో యని తనచందం, బెఱుకపడంగా హజార మెలమిం గదిసెన్." శుక. ౧, ఆ. ౯౫.

ఇఱుకుఁడు. దే. వి. 1. బాధ, నలఁగుడు. 2. ఇఱుకటము. విణ. బాధకము. "మ. కుపితానంగ శరాగ్నిదాహమున నాక్షోణీవిభుం డెంతయున్, దపియింపన్ వెస నుగ్రభానురుచు లుద్దారించుచున్ జంద్రికా, తపమున్ ముంచినఁ గ్రిందు మీఁదిఱుకుఁడై తాపంబు రెట్టింప..." పిన. శకుం. 3, ఆ. ౧౬౨.

ఇఱుకుమ్రాను. దే. వి. (ఇఱుకు+మ్రాను.) ఆవరణములోపలికి మనుష్యుఁడు మాత్రము వెళ్లుటకు వీలుగాను పశువులు పోకుండునట్లును పాఁతిన పంగలకొయ్య. (శ. ర., బ్రౌ.)

ఇఱుము. దే. వి. మఱుఁగుచోటు, మాఱుమూల. "గీ. పల్లముల డాఁగు దిబ్బల బయలుపడును, నీడలకుఁ బోవు నిఱుముల సిగడి తాఱు." భాగ. ౧౦. స్కం. పూ. ౧౬౨౭.

ఇఱుముకొను. దే. అ. క్రి. (ఇఱుము+కొను.) మఱుఁగుపడు. "చ. ఇఱుముకొనం దొడంగె దెస లేచిన చీఁకటి నంచుఁ జేతులం, గొఱవులు పట్టి త్రిమ్మరుచు..." భా. రా. యు. ౧౦౯౪.

ఇఱ్ఱి. దే. వి. హరిణము, మగజింక. "క. మనసిజ రాగంబునఁ బెనఁగిన యిఱ్ఱిని లేడిఁ జూచి... రెంటినిఁ ద్రెళ్లఁగ నేసె .." భార. ఆది. ౫, ఆ. ౪౯.

ఇఱ్ఱింకు. దే. వి. (ఇంకు+ఇంకు.) మిక్కిలి యింకుట. (చూ. ఇఱ్ఱింకుఁజూపు.)

ఇఱ్ఱింకుఁజూపు. దే. వి. (ఇఱ్ఱింకు+చూపు.) క్రేఁగంటి చూపు. "సీ. ఈక్షింపఁగా నేర్చు నిఱ్ఱింకుఁజూపుల మోవిఁ గూర్పఁగ నేర్చు మొలకనవ్వు." కవిక. 3, ఆ. ౨౨౬.

ఇఱ్ఱింకులింకించు. దే. స. క్రి. (ఇఱ్ఱింకులింకు. ధా. ప్రే.) భయపెట్టు. "సీ. ఎవ్వాఁడు వింధ్యాద్రి నిఱ్ఱింకులింకించె గంభీరహుంకార గర్జనమున." భీమ. ౨, ఆ. ౩౭.

ఇఱ్ఱింకులించు. దే. అ. క్రి. (ఇఱ్ఱింకులు+ఇంచు.) 1. మిక్కిలి శుష్కించు. "సీ. భౌమవారపువీర భద్రపళ్లెర మిడు గృహదైవతంబు లిఱ్ఱింకు లింక." ఆము. ౪, ఆ. ౪౩. 2. భయపడు, బెదరు. (చూ. ఇఱ్ఱింకులింకించు.) 3. నశించు. "సీ...ఎందేని నఘము లిఱ్ఱింకులించు." భీమ. ౩, ఆ. ౬౬.

ఇఱ్ఱింకులుచేయు. దే. స. క్రి. (ఇఱ్ఱింకులు+చేయు.) నశింపఁజేయు. పోఁగొట్టు. "ఉ...కన్నుఁగోనలం, దంకురితంబులైన దరహాసలవంబులు పద్మనేత్ర యిఱ్ఱింకులు చేసెఁ బక్ష్మములయాఱమిఁ గాటుక చిమ్మచీఁకటిన్." నైష. ౭, ఆ. ౧౯౩. (అణఁచు అని శ. ర.)

ఇఱ్ఱిగోఱజము. ద్వ. వి. (ఇఱ్ఱి+గోఱజము.) కస్తూరి. "ఆ. ఒక్క యెఱుకుఱేఁడు నక్కకొమ్మును నిఱ్ఱి గోఱజంబుఁ జున్నుఁ జాఱపప్పు..., కాను కిచ్చి..." స్వా. ౪, ఆ. ౧౪.

ఇఱ్ఱిపోతు=ఇఱ్ఱి. "ఆ. చలము లూదవ ముండ్లు గల మ్రాఁకుదీములఁ, గెరలి తాఁకి కొమ్ము లురులఁ దగిలి, వాని లేవ నీడ్చి కానకే కొనిపోవుఁ, బోతరించి యిఱ్ఱిపోతు లచట." స్వా. ౪, ఆ. ౨౨.

ఇఱ్ఱియలు. దే. వి. బ. ప్రక్క, పార్శ్వము. (శ.ర.)

ఇఱ్ఱు. దే. వి. ఇదంతము. "క. అచ్చుగ నఱ్ఱిఱ్ఱులు, నచ్చులె యంతమున తెనుఁగుటభిధానములన్." (ఆంధ్రభాషా భూషణము-కేతన)

ఇల. ఉభ. వై. వి. (సం. ఇలా.) 1. భూమి. "మ. ఇల వర్షంబులలోన భారతము భూయిష్ఠంబు..." నైష. ౩, ఆ. ౧౩౨. "గీ. ఇల పుడమి మన్ను బువి పంటవలఁతి యనఁగ, ధరణి కగు..." సాం. ని. స్థా. ౬ ౨. 2. భూలోకము. సం.=ఇడ.

ఇలకఱచు. దే. అ. క్రి. (ఇల+కఱచు.) ఈలకఱచు, పండ్లు బిగించు. "గీ. కడిఁది విలు చేఁది గుఱి కిల కఱచి నిలుపు, మరునికువలయశరముకంపములఁ బోలుఁ, దార కడకంటికై సారు చేరి చేరి, వేగ మగుడు సలజ్జదృగ్విభ్రమములు." ఆము. ౫, ఆ. ౧౩. (శ. ర. పా.) స. క్రి. బిగఁబట్టు. "ఆ. అట్టు దూల నేయ నాతండు మన సిల, కఱచి ధైర్య మూఁతగాఁగ నిలచి." భా. రా. యు. ౭౦౨.

ఇలకోడి. దే. వి. ఈలపురుగు, ఝిల్లిక. (శ. ర.)

ఇలటము=ఇల్లటము. "ద్వి...వెల్మఁ డొక్కఁడు, దధముఁడై చిరకాల మతివ నర్థించి, యిలట ముండఁగ..." పండితా. పురా. ౯౦. పు.

ఇలాకా. హిం. వి. సంబంధము.

ఇలాజ. సం. ఆ. స్త్రీ. సీత. "క...ఒనరించె నిలాజ లాజహోమము..." దశా. ౭, అ. ౨౬౦.

ఇలాధరము. సం. వి. అ. పుం. (వ్యు. భూమిని మోయునది.) పృథ్వీధరము, పర్వతము. హంస. ౭, ఆ. ౭౦౪.

ఇలాయి. దే. వి. చుట్టువత్తులు వేసెడు దివ్వటీ. "మ. తగసూర్యప్రభ లాయిలాయఁలును జంద్రజ్యోతులున్..." హంస. ౩, ఆ. ౭౦.

ఇలాయీ=ఇలాయి. "మ. ఇట్టిట్టై కరదీపికాతతు లిలాయీలున్..." రంగా. ౩, ఆ. ౧౪౫.

ఇలారము=ఇలువారము. (శ. ర.)

ఇలి. ఉభ. దే. వి. ఎంగిలిమెతుకు. గీ. పామునకుఁ బలి వెట్టని ప్రతినవారు, నీఁగ కెన్నఁడు నే నిలి యిడని వారు." నైష. ౭, ఆ. ౫౩. సం. వి. ఈ. స్త్రీ. కటారము, చేఁగత్తి.

ఇలి. దే. వి. ఎలుక. (ఆంధ్రదీపిక.)

ఇలిక. సం. వి. ఆ. స్త్రీ. భూమి.

ఇలిపాషాణము. దే. వి. ఎలుకలుపట్టు బోను. (క్యాంబెలు., బ్రౌ.)

ఇలు=ఇల్లు. దే. వి. ఔ. 1. గృహము. "క. ఇలు వెలువరించి..." భార. ఆది. ౬, ఆ. ౧౦౦. 2. కుటుంబము. "క. మనయింటిచేటు చూచితె ..." సర్వ. ౯, ఆ. ౫౨. 3. గృహకృత్యము. "ఉ...తలిదండ్రులు గూడి దేవియుం, దేవరవోలె నుండి యిలు దీర్పఁగఁ గాపురమొప్ప వానికిన్." స్వా. ౧, ఆ. ౫౩. అప. కొన్ని ధాతువులమీఁది యించుగాగమమునకు ఆదేశముగా వచ్చునది. ఉదా:—రంజిలు మొ.

ఇలుకరించు. దే. స. క్రి. విప్పు, తెఱచు. "క. భూకాంత నీరువట్టుకుఁ, గాక వదన మిలుకరింపఁ

గాన్పించినపు, డ్లో కా కన వెలిపుచ్చలు, లోక ములోఁ గాచె నిట్లు లోఁబడె జనముల్." వరాహ. ౧౦, ఆ. ౩౦.

ఇలుకు. దే. అ. క్రి. బెణఁకు. "సీ. గోరక్షణమునకై గోవర్ధనమహీధ్ర మెత్తిననాఁ డెంత యిలికె నొక్కొ." బహు. ౩, ఆ. ౭౯. వి. బెణఁకు. (శ. ర.)

ఇలుగు. దే. అ. క్రి. నీలుగు, చచ్చు. "క. బల విక్రమఘను లగుదొర, లిలిగిన మనసేన మేది నీశ్వర విను కన్నులు సెడిన ట్లున్నది..." భార. శల్య. ౧, ఆ. ౫౧. భా. రా. కిష్కిం. ౨౬౬. "క. పులి నమ్మియ కాదె తొల్లి పులుఁ గొక టిలిగెన్." ద్వా. ౧, ఆ. ౨౬౯.

ఇలుదొర. దే. వి. (ఇలు+దొర.) గృహస్థుఁడు. "గీ... ఇలుదొర గేస్తు నా గృహస్థుఁ, డు..." వేంక. మాన. ౩౪.

ఇలునింపడము. దే. వి. (ఇలు+నింపడము.) వధూ వరుల నూతన గృహప్రవేశము. (శ. ర.)

ఇలుపట్టు. దే. వి. (ఇలు+పట్టు.) ఇంటిపట్టు, నివేశన స్థలము. "క. అమ్మైన నర్థితరఁగలు, గ్రమ్మన నెడ గలుగఁ ద్రోచి కాదే యిలుప, ట్టిమ్ములఁ బడసితి వీస, హ్యామ్మునఁ బశ్చిమధరిత్రి యపరాం తమునన్. హరి. ఉ. ౧, ఆ. ౩౬.

ఇలుఱేఁడు. దే. వి. (ఇలు+ఱేఁడు.) ఇలుదొర. "వ... అయ్యిలుఱేఁ డెల్లకొమరులఁ బిలిపించి..." నీలా. ౩, ఆ. ౫౬.

ఇలువడి. దే. వి. 1. కులీనత, మంచివంశమునఁ బుట్టుట. "చ. వలను గులంబు లేనిపరివారము కోటియుం నేల నేర్చు న, గ్గలికయు భక్తిపెంపు మదిఁ గల్గి సుహృజ్జనమిశ్రమౌబలం, బిలువడి గల్గెనేని యిల యెల్లను నేలఁగఁ జాలు..." భార. శాం. ౩, ఆ. ౧౦౩. ('కులీనైస్సహాశక్యైత కృతాన్నైం జేతుం వసుధరాం.' సం. భా. శాం.) య. ౪, ఆ. ౧౬౬. 2. సత్ప్రవర్తనము, మంచి నడత. "క. కులమును రూపును బ్రాయము, నిలు వడియుం గలుగునరున కీఁ గంటె నినున్." రాజ. చ. ౩, ఆ. ౧౯౫. 3. పాతివ్రత్యము, ఇల్లాలితనము. "సీ... ఇలువడి ఘటశుద్ధి గలిగిన కాంతలందు. గీ. నిలుతు..." భార. అను. ౧, ఆ. ౨౧౫. 4. అభిమానము. (మా. ఇల్వడి.)

ఇలువరము. దే. వి. 1. ఇలువారము, ఆనేయ మగు కుటీరము. "గీ. అల కుటీరంబె యానేయ మైన నిలువ, ర మన నిలువార మనఁగాను రహికి నెక్కు." ఆం. భా. ద్వి. ౧౪. 2. తృణముచేఁ నేర్పఱచిన ఘుట్టివంటిగూడ. "గీ. భూమి సత్కృత స్మృతదృష్టపూర్వ మైన, బహుళ సంపత్పరంపర పాదుకొనిన, గరిసె యన గోటమించఁగ గణన కెక్కు, నందుపై నుంచు నిలువర మన దివంబు." చంద్రా. ౧, ఆ. ౫. (శ. ర. పా.) 3. ఎక్కడకు వలసిన అక్కడకు తీసికొనిపోఁదగిన గుడిసె. (బ్రౌ.)

ఇలువరుస. దే. వి. 1. ఇంటివంతు. "క. ఇలువరుసఁ గాఁగ నీ క్రియఁ, గలవారల నెల్లఁ బుచ్చెఁ గాలునిపురికిన్." విక్ర. ౫, ఆ. ౨౦౬. 2. వంశానుక్రమము. (శ. ర.) 3. పాతివ్రత్యము. "క. ఇలువరుస చెడఁగ బంధులు, తలవంపఁగ మగఁడు రోయఁ దల్లి కట్టా, వెలి నేల నన్నుఁ గంటివి, కలిగించినవాఁడు శీతకరుఁడో గురుఁ డో." భాగ. ౯, స్కం. ౩౧౨. 4. అభిమానము. "క. కులసతుల విడిచి పురుషులు, కులహీనుల యిండ్లఁ బోయి కూటికొఱకుఁ గ, న్నెలఁ బెండ్లి యాడి యుందురు, నిలువరుసలుఁ బౌరుష ములు నెడలి మునీంద్రా." వి. పు. ౮, ఆ. ౭౯౯.

ఇలువారము. దే. వి. ఇలువరము, ఆనేయ మగు కుటీరము. ఆం. భా. ద్వి. ౧౪.

ఇలువిందు. దే. వి. (ఇలు+విందు.) అతిథి. "ద్వి. ఇమ్మహి భక్తులయిలువిందు వచ్చె." బస. ౫, ఆ. ౧౪౯. పు.

ఇలువేలుపు. దే. వి. కులదైవము. "చ. తమ కిలు వేలుపై వెలయు తాండవకృష్ణపదాబ్జ సేవ..." కళా. ౧, ఆ. ౭. (ఇట్లే: ఇలువేల్పు, ఇల్వేల్పు ము.)

ఇల్కుఱుచే=ఇలకఱచు. "చ. పడిపడి యాన మిల్కు ఱచి పట్టుచు..." భా. రా. యు. ౯౯౯.

ఇల్ల. దే. అవ్య. (క. ఇల్ల. త. ఇల్లై.) లేదు. "ఉ. మందత నాస్తి లేదనెడుమాట హుళక్కి మదం

బు మిథ్య చు, ల్కుదన మిల్ల కుత్సితము కల్ల యసత్యము సున్న..." వెద. శతం. ౧, ఆ. ౫౦. "క. ఇల్లసుమీ సంసారము..." వేమన. ౧౦౨౦.

ఇల్లంత్రము=ఇల్లటము. "గీ...ఇల్లంత్ర మనఁగను నిల్లట మన, శ్వశురుని గృహాధివాసంబు చను ను..." ఆం. భా. ద్వి. మ. ౧౧౧.

ఇల్లటపుటల్లుఁడు. దే. వి. ఆలితో న త్తింట నేయుండు నల్లుఁడు. "క. ఇల్లటపుటల్లుఁ డని తన, యుల్లము రా...విక్రమ. ౭, ఆ. ౧౬౧. "సీ...శాలీనా హ్వయుం డిల్లటపుటల్లుఁడు..."కళా౪, ఆ. ౬౦.

ఇల్లటము. దే. వి. అల్లుఁ డాలితో న త్తవారింట నుండుకాఁపురము. ఆం. భా. ద్వి. ౧౧౧.

ఇల్లడ. దే. వి. (ఇల్లు+అడకము.) న్యాసము, అడిగి నపుడు మరల నిచ్చుటకై యొకరియొద్ద దాఁచిన ధనాదికము. "సీ...ఇల్లడ యిమ్మహానుభావు నిడితి మీకడ..." భార. ఆశ్ర. ౧, ఆ. ౯౩. ఆము. ౫, ఆ. ౧౩౫.

ఇల్లడధనము. దే. వి. (ఇల్లడ+ధనము.) ఇల్లడ పెట్టినసొమ్ము. "గీ...ఇల్లడధన మడఁచికొన్న, వాఁడు గార్దభత్వమును...తాల్చు..." మార్క. ౨, ఆ. ౧౧౩.

ఇల్లడమానిసి. దే. వి. (ఇల్లడ+మానిసి.) ఇల్లడగా పెట్టఁబడిన స్త్రీ. "ఉ. ఈతఁడు నాకుఁ బ్రాణ విభుఁ డీతనికిం బ్రియురాల నన్ను ము, న్నీతఁడు సూచె సీతనికి నిల్లడమానిసి నేను..." వి. పు. ౫, ఆ. ౧౫౧.

ఇల్లడము. దే. వి. అవకాశము, తెఱపి. "ఉ. పొడు వను జంపనుం జనుటపోలె నెఱింగియుఁ దాను వారితో, పెడనెడమాట లాడినను నిల్లడ మిచ్చిన ...ద్రోహి గానఁ ద, ప్పుడుగక వానిపైఁ దగులు నుత్తమసాహసదండ మెమ్మెయిన్." విజ్ఞా. ప్రా. ౯౭. ('అవకాశ' యని మూలము.)

ఇల్లడపెట్టు. దే. స. క్రి. అ. (ఇల్లడ+పెట్టు.) ఇల్లడగా నుంచు. "ఉ...సహదేవుని నిల్లడపెట్టె..." భార. విరా. ౨, ఆ. ౨౨౧. "సీ. తనకు సంజ్ఞాదేవి...ఇల్లడపెట్టుట యెట్లు మఱచె." కాశీ. ౪, ఆ. ౭౬౬. "సీ...ఇల్లడపెట్టితే యిగురుఁబోణి. విక్ర. ౭, ఆ. ౬౨.

ఇల్లడసొమ్ము=ఇల్లడధనము. "సీ. క్రయవిక్రయం బులఁ గపటంబు తలఁచుగుఁ గడఁగి యిల్లడసొమ్ము లడఁచికొండ్రు." భార. అర. ౪, ఆ. ౨౯౪.

ఇల్లరి. దే. వి. (ఇల్లు+అరి.) ఇంటిపన్ను. "సీ... గృహభాగధేయమా నిల్లరి యన..." ఆం. భా. ద్వి. ౧౯౨.

ఇల్లఱికము=ఇల్లటము. (శ. ర.)

ఇల్లవ. దే. వి. ఒకజాతిచేప. (శ. ర., బ్రౌ.)

ఇల్లాపె. దే. వి. (ఇల్లు+ఆపె.) గృహిణి, భార్య. "శా. వాపోచున్ తుధుఁ గుంది చాల సుతు లవ్వా బువ్వ బువ్వంచు ని, ల్లాపెన్ జీర్ణపటాప కర్షములు నుడ్డాడింపఁగాఁ జూచి గా, కాపన్నుం డు మనీషి భీతిలి పరం బాదేహి యన్వాక్య మేఁలా పల్కుఁ దనపొట్టకై..." మల్లభూ. వై. ౨౧.

ఇల్లామల్లి. దే. విణ. (క. ఇల్లామల్లి.) కొండెగాఁడు, పిశునుఁడు. (శ. ర., బ్రౌ.)

ఇల్లాలితనము. దే. వి. పాతివ్రత్యము. "సీ...తార కే యిల్లాలితనము తగ్గె." అహ. 3, ఆ. 3౯.

ఇల్లాలు. దే. వి. (ఇల్లు+ఆలు.) **1.** భార్య, గృహిణి. "శా...మాతాతగా రత్నాకరమేఖలాపతికి నిల్లాలై తిగా గావునన్, ముత్తో వీవు..." హర. ౭, ఆ. ౧౨౫. **2.** స్త్రీ, ఆఁడుది. "మ... జగముల్ మన్నించునిల్లాలు భా, సురతన్ లే ములు వాపుతల్లి సిరి యిచ్చున్ నిత్యకల్యాణ ముల్. భాగ. ౧౦స్కం. ౧౧. **3.** పతివ్రత. (చూ. ఇల్లాలితనము.)

ఇల్లి. దే. వి. ఉపవాసము. "సీ. పస్తిల్లి నుంకు నిష్ప స్తు నిట్లనఁగను నుపవాససంజ్ఞ యై యొప్పు చుండు." ఆం. భా. ద్వి. ౧౭౫.

ఇల్లింద. వై. వి. (సం. ఇంద్రవల్లీ.) ఇంద్రవల్లి. (శ. ర.)

ఇల్లిగ్గులు. దే. వి. బ. (ఇగ్గులు+ఇగ్గులు.) మిక్కిలి వెనుక కొఱగుటలు, తగ్గఁబాటు. "క. వెల్లి

యగుగవలత్రొక్కన, నిల్లిగ్గులు గానవచ్చు హృదయములోనన్, మల్లామడి యగుమవనుఁడు, మెల్లన కూర్చుండెఁ దాల్మి మినుమిను కనఁగన్." ఉ. హరి. ౫, ఆ. ౧౧౬.

ఇల్లిముక్కు. దే. వి. (త. ఇల్లిమూక్కు.) పగిలి నెత్తురుకాఱెడి ముక్కులోపలి భాగము. (శ.ర.)

ఇల్లు. దే. వి. ఔ. 1. గృహము. "సీ. ఏకొండ యిల్లుగా నీశానుఁ డేప్రొద్దుఁ బార్వతీ సహితుఁడై పాయకుండు." విక్ర. ౧, ఆ. ౧౯౭. ఇల్లున్ వాకిలి చూచుకొను=ఇల్లు మొ. కాపాడుకొను. 'ఇల్లూ వాకిలీ' అని వ్యవహారము. "ఇల్లున్ వాకిలి చూచుకొమ్ము మదమత్తేభేంద్ర కుంభస్తనీ!" శశాం. ౪, ఆ. ౧౮౭. 2. గృహకృత్యము. "క. గొల్లఁడు వ్యాఘుఁడు రజకుఁడు, కల్లమ్మెడువాఁడు లోనుగాఁ గొందఱు దా, రిల్లాలప్పరుమం దగు, నిల్లు నడపు చనవు దాని కిచ్చిన కతనన్." విజ్ఞా. వ్యవ. ౮౦. 3. కుటుంబము. "ఆ. వలదు సీత నిచ్చి నేలినాప్తకులనాథు, కొలువుపట్టి యిల్లు నిలుపుకొనుము." రామా. ౭, ఆ. ౭౪. 4. (జ్యోతి) స్థానము, రాశి. "గీ. అష్టకళ మిత్త్రునింట హైన్యమున నుండ, నీకు సంప్రాప్త మగుఁగాక నెలకు నెలకు." కవిరా. 3, ఆ. ౧౩౩. 5. చదరంగపు గడి. (వా.) 6. మంచపుగడి. (వా.) అప. కొన్ని ధాతువులమీఁది ఇం మగాగమమునకు ఆదేశముగా వచ్చునది. ఉదా:—రంజిల్లు, మత్తిల్లు మొ.

ఇల్లుటాలు. దే. వి. (ఇల్లు+ఆలు.) ఇల్లాలు, భార్య. "ఆ...నందునియిల్లుటా, లగుయశోద..."నీలా. ౧, ఆ. ౭౧.

ఇల్లెము. దే. వి. ఒకజాతిచేఁప. "సీ...ఇల్లెపుఁ జేఁప యూకుజెల్ల." హంస. ౪, ఆ. ౧౮౭.

ఇల్వడి=ఇలువడి. అభిమానము. "ఉ. రాముఁడు పెద్దకాల మటు రావణునింట వసించియున్న యూ, కోమలి సీతఁ దెచ్చుకొని కూళిమి నొందు దలంపకున్నవాఁ, డేమిటిమర్త్యొ రాజుతుల కెక్కుడియిల్వడి యంచు దుర్జన, స్తోమము నిందసేయ..." పద్మ. ౯, ఆ. ౮. (శ. ర. పా. 'ఇల్వరుసంచు' ముద్రి.)

ఇల్వరుస=ఇలువరుస. (త. ఇల్వాకిసై.) (ఇంటిపంతు) "సీ. ఇందుల కాఁపుల నందఱఁ దొల్లి యిల్వరుస మ్రింగుచున్న..." భార. ఆది. ౬, ఆ. ౪౬౪. 2. కులమర్యాద; పాతివ్రత్యము. "ఉ. అత్తలు మామలున్ వగవ నాఱడి కోడక నాథులన్ శుగా, యత్తులఁ జేసి యిల్వరుస లాఱడి వోవఁగ..." భాగ. ౧౦, స్కా. పూ. ౯౯౪.

ఇల్వలలు. సం. వి. ఆ. స్త్రీ. బ. మృగశీర్ష నక్షత్రము యొక్క శిరోదేశమున నున్న ఐదు నక్షత్రములు.

ఇవ. వై. వి. శైత్యము. చలి. "గీ. కొన్ని దేశంబు లిరులచే గుత్తిపడియెఁ, గొన్ని దేశంబు లివచేతఁ గూడఁబడియె." కాశీ. ౧, ఆ. ౧౩౭. (ఈఁదచే' అని పాఠాంతరము.)

ఇవక. వై. వి. (సం. మిహికా.) శీతము, చలువ. "గీ...చలువ యివక, యనఁగ శీతంబు..." ఆం. భా. ప్ర. ది. ౮౦.

ఇవతల. ద్వ. వి. (ఇవలి+తల.) 1. ఈవలి ప్రదేశము. (శ.ర.) 2. ఈవలియొడ్డు. "సీ...పారసాజ్ఞ...ఇవతల యన నలరుచుండు." ఆం.భా. ప్ర. ౧౫౫. 3. ఈవలికాలము, ఈ పిమ్మట. "చ. ఇవతల నొక్కరాజు తనయింటను రత్నము పోయె నంచు నా, యవుదల నిందమోపఁ బరిహారముగా నొకజాడ నెంబడిన్, దవుల వనాంతరంబునను నన్నని మెచ్చి పురాణబుఖపుం, గవుఁ డగురామదాసు తనకన్యను రత్నము నిచ్చె బల్మిచేన్." రాధా. 3, ఆ. ౫౭.

ఇవతళించే. ద్వ. అ. క్రి. చల్లనగు. "గీ. ఇగ్రుచు కోర్కులఁ దనడెంద మివతళింప." కవిక. 3, ఆ. ౪౪౪.

ఇవతాళించే. ద్వ. అ. క్రి. (ఇవక+తాళించు.) 1. చల్లనగు. "మ. ఇవతాళించె సుగంధగంధవహ మెంతే రామపాదాబ్జ పల్లవ సంజాత పరాగచాతురి నహల్యాగౌతముల్ గూడఁగన్." దశా. ౭, అ. ౧, ఆ. ౧౭౪. 2. గడ్డకట్టు. "వ...శిశిరకాలంబునం దివతాళించు కొలంకుల

లోసనం బుక్కిటిబొంటిసీట నిశాసమయంబుల నిలిచియు..." హర. ४, ఆ. ౧४.

ఇవతాళింపు. ద్వ. వి. (ఇవతాళించు. ధా.) శైత్యము. ఆం. భా. ప్ర. ౪౧.

ఇవపుగుబ్బలి. ద్వ. వి. (ఇవము+గుబ్బలి.) మంచు కొండ, హిమవంతము. "సీ. ఇవపుగుబ్బలి బిడ్డ సవతి తమ్ముఁడు నాలపోలమువాఁ డన వఱలు శూద్రుఁడు..." వేంక. మాన. ౨౭.

ఇవపుగుబ్బలిబిడ్డ. ద్వ. వి. (ఇవము+గుబ్బలి+బిడ్డ.) పార్వతి. వేంక. మాన. ౨౭.

ఇవపుగుబ్బలిబిడ్డసవతి. ద్వ. వి. (ఇవము+గుబ్బలి+ బిడ్డ+సవతి.) గంగ. వేంక. మాన. ౨౭.

ఇవపుగుబ్బలిబిడ్డసవతితమ్ముఁడు. ద్వ. వి. శూద్రుఁడు. వేంక. మాన. ౨౭.

ఇవము. వై. వి. (సం.హిమమ్.) 1. మంచు. "సీ. వేఁడి వేలు పివము వేఁటాడుపోటరి..." నీలా. 3, ఆ. ४౫. 2. చలి. "గీ. కొన్ని దేశంబు లివముచేఁ గొంకుఁబోయె." కాశీ. ౧, ఆ. ౧3౭. 3. చల్ల దనము. "ద్వి. పన్నీటియివము కప్రముమీఁది చలువ." ద్వి. పరమ. ౨, ఆ. ౫౭. పు. విణ. చల్లనిది. (చూ. ఈము.)

ఇవముకొను. ద్వ. అ. క్రి. (ఇవము+కొను.) 1. కొంకరలువోవు. "గీ. ఎండ సెండితి మంచున నివము కొంటి, వానఁ దడిసితి సీతున వడఁకుచుంటి." కాశీ. ౬, ఆ. ४४. 2. చలిచే బాధపడు. "గీ. చంద్రబింబాస్య కుచశైలజన్మభూమి, గాన రారూపుఁబోలె సక్కడిఁదిచలికి, నించుకంతయుఁ గంపింప దివముకొనుచు, ముజ్జగంబులు పచరింప మూఁటి లెక్క." పాండు. ४, ఆ. ౫.

ఇవముగొను=ఇవముకొను. 1. తడియు, నాను. "చ. అవిరళ పుష్పరేణుయుతమై పొలుపొందు మరందవృష్టిచే, నివముగొనంగ..." కళా. ४, ఆ. ౪౦. 2. (తేమచే నిండు.) "గీ. ఎపుడు నెడయానిచీఁకట్ల నివముగొనుచు, నొంటిఁ జొర రానియట్లుగా నుండె మఱియు." య. ౧, ఆ. ౧౧౬.

ఇవముమేపరి. ద్వ. వి. (ఇవము+మేపరి.) సూర్యుఁడు. అచ్చ. యు. 3౧౧. ఇట్లే. ఇవముసూడు. అచ్చ. కిష్కి. ౧. 3౯.

ఇవల. దే. వి. ఈవలిభాగము. "క. కనక మసంఖ్యము మోపులు, గొనివచ్చె నతండు మంచుకొండ యివలకుఁ." భార. అశ్వ. ౧, ఆ. ౬3. 2. ఈవలికాలము. "గీ. ఇవల నేఁడుదరంబుల నవల నేఁడు, దరములను బిత్రువర్గంబు నరుఁడు గంగ, నాడి శుచిఁ జేయు..." భార.అను.౧,ఆ.౧౧౦.

ఇవిరించు. దే. అ. క్రి. 1. చిగిరించు. (శ.ర.) 2. ఎట్టి నగు. (శ.ర.)

ఇవురఁబొఱు. దే. అ. క్రి. (ఇవురక్+పొఱు.) ఇంకు. "సీ...ఇవురఁబొఱిన మహార్ణవము కరణి." భార. ద్రో. ౩, ఆ. ౧౨౬.

ఇవురాకు. దే.వి. (ఇవురు+ఆకు.) చిగురాకు. "గీ. పెద్ద లివురాకుఁ బట్టెన పెట్టుపడిరి." ఆము. ౫, ఆ. ౧౧౧.

ఇవురు. దే. వి. చిగురు. (చూ. ఇవురాకు.) అ. క్రి. 1. ఇగురు, ఇంకు. "సీ. కల్పాంతవాయు సఖ స్ఫురణంబున నివిరిపోయిన మహార్ణవము కరణి." భార.శల్య. ౨,ఆ.3౯. 2. సక్తమగు. "గీ. ఇంద్రియంబులు మనమునం దివురఁ జేసి." భార. శాం. ౬, ఆ. ౧౧౭.

ఇవురుఁబోణి. దే. వి. (ఇవురు+బోణి.) ఇగురుఁబోణి, మనోజ్ఞురాలగు స్త్రీ; స్త్రీ. "గీ. శీతలజలావగాహమస్నేహతువర, కందమూలఫలాశాదికదశనంబు, నేయుటకు సెట్లు దనరె శచీవిలాస, మెన్న దొరఁకొన్న నీ చిన్నెయివురుఁబోణి." కృ.శకుం. ౨, ఆ. ౭౦.

ఇవురుచే=ఇవుర్చు. (శ. ర.)

ఇవుర్చు=ఇగురుచే. (శ. ర.)

ఇవురొత్తు. దే. అ. క్రి. (ఇవురు+ఒత్తు.) పొడచూపు. "ఆ...నడలు, మురిప మెతేఁగె సిగ్గు మోమున నివురొత్తె, దోయజాస్య కలరుఁ బ్రాయమైన. వేం. పంచ. 3, ఆ. 3౦౧.

ఇవుర్వంటకము. దే. వి. (ఇవురు+వంటకము.) ఇగురు వంటకము, అత్తెసరు. "సీ. రాగిలోహండి

నన్పాప్రియి లేకుండంగ వండి దించిన యివుర్వాంట కంబు." కాశీ. 3, ఆ. ౧౨౧.

ఇవ్రుల=ఇవల.

ఇవులుచే=ఇవుల్చు. (శ. ర.)

ఇవుల్చు=ఇగులుచే. (శ. ర.)

ఇవ్వల. దే. వి. 1. ఈవల, ఈవైపు. "గీ. ఇవ్వల వ్వల దైత్యు లట్టిట్టుఁ ద్రోయ." దశా. ౯, ఆ. ౧౦౭. 2. ఈపక్షము. "క. ఎవ్వనితో నెచ్చోచ్చటం, జివ్వకుఁ జేసాఁపవలదు చే సాఁచినచో, నివ్వల నవ్వల నెవ్వరు, నవ్వక యుండంగఁ బగఱ నణఁగింపఁదగున్." కాశీ. ౧, ఆ. ౧౦౯.

ఇషము. సం. వి. అ. పుం. ఆశ్వయుజమాసము. న. ఇనుము.

ఇషిక. సం=ఇషీక.

ఇషీక. సం. వి. ఆ. స్త్రీ. 1. ఱెల్లు⚘. 2. అవురు⚘. 3. చిత్తరువువ్రాసెడుకుంచె. 4. ఒకజాతిచెఱకు⚘. 5. గజనేత్రగళము. 6. బొంతదుబ్బులోనిమొవ్వ. "ఆ. అనఘ ముంజగర్భ మగునిషీక నిదర్శ, నంబు గాఁగఁ గనుఁగొనంగ వలయుఁ, దనువు ముంజ మాత్మ దదిషీకనిష్కర్ష, విధము సుమ్ము యోగవిదుని వెరవు." భార. అశ్వ. ౧, ఆ. ౨౦౭.

ఇషీకము. సం=ఇషీక. (బొంత దుబ్బులోనిమొవ్వ.) "క. కాకుత్థ్సాన్వయనాథుఁ డి, షీకము మంత్రించి వైచెఁ జెన్నటికాకిన్." భా. రా. సుం. 3౧౫.

ఇషీకాస్త్రము. సం. వి. అ. న. బాణము.

ఇషుధి. సం. వి. ఇ. పుం., స్త్రీ. తూణీరము, అమ్ముల పొది.

ఇషువు. సం. వి. ఉ. పుం., స్త్రీ. 1. బాణము. 2. ఐదు సంఖ్య. 3. వృత్తక్షేత్రమున జీవమధ్యావధివఱకు గీచిన ఋజురేఖ. (లీలా.) 4. సంగీత శాస్త్రమున తానములలో నొక యవాంతర భేదము.

ఇష్ట. సం. వి. ఆ. స్త్రీ. శమి, జమ్మి⚘.

ఇష్టక. సం. వి. ఆ. స్త్రీ. ఇటికె.

ఇష్టకాపథము. సం. వి. అ. న. లామజ్జకము, తెల్ల వట్టివేరు. పుం. ఇటికెలతోఁ గట్టిన మార్గము.

ఇష్టగంధము. సం. వి. అ. న. 1. సూఁగుదోస⚘. 2. మంచివాసన. 3. ఇసుక. విశే. (అ.ఆ.అ.) మంచివాసన గలది.

ఇష్టగోష్ఠి. సం. వి. ఇ., ఈ. స్త్రీ. మంచిచెడ్డలు చెప్పు కొనుట. "ద్వి. గోపురంబున నిష్టగోష్ఠి నున్నెడను." బసవ. ౪, ఆ. ౧౨౭ పుట. (రూ. ఇష్టాగోష్ఠి.)

ఇష్టదేవత. సం. వి. ఆ. స్త్రీ. ప్రియదైవము. "మదిష్ట దేవత విరూపాక్షుండు." బాలసరస్వతీయము. అవతారిక., "సీ. బలదేవుఁ డొకనాఁడు పద్మా క్షుతోఁగూడ ధర్మనందను సభాస్థలికిఁవచ్చి, యిష్ట గోష్ఠిని వసియింప నారదమౌని యరుదెంచె..." దశా. ౮, అ. ౧, ఆ. ౧౫3. ఇష్టే, ఇష్టదైవము మొ.

ఇష్టభోగము. సం. వి. కోరిన సౌఖ్యమునను భవించుట. "గీ. ఇష్టభోగంబులొసఁగె ఫణీంద్రుకీల." శశాంక. పీఠి. ౪౮.

ఇష్టము. సం. వి. అ. న. 1. కోరిక. 2. కర్మము. 3. ఉపనయనాది సంస్కారము. 4. ప్రియత్వము. "మ...సంతసంబు వడి రుర్వీవంద్యు లిష్టంబునన్." భార. ఆది. ౮, ఆ. ౫౨. 5. అతిథ్యాతి విహితకృత్యము. 6. ఇటికె. విశే. (అ.ఆ.అ.) 1. కోరఁబడినది. 2. ప్రియమైనది. 3. పూజింపఁబడినది. 4. యజింపఁబడినది.

ఇష్టలింగము. దే. వి. ఇష్టదేవత. (బ్రా.)

ఇష్టసిద్ధి. సం. వి. ఇ. స్త్రీ. కోరిన కోరిక యీడేరుట. "ఆ. ఇష్టసిద్ధికొఱకు నీరాదు బీజముల్, కష్టము నను జవివి గానలేఁడు." వేమన. ౪౨౧, ౪౨౨.

ఇష్టాపత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. కోరిక దీరుట. 2. తర్కమునఁ బ్రతివాది కనువగు నాక్షేపము.

ఇష్టాపూర్తము. సం. వి. అ. న. ఇష్టమును బూర్తమును. (అగ్నిహోత్రాదికర్మ మిష్టము. వాపీకూప తటాకారామ దేవాలయ నిర్మాణాన్నదానములు పూర్తము.) విశే. కోరిక నిండఁబడినది.

ఇష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. యజ్ఞము. 2. కోరిక. 3. కత్తి. 4. యజ్ఞభేదము. 5. సంగ్రహశ్లోకము. (భాష్యేష్టి మొ.) న్. పుం. యజ్వ, యజ్ఞము చేసినవాఁడు.

ఇష్టిక. సం. వి. ఆ. స్త్రీ. ఇటిక. (చూ. ఇష్టక.)

ఇష్టికాశిల. (పారి.) కంకరరాయి, శిలావిశేషము.

ఇష్టికోల. దే.వి. యజ్ఞదండము. "సీ...ఇష్టికోలయుఁ జంక నిక్షితోలు." హర. ౭, ఆ. ౧౨.

ఇష్టిపచుఁడు. సం. వి. అ. పుం. 1. పిసినిగొట్టు. 2. రాక్షసుఁడు.

ఇష్టుఁడు. సం. వి. అ. పుం. 1. ఆప్తుఁడు. "క. విదురుఁడు...పెద్దయిష్టుఁడు మీకుఁ గా." భార. ఆది. ౮, ఆ. ౧౯. 2. చెలికాఁడు. "ఉ...పూవిలుతుఁ డిష్టుఁడు..." కేయూర. ౪, ఆ. ౧౯౨.

ఇష్మము. సం. వి. అ. పుం. వసంతఋతువు.

ఇష్మఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు.

ఇష్యము. సం.=ఇష్మము.

ఇష్వసనము. సం. వి. అ. పుం. విల్లు, ధనుస్సు.

ఇష్వాసము. సం.=ఇష్వసనము.

ఇష్వాసుఁడు. సం. వి. అ. పుం. విలుకాఁడు.

ఇష్వుఁడు. సం. వి. అ. పుం. ఆచార్యుఁడు, గురువు.

ఇసడిలు. దే.అ.క్రి. ఈసడిల్లు. (విసుగు.) "క. ఇసడిలక మఱియుఁ జనియ, వ్వసుధేశుఁడు దండకమున వర్తింపఁగఁ దా, పసహింసాపరు లగురా, క్షసు లిరువురు నేను గూడి కపటాకృతులన్." భా.రా. ఆర. ౨, ఆ. ౬. (శ. ర. వ్రాతప్రతి పా. 'విసువక మఱియుం జని' ముద్రితపా.)

ఇసిరో. దే. అవ్య. (ఇసి+రో.) ఇసీ, ఛీ. "చ... కిరీటి చే నఱుక శాంతత నొందిన సోమదత్త నం, దనుతల ద్రుంపవే మఱచి తా యిసిరో యిది పోరిపాడియే." భార. మా. ౪౪. (రూ. ఇస్సిరో.)

ఇసిఱింత. (ల.) దే. విశే. మనోహరము, సొబగైనది. "సీ. ఏపువ్వుఁబోఁడుల యిసిఱింతచూపుల ఋషు లగట్టిమనంబు లిగురువెట్టు." కాశీ. ౩,ఆ.౧౯౯. 2. చంచలము, తరళము. "క. భూపాల మెఱుఁగుఁబోఁడుల, చూపులకుం దాయునీదుసొబగట్లగుటన్, మాపిన్నది యిసిఱింతల, చూపుల నఱగంట వెఱచుచున్ నిను జూచున్." నైష. ౮, ఆ. ౬౧. (శ. ర. పా; 'మాపిన్నది యుసు వింతల' ముద్రితము. 'ఇసు వింతల' వేదం. పా. ఇతర ప్రయోగముల ననుసరించి యిసిఱింతల యనుటే గ్రాహ్యము.) "చ. మన తరళాక్షి సిగ్గుతెరమాటున ..ఇసిఱింతల చూపులఁ దన్నుఁ జూడఁగా." పిన. శశం. 3, ఆ. ౯౨.

ఇసిఱింతలువాఱు దే. అ. క్రి. (ఇసిఱింతలు+వాఱు.) చలించు, అదరు. "క. అంతట నిష్టఱు మనసులఁ, కంతుని పసఁ గలసె వింతకసమస లొలయన్, మంతనములఁ బెదవులు నిసి, ఱింతలు వాఱంగ నగవు చెప్పలు గోరన్." విక్ర. ౮, ఆ. ౮౭., హర. ౯, ఆ. ౯౧.

ఇసీ. దే. అవ్య. ఇస్సీ, ఛీ. "ఉ. బెబ్బులితోలు పచ్చడముఁ బెద్ద నిసీ యని నవ్వి..." రామా. పీఠి. ౨౬. భార. శాం. 3, ఆ. 3౯౬.

ఇసుక. దే. వి. ఏ. సికత. "గీ. శిలలఁ గాష్ఠంబులను మృత్తికలను నిసుక, లింగముల లెస్సగాఁగఁ గల్పించి భక్తి, నర్చనము సేయునతఁ డొకం డనుచుఁ జెప్ప, శివుఁడు భక్తవిమర్శన చేయు నపుడు." భీమ. ౯, ఆ. ౧౪౯.

ఇసుకగరుములు. దే. వి. (పారి.) ఇసుక నేలలకును గరుప నేలలకును మధ్యస్థముగ నుండు నేలలు.

ఇసుకతిన్నియ=ఇసుకతిన్నె. (రూ.) ఇసుకదిన్నియ.

ఇసుకతిన్నె. దే. వి. (ఇసుక+తిన్నె.) సైకతము. "సీ. ఇసుక తిన్నెలమీఁద నెక్కఁగా వలె నందు వది గోర నేమిరా మదనరూప. రాధా, ౧, ఆ. ౪౦. పాండు. ౨,ఆ.౧౯3. (రూ. ఇసుకదిన్నె.)

ఇసుకదాసరి. దే. వి. (ఇసుక+దాసరి.) సైకత శాకము, ఒకవిధమగు కూరచెట్టు. (శ. ర.)

ఇసుకదిబ్బ=ఇసుకతిన్నె.

ఇసుకదొందు. దే. వి. (ఇసుక+దొందు.) ఒకవిధమగు చేప. (శ.ర.)

ఇసుకపాఁతఱ. దే. విశే. హద్దులేనిది. "తే. అనఘ వేశ్యావిడంబవర్తనము లెన్న, నిసుకపాఁతఱ యా జోలి యేలత్రవ్వ." (వైజయంతీ విలా.)

ఇసుకపులకండము. ద్వా. వి. (ఇసుక+పులకండము.) మత్స్యండిక, ఇసుకవలెనుండు శర్కర. (శ. ర.)

ఇసుకబేలు. దే. వి. ఒకానొకతీఁగ. (శ. ర.)

ఇసుకమ్రాను. దే. వి. ఉలిమిరి, వరుణము? (శ.ర.)

ఇసుకరాజనములు. దే. వి. బ. ధాన్యవిశేషము. హంస. ౪, ఆ. ౧౨౮.

ఇసుమంత. దే. విశే. (ఇసుము+అంత.) అల్పము. "గీ. సంగతియె యోయి యిసుమంత శింగ ణావు." ఆము. ౪, ఆ. ౬౦.

ఇసుమంతలు=ఇసుమంత. "సీ...కొన్నిటి నిసుమం తలుగా నుఖుమాడి యాడి." భార. విరా. ౫, ఆ. 3౫.

ఇసుము. దే. వి. **1.** ఇసుక. "సీ. ఎల్లెడ మిన్నేటి యిసుమున నచ్చరకొమ లిడ్డ వెన్నెలకుప్ప లనఁగ." పారి. ౨, ఆ. 3౭. "గీ. ఇసుము చల్లిన రా లని బిసరుహాస్త, కరనితాంత దురంత భీకర వనంబు." రామా. ౭, ఆ. ౨౪. **2.** పొడి. "గీ. ఇసుము చేయదె గద గోప్పుఁ డెత్తుగదను." ఉ. హరి. 3, ఆ. ౭.

ఇస్మ=ఇసుము. (ఇసుక.) "సీ. ఇంద్రుఁ డంబుధిఁ బైఁడియిస్మగొల్మిని వెట్టి కరఁగించు కరువుముఖం బనంగ." మల్హ. 3, ఆ. ౧౪౨.

ఇసుల్లు. దే. వి. బ. వర్షము వెలియఁగానే దీపము చుట్టుచేరు రెక్కల చీమలు. (క్యాంబెలు.)

ఇస్త్రిరి. హిం. వి. చిన్న యినుపపెట్టెలో నిప్పులు వేసి బట్టలమీఁద రాచి నునుపుచేయుట. (వా.) రూ. ఇస్త్రీరి. "ఉ...ఇస్త్రీరి, యిచ్చినకోటు మేన ధరి, యించి భుజాన రుమాలువైచి." దాసు శ్రీరామకవి. తెలుఁగునాడు. (నియోగి ప్రశంస.) **11** పుట.

ఇస్త్రిరిమడత. ద్వి. వి. (ఇస్త్రిరి+మడత.) ఇస్త్రిరి చేసి మడత పెట్టినబట్ట. (వా)

ఇస్తిహారు. హిం. వి. **1.** ప్రకటన. **2.** ప్రకటన పత్త్రము. వ్యవ:—వేలమునకు ఇస్తిహారు కట్టి నారు.

ఇస్తిహారునామా. హిం. వి. ప్రకటనపత్త్రిక.

ఇస్లువు. దే. వి. సొత్తు, స్వామ్యము. (శ. ర. బ్రౌ.)

ఇస్సిరో. దే. అవ్య. ఇస్సీ. "శా...డాగియుండె నఁట రారా జిస్సిరో......" భార. శల్య. ౨, ఆ. ౯౮.

ఇస్సిస్సి. దే. అవ్య. ఇసిరో. "గీ. కోప ముదయిం పఁగాఁ బండ్లు కొఱుకుకొనుచు, దంభుఁ డిస్సిస్సి ...ఎడ గల్గ నుండు మనిన." ప్రబోధ. ౨, ఆ. ౧౪.

ఇస్సిస్సియగు. దే. అ. క్రి. (ఇస్సిస్సి+అగు.) అసహ్యమగు. "వ ..దిసమొలయుం డానును జూడ నిస్సిస్సియై వచ్చువీఁడు పిశాచంబు గాని రక్కసుండు గాఁడు." ప్రబోధ. 3, ఆ. ౧౨.

ఇస్సిస్సిరో. దే. అవ్య. ఇసిరో. "శా...ఇస్సిస్సిరో ...దొంగసొమ్ములకు సై యిట్లేల ప్రాల్మాలితే." విప్ర. ౫, ఆ. 3౫.

ఇస్సీ. దే. అవ్య. ఇసీ. "క. అందఱు రథికులు పఱ వఁగ, నిం దేటికి మున్ను వచ్చి రిస్సీ యని..." భార. విరా. ౫, ఆ. ౭౯.

ఇహత్యము. సం. విశే. (అ. ఆ. అ.) **1.** ఇక్కడిది. **2.** ఇప్పటిది.

ఇహము. సం. అవ్య. **1.** ఈలోకము. "ఆ. ఇహ పరముల నెసక మెసఁగ..." భార. శాం. ౫, ఆ. ౨౫౭. భో. ౨, ఆ. ౯. **2.** ఈ లోకమందలి సుఖము. "చ...వారల కెగ్గు సేసినం, జెడు నిహముం బరంబు .." భార.ఆది. ౧,ఆ.౧౩౯.

ఇహలోకము. సం. వి. అ. పుం. ఈ లోకము.

ఇహాముత్రఫలము. సం. వి. అ. న. ఇహపరలోకము లందలి కర్మఫలము. "క. క్షత్త్రియ సంస్కారము నకుఁ, బాత్త్రముగా నీవు నన్నుఁ బాటింప విహా, ముత్రఫలములకు నీకేఁ, బుత్త్రుఁడ నని వచ్చు టింకఁ బొసఁగునె చెపుమా." భార. ఉద్యో. ౪,ఆ. ౭౨.

ఇహాముత్రలు. సం. అవ్య. (ఇహ+అముత్ర+లు.) ఇహపరములు. "క...అనుపమవర్గత్రయసా, ధన మహితోద్యోగపరతఁ దనరుగృహస్థుం, డనఘ యిహాముత్రలయం,దనవరతాభీష్టసిద్ధి నభిరమ్యుఁ డగుఁ." మార్క. 3, ఆ. ౨౨౪.

ఇహీహీ. దే. అవ్య. ఇహీ. "క. మగటిమి గలరాచ చందమా యిది యిహీహీ." రామా. ౫, ఆ. ౧౪౭. వి. నవ్వుటయం దగుధ్వని కనుకరణము, "చ...ఇహిహీ యని నవ్వె..." రుక్మి. 3, ఆ. ౯౪.

ఇహీ. దే. వి. ఇహీహీ. "ఉ...ఇహీ యని భక్తులు నవ్వకుందురే." చెన్న. ౪, ఆ. ౨౧౬.

ఇళ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఇల, బుధునిభార్య. 2. ఆవు. 3. మాట. 4. ఇడ, నాడీభేదము.

## ఈ

ఈ. ఉభ. దే. ఒకానొక యక్షరము. స. దగ్గఱ నున్నదానిని దెలుపును. "ఉ...లతాంగిఁ గూర్చి గా, కీవెడమాటలన్ మరలఁడు..." భార. విరా. ౨, ఆ. ౭౦. ఇచ్చు ధాతువునకు భవిష్యదర్థక వ్యతిరేకార్థక ప్రార్థనాద్యర్థక తుమున్నర్థక ప్రత్యయములు పరమగునపు డాదేశముగా వచ్చునది. ఉదా:—ఈఁగలఁడు, ఈఁడు, ఈ, ఈన్ మొ. అవ్య. 1. సంప్రార్థమున మధ్యమపురుష 'ము, డు' వర్ణకములకు విభాష ననుప్రయుక్త మగు నది. ఉదా:...వినుమీ, వినుఁడీ. 2. ప్రశ్నించు నపుడు "ఏ" అను శబ్దమున కనుప్రయుక్తమై యర్థవిశేషములఁ దెలుపును. ఉదా:—ఏఁడీ, ఏరీ, మొ. 3. ఇకారాంత పదములకు సంబుద్ధిని విభాష నాదేశముగా వచ్చునది. ఉదా:—హరీ మొ. ప్ర. 1. కొన్ని శబ్దములకు పుంస్త్వమున మతుబర్థమందు వచ్చునది. ఉదా:—కమ్మతీఁడు. 2. కొన్ని శబ్దములకు స్వార్థమునందు వచ్చును. ఉదా:—కల్లరీఁడు. సం. వి. ఈ. స్త్రీ. లక్ష్మి.

ఈంద్ర. దే. వి. తాటిచెట్టు మొదలగునవి గీచి జీవించుజాతి, ఈడిగ. "గీ. కటకటా పద్మగర్భుఁ డెక్కడిరసజ్ఞుఁ, డీంద్రనరకని కిటువంటి తీంద్ర వయసు, టోరచూపుల సెజ్జవహాంతకారిఁ దెచ్చి, యాలుగాఁ గూర్చి పాపాత్ముఁడాయె నహహ." సురా. ౫౯.

ఈంద్రము. దే. వి. పీడనము, బాధించుట. (చూ. ఈంద్రముసేయు.)

ఈంద్రముసేయు. దే. స. క్రి. (ఈంద్రము+చేయు.) పీడించు, బాధించు. "క. మున్నెన్నదురు వదాన్యుల, నెన్నఁడుచో నిన్నుఁ ద్రిభువనేశుం డనుచున్, ఇన్నిదినంబుల నుండియు, నెన్నఁడు నినుఁ బెట్టు మనుచు నీంద్రముసేయన్." భాగ. ౭. స్కం. ౫౬౫.

ఈంద్రించు. దే. స. క్రి. ఈంద్రముసేయు. "శా. ఈరీతిం గుమతోక్తులన్ జనని త మ్మీంద్రింప నారాటమున్, బోరాటంబు ఘనంబులైన..." కాశీ. ౪, ఆ. ౫౦.

ఈఁక. దే. వి. 1. ఈఁకె, పక్షిఱెక్క. "సీ. గఱి యీఁక చట్టుప యొఱక డా కన నొప్పుఁబక్షంబు..." ఆం. భా. ద్వి ౯౯. 2. పక్షి ఱెక్క లోని భాగము. "చ...దోర్నైన యీఁ, కలుఁ బెనుగండలున్ దొరఁగఁగా ఖగదానవవీరు లిట్లు మూ, ర్ఛలఁబడి .." భా. రా. అర. ౨, ఆ. ౧౩౭., భార. ఉద్యో. 3 ఆ. ౨౯౭.

ఈఁకియ. దే. వి. ఈఁక. "సీ...నెఱసంజకాఁక సోఁకిన వెఱఁగంది యీఁకియలు ముడుచు." ప్రబంధ. ౫౯.

ఈఁకు. దే. అ. క్రి. ఇంకు. (శ. ర; బ్రౌ.)

ఈఁకె=ఈఁకియ. "ఆ. ఈఁకె లంటఁ జేసెఁ దోఁక లంటఁగఁ జేసె..." వేమన. ౨౧౫౦.

ఈఁగ. దే. వి. 1 మక్షిక. "వ...ఈఁగపుం గాటిక ..." వరాహ. ౯, ఆ. ౧౨3. "ఆ. ఈఁగ తేనెరుచికి నింపుగాఁ జచ్చును..." వేమన. ౨౫౨౦. 2. తుపాకిచివర నున్న ఉక్కుపూస. "సీ. గుఱి తప్పనీని యబ్బురపుఁ జూడ్కులు వాని యుక్కుటీఁగలమీఁద నూలుకొలిపి." రంగా. 3, ఆ. 3౪.

ఈఁగపులి. దే. వి. (ఈఁగ+పులి.) 1. ఒకజాతి సాలెపురుగు. "సీ. పాదొట్టనఁగ లూత పరఁగుఁ దద్భేదంబుదోఁచు నీఁగపులి విందుపురు గనఁగ." ఆం. భా. ద్వి ౭౭. 2. ఈఁగలకుఁ బులివంటిది—సాలెపురుగు. (శ. ర.)

ఈఁగు. దే. స. క్రి. (త. నీంగు.) 1. పోఁగొట్టు. "గీ. వీగి తనతల్లిదాస్యంబు నీఁగఁ బాని." భార. ఆది. ౨, ఆ. ౭౪. 2. తీర్చు. "ఉ...గో విందుఁడ కావు మంచుఁ బలవించుట యీఁగఁగ

రానియప్పు..." భార. ఉద్యో. ౨, ఆ. ౧౭౯. 3. తొలఁగించుకొను. "ఉ...నీ, కిచ్చు నవశ్య ముఁ జయము నీఁగుము తొల్లిటఁ బద్ధ బన్న ముఁ." భాగ. ౧౦. స్కం. ఉ. ౭౯౦. అ. క్రి. 1. చొచ్చు. "క. ఈ గంగాదిక తీర్థము, లీఁగంగా నీవు తమసమిద్ధాంబువులఁ, దోఁగెడువారల గనగనఁ, గ్రాఁగెడు నంగార సింధు కల్లోల ములఁ." పాండు. ౧, ఆ. ౧౪౦. 2. దాఁగు. "సీ. ఈగిరిరాజుపై నీఁగిరి గాఁబోలు నఖిల దేవతలు నేకార్ణవమున." ఉ. హరి. ౨, ఆ ౧౬౧. "ద్వి. ఈఁగి దిక్కరులు ఘీంకృతు లొనరించెఁ, గ్రాఁగిన యసురులగతి నబ్ధు లింకె." రం. రా. యు. 3౫3. పా. (ఈగు=ఇగ్గు అని. శ. ర.)

ఈఁచె. దే. వి. కణిశవృంతము, ఊఁచ. "గీ...ఈఁచ యనఁగఁ, గణిశవృంతంబు చెలఁగును..." ఆం. భా. ద్వి. ౨3౬.

ఈఁటెయ. దే. వి. ఆయుధవిశేషము, కుంతము. "సీ. వంకుల జముదాళ్లు వాల్బల్లెములఁ గ్రుమ్మి పయికొని పెద్దయీటెయలఁ బొడిచి." అచ్చ. యు. ౧౮౦.

ఈఁటె=ఈఁటెయ. "సీ...నేజ బరిచి యీఁటె యనంగఁ బరగుఁ గుంత, ము..." ఆం. భా. ద్వి. ౨౧౭. హరి. ఉ. ౧, ఆ. ౭3.

ఈఁటెకాఁడు. దే. విణ. (ఈఁటె+కాఁడు.) ఈఁటెతోఁ యుద్ధము చేయువాఁడు, కాంతికుఁడు. "సీ...విచ్చు, కత్తులవా రీఁటెకాండ్రట్ల వత్తిల్ల ..." రామ. ౨౦౮.

ఈఁత. దే. వి. 1. ఈఁదుట. "గీ. ఓలి నిలుచుచుఁ గరళలఁ దేలి చనుచు, మునిఁగిపోవుచు నోర్తోర్తు ముంచిపట్టి, లోఁతునకు నొయ్యఁ దిగుచుచు నీఁత లేని, యచట మిన్నక యీఁదుచు నాడి రర్థి." నిర్వ. ౭, ఆ. ౪౯. 2. ఖర్జూరిక. "సీ. ఈఁతచెట్టును లొఁతు నీఁత యనఁ జెలంగు ..." సాం. ని. మాన. ౭౭. 3. లోఁతు. 4. ఈనుట. రా. వి. 3, ఆ. ౪౫.

ఈఁతకాఁడు. దే. విణ. (ఈఁత+కాఁడు.) ఈఁదెడు వాఁడు. "వ...(పార్థుఁడు) గాంధారినిఁ గుంతి నిం గాంచి యీఁతకాఁడు తీరంబు గనిన చందంబు నొంది..." భార. అశ్వ. ౪, ఆ. ౧౬౭. "సీ. తీవ్రప్రవాహ మీఁదెడు నీఁతకాండ్రు నా..." నిరం. ౪, ఆ. ౬౯.

ఈఁతకాయ. దే. వి. (ఈఁత+కాయ.) 1. ఈఁదుటకు సహాయ మగుసొఱకాయ, ఈఁదుఁగాయ. "ఉ. కోపనశాపనవ్యశిఖి గొల్మసఁగం గసుఁగంది మ్రుంది త, త్తాపము నాఁపలేక తిమిధామజల భ్రమిఁ గూలి తూలుజు, భాపహ రాజ్యలక్ష్మి వెరవారఁగఁ దేల్పవె యీఁతకాయ రూ, పై పృథుకర్పరం బమర నాశ్రిత రక్షణ దక్షిణేక్షణా." పాండు. ౨, ఆ. ౫౭. 2. ఖర్జూరిక యొక్క కాయ. (వ్య)

ఈఁతకొట్టు. దే. అ. క్రి. (ఈఁత+కొట్టు.) ఈఁదు. (శ. ర.) ఇట్లే: ఈఁతలుకొట్టు. (వా)

ఈఁద. దే. వి. 1. చలిగాలి. "గీ. ఈఁద యన నీఁదర యనంగ నెసఁగు శీత, వాయువు..." ఆం. భా. ప్ర. ౬౦. 2. గాలి. "ఉ. ఆదురితాత్ముఁ డిట్లు మదనాంతకుపట్టణ మల్లఁ జొచ్చి పె, ల్లీఁదయు వానయుం దమము నేర్పెతుఁ గూడి జనావరోధమం, బ్రోదిగఁ జేయఁగాఁ గడచిపోవ మనం బటె ప్రాలుమాలి..." ఉద్భ. ౨, ఆ. ౭౬౦.

ఈఁదకొమరుఁడు. ద్వ. వి. (ఈఁద+కొమరుఁడు.) వాయుపుత్త్రుఁడు. 1. భీముఁడు. 2. హనుమంతుఁడు. అచ్చ. సుం. ౯౯.

ఈఁదతూపు. దే. వి. (ఈఁద+తూపు.) వాయవ్యాస్త్రము. అచ్చ. యు. ౨౬౫.

ఈఁదర. దే. వి. ఈఁద, చలిగాలి. ఆం. భా. ప్ర. ౬౦.

ఈఁదరగాలి=ఈఁదర. (వా)

ఈఁదాడు. యు. వై. వి. (సం. హింతాలః.) గిఱకతాటిచెట్టు. (శ. ర.) దే. అ. క్రి. (ఈఁదు+ఆడు.) ఈఁదులాడు. "మ. ఇల సాచి క్షమ యోగసాధనల యం దీఁదాడఁగాఁ గొంత ని, శ్చలతం జేరఁగ వచ్చు..." స. శ. ౯3. (సక్త మగు అని భావము.)

ఈఁదు. దే. అ. క్రి. ఈఁదులాడు. "గీ...ఈఁత లేని, యచట మిన్నక యీఁదుచు నాడి రర్థి." నిర్వ. ౭, ఆ. ౪౯. స. క్రి. (ఈఁది నది మొద లగువానిని) దాఁటు. "సీ. తీవ్రప్రవాహ మీఁ దెడు నీఁతకాండ్రు..." నిరం. ౪, ఆ. ౬౯. "గీ. ప్రళయకాల సముద్రముభంగిఁ బొంగి, కడు భయంకరుఁ డగుభీముఁ గడపనీఁద, పశమె..." భార. ఉద్యో. ౨, ఆ. ౧౯౦. వి. 1. వాయువు. "సీ. ఈఁదు తెమ్మెర...పోఁకుదయ్యము మింటిమాలి గాలి." వేంక. దేవ. ౧౫. "క...ఈఁ, దునకుం గాదిలి కొమరుఁడ..." అచ్చ. సుం. ౧౩౯. (శ. ర. పా. 'గాడ్పు నకుఁ' ముద్రి.) 2. ఈఁత. "వ. వేము పులుగుడు గుఱిమెద యీఁదు గేదంగి..." స్వా. ౪, ఆ. ౩౭. 3. తేమ. "శా. తారాప్రోష్ఠులఁ గాలసూతుఁడు వియద్వారాశి వేఁటాడి ప్రా, ష్ఠారంభం బనుబుట్టఁ బెట్టి నులివాయం గుంజి యీఁదాఱఁ జె, న్నారఁ బై చినజాలమో యనఁగ..." కాళ. ౪, ఆ. ౯౬.

ఈఁదుఁగాయ. దే. వి. (ఈఁదు+కాయ.) ఈఁత కాయ, ఈఁదుటకు సహాయ మగుసొఱకాయ. హంస. ౪, ఆ. ౧౭౨.

ఈఁదుఁగొయ్య. దే. వి. (ఈఁదు+కొయ్య.) ఈఁదుటకు సహాయ మగుమ్రాను. "గీ. ఈఁదుగొయ్యలు తెప్పలు నీఁదుఁగాయ, లరడ బరిగోల్లు పడవలు తరులు పుట్లు, చేపడవ లోడ లాదిగాఁ జెలఁగునట్టి, యంబుతరణంబులకు నెల్ల నధిపుఁ డతఁడు." హంస. ౪, ఆ. ౧౭౨.

ఈఁదులాట. దే. వి. ఈఁదుట. (చూ. ఈఁదులాడు.)

ఈఁదులాడు. దే. అ. క్రి. (ఈఁదులు+ఆడు.) 1. ఈఁదు. "క...బ్రహ్మాండం, బుదితము గావించి బాహ్యమున నుదితంబౌ, నుదకమున నీఁదులాడఁగ, మదిఁ దలఁచుచు నుండె దితికుమారుం డధిపా." దశా. ౩, ఆ. ౧౭౬. 2. వ్రేలాడు. "గీ. ఈఁటెపోటులఁ బడి ప్రేవు లీఁదులాడ." స్వా. ౪, ఆ. ౪౨.

ఈఁబడు. ద్వ. అ. క్రి. (ఈన్+పడు.) ఈయఁబడు. "సీ...దానవారాతిచేత ముందటన యీఁబడిన యింద్రత్వము..." భాగ. ౫, స్కం. ౨, ఆ. ౧౧౨.

ఈక. దే. అవ్య. ఇచ్చుధాతువునకు వ్యతిరేకక్త్వార్థకరూపము, ఈయక.

ఈకువ. దే. వి. తడి, ఆర్ద్రత. (శ. ర.)

ఈకె. ద్వ. స. వి. (ఈ+అక.) ఈమె. (చూ. ఆకె.)

ఈకొను. ద్వ. స. క్రి. ఈయకొను, అంగీకరించు. "చ. ఇపుడు మదీయవాక్యముల కీకొనవో యని డెందమూరకే, తెపతెపఁ గొట్టుకాడెడి..." రాధా. ౧, ఆ. ౯౧.

ఈకోలు. ద్వ. వి. (ఈకొను. ధా.) ఈయకోలు. "సీ. ఇయ్యకో లొప్పికో లీకోలు మైకోలు... సమ్మతి పేరు..." ఆం. భా. ప్ర. ౧౦౪.

ఈక్ష. సం. వి. ఆ. స్త్రీ. 1. చూచుట. 2. పర్యాలోచనము. 3. దృష్టి. "సీ. ఎవ్వనిపదము సూక్ష్మేక్షుబుధులు పునరావృత్తి శూన్యక మంద్రు తెలిసి." హర. ౪, ఆ. ౬౩.

ఈక్షణము. సం. వి. అ. న. 1. కన్ను. 2. చూపు. 3. చూచుట.

ఈక్షణిక. సం. వి. ఆ. స్త్రీ. దైవజ్ఞ, సోదె చెప్పునది.

ఈక్షించు. సం. స. క్రి. 1. చూచు. "క. ఆ పరమపురంధ్రులయం, దేపుణ్యాంగనయు భిక్ష యిడ దయ్యెఁ గటా, రేపాడి మేలుకని యే, నేపాపాత్మునిముఖంబు నీక్షించితినో." కాశీ. ౭, ఆ. ౧౪౨. 2. ఆలోచించు. "మ. భవపాశత్రుటనక్షమంబు లగునాథాగాథగాథావలుల్, చెవులారన్ వినుచుండు నెవ్వఁ డితఁ డీక్షింపన్ మహాభాగుఁడు..." ఉద్భ. ౧, ఆ. ౨౭.

ఈక్షిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కన్ను. 2. దృష్టి. "ఉ...సూక్ష్మేక్షికఁ జూడఁ గార్యగతి యిట్టిద యౌ..." హర. ౩, ఆ. ౩౯.

ఈక్షిత. సం. విశే. (బు. త్రి. బు.) 1. చూచువాఁడు. 2. ఆలోచించువాఁడు.

ఈక్షితము. సం. వి. అ. న. చూపు, దృష్టి. విశే. (అ.ఆ.అ.) 1. చూడఁబడినది. 2. ఆలోచింపఁబడినది.

ఈగడ. దే. వి. జాడ, పోకడ. "గీ. ఇచట శుచిముఖి యనుహంసియీగాగడ యొక, కొంత దొరకునో యంచు నక్కజమునందు, నొయ్య నిలిచితి..." ప్రభా. ౪, ఆ. 3; పరమ. ౫, ఆ. ౫౭, ౫౮, ౫౯.

ఈగి. దే. వి. (త. ఈగై.) 1. దానము. "క. పద నెఱుఁగ కీగి యిచ్చిన, బెదరి రనరె యిచ్చె మైనఁ బిమ్మట నగరే." భార. ఉద్యో. 3, ఆ. ౧౬3. 2. ఇచ్చుట. దానము, త్యాగము. "క. దారిద్ర్యముచేఁ గుందుచు, నేరిని నడుగంగఁ బోవ కెంతయుఁ గృశతం, గూరిన విప్రున కుర్వర,వార నిదయనీగి ఫలము వాగ్గోచరమే." భార. అను. ౨, ఆ. 3౫3.=ఈవి. (ఈ ధాతువు.) "క. ఈగికిఁ గలుచు హరిద్రా, రాగం బది నిల్వదె..." కు. సం. ౮, ఆ. ౧౬3.

ఈగికాఁడు. దే. విశే. (ఈగి+కాఁడు.) ఈవికాఁడు, దానశీలుఁడు. (శ. ర.)

ఈగిచేయి. దే. వి. (ఈగి+చేయి.) దానముచేయు హస్తము ; కుడిచెయ్యి. "సీ. అలరారు సిరి దన యడుగునఁ గూర్చి గట్టిగ నీగిచేయి మాటికొనఁ డేని." వసు. ౧, ఆ. 3౪.

ఈగిమ్రాను. దే. వి. ఔ. (ఈగి+మ్రాను.) కల్పవృక్షము. "సీ. ఈగిమ్రాన్వలె ఫలం బిడి జగి దప్పక..." నరస. ౫, ఆ. ౧౯. "సీ. ఉలుపకై యీగిమ్రాఁకులచెంతకును దానె చని యిప్ప డాదుకొం దనఁగవలసె." కువల. ౧, ఆ. ౪౬.

ఈగులకెంపు. దే. వి. (ఈగులు+కెంపు.) చింతామణి. "సీ. నిగిడి యీగులకెంపునెలకట్టు గల చోటఁ గల్వకావిరి కాఱు క్రమ్ముచోట." పాండు. 3,ఆ. ౧౫౮.

ఈచే. దే. వి. 1. వంకర. "ద్వి. కాలకౌశికుఁ డనఁ గాఁ బేరువడసి, కాలిచ. జనుచు..." ద్వి. హరిశ్చ. ఉ. ౪౯౦. 2. వ్యర్థపదము. ప్రబంధ. ౧౬. విశే. 1. శుష్కించినది. (చూ. ఈచవోవు.) 2. వ్యర్థము. (చూ. ఈచవోవు.)

ఈచేపడు. ద్వ. అ. క్రి. (ఈచ+పడు.) 1. వంకరయగు. "సీ. కాలిచవడ నింద్లకడ కేఁగి వదరుచుండెడునాఁడు వైరాగ్యనిష్ఠుఁ డయ్యె." పాండు. ౪, ఆ. ౨౧౦. 2. ఈచేవోవు.

ఈచేవోవు. దే. అ. క్రి. (ఈచ+పోవు.) 1. సన్నగిల్లు. "సీ. ఊరకాళులు నీచవోయిన చేతులు ..." ఉ. హరి. ౨, ఆ. ౧౨౨. 2. వ్యర్థమగు. "సీ. తఱితోడ విత్తినఁ దఱచుగాఁ బండుఁ జే నెప్పుడైన విత్తిన నీచవోవు." నీతిసీ. ౮3.

ఈచే. దే. అ. క్రి. (పాఁడి పసులపాలు) వట్టు, ఎండిపోవు. (శ. ర.)

ఈచేకపోవు. దే. అ. క్రి. (ఆవు మొ.) చావుదూడ వేయు, చచ్చినదూడను ఈను. (శ. ర.)

ఈచేకొనిపోవు.=ఈచేకపోవు. (నెలలు నిండక పూర్వమే పశువులగర్భము చెడు. వా.)

ఈటార్చు. దే. స. క్రి. (ఈటాఱు ధా. ప్రే.) తడిపోఁగొట్టు. "గీ. వేణి నీటార్చి సురపొన్న విరులు ముడిచి." హర. ౨, ఆ. ౧౦౭.

ఈటాఱు. దే. అ. క్రి. (ఈటు+ఆఱు.) ఎండు. తడిపోవు. "సీ. జలము లూటలు గ్రమ్మ శశికాంతపాషాణ నికరమ్ము లీటాఱె నీరదవియ." పిన. శకుం. 3, ఆ. ౨౦౨.

ఈటు. దే. విశే. 1. వ్యర్థము. (శ. ర.) 2. శూన్యము. (శ. ర. చూ. ఈటాఱు.)

ఈటువోవు. దే. అ. క్రి. (ఈటు+పోవు.) 1. వీటిఁబోవు, వ్యర్థమగు. (శ. ర.) 2. శూన్యమగు. (శ. ర.)

ఈడ. ఉభ. దే. వి. (ఈ+కడ.) 1. ఇక్కడ. "క. ఈడకు వచ్చినఁ గా దని, యూడకునుం బోక..." రాధా. 3,ఆ. ౫౪. 2. ఎఱుకి త్తలి. "గీ. ఈ డెఱుంగసివిభుఁ జూపుఁ డీడలార." భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౧౫., అచ్చ. అర. ౭౮. (ఈడె అని. శ. ర.) సం. వి. ఆ. స్త్రీ. స్తుతి, పొగడ్త.

ఈడఁబడు. ద్వ. అ. క్రి. (ఈడన్+పడు.) వెనుకఁబడు, ప్రాఁతపడు. "గీ. ఏల యెన్నోతరంబుల నీడఁబడ్డ, పెద్దవావులు శోధించి గుద్దలింప." హర. ౭, ఆ. ౧౨౮.

ఈడఁబోవు. దే. అ. క్రి. (ఈడన్+పోవు.) వెనుగియు. "ఉ. యక్షుఁడు దానవుం గదిసి యార్చి తగం గద బిట్టు ప్రేషిరన్, రాక్షసుఁ డీడఁబోక

భిదురప్రతిమానమవాఁసి ప్రేసె..." నిర్వ. ౪, ఆ. ౫౨. "శా. కూడంబాఱి సముద్ధతిం గడఁగి శర్మోపాలకుల్ మూఁక లన్లాడం దాఁకి నిశాత సాయక పటువ్యాపార ఘోరంబుగా, నీడంబోక పెనంగిరక్ ..." భార. విరా. 3, ఆ. ౧33; ౫, ఆ. ౬3.

ఈడనము. సం. వి. అ. న. పొగడుట.

ఈడము, ఈడాము. దే. వి. సింహళద్వీపము. "గీ. ఈడము వళంద బందర..." హంస. ౧, ఆ. ౧౧౨. "సీ. ఇందిరామదిరాక్షి కీడాపు నీలంపు మేడచుట్టు ప్రహరిగోడ యనఁగ." రా. వి. ౧, ఆ. ౪.

ఈడవిడుచు. దే. స. క్రి. (ఈడ+విడుచు.) దిగవిడుచు, జాఱవిడుచు. "సీ. త్రివర్గేచ్ఛ యెవ్వని చేత నీడవిడువఁ, బడు..." భార. అశ్వ. ౧, ఆ. ౭౦3. "గీ. ఈడవిడిచిన మేఁదిఁగె యింతనయము, గలిగియున్నది వాలిక గలిగె నేని, నెంత నవకమై యుండునో..." కు. సం. ౭, ఆ. ౭౦, భార. అశ్వ. ౧, ఆ. ౭౨౮.

ఈడాడు. దే. స. క్రి. (ఈడు+ఆడు.) కవియు, మార్కొను. "ద్వి. ఓడక కోడకు జేవి యుగ్ర రాక్షసుని, నీడాడి నీచెఱ నే విడిపింతు." రం. రా. అర. ౧౮౧ పు.

ఈడిక. దే. వి. 1. సరవడి, గడ్డి మొదలగువానిని దెచ్చెడి బండిపరమువంటి సాధన విశేషము. "సీ...అలరుఁ దృణాద్యానయన సాధనవిశేష సంజ్ఞ యీడిక యన సరవడి యన..." ఆం. భా. ద్వి. ౭౦౧. 2. కంపతొడుగు, విత్తనములు చల్లినతరువాత చేను చదునుచేయుటకై పైన ఈడ్చు ముండ్లకంప. "సీ...తొడుగుట్టి యీడిక సుడుము కంప, యనఁ దనర్చును గంటకాది భారము..." ఆం. భా. ద్వి. 3౮.

ఈడిగ. దే. వి. ఈండ్రజాతి. "గీ. చిఱుతపగలాఁడి నీడిగచిగురుఁబోఁడి." సురా. ౪౪.

ఈడిగిలఁబడు. ద్వ. అ. క్రి. (ఈడిగిలన్+పడు.) 1. వెలికిలఁబడు. "సీ. ఈఁదు చకోరంబు లెగుర ప్రేఁగె యీడిగిలఁబడునట్లుగా దలముకొనుచు. గీ...నిండారువెన్నెల నిట్టవాడిచె." నిర్వ. ౬, ఆ. ౫౬. 2. (భయాదులచే ముందునకు రానని) చదికిలఁబడు. "సీ. తిగిచిన రాక యీడిగి లంబడుచును లజ్జాలసత్వమున మల్లాడి యీడి." ప్రభా. ౫, ఆ. ౭౮.

ఈడిగిలు. దే. అ. క్రి. ఈడిగిలఁబడు, చదికిలఁబడు. "క. నిను విడిచినఁ గొంపోయినఁ, బని కొదవలు లేమి సరియె పత్త్రిక చేఁజి, క్కినయది నీ విఁక నీడిగి, లిన నొచ్చుట మీఁదుమిక్కిలి వివేకింపక్." ప్రభా. 3, ఆ. ౧౪౫. "చ... ఆ, మెనసరి వక్కురాలు మొఱవెట్టుచు నీడి గిలక్ ..." జై. ౨, ఆ. ౧౧౧.

ఈడిగిల్లు=ఈడిగిలు. (రూ.)

ఈడితము. సం. విణ. (అ.ఆ.అ.) స్తుతింపఁబడినది.

ఈడు. దే. అ. క్రి. 1. సాఁగు. (శ. ర.) 2. జాఱు. (చూ. ఈడవిడుచు.) స. క్రి. పిదుకు. "వ. గోవులకుం గ్రేపుల విడువకయుం విడిచి విడిచి యీడకయు నీడి యీడి యీడినపాలు కాఁపకయు ..." భాగ. ౧౦. స్కం. పూ. ౯౬౬. వి. 1. వయస్సు. "గీ. రాగమంజరి యన నొప్పు రాజసుతయుఁ, దాను నొకయీడు గాఁగ... పెఁగి." విక్ర. ౧, ఆ. ౧౧౬. 2. యౌవనము. "గీ. ఈ డనంగను బ్రాయమై...అలరు నీడు, పాయ మన జవ్వన మన యౌవనము శర్వ." ఆం. భా. ద్వి. ౧౧౭. 3. సామ్యము. "క. చూ చెదరు గాని సభికులు, నీచిన్నికుమారకులకు నీ మల్లురకుక్, ఓచెల్ల యీడు గా దని, సూచింపరు..." భాగ. ౧౦. స్కం. పూ. ౧3౫౧. రాధికా. ౧, ఆ. ౬౯. 4. అధి, తాకట్టు. "సీ... ఈ డనంగను నాధి చెలంగుచుండు." ఆం. భా. ద్వి. ౨౭౯. విణ. 1. సమానము. "ఆ. భూతములకు దుఃఖములు వాపికొనుటకు, నేవిధములు గంగ కీడు గావు." భార. అను. ౨, ఆ. ౧౦౬. 2. అనుగుణము. "ఉ...నీ, పేర్మికి నీడె దుర్దశల పెల్లునకుక్ దురపిల్లు టారయక్." భార. విరా. ౧, ఆ. ౫౧. 3. శక్యము. "క. ఓడక నినుఁ బొగడఁగ నా, కీడగుఁ గా దని తలంపక..." శివ.సా.౯. 4. వయోరూపములఁ దగినది. వ్యవ:- ఈ పిల్ల యాతని కీడు.

ఈడుచు. దే. స. క్రి. (ఈడు ధా. ప్రే.) తిగుచు, లాగు. "సీ. శరభసింహమదేభసమితి నీడిచి తెచ్చి గట్టిగా దామెనఁ గట్టివైచు." ఉ. రా. ౨, ఆ. ౧౪౭.

ఈడుజోడాడు. దే. స. క్రి. (ఈడు+జోడు+ఆడు.) ఎదుర్కొను. "వ...దరస్మితవ్రీడాభరంబు లీడుజోడాడ..." శుక. ౧, ఆ. ౧౩౩.

ఈడుజోడు. దే. విణ. (ఈడు+జోడు.) సమానము. "గీ. కలిమిబలిమిని నీకు లోకములయందు, నీడుజోడును లేరుగా యింద్ర .." దశా. ౨, అ. ౧౦., పాండు. ౧, ఆ. ౪౬.

ఈడుపడు=ఈడ్వడు. "గీ. ముదిత యొక్కతె మోదుగుమొగ్గఁ గాంచి, యెలమిఁ జిలుక నిదొండపం డిడఁగఁ జనియె, గమనవాగ్వక్రతావిభ్రమములు ముఖము, నీడుపడఁ దోఁటలోఁ గ్రీడలాడునెడల." శ్రీరాధా. ౨, ఆ. ౧౪౬.

ఈడుపు. దే. వి. (ఈడుచు. ధా.) లాగుట, ఆకర్షణము. "సీ. శిబికావతంసరాజిత పదాబ్జములకా యీడుపు..." సా. 3, ఆ. ౧౭. 2. విలంబనము, ఆలస్యము. (శ. ర.) బ. బుగడలగొలుసు, కర్ణాభరణవిశేషము. (శ. ర.)

ఈడుమీఱు. దే. అ. క్రి. (ఈడు+మీఱు.) 1. వయసు వచ్చియుండు. "సీ. ఈడుమీఱె ననంగ నీడేఱె ననఁగను వయసు వచ్చె ననుట వఱలు నెందు." ఆం. భా. త్రి. ౯౪. 2. రజస్వల యగు. "గీ. శుభదినంబున సప్తమశుద్ధి గలిగి, చెలఁగువేళను గుఱుమాపు చీరతోడ, సరసరుచిరాన్న భోజనోత్తరమునందు, నీ డెఱుంగని చేడియ యీడుమీఱె." రాధికా. ౧, ఆ. ౬౯.

ఈడుముంత. దే. వి. (ఈడు+ముంత.) పాలముంత, పాలుపిదుకు పాత్రము. (శ. ర.)

ఈడువచ్చు. దే. అ. క్రి. (ఈడు+వచ్చు.) 1. సమానమగు. "మ...దాడిమీ, ఫలబీజాదులు నద్రిజావయవసౌభాగ్యంబుతో నీడురాఁ, గలవో లేవో..." కాశీ. ౧, ఆ. ౧౦౦. 2. రజస్వల యగు; రజస్వల కానుండు. వ్యవ:—ఆమె యీడు వచ్చినపిల్ల. ఇంకను పెండ్లి కాలేదు.

ఈడువాఁడు. దే. విణ. (ఈడు+వాఁడు.) సమానుఁడు. "గీ. పరమపావని విశ్వప్రపంచజనని, వైన నినువంటికూఁతును గాన లేరు, గాన నానాసుపర్వులలో నపత్య, వంతు లెవ్వారు నా యీడువారు కారు." వరాహ. ౬, ఆ. 33.

ఈడుసేయు. దే. స. క్రి. (ఈడు+చేయు.) పోల్చు. "ఉ. దోసము గాదె యయ్యతివతోఁ బెఱతొయ్యలి నీడుసేసినన్." కవిక. 3, ఆ. ౨౯.

ఈడేర్చు. దే. స. క్రి. (ఈడేఱు. ధా. ప్రే.) 1. ఈడేఱఁజేయు, సిద్ధింపఁజేయు. "గీ. ఈ నృపతి కోర్కు లీడేర్పు మెట్టులైన." కళా. ౫, ఆ. ౨౧౧. 2. కాపాడు, ప్రోచు. "ఉ...నీ వెవరయ్య నన్ను నీ, డేర్పఁ దలంచి మానవునిలీవను వచ్చిన శంకరుండవో." సా. 3, ఆ. ౧౯౫.

ఈడేర్చుకొను. దే. అ. క్రి. (ఈడేర్చు+కొను. స్వార్థమున.) కార్యసిద్ధి యొనరించు, సిద్ధింపఁజేయు. "ఆ. ఇంతలావు చేసి యీడేర్చుకొని రాఁగఁ, దొల్లి యేరికైనఁ జెల్లెనయ్య, నీకుఁ జెల్లెఁగాక.." రామా. 2, ఆ. 2.

ఈడేఱించు. దే. స. క్రి. (ఈడేఱు. ధా. ప్రే.) సిద్ధింపఁజేయు, అపనయించు. "క. విశ్వామిత్రతనూజుఁడు, విశ్వేన్నతుఁ డైన ప్రాణవిభుఁడు ఘటిల్లెన్, శాశ్వతుఁడు సోమతీర్థము, హేశ్వరుఁ డిట నాప్రయాస మీడేఱించెన్." పిన. శకుం. ౪, ఆ. ౨౪.

ఈడేఱు. దే. అ. క్రి. (ఈడు+ఏఱు.) 1. సిద్ధించు. "శా...వాంఛితఫలం బీడేఱ..." వరాహ. 2, ఆ. ౧౦౫. 2. సఫలమగు. "శా...నా పడిన పాట్లీడేఱ..." కళా. ౨, ఆ. ౬౪. 3. సాంతమగు. "చ...సజ్జనుల్, పని యీడేఱక పోదురే..." మల్లభూ. నీతి. ౭౧. 4. నెగ్గు. "క... మానసభవునిపుత మీడేఱంగన్." ఉ. రా. 2, ఆ. ౪౭౧. 5. వర్ధిల్లు. "సీ. గతిలక్షణము చూచి ఘనుఁ డౌ ననిరి గాని యీడేఱఁ డని నాఁడె యెంచరైరి." సా. 3, ఆ. ౧౦౨. 6. రజస్వల యగు; యౌవనవతి యగు. "క..."

ఇ, ట్టీడేజే కట్టుదప్పిన, చేడియ కీఁకనైనఁ బెండ్లి సేయం దగదే.” య. 3, ఆ. ౧౦౦.

ఈడేఱుచు. దే. స. క్రి. (ఈడేఱు. ధా. ప్రే.) 1. ప్రోచు, కాపాడు. “ఉ...ఇ. చొప్పెరయ మారమమ్ము నొకచొప్పున దుష్టినితి నొందకుండ నీ, డేఱుపుమయ్య...” వేం. పంచ. ౧, ఆ. 30౪. 2. సిద్ధింపఁ జేయు. (చూ. ఈడేర్చు.)

ఈడ్గిలఁబడు=ఈడిగిలఁబడు. “గీ. ఆఁకటను బోవఁ జాలవే నంగడింట, గంట తాకట్టుగా నుంచి కడుపునిండఁ, గుడువు మిచ్చట నీడ్గిలఁబడి తెలాఱు, దాఁక నొఱలినఁ గలుగదు...” చెన్న. ౨, ఆ. ౪౨.

ఈడ్గిలు=ఈడిగిలు. (చూ. ఈడ్గిలఁబడు.)

ఈడ్చు=ఈడుచు. “ఉ. ఏవురు చూడఁగా సభకు నీడ్చెఁ గులాంగన నిట్లొనర్తురే.” భార. ఉద్యో. 3, ఆ. ౧౧౦.

ఈడ్యము. సం. విణ. (అ.ఆ.అ.) పొగడఁదగినది.

ఈడ్వఁబడు, ద్వ. అ. క్రి. (ఈడ్వన్+పడు.) లాగఁబడు. “వ...విరోధులచేతం బతులసన్నిధిం దల పట్టి యీడ్వంబడి వనంబున కరిగి...” భార. విరా. ౧, ఆ. 3౧3.

ఈడ్వడు. ద్వ. అ. క్రి. (ఈడు+పడు.) సాటియగు. “చ...పనసలు బోలుచుం గలుగుండ్లతోడ నీ, డ్వడు పెనుఁబండ్లు ..” ఆము. ౧, ఆ. ౬౮.

ఈతఁడు. దే. స. పు. (ఈ+అతఁడు.) ఈపురుషుఁడు. “గీ. నిర్మలస్వాదు నలినాంబునిధివిహార, మలివ యీతండు నీవును నాచరింపు.” నైష. ౫, ఆ. 3౪; ౬, ఆ. ౬౯.

ఈతగాఁడు. దే. స. పు. (ఈతఁడు+కాఁడు. స్వార్థమున.) ఈయన. (శ. ర.)

ఈతల. దే. వి. ఔ. అనా. (ఈ+తల.) 1. తరువాత, పిమ్మట. “క. తొలియుగమున శ్రీనాముఁ, గలచెలఁదియుఁ ద్రేతయందుఁ గాళింబను పా, ములఱేఁడును దానికి నీ, తలియుఁగమున హాస్తియుఁ బ్రతంబునఁ గొల్వన్.” కాళ. ౨, ఆ. ౯3. 2. ఇవతల, ఈప్రక్క. “క. ఆతల నీతలదేశము, లేతతినైనన్ సమృద్ధి నెనయఁగ ఖ్యాతిగ నిట నహిభయంబు కలుగుటకతనన్.” కాళిందీ. ౬, ఆ. ౨౨3.

ఈతలాఁతల. దే. అవ్య. (ఈతల+ఆతల.) కొంచెము హెచ్చుతగ్గుగాని కొంచెము మాలస్యముగఁగాని. వ్యవ:—నే నొకనిమిష మీతలాతల వచ్చెదను. (ఆలస్యముగా నని భావము.)

ఈతలాతలగు. దే. అ. క్రి. (ఈతల+ఆతల+అగు.) 1. తాఱుమాఱగు. “క. బలభేది భిదురధారలఁ, దలఁకనితనమానసంబు దర్పకబాణం, బుల నీతలాతలైనన్...” వరాహ. ౧౧, ఆ. ౫౫. 2. ఆలస్యమగు. వ్యవ:—నేను వచ్చుట కొంచె మీతలాతలగును. మీరు నాకోసము కనిపెట్టుకొని యుండవలెను.

ఈతి. సం. వి. ఈ. స్త్రీ. 1. కృషిని పాడుచేసెడు అతివృష్ట్యాది. “శ్లో. అతివృష్టి రనావృష్టి ర్మూషకా శ్శలభా శ్శుకాః, అత్యాసన్నాశ్చ రాజానః షడేతా ఈతయస్స్మృతాః.” 2. కొల్లమున్నగుదేశోపద్రవము. 3. అంటురోగము. 4. ప్రవాసము, ఊరు విడిచిపోవుట.

ఈలిక. సం. వి. ఆ. స్త్రీ. సహదేవి, ముత్తవపులగము.

ఈత్వరి. సం. వి. ఈ. స్త్రీ. వ్యభిచారిణి.

ఈద. దే. వి. ఒకవిధమగు ఆయుధము. “చ. పరశులు గొంతముల్ గదలు...త్రిశూలము లీదలు మండలాగ్రముల్.” కు. సం. ౧౨, ఆ. ౫.

ఈదు. హిం. వి. మహమ్మదీయుల పండుగలలో నొకటి. “సీ. తురకలయీదునందు ముదంబు గల్గెనో భక్తనిత్యోత్సవపరత మాని. సిం. నార. ౮.

ఈదృక్కు. సం. విణ. (శ.) ఇట్టిది. “వ. ఈదృగ్విధగుణాలంకారుం డైన యమ్మహాప్రధాన శేఖరునకు.” నైష. ౧, ఆ. 3౯. (రూ.) ఈదృశము.

ఈదృక్షము. సం. విణ. (అ.ఆ.అ.) ఇట్టిది.

ఈదృశము. సం. విణ. (అ.ఈ.అ.)=ఈదృక్కు. ఇట్టిది.

ఈన=ఈనె. దే. వి. 1. ఆకులనరము. "సీ. ఈనగాగ్రంబున నీన గాఁడినయంత శిలనైన మిన్నేఱు నెలవకున్నె." ఉ. హరి. ౨, ఆ. ౧౬౧. 2. చీఁపురుపుల్ల. (శ. ర.)

ఈనపుడక=ఈనప్రుల్ల=ఈన.

ఈనము. వై. విణ. తక్కువైనది. (బ్రౌ.)

ఈనరాసి. వై. వి. పూర్ణముగాపండని వడ్లరాశి. (బ్రౌ.)

ఈనాము. హిం. వి. బహుమతి నిచ్చు ద్రవ్యాది. "సీ. కరిమయూరమరాళికలకు నొయ్యార మీనా మిచ్చి నడపుసన్నంపునడపు." వరాహ. ౪, ఆ. ౧౫౯. (రూ. ఇనాము.)

ఈనిక. దే. వి. (ఈను ధా.) ఈనుట, ఈఁత. (శ.ర.)

ఈనియ. దే. వి. ఈన, ఆకులనరము. "వ. కదళీపలాశంబు నడిమియీనియ పుచ్చి..." హర. ౨, ఆ. ౧౨౫.

ఈను. దే. అ. క్రి., స. క్రి. (పశ్వాదులు.) ప్రసవించు "సీ. మానుషీక్షీరంబు నీనిన పదినాళ్లలోని ధేనువుల పాలును నపేయ, ములు..." భార. శాం. ౪, ఆ. ౨౧౦. స. క్రి. 1. కలిగించు. "సీ. అవతంసకుసుమంబునం దున్న యెలదేఁటిరుతి కించిదంచితశ్రుతుల నీన." స్వా. ౧, ఆ. ౫. 2. వెలువరించు. "చ...ఆసుమాలిపై, జడిగొనసమ్మీనుహరిశార్జ్గధనుర్గుణ..." ఆము. ౧, ఆ. ౯. వి. ఈనె. (వా.)

ఈనె. దే. వి. 1. ఈన, ఆకులనరము. "చ.. పై, పొర నడిమీనెయుం దిగిచి పొంకముగాఁ గొన గోరఁ ద్రుంచి..." సా. 3,ఆ.౧3౯. 2. అల్ప భాగము. "చ. గొనకొని రాజు లేయుశరకోటి పరస్పరఘట్టనంబులం, దునుకలు వ్రక్కలీనెలు చిదుర్పలు తుత్తుమురై పడంగ..." భో. ౫, ఆ. ౨౨. 3. చీఁపురుపుల్ల. (వా)

ఈనెగట్టు. దే. అ. క్రి. (ఈనె+కట్టు.) ఈనెవలె నేర్పడు. "ఉ...ఊనిపల్లొత్తుబు బట్టబైట నిడ నోపుచు వాతెఱ నీనెగట్టఁగా, నత్తరలాక్షి చూపులు నిజాంఘ్రిల నిల్పుచు వీథి నేఁగఁగన్." శుక. ౧, ఆ. ౫౧3.

ఈనెగాజులు. ద్వ. వి. బాలికాక్రీడావిశేషము. (శ. ర.) "సీ... ఈనెగాజులు పోటుటీనె గుజ్జంబులు నాల్గుకంబాలాట నట్టకోఁతి...తే. ఆడుకొనుచు...ప్రొద్దుపుచ్చుచుంట." హంస. 3, ఆ. ౧౪౬.

ఈనెగుజ్జము. దే. వి. బాలక్రీడావిశేషము. (చూ. ఈనెగాజులు.)

ఈపి. దే. వి. 1. ఈరు. (శ. ర.) 2. ఈఁగమలము. "ద్వి...మక్షిక మీపిఁ బెట్టె నయ్యెడల." నవ. ౫, ఆ. ౨౪౪. పు.

ఈపె. ద్వ. స. ఏ. (ఈ+అప్ప.) ఈమె. (చూ. ఆపె.) ఉ. రా. ౯, ఆ. ౯౯.

ఈప్స. సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛ, కోరిక.

ఈప్సితము. సం. వి. అ. న. 1. ఈప్స. 2. కోరిన వస్తువు. విణ. (అ.ఆ.అ.) 1. కోరఁబడినది. 2. పొందుట కిష్టమైనది.

ఈప్సితవ్యము. సం. విణ. (అ.ఆ.అ.) కోరఁదగినది.

ఈప్సువు. సం. విణ. (ఉ.) కోరువాఁడు.

ఈబరి. దే. విణ. నిష్ప్రయోజకుఁడు. (శ. ర.)

ఈబరిగొట్టు=ఈబరి. (శ. ర; బ్రౌ.)

ఈబిడ. దే. స. ఏ. (ఈ+బిడ్డ.) ఈమె. "గీ. ఈ బిడారు మృగీమద శ్రీ బిడారు." విజ.౧,ఆ.౧3౦.

ఈమిరి. దే. వి. తడి. (శ. ర; బ్రౌ.)

ఈము=ఇవము. వై. వి. 1. శీతము. "గీ...ఇవం బిగం బీము..., ఆనఁగ శీతంబు..." ఆం. భా. ప్ర. ౯౦. 2. ఇచ్చునకు వ్యతిరేకార్థకోత్తమ పురుష బహువచనరూపము, ఈయము.

ఈమె. ద్వ. స. ఏ. (ఈ+అమ్మ.) ఈ పూజ్యురాలు, ఈబిడ. "గీ. ఈమె యెూ నని చుట్టంబు లెల్లఁ బొగడ." ఉ. రా. ౧, ఆ. 3౦.

ఈయ. వై. వి. 1. ఇయ్య. (చూ. ఈయకొను.) 2. ఈ. "సీ. బలిమి నీయనిభూమివలయపతుల..." భార. ఆది. ౧, ఆ. ౭. (ఈయని=ఈని.)

ఈయక=ఈక.

ఈయకొను. ద్వ. స. క్రి. (ఈయ+కొను.) ఇయ్యకొను, అంగీకరించు. "క. లే యని యింద్రుఁడు సూత్రప్రాయముగా నిటుల నాడు పలుకున కెంతే, నీయెడ మెచ్చుచు వాసుకి, యీయకొనియె నంత నిర్జరేంద్రుఁడు కడఁకన్." దశా. ౨, అ. ౧౮౪.

ఈయకోలు. ద్వ. వి. (ఈయకొను ధా.) ఇయ్యకోలు, అంగీకారము. (శ. ర.)

ఈయది. దే. స. వి. (ఈ+అది.) ఇది. "క... ఈయది, నిర్ణయ మని పలుకఁదగునె నిండిన సభలోన్." విక్ర. ౧, ఆ. ౧౫౧.

ఈయన. దే. స. వి. (ఈ+అన్న.) ఈతఁడు. "క. ఈయనతో..." భార. భీష్మ. ౨, ఆ. ౨౫౨.

ఈయమ. ద్వ. స. వి. (ఈ+అమ్మ.) ఈమె. "క. ఈయమ నీకోడలు..." హరి. ఉ. 3, ఆ. ౨౦౬.

ఈరణ. సం. వి. ఆ. స్త్రీ. 1. పురికొలుపుట. 2. పోక.

ఈరణము. సం. వి. అ. పుం. 1. పురికొలుపుట. 2. పోక. 3. చౌటినేల. విణ. (అ.ఆ.అ.) పురికొలుపునది.

ఈరణీయము. సం. విణ. (అ. ఆ. అ.) పురికొల్పఁదగినది.

ఈర(ఱ)మి. దే. వి. 1. జొంపము, తీఁగలు మున్నగువాని గుంపు. "వ. పొదరిండ్ల యీరమి మెఱుంగున..." కళా. ౧, ఆ. ౬౨. (ముద్రి. ఈఱమి. శ. ర. పా.) ప్రభా. ౧, ఆ. ౧౩౭. 2. సాంద్రత. "ఉ...కన్నుఁగొనలం, దంకురితంబులైనదరహాసలవంబులు పద్మనేత్రయి, ట్టింతులు నేసెఁ బత్తములయీఱమిఁ గాటుకచిమ్మచీఁకటిన్." నైష. ౭, ఆ. ౧౯౩. విణ. సాంద్రమైనది. "చ...ఓడి శాత్రవుల్...చొరని యీఱమికొనలు... లేవు భూస్థలిన్." వి.పు. ౧, ఆ. ౪౪.

ఈర(ఱ)ము. దే. వి. (త. ఈరమ్.) కుంజము, పొద. "ద్వి. బీరముల్ మెచ్చుచు భేదింపరాని, యీరముల్ చొచ్చుచు..." రం. రా. ఆర. ౧౫౦ పు. "క. ఈఱము లారట నొందక, తూఱుచు..." వెం. పంచ. ౪, ఆ. ౨౭౧. విణ, సాంద్రమైనది. "ఉ. ఈరపుమోకమావి గమియిక్కవ గొజ్జెఁగలందు జాజుప, న్నీరులయేట..." కవిక. 3, ఆ. ౧౧౫. "గీ. తఱచు వెన్నెలగుంపులఁ దారితారె, యీఱ మగు వెన్నెలలలోనఁ దూఱి తూఱి." విక్ర. ౬, ఆ. ౭౧.

ఈరములుపట్టు. దే. అ. క్రి. (ఈరములు+పట్టు.) పొదలచాటున డాఁగియుండి బాటసారులఁ గొట్టి ధనాదుల నపహరించు. "ఉ. బాధులఁ దిట్టి సజ్జనుల బాధలఁ బెట్టి యనాథకోటిఁ బెం, బందెలు సుట్టి యీరములుపట్టి పథంబులు గొట్టి దిట్టయై, నిందల కోర్చి సాధులకు నిందితుఁడై గడియించు విత్త మా, సుందరి కిచ్చి మచ్చికలు సొంపెడఁ గూర్చి వసించె దత్కృపన్." భాగ. ౬, స్కం. ౧౦౭.

ఈరస. వై. వి. (సం. ఈర్ష్య.) 1. ఈర్ష్య, అసూయ. (వ్య) 2. ద్వేషము, పగ. "మ. వెస ఖండించు నదల్చుఁ ద్రుంచుఁ జఱచున్ ద్రెయ్యున్ వెసం జీఱు నీ, రసతో నొంచుఁ బరాభవించుఁ గలఁచున్ రౌద్రంబుతోఁ దాఁకు..." భా. రా. యు. ౧౯౭౪. 3. క్రోధము, కోపము. (చూ. ఈరసించు.)

ఈరసపడు. వై. అ. క్రి. (ఈరస+పడు.) అసూయ చెందు, ఓర్వలేకపోవు. "క. నా రూపమునకు మదిలో, నీరసపడుచున్న వాఁడు హృదయేశ్వర..." కాశీ. ౪, ఆ. ౧౫౨.

ఈరసమాడు. ద్వ. స. క్రి. (ఈరసము+ఆడు.) తిరస్కరించు, త్రోసిరాజను. "క. కుందనపుఁ గామాళంబులు, పొం దెఱుఁగక యొన్ని బిరుదములు పలికినఁ ద, మ్ముందదుకు లన్నుచు నాలిక, నిందీవరనయనజంఘు లీరసమాడున్." వరాహ. ౧౧, ఆ. ౪౪.

ఈరసము. వై. వి. 1. అసహనము, అసూయ. "గీ. కడుదయాళురు దేవతాగణములెల్లఁ, గాలభైరవుచిత్తంబు కఠినపాక, మీరసము పెద్దదుంతి విఘ్నేశ్వరునకుఁ, గాళి మనబోంట్ల కెల్లను గాని బ్రతుకు." భీమ. ౫, ఆ. ౧౯౯., భార. శాం. 3, ఆ. ౭౦. 2. ద్వేషము, పగ. "క. పెక్కండ్రతోడ నీరస, మొక్కటఁ దలఁచిన కొనక..."

భార. శాం. 3, ఆ. ౨౯౬. 3. కోపము, క్రోధము. "గీ. ఈరసము తలపోయక యావు తొల్లి, మె లఁత ప్రీతితోఁ జేసిన మేలు దలఁచి, యకట యిచ్చోట నడఁచితి ననుచు దాని, నిక్క మెఱిఁగింపు మని చాఁగి మ్రొక్కుటయును." దశ. ౬, ఆ. ౧౧౪. 4. పట్టుదల, చలము. "సీ. ధరణీశుఁ డనరాదు తనకు నోడితి నన్న దాఁక నీరసమున వీఁకఁ జూపు." ఉ. రా. 3, ఆ. ౧౦౧. "క. వారును ముందటిమార్వురు, నీరసమున నొక్కపెట్ట యేయఁగ..." భార. భీష్మ. ౨, ఆ. ౧౮౦.

ఈరసమెత్తు. ద్వి. అ. క్రి. (ఈరసము+ఎత్తు.) అసూయపడు, ఈర్ష్యాగ్రస్తులగు. "ఉ...వారు మ, మ్మీరసమెత్తి కీడ్పఱచి యింతలు సేసిన..." భార. ఉద్యో. 3, ఆ. ౭౪.

ఈరసించు. వై. అ. క్రి. 1. ఈర్ష్యపడు, అసూయ చెందు. (శ. ర.) 2. ద్వేషించు, పగగొను. (శ. ర.) 3. కోపించు, కుపితుఁడగు. "ఉ...ఆ, ఈ విభుఁ డీరసించెను గదయ్య నిమిత్తము లేమి నీపయిన్." వేం. పంచ. ౧, ఆ. ౪౩౮.

ఈరాఱు. దే. స. (ఈరు+ఆఱు.) పండ్రెండు. "గీ. పరగు నీరాఱు పండ్రెండు బార యనఁగ." ఆం. సం. మాన. ౪౩.

ఈరిక. దే. వి. 1. అంకురము, మొలక. "క. కోరి కలఫలము వలపుల, యీరిక..." శ్రీరాధా. ౪, ఆ. ౯౯౮. 2. చీరిక, చిన్న గుడ్డముక్క. (వా.)

ఈరికలీను=ఈరికలెత్తు. "చ. గొనబు వహించుఁ జూడ్కులకుఁ గోరిక లీరికలీనుచుండఁగన్." కాళిందీ. ౧, ఆ. 3౧౬.

ఈరికలెత్తు. దే. అ. క్రి. (ఈరికలు+ఎత్తు.) అంకురించు, మొలకెత్తు. "వ...అర్థిజనంబులమనంబుల ఘనంబులుగ నీరికలెత్తిన కోరికలు సారికలుగొన నొసంగుచు..." భాగ. 3, స్కం. ౫౦౭. విజ. ౨, ఆ. ౧౬౪.

ఈరిణము. సం=ఇరిణము.

ఈరితము. సం. విశే. (అ.ఆ.అ.) 1. త్రోయఁబడినది. 2. ప్రేరింపఁబడినది. 3. చెప్పఁబడినది.

ఈరు. దే. వి. (క. ఈరు. త. ఈర్.) పేనుగ్రుడ్డు. "ఆ. మీర లూరకుండ రీరు దువ్వఁగఁ బేను, వచ్చు ననుట వినరె వనితలార." ప్రభా. ౫, ఆ. ౭౮. (కొంచెము కదిపిన నంతయు బయటపడు నని భావము.) "గీ. ఎలయు సీత్కారములతోడ నీళ్ల గ్రుక్కి..., నెఱులఁ గలిగిన పేల నన్నింటిఁ దిగిచె." పాండు. 3, ఆ. 30. స. 1. ద్వయము, రెండు. "గీ...రెం డీరు నాఁగ, నలరు ద్వయ మనుటకు..." వేంక. మాన. ౫౧. 2. మీరు, తమరు. "క. ఎంతకుఁ గృతకార్యుం డగు, నంతకుఁ డీ రంతకును భయుం బందక ని, శ్చింతమున నుండుఁడు..." భార. ఆది. ౭, ఆ. ౨౬౮. విశే. అల్పము, హీనము. (చూ. ఈర్పేను, ఈరెండ.)

ఈరుచు. దే. స. క్రి. (ఈర్పెనతో ఈళ్లను) ఈడ్చు. (శ. ర.)

ఈరుపెన. దే. వి. (ఈరు+పేను.) ఈళ్లను పేలను తీయు సాధనము-దువ్వెన. (చూ. ఈర్పెను.)

ఈరుపేను=ఈర్పేను.

ఈరువాఱు. దే. వి. అసివాఱు. (శ. ర.)

ఈరువు. దే. వి. ఎఱచి, మాంసము. "క...పొ యీరు వెఱచి నంజుడు,...పరఁగు మాంసము..." ఆం. సం. తిర్య. ౧౮.

ఈరె. దే. వి. పంటెను జుట్టి తీసినసూలు. (శ. ర.)

ఈరెండ. దే. వి. (ఈరు+ఎండ.) బాలాతపము, లేఁతయెండ. "సీ. పాలోమి పెంచిన బాలశోక ద్వయం బలఁతియీరెండకు నల్లుసాప." హర. ౭, ఆ. ౧3౯. ఆము. ౬, ఆ. ౯౭.

ఈరెలుఁగు. దే. వి. (ఈరు+ఎలుఁగు.) హీనస్వరము. "చ...వడఁ గుంది యీరెలుం, గున..." పారి. ౪, ఆ. ౨౧.

ఈరెలుఁగుపడు. ద్వి. అ. క్రి. (ఈరెలుఁగు+పడు.) గద్గదకంఠుఁడగు, హీనస్వరుఁడగు. "గీ. నరసి, ప్రాలినబొమ లెత్తి పరమవృద్ధు తలవడంకఁగ నొయ్య నీరెలుఁగుపడుచు, నంబి నెమ్మోము దేరకొనంగఁ జూచి, శివునికారుణ్య మనుచు నాశీర్వదించె." హర. ౨, ఆ. ౪౮.

ఈరేడు. దే. స. (ఈరు+ఏడు.) పదునాలుగు. "క. బాడబదహనుఁడనై వెస, నేడు సముద్రములజలము లేఁ గ్రోలుదు నీ, రేడుజగంబులు విలయముఁ, గూడునెడం దజ్జలములు గొనకొని విడుతున్." భార. ఆర. ౪, ఆ. ౭౧. భీమ. 3, ఆ. ౨౦౬.

ఈరేను=ఈరైదు. "ఉ...ఒక్కనిశాచరుఁ డాననంబు లీ, రేను ధరించినాఁడు..." భా. రా. ౨, ఆ. ౧౦౮.

ఈరైదు. దే. స. (ఈరు+ఐదు.) పది. "సీ...పదీరై దన నగు దశాభిఖ్యలు..." వేంక. మాన. ౫౨., భార. శల్య. ౧, ఆ. ౨౭౬.

ఈరైదుకడలు. దే. వి. బ. (ఈరు+ఐదు+కడలు.) దశదిశలు. "గీ. తనరు నీరైదుకడలు నా దశదిశలును." ఆం. సం. దేవ. 3౨.

ఈర్చు=ఈరుచు. (శ. ర.)

ఈర్పెన=ఈరుపెన. ఈళ్లు పేలు నీర్చెడి సాధనము, దువ్వెన. "గీ. వెలయు లీషావికర్షి యీర్పెన యనంగ." ఆం. భా. ద్వి. ౧౬౮.

ఈర్పేను. దే. వి. (ఈరు+పేను.) ఈరుపేను, చిన్నపేను. "గీ. చెలఁగి యీర్పేను మశకంబు చీమ నల్లి, యల్ప మనుబుద్ధి హింస సేయంగఁ దగదు." కాశీ. ౬, ఆ. ౭౮.

ఈర్మము. సం. వి. అ. పుం. న. వ్రణము, పుండు.

ఈర్య. సం. వి. ఆ. స్త్రీ. 1. ఈర్యాపథము. 2. ఈర్ష్య.

ఈర్యము. సం=ఈరణీయము.

ఈర్యాపథము. సం. వి. అ. పుం. 1. ధ్యానమానాదిరూపక మగు సన్న్యాసిమార్గము. 2. శ్రుతిస్మృత్యుక్తమైన క్రమప్రకారము నడచుట.

ఈర్వారువు. సం. వి. ఉ. పుం. స్త్రీ. ఉర్వారుకము, దోసకాయ.

ఈర్ష్య. సం. వి. ఆ. స్త్రీ. అసహనము, ఓర్వలేమి.

ఈర్ష్యకుఁడు. సం. విణ. (అ. క్లీ్యకా. అ.) ఈర్ష్యాళువు.

ఈర్ష్యత్. సం. శత్ర. అసూయపడుచున్న.

ఈర్ష్యాళువు. సం. విణ. (ఉ) ఈర్ష్యపడువాఁడు.

ఈర్షి్యతము. సం. విణ. (త్రి. ఆ. అ.) అసూయ గలిగినది.

ఈర్ష్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఈర్ష్యాళువు.

ఈర్ష్యువు. సం=ఈర్ష్యాళువు.

ఈఱతాఱ. దే. వి. ఊయెలవలె నూఁగుట, ముందునకు వెనుకకుఁ బోయి వచ్చుట. "క. పెనుగాలిఁ దూలు మేఘం, బనుబోలెను బక్షివిభుని భూరిబలమునన్, దన కెట్లు నరుగరాక, ద్దనుజూరథము దిరిగె నీఱతాఱలనడలన్." భా. రా. ఆర. ౨, ఆ. ౧౨౪. విణ. 1. వక్రము, కుటిలము. "గీ...ఏల, యీఱతాఱతలంపులు బీఱువాఱ." భార. అశ్వ. ౧, ఆ. ౧౦౮. "గీ. మోఱకుని చందమున నీఱతాఱచూపు, పొందవేయుని పైఁ దార్చి బ్రాహ్మణుండు, పలికె నిప్పచ్చరం బైన భాషణములఁ, బరమనాస్తికభావంబు పరిమళింప." హర. ౭, ఆ. ౧౪. 2. తాఱుమాఱైనది, వ్యత్యస్తము. "గీ. ఈఱతాఱ లనఁగను దాఱుమాఱు, లు..." ఆం. భా. తృ. ౨౬. 3. పరుషము, కఠినము. "గీ. చేఱకోలలవ్రేటుల నీఱతాఱ, యదలుపుల వాహనంబులు సెదరి పఱచె." భార. ద్రోణ. 3, ఆ. ౪౮. 4. వ్యతిరిక్తము, పొసఁగనిది. "గీ. బహువిధంబులఁ బలుకునా పలుకు లెల్లఁ, జీఁదకన్నిడి తన పెడచెవులఁ బెట్టి, యీఱతాఱలు మఱుమాట లిచ్చి యపహసించె దుర్యోధనుఁడు వేయుఁ జెప్పనేల." భార. ఉద్యో. ౪, ఆ. ౭౬.

ఈల. దే. వి. 1. (దొంగలు మొదలగువారు) సంకేతముగా నోటితో చేయుధ్వని. "గీ...ఈల, యనఁగఁ దస్కరసంకేతనినద మెసఁగు." ఆం. భా. ప్ర. ౩౨౨., ఆము. ౫, ఆ. ౬౮. 2. చిమ్మటకూఁత. (శ. ర.) 3. ఈలకూర. (శ. ర.) 4. సిగ్గు. "సీ...విడువు మీల యటంచు నొడివె పేొమ." స్వా. 3, ఆ. ౧౦౧. (శ. ర. పా. 'విడువు మాయలు' పాఠాంతరము.) 5. ఈలపెట్టుట కుపయోగించు సాధనము. "శా. ఈలల్ పీఁకెలు...." కాశీ. 3, ఆ. ౫౮.

**ఈలకఱచే.** దే. అ. క్రి. (ఈల+కఱచు.) ఇలకఱచు, ప్రాణములు బిగపట్టు. "క...అంచ, గడపంగా కీలకఱచి కాకము పాఱున్." భార. కర్ణ. ౨, ఆ. ౬౯., భార. ద్రో. ౨, ఆ. ౧౦౪. ('ఈలగఱచుకొని' ముద్రి. 'ఈలుగఱచుకొని' పాఠాంతరము.)

**ఈలకూఁతలు.** దే. వి. బ. (ఈల+కూఁతలు.) బాల క్రీడావిశేషము. "గీ. ఏలపాటలు సరిబేసు లీల కూఁత, లాదిగా శైశవక్రీడ లాడి రచట." వి.పు. ౨, ఆ. ౭౦౩.

**ఈలకూర.** దే. వి. ఒకజాతి ఉప్పనికూరాకు. "గీ. ఆలి నొల్లనివాఁడు దా నీలకూర, కుప్పు చాల లే దన్నట్లు తప్పు లేని, తప్పు గొట్టించు మమ్ము సంతతము నేమి, చెప్పుకొందుము నీతోడ సిగ్గుపడక." వరాహ. ౨, ఆ. ౪౨. (ఈలకూర కుప్పు చాల దన్నట్లు=లేనిపోనివంకలు పెట్టు అని భావము.)

**ఈలగ్రద్ద.** ద్వి. వి. ఒకజాతిడేగ. "ఆ. కొట్టి జుట్టు పట్టుకొని పోవఁ బసిబిడ్డ, లేడ నీలగ్రద్ద లేడ చెపుమ." వేం. పంచ. ౧, ఆ. ౨౯౭. విణ. గృధ్నువు, లుబ్ధుఁడు. "ఆ. ఏము నలువు రందు నెవ్వాఁడు గాఁ జాలు, నిచ్చివుచ్చుకొన్నయీల గ్రద్ద, మాకు నింపు గావు మాను మీసుద్దులు, కలహములమొగంబ కలియుగంబ." నైష. ౨, ఆ. ౧౦౨.

**ఈలపురుగు.** దే. వి. ఇలకోడి, చిమ్మట. (శ. ర.)

**ఈలి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. **1.** చిన్న చేతికత్తి. **2.** దుడ్డుకఱ్ఱ.

**ఈలిక.** సం. వి. ఆ. స్త్రీ=ఈలి.

**ఈలుగు.** దే. అ. క్రి. నీలుగు, చచ్చు. "క. పవన సుతుచేత నాభూ, ధవుఁ డీలిగనేని..." భార. కర్ణ. ౨, ఆ. ౩౮౩.

**ఈలువు.** దే. వి. **1.** కులాచారము, వంశసాంప్రదాయము. "గీ. ఇవ్విధంబున సుకుమారుఁ డీలువుడిగి, మాల చిగురాకుఁబోఁడితో మనువు మనఁగ." శివరా. ౩, ఆ. ౧౧౨. **2.** సద్వర్తనము, మంచినడవడిక. "ఉ. ఈలువు వంగడంబు గల దీజవరా లని..." వేం. పంచ. ౪, ఆ. ౯౦౨. **3.** మనస్సు. "చ...లలనానలినాస్త్రుఁడ వీవు నిన్నుఁ గ, న్గొనిన లతాంగియీలువు మనోభవుఁ డింతకుఁ గొల్లలాడఁడే." వసు. ౩, ఆ. ౯౨. **4.** మానము, అభిమానము. "ఉ...నీ, విమ్మెయి నిప్డు వేగపడి యీలువుపెం పెడలించి పోవఁగాఁ, బిమ్మటిమాట కోర్వ ననుఁ బొండిలి గమ్మటులైన మేలగున్." భో. ౨, ఆ. ౧౧౩. "సీ...ఈలువు మానంబు..." ఆం. సం. ౯౬. **5.** పాతివ్రత్యము, ఇలువడి. "క. ఇది ధర్మం బిది యీలువు, ఇది వ్రత మిది సద్వివేక మిది యాచారం, బిది దేవపూజ యధిపతి, యుదితం బాలంబు సేయ కుండుట సతికిన్." కాశీ. ౨, ఆ. ౨౬. **6.** మిక్కిలి పాతివ్రత్యము. "సీ. ఇలఁ బతివ్రతలలో నీలువు గలయట్టి తల్లివి..." కళా. ౪, ఆ. ౧౨౯.

**ఈలువుగొను.** దే. అ. క్రి. (ఈలువు+కొను.) మానము చెఱచు; రమించు. "వ...కాందిశీకు లైన వారల మీవారిం జూపెద మని తోడుకొని పోయి విజనస్థలంబుల నొడంబడకుండినఁ బుడమిం బడవైచి యీలువుగొని విడిచినం గ్రమ్మఱి తమ్ము నన్వేషించు నత్తమామలం గలసికొని తేలు గుట్టినదొంగలంబోలె మెలంగు ముగ్ధాంగనలును ..." శుక. ౨, ఆ. ౧౦.

**ఈలువుటాలు.** దే. వి. ఔ. (ఈలువు+ఆలు.) **1.** పతివ్రత. "క. పతి యున్నను బతి చచ్చిన, నితరులఁ దాఁ బొందకున్న యీలువుటాలీ, క్షితిఁ గీర్తియుఁ బిమ్మటఁ బా, ర్వతితోడ సఖిత్వమును ధ్రువంబుగఁ బడయున్." విజ్ఞా. ఆచా. ౧౧౯. **2.** (పతివ్రత యగు) భార్య. "సీ. అమరులయీలువుటాండ్రను జెఱపట్టి తఖిల లోకములకు నలఁత సేసి." భార. అర. ౨,ఆ.౬౧. **3.** మంచిగుణములుకల యాఁడుది. "చ. ఇలు గలనైన వెల్వడని యీలువు టాండ్రకుఁ దాఁపి కత్తెవై." ఆము. ౯, ఆ. ౨౦.

**ఈల్కఱచే**=ఈలకఱచు. "చ. పడి వడి యాన మీల్కఱచి పట్టుచు వాఁడును నెట్టకేలకున్." భా. రా. యు. ౮౮౬.

ఈల్గు=ఈలుగు. "గీ. ఇత్తెఱంగున నిజపుత్త్రుఁ డీల్గుట యును." భార. భీష్మ. ౨, ఆ. ౧౯౬.

ఈవ. దే. వి. ఈఁగ. "గీ...ఈవ యీఁగ యనఁగ, మక్షికకు నొప్పు..." సాం. ని. తిర్య. ౮౩.

ఈవరి. దే. విణ. (ఈవి+అరి.) ఈవికాఁడు, దాఁత. (చూ. ఈవరితనము.)

ఈవరితనము. దే. వి. (ఈవరి+తనము.) దాతృత్వము, త్యాగము. "క. సిరిరాచవేల్పు కడు నీ, వరితనమున నీటిదాల్పవలమురిసుడివాల్, దొర వంటిరెుప్పు గలదే, వరజాణ..." య. ౫,ఆ.౧.

ఈవల. దే. వి. (ఈ+వలను.) 1. ఇటుప్రక్క. (శ.ర.) 2. ఈదరి, ఇవతలియొడ్డు. "చ. అలయక సప్తవారిధుల నావలి కీవలి కొక్కరీతిగాఁ, గల యఁగ నీఁదవచ్చు..." సీతారా. 3, ఆ. ౩౯. 3. ఇటుపిమ్మట. (శ. ర.) 4. ఇక్కడ. "ఉ... వి, నావల నీవలన్ విని..." విక్ర. ౫,ఆ. ౧౫౮.

ఈవలవలసేయు. దే. స. క్రి. (ఈవల+అవల+చేయు.) తలక్రిందుచేయు. "సీ. పశ్చిమోత్తర పూర్వపాథోధిపర్యంత మఖిలదిక్కుల నీవలవల సేసి." భా. రా. యు. ౨౬౩.

ఈవలావలగు. దే. అ. క్రి. (ఈవల+ఆవల+అగు.) తలక్రిందు లగు. "చ. అదలుపులం బ్రచండ మగునార్పుల లంకయు నీవలావలై, కదలిన భంగి..." భా. రా. యు. ౧౩౧౯.

ఈవి. దే. వి. 1. ఈగి, దానము. "గీ. అడుగక యమున్న యీవి భాగ్యంబుగాదె." నైష. 3, ఆ. ౫౩. 2. వరము. "గీ. వెలయు నజుని వరముల గర్వింపవలవ, దట్టి బ్రహ్మను బుట్టించు నతఁడె యితఁడు, అట్లు గావున నాదేవుఁ డలిగె నేని, పద్మజునియీవు లెందుకుఁ బనికిరావు." శతకంఠ. ౨,ఆ. ౧౬౯. 3. పారితోషికము, బహుమానము. "ఉ. మెచ్చుల కెంతకార్య మిది మేకొని యేనిపు డీవు లందఁగా, నిచ్చటి యచ్చరల్ నగరె..." చంద్రా. 3, ఆ. ౮౬.

ఈవికాఁడు=ఈగికాఁడు. (శ. ర.)

ఈవిమ్రాను=ఈగిమ్రాను. "సీ. పచ్చటా తళుకుఁ జిప్పరకోళ్ల సకినలమంచంబుపై నీవిమ్రానికమ్మ, విరిశయ్య..." దశా. ౮, ఆ. ౧౦౭.

ఈవిల. సం. వి. ఆ. స్త్రీ. ఈలి.

ఈవు. దే. స. నీవు. చెన్న. ౨, ఆ. ౨౭౦. (ఇది నీవులోని ఆద్యక్షరము లోపించినరూపము. ఇట్లే మీరు, మీరలులో ఆద్యక్షరము లోపింపఁగా, 'ఈరు, ఈరలు' అగును. భార. విరా. ౫,ఆ.౧౨౩; భార. ఆది. 7, ఆ. ౨౧౯. 'నీకు, మీకు' అను వానిలో ఒక్కొక్కప్పు డిట్టిలోపమే కలుగఁగా 'ఈకు' అను రూపము వచ్చును. చంద్రా. 3, ఆ. ౧౯; శివరా. ౮, ఆ. ౬౩.)

ఈవుత. దే. ద్రు. ఇచ్చుత. (ఇచ్చున కాశీరర్థకము) "చ...చిరాయు వీవుతన్. ఉ. రా. ౧, ఆ. ౫.

ఈవులకెంపు. దే. వి. (ఈవులు+కెంపు.) చింతామణి. (చూ. ఈగులకెంపు.)

ఈవులమొదవు. దే. వి. (ఈవులు+మొదవు.) కామధేనువు. (శ. ర.)

ఈవులమ్రాను. దే. వి. కల్పవృక్షము. "క...ఈ, వులమ్రాను తెల్లమ్రా ననఁ, జెలఁగును కల్పక సమాఖ్య." ఆం. భా. ప్ర. ౫౭.

ఈవులరతనము. ద్వ. వి. (ఈవులు+రతనము.) చింతామణి. "సీ. సకలవిద్వత్సువాృత్సంఘాత మున కేపురమతల్లి యీవులరతన మయ్యె." విజ. ౧, ఆ. ౮౧.

ఈశ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఐశ్వర్యము. 2. ఐశ్వర్యవంతురాలు. 3. గౌరీదేవి. 4. ఈష.

ఈశనము. సం. వి. అ. న. ఐశ్వర్యము.

ఈశవాచకము. సం. వి. అ. పుం. శిరీషము, దిరిసెనపు.

ఈశానదిక్కు. సం. వి. క్. స్త్రీ. తూర్పునకు ఉత్తరమునకు నడిమిదిక్కు.

ఈశానము. సం. వి. అ. పుం. 1. పదునొకండు అనుసంఖ్య. 2. ఆర్ద్రానక్షత్రము. న. 1. కాంతి, ప్రకాశము. 2. ఈశ్వరుని యైదుముఖములలో నొకటి.

ఈశాని. సం. వి. ఈ. స్త్రీ. 1. దుర్గాదేవి. 2. బూరుగుపు.

ఈశానుఁడు. సం. వి. అ. పుం. 1. రాజు. 2. శివుఁడు. 3. ఈశానదిక్పాలకుఁడు. విణ. (అ. ఆ. అ.) ఐశ్వర్యశీలుఁడు.

**ఈశి.** సం. వి. ఈ. స్త్రీ. ఈశునిభార్య, పార్వతి.

**ఈశిత.** సం. వి. అ. న. ఈశిత్వము. విణ. (ఋ. త్రీ. ఋ.) ఒడయఁడు, ప్రభువు.

**ఈశిత్వము.** సం. వి. అ. న. శివునియష్టైశ్వర్యముల లో నొకటి.

**ఈశుఁడు.** సం. వి. అ. పుం. **1.** ప్రభువు. **2.** యజమానుఁడు. **3.** భర్త. **4.** శివుఁడు. **5.** ఈశానదిక్పతి. **6.** నాయకుఁడు.

**ఈశ్వర.** సం. వి. అ. పుం. ప్రభవాదులలో నొక సంవత్సరము. ఆ. స్త్రీ. **1.** దుర్గ. **2.** లక్ష్మి.

**ఈశ్వరప్రియములు.** సం. వి. అ. పుం. బ. ధాన్యవిశేషము. "సీ. ఏలికరాజనా లీశ్వరప్రియములు..." హంస. ౪, ఆ. ౧౭౭.

**ఈశ్వరవల్లరి.** సం. వి. వి. ఈ. స్త్రీ. లింగిని, లింగిదొండ ✽.

**ఈశ్వరి.** సం. వి. ఈ. స్త్రీ. **1.** దుర్గ. **2.** లక్ష్మి. **3.** లింగినీలత. **4.** క్షుద్రజటాలత. **5.** వంధ్యాకర్కటీలత. **6.** నాకులీవృక్షము.

**ఈశ్వరుఁడు.** సం. వి. అ. పుం. **1.** యజమానుఁడు. **2.** రాజు. **3.** భర్త. **4.** శివుఁడు. **5.** పరమేశ్వరుఁడు. **6.** మన్మథుఁడు. **7.** పరమాత్మ. విణ. (అ.ఆ., ఈ.అ.) **1.** ప్రభువు. **2.** ధనవంతుఁడు. **3.** సమర్థుఁడు.

**ఈశ్వరేశ్వరి.** సం. వి. ఈ. స్త్రీ. అంబిక, పార్వతి.

**ఈష.** సం. వి. ఆ. స్త్రీ. **1.** లాంగలదండము. **2.** నూటయెనుబదియెనిమి దంగుళముల ప్రమాణము.

**ఈషణము.** సం. వి. అ. న. త్వర. ఇచ్ఛ. (ఈషణత్రయము : విత్తేషణము, పుత్రేషణము, దారేషణము.) "ఆ. ఈషణత్రయంబు నెడపంగ నేరక, మోహరాశిలోన మునిఁగియుండు, జనులకెట్లు మోక్షంబు గల్గురా..." వేమన. ౪౭౧. (రూ. ఇషణము.) విణ. (అ.ఆ.అ.) **1.** త్వరపడునది. **2.** త్వరపెట్టునది.

**ఈషత్.** సం. అవ్య. ఇంచుక, కొంచెము. ఉదా :— ఈషద్భేదము.

**ఈషిక.** సం. వి. ఆ. స్త్రీ. **1.** ఏనుఁగుకనుగ్రుడ్డు. **2.** చిత్తరువు వ్రాయుకుంచె. **3.** ఒకవిధ మగు వస్త్రము.

**ఈసడము.** దే. వి. దూఱు, నింద. "సీ...ఈసడమీసడింపు. నా నపవాదసంజ్ఞయై యలరుచుండు." ఆం. భా. ప్ర. ౧౧౫.

**ఈసడచేయు.** దే. స. క్రి. (ఈసడము+చేయు.) ఈసడించు, నిరసించు. 'క. ఆ సమయంబున గుణవతి, యాసురచనసాశ్వలంక్రియా సాహిత్యం, బీసడచేసి నిజేష్టన, సాంద్రస్వాంతప్రవృత్తియై వర్తిల్లెన్." కాళిందీ. ౨, ఆ. ౩౯.

**ఈసడించు.** దే. అ. క్రి. విరోధించు, పగగొను. "సీ. ఇది తమ్మికంటిపై నీసడించిన నిశాధవుఁ ద్రోలు లోకబాంధవుని పొడుపు." వసు. ౪, ఆ. ౫౬. స. క్రి. **1.** దూఱు, నిందించు. "ఉ. ఆసువతిం గనుంగొని తదంగన యప్పుడు హెచ్చి నట్టిపే, రీసున నీసడించుచు నొకించుక నీకును సిగ్గు లే దొకో, దోసము గాదె యిద్దఱు వధూవరు లేకత మున్నచోటికిన్, డాసిన..." కళా. ౩, ఆ. ౨౧౪. **2.** నిరసించు, తక్కువపఱచు. "సీ. చతురభాషామనీషా విశేషాప్తిచే నెభోగి యాభోగి నీసడించు." నరస. ౧, ఆ. ౧౧. **3.** రోఁతగొను, అసహ్యించుకొను. "గీ. అంతనొకనాఁడు నిర్మలస్వాంతమాని, మాళి భుజియింపఁ బాత్రలో వ్రేలు దునిసి, పడిన మది నీసడింపక కడకుఁ దిగిచి, వైచి భుజియించె నప్పతివ్రతల తల్లి." పాంచా. ౩, ఆ. ౪౬.

**ఈసపిట్ట.** ద్వ. వి. ఒకజాతిచేఁప. (శ. ర; బ్రా.)

**ఈసు.** వై. వి. (సం. ఈర్ష్య.) **1.** అసూయ, ఓర్వలేమి. "క. ఈసున దుర్యోధన దుశ్శాసనులొగిఁ బాండవులకు సభలో సెగ్గుల్, చేసిన విని వారల నను, శాసింపఁగ వలవ దనఁగఁ జనదే నీకున్." భార. ఆర. ౧, ఆ. ౩౮౩. **2.** కోపము, క్రోధము. "ఉ...ఆ, భూసురుఁ డీసు వెంచి మునిపుత్త్రకుఁ బాసి తొలంగె వెండియున్." పాండు. ౫, ఆ. ౨౨౭. **3.** ద్వేషము, పగ. "ఉ...అమ్మహా, క్రూరుఁడు కంసుభార్య తన

కూఁతురు గావున దానిసంతత, ప్రేరణ నా కుపద్రవము పెక్కువిధంబులఁ జేసె నీసునన్." భార. సభా. ౧, ఆ. ౧౧౩. 4. చలము, పట్టుదల. "చ. వనజదళాక్షు నవాజగతిపారలవర్ష్మము లీ వెఱింగి యీ, సునఁ బగఁబట్టునీదివిజసూదనుఁ జంపితి గాన యింక క్రో, ధన మగు..." భాగ. 3, స్కం. ౭౦౭. 5. నింద. (చూ. ఈసుపడు.)

**ఈసుకాఁడు.** వై. విణ. (ఈసు+కాఁడు.) ఈర్ష్యాళువు, ఉడుకుఁబోతు. (శ. ర.)

**ఈసుపడు.** వై. అ. క్రి. (ఈసు+పడు.) నిందనొందు, దూఱువడు. "గీ. ప్రథమమున నీవు చేసినబాస నమ్మి, మోసపోయితిఁ గులమును దీసువడితి." శివరా. 3, ఆ. ౧౭౯.

**ఈసువాఁడు=ఈసుకాఁడు.** "సీ....శల్యుఁ డతిరథుండు, గీ. వాసుదేవుతోడి యీసువాఁ డల్లుర, విడిచె నిన్నుఁ గూడి..." భార. ఉద్యో. ౪, ఆ. ౭౨౧.

**ఈసుల్లు=ఇసుల్లు.** వ్యవ:—ఈసుల్లు బయలుదేఱిన వాన తప్పక వచ్చును.

**ఈహ.** సం. వి. ఆ. స్త్రీ. 1. కోరిక. 2. చేష్ట. 3. ఉద్యమము, కడఁక. 4. కిరణము. 5. శోభ.

**ఈహనము.** సం. వి. అ. న. 1. కోరిక. 2. చేష్ట. 3. ఉద్యమము.

**ఈహామానుఁడు.** సం. విణ. (అ.ఆ.అ.) కోరుచున్న వాఁడు. "వ...అనీహామానుండయి దైవపరుండైనవాఁడు నీరిలోని యానపాత్రంబునుంబోలె నవసన్నుం డగు..." భార. అర. ౧, ఆ. ౭౩౬.

**ఈహామృగము.** సం. వి. అ. పుం. 1. తోఁడేలు. 2. కృత్రిమపులేఁడి. 3. రూపకభేదము. (కథానాయకుఁడు లేఁడివలె నలభ్య యగు స్త్రీ కొఱకు వెన్నాడినట్లు వర్ణింపఁబడిన కథ గలనాలుగంకముల రూపకము.)

**ఈహిత.** సం. విణ. (బు. త్రి. బు.) ఈహకుఁడు. 1. కోరువాఁడు. 2. చేయువాఁడు.

**ఈహితము.** సం. వి. అ. న. 1. కోరిక. 2. చేష్ట. 3. కడఁక. విణ. (అ. ఆ. అ.) కోరఁబడినది.

**ఈహితవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కోరఁదగినది. 2. చేయఁదగినది.

**ఈహీ=ఇహీ.** "శా...ఇం, దెవ్వం డెవ్వఁడో మీఁది చే టెఱుఁగ రీహీ..." కవిక. ౨, ఆ. ౧౧౨.

**ఈహ్యము.** సం=ఈహితవ్యము.

**ఈళము=ఈడము.** "సీ. ఈళంపు నీలంపు మేలికంబాలు కులశైలజాలంబు కొమరుఁ దాల్చు." అహ. ౧, ఆ. 3౦.

**ఈళాము=ఈళము.** "రగడ. తళుకుఁడుమ్మెవత్తాళికగు నని తలఁపుమీ యీళాపు నీలము." శుక. ౧ ఆ. ౨౭౨.

**ఈళిక.** సం. వి. ఆ. స్త్రీ=ఈలిక.

**ఈళితము.** సం=ఈడితము.

## ఉ

**ఉ.** ఉభ. దే. ఒకానొక యక్షరము. 1. హలంత సంస్కృతశబ్దములు తత్సమము లగునపు డంతాగమముగా వచ్చువర్ణము. ఉదా:—వాక్+ఉ= వాకు, వాక్కు. దిక్+ఉ=దిక్కు. 2. మహద్వాచకము లగు బల్లిదాదులయొక్కయు పెక్కుపుంలింగ మహద్వాచక తత్సమ శబ్దముల యొక్కయు తుది అకారమున కాదేశముగా వచ్చునది. ఉదా:—బల్లిదుఁడు, రాముఁడు. 3. ఆలుశబ్ద ముత్తరపద మగునపుడు బల్లిదాదులయు తత్సమ శబ్దములయు తుది అకారమున కాదేశముగా వచ్చునది. ఉదా :—బల్లిదురాలు, ధీరురాలు. 4. నామముల తుది ఇకారమునకు బహువచనము పరమగునపు డాదేశముగా వచ్చునది. ఉదా :—హరులు, గిరులు, సిరులు. 5. ఇకారాంతము లగు తెలుఁగు శబ్దములయుపోత్తమేత్వమునకు బహువచనమున ఆదేశముగా వచ్చునది. ఉదా :-కలికి—కలుకులు. కొలికి—కొలుకులు. 6. ప్రేరణార్థమున వచ్చు 'చు, పు' వర్ణములు పర మగునపుడు ధాతువులలోని ఇకారమున కాదేశముగా వచ్చునది. ఉదా :-పడియు, పడుచు; తెలియు-తెలుపు. 7. కృత్ప్రత్యయములు పరమగునపుడు కొన్ని యువర్ణాంత ధాతువుల తుది ఇకారమున కాదేశముగా వచ్చునది. ఉదా :—కినియు-

కినుక, కినుపు; బలియు—బలుపు. అవ్య. ద్రు. (క. ఉం. త. ఉమ్.) 1. అపిశబ్దార్థమును దెలుపును. "మ. ఇవి యేనున్ సతతంబు నాయెడఁ గరం బిష్టంబులై యుండుఁ బొ, యవు భూదేవ కులాభితర్పణ మహీయః ప్రీతియున్..." భార. ఆది. ౧, ఆ. ౧౨. (ఇట సముచ్చయార్థము.) "క. ఎట్టి విశిష్టకులంబునఁ, బుట్టియు .." భార. ఆది. ౫, ఆ. ౫౮. (ఇట విరోధార్థకము.) 2. సర్వార్థము నిచ్చును. "ఉ...దీనికి నాఁడు టెన్నఁడున్, బుట్టమి..." భార. ఉద్యో. 3, ఆ. ౧౧౮. 3 ఆనంతర్యమును దెలుపును. "చ. అనుటయుఁ బిన్ననవ్వు నగి యంబుజనాభుఁడు వల్కె నెన్నఁడుక్, విన నివి..." భార. ఉద్యో. 3, ఆ. ౫౨. 4. వాక్యాలంకారముగాఁ గాన వచ్చును. "సీ. విషయోపభోగాభిలషణ మింకను నాకు వదలక పెరుఁగుచున్నదియుఁ గాన." భార. ఆది. 3, ఆ. ౯౫. 5. ఉకారేతరాంతముల మీఁదఁ గొన్ని చోట్ల ఉను లోపించుటయుఁ గలదు. "శా. వాలిం గీలియు వాయుపుత్రుసరియే..." సర్వ. ౭, ఆ. ౯౯. ప్ర. కొన్ని ధాతువులపై వచ్చు కృత్ప్రత్యయము. ఉదా:- ఒప్పు+ఉ=ఒప్పు. సం. వి. ఉ. పుం. 1. శివుఁడు. 2. బ్రహ్మ. 3. విష్ణువు. 4. రాజు. (తెలుఁగున దీనికి వ్యస్తప్రయోగము లేదు.)

**ఉంకించు.** దే. అ. క్రి. 1. యత్నించు, కడఁగు. "ఉ. చంచలనేత్ర గాంచి నృపచంద్రుఁడు... కపుంగిలింప నుంకించు..." విజ. ౨, ఆ. ౨౭. 2. సిద్ధముగానుండు, సిద్ధమగు. "గీ. రక్తసంసిక్తమైనధరాతలమున, నార్తిఁ బొరలుచు నూర్పు లందంద సంద, డింప జీవంబు వెడల నుంకింప..." భార. సౌ. ౧, ఆ. ౨౧౨. 3. ఆరంభించు, మొదలిడు. "సీ. లలి నుల్లసిల్లుచు లలితలోచనదీప్తు లడర నుంకించిన నాఁగి యూఁగి." భార. విరా. 3, ఆ. ౫౫. 4. ఊఁచు, కుప్పించు. "గీ. కవణ లుంకించి వ్రేయఁ గొ ప్పువియ నవలి, కరమున నమర్చ..." ఆము. ౧, ఆ. ౫౯.

**ఉంకింపు.** దే. వి. (ఉంకించు ధా.) 1. యత్నము, పూనిక. 2. విజృంభణము. 3. కుప్పించుట, గంతు. (ఆం. పా.)

**ఉంకు.** దే. అ. క్రి. 1. భయపడు. "క. పొత్తులఁబోక బవళించిన, యత్తటి నూరుపులు నిలుప నంతర్దృష్టిం, జిత్తము హరి హత్తించిన, యుత్తముఁ గనుఁగొన్న దాదు లుంకుదురు మదిన్." దశా. ౪, ఆ. ౧౪౨. 2. (నేలఁ గొట్టిన) వైకెగయు. "గీ. నీర ముంచిన సొరకాయ నెగసినట్లు, పేరుకొని వైచు తెల్లనిచీరవోలె, నుంకు చెండువిధంబున నుత్తరించు, కమలపాకు నిక్కెడుభంగి దాఁటె నిట్టి." ఉ. హరి. ౪, ఆ. ౨౮. ('ఉక్కెచెండు' అని తాళపత్త్రప్రతి.) వి. 1. సమ్మతి, అంగీకారము. (చూ. ఉంకుటుంగరము.) 2. లోపము. "ఆ. ఉంకునె కన లేనియోగులు బొంకలా..." వేమన. ౨3౬౧.

**ఉంకుటుంగరము.** దే. వి. (ఉంకు+ఉంగరము.) వధూవరులు వివాహము చేసికొనుటకు పరస్పరము సమ్మతించి మార్చుకొనెడి యుంగరము. (శ. ర.)

**ఉంకుడు**=ఉంకువ. (ఆం. పా.)

**ఉంకుణము.** సం. వి. అ. పుం. 1. నల్లి. 2. పేను.

**ఉంకువ.** దే.వి. 1. వరుఁడు కన్యార్థము మామకుఁ గాని కన్యకుఁ గాని యిచ్చు ద్రవ్యము, కన్యాశుల్కము. "ఉ...ఓ, పంకజనాభ నీవు శిశుపాల జరాసుతులన్ జయించి నా, వంకకు వచ్చి రాక్షసవివాహమునన్ భవదీయశౌర్యమే, యుంకువ నేసి కృష్ణ పురుషోత్తమ చేకొని పొమ్ము వచ్చెదన్." భాగ. ౧౦, స్కం. పూ. ౧౭౬౬. భార. ఆర. 3, ఆ. ౧3౨. 2. ఓలి, శుల్కము. "గీ. ఓలి యుంకువ యన శుల్క మొప్పు..." ఆం. శే. ౫౪.

**ఉంకువు**=ఉంకువ. "వ...ఇక్ష్వాకుండును నయ్యుంకువునకు భార్య యగుట పుత్త్రజన్మావధిగా నొడివి యశ్వంబుల నొసంగి కన్యకం బరిగ్రహించి..." భార. ఉద్యో. 3, ఆ. 3౧౬.

**ఉంకెక్కు.** దే. అ. క్రి. (ఉంకు+ఎక్కు.) జయము, పెనుదియు. "క. ఎక్కువకులంబునతనికి, నిక్కపుటాలైనదాని నీచకులం డుం, కెక్కక బలిమింగవిసినఁ, దక్కని చంపుటయ రాజధర్మం బెందుర్." విజ్ఞా. ప్రా. ౧౦౭.

ఉంగ. దే. వి. పాలు ఉగ్గు పోయునపుడు పిల్లల యేడుపుయొక్క ధ్వని కనుకరణము. "సీ. కచుజెప్ప వేయక కనుఁగొంచుఁ దనలోన నుంగుంగ యని సారె నుగ్గడించు." పా. ౧, ఆ. ౪౯.

ఉంగడి=ఉంగిడి. (ఆం. పా.)

ఉంగరపువ్రేలు. వ్య. వి. (ఉంగరము+వ్రేలు.) అనామిక, చేతి చిటికెనవ్రేలికి ముందువ్రేలు. "సీ. మొలయుంగరము వ్రేల వలముగాఁ దిర్చిన నాభి నామము విపరము లమరు." శుక. ౨, ఆ. ౪౧౩.

ఉంగరము. వై. వి. (సం. అంగులీయకమ్.) 1. అంగులీయకము, చేవ్రేలి యాభరణము. "గీ. కడియములు కెంపురవలయుంగరము వెండి, కుప్పెకుచ్చుపూపుహొనలమ్మ, చీర కడిపై పైటపోఁపరిసిస్తు అవిక, యొసఁగఁ జరియించు నిట్టు లయ్యెమ్మెలాఁడి." శుక. ౨, ఆ. ౪౧౧. 2. ఉంగరము వలె నుండువస్తువు. "సీ. పుక్కిలించిన తావు మాఁజిల్ల పెంచెర లుంగరంబులఁ బట్టి యొత్తువారు." నైష. ౬, ఆ. ౧౦౮. 3. ఉంగరము వలె నంపముగఁ జుట్టుకొనుట. "క...మపునికా, లాయసచక్రపరంపర, లో యన నుంగరపుఁ గురులు యువతికి నమరున్." ఆము. ౫, ఆ. ౯. "చ. తొకతొక మాటలున్ నొసలఁ దుంపెసలాడెడు నుంగరంపువెం, డ్రుకలును..." కవిరా. ౨, ఆ. ౪౭.

ఉంగిడి. దే. వి. 1. నాముమున్నగునవి తినుటచేఁ గలుగు పశురోగవిశేషము. "వ. ఉంగిడి యదురుఁద్రిక్క యనువానికి నా పేరు సెప్పినం జాలు..." భార. విరా. ౧, ఆ. ౨౮౬. 2. ఊపిరి యాడనిస్థితి. వ్యవ:—ఉంగిడి కలఁగునట్లు వానిని పనిలోపెట్టి నలఁపుచున్నారు.

ఉంగిడిగొను. దే. అ. క్రి. (ఉంగిడి+కొను.) ఉంగిడి వచ్చు. "వ...ఉంగిడిగొన్న భంగి..." కాశీ. ౨, ఆ. ౧౩౮.

ఉంగుటము. వై. వి. (సం. అంగుష్ఠః. క. ఉంగుట.) బొటనవ్రేలు. "ఉ...ఉంగుటము పాటిప్రమాణమువాని..." వరాహ. ౯, ఆ. ౭౪., నిర్వ. ౩, ఆ. ౪౯.

ఉంగుంగ. దే. వి. చిన్నపిల్లలుచ్చరించు ధ్వని. (బ్రౌ.)

ఉంగే=ఉంగ. "క. అంగములు మిగుల నలియఁగ, నుంగే యుంగే యటంచు నొకనిమిషము నో, రం గాదు వేయ కేడ్చుచు, సంగీకృత బాల్య చేష్ట నతఁ డట్లుండెన్." పరమ. ౧, ఆ. ౧౨౫.

ఉంగ్రము=ఉంగరము. (శ.ర.)

ఉంచు. దే. స. క్రి. 1. కూర్చుండఁ జేయు. "ఉ... రత్నపీఠమున నుంచి..." విక్ర. ౧, ఆ. ౧౦౭. 2. స్థాపించు, కట్టు. "ఉ. ఉంచిన యగ్రహారములు..." వసు. ౧, ఆ. ౬౪. 3. అలంకరించు, ధరింపఁజేయు. "ఉ...ర, త్నాంకితహారముంప బరువానునో బిడ్డ కివేల కర్కశా, లంకృతు లంచు హల్లకకలాపము లుంచు నదీలలామ పయున్." వసు. ౩, ఆ. ౩౧. 4. నియమించు, ఏర్పాటుచేయు. "మ...రా, జకులగ్రామణి యుంచె నవ్వసుపదున్ సైన్యాధిపత్యంబునన్." వసు. ౬, ఆ. ౩౯. 5. తాకట్టిడు, న్యాసముచేయు. "చ...అ, భ్రగతరుసంతతిన్ బ్రహ్మసమభార్యఁ బురిన్ గిర యుంచె వార్ధి నాన్." ఆము. ౧, ఆ. ౫౪.

ఉంచుకొను. దే. స. క్రి. (ఉంచు+కొను.) 1. ఉండునట్లు చేసికొను. వ్యవ:—ఆయాస్తి తన స్వాధీనములో నుంచుకొన్నాఁడు. 2. (వేశ్యాదుల) వశమునఁ బెట్టుకొను. వ్యవ:—వాఁడా వేశ్య నుంచుకొన్నాఁడు.

ఉంఛనము. సం. వి. అ. న=ఉంఛము.

ఉంఛము. సం. వి. అ. పుం. పొలములో రాలిన గింజలను జీవనార్థ మేఱుకొనుట.

ఉంఛవృత్తి. సం. వి. ఇ. స్త్రీ. ఉంఛము. విణ. (ఇ.) ఉంఛముచే బ్రదుకువాఁడు.

ఉంట. దే. వి. 1. ఉండ. "సీ. కలశవారిధి బయల్ వెలసి కొమ్మునఁ గొట్ట నంటివచ్చిన నాచుటుంట పుడమి." చంద్రా. ౧, ఆ. ౭౫., పార్వ. ౧, ఆ. ౫౪. 2. ఉండుట. "సీ...ఒరిమమై నుంట నీకొప్పు గాదె." నైష. ౩, ఆ. ౧౨౬. విణ. గుంద్రము. (శ.ర.)

ఉంటగాలము. దే. వి. (ఉంట+గాలము.) సీసపుగుండు కట్టిన యొకవిధ మగుగాలము. "గీ. కొండమ తి బడ్డకొండమ ద్రొబ్బుడు పటంబు, చాపమెత్తిలి గూడయుఁ జల్లు లాఁడు, లుంటగాలంబు తెరగీము లుసురుగాల, మొసుకు గొరకపుటఁకు సొక్కు లెసఁగుచుండు." హంస. ౪, ఆ. ౧౮౪.

ఉండ. దే. వి. (క. ఉండె. త. ఉండై.) గుళిక, గుండ్రముగా చేయఁబడిన వస్తువు. "చ...త్రిజగంబుల క న్నులబ్రహ్మ విష్ణు రు, ద్రమహిమ లొక్కటై కలయఁ గ్రాంచినయుండ త్రివేద మూలకం, బ దని నుతింప నొప్పెసఁగెఁ దామరస ప్రియబింబ మత్తఱిన్." నిర్వ. ౬, ఆ. ౮౮. విణ. గుండ్రము, ఉండవలె నుండునది. (శ. ర.)

ఉండక్రోవి. దే. వి. (ఉండ+క్రోవి.) పట్టుకొను చోట గుండ్రముగా నుండు చేతికఱ్ఱ, లాతము. (శ.ర.)

ఉండగట్టు. దే. అ. క్రి. (ఉండ+కట్టు.) ఉండలుండలుగా నగు. ఉదా:—ఉండగట్టిసపిండి.

ఉండలక్రోవి. దే. వి. (ఉండలు+క్రోవి.) ఘుటికాక్షేపణనాళము, ఉండలు పుచ్చుకొని కొట్టు పడెసెల. "క. వెలివాఖును గాలురులును, వలలుఁ జెరలు దీమములును పడిఁ దీసికొ, క్కులు నారెగోలలు ను, డలక్రోవులు వేఁట కారడంబుఁ బెనుపఁగన్." ఉ. హరి. ౪, ఆ. ౨౨.

ఉండవిలు. దే. వి. ఔ. (ఉండ+విల్లు.) ఉండలు వేయువిల్లు. "గీ. తరుణి నతనాభిమండలోదంచ నాభి, రామరోమావళీ జ్యావిరాజమాన, నీదు తను వుండవిలు సేసి నెఱఁకు లేయు, రతివరుఁడు హారగుళికల రాజహంసు." నైష. ౨, ఆ. ౯౭.

ఉండసురియ. ద్వి. వి. (ఉండ+సురియ.) పట్టుకొను చోట గుండ్రముగా నుండెడుకత్తి. "వ. వేదండంబులఁ గోదండంబులఁ గొండగొఱియల నుండసురియల...చెండాడుచు..." రా.వి. ౩,ఆ.౬౫.

ఉండి. దే. అవ్య. 1. ఉండుధాతువునకు క్త్వార్థక రూపము. ఉదా:—ఆబాలుఁడు చెట్టునుండి పడిపోయినాఁడు. 2. అపాదానార్థమున వచ్చిన 'వలన' మొదలగువానికి అనుప్రయుక్త మగును. "ఆ. విష్ణువలనఁ ద్రిపురవిజయి మౌళివలన, నుండి హిమనగమున నొలసె గంగ." భాగ.అను. ౨, ఆ. ౧౧౮. 3. హేత్వర్థకము. "క. నిన్నుండి పేరి రూపముఁ, గన్నులఁ జూడంగఁ గలిగెఁ గా నేఁటికి .." అని. ౨, ఆ. ౧౩౭. 4. మొదలుకొని అనునర్థమును దెలుపును. "క. ఏ నొకటి విన్నవించెద, దానవకులమథన పెద్దదవ్వున నుండిన్, బూని వినిపింపఁ గలపని, యౌనో కాదో విచారమని తెలియఁదగున్." ఉ. హరి. ౫, ఆ. ౨౯౩.

ఉండిగ. దే. వి. (క. ఉండిగె.) ముడుపులు మున్నగునవి వేయుటకై దేవాలయమున ముద్రవేసి యుంచినపాత్ర. "సీ. ఉండిగల్ నిండఁ బొన్నాళ్లు కేఁగెడు జేరు లకలంక భక్తిఁ గానుకలు వైవ." శుక. ౩, ఆ. ౪౪౨.

ఉండు. దే. అ. క్రి. (క. ఉండు. త. ఉండా.) దీనికి 'ఉండుదు, ఉండ్రు, ఉండ్రు, ఉంటివి, ఉన్నను, ఉన్నవి, ఉన్నె, ఉన్నె' మున్నగు రూపములు సిద్ధించును. 1. స్థిత మగు. "వ... పాండవులును బ్రాహ్మణసమూహములో నుండి..." భార. ఆది. ౭, ఆ. ౧౬౬. 2. వర్తిల్లు. "తరల...కామ భో, గరతి నుండితిమి..." భార. ఆది. ౫, ఆ. ౫౧. 3. వసించు. "క. ఎయ్యది నీ వుండు నెలవు..." విక్ర. ౨, ఆ. ౨౪౪. 4. జీవించు. "క. నిరతంబు బ్రహ్మ మొదలుగ, వరుసన యెడతెగక యిట్లు వచ్చినవంశం, బురుభుజ నీ వుండఁగ నీ, తరమున విచ్ఛిన్న మగుట ధర్మువె యనిసన్." భార. ఆది. ౪, ఆ. ౨౨౧. 5. నిలుచు. "గీ. వచ్చి యరదంబు డిగ్గి తద్ద్వారసీమ, దారుకుని నుండ నియమించి..." పారి. ౧, ఆ. ౧౦౫. 6. ఊరకుండు. "ఆ... సంశయోపేతచిత్తుఁడై, యుండి యుండనోపకొక్కనాఁడు, భోజనావసానమున నున్న యాముని, కిందమవదన ప్రీతి నిట్టు లనియె." భార. ఆది. ౮, ఆ. ౧౮౫. 7. శేషించు. "గీ. ఇందుబింబాస్య నాదాక కెదురుచూచు, నయనములు వేయి విరియించి నాకభర్త, యుదిలగొనుచున్న వా రాత్రి నున్నముగుదు, కాలయాపన సేయఁ గాఁ గాదు నీకు." నైష. ౪, ఆ. ౬౪. 8. ధాతు

జన్యము లగు కృదవ్యయములకుఁ గొన్నిపట్ల నను ప్రయుక్తమగును. "చ. ఇది గొనిపోయి భర్తృహారి కిచ్చెద నిచ్చిన నాతఁ డాయుర, భ్యుదయముఁ బొందియుండు..." విక్ర. 3, ఆ. ౧౧. 9. తుమున్నంతముల కనుప్రయుక్తమై యొకొక్కప్పుడు భవిష్యదర్థమును సూచించును. "శా. నిన్నుం జంపి మహేశహారముగ వండింపంగ నున్నాఁడు..." హర. ౨, ఆ. ౭౮. 10. తుమున్నంతముల కనుప్రయుక్తమై యొకొక్కప్పుడు 'సిద్ధమగు' మున్నగునర్థముల నిచ్చును. "ఆ. స్వజనములను దాను భుజియింపనుండియా, సత్తు వలెఁ గిచ్చెఁ జనదె పొగడ." భార. ఆశ్వ. ౪, ఆ. ౨౫౯. స. క్రి. 1. చేయు. "క. నృప శ్రావణకృష్ణాష్టమి, నుపవాసం బుండె..." వరాహ. ౯, ఆ. ౧౩. 2. పొందు. "క... హాని నిజ, పురమున సుఖ ముండె..." భాగ. ౧౦, స్కం. ఉ. ౫౨౪.

ఉండుకొను. దే. అ. క్రి. (ఉండు+కొను. స్వార్థమున.) "చ. ననుఁ గనినట్టివారలకె నాపయిఁ గూర్మి యొకింత లేక య, వ్వనటఁ దోలఁగఁ జేయుట యవాస్తవమై యిటు లుండుకొంగ..." కాళిందీ. ౨, ఆ. ౨౧౧.

ఉండె. దే. వి. ఊరుమూలదేశము. (ఆం. పా.)

ఉండేరకము. సం. వి. అ. పుం. ఉండ్రము.

ఉండ్ర. దే. వి. వెలిచంద్ర, కపరము♆. "సీ... కదరమా నుండ్రస యనఁగను నుండ్ర యనఁగ." ఆం. భా. ద్వి. ౪౦., వాల్మీ. ౨, ఆ. ౧౨.

ఉండ్రకము. వై. వి. ఉండ్రము. "గీ. అనుదినము నుండ్రకము లుపహార మొసఁగి." ధర్మ. ౭, ఆ. ౧౧౫.

ఉండ్రము. వై. వి. (సం. ఉండేరకః.) మోదకము; వేడినీళ్లతో దడిపినపిండితో గుండ్రనియుండలు చేసి నీటియావిరిపై నుడికించిన భక్ష్యము. సీ. ఉండ్రాలు నూఁబిండి పుండ్రేక్షులుం దేనె..." హర. ౬, ఆ. ౫౫., కాశీ. ౭, ఆ. ౧౧౫. విణ. గుండ్రము. (శ. ర.)

ఉండ్రస=ఉండ్ర. ఆం. భా. ద్వి. ౪౦.

ఉండ్రెన. దే. వి. దుర్గంధముగలచంద్ర♆. (ఆం. పా.)

ఉందరువు. సం. వి. ఉ. పుం. 1. ఎలుక. 2. పందికొక్కు.

ఉందురకర్ణి. సం. వి. ఈ. స్త్రీ. మూషికపర్ణి, ఎలుకజీడి♆.

ఉందురము. సం. వి. అ. పుం=ఉందురువు.

ఉందురువు. సం=ఉందరువు.

ఉంపడము. దే. వి. (ఉంచు ధా.) 1. వేశ్యను గుత్తగా నుంచుకొనుట. (శ. ర.) 2. భోగవనిత. "సీ... తొడుసు నుంపడ మనంగ. గీ. భోగవనితకుఁ బగు..." సాం. ని. మాన. ౩౪.

ఉంపుడుకత్తె. దే. విణ. (ఉంచు. ధా.) భోగార్థముంచుకొనఁబడిన వేశ్యాది స్త్రీ. (వా.)

ఉంబ. వై. వి. (సం. ఉమ్భా.) గోవుల యంభారవము. (శ.ర; బ్రా.)

ఉంబళి. దే. విణ. (క. ఉంబళి. త. ఉంబళమ్.) పన్ను లేనిది. ఉదా:—ఉంబళి గ్రామము. (శ. ర.) వి. పన్ను లేకుండ భూమి మున్నగువాని ననుభవించుట. వ్యవ:—వాని కాగ్రామము ఉంబళి కిచ్చిరి.

ఉంబళిక. దే. వి. (క. ఉంబళికె.) 1. పన్ను లేకుండ ననుభవించుభూమి లేక గ్రామము. "సీ... ఉంబళికలు గలకమ్మవెలమదొరలు..." రా. వి. ౫, ఆ. ౧౩. 2. భూమి లేక గ్రామము పన్ను లేకుండ ననుభవించుట. "సీ. చలువపూఁదేనె గాసపునల్ల ప్రజలకు నలరుటేరమ్ము లుంబళిక కొసఁగి." చంద్రా. ౪, ఆ. ౧౪. విణ. పన్ను లేనిది. "సీ. అల సహ్యజాతటి నగ్రహారంబులు బహురేఖ మించు నుంబళికయూళ్లు." రాజగో. ౧, ఆ. ౩౩.

ఉంభకుఁడు. సం. విణ. (అ. భికా. ప్ర.) ఉంభిత.

ఉంభత్. సం. శత్ర. పూరించుచున్న.

ఉంభనము. సం. వి. అ. న. 1. పూరించుట, నించుట. 2. పూయుట, అలముట.

ఉంభిత. సం. విణ. (బు. త్రీ. బు.) పూరకుఁడు.

ఉంభితము. సం. విణ. (అ. ఆ. అ.) 1 పూరింపఁబడినది, నింపఁబడినది. 2. పూయఁబడినది, అలమఁబడినది. "క. అంభోధికన్యకాకుచ, కుంభోంభిత ఘుసృణమసృణగురు వక్షునకున్." ఆము. ౧, ఆ. ౪౬.

ఉఁ. వై. అవ్య. (సం. హుమ్.) 1. వినుటను సూచించును. 2. సమ్మతిని చూపును. 3. విసుగు, కోపము చూపును. ఉదా:—ఉఁ. పో.

ఉక. దే. ప్ర. కొన్ని పదములకు స్వార్థమున వచ్చు తద్ధిత ప్రత్యయము. ఉదా:—పొలఁతి+ఉక=పొలఁతుక; ఎమ్ము+ఉక=ఎమ్ముక.

ఉక్క. వై. వి. (సం. ఉల్కా.) ఉమ్మ, ఊష్మము. "సీ. మిక్కుటంబుగ మేనియుక్కచేఁ గమలిన విరిపూవు సజ్జలకరణి చూచి." రాజ. చ. 3, ఆ. ౧౪౬. "గీ. ఉడుకు సెక వెట్ట వేఁడిమి యుబ్బ యావి, యుక్క యన నొప్పు నామంబు లుష్ణమునకు." ఆం. శే. ౫౭.

ఉక్కఁబట్టు. వై. స. క్రి. (ఉక్కన్+పట్టు.) 1. ఊపిరాడకుండ మూయు. "సీ. ఒకవేళవానల నుపహతి నొందించు నొకవేళ రంధ్రంబు లుక్కఁబట్టు." భాగ. ౭, స్కం. ౧౯౯. 2. విడిచిపెట్టు, మాను. "క. నీ కిష్టం బివి కానీ, నా కాపాపాత్ముఁ జెప్పిసం బదిలక్షల్, లేకున్న విడుతుఁ బ్రాణము, నీకై కూ డుక్కఁబట్టి నీలగ్రీవా." కాశ. 3, ఆ. ౧౦౧. (శ. ర. పా. 'ఉగ్గఁబట్టు' ముద్రి.)

ఉక్కట. వై. వి. (సం. ఉత్కటః.) మదము, గర్వము. "ఉ. చక్కెరబొమ్మపైఁ గరము సాఁచుట కొట్టినపిండి నీకు నీ, వక్కట యుక్కటం గలుష మన్నఁ గలంగవు..." రా.వి. ౪, ఆ. ౫౫.

ఉక్కడఁగించు. దే. స. క్రి. 1. (ఉక్కడఁచు. ధా. ప్రే). ఉక్కడఁచు, నిస్సత్త్వముచేయు. 2. వధించు, చంపు. 3. నాశముచేయు. (చూ. ఉక్కడఁచు.)

ఉక్కడఁగు. దే. అ. క్రి. (ఉక్కు+అడఁగు.) నిస్సత్త్వమగు, బలహీనమగు. "చ...పురంబున వారు భయంబువొంది రం, దువిపలగర్భముల్ గలఁగె నుక్కడఁగెన్ మగధేశు సైన్యముల్." భార. సభా. ౧, ఆ. ౨౧౩.

ఉక్కడఁచు. దే. స. క్రి. (ఉక్కడఁగు. ధా. ప్రే.) 1. ఉక్కడఁగించు, నిస్సత్త్వము చేయు. "సీ... క్రొక్కారు మెఱుఁగుల నుక్కడంచి." భార. విరా. ౨, ఆ. ౮౩. 2. చంపు. "సీ...ఉగ్రాస్త్ర నొకకోల నుక్కడంచె." మార్క. ౬, ఆ. ౧౦౩. 3. నాశముచేయు. "గీ. ఒకనికై యిట్లు కుల మెల్ల నుక్కడంప, నెత్తికొనఁ జూచె దివి నీతి యే నృపాల." భాగ. 3, స్కం. 33.

ఉక్కడము. వై. విణ. (సం. ఉత్కటః.) శ్రేష్ఠము, గొప్ప. "ఉ. ఉక్కడ మైనమంచి మను వొప్పెడునాహయరత్న మెక్కెనన్." సా. ౧, ఆ. ౮౨. (శ. ర. పా. 'ఉక్కళమైన' ముద్రి.) వి. సేనల సంరక్షించుకావలి. "వ. కొక్కెరలు కెరలి యిరు చక్కియల నుక్కడంబు నడవన్..." హర. ౨, ఆ. ౨౦.

ఉక్కడీఁడు. వై. విణ. (ఉక్కడము+ఈఁడు.) సేనకు సహాయముగా నుండి ముందుగాఁ బంపఁబడినబంటు. "గీ. ఉక్కడీఁ డయి యేతెంచె నుక్కుమిగిలి, కలికిగారాబు చెలికాఁడు కలికి మగఁడు. నైష. ౭, ఆ. ౪౧.

ఉక్కణఁగు=ఉక్కడఁగు. (చూ. ఉక్కణఁచు.)

ఉక్కణఁచు. దే. స. క్రి. (ఉక్కణఁగు. ధా. ప్రే.) చంపు, వధించు. "క. రక్కసునా యోధనమున, నుక్కణఁచి..." రుక్మాం. ౫, ఆ. ౭౫.

ఉక్కణఁగించు=ఉక్కణఁచు. "ఉ. ఆగ్రహ మాత్మలోఁ బొడమునట్లుగఁ దండ్రి నకారణంబ య, త్యుగ్రనిశాచరప్రతతు లుక్కణఁగించుట చెప్పి..." వి. పు. ౧, ఆ. ౧౩.

ఉక్కణము. వై. విణ. ఉక్కడము, సేనలకై యుంపఁబడినకావలి. "చ...కడింది మగల్ దగు నుక్కణంబుగా, భయ మను పేరు లేక నిరపాయముగా విడియించుచున్ మనః, ప్రియ మగు భంగి సేన నడపించె..." నిర్వ. ౫, ఆ. ౯౬.

ఉక్కపెట్టు. ద్వ. అ. క్రి. ఎండకాలమున గాలి లేక దేహము తపించు. వ్యవ:—ఈవేళ బాగుగా ఉక్కపెట్టుచున్నది.

**ఉక్కపోఁత.** ద్వి. వి. (ఉక్కపోవు. ధా.) ఉక్క పోయుట. వ్యవ:— ఈవేళ ఉక్కపోఁత భరింప శక్యము గాకుండ నున్నది.

**ఉక్కపోయు.** ద్వి. అ. క్రి. (ఉక్క+పోయు.) ఉక్కపెట్టు. వ్యవ:— ఎంత ఉక్కపోయు చున్నను వాఁడు చొక్కా విప్పఁడు.

**ఉక్కరి.** దే. విశే. (ఉక్కు+అరి.) **1.** శౌర్యవంతుఁడు. "సీ. ఉక్కరివై పొంచి నిక్కుచు నొకకోలఁ గూల వ్రేయఁగ నల్ల వాలిగాఁడు, మగఁటిమి సూపి సెమ్మరి గెల్పు చేకొన వేటకాఁడి ముది నేలవేల్పు గాఁడు." అచ్చ. యు. ౩౧౪. (శ. ర. పా. 'టక్కరి' ముద్రి.) **2.** ధైర్యశాలి. "సీ...ఉక్కరి దిటవరి దిట్టన ధీరున కగు." సాం. ని. మాన. ౯.

**ఉక్కఱు.** దే. అ. క్రి. (ఉక్కు+అఱు.) **1.** ఉక్కడఁగు, దుర్బలమగు. "ఉ. ఉక్కఱి యిట్లు మధ్యము మహోగ్ర శరంబుల దాఁక నోర్వక ..." భార. అర. ౪, ఆ. ౧౨. **2.** దైన్యమందు, అధైర్యపడు. "క. ఉక్కఱి సురపతి కైనను, మ్రొక్కము నృపధర్మ మూఁది మొన తలఁ బడినన్, మిక్కిలి పేరును నిట దివి, నక్కజ ముగఁ బెంపుఁ బడయ నగుట నుపేంద్రా." భార. ఉద్యో. ౩, ఆ. ౩౬౦. **3.** బెదరు, భయపడు. "చ. చిఱునగ వొప్ప గాండివము సెచ్చెర సజ్యము సేసి సేన లుక్కఱ రభసంబుమై నడరెఁ గవ్వడి..." భార. విరా. ౫, ఆ. ౧౪౩.

**ఉక్కలుఁడు.** వై. విశే. (సం. ఉత్కలః.) శౌర్యవంతుఁడు. "మ...రెండువే, లెలుఁగుల్ పూనిన కాంచనోన్నతరథం బే పెక్కఁగా నెక్కి యు, క్కలుఁడై యేఁగె మయుండు సైన్యమున కేక స్వామి యాతం డనన్." హరి. పూ. ౪, ఆ. ౧౨. (శ. ర. పా. 'ఉత్కలుఁడు.' ముద్రి. 'మొక్కలుఁడు' పాఠాంతరము.)

**ఉక్కస.** దే. వి. ఆయాసము. "చ. కుసుమసుగంధి యొార్తు నృపకుంజరుఁ గన్గొని మోహితాత్మయై, యసురుసు రన్న దాని నికటాంగన యారసి నీకు నేటి కిట్లుసు రన నన్న నింటికిడనుం డిట కుం బరువెత్తి వచ్చునుక్కస నుసు రంటిఁ బొమ్మనుచు గ్రక్కునఁ బోలఁగ బొంకె నయ్యొడన్." వేం. పంచ. ౪, ఆ. ౬౪౮.

**ఉక్కళము.** యు. దే. వి. కోవురము, శత్రువుల రాకఁ గనిపెట్టుటకై పెట్టినకావలి. "గీ. అంతఁ దనసైనికుల దుర్గ మాక్రమింపఁ, బంపుటయు వారు చటులదోర్బలము మెఱయఁ, గొండ ప్రక్కల నుక్కళ ముండువేల్పు, తండములఁ జెండి యెక్కి యక్కొండయందు." పశా. ౨, అ. ౫౭. "ఉ. చుక్కలఱేఁడు తూర్పు దెసజోదు తనుం గుసుంగరార్థమై, యుక్కునఁ దాకసిల్లు నని యుక్కళ ముంపినరీతి వేగురుం, జుక్క సురేంద్రదిక్కునను శోభిలె..." శశాం. ౪, ఆ. ౧౨౬. వై. వి. (సం. ఉపనిష్కరః.) పట్టణమునకుఁ బోవురాజమార్గము. "సీ. ఉపనిష్కరం బన నుక్కళం బమరును..." ఆం. భా. ద్వి. ౯.

**ఉక్కాడు.** దే. అ. క్రి. (ఉక్కు+ఆడు.) పగగొను, విరోధించు. "క. పెక్కండ్రతోడ నీరస, మొక్క తఱిన కొనక తఱిఁగియున్న పగతుతో, నుక్కాడి బంధుభావముఁ, దక్కటిపగఱగొఁడ వలయుఁ దా నెఱపంగన్." భార. శాం. ౩, ఆ. ౨౫.

**ఉక్కించు.** దే. స. క్రి. త్రొక్కు. "సీ. ఖురముల సప్తసాగరముల రొంపిగా నుక్కించి మట్టాడు నొక్కచోట." భాగ. ౩, స్కం. ౪౧౫.

**ఉక్కిరిబిక్కిరి.** దే. వి. **1.** ఊపిరి యాడకపోవుట. వ్యవ:— వారు నలుగురు నొక్కసారిగా నన్నుఁ బట్టుకొనఁగా నా కుక్కిరిబిక్కిరి యైనది. **2.** విశ్రాంతి లేకపోవుట. విశే. **1.** ఊపిరియాడనిది. (శ. ర.) **2.** విశ్రాంతిలేనివాఁడు. వ్యవ:— నాపని తెమలక ఉక్కిరిబిక్కిరిగా నున్నాను.

**ఉక్కివము.** దే. వి. (క. ఉక్కివ.) **1.** కపటము, మోసము. "ఉ. నిక్కము నట్ల కాన తగునీతి పరుల్ సుర లుక్కివంబునన్, మిక్కిలి యైన వారి నియమింపక తక్కుదురే..." నిర్వ. ౪, ఆ. ౪౨. **2.** కపటకృత్యము. "క. ఎక్కువ తక్కువమాటలు, నుక్కివములు బంది గీము లొందించుటలున్, బెక్కు దనయన్నదమ్ముల, దిక్కున నన్నియును సైఁపఁ దేజము సేయున్." భార.

శాం. ౨, ఆ. 3౫౯. 3. రహస్యము, లోగుట్టు. "వ. ధర్మతనయుండు జూనంబునకుఁ బ్రియుండు గాని యందుల యుక్కివం బెఱుంగండు..." భార. సభా. ౨, ఆ. ౧౭3. ("ద్యూతప్రియశ్చ కౌంతేయో.నచ జానాతి దేవితుమ్." సం.భార. సభా. ౪౯. ౪౦.) విశే. కుత్సితము, నికృష్టము. "ఆ...ఉక్కివం బనఁగను గుత్సితంబు పరఁగు." ఆం. శే. ౨౦.

ఉక్కివుఁడు. దే. విశే. 1. మోసగాఁడు. "ఉ. ట క్కరు లుక్కివుల్ బలుతుటారులు క్రూరులు వేషధారులున్, రక్కసులు..." సమీర. ౪, ఆ. ౨౨. 2. మూర్ఖుఁడు, అవివేకి. "గీ. సముచితము లగుమాటలఁ జక్కఁబడక, తక్కి నే నుక్కివుం డగుధార్తరాష్ట్రుఁ, గ్రూరశరముల నే నియ్య కొలుపువాఁడ, నవని గొంతేయులకు నిచ్చునట్లు గాఁగ." భార. ఉద్యో. ౧, ఆ. ౭౭. 3. దుర్మార్గుఁడు, దుష్టుఁడు. "వ...భవత్ప్రతాపంబునఁ నహుషునకుఁ బరాభవం బొనరించి నన్ను రక్షిం పక తక్కిన నుక్కివుం డగునతని పాపనిశ్చయం బున నాపద వచ్చు." భార. ఉద్యో. ౧, ఆ. ౧౭౪. "ఉ...ఇ, ట్లుక్కివుఁ డైన నీకొడుకు నుల్లము నున్నటు లాడఁ గూడునే." భార. ఉద్యో. ౨, ఆ. ౫౨.

ఉక్కిస. దే. వి. 1. పొడిదగ్గు. "క...వళీ, పలితంబు లయ్యె వగరును, దలయేరును నుక్కిసయును దల కొనుదెంచెన్." భార. ఆది. 3, ఆ. ౧౯౧. 2. శ్వాసశ్రమము, ఊపిరి పీల్చుట విడుచుట యందుఁ గలబాధ. "ఆ. వగరు పుట్టె నంత బెగలె దంతంబులు, నుక్కిసయును దగ్గుఁ బిక్క టిల్లె, శిరసు నొవ్వఁదొడఁగెఁ జెదరె మనం బంతఁ, గడిఁది యైన ముప్పుకాలమందు." భాగ. ౬, స్కం. ౬౧.

ఉక్కిఁడు. దే. విశే. 1. అవివేకి, మూర్ఖుఁడు. "ఉ...ఉక్కి లయి నేర్పు లేక తమకించి పయింబడి నొచ్చువారు..." నిర్వ. 3, ఆ. ౧౧. 2. దుష్టుఁడు, దుర్మార్గుఁడు. "ఉ. మానవకోటి నిట్టెవిసుమానపుఁబీనుఁగు లైనవారి నెంౘైననుఁ గంటిమే యకట యూఱడి వమ్మయి పోయె దుర్జయం, బైనబలంబు గాని తెఱవై తన కిత్తఱిఁ బోదు గావ యు, క్కివిమనంబు గీడు పరికిం చునె క్రొవ్వినఁ జేటు దప్పునే." భార. విరా. 3, ఆ. ౭.

ఉక్కు. దే. అ. క్రి. (క. ఉక్కు.) 1. ఉక్క పోయు. వ్యవ:—ఈ యెండకు చాల ఉక్కు చున్నది. 2. ఊపి రాడకపోవు. "ఉ...నేఁ, బట్టిన నుక్కి చచ్చు..." చంద్రా. 3, ఆ. ౬౦. 3. చనిపోవు. "ద్వి. ఘోరాహవంబునఁ గుంభ కర్ణాది, వీరులు పెక్కండ్రు విషమవిక్రములు, ఉక్కి రంటఱు విభుఁ డొక్కఁడె చిక్కె." రం. రా. యు. ౫౧౪, పు. వి. 1. శౌర్యము, పరాక్రమము. "గీ. ఉక్కు లావును నంతంత కెక్కు డయ్యె." భార. విరా. ౫, ఆ. ౧౮౪. 2. శక్తి, బలము. "క...నీ, యుక్కును బీరముఁ జూచెదఁ, జిక్కన నిలు మనుచు..." భార. ఆది. ౬, ఆ. ౨౦3. 3. వేగము, వడి. "ఉ...పే, రుక్కున నేఱు నిక్కుచన నొక్కఁడు వంకలు నొక్కశక్తుఁడే." పాండు. ౫, ఆ. ౨౧౭. 4. గౌరవము, మర్యాద. "ఆ...దు, శ్శాసనుండు వస్త్రచయము పర్వ, తోపమాన మయిన నొలు వంగ నోపక, యుడిగె లజ్జఁ బొంది యుక్కు దక్కి." భార. సభా. ౨, ఆ. ౨3౧. 5. సాహసము, తెగువ. "క. పెక్కండ్రము గల మని యి, ట్లుక్కునఁ జొరఁబడుట నీతియు నుపాయ ముఁ గా, దక్కజ మగుదైవబలం, బెక్కుడు..." హరి. ఉ. ౧, ఆ. ౮౬. 6. అయస్సారము, కాఁచి శుభ్రముచేసిన యినుము; ఇనుము. "సీ. ధృత రాష్ట్రుకౌఁగిట మృతిమాన నుక్కుకంబముచేతఁ బ్రోవఁడే పవనతనయుఁ." విష్ణుమా. ౧, ఆ. ౬3. "సీ. ఉలి యు క్కును మనఁగ నొనరు నయ స్సంజ్ఞ..." సాం. ని. స్థా. ౬౫. 7. దృఢత్వము, గట్టితనము. "గీ. ఉదు టుగువు గట్టి బిగు పూట యుక్కు నాఁగ, దృఢతకును బొల్చు..." వేంక. మాన. ౫౬, సాం. ని. మాన. 3౫. 8. ధైర్యము, దిట్టతనము. "గీ. ఉక్కు చేగ దిటము...నాఁగ ధృతికిఁ బేర్లు." ఆం. సం. మాన. ౫౭. 9. ఔద్ధత్యము, ఉదుటు. "ఉ... మేల్, జగ్గమిటారి గుబ్బచనుజక్కవ లుక్కున

నిక్కి గ్రక్కునన్, లోగ్రక సైతిణీ రవికలో నుదు టారఁగ..." కాశీ౦డి. ౨, ఆ. ౯౫. విశే. ఘో రము, దారుణము. "చ. తరుణులఁ బాంధులన్ వెడఁగుఁ దాపసులన్ బ్రసవాశుగంబులన్, బొరి గొనునట్లు గాదు ననుఁ బోర జయించుట యన్న నవ్వి నా, శరములు ప్రవ్వ తాట సహజంబులు వానికి నిన్ను నొంచుటో, గరళము గంటె నుక్కు లవి గ్రక్కున నైదుశరంబు లేసినన్." జై. 3, ఆ. ౧౦౨.

ఉక్కుతీఁగ. దే. వి. (ఉక్కు+తీఁగ.) (వీణ మున్న గువానికి వేసెడు) ఉక్కుతంతి. (శ. ర.)

ఉక్కుతునియ. దే. వి. (ఉక్కు+తునియ.) ఉక్కు తునుక. (శ. ర.) విశే. 1. శూరుఁడు. "గీ. ద్రౌప దేయులు నాసుభద్రాసుతుండు, నుక్కుతునియలు గారె..." భార. ఉద్యో. ౨, ఆ. ౧౭౬. 2. ధై ర్యవంతుఁడు. "సీ...ధైర్యవంతునకుఁ బెళ్లగు ను క్కుతునియ దిట్ట, గట్టిడెందముగాఁడు గడుసరి యన..." వేంక. మాన. ౨౯.

ఉక్కుతునక=ఉక్కుతున్క. (వా)

ఉక్కుతున్క. దే. విశే. (ఉక్కు+తున్క.) శూరుఁ డు. "ఉ. గాళకు లాపురీభటశిఖామణు లెక్కటి యుక్కుతున్కలు..." విజ. ౧, ఆ. ౧౦.

ఉక్కునీరు. దే. వి. (ఉక్కు+నీరు.) ఇనుము కరఁ గిన వచ్చు ద్రవపదార్థము. "ఆ. బొమ్మఁ ద్రొక్కి మోము లెమ్మపట్టఁగ మోఁది, యనలముఖము లోన నగ్నివర్ణముగను గాఁచి వక్త్రమున నిండఁగా నుక్కునీరు వోతు రేచి నిష్ఠురముగ." భాగ. ౫, స్కం. ౨, ఆ. ౧౫౭.

ఉక్కుమడఁగు. దే. అ. క్రి. (ఉక్కు+మడఁగు.) ఉక్కుచెడు. "చ. ఉఱక విరోధిసైన్యముల నుక్కుమడంగఁగ నుల్లసద్గతిం,బఱప..." భార. విరా. ౫, ఆ. ౬౧. 2. చచ్చు. (చూ. ఉక్కు మడఁచు.)

ఉక్కుమడఁచు. దే. స. క్రి. (ఉక్కుమడఁగు ధా. ప్రే.) ఉక్కుచెడఁజేయు; చంపు. "గీ. విను గంధర్వ కిన్నర దానవాది, దివ్యభూతంబులకును భీతిల్ల నవినఁ, బాండు పుత్రులమాతకు భయము నందునాకు, నెక్కుడిది ప్రేల్మిడిన వారి యుక్కుమ డఁతు." భార. ఉద్యో. ౪, ఆ. ౨౧౬.

ఉక్కుమిగులు. దే. అ. క్రి. (ఉక్కు+మిగులు.) ప్రబలు, అతిశయించు. "క. రెండు బలంబుల వారలు, నొండొరువులకంటెఁ జాల నుక్కుమిగిలి యొం, డొండ కడంగుచు నుజ్జ్వల, చండస్థితి నొప్పి రప్పుడు జగతీనాథా!" భార. భీష్మ. ౧, ఆ. ౧3౮.

ఉక్కుమీఱు. దే. అ. క్రి. (ఉక్కు+మీఱు.) ప్రబ లుఁడగు. (ఇంద్రుఁడు.) "గీ. సిద్ధచారణ గంధర్వ జిహ్మగాది, సురలు మునులును రంభాదిసుందరాం గులాడఁ బాడఁగ వినుతి సేయఁగఁ గొలువ, మ్రొక్కి భద్రాసనంబున నుక్కుమీఱి." భాగ. ౬, స్కం. ౨౬౦, ఉ. రా. 3, ఆ. ౧౫౯.

ఉక్కుమెఱయు=ఉక్కుమీఱు. "ఆ. అనుచు నతని నుడిపి ధనువు మ్రోయించుచు, నంపగములు వఱప నవ్విభుండు, వాని సెల్ల వింట వడిఁ బాఱఁ జమపుచు, లెక్కసేయకుండె నుక్కుమెఱసి." భా. రా. అర. ౧, ఆ. ౨౨౮.

ఉక్కువడు. వ్యా. అ. క్రి. (ఉక్కు+పడు.) 1. దు ర్బలుఁడగు. "గీ. దివ్యమణి లేక యప్సరస్త్రీలు లేక, యమృతకుంభాదు లగు పదార్థములు లేక, యుక్కువడి యుండె బహుకాల మొప్పు దఱిగి, విగతలక్ష్మీవిలాసుఁడై వేల్పుఱేఁడు." హర. ౬, ఆ. 3౦. ('ఉక్కెవడు' ముద్రి.) 2. దైన్య మందు. "గీ. ఉక్కువడి యున్కి మాని పెల్లు బ్బె నాక, మప్సరః కామినీతురంగాదికముల." హర. ౬, ఆ. ౧౨౯. ('ఉక్కెవడి' ముద్రి.)

ఉక్కెక్కు. దే. అ. క్రి. (ఉక్కు+ఎక్కు.) బలిష్ఠ మగు. "ఉ. గ్రక్కున లేచి వాలమున గాఢ తరంబుగఁ జుట్టి పిక్కలు,క్కెక్కఁగఁ ద్రొక్కి నిల్చి తను వించుక వంచి కరంబు లూరులన్, నొక్కి..." కాశీ. ౪, ఆ. ౭౪.

ఉక్కెఱ. వై. వి. (సం. ఉపకారికా.) బెల్లము పిండి కలిపి చేసినభక్ష్యవిశేషము. "గీ. కనక మణి పంజరంబుల నునిచి యునిచి, చక్కెరయు ను క్కెఱయు సారె గ్రుక్కి గ్రుక్కి, యొఱపుఁ

బలుకులు పలుమాఱు గఱపి కఱపి, కలికి చిలుకల కొలికి రాచిలుకఁ బెనుచు." పాండు. ౪, ఆ. ౨౭౮. "మ. ఇడి రమ్మాని కుపాయనంబులు మనోభీష్టంబుగాఁ బూరియల్, వడలుం జక్కెర కజ్జెకాయలును లాడ్వా లుక్కెఱల్..." రామా, ౭, ఆ. ౧౧౫., అప్ప. ౭, ఆ. ౧౬౭.

ఉక్తా. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక ఛందస్సు.

ఉక్తము. సం. వి. అ. న. 1. మాట. 2. వాక్యము. విణ. (అ.ఆ.అ.) 1. ఆడుగఁబడినది. 2. చెప్పఁబడినది.

ఉక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. మాట. 2. చెప్పుట. 3. సరస్వతి. 4. శబ్దశక్తి.

ఉక్థము. సం. వి. అ. న. 1. సామవేదము. 2. ప్రాణము. 3. ఋక్కులసమూహము. పుం. 4. చాటువు.

ఉక్షణము. సం. వి. అ. న. (జలాదులు) చల్లుట, సేచనము.

ఉక్షము. సం. వి. న్. పుం. 1. వృషభము, ఎద్దు. 2. వృషభ మనునొకానొక యోషధి.

ఉక్షితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. చల్లఁబడినది. 2. తడుపఁబడినది.

ఉఖ. సం. వి. ఆ. స్త్రీ. 1. వంటకుండ, లోవి. 2. సూర్య కిరణము.

ఉఖ్యము. సం. విణ. (అ.ఆ.అ.) కుండలో నుడికినది. (భక్ష్యాది.)

ఉగము. వై. వి. (సం. యుగమ్.) 1. ఆయువు. "క. ఏనుం గని కర మరయక, పూసితిఁ గా కిట్టి యెడలఁ బొసఁగునె యేయుం, గానమె కాల నియమగతి,తో నావేఁట మునియుఁగము ద్రుంగించెఁ దుదన్." రాఘవ. ౧, ఆ. ౭౪. (రామాయణార్థమున) 2. ఊపిరి. (వా)

ఉగాది. వై. వి. (సం. యుగాదిః. క. ఉగాది.) చాంద్రాయణ సంవత్సరాది. (శ. ర. వా.)

ఉగియు. దే. అ. క్రి. ఉరియు, స్రవించు. "ద్వి. ధాతువు ల్దలఁకినతాపాశ్రు కణము, లుగిసిన నరములు బిగిసిన నూర్పు, లెగసిన..." పండితా. మహిమా. ౨౫౪. పు.

ఉగువు. దే. వి. దృఢత, గట్టితనము. "గీ. ఊవు టుగువు గట్టి బిగు వూట యుక్కు సాగ, దృఢత తుచ బొల్చు..." వెంక. మాన. ౫౬.

ఉగ్గఁగట్టు. దే. స. క్రి. (ఉగ్గు+కట్టు.) బిగించు. "క. అని దామపాశమున నాశ్రసి వెన్నుడు ముగ్గఁగట్టి తక్కిసకొనత్రా, డొనరఁగ నులూఖల ముతో, జనని వెసన్ ముడిచి నిల్పె సదనము నందున్." ఐ. పు. ౭, ఆ. ౧౩౫.

ఉగ్గఁబట్టు=ఉక్కఁబట్టు. (వా.)

ఉగ్గడన. వై. వి. (సం. ఉద్ఘాటనా.) ప్రకటనము, చాటింపు. "తరల. కొడుకుసద్గుణకోటు లెల్లను గోటిభంగుల నోలి నుగ్గడన సేయుచు సత్యవంతునిఁ గానరే మునులార యీ యడవిలోపల నంచు వే సుత యంచు ధైర్యము డించుచున్." భార. అర. ౭, ఆ. ౨౭౦. ('మక్కువన్ గడన సేయుచు' అని పాఠాంతరము.)

ఉగ్గడి. దే. వి. గడువు, వ్యవధి. "గీ. గడు వనఁగ మేర యనఁగ నుగ్గడి యనంగ, నడరు మర్యాద ..." ఆం. భా. ద్వి. ౧౯౧.

ఉగ్గడించు. వై. అ. క్రి. (సం. ఉద్ఘాట్.) శబ్దించు, గలుగల్లు మను. "చ...ప్రార్థనామృదూక్తులు సెలఁగఁగ వేన్ పొదివి తొల్చుదువుల్ తగు విన్నపంబులన్, బలుమఱుఁ జేయుచుందమున బంగరుటుందియ లుగ్గడింపఁగన్." పాండు. ౨, ఆ. 3౭. స. క్రి. 1. ప్రకటించు, వెలిపుచ్చు. "క. నగళులఁగోపలిమాటలు, దగునే వెలి నుగ్గడింప..." భార. విరా. ౧, ఆ. ౧3౦. 2. వచించు, చెప్పు. "గీ. అదిథునుంగాక జని యించు టాదిగాఁగ, బసులలోనన పెరిఁగిన పాలసుఁడు, వావి మాలినపశుమార్గ వర్తనంబు, నూను టరిదియె యిది యేల యుగ్గడింప." హరి. ఉ. 3, ఆ. ౧౦3. 3. వర్ణించు, కొనియాడు. "వ. మఱియుఁ దదీయసౌందర్యం బుగ్గడింప నలవి గాక..." భాగ. 3, స్కం. ౭33. "గీ. సముచితంబుగఁ గూరలచంద ముగ్గడించి ..." భార. ఉద్యో. 3, ఆ. ౨౧౭. 4. ఉచ్చరించు, పఠించు. "చ...భూసురవితానము మం

త్రము లుగ్గడింపఁగన్." చంద్రి. ౬, ఆ. ౭౩. "ఉ...వందిజనంబు ముందటం, జాటువు లుగ్గడింప..." నైష. ౪, ఆ. ౧౨౬. 5. (గ్రంథాదులు) రచించు, వ్రాయు. "ఉ. గ్రాంథిక సన్నుత ప్రతిభఁ గాంచి రసజ్ఞత మించి యాదిమ, గ్రంథము లుగ్గడించి ఫణిరాట్పరికల్పిత శాస్త్రసీథికిన్, బంధువు లైనసత్కవులఁ బ్రార్థన చేసెద..." ఉద్భ. ౧, ఆ. ౧౨.

ఉగ్గడింపు. దే. వి. పొగడ్త.

ఉగ్గడువు. వై. విశే. (సం. ఉత్కటమ్. క. ఉగ్గడ.) ఉత్కటము, అధికము. "క. నడురేయి తీవ్రభానుఁడు, పుడమి వెలసె ననుతలంపు పుట్టించుచు నుగ్గడు వగు తేజంబున వెలిఁగెడు కర్ణుఁడు..." భార. ద్రో. ౫, ఆ. ౧౯౫. "చ...ఏటుగంటి యుగ్గడు వగునెత్తుటన్ సుడిసి..." ఉ. హరి. ౪, ఆ. ౨౪౩.

ఉగ్గము. వై. వి. (సం. ఉద్గ్రాహః.) చేతఁ బట్టుకొనిపోవుటకు వీలగునట్లు చెంబు మొంత మున్నగువానిమెడకుఁ గట్టి బిగించెడి త్రాడు. "గీ. హాలికుఁడొకండు తన్నగరాశ్రయుండు, చేత నుగ్గంపుఁ గుండతో..." పరమ. ౫, ఆ. ౨౮.

ఉగ్గళించు. వై. అ. క్రి. నట్టువుఁడు కొలిపించు. (శ. ర.) స. క్రి. 1. కౌఁగిలించు. "మ...పతి లీలాచంచలల్లోచనాం, చలయై యున్నసవోఢ నొక్కతెను జంచత్పంచబాణావృతా, నిలముల్ వీవఁగ నుగ్గళించెఁ గుహానానిస్తంద్రచేతస్కుఁడై." గాధ. ౧,ఆ. ౫౯. 2. పెంచు, పెరిఁగించు. "సీ...లఘువుల క్రింది వెల్లను గూడి పెండియు నొక్కటి గలుపుక యుగ్గళింప. ఆ. నైనసాఖ్య వృత్త మది..." అప్ప. ౪, ఆ. ౧౪౯.

ఉగ్గించు. దే. స. క్రి. నేఁత నేయునపుడు పడుగు పేకల పోఁగులను చేర్చు. (శ. ర.)

ఉగ్గు. దే. వి. 1. చనుఁబాలతో రంగరించి చిన్న పిల్లలకు పోయునాముదము మున్నగు పదార్థము. "చ...అచ్యుతపదభక్తిపేరిచము రుగ్గుగఁ బెట్టుచుఁ బెంచె నర్మిలిన్." పర. ౧, ఆ. ౭౨. "గీ. పల్లాఱును దేఁటిచిన్నిపాపలకుఁ గులికి, పువ్వుఁదేనియ నుగ్గులు పోసి పోసి." య. ౪, ఆ. ౨౫. 2. ముడుత. "మ. పలుకంబారెఁ గపోలపాళికలు పైపైఁ దోఁచె జాడ్యంబు చన్నులఁ బొంకంబు ఘటిల్లె సోఁగ లగుకన్నుల్ వెల్ల కాఁ జొచ్చె నుగ్గులు విచ్చెన్ వళిభంగముల్ సరుల పైఁ గోర్కుల్ తమిం బాసె వెగ్గలమై చిట్టుము లుట్టఁగాఁ దొడఁగె రాకాచంద్రబింబాస్యకున్." ఉద్భ. 3, ఆ. ౪౦. విశే. వంపు గలది. "సీ. నీలం పుతూలకిన్నెరపారిమగతాల యుగ్గుచప్పరముల నిగ్గు లీన." దశా. ౪, అ. ౧౦౭. వి. (క. ఉగ్గు.) అవ్యక్తవచనము. కావ్యా. ౨. ఆ. ౬౩.

ఉగ్గులువాఱు. దే. అ. క్రి. (నూలిపోఁగు) మెలిపడు. (శ. ర.)

ఉగ్గువడు. ద్వ. అ. క్రి. (ఉగ్గు+పడు.) 1. క్షీణించు, చెడు. "క. సిగ్గువడి నిడుదబుడుపుల, బొగ్గువలెం బడినవజ్రముం గని సురరాజగ్గణములతోఁ దనధృతి,యుగ్గువడన్ వే పితామహునికడ కరిగెన్." కకు. ౧, ఆ. ౨౦౯. 2. ముడుతపడు. "వ. జిగిదిగి బిగి వదలి స్రగ్గి యుగ్గువడి తరంగితాయమానం బైనసర్వాంగీణ చర్మంబును..." కవిక. ౫,ఆ. ౧౧౦. (శ.ర.పా. 'తగ్గుపడి' ముద్రి.)

ఉగ్మలి. దే. వి. 1. ఆఁడుది, స్త్రీ. "క. చిడిముడి పడుచు నెదురు చనఁగడఁగుచు హారములు సక్కఁగాఁ ద్రోచుచు మల్లడిగొనుచు దుర్విలాసం,బొడలికి నొడఁగూర్చుచుండ నుగ్మలి యంతన్." భార.విరా. ౨, ఆ. ౧౧౪. "క. జపియించె నేనుదివసము, లుపవాసపురస్సరముగ నుగ్మలి..." పాండు. ౫, ఆ. ౧౨౦., సాం. ని. మాన. ౬౦. 2. చెలి, స్నేహితురాలు. "ఉ... ఇట్టివిచిత్రలజ్జ మేమెత్తతి నైన విన్న యదియే కను టెక్కడి మాట యుగ్మలీ." కాళిందీ. ౬, ఆ. ౧౮. 3. గృహిణి, ఇల్లాలు. "గీ. తిరిగి నింటింట భిక్షాంప్రదేహి యనుచు, బాదరాయణుఁ డీశానుపట్టణమున, నొట్టుపెట్టినభంగి నే యుగ్మలియుఁ నుబిలిచి యొకపట్టెఁడన్నంబు పెట్టదయ్యె." కాశీ. ౭, ఆ. ౧౩౫. 4. భార్య, పెండ్లాము.

ఉగ్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. తెల్లవస✽. 2. ఓమము✽. 3. దనియాలు. 4. ఉగ్రజాతి స్త్రీ.

ఉగ్రాపశ్యము. సం. విణ. (అ.ఆ.అ.) 1. క్రూరముగాఁ జూచునది. 2. భయంకర మైనది.

ఉగ్రకర్ముఁడు. సం. విణ. (న్. సీ. న్.) 1. భయంకర మగుపనులు చేయువాఁడు. 2. క్రూరుఁడు, హింసకుఁడు.

ఉగ్రకాండము. సం. వి. అ. పుం. కాఁకర ✽.

ఉగ్రగంధ. సం. వి. ఆ. స్త్రీ. 1. తెల్లవస✽. 2. ఓమము✽. 3. అజమోద యనునోమము ✽.

ఉగ్రగంధము. సం. వి. అ. పుం. 1. సంపెఁగ ✽. 2. పెనగుమ్ముడు ✽. 3. తెల్లగగ్గెర ✽. 4. లశునము, వెల్లుల్లి ✽. న. రామఠము, ఇంగువ. విణ. (అ. ఆ. అ.) అధిక మగువాసన గలది.

ఉగ్రధన్వుఁడు. సం. వి. న్. పుం. 1. శివుఁడు. 2. ఇంద్రుఁడు. విణ. (అ. ఆ. అ.) భయంకర మైనవిల్లు గలవాఁడు.

ఉగ్రము. సం. వి. అ. పుం. 1. శోభాంజనము, మునగ ✽. 2. కేరళము, మలయాళదేశము. 3. వత్సనాభము, వసనాభి. 4. క్రూరనక్షత్ర పంచకము. (పూర్వఫల్గుని, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, మఘ, భరణి.) విణ. (అ. ఆ. అ.) 1. క్రూరము. 2. ఉత్కటము. 3. తీక్ష్ణము. 4. దీర్ఘము. 5. క్రుద్ధము.

ఉగ్రశేఖర. సం. వి. ఆ. స్త్రీ. ఆకాశగంగ.

ఉగ్రాక్షుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు. విణ. (అ.ఆ.అ.) భయంకరమైన కన్నులు గలవాఁడు.

ఉగ్రాణము. దే. వి. (క. ఉగ్రాణవు.) 1. సామగ్రులుంచెడుగది, కోష్ఠము. "సీ... ఉగ్రాణంపుటిండ్లు చూచి." విప్ర. ౫, ఆ. ౬. 2. ధనాగారము, బొక్కసము. "సీ. ఆఖ్యలై తనరు ధనాగారమునకు నుగ్రాణం బనంగ బొక్కస మనంగ." ఆం. శే. ౫౪.

ఉగ్రుఁడు. సం. వి. అ. పుం. 1. శివుఁడు. 2. క్షత్రియునకు శూద్రస్త్రీయందు పుట్టినవాఁడు.

ఉచకము. సం. వి. అ. పుం. ఏరండము, ఆముదము✽.

ఉచింత. దే. వి. ఉచ్చింత, ఉస్తె ✽. (శ. ర.)

ఉచితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. యుక్తము. 2. పరిచితము. 3. మితము. 4. విదితము. 5. న్యస్తము, ఉంచఁబడినది.

ఉచ్చండము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి భయంకరమైనది. 2. మిక్కిలి కోపము గలది. 3. మిగుల వేగము గలది. 4. మిక్కిలి వేఁడియైనది.

ఉచ్చంద్రము. సం. వి. అ. పుం. అపరరాత్రము, రాత్రికాలము.

ఉచ్చక్షువు. సం. విణ. (న్.) 1. పైకి చూచునది. 2. గ్రుడ్డిది.

ఉచ్చట. సం. వి. ఆ. స్త్రీ. 1. దంభము. 2. పని. 3. ఒకజాతివెల్లుల్లి ✽. 4. గురివెంద ✽. 5. వట్రువముస్తె✽. 6. నేలయుసిరిక✽. 7. భద్రముస్తె✽.

ఉచ్చనీచములు. సం. వి. అ. న. బ. 1. ఎక్కువతక్కువలు. 2. మంచిచెడ్డలు. విణ. (అ.ఆ.అ.) 1. మెరకపల్లములు గలది. 2. గొప్పవి కొలఁదివి కలిసియున్నది.

ఉచ్చము. సం. వి. అ. పుం. 1. గ్రహగతికిఁ గారణమైన జీవభేదము. 2. గ్రహస్థాన విశేషము. (వ్యతి. నీచము.) విణ. (అ. ఆ. అ) 1. ఉన్నతము. 2. ఉత్కృష్టము. 3. మిక్కుటము.

ఉచ్చయము. సం. వి. అ. పుం. 1. సమూహము. 2. పుప్పులు మున్నగునవి కోయుట. 3. పోఁకముడి. 4. నీవారి ధాన్యముప్రోఁగు. 5. అతిశయము.

ఉచ్చరణము. సం. వి. అ. న. 1. ఊర్ధ్వగమనము. 2. బహిర్గమనము. 3. ఉచ్చారణము.

ఉచ్చరించు. సం. స. క్రి. 1. వాక్రుచ్చు, చెప్పు. 2. పలుకు. 3. రచించు. "సీ. ఉచ్చరించితివి విద్వచ్చయంబు నుతింపఁ జాటు ప్రబంధముల్ శతకములును." చంద్ర. వి. ౧, ఆ. ౧౪.

ఉచ్చరితము. సం. వి. అ. న. 1. మలము, పురీషము. 2. మూత్రము, ఉచ్చ. విణ. (అ. ఆ. అ.)

1. పై కెగసినది. 2. వెలుపలికి పోయినది. 3. ఉచ్చరింపఁబడినది.

ఉచ్చరియించు. సం. స. క్రి. ఒనరించు, చేయు. "క. అచ్చట మానాన్మిశ్వరు, వచ్చి కృత స్నాను లగుచు వనమాలిజపు, బుచ్చరియింతురు వారు వి,యచ్చరు లరుదందఁ గనుదు రచ్యుతు నంద్రున్." శ్రీ రం. మా. ౫, ఆ. ౧౦.

ఉచ్చలము. సం. వి. అ. న. మనస్సు. విణ. (అ.ఆ.అ.) చలించుస్వభావము గలది.

ఉచ్చాటనము. సం. వి. అ. న. 1. పెల్లగించుట. 2. లేవఁగొట్టుట. 3. పిశాచాదులఁ బోద్రో లుట.

ఉచ్చాటము. సం. వి. అ. పుం.=ఉచ్చాటనము.

ఉచ్చాటించు. సం. స. క్రి. వేళ్లతోఁ బెల్లగించు. "శా. చండాపాతములం దటద్ద్రుమము లుచ్చా టించి..." హరి. పూ. ౬, ఆ. ౧౧౬.

ఉచ్చారణము. సం. వి. అ. న. ఉచ్చరించుట, పలుకుట.

ఉచ్చారము. సం. వి. అ. పుం. 1. ఉచ్చారణము. 2. మలము. 3. మూత్రము.

ఉచ్చావచములు. సం.=ఉచ్చనీచములు.

ఉచ్చి. వై. వి. (సం. ఉచ్చైః. క. త. ఉచ్చి.) నడితల, బ్రహ్మరంధ్రము. "సీ. బ్రహ్మరంధ్రాభిధ పరఁగు నుచ్చర..." ఆం. భా. ద్వి. ౧౭౪.

ఉచ్చింత. దే. వి. ఉస్తె. "వ. ఉచ్చింత పువ్వుల లోని కేసరంబుల క్రియ..." భో. ౪, ఆ. ౧౮.

ఉచ్చైశ్శ్రవము. సం. వి. స్. పుం. ఇంద్రుని గుఱ్ఱము. విణ. (స్.) 1. నిక్కినచెవులు గలది. 2. గట్టిగా మాట్లాడినఁ గాని విన లేనిది, చెవిటిది.

ఉచ్చైస్స్వరము. సం. వి. అ. పుం. పెద్ద కంఠధ్వని. విణ. (అ.ఆ.అ.) పెద్దకంఠధ్వని గలది.

ఉచుకరించు. దే. అ. క్రి. ఉచుక్కుమను. (చూ. ఉచుకరింపు.)

ఉచుకరింపు. దే. వి. (ఉచుకరించు ధా.) ఉచుక్కు మనుట. "మ...క్రేఁగంటి కెంపుపు జాపుం దల వంపు లోనుచుకరింపుం దొట్టు నిట్టూర్పుగుం, పును..." చంద్రా. ౫, ఆ. ౧౫౨.

ఉచుక్కు. దే. వి. అనాదరవిషాదాదుల సూచించు ధ్వని కనుకరణము. "సీ. తన విలాసముఁ గనుంగొని నీటువెట్టెదు మానాస్త్ర రతియు నుచుక్కు రనఁగ." దశా. ౧, ఆ. ౫౭. "ఉ...వాఁడా పువుఁబోఁడిఁ జూచి...దానిగర్వము నుచుక్కులు గాంచి కెరలన మించఁగన్." శుక. 3,ఆ.౧౬౬.

ఉచ్చ. వై. వి. (సం. ఉచ్చారః. క. ఉచ్చె.) మూత్రము, నరపశ్వాదులు రహస్యావయవములనుండి విడుచుజలము. "క. ఉచ్చను బుట్టినతను వఁట..." వేమన. ౧౦౩౦.

ఉచ్చగిత్త. ద్వ. వి. (ఉచ్చ+గిత్త.) 1. ఆవుల మూత్రము వాసనచూచుచు వానివెంటఁ గామముతో నేఁగుగిత్త. 2. స్త్రీలోలుఁడు, విషయాసక్తుఁడు. (వా.)

ఉచ్చచెలమ. ద్వ. వి. (ఉచ్చ+చెలమ.) ఉచ్చయూరుస్థానము, యోని. "ఆ. ఉచ్చచెలమఁ గోరియున్నది జగమెల్ల." వేమన. ౧౦౪౮.

ఉచ్చపోయు. ద్వ. అ. క్రి. (ఉచ్చ+పోయు.) మూత్రవిసర్జనము చేయు. (వా.)

ఉచ్చబుడ్డ. ద్వ. వి. (ఉచ్చ+బుడ్డ.) 1. మూత్ర ముండుతిత్తి. (శ. ర.) 2. ప్రసవకాలమున స్త్రీ యోనినుండి శిశువుతో వచ్చు నీరుతిత్తి, క్లోమము. (శ. ర.)

ఉచ్చమల్లి. ద్వ. వి. (క. ఉచ్చెమల్లి.) 1. రోఁత పుట్టించుస్త్రీ. "గీ...ఉచ్చమల్లి యియ్యింతిపల్లి." శుక. 3, ఆ. ౧౮. 2. నగ్నిక, దిసమొలయాఁడుది. "వ. హృషీకేశుండు సమయింపం దలంచి వెంటం దగులునవసరంబునం గోటవి యన నొక యుచ్చమల్లి వచ్చి యడ్డపడిన దానగ్నికం జూచి నారాయణుండు మాఱుమొగంబు పెట్టె." ఉ. హరి. ౬, ఆ. ౧౮౨.

ఉచ్చు. దే. అ. క్రి. (క. ఉచ్చు.) 1. వెలువడు, బయటకువచ్చు. "మ...హరిశ్రీ పాదతలంబుఁ దూఱఁగొని యయ్యస్త్రంబు మీఁగాల నిష్ఠుర వేగంబున నుచ్చి పోయె..." భార. మా. ౭౩.

భార. భీష్మ. 3, ఆ. ౧౯. 2. అంకురించు, మొలచు. "శా. ఆ సర్వేశ్వరు విశ్వరూపమున కత్యాశ్చర్యస్ఫూర్తిఁ బొందె హర్షబాష్పాంబుసారంబుల మేనిపైఁ బులకసస్యం బుచ్చ నత్తింపుచున్." వరాహ. ౯, ఆ ౧౦౯. 3. నొచ్చుకొను. "మ...ఆసుయోధనుని యుల్లం బుచ్చి పోనాడుమీ." భార. ఉద్యో. 3, ఆ. ౯౭. స. క్రి. 1. ఛేదించు, చీలుచు. "గీ. గొరక మే నుచ్చి ధరఁ గాఁడ శిరము విసరె." స్వా. ౪, ఆ. ౪౭. "వ...ఉచ్చి చనువివ్వచ్చునిశిత శరపరంపరలు..." భార. విరా. ౫, ఆ. ౬౦. 2. నాఁటు. గ్రుచ్చుకొను. "చ...పై నొరఁగి పొంకపు జన్నిదమ్ముల నుచ్చి పాఱఁ గొంగిరి దయసేయ రాదొ..." ఉ.రా. ౪, ఆ. 3౧౫. 3. విడుచు, వెలువఱచు. "సీ... ఊసురంచు నిట్టూర్పు లుచ్చుదాని." శివలీ. ౨, ఆ. ౭3. వి. ఉరి, వాగురు. "సీ...ఉచ్చునానురి యన నొప్పుచుండుఁ, బక్షిబంధనసజ్జ..." ఆం. భా. ద్వి. ౨౯౩.

ఉచ్చెచ్చిరే. దే. వి. కుక్కను పిలుచుటయం దగు శబ్దమున కనుకరణము. "ద్వి. ఉచ్చుచ్చిరే శంకరోచ్ఛిష్టభోగి, యని యిటు లెలిఁగించు నమ్మాత్రలోన." బస. ౭, ఆ. ౨౧౨. పు.

ఉచ్ఛన్నము. సం. విణ. (అ. ఆ. అ.) ఆచ్ఛన్నము, మఱుఁగుపడినది.

ఉచ్ఛిత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. గోళ్లతో త్రుంచుట. 2. వేళ్లతో పెకలించుట. 3. నశింపఁజేయుట.

ఉచ్ఛిన్నము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చీల్పఁబడినది. 2. గోళ్లతో త్రుంపఁబడినది. 3. వేళ్లతో పెకలింపఁబడినది.

ఉచ్ఛిష్టము. సం. వి. అ. న. తేనె. విణ. (అ.ఆ.అ.) 1. భుక్తశేషము. 2. పూర్వ ముపయోగించినది. 3. విడువఁబడినది.

ఉచ్ఛిష్టుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) భోజనానంతరము చేసికొనవలసిన శుద్ధి చేసికొననివాఁడు.

ఉచ్ఛూనకము. సం. వి. అ. న. దంతక్షత విశేషము.

ఉచ్ఛూనము. సం. వి. అ. న. 1. బలుపు, బలియుట. 2. పొంగుట. 3. వాచుట. 4. ఎత్తు. విణ. (అ. ఆ. అ.) 1. ఉబ్బినది. 2. వాచినది. 3. బలిసినది. 4. ఎత్తైనది.

ఉచ్ఛృంఖలము. సం. విణ. (అ.ఆ.అ.) 1. గొలుసు లేనిది, బంధనము లేనిది. 2. అడ్డుపాటులేనిది, ప్రతిబంధకరహితము. 3. నియమించువాఁడు లేనిది. 4. క్రమపద్ధతులు లేనిది.

ఉచ్ఛేదనము. సం. వి. అ. న.=ఉచ్ఛేదము.

ఉచ్ఛేదము. సం. వి. అ. పుం.=ఉచ్ఛిత్తి.

ఉచ్ఛేదించు. సం. స. క్రి. 1. గోళ్లతో త్రుంచు. 2. పోఁజేయు. "మ. చిగురాకున్ దమకంఠదోషముల నుచ్ఛేదింపఁగాఁ జాల మెండుగ దిన్ మేసి పికంబు లెల్ల..." చిత్రభా. ౨,ఆ.౧౦౦.

ఉచ్ఛోషణము. సం. వి. అ. న. 1. ఎండిపోవుట. 2. ఇంకిపోవుట. 3. ఎండించుట. 4. ఇంకించుట. 5. తపించుట. 6. తపింపఁజేయుట. విణ. (అ.ఆ.అ.) 1. ఎండించునది. 2. ఇంకిపోఁజేయునది. 3. తపింపఁజేయునది.

ఉచ్ఛ్రయణము. సం. వి. అ. న. 1. గొప్పతనము. 2. ఔన్నత్యము, ఎత్తు.

ఉచ్ఛ్రయము. సం. వి. అ. పుం. 1. ఉచ్ఛ్రయణము. 2. అతిశయము. 3. గ్రహోదయము.

ఉచ్ఛ్రాయము. సం.=ఉచ్ఛ్రయము.

ఉచ్ఛ్రితము. సం.వి.అ.పుం. 1. సరళదేవదారువు ♣. 2. దేవాలయధ్వజము. విణ. (అ. ఆ. అ.) 1. పైకెత్తఁబడినది. 2. ఉన్నతము. 3. గొప్పది. 4. పుట్టినది. 5. పెరిఁగినది. 6. పొడవైనది.

ఉచ్ఛ్రితి. సం. వి. ఇ. స్త్రీ.=ఉచ్ఛ్రయము.

ఉచ్ఛ్వసితము. సం. వి. అ. న. 1. ఊపిరి. 2. నిశ్వాసము. 3. నిట్టూర్చుట. 4. ప్రాణము. 5. వదులగుట. 6. వికసించుట. విణ. (అ. ఆ. అ.) 1. ఉచ్ఛ్వాసము చేసినది. 2. నిశ్వాసము చేసినది. 3. ఓదార్పఁబడినది. 4. చెదరినది. 5. ఆశించినది. 6. వికసించినది. 7. సంతోషించినది.

ఉచ్ఛ్వాసము. సం. వి. అ. పుం. 1. ఊర్పు లోనికిఁ దీల్చుట. 2. నిశ్వాసము, ఊర్పు వదలుట.

**3.** నిట్టూర్పు. **4.** ప్రాణము. **5.** ఓదార్పు. **6.** గ్రంథభాగము.

ఉజ్జయని. సం=ఉజ్జయిని. "గీ. భద్రనామాభిధానుఁ డక్షుద్రసంప,దాఢ్యుఁ డుజ్జయనీపురి నధికలోభ, గర్హితుం డైనయొకవణిగ్వరుఁడు గలఁడు." విక్ర. ౨, ఆ. ౧౬౦.

ఉజ్జయిని. సం. వి. ఈ. స్త్రీ. అవంతి, ఒక నగరము. (ఇది మోక్షదాయకము లగుసప్త నగరములలో నొకటి. పూర్వ మిది మాళవదేశమునకు ముఖ్య పట్టణము. ప్రాచీననక్షత్రశాలాకేంద్రము.)

ఉజ్ఝాసనము. సం. వి. అ. న. వధించుట, చంపుట.

ఉజ్జి=ఉజ్జీ. (శ. ర. బ్రౌ.)

ఉజ్జీ. దే. విణ. ఉద్ది. (వా)

ఉజ్జీవనము. సం. వి. అ.న. **1.** బ్రతుకుట. **2.** బ్రతికించుట. **3.** చావునకు సిద్ధమై బ్రతుకుట.

ఉజ్జీవించు. సం. అ. క్రి. **1.** బ్రతుకు. **2.** చక్కఁగా పెరుగు. "వ. గుజ్జులేమావులపజ్జల నుజ్జీవించు గొజ్జఁగియారంబుల నంటు గోరంటలతో..." ఉ. రా. ౬, ఆ. ౨౪.

ఉజ్జృంభము. సం. వి. అ. పుం. **1.** వికాసము. **2.** ఆవులింత. **3.** విజృంభణము. **4.** బీఁట. విణ. (అ. ఆ. అ.) **1.** వికసించినది. **2.** ఆవులించినది. **3.** విజృంభించినది.

ఉజ్జృంభించు. సం. అ. క్రి. విజృంభించు, చెలరేఁగు. "శా...నీబాహాప్రతాపంబు...ఉజ్జృంభింపరాఁ జేయుమా." హర. ౭, ఆ. ౬౩.

ఉజ్జృంభితము. సం.వి.అ. న. **1.** ఆవులింత. **2.** చేష్ట. విణ. (అ. ఆ. అ.) **1.** విరిసినది. **2.** చెలరేఁగినది.

ఉజ్జ్వలత్. సం.శత్రం. ప్రకాశించుచున్న. "క. ధృష్టద్యుమ్నుఁడు నుజ్జ్వల, దష్టాపదపుంఖ మార్గణావళి నయ్యు, త్కృష్టగజఘటలఁ గలఁచె..." భార. భీష్మ. ౨, ఆ. ౨౧౦.

ఉజ్జ్వలనము. సం. వి. అ. న. **1.** వెలుఁగొందుట. **2.** మండుట.

ఉజ్జ్వలము. సం. వి. అ. పుం. **1.** సింగారము. **2.** శృంగారరసము. న. బంగారము. విణ. (అ. ఆ. అ.) **1.** ప్రకాశించునది. **2.** మండునది. **3.** వికసించునది. **4.** అడ్డులేనిది. **5.** కూడుకొన్నది. **6.** తెల్లనిది. **7.** ప్రకటితము. "సీ. కాళ్లయొ ప్పిద మాడుక ట్టనుజ్జ్వలము సేయఁగ..." భార. విరా. ౧, ఆ. ౨౨౮.

ఉజ్జ్వలితము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** మండినది. **2.** వెలుఁగొందినది. **3.** మండింపఁబడినది. **4.** వెలుఁగొందఁజేయఁబడినది.

ఉజ్ఝనము. సం. వి. అ. న. విడుపు, త్యజించుట.

ఉజ్ఝితము. సం. విణ. (అ.ఆ.అ.) విడువఁబడినది.

ఉజ్జే. దే. వి. **1.** ఊహ. (శ. ర.) **2.** లక్ష్యము. (చూ. ఉజ్జగొను)

ఉజ్జేగించు. దే. స. క్రి. **1.** విడుచు. "ఉ. చాలక తక్కినట్ల వినుఁడు శౌర్యము లజ్జయు నుజ్జగించి మీ,రోలిన నిల్చి నాయెదుర నోడితి మే మనుఁడు..." నిర్వ. ౫, ఆ. ౨౭. **2.** సమాప్తిచేయు. "ఉ. ఆమహనీయచాపమున నర్జునుదర్ప మడంచి నేఁడు సంగ్రామము నుజ్జగించెద..." భార. కర్ణ. ౧, ఆ. ౨౩౪. **3.** చల్లార్చు, నశింపఁజేయు. "సీ. వేరు వెల్లఁకి కాయ గూర పం డని కోర కుదరాగ్ని గాడ్పుచే నుజ్జగించు." పాండు. ౨, ఆ. ౨౯. **4.** నిరసనచేయు. "క. కమలముల నుజ్జగించుం, గుముదంబుల బుజ్జగించుఁ గోమ చూపులు..." విజ. ౧, ఆ. ౧౩౩.

ఉజ్జేగింపించు. దే. స. క్రి. (ఉజ్జగిల్లు ధా. ప్రే.) ముగింపించు, సమాప్తినొందించు. "సీ...నవ్య దివ్యాన్నపానప్రశస్తి. "గీ. నుజ్జగింపించి డెం దాన కుబ్బొనర్చి, నిశలఁ గుంకుమ మగలుమై నిండ నలఁది, గేహమున ధూపధూమ మెక్కించి కుధర,ధరుని హేమంతమునఁ గొల్వ దొరకు ముక్తి." పాండు. ౨, ఆ. ౧౧౨.

ఉజ్జేగింపు. దే. వి. (ఉజ్జగించు ధా.) విడి, విడుదల. "సీ. ఉజ్జన మనఁగను నుజ్జగిం పనఁగను విడి యన విడు పన విడుదల యన." అం. భా. ద్వి. ౧౭౩.

ఉజ్జేగిలు. దే. అ. క్రి. పోవు, నశించు. "ఉ...మ డుంగుల నొత్తెఁ జెమ్మనీ, రుజ్జగిలన్ వహించె మెయి నూఁదినఁ బాఱు దుకూలచేలముల్." స్వా. ౫, ఆ. ౫౭.

ఉజ్జీగిల్లు=ఉజ్జగిలు. "సీ. గంజాయి దినఁగ నుత్కంఠ చేసిననాఁడ లజ్జాభిమానంబు లుజ్జగిల్లె." శివరా. 3, ఆ. ౬౨.

ఉజ్జీగొను. దే. స. క్రి. (ఉజ్జ+కొను.) లక్ష్యము చేయు, సరకుగొను. "సీ. అపకీర్తికిని లోఁగ డొఁగాము లెఱుఁగఁడు లజ్జాభిమానంబు లుజ్జ గొనఁడు,బొంకు రోయఁడు పాపమునకు శంకిం పఁడు కులశీలములపోక కలయఁ దకఁడు." రుక్మాం. ౫, ఆ. ౧౭౬. (శ. ర. పా. 'ఉజ్జగించు' ముద్రి. క్రమము ననుసరించి శ. ర. పా. మే గ్రాహ్యము.)

ఉజ్జీనము. వై. వి. (సం. ఉజ్ఝనమ్.) విడుపు. ఆం. భా. ద్వి. ౧౭3.

ఉజ్జీనసేయు. ద్వ. స. క్రి. (ఉజ్జనము+చేయు.) త్యజించు, విడుచు. "సీ. సంధ్యాభివందన శ్రద్ధ యుజ్జనసేయు గీతవాద్యవినోదకేళిఁ దగులు." కాశీ. ౪, ఆ. ౦౧.

ఉజ్జీని. వై. వి. (సం. ఉజ్జయినీ.) అవంతి. "మ... తా నేఁగె నుజ్జినికిన్..." విక్ర. ౨, ఆ. ౦౪.

ఉజ్జోయించు. దే. స. క్రి. ఊహించు. (శ. ర.)

ఉజ్జోయింపు. దే. వి. (ఉజ్జాయించు ధా.) 1. ఊహ. (బ్రౌ.) 2. దాదాపు, రమారమి. (వా.)

ఉజ్జ్వకల్లు. ద్వ. వి. అగ్నిపర్వతములనుండి వెడలఁ గ్రక్కఁబడిన ఱాయి. (శ. ర.)

ఉజ్జేని=ఉజ్జయిని. "ఉ... ను,జ్జేనికిఁ జేరఁబోవుట యుఁ జెప్పి..." దశ. 3, ఆ. ౫౯.

ఉటంకము. దే. వి. సంగ్రహము. (చూ. ఉటంకించు.)

ఉటంకి. దే. విశ. 1. చొఱవ గలవాఁడు, సాహసికుఁడు. (శ. ర.) 2. ధైర్యవంతుఁడు. (శ. ర.) 3. నీచుఁడు, దుర్మార్గుఁడు. "ఉ. ఓరి యుటంకి ...నా, కూరిమిపట్టి నిట్టినసగూఁటితనంబున బేలుపుచ్చి తౌ,రార..." విప్ర. ౪, ఆ. ౨౫.

ఉటంకించు. దే. స. క్రి. 1. సంగ్రహించు. (శ. ర.) 2. ఉదాహరించు. (వా.) 3. ఎత్తిపొడుచు. (వా.)

ఉటంకు=ఉటంకి. (శ. ర.) నీచురాలు. "సీ. పేరు కోఁ దగినట్టియూర లేనియుటంకు పరుల బుద్ధులకుఁ జొప్పడనిమంకు. గీ...అయ్యింతి తల్లి." శుక. 3, ఆ. ౧౭.

ఉటజము. సం. వి. అ. పుం. న. 1. పర్ణశాల, ఆకుటిల్లు. 2. గడ్డియిల్లు. 3. ఇల్లు. 4. మున్యాశ్రమము.

ఉటము. సం. వి. అ. న. 1. ఆకు. 2. గడ్డి.

ఉట్టంకణము. సం. వి. అ. న. స్థాపనము.

ఉట్టంకించు. సం. స. క్రి. స్తుతించు. "క. పంకజగర్భుం డైనను, శంకామతి నుండుఁ బొగడఁ జాలక నే నుట్టంకింపఁగలనె..." శతకంఠ. ౧, ఆ. ౧౨౭.

ఉట్టంకితము. సం. విశ. (అ.ఆ.అ.) స్థాపింపఁబడినది.

ఉట్టాడు. దే. అ. క్రి. ఊటాడు, త్వరపడు. "మ... చటులజ్యా ఘోషముం జేయున, య్యుమ ప్రాపొంది రతీశ్వరుఁడు హరు బిట్టోడింప నుట్టాడుచున్." పాండు. ౧, ఆ. ౧౭౯.

ఉట్టి. దే. వి. (క. ఉట్టి.) పిడతలు లోనగునవి యుంచుటకై వ్రేలాడఁగట్టుట కల్లిన చిక్కము, శిక్యము. "మత్త... తా,నుట్టి యందక ఱోళ్లఁ బీఁటలు నొక్కప్రో విడి యెక్కి చే, వెట్టఁజాలక కుండ క్రిం దొకపెద్దతూఁ టొనరించి మీ,పట్టి మీఁగడ పాలుఁ జేరలఁ బట్టి త్రావె దలోదరీ." భాగ. ౧౦, స్క. పూ. 3౧౦.

ఉట్టిచీల. దే. వి. ఇరుప్రక్కల తల యేర్పడిన చీల. (శ. ర.)

ఉట్టిపడు. దే. అ. క్రి. (ఉట్టి+పడు.) 1. కాఱు. స్రవించు. "ఉ...మద్వర వాక్యసీమకుం,బట్టము గట్టినాఁడ హరిఁ బాయక తత్కథనామృతంబు నే,నుట్టిపడంగఁ జెప్పుదు బుధోత్తము లానుఁడు శ్రోత్రపద్ధతిన్." భాగ. ౬, స్కం. ౨౪. 2. ప్రత్యక్షమగు, స్పష్టముగాఁ దోఁచు. "చ...జీవకళ యుట్టిపడన్..." ప్రభా. ౧, ఆ. ౧3౦. "సీ. బ్రహ్మతేజం బుట్టిపడుసెమ్మొగము తీవి రాకాశశాంక గౌరవముఁ దెల్పు." పెద. శకు. ౨, ఆ. ౫3. 3. అతిశయించు, పెంపొందు.

"క...ఆబాలురఁ గృపయుట్టిపడఁగఁ జూచి నృపతి యొయ్యన నగుచున్." కళా. ౬, ఆ. ౧౪౯. **4.** శీఘ్రముగా వచ్చు. "గీ. పిట్టదొర శౌరికట్టెడ నుట్టిపడియె." బహు. 3, ఆ. 3. **5.** అకస్మికముగా కలుగు. "గీ. ఉట్టిపడ్డట్లు కట్టి ట్టి నూఁదినట్లు, తేజ మెసఁగఁగ నామ్రోల దివ్య వాణి, పూని సాక్షాత్కరించి సంపూర్ణదృష్టిఁ జూచి యిట్లని పలికె మంజులముగాను." భాగ. ౬, స్కం. ౧౭. **5.** ఊడిపడు, దిగివచ్చు. "క...పెట్టన్, బుట్టవ యాఁదోడులతో, నుట్టి పడితె యాకసంబునుండి సమీరా." కాళిందీ. 3, ఆ. ౧౦౨.

ఉట్టు. దే. అ. క్రి. (క. హుట్టు.) **1.** పుట్టు,కలుగు. "ఉ...నేర్పునన్ సుదరు లాటపాటల వినోద ము సూపిరితీపు లుట్టఁగన్." ద్వా. ౭, ఆ. ౨3. **2.** స్రవించు, కాఱు. "ఆ. అగ్ని నెత్తు రుట్ట నమ్మ స్తకమువట్టుకొని..." భార. ద్రో. ౫, ఆ. ౨౦౫. "చ. అరిపయి వీక నెత్తి చనునప్పుడుఁ దేనియ లుట్టునట్లుగా,నరపతి వానివార్తలు వినం బ్రియ మాడుట మేలు..." భార. శాం. 3, ఆ. ౨౧. వి. ఉప్పు పుడఁదగిన నేలః (శ. ర.; బ్రౌ.)

ఉట్రవడియము. ద్వ. వి. కూరలలో వేయుటకై పెట్టిన చిన్న పిండివడియము, చిట్టివడియము. "క. గుడి మ్రింగెడువానికి లో,నడరెడు వే ల్పుట్రవడియ మగుఁ గద తలఁపన్." అచ్చ. సుం. ౧౫౫.

ఉట్లబొద్ది. దే. వి. ఒకానొకచెట్టు. (శ. ర.)

ఉతాణి. అన్య. దే. విశే. గొప్ప, ఉన్నతము.(శ.ర.)

ఉడాయించు. హిం. అ. క్రి. దాఁటు, పాఱిపోవు. (శ. ర.) సం. క్రి. అపహరించు, దొంగిలించు.

ఉడాయింపు. హిం. వి. **1.** పాఱిపోవుట. **2.** అపహ రించుట.

ఉడికించు. దే. స. క్రి. (ఉడుకు. ధా. ప్రే.) **1.** (పిండి కూర మున్నగునవి) ఉడుకునట్లు చేయు. వ్యవ:—జిగురునకై కొంచెము గోధుమ పిండి యుడికింపుము. **2.** ఎత్తిపొడుచు; పరిహా సము చేయుచు లోపములను చాటు. వ్యవ:— వానిని ఉడికింపకుము.

ఉడికిలు=ఉడికిల్లు. (ఆం. పా.)

ఉడికిల్లు. దే. అ. క్రి. **1.** ఉడుకు, తపించు. (శ.ర; బ్రౌ.) **2.** ఒరులు పరిహసించిన బాధపడు.(వా.)

ఉడిగపుఁగత్తె. దే. వి. (ఉడిగము+కత్తె.) ఊడిగము చేయు స్త్రీ, దాసి. "గీ. అన్నగేంద్రునికిని గిరి టార్పణకరియైన యుడిగంపుఁగత్తె మధ్యాహ్న లక్ష్మి." కళా. ౫, ఆ. ౧౭౯.

ఉడిగము. దే. వి. **1.** ఊడిగము, సేవ. "గీ. సమయ కృత్యంబు లప్పుడు సలుపఁ దలఁచు,నలిననాథుని చిత్తంబు దెలిసి సత్య, భామకనుసన్న నుడిగంపుఁ బద్మముఖులు, నిలిచి రంతంత వినయంబు దొలఁక నెదుట." పారి. ౨, ఆ. ౪. **2.** వినయము, విధే యత. "ఉ. కాలికిఁ గేలు సాఁచి యుడిగంబున మ్రొక్కుము రాచమిన్న యిల్లాలికి..." అచ్చ. యు. ౪౬౯.

ఉడిగించు=ఉడివించు. దే. స. క్రి. (ఉడుగు ధా. ప్రే.) **1.** నిలిపివేయు, మానిపించు. "క. కడవఁ బడి మున్ను పన్నిం, గడుకొని పడినవియ కాని కద్రూసుతులం,బడ్డనీ నింక నవశ్యము, నుడిగిం తును సర్పయాగ మోడకుఁ డింకన్." భార. ఆది. ౨, ఆ. ౨౨౨. **2.** సంహరించు, రూపు మాపు. "సీ. దైత్యు లుద్దండించి దండశంకుల శక్తు లిగిడించి రుడిగించె నింద్రసుతుఁడు." హర. ౭, ఆ. ౧౬౪. **3.** పోఁగొట్టు, అణఁచు. "ఉ...నీమదాంధ్య ముడిగించెద..." భార. ఆది. ౬, ఆ. ౨౯౪.

ఉడిగిపోవు. దే. అ. క్రి. (ఉడిగి+పోవు.) ఉడుగు, వ్యర్థమగు. "వ...ఉడిగిపోయిన మ్రాఁకునుం బోలెఁ బండ్లు డుల్లి..." కవిక ౪, ఆ. ౧౧3.

ఉడివించు. దే. స. క్రి. (ఉడుపు ధా. ప్రే.) **1.** నిలిపివేయు. "ఉ...సర్పయాగ ముడివింపు ము..." భార. ఆది. ౨, ఆ. ౧3౧. **2.** నశింపఁ జేయు. "ఉ...కామశక్తి యుడివింపఁగ శక్య మె యెట్టివారికిన్." భార. ఆది. ౭, ఆ. ౫౭.

ఉడివుచ్చు. దే. స. క్రి. (ఉడిగి+పుచ్చు.) చెఱచు, భంగపఱచు. "గీ. మునుపటి పతివ్రతలు..., మాన ముడివుచ్చుకొనిరఁటే మచ్చెకంటి." హంస. ౧, ఆ. ౧౨౭.

ఉడివోవు. దే. అ. క్రి. (ఉడిగి+పోవు.) **1.** నశించు. "చ. వలిమలయల్లువాఁడు తలవాఁక ధరించిన పూవుగుత్తి వేల్పులగమిజీవగఱ్ఱ యుడివోవని చల్వలచెంకి వెన్నెలల్, మొలచినపాదుపాల్కడలి ముద్దులపట్టి..." పారి. పీఠి. ౬. వరాహ. ౧, ఆ. ౯౦. **2.** వ్యర్థమగు. "ఉ. క్రచ్చఱ నెవ్వఁడేనిఁ గనుగొందక యుండఁ జకోరలోచనం, దెచ్చు నుపాయమార్గమునఁ దెచ్చినయప్పుడె యేను వానికిన్, మెచ్చుడివోవకుండ మఱి మీఁదటియీవులు వేయునుండనీ, యిచ్చితి నింద్రలోకపద మిందఱు సాక్షిగఁ బొందు గ్రమ్మఱన్." కాశీ. ౬, ఆ. ౨౩౬. "సీ. ఉడివోయె...అనఁగను వ్యర్థమయ్యెనటంట..." ఆం. శే. ౧౬. **3.** ఎడతెగు, విచ్ఛిన్నమగు. "సీ. ఉడివోనిమిన్కులీనెడిపేరు లిరుదెస..." వసు. ౧, ఆ. ౬. **4.** తొలఁగు, తప్పుకొను. "క. అడిసిగ్గులు తమకంబులు,నుడివోవఁగఁ గేలికడక లొదవఁగఁ జెయువుల్, తడఁబడ మఱపులు దెలుపులు, నడరి రతిక్రీడ సలిపి రతిపయుఁ బతియున్." మార్క. ౮, ఆ. ౧౯౫.

ఉడుఁగోఁత. దే. వి. (ఉడుగు+కోఁత.) పాదులు మొక్కలు మున్నగువాని కాపు ఉడిగిన వెనుకఁ గోయుకోఁత. (వా.)

ఉడుఁగోఁతపిందె. దే. వి. (ఉడుఁగోఁత+పిందె.) కాపుడిగిన వెనుక నిస్సారముగా బయలువెడలు పిందె. (వా. 'ఉడుఁబోతుపిందె' అని శ. ర.)

ఉడుఁదేనెలు. దే. విణ. (ఉడుగు+తేనెలు.) నశించిన తేనె కలవి, మధువు లేనివి. "ద్వి. కడివోవ నళు లానఁగా రేకు లెడలి, యుడుఁదేనెలైన పర్యుషిత పుష్పములు." పండితా. పురా. ౮౯, పు.

ఉడుఁబోతు. దే. విణ. (ఉడుగు+పోతు.) ఉడుగువాఁడు, విరతిశీలుఁడు. (శ. ర.)

ఉడుక. వై. వి. (సం. హుడుక్కా.) **1.** చర్మవాద్యవిశేషము. "చ. తొలకరిచూపు లింపొసఁగుధూమములై పయిఁ బర్వఁ గంధరోజ్జ్వలకలనిస్వనం బుడుకచాల్ రొదయై వినవేడ్కఁ దార్ప..." చంద్రి. ౨, ఆ. ౪౭. **2.** ఉక్కు, వేడిమి. "సీ. చర్మవాద్యమున శుష్కమునర్ష... బేరగు నుడు కనియెడునాఖ్య..." ఆం. సం. నానా. ౨౪.

ఉడుకాటము. దే. వి. ఉడుకుట. (శ. ర.)

ఉడుకాడు=ఉడుకు. (శ. ర.)

ఉడుకు. దే. అ. క్రి. **1.** తప్తమగు, కాఁగు. "సీ. కళపెళ నుడుకు చక్కని నూనియలు మీఁదఁ జిల్కఁజెల్లునె మీకుఁ జెలియలార." నీలా. ౩, ఆ. ౩౪. **2.** (వేఁడిమిచే) వాడిపోవు. "క. నలినాక్షుల బాహువుల మృణాళము లుడుకన్." వరాహ. ౪, ఆ. ౩౪. **3.** పరితపించు, బాధపడు. "గీ. హంసతూలికాతల్పములందుఁ బొందు, భోగిజనముల మృదుగాత్రములు ముడుఁడు, కంటె పరుసని ధరణిభాగమునఁ గూలి, యున్నయవి సూచువారలయుల్ల ముడుక." భార. స్త్రీ. ౨౧౪. **4.** (అన్నాదులు జలాదులచే) పరిపక్వమగు. "వ. చిచ్చు లాత్రంబులం దవిలించి చిముడ నుడికిన వెలువరించి..." స్కా. ౪, ఆ. ౬౦. **5.** ఒరులు పరిహసించినపుడుగాని లోపము లెత్తి పొడిచినపుడుగాని సహింపలేక కోపించు. వ్యవ:- ఉన్నమాట యన్న వాఁ డుడికి పోయినాఁడు. **6.** కోపించు. "క. విడువక తలపయిఁ గొన్నాళ్లిడి చూచి కళంకి వగుట యెఱిఁగి మహేశుం, డుడుకుచు దక్షాధ్వరమున, నడుగునఁ బడవైచె దాన నడఁగవు చంద్రా." స్కా. ౭, ఆ. ౪౩. వి. **1.** వేఁడిమి. "గీ...పగటి, యెండయుడుకాఱకుండ భూమండలమున." ఆము. ౨, ఆ. ౬౦. **2.** బాధ. "క. కడుఁ గ్రొవ్వి వాఁడు లోకము, నుడుకులఁ బెట్టంగ..." భార. అను. ౪, ఆ. ౪౦౭. **3.** తాపము. (శ. ర.) **4.** మనస్తాపము. "ఆ. ఓడి వచ్చినాఁడ నుద్ధతి నాకేల, యుడుకు మాని నీవ యుర్వి యేలు, గుఱ్ఱములును నేనుఁగులు లేనిబయలు నీ,తలనె కట్టుకొనుము ధర్మతనయ." భార. శల్య. ౨, ఆ. ౭౨. **5.** వేఁడివేఁడి పాయసము. "ఉ...మీరవుగాము లేవియుఁ, జూడక యేల యిట్లుడుకు జుఱ్ఱెదరు..." పరమ. ౫, ఆ. ౫౬. (ఉడుకు జుఱ్ఱు=త్వరపడు అని భావము.) విణ. వేఁడిమి గలది. "చ. పడమరవెట్ట నయ్యుడుకు ప్రాశన మొల్లక కూటిపేదలై..." ఆము. ౨, ఆ. ౪౯.

ఉడుకుఁబోతు. దే. విశే. (ఉడుకు+పోతు.) ఎవరైనను పరిహాసము చేసినఁ గాని యెత్తి పొడిచినఁ గాని సహింపలేక కోపము దుఃఖము తెచ్చుకొని బాధపడువాఁడు. (వా. శ. ర.)

ఉడుకువ. దే. వి. ఎడతెఱపి, విరామము. "చ. ఉడుకువ లేనికయ్యమున కోర్వఁగ వచ్చునె..." భార. విరా. ౫, ఆ. ౧౮౬., ౨, ఆ. ౩౧౫.

ఉడుకెత్తు. దే. అ. క్రి. (ఉడుకు+ఎత్తు.) కాఁగు, వేఁడెక్కు. "గీ. వెంటనె తపోగ్ని ఘోరమై వెడలుటయును, శరధు లుడుకెత్తె సురగిరి గరఁగె..." దశా. ౪, ఆ. ౭౬.

ఉడుక్క=ఉడుక. (శ. ర.)

ఉడుగర. దే.వి. 1. ఉపహారము, కానుక. "క. కలిమి మెఱయంగ మఱియున్,గలబాంధవు లొసఁగిరపుడు కాంచనమణిభూషలుఁ జీరలు నరపతికిన్ బొలఁతికి నుడుగరలు ముదముపొదలఁగనంతన్." స్వా. ౫, ఆ. ౯౭., ఆం. శ. ౭౦. 2. పారితోషికము, బహుమతి. "సీ. తన ధాటిపదము లందమున విన్పించుగంధర్వుల కుడుగరల్ దయ నొసఁగుచు." దశా. ౨, ఆ. ౧౦౩. 3. కానుకగా నిచ్చుసన్నని నూలుబట్ట. "సీ. తనరంభ వారి కీయ నటించు వాదించుకొం బేరి కుడుగర గప్పవలసె." కువల. ౧, ఆ. ౪౬., ఆం. భా. ద్వి. ౧౫౨.

ఉడుగు. దే. అ. క్రి. (క. ఉడుగు.); 1. అఁగు అఁపుచేయు. "క. కదియుచుఁ బాయుచుఁ బట్టుచు,నువలుచుచుం బడుచు లేచు చుడుగుచు... పెనఁగిరి..."భార.విరా.౨,ఆ.౩౪౮. "క. ఉడుగుడుగు మోహనాస్త్రము, విడువకు మనునెలుఁగుతోడ వేగంబున న,య్యెడ కేఁగుదెంచి నారదుఁ,డు..." భార. ఉద్యో. ౪, ఆ. ౩౪౮. 2. నశించు. "సీ. రోగాపమృత్యువార్తాగంధ మెడలెను జారచోరాదులపేరు నుడిగె." రాఘవ. ౪, ఆ. ౨౫౯. 3. కృశించు. (శ. ర.) 4. ఇంకిపోవు. "క. వనరాసు లేడు నుప్పరి, పెనమున నీరులును బోలెఁ బెల్లున నుడిగెన్." కు. సం. ౬, ఆ. ౧౫౫. 5. దాఁగుకొను, ప్రకటము గాకుండు. "ఆ. అనిన ధౌమ్యుఁ డిట్టు లనియె నీవత్సర, మొకఁడు నెట్టు లయిన నుడిగి మడిఁగి, సంకటముల కోర్చి చరియించి యాపద, నిస్తరించి పిదప నెగడవలయు." భార. విరా. ౧, ఆ. ౧౪౩. 6. శ్రమపడు, బాధనందు. "గీ. ఉపవసింతుము గాక నేఁ డుడిగి మడిఁగి, యస్తమించుచు నున్నవాఁ డహిమభానుఁ, డెల్లి పారణకైన లే దెట్టు మనకు, మాధుకరభిక్ష బ్రాహ్మణ మందిరముల." కాశీ. ౭, ఆ. ౧౫౩. స. క్రి. మాను, విడుచు. "ఉ. ఉత్పలగంధి నన్నుడిగి యొద్దను బంపుము..." భార. విరా. ౨, ఆ. ౯౩.

ఉడుచు. దే. స. క్రి. (ఉడుగు ధా. ప్రే.) 1. ఉపసంహరించు, మరలించు. "క. ధరణీదిశాప్రసారిత,గురుకరనికరంబు లుడిచికొని దీర్ఘ నిరం,తర గతి ఖిన్నుఁడపోలెను, హరిదశ్వుఁడు విశ్రమించె నస్తాద్రి దరిన్." భార. ఆది. ౬, ఆ. ౧౭౫. 2. సమయఁజేయు, క్షీణింపఁజేయు. "వ...వారాశియుంబోలె బోరన మ్రోయుచున్న వాదిత్ర శబ్దంబు లుడిచి నా ప్రియశిష్యుం డయిన యర్జును ధనుఃకౌశలంబుఁ జూడుం డనిన..." భార. ఆది. ౬, ఆ. ౧౬., నృసిం. ౧, ఆ. ౨౫.

ఉడుత. దే. వి. తరుమూషికము, వీఁపున మూఁడు చారలు గల జంతువిశేషము. "సీ. ఉఱుతనా నుడుతనాఁ దరుమూషికం బగు..." ఆం. భా. ద్వి. ౮౭.

ఉడుతచాఱలు. దే. వి. బ. (ఉడుత+చాఱలు.) ఉడుతచాఱలవంటి చాఱలు గలవస్త్రవిశేషము. "గీ...ఉడుత,చాఱ లేనుఁగడుగు లన మిఱు నిట్లు, చిత్రవస్త్ర విశేషముల్..." ఆం. భా. ద్వి. ౧౫౪.

ఉడుతభక్తి. మి. వి. (ఉడుత+భక్తి.) ఉడుత చూపినభక్తి; యథాశక్తి భక్తితో చూపు సౌహార్దము. (వా.) (తొల్లి శ్రీరాముఁడు వారిధి గట్టు సమయమున వానరులు కొండలు మోసికొని వచ్చి తోడ్పడుచుండ నొకయుడుత శ్రీరామ కార్యమునఁ దనజీవితము సార్థకము చేసికొను తలంపుతో భక్తిభరిత హృదయమున నిసుకలోఁ బొరలాడి దేహమున కంటుకొన్న యిసుక రేణువు లావారిధిపై రాలిచి పోవుచుండ శ్రీరా

ముఁడు దానిభక్తికి సంతసించి వాత్సల్యముతో దానివీఁపుపై మూఁడువ్రేళ్లతో నిమిరిన మూఁడు చాఱ లేర్పడెను. నాఁటినుండి యుడుతభక్తి సామెత యైనది.) 2.

ఉడుపకుక్క. ద్వ. వి. (ఉడుము+కుక్క.) ఉడుములను కుందేళ్లను మున్నగువానిని వేఁటాడు కుక్క. "గీ. ఉడుపకుక్కలు కుందేళ్ల నుందురుపుల,నుడుముల గ్రహింప..." స్వా. ౪,ఆ.౫౧.

ఉడుపతి. సం. వి. ఇ. పుం. 1. చంద్రుఁడు. 2. వరుణుఁడు.

ఉడుపథము. సం. వి. ఇ. పుం. న. తారాపథము, నక్షత్రమార్గము.

ఉడుపము. సం. వి. అ. పుం. న. ప్లవము, తెప్ప.

ఉడుపు. దే. స. క్రి. (ఉడుగు ధా. ప్రే.) 1. అణఁచు, అణఁగఁగొట్టు. "క...ఉడిపెద నీగ, ర్వోన్నతి..." భార. ఉద్యో. ౪, ఆ. ౩౪౧. "క...కురుబలముపేర్మి యుడిపెం దోర్దర్పన్." భార. విరా. ౫, ఆ. ౫౯. 2. బంధించు, అడ్డగొట్టు. "క. మురనరకాసురు లిరువురు, సురలరిగెడుత్రోవ లుడిపి..." ఉ. హరి. ౧, ఆ. ౯౭. 3. విసర్జించు, విడుచు. "క. అని చూపఱకద్భుతముగ,దనుజుఁడు యుద్ధంబు చేసి తచ్ఛక్తిఁ దుదన్,దనువుతగు లుడుచుకొనియెం, దనవారలు గలఁగఁ బగఱదళములు సెలఁగన్." రాఘవ. ౪, ఆ. ౨౦౫. 4. పోఁగొట్టు, నశింపఁజేయు. "గీ. లేము లుడిపెదు లేఁజూపు లేమతోడ." ఆము. ౧, ఆ. ౧౨. 5. ఆఁపు, విరమించు. "క. ఏయెడఁ బతిఁ బొడగానక..., వాయుడుపక చీరు నేడ్చు వడి వాపోవున్." కు. సం. ౫, ఆ. ౬౯. వి. (క. ఉడుపు.) 1. వస్త్రము. (వా) 2. దుస్తు. (వా)

ఉడుము. దే. వి. (క. ఉడు. త. ఉడుంబు.) బల్లివలె నుండి యంతకన్నఁ జాలపెద్ద దగుజంతువు, గోధ. "గీ. ఉడుము నడిఁకిన నడుఁకునే బడియ పెట్టు." కాశీ. ౨, ఆ. ౧౪౪. "గీ. ఉడుము తేళ్లు మేపరి యన నొనరుచుండు, నవని గోధేర నామధేయములు..." సాం. ని. తిర్య. ౭౬.

ఉడుపుష్పము. సం. వి. అ. న. జపాపుష్పి, దాసనపువ్వు.

ఉడుపు. ఉభ. దే. స. క్రి. ఉడుగు, మాను. (శ.ర.) అ. క్రి. 1. ఉపశమిల్లు, తగ్గు. "క. అడలుచుఁ బెదవులు దడుపుచు, గుడికొనుకన్నీరు గ్రుక్కుకొనుచున్ మదిలో,నుడుపని నెంజిలి నేమియు, నుడుపని యమ్మానధనుఁ గనుంగొని వేగన్." సా. ౩,ఆ.౧౬౪. 2=ఉడుగు. (చూ. ఉడుగు.)

ఉడుసర. దే. వి. కాఁచి, వాయసి ♆. (శ. ర.)

ఉడుక్క=ఉడుకు. 1. (వేఁడియైనది.) "చ. కరమున నున్నపుక్కయును గామునిభూతియు నుడుక్కఫాలమున్, గరివరచర్మమున్ దొఱఁగి ..."విక్ర.౧,ఆ.౭౩. 2. (క్రాఁగునది.)"సీ. దానిచేరువ నుడుక్కనుంసకొప్పెరపొంత విపులమౌ కనకమండపముక్రింద." ద్వా. ౬, ఆ. ౧౧౯.

ఉడుక్కవ=ఉడుకువ. (విరతి, ఉడుకుట.) "చ. వలవదు రోయఁ బాండవుల వారొకయుడుక్కవ లేని త్రిమ్మటన్,బల మఱి వన్యసత్త్వములపాల్పడి చచ్చినచోటఁ బూరియున్,మొలవదె..." భార. విరా. ౩, ఆ. ౯౬. (శ. ర. పా; పాఠాంతరమును. 'ఉడుకుట' ముద్రి.).

ఉడ్డ. దే. వి. (క. ఉడ్డి.) 1. నాలుగు. (చూ. ఉడ్డకేల్ దొర.) 2. రాశి, సమూహము. (శ. ర.)

ఉడ్డకేల్ దొరబిడ్డ. ద్వ. వి. (ఉడ్డ+కేలు+దొర+బిడ్డ.) విష్ణువు. "సీ. జిడ్డు సంద్రపుటల్లుఁ డుడ్డకేల్ దొరబిడ్డ వేగంటినైదోడు వెన్నదొంగ." వేంక. దేవ. ౪.

ఉడ్డకేల్ మిడి దొరబిడ్డ. ద్వ. వి. (ఉడ్డ+కేలు+మిడి+దొర+బిడ్డ.) గుహుఁడు. వేంక. దేవ. ౯

ఉడ్డకేలుగలాఁడు. ద్వ. వి. (ఉడ్డ+కేలు+కలాఁడు.) చతుర్భుజుఁడు, విష్ణువు. సాం. ని. దేవ. ౪.

ఉడ్డకేలువేలుపు. ద్వ. వి. (ఉడ్డ+కేలు+వేలుపు.) విష్ణువు, చతుర్భుజుఁడు. (శ. ర.)

ఉడ్డబుగడలు. దే. వి. బ. (ఉడ్డ+బుగడలు.) ఆఁడువారు కొనచెవిని ధరించెడు నాలుగుపేఁటలు గలహారవిశేషము, చెంపసరములు. "సీ. మెఱుఁ

గంచు కమ్మలు...ఉడ్డబుగడలు కట్లసరులు." హంస. ౪, ఆ. ౧౩౮. (ముద్రితపాఠము. 'ఉడ్డబుడగ'లని సూ. ని.)

ఉడ్డమోమువేలుపు. ద్వి. వి. (ఉడ్డ+మోము+వేలుపు.) బ్రహ్మ, చతుర్ముఖుఁడు. (శ. ర.)

ఉడ్డా=ఉడ్డ. (శ. ర.)

ఉడ్డాడించు. దే. స. క్రి. **1.** త్రిప్పు, చుట్టును గదలించు. "మ. ఇభలోకేంద్రుఁడు హస్తరంధ్రముల నీరెక్కించి పూరించి చం,డభమార్గంబున కెత్తి నిక్క వడి నుడ్డాడించి పింజింప..." భాగ. ౮, స్కం. ౪౭. **2.** కలఁచు క్షోభపెట్టు. "క. పోయెదఁ బోయెద నంచి, ట్లోయంచలతల్లి యేల యుడ్డాడింపన్, మాయే కాంతపుఁ బనికిని,నీయునికి విరోధి గాదు నిర్వాహకమున్." ప్రభా. 3, ఆ. ౭౦. **3.** పీడించు, బాధపెట్టు. "శా. వాపోచున్ క్షుధఁ గుంది బాల సుతు లవ్వా బువ్వ బువ్వంచు ని,ల్లాపెన్ జీర్ణపటాపకర్షముల నుడ్డాడింపఁగాఁ జూచి..." మల్లభూ. వై. ౨౧. **4.** న్యూనపఱచు, తక్కువచేయు. "మ. అస దౌకౌనుబెడంగు సింగముల నుడ్డాడింప..." ముకుంద. ౨, ఆ. ౨౧౦.

ఉడ్డాడు. దే. అ. క్రి. క్షోభించు, కలఁతనందు. "ద్వి. వేగ నందునిపల్లె వెఱచి యుడ్డాడ,నలయక వర్షించుఁ డని పల్క యనుప." ద్వి. భాగ. ౧౦, స్కం. (శ. ర.)

ఉడ్డామరము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** భయంకరమైనది. **2.** శ్రేష్ఠమైనది.

ఉడ్డినము. సం=ఉడ్డీనము.

ఉడ్డీనము. సం. వి. అ. న. పైకెగురుట, నెగవు. విణ. (అ. ఆ. అ.) పైకెగిరినది.

ఉడ్డు. దే. వి. **1.** కలఁత, క్షోభము. (చూ. ఉడ్డాడు.) **2.** ఉక్కిరిబిక్కిరి. (చూ. ఉడ్డుగుడుచు.)

ఉడ్డుగుడుచు. దే. అ. క్రి. (ఉడ్డు+కుడుచు.) ఉక్కిరిబిక్కిరి యగు. "సీ. బేతాళములు నీళ్లఁ ద్రేసి తొక్కఁగఁ జాళి యుదుటెల్లఁ బెడఁబాసి యుడ్డుగుడిచె." దశా. ౨, ఆ. ౪౦౯.

ఉడుపు=ఉడుపు. (తీర్చు, మానుపు.) "ద్వి. వేలిమి సమిధలు వెలయ దర్భలును, బాలురపో రుడ్పఁ బండ్లు దోసెఁడును." ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౧౮.

ఉడ్రము. సం. వి. అ. పుం. ఓఢ్రదేశము.

ఉడ్లపల్లంచి. దే. వి. బాలికా క్రీడావిశేషము. (శ. ర.)

ఉతక. దే. వి. కవాటమూలాలవాలము, తలుపు బందులు అనుగొడిసె. "ఆ. ఉతకలోని తలుపు నూఁగించి నెట్టెడి,పద నెఱిఁగి లోనఁ బట్టుఁ బట్టు,మతిని గూడి మించి మర్మంబు గనుమయా, విశ్వ..." వేమన. ౧౨౦౪.

ఉతము. సమా. విణ. (అ.ఆ.అ.) **1.** ఊతము, నేయఁబడినది. **2.** స్యూతము, కుట్టఁబడినది.

ఉతుకు. దే. స. క్రి. **1.** మురికిపోవుటకై తడిపిన బట్టలు బాలిమీఁద వేసి గుంజు. (శ. ర. వా.) **2.** కొట్టు. వ్యవ:—వానిని రెం డుతుకుము.

ఉత్క. సం. వి. ఆ. స్త్రీ. ప్రియుఁడు రానందునఁ గలిగిన చింతతో సంకేతస్థలమును జేరు నాయిక.

ఉత్కంఠ. సం. వి. ఆ. స్త్రీ. **1.** ఆయల్లకము, ఇష్టవస్తుప్రాప్తికై పడువేగిరపాటు. **2.** చింత, విరహాదులవలనఁ గలుగువిచారము. **3.** సితవీర్య, జీలుగు ⚘.

ఉత్కంఠిత. సం. వి. ఆ. స్త్రీ. విరహోత్కంఠిత, ప్రియుఁడు వేళకురామి విచారించు నాయిక.

ఉత్కంపము. సం. వి. అ. పుం. వడఁకు. విణ. (అ.ఆ.అ.) వణఁకునది.

ఉత్కంపి. సం. విణ. (ని. నీ. ని.) **1.** వడఁకునది. **2.** వడఁకించునది.

ఉత్కంపించు. సమా. స. క్రి. వణఁకు. "మ...ఉదగ్రులై నడిచి రుత్కంపింపఁ ద్రైలోక్యమున్." హరి. ఉ. ౯, ఆ. ౧౬౩.

ఉత్కటము. సం. వి. అ. పుం. **1.** మదగజము. **2.** ఎఱ్ఱచెఱకు ⚘. **3.** తెల్లు ⚘. **4.** ఆకు, పత్త్రి ⚘. న. లవంగపుఁబట్ట, దాల్చినచెక్క. విణ. (అ.ఆ.అ.) **1.** అధికమైనది. **2.** మదించినది. **3.** తీవ్రమైనది. **4.** విషమమైనది. **5.** బలముగలది.

ఉత్కము. సం. విణ. (అ. ఆ. అ.) ఉత్కంఠ గలది.

ఉత్కరము. సం. వి. అ. పుం. 1. గుంపు. 2. ధాన్యాదుల రాశి. 3. పెంట.

ఉత్కర్తనము. సం. వి. అ. న. త్రుంచుట.

ఉత్కర్షము. సం. వి. అ. పుం. 1. పైకి లాగుట. 2. ఆధిక్యము. 3. శ్రేష్ఠత్వము.

ఉత్కర్షించు. సం. స. క్రి. స్తుతించు. "క. ఉరగేంద్రుఁడఁ గాను నిన్ను నుత్కర్షింపన్." వేం. పంచ. ౨, ఆ. ౧౬౫. అ. క్రి. అతిశయించు, పెంపొందు. "క...మహిత దానంబున, నుపచిత మగువిద్య తపము నుత్కర్షించున్." భార. అను. ౪, ఆ. ౩౫౧.

ఉత్కలనము. సం. వి. అ. న. వివాహోద్యుత్సవము.

ఉత్కలము. సం. వి. అ. పుం. ఓఢ్రదేశము.

ఉత్కలిక. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉత్కంఠ. 2. పెద్ద అల. 3. హేల, విలాసము. 4. మొగ్గ. 5. కామాదులవలనఁ గలుగు స్మరణము. 6. ఛందోభేదము.

ఉత్కలుఁడు. సం. వి. అ. పుం. 1. ఓఢ్రదేశస్థుఁడు. 2. బోయవాఁడు. విణ. (అ. ఆ. అ.) భారము మోయువాఁడు.

ఉత్కారము. సం. వి. అ. పుం. 1. ధాన్యము మున్నగువానిని తూర్పెత్తుట. 2. ధాన్యాదులను రాశి చేయుట.

ఉత్కీర్ణము. సం. విణ. (అ.ఆ.అ.) 1. పైకి చిమ్మఁబడినది. 2. చెక్కఁబడినది. 3. తొలువఁబడినది.

ఉత్కీర్తనము. సం. వి. అ. న. 1. స్తుతించుట. 2. బిగ్గరగా పలుకుట. 3. చాటుట, ప్రకటించుట.

ఉత్కుణము. సం. వి. అ. పుం. 1. నల్లి. 2. పేను.

ఉత్కూలము. సం. విణ. (అ.ఆ.అ.) గట్టువఱకుఁ గలది. "క. ఉత్కూలజలాఢ్య మైన యొకనది గంటిన్." ద్వా. ౩, ఆ. ౧౦౦.

ఉత్కూలితము. సం. విణ. (అ. ఆ. అ.) గట్టునకుఁ జేర్పఁబడినది. శిశు. ౩, స. ౭౦ శ్లో.

ఉత్కృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. గొప్పపని. 2. గొప్ప గ్రంథము. 3. ప్రతిపాదమును ౨౬ అక్షరము లుండు ఛందోవిశేషము.

ఉత్కృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. శ్రేష్ఠము. 2. గొప్పది. 3. దున్నఁబడినది. 4. అధికము. 5. పైకి లాగఁబడినది.

ఉత్కోచము. సం. వి. అ. పుం. 1. లంచము. 2. ప్రమాణము. "క. తత్కాలమ్మున నిలువక, యుత్కోచము చేసి తప్పియును భవదాజ్ఞా, సత్కారముఁ దలఁపుచుఁ జని..." ద్వా ౩, ఆ. ౧౦౦. 3. ఉపాయము, కానుక.

ఉత్కోచుఁడు. సం. విణ. (అ. ఆ. అ.)—కానుక పొందఁ దగినవాఁడు—నేర్పరి. "మ...అతఁ డుత్కోచుఁడు వాచాలతన్." పాండు. ౩, ఆ. ౬.

ఉత్క్రమణము. సం. వి. అ. న. 1. మీఁదికిఁ బోవుట. 2. తొలఁగుట. 3. మీఱుట.

ఉత్క్రమము. సం. వి. అ. పుం.=1. ఉత్క్రమణము. 2. క్రమము తప్పుట.

ఉత్క్రమించు. సం. అ. క్రి. నిష్క్రమించు, వెడలిపోవు. (ప్రాణి) "గీ. తాపమున దప్పి నాఁకటఁ దప్పుఁ డగుచు, దుస్సహక్లేశమున మహాతురత యొదవ, నొరలుచును దేహ మొకభంగి నుత్క్రమించు." కవిక. ౫, ఆ. ౧౧౧.

ఉత్క్రాంతి. సం. వి. ఇ. స్త్రీ.=ఉత్క్రమణము. మరణము.

ఉత్క్రామము. సం. వి. అ. పుం.=ఉత్క్రమము.

ఉత్క్రుష్టము. సం. వి. అ. న. 1. గట్టిగా పిలుచుట. 2. పైకి గట్టిగా నేడ్చుట. విణ. (అ.ఆ.అ.) 1. గట్టిగా పిలువఁబడినది. 2. గట్టిగా నేడ్చినది.

ఉత్క్రోశము. సం. వి. అ. పుం. 1. మొఱ్ఱ. 2. చాటింపు. 3. ఒకజాతి పక్షి. విణ.=ఉత్క్రుష్టము.

ఉత్క్రోశించు. సం. అ. క్రి. ఉప్పొంగు, హర్షించు. "శా...సుర లుత్క్రోశించి వర్ణింపఁగన్." ద్వా. ౪, ఆ. ౨౭౫.

ఉత్క్షిప్తము. సం. వి. అ. పుం. ఉమ్మెత్త ⚘. విణ. (అ.ఆ.అ.) 1. ఎగఁజిమ్మఁబడినది. 2. పైకెత్తఁబడినది. 3. తొలఁగింపఁబడినది.

ఉత్క్షేపణము. సం. వి. అ. న. 1=ఉత్క్షేపము. 2. పదియాఱుపణముల మానము. 3. వీవన. 4. రోఁకలి.

ఉత్క్షేపము. సం. వి. అ. పుం. 1. ఎగఁజిమ్ముట. 2. పంపుట. 3. ఢోఁకు. 4. ఎగరఁబోయఁబడిన ధాన్యాదికము. 5. పాఱవేయుట. విణ. (అ.ఆ.అ.) ఎగఁజిమ్మునది.

ఉత్క్షేపించు. సం. స. క్రి. ఎగఁజిమ్ము. "మ. గిరిరుద్ధాంఘ్రిలు మింటితో నొఱయ నుత్క్షేపించు లాంగూలముల్." భా. రా. కిష్కిం. ౨౦౭.

ఉత్ఖల. సం. వి. ఆ. స్త్రీ. ముర యను గంధద్రవ్యము ⚘.

ఉత్ఖాతము. సం. వి. అ. న. త్రవ్వుట. విణ. (అ.ఆ.అ.) 1. త్రవ్వఁబడినది. 2. పెల్లగింపఁబడినది.

ఉత్త. వై. విణ. (సం. రిక్తః.) 1. వట్టిది. ఉదా:—ఉత్తచెయ్యి. 2. కేవలము. ఉదా:—ఉత్త అన్నము. 3. అసత్యము. ఉదా:—ఉత్తమాట. 4. పనిలేనిది. ఉదా:—ఉత్తప్పుడు. 5. లేనిది, కల్పితము. ఉదా:—ఉత్తనాటకము. 6. లేనిపోనిది, అనవసరముగా మీఁద పడినది. ఉదా:-ఉత్తగొడవ. 7. వ్యర్థము. "ఆ. ఉత్తతిత్తి దీనియుపయోగములు లేవు." వేమన. ౧౫. (దీని యామ్రేడితరూపము ఉత్తుత్త.)

ఉత్తండ. సం. వి. ఆ. స్త్రీ. ఒకరకముకానుగు ⚘.

ఉత్తండము. దే. వి. స్త్రీ కంఠభూషావిశేషము. "సీ. సరిగె ముక్కర బన్నసరము నుత్తండాలు కంకణంబులు తట్లు కడియములును." హంస. ౨, ఆ. ౧౩౦., ఆం. భా. ద్వి. ౧౪౯.

ఉత్తంభము. సం. వి. అ. న=ఉత్తంభము.

ఉత్తంభనము. సం. వి. అ. పుం. 1. ఆధారము. 2. ఆఁపుట. 3. వృద్ధిచేయుట.

ఉత్తంభించు. సం. స. క్రి. 1. నిలుపు. (శ. ర.) 2. పొడిగించు. (శ. ర.)

ఉత్తంసము. సం. వి. అ. పుం. 1. తలమానికము, శిరోభూషణము. 2. పూఁగమ్మ, చెవినగ. 3. కిరీటము. 4. శ్రేష్ఠవాచకము. ఉదా:—వనితోత్తంసము.

ఉత్తప్తము. సం. వి. అ. న. 1. మిక్కిలి వేఁడిమి. 2. సంతాపము. 3. ఎండినమాంసము. విణ. (అ. ఆ. అ.) 1. కాఁగినది. 2. కాలినది. 3. సంతాపము నందినది. 4. కదలినది. 5. స్నానము చేసినది.

ఉత్తమ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉత్తమురాలు. 2. చిఱుపాల ⚘. 3. ఒకవిధమైనపొక్కు. 4. నేల ఉసిరిక ⚘. 5. నాయికాభేదము.

ఉత్తమర్ణుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) అప్పిచ్చువాఁడు. (వ్యతి. అధమర్ణుఁడు.) "క. అధిప విను ధనంజయుచే, నిధనంబై ముక్తిఁ జేకొనియెఁ గావున నవ్విధుకులజుఁ డుత్తమర్ణుం,డధమర్ణుఁడ కర్ణుఁడు..." జై. ౧, ఆ. ౬౪.

ఉత్తమపురుషము. సం. వి. అ. పుం. నేను మేము మనము కర్తగాఁ గల క్రియారూపము.

ఉత్తమము. సం. విణ. (అ.ఆ.అ.) 1. శ్రేష్ఠమైనది. 2. ముఖ్యము. 3. రెండింటికన్న నధికముగాఁ గలవర్ణములలోఁ గడపటిది.

ఉత్తమాంగము. సం. వి. అ. న. 1. శిరస్సు, తల. 2. శిశ్నము, మగగుఱి. 3. యోని, ఆఁడుగుఱి.

ఉత్తమాంగుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. యోగ్యుఁడు. 2. మంచిముఖము కలవాఁడు.

ఉత్తమీయము. సం. విణ. (అ.ఆ.అ.) ఉత్తమమైన దానికి సంబంధించినది.

ఉత్తము. సం. విణ. (అ.ఆ.అ.) ఆర్ద్రము, తడిసినది.

ఉత్తర. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉత్తరదిశ. 2. ఉత్తరఫల్గునీ నక్షత్రము. 3. విరటునికూఁతురు. 4. ధనుర్లక్ష్మి.

ఉత్తరంగము. సం. వి. అ. న. ద్వారముమీఁది కమ్మి. విణ. (అ.ఆ.అ.) 1. పైకి లేచినతరంగములు గలది. 2. అలలవలె నెగిరిపడునది. 3. చాపల్యము గలది.

ఉత్తరక్రియ. సం. వి. ఆ. స్త్రీ. 1. తరువాత చేయు పని. 2. అపరకర్మము.

ఉత్తరజంఁదెము. మి. వి. (ఉత్తర+జంఁదెము.) 1. యజ్ఞోపవీతముతో ధరించు మఱియొక సూత్రము. (వా) 2. జంఁదెములవలె ధరించు ముత్యముల హారము మున్నగునాభరణవిశేషము.

ఉత్తరజన్నిదము. మి. వి=ఉత్తరజంఁదెము. "సీ. ఇభకుంభమణు లెడసెడఁ గూర్చుగురివెంద జమలి యుత్తరజన్నిదములు దనర." రా.వి. 3,ఆ.38.

ఉత్తరడొక్కరము. వై. వి. (సం. ఉత్తరదోఃకరమ్.) మల్లబంధ విశేషము. (శ.ర.)

ఉత్తరమీమాంస. సం. వి. ఆ. స్త్రీ. వేదవ్యాస విరచిత మగు శారీరక సూత్రగ్రంథము. (ఇది వేద విహిత మగు జ్ఞానకాండకు సంబంధించినది. కర్మకాండకు సంబంధించినది 'పూర్వమీమాంస.')

ఉత్తరణము. సం.వి.అ.న. దాఁటుట. విణ. (అ.ఆ.అ.) దాఁటునది.

ఉత్తరదోఃకరము. సం. వి. అ. న. మల్లబంధ విశేషము. (శ. ర.)

ఉత్తరపక్షము. సం. వి. అ. పుం. 1. కృష్ణపక్షము. 2. సిద్ధాంతము. (వ్యతి. పూర్వపక్షము.)

ఉత్తరపదము. సం. వి. అ. న. 1. తర్వాతిమాట. 2. సమాసములోని తుదిపదము.

ఉత్తరపూర్వము. సం. వి. ఆ. స్త్రీ. ఈశాన్యదిక్కు.

ఉత్తరఫల్గుని. సం. వి. ఈ. స్త్రీ. ఒక నక్షత్రము, ఉత్తరఫాల్గుని. (నక్షత్రము లిరువదేడింటిలో పండ్రెండవది.)

ఉత్తరభద్రపద. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక నక్షత్రము, ఉత్తరభాద్రపద.

ఉత్తరము. సం. వి. అ. పుం. 1. భవిష్యత్కాలము. 2. అనంతర ప్రదేశము. న. 1. సమాధానము, జవాబు. 2. ప్రతివాదము. 3. పూర్వపక్ష ఖండనము. 4. సిద్ధాంతము. 5. పైభాగము. 6. వామ భాగము. 7. ఉత్తరించుట, దాఁటుట. 8. రెండు సంఖ్యలకుఁ గలభేదము. 9. జాబు, లేఖ.

ఉత్తరవయస్సు. సం. వి. స్. న. వార్ధక్యము, ముదిమి.

ఉత్తరవస్త్రము. సం. వి. అ. న. ఉత్తరీయము, పైబట్ట.

ఉత్తరవాసము. సం. వి. స్. న.= ఉత్తరవస్త్రము. "సీ. చంద్రాతపముతోడ సరియైన వెలిపట్టుపుట్టము త్తరవాసముగ ధరించి." నైష. ౯,ఆ.౧౦3.

ఉత్తరవాసస్సు. సం=ఉత్తరవాసము.

ఉత్తరసాక్షి. సం. వి. న్. పుం. 1. సాక్షులు చెప్పిన దానిని ధ్రువపఱచుసాక్షి. 2. తనపై మోపఁబడిన నేరము పరిహరించుటకుఁ దెచ్చుకొను సాక్షి.

ఉత్తరస్ఫుటితము. సం. వి. అ. న. యోనియందు చేయు చుంబనము. "సీ. చిత్తజు గృహమునను త్తరస్ఫుటితంబు పొక్కిట సంపుటంబును శిరోధి, ననుపదం బూరుల నన్వితం బన నొప్పు దళ చుంబనములు దత్తత్ స్థలముల." హంస. ౫, ఆ. ౧౪౯.

ఉత్తరాయణము. సం. వి. అ. న. సూర్యుఁడు ఉత్తరముగాఁ బోవు ఆఱుమాసములకాలము. (మకర సంక్రాంతి మొదలు కర్కటక సంక్రాంతివఱకుఁ గలకాలము.)

ఉత్తరాభాద్ర=ఉత్తరభాద్రపద. ఇరువదియాఱవ నక్షత్రము.

ఉత్తరాషాఢ. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక నక్షత్రము.

ఉత్తరాసంగము. సం. వి. అ. పుం=ఉత్తరీయము.

ఉత్తరాపి. దే. వి. తలుపుక్రిందఁ దిరిగెడు కుఱుసము. (శ. ర.)

ఉత్తరించు. ఉభ. దే. స. క్రి. 1. ఖండించు, నఱకు. "చ...అమ్మగలమగండు వీఁక దళమం బగు మస్తక ముత్తరించి వ్రేల్వఁ గడఁగి..." ఉ.రా. ౫, ఆ. ౧౭3. 2. తెగడు, తిరస్కరించు. "వ...చక్కెరల ధిక్కరించి తేనెలం బోనాడి చెఱకురసంబుల నిరసించి మధురిమ నమరు నధర బంధుజీవప్రసూనంబును మొల్లల నుల్లసంబాడి యాణిముత్తియంబుల నుత్తరించి సుధాబిందువులఁ బలువరుసల సరసంబాడు పలువరుసయు ..." పాండు. 3, ఆ. ౧౬౯. సం. స. క్రి.

1. (నద్యాదులను.) దాఁటు. “వ. ఇట్లుద్ధవుండు యమునానది నుత్తరించి బదరికాశ్రమంబునకుం జనియె...” భాగ. 3, స్కం. ౧౭౧. 2. కడచను,దాఁటి ముందునకుఁ బోవు. (ఉత్తరియించు రూపాంతరము.) “సీ. చదలేఱు ప్రవహించు చాయ యుత్తరియించి ధ్రువమండలంబు పెంద్రోవ నడచి.” నైష. ౭, ఆ. 3౭.

ఉత్తరిగము. వై. వి. (సం. ఉత్తరీయః.) 1. పైబట్ట. 2. జందెమువలె వేసికొను బంగారునగ. (ఆం. పా.)

ఉత్తరిగె. దే. వి. హారవిశేషము. “సీ. సరవిశేషంబు లుత్తరిగె యుత్తండంబు బన్నసరంబునాఁ బరగుచుండు.” ఆం. భా. ద్వి. మ. ౧౪౯.

ఉత్తరీయము. సం. వి. అ. న. 1. ఉత్తరవాసము, పైబట్ట. 2. పైఁట.

ఉత్తరుఁడు. సం. వి. అ. పుం. 1. శివుఁడు. 2. విష్ణువు. 3. విరటునికొడుకు.

ఉత్తరువు. వై. వి. (సం. ఉత్తరమ్. క. ఉత్తరువు.) ఆజ్ఞ, అనుజ్ఞ. “సీ. ఊళ్లాయములమీఁద వారార పుత్తరువు గన్నరాయకైజీతంబు రాయవారు.” రా. వి. ౫, ఆ. ౧3.

ఉత్తరేను. దే. వి. (క. ఉత్తరేణి.) అపామార్గము.* “సీ...ఉత్తరేను కసింద కోరిందపొదల.” ఆము. ౬, ఆ. ౧3.

ఉత్తరోత్తరము. సం. వి. అ. న. 1. ఉత్తరమున కిచ్చినజవాబు. 2. ఉత్తరప్రత్యుత్తరములు గల వాదము. విణ. (అ.ఆ.అ.) 1. తరువాతిదాని కంటెఁ దరువాతిది. 2. క్రమముగా హెచ్చునది. “గీ. పొత్తమిటు సేయ నీ కుత్తరోత్తరాభి, వృద్ధి యని...” ఆము. పీఠి. ౧౭. క్రి. విణ. 1. పైపై. 2. మఱిమఱి. “గీ. ఉత్తరోత్తర మభివృద్ధి నొందుచుండుఁ,గాశి ధర్మార్థకామమోక్షములు నాల్గు.” కాశీ. ౨, ఆ ౫౨. 3. ఎడతెగక.

ఉత్తలపడు. ద్వి.అ.క్రి. (ఉత్తలము+పడు.) 1. క్షోభించు, కలఁతనందు. “క. ఇత్తఱి మనుష్యభువనం, బుత్తలపడుచున్నయది...” భార. భీష్మ. ౨, ఆ. ౨౬౭. 2. త్వరపడు, తొందరచెందు. “మ...ఆలింగనకేళి కుత్తలపడుఁగా...” హరి. పూ. ౭, ఆ. ౧౧౨. 3. తాఱుమాఱగు. “చ...గ్రహతారకంబు లుత్తలపడఁ జొచ్చె...” భో. ౪, ఆ. ౭౭. 4. పరితపించు. “వ. అనుచు నుత్తలపడు నయ్యవసరంబున...” భార. విరా. ౫, ఆ. ౨3౮.

ఉత్తలపాటు. దే. వి. (ఉత్తలపడు ధా.; ఉత్తలము+పాటు.) 1. క్షోభము, కలఁత. “సీ. తఱకొత్త మదిఁ దిలోత్తమకు నుత్తలపాటు...” నైష. 3, ఆ. 3౬. 2. త్వర. 3. పరితాపము, దుఃఖము. “క. అలజడి నెంజిలి పిమ్మట, సిలు గుత్తలపాటు వంత... నా నమరు దుఃఖాఖ్యల్.” ఆం. శే. ౧౦. 4. తాఱుమాఱు. (శ. ర.)

ఉత్తలపెట్టు. దే. స. క్రి. (ఉత్తలము+పెట్టు.) 1. పరితపింపఁజేయు. “ఉ...మెత్తని మేనివాని నెట్టుత్తలపెట్టిరో పలువు రుగ్రమనస్కులు గూడి యక్కటా.” భార. ద్రో. ౨, ఆ. 3. 2. త్వరపెట్టు. 3. తాఱుమాఱొనర్చు. 4. కలఁత నొందించు. (శ. ర.)

ఉత్తలము. దే. వి. 1. కలఁక, సంక్షోభము. “ఉ. అత్తఱి రావణుండు విలయానలదుస్సహమూర్తియై నరేంద్రోత్తముమీఁదఁ దేరుఁ గడునుగ్రగతిం బఱపించి సంతతో,ద్వృత్తశరప్రవాహ పరివీత దిశాముఖుఁ డైనఁ జూచి పేరుత్తల మంది రాతనిసముద్ధతికిన్ దివినుండి నిర్జరుల్.” భార. అర. ౭, ఆ. ౧౪౯. 2. త్వర, వేగిరపాటు. (శ. ర.) 3. పరితాపము, దుఃఖము. “క. చిత్తంబునఁ బైకొనియెడు, నుత్తల మడఁచుచు... చనియెఁ జెలువ యడవికిన్.” భార. అర. ౭, ఆ. ౨౧౦. 4. వ్యత్యాసము, తాఱుమాఱు. (శ.ర.) 5. సంభ్రమము, తత్తరపాటు. “సీ... సంభ్రమసంజ్ఞ యుత్తలంబు.” ఆం. భా. ప్ర. నా. ౧౪౦. 6. అధృతి, భయము. “సీ...వెఱ యుత్తలము బీతు బెదరు...అటన నధృతి యగు...” ఆం. భా. ప్ర. ౧33.

**ఉత్తాడించు.** సం. స. క్రి. తాడనము చేయు, కొట్టు. "వ...రుద్రులం బఱపి మరుత్తుల నుత్తాడించి..." కాశీ. ౭, ఆ. ౯౫.

**ఉత్తానము.** సం. వి. అ. పుం. మిట్టనేల, మెరక. న. రతివిశేషము. విణ. (అ.ఆ.అ.) 1. విరివియైనది. 2. వెలికిలఁ బరుండునది. 3. మీఁదిమొగము గలది. 4. లోఁతు లేనిది. 5. మాయ లేనిది.

**ఉత్తారణము.** సం. వి. అ. న. 1. ఉత్తరించుట, దాఁటుట. 2. ఉద్ధరించుట, రక్షించుట. విణ. (అ.ఆ.అ.) 1. దాఁటించునది. 2. రక్షించునది.

**ఉత్తారము.** సం. వి. అ. పుం. 1. దాఁటుట. 2. అద్దరి కేఁగుట. 3. కాపాడుట. 4. వాంతి. విణ. (అ.ఆ.అ.) 1. పైకి త్రిప్పఁబడినగ్రుడ్లు కలది. 2. అధిక మైనధ్వని కలది.

**ఉత్తాలకము.** సం. వి. అ. పుం. తిరీటకము, తెల్లలొద్దుగు ✤.

**ఉత్తాలము.** సం. వి. అ. పుం. కోఁతి. విణ. (అ.ఆ.అ.) 1. బల మైనది. 2. భయంకర మైనది. 3. విస్తరించినది. 4. మే లైనది. 5. పొడు వైనది.

**ఉత్తి.** యు. దే. వి. చెల్లు, పరిష్కారము. "చ. శమనతనూజమాద్రిజులు సాత్తులుగాఁ జని యౌవనాశ్వదుర్గము వడిఁ జొచ్చి యధ్వరతురంగముఁ బావని కిచ్చి తండ్రిపాపముల నడంచి సద్గతికిఁ బంపిన క్రీడిఋణంబు నేవ త్తస్మరతలంబు నర్గ వినుతశౌర్యము నుత్తిగఁ బెట్టి తీర్చెదర్." జై. ౧, ఆ. ౯౫. (ఈడు, ప్రతినిధి అని శ.ర.) వై. వి. (సం. యుక్తిః.) ఉపాయము. (చూ. ఉత్తుఁడు.)

**ఉత్తిష్ఠత్.** సం. శత్రు. లేచుచున్న, నిలఁబడుచున్న.

**ఉత్తిష్ఠమానము.** సం. విణ. (అ.ఆ.అ.) అభివృద్ధి నొందుచున్నది.

**ఉత్తీర్ణము.** సం. విణ. (అ.ఆ.అ.) 1. దాఁటఁబడినది. 2. దాఁటినది. 3. కృతార్థ మైనది. 4. కడచినది.

**ఉత్తుంగము.** సం. విణ. (అ.ఆ.అ.) ఉన్నత మైనది, ఎత్తైనది.

**ఉత్తుండి.** సం. వి. ఈ. స్త్రీ. కాకతుండి, గురుజ ✤.

**ఉత్తుఁడు.** వై. విణ. (సం. యుక్తః.) అర్హుఁడు, తగినవాఁడు. "గీ. ఎన్నియేఁడులు మనుజుని యెమ్ము గంగ, వారిలోఁ నుండు నన్నివేల్ వత్సరములు,నాకలోకమహాసుఖశ్రీకి నాతఁ, డుత్తుఁడై యుండు నిర్మలచిత్తవృత్తి." భార. అను. ౨, ఆ. ౧౦౫., భో. ౪, ఆ. ౩౩౪.

**ఉత్తేజకము.** సం. విణ. (అ. జికా. అ.) 1. ప్రేరణ చేయునది. 2. వాఁడి చేయునది.

**ఉత్తేజన.** సం. వి. ఆ. స్త్రీ=ఉత్తేజనము.

**ఉత్తేజనము.** సం. వి. అ. న. 1. ప్రేరణము. 2. వాఁడి చేయుట. 3. మెఱుఁగిడుట.

**ఉత్తేజితము.** సం. వి. అ. న. 1=ఉత్తేజనము. 2. ఒకానొక అశ్వగతి. విణ. (అ. ఆ. అ.) 1. ప్రేరణ చేయఁబడినది. 2. వాఁడిచేయఁబడినది. 3. మెఱుఁగిడఁబడినది.

**ఉత్థము.** సం. విణ. (అ.ఆ.అ.) 1. పుట్టినది. 2. వెలువడినది. 3. మేల్కొన్నది.

**ఉత్థానము.** సం. వి. అ. న. 1. కూర్చుండి లేచుట. 2. నిలుచుట. 3. ప్రబోధించుట. 4. పురుషప్రమాణము. 5. ఉదయము. 6. ప్రయత్నము. 7. సంతోషము. 8. ముంగిలి. 9. తంత్రము. 10. యుద్ధము. 11. సైన్యము. 12. మలస్రావరోగము. 13. ముగింపు. 14. పౌరుషము. 16. ఇల్లు. 16. కోరిక.

**ఉత్థాపకము.** సం. విణ. (అ. పికా. అ.) 1. లేపునది. 2. లేవఁదీయునది. 3. ప్రేరించునది. 4. నిలఁబెట్టునది.

**ఉత్థాపించు.** సం. స. క్రి. నిగిడించు. "క. మెండుగ నుత్థాపించినదండము..." వేం.పంచ. ౩, ఆ. ౫౪.

**ఉత్థాపితము.** సం. విణ. (అ.ఆ.అ.) 1. లేవఁబడినది. 2. పురికొల్పఁబడినది. 3. పుట్టింపఁబడినది.

**ఉత్థితి.** సం. వి. ఇ. స్త్రీ=ఉత్థానము.

**ఉత్పతనము.** సం. వి. అ. న. 1. ఎగురుట. 2. జనించుట. 3. ఆరోహణము, ఎక్కుట.

ఉత్పత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. జన్మము, పుట్టుక. 2. పైకి పోవుట. 3. జన్మస్థలము.

ఉత్పథము. సం. వి. అ. పుం. 1. అపమార్గము. 2. తప్పు. విణ. (అ.ఆ.అ.) 1. తప్పుదారిని బడినది. 2. అన్యాయమైనది, న్యాయము నతిక్రమించినది.

ఉత్పన్నము. సం. విణ. (అ.ఆ.అ.) 1. పుట్టినది. 2. సమకూడినది.

ఉత్పరపర్ణకము. సం. వి. అ. న. నఖక్షత విశేషము.

ఉత్పలపత్త్రము. సం. వి. అ. న. 1. కలువరేకు. 2. తిలకభేదము. 3. పిఱుఁదులమీఁద నుంచు నఖక్షతము. "సీ. పురుషుఁ డుత్పలపత్త్రములు పిఱుందున నుంచ..." కవిరా. ४, ఆ. ३०.

ఉత్పలపూరక. సం. వి. ఆ. స్త్రీ. ఆఁగాకర ♆.

ఉత్పలము. సం. వి. అ. న. 1. కలువ. 2. నల్లకలువ. 3. చెంగల్వకోష్టు♆. 4. ఉత్పలశారిబ♆. విణ. (అ.ఆ.అ.) కృశించినది.

ఉత్పలశారిబ. సం. వి. ఆ. స్త్రీ. నల్లసుగంధిపాల, మామెన ♆.

ఉత్పలిని. సం. వి. ఈ. స్త్రీ. 1. నల్లకలువలప్రోగు. 2. కలువతీఁగ.

ఉత్పశ్యుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. పైకి చూచువాఁడు. 2. ముఖము పైకెత్తినవాఁడు.

ఉత్పాటనము. సం. వి. అ. న. 1. పెకలించుట. 2. కుఱుపువలనఁ గలుగుబాధ.

ఉత్పాటించు. సం. స. క్రి. పెకలించు. "మ... పారిజాత ధరణీజాతంబు ... ఉత్పాటించి..." పారి. ४, ఆ. ५३.

ఉత్పాతకారి. సం. విణ. (న్. సీ. న్.) ఉపద్రవము కలిగించువాఁడు. "గీ. పాంథనివహంబు పాలి యుత్పాతకారి, ధూమకేతువుఁ బోలి పెన్డోఁట నడుమ,విరిసెఁ బ్రోవ్వారి నాగకేసరపుఁ బువ్వు, మీఁదిధూమంబుభంగిఁ దుమ్మెదలు వెడలె." భీమ. ५, ఆ. ८२.

ఉత్పాతము. సం. వి. అ. పుం. 1. పైకి పోవుట. 2. శుభాశుభసూచక మగు భూతవికారము. (దివ్యము, అంతరిక్షము, భౌమము అని యిది మూఁడువిధములు. దివ్యము—అపూర్వ గ్రహములు నక్షత్రములు తోఁచుట; అంతరిక్షము—పరివేషము, ఇంద్రధనుస్సు కలుగుట, పిడుగులు కొఱవులు పడుట; భౌమము—అపూర్వములైన చరాచర వస్తువులు కలుగుట.) 3. ఉపద్రవము.

ఉత్పాదకము. సం. వి. అ. పుం. ఎనిమిదిపాదములు గల శరభమృగము. విణ. (అ. ఆ. అ.) పుట్టించునది.

ఉత్పాదనము. సం. వి. అ. న. పుట్టించుట. విణ. (అ. ఆ. అ.) పుట్టించునది.

ఉత్పాదము. సం. వి. అ. పుం. 1. పుట్టుక. 2. సంభవము. విణ. (అ.ఆ.అ.) పైకి పాదములు గలది.

ఉత్పాదశయనము. సం. వి. అ. పుం. టిట్టిభము, లకుముకిపిట్ట.

ఉత్పాదించు. సం. స. క్రి. 1. పుట్టించు. "వ... పుత్త్రుల నుత్పాదించి..." కాశీ. 3, ఆ. ८९. 2. వెలిఁగించు. "సీ... ఉత్పాదించు ధూపదీపాదికములు." హర. 3, ఆ. ३६.

ఉత్పాదిల్లు. సం. అ. క్రి. 1. బయలు వెడలు. "మ...బొబ్బలు నార్పుల్ పటుసింహనాదములు నుత్పాదిల్ల..." భీమ. ४, ఆ. ०८०. 2. కలుగు. "క...విఘ్నంబుత్పాదిల్లు..." భార. సభా. ౨, ఆ. ०३५. 3. ప్రవేశించు. "క. పాదవిభేదంబున మర్యాదలును దఱుఁగు నధర్మమాకొలఁదిని యుత్పాదిల్లి వృద్ధిం బొందు..." భాగ. 3, స్కం. ३५०. 4. జన్మించు, పుట్టు. "క...విష్ణుదేవునంశంబున నుత్పాదిల్లెఁ గృష్ణుఁడు..." భార. ఆది. 3, ఆ. २४.

ఉత్పాలి. సం. వి. ఈ. స్త్రీ. ఆరోగ్యము, స్వాస్థ్యము.

ఉత్పీడన. సం. వి. ఆ. స్త్రీ=ఉత్పీడము.

ఉత్పీడనము. సం. వి. అ. న=ఉత్పీడము.

ఉత్పీడము. సం. వి. అ. పుం. 1. మథనము. 2. రాపిడి. 3. పిడుచుట. 4. ఆధిక్యము.

ఉత్ప్రాసము. సం. వి. అ. పుం. ఎత్తిపొడుపుమాట, ఉపహాసము.

ఉత్ప్రేక్ష. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొక యలంకారము. 2. ఊహము. 3. అనవధానత.

ఉత్ప్రేక్షించు. సం. స. క్రి. 1. ఊహించు, 2. ఉత్ప్రేక్షాలంకారముతో వర్ణించు. 3. ఉత్ప్రేక్షతోఁ జెప్పు.

ఉత్ప్లవ. సం. వి. ఆ. స్త్రీ. పడవ.

ఉత్ఫుల్లము. సం. వి. అ. న. 1. యోని. 2. సురతబంధవిశేషము. విణ. (అ.ఆ.అ.) 1. వికసించినది. 2. తెఱచినది. 3. ఉబ్బినది. 4. వెలికిలఁబడినది. 4. విరివి యైనది.

ఉత్త్వము. సం. వి. అ. న. ఉకారము. "చ... మిత్త్రుఁ బిల్చె నా, మొరసెను కాలవేదు లట ముందుగ నుత్త్వము ముప్పిధంబుగన్." కాళిందీ. 3, ఆ. ౧౩౧.

ఉత్సంగము. సం. వి. అ. పుం. 1. ఒడి. 2. తొడ. 3. పిఱ్ఱ. 4. పైభాగము. 5. మధ్యభాగము. 6. శిఖరము, 7. కౌఁగిలింత. 8. ఒకానొక హస్తాభినయము. 9. మిక్కుటము మగు కలయిక.

ఉత్సంగుఁడు. సం. వి. అ. పుం. సన్న్యాసి, సర్వసంగపరిత్యాగి.

ఉత్సన్నము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నష్టము. నశించినది. 2. విచ్ఛిన్నము, తెగిపోయినది. 3. వ్యవహారమున లేనిది. 4. ఉద్గతము, ఉబికినది. 5. పెల్లగింపఁబడినది.

ఉత్సము. సం. వి. అ. పుం. 1. ఊట. 2. ఊటగలచోటు. 3. జల ప్రవాహము.

ఉత్సర్గము. సం. వి. అ. పుం. 1. విడుచుట. 2. దానము. 3. సామాన్యవిధి, న్యాయము, 4. సమాప్తి. 5. గుదస్థానము. 3. (వృషాదులను) విచ్చలవిడిగా విడుచుట.

ఉత్సర్జనము. సం. వి. అ. న. 1. విడుచుట. 2. దానము. 3. సమాప్తి. 4. త్యాగము.

ఉత్సర్జించు. సం. స. క్రి. విడుచు. "సీ. మాటలాడుచు మూత్రమలము లుత్సర్జించు మిహిరోదయమ్మున మేలుకొనఁడు." కాశీ. ౬, ఆ. ౪౬.

ఉత్సర్పము. సం. వి. అ. పుం. 1. దాఁటుట. 2. పై కుబుకుట. 3. ఎగఁబ్రాకుట.

ఉత్సవము. సం. వి. అ. పుం. 1. ఆనందజనక మగు శుభాది. 2. పండుగ. 3. గర్వము. 4. కోపము. 5. కోరికలు సిద్ధించుట.

ఉత్సహించు. సం. స. క్రి. 1. ఉత్సాహపడు. "క. అని యుత్సహించి కలశీ, వనరాశి తటంబుఁ గదిసి వసుధాధరరా, ట్తనయాధిపుఁడు..." దశా. ౧, ఆ. ౨౨౫. 2. కడఁగు. "గీ. అవఘులారసంసిద్ధుల రైతి రింకఁ, దడయ నేటికి నిర్మలోదాత్తగతికి, నుత్సహింతురు గాక..." భార. శాం. ౪, ఆ. ౧౬౩.

ఉత్సాదనము. సం. వి. అ. న. 1. ఉద్వర్తనము, నలుఁగుపెట్టుట. 2. తొలఁగించుట. 3. నాశనము చేయుట. 4. పై కెత్తుట. 5. పెల్లగించుట. 6. దున్నుట.

ఉత్సాదించు. సం. స. క్రి. 1. పెల్లగించు. 2. పై కెత్తు. 3. నాశనము చేయు. భార. ఆది. ౧, ఆ. ౧౩.

ఉత్సారకుఁడు. సం. వి. అ. పుం. 1. ద్వారపాలుఁడు. 2. కావలివాఁడు. 3. జనులను తొలఁగించి దారిచేయువాఁడు. సం. విణ. (అ.ఆ.అ.) తొలఁగించువాఁడు.

ఉత్సారణ. సం. వి. ఆ. స్త్రీ=ఉత్సారణము.

ఉత్సారణము. సం. వి. అ. న. 1. కదలించుట. 2. తొలఁగించుట. 3. జనులనుండి దారిచేయుట.

ఉత్సారించు. సం. స. క్రి. 1. కదలించు. 2. తొలఁగించు.

ఉత్సారితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. కదలింపఁబడినది. 2. తొలఁగింపఁబడినది. 3. దూరముగా నెట్టఁబడినది.

ఉత్సాహన. సం. వి. ఆ. స్త్రీ=ఉత్సాహనము.

ఉత్సాహనము. సం. వి. అ. న. ఉత్సాహము కలిగించుట.

ఉత్సాహము. సం. వి. అ. పుం. 1. ప్రయత్నము. 2. అభిలాషము. 3. ఒకానొకశక్తి. 4. వీరరసమునకు స్థాయి. 5. శుభము. 6. సూత్రము. 7. వృత్తివిశేషము.

ఉత్సాహవర్ధనము. సం. వి. అ. పుం. వీరరసము.

ఉత్సాహించు. సం. అ. క్రి. 1. ఉత్సాహపడు. "మ...మది నుత్సాహించి నీ భక్తిమత్పురుష శ్రేష్ఠులఁ బూజసేయుట మహాపుణ్యంబు సర్వేశ్వరా." స. శ. ౨౬. 2. యత్నించు. "సీ. వెడ వింటిదొర దాడివెడల నుత్సాహించు చిలుకపైకములు విందులకుఁ దిరుగు." చంద్రా. ౪, ఆ. ౧౪౧. 3. ఉప్పొంగు, చెలరేఁగు. "శా...ఝూరఝూమరు, స్సైత్రిం బొల్చుపాలుతాళులీలఁ గుళుఁడుత్సాహించె..." జై. ౬, ఆ. ౧౪౬.

ఉత్సిక్తము. సం. విశే. (అ.ఆ.అ.) 1. ఉద్రేకించినది. 2. గర్వించినది. 3. పొంగినది. 4. ప్రోక్షింపఁబడినది. 5. అతిశయించినది.

ఉత్సుకము. సం. వి. అ. పుం. తహతహ.

ఉత్సుకుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) 1. ఇష్టకార్యసిద్ధికిఁ బూనువాఁడు. 2. ఇష్టకార్యసిద్ధికై తహతహపడువాఁడు. 3. కుతూహలపడువాఁడు.

ఉత్సూరము. సం. వి. అ. పుం. సాయంకాలము.

ఉత్సృష్టము. సం. విశే. (అ.ఆ.అ.) 1. విడువఁబడినది. 2. ఈయఁబడినది.

ఉత్సృష్టి. సం.వి.ఇ.స్త్రీ. 1. విడుచుట. 2. ఇచ్చుట.

ఉత్సేకము. సం. వి. అ. పుం. 1. అతిశయము. 2. గర్వము. 3. పొంగు. 4. ప్రోక్షణము.

ఉత్సేకించు. సం. అ. క్రి. 1. అతిశయించు. 2. గర్వించు. 3. పొంగు. 4. ఉప్పొంగు.

ఉత్సేచనము. సం. వి. అ. న. ప్రోక్షణము, పైకి చల్లుట.

ఉత్సేధము. సం. వి. అ. పుం. 1. పొడవు. 2. శరీరము. 3. ఘనత. 4. బలిమి. విశే. (అ. ఆ. అ.) పొడువైనది.

ఉత్స్మయము. సం. వి. అ. పుం. చిఱునవ్వు. విశే. (అ.ఆ.అ.) వికసితము.

ఉత్స్మితము. సం. వి. అ. న. ఉత్స్మయము, చిఱునవ్వు.

ఉద్. సం. అవ్య. (ఇది సమాసపూర్వపదముగానే యుండును.) 1. ఊర్ధ్వము. 2. ఉద్ధృతము. 3. ఉత్కృష్టము. 4. ఉన్నతము. 5. ఉత్క్రాంతము. 6. ఉద్గతము.

ఉదంచనము. సం.వి.అ.న. 1. మూఁకుడు. 2. చేఁద. 3. ఎగఁజిమ్ముట. విశే. (అ.ఆ.అ.) ఎగఁజిమ్ముటకు సాధనమైనది.

ఉదంచితము. సం. విశే. (అ.ఆ.అ.) 1. పూజింపఁబడినది. 2. చెలరేఁగినది. 3. పైకి నెట్టఁబడినది.

ఉదంతకము. సం=ఉదంతము.

ఉదంతము. సం. వి. అ. పుం. వృత్తాంతము, సంగతి.

ఉదంతిక. సం. వి. ఆ. స్త్రీ. తనివి, తృప్తి.

ఉదంతుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) 1. సజ్జనుఁడు. 2. వార్ధుషికుఁడు, వడ్డివర్తకము చేయువాఁడు.

ఉదకమాడు. మి. అ. క్రి. (ఉదకము+ఆడు.) స్నానము చేయు. "గీ. ఒక్కప్రొద్దుండి నెలయేట నుదకమాడి." కాశీ. ౩, ఆ. ౩౨.

ఉదకము. సం. వి. అ. న.-తడుపునది.-జలము, నీరు. పుం. 1. కుందము ⚘. 2. ఉత్పలము ⚘. 3. యోని మూలము.

ఉదకీర్యము. సం.వి.అ.పుం. కరంజకము, కానుఁగు⚘.

ఉదక్కు. సం. విశే. (చ్. దీపి. చ్.) 1. పైకి పోవునది. 2. ఎత్తయినది. 3. పిమ్మటిది. 4. ఉత్తరదిక్సంబంధమైనది.

ఉదక్తము. సం. విశే. (అ.ఆ.అ.) పైకెత్తఁబడినది. (జలాది.)

ఉదక్య. సం. వి. ఆ. స్త్రీ. రజస్వల, ముట్టుది. "గీ. రజకితోడ నుదక్యతో శ్రమణతోడ, విధవతో నాథుతో రాయువెలఁదితోడఁ, జెడిపెతోఁ జాలఁ బోరామి సేయఁ జనదు, ప్రాణసంకటములను బుణ్యాంగనలకు." కాశీ. ౨, ఆ. ౭౪.

ఉదగద్రి. సం. వి. ఇ. పుం. హిమాలయపర్వతము.

ఉదగయనము. సం. వి. అ. న. ఉత్తరాయణము.

ఉదగాహము. సం. వి. అ. పుం. స్నానము.

ఉదగ్రము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉన్నతము. 2. దీర్ఘము. 3. ఘనము. 4. వృద్ధము. 5. ఉద్ధతము. 6. భయంకరము.

ఉదజము. సం. వి. అ. పుం. 1. పశువులఁద్రోలుట. 2. పద్మము. విశే. (అ.ఆ.అ.) నీటినుండి పుట్టినది.

ఉదధి. సం.వి.ఇ.పుం. 1. సముద్రము. 2. నాలుగు.

ఉదధిమేఖల. సం. వి. ఆ. స్త్రీ. భూమి.

ఉదన్వంతము. సం. వి. త్. పుం. సముద్రము.

ఉదపాన మండూకము. సం. వి. అ. పుం. 1. కూపస్థమండూకము, నూతిలోని కప్ప. 2. బహిః ప్రపంచ మెఱుఁగక తా నున్నస్థలమే ప్రపంచ మని తానే గొప్పవాఁడ నని భావించువాఁడు.

ఉదపానము. సం. వి. అ. పుం. న. నూయి.

ఉదయము. సం. వి. అ. పుం. 1. ఉదయించుట. 2. వెడలుట. 3. పుట్టుక. 4. వృద్ధి. 5. సృష్టి. 6. తూరుపుకొండ. 7. ఫలసిద్ధి. 8. వడ్డి.

ఉదయరాగ పట్టులు. మి. వి. బ. వస్త్రవిశేషము. "వ...ఉదయరాగపట్టులు నేత్రపట్టులును..." ద్వా. 3, ఆ. ౨౦౬.

ఉదయి. సం. విశే. (న్.నీ.న్.) 1. ఉదయించునది. 2. వృద్ధినందునది. 3. పైకి వెడలునది.

ఉదయించు. సం. అ. క్రి. 1. (సూర్యచంద్రాదులు) పొడము. 2. కలుగు. "వ. అరిషడ్వర్గం బేమిట నుదయించు నెట్లు సమయు..." భార. శాం. 3, ఆ. ౪౨౦. 3. ప్రవేశించు. "శా...వసంత కాల ముదయించెన్ సౌఖ్యసంధాయియై." భీమ. ౫, ఆ. ౯౨.

ఉదరంభరి. సం. విశే. (ఇ) అతిథిపూజ మున్నగునవి లేక తనపొట్టమాత్రమే పోషించుకొనువాఁడు.

ఉదరము. సం. వి. అ. న. 1. కడుపు. 2. నడుము. 3. యుద్ధము. 4. మధ్యభాగము.

ఉదరిణి. సం. వి. ఇ. స్త్రీ. గర్భిణి, చూలాలు.

ఉదరిపడు. ద్వ. అ. క్రి. అదరిపడు. "గీ. ఉదరిపడి మేలుకని..." హరి. ఉ. ౭, ఆ. ౯౮.

ఉదరిపాటు. ద్వ. వి. (ఉదరిపడు ధా.) 1. అదరిపాటు. (శ. ర.) 2. ఉలికిపాటు. "గీ...పదములు తడఁబడ నుదరిపాటుఁగదుర..." ఉ. రా. 3, ఆ. ౩౪౭.

ఉదరు. దే. అ. క్రి. 1. అదరు. "సీ. ఉదరి క్రేళ్లు ఱికెడునుగ్రకేసరులతో బిలగతాహులు కింక వెలికి నెగయ." హరి. పూ. ౭, ఆ. ౧౭౭. 2. విజృంభించు. "సీ. ఒకమాటు మింటికి నుదరి యుల్లంఘించు నొకమాటు లోపల నొదిఁగి యుండు." భాగ. ౮, స్కం. ౭౧౯. 3. కోపించు. "ఆ. అనుచు నుదరి పలుక విని హిడింబయుఁ గడుఁవెఱచి..." భార. ఆది. ౬, ఆ. ౨౦౧. 4. భయపడు. "ద్వి. ఉదరి తాపసులెల్ల నొండొరుఁ గడవఁ,బదపదం డిదె మహాప్రళయంబు వచ్చె." ద్వి. హరిశ్చ. పూ. ౪౦౬, ప. వి. పో. అనా. "చ. ఉదట రణోత్సవం బొదవ నూఱట నార్వఁగ నొక్కఁడోరు సాలదు తమ కంచు..." కు. సం. ౧౨, ఆ. ౭.

ఉదర్కము. సం. వి. అ. పుం. 1. ఉత్తరకాలము. 2. ఉత్తరఫలము. 3. శాకవిశేషము, మదనకంటకము ♆.

ఉదర్చి. సం. వి. స్. పుం. 1. అగ్ని. 2. శివుఁడు. 3. మన్మథుఁడు. విశే. (స్) పైకెగయుజ్వాలలు కలది.

ఉదర్ధి. సం. వి. ఇ. పుం. ఎద్దు.

ఉదలు. దే. స. క్రి. విడుచు. (చూ. ఉదలుచు.)

ఉదలుచు. దే. స. క్రి. (ఉదలు+చు. స్వార్థమున. క. ఉదర్చు.) 1. విడుచు. "క. కదియుచుఁ బాయుచుఁ బట్టుచు, నుదలుచుచుం బడుచు లేచు చుడుగుచు...పెనఁగిరి..." భార. విరా. ౨, ఆ. ౩౪౯. 2. విడిపించు. (చూ. ఉదల్చు.)

ఉదల్చు. దే. స. క్రి. విడిపించు. "ఉ. పాపవినిశ్చయుండు సతిపయ్యెదకొంగు కడంగి పట్టినం,గోపముతో నుదల్చికొని కోమలియున్ వెస వాని ద్రేయుడుగ్." భార. అర. ౬, ఆ. ౧౯౦.

ఉదవసితము. సం. వి. అ. న. గృహము, ఇల్లు.

ఉదవాహము. సం. వి. అ. పుం. మేఘము.

ఉదశ్విత్తు. సం. వి. త్. న. పెరుఁగుతో సమముగా నీళ్లు కలిపి చేసిన మజ్జిగ.

ఉదస్తము. సం. విశే. (అ.ఆ.అ.) 1. ఎగఁజిమ్మఁబడినది. 2. నిరసింపఁబడినది. 3. అవమానింపఁబడినది.

ఉదస్తుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) అవమానింపఁబడినవాఁడు. "క. మొదలనె యొరుదలకానిం,జెదరంగా నాడ కాత్మఁ జింతింపు పదిం,బదిగ మృషయేని మఱి విను,మదస్తుఁగాఁ గాకయుండ నొక్కమతమునకా." అను. ౪, ఆ. ౨౨౦.

ఉదాత్తము. సం. వి. అ. పుం. 1. ఒకానొక వేదస్వరము. (ఉదాత్తానుదాత్తస్వరితము లని యివి మూఁడు.) 2. ఒక యర్థాలంకారము. 3. దానము. 4. పెద్దమద్దెల.

ఉదాత్తుఁడు. సం. వి. అ. పుం. ధీరోదాత్త నాయకుఁడు. విణ. (అ.ఆ.అ.) 1. గొప్పవాఁడు. 2. ఈవికాఁడు. 3. మనోజ్ఞుఁడు.

ఉదానము. సం. వి. అ. పుం. 1. పంచవాయువులలో నొకటి. 2. బొడ్డు. 3. ఒకానొకపాము.

ఉదారము. సం. వి. అ. పుం. ఊదరధాన్యము.

ఉదారుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. దాత. 2. గొప్పవాఁడు. 3. సరళస్వభావము కలవాఁడు. 4. గాంభీర్యము గలవాఁడు. 5. నేర్పు గలవాఁడు.

ఉదాసము. సం. వి. అ. పుం. 1. ఎగఁజిమ్ముట. 2. ఉపేక్షించుట. 3. నిరసనము. విణ. (అ.ఆ.అ.) 1. ఎగఁజిమ్మునది. 2. ఉపేక్షించునది. 3. నిరసించునది.

ఉదాసించు. సం. స. క్రి. 1. తిరస్కరించు. 2. ఉపేక్షించు. "సీ... పెద్దపత్ని నుదాసింపఁ బాడిగా దంచును..." దశా. ౭, ఆ. ౧౩.

ఉదాసీనుఁడు. సం. వి. అ. పుం. 1. కూటస్థుఁడు. 2. శత్రువు మిత్రము గానిరాజు. విణ. (అ.ఆ.అ.) 1. ఉపేక్షించువాఁడు. 2. ఏ పక్షమునకుఁ జెందక యుండువాఁడు. 3. నిరసించువాఁడు.

ఉదాస్థితుఁడు. సం. వి. అ. పుం. 1. ద్వారపాలుఁడు. 2. స్వకర్మపరిత్యాగి యగుముని. 3. చారుఁడు. 4. అధ్యక్షుఁడు; ప్రభువు.

ఉదాహరణము. సం. వి. అ. న. 1. కథనము. 2. సంగతి. 3. దృష్టాంతము. 4. ఉపోద్ఘాతము. 5. ప్రమాణము. 6. మచ్చు. 7. తర్కమందలి ప్రతిజ్ఞాదులలో మూఁడవది. 8. ప్రబంధవిశేషము. 9. అలంకారవిశేషము.

ఉదాహరము. సం. వి. అ. పుం. ఉదాహరణము, దృష్టాంతము.

ఉదాహరించు. సం. స. క్రి. 1. ఉదాహరణముగా చెప్పు. "క. తనమహిమ నాశ్రయశక్తిని,యొనరుచుఁ జనఁ జూచి సుగ్రహు కులీనలయం,చు నుదాహరింతురు..." కళా. ౭, ఆ. ౪౩. 2. ఉదాహరణముగా చూపు. "వ... పావకుండు... పూర్వకృత ఖాండవదాహం బుదాహరించు తెఱంగునం బ్రతివిశాఖాతిప్రతాపంబుఁ జూపుటవలన ధనంజయాభిధానంబును..." శుక. ౩, ఆ. ౩౦౨.

ఉదాహారము. సం. వి. అ. పుం=ఉదాహరణము.

ఉదాహృతి. సం. వి. ఇ. స్త్రీ=ఉదాహరణము.

ఉదితము. సం. వి. అ. న. 1. చెప్పుట. 2. వాక్యము. 3. లగ్నము. 4. కురువేరు ♣. విణ. (అ.ఆ.అ.) 1. పైకిలేచినది. 2. ఉదయించినది. 3. కలిగినది. 4. చెప్పఁబడినది.

ఉదితి. సం. వి. ఇ. స్త్రీ. ఉదయము.

ఉదిరి. దే. వి. అపరంజి, మేలిమిబంగారము. "సీ... ఉదిరి యంబరమువాఁడు." చంద్రా. ౧, ఆ. ౭౦. విణ. 1. పదియాఱువన్నెగలది, మేలిమి. "చ. ఉదిరిపసిండిచాయ గలయొప్పులకుప్పలు..." రామా. ౭, ఆ. ౧౭౦. "సీ. ఇది కోలమెఱుఁగుగా దుదిరిబంగారంపుఁబసిమి గ్రమ్మెడు పచ్చపట్టు గాని." పాండు. ౪, ఆ. ౩౧. 2. మేలిమి బంగారము. "క... ఉదిరిమేఁల్బొమ్మపుగద మరునాఱవ,యమ్మపుగద..." కాళిందీ. ౨, ఆ. ౯౪.

ఉదిరిపడు. ద్వ. అ. క్రి. అదరిపడు. "క. విని కినిసి యుదిరిపడి..." దశ. ౪, ఆ. ౭౧.

ఉదిరిమల. దే. వి. (ఉదిరి+మల.) బంగరుకొండ, మేరుపర్వతము. "క. ఉదిరిమలతోడ నొరయఁగ, నెదిరినదొర..." రా. వి. ౨, ఆ. ౭౯.

ఉదిల. దే. వి. 1. అధైర్యము. "సీ...తాజీక యుదిల యటన నధృతి యగు." ఆం. భా. ప్ర. ౧౩౩. 2. చలనము. (చూ. ఉదిలగొను.) 3. పరితాపము. (శ. ర.)

ఉదిలకొను. దే. అ. క్రి. (ఉదిల+కొను.) 1. అధైర్యపడు. "సీ...అమరు. ఆ. వసులఁ దాఁకి యేసిరి...చెదర జలదపఙ్క్తి బెదర వజ్రాయుధు, హృదయ ముదిలకొనఁగఁ ద్రిదశగణము." భార. ఆది. ౨, ఆ. ౨౧. 2. త్వరపడు. "గీ...నారాక కెదురుసూచు,నయనములు వేయుఁగల్గిననాకభర్త, యుదిలకొనుచున్నవా రార్తినున్నముగురు." నైష. ౪, ఆ. ౬౪. 3. వ్యాపించు. "వ. వారివాహవ్యూహంబులు కడ లవియఁ జదల నుదిలకొనియె." హర. ౬, ఆ. ౫౦. 4. అతిశయించు. "గీ...మనములోన, మదనవికృతు లంతంతకు నుదిలకొనఁగ." కేయూర. ౪, ఆ. ౭.

ఉదిలగొను=ఉదిలకొను. 1. చలించు. "క. ఏనరుఁడు మానసము ధృతి,నూన నుచితవృత్తి నుండు నుదిలగొనక యెం,దైనను నెయ్యది యేనియు, వానికి దుర్లభము లేదు..." భార. శాం. ౩, ఆ. ౧౬౧. 2. జంకు, వెనుదీయు. "గీ. అని శపింపఁగఁ బూనునయ్యవసరమున, నేమి చెప్పుదు నోసంయమీంద్రవంద్య, యుదిలగొని కంప మందుచునుండెఁ గాని, శాపజలమందుకోఁ గేలు సాఁగదయ్యె." భీమ. ౨, ఆ. ౧౦౯. 3. పరితపించు. "వ. ఇట్లు హృదయంబునం గదిరిన మదనానలంబుచే నుదిలగొని యాసుదతి చిత్రరేఖ కిట్లనియె." ఉ. హరి. ౫, ఆ. ౧౦౨.

ఉదిలు. దే. అ. క్రి. (క., త. ఉదిర్.) పడిపోవునట్లుండు. "గీ. పెటిలె బ్రహ్మాండభాండంబు చిటిలె దిక్కు,లురలె పాతాళభువనంబు లుదిలె నభము, మేటిధాటీజనిత కాలకూటవిషము,చిచ్చు విడివడి యంతంతఁ బెచ్చుపెరుఁగ." భీమ. ౪, ఆ. ౬౧.

ఉదీచి. సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరదిక్కు.

ఉదీచీనము. సం. విశే. (అ.ఆ.అ.) 1. ఉత్తరమున నున్నది. 2. ఉత్తరకాలమున నున్నది.

ఉదీచ్యము. సం. వి. అ. పుం. 1. శరావతీనదికి వాయవ్యమున నున్నదేశము. 2. ఉత్తరదేశము. న. కురువేరు ౘ. విశే.=ఉదీచీనము.

ఉదీపము. సం. వి. అ. పుం. ప్రవాహము, వెల్లువ. విశే. (అ.ఆ.అ.) పొటెసవెల్లువ గలది.

ఉదీరణము. సం. వి. అ. న. 1. ఉచ్చారణము. 2. కథనము. 3. బాణాదులప్రయోగము.

ఉదీర్ణము. సం. విశే. (అ.ఆ.అ.) 1. ఉదారము, గొప్పది. 2. ఉదితము, చెప్పఁబడినది. 3. ఉద్రిక్తము, అతిశయించినది. 4. ఉత్పన్నము, పుట్టినది. 5. మదాంధము, గర్వించినది.

ఉదుంబరదళ. సం. వి. ఆ. స్త్రీ=ఉదుంబరపర్ణి.

ఉదుంబరపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. దంతి ౘ.

ఉదుంబరము. సం. వి. అ. పుం. 1. మేఁడి ౘ. 2. గడప. 3. కుష్ఠభేదము. న. 1. మేఁడిపండు. 2. రాగి. 3. కర్షమనునొకానొక మానము.

ఉదుంబరుఁడు. సం. వి. అ. పుం. నపుంసకుఁడు, పేడి.

ఉదుక=ఉతక. "సీ. ఓలుమ్రానుదుక నాఁ బోలుఁ గవాటమూలాలవాలాభిధ..." ఆం. భా. ద్వి. ౨౨.

ఉదుకు=ఉతుకు. దే. స. క్రి. 1. మురికి పోవుటకై తడిపినబట్టలు ఱాతిపై గుంజు. "చ...త్రాటము,న్నదికినశాటి వ్రేల..." ఆము. ౧, ఆ. ౮౩. 2. తాడించు. "గీ...అన్నిశాచరుని..., ఒడలు గుల్లలతిత్తిగా నుదికి చంపె." భా. రా. యు. ౬౮౦. 3. నశింపఁజేయు. "గీ. మొదలియది పాపముల నెల్ల నుదుకఁ జాలు." భీమ. ౬, ఆ. ౧౭.

ఉదుటారు. దే. అ. క్రి. (ఉదుట+ఆరు.) తృళ్ళిపడు. "ఉ...మేల్,జగ్గుమిటారి గుబ్బచనుఁజక్కవ లుక్కున నిక్కి గ్రుక్కసక్కెలొగ్గక పైరిణీరవికలోఁ నుదుటారఁగ..." కాళిందీ. ౨, ఆ. ౯౯.

ఉదుటు. దే. వి. 1. ఔద్ధత్యము. "చ...మార్గ తొలంగినఁ గన్ను విచ్చి పేరుదుటున లేచె లక్ష్మణ సహోదరుఁడు..." ఉ. రా. ౭, [illegible]

౧౩౭. 2. దార్ఢ్యము. వేంక. మాన. ౫౬. 3. విలాసము. "సీ. ఒరగంటు మెఱుఁ గెక్కు నొరయంగఁ గలతెక్కు మొన్నంచు పక్కెర యందుదుటుసూప." దశా. ౭, ఆ. ౬౬. విశే. 1. ఉద్ధతము, పొంగరెక్కినది. "సీ... ఉదుటు రా యంచ లేఁగొదము..." సా. ౧, ఆ. ౧౨౨. 2. విలాసము గలవాఁడు. "చ. ఉదు టగువానిఁ బ్రాయమున నుండెడువాని..." హంస. ౫, ఆ. ౧౫౭.

ఉదుటెక్కు. దే. అ. క్రి. (ఉదుటు+ఎక్కు.) (ప్రాయముచే) విలాసము కలుగు. "సీ. నీనిమా పుమటెక్కఁగాను గా సిరిపట్టికివి బోర బిరుదుఁ డెక్కెంబు గలిగె." ఆము. ౬, ఆ. ౧౧౫.

ఉదురు. దే. అ. క్రి. 1. గర్వించు. 2. తిరస్కరించు. "సీ. కొసరుమాటలను బైకొన్నచిన్నె గణింపఁ గినుకతో నుదిరి జుంకించువగలు." ఉ. రా. ౬, ఆ. ౧౬౯. (కంపించు అని సూ.ని.) 3. పాఱు, పోవు. "ఆ. అదియుఁ గాక యా ధరాధీశుఁ డింతకు,మున్న మన సమీపమునకుఁ దనదు,దేగఁ బిలిచికొనుచు తీవితో రాఁడె యా, యొప్పు మిగులఁ దాల్మి నుదురఁ దోలె." కళా. ౬, ఆ. ౨౬౫. వి. జౌ. అనా. ఉదుటు, ఉద్ధతి. "చ. ఉదుటఁ దెమల్చి మ్రింగుసరసోదకబిందుల మౌక్తికంబులం,గదఁ గబళించు..." కు. సం. ౬, ఆ. ౯౯. "చ...మహోదరుం, డుదురున నొక్కఘోరగద యూని కృతాంతునిలీల నుగ్రుఁడై." ఉ. రా. 3, ఆ. ౧౪.

**ఉదురుమిడుకు.** దే. విశే. (ఉదురు+మిడుకు.) 1. ఉద్ధతుఁడు, గర్వి. (శ. ర.) 2. దుర్మార్గుఁడు. "సీ. ఒకకాలఁ జిరకాల మోహాతో తపోవృత్త మొనర నాఁ జేసె నీయుదురుమిడుకు." కళ. ౫, ఆ. ౭౭. "గీ. ఉద్ధతులు గొంట్లు పలుగాకు లుదురుమిడుకులు..." హర. ౫, ఆ. ౧౦.

ఉదూఖలము. సం. వి. అ. న. 1. ఱోలు. (రూ. ఉలూఖలము.) 2. గుగ్గిలము ♆.

ఉదూఢము. సం.విశే. (అ.ఆ.అ.) 1. పెండ్లి యైనది. 2. బలిసినది. 3. మోయఁబడినది.

ఉద్గతము. సం. విశే. (అ.ఆ.అ.) 1. బ్రద్దలు చేసి పైకి వచ్చినది. 2. పుట్టినది. 3. ఉదయించినది. 4. క్రక్కివేయఁబడినది.

ఉద్గతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఉద్గమనము, పైకిఁ బోవుట. 2. వాంతి. 3. పుట్టుక. "సీ. జగదుద్గతికిని బీజము ప్రధాన మన..." ఆము. 3, ఆ. ౮.

ఉద్గమనీయము. సం. వి. అ. న. 1. తెల్లనివస్త్రములజంట. 2. ఉదికినబట్ట. 3. కట్టి విడచినబట్ట. "గీ. తండ్రియుద్గమనీయంబు తానె యుదుకు." పాండు. 3, ఆ. ౪౬.

ఉద్గమము. సం. వి. అ. పుం. 1. పైకిఁ బోవుట. 2. పుట్టుక. 3. ఉదయము. 4. ఎత్తు. 5. నిక్కు. 6. విడుపు. 7. మొక్క. 8. వాంతి.

ఉద్గమించు. సం. అ. క్రి. 1. ఊరు, పైకి వచ్చు. "వ...సాంసర్గికద్రవ్యవికారంబునం జేసి యూర్ధ్వం బగుటయు ముద్దగట్టుటయు...తాపనివారణంబును గూపగతం బైనజలంబు దివియ మఱియు నుద్గమించుటయు ననునివి జలవృత్తు లనంబడు..." భాగ. 3, స్కం.,౮౯౬. 2. ఎగురు. "ఉ...వాలి మింటికిక్,గ్రక్కున నుద్గమించె..." ఉ. రా. 3, ఆ. ౨౭౨.

ఉద్గరణము. సం. వి. అ. న. 1. వాంతి. 2. త్రేఁపు.

ఉద్గాఢము. సం. వి. అ. న. అతిశయము. విశే. (అ. ఆ. అ.) అధికము.

ఉద్గాత. సం. వి. ఋ. పుం. యజ్ఞమునందు సామవేదతంత్రము నడపు ఋత్విజుఁడు.

ఉద్గారము. సం. వి. అ. పుం. 1. క్రక్కు. 2. స్రావము. 3. త్రేఁపు.

ఉద్గారించు. సం. అ. క్రి. త్రేఁచు. స. క్రి. వెలిగ్రక్కు, విడుచు. "మ...సౌరభము లుద్గారించుచుఁ..." పిన. శకుం. ౧,ఆ.౮౪. "సీ. కన్నుకన్నునకు మౌక్తికము లుద్గారించుఁ జెఱకు సింగిణిచేతఁ జెప్పరున్న." ఉద్భ. ౭, ఆ. ౧౧౭. ('ఉద్గాలించు' ముద్రి.)

ఉద్గిరణము. సం. వి. అ. న. నిగరణము, మ్రింగుట,

ఉద్గిరి. సం. వి. ఇ. స్త్రీ=ఉద్గిరణము.

ఉద్గీతి. సం. వి. ఇ. స్త్రీ. 1. పాడుట. 2. ఒకానొక మాత్రావృత్తము, ఆర్యావృత్తభేదము. 3. సామగానము చేయుట.

ఉద్గీథము. సం. వి. అ. పుం. 1. ప్రణవము. 2. సామవేదము. (సామవేదభేద మని యొకరు. సామగానావయవభేద మని వాచస్పత్యము.) 3. మేఘము.

ఉద్గీథుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకానొక ఋత్విజుఁడు. 2. చంద్రుఁడు.

ఉద్గీర్ణము. సం. విణ. (అ.ఆ.అ.) 1. క్రక్కఁబడినది. 2. పైకి వ్యాపింపఁజేయఁబడినది. 3. వెడలింపఁబడినది.

ఉద్ఘూర్ణము. సం. విణ. (అ.ఆ.అ.) పై కెత్తఁబడినది.

ఉద్గ్రాహము. సం. వి. అ. పుం. ఉద్గ్రహణము, పై కెత్తి పట్టుకొనుట.

ఉద్గ్రీవుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. మెడ పై కెత్తినవాఁడు. 2. గర్వము కలవాఁడు.

ఉద్ఘటితము. సం. వి. అ. న. రతిబంధ విశేషము.

ఉద్ఘట్టనము. సం. వి. అ. న. ఒరయిక, రాపిడి.

ఉద్ఘనము. సం. వి. అ. పుం. చెక్కెడు మ్రానికి ఆనికగా క్రింద నుంచుదుంగ మున్నగునది.

ఉద్ఘము. సం. వి. అ. పుం. 1. హస్తపుటము. 2. అగ్ని. 3. దేహమునందలివాయువు. విణ. అ. పుం. శ్రేష్ఠము, ప్రశస్తము. ఉదా:—గవోద్ఘము. (ఇది మతల్లికాదుల వంటిది.)

ఉద్ఘాటనము. సం. వి. అ. న. 1. పైకి లాగుట. 2. చేఁద మున్నగు నీళ్లుతోడు సాధనము, ఏతము. 3. ఉగ్గడించుట. 4. భేదించుట. 5. తాళపుఁజెవి మున్నగు పెట్టె తెఱచు సాధనము.

ఉద్ఘాటించు. సం. స. క్రి. 1. కవియు, ఎదుర్కొను. "మ. పొడగానంబడకుండ డాఁగు వెలికిం బోవంగఁ దా నడ్డమై, పొడచూపుం జరణంబులం బెనఁగొనుం బోరాక రారాక బెగ్గడిలం గూలఁగఁ దాఁచు లేచుఁ బటి నుద్ఘాటించు లంఘించు..." భాగ. ౮, స్కం. ౬౩. 2. భేదించు, పగులఁగొట్టు. "వ. ఘోర కర్పరంగ వేణు వీణా నినాదంబు రోదసీకటాహంబు నుద్ఘాటింప..." నైష. ౬, ఆ. ౭౦. 3. చంపు; చావఁగొట్టు. "మ...నిశాచరుల నుద్ఘాటించి..." ౭. ప్ర. ౬, ఆ. ౨౬౯. 4. కూడఁగొట్టు, పడఁగొట్టు. "వ. యూపస్తంభంబు లుద్ఘాటించిరి..." కాశీ. ౭, ఆ. ౮౩. 5. పెఱుకు, కూడఁబీయు. "క. కైటభవిరోధిభక్తిరసాటోపం బెసఁగ వనరుహాలోకన ముద్ఘాటించి భీమనాథుని హాటక పదపీఠిలోచనాబ్జముఁ బెట్టెన్." భీమ. ౬, ఆ. ౬౭. అ. క్రి. వ్యాపించు, విస్తరించు. "స్రగ్ధర. ఉద్ఘాటించుచున్ ...ప్రతాపాతపంబుల్ ..." పరాహ. ౧, ఆ. ౪౦.

ఉద్ఘాతము. సం. వి. అ. పుం. 1. దెబ్బ. 2. ఆరంభము. 3. ఇనుపగుదియ. 4. తొట్రుపాటు. 5. అడ్డు. 6. కొట్టుట. 7. ప్రాణాయామము. 8. రేచకపూరకకుంభకములలో నొకటి. విణ. (అ. ఆ. అ.) ఎత్తినది.

ఉద్ఘుష్టము. సం. వి. అ. న. ధ్వని, మ్రోఁత. విణ. (అ.ఆ.అ.) 1. ధ్వనించినది. 2. వినఁబడినది.

ఉద్ఘోషము. సం. వి. అ. పుం. 1. మొఱ్ఱ. 2. చాటింపు. 3. జనప్రవాదము. 4. బిగ్గఱగా మాటాడుట.

ఉద్ఘోషించు. సం. అ. క్రి. ఊఱము. "మ...ఉద్ఘోషించె నూత్నాభ్రముల్." కవిక. ౬, ఆ. ౧౨౨. స. క్రి. చాటు, నొక్కి చెప్పు.

ఉద్దండము. సం. వి. అ. పుం. పెద్దకఱ్ఱ. విణ. (అ.ఆ.అ.) 1. భయంకర మైనది. 2. మిక్కుటమైనది. 3. పొడు వైనది. 4. నిరంకుశ మైనది. 5. ఎత్తఁబడినదండము కలది.

ఉద్దండించు. సం. అ. క్రి. వ్యాపించు. "మ...ఆ ధరణీనాథునికీర్తి దాఁటెఁ గడు నుద్దండించి బ్రహ్మాండమున్." కాశీ. ౧, ఆ. ౧౨౨. స. క్రి. విడుచు, త్యజించు. "మ. తరుణుల్ గొందఱు మూలగేహముల నుద్దండించి రారాక తద్విరహాగ్నిం బరితాపమందుచు..." భాగ. ౧౦, స్కం. పూ. ౯౬౭.

ఉద్దంతురము. సం. వి. అ. పుం. 1. ఉన్నతమైనది. 2. మిట్టపల్లది. 3. భయంకరమైనది.

ఉద్దంతుఁడు. సం. వి. అ. పుం. 1. పొడగరి, 2. మిట్టపల్లవాఁడు.

ఉద్దంశము. సం. వి. అ. పుం. 1. మత్కుణము, నల్లి. 2. లీఖ, పేను. 3. మశకము, దోమ. 5. జోటీఁగ.

ఉద్దడ. దే. వి. మల్లబంధవిశేషము. ప్రబంధ. ౭౮.

ఉద్దము. దే. వి. 1. పాదరక్ష, చెప్పు. "గీ. పాదములఁ గిట్టు కిట్టని పలుకుచుండు, కుచ్చుటుద్దాలుఁ జేపట్టుకోల యమర." హంస. 3, ఆ. ౯౦. (శ.ర.పా. 'కుచ్చుటద్దాలు' ముద్రి.) 2. పాదరక్షావిశేషము, ఒకవిధమగు చెప్పు. ఆం. భా. ద్వి. ౨౯౮. 3. పొడవు, ఎత్తు. (బ్రౌ.)

ఉద్దర. వై. వి. (సం. ఉద్ధారః.) అధి, తాకట్టు. "సీ. తాకట్టు కుదువ యుద్దర వారకం బీ దనం గను నాధి చెలఁగుచుండు." ఆం. భా. ద్వి. ౨౨౯.

ఉద్దరి. దే. వి. వాటమై మిక్కిలి పొడవైనగట్టు. (శ. ర. బ్రౌ.) విణ. ఉత్తది, లేనిది. వ్యవ :— వాఁడు చేయున దేమి ? ఉద్దరి.

ఉద్దరువు. వై. వి. ఉద్దర. "ఉ. వెచ్చము వెట్టుమన్న బదివేలకు నుద్దరు వొల్లరు..." పిన. శకుం. ౧, ఆ. ౭౮.

ఉద్దవడి. దే.అవ్య. ద్రు. (ఉద్ద+వడి.) శీఘ్రముగా. "చ. అలిగి ప్రహస్తుఁ డుద్దవడి హైహయుపై ముసలంబు వైచినన్." ఉ. రా. 3, ఆ. ౨౪3. 2. మిక్కిలి. "సీ. పరమేశు మన ముద్దవడి ముట్టి సాధింప నెత్తినగతిఁ దల యెత్తఁదొడఁగె." కు. సం. 3, ఆ. 3౨.

ఉద్దవిడి=ఉద్దవడి. 1. శీఘ్రముగా. "ఉ...య,కా వలిపె రడంత మని యప్పుడ యుద్దవిడిన్... రాజత శైలముఁ జేరఁ బోయినన్." నిర్వ. ౪, ఆ. ౪3. 2. మిక్కిలి. "చ...పరాకునన్ మెలఁగుచిత్తము లుద్దవిడిం గలంగఁగా,నిందుని భాస్య లప్పుడు సమీక్షణఁ జేసిరి రాజహంసముల్." నైష. ౨, ఆ. ౪౫.

ఉద్దాంతము. సం. విణ. (అ.ఆ.అ.) మిక్కిలి అణఁచఁబడినది.

ఉద్దానము. సం. వి. అ. న. బంధించుట, బంధనము.

ఉద్దామ్ముఁడు. సం. వి. అ. పుం. వరుణుఁడు. విణ. (అ.ఆ.అ.) 1. బంధరహితుఁడు. 2. భయంకరమైనవాఁడు. 3. స్వాతంత్ర్యము గలవాఁడు. 4. గాంభీర్యము కలవాఁడు. 5. గర్వము గలవాఁడు. 6. ఆధిక్యము గలవాఁడు.

ఉద్దారుఁడు. హిం. వి. ఒకానొకయధికారి. "గీ. అమనుజుఁ డైదు తేజితో నరుగుదెంచె, దారుణాకారుఁ డైనయుద్దారుఁ డొకఁడు." శుక. ౨, ఆ. ౪౨౬.

ఉద్దాలకము. సం. వి. అ. పుం. 1. ఎఱ్ఱజొన్న చే. 2. మణివిశేషము. 3. ధాన్యభేదము. 4. కొండగోఁగుపువ్వు.

ఉద్దాలము. సం. వి. అ. పుం. బహువాలకము, విరిగిచే.

ఉద్ది. దే. వి. 1. జత. (శ. ర.) 2. జట్టు. "సీ. వేడ్కతోఁ బాడుచు విరిబంతు లాడుచు నుద్దులు గూడుచు నుబ్బి యుబ్బి." పరమ. ౪,ఆ.౧౦౦. 3. చెలిమి. "సీ. వెలిదామరలఁ బోలు వెడఁద క్రాల్గన్నులు మద్దికాయలతోడ నుద్ది వడయు." కాశీ. ౪,ఆ.౭౧., కాశీ. ౨,ఆ.౫౬. 4. గూడమున్నగువానితో లోఁడినసీడు పొరలిపోకుండ బోదె మొదట నేర్పఱచిన మిట్ట. (శ. ర. బ్రౌ.) 5. మినుము, సస్యవిశేషము.(శ.ర.) విణ. 1. ఉజ్జి, పోటి. "శా. రాజేంద్రుండు విదర్భరాజతనయారత్నంబుఁ బెన్నుద్దులై, రాజీవాక్షుల నుద్దు లుంచుకొని నీరం జల్లు పోరాడుచో..." విక్ర. ౫, ఆ. ౫౭. 2. సాటి, సమానము. "సీ...బిసరుహాసను నుద్ది పెద్దవిభుఁడు." నైష. ౧,ఆ. ౨౬. 3. జంటగలది. "దండకము...దిట్టవై కిట్టి పెన్నుద్దిమద్దుల్ వడం ద్రోచియున్..." పారి. 3, ఆ. 3౮.

ఉద్దించె. దే. అ. క్రి. సరిపోలు, ఎనయగు. "సీ. ఉదయాద్రితటముతో నుద్దించునురమునఁ గౌస్తు

భం బనుదివాకరుఁడు దోఁప." ఉ. హరి. ౨, ఆ. ౧౪౬. అ. క్రి. స. క్రి. "గీ. చెంచుకోమరుల తోడ నుద్దించుకాడుఁ, దిన్నఁ డభినవబాల్య సంపన్నుఁ డగుచు." కాళ. 3, ఆ. 33.

ఉద్దికాఁడు. దే. విణ. (ఉద్ది+కాఁడు.) 1. జత యైనవాఁడు. "ఉ...భా, స్వంతుని యుద్ది కాఁడు..." భల్లా. ౫, ఆ. (శ. ర.) 2. చెలిమి కాఁడు. "సీ. ఎద్దు తత్తడిజోడునుద్దికాఁ డిడిన హాళంబట్టు నాడెపుజల్లుఁ బుట్టములును." ఉచ్చు. ఆర. ౫౭. (శ. ర. పా. 'జోడునుద్దికాఁడు.' ముద్రి.)

ఉద్దిగొను. దే. అ. క్రి. (ఉద్ది+కొను.) జతగూడు, జంట యగు. "వ. ఇద్దఱుముద్దియ లుద్దిగొని వీణ లందుకొని...వాయించుచు..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౮౨.

ఉద్దిచేయు. దే. స. క్రి. (ఉద్ది+చేయు.) జోడించు, జతగూర్చు. "గీ. దక్షునల్లుండ్ర మెడల సూత్రములు గట్టి,యూపములు సూత్రములతోడ నుద్ది చేసి,దామెనలు గూర్చి నడిపించెఁ దరతరంబ, వీరభద్రుఁడు పశువుల వెల్చునట్లు." కాశీ. ౭, ఆ. ౮౮.

ఉద్దితము. సం. విణ. (అ.ఆ.అ.) బద్ధము, కట్టఁ బడినది.

ఉద్దియ. వై. వి. (సం. ఉద్యోగః.) యత్నము. (చూ. ఉద్దియసేయు.)

ఉద్దియసేయు. ద్వ. అ. క్రి. (ఉద్దియ+చేయు.) యత్నించు. "ఉ. నిద్దుర మేలుకొన్ము...కాల్య సంధ్య రా,నుద్దియసేయుచున్నయది..." నైష. ౮, ఆ. ౧౭.

ఉద్దిష్టము. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఉద్దేశింపఁబడి నది. 2. కోరఁబడినది. 3. ఉపదేశింపఁబడినది.

ఉద్దీఁడు. దే. వి. (ఉద్ది+ఈఁడు.) ఉద్దికాఁడు, జత గాఁడు. "సీ. పిల్లదీపాడుచుఁ బెనఁగునుద్దీలచే గ్రుద్దులఁబడి కంది కుంది కుంది." శేష. 3, ఆ. (శ. ర.)

ఉద్దీపకము. సం.వి.అ.పుం. వజ్రహేతువు, కొండచీమ. విణ. (ఆ.పి.కా.అ.) 1. వెలిఁగించునది. 2. ప్రకాశింపఁజేయునది. 3. ఉద్రేకింపఁజేయునది.

ఉద్దీపనము. సం. వి. అ. న. 1. వెలుఁగుట. 2. ప్రకాశించుట. 3. ఉద్రేకించుట. 4. మెఱుఁగుపెట్టుట. 5. వెలిఁగించుట. 6. ప్రకాశింపఁజేయుట. 7. విభావభేదము.

ఉద్దీపించు. సం. అ. క్రి. 1. ప్రకాశించు. "మ. త్రిజగన్మోహనలీలకాంతిఁ దను పుద్దీపింప..." భాగ. ౧, స్కం. ౨౧౮. 2. అతిశయించు. "మ...కోప మున నుద్దీపింప నేతెంచిరి..." భార. భీష్మ. ౧, ఆ. ౧౧౦. స. క్రి. రగుల్చు, వెలిఁగించు. "మ...సుస్థిరతం బుణ్యాదశం దపోగ్ని మది నుద్దీపించి..." కు. సం. ౬, ఆ. ౯౬.

ఉద్దీపితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. వెలిఁగింపఁ బడినది. 2. ప్రకాశింపఁజేయఁబడినది. 3. ఉద్రేకింపఁజేయఁబడినది. 4. అతిశయింపఁజేయఁబడి నది.

ఉద్దీప్రము. సం. వి. అ. పుం. న. గుగ్గిలము. విణ. (అ.ఆ.అ.) 1. ప్రకాశించునది. 2. మండునది.

ఉద్దులు. దే. వి. బ. 1. (క. ఉద్దు.) మినుములు. "క. ఉడికినపెసమ్మట మిరియము,పొడి బెల్లముచల్లి యుద్దుపొడి రాలిచి నే,యిడి యెల్లఁగ వేఁచిన వేఁపుడుఁ గంద మిళిందవేణి పొందుగ నిడి యెన్." పాంచాలీ. ౪, ఆ. ౪౭. 2. బాల క్రీడావిశేషము. "ద్వి. బంతులాలంకి యప్పల ములు పాఱి,గంతు లుద్దులు గ్రచ్చకాయలాట లును." అ. మ. క. ౪౬, పు. ౨౪.

ఉద్దేశకము. సం.వి.అ.పుం. 1. ఉదాహరణమున కిచ్చు వాక్యము. 2. అభ్యాసార్థమిచ్చినగణితప్రశ్న. (లీలావతి.)

ఉద్దేశపాదపము. సం.వి.అ.పుం. చైత్యము, రచ్చ 🌲.

ఉద్దేశము. సం. వి. అ. పుం. 1. లక్ష్యము, గుఱి. 2. అనుసంధానము. 3. అభిలాషము. 4. ఉపదేశము. 5. అభిప్రాయము. 6. ఉన్నతప్రదేశము. 7. ఏకదేశము. 8. వెదకుట.

ఉద్దేశించు. సం. స. క్రి. 1. గుఱించు. "వ...హరి నుద్దేశించి యనిన విని..." భాగ. ౭, స్కం.

౧౯. 2. భావించు. "శా. దేవా దేవరతోడఁ బుట్టువు... సీ,శ్రీ వెంపారుటఁ గోరు నీమహిమఁ బ్రార్థించుక్ మదిం గావ్రనక్,వేవేద్రామల చంద మెప్ప దని యుద్దేశించి..." నిర్వ. ౪, ఆ. ౨౬.

ఉద్దేశ్యము. సం. వి. అ. న. అభిలాషమునకుఁ గాని యభిప్రాయమునకుఁ గాని గలకారణము. విణ. (అ.ఆ.అ.) 1. గుఱిపంపఁదగినది. 2. ఉద్దేశింపఁదగినది. 3. అభిలషింపఁదగినది. 4. ఉపదేశింపఁదగినది.

ఉద్దేహిక. సం. వి. ఆ. స్త్రీ. చెదపురుగు.

ఉద్ద్యోతము. సం.వి.అ.పుం. 1. కిరణము. 2. కాంతి. 3. వ్యాకరణగ్రంథము. 4. అలంకారగ్రంథము. విణ. (అ.ఆ.అ.) ప్రకాశింపఁజేయునది.

ఉద్ద్యోతించు. సం. అ. క్రి. ప్రకాశించు, వెలుఁగొందు. "క. ఆతనిదేహము వెలువడి, యాతత మగుదీప్తి యంబరాంతంబున నుద్ద్యోతించుచు నెగసి మహాజ్యోతీరూపంబువోయి సూర్యునిఁ గలసెన్." ద్వా. ౧, ఆ. ౧౬౪., కళా. ౨, ఆ. ౯.

ఉద్ద్రావము. సం. వి. అ. పుం. 1. పలాయనము, పాఱిపోవుట. 2. జంకు, వెనుదీయుట. విణ. (అ. ఆ. అ.) 1. పరుగెత్తునది. 2. జంకునది, వెనుదీయునది.

ఉద్ద్రుతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వెనుదీసినది. 2. పాఱిపోయినది. 3. వడిగాఁ బరుగెత్తినది.

ఉద్ధతము. సం. విణ. (అ.ఆ.అ.) 1. గర్వించినది. 2. పైకెగిరినది. 3. కఠినము. 4. కొట్టఁబడినది.

ఉద్ధతి. సం. వి. ఇ. స్త్రీ. 1. గర్వము. 2. ఉద్దీనము. 3. పెద్దదెబ్బ.

ఉద్ధరణము. సం. వి. అ. న. 1. ఊడఁదీయుట. 2. మీఁది కెత్తుట. 3. వాంతి. 4. ఋణము దీర్చుట. 5. ఉద్ధరించుట. 6. ఆపదనుండి కడతేర్చుట. 7. ముక్తి. 8. పెకలించుట. 9. కక్కిన యన్నము. 10. ఉద్యోగమునుండి తీసివైచుట.

ఉద్ధరణి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆచమనాదులందు నీళ్లు చేతిలోఁ బోసికొనుట కుపయోగించు చిన్న గరిటె వంటి సాధన విశేషము. 2. ఏతము, గిలక.

ఉద్ధరించు. సం. స. క్రి. 1. పెల్లగించు. 2. మీఁది కెత్తు, లేవదీయు. "గీ...గృహమేధిమండలంబు, నుద్ధరింపఁగ నాపథ మొందుగలదె,యుష్మదంఘ్రిరజోలేశ మొకటి దక్క." స్వా. ౧, ఆ. ౬౪. 3. రక్షించు. "వ...లోకంబు లుద్ధరింపు మనిన..." మార్క. ౨, ఆ. ౧౮౫.

ఉద్ధర్త. సం. విణ. (ఋ. ఈ. స్త్రీ. ఋ.) 1. పైకెత్తువాఁడు. 2. ఆపదనుండి కాపాడువాఁడు. 3. నాశము చేయువాఁడు.

ఉద్ధర్షము. సం. వి. అ. పుం. 1. అధికానందము. 2. ఉత్సవము. విణ. (అ. ఆ. అ.) 1. సంతోషించునది. 2. మితి మీఱినసంతోషము గలది.

ఉద్ధవము. సం. వి. అ. పుం. 1. ఉత్సవము. 2. యజ్ఞాగ్ని.

ఉద్ధానము. సం. వి. అ. న. 1. ప్రొయ్యి. 2. వాంతి. విణ. (అ.ఆ.అ.) 1. లేచినది. 2. క్రక్కఁబడినది.

ఉద్ధారకుఁడు. సం. విణ. (అ.రికా.అ.)=ఉద్ధర్త.

ఉద్ధారణము. సం. వి. అ. న. 1. రక్షణము. 2. పైకెత్తుట. 3. నీళ్లు మున్నుగునవి తోడుట. 4. పంచుకొనుట.

ఉద్ధారము. సం. వి. అ. పుం. 1. ఊడఁబెఱుకుట. 2. రక్షించుట. 3. లేవనెత్తుట. 4. తోడుట. 5. విడఁదీయుట. 6. విడఁదీసినభాగము. 7. దాయభాగమునుండి జ్యేష్ఠుని కీయఁదగిన సొమ్ము. 8. అప్పు. 9. వడ్డి లేనిఋణము. 10. ముక్తి. 11. ఋణశుద్ధి.

ఉద్ధితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పెరిగినది. 2. నిక్కినది. 3. పుట్టినది.

ఉద్ధురము. సం. విణ. (అ.ఆ.అ.) 1. తొలఁగించిన బరువు కలది. 2. దృఢమైనది. 3. బిగ్గరమైనది. 4. దట్టమైనది. 5. నిండినది. 6. సమర్థమైనది.

ఉద్ధూతము. సం. విణ. (అ.ఆ.అ.) 1. మీఁదికిఁ గదలింపఁబడినది. 2. వణఁకింపఁబడినది. 3. ఎగురఁగొట్టఁబడినది. 4. గట్టిగాఁ బిలువఁబడినది.

ఉద్ధూననము. సం. వి. అ. న. 1. ఎగఁజిమ్ముట. 2. ఎగురఁగొట్టుట. 3. వణఁకించుట. విణ. (అ.ఆ.అ.) ఎగురఁగొట్టునది.

ఉద్ధృతము. సం. విణ. (అ.ఆ.అ.) 1. పైకెత్తఁబడినది. 2. తోడఁబడినది. 3. రక్షింపఁబడినది. 4. అనుభవింపఁబడి విడువఁబడునది. 5. వెకలింపఁబడినది. 6. విభక్తమైనది. 7. చెల్లాచెదరు చేయఁబడినది. 8. తీసివేయఁబడినది. 9. ఎగఁజిమ్మఁబడినది. 10. తీసి చూపఁబడినది.

ఉద్ధృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. పైకెత్తుట. 2. ఎగఁజిమ్ముట. 3. తోడుట. 4. వెడలఁదీయుట. 5. రక్షించుట. 6. విముక్తి. 7. గర్వము.

ఉద్బంధము. సం. వి. అ. పుం. 1. పైకెత్తికట్టుట. 2. ఉరితీయుట. విణ. (అ.ఆ.అ.) 1. కట్టువీడినది. 2. చెఱనుండి విముక్తి నందినది.

ఉద్బలుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) మిక్కిలిబలము గలవాఁడు.

ఉద్బుద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మేలుకొన్నది. 2. తలఁపునకుఁ వచ్చినది. 3. ఉద్రేకించినది. 4. వికసించినది. 5. ఉద్బోధము గలది.

ఉద్బుద్ధితము. సం. వి. అ. న. రతిబంధవిశేషము.

ఉద్బోధకము. సం. విణ. (అ. ధికా. ఏ.) 1. మేలుకొలుపునది. 2. ఉద్బోధించునది.

ఉద్బోధనము. సం. వి. అ. న. 1. మేలుకొనుట. 2. వికాసము. 3. సంస్కారోద్దీపనము.

ఉద్బోధము. సం. వి. అ. పుం=ఉద్బోధనము.

ఉద్బోధించు. సం. స. క్రి. 1. మేలుకొలుపు. 2. రగుల్చు. "మ...చక్రదావశిఖి నుద్బోధింప నేతెంచె..." వరాహ. ౫, ఆ. ౩౯.

ఉద్భగ్నము. సం. వి. అ. న. రతిబంధవిశేషము.

ఉద్భటము. సం. వి. అ. పుం. 1. చేట. 2. తాఁబేలు.

ఉద్భటుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు. విణ. (అ. ఆ. అ.) 1. శ్రేష్ఠుఁడు. 2. శూరుఁడు. 3. మహాశయుఁడు.

ఉద్భవము. సం. అ. పుం. 1. ఉత్పత్తి. 2. జన్మకారణము. విణ. (అ. ఆ. అ.) పుట్టినది.

ఉద్భవించు. సం. అ. క్రి. పుట్టు. "చ...శిశ్రుం డను, గ్రహమున నుద్భవించె నని క్రచ్చఱఁ బల్కు పురాణ సంహితల్." భీమ. ౩, ఆ. ౧౬౧.

ఉద్భవిల్లు. సం=ఉద్భవించు.

ఉద్భాసము. సం. వి. అ. పుం. ప్రకాశము, కాంతి.

ఉద్భాసితము. సం. విణ. (అ. ఆ. అ.) వెలిఁగింపఁబడినది.

ఉద్భాసిల్లు. సం. అ. క్రి. మిక్కిలి ప్రకాశించు. "క...పిన్నవసుధాధిపుఁ డుద్భాసిల్లె..." వసు. ౧, ఆ. ౨౫.

ఉద్భిజ్జము. సం. విణ. (అ.ఆ.అ.) భూమిని భేదించుకొని పుట్టునది. (తరుగుల్మాది.)

ఉద్భిత్తు. సం. విణ. (ద్)=ఉద్భిదము.

ఉద్భిదము. సం. విణ. (అ. ఆ. అ.) మొలచునది. (మొక్క.)

ఉద్భిన్నము. సం. విణ. (అ.ఆ.అ.) 1. పుట్టినది. 2. మొలచినది. 3. వికసించినది. 4. చీల్చఁబడినది. 5. మోసముచేఁ బట్టి యీఁబడినది.

ఉద్భూతము. సం. వి. అ. పుం. పాదస్ఖలనము, కాళ్లు తడఁబడుట. విణ. (అ.ఆ.అ.) పుట్టినది.

ఉద్భూతి. సం. వి. ఇ. స్త్రీ. 1. పుట్టుక. 2. ఐశ్వర్యము. 3. ఔన్నత్యము. విణ. (ఇ) గొప్పయైశ్వర్యము గలవాఁడు.

ఉద్భేదనము. సం. వి. అ. న. 1.=ఉద్భేదము. 2. ప్రకాశనము.

ఉద్భేదము. సం. వి. అ. పుం. 1. చీల్చుట. 2. భేదించుకొని పైకివచ్చుట. 3. బయలుపడుట.

ఉద్భ్రమణము. సం. వి. అ. న.=ఉద్భ్రమము.

ఉద్భ్రమము. సం. వి. అ. పుం. 1. పరిభ్రమణము, చుట్టు తిరుగుట. 2. పైని తిరుగుట. 3. ఉద్వేగము, మనోవ్యాకులత.

ఉద్భ్రాంతము. సం. వి. అ. న. 1. చుట్టుఁ దిరుగుట. 2. పైని దిరుగుట. 3. గిరగిరఁ దిరుగుట. 4. కత్తిని త్రిప్పుట. విణ. (అ.ఆ.అ.) 1. చుట్టుఁ దిరిగినది. 2. పైని తిరిగినది. 3. భ్రాంతి నందినది. 4. గిఱ్ఱునఁ త్రిప్పఁబడినది.

ఉద్యత్. సం. శత్రు. 1. పైకి లేచుచున్న. 2. ఉదయించుచున్న. 3. బయలుదేఱుచున్న.

ఉద్యతము. సం. వి. అ. న. యత్నము, ఉద్యమము. విణ. (అ.ఆ.అ.) 1. యత్నించినది. 2. పైకెత్తఁబడినది. 3. సిద్ధమైనది.

ఉద్యతి. సం. వి. ఇ. స్త్రీ. 1. పై కెత్తుట. 2. యత్నము.

ఉద్యమము. సం. వి. అ. పుం. 1. పై కెత్తుట. 2. శ్రమము. 3. ప్రయత్నము. 4. సిద్ధమగుట.

ఉద్యమించే. సం. స. క్రి. ప్రారంభించు, మొదలుపెట్టు. అ. క్రి. కడఁగు, యత్నించు. "వ...పృథుచక్రవర్తి...ఇంద్రునిమీఁద బాణంబు నేయ నుద్యమించిన..." భాగ. ౪, స్కం. ౫౨౫.

ఉద్యానకము. సం.=ఉద్యానము.

ఉద్యానము. సం. వి. అ. పుం. న. 1. విహారము కొఱకు బయలుదేఱుట. 2. విహారార్థ మైన పూలవనము. 3. ప్రయోజనము.

ఉద్యాపనచేయు. మి. స. క్రి. (ఉద్యాపనము+చేయు.) విడుచు, త్యజించు. "ఉ...చంచూపుట మానము ద్రఁ దఱిఁ జూచి వినిద్రనివేకశాలి యుద్యాపనచేసెఁ గన్నుఁగొనలందుఁ దొలంకఁగ మందహాసముల్." నైష. ౨, ఆ. ౧౫.

ఉద్యాపనము. సం. వి. అ. న. 1. వ్రతాదులను సమాప్తి చేయుట. 2. వెడలఁగొట్టుట.

ఉద్యాసము. సం. వి. అ. పుం. యత్నము.

ఉద్యుక్తము. సం. విణ. (అ.ఆ.అ.) 1. పూనినది. 2. సిద్ధమైనది.

ఉద్యోగము. సం. వి. అ. పుం. 1. యత్నము. 2. పని. 3. పాటుపడుట.

ఉద్యోగి. సం. విణ. (న్. సీ. న్.) 1. యత్నించువాఁడు. 2. వ్యాపారము గలవాఁడు. 3. పాటుపడువాఁడు.

ఉద్యోగించే. సం. అ. క్రి. 1. యత్నించు. "మ. ఉదయం బొందఁగఁ జేసి నీవు క్రియ కుద్యోగించు టెల్లన్ శుభప్రదమై..." హరి. పూ. ౭, ఆ. ౨౦౪. 2. సిద్ధపడు. "వ. అతండు పయనంబున కుద్యోగించిన." భార. ఉద్యో. ౧, ఆ. ౨౧౪.

ఉద్రథము. సం. వి. అ. పుం. కోడి.

ఉద్రము. సం. వి. అ. పుం. నీరుపిల్లి.

ఉద్రిక్తము. సం. విణ. (అ.ఆ.అ.) 1. అతిశయించినది. 2. విజృంభించినది. 3. విదితము.

ఉద్రేకము. సం. వి. అ. పుం. 1. విజృంభణము. 2. అతిశయము. 3. కామాదులు హెచ్చుగుట.

ఉద్రేకించే. సం. అ. క్రి. 1. అతిశయించు. "సీ. దివ్యగంధముల నుద్రేకించి విద్యుదంకురరేఖలకు జోడు కోడె లగుచు." పాండు. 3, ఆ. ౧౧౧. 2. కలఁగు. "శా...ఆకంపించె జగత్త్రయంబు దెసలల్లాడెన్ సముద్రంబు లుద్రేకించెన్..." కాశీ. ౪, ఆ. ౨౨౨.

ఉద్వర్తనము. సం. వి. అ. న. 1. పైకెఁ బోవుట. 2. ఎగిరిపడుట. 3. వృద్ధియగుట. 4. నలుఁగు పెట్టుట. 5. నలుఁగుపిండి. 6. యుప్రవర్తనము. 7. రాపిడి.

ఉద్వర్తనము. సం. వి. అ. పుం. 1. పైపెచ్చు. 2. అతిశయము. 3. నలుఁగుపెట్టుట. విణ. (అ.ఆ.అ.) అతిశయించినది.

ఉద్వసించే. సం. స. క్రి. దేవతాదులను పూజానంతరము స్వస్థానముఁ జేర్చు. "ఉ...లింగముల్ నిక్కపుభక్తిఁ బీఠమున నిల్పి భజించుచు నుద్వసింపఁ బోనక్కడ దేవుఁ డుండ..." కాశీ. ౪, ఆ. ౭౨.

ఉద్వహ. సం. వి. ఆ. స్త్రీ. కూఁతురు.

ఉద్వహనము. సం. వి. అ. న. 1. పైకెత్తుట. 2. మోచుట. 3. పెండ్లియాడుట.

ఉద్వహము. సం. వి. అ. పుం. 1. వివాహము, పెండ్లి. 2. ఒకానొకవాయువు.

ఉద్వహించు. సం. స. క్రి. 1. ధరించు. "ఆ. వటు నిషాదకోచవారి శిరంబునఁబరమభద్ర మనుచు బలి వహించె,నేజలము గిరీశుఁ డిందుజూటుఁడు దేవ,దేవుఁ డుద్వహించె ధృతి శిరమున." భాగ. ౮, స్కం. ౫౪౭. 2. మోచు. "సీ. కంబళికట బ్రుసీకాషాయ కరకంబు లొక్కయం తేవాసి యుద్వహింప." పాండు. ౫, ఆ. ౧౮౭. 3. పట్టుకొను. "సీ. అనుయాయిపృథుక వాస్తాం తరన్యస్తోపదోంచితార్థము తానె యుద్వహించి." పాండు. ౧, ఆ. ౧౯౦. 4. పెండ్లియాడు, "క. ఆ లక్ష్మీనారాయణుఁడు...బాలామణి ను ద్వహించె భాగ్యము లొలయన్." బ్రహ్మో. ౧, ఆ. ౪౦. 5. ఎగఁబట్టు. 6. ఎత్తిపట్టుకొను.

ఉద్వహుఁడు. సం. వి. అ. పుం. పితృదేవతలను నరకమునుండి రక్షించువాఁడు, కొడుకు. విణ. (అ. ఆ. అ.) 1. మోచువాఁడు. 2. పైకెత్తువాఁడు. 3. వంశమును వృద్ధినొందించువాఁడు. 4. శ్రేష్ఠుఁడు.

ఉద్వాంతము. సం. వి. అ. పుం. మద ముడిగిన యేనుఁగు. విణ. (అ.ఆ.అ.) 1. క్రక్కఁబడినది. 2. భేదించి పైకివచ్చినది.

ఉద్వానము. సం. వి. అ. న. ప్రొయ్యి.

ఉద్వాసనము. సం. వి. అ. న. 1. గృహాదులనుండి వెడలఁగొట్టుట. 2. విడుచుట. 3. చంపుట. 4. దేవతాదులను పూజానంతరము స్వస్థానము చేర్చుట.

ఉద్వాసము. సం=ఉద్వాసనము. విణ. (అ.ఆ.అ.) గృహాదులనుండి వెడలినది, ప్రవాసమున నున్నది.

ఉద్వాసించు. సం. స. క్రి. విడనాడు. "శా. తా పంబుం బెడఁబాపి దుర్దమ విషాదంబుం దిగం ద్రావి ని,ర్వ్యాపారత్వముఁ బోవఁద్రోచి పగ లుద్వాసించి..." నిర్వ. ౯, ఆ. ౭౦.

ఉద్వాహనము. సం. వి. అ.న. 1. పెండ్లిచేయుట. 2. పెండ్లాడుట. 3. పైకెత్తుట. 4. తోడుట. 5. స్థలాంతరమునకు దీసికొనిపోవుట. ౬. ఇను మఱు మన్నిసహాలకు. విణ. (అ. ఆ. అ.) 1. పైకెత్తునది. 2. తోడునది.

ఉద్వాహము. సం. వి. అ. పుం. 1. వివాహము. 2. పైకెత్తుట. 3. మోచుట.

ఉద్వాహిని. సం. వి. ఈ. స్త్రీ. త్రాడు, రజ్జువు.

ఉద్విగ్నము. సం. విణ. (అ.ఆ.అ.) 1. వ్యాకుల చిత్తము. 2. భయమందినది.

ఉద్వీక్షణము. సం. వి. అ. న. 1. పైకిఁ జూచుట. 2. చూపు. 3. చూచుట. 4. కన్ను.

ఉద్వీక్షించు. సం. స. క్రి. చూచు. "రగడ. ఉడు రాజ కళాభరణు...ఉద్వీక్షించును." కాశీ. ౬, ఆ. ౧౨౫.

ఉద్వృత్తము. సం. విణ. (అ. ఆ.అ.) 1. దుష్ప్రవర్తనము గలది. 2. పైకెత్తఁబడినది. 3. ఉచ్ఛ్రితము. 4. క్రక్కఁబడినది. 5. కలఁతనందినది. 6. అధికమైనది. 7. గర్వించినది.

ఉద్వృత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. దుష్ప్రవర్తనము. 2. గర్వము. 3. కలఁత. 4. ఆధిక్యము. 5. వాంతి. 6. ఎగిరెపడుట, మిడిసిపాటు. 7. పైకెత్తుట.

ఉద్వేగము. సం. వి. అ. పుం. 1. కలఁత నందిన మనస్సు. 2. పైభాగమును గదలించుట. 3. చమత్కారము. 4. భీతి. 5. వడఁకు. 6. విరహావ్యథ. న. 1. పోఁకపండు. 2. పోఁకచెక్క. విణ. (అ.ఆ.అ.) 1. వేగముగాఁ బోవునది. 2. నిశ్చలమైనది. 3. మెల్లఁగాఁ బోవునది.

ఉద్వేగించు. సం. అ. క్రి. 1. వ్యాకులపడు. 2. భీతిల్లు. "వ. ఇట్లఖిలభువనాధీశ్వరుం డగు పరమేశ్వరుం డనవరతరతనిరతుండై జగద్వ్యాపారం బారయమికి నింద్రాది దేవత లుద్వేగించి విరించి పాలికిం జని." కు. సం. ౯, ఆ. ౧౫౫.

ఉద్వేగిల్లు. దే. అ. క్రి. భయపడు. "శా...కేశినామకూరాసురుఁడు...చరియించె గోపకుల ముద్వేగిల్ల వేగోద్ధతిన్." హరి. పూ. ౮, ఆ. ౯౯.

ఉద్వేజకము. సం. విణ. (అ. జకా. అ.) 1. చిత్తచాంచల్యము గలిగించునది. 2. దుఃఖంపఁ జేయునది. 3. దుఃఖించునది. 4. భీతి చెందించునది.

ఉద్వేజనము. సం. వి. అ. న. 1. చిత్తచాంచల్యము. 2. విరహావ్యథ. 3. భయము. 4. భయపెట్టుట. 5. కలఁత. 6. కలఁతపెట్టుట. విణ. (అ.ఆ.అ.) 1. భయపెట్టునది. 2. కలఁచునది.

ఉద్వేజితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. కలఁపఁబడినది. 2. వెఱపింపఁబడినది.

ఉద్వేలము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తీరమును దాఁటినది. 2. హద్దు మీఱినది. 3. అధికమైనది.

ఉద్వేష్టనము. సం. వి. అ. న. 1. చుట్టుకొనుట. 2. కాళ్లు చేతులు మున్నగునవి త్రాళ్లతో చుట్టుట. 3. తనలోఁదాను చుట్టుకొనుట. 4. నొప్పి, బాధ.

ఉద్వేష్టితము. సం. విణ. (అ.ఆ.అ.) చుట్టుకొనఁబడినది.

ఉదోఢ. సం. వి. ఋ. పుం. వివాహ మాడినవాఁడు, భర్త.

ఉనికి. దే. వి. 1. ఉండుట. "క. వే ఱొకతెఱఁగున నొరులకు,మాఱాడకయునికి లెస్స..." భార. విరా. ౧,ఆ. ౧౭౮. 2. స్థితి. "గీ. బాలవయ్యు ననత్యుత్తమశీల వినయ, గౌరవాన్వితవై నిర్వికారవృత్తి,నున్న నీ యున్నయునికిన సన్నుతాంగి, సుతుఁడు పుట్టుట యిది గడుఁ జోద్యమయ్యె." భార. ఆది. 3, ఆ. ౧౮౦. 3. బ్రదుకు. "సీ. తన యుని కీపాటు సెనయఁ జేసితి నయో తనయుని కేఁక నేల యనుచుఁ బొగులు." సా. 3, ఆ. ౨౩౧. 4. స్థానము. "మ. ఉనికిఁ నిల్వక ప్రాణముల్ తొలఁగిపో నూహింప..." చంద్రా. ౬, ఆ. ౧౦౭. 5. సంధి విగ్రహాదు లగుషడ్గుణములలో నొకటి. "గీ...షడ్గుణము లగుచుఁ, బేరుకొనఁగాను దగు సంది పోరు పోక,యునికి రంటన..." ఆం. శా. ద్వి. ౧౮౯.

ఉనికిపట్టు=ఉనికి. దే. వి. (ఉనికి+పట్టు.) 1. స్థానము. "సీ. వైరాగ్యమహిమ కీవడుగు నివాసంబు విజయంబునకు నీవఁ డునికిపట్టు." ఉ. రా. ౫, ఆ. ౧౪౦. 2. నివాసస్థానము "ఆ. ఉనికిపట్టు తావు మనికిపట్టు...ఎలరు నివాసదేశంబు నకుఁ బేళ్లు..." సాం. ని. స్థా. ౫.

ఉను. దే. సముచ్చయము. ఐనను. "క...భూసురాహుతి మంత్రోద్భవ దారుణ దహనశిఖల్,గవిసిన నెద్దియును జేయఁగా నెడ గలదే." భార. ఆది. ౨, ఆ. ౧౩౩.

ఉనుకువ. దే. వి. ఉనికి, వాసము. (చూ. ఉనుకువగొను.)

ఉనుకువగొను. దే. అ. క్రి. (ఉనుకువ+కొను.) ఉండు, నివసించు. "వ. శశాంక శిలాసౌధవిటంకంబుల నునుకువగొన్నశఱి శరన్నీరదవశంవదాబగుసునాసీరశిలాశకలం బన మెలంగుచు..." పాండు. ౪, ఆ. ౨౩౬.

ఉనుచు. దే. స. క్రి. ఉంచు, ఉండఁజేయు. (శ. ర.)

ఉన్కి. దే. వి. 1. ఉనికి, ఉండుట. "చ. ఎఱుఁగనె నీవు ప్రాంతమున నింతట నంతట నున్కి..." నైష. ౧, ఆ. ౧౦౪. 2. స్థితి, అవస్థ. "సీ. నా యున్కి గనుఁగొన్న నాసాటివారిలో నిది లాఘవం బని యెంచుకొంటి." అని. ౨, ఆ. ౧౩౭. 3. బ్రదుకు, జీవనము. "క. నీవస్త్రశస్త్రవిద్యా, కోవిదుఁడవు రణములందుఁ గ్రూరుఁడ వరివిద్రావణ సాహసికుఁడవు, గావున నీయున్కి నమ్మఁగా నోప నెడన్." భార. ఆది. ౪, ఆ. ౧౮౩.

ఉన్నతము. సం. వి. అ. న. ఉన్నతి. విణ. (అ.ఆ.అ.) 1. ఎత్తైనది. 2. గొప్పది. 3. ఎత్తఁబడినది.

ఉన్నతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఔన్నత్యము, ఎత్తు. 2. ఉచ్చస్థితి. 3. గరుడునిభార్య.

ఉన్నతిల్లు. సం. అ. క్రి. మిక్కుటమగు. "గీ. పాదపీఠోరువజ్రప్రభాతికంబె,మున్న పదనఖసంకాశమున్నతిల్లె." కు. సం. ౭, ఆ ౫౭.

ఉన్నద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కట్టఁబడినది. 2. పెరిఁగినది.

ఉన్నమనము. సం. వి. అ. న. పైకెత్తుట.

ఉన్నమితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. పైకెత్తఁబడినది. 2. పొడిగింపఁబడినది.

ఉన్నము. సం. విణ. (అ.ఆ.అ.) ఆర్ద్రము, తడిసినది.

ఉన్నయనము. సం. వి. అ. న. 1. ఎత్తినకన్ను. 2. దిద్దుబాటు. 3.=ఉన్నయము. విణ. (అ.ఆ.అ.) కండ్లెత్తినది.

ఉన్నయము. సం. వి. అ. పుం. 1. పై కెత్తుట. 2. పైకిఁ దీసికొనిపోవుట. 3. ఊహించుట. 4. ఉన్నతి, ఎత్తు. 5. ఊహ.

ఉన్నాయము. సం.=ఉన్నయము.

ఉన్నాహము. సం. వి. అ. పుం. 1. కట్టుట. 2. పైని కట్టుట. 3. నిక్కుట. న. పుల్లనీళ్లు.

ఉన్ని. వై. వి. (సం. ఊర్ణా. ప్రా. ఉన్నా.) గొఱ్ఱె బొచ్చు. (శ.ర.)

ఉన్నిగాఁడు. దే. వి. పక్షివిశేషము. "సీ. సొలఁకువ యుల్లంగి పూరేడు లావుక పొన్నంగి దాబయు నున్నిగాఁడు." సుద. 3, ఆ. ౧౯౪.

ఉన్నిద్రము. సం. విణ. (అ.ఆ.అ.) 1. నిద్ర లేనిది, మేల్కొన్నది. 2. ఎచ్చరిక గలది. 3. విరిసినది, వికసించినది.

ఉన్మంథనము. సం.=ఉన్మథనము.

ఉన్మత్తము. సం. వి. అ. పుం. 1. ఉమ్మెత్త చెట్టు. 2. ముచుకుంద చెట్టు. విణ. (అ. ఆ. అ.) 1. పిచ్చి గలది. 2. మత్తు గలది. 3. గర్వించినది. 4. పిశాచాదులచే నావేశింపఁబడినది.

ఉన్మథనము. సం. వి. అ. న. 1. కదలించుట. 2. కలఁచుట. 3. మథించుట. 4. మర్దనము. 5. పీడించుట. 6. చంపుట. విణ. (అ.ఆ.అ.) 1. కదల్చునది. 2. తరుచునది, మథించునది. 3. పీడించునది. 4. చంపునది. 5. మర్దించునది.

ఉన్మదనము సం. విణ. (అ.ఆ.అ.) కామోద్రేకము గలది.

ఉన్మదము. సం. వి. అ. పుం. 1. వెఱ్ఱి. 2. మత్తు. విణ. (అ.ఆ.అ.) 1. వెఱ్ఱియెత్తినది. 2. మత్తెక్కినది. 3. మత్తు కలిగించునది.

ఉన్మదితుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) వెఱ్ఱియెత్తిన వాఁడు.

ఉన్మదిష్ణువు. సం. విణ. (ఉ) 1. వెఱ్ఱియెత్తుస్వభావము గలది. 2. మత్తెక్కినది. 3. మదము పట్టినది.

ఉన్మని. సం. వి. ఈ. స్త్రీ. యోగుల యవస్థలలో నొకటి. "ఆ. ఉత్తమాంశ మూని యున్మనిలోన." వేమన.

ఉన్మనుఁడు. సం. విణ. (న్) 1. తహతహ పడు వాఁడు. 2. అన్యమనస్కుఁడు. 3. వ్యాకుల చిత్తుఁడు.

ఉన్మాథము. సం. వి. అ. పుం. 1.=ఉన్మథనము. 2. జంతువులను బంధించునుపకరణము. (బోను, ఉరి మొ.) విణ.=ఉన్మథనము.

ఉన్మాదనము. సం. వి. అ. పుం. మన్మథుని శర విశేషము. విణ. (అ.ఆ.అ.) 1. వెఱ్ఱి యెత్తించునది. 2. మత్తెక్కించునది.

ఉన్మాదము. సం. వి. అ. పుం. 1. వెఱ్ఱి. 2. అలంకారశాస్త్రమున సంచారిభావములలో నొకటి.

ఉన్మాది. సం. విణ. (న్. నీ. న్.) ఉన్మాదము కల వాఁడు.

ఉన్మానము. సం. వి. అ. న. 1. త్రాసు మున్నగు తూచుసాధనము. 2. త్రాసు మున్నగువానిచేఁ దూఁచుట. పుం. తూము, ఒక తులామానము.

ఉన్మార్గము. సం. వి. అ. పుం. 1. తప్పుదారి. 2. చెడ్డ నడత. విణ. (అ.ఆ.అ.) దారి తప్పినది.

ఉన్మార్జనము. సం. వి. అ. న. 1. తుడిచివేయుట. 2. తొలఁగించుట.

ఉన్మార్జించు. సం. స. క్రి. తుడిచివేయు. "మ... సమరస్వేదోజ్జ్వలం బైనయుగ్మలిఫాలంబుఁ గ పోలయుగ్మకము నున్మార్జించుచుఁ దేవి యగ్గలికం బెద్దపెనంగి దస్సి టిటు లింకం జాలు నిల్మంచు..." హరి. ఉ. ౪, ఆ. ౧౪౯.

ఉన్మితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తూఁచఁబడినది. 2. నిలువునఁ గొలువఁబడినది.

ఉన్మితి. సం. వి. ఇ. స్త్రీ.=ఉన్మానము.

ఉన్మిషత్. సం. శతృ. వికసించియున్న. "చ...ఉన్మిష, న్నలినరజస్సంధి..." భార. ఆది. ౮, ఆ. ౨౩౨.

ఉన్మిషము. సం. వి. అ. పుం. వికాసము. విణ. (అ.ఆ.అ.) వికసించినది.

ఉన్మిషితము. సం. వి. అ. న. **1.** వికాసము. **2.** చూపు. **3.** తెఱచుకొనుట. విణ. (అ.ఆ.అ.) **1.** వికసించినది. **2.** తెఱవఁబడినది.

ఉన్మీలనము. సం. వి. అ. న. **1.** వికాసము. **2.** కన్నుతెఱచుట. **3.** బయలగుట. **4.** బయలు చేయుట. **5.** రంగు వేయుట.

ఉన్మీలితము. సం. వి. అ. న. **1.**=ఉన్మీలనము. **2.** ఒకానొక యర్థాలంకారము. విణ. (అ.ఆ.అ.) **1.** వికసించినది. **2.** తెఱవఁబడినది. **3.** బయలుపెట్టఁబడినది. **4.** రంగు వేయఁబడినది.

ఉన్ముఖము. సం. విణ. (అ. ఆ, ఈ. అ.) **1.** పైకెత్తినముఖము గలది. **2.** ఎదురుచూచునది. **3.** సిద్ధమైనది. (ఉదా:—ఫలోన్ముఖము.) **4.** పలుకునది.

ఉన్ముద్రము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** తెఱచుకొన్నది. **2.** వికసించినది.

ఉన్ముద్రించు. సం. స. క్రి. వెల్లడిచేయు. "మ. మునువుర్ మెచ్చుటయుర్ రహస్యమును నున్ముద్రించి నానాదివౌకసు లాస్థానముఁ గూడియాడుదురు శ్రీకాశీప్రదేశంబునన్, గనవైపుట్టెడుభాగ్యమైన మనకున్ గల్పింప దాదైవమి, కసుమాలం బగునాక మేల యని యుత్కంఠాతిరేకంబునన్." కాశీ. ౭, ఆ. ౨౦౬.

ఉన్మూలనము. సం. వి. అ. న. **1.** సమూలముగాఁ బెల్లగించుట. **2.** సమూలనాశనము చేయుట.

ఉన్మూలము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** పైకి వచ్చిన వేరు గలది. **2.** పెల్లగింపఁబడినమూలము గలది. **3.** మొదలంట నాశనమైనది.

ఉన్మూలించు. సం. స. క్రి. **1.** పెల్లగించు. "శా. బాహాస్తంభచతుష్టయంబున మురప్రధ్వంసి లంఘించి యు, త్సాహం బొప్పఁగ నెత్తె మందరమహీధ్రం బుద్ధతిం గూటసం, దోహంబుల్ ప్రదుష్కాండకర్పరము నున్మూలింప దిక్సీమలం, గ్రాహింపన్ బడయూఘనిష్ఠుర మహాగండోపలధ్వానముల్." భీమ. ౪, ఆ. ౯౮. **2.** చంపు. "మ. అనఘా నిన్ను నుశీనరప్రజల కర్థానందసంధాయిఁ గా, మును నిర్మించిన బ్రహ్మ నిర్దయత నున్మూలించెనే..." భాగ. ౭, స్కం. ౪౩. **3.** నశింపఁజేయు. "శా...రాజకాంతా విలాపాలాపంబులు భూమి నెల్లెడల మెండై నిండెఁ దద్దైన్య మున్మూలించెన్ మది నెంచి కశ్యపుఁడు రాముర్ జేసి దీవించుచున్." దశా. ౬,అ.౧౪౬. "మ. మునులం దిట్టుచుఁ బుష్పవృక్షతతు లున్మూలించుచుర్ గ్రూరులై, యనవద్యుం జమదగ్నిఁ బట్టి...వధియించి రాగ్రహమునన్ మోహాంధులై హైహయుల్." భార. అర. ౩, ఆ. ౧౯౨.

ఉన్మూలితము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** పెల్లగింపఁబడినది. **2.** మొదలంట నశింపఁజేయఁబడినది.

ఉన్మేష. సం.=ఉన్మేషము.

ఉన్మేషణము. సం. వి. అ. న.=ఉన్మేషము.

ఉన్మేషము. సం. వి. అ. పుం. **1.** వికాసము. **2.** ఉన్మీలనము, కన్ను తెఱచుట. **3.** కాంతి. **4.** మెఱుపు. **5.** స్ఫురణము. **6.** ప్రకటనము. "మ. నిజసంశోభిత పీరనృత్తమున నున్మేషంబుగా..." భార. ఉద్యో. ౪, ఆ. ౧౬. **7.** అభివృద్ధి. "మ. నిను మున్నెంతయు నమ్మి పాండవుల యున్మేషంబు నే చీరికిం, గొన..." భార. భీష్మ. ౩, ఆ. ౧౭౦.

ఉన్మేషి. సం. విణ. (న్. ణీ. న్.) **1.** వికసించునది. **2.** తెఱచుకొని యుండునది. (కన్ను.) **3.** ప్రకాశించునది. **4.** వ్యక్తమైనది.

ఉప. సం. అవ్య. (ఇది సమాసపూర్వపదముగా నుండి తఱచుగా నీ క్రిందియర్థము లిచ్చును.) **1.** దగ్గఱనున్నది. (ఉదా:—ఉపశిష్యము.) **2.** చిన్నది. (ఉదా:—ఉపపురాణము.) **3.** అధికము. (ఉదా:—ఉపతప్తము.) **4.** సదృశము. (ఉదా:—ఉపమాత.) **5.** శబ్దాలంకారము. (ఉదా:—ఉపహాసించు.)

ఉపకంఠము. సం. వి. అ. న. 1. పొలిమేర. 2. అశ్వగతులలో నొకటి. 3. దగ్గఱ నున్న దేశము. 4. సమీపమునఁ గలకాలము. అవ్య. అ. న. 1. కంఠసమీపమున. 2. కంఠమున. విణ. (అ.ఆ.అ.) దగ్గఱ నున్నది.

ఉపకరణము. సం. వి. అ. న. 1. ఉపయోగపడుట. 2. పనిముట్టు. 3. రాజాదులఛత్త్రాదిచిహ్నము.

ఉపకరణీయము. సం.=ఉపకార్యము.

ఉపకరించు. సం. అ. క్రి. ఉపయోగించు. "గీ. వరుణునకు డాఁగిపోనఁ జోటు వలఁతి యగుట,నువధి నాయకభావంబు నుపకరించె." పారి. ౪,ఆ.౧౨.

ఉపకర్త. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) 1. మేలు చేయువాఁడు. 2. కార్యసాధన కనుకూల మైనవాఁడు.

ఉపకారము. సం. వి. అ. పుం. మేలు.

ఉపకారి. సం. విణ. (న్. నీ. న్.)=ఉపకర్త.

ఉపకారిక. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉప్పరిగ, మేడ. 2. నగరు, రాజగృహము. 3. గుడారము, డేరా. 4. ఉక్కెఱ, మధురభక్ష్య విశేషము. 5. ఉపకారము చేయుస్త్రీ.

ఉపకార్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మేలు చేయఁదగినది. 2. మేలు పొందఁదగినది.

ఉపకుంచిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చిట్టేలకి ✿. 2. నల్లజీలకఱ్ఱ. 3. మైలతుత్థము.

ఉపకుర్వాణుఁడు. సం. వి. అ. పుం. స్వాధ్యాయగ్రహణపర్యంతము బ్రహ్మచర్యాది నియమబద్ధుఁడై తరువాత గురుదక్షిణ యిచ్చి స్నాతకవ్రతానంతరము గృహస్థధర్మమును గైకొను బ్రహ్మచారి. (వ్యతి. నైష్ఠికుఁడు.) విణ. (అ.ఆ.అ.) = ఉపకర్త.

ఉపకుల్య. సం. వి. ఆ. స్త్రీ. 1. పిల్లకాలువ. 2. పిప్పలి ✿.

ఉపకూజితము. సం. వి. అ. న. 1. కూఁతను బట్టి కూసినకూఁత. 2. ప్రతిధ్వని. విణ. (అ. ఆ. అ.) ప్రతిధ్వనించునట్లు చేయఁబడినది.

ఉపకృతము. సం. వి. అ. న. ఉపకారము, మేలు. విణ. (అ.ఆ.అ.) మేలు చేయఁబడినది.

ఉపకృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. మేలు. 2. ఒకానొక తత్సమధాతువు. 3. తత్సమధాతుగణములు మూఁడింటిలో నొకటి. విణ. (న్. నీ. న్.) ఉపకారము పొందినవాఁడు.

ఉపక్లృప్తము. సం. విణ. (అ.ఆ.అ.) 1. సిద్ధము చేయఁబడినది. 2. ఊహఁబడినది. 3. నియమింపఁబడినది. 4. తగినది.

ఉపక్రంత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ఉపక్రమించువాఁడు.

ఉపక్రమకుఁడు. సం. విణ. (అ.మికా.అ.) = ఉపక్రాంత.

ఉపక్రమణము. సం. వి. అ. న. 1. దగ్గఱకు వచ్చుట. 2. పూనుట. 3. ప్రారంభము. 4. చికిత్స.

ఉపక్రమణి. సం. వి. ఈ. స్త్రీ.=ఉపక్రమణిక.

ఉపక్రమణిక. సం. వి. ఆ. స్త్రీ. పీఠిక, భూమిక.

ఉపక్రమము. సం. వి. అ. పుం. 1. ప్రారంభము. 2. ఉపాయము నెఱిఁగి ప్రారంభించుట. 3. దగ్గఱకు వచ్చుట. 4. పరాక్రమము. 5. సామము మున్నగు నుపాయము. 6. మంత్రిజన పరీక్ష. 7. చికిత్స. 8. ఉపక్రమణిక. 9. వేదాంతశాస్త్రమునఁ దాత్పర్యమును నిర్ణయించు హేతువాదము.

ఉపక్రమించు. సం. అ. క్రి. స. క్రి. మొదలిడు. "చ...ముని యధ్వరకర్మ ముపక్రమించె..." రామా. ౮, ఆ. ౮౮. "చ...అతం డరుగంగ నుపక్రమించినన్." మార్క. ౨, ఆ. ౧౧౨.

ఉపక్రియ. సం. వి. ఆ. స్త్రీ.=ఉపకారము.

ఉపక్రోశనము. సం. వి. అ. న. నింద, దూఱు.

ఉపక్రోశము. సం. వి. అ. పుం. నింద, దూఱు.

ఉపక్వణము. సం. వి. అ. పుం. ఉపక్వాణము, వీణానాదము.

ఉపక్వాణము. సం.=ఉపక్వణము.

ఉపగతము. సం. వి. అ. న. 1. ప్రాప్తి. 2. స్వీకృతి. 3. జ్ఞానము. 4. అంగీకారము. విణ. (అ.ఆ.అ.)

1. ప్రాప్తము. 2. దగ్గఱకు వచ్చినది. 3. స్వీకరింపఁబడినది. 4. తెలియఁబడినది. 5. గతించినది. 6. అంగీకరింపఁబడినది. 7. లభించినది.

ఉపగతి. సం. వి. ఇ. స్త్రీ. 1. దగ్గఱకు వచ్చుట. 2. జ్ఞానము. 3. ప్రాప్తి. 4. సమ్మతి. 5. స్వీకృతి.

ఉపగమము. సం. వి. అ. పుం. 1. =ఉపగతి. 2. కలయిక.

ఉపగీతి. సం. వి. ఇ. స్త్రీ. 1. స్తోత్రము. 2. గానము. 3. ఒకానొకవృత్తము.

ఉపగుహ్యము. సం. =ఉపగోహ్యము.

ఉపగూఢము. సం. వి. అ. న. కౌఁగిలి. విణ. (అ.ఆ.అ.) 1. దాఁపఁబడినది. 2. కౌఁగిలింపఁబడినది. 3. పట్టుకొనఁబడినది.

ఉపగూహనము. సం. వి. అ. న. 1. కౌఁగిలింత. 2. దాఁచుట.

ఉపగోహ్యము. సం. వి. అ. న. ఉపగుహ్యము, కౌఁగిలి. విణ. (అ.ఆ.అ.) 1. కౌఁగిలింపఁదగినది. 2. పట్టుకొనఁదగినది.

ఉపగ్రహము. సం. వి. అ. పుం. 1. చెఱ. 2. చెఱఁబెట్టుట. 3. బంది. 4. ఆటంకము. 5. ఉపయోగము. 6. ఆనుకూల్యము. 7. గ్రహసమానమైనది. (రాహువు, కేతువు మొ.) 8. సంధి. 9. సూర్యాది గ్రహణము.

ఉపగ్రాహము. సం. వి. అ. పుం. 1. ఉపద, కానుక. 2. బహుమతి, కానుకయిచ్చుట.

ఉపగ్రాహ్యము. సం. వి. అ. న. ఉపద, కానుక. విణ. (అ.ఆ.అ.) 1. సమీపమున నుంచుకొనఁదగినది. 2. కానుకగా నర్పింప నర్హమైనది.

ఉపఘాతము. సం. వి. అ. పుం. 1. దెబ్బ, వ్రేటు. 2. కొట్టుట. 3. బాధ. 4. నాశము. 5. అపకృతి. 6. రోగము.

ఉపఘ్నము. సం. వి. అ. పుం. 1. సమీపాశ్రయము. 2. ఆధారము. 3. ప్రాఁకుడుకొయ్య.

ఉపచయము. సం. వి. అ. పుం. 1. పొడవు. 2. వృద్ధి. 3. ప్రోగు. 4. ఎత్తు.

ఉపచరణము. సం. వి. అ. న. 1. ఉపచరించుట. 2. దగ్గఱకు వచ్చుట. 3. చికిత్స చేయుట.

ఉపచరించు. సం. స. క్రి. 1. సమ్మానించు. "వ... ఉత్తమగుణంబులు గలవారాంగనలం గలిసినవారలకు మోక్షంబు సిద్ధించుచుండునే యని సుశీలుండు చెప్పిన విద్యాసిద్ధియు నది యట్ల తప్పదని యాదట నుపచరించి పోం డని యనిపిన ..." మల్హ. 3, ఆ. ౫౧. 2. సేవించు. "సీ. చంచురుచెలికాఁడు సయిదోడు గూడి నీ యుల్లంబు మెల్లంబు నుపచరింప." ఉ. హరి. ౧, ఆ. ౧౯౯. "గీ. వచ్చి తడవయ్యె నింకఁ బోవలయు గుఱుని,యెద్ద కని తల్లిదండ్రుల నుపచరించి." సా. 3, ఆ. ౨౬. 3. బోధించు. "సీ...ఒకవేళ వేదాంత ముపచరించు." నిరం. ౪, ఆ. ౭౪. 4. ఉపచారము చేయించు. "తరల. ...తల్లి వచ్చిన భక్తితో,నుపచరింపక లాఁతివైయుటు లూరకుండుట యుక్తమే." భార. స్త్రీ. ౨, ఆ. ౨౭.

ఉపచరితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. సమ్మానింపఁబడినది. 2. సేవింపఁబడినది. 3. లక్షణచే బోధింపఁబడినది.

ఉపచర్య. సం. వి. ఆ. స్త్రీ. 1. సేవ. 2. చికిత్స.

ఉపచారము. సం. వి. అ. పుం. 1. =ఉపచర్య. 2. గౌరవించుట. 3. లంచము. 4. వాడుక. 5. నడవడిక. 6. అలంకారము. 7. పూజావిధానము. (ఇవి ఐదు:— స్నానము, పూజ, నైవేద్యము, ప్రదక్షిణము, నమస్కారము. మఱియుఁ బదునాఱు:— ఆవాహనము, ఆసనము, పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము, అభిషేకము, వస్త్రము, యజ్ఞోపవీతము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, ప్రదక్షిణము, నమస్కారము.) 8. సంస్కారము. 9. ప్రార్థనము. 10. లక్షణావృత్తి. 11. దగ్గఱుట. 12. పరప్రీతికైనయసత్యభాషణము.

ఉపచికీర్ష. సం. వి. ఆ. స్త్రీ. ఉపకారము చేయవలెనను కోరిక.

ఉపచితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కూడఁబెట్టఁబడినది. 2. పెరిఁగినది. 3. కుపురుపడినది. 4. సమృద్ధమైనది. 5. పూయఁబడినది.

ఉపచితి. సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రోగగుట. 2. వృద్ధి. 3. ఔన్నత్యము, ఎత్తు.

ఉపచిత్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. మూషికపర్ణి ♣. 2. చిత్రకుఁ బ్రక్కనున్ననక్షత్రము. (హస్త లేక స్వాతి.) 3. దంతీ ♣. 4. ఒకానొక వృత్తము.

ఉపజల్పనము. సం. వి. అ. న. సంభాషణము.

ఉపజాపకుఁడు. సం. విశే. (అ. కా. అ.) భేదము గలిగించువాఁడు.

ఉపజాపము. సం. వి. అ. పుం. 1. భేదోపాయము. 2. ఉపాంశువు, మెల్లఁగా జపించుట.

ఉపజిహ్వ. సం. వి. ఆ. స్త్రీ. 1. కొండనాలుక. 2. ఒకానొక రోగము. 3. ఒకానొక కీటకము.

ఉపజీవి. సం. విశే. (న్. నీ. న్.) 1. ఒకరి ననుసరించి జీవించువాఁడు. 2. ఒకరి నాశ్రయించి జీవించువాఁడు.

ఉపజీవించు. సం. స. క్రి. ఆశ్రయించి జీవించు. "గీ... అమరులింద్రు, ననిశమును నుపజీవించు నట్లు బంధుజనులు నిన్నుపజీవింప మనుము పేర్మి." భార. అను. ౧, ఆ. ౩౧౫.

ఉపజీవిక. సం. వి. ఆ. స్త్రీ. 1. జీవిక, బ్రదుకు. 2. జీవనోపాయము. 3. ఒకరి ననుసరించి జీవించుట.

ఉపజ్ఞ. సం. వి. ఆ. స్త్రీ. పరులయుపదేశము లేకయే మొట్టమొదటనే కలుగు జ్ఞానము. (ఉపజ్ఞాశబ్దము తత్పురుషసమాసమునఁ దదాదిత్వము తెలుపఁదలఁచినపుడు నపుంసక మగును. ఉదా:—ప్రాచేతస+ఉపజ్ఞా=ప్రాచేతసోపజ్ఞము=వాల్మీకియొక్క యాద్యజ్ఞానము. మొట్టమొదట వాల్మీకి రచించె నని భావము. ఇట్లే: ప్రాచేతసోపజ్ఞము శ్లోకము, పాణిన్యుపజ్ఞము వ్యాకరణము.)

ఉపఢౌకనము. సం. వి. అ. న. 1. ఉపద, కానుక. 2. కానుక యిచ్చుట.

ఉపతపనము. సం. వి. అ. న. తపింపఁజేయుట. విశే. (అ. ఆ, ము. అ.) 1. తపింపఁజేయునది. 2. బాధించునది.

ఉపతపించు. సం. అ. క్రి. 1. దుఃఖపడు. 2. అసూయపడు. "గీ. మొదలి పెక్కువయును బోయి మునిఁగె నద్రికలశజునినేత్రమునఁ గొంపు గాననైన, నొరుని యైశ్వర్య మీక్షించి యుపతపించు నట్టిఖలునకు నది పెద్ద యాపె తలఁప." కాశీ. ౩, ఆ. ౬.

ఉపతప్త. సం. వి. ఋ. పుం. 1. రోగము, వ్యాధి. 2. ఉష్ణత, వేఁడిమి. విశే. (ఋ. స్త్రీ. ఋ.) మిక్కిలి తపింపఁజేయునది.

ఉపతాపము. సం. వి. అ. పుం. 1. వేఁడిమి. 2. వ్యాధి. 3. త్వర. 4. కీడు. 5. పీడించుట, పీడ. "ఆ. పిదపలనొప్పి కోడ కుపతాప మొనరించు, నదియ కడు నధర్మ మనిరి బుధులు." భార. ఆది. ౩, ఆ. ౨౧౯., కాశీ. ౪, ఆ. ౩౭.

ఉపతాయి. దే. వి. ఒకానొక మల్లబంధము. "సీ. ఉపతాయిలోఁ దన కౌఁదానతోరహస్తము సూపి వ్రేయక సమవృత్తిఁ బాసి క్రమ్మఱఁ జేసి..." భార. విరా. ౨, ఆ. ౧౫. "క. నిపుణతఁ బెనఁగంగ దొడఁగి,రుపతాయిన్ వేషభాషలుపలాస్యముగన్." హర. ౭, ఆ. ౮౨. "వ... పులులు తలపడ్డపోలికఁ గదలు పోరాడు నైపడి సింగంబులు పెనంగుభంగి నుపతాయితో నళువాయి నిరుపురుం జదిసియుం గదిసియు..." ఉ. హరి. ౩, ఆ. ౭౦.

ఉపతిష్యము. సం. వి. అ. న. పుష్యమీ నక్షత్రమునకు దగ్గఱ గలది. 1. పునర్వసు. 2. ఆశ్లేష.

ఉపత్యక. సం. వి. ఆ. స్త్రీ. కొండచేరువ నేల. (వ్యతి. అధిత్యక.)

ఉపద. సం. వి. ఆ. స్త్రీ. 1. కానుక. "గీ. ధరణిధవదత్త వివిధోపదావిధాన మార్జిత శ్రీవినిర్జిత నిర్జరాల, యేశ్వరుఁడు..." ఆము. ౧, ఆ. ౨౭. 2. లంచము. 3. కానుకగా నిచ్చుద్రవ్యము.

ఉపదంశము. సం. వి. అ. పుం. 1. ఊరుగాయ. "గీ. చాలఁ ద్రావియు మగుడఁ జేసాచువారు, దొడరి యుపదంశభాండముల్ దొమకువారు, నైరి మృగయాధిదైవతమాత్రయం మ, బాన ములు చేసి శబరదంపతులు రతుల." కాశీ. 3, ఆ. ౪౧. 2. నంజుకొను పదార్థము. 3. కొఱుకుట. 4. కొఱుకురోగము. 5. మునగ చె. 6. ఏఱువంగ చె.

ఉపదర్శకుఁడు. సం. వి. అ. పుం. ద్వారపాలకుఁడు. విణ. (అ. ర్శికా. అ.) 1. జరుగుచున్నపని చక్కఁగా జరుగుచున్నదో లేదో చూచువాఁడు. 2. చూపువాఁడు. 3. దగ్గఱనుండి చూచువాఁడు. సాక్షి.

ఉపదానము. సం. వి. అ. న. 1. అరణము. 2. కానుక. 3. లంచము.

ఉపది. సం. వి. ఈ. స్త్రీ. 1. బచలిక చె. 2. చెదపురుగు.

ఉపదిష్టము. సం. వి. అ. న. ఉపదేశము. విణ. (అ. ఆ. అ.) 1. ఇదమిత్థమ్మని తెలుపఁబడినది. 2. ఉపదేశింపఁబడినది. 3. ఉపదేశము నందినది.

ఉపదేశము. సం. వి. అ. పుం. 1. బోధనము. 2. మంత్రాను లుపదేశించుట. 3. విధివాక్యము.

ఉపదేశించు. సం. స. క్రి. బోధించు. "క. హితముపదేశింప నేర్తురే యెలనాగల్." మార్క. ౨, ఆ. ౨౨౩.

ఉపదేష్ట. సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) ఉపదేశకుఁడు, ఉపదేశము చేయువాఁడు.

ఉపదేహిక. సం. వి. ఆ. స్త్రీ. ఉపది, చెదపురుగు.

ఉపదోహము. సం. వి. అ. పుం. పాలుపిదుకు పాత్రము. "సీ. కాంస్యోపదోహయుఁ గాంచన చారుశృంగయు..." భార. అను. ౨, ఆ. 333.

ఉపద్రవము. సం. వి. అ. పుం. 1. ఆపద. 2. వికారము. 3. రోగోద్రేకకారణ మగు శ్లేష్మాది వికారము.

ఉపద్రష్ట. సం. వి. ఋ. పుం. ఒకానొక ఋత్విక్కు. విణ. (ఋ. స్త్రీ. ఋ.) దగ్గఱనుండి కని పెట్టువాఁడు.

ఉపధ. సం. వి. ఆ. స్త్రీ. 1. ధర్మార్థకామములచేత మంత్రి మొదలగువారి గుణములు పరీక్షించుట. 2. స్థాపనము. 3. ఉపాయము. 4. మోసము. 5. వ్యాకరణమునఁ గడపటి యక్షరమునకుఁ బూర్వాక్షరము.

ఉపధానము. సం. వి. అ. న. 1. స్థాపనము. 2. తలగడ. 3. విషము. 4. స్నేహము. 5. విశేషము. 6. సమీపమున నుంచుట.

ఉపధావనము. సం. వి. అ. న. 1. వెంబడించుట, కూడవచ్చుట. 2. మననము చేయుట.

ఉపధావించు. సం. స. క్రి. వెంబడించు. "శా. ఘంటావీథిఁ జరించుచున్నది పురిం గారాము వాటించి వెన్వెంటన్ దివ్యకరేణు వభ్ర ముపధావింపంగ దర్పోద్ధతిన్." కాశీ. 3, ఆ. ౧౫౫.

ఉపధి. సం. వి. ఇ. పుం. 1. ఒకవిధముగా నున్న వస్తువును మఱియొకవిధముగా ప్రకటించుట. 2. మిష. 3. భయము. 4. రథచక్రము. 5. మోసము.

ఉపధూపితము. సం. వి. అ. పుం. మృత్యువు. విణ. (అ. ఆ. అ.) 1. చావు సమీపించినది. 2. పొగ వేయఁబడినది. 3. సంతాపము గలది. 4. అధికమైనబాధ గలది.

ఉపనగరము. సం. వి. అ. పుం. నగరమందలిభాగము, పేఁట.

ఉపనతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వంగినది. 2. పొందఁబడినది. 3. సంభవించినది. 4. సమీపించినది.

ఉపనయనము. సం. వి. అ. న. 1. బాలుని గురుసమీపమును పొందించి వేదాధికారము గలుగుటకై చేయు సంస్కారవిశేషము, వడుగు. 2. దగ్గఱకుఁ దెచ్చుట. 3. అర్పించుట.

ఉపనయము. సం. వి. అ. పుం. 1.=ఉపనయనము. 2. పొందుట. 3. ఉపయోగించుట. 4. తర్కమున నొకానొక యవయవవాక్యము. 5. ఒకానొక సన్నికర్షము.

ఉపనాయనము. సం. వి. అ. న. ఉపనయనము.

ఉపనాయము. సం. వి. అ. పుం. ఉపనయనము.

**ఉపనాహము.** సం. వి. అ. పుం. 1. మూట. 2. పుండునకుఁ బూయుమందు. 3. వీణాదులతంత్రి చుట్టెడు బిరడ. 4. ఒకానొక రోగము.

**ఉపనిధి.** సం. వి. ఇ. పుం. 1. వస్తుస్వరూపమును వస్తుపరిమితిని జూపక చెప్పక యొకనియొద్ద దాఁచుట. 2. అట్లుంచినసొమ్ము.

**ఉపనిషత్తు.** సం. వి. ద్. స్త్రీ. 1. బ్రహ్మజ్ఞానము. 2. వేదాంతభాగము. (ఇవి నూటయెనిమిది.) 3. దగ్గఱయిల్లు. 4. ధర్మము. 5. ఏకాంతము, రహస్యము.

**ఉపనీతుఁడు.** సం. విశే. (అ.ఆ.అ.) 1. సమీపమున నుంచఁబడినవాఁడు. 2. ఉపనయనమైనవాఁడు. 3. పొందఁబడినవాఁడు.

**ఉపనేయుఁడు.** సం. విశే. (అ.ఆ.అ.) ఉపనేతవ్యుఁడు—1. దగ్గఱకుఁ దేఁదగినవాఁడు. 2. ఉపనాయార్హుఁడు.

**ఉపన్యసించు.** సం. స. క్రి. వివరించు; చెప్పు. "వ. రయంబున రాజసన్నిధికిం జని భవత్కార్యం బుపన్యసించి దండించుట వేఁడుము..." భార. శాం. ౧, ఆ. ౧౬౧. "ఆ. అని యుపన్యసించి యమ్మునిపతి యను..." భార. అను. ౪, ఆ. ౨౩౦.

**ఉపన్యస్యత్.** సం. శత్ర. ఉపన్యసించుచున్న.

**ఉపన్యాసము.** సం. వి. అ. పుం. 1. దగ్గఱఁ బెట్టుట. 2. ఇల్లడ యిడుట. 3. వివరించుట; చెప్పుట. 4. వేదాంతాదివిచారము. 5. స్వకార్యసిద్ధి కొనరించుకొన్న సంధి.

**ఉపన్యాసకుఁడు.** సం. విశే. (అ. సికా. అ.) = ఉపన్యాసి.

**ఉపన్యాసి.** సం. విశే. (న్.సీ.న్.) ఉపన్యాసకుఁడు; ఉపన్యసించువాఁడు.

**ఉపపత్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. పుట్టుట. 2. పొందుట. 3. ఒనగూడుట. 4. యుక్తి. 5. పొందిక. 6. కారణము. 7. అర్హత. 8. ముగియిక. 9. ఉపాయము. 10. సంగతి. 11. సాహాయ్యము. 12. సమాధి. 13. చెప్పుట. 14. సంపద. 15. సిద్ధి.

**ఉపపన్నము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. పుట్టినది. 2. పొందఁబడినది. 3. పొందినది. 4. కూడినది. 5. తగినది. 6. ధనవంతము. 7. యుక్తియుక్తము.

**ఉపపాదకము.** సం. విశే. (అ. సికా. అ.) 1. పుట్టించునది. 2. యుక్తియుక్తముగాఁ జెప్పునది. 3. ఉపపత్తి కలదిగా నొనరించునది.

**ఉపపాదనము.** సం. వి. అ. న. 1. పుట్టించుట. 2. యుక్తియుక్తముగా సమర్థించుట. 3. ఇచ్చుట. 4. వివరించి చెప్పుట.

**ఉపపాదించు.** సం. స. క్రి. తెలుపు. "వ. బలాంగచతుష్టయ ప్రవర్ధనోపాయంబు లుపపాదించి..." హరి. ఉ. ౨, ఆ. ౧౭౭.

**ఉపపాదితము.** సం. విశే. (అ.ఆ.అ.) 1. పుట్టింపఁబడినది. 2. యుక్తియుక్తముగ సమర్థింపఁబడినది. 3. చక్కఁగాఁ బ్రతిపాదింపఁబడినది.

**ఉపప్లవము.** సం. వి. అ. పుం. 1. ఉల్కాపాతము మున్నగునుత్పాతము. 2. ఉపద్రవము. 3. భయము. 4. విఘ్నము. 5. వ్యాధిపీడ. 6. అడ్డంకి. 7. సూర్యాదిగ్రహణము. 8. రాహువు. 9. నీటిపైఁ దేలుట. 10. దగ్గఱ నుండుట.

**ఉపప్లావ్యము.** సం. వి. అ. పుం. మత్స్యదేశమందలి పురవిశేషము. విశే. (అ. ఆ. అ.) తప్పక పీడింపఁదగినది. "క. నడచి యుపప్లావ్యపురంబు దగ్గఱి వనప్రదేశముల బలచయముల్, విడియించి..." రాఘవ. ౪, ఆ. ౮౦. (రెండింటికి నిది యుదాహరణము.)

**ఉపబర్హణము.** సం. వి. అ. న. = ఉపబర్హము.

**ఉపబర్హము.** సం. వి. అ. పుం. 1. తలగడ. 2. పీడించుట.

**ఉపబృంహణము.** సం. వి. అ. న. చక్కఁగాఁ బెరుఁగుట.

**ఉపబృంహితము.** సం. విశే. (అ.ఆ.అ.) చక్కఁగాఁ బెరిగినది.

**ఉపభుక్తము.** సం. విశే. (అ.ఆ.అ.) 1. అనుభవింపఁబడినది. 2. క్రోలఁబడినది. 3. ఉపయోగింపఁబడినది.

ఉపభృత్తు. సం. వి. త్. స్త్రీ. స్రుగ్భేదము, రావి కఱ్ఱతోఁ జేసిన స్రుక్కు.

ఉపభోగము. సం. వి. అ. పుం. 1. అనుభవము. 2. ఆస్వాదనము. 3. వినియోగము. 4. సంభోగము. 5. విషయసుఖము. 6. భుక్తపఱచుకొనుట. వి. పు. 3, ఆ. 309.

ఉపభోగించు. సం. స. క్రి. అనుభవించు. "మ... దుశ్చేష్ట ని, ట్లుపభోగింపఁగ నయ్యె నిట్టివెత..." రంగా. 3, ఆ. 296.

ఉపభోగ్యము. సం. విణ. (అ.ఆ.అ.) ఉపభోగార్హము, అనుభవించుటకుఁ దగినది.

ఉపమ. ఉభ. వై. వి. (సం. ఉపాయః.) వెరవు, ఉపాయము. "క. ఉపమ యెఱుంగనివారల, కపరిమితావస్థ బొందు నది యెట్లన న, య్యుపమ యెఱుంగక కాదే, చపలత ము న్నొక్కనక్క సమసెం బెలుచన్." హంస. 1, ఆ. 149. వి. పు. 2, ఆ. 7. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొక యర్థాలంకారము. 2. పోలిక, సాదృశ్యము. 3. ఒకానొక ప్రమాణము. విణ. ఆ. స్త్రీ. సదృశము, సమానము. (తుల్యార్థైరతులోపమాభ్యాం' అని కౌముది.)

ఉపమంత్రణము. సం. వి. అ. న. 1. ఆమంత్రణము, పిలుపు. 2. ఉపచ్ఛందనము, బుజ్జగింపు.

ఉపమరి. వై. విణ. (ఉపమ+అరి.) ఉపమ గలవాఁడు, వెరవరి. "గీ. ఉభయభాషలనేర్పరు లుపమరులు సమర్థు లీకృతిరాజ సిర్మాణమునకు." ప్రబోధ. 1, ఆ. 38.

ఉపమాత. సం. వి. ఋ. స్త్రీ. 1. దాది, పెంపుడు కత్తె. 2. తల్లితో సమానురాలు. (వీరు ఆఱుగురు. 1. తల్లితోఁబుట్టువు. 2. మేనమామ భార్య. 3. తండ్రితోఁబుట్టువు. 4. పినతండ్రి భార్య. 5. అత్తగారు. 6. అన్నభార్య.) విణ. (ఋ. త్రీ. ఋ.) ఉపమించువాఁడు, ఉపమానము చెప్పువాఁడు.

ఉపమానము. సం. వి. అ. న. 1. పోలిక. 2. పోల్పఁదగినవస్తువు. (చంద్రాది. వ్యతి. ఉపమేయము.) 3. తర్కశాస్త్రమునఁ గలయొక ప్రమాణము.

ఉపమించు. సం. స. క్రి. 1. పోల్చు, సాదృశ్యము చెప్పు. "క. ఉపమింపఁగ రానితపస్తపమునఁ గడువాఁడి మారుధరణీసుమనస్తపనుఁడు కమల వికాసం,బెపుడును నుడివోనితావి నింపు వహింపన్." పాండు. 4, ఆ. 46., భార. సభా. 2,ఆ.114. 2. పోలు, సదృశమగు. "గీ. మించు క్రొమ్మించు నుపమించుమెలఁత యగుచు, నిలుచు నవ్వనదేవత నృపతి నూచి." స్వా. 6, ఆ. 86., భార. ఆది. 9, ఆ. 191.

ఉపమితి. సం. వి. ఇ. స్త్రీ. ఉపమ.

ఉపమేయము. సం. విణ. (అ.ఆ.అ.) పోల్పఁదగినది. (ముఖము మొ.)

ఉపమేయోపమ. సం. వి. ఆ. స్త్రీ. ఒక యర్థాలంకారము, మొదట నుపమేయోపమానములుగాఁ జెప్పఁబడినవే మరల నుపమానోపమేయములుగాఁ జెప్పునలంకారవిశేషము. (ఉదా:-నీసుగుణము సౌందర్యమువలెను సౌందర్యము సుగుణమువలెను శోభిల్లుచున్నవి.)

ఉపయంత. సం. వి. ఋ. పుం. భర్త, మగఁడు. విణ. (ఋ. త్రీ. ఋ.) ఆజ్ఞాపించువాఁడు.

ఉపయమనము. సం. వి. అ. న. 1.=ఉపయమము. 2. బంధనసాధనము. (కుశాది.)

ఉపయమము. సం. వి. అ. పుం. 1. వివాహము, పెండ్లి. 2. సంయమనము, కట్టుపాటు.

ఉపయాచితము. సం. వి. అ. న. యాచన. విణ. (అ. ఆ. అ.) 1. యాచింపఁబడినది. 2. అభీష్టసిద్ధికై దేవతల కీఁబడినది.

ఉపయాతము. సం. వి. అ. న. 1. ఆగమనము, వచ్చుట. 2. దగ్గఱకు వచ్చుట. 3. తిరిగి వచ్చుట. విణ. (అ. ఆ. అ.) 1. వచ్చినది, 2. దగ్గఱకు వచ్చినది. 3. తిరిగి వచ్చినది.

ఉపయామము. సం. వి. అ. పుం. వివాహము, పెండ్లి.

ఉపయుక్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉపయోగింపఁబడినది. 2. అనుభవింపఁబడినది. 3. కూర్పఁబడినది. 4. న్యాయ్యమైనది. 5. తగినది.

ఉపయోగము. సం. వి. అ. పుం. 1. ఆనుకూల్యము, వీలు. 2. ఆచరణము, వాడుక. 3. భుక్తత, అనుభవించుట. 4. ప్రయోజనము, లాభము.

ఉపయోగి. సం. విశ. (న్. నీ. న్.) 1. ఉపయోగపడునది. 2. ఉపయోగపడఁ జేయునది.

ఉపయోగించు. సం. అ. క్రి. 1. ఉపయోగపడు; అవసరమగు. "వ...తన కెంతయర్థం బుపయోగించు నంతయర్థంబ స్వీకరించుటయు..." భాగ. 3, స్కం. ౯౨౧. 2. ఒదవు, లభించు. (శ. ర.) స. క్రి. 1. భక్షించు, తిను. "క...ప్రచండాటవిలో, విపులఫలశాకమూలము, లుపయోగించుచును నిష్ఠ నుండెదమాతో౯౯." భార. ఆర. ౧, ఆ. ౧౩. 2. అనుభవించు, విని యోగించు. "వ...నన్నుం గురురాజ్యం బేలించి నా యైశ్వర్యం బుపయోగింపు మనిన..." భార. ఆది. ౬, ఆ. ౩౫.

ఉపరతము. సం. వి. అ. న.=ఉపరతి. విశ. (అ.ఆ.అ.) 1. ఉడిగినది, కార్యమునుండి విరమించినది. 2. మరణించినది, చచ్చినది. 3. మరలినది. 4. విరక్తి నందినది.

ఉపరతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఉడుకువ, కార్యవిరమణము. 2. పురుషాయితము, పురుషునివలె స్త్రీ రతిచేయుట. 3. ఉపేక్ష. 4. బుద్ధి. 5. ఇంద్రియములను విషయదృష్టినుండి మరలించుట. 6. సన్న్యాసము. 7. చావు.

ఉపరథ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. పుంత. 2. చిన్నదారి.

ఉపరమణము. సం. వి. అ. న.=ఉపరతి.

ఉపరమము. సం. వి. అ. పుం. 1. ఉడుగుట. 2. విషయనిరసనము. 3. చావు. 4. మరలుట.

ఉపరాగము. సం. వి. అ. పుం. 1. సూర్యాదిగ్రహణము. 2. ఎఱుపు. 3. రంగు. 4. దుఃఖము. 5. నింద. 6. దుర్వ్యసనము. 7. అన్యాయము. 8. ఒక సత్పదార్థమునకు గుణాంతరము గల్పించుట.

ఉపరామము. సం.=ఉపరమము.

ఉపరి. సం. అవ్య. 1. పైని, మీఁద. "సీ. ఆటమీఁద దారల కన్నిటి కుపరియై యెండులక్షల శుక్రుఁ డుండి..." భాగ. ౫, స్కం. ౬, ఆ. ౮౮; ౭౨. 2. తరువాత. 3. పైఁగా.

ఉపరుద్ధము. సం. విశ. (అ.ఆ.అ.) 1. అడ్డగింపఁబడినది. 2. ఆవరింపఁబడినది. 3. ఎదిరింపఁబడినది. 4. పీడింపఁబడినది. 5. చెఱఁబెట్టఁబడినది.

ఉపరోధకము. సం. వి. అ. న. పడుకటిల్లు. విశ. (అ.ఆ.అ.) 1. ప్రతిబంధకము. 2. ఆవరించునది. 3. బాధించునది. 4. ముట్టడించునది.

ఉపరోధము. సం. వి. అ. పుం. 1. ఆటంకము. 2. ముట్టడి. 3. ఆవరించుట. 4. బంధించుట.

ఉపరోధించు. సం. స. క్రి. అడ్డగించు. "మ...ఈ విపినంబు...చూడఁగ మదిం గౌతూహలం బయ్యె నన్నుపరోధింపకు..." భార. ఆర. ౭, ఆ. ౨౦౮.

ఉపల. సం. వి. ఆ. స్త్రీ. 1. కల్వపుగుండు. 2. పాత్రము. 3. గులకరాయి.

ఉపలంభము. సం. వి. అ. పుం. 1. పొందుట. 2. తెలిసికొనుట.

ఉపలక్షణము. సం. వి. అ. న. 1. చూచుట. 2. గుర్తు. 3. సూచన. 4. వాచ్యార్థమే కాక లక్షణచే మఱియొకయర్థమును జెప్పుట.

ఉపలక్షించు. సం. స. క్రి. చూచు. "వ...ఇంద్రుండు...విరోచననందను నుపలక్షించి యిట్లనియె." భాగ. ౮, స్కం. ౩౪౯. భార. ఆర. ౨, ఆ. ౧౪౦.

ఉపలక్షితము. సం. విశ. (అ.ఆ.అ.) 1. చూడఁబడినది. 2. ఊహింపఁబడినది. 3. కూడియున్నది.

ఉపలబ్ధము. సం. విశ. (అ.ఆ.అ.) 1. పొందఁబడినది. 2. తెలిసికొనఁబడినది.

ఉపలబ్ధి. సం. వి. ఇ. స్త్రీ. 1. పొందుట. 2. ప్రత్యక్షాదిజ్ఞానము, తెలిసికొనుట.

ఉపలము. సం. వి. అ. పుం. 1. రాయి. 2. మేఘము. 3. రత్నము.

ఉపలాలనము. సం. వి. అ. న. బుజ్జగించుట.

ఉపలాలించు. సం. స. క్రి. బుజ్జగించు. "సీ. తొడలపై నర్మిలి నిడుకొని నన్నుపలాలించుచుండు బాల్యమున నట్టిభీష్ముని జంపితి..." భార. శాం. ౧, ఆ. ౧౯౬. "క. అక్కడ నొక్కకుమారుని, నక్కున నిడి యొక్కదాది యనురాగముతో, మిక్కిలి నుపలాలింపఁగ,నక్కమలాక్షుండు విని యె నవ్వాక్యంబుల్." వి. పు. ౬, ఆ. ౨౪౯.

ఉపలింగము. సం. వి. అ. న. అరిష్టసూచక మగు భూకంపాద్యుపద్రవము.

ఉపలిప్తము. సం. విశే. (అ.ఆ.అ.) 1. అలుకఁబడినది. 2. పూయఁబడినది.

ఉపలేపము. సం. వి. అ. పుం. 1. అలుకుట. 2. పూయుట. 3. రాచుట. 4. పైవాని కగుద్రవ్యము.

ఉపవడము. దే. అ. క్రి. మేలుకొను, మెలఁకువగను. "క...నృపుఁ డుపవడమై, జవ్వాదులతికయో యన,నవ్వేలఁది వడంకఁ జూచి..." శుక. ౧, ఆ. ౩౧౩.

ఉపవడము. దే. వి. అవబోధము, మేలుకొనుట. "గీ...ఉపవడ మనంగ నవబోధ మొప్పు..." ఆం. భా. ప్ర. ౧౪౬.

ఉపవనము. సం. వి. అ. న. ఉద్యానము, పెంచిన తోట. అవ్య. అ. న. వనసమీపమున.

ఉపవర్తనము. సం. వి. అ. న. 1. వ్యాయామప్రదేశము. 2. ప్రదేశము. 3. దేశము. 4. మండలము.

ఉపవసథము. సం. వి. అ. పుం. 1. గ్రామము, పల్లె. 2. యాగమునకుఁ బూర్వదివసము.

ఉపవసించు. సం. అ. క్రి. ఉపవాసము చేయు, పస్తుండు. "గీ. ఉపవసింతుము గాక నేఁ డుడిగి మడిఁగి." కాశీ ౭, ఆ. ౧౫౩.

ఉపవస్త. సం. విశే. (ఋ. స్త్రీ. ఋ.) ఉపవసించువాఁడు.

ఉపవస్తము. సం. వి. అ. న. ఉపవాసము.

ఉపవాసకుఁడు. సం. విశే. (అ. సికా. అ.) ఉపవసించువాఁడు.

ఉపవాసనము. సం. వి. అ. న. ఉపవాసము. "సీ. ప్రాద్దునఁ దగినట్టి భోజనం బొల్లక యుపవాసనంబుండ నువిద తలఁచు." శివరా. ౨, ఆ. ౧౮.

ఉపవాసము. సం. వి. అ. పుం. ఉపవస్తము, భోజనము చేయకుండుట.

ఉపవాసి. సం. విశే. (న్. నీ. న్.) ఉపవాసకుఁడు.

ఉపవాహ్యము. సం. వి. అ. పుం. రాజాదు లెక్కు యేనుఁగు. విశే. (అ.ఆ.అ.) రాజాదు లెక్కఁదగినది.

ఉపవిలోకనము. సం. వి. అ. న. విలోకనము, చూచుట. "ఉ. ద్రౌపదియున్ సుభద్రయును దక్కటికాంతలు భ్రాతృ పుత్త్రపౌత్త్రోపవిలోకనోత్సవము నొందుదురు..." భార. ఆశ్ర. ౨, ఆ. ౧౦౮.

ఉపవిష. సం. వి. ఆ. స్త్రీ. అతివస ✽.

ఉపవిష్టుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) కూర్చున్నవాఁడు.

ఉపవీతము. సం. వి. అ. న. ఎడమబుజము మీఁది నుండి కుడిచేతిక్రిందుగా వ్రేలాడు యజ్ఞోపవీతము.

ఉపవీతి. సం. విశే. (న్. నీ. న్.) ఉపవీతము ధరించినవాఁడు.

ఉపవేశము. సం. వి. అ. పుం. కూర్చుండుట.

ఉపవేశి. సం. విశే. (న్. నీ. న్.) కూర్చున్నవాఁడు.

ఉపవేశించు. సం. అ. క్రి. కూర్చుండు. "వ...గంగాతరంగిణీ దక్షిణకూలంబునం బూర్వాగ్రదర్భాసనంబున నుత్తరాభిముఖుండై యుపవేశించి..." భాగ. ౧, స్కం. ౫౦౭.

ఉపవేష్ట. సం. విశే. (ఋ. స్త్రీ. ఋ.) ఉపవేశి.

ఉపశమనము. సం. వి. అ. న.=ఉపశమము.

ఉపశమము. సం. వి. అ. పుం. 1. అడఁగుట, తగ్గుట. 2. రోగాదులబాధ తగ్గుట. 3. ఆశ నశించుట. 4. ఇంద్రియనిగ్రహము. 5. నివృత్తి. 6. ఓర్పు.

ఉపశమించు. సం. అ. క్రి. 1. శాంతించు. 2. తగ్గు క్షీణించు. 3. అడఁగు, నశించు. స. క్రి. 1. శాం

తింపఁజేయు. "క. విమలాత్మ నాకు నభయము, సమకూరెడునట్లుగాఁగ సన్మతి నీక్రోధము నుపశమించి కరుణింపుము..." భాగ. ౪, స్కం. ౪౮౭, 2. అణఁచు. "గీ. ఇంతకాలంబు నాతోడ సెరపు లేక,కూడియుండితి వటుగాన కోప మెల్ల,నుపశమించిలి నీ వింక నుండవలదు, పొమ్ము..." వి. పు. ౨, ఆ. ౨౪౪.

ఉపశమియించు. సం. స. క్రి.=ఉపశమించు. శాంతింపఁజేయు. "గీ. చింత మదిలోన నుపశమియింతు ననిన." అహ. ౨, ఆ. ౬౨.

ఉపశమిల్లు. సం. అ. క్రి. 1. చల్లారు. "వ...జలంబుల నగ్ని యుపశమిల్లునట్లు..." భార. అర. ౧, ఆ. ౨౨. 2. అడఁగు, నశించు. "వ. శారీర దుఃఖంబు లౌషక్రియాది ప్రతియోగంబుల నుపశమిల్లు..." భార. అర. ౧, ఆ. ౨౨.

ఉపశయము. సం. వి. అ. పుం. 1. సమీపశయనము. 2. అన్నౌషధాదులచే వ్యాధి సెఱుంగుట. 3. పథ్యాదిచే రోగోపశమనము చేయుట. 4. వల యొద్ది యాచెంత దాఁగి యుండుటకై త్రవ్వఁగొయ్యి, మాటుగొయ్యి. అవ్య. అ. న. చేతిదగ్గఱ. విశ. (అ.ఆ.అ.) ప్రక్కను బరుండునది.

ఉపశల్యము. సం. వి. అ. న. 1. ఊరి పొలిమేర. 2. దగ్గఱచోటు.

ఉపశాంతము. సం. విశ. (అ. ఆ. అ.) ఉపశమము నొందినది.

ఉపశాంతి. సం. వి. ఇ. స్త్రీ.=ఉపశమము.

ఉపశిక్షణము. సం. వి. అ. న. 1. విద్య నేర్చుట. 2. విద్య నేర్పుట.

ఉపశోభనము. సం. వి. అ. న. 1. ప్రకాశించుట. 2. శోభింపఁజేయుట.

ఉపశోభితము. సం. విశ. (అ.ఆ.అ.) 1. ప్రకాశించినది. 2. ప్రకాశింపఁజేయఁబడినది.

ఉపశోభితుఁడు. సం. విశ. (అ.ఆ.అ.) 1. ప్రకాశించువాఁడు. 2. ప్రకాశింపఁజేయఁబడినవాఁడు. "ఉ...కృష్ణుం డభిషేకసంపదుపశోభితుఁ జేయఁగ..." భార. భీష్మ. ౨, ఆ. ౧౫.

ఉపశ్రుతి. సం. వి. ఇ. స్త్రీ. 1. సమ్మతి. 2. వినికి. 3. శుభాశుభముల నొకదేవత చెప్పువాక్యము. అవ్య. ఇ. న. కర్ణసమీపమున, చెవిదగ్గఱ.

ఉపశ్లేషము. సం. వి. అ. పుం. 1. కౌఁగిలి. 2. ఆధారాధేయసంబంధము.

ఉపశ్లోకించు. సం. స. క్రి. నుతించు, పొగడు. "క...ఆ, భూకాంతునిగుణము లుపశ్లోకించుచు..." ద్వా. ౧౧, ఆ. ౧౧౦.

ఉపసంపన్నము. సం. విశ. (అ.ఆ.అ.) 1. ప్రాప్తి, పొందఁబడినది. 2. సమీపస్థము, దగ్గఱ నున్నది. 3. సహితము, కూడియున్నది. 4. సమృద్ధము, చాలినది. 5. మృతము, చచ్చినది. 6. సంసిద్ధము, తయారైనది. 7. యజ్ఞార్థము చంపఁబడినది. (పశ్వాది.) 8. పాకము చేయఁబడినది.

ఉపసంయమము. సం. వి. అ. పుం. 1. ఉపసంహారము. 2. బంధనము. 3. చక్కఁగా నియమించుట.

ఉపసంవ్యానము. సం. వి. అ. న. పరిధానము, దోవతి.

ఉపసంహరణము. సం. వి. అ. న.=ఉపసంహారము.

ఉపసంహరించు. సం. స. క్రి. 1. చంపు; లయమొనరించు. "సీ...జగము లన్నియు నుపసంహరించు." మార్క. ౪, ఆ. ౧౫. 2. మరల్చు. "వ. ఇట్లస్త్రద్వయం బుపసంహరించి..." భాగ. ౧, స్కం. ౧౫౩. "వ. వరుణానిలాగ్నులు తమ తమశక్తు లుపసంహరించిరేనిఁ బితరపాకంబు సాగదు..." కాశీ. ౧, ఆ. ౨౫౭. 3. అణఁచు, ఉపశమింపఁజేయు. "వ. స్వామీ! కోపం బుపసంహరింపుము." భార. శాం. ౫, ఆ. ౪౪౧. 4. ముగించు, పూర్తిచేయు.

ఉపసంహారము. సం. వి. అ. పుం. 1. (అస్త్రశస్త్రాదుల) మరల్చుట. 2. చంపుట. 3. సమాప్తి. 4. సంగ్రహము చేయుట. 5. సంకుచితము చేయుట. 6. నాశనము. 7. ఖండనము.

ఉపసంహృతి. సం. వి. ఇ. స్త్రీ.=ఉపసంహారము.

ఉపసత్త. సం. విశ. (ఋ.త్రీ.ఋ.) 1. దగ్గఱనున్నవాఁడు. 2. అనుసరించువాఁడు. 3. సేవచేయువాఁడు.

ఉపసత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. సంబంధము. 2. అనుసరించుట. 3. సేవ.

ఉపసరము. సం. వి. అ. పుం. 1. ఎదపదనున్న స్త్రీపశువులను పురుషపశువులు చేరుట. 2. పశువులు ప్రథమగర్భము నందుట. 3. నిరంతరగమనము. విణ. (అ. ఆ. అ.) సమీపించునది.

ఉపసర్గము. సం. వి. అ. పుం. 1. రోగవికృతి. 2. కీడు. 3. ఉత్పాతము. 4. సంస్కృత ధాతువులకు మొదటఁ జేర్పఁబడు 'ప్ర, పరా' మొదలగునవి.

ఉపసర్జనము. సం. వి. అ. న. 1. ఉపద్రవము. 2. త్యాగము. విణ. అ. న. అప్రధానము.

ఉపసర్పము. సం. వి. అ. పుం. సమీపించుట, దగ్గఱుట.

ఉపసర్పించు. సం. స. క్రి. 1. సమీపించు. 2. ఆశ్రయించు. (శ. ర.)

ఉపసర్యా. సం. వి. ఆ. స్త్రీ. ఎదపదనున్న స్త్రీపశువు. ('తొలిచూలావు' అని శ. ర.)

ఉపసాంత్వన. సం. వి. అ. న.=ఉపసాంత్వనము.

ఉపసాంత్వనము. సం. వి. అ. న. ఓదార్పు, ఊఱట.

ఉపసూర్యకము. సం. వి. అ. న. (సూర్యచంద్రుల) పరివేషము, గుడి.

ఉపసృష్టము. సం. వి. అ. న. మైథునము, రతి. విణ. (అ. ఆ. అ.) 1. కూడినది. 2. విడువఁబడినది. 3. ఉపరాగముతోఁ గూడినది. 4. కాముకము. 5. ఉపసర్గముతోఁ గూడుకొన్నది.

ఉపసేవనము. సం. వి. అ. న. 1. సేవించుట; అనుసరించి సేవించుట. "క. సారమతిఁ జేసి మానస, శారీరరుజావళులను సతతంబుఁ బ్రతీకారములు సేయుచుండుదె, యారఁగ వృద్ధోపసేవ నౌషధసేవన్." భార. సభా. ౧, ఆ. 3౫. 2. అనుభవించుట. 3. భోగించుట.

ఉపస్కరణము. సం. వి. అ. న. 1.=ఉపస్కరము. 2. అలంకరించుట. 3. రుచి కలిగించుట. 4. గుణాంతరము నిచ్చుట.

ఉపస్కరము. సం. వి. అ. పుం. 1. గుణాంతరమును గలిగించు ద్రవ్యము. 2. అలంకరించు వస్తువు. 3. రుచి కలిగించువస్తువు. 4. ఇంటిపనిముట్టు. 5. వికృతి. 6. సముదాయము. 7. హింస. 8. వాక్యమందలి యధ్యాహారము.

ఉపస్తరించు. సం. స. క్రి. అభిఘరించు. "గీ. పాత్రసంశుద్ధి కాజ్యం బుపస్తరించి." భీమ. ౨, ఆ. ౧3౫. "వ...కదళీపలాశంబు నడిమియీనియఁ బుచ్చి పఱచి యుదకంబునం బ్రక్షాళించి యుపస్తరించి..." హర. ౨. ఆ. ౧౨౫.

ఉపస్థము. సం. వి. అ. పుం. 1. ఒడి. 2. మధ్యము. పుం. న. 1. స్థితి. 2. గుదము. 3. మర్మావయవము. "క. పాణి యుపస్థం బుదరము, వాణి యనఁగ మూయరానివాకి ళ్లివి..." భార. శాం. ౫, ఆ. 3౧౭. విణ. (అ.ఆ.అ.) దగ్గఱనున్నది, సమీపస్థము.

ఉపస్థాత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) 1. సేవచేయువాఁడు. 2. నమ్రత కలవాఁడు. 3. పరిచారకుఁడు.

ఉపస్థానము. సం. వి. అ. న. 1. చేరిక. 2. సేవ. 3. ఉపాసన. 4. స్మరణ. 5. నివసించుచోటు. 6. పూజాగృహము. 7. పొందుట.

ఉపస్థితము. సం. వి. అ. న. 1. సేవ. 2. స్మరణ. 3. సమీపమునకు వచ్చుట. విణ. (అ.ఆ.అ.) 1. సమీపించినది. 2. సమీపస్థము. 3. పొందఁబడినది. 4. స్మృతికి వచ్చినది. 5. ఉపాసింపఁబడినది. 6. సేవింపఁబడినది.

ఉపస్థితి. సం. వి. ఇ. స్త్రీ. 1. సమీపమున నుండుట. 2. సమీపించుట. 3. పొందుట. 4. స్మృతి. 5. సేవ. 6. దేవతాద్యుపాసన.

ఉపస్పర్శము. సం. వి. అ. పుం. 1. తాఁకుట. 2. ఆచమించుట. 3. స్నానము. "గీ. అభ్రగంగ నుపస్పర్శ మాచరించి, వేగ విచ్చేయవలయు..." కాశీ. ౭,ఆ. ౧౬౭.

ఉపహతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కొట్టఁబడినది. 2. ఉపద్రవముఁ గాంచినది. 3. నిందింపఁ

బడినది. 4. నాశము చేయఁబడినది. 5. చెడిపోయినది.

ఉపహతి. సం. వి. ఇ. స్త్రీ. 1. దెబ్బ. 2. నాశము. 3. అడ్డగింత. 4. ఉపద్రవము.

ఉపహరణము. సం. వి. అ. న. 1. సమీపమునకుఁ గొనివచ్చుట. 2. పట్టుకొనుట. 3. వడ్డించుట. 4. కానుక లిచ్చుట. 5. బలి యొసఁగుట.

ఉపహవము. సం. వి. అ. పు. ఆహ్వానము, పిలుపు.

ఉపహసించు. సం. అ. క్రి. నవ్వు. "వ...గిరిజ పలుకులు విని కృతకమునికుమారుం డుపహసించుచు ..." కు. సం. ౭, ఆ. ౩౨. స. క్రి. పరిహసించుచు, ఎగతాళిచేయు.

ఉపహసితము. సం. వి. అ. న. ఎగతాళితోఁ గూడిన నవ్వు. విణ. (అ. ఆ. అ.) పరిహసింపఁబడినది.

ఉపహారము. సం. వి. అ. పు. 1. కానుకగా నిచ్చు ద్రవ్యము. 2. పూజ.

ఉపహితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఉంపఁబడినది. 2. కూడియున్నది. 3. ఆరోపింపఁబడినది. 4. అర్పింపఁబడినది.

ఉపహూతి. సం. వి. ఇ. స్త్రీ. ఉపహవము, పిలుపు.

ఉపహృతము. సం. విణ (అ.ఆ.అ.) 1. ఈయఁబడినది. 2. కానుకగా నీయఁబడినది. 3. యజ్ఞమునఁ బశువుగా నీయఁబడినది. 4. వడ్డింపఁబడినది. 5. చంపఁబడినది. "క. అప్పరుసునఁ బెరిఁగిన నృపు,లిప్పుడు భారతరణోపహృతులై ..." భార. శాం. ౧, ఆ. ౯౯.

ఉపహ్వరము. సం. వి. అ. న. 1. నిర్జన ప్రదేశము. 2. దగ్గఱ.

ఉపహ్వానము. సం. వి. అ. న. 1. ఆహ్వానము. 2. మంత్రోచ్చారణముచే దేవతాదుల కిడిన యాహ్వానము.

ఉపాంగము. సం. వి. అ. పు. తిలకము, చుక్క. న. 1. సుతి వేసెడు తిత్తి. "చ...భామ లయ్యెనుమతి గాంచి దండియ లుపాంగము మద్దెల తాళ మావజం,బును గొని మేళమై ముని తపోవనికిం జని నిల్చి రొక్కెడన్." రామా. ౧,ఆ. ౯౯. 2. మీమాంసాది. (మీమాంస, న్యాయశాస్త్రము, పురాణము, ధర్మశాస్త్రము నని యివి నాలుగు.) 3. అంగమున కంగ మగు నొక యంతర్భాగము.

ఉపాంతము. సం. వి. అ. పు. 1. దగ్గఱ. 2. చివర. విణ. (అ.ఆ.అ.) 1. దగ్గఱ నున్నది. 2. అంతమునకు దగ్గఱ నున్నది. 3. సమానమైనది. "ఉ...శతానీకుఁడు దాఁకెఁ గంకటమణిద్యుతి విద్యుదుపాంత కాంతియై." భార. విరా. 3, ఆ. ౧౭౨.

ఉపాంశువధము. సం. వి. అ. పు. ఇతరులకుఁ దెలియకుండఁగఁ జంపుట, గూఢవధ. "పృథ్వీ. ఉపాంశువధఁ జేసి మధ్యము మహోద్ధతిం జంపి నిస్సపత్నముగ ధర్మనందను నశక్తు బంధించి..." భార. ఆది. ౫, ఆ. ౧౬౮.

ఉపాంశువు. సం. వి. ఉ. పు. పైకి వినఁబడకుండఁ జేయుజపము. (మానసికము, ఉపాంశువు, వాచికము అని జపము మూఁడువిధములు.) అవ్య. ఏకాంతము, రహస్యము. "క. శీలముఁబట్టియుం గంజా,హ్వాల లుపాంశువ భుజించునధముల బైటం,జాలఁడు వైవక విప్ర,స్థాలిత్యము బైట వేసి కసుగిఱుపుసథన్." ఆము. ౪, ఆ. ౪౭.

ఉపాకరణము. సం. వి. అ. న. 1. సంస్కారపూర్వమగునధ్యయనారంభము. 2. విధ్యుక్త మగు యజ్ఞ పశుహింస.

ఉపాకర్మము. సం. వి. న్. న.=ఉపాకరణము.

ఉపాకృతము. సం. వి. అ. పు. 1. యజ్ఞహింసకై సిద్ధము చేయఁబడిన పశువు. 2. ఉపద్రవము. న. 1. యజ్ఞపశుసంస్కారము. 2. ఉపాకర్మము. విణ. (అ.ఆ.అ.) ఉపద్రవము నందినది.

ఉపాఖ్యానము. సం. వి. అ. న. 1. ముఖ్య కథాభాగముమధ్య వచ్చు నవాంతరకథ. 2. పూర్వుల చరిత్రము చెప్పుట. 3. చెప్పుట.

ఉపాగతము. సం. విణ. (అ.ఆ.అ.) 1. దగ్గఱకు వచ్చినది. 2. జరిగినది. 3. అంగీకరింపఁబడినది.

ఉపాత్తము. సం. వి. అ. పు. మద ముడిగిన యేనుఁగు. విణ. (అ.ఆ.అ.) 1. పొందఁబడినది.

2. సంపాదింపఁబడినది. 3. గ్రహింపఁబడినది. 4. మొదలుపెట్టఁబడినది. 5. తీసికొనిపోఁబడినది.

ఉపాత్యయము. సం. వి. అ. పుం. 1. శాస్త్రలోకాచారాతిక్రమణము. 2. వ్యతిరేకము. 3. నాశము.

ఉపాదానము. సం. వి. అ. న. 1. తీసికొనుట. 2. పొందుట. 3. ప్రతిగ్రహణము. 4. ఇంద్రియములను విషయములనుండి మరల్చుట. 5. కారణము. 6. ఆయవారము. "సీ. తలమీఁద మంత్రాక్షతము లుంచి కలకాఁపుటిండ్ల నుపాదానమెత్తి తెచ్చి." హంస. ౨, ఆ. ౧౫౨.

ఉపాదేయము. సం. విణ. (అ.ఆ.అ.) 1. గ్రహింపఁదగినది. 2. పొందఁదగినది. 3. ఉత్తమమైనది. 4. ఉపాదానకారణమునుండి సంభవించిన కార్యము. (మట్టి ఉపాదానము: కుండ ఉపాదేయము.)

ఉపాధానము. సం. వి. అ. న. 1. ఉంచుట. 2. ధరించుట. 3. కప్పుట. 4. ఆరోపించుట.

ఉపాధి. సం. వి. ఇ. పుం. 1. కపటము. 2. దగ్గఱ వస్తువులయందు తాత్మధర్మము నారోపించుటకు సాధన మగుపదార్థము. 3. విశేషణము. (జాతి గుణ క్రియ సంజ్ఞ లని యివి నాలుగువిధములు.) 4. ఉపనామము. 5. ధర్మచింతనము. 6. గుర్తు. 7. జీవిక. విణ. ఇ. పుం. కుటుంబమున మిక్కిలి యాసక్తి గలవాఁడు.

ఉపాధిగ్రస్తత. సం. వి. ఆ. స్త్రీ. వ్యాప్తిదోషములలో నొకటి. "మ. స్వమతి ప్రౌఢివృథానుమానముల సంస్థాపించు నేవేళ నెద్ది మతం బప్పుడు వానివానికి నుపాధిగ్రస్తతావ్యాప్తిభంగముఖానేక సుదూషణంబులు వెసం గల్పించుచుఁ..." ప్రభా. ౪, ఆ. ౬౨.

ఉపాధ్యాయ. సం. వి. ఆ. స్త్రీ. ఉపాధ్యాయురాలు.

ఉపాధ్యాయాని. సం. వి. ఈ. స్త్రీ. ఉపాధ్యాయుని భార్య.

ఉపాధ్యాయి. సం. వి. ఈ. స్త్రీ. ఉపాధ్యాయ.

ఉపాధ్యాయుఁడు. సం. వి. అ. పుం. 1. గురువు. 2. వేతనము గ్రహించి వేదభాగాదులు చెప్పువాఁడు.

ఉపానహము. సం. వి. హ్. స్త్రీ. 1. చెప్పు. 2. చెప్పులజోడు. "క. దానప్రవణ యుపానద్దానంబును నాతపత్త్రదానము సురసన్మాననభాజనము లగుట,నానాబుధజనులచే వినఁబడు నెపుడుఁ." భార. అను. 3, ఆ. ౨౬౭.

ఉపాయనము. సం. వి. అ. న. 1. పొందుట. 2. కానుక. 3. గుర్వాదుల సమీపమునకుఁ బోవుట.

ఉపాయము. సం. వి. అ. పుం. 1. సాధనము. 2. వెరవు. 3. ఉపశమము. 4. వడ్డీ వ్యాపారము. 5. రాజు శత్రువులను లొంగఁదీయు సాధన విశేషము. (సామ దాన భేద దండోపాయములు నాలుగు. ఉపేక్షఁ గలిపి యైదని శుక్రుఁడు. మాయ, ఉపేక్ష, ఇంద్రజాలముఁ గలిపి సప్తోపాయము లని కొందఱ మతము.)

ఉపారము. ఉభ. వై. వి. (సం. ఉపహారః.) 1. ఉపాయనము, కానుక. "సీ. కానుక కానిక కప్పము నూడిద యులుపా యుపారంబు నులుపయనఁగఁ, జను నుపాయనసంజ్ఞ..," ఆం. భా. ద్వి. ౧౯3. 2. నైవేద్యపదార్థము. (ఆం. పా.) దే. వి. మల్లబంధవిశేషము.

ఉపార్జనము. సం. వి. అ. న. సంపాదనము.

ఉపార్జించు. సం. స. క్రి. సంపాదించు. "సీ... పాడిమై నర్థముల నుపార్జించి దేవతాబ్రాహ్మణపూజగా నిడుచు..." భార. శాం. ౧, ఆ. ౭౫.

ఉపార్జితము. సం. విణ. (అ. ఆ. అ.) సంపాదింపఁబడినది.

ఉపాలంభనము. సం. వి. అ. న.=ఉపాలంభము.

ఉపాలంభము. సం. వి. అ. పుం. 1. చెప్పుట. 2. దూఱుట, దూషణము.

ఉపాలంభించు. సం. స. క్రి. దూఱు, నిందించు. "వ. అని యుపాలంభించిన విని విరోచననందనుం డిట్లనియె," భాగ. ౮, స్కం. 3౫౨.

**ఉపాలబ్ధము.** సం. విశే. (అ.ఆ.అ.) 1. చెప్పఁబడినది. 2. దూఱఁబడినది.

**ఉపాశ్రయము.** సం. వి. అ. పుం. 1. ఆశ్రయము, అవలంబనము. 2. ఆనిక, ఆనుకొనుట కాధారము. 3. ఆస్పదము, చోటు.

**ఉపాశ్రయించు.** సం. స. క్రి. సేవించు, కొలుచు. "ఉ. శంభునిం, గూడి నిజాంగసంశ్రయతఁ గూర్చి పునర్జనితాంగజోజ్జ్వల, క్రీడ నెఱుంగనీయని గిరిప్రభుకన్య నుపాశ్రయించెదన్." సమీర. ౧, ఆ. ౪.

**ఉపాశ్రితుఁడు.** సం. విశే. (అ.ఆ.అ.) 1. ఆశ్రయించువాఁడు. 2. ఆశ్రయింపఁబడినవాఁడు.

**ఉపాస.** సం.=ఉపాసన.

**ఉపాసంగము.** సం. వి. అ. పుం. అమ్ములపొది.

**ఉపాసకుఁడు.** సం. వి. అ. పుం. సేవకుఁడు. విశే. (అ. ఆ. అ.) 1. సేవించువాఁడు. 2. దేవత నుపాసించువాఁడు.

**ఉపాసన.** సం. వి. ఆ. స్త్రీ. 1. దేవతాదులను సేవించుట. 2. చింతనము. 3. పూజనము.

**ఉపాసనము.** సం. వి. అ. న. 1. = ఉపాసన. 2. విలువిద్య నభ్యసించుట. 3. చిన్నపీఁట.

**ఉపాసము.** వై. వి. (సం. ఉపవాసః.) ఉపవాసము, పస్తు. "క. దిన మొక్కొక్కటి యెక్కఁగ, వనజాక్షుం డుపవసించి వత్సర మెల్లన్, జనఁగా నొక్కొకయేఁ డెక్క నుపాసం బుడిగి యశనకర్మము నడుపున్." ఉ. హరి, ౨, ఆ. ౧౬౬.

**ఉపాసాదితము.** సం. వి. అ. న. లబ్ధి, పొందుట. విశే. (అ.ఆ.అ.) లబ్ధము, పొందఁబడినది.

**ఉపాసించు.** సం. స. క్రి. 1. సేవించు, కొలుచు. భార. శాం. ౧, ఆ. ౨. 2. పారాయణము చేయు. "క. ఈ సందర్భము వీరలు, సేవినయది మేము వీరిశిష్యులము రసోల్లాసమధుర మగుదీని నుపాసింతుము ప్రీతి నేత దనుమతి నెందున్." నిర్వ. ౧౦, ఆ. ౧౨౪.

**ఉపాసిత.** సం. విశే. (ఋ. త్రి. ఋ.) ఉపాసించువాఁడు.

**ఉపాసితము.** సం. విశే. (అ.ఆ.అ.) 1. సేవింపఁబడినది. 2. చింతింపఁబడినది. 3. పూజితము.

**ఉపాస్తి.** సం. వి. ఇ. స్త్రీ. = ఉపాసన. 1. సేవ. "క. వాణికి...సద్భక్తితో నుపాస్తి యొనర్తున్." హర.కీశి. ౪. 2. ఆరాధనము. "ఉ. ఆల మొనర్పఁగా వలయు నప్పుడు వహ్ని నుపాస్తి చేసి యా, వేలిమి నొక్క లేప ప్రభవించిన గ్రక్కున దాని నెక్కి..." నిర్వ. ౭, ఆ. ౯.

**ఉపాస్యము.** సం. విశే. (అ.ఆ.అ.) 1. సేవింపఁదగినది. 2. చింతనము చేయఁదగినది. 3. పూజింపఁదగినది.

**ఉపాహారము.** సం. వి. అ. పుం. 1. చిఱుతిండి. 2. ఫలహారము.

**ఉపాహితము.** సం. వి. అ. పుం. ఉల్కాపాతాదికమగునుత్పాతము. విశే. (అ.ఆ.అ.) 1. ఉంపఁబడినది. 2. ధరింపఁబడినది. 3. ఆరోపింపఁబడినది. 4. కూర్పఁబడినది. 5. కలిగింపఁబడినది.

**ఉపాహృతము.** సం. విశే. (అ.ఆ.అ.) 1. పట్టుకొనఁబడినది. 2. కొనిరాఁబడినది. 3. ఈయఁబడినది.

**ఉపేంద్రుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రునితమ్ముఁడు. 1. వామనుఁడు, విష్ణువు. 2. కృష్ణుఁడు.

**ఉపేక్ష.** సం. వి. ఆ. స్త్రీ. 1. అశ్రద్ధ. 2. నిర్లక్ష్యము. 3. ఒకానొక భావనము. (మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష యనునవి భావనాచతుష్టయము.) 4. ఒకానొక యుపాయము.

**ఉపేక్షణము.** సం. వి. అ. న. = ఉపేక్ష.

**ఉపేక్షించు.** సం. స. క్రి. అశ్రద్ధచేయు; విడిచిపుచ్చు. "ఉ. ఇట్టివిపరీతచరిత్రునిఁ ద్రుంప కిట్లుపేక్షించుట గాదు వీని బలిసేయు వసుంధరకున్ శుభం బగున్." భాగ. 3, స్కం. ౬౬౭.

**ఉపేక్షితుఁడు.** సం. విశే. (అ.ఆ.అ.) ఉపేక్షింపఁబడినవాఁడు.

**ఉపేత.** సం. విశే. (ఋ. త్రి. ఋ.) 1. ఉపాయములు పన్నువాఁడు. 2. దగ్గఱకు వచ్చువాఁడు.

ఉపేతము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** కూడుకొన్నది. **2.** సమీపము నందినది. **3.** పొందినది. **4.** పొందఁబడ్డది.

ఉపోఢము. సం. వి. అ. న. పన్నఁబడిన సేన, వ్యూహము. విణ. (అ.ఆ.అ.) **1.** మోయఁబడినది. **2.** సమీపము నందింపఁబడినది. **3.** పన్నఁబడినది. **4.** వివాహ మైనది.

ఉపోదక. సం. వి. ఆ. స్త్రీ. మట్టుబచ్చలి ♆.

ఉపోదకి. సం. వి. ఈ. స్త్రీ. ఉపోదక. (దీని కింకను ఉపోదిక, ఉపోదీక యను రూపము లున్నవి.)

ఉపోద్ఘాతము. సం. వి. అ. పుం. **1.** పీఠిక. **2.** ఆరంభము. **3.** ఒకానొక సంగతి. (తర్కశాస్త్రమున.)

ఉపోద్బలము. సం. వి. అ. న. **1.** ప్రోత్సాహము. **2.** ధైర్యము చెప్పుట. "వ...నదీనందనుండు సమయుటకు సమయం బైన వైపపత్తోత్సాహంబున నేచి పలికెం గావలయు నని యుపోద్బలంబుగా నతని కి ట్లనియె." భార. భీష్మ. 3, ఆ. 3౨౬.

ఉపోషణము. సం. వి. అ. న. పస్తు, ఉపవాసము.

ఉపోషితము. సం.=ఉపోషణము.

ఉపోషితుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) పస్తున్నవాఁడు.

ఉపోష్యము. సం. విణ. (అ.ఆ.అ.) పస్తుండఁదగినది. (తిథి మొ.)

ఉప్తము. సం. వి. అ. న. కుంకుమము. విణ. (అ.ఆ.అ.) **1.** విత్తనములు చల్లఁబడినది. **2.** గొఱిగింపఁబడినది.

ఉప్తి. సం. వి. ఇ. స్త్రీ. విత్తనములు చల్లుట.

ఉప్త్రిమము. సం. విణ. (అ. ఆ. అ.) విత్తనములు చల్లుటవలన మొలచినది.

ఉప్ప. దే. విణ. ఉప్పనిది. వా:—ఆ నూతినీళ్లు ఉప్పగా నున్నవి.

ఉప్పట్టి. దే. వి. బాలక్రీడా విశేషము. (బ్రా.)

ఉప్పట్టు. దే. వి.=ఉప్పట్టి.

ఉప్పత. దే. వి. **1.** అసహనముచే నిందారోపణము చేయుట. (శ. ర.) **2.** అవ్వ, రట్టు. ఆం. భా. ప్ర. ౧౧౫.

ఉప్పతించు. దే. స. క్రి. అసహనముచేఁ బరులకు నిందారోపణము చేయు. "గీ. జలరుహాభవుండు హస్తకౌశల్య మొప్ప,నేర్పడఁగ నంగములు నెల్ల సృష్టిచేసి,యుప్పతింతు రటం చని యొక్కచోట, భంగ మొందించె నన మీఱుఁ బడఁతి కౌను." పార్వ. ౬,ఆ.౯౭.; "ఉప్పతించినాఁడు సురసురనె నేమో." క్షేత్రయ.

ఉప్పతిల్లు. వై. అ. క్రి. (సం. ఉత్పత్. ప్రా. ఉప్పత.) **1.** కలుగు, పుట్టు. "ఆ. సోమదత్తు కొడుకు సుమతికి జన మేజ,యుం డనంగఁ గొమరుఁ డుప్పతిల్లె." భాగ. ౭, స్కం. ౮౯. **2.** సంభవించు, తటస్థించు. "గీ. దక్షిణాయన మొకదీవిఁ బఱసుఁ జూపు,నుత్తరాయణ మొకదీవి నుప్పతిల్లు." కాశీ. ౧, ఆ. ౧౨౯. **3.** అతిశయించు, పెంపొందు. "వ. పూషాదిత్యుపలువరుసయంతంబున నుప్పతిల్లు త్రుళ్లు మెఱుంగులు..." భీమ. ౫, ఆ. ౯., స్వా. 3, ఆ. ౧౭౧. **4.** పూర్ణమగు, నిండు. "ఉ. ఆర్పుల నట్టహాసముల నబ్జభవాండము లుప్పతిల్ల..." దశా. ౬, అ. ౧౫3. **5.** (దాహాదులు) అగు. "వ...అప్పటప్పటికి నుప్పతిల్లిన దప్పిం గొండొక మందగతిం జెందక..." భాగ. ౯, స్కం. ౨౦౯.

ఉప్పన. దే. వి. ఉప్పు, షడ్రసములలో నొకటి. "సీ. లవణ ము ప్పుప్పన యనఁ జెలంగు..." ఆం. భా. ప్ర. ౧౦౪.

ఉప్పనఁబట్టెలు. దే. వి. బ. **1.** బాలక్రీడావిశేషము. "సీ. పడఁతి నీచూపు లుప్పనఁబట్టె లాడించి చెలులవక్త్రములఁ బుజింతుఁగాక." ఉ. హరి. ౫, ఆ. ౧౮౧., కాళ. 3, ఆ. 33. **2.** పేరెము పాఱుట. (బ్రా.)

ఉప్పయనము. దే. వి. (క. ఉప్పయణ.) గుమిగూడుట. (చూ. ఉప్పయనముచేయు.)

ఉప్పయనముచేయు. దే. అ. క్రి. (ఉప్పయనము+చేయు.) గుమిగూడు, మొత్తమగు. "క. ఆ

ప్పొలఁతి కురులు శివుమన, సొప్పరి తనుఁ దగులఁ బెట్టు నురు లన నెఱులై,కప్పారి కొదమతుమ్మెద, లుప్పయనము సేసినట్టియొఱపున నొప్పున్." కు. సం. ౩, ఆ. ౭౦.

ఉప్పర. దే. వి. చెఱువులు మున్నగునవి త్రవ్వి బుట్టలు మున్నగునవి యల్లి యమ్ముకొని జీవించెడు జాతి. (వా.) ఉప్పరవాఁడు, ఉప్పరది.

ఉప్పరగుడి. దే. వి. (క. ఉప్పరకుడి.) ఉన్నతధ్వజము, మిక్కిలియెత్తుగ నిలిపినజెండా. "ద్వి. ఉప్పరగుళ్లు మహోత్కపతాకములు..." పండితా. మహిమ. ౨౯౬, పు.

ఉప్పరము. వై. వి. (సం. ఉపరి. క. ఉప్పర.) **1.** పైభాగము. "ఉ...దోమతెర లుప్పర మెత్తిరి..." ఆము. ౫, ఆ. ౧౦౪. జై. ౫, ఆ. ౧౩౯. **2.** ఆకాశము. "మ...ఉప్పర మంటుచ ప్పరమునన్..." శుక. ౩, ఆ. ౬౦౫. విశే. ఉన్నతము. "వ...ఉప్పరంబైనకప్పురంపుఁదిప్పనప్పు డొప్పులకుప్ప నుంచి..." రా.వి.౪,ఆ.౨౬.

ఉప్పరముదాఁటు. ద్వ. అ. క్రి. (ఉప్పరము+దాఁటు.) వ్యాపించు, విస్తరించు; మిన్నుముట్టు. "సీ. అంటెనఁ గందునో యను మేనినునుఁగాంతి యిరుగెలంకులకు నుప్పరముదాఁటు." విక్ర. ౮, ఆ. ౧౦౧.

ఉప్పరమెగయు. ద్వ. అ. క్రి. (ఉప్పరము+ఎగయు.) అతిశయించు; మిన్నుముట్టు. "క. అప్పులకుల కలుకలు మది,నుప్పరమెగయంగ నెసఁగె..." ఉ. హరి. ౫, ఆ. ౨౨౦.

ఉప్పరపట్టము. ద్వ. వి. (ఉప్పరము+పట్టము.) నగరము నలంకరించుటకు దారిప్రక్క నెత్తుగా నిలుపు ధ్వజాదికము. "ద్వి. మకుటతోరణములు మార్గపార్శ్వముల, నుప్పరపట్టంబులు..." పండితా. మహిమ. ౨౯౬, పు.

ఉప్పరవీది. వై. వి. (ఉప్పరము+వీది.) **1.** ఆకాశమార్గము, ఉపరివీథి. "ఉ...తేరుప్పరవీదిఁ దోలుకొని..." భార. భీష్మ. ౨, ఆ. ౯౦. **2.** ఆకాశము. "గీ. వేలుపులత్రోవ యుప్పరవీది యాకసంబు..." ఆం. సం. దేవ. ౩౧.

ఉప్పరి. దే. వి. (ఉప్పర+ఇ.) ఉప్పరవాఁడు. "ఉ...ఒక్కబావిఁ ద్రవ్వింప మటంచు నుప్పరులఁ బిల్వఁగఁ బంచి..." చెన్న. ౫, ఆ. ౨౩౧.

ఉప్పరించు. దే. స. క్రి. (క. ఉప్పరిసు.) పై కెత్తు. "వ...పక్కల మొక్కలంబునఁ జప్పరించియు నుప్పరించియు..." ఉ. హరి. ౬, ఆ. ౧౦౮.

ఉప్పరిగ. వై. వి. (సం. ఉపకారికా. క. ఉప్పరిగె. త. ఉప్పరిగై.) మేడ. "ఉ. ఉప్పరిగొప్పయుప్పరిగలందు వసించెడుముగ్ధకాంతలు..." దశా. ౧, ఆ. ౮౪. "గీ. పరఁగు సౌధంబు మేడ యుప్పరిగ యనఁగ." ఆం. సం. స్థా. ౩౧.

ఉప్పరీఁడు. = ఉప్పర.

ఉప్పలము. దే. వి. ఉప్పు పండుపొలము. "గీ...లవణాకరంబు,వెలయు నుప్పల మన..." ఆం. భా. ద్వి. ౯.

ఉప్పలవాయి. దే. వి. చూపుడువ్రేలికిని బొటనవ్రేలికిని మధ్య గలభాగము. "గీ. పరుస పలకేలి యుప్పలవాయి పైత్ర్యకంపుఁదీర్థంబు తర్పణకార్యమునకు." భార. అను. ౪, ఆ. ౧౧౩.

ఉప్పలి. దే. వి. కీడు, ఆపద. (శ. ర.)

ఉప్పవడమగు=ఉపవడమగు. "క. ఉప్పవడంబై వేలుపుఁగప్పురగంధులను వేడ్కఁ గైసేయుచు నేఁ, డప్పరమహాని యుండెడు,చొప్పరయుద మనుచు నడచుచుం దమలోనన్." వాల్మీ. ౩, ఆ. ౧౦౭. "సీ. భూనాయకుండును భోజనోత్తరమునఁ బవడించి యంత నుప్పవడమగుచు." పరమ. ౩, ఆ. ౫౬. (శ. ర. పా.)

ఉప్పవడము=ఉపవడము. (శ. ర.)

ఉప్పళము. దే. వి. ఉప్పలము. (శ.ర.)

ఉప్పళించు=ఉప్పరించు. "గీ. కాలిదెసఁ జొరవచ్చుట గానిపించు, నుదుగు సీసానఁ బట్టియు నుప్పళించి, పోవనిచ్చు..." భార. విరా. ౨ ఆ. ౧౫.

ఉప్పి. దే. వి. కుండలి ⚘. "సీ...ఉప్పి తెల్లుప్పి నీరుప్పి యిప్పు." హంస. ౪, ఆ. ౧౧.

ఉప్పిఁడి. దే. వి. **1.** ఉప్పు కారము పులుసు మున్నగునవి తినక యేకాయయో పండో తినియుండు

నుపవాసము. "చ. వ్రతములు చేసి పెక్కు లుప వాసములుం మఱి పెక్కు లుప్పిడుల్, ధృతి నొనరించి..." ఉద్భ. ౨, ఆ. ౧౧౫. 2. ఉప వాసము. "గీ. పలు తెఱంగులనుప్పిడుల్ సలుప వలదు." అచ్చ. అయో. ౫౪. విణ. 1. ఉప్పు లేనిది. ఆం. భా. ప్ర. ౧౦౫. 2. శుష్కము. "సీ. ఓర్పుమై నుప్పిండియుపవాస ముండని మగనాలి సరిపోల్పఁ దగదు విధవ." కాశీ. ౨, ఆ. ౧౭౩.

ఉప్పిడి. దే. వి. ఉప్పుడుబియ్యము. (బ. ఉప్పిళ్లు.) ఆం. భా. ద్వి. ౨౫౪.

ఉప్పిరింత. దే. వి. జ్యోతిష్మతి, మానేరు 🌿. (శ.ర.)

ఉప్పిలము. దే. వి. ఉప్పు తయారగుచోటు. (ఆం. పా.)

ఉప్పు. దే. స. క్రి. ఉడుకఁబెట్టు. "వ. కీచకతండు లంబులం బిండిగొట్టి కొట్రఁ బోసి యుప్పి గొప్పలుగాఁ జేసి యావించినకుడుములబానలు ..." కాళ. 3, ఆ. ౩౬. వి. 1. లవణము. "ఆ. కప్పురంబు వెట్టి యుప్పు గొనుట." ఆము. ౬, ఆ. ౬౨. 2. ఊషరక్షేత్రము. ఆం. భా. ద్వి. ౬3. 3. సొమ్ము. "క. తొంటిజని వానియు ప్పటుట్లు,తింటిఁ జుమీ యింతపాటుఁ దెచ్చుకొను టక్కై." శుక. 3, ఆ. ౪౧౧.

ఉప్పుఁగండ. ద్వ. వి. (ఉప్పు+కండ.) ఉప్పు రాచి యెండఁబెట్టిన మాంసపుముక్క. "సీ. దుప్పులఁ బడనేసి యుప్పుఁగండలు చేసి చప్పరించుచు నుండు చపులు మఱచి.' వాల్మీ. ౨, ఆ. ౧౭౯.

ఉప్పుఁగడలి. దే. వి. (ఉప్పు+కడలి.) లవణసము ద్రము. "సీ...క్రన్నన నీయుప్పుఁగడలి దాఁ టి." అచ్చ. యు. ౪౦3.

ఉప్పుఁగలు. దే. వి. (ఉప్పు+కలు.) ఉప్పురాయి. "క. తప్పక చంపెన్ వదనము,చెప్పక చెప్పె డును రక్తసిక్తం బయి నా,కుప్పుఁగలువోలెఁ గలి గిన,యిప్పాపని దీని కేన యిచ్చితి మెసవన్." వేం. పంచ. ౫, ఆ. ౨౫.

ఉప్పుఁగాయ. దే. వి. (ఉప్పు+కాయ. క. ఉప్పుఁ గాయ.) ఊరుఁగాయ. "మ...కప్పురపుందోయ ము మీఁగడల్ పెరుఁగు లుప్పుంగాయలున్ మున్నుగాఁ,బరిపూర్వంబుగ నారగించి రను వొప్పం బెండ్లివా రందఱున్." అని. ౧, ఆ. ౧౦౫.

ఉప్పుఁగుందము. దే.వి. (ఉప్పు+కుందము.) బాలక్రీ డావిశేషము. (శ.ర.)

ఉప్పుఁగొటారు. దే. వి. (ఉప్పు+కొటారు.) ఉప్పు లము. (వా.)

ఉప్పుఁజేఁప. దే. వి. (ఉప్పు+చేఁప.) ఉప్పురాచి యెండఁబెట్టినచేఁప. హంస. ౪, ఆ. ౧౭౭.

ఉప్పుఁబట్టి. దే. వి. (ఉప్పు+పట్టి.) చవుటినేల, ఊషరక్షేత్రము. తనంతట ఉప్పు పండెడునేల. (శ. ర; వా)

ఉప్పుఁబిండి. దే. వి. (ఉప్పు+పిండి.) ఉప్పు వేసి వండినపిండి. ఉప్పుడుపిండి. (వా)

ఉప్పుకట్టు. దే. వి. (ఉప్పు+కట్టు.) ఉప్పలమున గడ్డ కట్టినయుప్పు. "సీ. చలిత శిరాపరస్పర ఘర్షణ భవాగ్నికణములమై నుప్పుకట్లు చిట్ల." పార్వ. ౫, ఆ. ౧౦౬.

ఉప్పుకూర. దే. వి. ఈలకూర.

ఉప్పుటుండలు. దే. వి. బ. భక్ష్యవిశేషము. "సీ. బొబ్బట్లు నెలంబు లుబ్బుగుడుము. గీ. సారువలు నుప్పుటుండల మేరువులును.'' శ్రీ రం. మా. ౬, ఆ. ౧౧౦.

ఉప్పుడు. దే. విణ. ఉడికినది. ఉదా:—ఉప్పుడు బియ్యము=ఉడికినవడ్లనుండి దంచిన బియ్యము.

ఉప్పురియు దే. అ. క్రి. మసైపోవు, చివికిపోవు, ఉరిసిపోవు.

ఉప్పెన. వై. వి. (సం. ఉల్బణమ్.) సముద్రపు పొంగు. "సీ. వ్రాల వచ్చినకల్పసాల ముప్పెనఁ బోయె వచ్చినభాగ్యదేవత తొలంగె.' కాళ. ౪, ఆ. ౧౧౧.

ఉప్పొంగు. దే. అ. క్రి. (ఉబ్బి+పొంగు.) 1. మిక్కిలిపొంగు. "సీ...శరనిధు లుప్పొంగి పొరలఁ బడియె." భార. ఉద్యో. ౪, ఆ. ౧౧౬. 2. అధి

కమగు. "మ. బోమ లల్కఁ ముడివడ్డ రౌద్ర రస ముప్పొంగఁ..." భార. ఉద్యో. ౨, ఆ. ౧౮౮. **3.** మిక్కిలి సంతోషించు. "మ. చెలులం దానును సత్యభామ సనుదెంచెఁ నాథుఁ డుప్పొంగఁగఁ." పారి. ౨, ఆ. ౧౪.

ఉప్పు. దే. వి. ఊఁదుటయం దగుధ్వని కనుకరణము. "సీ...మలయమారుతమును నుప్పున నెగనూఁదు నొక్కనాఁడు." శతకంఠ. ౧, ఆ. ౨౭.

ఉబలాటపడు. ద్వ. అ. క్రి. (ఉబలాటము+పడు.) **1.** మిక్కిలికోరు. వ్యవ:—పట్టుచీరకై యామె యుబలాటపడుచున్నది. **2.** ఉత్కంఠతోనుండు. వ్యవ:—మగపిల్లవానికై యామె యుబలాటపడుచున్నది.

ఉబలాటము. దే. వి. **1.** ఉత్కంఠ, తీవ్ర మైన యభిలాష. **2.** జాలి. (శ. ర.)

ఉబుకు. దే. అ. క్రి. (క. ఉబకు.) **1.** ఉప్పొంగు, సంతోషించు. "గీ. ఉబికి చనఁ దగ దితిహాస మొకటి వినుము." శుక. ౧, ఆ. ౧౭౦. **2.** పైకి లేచు. "సీ. చెండు గోరించినచెలువున లివమీఱ నొయ్యారమునఁ గొంత యుబికి యుబికి." శశాం. 3, ఆ. ౧౧౧. వి. పొంగుట. (శ. ర.)

ఉబుకువాఁడు. దే. విశే. (ఉబుకు+వాఁడు.) వర్ధిష్ణువు, అభివృద్ధి నందఁగలవాఁడు. "గీ. ఉబుకువాఁ డన వర్ధిష్ణు వొప్పుచుండు." ఆం.భా.త్రృ.౯.

ఉబుసు. దే. వి. **1.** పనిలేనికాలము. (చూ. ఉబుసుపుచ్చు.) **2.** సంగతి, సమాచారము. "గీ. ఏను మానిసి ము న్నంచు నేకతమున, నొండొరుల తోడుతను జెప్పుకొందు రుబుసు." భీమ. ౪, ఆ. 33. విక్ర. ౬, ఆ. 3౮. **3.** కాలక్షేపము. "సీ. గోరంతయుబుసుగాఁ గూర్చుండఁ దలఁచుచో నట్టె సివం బాడినట్లు తోఁచు." రాధా. 3, ఆ. 3౭.

ఉబుసుపుచ్చు. దే. అ. క్రి. (ఉబుసు+పుచ్చు.) కాలక్షేపము చేయు. "గీ. అమరపతిఁ గొల్వఁ జనువార లతివ యెపుడు, నుబుసుపుత్తురు వివిధోప యోగ్యకళల." పారి. ౨, ఆ. ౯౨., శుక. ౧, ఆ. 303. కళా. 3, ఆ. ౪.

ఉబుసుపోక. దే. వి. (ఉబుసుపోవు. ధా.) కాలక్షేపము. "సీ. ఉబుసుపోకకు నైన నొల్లవు చెవిఁ జేర్ప వైణికవల్లకీవాదనముఁ..." వరాహ. ౨,ఆ.౫౬., ఆము. ౨,ఆ.౭౪., స్వా. ౪,ఆ.౨౪.

ఉబుసుపోవు. దే. అ. క్రి. (ఉబుసు+పోవు.) కాలక్షేప మగు. "గీ. శమనలోకాభిపత్తన ప్రణపరత, నుబుసుపోవంగ శివశర్మ యొయ్యఁ జేరె, నప్సరోలోకము..." కాశీ. 3, ఆ. ౧౬౫.

ఉబ్బ. వై. వి. (సం. ఊష్మః.) ఉమ్మ, వేఁడి. "గీ. ఉడుకు సెగ వెట్ట వేఁడిమి యుబ్బ యావిరియుక్క యన నొప్పు నామంబు లుష్ణమునకు." ఆం. శే. ౫౭.

ఉబ్బకము. వై. వి. **1.** ఉబ్బుట. (బ్రౌ.) **2.** ఆధిక్యము. (శ. ర.)

ఉబ్బడఁగు. దే. అ. క్రి. (ఉబ్బు+అడఁగు.) క్షీణత నొందు. సాం. ని. మాన. ౪౯. ఆం. సం. మాన. ౭౦.

ఉబ్బతిలు. వై. అ. క్రి. ఉబ్బు, పొంగు. "మ... బ్రహ్మాండకటాహ ముబ్బతిలి తీంద్రంబై పగుల్ గానరాఁ." భాగ. ౮, స్కం. ౬౨౫.

ఉబ్బనీరు=ఉమ్మనీరు. (శ.ర; బ్రౌ.)

ఉబ్బరపోవు. ద్వ. అ. క్రి. (ఉబ్బరము+పోవు.) **1.** ఆశ్చర్యపడు. "ఉ. ఆదిమ మైనయండమున యం దుదయించెను గూబపుల్గు సూర్యోదయ వేళ ముజ్జగము నుబ్బరపోవఁగ..." కాశీ. ౬, ఆ. ౧౭. నైష. 3, ఆ. ౯౫. **2.** బాధపడు. "ఉ. ఒయ్యన వెల్వు సూడి జడి నుబ్బరపోయెడి ప్రాణికోటికిన్, దయ్యము నెత్తికోలు తుది దాఁకఁగఁ దూరుపు దెల్లవాఱె తెల్పయ్యెను..." హర. ౨, ఆ. ౨౪.

ఉబ్బరము. వై. వి. (సం. ఉల్బణమ్.) **1.** ఉబ్బుట, అతిశయము. "వ. ప్రత్తిసంపత్తియు బొబ్బరయుబ్బరంబును..." భీమ. 3, ఆ. ౫౭. **2.** కడుపుబ్బుట. (శ. ర. వా.) **3.** (సం. ఉద్భ్రమః.) ఆశ్చర్యము. (చూ. ఉబ్బరపోవు.) **4.** బాధ. (చూ. ఉబ్బరపోవు.)

ఉబ్బరించు. వై. అ. క్రి. ఉబ్బు,పొంగు. (సముద్రము.) "సీ. రేజేనిసిరి కుబ్బరించుమ్రోఁతలప్రోవు జపసిరో సపు మంట దాఁచుతావు." కవిరా. ౪, ఆ. ౬౩. 2. కడుపుబ్బు. (శ. ర. వా.) 3. మారముపట్టు. "ద్వి. ఉబ్బునూర్పులతోడ నొకకొంత సేపు,ఉబ్బ రింపక పట్టి యూరకుండుచును." రం. రా. యు. ౩౩౯, పు.

ఉబ్బరిక. దే. వి. విజృంభణము. (చూ. ఉబ్బరిక చేయు.)

ఉబ్బరికచేయు. దే. అ. క్రి. (ఉబ్బరిక+చేయు.) విజృంభించు. "వ...వసుదేవుపట్టి పట్టిసంబు గొని దట్టించిన నుబ్బరికచేసి చాణూరుండు హరికరం బు పట్టి..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౩౪౫.

ఉబ్బలి. దే. వి. బురద. పంకము. "క. కరు లుబ్బలిలోఁ జిక్కినఁ,గరు లెత్తఁగఁ జాలియుం డుఁగాదే పుడమిన్." వేం. పంచ. ౨, ఆ. ౭౧. రసి. ౬, ఆ. ౪౫.

ఉబ్బలబడు. దే. అ. క్రి. ఉబ్బవేయఁబడు. "సీ. రస ధూమమఖిలగాత్రచ్ఛిద్రములఁ బ్రాక నుబ్బలబడి మూల్గుచుండువారు." వేం. పం. ౪, ఆ. ౭౨౪.

ఉబ్బసపుచ్చు. ద్వ. అ. క్రి. (ఉబ్బసము+పుచ్చు.) ఆయాసపడు. "క...,నావుడు నుబ్బసపుచ్చుచు ..." ద్వా. ౨, ఆ. ౮౫. (చూ. ౮౬.)

ఉబ్బసము. వై. వి. (సం. ఉచ్ఛ్వాసః. క. ఉబ్బస.) శ్వాసరోగము. "గీ...కాసంబు పేరు దనర్చు చుండు,నుబ్బస మనంగ దగ్గన నుక్కిస యన." ఆం. భా. ౨, ఆ. ౧౨౬.

ఉబ్బించు. దే. స. క్రి. (ఉబ్బు. ధా. ప్రే.) 1. పొం గఁజేయు. "శా...తజ్జలధినీ రుబ్బింప..." హర. ౬, ఆ. ౮౭. 2. వృద్ధినొందఁజేయు, పెంచు. "సీ. ఉత్సాహ మొదవ మై నుబ్బించె నేనియుఁ బచ్చిగోడలజాడ విచ్చుదిశలు." ఉ. రా. ౨, ఆ. ౧౯౬. 3. ముఖస్తుతిచే నానందిం పఁజేయు. "సీ...వారిఁ యుబ్బించువారి కిచ్చు." విక్ర. ౭, ఆ. ౧౨౪.

ఉబ్బు. వై. అ. క్రి. (సం. ఉల్బణమ్.) 1. పొంగు. "క...నదు లెల్ల నుబ్బి పఱదలు వాఱెన్." వి. పు. ౭, ఆ. ౧౫౬. 2. ఉద్ధత మగు. "సీ...ఎట్లు బ్బెనో విరహబాష్పోదకములు." నైష. ౮, ఆ. ౧౬౮. రం.రా.అర. పు.౧౩౦. 3. అతిశయించు. "సీ...ఒకదీవిఁ బేరెండ యుబ్బి కాయు." కాశీ. ౧, ఆ. ౧౨౯. 4. గర్వించు. "క. తనలోకముఁ గొనియాడఁగ, విని యుబ్బఁడు సజ్జనుండు..." భార.ఉద్యో. ౨, ఆ. ౪౮., భార.విరా. ౧, ఆ. ౧౩౩. 5. వేడుకపడు. "గీ. ఉపనిషత్తులు వారిచే నుబ్బి వినును." ఆము. ౪, ఆ. ౪౩. 6. సంతోషించు. "ఉ. మాలి శిరంబుఁ ద్రుంచె క్షణమాత్రములో దివివేల్పు లుబ్బఁగన్." ఉ. రా. ౨, ఆ. ౭౯. 7. ప్రకట మగు. "గీ. కాన వచ్చిన యుబ్బులింగంబులకును,గానరాని నిగూఢ లింగంబులకును." కాశీ. ౩, ఆ. ౨౨౬. 8. విస్త రించు. "మ. బెరసెన్ మేన నిగిర్చినట్లు వళు లుబ్బెన్..." పారి. ౫, ఆ. ౪౬. వి. 1. పొంగు. "చ. సుదతిముఖేందుమండలము సొంపున రాగ రసాంబురాశి యభ్యుదయముఁ బొంది యెంత యును నుబ్బున వేల నతిక్రమించుచున్." నైష. ౩, ఆ. ౧౪౮. 2. సంతోషము. (భర్తకు) "ఉ...ఊరువు లొత్తిచిత్తమున నుబ్బొనరించుట ధర్మమింతికిన్. కాశీ. ౨, ఆ. ౮౧. 3. ఉత్సా హము; ఉత్సాహకారణము. "చ...పర్వవచనం బుల సేనకు నుబ్బొనర్చుచున్..." భార.శల్య. ౧, ఆ. ౭౩. "చ...దేవతలపారణ మంబుధి యుబ్బు లోచనోత్సవము..." భా. రా. సుం. ౧౭౦. 4. విజృంభణము. "ఉ. పాండునృపాల నందనులు పావని మున్నుగ నేచి...సేన తమ యుబ్బున కుబ్బఁగ...నిర్వికారులై." భార. భీష్మ. ౧, ఆ. ౨౩౪. 5. అతిశయము. "ఆ. నువ్వుఁబువ్వు నవ్వుజవ్వనినాసిక, చివురుసవురు జవురు నువిదమోవి,మబ్బునుబ్బు గెబ్బు బిబ్బోకవతివేణి." విజ. ౧, ఆ. ౮౪. 6. ఒకవ్యాధి. (ఉదా:—ఉబ్బురోగము. మల మూత్రములు బంధించు రోగము.) ఉష్ణము. "తే...ఉబ్బు నుమ్మయొక్క...ఊష్మాఖ్యతా." ఆం. భా. ప్ర. ౮౨. 7. జనశ్రుతి. "సీ...ఉబ్బునాఁగను జన శ్రుతి దనర్చు." ఆం. భా. ప్ర. ౧౧౨. విశే. ఉన్నతము; దృఢము. "సీ. కలిమిగుబ్బెతమిన్న

గబ్బినిబ్బరపుబ్బుగుబ్బ రాజక్క_వ గిబ్బజోడు." దశా. ౧, అ. ౧౬౪., ఆం. భా. తృ. ౧౬.

ఉబ్బుఁగుడుము. దే. వి. (ఉబ్బు+కుడుము.) మినుప పప్పు బియ్యము నానవేసి రుబ్బి నీటియావిరిపై నుడికింపఁగా నుడికెడి స్థూల మగునిడ్డెన. "సీ... బొబ్బట్లసెలంబు లుబ్బుఁగుడుము,సారువలు..." శ్రీ రం. మా. ౬, ఆ. ౧౧౦.

ఉభయచరము. సం. విణ. (అ. ఈ. అ.) రెండిటఁ దిరుగునది. (తాఁబేలు, పక్షి, మొ.)

ఉభయము. సం. వి. అ. న. ప్రజానీకము చేయు ధర్మకార్యమునకు వంతుప్రకార మొక్క_ రిచ్చెడుసొమ్ము. స. (అ. ఈ. అ.) 1. రెండవయవములు గలది. 2. రెండు.

ఉభయతోముఖి. సం. వి. ఈ. స్త్రీ. ఈనుచున్న యావు. "వ...గాయత్రీజప పరాయణుల నుభయతోముఖి గోప్రదాతల..." కాశీ.౨,ఆ.౩౧.

ఉమ. సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి. 2. కీర్తి. 3. పసుపు. 4. కాంతి. 5. శాంతి. 6. నల్లగిసె ✿.

ఉమాచతుర్థి. సం. వి. ఈ. స్త్రీ. జ్యేష్ఠశుద్ధ చతుర్థి. (ఇది పార్వతి పుట్టినదినము.)

ఉమాదము. వై. వి. (సం. ఉన్మాదః.) ఉన్మాదము, పిచ్చి. (శ. ర., బ్రౌ.) (రూ. ఉమ్మాదము.)

ఉమాపతి. సం. వి. ఇ. పుం. శివుఁడు.

ఉమాప్రియము. సం. వి. అ. పుం. నీపము, కడిమి✿.

ఉమావృతము. సం. వి. అ. పుం. అక్షోటము, కొండగోలుగు ✿.

ఉమాసుతుఁడు. సం. వి. అ. పుం. 1. విఘ్నేశ్వరుఁడు. 2. కుమారస్వామి.

ఉమి. వై. వి. (సం. ఊర్మిః.) 1. ఉమ్మి, ఉమిసిన ద్రవము. "క. క్రమ మఱి శూద్రుఁడు విప్రో, త్తముపైనిఁ దప్పు లేక తా గర్వితుఁడై,యుమిసినఁ బెదవులు గోయుట,యుమికొలఁ దినిపించు టుచిత మర్వీశులకున్." విజ్ఞా. ప్రా. కాం. ౪౬. 2. ఉమ్మివేయుట. "సీ. నాసాపుటంబులు మూసి యుమల్ మాని..." శివధ. ౭, ఆ. ౫.

ఉమియు. వై. అ. క్రి. ఉమ్మివేయు. "ఆ. నీవు సూచుచుండ నీయిష్టుఁ డిమ్మఱి,మంతుఁ డిప్పుడు దనను మదముపెర్మి,నన్ను నుఱక యుమిసె నామీఁద నిట్టియ,ద్దనుజుఁ డీల్గు నొక్క_ మనుజు చేత." భార. అర. ౪, ఆ. ౩౧. స. క్రి. 1. వెడలఁగ్రక్కు. "క. ద్యుమణికరాళి మెఱుగ్గై, యమపనశశి గలయఁ గూర్చి హవ నౌటయుం న,య్యమృతపుబింద మెక్రమ్మఱ, నుమిసెడునన్ గలయఁ గరక లుడుగక రాలెన్." ఆము. ౪, ఆ. ౯౫. 2. నోటినుండి పాఱవేయు. "సీ. కొని బాలురైనను దిని పిప్పి యుమిసెడు చెఱకువి ల్లని నమ్మి చేతఁ బట్టి." కు. సం. ౪,ఆ. ౭౫. 3. వెలువఱచు. "క. ఎఱమంట లుమియు మాద్యు_లఁ,జుఱచుఱఁ జూచుటయు ..." హరి. పూ. ౨, ఆ. ౬౬.

ఉముక. దే.వి. (త. ఉమి. క. ఉయ్.) ఊఁక,తుషము. "ఉ. గాడిపరూపుఁ దాల్చి యుముకల్ దినుచుండఁగఁ జూచి..." భార. శాం. ౪, ఆ. ౩౯౬.

ఉమెత=ఉన్మత్త, "క. ముది మది దప్పెనొ పైత్యము,గదిరెనొ యటు గాక యుమెతకాయ నమలితో." చెన్న. ౨, ఆ. ౩౫.

ఉమేజువారీ. హిం. వి. ఉమేజువారుపని.

ఉమేజువారు. హిం. వి. పని సరిగా జరుగుచున్నదో లేదో యని కనుపెట్టి చూచువాఁడు.

ఉమ్మ. వై. వి. (సం. ఊష్మా.) ఊష్మము, ఉబ్బ. "సీ...బీఱెండతో నెసఁగె నుమ్మ,యీఁగ మిక్కు_ట మయ్యె..." హరి. పూ. ౭,ఆ. ౧౬౦.

ఉమ్మగిల్లు. వై. అ. క్రి. 1. ఆవిరిచే నుడుకు. (శ.ర.) 2. వార్చి యుంచినయన్నము మొదలగునవి పాత్రవేఁడిమిచే నుడుక నందలితడి తొలఁగు. "వ. లోన నుమ్మగిలి గబ్బువలవక కమ్మతావులు గలనాపురాకులు పఱచి..." స్వా. ౪, ఆ. ౬౦.

ఉమ్మడి. దే. వి. ఉంబళిక. "సీ. శ్రీరంగవిభుఁ బ్రతిష్ఠించి యర్వదివేలుమాడ లద్దేవునుమ్మడికి నొసఁగె." జై. ౧,ఆ. ౩౨. విణ. 1. అవిభక్తము. "ఉ. ఉమ్మడిసొమ్ము గానఁ దనయోపినయంతయు

నన్నివంకలన్, నెమ్మదిఁ బొఱఁ జల్లుచును నీర్గెడుఁ దాన ప్రదాత నంచు..." భో. ౬, ఆ. ౧౩౭. **2.** ఏకము. "గీ. మంపు దులకించు ముత్తిగ మానికముల, మొలకనిద్దాకడానిసొమ్ములమె ఱుంగు,లుమ్మడిగఁ గ్రమ్మి నెమ్మేన నొఱపుఁ జూప." రసిక. ౩, ఆ ౪౭. అవ్య. ద్రు. ఏకకాలమున. (ఇది తఱచు ఒక్క శబ్దపూర్వముగాఁ గన్పట్టుచున్నది.) "మ...ఆ, బలియుం డేయు మెఱుంగుటమ్ము లసమొప్పన్ ద్రుంచువాఁ డుమ్మడిన్." అచ్చ. యు. ౩౪౬. "క. కృతవర్మయుఁ గృపుఁడు గురుఁడు...అ, చ్యుతునల్లుని బొదివి రొక్కయుమ్మడిఁ బెలుచన్." భార. ద్రో. ౨, ఆ. ౯౨. "ఉ...ఒ,క్కుమ్మడి మ్రోసె ..." హరి. పూ. ౧, ఆ. ౧౧౩.

ఉమ్మదము. వై. వి. ఊష్మము, ఉక్క. "చ. పటుతరవిక్రమస్ఫురణఁ బాశుపతంబులు రెండుఁ బోరఁగా,...ఉమ్మదము వుట్టెఁ జెమర్చెఁ బురాణకూర్మముల్." శివరా. ౧, ఆ. ౯౦.

ఉమ్మనీరు. వై. వి. (ఉమ్మ+నీరు.) ప్రసవజలము, ప్రసవ మగుటకుముందు వెలికి వచ్చునీరు. "గీ. ఉర్విఁ గాదంబినులఁ గలయుమ్మనీరు,తొరుఁగఁ గేకులు కేకులుతోన చేసె." ఆము. ౪, ఆ. ౭౯.

ఉమ్మలము. దే. వి. దుఃఖము, శోకము. "క. కనకమయయూప మొప్పఁగ,ననూనవిభవమున నీవు యాగం బొనరిం,చినయొప్పును నిప్పటి నీ,యునికియునుం జూచి నాకు నుమ్మల మయ్యెన్." భార. శాం. ౪, ఆ. ౩౯౦., భార. విరా. ౨, ఆ. ౮౦.

ఉమ్మలి. దే. వి. ఉబ్బలి. "గీ. ఉమ్మలి యవుఙు జవుకు నా నొప్పుఁ బంక,ము..." ఆం. భా. ప్ర. ౧౫౫.

ఉమ్మలించు. దే. అ. క్రి. **1.** బాధపడు. "గీ. ఒక్కరేయి నీపాల నాథునికి గాఁగఁ, బలికికొన్నారమది చెల్లె నలఘుచరిత,పోయి వచ్చెద నని దివంబునకుఁ బోవ,నుత్సహించె నమ్ముని మది నుమ్మలింప." భార. శల్య. ౨౧౩. "గీ. తనకులంబునఁ బుట్టినధార్తరాష్ట్రు, లన్నదమ్ములతో విగ్రహంబు గొనుట, కుమ్మలించి వివర్ణత నొందినట్లు, గంది యెంతయుఁ జెలువేడెఁ జాదురుండు." భార. ఉద్యో. ౧, ఆ. ౬౦౭. **2.** తాపము నందు. "వ...ఓసరిల్లుచు నుష్హానుచు నుమ్మలించుచు ..." కాశీ. ౨,ఆ.౧౩౮., నిర్వ. ౮,ఆ. ౧౩౪.

ఉమ్మలింపు. దే. వి. (ఉమ్మలించు ధా.) ఊష్మము, ఉక్క. ఆం. భా. ప్ర. ౮౭.

ఉమ్మలిక. దే. వి. **1.** దుఃఖము. "క. ఇమ్మహి యెల్లను నీమది,యుమ్మలికకుఁ జాల నొచ్చె నుర్వీవర ..." భార. ఉద్యో. ౧, ఆ. ౧౦౭. ("దుఃఖ నైవ్యతస్యమహాతో ధార్తరాష్ట్ర కృతస్యవై." అని మూలము.) స్వా. ౬, ఆ. ౧౪. **2.** కష్టము. "సీ. నలునిపిఱుందఁ గానల కేఁగి దమయంతి మనుజులు పడనియుమ్మలిక పడెఁ." భార. విరా. ౨, ఆ. ౨౩౪.

ఉమ్మలికము=ఉమ్మలిక. **1.** దుఃఖము. "గీ...అజాత,వైరి యల్లన నకులునివలను సూచి, నెమ్మనంబున నుమ్మలికమ్ము గదుర,నెలుఁగుచందంబు వేఱుగా నిట్టు లనియె." భార. విరా. ౧, ఆ. ౯౧; **2.** కష్టము. "వ. ఇవ్విధంబునఁ గృష్ణునితోడఁ దన యుమ్మలికంబు లన్నియుఁ ద్రవ్వికొని శోకంబు వెల్లిగొన." భార. ఉద్యో. ౩, ఆ. ౧౯౧.

ఉమ్మలికాఁడు. దే. వి. అధికారి. "చ. శ్రవణయుగాంతరావరణ చక్రము లుగ్గలు బట్టుతోరపుం, జెవుడుకనీనికా వసుధ నీమకు నుమ్మలికాఁడు." వేం. పంచ. ౧, ఆ. ౩౭౯.

ఉమ్మలికించు. దే. అ. క్రి. దుఃఖించు. "ఉ...నీకు నిది ప్రాణభయం బగు నన్న నాత్మలో,నుమ్మలికించుచున్ సతుల నొల్లక యుండెను..." వి.పు. ౫, ఆ. ౩౦౦., భార. భీష్మ. ౩, ఆ. ౪౧౫.

ఉమ్మాదము. వై. వి. (సం. ఉన్మాదః.) చిత్తవిభ్రమము, పిచ్చి. ఆం. భా. ప్ర. ౧౩౬.

ఉమ్మాయముత్తియము. ద్వా. వి. క్షుద్రమౌక్తికము. (శ. ర.)

ఉమ్మి=ఉమి. (శ. ర. వా.)

ఉన్మైత=ఉన్మైత్త. "సీ. పరువంపుఁగ్రొమ్మావిపండు లేపున మెక్కుచిలుక గాటఁపుటున్మైతఁకుఁ జను నె." నీలా. ౧, ఆ. ౭౬.

ఉన్మైత్త. వై. వి. (సం. ఉన్మత్తః.) దుత్తూరము. "సీ. ఒక్కజాత్రఁపుబొమ్మ యున్మైత్తవిరిచాయ నందమాపావడ యంది యిచ్చె." దశా. ౭, అ. ౨, ఆ. ౩౨౧.

ఉమ్యము. సం. వి. అ. న. నల్లగిసె బయలుదేఱు పొలము.

ఉయాల=ఊయెల. "సీ. నిలువుటద్దములు గంటల యుయాలలు హంసతూలికపాన్పులు దోమతెర లు." షోడశ. ౩, ఆ. (శ. ర.)

ఉయెల = ఊయల. (శ. ర.)

ఉయ్యల=ఊయెల. "క...ఉయ్యల నూఁపుచుఁ బెనుపఁ దొడఁగె నావరశిశువున్." కళా. ౬, ఆ. ౧౯౩.

ఉయ్యలచేరుపిట్ట. ద్వ. వి. (ఉయ్యెల+చేరు+పిట్ట.) సారసపక్షి, బెగ్గురు. ఆం. భా. ద్వి. ౯౪. ఇట్లే: ఉయ్యలపులుఁగు. ఆం. భా. ద్వి. ౯౪. ఉయ్యాలచేరుపులుఁగు. వేంక. తిర్య. ౧౦౨.

ఉయ్యాల=ఊయెల. "సీ. ఔఁదలఁ జవలేటిలేఁదరఁగలు బాలుఁడగుచందమామ నుయ్యాల లూఁప." హరి. పూ. ౬, ఆ. ౩౪., సాం. ని. స్థా. ౬౪.

ఉయ్యాలతొట్టి. ద్వ. వి. (ఉయ్యాల+తొట్టి.) తొట్ల, త్రాళ్లు గట్టి యూఁచెడు నుయ్యాల. "సీ. ఉయ్యాలతొట్టిలో నునిచి చేతులువట్టి యూఁచియాడెడుపాట నుబ్బ నేర్చె." వి. పు. ౭, ఆ. ౧౨.

ఉయ్యాలమంచము. ద్వ. వి. (ఉయ్యాల+మంచము.) డోలామంచము. "మ. కొడుకుల్ బ్రహ్మలు కూఁతు రీశ్వరశిరఃకూటంబుపైఁ గాపురం, బుడురాజుం దినరాజుఁ గన్నులహిరా ణుయ్యాల మంచంబు నీ,సవతుల్ శ్రీయు ధరిత్రియున్..." ఒంటి. శ. ౧౫.

ఉయ్యెల=ఊయెల. "ఉ. శ్రీమదికిం బ్రియం బెసఁగఁ జేర్చినయుయ్యెలలీల..." పారి. పీఠి. ౧.

ఉయ్యేల=ఊయెల. "సీ. ఉయ్యాల యుయ్యేల యూరెల తొట్ల..." సాం. ని. స్థా. ౬౪.

ఉరంగమము. సం. వి. అ. పుం. సర్పము, పాము.

ఉరఃకిరణము. సం. వి. అ. పుం. ఉష్ట్రము, లొట్టిపిట్ట.

ఉరగము. సం. వి. అ. పుం. 1. ఉరముతో గమించునది. పాము. 2. సీసము. 3. ఆశ్లేషానక్షత్రము. 4. నిడుపైన చేఁప. 5. జెలగ.

ఉరగి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుపాము.

ఉరడించు=ఉరవడించు. "క. జ్వరవర యే నుండఁగ నీకొరకుఁ దొడరఁగఁ దగునె రమ్మ యురడింపుము నీపరు వెల్లఁ జూపు..." హరి. ఉ. ౯, ఆ. ౧౧౭. (శ. ర. పా.)

ఉరణము. సం. వి. అ. పుం. 1. గొఱ్ఱెపోతు. 2. తగిరిస .

ఉరణి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుగొఱ్ఱె.

ఉరభ్రము. సం.=ఉరణము.

ఉరమరిక. దే. వి. రమారమి. (శ. ర.)

ఉరము. సం. వి. స్. న. వక్షము, ఱొమ్ము.

ఉరరీకరించు. సం. స. క్రి. సమ్మతించు. "గీ. దరము చెలువంబుఁ దఱుముకంధరమువాని,నరరి నురరీకరించుపేరురమువాని." చం. రా. ౩, ఆ. ౯౯.

ఉరరీకారము. సం. వి. అ. పుం. 1. సమ్మతి. 2. విస్తృతము చేయుట.

ఉరరీకృతము. సం. విశే. (అ.ఆ.అ.) 1. సమ్మతింపఁబడినది. 2. విరివి చేయఁబడినది.

ఉరరీకృతి. సం. వి. ఇ. స్త్రీ.=ఉరరీకారము.

ఉరలఁద్రోచు. దే. స. క్రి. (ఉరలన్+త్రోచు.) 1. దొర్లించు. "క. తరువం బెట్టిఁ బానల..., ఉరలం ద్రోచుచును బోవు నుక్కివపు గతిన్." హరి. పూ. ౫, ఆ. ౨౦౩. 2. మీఱు. "క... శ్రుతిధర్మం,బురలం ద్రోవఁగ నగునే..." నృసిం. ౪, ఆ. ౯౪.

ఉరలఁబడు. ద్వ. అ. క్రి. (ఉరలన్+పడు.) 1. దొర్లు. (శ. ర.) 2. కూలు. "గీ. బలుపుఁ బప్పుల తీరంబు లురలఁబడఁగ." నైష. ౬, ఆ. ౧౨౪.

ఉరలఁబాఱు. దే. అ. క్రి. (ఉరలన్+పాఱు.) చలించు, బెదరు. "మ...నీబలం, బురలంబాఱఁగ భీష్మువైఁ గవిసె..." భార. భీష్మ. 3, ఆ. ౨౬3.

ఉరలు. దే. అ. క్రి. 1. పడు, రాలు. "చ...శిరం, బురలఁగ నాటువడ్డజలజోద్భవుకంటెను బెద్దవే..." కు. సం. ౪, ఆ. ౭౬. 2. దొర్లు. "క. పడిగొని కులగిరిఁ దరువఁగ,జడనిధిఖగమకర కమఠఝషఫణిగణముల్,సుడివడఁ దడఁబడఁ గెలఁకులఁ,బడు భయపడి సెగసి బయలఁబడు నురలి పడున్." భాగ. ౮, స్కం. ౨౧౨. 3. పగులు, బీఁటలుదీయు. "వ... వెనుబొబ్బలం బ్రహ్మాండకటాహంబు నిర్భరం బయి గుబ్బుగుబ్బని యురల..." భాగ. ౮, స్కం. ౨౦౮. 4. దగ్ధమగు. "గీ. వెటిలె బ్రహ్మాండభాండంబు చిటిలె దిక్కు,లురలె పాతాళభువనంబు లుదిలె నభము." భీమ. ౪, ఆ. ౬౧. ('సప్తధో భువనాన్యాసన్నిర్దగ్ధాని సమం తతః' అని మూలము.) 5. స్రవించు. "సీ. తోయజదళములతుది మంచు తొరఁగెడుగతిఁ గన్నుఁగవ నశ్రుకణము లురల." భార. విరా. ౨, ఆ. ౧3౮. 6. వీడు. "క. నటనోద్భటుఁ డైనమహా,నటునిజటాజూట మురలినం దొరఁగుమరుత్కూటకనది యిది..." పాండు. ౧, ఆ. ౧3౮.

ఉరలుకొను. దే. అ. క్రి. (ఉరలు+కొను. స్వార్థమున.) వీడు, కోలుపోవు. "సీ. అఖిలజీవులు నిజవ్యాపారశూన్యులై యున్నతతేజంబు లురలుకొనఁగ." భాగ. ౨, స్కం. ౨౬౬.

ఉరవడి. ద్వ. వి. (ఉరవు+పడి.) 1. మిక్కిలివేగము. "క...ఇమ్మోహరమునకును డాపలించి యరదముఁ బోనీ, మ్మురవడిన్..." భార. విరా. ౪, ఆ. ౨౪౬. 2. వేగము. "చ. ఇరువురు నీలనీరజనిభేక్షణ లించినవేడ్కతోఁ బరస్పర మెదిరించి కాంచనపుబందులఁ దచ్చునవాటు లాడఁగా, ధరణిపుఁ డడ్డమై చనుడుఁ దద్భుజదండముఁ దాఁకి మిట్టి మిట్టురవడిఁ జెండు గ్రమ్మఱిన నుబ్బరపోయిరి భామినీజనుల్." నైష. 3, ఆ. ౯౫. 3. అతిశయము, ఆధిక్యము. "సీ. ఉరవడిఁ బ్రాగ్దిశి నుదయించు మార్తాండకోటిబింబచ్ఛాయఁ గూడినట్లు." భాగ. ౬, స్కం. ౧౭. 4. శౌర్యము. "క. కురుబలముఁ దొడరి గెలువఁగ,సురగణముల కైన నరిది శూరోత్తమ నీ, వురవడి గెలిచితి భాగ్యస్ఫురణంబును బాహుబలముఁ బొగడం దగదే." భార. ద్రో. ౫,ఆ.౭. 5. విజృంభణము. "చ. పొరిఁబొరి నార్చుచుం గవిసి భూరితరంబుగ గర్జదభ్రముల్, ఖరకరుఁ గప్పినట్లు రణకర్కశు నారఘువీరుఁ గప్ప నా, యురవడి నూచి..." భా. రా. అర. ౧, ఆ. ౧౯3. (ఈపదము లఘురేఫయుక్త మనుట కిన్నినిర్ధారక ప్రయోగము లుండఁగా. కాశీ. ౨, ఆ. ౪౫. లోని తప్పు పాఠమును గ్రహించి సూ. ని. అలఘురేఫ మనియు నన్నది. ఇది చింత్యము.)

ఉరవడించు. ద్వ. అ. క్రి. 1. వేగిరపడు. "ద్వి. ఉరవడింపకుఁడు వహ్వాహో మాను మానుఁ, డరసి కార్యము చూత మని విభీషణుఁడు." రం. రా. యు. ౨౫౧, పు. 2. విజృంభించు. "సీ. కసిమసంగి నమారి గడఁగి జీవులమీఁద నుగ్రతఁ గవియున ట్లురవడించి." భార. ఉద్యో. ౨, ఆ. ౧3౯. 3. పరాక్రమించు. "వ...ఆయుద్ధంబు లెత్తికొని తత్తఱంబున రణాంబునకు నురవడించు రక్కసుల..." భాగ. ౭, స్కం. ౧౯౯.

ఉరవణించు=ఉరవడించు. 1. వేగిరపడు. 2. చెలరేఁగు. "గీ. సారవంతమై కర్ణునిసైన్య మురవణించుఁ గాకేమి దీనికి నృపవరేణ్య, పూని చేయంగవలయుఁ బ్రధానకార్య, మతని సమయించుటయ నాకు నది భరంబె." భార. కర్ణ. ౨, ఆ. ౧౪౮. 3. ఎదుర్కొను, ప్రతిఘటించు. "చ. యజనము దానకర్మమును...సంగరంబునన్, విజితవిభీతియై నురవణించుటయున్ నృపధర్మముల్..." భార. శాం. ౨, ఆ. ౨౨౪. 4. దండెత్తు. "వ...అంత సమస్తసైన్యంబులు సన్నద్ధంబులు గావించి వివిధాయుధంబులు ధరించి సుధాశనులు మహాదేవిం బురస్కరించుకొని

మహిషునిమీఁదికి నురవణించిన." మార్క. ౬, ఆ. ౪౦.

ఉరవు. వై. వి. (సం. ఉరః.) వక్షస్థ్సలము. ఆం.భా. ద్వి. ౧౩౭.

ఉరశ్ఛదము. సం. వి. అ. పుం. కవచము.

ఉరసము. సం. విణ. అ. న. శ్రేష్ఠము. (ఇది సమాసోత్తరపదముగనే యుండును:—వనితోరసము.)

ఉరసిజము. సం.=ఉరోజము.

ఉరసిలుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. వెడఁద యైన వక్షస్థ్సలము గలవాఁడు. 2. పరాక్రమము గల వాఁడు.

ఉరసుఁడు. సం.=ఉరసిలుఁడు.

ఉరస్త్రాణము. సం. వి. అ. న. ఉరశ్ఛదము, కవచము.

ఉరస్కుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఉరముకల వాఁడు. "మ...సంహతోరు కఠినోరస్కుండు ..." హరి. పూ. ౪, ఆ. ౯౯.

ఉరస్ఫుటనము. సం. వి. అ. స. రతిబంధవిశేషము.

ఉరస్యుఁడు. సం. వి. అ. పుం. పురుషునకు ధర్మపత్ని యందుఁ బుట్టినకొడుకు, ఔరసపుత్త్రుఁడు. విణ. (అ. ఆ. అ.) శ్రేష్ఠుఁడు.

ఉరస్వంతుఁడు. సం. విణ. (త్. స్వతీ. త్.) ఉరసిలుఁడు.

ఉరసూత్రిక. సం. వి. ఆ. స్త్రీ. ఉరఃపర్యంతహారము, ఱొమ్మువఱకు వ్రేలు ముత్యాలహారము.

ఉరళించు. దే. అ. క్రి. వెలుఁగు, ప్రకాశించు. (శ. ర.; బ్రౌ.)

ఉరి. దే. వి. (క. ఉరల్.) 1. ఉచ్చు, వాగుర. "గీ. ద్రౌపదీరూప మనునురిఁ దగిలి తనదు, హృదయ మనుమృగ మత్తరి నుదిలకొనుచు." భార. విరా. ౨, ఆ. ౨౪. 2. కంఠపాశము. "గీ. వానిఁ దెగఁజూడ వైతేని వాయుపుత్త్ర,నీవు గనుఁగొన నురినైన నీరనైన, నగ్నినైన విషంబునవైన నేను, మేను దొఱఁగుదు..." భార. విరా. ౨, ఆ. ౨౯. 3. చోరసాధనవిశేషము. "చ...మైలమందు గొయ్యయు నురి గ్రొంకి నారసము నాదిగఁ గల్గినసాధనంబు లన్నియు సమకూరఁ జేసికొని నేప్పన నేఁగితి ముచ్చుప్రొద్దునన్." దశ. ౯, ఆ. ౭౨.

ఉరిగోల. దే. వి. (ఉరి+కోల.) చిన్న జంతువులను పక్షులను పట్టుకొనుటకై చివర నురిపెట్టి కట్టిన నిడుపాటికోల. "క. కట్టలుకఁ దడుపుచాటునఁ, బిట్టల నురిగోలఁ దిగిచి బిఱుసున తెక్కల్, పట్టి విఱిచి..." భాగ. ౭, స్కం. ౯౯.

ఉరిడె. దే. వి. కుమ్మరిపురుగు, యమకీటము. "గీ. ఉరిడెపురు గెల్లవేళల బురదలోనె, పొరలుచుండి యుఁ బంకంబుఁ బొందనట్లు." రుక్మ. ౪,ఆ.౩౬.

ఉరిత్రాడు. దే. వి. ఔ. (ఉరి+త్రాడు.) కంఠపాశము. "సీ. పసిఁడిగాజులు పైకి వెసఁ ద్రోచి నునుఁదీఁగఁ దెమలించునురిత్రాడు నెమకుకరణి." స్వా. ౩, ఆ. ౩౧.

ఉరిదీయు. దే. స. క్రి. ఉరిపోసి చంపు. (వా.)

ఉరియాట. దే. వి. (ఉరియాడు ధా.) 1. ఉరియాడుట, ఊఁగులాడుట. (శ. ర.) 2. ఆందోళనము, కలవరపాటు. 3. సంశయము, సందేహము. "గీ. మీరు సెప్పంగ నురియాట మేలె రాజ్య, కాంక్ష మిగిలి యేఁ జంపంగఁ గానియట్టి, వారిఁ బలువురఁ జంపిన క్రూరతావిశేష మాత్మ దహించుటఁ జేసికాక." భార. శాం. ౧, ఆ. ౨౭౯. ('న తేభిశంకే వచనం యద్బ్రవీషి తపోధన' అని మూలము.)

ఉరియాడు. దే. అ. క్రి. 1. సంశయించు, సందేహపడు. "చ. మన మురియాడుచుండ ననుమానముతోన సుదేష్ణఁ జూచి..." భార. విరా. ౨, ఆ. ౧౦౨. 2. కళవళపడు, కలఁగు. "గీ. ఇట్టు లురియాడుచిత్తంబు నెట్టకేని, నాథుచెప్పిన ధర్మంబునకుఁ జొరంగ,నూలుకొల్పి..." భార. ఆర. ౧, ఆ. ౭౩. 3. చెదరు, విడివడు. "మ. కచభారం బురియాడి వెన్నొరయ..." చిత్ర.భా. ౮, ఆ. ౬౦. 4. గద్గదిక మగు. "ఆ...గళమున నెలుఁ గురియాడ వగచి యమ్మురాంతకుండు." భార. శల్య. ౨, ఆ. ౩౬౧.

ఊరియు. దే. అ. క్రి. (క. ఊరి.) **1.** చలించు, కంపమందు. "గీ. కౌను లురియంగఁ బిఱుఁదులు గదలి మేఖలావళులు గదలింప నేత్రాంశు లలర." హరి. పూ. ౮, ఆ. ౧౬౮. (శ. ర. పా. 'కౌను గునియంగ' ముద్రి.) **2.** నెరయు, తెల్లపడు. "చ. ఊరిసిన పల్లవెండ్రుకలు నూడినదంతములు ..." హంస. ౨, ఆ. ౩౪. **3.** పక్వమగు, ఉడుకు. "వ...తన సవరించిన కాష్ఠంబులు క్రమంబున నిడి యనలంబుఁ బ్రబలంబు సేయం గాష్ఠంబులు సమసెఁ గాని యూరేఁగుఁబం డ్లూరియు వయ్యె." భార. శల్య. ౨, ఆ. ౧౯౨. ('న చ స్మ తా న్యపచ్యంత.' అని మూలము.) **4.** పరితపించు, దుఃఖపడు. "ఆ. తల్లులార కరము తప్పుయి తోఁచుట్సల్ల మలఁత పేర్మి నురియు చుండు." భార. మా. ౨౦౧. **5.** కాలు, దగ్ధమగు. "ఆ. ఉదరవహ్నిచేత నురియుచుండియు నేను, జూడఁ గడఁగి యిట్టిపాడుఁ గుడువ, నొల్లను..." భో. ౩, ఆ. ౫౩. **6.** రేఁగు, రాయిడి నందు. "గీ. అరులు మనమీఁద నురవడి నరుగుదేర, నేము సిడిముడిపడుచుండ నిట్టు లనుట, యొప్ప దురిసినపుండుల నుప్పు వెట్టె, దరయ దీనికి నిన్ను నేమందుఁ బార్థ." భార. ద్రో. ౫, ఆ. ౩౫౮.

ఊరివిడి. దే. వి. వృక్షవిశేషము. (ఆం. పా.)

ఊరిపోయు. దే. అ. క్రి. (ఊరి+పోయు.) ఊరి పోసి కొని చచ్చు. వా:—ఆయపకీర్తి పడలేక యామె యురిపోసికొన్నది. స. క్రి. ఊరిదీయు. (శ. ర., వా.)

ఊరీకారము. సం. వి. అ. పుం.=ఊరరీకారము.

ఊరీకృతము. సం.=ఊరరీకృతము.

ఊరు. వై. అ. క్రి. (సం. ఊర్జ్.) **1.** మేలగు, శ్రేష్ఠమగు. "చ. వెనఁగక ప్రాణరక్షణ ముపేక్ష యొనర్చుట పాప మిందుకై, కనలకు నాకు మేనియెడఁ గాంక్షయు లే దిది పోవుటే యురున్." ఆము. ౬, ఆ. ౭౮. **2.** తగు, ఉచితమగు. "క...క్రియన్, విసువక పరిశుద్ధి జీవునికిఁ జేయుటురున్." భార. శాం. ౫, ఆ. ౪౧౭.

ఊరుక్రముఁడు. సం. వి. అ. పుం. విష్ణుమూర్తి, వామనుఁడు.

ఊరుజి. దే. వి. (క. ఊరసు.) **1.** వ్యాప్తి. (చూ. ఊరుజగొను.) **2.** ఒకవిధ మగుచేఁప. (శ. ర.)

ఊరుజిగొను. దే. అ. క్రి. (ఊరుజ+కొను.) వ్యాపించు. "వ...అందియలరవళితోడం గూడి మట్టియలమ్రోఁత త్రిభువనంబుల నురుజగొన..." భీమ. ౨, ఆ. ౧౧౦.

ఊరుటు. దే. వి. **1.** ఊంగరము. **2.** కంపితస్వరము. "సీ. అంగహారముఁ జూపి యంగాధిపు మనోహరాంగహారముఁ గొన్నయబ్జవదన, యురుటెంత గనిపించి హూణాధ్యు కెంగేలియురుటుఁ గైకొన్ననీలోత్పలాక్షి." బహు. ౫, ఆ. ౬౩. (రెం డర్థములకు నిది యుదాహరణము.)

ఊరుఘోడ. దే. వి. మల్లవిద్యయందలి పదునాలుగు విసరులలో నొకటి." హంస. ౧, ఆ. ౨౦౬.

ఊరుబుకము. సం. = ఊరుబూకము.

ఊరుబూకము. సం. వి. అ. పుం. ఆముదము ♆.

ఊరుమ. దే. వి. చర్మవాద్యవిశేషము. "వ. ఊరుమ గీసినగతిం దేఁటి మ్రోసినక్రియ నాదొఱక..." స్వా. ౪, ఆ. ౧౦౫.

ఊరుముంజి. దే. వి. (హి. ఆర్మజ్.) దేశవిశేషము. "సీ. సింహళంబున గంధసింధురంబులు తెచ్చి యురుముంజి బలుతేజిహరులు దెచ్చి." హర. పీఠి. ౨౫, సా. ౨, ఆ. ౬౨. (రూ. హురుముంజి.)

ఊరుముడు. దే. వి. ఒకానొకచెట్టు. (శ. ర., బ్రా.)

ఊరులు=ఊరలు. **1.** పడు, రాలు. "క. అప్పుడు ధృష్టద్యుమ్నుఁడు, నిప్పు లురులుచూపు లడరి నిశితాస్త్రములం, గప్పె గురుని..." భార. ద్రో. ౧, ఆ. ౧౫౬. **2.** దొరలు, జాఱిపడు. "క. డెందము కలంగఁ గన్నీ, రందంద మొగంబుమీఁద నగ్గల మురులన్." భార. మా. ౧౯౬. "వ... అశ్రుజలంబు లురుల నేడ్చుచున్నం జూచి ..." భార. ఆర. ౨, ఆ. ౧౪౬.

ఊరువడి=ఊరవడి. (మిక్కిలివేగము.) "సీ. ఉరువడిఁ బఱతెంచి యురుపక్కియలు దాఁకి గంధసింధుర కోటిఁ గనుపుకొట్టి." రాజ. చ. ౨, ఆ. ౭౫.

ఊరువడు. ద్వ. అ. క్రి. (ఊరువు+పడు.) నెఱవేఱు, సిద్ధించు. "క. నీప ట్టురువడ నొక్కఁతెఁ, జూపి యొకతె గర్వ మడఁచుచుఁ బలయు గతిన్, బ్రాప్తింపవచ్చు భోగము, నీపుణ్యం బిను మడించి నేఁడు ఫలించెన్." కళా. 3,ఆ.౨౧౧.

ఊరువణించు. దే. అ. క్రి. ఊరవణించు, పరాక్రమించు. "వ. భీషణం బగుసేనయుఁ దానును నతని వెనుకొని చని యతిరయంబునం బురంబు చొర నురువణించిన." కళా. ౮, ఆ. ౭౩.

ఊరువు. ఉభ. దే. స. క్రి. 1. విడుచు, త్యజించు. "ఆ. క్షరము నక్షరంబుఁ గానంగఁ బోలువే, దార్థచింతనమున నమ్మిథునము, నందుఁ బూర్వ మురివి యపరంబు సేపట్టి, నిలుపవలయు నధిక నిష్ఠ కలిగి." భార. శాం. ౬, ఆ. ౧౪౪. 2. లేవనెత్తు. "సీ. ఒకలేమ మ్రొక్కిన నురివి నాఁ డిక్కడ రమణి మ్రొక్కినచొప్పు రమ్య మయ్యె." భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౯౯. 3. వెడలించు, వెలుపలుచు, "ఆ. నురువు లురువు వెడఁదనోళ్లతోడుత మోర, లెత్తికొనుచు వేఁదురెత్తినట్లు." భా. రా. యు. ౫౧౮. వి. 1. వస్తుస్వరూపము, మూర్తి. వా:—ఆ సామానులు మొత్త మెన్నియురువులు. "చ. హరునిగుఱించి వత్సరసహస్రము ఘోరతపంబు చేసి తత్కరుణ దుకూలకంథయును దండముఁ బావలు రత్నపాత్రమున్,వరమునఁ గాంచె మద్గురుఁ డపార ఙమైఁ బ్రబలాభిధానుఁ డీ, యురువులచేత న య్యెడుప్రయోజన మెల్లను చిత్తగింపుమా." విక్ర. ౨, ఆ. ౬. (తాళపత్రప్రతి పా. "ఉరు విడి"శ. ర. ముద్రి.) 2. విధము, రీతి. "గీ. తెలియ యధరంబు పవడంపుఁదీవె యురువు." విక్ర. ౬, ఆ. ౨౫. సం. విశే. (ఉ. ఉ, ర్వీ. ఉ.) 1. వెడఁద యైనది. 2. పెద్దది. 3. అధిక మైనది. 4. మే లైనది.

ఉరువుకము. సం. వి. అ. పుం. = ఉరువువు.

ఉరువువు. సం. వి. ఉ. పుం. ఎఱ్ఱాముదము ❀.

ఉరువూకము. సం. = ఉరుబూకము.

ఉరోజము. సం. వి. అ. పుం.—ఉరమునఁ బుట్టినది—స్తనము, చన్ను. (ఇట్లే ఉరోజాతము, ఉరోభవము మొ.)

ఉరోభువు. సం. వి. ఊ. పుం. ఉరోజము, చన్ను.

ఉర్మ=ఉఱుము. "గీ...కడిఁది యుర్ములు బెడబెడ యనంగ." ద్వా. 3, ఆ. ౯౭.

ఉర్లఁబడు. ద్వ. అ. క్రి. (ఉర్లన్+పడు స్వార్థమున.) కూలు, విఱిగిపడు. "మ...పరిఖాంభోనిధి లక్ష్యమాణపుర సౌభాగ్యంబు మించుచున్... వియద్గంగాతరంగాహతిన్, దరు లుర్లంబడి పెల్లగిల్లి పడు నానాకంబు చందంబునన్." చంద్రా. ౧, ఆ. ౧౧.

ఉర్లు=ఉరలు. (పడు, రాలు.) "ఉ...యక్షులు నక్షుల నిప్పు లుర్ల హర్యక్షములో యనన్..., రాక్షససేనఁ దాఁకిరి..." ఉ. రా. 3, ఆ. ౮.
2. దొర్లు, జాఱిపడు. "శా...విధాత తెమలెన్ బాఱెన్ సురౌఘంబు బ్రహ్మాండక్రోడకటాహ మర్లి పడె మ్రోయం జొచ్చె సంభోనిధుల్." జై. ౪, ఆ. ౨౮.

ఉర్లుపెంజెర. దే. వి. (ఉర్లు+పెంజెర.) దొర్లుచు గమించునొకజాతిపాము. "సీ. శంఖపాలకులును జాతినాగులు నుర్లుపెంజెరలును నెఱ్ఱపెంజెరలును." ద్వా. ౮, ఆ. ౧౦౦.

ఉర్వడి=ఉరువడి. (మిక్కిలివేగము.) "చ. ఒడిసెల రాతిచందమున నుర్వడి సింగిణికోల వాఱుకై, వడి..." సా. ౧, ఆ. ౯౩.

ఉర్వర. సం. వి. ఆ. స్త్రీ. 1. సర్వసస్యపరిపూర్ణ మగునేల. 2. నేల.

ఉర్వశి. సం. వి. ఈ. స్త్రీ.—గొప్పవారిని వశీకరించు నానునది—ఒకానొక యప్సరస, ఊర్వశి.

ఉర్వారువు. సం. వి. ఉ. స్త్రీ. ఉర్వారుకము, దోస ❀.

ఉర్వి. సం. వి. ఈ. స్త్రీ—విరివి గలది—1. భూమి. 2. లావుగా నున్నస్త్రీ.

ఉర్వీధరము. సం. వి. అ. పుం. కొండ.

ఊర్వీభృత్తు. సం. వి. త్. పుం. **1.** పర్వతము, కొండ. **2.** భూపతి, రాజు.

ఊర్వీరుహము. సం. వి. అ, హ్. పుం. భూజము, చెట్టు.

ఉఱక. దే. అవ్య. (ఉఱక, ఊరక యను వ్యతిరేకక్త్వార్థకరూపములే ప్రయోగములఁ గానవచ్చుచున్నవి. కాని, వీనిమూల ధాతువుల కితరరూపములు గానరావు. ఈపదము లఘురేఫ మని శ. ర., సూ. ని. కాని, నిర్ధారకప్రయోగముల ననుసరించి దీని నలఘురేఫముగనే గ్రహించుటయైనది.) **1.** మాటాడక. "క. వెఱచఱచియింత కంటెం,దఱచుగ బాణంబు లేసి తడయక పగ ఱం,జెఱుతు నని యిసుము చల్లుచు,నుఱక ధనంజయుఁడు రణజయోన్నతుఁ డరిగెన్." భార. సభా. ౨, ఆ. ౩౦౬. **2.** వ్యర్థముగ. "చ. ఎఱిఁగి యెఱింగి జీవమున కెగ్గు దలంచి దవానలంబులోఁ, నుఱుకుదురే రణంబు తెరు వొల్లము దుర్జయుఁడైనవీనితోఁ, నుఱక పెనంగ మాకుఁ జలమో సలమో తగ నీవు నిట్టు లీ, మొఱకుఁదనంబు దక్కుమిట ముందర నీఁగుద మంతభంగమున్." భా. రా. యు. ౯౧౯. **3.** అకారణముగా. "సీ. ఉఱక దివోదాసు నుచ్చాటనము చేసి..." కాశీ. ౬, ఆ. ౧౩౯.

ఉఱవు. దే. వి. (ఈపదము లఘురేఫయుక్తముకూడ నని శ. ర; సూ. ని. కాని, క్రిందినిర్ధారక ప్రయోగముల ననుసరించియు, లఘురేఫ మనుటకుఁ బూర్వనిఘంటువులు చూపిన. ఉ. హరి. ౪, ఆ. ౨౦౩. లో 'ఒరవగు' 'ఉరువగు' ననుతాళపత్త్రప్రతుల పాఠములు లభించి సమంజసముగఁ గనుపట్టుటచేతను, నితరనిర్ధారక ప్రయోగములు కానరాని కారణమునను, ఈపద మలఘురేఫయుక్తముగనే గ్రహింపఁబడినది.) **1.** ఔచిత్యము, ఉచితభావము. "ద్వి. నెఱిచకోరములకు నెలనెలపంట, యుఱవేది విరహుల నుడికించు మంట. ఉ. రా. యు. ౩౧౩. పు. (శ. ర. పా.) **2.** దృఢత్వము, గట్టితనము. "సీ...చేవ యుఱవు బిగు వన దృఢత్వముపేరులు..." సాం. ని. మాన. ౩౫. విశే. **1.** అధికము, గొప్పది. "క. ఉఱ వగునారుగపంటలు, గొఱియలపాఁడియును దఱచగున్..." భార.ఆర. ౪, ఆ. ౨౯౫. **2.** ఉచితము, తగినది. "ఆ...ఇ,త్తెఱఁగు సూడ మీకు నుఱవుకాదు." భార. ఉద్యో. ౩, ఆ. ౩౮౦., భార. ఆర. ౭, ఆ. ౩౬౬. **3.** విశాలము, వెడల్పైనది. "క. కఱకంఠుని భక్తులకుం, జెఱుతొండఁడు మిగుల భక్తిసేయుచును గడున్, దఱచగు పెనువానలలోఁ, నుఱ వగుకూటముల మడుఁగు లోరము లిడుచున్." హర. ౨,ఆ.౩౨.

ఉఱిది. దే.వి. (క.ఊఱుబు. త.ఉఱుది.) **1.**దార్ఢ్యము, గట్టితనము. "క. వలమురి జిగి నగుమెడకలు, వలమురిపముఁ జూపు చూపు వనజాతము నా, వలమురియించుమొగము శై,వల ముఱిది హసించు వేణి వనితకుఁ దనరున్." చంద్రా. ౪, ఆ. ౧౪౪. (శ. ర. పా. 'శై,వల మురివి' ముద్రి.) **2.** వడి. వేగము. "క. కదలనినీటికి మీనము, లెదురెక్కునె యుఱిదిఁ బాఱు నేటికిఁ బోలెన్." వేం. పంచ. ౨, ఆ. ౧౬౦. **3.** ధృతి, ధైర్యము. "ఆ. దిట్ట ముఱిది బిగువు నాఁగ ధృతికిఁ జెల్లు." ఆం. సం. మాన. ౫౭. విశే. **1.** దృఢము. (శ.ర.) **2.** స్థిరము. (శ. ర.) **3.** ఘోరము, దారుణము. "క. ఉఱిదివిషయము వెరవున నిడి, చెఱ నున్న ప్రహరివర్మఁ జెచ్చెరఁ జంపఁ, దెఱఁగు విచారించితి మతఁ, డఱుగమిఁ జచ్చె ననువార మైమె లలితాంగీ." దశ. ౭, ఆ. ౧౪౯.

ఉఱియ. దే. విశే. **1.** ధీరుఁడు. "గీ. తెఱవకైయిట్లు చెల్లఁబో దిటము దప్పి, యొఱలఁ దగు నయ్య నీవంటి యుఱియదొరకు." అచ్చ. ఆర. ౧౦౩. **2.** సాహసికురాలు. "క. అని మరుబాములఁ బడలేనని కైదువు దుస్సి దాఁటు నాయితముబలెన్, బెనఁగు నలయుఱియ చేసురి, య నులిమి బలిమి విడిపించి యను ననురక్తిన్." సా. ౨, ఆ. ౨౩౫. **3.** సహాయుఁడు. "ఉ. ఉఱియలు లోఁగ వైరి యిఁక నుండఁగ నీతము గా దటంచుఁ దా,నఱవఱలయ్యెఁ జెప్పట నొయారపుఁ గస్తురిబొట్టు మోమునన్." కాళిందీ. ౨, ఆ. ౯.

ఊఱియు. దే. అ. క్రి. 1. ఇల్లు లోనగువాని పై కప్పు చెడి యాద్వారమున వర్షపునీళ్లు పడు. "సీ...నా కొక్కమందిరము నిర్మింపుమీ యుదకధారలచేత నుఱియకుండ." కాశీ. ౬, ఆ. ౪౦. 2. (వర్షాదులు) కురియు, పడు. "గీ. బోరు బోరున వర్షాంబుధార లుఱిసె." శుక. ౧, ఆ. ౨౭౬.

ఊఱు. యు. వై. అ. క్రి. (సం. ఊరః. క. ఊఱు.) 1. నచ్చు, ఇష్టమగు. "క. తెలిపిగొని నీవు సొచ్చినఁ, బిఱుఁదనె చొచ్చెదము రిపులు పెల్లగిలఁగ నం,దఱమును మా కిది యెంతయు, నుఱు నట్టివరంబు దీని నొసఁగుము పుత్త్రా." భార. ద్రో. ౨, ఆ. ౭. "చ. వెఱచితి రాఁగదే యనిన వెండి కదా పగఁ దీర్తు నీవు నా, వెఱ పెటు లున్న నీరథికవీరులు వాపెద రొల్ల నిన్ను నీ,యుఱు కడ కేఁగి తోడుపడు మొల్లకు నెవ్వరికేని..." భార. ఉద్యో. ౪, ఆ. ౧౭౯. 2. తగు, ఒప్పు. "ఉ...ఒకనక్క నిచ్చి సిం,హమ్ముల విల్చికో లుఱిచె..." భార. సభా. ౨, ఆ. ౧౮౧. 3. ధర్మ మగు, న్యాయ మగు. "క. కులమునకు నఖిలలోకం,బులకు నపాయంబు సేయు పురుషాధము ని,మ్ముల దూషించి జగంబును, గులమును రక్షించు టుఱదె కువలయనాథా." భార. ఆది. ౫, ఆ. ౧౧౧. 4. బయలుదేఱు, పొడము. "సీ. అరదంబు లడరిన నశనివేగోద్ధతు లుఱ మీఁద నుఱుముగా నుఱుకువారు." భా. రా. యు. ౯౭౬. 5. మేలగు, శ్రేష్ఠమగు. (శ. ర.) దే. అ. క్రి. 1. ఉడుగు, మాను. (ఈ క్రిందివానికి వ్యతిరేకార్థము నందే ప్రయోగములు కానవచ్చుచున్నవి.) "వ...కద్రువగర్వంబున నుఱక గరుడుని వినతనుం బనులుగొనుచున్నంత..." భార. ఆది. ౨, ఆ. ౪౭. 2. జంకు, వెనుదీయు. "క. ఉఱఁడు సుమీ ఖండాగొని, నఱక..." కళా. ౪, ఆ. ౪౫. స. క్రి. సరకుగొను, లెక్కచేయు. "చ. ఊఱఁడు సురేంద్రునైన బలియుండు హిడింబుఁడు..." భార. ఆది. ౬, ఆ. ౧౯౫. భార. స్త్రీ. ౨, ఆ. ౦౭. వి. 1. ఉఱ్ఱు. (చూ. ఊఱుఁద్రావుడు.) 2. మర్కటధ్వని. (చూ. ఊఱుగొట్టు.) 3. పాము ఊఱుకునప్పుడు పుట్టు ధ్వని. "ద్వి. మెఱుఁగుఁగోఱ లుఱ వల్మీకముల్ వెడలి, యుఱుపుట్టఁ గోనల చుఱికి..." ద్వి. హరిశ్చ. పూ. ౧౯౬౨, పం.

ఊఱుఁద్రావుడు=ఉఱ్ఱుఁద్రావు. "గీ. క్షీరకలశంబు నుఱుఁద్రాగ్లఁ జేతఁబట్టి, యమరు గోపాలకృష్ణు నల్లంతఁ గాంచె." వి. పు. ౭, ఆ. ౩౩౭.

ఊఱుకు. దే. అ. క్రి. (క. ఊఱుక్కు.) 1. దుముకు, దూకు. "క. ఎఱిఁగి పిఱుసనిన వెసఁ బై, కుఱుకుదు..." భార. విరా. ౨, ఆ. ౨౮౨., "గీ. వెఱ పొకింతయు లేక చిచ్చుఱికెనేని." కాశీ. ౨, ఆ. ౯౧. 2. పాఱు, పరుగెత్తు. "గీ. ఆరె కులు చూచిరేని మహాప్రమాద, మీ విలాసిని విడిచి నీ వెచటి కయిన, వేగ నుఱుకుము..." హరిశ్చ. ౪, ఆ. ౧౦౭. 3. బయలుపడు. "లయగ్రాహి...కోపం, బుఱుక నృపవరునిపయి నుఱికి కనిమసఁగి..." పద్మ. ౭, ఆ. ౨౭౮.

ఊఱుకుడు. దే. వి. (ఊఱుకు. ధా.) ఊఱుకుట, దుముకుట. (చూ. ఊఱుకుడుఁగప్ప.)

ఊఱుకుడుఁగప్ప. దే. వి. దుముకుచుఁ బోవు నొక జాతికప్ప. (శ. ర; బ్రౌ.)

ఊఱుకుడుబొద్దు. దే. వి. (ఊఱుకుడు+బొద్దు.) రోగముచేఁ బెరిఁగినబొద్దు, తుండి. (శ. ర.)

ఊఱుగొట్టు. దే. అ. క్రి. (ఊఱు+కొట్టు.) కోఁతి యుఱ్ఱు మని ధ్వనిచేయు. (శ. ర.)

ఊఱుచే. దే. స. క్రి. పోఁగొట్టు, నశింపఁజేయు. "ఆ. వేదవిహితవృత్తి విప్రుల నుఱిచెఁ,దత్సతుల పుసుపభక్తిసలుపు డుడిచెఁ,బుణ్యకర్మ ముఱిచె భువి నిట్లు నిఖిలపాప, కారకుండు బలిమిఁ దారకుండు." కు. సం. ౪, ఆ. ౧౧.

ఊఱుత. దే. వి. (త. ఊఱుత్తై.) ఉడుత, చిక్రోడము, "సీ. ఊఱుత నా నుడుత నాఁ దరమూషికం బగు..." ఆం. భా. ద్వి. ౦౭.

ఊఱుపు. దే. వి. ఊఱియుట, నీరుకాఱుట. (శ. ర.)

ఊఱుము. దే. అ. క్రి. (త. ఊఱుము.) గర్జించు. "క. ఊఱుముచు మెఱుముచుఁ బిడుగులు, వఱలఁగ నలుగడలఁ బడ నవారితవృష్టుల్." భార.

ఆది. ౮, ఆ. ౨౭౦. వి. 1. మేఘధ్వని, గర్జనము. "క. మెఱుము ధనుర్దండముగుణ, ముఱుముగ విశిఖతతిఁ గుఱియ..." భార. ద్రో. ౧, ఆ. ౨౯౪. 2. సింహనాదము, వీరహుంకారము. "క. ఊఱుములు నార్పులును బొబ్బలురవడి నెగడన్." కాళ. ౨, ఆ. ౪౫. "క. ఒకమరి కిరీటికట్టైది, రికి నుఱుమునఁ బోయి శేని రెండవమా ఱేయ్యకొనుట కోర్వఁగలేరై, రొకళ్లఁ గురురాజసేన యోధులలోనన్." భార. విరా. ౫, ఆ. ౫౫. 3. ఉడుము. "వ. తొఱ్ఱదొఱ్ఱకన్నం గుక్కలచేఁ బఱిపఱి యైన యుఱుములును." ఉ. హరి. ౪, ఆ. ౨౯.

ఊఱుముతిండి. దే. వి. (ఊఱుము+తిండి.) ఉడుపకుక్క. "ఉత్సాహ...ఎలుకవేఁట కుఱుముతిండియేల..." కు. సం. ౨, ఆ. ౫౯.

ఊఱువు. దే. వి. ఉఱుగొట్టుట. "సీ. ఒండొరుఁ గడచుచు నుఱువులు సూపుచుఁ బొతరలాడుచుఁ బరువుగొనుచు. "గీ...అశోకఁతిమూఁక యెలమి నడచి." అచ్చ. యు. ౯౦.

ఉఱ్ఱటలూఁగు. దే. అ. క్రి. (ఉఱ్ఱటలు+ఊఁగు.) 1. మిక్కిలియూఁగు. "మ. అనుచుం డెందము గందళింప ధృతి జవ్వాడఁగ మోహంబు పైకొన సి గ్గుఱ్ఱటలూఁగ..." కృ. శతం. ౨, ఆ. ౫౭. 2. చలించు. (శ. ర.)

ఉఱ్ఱటలూఁచు. దే. స. క్రి. (ఉఱ్ఱటలూఁగు. ధా. ప్రే.) మిక్కిలియూఁచు. "సీ. బలిమిఁ గానన పరంపరల నుఱ్ఱటలూఁచి తీవపందిళ్లలో దిరిగి తిరిగి." వేం. పంచ. ౪, ఆ. ౨౩౧.

ఉఱ్ఱట్లూగు = ఉఱ్ఱటలూఁగు. (మిక్కిలియూఁగు.) "క. తక్కుఁ గలదనుజవీరులు, తక్కటిగీర్వాణవరులు దలపడి వైరం, బెక్కఁగ నెక్కటిపోరిరి, యుక్కన బ్రహ్మాండభాండ ముఱ్ఱట్లూఁగన్." శశాం. ౫, ఆ. ౩౬.

ఉఱ్ఱాడు. దే. అ. క్రి. (ఉఱ్ఱు+ఆడు,) మిక్కిలి చలించు. "గీ. గమనజవమున నుఱ్ఱాడుకావడదరి, కిఱ్ఱు కిఱ్ఱని భుజమునఁ గేళిసల్పె." హంస. ౧, ఆ. ౧౬౨.

ఉఱ్ఱు. దే. వి. 1. ఊఁగుట చలించుట యందగు ధ్వని కనుకరణము. (చూ. ఉఱ్ఱూఁతలూఁగు.) 2. కోఁతి యుఱ్ఱు మని చేయుధ్వని. (శ. ర.) 3. బందము, పాలు తీయునపుడు పశువుకాళ్లకుఁ గట్టుత్రాడు. (హోమధేనువు.) "సీ...ఉఱ్ఱువేయ, వలవదు పిదుకుచో వరవృష్టిధారల చెలువునఁ జన్నులు చేఁపి కురియు." భో. ౪, ఆ. ౧౨౯.

ఉఱ్ఱుఁద్రాడు. దే. వి. ఔ. (ఉఱ్ఱు+త్రాడు.) బందము, పాలు తీయునపుడు పశువుకాళ్లకుఁ గట్టుత్రాడు. "సీ. కుఱ్ఱులఁ బట్టఁగ నుఱ్ఱుఁద్రాళ్లు వలదు కుండ యొడ్డినఁ బాలు నిండఁ గురియు." మైరా. ౧, ఆ. ౫౭.

ఉఱ్ఱుకట్టు. దే. స. క్రి. (ఉఱ్ఱు+కట్టు.) పాలు తీయునపుడు పశువుకాళ్లను త్రాటితోఁ గట్టు. (శ. ర.)

ఉఱ్ఱూఁతలూఁగు. దే. అ. క్రి. (ఉఱ్ఱు+ఊఁతలు+ఊఁగు.) 1. మిక్కిలియూఁగు. 'సీ. ఉఱ్ఱూతలూఁగెడు నుదయాస్తగిరులచే నాకాశలక్ష్మి కోలాటమాడ." ఉ. హరి. ౪, ఆ. ౨౧౬. కాశీ. ౨, ఆ. ౫౧. 2. మిక్కిలిచలించు. "సీ. యుగవిరామమున నుఱ్ఱూఁతలూఁపఁగ ఁజాలుగాలికొండ దమింపఁ జాల దెట్లు." కాశీ. ౨, ఆ. ౧౦౫. 3. వేగిరపడు. "మహాస్రగ్ధర...తడ వగు ననుచున్ డాయ నుఱ్ఱూఁతలూఁగున్." సురా. ౪౭.

ఊల. దే. వి. కండూతి, దురద. వా:—చిడుముచే నొడలంతయు నుల పట్టినది.

ఊలంకలము. సం. వి. అ. పుం. పెద్దనల్లచీమ, కండ్రచీమ.

ఊలంకు. దే. వి. తలవాకిటముందర నుండు ప్రకోష్ఠము. (ఆం. పా.)

ఊలక. దే. విణ. తేలికయైనది, లఘువు. (శ.ర.) వి. లఘుత, చులక. "సీ...చులుక చౌక, యులక యెల్లిద మన నొనరు లఘుతపేళ్లు." సాం. ని. మాన. ౨౪.

ఊలకన. దే. వి. చులకన. (శ. ర.)

ఊలగరము=ఊలవరము. (శ. ర.)

ఉలపము. సం. వి. అ. పుం. న. ఒకటితో నొకటి పెనఁగొన్న ద్రాక్షాదిలత. పుం. మొదవగడ్డి.

ఉలవ. దే. వి. కుళత్థము ¶. "సీ. ఒప్పుఁ గుళత్థాఖ్య యులవ యం చనఁగను..." ఆం. భా. ద్వి. ౬౬౬. బ. ధాన్యవిశేషము, కుళుత్థములు. "సీ. చక్కఁగా నఱికిన జాడుచొప్పలు నులవల పిష్టములు బలీవర్దములకు." వరాహ. ౪, ఆ. ౧౩౬.

ఉలవరము. దే. వి. తడిచే నేల యుబుకుట, పుక్కిపదను. (శ. ర.)

ఉలవరించు. దే. అ. క్రి. తడిచే నేల పద నగు. (శ. ర.)

ఉలస. దే. వి. 1. తృణవిశేషము. (శ. ర.) 2. ఉలచ, ఒక జాతిచేప. "సీ. కొరమ దాసరి కొయ్య కొఱ్ఱ మీ నులస..." హంస. ౪, ఆ. ౧౮౭.

ఉలసకమ్మలు. దే. వి. బ. కన్నడదేశమందలి యొక జాతి బ్రాహ్మణులు. (వా.)

ఉలారము. దే. వి. 1. ఉల, కండూతి. (వా.) 2. అత్యాతురత. (వా.)

ఉలి. దే. వి. (క. ఉళి.) 1. వృక్షాదనము, వడ్రంగి సాధనవిశేషము. "సీ...ఒనరు దారుచ్ఛేది యులి యనంగ." ఆం. భా. ద్వి. ౩౦౦. 2. రాతిని చెక్కు సాధనవిశేషము. "ఉ...మోములు రాపులు దంష్ట్రికాగ్రముల్, ముట్టనిచంద్రులింతు లులి ముట్టనిలింగము లౌట చిత్రమే." కాళ. ౪,ఆ.౪౭. 3. ఉక్కు, ఇనుము. "సీ. ఉలి యు క్కను మనఁగ నొనరు నయస్సంజ్ఞ..." సాం. ని. స్థా. ౬౫. విశే. అల్పము, చిన్నది. "క. గురుఁ డనుజలనిధిఁ గడచితి, నొరులు దలంపఁగ నాకు నులిగాలువలు..." భార. ద్రో. ౪, ఆ. ౬౩.

ఉలింద. దే. వి. వృక్షవిశేషము. (శ. ర; బ్రా.)

ఉలికిపడు. ద్వ. అ. క్రి. (ఉలికి+పడు.) ఆకస్మికముగాఁ గలిగిన భయాదులచేఁ గంపించు. "వ... వారి సమర్పణంబుగా జలతర్పణంబు సేయుచున్నసమయంబున నారాజుదోసిట నొక్క మీనుపిల్ల దవిలి వచ్చిన నులికిపడి మరలం దదంగి జలంబునందు శఫరి శాబకంబు విడిచె..." భాగ. ౮, స్కం. ౬౯౪. భాగ. ఆది. ౧, ఆ. ౧౫౭.

ఉలికిపాటు. ద్వ. వి. (ఉలికిపడు. ధా.) ఉలికిపడుట. "సీ. ధానుష్కశింజినీధ్వానముల్ చెవిఁబొఱ నులుకిపాటున నిద్ర లుడుగనైరి." ఉ. రా. ౭, ఆ. ౪౧౦., పర. ౨, ఆ. ౪౬. బ్రా.

ఉలిచి. దే. వి. ఒకానొకచెట్టు. (వా.) విశే. 1. తులువ, దుర్మార్గుఁడు. "సీ. పనులకు బుద్ధి చెప్పఁగ నేర్పు పెద్దల కుండకపో దొక్కయులిచిగుణము." సారం. ౪, ఆ. ౧౨౫. 2. పొగరుఁబోతు. (బ్రా.) 3. శోభి, శోభరోగము కలవాఁడు. "గీ. వాఁటి యన నులిచి యన నుల్పుఁ డన శోభి, శోభిలును..." ఆం. భా. ద్వి. ౧౨౨.

ఉలిచికట్టె. దే. విశే. (ఉలిచి+కట్టె.) 1. ఖలుఁడు; తుచ్ఛుఁడు. ఆం. భా. తృ. ౧౩. 2. పొగరుఁబోతు. "సీ...ఒంచుసుద్దులమారి యులిచికట్టె." హంస. ౫, ఆ. ౧౧౩.

ఉలిపిగొట్టు. దే. వి. (ఉలిపి+కొట్టు.) తులువ, దుర్మార్గుఁడు. (శ. ర.)

ఉలిమిడి=ఉలిమిరి. (శ. ర.)

ఉలిమిరి. దే. వి. వరుణము ¶. "సీ. వరుణనామము లులిమిరి యన..." ఆం. భా. ద్వి. ౪౩.

ఉలిమ్రాను. దే. వి. ఖదిరము, చండ్ర ¶. (శ. ర.)

ఉలియాడు. దే. స. క్రి. (ఉలి+ఆడు.) గంట్లు వేయు. వా:—తిరుగలి ఉలియాడినాడు.

ఉలియు. దే. అ. క్రి. 1. మ్రోయు, శబ్దించు. "చ. మలయపుగాలి రేలు పనమాలవిమానపతాక ఘల్లుమంచులియఁ బసిండిమువ్వగమి యొక్కొకమాటు గదల్ప..." ఆము. ౧, ఆ. ౭౪. 2. వెడలు, ప్రకటమగు. "ఆ. అరుగుదెంచి యమ్మహానది వీక్షించి, చేతులెత్తి కట్టు చిట్ట విడిచి, ఘోరకోపవేగధీరోత్థ లులియంగ, బలుకు నిట్లు క్షేత్రపాలకుండు." పాండు.

౯, ఆ. ౧౩౪. 3. తప్పు, పోవు. "గీ. చెయ్వు లులియంగ మూర్ఛలఁ జెంది చొంది." ఉ. రా. ౮, ఆ. ౧౭౯. 4. చేష్టలు కలుగు. "చ. అలు గుల మంది యందుల మృగావళియున్ విహగం బులున్ భయాకులగతిఁ బొంది మూఁగలును గుంటులుఁ జీకులు నైనయట్లులై, యులియక యున్నచో నడఁగి యుండ..." భార. ఆది. ౧, ఆ. ౩౦౨. 5. అలుచు; రుతము చేయు. "క. శంభుసమాధికి విఘ్నా, రంభములై యులి యువనచరములకు జిహ్వాస్తంభగతి స్తంభము న, స్తంభములుగ నంది హస్తసంజ్ఞ నడల్చెన్." కు. సం. ౯, ఆ. ౭. "క. మెలఁగక మృగములు విహగము, లులియక లేఁబొలలఁ జిగుళులొత్తక మలయూ, నిలుఁడు సడింపక నెలవుల, నలపడి వన మమరెఁ జిత్రితాటవివోలెన్." కు. సం. ౯, ఆ. ౯.

ఉలివాడు. దే. అ. క్రి. (ఉలివు+ఆడు.) 1. చలించు. "సీ. కొమరొందుసవవిలాసముల కన్బొమ లులివాడుచోపుడుఁగోల లగుచుఁ బసర." కళా. ౨, ఆ. ౧౭౨. 2. (ఉలి+వాడు.) కొంచెము వాడు. "క. కలహమున సురలు దొరకు, ప్రళయానలరూప ముదరి పడి యొక్కొక్కరూ, ర్గలఁచిన మీసలు గడ్డము, నులివాడులు వాడుచుండు నొందినభీతిన్." కు. సం. ౧౦, ఆ. ౧౦౧.

ఉలివు. దే. వి. 1. శబ్దము, మ్రోఁత. "సీ. మ్రోఁత నాడు రవళి మ్రోఁగుడు వాఁగుడు సద్దులి వలికిడి చప్పు డులుకు, డనఁగ శబ్దం బొప్పు..." ఆం. భా. ప్ర. ౧౨౧. భార. విరా. 3, ఆ. ౪. 2. చలనము, కదలిక. (చూ. ఉలివాడు.)

ఉలివుడు. దే. వి. అలుకుడు, చప్పుడు. (ఆం. పా.)

ఉలుకఁబాఱు. దే. అ. క్రి. (ఉలుకన్+పాఱు.) వెలికిఁ బ్రసరించు. "గీ. ఒడలికాంతులు పట్టులే కులుకఁబాఱు, సన్నవలిపంపుఁబయ్యెద సోకళించి." భాగ. ౮, స్కం. ౩౬౩.

ఉలుకు. దే. అ. క్రి. (క. ఉలుకు.) 1. భయపడు, బెదరు. "క. అలయుచుఁ బులుఁగుల యెలుఁగుల, కులుకుచు..." భార. ఆర. ౨, ఆ. ౮౪. 2. [illegible]పించు, తప్తమగు. "వ. ఇట్లు పేటోంటుదివసంబున జనకతనయ పట్టపగలింటిమింటిపూనికంపుఁ గాఁకతళుకుసోఁకులకు నులుకుచు బయలునెత్తమ్ముల వసియింప..." రామా. ౫, ఆ. ౩౩. 3. అసూయపడు, చూపోపకపోవు. "క. జనులకు నొడఁబా టగువిధమున నడచుచు లోక నింద్యముల నుడుగుచు మీఁదని యొకనికలిమి కులుకక, మనుజులతోఁ బొంది పొసఁగి మను టొప్పు నృపా." భార. ఉద్యో. ౨, ఆ. ౩౧. 4. మిఱుమిట్లుగొను. "చ. వెలుఁగుకుమారు తేజమున వేఁడిమి దాఁకినయంత పేయుఁగన్నులు మిఱుమిట్లువోయినఁ గనుంగొననేరక మూసకొన్న కెప్పలు గమరంగ విచ్చె నురుభాస్కర తీవ్ర కరప్రభాతిఁ గన్నులికి రయంబున న్మోగిడియున్న కుముద్వతిన్వోలె భీతితోన్." కు. సం. ౧౦, ఆ. ౬౨. 5. పొర్లు, నిండి ప్రక్కకుఁ బాఱు. (చూ. ఉలుకఁబాఱు.) వి. 1. భయము. బెదరు. "క. ఉలుకును వెక్కసపాటును, వలపోను నెమ్మనముతోడ..." భార. విరా. ౧, ఆ. ౨౧౩. 2. సంతాపము, దుఃఖము. "సీ... డోఁరికిఁ బొమ్మన్న నులుకుఁ జెందు." శుక. ౨, ఆ. ౨౦౮. 3. కామము, కోరిక. "త. ఇటు నానాటికి నొయ్యనఁ గుటిలాలక యులుకుదీర్చుకొనుచుం బసకొఁగిట నాదటఁ జెలఁగఁగ నృపిన్మటుఁడున్ సమరపుల గౌరవించుచుఁ దివుటన్." ద్వా. ౨, ఆ. ౧౨౭.

ఉలుకుడు. దే. వి. ఉలుకు. (ఆం. పా.)

ఉలుక్కు. దే. వి. గుజ్జుపుమందసలె. "సీ. చను నులుక్కునఁగ నీచగతి పేరు..." ఆం. భా. ద్వి. ౧౯౮.

ఉలుచే. వై. వి. (సం. ఉలూపీ.) మిక్కిలి చాపల్యము గలచేఁప. ఆము. ౨, ఆ. ౯౩., ఆం. భా. ప్ర. ౧౬౦.

ఉలుచే=ఉల్చు. (శ. ర.)

ఉలుప. వై. వి. (సం. ఉపదా. క. ఉలిపె. త. ఉలుపై.) 1. కానుక. "సీ. వలరాచముత్తైదువల పండ్లు గనని మావులకుం గ్లనేకము లులుప వెట్టి." చంద్రా. ౪, ఆ. ౧౯౧. కళా. ౬, ఆ. ౨.

**2.** పలుచగా నూరిన పుల్లని యూరుఁబిండి. "గీ. ప్రలుప యులు పస విరళాశ్లు కలితపిష్ట, మమ ప..." ఆం. భా. ద్వి. ౨౫౧.

ఊలుప డు=ఊల్పుఁడు. (శ.ర.)

ఊలుపము. సం. = ఊలపము.

ఊలుపపట్టు = ఊలుపాపట్టు. "సీ. ఊలు పాంకురము లేచ్చి యులుపపట్టెడుపూన్కిఁ గుశపల్ల వాహృతి గుంటువడియె." పాండు. ౫, ఆ. ౨౩౭.

ఊలు పా = ఊలుప. (కానుక.) "సీ. తనకులుపా సాల దని మిట్టిపడఁగ నసామ ధేయపు దైత్యునకు నడంగి." ప్రభా. ౧, ఆ. ౭౭.

ఊలు పాపట్టు. దే. స. క్రి. (ఊలుపా+పట్టు.) కాను కిచ్చు; ఇచ్చు. "క...ఫలాదివన్యము, లులుపా పట్టించె నినజుఁ డాదయనికి..." గామా. ౭, ఆ. ౨౩౭. ఇట్లే: ఊలు పాలుపట్టు. ఆము. ౪, ఆ. ౩౬. ఊలుపాచేయు. య. ౪, ఆ. ౭౫.

ఊలుప్పు. దే. స. క్రి. ఊలుచు, ఊడఁదీయు. "గీ... మెకములమీఁదిగోలుసు, లూడిపి జాగిలముల నుసి కొలిపె నపుడు." సా. ౧, ఆ. ౬౨. (శ. ర. పా. 'ఉడిపి' ముద్రి.) వి. శోఫరోగము. (శ. ర.)

ఊలుమఁడు. దే. వి. కుష్ఠరోగి. "సీ. ఉలుమఁ డొక్కఁడు నూనెతలతోడ నేతెంచె..." ద్వా. ౧, ఆ. ౨౧౩.

ఊలుము. దే. స. క్రి. నులుము, నలుపు. "గీ. ఒడలు విఱుచుచుఁ గనుఁగవ లులిమికొనుచు." భాగ. ౭, స్కం. ౭౩౪. (తాళపత్త్ర ప్రతి. పా. 'ఈసుమకొనుచు' ముద్రి. పా.) వి. కుష్ఠ రోగము. ఆం. భా. ద్వి. ౧౨౭., భార. అను. ౫, ఆ. ౧౦౦.

ఊలుపకట్టు. దే. వి. పెద్ద పెద్దరాళ్లను బెల్లగించుట కు గడ్డపాఱ మొదలగునవి గ్రుచ్చుట. "వ... ఆశైలంబుమూలంబు గానం ద్రవ్వ నెడనెడం బొడముమ్ము లోపలంబులు పెకలింపం జాలక యు లుపకట్టు నించి మించినభుజాటంకంబుల నగర్చు తతి శిలాగర్భంబుల వెడలువర్షాభులఁ గని యు చ్చెరువందుచు..." దశా. ౨, ఆ. ౧౬౪.

ఉలూకము. సం. వి. అ. పుం. **1.** గ్రుడ్లగూబ. **2.** ఒకానొక దేశము. న. మొదపగడ్డి.

ఉలూకారాతి. సం. వి. ఇ. పుం. వాయసము, కాకి.

ఉలూకిని. సం. వి. ఈ. స్త్రీ. ఉలూకసమూహము.

ఉలూకుఁడు. సం. వి. అ. పుం. **1.** ఇంద్రుఁడు. **2.** శకునిపుత్త్రుఁడు. **3.** విశ్వామిత్త్రుని కొడుకు.

ఉలూఖలకము. సం. వి. అ. న. గుగ్గిలము ♆.

ఉలూఖలము. సం. వి. అ. పుం. మేడికట్టె. న. **1.** ఱోలు. **2.** గుగ్గిలము ♆.

ఉలూపి. సం. వి. న్. పుం. శింశుమారము, ఉలుచ. వి. ఈ. స్త్రీ. ఉలూచి, ఒకానొక నాగకన్య.

ఉల్కా. సం. వి. ఆ. స్త్రీ. **1.** కాఁగడా. **2.** ఆకా శమునుండి పడు తేజఃపుంజము. **3.** కొఱకంచు. **4.** మిణుఁగురు. **5.** దీపావళినాఁడు లక్ష్మీపూజా నంతరము వెలిఁగించుదీపము.

ఉల్కము. సం. = ఉల్కా. (రేఖాకారముగా నాకా శమునుండి పడు తేజఃపుంజము.) "ఉ...మహో ల్కముల్, మొత్తముగట్టి రాలె బలముల్ వెఱఁ గందఁగఁ జేటు దెల్పుచున్." నిర్వ. ౨, ఆ. ౯౭.

ఉల్కాపాతము. సం. వి. అ. పుం. అరిష్టసూచక ముగా నాకాశమునుండి రేఖాకార మగు కాంతి పుంజము పడుట.

ఉల్కాముఖము. సం. వి. అ. పుం. కొఱవిదయ్యము.

ఉల్కాముఖి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడునక్క.

ఉల్కిక. సం. = ఉల్కము. "ఆ. రత్న కేతనములు రాజిత శేఖరంబులును రుచిరఘంటికలును బార్థు, బాణనిహతిఁ దునిసిపడుఁ గౌరవులచేటు, దెలుప డుల్లునుల్కికలును బోలె." భార. విరా. ౫, ఆ. ౫౦.

ఉల్కిపాటు = ఉలికిపాటు. "చ. పలికిన నుల్కి పాటు మదిఁ బట్టుకొనంగ..." దశ. ౨, ఆ. ౪౬.

ఉల్కు = ఉలుకు. (బెదరు, భయపడు.) "ద్వి. చాల సీతని కుల్కి సత్యంబుకొఱకు, నూలిపోఁగునఁ జిక్కి నుసల కున్నాఁడ." ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౨౫, పం.

ఉల్చు. దే. స. క్రి. ఉలుచు, ఊడఁదీయు. "గీ. సత్కవుల త్రుప్పు డుల్చువసంతవేళ." జై. ౧, ఆ. ౪౫.

ఉల్టా. హిం. వి. లోతట్టు, అడుగుభాగము.

ఉల్టాసీదాలు. హిం. వి. బ. 1. లోపలిభాగము పై భాగమును. 2. క్రిందుమీఁదులు.

ఉల్టాసీదాలుకొట్టు. మి. అ. క్రి. (ఉల్టాసీదాలు+కొట్టు.) 1. క్రిందుమీఁదు లగు. 2. కష్టసుఖము లనుభవించు. 3. లాభనష్టము లందు. 4. వ్యవహారమున మునిఁగి తేలుచుండు.

ఉల్పఁడు. దే. వి. ఉలుపఁడు, శోఫరోగి. ఆం. భా. ద్వి. ౧౨౨.

ఉల్పా = ఉలుపా. "క. అల్లునికి విడిదియుల్పా' ల్లెల్లను ఘటియించి పంపి..." ఉ. హరిశ్చ. ౨, ఆ. ౭౯.

ఉల్బణము. సం. వి. అ. న. 1. పొంగు. 2. అతిశయము. విణ. (అ.ఆ.అ.) 1. అధికమైనది. 2. స్పష్టమైనది. 3. నతోన్నతము, ఎగుడుదిగుడు గలది. (మార్గము.) 4. డాబుకలది.

ఉల్బము. సం. వి. అ. న. 1. గర్భపిండము. 2. మావి.

ఉల్ముకము. సం. వి. అ. పుం. అలాతము, మండుచున్న కొఱవి.

ఉల్ముకిని. సం. వి. ఈ. స్త్రీ. ఉల్ముకసమూహము.

ఉల్ల. దే. స. (క. ఉల్లి.) చాల దగ్గఱ చాల దూరము కానిస్థలమునందు. "గీ. ఉల్ల పద్మాకరము పొంతనుండి నిన్ను, మెచ్చి కనుఁగొనుచున్న యున్మీలితాక్షుఁ, డుత్పలాక్షి యిత్త్వాకు వంశోద్భవుండు." భార. అర. ౬, ఆ. ౧౫౪. "సీ. మేలి గా కేమి టంకాలజాలెము లెవ్వి యుల్ల పెట్టియ నిండి యున్నయవియ." కాశీ. ౨, ఆ. ౨౪౪.

ఉల్లంకి. దే. వి. పక్షివిశేషము. (శ. ర.)

ఉల్లంగి. దే. వి. 1. ఒకానొకపక్షి. "సీ...డేగ గూడబా తుల్లంగి..." హంస. 3, ఆ. ౧౩. 2. ఒకానొకచెట్టు. (శ. ర.)

ఉల్లంఘనము. సం. వి. అ. న. 1. తలంచుట, దాఁటుట. 2. అతిక్రమించుట, మీఱుట.

ఉల్లంఘించు. సం. స. క్రి. 1. కడచు, దాఁటు. "సీ. బాహులేయక్షేత్రపదము నుల్లంఘించి దుంఠిరాట్తీర్థోపకంఠ మొరసి." కాశీ. ౬, ఆ. ౧౨౭. 2. అతిక్రమించు, మీఱు. "క. నాపలు కుల్లంఘింపక..." హరిశ్చ. ౨, ఆ. ౧౭౫. 3. అగౌరవించు, నిరసించు. "శా...ఆ మొదవు నుల్లంఘించి తన్నెన్ వడిన్." భాగ. ౧, స్కం. ౪౧౩. అ. క్రి. ఎగురు. "సీ. ఒకమాటు మింటికి నుదరి యుల్లంఘించు నొకమాటు లోపల నొదిఁగి యుండు." భాగ. ౮, స్కం. ౭౧౯.

ఉల్లంఘితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. తలంపఁబడినది, దాఁటఁబడినది. 2. మీఱఁబడినది, అతిక్రమింపఁబడినది.

ఉల్లకట్టు. దే. వి. (ఉల్లము+కట్టు.) ఉత్ప్రాసము, మర్మమంట నెత్తి పొడుచుట. (శ. ర.)

ఉల్లడ. వై. వి. (సం. ఉల్లాభః. క. ఉల్లడె.) మేలుకట్టు. ఆం. భా. ద్వి. ౧౫౮.

ఉల్లబము. దే. వి. ఉల్లడ. ఆం. భా. ద్వి. ౧౫౮.

ఉల్లము. దే. వి. 1. ఎద, అంతరంగము. "ఉ. ఉల్లము పొక్క సెవ్వగల కోటలతో యే మరణంబు గోరినక్." నిర్వ. ౯, ఆ. ౨౪. 2. ఇచ్ఛ, కోరిక. "ఆ. ఉసురు గాచుకొనఁగ నుల్లంబు గలిగిన, నిపుడ బాల విడిచి యేఁగుము..." హరి. ఉ. 3, ఆ. ౧౩౯.

ఉల్లఅపుబిరుదు. దే. విణ. (ఉల్లఅము+బిరుదు.) 1. దుస్సహ మగుపరాక్రమము గలవాఁడు. "సీ. మొగజోదు కృతవర్మ మూఁడవవాఁడు నాలవవాఁడు నిశఠుఁ డుల్లఅపుబిరుదు." ఉ. హరి. ౪, ఆ. ౨౦౨. 2. భయంకరమైనబిరుదులు గలవాఁడు. "గీ...చక్రసం బగు బిరుదులు గలుగునాతఁ, డుల్లఅపుబిరుదు..." ఆం. భా. తృ. ౨౬.

ఉల్లఅము. దే. విణ. దుస్సహము. (చూ. ఉల్లఅపుబిరుదు)

ఉల్లల. దే. వి. 1. ఉడుకుటయందగుధ్వని కనుకరణము. "క. ధనము గలవాఁడు మృత్యువుదన మున నున్నట్లుం భయము దనచిత్తమునం, దను కేఁగ నుల్లల నుడుకును, విను శిఖిచోరాదిముఖ్య విషయాపదలన్." భార. శాం. ౪, ఆ. ౩౪. 2. హృదయము. (ఆం. పా.)

ఉల్లలత్. సం. శత్రం. 1. కదలుచున్న, చలించుచున్న. 2. ఎగురుచున్న. 3. ఒండొంటిఁ గొట్టుకొనుచున్న. "క. ఉల్లలదలకాజలకణ, పల్లవిత కదంబముకుళపరిమళలహరీ, హల్లోహల మదబంభర, మల్లధ్వను లెసఁగ విసరె మరుదంకురముల్." స్వా. ౨, ఆ. ౬.

ఉల్లలము. సం. వి. అ. పుం. 1. చలనము, కదలిక. 2. ఆందోళనము. విణ. (అ.ఆ.అ.) 1. చలించునది. 2. పెక్కురోగములు గలది.

ఉల్లలితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. చలించినది. 2. పై కెగిరినది. 3. ఊఁపఁబడినది.

ఉల్లసత్. సం. శత్రం. ఉల్లసిల్లుచున్న.

ఉల్లసనము. సం. వి. అ. న. 1. సంతోషము. 2. రోమాంచము. 3. ప్రకాశము, కాంతి. 4. వికాసము. 5. బయలుదేఱుట.

ఉల్లసమాట. దే. వి. (ఉల్లసము+ఆట.) ఉల్లసమాడుట. "క. అని తను నుల్లసమాటకుఁ, గినిసి..." భార. విరా. ౫, ఆ. ౧౮౨.

ఉల్లసమాడు. దే. స. క్రి. (ఉల్లసము+ఆడు.) 1. ఎత్తిపొడుచు, ఉల్లకట్టుమాట లాడు. "క. పసు లని యార్చుచు మము నుల్లసమాడిన ధర్మహీను లను నృపధర్మం, బెసఁగఁగ నే మిచ్చట నిదె,పసు లని యార్చెదము మగుడ బంధుద్రోహీ." భార. శల్య. ౨, ఆ. ౨౮౦. 2. పరిహసించు, వేళాకోళము చేయు. "సీ...అన్నరపతి దున్నంగ నింద్రుఁడు సను దెంచి యేల యిచటఁ, దునియెద వనిన నమ్మనుజాధిపతి తనకోర్కి చెప్పిన గేలిగొనుచుఁ జనియెఁ, బలుమఱు నద్దేవపతి వచ్చి వెండియు నుల్లసమాడుచు నుండు నతని." భార. శల్య. ౨, ఆ. ౨౧౫. 3. నిందించు, దూఱు. "వ. అని యుల్లసంబాడినం గటకటంబడి." కాశీ. ౪, ఆ. ౫౧.

ఉల్లసము. ఉభ. దే. వి. 1. ఉత్ప్రాసము, ఉల్లకట్టు. "గీ. లావునను గూడి పాణిపల్లవయుగమున, నొత్తి పట్టిన సరకుగా కుల్లసమున, హారకాంతిచ్ఛలంబున నల్ల నవ్వు, ప్రసణిచన్నులు రాజుచిత్తము హరించె." నైష. ౭, ఆ. ౧౭౯. 2. ఉత్ప్రాసవాక్యము, ఎత్తిపొడుపు మాట. "గీ. ఒల్లఁ బొమ్మన్నఁ బోదె తా నుల్లసముల, నేఁప నది రక్కసియ యాట యెగ్గె .." ఆము. ౫, ఆ. ౫౧. 3. పరిహాసము, వేళాకోళము. (చూ. ఉల్లసమాడు.) 4. నింద, దూఱు. (చూ. ఉల్లసమాడు.) 5. బాధ; విరహబాధ. "చ...విరహసంభృతతాపము పొందెఁ బార్వతిన్. వ. ఇట్టుల్లసంబున నడరునాయుల్లకభరంబునం దురపిల్లుచు." కు. సం. ౫, ఆ. ౧౦౫., ౧౦౬. సం. వి. అ. పుం. 1. సంతోషము. 2. ప్రకాశము, కాంతి. 3. వికాసము. విణ. (అ.ఆ.అ.) 1. సంతోషించునది. 2. ప్రకాశించునది. 3. వికసించునది. 4. వ్యక్తమగునది.

ఉల్లసించు. సం. అ. క్రి. 1. వ్యక్తమగు. "మ... నా రుల్లసిం,చె నుదుశ్రాంతి జనించె గర్భము రహించెన్..." ఉ. రా. ౧, ఆ. ౧౮౧. 2. సంతోషించు. "పంచచామరము. ప్రసన్నగోపబాల గీతబాహువీర్యుఁ డయ్యు నుల్లసించి యేఁగె...మందకున్." భాగ. ౧౦, స్కం. పూ. ౫౮౫.

ఉల్లసితము. సం. వి. అ. న. రోమాంచము, గగుర్పాటు. విణ. (అ.ఆ.అ.) 1. సంతోషించినది. 2. ప్రకాశించినది. 3. గర్వించినది. 4. చలించినది. 5. పైకె లాగఁబడినది.

ఉల్లసిల్లు. సం. అ. క్రి. 1. వ్యక్తమగు. 2. సంతోషించు. "ఉ. చింతఁ దొఱఁగి యానృపతి చెల్వయుఁ దా మది నుల్లసిల్లుచున్." ద్వా. ౬, ఆ. ౭౫. 3. కలుగు, పుట్టు. "క. మగువా నీపెంచి నలత, చిగురున ముకుళంబు నుల్లసిల్లెనె చెపుమా." హర. ౪, ఆ. ౧౯. 4. ప్రకాశించు, ఒప్పు. "గీ. మోక్షనగరీమహాద్వారముఖ కవాట, విఘ

టసాలోహకుంచికా విభ్రమమున, నుల్లసిల్లెడు సుషదంగయోగవిద్య, నభ్యసించిన సాభమం డద్రి మదన." కాశీ. ౫, ఆ. ౨౮౫. **5.** వికసించు, విచ్చు. "చ. కమలము లుల్లసిల్ల రవికాంత శిలా ధమనీలతానహా, భ్రమలఁ గృపీటసంభవుఁడు రాజుగఁ జీకటి యారుసొరుగా...పొడుపు కొండపయిన్ రవి యొప్పె..." కాశీ. ౧, ఆ. ౧౨౫.

**ఉల్లాకు.** దే. వి. (ఉలి+ఆకు.) చీటి, ఖండపత్త్రిక. (శ. ర.)

**ఉల్లాకుఁజేఁప.** దే. వి. మత్స్యవిశేషము. (శ.ర.బ్రా.)

**ఉల్లాఘము.** సం. వి. అ. పుం. మిరియము. విణ. (అ. ఆ. అ.) **1.** రోగము తుదిరినది. **2.** దక్షత గలది. **3.** శుచియైనది. **4** సంతోషము గలది.

**ఉల్లాపనము.** సం. వి. అ. న. వృత్తి మొదలగు వానితో వ్యాఖ్యానము రచించుట.

**ఉల్లాపము.** సం. వి. అ. పుం. **1.** కాకుస్వరము గల వాక్యము, శోకము భీతి మున్నగువానిచేఁ గలిగినధ్వనివికారముతో చెప్పుమాట. **2.** మాట. **3.** దూషణవాక్యము. **4.** సూచనము. **5.** గట్టిగాఁ బిలుచుట.

**ఉల్లాపి.** సం. విణ. (న్. నీ. న్.) **1.** శోకము భీతి మున్నగువానిచే వికృతముగాఁ బలుకునది. **2.** దుర్భాష లాడునది. **3.** సూచించునది. **4.** గట్టిగాఁ బిలుచునది.

**ఉల్లాపించు.** సం. స. క్రి. దుర్భాషలాడు, నిందించు. "వ. అని విధి నుల్లాపించుచు నక్కుసుమకోమలి నల్లనల్లన తడమికొనివచ్చి." కు. సం. ౫, ఆ. ౧౮౮.

**ఉల్లాభము.** సం. వి. అ. పుం. వితానము, మేలుకట్టు.

**ఉల్లాము.** దే. వి. పక్షివిశేషము. (శ. ర.)

**ఉల్లారు.** దే. వి. (క. ఉల్లార.) **1.** గుజ్జుపుజీనిమీఁది పఱుపు. "వ...అగ్రభాగపల్లవంబు లింద్రగోపపు టుల్లారులయోజ రాజిల్లఁ దేజీలపోలిక భాసిల్లువానంతికా కుదురుగంబులను..." కళా. ౬, ౨౨౮. **2.** జాలరు. "వ...మూరకొక్కఁడును జేనకొక్కఁడునుగాఁ గుట్టిన డొల్లుటుల్లారు లుల్లసిల్లం బల్లించిన పల్లంబులపై..." ఆము. ౪, ఆ. ౩౯., పార్వ. ౫, ఆ. ౧౫౨.

**ఉల్లాసనము.** సం. వి. అ. న. **1.** కాంతి. **2.** సంతోషము. **3.** వికాసము. విణ. (అ. ఆ. అ.) ఉల్లసింపఁజేయునది.

**ఉల్లాసము.** సం. వి. అ. పుం. **1.**= ఉల్లాసనము. **2.** ఒకరిగుణదోషములు మఱియొకరిగుణదోషములెత్తిచెప్పుటచే సూచింపఁబడు నొకానొక యర్థాలంకారము. **3.** గ్రంథప్రకరణము. **4.** ప్రారంభము.

**ఉల్లాసి.** సం. విణ. (న్. నీ. న్.) **1.** ఉల్లసించునది. **2.** ఉల్లసింపఁజేయునది; ఉల్లసింపఁజేయువాఁడు. "ఉ...యాదవోల్లాసి చరిత్రమున్ వినఁ దలంపఁగ..." హరి. పూ. ౧, ఆ. ౫౩.

**ఉల్లాసించు.** సం. అ. క్రి. **1.** సంతోషించు. "సీ...శోకించియున్నాఁడొ...ఉల్లాసించినాఁడొ కలఁగినాఁడొ." శివరా. 3, ఆ. ౧౫. **2.** ఒప్పు, ప్రకాశించు. "సీ. అభినవ బర్హిబర్హాపీడలక్ష్మి నుల్లాసించుకేశకలాప మమర." హరి. పూ. ౮, ఆ. ౭.

**ఉల్లాసితము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉల్లసింపఁ జేయఁబడినది.

**ఉల్లి.** దే. వి. (క. ఉల్లి.) **1.** లశునము, నీరుల్లి ♣. "ఆ. మునగ యుల్లి యడవిమునగ దుర్గ్రాసను లు...ప్రవర్జనీయకోటి..." భార. అను. 3, ఆ. ౧౮౯. **2.** వెల్లుల్లి ♣. "గీ. శ్రాద్ధకర్మంబునందు పర్జ్యములు వినుము, చెండలంబును దోస పలాండు వుల్లి." మార్క. ౪, ఆ. ౨౦౩. సా: ఉల్లి దిన్నకోమటి. "గీ. ఘుటికఁ మ్రింగినసిద్ధునియటుల నుల్లి,దిన్నకోమటివలె నూరకున్నవాఁడు." సా. 3, ఆ. ౧౬౫.

**ఉల్లిక.** దే. వి. రక్తపుచ్ఛి ♣. (ఆం. పా.)

**ఉల్లికుచ్చెడము.** దే. వి. మత్స్యవిశేషము. (శ. ర.)

**ఉల్లికట్టు = ఉల్లకట్టు.** దే. వి. (ఉల్లి+కట్టు. గర్భదోషవిర్మూలనమున ఉల్లి కట్టుపంతయుఁ గలఁ

చును.) **1.** ఎత్తిపొడుపు. "క. సమరమునకుఁ బిరికొల్పుచు, మముఁ దలఁచిన నుల్లికుట్టుమాట లఁ దచ్చి, క్షేమ లడిగించుచుఁ బాండవసమితిం గడఁగించువా రచట నెవ్వరొకో." భార.ఉద్యో. ౨, ఆ. ౨౪౨. **2.** ఎత్తిపొడుపుమాట. "చ... ప్రతాపభాషణంబున వెడ నుల్లికుట్టులను బొంకుల వానిఁ గలంగఁజేసి..." భార. శాం. 3, ఆ. ౨౦. **3.** మర్మభేదనము. (ఆం. పా.)

ఉల్లికోడి. దే. వి. (ఉల్లి+కోడి.) ఉల్లిమొక్క-నుండి బయలుదేఱి చివర తెల్లనిపూవు పూయు పొడుగాటికాడ. (వా.)

ఉల్లిఖితము. సం. విణ. (అ. ఆ. అ.) **1.** వ్రాయఁబడినది. **2.** గోకఁబడినది. **3.** సానఁబట్టఁబడినది.

ఉల్లిగడ్డ. దే. వి. ఉల్లిపాయ. (ఆం. పా.)

ఉల్లిపాయ. దే. వి. (ఉల్లి+పాయ.) **1.** ఉల్లిగడ్డ. (వా.) **2.** ఉల్లిపాయ లోని చిన్నగడ్డ. (వా.)

ఉల్లిపాషాణము. మి. వి. (ఉల్లి+పాషాణము.) సౌవీరము, ఒకానొక విషపదార్థము. (శ. ర.)

ఉల్లిపొర. దే. వి. (ఉల్లి+పొర.) ఉల్లిగడ్డయొక్క- పలుచని చర్మము. (వా.)

ఉల్లిపొరకాకితము. దే. వి. ఉల్లిపొరవంటి పలుచని కాకితము. (వా.)

ఉల్లీఢము. సం. విణ. (అ. ఆ. అ.) సానఁబట్టఁబడినది.

ఉల్లు. సం. వి. ఉ. పుం. సూరణము, కంద.

ఉల్లుంచనము. సం. వి. అ. న. **1.** కత్తిరించుట. **2.** భేదించుట. **3.** పెకలించుట.

ఉల్లుంఠ. సం. వి. ఆ. స్త్రీ.=ఉల్లుంఠనము.

ఉల్లుంఠనము. సం. వి. అ. న. **1.** ఉపాలంభము, నొచ్చునట్లు తిరస్కరించుట. **2.** వ్యాజస్తుతి, లోపల కోప ముండి పైకి స్తుతించుట.

ఉల్లుంఠితము. సం. విణ. (అ.ఆ.అ.) **1.** ఉపాలంభింపఁబడినది. **2.** వ్యాజస్తుతి చేయఁబడినది.

ఉల్లూనము. సం. విణ. (అ.ఆ.అ.) త్రుంచివేయఁబడినది.

ఉల్లెడ=ఉల్లడ. "వ. హుతవహుం డగరుధూపంబు లేఁపఁ బర్జన్యుం డుల్లెడ యిడ..." ఆము. ౬, ఆ. ౧3౦.

ఉల్లేఖనము. సం. వి. అ. న. **1.** గోఁకుట. **2.** రాచుట. **3.** వ్రాయుట. **4.** త్రవ్వుట. **5.** చెక్కుట. **6.** ఉచ్చరించుట.

ఉల్లేఖము. సం. వి. అ. పుం. **1.**=ఉల్లేఖనము. **2.** పలుతెఱఁగులు గలధర్మము లున్నయొకే పదార్థమును బలువురితుల గ్రహించు నొకానొక యర్థాలంకారము.

ఉల్లేఖించు. సం. స. క్రి. **1.** విస్తరించి చెప్పు. "శా...క్రీడావిహారక్రియా, లీలాహాస్యకళా ప్రసంగముల నుల్లేఖించి వర్తింతురు...అద్దేవత ల్." కాశీ. ౬,ఆ.౨౧౦. **2.** అంటు. "సీ. ఆటమండపముపై నభ్ర ముల్లేఖించు జాంబూనద త్రిశూలంబుఁ జూచి." శివరా. 3, ఆ. ౧౦౭.

ఉల్లోకితము. సం. వి. అ. న. స్వభావదృగ్విశేషము, సహజమైనచూపు.

ఉల్లోచము. సం. వి. అ. పుం. ఉల్లెడ, మేలుకట్టు.

ఉల్లోలము. సం. వి. అ. పుం. పెద్ద కెరటము. విణ. (అ.ఆ.అ.) మిగులఁ జలించునది.

ఉవిద. వై. వి. (సం. యువతిః.) **1.** స్త్రీ, ఆఁడుది. "గీ...ముగుద యువిద, గరిత యన భామినీ సమాఖ్య లగు..." సాం. ని. మాన. ౨౦, ఆ. సం. ౯. **2.** జవ్వని, యౌవనవతి. "గీ. ఉవిద నిద్దంపు జొంపులనవతుఁ గోరి, కలమగర్భాంబు లడఁచులోఁ గంటకములు." ఆము. ౫, ఆ. 33. **3.** అందగత్తె, సుందరి. "గీ. ఉవిద సోమరసం బన్న నోకిలించు...,పాషతుండు నేఁ డెల్లి నీపై విరాళి." నైష. ౪,ఆ. 3౨. **4.** ఆలు, భార్య. "గీ. ఉవిద యానీదు విద్యాంసుఁ డోడెనేని, నీకు నితనికి నన్నపూనికయ..." ఆము. ౪, ఆ. ౬౪.

ఉవ్వ. దే. వి. వృక్షవిశేషము. (శ. ర.)

ఉవ్వపిట్ట. ద్వ. వి. పక్షి విశేషము, గోలత్తిక. (శ. ర. బ్రౌ.)

ఉవ్వలపోటి. దే. వి. బాలక్రీడావిశేషము. "సీ. చిడుగు డువ్వలపోటి..." కాళ. ౩, ఆ. ౩౩.

ఉవ్వాయి. దే. వి. జయము, గెలుపు. (వికాస మని శ. ర; సంతోష మని సూ. ని.) "క. ఇవ్విధమున రుక్మిణి మదిఁ, బువ్వాం బరిమళముఁ బోలెఁ బొలుపుగ నెత్తం, బువ్వాయి గలిగె శౌరికి, మవ్వము విగఁదోడఁగె గెలుపు మట్టంబయ్యెన్." "గీ. చాలు నని పాసె రుక్మిణి..." ఉ. హరి. ౩, ఆ. ౧౨౫., ౧౨౬.

ఉవ్విళులూరు = ఉవ్విళ్లూరు. 1. త్వరపడు. "ఉ... చూచువేడుకల నువ్విళులూరెడు నెమ్మనంబులు ..." భార. విరా. ౫, ఆ. ౩౯౩. 2. ఆసించు, కోరు. "సీ. మీమొగంబులు సాల్గు నీమాడ్కి నువ్విళు లూరెన నేకాస్య నొకతె నేను, జాలిం దునే..." కళా. ౫, ఆ. ౧౫.

ఉవ్విళులూర్చు = ఉవ్విళ్లూర్చు. "చ. పడఁతులు లేచుసంభ్రమము భర్తల నువ్విళులూర్చె..." కవిక. ౪, ఆ. ౧౮౯.

ఉవ్విళ్లు. దే. వి. బ. తొందర. "మ...క్రొవ్వున నన్నబ్బట్టఁగఁ బూని తిక్వడు మదం బువ్విళ్లు నీ కేల యం,చును..." శతకంఠ. ౩, ఆ. ౭౦.

ఉవ్విళ్లుగొను. దే. అ. క్రి. (ఉవ్విళ్లు+కొను.) త్వరపడు. "ఉ. వీళ్లవి రెండుఁ బన్నుదు దివిం గల పాశనమానిచూడ్కు లు,వ్విళ్లుగొనంగఁ జొచ్చె ..." కవిక. ౨, ఆ. ౧౫౦.

ఉవ్విళ్లుగొలుపు. దే. స. క్రి. (ఉవ్విళ్లుగొను ధా. ప్రే.) త్వరపెట్టు. "సీ. మాధుర్యధుర్య కోమలవచనామృతం బనుభవింపఁగఁ గౌతుకాంతరంబు. "గీ. గలుగఁ జేయుచు నువ్విళ్లుగొలుపు నీదు, సంగతి యొకింత గని యెట్లు జాఱవిడుతు." ప్రభా. ౩, ఆ. ౬౬.

ఉవ్విళ్లూరు. దే. అ. క్రి. (ఉవ్విళ్లు+ఊరు.) 1. తొందరపడు. "క...అతఁ, డువ్విళ్లూరెడు భవన్మదోద్ధతి యడఁపన్." హరి. ఉ. ౬, ఆ. ౧౧౬. 2. ఆసించు, కోరు. "మ. అనినం గేకయ రాజనందన ప్రభూతాశ్చర్యయై యిట్లనున్, వినునీరూపము సూచి మానృపతి..యువ్విళ్లూరునే నెమ్మెయిం,బనిగొందున్..." భార. విరా. ౧, ఆ. ౩౨౧.

ఉవ్విళ్లూర్చు. దే. స. క్రి. (ఉవ్విళ్లూరు. ధా. ప్రే.) ఆశ కలుగఁజేయు, కోరిక పుట్టించు. "సీ. ఏగంధగజయాన హృదయ మువ్విళ్లూర్చి భవునిమైఁ జక్క సాఁబాలు గొనియె." కాశీ. ౪, ఆ. ౧౫౦.

ఉవ్వు. దే. వి. శీఘ్రత్వాదులఁ దెలుపునసుకరణము. (చూ. ఉవ్వున.)

ఉవ్వున. దే. అవ్య. ద్రు. 1. వెంటనే, శీఘ్రముగా "ఉ...పసిండివిమాన మెక్కి తా,నువ్వున నచ్చరల్ గొలువ నుర్వికి వచ్చి ముహూర్తమాత్రలో, మవ్వపుటైహికక్రియలు మాని పరాపరతత్త్వవేది యై." వి. పు. ౫, ఆ. ౩౧౦. 2. తటాలున హఠాత్తుగా. "ఉ...ఒం డుపమ నేరక యూరక యుండి యింతలో,నువ్వునఁ జేవ నైకొని సహోదరి పాడి దొఱంగి చెల్లెలిన్,...వధియించు తెంపుతోన్." వి. పు. ౭, ఆ. ౮. "ఉ. ఉవ్వున నుప్పతిల్లె నసురోద్వహమూర్ధచయంబు గ్రక్కునన్." భా. రా. యు. ౨౧.

ఉవ్వెత్తు. దే. క్రి. విశే. (ఉవ్వు+ఎత్తు.) 2. పూర్తిగా. "ఉ. ఉత్తరుఁ డద్బుతం బగిబలౌఘములన్ నుఱుమాడి వైచె నువ్వెత్తుగ..." కళా. ౮, ఆ. ౫౭. 2. సునాయాసముగా. "మ. నను నువ్వెత్తుగఁ దాఁటిమీఁటితివి..." వసు. ౨, ఆ. ౧౦. 3. మితిమీఱి. "ఉ...ఆవ యు,వ్వెత్తుగఁ ద్రావినట్లు విబుధేశుఁడు మాణవకోగ్రనిమ్నకున్, జిత్తమునం దపించి..." పాండు. ౫, ఆ. ౧౮౯.

ఉవ్వెత్తుగొను. దే. స. క్రి. (ఉవ్వెత్తు+కొను.) అడఁచు, నశింపఁజేయు. "వ...ఉడుగణమయూఖంబుక్రొవ్వు లువ్వెత్తుగొని నివ్వటిల్లుచు బ్రహ్మాండకరండకర్పూర ఖండాయమానంబు లగు చంద్రకిరణంబులును..." భాగ. ౧౦, స్కం. పూ. ౭౬౫.

ఉశనసుఁడు. సం. వి. స్. పుం. శుక్రాచార్యుఁడు.

ఉశనుఁడు. సం. వి. స్. పుం. ఉశనసుఁడు, శుక్రుఁడు.

ఉశి. సం. వి. ఈ. స్త్రీ. ఇచ్ఛ, కోరిక.

ఉశీరము. సం. వి. అ. పుం. న. నలదము, వట్టివేరు ✿.

ఉష. సం. వి. ఆ. స్త్రీ. 1. రాత్రి. 2. రాత్రి శేషము. 3. అవు. 4. చేదుసొర ✿. 5. బాణుని తనయ.

ఉషణ. సం. వి. ఆ. స్త్రీ. 1. పిప్పలి ✿. 2. సొంటి.

ఉషణము. సం. వి. అ. న. 1. మిరియము. 2. సొంటి. 3. పిప్పలివేరు.

ఉషపము. సం. వి. అ. పుం. 1. అగ్ని. 2. చిత్రమూలము ✿.

ఉషపుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

ఉషము. సం. వి. అ. పుం. 1. గుగ్గిలము ✿. 2. వేకువ. 3. పగలు. 4. చౌటిమన్ను. విశ. (అ.ఆ.అ.) కాల్చునది.

ఉషర్బుధము. సం. వి. అ. పుం. చిత్రమూలము ✿.

ఉషర్బుధుఁడు. సం. వి. అ. పుం. 1. అగ్ని. 2. బిడ్డఁడు. విశ. (అ.ఆ.అ.) అగ్నిహోత్రము చేయు కాలమున మేలుకొని యుండువాఁడు.

ఉషసి. సం. వి. ఈ. స్త్రీ. సాయంసంధ్య.

ఉషస్యము. సం. విశ. (అ. ఆ. అ.) సంధ్యాకాల మందలిది.

ఉషస్సు. సం. వి. న్. న. ప్రత్యూషము, తెల్లవాఱుటకు ముందు నాలుగైదు గడియల కాలము.

ఉషాకలము. సం. వి. అ. పుం. ఉషఃకాలమునఁ గూయునది — కోడి.

ఉషి. సం. వి. ఇ. స్త్రీ. వృద్ధి, వడ్డి.

ఉషితము. సం. వి. అ. న. నివాసము. విశ.(అ.ఆ.అ.) 1. కాల్పఁబడినది. 2. ఉన్నది. 3. పాసిపోయినది.

ఉష్ట్రకర్ణి. సం. వి. ఈ. స్త్రీ. కరభకర్ణిక, వృక్షవిశేషము.

ఉష్ట్రము. సం. వి. అ. పుం. ఒంటె.

ఉష్ట్రి. సం. వి. ఈ. స్త్రీ. స్త్రీజాతియొంటె.

ఉష్ట్రిక. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉష్ట్రి. 2. ఒకరకపు కుండ. 3. కల్లుకుండ.

ఉష్ణకము. సం. వి. అ. పుం. 1. జ్వరము. 2. వేసవి.

ఉష్ణగుఁడు. సం. వి. ఉ. పుం. వేఁడివెలుఁగు, సూర్యుఁడు.

ఉష్ణనది. సం. వి. ఈ. స్త్రీ. వైతరణీనది.

ఉష్ణము. సం. వి. అ. పుం. 1. వేఁడిమి. 2. ఎండ. 3. వేసవి. 4. తాపము. 5. నీరుల్లి ✿. 6. ఒకానొక నరకము. విశ. (అ. ఆ. అ.) 1. వేఁడి గలది. 2. నేర్పు గలది. 3. చుఱుకు గలది. 4. కారము గలది. 5. కోపోద్రేకము గలది.

ఉష్ణరశ్మి. సం. వి. ఇ. పుం. సూర్యుఁడు.

ఉష్ణవారణము. సం. వి. అ. న. ఆతపత్రము, గొడుగు.

ఉష్ణాంశువు. సం. వి. ఉ. పుం. సూర్యుఁడు. (ఇట్లే: ఉష్ణకరుఁడు, ఉష్ణదీధితి, ఉష్ణభానువు, ఉష్ణరుచిమొ.)

ఉష్ణాగమము. సం. వి. అ. పుం. 1. వేసవి. 2. వేసవి రాక. ఇట్లే: ఉష్ణాభిగమము, ఉష్ణోపగమము.

ఉష్ణాసహము. సం. వి. అ. పుం. హేమంతఋతువు. విశ. (అ.ఆ.అ.) వేఁడిమి సహింపలేనిది.

ఉష్ణించు. సం. అ. క్రి. 1. ఎండు. "మ. ఉదకం బింకిన లావు దూలి వడిఁ దా నుష్ణింపఁగా రొంపిలోఁ, గదలంజాలనిమీను..." స. శ. ౫౮. 2. వేఁడెక్కు. "సీ. సారెకు నుష్ణించి నీరు గ్రమ్మెడు నేత్రములమీఁద నరసినబొమలు వ్రాల." వరాహ. ౬, ఆ. ౧౭.

ఉష్ణిక. సం. వి. ఆ. స్త్రీ. 1. యవాగువు, వేఁడిగంజి. 2. నేర్పు గలస్త్రీ. 3. చుఱుకైనస్త్రీ.

ఉష్ణిమ. సం. = ఉష్ణిమము.

ఉష్ణిమము. సం. వి. న్. పుం. వేఁడిమి.

ఉష్ణీషము. సం. వి. అ. పుం. న. 1. తలపాగ. 2. కిరీటము.

ఉష్ణీషి. సం. వి. న్. పుం. శివుఁడు. విశ. (అ.ఆ.అ.) ఉష్ణీషము గలవాఁడు.

ఉష్మము. సం. వి. అ. న్. పుం. 1. వేఁడిమి. 2. ఉక్క. 3. ఎండ. 4. వేసవి. 5. ఆవిరి.

ఉష్మాగమము. సం. వి. అ. పుం. ఉష్ణోపగమము, గ్రీష్మఋతువు.

ఉష్మోపగమము. సం. = ఉష్మాగమము.

ఉసి. దే. వి. 1. కుక్క మొదలగువానికిఁ జేయు ప్రేరణము. (చూ. ఉసికొలుపు.) 2. నుసి, పొడి. "ద్వి. పరగినకరతిత్తి పత్త్రాలసంచి, యొరగిన గొడుగును నుసి రాలు కోల." ద్వి. హరిశ్చ. ఉ. ౫౦౪, పం. 3. సంగీతము పాడునపుడు తాళము వేయుట ననుసరించి చేయు హస్తవిక్షేప విశేషము. (వా.) 4. అవకాశము. (ఆం. పా.)

ఉసికొను. దే. అ. క్రి. (కుక్క) కవియు, మీఁద పడు. (చూ. ఉసికొలుపు.)

ఉసికొలుపు, ఉసికొల్పు. దే. స. క్రి. (కుక్కను) కవియించు. "క. పొద లట్లు వెడలుపందుల, కదుపులఁ బట్టెడలు దిగిచి కవియించిన బెట్టిద మైన జాగిలంబులు, చెదరక డాయంగఁ జూచి చెంచులు కడకన్. క. వడి నుసికొలుపుటయును ..." య. ౨, ఆ. ౭౯. 2. ప్రేరించు. "చ... గోపకులాభరణుండు ప్రేమతోన్" "సీ. ఉసికొల్పి వంచించి దుసుకుల చనుదోయి చే నంట ..." రాధికా. ౧, ఆ. ౧౨౩, ౧౨౪.

ఉసిరి = ఉసిరిక. సాం. ని. స్థా. ౫౭. దశా. ౬, ఆ. ౧౫.

ఉసిరిక. దే. వి. ఆమలకి వృ. "గీ... శౌచ మృత్పిండ మునకుఁ, గలశసంభవ యుసిరికకాయయంత, మాన మని చెప్పుదురు కర్మమర్మవిదులు." కాశీ. ౫, ఆ. ౨౦౦. ఉ. రా. ౫, ఆ. ౨౮౩.

ఉసివోవు. దే. అ. క్రి. (ఉసి+పోవు.) తప్పిపోవు, గుఱికి తగులక దాఁటిపోవు. "ఉ. కానకు నంప తప్పెఱుఁగు గబ్బిమెకంబులు సేరఁ గారుపో, తేనుఁగుదాయ యెల్లపులి యేసినయే టుసివోయెఁ బోయెరన్, మానితి నిస్సిరో యనుచు..." కళా. ౪, ఆ. ౫౭.

ఉసుఁగు. దే. అ. క్రి. (క. ఉసిగు.) నుసుఁగు, తొలఁగు. "ద్వి... కన్నప్ప చెప్పరాయిడిని, చొప్పర నుసిఁగినచోట్ల భావమున, తడయక సిద్ధవు తానయై నిలిచి, పొడిపించుకొన్నట్టి పోటులు పగిది." పండితా. పురా. ౧౦౪, పు. "ద్వి. పోటులు బొందలు పొరలెత్తియున్న, చోటులు నుసిఁగిన చోటులు..." పండితా. పురా. ౧౦౪, పు.

ఉసుక. దే. వి. (క. ఉసుగె.) ఇసుక. "ద్వి. ఉసుక వంటకముగా నుడికింప వచ్చు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౩౧౯. (శ. ర. పా.)

ఉసుము. దే. అ. క్రి. 1. ఉడుకు; కడిగివేయు. "మ. అసిధారావధితాత్మ బంధుభుజమధ్యాసైన్యర నిర్యద్వసన్, మసలై పుట్టిన యమ్మహాదురితమున్ మస్పెట్టియున్ వాజిమే, ధనమిద్ధానలభూతిచే నుసిమియున్ దప్పింపలే నైతి నీ, కస టెప్పాటఁ దొలంగు నెట్టులగుదుం గల్యాణ కల్యాత్ముఁ డన్." పాండు. ౫, ఆ. ౪౧. 2. పులుము, నులుము. "గీ. అవయవంబులు గదలించి యావులించి, నిదురఁ దెప్పిఱి మేల్గాంచి నీల్గి మలఁగి, యొడలు విఱుచుచుఁ గనుఁగవ లుసుముకొనుచు, ధాత గూర్చుండె సృష్టిసంధాత యగుచు." భాగ. ౧, స్కం. ౭౩౪. 3. తోము, మసి పోవుటకై యిసుక మున్నగువానితో రాచు. "క. బిసరుహరజమునఁ బైకం, దుసిమిన దగదగ వెలుంగు నుదురాజు క్రియన్." పాండు. ౩, ఆ. ౧౯౬.

ఉసురసురు. దే. వి. (ఉసురు+అసురు.) తాపము దుఃఖము మున్నగువానివలన విడుచు నిశ్వాసములధ్వని కనుకరణము. "చ. మసుఁ గిడి పండుకొ మ్మనుచు మోహాముతోడ వితర్దిఁ జూపి తా, నుసురసు రంచు ఖిన్న యయి యొయ్యన నేఁగి ..." హంస. ౪, ఆ. ౧౧౩.

ఉసురు. దే. వి. తాపదుఃఖాదులందు విడుచు నిశ్వాసములధ్వని కనుకరణము. "గీ. అని ప్రమోదించు నుసు రసు నలంతఁ గుందు." సా. ౨, ఆ. ౧౪౭. "సీ. సంపెంగపూదరింటిచక్కి గోరంటఁ గాంచి యుసు రంచు మగిడి నోరూరునవియు." పారి. ౩, ఆ. ౫౧. (దీని యామ్రేడితరూపము ఉసురుసురు.)

ఉసురమను. దే. అ. క్రి. (ఉసురు+అను.) దుఃఖించు; బాధపడు. "క. తాపైన నఁ గరఁగు సేనిపు, డీయాడినమాటలకు నొకింతఁ గరఁగ వే, మోయి

యిది నీకు మంచిదో,కో యూఁడుది యుసురు మన్నఁ గొఱ గాదు సుమీ." సా. ౨,ఆ.౧౨3.

ఉసుఱు. వై. వి. (సం. అసవః.) 1. ప్రాణము. "గీ. ఉసుఱు నాఁగను బ్రాణాఖ్య యొప్పచుండు." ఆం. భా. ప్ర. ౬౧. 2. మనఃక్షోభమువలనఁ గలుగుఫలము. "గీ... నాయుసుఱు తాఁకి, దీపములు సైతమ మల్లాడుఁ దెఱవలార." శుక. ౨, ఆ. ౧౧౪.

ఉసుఱుకొను. దే. అ. క్రి. (ఉసుఱు+కొను.) వర్ధిల్లు, వృద్ధిపొందు. "వ... పెస రుసుఱుకొనియె..." కాశీ. 3, ఆ. ౨3.

ఉసులు. దే. వి. 1. వీలు, అనుకూల్యము. "వ. ఉసులు లేక..." ఉ. హరి. 3, ఆ. ౮౦. 2. సౌఖ్యము, సుఖము. (శ. ర.) విణ. 1. అనుకూలము:— నా దేహము ప్రయాణమున కుసులుగా లేదు. 2. సుఖవంతము. వా:— మాయిల్లు ఇరుకగుటచే నలుగురు వచ్చిన నుసులుగాఁ గూర్చుండఁ జోటుండదు.

ఉసుల్లో = ఇసుల్లో. (శ. ర.)

ఉసూరు = ఉస్సురు. "చ. సుదతియు విన్ననై కడు నుసూ రని మో మఱవాంచి యుండఁగా." రస. ౨, గు. ౯౨.

ఉస్తె. దే. వి. ఉచ్చింత ✤. "సీ...తంగేడి తగిడి యుస్తె." హంస. ౪, ఆ. ౧౦.

ఉస్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. భూమి. 2. గోవు. 3. ఎలుకజీడి ✤.

ఉస్రము. సం. వి. అ. పుం. 1. కిరణము. 2. ఎద్దు.

ఉస్రిక. సం. వి. ఆ. స్త్రీ. జలధేనువు, నీటియావు.

ఉస్సు = ఉస్సురు. "ఉ. ఓరువరానివంతఁ దల యూచుచు నుస్సని వెచ్చనూర్చు..." విక్ర. ౭, ఆ. ౧౫౪.

ఉస్సురస్సురు = ఉసురసురు. "ఆ. అంత నంత కంత కెంతయు సంతాప, మతిశయిల్ల నుస్సురస్సు రనుచు." పరమ. 3, ఆ. ౧౪౮.

ఉస్సురు. దే. వి. తాపము దుఃఖము మున్నగువాని ముందు విడుచు నిశ్వాసములధ్వని కనుకరణము. "గీ. ఇరుగు పొరుగులదంపతు లేపురేఁగి, సంగమక్రీడ నోలాడి సరసమాడు, సొవసొవలు విన్నమాత్ర నుస్సురుమటంచు, మన్మథుని బారిగొట్టై మగువ దలఁకు." హంస. ౫, ఆ. ౧౫౮.

ఉహుహూ. దే. వి. (ఉహూ+ఉహూ.) చలిచే వణఁకునపుడు కలుగుధ్వని కనుకరణము. "క. బహుశీతోపేతంబై, యుహుహూ యని వడఁకె లోక మూర్వీనాథా." భాగ. ౧౦, స్కం. పూ. ౯౦౦.

ఉహ్హూ. దే. వి. 1. నిప్పు, ధూళి మున్నగువాని నూఁదుటయం దగుధ్వని కనుకరణము. "సీ. ఉహ్హూని వహోమాగ్ని నూఁదనొల్లఁడు గాని..." పాండు. 3. ఆ. ౧౨. 2. ఉస్సురు. "ఉ. అంగడినుండి బియ్యము పదార్థములుం గొనివచ్చి దప్పిమై, నంగము దూల నుహ్హూనుచు..." కాశీ. ౫,ఆ.౬౫.

ఉళక్కి. దే. విణ. రిక్తము, ఉత్తది. (వా.)

ఉళిక్కి. దే. విణ. హుళిక్కి, కపటము. "గీ. జడలు రుదురక్కపేరులుఁ జాలఁబూని, బూది మెయిఁ బూసి పులితోలు మీఁదఁగూరు, చుండిముక్కును గన్నులు నొనరమూసి, కొని యుళిక్కిగ నేమేమొ గొణఁగుచుండె." అచ్చ. యు. ౪౯.

## ఊ

ఊ. ఉభ. దే. 1. ఒకానొకయక్షరము. 2. ఉకారాంతతత్సమపదములమీఁది సంబుద్ధి డుజ్జునకు వికల్పమై యాదేశముగా వచ్చు నక్షరము. ఉదా:— శంభూ ! సం. వి. ఊ. పుం. 1. శివుఁడు. 2. చంద్రుఁడు. 3. పురుషుఁడు. 4. వైశ్యుఁడు. (ఇది తెలుఁగున వ్యస్తముగాఁ బ్రయోగింపఁబడ లేదు.) ఊ. స్త్రీ. ఉపమ, పోలిక. విణ. (ఉ.ఊ.ఉ.) రక్షకుఁడు, కాపాడువాఁడు.

ఊం. వై. వి. (సం. హుమ్.) 1. శంఖాదు లూఁదునపుడు కలుగుధ్వని కనుకరణము. (వా.) 2. పల్లకీ మోయుబెస్తలు ' ఓం తోపా ' టుపయోగించు మఱియొక యూఁతపదము. (వా.)

ఊఁ. వై. అవ్య. (సం. హుమ్.) 1. కథాది శ్రవణసమయమున శ్రోత వినుచున్నట్లు తెలుపుపదము. 'ఉదా:— ఊఁ. తరువాత. 2. అంగీకారమును

తెలియఁజేయుపదము. ఉదా:—నీవు రేపు తప్పక వచ్చెదవా? ఊఁ. 3. క్రోధము, ఆశ్చర్యము మున్నగువానిని దెలుపు పదము. (వా.) 4. ప్రశ్నార్థకము. (ఆం. పా.)

ఊఁక. దే. వి. 1. ఊఁగులాట. "చ. పికముల వీఁక కర్ణ సిరులఁ జేర్చినయామని యూఁచు నూఁక కున్, జకితమృగాక్షి యొర్వ నిఁకఁ జాలఁ గృపామతి నాదరింపుమా." రుక్మా. 3, ఆ. ౧౪౮. 2. ఉమక. "సీ...ఊఁక పొట్టుముక నా నొప్పఁ దుషము." ఆం. భా. ద్వి. ౨౩౯.

ఊఁకదంపు. దే. వి. (ఊఁక+దంపు.) 1. ధాన్యము బియ్యము చేయుటకై దంపి యూఁకను దొలఁగించుట. 2. అర్థము లేనిభాషణము. వా:—ఆతనియుపన్యాస మంతయు వట్టియూఁకదంపు.

ఊఁకదంపుపాట. దే. వి. (ఊఁక+దంపు+పాట.) 1. వడ్లు దంపునపుడు కాలక్షేపమునకు దంపు స్త్రీలు పాడుపాట. (వా.) 2. అర్థము లేనివాగాడంబరభాషణము. (వా.)

ఊఁకబంతి. దే. వి. (ఊఁక+బంతి.) ఊఁకవంటి రేకులు గలయొకబంతిచెట్టు. (ఊఁకబంతి, రేకబంతి, ముద్దబంతి యని బంతి మూఁడువిధములు.) ఉదా:—ఊఁకబంతిపువ్వు.

ఊఁకర. వై. వి. (సం. హుంకారః.) ఆనందముతోఁ జేయు "ఊఁ, ఊఁ" అను శిశువుల తొక్కుపలుకు. (చూ. ఊఁకరలిచ్చు.)

ఊఁకరలిచ్చు. ద్వ. అ. క్రి. (ఊఁకరలు+ఇచ్చు.) 1. శిశువులు ఆనందముతో ఊఁఊఁ అని ధ్వని చేయు. "సీ...వెడయేడ్పునంతన యుడుగు నుగ్గడుగు నూఁకరలిచ్చు నాలకించు." భో. 2, ఆ. ౧౭౬. 2. హుంకరించు. (చూ. ఊఁకరలుగొట్టు, ఊఁకరలువెట్టు. మొ.)

ఊఁకరలుగొట్టు. ద్వ. అ. క్రి. (ఊఁకరలు+కొట్టు.) హుంకరించు, ఆనందభయాదులచే నఱచు. "ద్వి...పసులు, వలివేగమున వచ్చి వచ్చి యొండొండ, యూఁకరల్ గొట్టుచు నుత్తల పడుచు." బస. 2, ఆ. ౧౨౨౨, పం. (ఇట్లే: ఊఁకరలు వెట్టు. బస. 4, ఆ. ౪౧౧, పం.)

ఊఁకించు. దే. అ. క్రి. ఉంకించు, పూను. "శా... నేఁ ద్రివిష్టపములన్ గెల్వంగ నూఁకింతు..." భార. కర్ణ. 3, ఆ. ౧౩౦.

ఊఁకు = ఊఁకించు. "చ. ఉరవడి నుప్పరం బెగయ నూఁకు మదీయపదోగ్రఘట్టన, స్ఫురణము సైఁప లేక వడి భూమి దిగంబడు..." భా. రా. సుం. 3. వి. 1. పూనిక. (శ. ర.) 2. మాఱు, పర్యాయము. "ఉ. తాఁకి భుజావిజృంభణము దర్పము నేర్పును నేర్పడంగ నొ, క్కూఁకున వేయు చేతుల మహోగ్రశరావళిపింజపింజతోఁ, దాఁకఁగ నేసినన్..." భాగ. ౧౦, స్కం. ఉ. ౪౩౬. 3. విజృంభణము, శక్తికొలఁది చేయు తీవ్రప్రయత్నము. "ఉ. ప్రాఁకుడు మాత్రికూట శిఖరంబులమీఁదికి నెల్లవారు నొక్కూఁకున ..." భా. రా. యు. ౨౮౦.

ఊఁకువ. దే. వి. 1. యత్నము, పూనిక. "ఉ. మచ్చికజింకఁ బట్ట వడిమై శశి యూఁకువ సేయ ..." కాళిందీ. ౧, ఆ. ౪౯. 2. మాఱు, పర్యాయము. "వ. అప్పులుంగు లొక్కయూఁకువ దెప్పరంబుగా నుప్పరంబున కెగసిన..." వేం. పంచ. ౨, ఆ. ౧౩. 3. విశ్రాంతిస్థానము. "చ...ఇదె పావనిపోవుచున్నవాఁ, డుడుగణవీథి లంకవల నొక్కఁడు నొక్కని మేమ మాశ్రమం, బుడుగ హిరణ్యనాభ తగ నూఁకువ గమ్ము..." భా. రా. సుం. ౨౬.

ఊఁకొట్టు. ద్వ. అ. క్రి. (ఊఁ+కొట్టు.) ఊఁఊఁ అను. "మ. సొలయన్ జూచు నగున్ బయల్ వలుకరించుం బలుక్క నూఁకొట్టు..." చంద్రా. 3, ఆ. ౪. స. క్రి. ఊఁఊఁ అనుచు విను. వా:—నే కథ చెప్పుచుండఁగా మా పిల్లవాఁ డూఁకొట్టుచున్నాఁడు. వి. శ్రమాది సూచకముగా ఊఁ యనుట. "సీ. పెదవికాటునఁ బుట్టు బెడిదంపుటూఁకొట్టు గుబ్బజీరలఁ దొట్టుగొదఁగు తిట్టు." చంద్రా. ౬, ఆ. ౧౪౧.

ఊఁకొను. ద్వ. అ. క్రి. (ఊఁ+కొను.) ఊఁ అను. "గీ. తనువు మఱచితి వేమొ యూఁకొన వదేమి, యపలికతఁ దెల్పు మనియెదో యైనఁ గాని." పార్వ. ౬, ఆ. ౨. స. క్రి. విను.

"శా. ఊఁకోఁ జెప్పఁగ నెంతయేని తడవౌ..." కాశీ. ౭, ఆ. ౧౭౩. "చ...అల్పబుద్ధులవెడ మాట లూఁకొనకు..." భార. ఉద్యో. ౩, ఆ. ౩౩౧.

ఊఁగాడు = (ఊఁగు+ఆడు.)ఊఁగియాడు. "శా. కంఠారావ మొనర్చె నత్తటి మహోగ్రస్ఫూర్తి దిఙ్నాగముల్, గుంటీభూతముదంబులై పడఁకఁగా గోత్రంబులూఁగాడఁగా..." చిత్రభా. ౩,ఆ.౨౬.

ఊఁగియాడు. దే. అ. క్రి. (ఊఁగి+ఆడు.) సంచలించు, కదలిపోవు. "సీ. తమతనుచ్ఛాయ మేఘములు పచ్చనివన్నె నుభయపక్షములునై యూఁగియాడ." కాశీ. ౩, ఆ. ౧౧.

ఊఁగు. దే. అ. క్రి. 1. ఆందోళించు, ముందు వెనుకల కుయ్యాలలో నుండి యూఁగాడు. "చ...సమీరణుఁ డర్కసఖుఁ డూఁచుచుండఁగా, నులియుచు మొల్లగుత్తు లనుసుయ్యెల లొప్పుగ నెక్కి యూఁగె నుల్లలదళిసీకులంబు..." భార. ఆర. ౪, ఆ. ౧౩౮. 2. కదలు. "క. ఊఁగెడుపల్లును విసమునఁ, దోఁగినవంటకముఁ గుత్సితుం డగు మంత్రిక్, లోఁగక యుమ్మాలించిన,చోఁ గలుగు నఖండ మైనసుఖ మెవ్వరికిన్." వేం. పంచ. ౧, ఆ. ౩౭౬.

ఊఁగులాట. దే. వి. (ఊఁగులాడు. ధా.) ఆందోళనము, ఊఁగులాడుట. (శ. ర.)

ఊఁగులాడు. దే. అ. క్రి. (ఊఁగులు+ఆడు.) 1. ఊఁగాడు. (శ. ర.) 2. సంచలించు; కలఁతనందు. "గీ. ఓరచూపులవిటచిత్త మూఁగులాడ." వీథి. ౫౦.

ఊఁచే. దే. వి. (క. ఊచె.) 1. ఇషీక, ఒకవిధ మగు తృణము. "గీ. విసరి యొకయూఁచఁ గొని వేయ వెంట వెంట, నదియ యొక్కమహాస్త్రమై కదియఁ గాకి, లావు సెడి వచ్చి ననుఁ గావు కావు మనుచుఁ, బాదముల వ్రాలఁ బరమకృపాళుఁ డగుచు." రామా. ౫, ఆ. ౬౮. 2. జొన్నలోనగువానికంకికాఁడ. (చూ. ఊఁచేబియ్యము.) 3. అరఁటిదూట. (శ. ర.) 4. ఇనుము మొదలగు వానికడ్డీ. ఉదా:—ఇనుపయూఁచ. 5. వెదురుబాణము. (వా.)

ఊఁచేకండె. దే. వి. (ఊఁచ+కండె.) నూలు చుట్టిన సున్నని జొన్నకాఁడ. "గీ. ఎన్నికలు పట్టి పుంజంబు లేర్పరించి, పంటకట్టలు మఱితోడుపడఁగ లూఁచకండె లొనరించి చాలించి కాఁపుటింతు, లున్న..." శుక. ౨, ఆ. ౪౨౩.

ఊఁచేపడు. ద్వ. అ. క్రి. (ఊఁచ+పడు.) 1. ఊఁచవలె సన్నమగు, కృశించు. 2. ఊఁచ కల దగు. "చ. సరసిజగంధి పెందొడలసాటికి రా నెదిరించి పోరు నీకరభము లెల్లఁ జేపడఁగఁ గన్గొని యుండియుఁ దజ్జయార్థమై, పొరలఁ బెనంగి యూఁచపడి పోవుట లింతియ కాక ధాత్రిపై, నరఁటులు పిల్లపిల్లతర మైనను సామ్యముఁ బొందనేర్చునే." భాను. ౨, ఆ. ౧౩. (రెండర్థములకు నిది యుదాహరణము.)

ఊఁచేపోవు. దే. అ. క్రి. (ఊఁచ+పోవు.) ఊఁచవలె నగు, కృశించు. "సీ...ఊఁచపోయినపిఱుఁదుదుటుఁబొట్ట." భల్లా. ౪, ఆ. (శ. ర.)

ఊఁచేబియ్యము. దే. వి. (ఊఁచ+బియ్యము.) ముదురని జొన్నగింజలు. "సీ. కంకుల నొజ్జ లేకాలంబు గడపంగ నూఁచబియ్యంబు శిష్యులకు గలవె." రామలిం. ౬౫.

ఊఁచేముట్టు. దే. క్రి. విణ. పూర్తి, నిశ్శేషము. "గీ. ఊఁచముట్టుగ గీము లాహుతిగొనంగ, ముఖరపావకశిఖలపై మోఁదుకొనిరి." రామా. ౬, ఆ. ౨౫౦. "గీ. సర్వధనములు నద్దురాచారశీలుఁ, డూఁచముట్టుగ నిలు ద్రోఁచి యుఱికి చనుట." పాండు. ౩, ఆ. ౫౦.

ఊఁచముట్టుగొను. దే. స. క్రి. (ఊఁచముట్టు+కొను.) నిశ్శేషముగాఁ జంపు; చంపు. "గీ...నీ తమ్ముఁగుఱ్ఱల నూఁచముట్టు, కొనియెనే విధి..." భార. శల్య. ౧, ఆ. ౨౮.

ఊఁచే. దే. స. క్రి. (ఊఁగుధా. ప్రే.) 1. ఊఁగఁజేయు, ఆందోళింపఁజేయు. "చ...సమీరణుఁ డర్కసఖుఁ డూఁచుచుండఁగా,నులియుచు మొల్లగుత్తు లను సుయ్యెల లొప్పఁగ నెక్కి యూఁగె నుల్లలదళిసీకులంబు..." భార. ఆర. ౪, ఆ. ౧౩౮. 2. ఆడించు, కదలించు. "ద్వి...విప్రు,

నొడసి గడ్డము పట్టి యూఁచె నవ్వేలఁది." ద్వి. హరిశ్చ. ఉ. ౧౧౩౦, పం.—అ. క్రి. సందే హించు, కొంకు. "క. కయ్యానకుఁ గాల్ద్రువ్వుచు, గయ్యాళితనంబు మీఱఁ గా డగ్గఱి యా, తొయ్యాలి యూఁచక యూఁచక, పయ్యెదకొంగును బటానబయలుగఁ జేసెన్." సా. 3, ఆ. ౧౬. "గీ. ఊఁచకాఁచక మఱి తలయూఁచె నొకతె." రాధికా. ౧, ఆ. ౧౮. (సందేహము సిగ్గు లేక కేళికి రమ్మని సైగచేసె నని భావము.)

ఊఁటాడించు. దే. స. క్రి. (ఊఁటాడు ధా. ప్రే.) 1. మాఱుమ్రోఁగించు, ప్రతిధ్వనింపఁజేయు. "క...వియచ్చరాహ్వానోద్గా, త్రుచ్చరితసామమంత్రము, ఖోచ్చధ్వను లంతరిక్ష మూఁటాడింపన్." జై. ౭, ఆ. ౨౦౩. 2. ఓడించు, ఓడఁ జేయు. "శా...ముదాళిమాలికల నూఁటాడించు వేణీరుచుల్." విజ. ౨, ఆ. ౧౬.

ఊఁటాడు. దే. అ. క్రి. (ఊఁటు+ఆడు.) 1. త్వరపడు, వేగిరపడు. (ఈ పదము నిరనుస్వారయుక్తమని శ. ర; సూ. ని. కాని, యీ క్రిందినిర్ధారక ప్రయోగమును బట్టియుఁ బై పదచ్ఛేదము ననుసరించియు సానుస్వారముగనే గ్రహింపఁబడినది.) "క. దాఁటి తనుఁ బూఁచి ప్రేయఁగ, నూఁటాడెడు నతనిఁ గృష్ణుఁ డొకయమ్మున నొ, క్కూ్కఁటున నడిదముఁ బలుకయుఁ, దూఁటులుగా నేయ వాఁడు దొలఁగక కడిమిన్." పద్మ. ౧౦, ఆ. ౩౨. 2. ఊఁగు, ఊఁగాడు. "ఉ. కూడె జగంబు లన్నియును గ్రుంకిరి సూర్యసుధాంశులద్రు లూఁటాడె...వృత్రుఁడు బొబ్బ వెట్టినన్." భాగ. ౬ స్కం. ౩౮౪. 3. అలయు, సొమ్మసిలు. "క. కాటుపడి భీతిఁ గాయం, బూఁటాడం బఱచి..." వేం. పంచ. 3, ఆ. 3౯౧. 4. తొలఁగు, పోవు. "మ. ఇదిగో వచ్చెద నంచుఁ బోయె బహునాళ్ళేఁగెన్ మహాబ్దంబులై, సదయుం డేటికి రాఁడు...జీవ మూఁటాడెడిన్, మదనక్రూరదవానలం బదనమై మై నంటఁగాఁ గీరమా." రాధికా. ౨, ఆ. ౬౧. 5. అధికమగు, పెంపొందు. "శా. ఆరాజుం గనువేడ్క చిత్తముల నూఁటాడన్..." వరాహ.

3, ఆ. ౧౨౭. 6. సంచరించు, తిరుగు. "వ. ఒంటిపాటున వేఁటపైఁ గలతివుట నూఁటాడుచు సమీపాటవీమధ్యంబు సొచ్చి..." పాండు. 3, ఆ. ౮౯. 7. వెనుకకు లాఁగు, ముందునకుఁ బోనీకుండు. "క. పెన్నిధిఁ గని పోవఁగ లేకున్నకృపణుమాడ్కిఁ జిత్తమూఁటాడఁగ నా, కన్నె పరాధీనత నతి, ఖిన్న యగుచు నింటికెట్టకేలకుఁ జనియెన్." జై. ౮, ఆ. ౭౮.

ఊఁటు. దే. స. క్రి. దూఁటు, పొడుచు. "సీ. చేరి సమ్మెటలను జేయికోలల వ్రేసి యంకుశంబుల నూఁటి యతిరయమున." భార. భీష్మ. 3, ఆ. ౨౩౪. వి. 1. పోటు, పొడుపు. "క. దాఁటి తనుఁ బూఁచి ప్రేయఁగ, నూఁటాడెడునతనిఁ గృష్ణుఁ డొకయమ్మున నొక్కూఁటున నడిదముఁ బలుకయుఁ, దూఁటులుగా నేయ వాఁడు దొలఁగక కడిమిన్." పద్మ. ౧౦, ఆ. ౩౨. 2. త్వర, తొందర. (చూ. ఊఁటాడు.)

ఊఁదు. దే. ల. క్రి. (త. ఊన్ఱు. క. ఊఱు.) నాఁటు, గ్రుచ్చు. (చూ. ఊఁదుకొను.)

ఊఁదుకొను. దే. అ. క్రి. (ఊఁదు+కొను.) నాఁటు. "గీ. పొదలి మాయ నదృశ్యులై చదలనుండి, కొండలంతలు తాళ్లు ముకుందుమీఁద, నూఁదుకొన వైవఁ దొడఁగి రొండొండ..." హరి. ఉ. ౯, ఆ. ౨౩౧. "క. ఊఁదుకొనఁ బడుమధూళిక, యోడికలకుఁ గ్రింపఁ గ్రమ్మియుండెడు తేంట్లన్, నీడలు దిరిగియుఁ దిరుగని, జాడఁ దరుల్ వొలిచె నవ్వసంతపువేళన్." ఆము. ౫, ఆ. ౧౩౭.

ఊఁదుచు = ఊఁదుప్పు: 1. నాఱునాఁటు. (శ. ర.) 2. చిమ్ము; సమ్మార్జించు. (శ. ర.)

ఊఁదుపు = ఊఁదుప్పు. (చూ. ఊఁదుప్పు.)

ఊఁదుప్పు. దే. స. క్రి. ఒకచోట నున్నమొక్కలను దీసి మఱియొకయుచితస్థలమున నాఁటు. "మ... వియద్గంగా ప్రవాహంబులో, పటిహైమాంబుజనాళముల్ పెఱికి యూఁదుప్పం జేయు దేవాళిచే, నిటు దైతేయుఁడు కేళిదీర్ఘికలలో నిచ్చావినోదంబుగన్." భార. 3, ఆ. ౭.

ఊఁదుప్పు. దే. వి. పరినాఱు మున్నగునవి దమ్ము చేసిన పొలములలోఁ నాఁటుట. (వా.)

ఊఁత. దే. వి. **1.** అవలంబము, పట్టు. "ఉ. ఊఁతల లోన నెల్లఁ గడు లేఁత కృతాంతునిసమ్ముఖంబు దా, రోఁతలకెల్లఁ బుట్టినిలు రోషము కందువ మృత్యుమూర్తి వె, న్నూఁత..." శివ. ఉ. ౨, ఆ. 33. **2.** ప్రాపు, రక్షణము. "గీ. అధిప వెఱయాశ్రమస్థుల కందఱకును, విను గృహస్థాశ్రమమువాఁడె వెలయ నూఁత." భో. ౨, ఆ. ౭౨. **3.** చేఁపలఁబట్టు ఒకవిధ మగుసాధనము. "ఆ. ఊఁతనీరు చెలఁది నేఁతమూ టాయెటి, దూది యెండపసుపు తొట్టియక్కఱంబు మేను దీని రహిఁ బుణ్యమమ్ముట, కప్పురంబు వెట్టి యుప్పు గొనుట." ఆము. ౬, ఆ. ౬౯., వేం. పంచ. ౧, ఆ. ౨౯౪.

ఊఁతకోల. ద్వి. వి. (ఊఁత+కోల.) **1.** ఊఁతము నకుఁ బట్టుకొనుకఱ్ఱ. "ఆ...బాపనయ్య నా కెదురయ్యెఁ దా, నూఁతకోల చేత నూఁదికొను చు." భో. ౪, ఆ. ౬3. **2.** ప్రాపు, రక్షణము. "గీ. అంధునకు నూఁతకోలగా నకట యొకని, నైన నిలుపక నూర్వుర నదయవృత్తి, మ్రింగితి ..." భార. స్త్రీ. ౧, ఆ. ౧౭౦.

ఊఁతగొను. దే. స. క్రి. (ఊఁత+కొను.) **1.** ఆధారముగాఁ బట్టుకొను. "గీ...సిడ మతఁ డూఁత గొనియె." భార. భీష్మ. ౨, ఆ. ౨౪౨. **2.** ఆధారముఁ జేసికొను. "ఉ. కాననివాని నూఁతగొని కాననివాఁడు విశిష్టవస్తువుల్, గాననిభంగి..." భాగ. ౭, స్కం. ౧౮౨.

ఊఁతము. దే. వి. **1.** పట్టు, అవలంబము. "సీ. తన చేతి నిడుదయూఁతపుఁగోల యందిచ్చి మెల్ల మెల్లనె కొంత మెలఁగఁజేయు." సా. 3, ఆ. ౨౯౯. **2.** బరువు, భారము. వా:—ఆ కావడి కొమ్మునకు ఊఁతము ఎక్కువైనది. విణ. బరువైనది. వా:—ఈకఱ్ఱ చాలనూఁతముగా నున్నది.

ఊఁతయిచ్చు. దే. స. క్రి. (ఊఁత+ఇచ్చు.) అవలంబముగాఁ జేయు. "ఉ. నాపుడు మూర్ఛ వచ్చిన మనంబునకున్ ధృతి యూఁతయిచ్చి ..." నిర్వ. ౯, ఆ. ౧౦౯.

ఊఁతు. దే. వి. చేఁపలఁబట్టువల. (ఆం. పా.)

ఊఁద. దే. వి. **1.** ఉబ్బు. (చూ. ఊఁదబొద్దు.) **2.** వాఁపు. (శ. ర.) **3.** ఈర్ష్య. "గీ. ఈసు నా నూఁద నాఁ దగు నీర్ష్య..." ఆం. భా. ప్ర. ౧3౪.

ఊఁదబొద్దు. దే. వి. (ఊఁద+బొద్దు.) ఉబికిన బొద్దు. "సీ. బొక్కియొమ్ముసు నూఁదబొద్దును మిడిపండ్లు తెఱ్ఱినోరును బాఁచి దేఱుమొగము." భల్లా. ౪, ఆ. (శ. ర.)

ఊఁదర. దే. వి. (కాయలు పండుటకును ఎలుక మున్నగునవి చచ్చుటకును వేయు) పొగ. (చూ. ఊఁదరకొట్టు.)

ఊఁదరకొట్టు. దే. స. క్రి. (ఊఁదర+కొట్టు.) **1.** అరఁటికాయలు మున్నగునవి రాశిగా నుంచి వాని మీఁద కప్పువెట్టి ఒకచోట సన్ననిరంధ్ర ముంచి దానిద్వారమునఁ బొగ లోపలికిఁ బంపు. (దీని వలన నవి త్వరగా పండును.) (వా.) **2.** ఎలుక పాము మున్నగునవి యుండెడికన్నము ద్వారమున పొగ లోనికి పోవునట్లు చేయు. (దీనివలన నవి చచ్చును.) **3.** తెఱపి లేకుండఁ జేయు. వా:— ఆ బాలుని పనిలోఁ బెట్టి యూఁదరకొట్టు చున్నారు.

ఊఁదరలిడు = ఊఁదరకొట్టు. "ద్వి. ఉరుధూమ తతుల బిట్టూఁదరలిడిన, పరుసునఁ దొఱటలఁ బాములు మడియ." ద్వి.హరిశ్చ. పూ. ౨౨3౯,౪౦.

ఊఁదరవెట్టు. దే. స. క్రి. (ఊఁదర+పెట్టు.) ఊఁదరకొట్టు, పొగ వేసిజంతువులఁ జంపు. "గీ. పాదలుతన ఫూత్కృతుల నెల్లఁ బొగలు గవిసి, యబ్జజాండ మూఁదరవెట్టినట్లు గాఁగఁ, గాల కర్కశకాయుండు కాళియుండు, గవిసె గోపాల బాలుపైఁ గసిమసంగి." హరి. పూ. ౭, ఆ. ౨౧.

ఊఁదు. దే. అ. క్రి. **1.** నిప్పు మొదలగునవి రగుల్చుటకు నోటితో వేగముగా గాలి విడుచు. "మ...ఉష్మాని వక్త్రంబు బిగించి యూఁదుట యు నుల్కాగ్నిచ్ఛటల్ గ్రమ్మ..." కాశీ. ౬, ఆ. ౨౨౯. **2.** ఉబుకు, ఉబ్బు. "ద్వి. అది యేల కడు పూఁద దయ్యెడుఁ జెపుమ." బస. 3, ఆ.

3౭3, పం. స. క్రి. (క. ఊదు.) **1.** నోటిగాలి శీఘ్రముగా విడిచి నిప్పు రగుల్చు. "చ. అనలము నోర నూఁదఁ జన దగ్గియు నీరము నొక్కమాటు తేఁ, జనము..." మార్క. 3, ఆ. ౨౪౭. **2.** కరఁగించు. "గీ. తామ్రమాదిగఁ గలయట్టి ధాతుచయముఁ, గొలిమి నిడి యూఁదఁ గీడెల్లఁ బొలియునట్లు." మార్క. 3, ఆ. 3౧౫. **3.** నోటిగాలిచే ఎగురఁగొట్టు. "ఉ... గౌతమీనదిన్, బుట్టిన సత్పవిత్రజలపూరముఁ ద్రుస్సన నూఁదుచున్..." భీమ. ౫, ఆ. ౧౧౬. **4.** (శంఖాదులను) పూరించు. **5.** ఎగురఁగొట్టు. "ఉ. ఊఁదుకపోవు శంఖము నహో గళరేఖ..." విజ. ౧, ఆ. ౬౯. (**4, 5.** అర్థములకు రెండిటికి నిది యుదాహరణము.) **6.** గ్రహించు, పట్టుకొను. "ఆ... ద్రుపదుచే, యూఁది యింటిలోని కొనర నరిగె." భార. ఆది. ౭, ఆ. ౨౫౪. **7.** అవలంబించు, ప్రధానముగాఁ గొను. "ఉ. మానుష శక్తి యొల్లఁడు సమంచితదైవము యూఁది యుండు..." భార. ఉద్యో. ౨, ఆ. ౮. **8.** నిలుపు, ఆను. "గీ. అకట దిక్కుల కెల్ల దిక్కైనమాకు, నొక్కదిక్కును లేదు కాలూఁదనైన, దిక్కు గావయ్య నేఁడు మా దిక్కుఁ జూచి." భాగ. ౬, స్కం. 33౯. **9.** నొక్కు, ఒత్తిడి చేయు. "సీ. కోర కెవ్వఁడు పదాంగుష్ఠభాగంబున నుడురాజుపొట్ట గుజ్జుఅక నూఁదె." కాశీ. 3, ఆ. 3౨. **10.** నాఁటు, గ్రుచ్చు. "శా. చేతోజాతవిరోధి కాశినగరీక్షేత్రోపకంఠంబునన్, శాతాగ్రం బగుశూల మూఁద ధరణీచక్రంబు భేదించుచున్..." కాశీ. ౫, ఆ. ౧3౭. **11.** చేఁపలను ఊఁతతోఁ బట్టు. (శ.ర.) వి. **1.** వాఁపు. (శ.ర.) **2.** ఊఁత. (శ. ర.)

ఊఁదుఁగ్రోవి. దే. వి. (ఊఁదు+క్రోవి.) **1.** ఊఁదెదుగొట్టము. "మ. ప్రతిసూర్యం డనుకమ్మటంబు మఘువద్భ్రాణాస మన్కాఱు రోహిత మస్పేరిటి యూఁదుఁగ్రోవి..." చంద్రా. ౪, ఆ. ౧౭. (శ. ర. పా. ఊఁదుఁగ్రోవ్వి ముద్రి.) **2.** పిల్లఁగ్రోవి. **3.** బ. బాలక్రీడావిశేషము. "సీ. కోలాటములు పిల్లఁగ్రోవులు గుమ్మడి క్రోవికూఁతలు నూఁదుఁగ్రోవులు..." హంస. 3, ఆ. ౧౪౬.

ఊఁదుఘుటికలు. మి. వి. బ. ధాన్యవిశేషము. "వ... ఊఁదుఘుటికలు గాజుకడియములు జాజికుసుమలు... అను నూటనాలుగువగల పైరులు..." ప్రబంధ. ౧౧౨.

ఊఁదువత్తి. ద్వ. వి. వత్తిధూపము, సాంబ్రాణివత్తి. (శ. ర.)

ఊఁదువెండి. దే. వి. శుద్ధరజతము, పరిశుద్ధి చేయఁబడిన వెండి. (శ. ర.)

ఊఁపర. దే. వి. తూఁపర, వ్యర్థప్రసంగము. "ఉ... ఈచెనటియూఁపర లేటికి నాడె దెన్నియున్." కు. సం. ౭, ఆ. 33.

ఊఁపరలాఁడు. దే. విశ. (ఊఁపరలు+ఆడు.) వ్యర్థప్రసంగము లాడువాఁడు. "సీ. ఊఁపరలాఁడుగాఁ డుపకారి..." ఉ. హరి. ౫, ఆ. ౨౭౮.

ఊఁపాడు = ఊఁగాడు. "సీ. చూపుఁదేఁటులపిల్ల లూపాడఁ జొచ్చెఁబో..." రాజ.చ.౧,ఆ.౮౪.

ఊఁపు = ఊఁచు. "శా... భూమీచక్రము పూని యెట్లు దల లూఁపుం బన్నగస్వామి..." నైష. ౫, ఆ. ౧3౭. వి. ఊఁచుట. (శ. ర. వా.)

ఊఁపురము. దే. వి. మూఁపురము, కకుదము. ఆం. భా. ద్వి. ౨౬౨.

ఊకనబొడ్డు. దే. వి. ఒకానొకమందాకుచెట్టు. (శ. ర: బ్రౌ.)

ఊచె. దే. అ. క్రి. (వ్యాధిచేఁ దలవెంట్రుకలు) రాలు. (శ. ర; బ్రౌ.)

ఊట. దే. వి. (క. ఊటె.) **1.** ఊరిన ద్రవపదార్థము. "సీ. దుర్గంధబుద్బుద దూష్యతఁ బొరయని యూటనీరును శుచులు..." మార్క. 3, ఆ. ౨౫౬. **2.** ఊరగాయరసము. (శ. ర.) **3.** చేవ, బలము. వేంక. మాన. ౫౬. **4.** సారము. "సీ...ఎముకయూఁట, చవి గని యానుచు..." భార. స్త్రీ. ౨, ఆ. ౯.

ఊటబుడ్డిచెక్క. దే. వి. కట్టడమునకుఁ దగినయొక దినుసుమ్రాను. (శ. ర.)

ఊటమెకము. దే. వి. దంష్ట్రి, పంది. సాం. ని. తిర్య. ౭౫.

ఊటరి. దే. వి. ఒకజాతిమొక్క. "సీ. శ్రీతులసియు సంబరేను సే లుసిరి కీశ్వరి నేలవే మూటరి చల్ల గడ్డ." హంస. ౪, ఆ. ౧౦.

ఊటరించు. దే. స. క్రి. 1. బెల్లించు. "సీ. వెలయును దేలించె బెల్లించె నూటరించె ననఁగ నెక్కించెనం చనెడిమాట." ఆం. భా. తృ. ౧-౨౪. 2. వంచించు, మోసముచేయు. (శ. ర.)

ఊటు. దే. వి. వానచినుకులు పడుటచేఁ గలిగిన చెమ్మ. (శ. ర.)

ఊడ. దే. వి. (క. ఊడె.) మఱ్ఱి మున్నగు చెట్ల కొమ్మలనుండి క్రిందికి వ్రేలాడువేరు, అవరోహము. (శ. ర.)

ఊడఁదన్ను. దే. స. క్రి. (ఊడన్+తన్ను.) 1. తొలఁగించు, నశింపఁజేయు. "క. అమరత్వమునకుఁ బోవుచుఁ, దమభవబంధము లూడఁదన్నుకొను గతిన్, సమరోర్వి నిమిషమాత్రంబు మదారాతులకబంధములు దన్నుకొనుక్." వరాహ. ౫, ఆ. ౩౨. 2. ఊడునట్లు తన్ను. (వ్యా.)

ఊడఁబీకు. దే. స. క్రి. (ఊడన్+పీకు.) ఊడునట్లు లాగు. (వా. ఆం. పదా.)

ఊడనిఁబాడు. దే. అ. క్రి. 1. వెడలిపోవు; నెమ్మదిగాఁ దొలఁగిపోవు. "క. ఆక్కాంతామణినెచ్చెలు, లొక్కొకపనిపేరు చెప్పి యూడనిఁబాడక్." కవిజ. ౩, ఆ. ౯౦. 2. పాఱిపోవు; భయముచే నల్దెసలఁ బరుగిడు. "చ...పక్షిరాజుఁ గని యచ్యుతపౌత్రునిఁ జుట్టుకొన్నయ, య్యురగము లెల్ల నల్దెసల నూడనిఁబాడిన..." ఉ. హరి. ౬, ఆ. ౨౩౯.

ఊడి. దే. వి. ఒకరకముకూరాకు. (శ. ర. బ్రౌ.)

ఊడిగము. దే. వి. (క. ఊటిగమ్.) సేవ, పరిచర్య. గీ. వెండియును నేలచెఱఁగుల నుండురాజు, లరికి నిచ్చినకన్నియ లడఁకువలను, గదిసి కట్టడయగునూడిగములు సేయ." య. ౧, ఆ. ౯౯. విణ. సేవకుఁడు, పరిచారకుఁడు. "గీ. కదలె నృపు వెంబడిన యూడిగములు..." ఉ. రా. ౭, ఆ. ౪౦౨.

ఊడిగీఁడు. దే. వి. (ఊడిగము+ఈఁడు.) 1. సేవకుఁడు. "గీ. దొరలు ప్రెగడలు మన్నీలు బిరుదులొజ్జ, లూడిగీలును బోగపుఁజేడియలును...కొలువ..." అచ్చ. అయో. ౫. 2. పరిచారిక. "ఉ...చూడ వేమి యో, నూనిని యూడిగీంద్ర..." గంధ. ౧, ఆ. ౫౪.

ఊడిగెము = ఊడిగము. "సీ...కిన్నరాంగన లూడిగెములు సేయ." చిత్రభా. ౪, ఆ. ౫౭.

ఊడిత. దే. వి. (సాలెవాఁడు పడుగు చేయునపుడది పడిపోకుండుటకై క్రింద నూతగా నిలువున నిలిపెడు) కఱ్ఱలజంట, కత్తెరకాలు. "సీ. పరిపరి యచ్చులు చదికుండ యూడిత చీడుదబ్బలు దండె నాడెక్రోవి." హంస. ౨, ఆ. ౧౧.

ఊడిపడు. ద్వ. అ. క్రి. (ఊడి+పడు.) 1. ఉట్టిపడు, అకస్మాత్తుగా దిగివచ్చు. వ్యవ.—వాఁడు కొండమీఁదనుండి యూడిపడ్డట్లు మాటాడుచున్నాఁడు. 2. గర్భవిచ్ఛిత్తియై పుట్టి క్రిందఁబడు; పుట్టు. "గీ...అవ్వరాహంబులన యీనుచో...ఒకపోతుపిల్ల యూడిపడఁగ..." భో. ౪, ఆ. ౧౮౧. ద్వా. ౫, ఆ. ౧౯౦.

ఊడియము = ఊడిగము. (శ. ర.)

ఊడు. దే. అ. క్రి. 1. విఱుగు; రాలు. "చ...పీనిఁ గపటాత్ముని నిచ్చట నుండనీక పంబ్లూడఁగ వేసి ద్రొబ్బుఁ దని యుగ్రతఁ బల్కిన..." వీర. ౨, ఆ. ౨౨౪. 2. సడలు; జాఱు. "గీ. తొడిమబూడి..." వరాహ. ౧౦, ఆ. ౧౨౫. "క. పెరిఁగిన త్రివిక్రమేశ్వరు, చరణతులాకోటి యతఁడు సంప్రాప్తదేహ, స్ఫురణంబడగునపు డూడిన, కరణిం బురికోట యొప్పుఁగనకమయంబై." పాండు. ౧, ఆ. ౧౦౫. 3. తెగు, ఖండితమగు. (చూ. ఊడుచు.) 4. భగ్నమగు, చెడిపోవు. "ఉ...సరివారలు నవ్విన నేమి కాఁపురం, బూడిన నేమి నాదగు ప్రియుం డిలు పాసి చనంగ..." శశాం.

౪, ఆ. ౩౭. 5. చనిపోవు. వా:—వాఁడున్న వాఁడును గాక యూడినవాఁడును గాకుండ నున్నాఁడు. 6. పాఱు, పరుగెత్తు. "గీ. దనుజుఁడు...తిరిగి వేఱొక్కదిక్కు, తెరువుగా నూడఁ జూచిన నరుగనీక." భార. ఆర. ౨, ఆ. ౧౨౫.

ఊడుగు. దే. వి. అంకోలము ♆. "సీ. వేణుజాతము లైన యూఱిపూసల నెంతు రూడుగుపండ్లకు నీడుగాఁగ." కాశీ. 3, ఆ. ౪.

ఊడుచే. దే. స. క్రి. (ఊడు. ధా. ప్రే.) 1. ఊడఁ జేయు, తొలఁగించు. "సీ. కస్తూరికాపుష్పగంధ బంధురమణిబంధ మూడిచి జటాభార మూని." భా. రా. అయో. ౬౩. 2. వదలించు, విప్పు. (చూ. ఊడ్చు.)

ఊడుపు. దే. వి. 1. పాదరక్షావిశేషము. ఆం. భా. ద్వి. ౨౯౮. 2. విడుదల. (వ్యు.)

ఊడెము = ఊడిగము. "ఉ...శృంగారరసంపుగిండి గలకామునియూడెపుఁగత్తెయో యనన్." కళా. ౮, ఆ. ౧౪౨.

ఊడ్చు. దే. స. క్రి. 1. సడలించు. "శా...తనవి న్లెక్కూడ్చి..." బహు. 3, ఆ. ౯౪. 2. విప్పు, వదలించు. "వ...యుగ్యంబులపగ్గంబు లూడ్చి..." వరాహ. ౪, ఆ. ౧౨౦. 3. విడుచు. "గీ. కుబుస మూడ్చెడిమేటినాగువును బోలె." భీమ. ౫, ఆ. ౭౦. 4. పీఁకు, లాగివైచు. "ఆ. పడుచు లీఁక లూడ్చి పట్టి యూడెదునట్టి, పులుఁగుచంద మయ్యెఁ దలఁప నాయవస్థ..." భార. కర్ణ. ౧, ఆ. ౩౪. 5. చ్యుతమగు; గర్భపాత మగు. "మ...రాజాంగనా, జనగర్భంబుల నూడ్చె హుంకృతి ధనుర్జ్యాటంకృతిన్..." దశా. ౬, అ. ౧౪౪. 6. నఱకు, ఖండించు. "ఉ. కొండలపత్త్రము లూడ్చు దయ్యె నూ,అంచులకత్తి..." వసు. 3, ఆ. ౧౦౭. 7. పిండి చేయు, పొడిచేయు. "చ. ఘనతరశైలముల్ వెఱికి క్రన్నన నూడ్చెద..." భా. రా. కిష్కిం. ౮౧౯. 8. అపహరించు; బెదరించి లాగుకొను. "శా...దానినా, నారత్నోజ్జ్వలభూష లూడ్చుకొని యానందంబుతోడం బురిన్, జేరెన్..." శుక. 3, ఆ. ౫౦౪.

ఊఢ. సం. వి. ఆ. స్త్రీ. 1. పెండ్లియైనస్త్రీ. 2. భార్య.

ఊఢము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పెండ్లాడఁబడినది. 2. మోయఁబడినది. 3. తీసికొనిపోఁబడినది.

ఊఢి. సం. వి. ఇ. స్త్రీ. 1. పెండ్లి. 2. మోఁత.

ఊఢుఁడు. సం.వి.అ.పుం. 1. సూర్యుఁడు. 2. వివాహితుఁడు.

ఊతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కుట్టఁబడినది. 2. నేయఁబడినది. 3. కాపఁబడినది.

ఊతి. సం. వి. ఇ. స్త్రీ. 1. కావలి. 2. కుట్టు. 3. నేఁత. 4. లీల.

ఊతిభము. స. వి. అ. పుం. చకోరము.

ఊదర. వై. వి. (సం. ఉదారః. క. ఊదరె.) తృణవిశేషము. (శ. ర.) బ. ధాన్యవిశేషము. (ఊదరలు, ఊదరులు, ఊదలు.) "గీ. గునుపు లూదర్లు..." కాశీ. 3, ఆ. ౧౫౧. "వ...ఊద లాదిగాఁ గలుగు వన్యధాన్యంబుల..." పిన. శకుం. 3, ఆ. ౧౭.

ఊదా. హిం. వి. ఎఱుపు నలుపు కలిసినరంగు. (శ. ర.)

ఊధము. సం. వి. న్. న. (ఆవు మొదలగుపశువుల) పొదుగు.

ఊధస్యము. సం. వి. అ. న. పాలు, క్షీరము.

ఊనము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తక్కువైనది, హీనము. 2. కొఱయైనది, అసమగ్రము. ఉదా:—ఏకోనవింశతి = ఒకటి కొఱవడినయిరువది అనగా పందొమ్మిది.

ఊనిక. దే. వి. 1. ఆనిక. (శ.ర.) 2. దిటవు. (శ.ర.)

ఊను. దే. అ. క్రి. 1. కలుగు. "ఉ...ధర్మజుఁడు పెడచేతఁ గన్నునీ,రూనఁగ నొత్తుకొంచుఁ జని..." భార. ఉద్యో. 3, ఆ. ౨౮౧. "క. ఐనను నెచ్చెలిదెస మది, నూనిననెయ్యమునఁ జేసి యుడుగక బుద్ధుల్, నానేర్చినట్లు సెప్పెద, మానుగ మీ కేను వినుఁడు మగువయుం నీవున్."

మార్క. ౨, ఆ. ౩౨౪. 2. నాఁటుకొను. "ఉత్సాహ. భానువిందుఁడు...చండకాండ సం, తాన మూన నేసి చూర్ణితంబు చేసె." భాగ. ౧౦, స్కం. ఉ. ౪౬౦. స. క్రి. 1. పూను, గ్రహించు. "ఉ...వాసుకి భోగిభోగసం,దో హము మీర లూని..." దశా. ౨, అ. ౯౧. 2. అవలంబించు, మొదలిడు. "గీ. పసులలోనన పెరిఁగినపాలసుండు, వావి మాలినపశుమార్గ వర్తనంబు, నూను టరిదియె..." హరి. ఉ. ౩. ఆ. ౧౦౭. 3. పొందు, కలిగియుండు. "ఆ...ఏమి సంభవించె, నేని దానఁ దృప్తి నూనుట దప్పిన, పనికి వగపకునికి భవ్యగుణము." భార. శాం. ౫, ఆ. ౨౩. 4. ధరించు, తాలుచు. "సీ. పైరుపచ్చలతాళి మీఱ మొల్కల గగు ర్పాటుఁ గంచుక మూనె రత్నగర్భ." ఉ. రా. ౧, ఆ. ౧౩౫. 5. ఆను, మోఁపు. "గీ. ఉక్కు గదయూనుకొని నిలుచున్నవాని." ఉ. రా. ౪, ఆ. ౧౦. 6. (యజ్ఞాదులు) ఒనరించు, చేయు. "చ...వేదశాస్త్రముల్, సదివితి మీవు లిచ్చితిమి జన్నము లూనితి మైహికంబునన్." ఉ. రా. ౨, ఆ. ౨౪. 7. తోలు మెత్తపఱచు. (శ. ర.)

ఊనుచే = ఊన్చు. (శ. ర.)

ఊన్చు. దే. స. క్రి. 1. ఊనఁజేయు, నెలకొలుపు. "క. ఒలసి మనోవాక్కాయం,బుల ద్రోహభావ మఖిలభూతములయెడం, గలిమి విను శీల మది మేలొలయించును దాన నుల్ల మూన్పుము పుత్త్రా." భార. శాం. ౩. ఆ. ౧౪౭. (వావిళ్ల ప్రతిపా. 'ఉన్పుము' అనంద ముద్రణము.) 2. తగిలించు, బంధించు. "చ...ఘనాఘము వాన కాళ్ల కున్, బలరిపుఁ డాలయూధ్రముల భంగిసె సంకెల లూన్చెనో యనన్." ఆము. ౪, ఆ. ౪౪. 3. పొందించు, కలుగఁజేయు. "మ. మురియం ద్రోయుచు నూన్చె నెమ్మనమునన్ మూర్ఛాసముచ్ఛ్రాయమున్." నైష. ౨, ఆ. ౯౯. 4. యజ్ఞాదు లొనరింపఁజేయు. "సీ. ఈతండ శిశులావనీతలేశుల నోర్చి, రాజ సూయము ధర్మరాజు నూన్చె." భార. ఆది. ౫, ఆ. ౧౨౪.

ఊపిరి. దే. వి. ఊర్పు, శ్వాసము. "గీ...ఊపిరి యూర్పు నా శ్వాస మలరు..." ఆం. భా. ప్ర. ౬౦.

ఊపిరికుట్టు. దే. వి. (ఊపిరి+కుట్టు.) ఊపిరి పీల్చునప్పుడు బాధ కలుగఁజేయు నొకానొకవ్యాధి, యాకము. "ఉ. వి ల్లెఱుమంగఁ జేసి యొక వేఁడిశరం బరివోసి యేసి య,బ్బల్లిదు ప్రక్కనొంచిన నపాయపుటూపిరికుట్టు వట్టి మూఁర్ఛిల్లి..." కకు. ౨, ఆ. ౧౪౬.

ఊబ. దే. వి. 1. ఖాతవిశేషము, ఒకవిధ మగుపాఁతర. "గీ. పరఁగు ఖాతవిశేషముల్ పాఁతర యన, నూబ యనఁగను..." ఆం. భా. ద్వి. ౨౪౦. 2. పేఁడి, నపుంసకుఁడు. (శ.ర.) విణ. గుల్ల గాఁ బెరిఁగి బలహీన మైనది. వా:—వాని దేహ మూబగా నున్నది.

ఊబి. దే. వి. బురద, పంకము. "సీ. ఉదక మల్పంబైన నూబిలోఁ బడుచేఁప..." రామలిం. ౪౧.

ఊయల = ఊయేల. "క. ఆ యొంటిపంటివేలుపు, దాయం బొలియించె నృహరిదంభోళికటు,చ్ఛాయల నూయలలూఁపున, ఖాయుధముల వఱడుఁ జీరు వ్యాఘ్రముఁ బోలెన్." పాండు. ౫, ఆ. ౧౦౧. ఇట్లే: ఉయ్యాల. అలర చంచలమైన ఆత్మలం దుండనీ యలవాటుచేసె నీ ఉయ్యాల. అన్నమయ్య—అధ్యాత్మ సంకీర్తనలు.

ఊయాల = ఊయేల. (శ. ర.)

ఊయెల = ఊయేల. సాం. ని. స్థా. ౬౪.

ఊయేల. ద్వ. వి. (ఊఁచు+ఏల.) డోల. (శ. ర.)

ఊరఁగంద. ద్వ. వి. (ఊరు+కంద.) ఊరియందు పైరువేసెడు కంద ♆. (శ. ర.)

ఊరఁబంది. దే. వి. (ఊరు+పంది.) గ్రామసూకరము, ఊరియందుఁ దిరుగుపంది. "చ...దుష్కథల్, విని ముదమందుచుందురు వివేకవిహీనత నూరఁబంది యాత్మను మధురాజ్య భక్ష్యములు మాని

పురీషము కేఁగుచాడ్పునన్." భాగ. ౩, స్కం. ౧౦౨౨.

ఊరఁబిచ్చుక. దే. వి. (ఊరు+పిచ్చుక.) ఊరియందుఁ దిరుగుపిచ్చుక, చటకము. "సీ. వైనతేయ ఖగంబుతో నూరఁబిచ్చుక రాజరత్నంబుతో గాజుపూస." చెన్న. ౫, ఆ. ౬౧.

ఊరక. దే. అవ్య. 1. అయత్నముగా. "సీ. బ్రహ్మ విజ్ఞాన మూరక పట్టువడదు." భీమ. ౫, ఆ. ౧౭౫. 2. అకారణముగా. "గీ. ఊరక కేల విజృంభించు నుదధు లేడు." నైష. ౭, ఆ. ౧౯౭. 3. నిష్ఫలముగా. "గీ. పుణ్యవాసన లూరకపోవు సూవె." కళా. ౫, ఆ. ౧౭౪. 4. విరమించక. "క. ఓరి దురాత్మక కౌమా, రారామలతోడ నీవఱచుపల్లఱపుల్, సైరించితి మిఁక నూరక, నో రెత్తితి వేని మిగుల నొత్తువు సుమ్మీ." వరాహ. ౧౧, ఆ. ౯౧. 5. మాటాడక. "క. ఊరక యుండక పలువుర,తో రవ మెసఁగంగ పలుకఁ దొడరుపక..." భార. విరా. ౧, ఆ. ౧౨౬. (ఇట్లే ఈ పదమునకు సందర్భముల ననుసరించి యనేకార్థములు తోఁచుచుండును.)

ఊరగము. దే. వి. కర్పూరము. "గీ...కపురము కప్పురంబు, ఘారలగం బూరగంబు రాశిర మనంగ, సమరుఁ గర్పూరము..." వేంక. మాన. ౫౬.

ఊరగోఁగు. దే. వి. (ఊరు+గోఁగు.) తీక్ష్ణ ⚘. (శ. ర.)

ఊరజోగి. ద్వ. వి. (ఊరు+జోగి.) ఊరియందుఁ దిరిగి బిచ్చ మెత్తుకొను సన్న్యాసి. "ద్వి. ఉరగ కంకణుతోడ నూరజోగులును." ద్వి. హరిశ్చ. పూ. ౨౯౯, పం.

ఊరబీఱ. దే. వి. (ఊర+బీఱ.) ఊరియందు పైరు చేయుబీఱ, ఆవడ ⚘. (శ. ర.)

ఊరవ్య. సం. వి. ఆ. స్త్రీ. వైశ్యస్త్రీ.

ఊరవ్యుఁడు. సం. = ఊరుజుఁడు.

ఊరాఱుచే = ఊరార్చు. (శ. ర.)

ఊరార్చు. ద్వ. స. క్రి. (ఊరుపు+ఆఱుచు.) 1. ఊఱడించు. "గీ. అట్టియెడఁ దన్నుఁ దాన యూరార్చికొనుచు..." భార. విరా. ౨, ఆ. ౨౨౩. 2. బతిమాలు. "క. కూరిమిపతి తన కోపము, వారించినఁ ద్రోచి పిదప వచ్చి యతనిఁ దా, నూరార్చునది ప్రగల్భా, ధీర..." కావ్యా. ౩, ఆ. ౫౩.

ఊరించే. దే. స. క్రి. (ఊరు. ధా. ప్రే.) 1. కలుగఁజేయు. "గీ. ఎడతెగని మోహ మూరించి యేపురేఁగి." హంస. ౨, ఆ. ౨౦౦. 2. నోరూరునట్లు చేయు. "సీ. మాటిమాటికి వ్రేలు మడిఁచి యూరించుచు నూరుఁగాయలఁ దినుచుండు నొక్కఁడు..." భాగ. ౧౦, స్కం. పూ. ౮౯౬.

ఊరీకరించే. సం. స. క్రి. అంగీకరించు. "సీ...వసిష్ఠుఁ డాగమించి...సపర్య లూరీకరించి." శకు. ౧, ఆ. ౧౭౫.

ఊరీకృతము. సం. = ఉరరీకృతము.

ఊరు. యు. దే. అ. క్రి. (క. త. ఊరు.) 1. ఊటవచ్చు, లోపలనుండి ద్రవము పైకి వచ్చు. "సీ...శశికాంతపంక్తుల జలము లూరె..." స్వా. ౩, ఆ. ౨౩. 2. (తినఁ గోరికచే నోటినుండి) ద్రవము కలుగు. "సీ. ఊరక చూచి నోరూరు టింతియె కాని యంటని మ్రాని పండ్లంద వశమె." దశా. ౬, అ. ౧, ఆ. ౧౦౧. 3. కలుగు, పుట్టు. "ఉ. ఊఱక చెయ్వులం దివుట లూరఁగ..." హరి. ఉ. ౬, ఆ. ౧౭౨. 4. లావగు, పెరుఁగు. "సీ. కలిగెఁబో పొదలుచుఁ గలయఁ దీఁగెలువాఱె ముదుర నూరఁగఁ గందమూలములకు." వరాహ. ౮, ఆ. ౭౭. వై. వి. ఔ. (సం. పూర్. దీని బహువచనరూపములు ఊరులు, ఊళ్లు, ఊళులు, ఊర్లు.) 1. గ్రామము. "గీ. పొమ్ము నిర్భాగ్య మాయూరిపొలము వెడలి." భీమ. ౨, ఆ. ౧౫౩. "గీ. పసిఁడిచీరలు గోవులుఁ బసులు గొల్చు,నూళ్లు లిండ్లును బండ్లును నోలి నొసఁగ,వలయు..." హరి. ఉ. ౧౦, ఆ.

33౨. 2. ఏఁడికోల లేనినాఁగలి. (శ. ర.) 3. దేశము; దేశాంతరము. (శ. ర.)

ఊరుఁగాయ. దే. వి. (ఊరు+కాయ.) (త. ఊఱుగాయ్.) ఉప్పు కారము ఆవ మున్నగువానిలో నూరుకాయ, ఉపదంశము. "గీ. ఊరుఁబిండులు నొకకొన్ని యొక్కకొన్ని, యూరుఁగాయలు ..." పాండు. ౪, ఆ. ౧౮౪. "మ... ఆవం జిగుర్లొక్కనుపచ్చళ్లను బాయసాన్నములు నూరుఁగాయలున్ ..." ఆము. ౧, ఆ. ౮౨. (వావిళ్ల ప్ర.)

ఊరుఁబండు. దే. వి. (ఊరు+పండు.) ఊరవేసిన కాయ పండు మొ. వా:—ఈ వెలఁగపండు ఊరుఁబండు.

ఊరుఁబిండి. ద్వ. వి. (ఊరు+పిండి.) ఉపదంశ విశేషము. "గీ. ఊరుఁబిండులు నొక కొన్ని..." పాండు. ౪, ఆ. ౧౮౪.

ఊరుకొను. దే. స. క్రి. మూరుకొను, ఆఘ్రాణించు. "క. ఈరీతిఁ బొదల మెదలుచు, నారీతిలకంబు మేనినచ్చిక యిచ్చం,గోరిక నవసహకారక, కోరక మూరుకొని వడి నిగుడ గమకించెన్." వసు. 3, ఆ. ౧౧౯.

ఊరుచే = ఊర్చు. (శ. ర.)

ఊరుజుఁడు. సం. వి. అ. పుం. వైశ్యుఁడు, కోమటి. విశే. (అ. ఆ. అ.) తొడనుండి పుట్టినవాఁడు.

ఊరుదఘ్నము. సం. విశే. (అ.ఈ.అ.) తొడలోఁతు గలది.

ఊరుపర్వము. సం. వి. న్. పుం. న. మోఁకాలు.

ఊరుపు. యు. దే. వి. వ్యంజనవిశేషము. (చూ. ఊర్పు.) వై. వి. 1. శ్వాసము, ఊపిరి. "గీ. నాగికేళాసవపుఁదీపుటూరు పొలయు." ఆము. ౨, ఆ. ౭౧. 2. ఉబుసు. (చూ. ఊరుపోక.)

ఊరుపోక. దే. వి. (ఊరుపు+పోక.) కాలక్షేపము. "సీ. ఒడ లుమ్మలించిన నొకపూఁట వెలుపట నుండుమీ చనుదెంచి యూరుపోక." భో. ౫, ఆ. ౨౧౦.

ఊరువు. సం. వి. ఉ. పుం. తొడ.

ఊరుస్తంభ. సం. వి. ఆ. స్త్రీ. అరఁటి చె.

ఊరేఁగించు. ద్వ. స. క్రి. (ఊరేఁగు. ధా. ప్రే.) ఊరేఁగునట్లు చేయు. వా:—వధూవరుల నూరేఁగించుచున్నారు.

ఊరేఁగింపు. ద్వ. వి. (ఊరేఁగు. ధా.) ఊరేఁగించుట. వా:—ఊరేఁగింపైనతరువాత నలుఁగులు.

ఊరేఁగు. ద్వ. అ. క్రి. (ఊరు+ఏఁగు.) ఉత్సవముతో నూరిలోఁ బల్లకి మున్నగువానిపైఁ దిరిగి వచ్చు. (పెండ్లివారు ఊరేఁగుచున్నారు.) "మ. వనజాక్షీ కనుఁగొంటివే నయనపర్వం బౌచు నస్తాచలం,బున నొప్పెన్ రవిబింబ మెఱ్ఱఁజిగిచేఁ బొల్పొంది నీకాంతుఁ డ,ల్లన మాణిక్యవిభూషణంబు లెడఁ గ్రాలన్ రేపు నూరేఁగుబా, గునఁ జెన్నారెడు..." సావి. ౨, ఆ. ౪3.

ఊర్గాయ = ఊరుఁగాయ. "శా..., ఊర్గాయల్ వనపర్ణభాజనములం దొప్పార..." బహు. ౪, ఆ. ౪౯.

ఊర్చు. యు. దే. స. క్రి. చేతితో నొక్కి తీయు. "సీ. పక్వశాకం బెల్లఁ బలికంచమున నుంచి యొడికంబుగాఁ బట్టి యూర్చి వైచు." శుక. 3, ఆ. 3౪౮. వై. అ. క్రి. నిశ్వసించు. "గీ. బడలిక పొడమి పైపై నూర్చునూర్పుల కమ్మకస్తురి తావి ఘుమ్మనంగ." దశా. ౮, అ. ౨, ఆ. ౧౫2.

ఊర్జము. సం. వి. అ. పుం. 1. కార్తికమాసము. 2. ఉత్సాహము. 3. బలము. 4. ప్రాణము. న. జలము, నీరు. విశే. (అ. ఆ. అ.) బలము గలది.

ఊర్జస్వంతము. సం. విశే. (త్. స్వతీ. త్.) 1. మిగుల బలిమిగలది. 2. మిగుల నుత్సాహము గలది.

ఊర్జస్వలుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. మిక్కిలి బలిష్ఠుఁడు. 2. మహోత్సాహి. 3. శ్రేష్ఠుఁడు.

ఊర్జస్వి. సం. విశే. (న్. నీ. న్.) = ఊర్జస్వలుఁడు.

ఊర్జస్సు. సం. వి. స్. న. 1. అన్నము. 2. ఉత్సాహము. 3. బలము.

ఊర్జి. సం. విశే. (న్. నీ. న్.) = ఊర్జస్వంతము.

ఊర్జితము. సం. వి. అ. న. 1. బలము. 2. ఉత్సాహము. విణ. (అ.ఆ.అ.) 1. బలమైనది. 2. వృద్ధి గలది. 3. గొప్పది. 4. గంభీర మైనది.

ఊర్ణ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉన్ని, గొఱ్ఱె మొ. వానిబొచ్చు. 2. అరఁటి మున్నగువాని నార. 3. కనుబొమలనడుమ నుండు పలుచని వెండ్రుకలసుడి. (ఇది మహాపురుష లక్షణము.)

ఊర్ణనాభము. సం. వి. అ. పుం. 1. సాలెపురుగు. 2. అభినయహస్త విశేషము, ఐదువ్రేళ్లను గొంచెము వంచి కొనలు కూడకుండ పట్టినహస్తము.

ఊర్ణనాభి. సం. వి. ఇ. పుం. సాలెపురుగు.

ఊర్ణపటము. సం. వి. అ. పుం. సాలెపురుగు.

ఊర్ణవాభము. సం. = ఊర్ణనాభము.

ఊర్ణాయువు. సం. వి. ఉ. పుం. 1. పొట్టేలు. 2. బొచ్చుకంబళి. 3. సాలెపురుగు. విణ. (ఉ.) ఉన్ని గలది.

ఊర్ధ్వజానువు. సం. = ఊర్ధ్వజ్ఞువు.

ఊర్ధ్వజ్ఞువు. సం. విణ. (ఉ.) ఊర్ధ్వజానువు, ఎత్తైన మోఁకాళ్లు గలవాఁడు.

ఊర్ధ్వదృష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. మీఁదిచూపు. 2. ఉన్నతస్థితిపైఁ గలుగుదృష్టి. 3. యోగదృష్టి.

ఊర్ధ్వదేహము. సం. వి. అ. పుం. మరణానంతర దేహము.

ఊర్ధ్వపాదము. సం. వి. అ. పుం. శరభమృగము.

ఊర్ధ్వపుండ్రము. సం. వి. అ. పుం. నిలువుబొట్టు.

ఊర్ధ్వము. సం. వి. అ. పుం. న. 1. తరువాతి కాలము. 2. తరువాతి దేశము. విణ. (అ. ఆ. అ.) 1. ఎత్తైనది. 2. మీఁదిది. 3. మీఁది కెత్తఁబడినది. 4. ఎగఁజిమ్మఁబడినది.

ఊర్ధ్వమూలము. సం. వి. అ. పుం. దర్భ ✥. విణ. (అ. ఆ. అ.) వ్రేళ్లు పైని గలది. "ఊర్ధ్వమూలమధశ్శాఖమ్." భగవద్గీత. ౧౫, అ. ౧, శ్లో.

ఊర్ధ్వరేతసుఁడు. సం. వి. స్. పుం. 1. సనకాది మహర్షి. 2. భీష్ముఁడు. 3. ఈశ్వరుఁడు. విణ. (స్.) క్రిందకు ఁబడని రేతస్సు గలవాఁడు.

ఊర్ధ్వరేతుఁడు. సం. = ఊర్ధ్వరేతసుఁడు.

ఊర్ధ్వలోకము. సం. వి. అ. పుం. స్వర్గము, పై లోకము.

ఊర్ధ్వశీలము. సం. వి. అ. పుం. అగ్ని.

ఊర్ధ్వవర్త్మము. సం. వి. స్. న. ఆకాశము, వాయుమార్గము.

ఊర్పు = ఊరుపు. 1. శ్వాసము, ఊపిరి. "ఉ... మీ, ముక్కున నూర్పు గల్గ మనమోహర మీ దురవస్థఁ బొందునే." భార. భీష్మ. ౨, ఆ. ౧౯౯. 2. వ్యంజనము, కూర. "సీ. మేలింపుచవి గుల్కు తాలింపు వంకాయ యూర్పులు గొని యూడ నేర్పుగలదె." రా. వి. ౨, ఆ. ౧౦౫.

ఊర్పుచ్చు. ద్వ. స. క్రి. (ఊర్పు+పుచ్చు.) ఊపిరి వెడలఁజేయు, ఊర్పు విడుచు. "శా...వార్ధిస్వామి యూర్పుచ్చె..." శేష. ౫, ఆ. (శ.ర.)

ఊర్పోక = ఊరుపోక. "సీ. ఘనునొద్దనుండియుఁ దనకాసపడియెనేఁ బొలఁతుక కదియు నూర్పోక కూర్మి." కవిక. ౪, ఆ. ౧౨౧.

ఊర్పోవు. దే. అ. క్రి. (ఊర్పు+పోవు.) ఊపిరాడు. "శా...శస్త్రవ్రాతముల్ సాంద్రమై, యూర్పోకుండఁగ నించినన్ మురహరుం డుద్దామకోపాగ్నియై." నిర్వ. 3, ఆ. ౧౭.

ఊర్బిండి = ఊరుఁబిండి. "గీ...గుడి, మ్రింగువానికి లింగ మూర్బిండివడెము." సిం. నార. 3౬.

ఊర్మి. సం. వి. ఇ. పుం. స్త్రీ. 1. తరంగము, అల. 2. ఒకానొక యశ్వగతివిశేషము. 3. వేగము. 4. ప్రకాశము. 5. బుభుక్షాది. (బుభుక్ష, తృష్ణ, శోకము, మోహము, జర, మరణము ఇవి షడూర్ములు.) 6. పీడ. 7. ఉత్కంఠ. 8. వంకర.

ఊర్మిక. సం. వి. ఆ. స్త్రీ. 1. = ఊర్మి. 2. ఉంగరము. 3. తుమ్మెదల ఝుంకారము.

ఊర్మిమాలి. సం. వి. న్. పుం. సముద్రము.

ఊర్మిళ. సం. వి. ఆ. స్త్రీ. 1. లక్ష్మణుని భార్య. 2. మగనిచే విడిచిపెట్టఁబడిన పతివ్రత.

ఊర్వశి. సం. = ఉర్వశి.

**ఊఱట.** దే. వి. 1. ఊఱడించుట. "ఉ. అంతలు సేసి పో నడిచి యక్కట సంజయుచేతఁ జెప్పి పుత్తెంతురె యిట్టి యూఱట మదిం బ్రియ మందె యుధిష్ఠిరుండు..." భార, ఉద్యో. 3, ఆ. ౧౦౧. 2. విరామము. "సీ. కోలుమసంగెడు కోర్కులు వెనువెంటఁ బాఱుచు నునికికి నూఱటయును." భార. విరా. ౨, ఆ. 3౧౫. 3. విశ్రాంతి. "ఉ...సేతువు కట్టి కట్టి మధ్యందినవేళ నూఱటల కాసలు చేయుచు..." భా. రా. యు. ౨౭౦. 4. స్వస్థత. "ఆ. ఉమ్మలంబు దక్కి యూఱటతోడ నీ, వేఁగు..." భార. విరా. ౨, ఆ. ౪౦. 5. క్షేమము. "చ...నీమనమున కెట్టు లూఱట సమస్తము నట్టుల చేసెదం దగన్." భార. విరా. 3, ఆ. ౬౪. విణ. 1. విశ్రాంతి నిచ్చునది. "సీ. కుంభినీ భృత్కుంభి కుంభీనసేంద్రుల కూఱట యెవ్వనియురుభుజంబు." వి. పు. ౧, ఆ. ౪౬. 2. సహాయము. "క. ఆ ధనము నీకు నచ్చిన, సాధనముగ నధ్వరంబు సాఁగించి బుధా, రాధనము చేయు నిరతా, రాధనచణు లైనతమ్ము లూఱట గాఁగన్." జై. ౧, ఆ. ౬౭.

**ఊఱడించు.** దే. స. క్రి. (ఊఱడు. ధా. ప్రే.) ఓదార్చు, ఊఱట నొందించు. "సీ. సలలితయామున సైకతస్థలములనుండి మష్టే మని యూఱడించె." భాగ. ౧౦, స్కం. ఉ. ౪౯౨.

**ఊఱడిలు.** దే. అ. క్రి. 1. ఉపశమిల్లు, "ఉ. వీఁడె నలుండు విశ్వపృథివీతలనైకవిభుండు వచ్చుచు, న్నాఁడని భీమభూమిపతినందన యూఱడిలంగఁ బల్కు పూఁబోఁడులమాట నేర్చికొని..." నైష. 3, ఆ. ౧౦౪. 2. స్వస్థత నందు. "ఉ... అక్కారుణికుండు చెందె నతికౌతుక మూఱడిలెన్ వధూటియున్." ఉ. రా. ౬, ఆ. 3౧౯.

**ఊఱడిల్లు** = ఊఱడిలు. 1. ఉపశమిల్లు. 2. స్వస్థత నందు. "ఆ. ఏను నిల్చినట్లు కాకూఱడిల్లు..." భార. ద్రో. 3, ఆ. ౨౨. 3. విశ్రాంతి నొందు. "ఆ. పుట్టినింటి కేను బోయి యొక్కించుక, యూఱడిల్లి వత్తు..." హరి. పూ. ౧, ఆ. ౧౭౦.

**ఊఱడు.** దే. అ. క్రి. 1. విరమించు. "క. కాఱడవిఁ బఱచుమృగముల, నూఱడక వధించి..." భార. ఆది. ౪, ఆ. ౧౯. 2, ఉపశమిల్లు. "ఉ. ఈ పగిదిన్ మురారి హృదయేశ్వరి నూఱడఁ బల్కి..." పారి. ౪, ఆ. ౧3. 3. స్వస్థతనందు. "క...ఉన్నతసామ్రా, జ్యోత్సవము నొందు పుత్త్రుల, నుత్సుకతం జూతు గాక యూఱడు మింకన్." భార. ఉద్యో. 3, ఆ. ౨౦౬. స. క్రి. అప్పగించు. "క. నిను నిట్లూఱడి పోయెను, మనుజేంద్రుఁడు నాకుఁ దగునె మానిని యిచ్చో, నిను డించిపోవ ..." భా. రా. ఆర ౨, ఆ. ౬౯.

**ఊల.** దే. వి. ఆర్తధ్వని, మొఱ్ఱ. "శా. ఏలన్ తందనతాన లేమయిన లేవే యంచు బాధించునే, నూలం బెట్టఁగఁ జాల..." వేం. పంచ. ౨, ఆ. ౧33.; ౧, ఆ. ౬౪౪. 2. హోరు మను ధ్వని. (చూ. ఊలవడు.)

**ఊలమాలగుడుచు.** దే. అ. క్రి. (ఊల+మాల+కుడుచు.) 1. తహతహపడు. "ద్వి. చిడిముడిఁ బొందుచు సిగ మిట్టి మిట్టి, పడఁగఁ బల్కులు తొట్రుపడ నూలమాల, గుడుచుచు..." నవ. 3, భా. (శ. ర.) 2. గుక్కిళ్లు మ్రింగు. (బ్రౌ.) 3. మొఱ్ఱపెట్టు. (వ్యు.)

**ఊలవడు.** ద్వ. అ. క్రి. (ఊల+పడు.) భోరుమను. "గీ. ఊలవడి చొచ్చి కామాక్షి నుత్తరించె, నగరితోఁ గూడ నేకామ్రనాథు ముంచె, హస్తగిరినాథు శ్రీపాద మప్పళించెఁ, గంచిఁ దెప్పలఁ దేల్చె నకాలవృష్టి." హర. ౨, ఆ. ౨౨.

**ఊలుకొను.** దే. అ. క్రి. నూలుకొను, నిలుచు. (చూ. ఊలుకొలుపు.)

**ఊలుకొలుపు.** దే. స. క్రి. (ఊలుకొను. ధా. ప్రే.) నూలుకొలుపు, నిలుపు. "సీ. గుఱి దప్పనీనియబ్బురపుఁ జూడ్కులు వాతి యుక్కుటీఁగలమీఁద నూలుకొలిపి." రంగా. 3, ఆ. 3౪.

**ఊల్కొను** = ఊలుకొను. "చ. ఘనపురుషార్థభూతమనఁగాఁ దగునాత్మకు నేనిమిత్తమై, యొనర ననర్థహేతు వన నూల్కొనుసంసృతి సంభవించు..." భాగ. ౪, స్కం. ౪౬౫.

ఊల్కొల్పు = ఊలుకొలుపు. (రూ.)

ఊవాడు = ఊఁగాడు. "క. అలరుంబోఁడులలోపల, నలరుం బోఁడుములు నీకు నగ్గల మగుచున్, దలఁ పూవాడక యుండుము, తలపూవు ధరించి వికచతామరసాక్షీ." పారి. ౧, ఆ. ౬౪.

ఊవిళ్లు = ఉవ్విళ్లు. (చూ. ఊవిళ్లూరు.)

ఊవిళ్లూరు = ఉవ్విళులూరు. "శా... పాలిండ్లపైఁ, బ్రోవు ల్వోసినభంగి ముత్యఫలకముల్ పుంఖాను పుంఖంబుగా, నూవిళ్లూరుచుఁ జూచె భూవిభుని దా నొయ్యారపుం జూపులన్." పిన. శకుం. 3, ఆ. ౫౧.

ఊవు = ఊఁగు. "ఉ. జీవము లింగమందుఁ దను చేష్టలు భక్తసపర్యలందు సం, భావన చేసి యంశుకసమాజము భావన మాచరించుచో, నూవినయంత నాత్మ కఠినోన్నత వక్షము దాఁకి నొచ్చునో, దేవర యందు గుల్మవసతిన్ సవరించి దృఢాంతరంగుఁడై." చెన్న. 3. ఆ. ౨౧౦.

ఊషకము. సం. వి. అ. న. ప్రభాతము, వేకువ.

ఊషణ. సం. వి. ఆ. స్త్రీ. 1. పిప్పలి ♆. 2. చవ్యము.

ఊషణము. సం. వి. అ. పుం. చిత్రమూలము ♆. న. శోషింపఁజేయునది-1. మిరియము. 2. సొంటి. 3. పిప్పలి.

ఊషము. సం. వి. అ. పుం. 1. చవుటిమన్ను. 2. వేకువ. 3. చెవిగూబ. 4. రంధ్రము. 5. మలయ పర్వతము.

ఊషరము. సం. విశే. (అ. ఆ. అ.) చవుటిది. (నేల.)

ఊష్మ. సం. = ఊష్మము.

ఊష్మకము, సం. వి. అ. పుం. వేసఁగి.

ఊష్మము. సం. వి. అ. న్. పుం. 1. వేఁడిమి 2. వేసఁగి. 3. ఉక్క. 4. ఆవిరి. 5. శషసహ లలో నొకటి.

ఊష్మలము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉష్మ గలది 2. ఆవిరి గలది. 3. తీవ్రము, ఉగ్రము. "వ... ధనంజయుండు దనయూష్మలత్వంబున నవ్వాక్యంబులు దుస్సహంబు లైనం బదరి..." భార. శాం. ౧, ఆ. ౪౭. ("ఉగ్ర ముగ్రపరాక్రమః" అని మూలము.)

ఊష్మాగమము. సం. వి. అ. పుం. 1. గ్రీష్మము, వేసవి. 2. గ్రీష్మాగమము, వేసవిరాక.

ఊష్మోపగమము. సం. = ఊష్మాగమము.

ఊసర. వై. వి. (సం. ఊషరః.) ఊసరక్షేత్రము. ఆం. భా. ద్వి. ౫.

ఊసరము. యు. దే. విశే. కృశించినది. (శ. ర.) వై. (సం. ఊషరః. క. ఊసరవు.) చవుటిది. (నేల.)

ఊసరవెల్లి. దే. వి. (క. ఊసరవల్లి.) 1. బింబము, మూఁడురంగులు గలతొండ. "గీ. వేగ నేతెంచి యూసరవెల్లి తొండ, పాదములనుండి తలదాఁకఁ బ్రాఁకెనేని, యతఁడు షణ్మాసములఁ జూచు యముని మొగము." కాశీ. ౫, ఆ. ౨౬౧. ("ద్రుతమారుహ్య సరట స్త్రివర్ణో యస్యమస్తకమ్, ప్రయాతియాతి తస్యాయుః షణ్మాసే పరిసంక్షయమ్." అని మూలము.) 2. ముదిరిన తొండ. (బ్రా. వా.) 3. తొండ. ఆం. భా. ద్వి. ౯౭.

ఊసరిల్లు. దే. అ. క్రి. చిక్కు, కృశించు. (శ. ర.)

ఊసివాసము. వై. వి. (సం. ఉచ్ఛ్వాసః.) ఊర్ధ్వశ్వా. (శ. ర.)

ఊసిల్లు = ఉసిల్లు. ఆం. భా. ద్వి. ౬౫.

ఊసు = ఉబుసు. (చూ. ఊసుపోవు.)

ఊసుపోక. దే. వి. (ఊసుపోవు. ధా.) కాలక్షేపము. "మ... అంధ్రక్ష్మా, స్థలికిం బోదమె యూసుపోకకు వినోదంబుల్ పరీక్షింపఁగన్." భీమ. ౫, ఆ. ౧౫.

ఊసుపోవు. దే. అ. క్రి. (ఊసు+పోవు.) కాలక్షేపమగు; తోఁచు. "క. జనపతికి నింక నేనే, మని చెప్పిన నేమి యగును నది గడచనె నై, నను నూసుపోక వెండియు, ననియెద నొకమాట రఘువరానుజ సీతోన్." నిర్వ. ౯, ఆ. ౨౬.

ఊహా. సం. వి. ఆ. స్త్రీ. = ఊహము.

ఊహనము. సం. వి. అ. న. ఊహించుట.

ఊహానీయము. సం. = ఊహ్యము.

ఊహాపోహణలు. మి. వి. బ. (ఊహ+పోహణలు.) ఆనుకూల్యప్రాతికూల్యము లూహించుట. "చ. మ నమున నూహాపోహణలు మర్వకమున్నె కఫాది రోగముల్, దనువున నంటి మేనిబిగి దప్పక మున్నె నరుండు మోక్షసాధన మొనరింపఁగా వలయు..." దాశ. శ. ౭౯.

ఊహాని. సం. వి. ఈ. స్త్రీ. చీఁపురు.

ఊహము. సం. వి. అ. పుం. 1. వితర్కము, ఊహించుట. 2. పరీక్షణము. 3. ఆరోపము.

ఊహాపోహము. సం. వి. అ. న. ఆనుకూల్యప్రాతికూల్యము లూహించుట. విణ. (అ. ఆ. అ.) మంచిచెడ్డ లెఱుఁగలేనిది.' 'మ...ఏ, మనిశంబున్ భయవిస్మయాకులత నూహాపోహముగ్ధస్థితిన్, గనుచున్ నిన్ను నెఱుంగ లేము..." హరి. పూ. ౭, ఆ. ౧౪౨.

ఊహి. సం. విణ. (న్. నీ. న్.) ఊహము కలవాఁడు.

ఊహించు. సం. స. క్రి. ఆలోచించు, వితర్కించు. మార్క. ౧, ఆ. ౧౪౯.

ఊహితము. సం. విణ. (అ.ఆ.అ.) ఊహింపఁబడినది.

ఊహ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. విచారింపఁదగినది. 2. అధ్యాహారము చేయఁబడినది.

ఊళ. దే. వి. (క. ఊళ్.) 1. నక్కకూఁత. "గీ... ఊళ యన జంబుకధ్వని..." ఆం. భా. ప్ర. ౧౨౨. 2. మొఱ. "క. ఊళలు వెట్టంగా డా, కాలన్ వడిఁ దున్నుటయుఁ భుగాలున నోరం, బాలు వెడల నాసరమయ్యు, జాలిగుడిచి మంచు కొండచక్కికిఁ బోవన్." వరాహ. ౫, ఆ. ౭౦.

ఋ

ఋ. సం. ఒకానొక యక్షరము. వి. ఋ. పుం. 1. ఏనుఁగు. 2. కొండ. 3. అమృతము. (దీనికి తెలుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

ఋంజాసనము. సం. వి. అ. పుం. మేఁక.

ఋక్కు. సం. వి. చ్. స్త్రీ. 1. ఛందోబద్ధ మగు వేదమంత్రము. 2. ఋగ్వేదము. 3. స్తుతి.

ఋక్థము. సం. వి. అ. న. 1. ధనము. 2. పితృధనము. 3. బంగారము.

ఋక్షగంధ. సం. వి. ఆ. స్త్రీ. 1. బొద్దికూర ❀. 2. పాలగుమ్ముడు ❀.

ఋక్షగంధిక. సం. = ఋక్షగంధ.

ఋక్షము. సం.వి.అ.పుం. 1. ఎలుఁగుగొడ్డు. 2. రైవతక పర్వతము. 3. భల్లకము ❀. 4. శ్యోనాకము ❀. న. 1. నక్షత్రము. 2. మేషాదిరాశి.

ఋగ్యజుషము. సం. వి. అ. న. ఋగ్వేద యజుర్వేదముల సముదాయము. "చ. ద్విజవరులం గుమారుల నతిప్రియదర్శనులైనవారి ఋగ్యజుషపద క్రమంబులు క్రియఁ గుఱిచియుంచుచు వచ్చువారి నగ్గజపురవల్లభుండు గని..." భార. ఆది. ౨, ఆ. ౧౯౬.

ఋగ్వేదము. సం. వి. అ. పుం. ఒకానొక వేదము. (ఋగ్యజుస్సామాథర్వము లని యివి నాలుగు.)

ఋజిమ. సం. వి. న్. పుం. ఋజుత్వము.

ఋజిమము. సం. = ఋజిమ.

ఋజీషము. సం. వి. అ. న. 1. బూరెలమూఁకుడు. 2. ఒకానొక నరకము. 3. సారము తీసివేసిన సోమలతయొక్క చూర్ణము.

ఋజుకము. సం. విణ. (అ. ఆ. అ.) ఋజువు.

ఋజువు. సం. విణ. (ఉ. ఉ,జ్వీ. ఉ.) 1. సరళము. 2. నిష్కపటము. 3. ఉత్పత్తిరహితము.

ఋణదాత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) అప్పిచ్చువాఁడు.

ఋణము. సం. వి. అ. న. 1. అప్పు. 2. దేవాది ఋణము. (ఇది దేవఋణము, పితౄణము, ఋషిఋణము అని మూఁడు తెఱఁగులు.) 3. దుర్గభూమి. 4. నీరు. 5. గణితమున తీసివేయు సంఖ్యా లేక గుర్తు.

ఋణార్ణము. సం. వి. అ. న. అప్పు తీర్చుటకై చేయు అప్పు.

ఋణి. సం. విణ. (న్. నీ. న్.) ఋణగ్రస్తుఁడు, అప్పుపడినవాఁడు.

ఋణికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) = ఋణి.

ఋతంభరుఁడు. సం. వి. అ. పుం. సత్యపాలకుఁడు, పరమేశ్వరుఁడు.

ఋతధాముఁడు. సం. వి. న్. పుం. విష్ణుమూర్తి.

ఋతము. సం. వి. అ. న. 1. నీరు. 2. మోక్షము. 3. సత్యము. 4. పరబ్రహ్మము. 5. యజ్ఞము. 6. ప్రాప్తి. 7. ఉంఛశిలవృత్తులు. విణ. (అ.ఆ.అ.) 1. సత్యమైనది. 2. పూజింపఁబడినది. 3. ప్రకాశమొందినది. 4. పొందఁబడినది.

ఋతి. సం. వి. ఇ. పుం. శత్రువు. స్త్రీ. 1. గతి. 2. స్పర్ధ. 3. నింద. 4. క్రోధ. 5. శుభము. 6. రోఁత.

ఋతీయ. సం. వి. ఆ. స్త్రీ. 1. రోఁత. 2. దయ. 3. వగచుట.

ఋతుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

ఋతుకాలము. సం. వి. అ. పుం. 1. వసంతాది ఋతుకాలము. 2. స్త్రీ ఋతుమతి యైన తరువాత పదునాఱుదినములకాలము. (ఇది గర్భధారణకు యోగ్య మగుకాలము.)

ఋతుగామి. సం. విణ. (న్. నీ. న్.) ఋతుకాలమందే భార్యను గలియువాఁడు.

ఋతుపతి. సం. వి. ఇ. పుం. వసంతర్తువు.

ఋతుమతి. సం. వి. ఈ. స్త్రీ. పుష్పవతి, ముట్టైనస్త్రీ.

ఋతువు. సం. వి. ఉ. పుం. 1. రెండుమాసముల కాలము. (వసంతము, గ్రీష్మము, వర్షము, శరత్తు, హేమంతము, శిశిర మని ఋతువు లాఱు.) 2. ఆఱుసంఖ్య. 3. స్త్రీ రజస్సు. 4. ప్రకాశము. 5. గర్భధారణకు యోగ్య మగుకాలము. 6. మాసము.

ఋతువృత్తి. సం. వి. ఇ. పుం. సంవత్సరము.

ఋత్విక్కు. సం. = ఋత్విజుఁడు.

ఋత్విజుఁడు. సం. వి. జ్. పుం. యాజకుఁడు, యజ్ఞకర్తవలన దక్షిణ పుచ్చుకొని యజ్ఞము చేయించు బ్రాహ్మణుఁడు. (వీరు నలువురు. 1. హోత. 2. ఉద్గాత. 3. అధ్వర్యువు. 4. బ్రహ్మ. వీర లొక్కొక్కరికి ముగ్గురు చొప్పున మొత్తము పదునాఱుగురు సహాయ ఋత్విజు లుందురు. వారు :—1. బ్రాహ్మణాచ్ఛంసి. 2. ప్రస్తోత. 3. మైత్రావరుణుఁడు. 4. ప్రతిప్రస్థాత. 5. పోత. 6. ప్రతిహర్త. 7. అచ్ఛావాకుఁడు. 8. నేష్ట. 9. ఆగ్నీధ్రుఁడు. 10. సుబ్రహ్మణ్యుఁడు. 11. గ్రావస్తుతుఁడు. 12. ఉన్నేత. అనువారు.)

ఋద్ధము. సం. వి. అ. న. 1. వృద్ధి. 2. సమృద్ధి. 3. సిద్ధాంతము. విణ. (అ.ఆ.అ.) 1. సమృద్ధము. 2. వృద్ధినందినది. 3. నూర్చి తూర్పెత్తుటకు సిద్ధముగా నుంచినది. (ధాన్యాది.)

ఋద్ధి. సం. వి. ఇ. స్త్రీ. 1. వృద్ధి. 2. సమృద్ధి. 3. సిద్ధి. 4. పార్వతి. 5. లక్ష్మి. 6. కుబేరపతి. 7. ఒకానొక గంధద్రవ్యము.

ఋభుక్షము. సం. వి. అ. పుం. 1. స్వర్గము. 2. వజ్రము.

ఋభుక్షుఁడు. సం. వి. న్. పుం. ఇంద్రుఁడు.

ఋభువు. సం. వి. ఉ. పుం. వేల్పు, దేవత.

ఋశము. సం. వి. అ. పుం 1. తృణము. 2. అవధి.

ఋశ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. మనుఁబెంటి, ఒకానొక మృగి. 2. దూలగొండి ❀.

ఋశ్యకేతువు. సం. వి. ఉ. పుం. 1. అనిరుద్ధుఁడు. 2. మన్మథుఁడు.

ఋశ్యప్రోక్త. సం. వి. ఆ. స్త్రీ. 1. దూలగొండి ❀. 2. పిల్లపీఁచర ❀. 3. ముత్తవపులగము ❀. 4. ఒకానొకగంధద్రవ్యము.

ఋశ్యము. సం. వి. అ. పుం. మనుఁబోతు, ఒకానొక మృగము.

ఋషభము. సం. వి. అ. పుం. 1. ఎద్దు. 2. మత్తగజము. 3. ఒకానొక స్వరము, రి. 4. కర్ణరంధ్రము. 5. పందితోఁక. 6. మొసలితోఁక. 7. ఒకానొకసామము. 8. ఒకానొక యజ్ఞము. 9. ఒకానొకవృత్తము. 10. శృంగి, ఒకానొక గంధద్రవ్యము ❀.

ఋషభి. సం. వి. ఈ. స్త్రీ. 1. మీసములు మున్నగు పురుషలక్షణములు గలస్త్రీ. 2. విధవ. 3. దూలగొండి చె.

ఋషభుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకానొక ఋషి. 2. విష్ణునియొకానొక యవతారము. విణ. అ. పుం. శ్రేష్ఠుఁడు. ఉదా :—పురుషర్షభుఁడు.

ఋషి. సం. వి. ఇ. పుం.—జ్ఞానముచే సంసారసముద్రమును దాఁటినవాఁడు. 1. వసిష్ఠాది. (సప్తర్షులు ఒకమన్వంతరమున. మరీచి, అత్రి, అంగిరుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, వసిష్ఠుఁడు. మఱియొక మన్వంతరమున:—కశ్యపుఁడు, అత్రి, భరద్వాజుఁడు, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, జమదగ్ని, వసిష్ఠుఁడు. దేవర్షులు, రాజర్షులు, బ్రహ్మర్షులు నని ఋషులు మఱియొకక్రమమున మూఁడువిధములు. నారదాదులు దేవర్షులు, జనకాదులు రాజర్షులు; వసిష్ఠాదులు బ్రహ్మర్షులు. మహర్షి, పరమర్షి, శ్రుతర్షి, కాండర్షి యని మఱియొకక్రమమున ఋషులు నాలుగు తెఱఁగులు.) 2. శాస్త్రకారుఁ డగు నాచార్యుఁడు. 3. మంత్రద్రష్ట. 4. వేదము. 5. కిరణము. 6. జ్ఞానేంద్రియము. (చక్షురాది.)

ఋషిపంచమి. సం. వి. ఈ. స్త్రీ. భాద్రపదశుక్లపంచమి. (సప్తర్షులఁ గూర్చి చేయువ్రతదివసము.)

ఋషిశస్త్రము. సం. వి. అ. పుం. శాపము, ధర్భ.

ఋషీతకము. సం. వి. అ. పుం. తెల్లకాకి.

ఋష్య. సం. = ఋశ్య.

ఋష్యప్రోక్త. సం. = ఋశ్యప్రోక్త.

ఋష్యము. సం. = ఋశ్యము.

ఋష్య (శ్య) మూకము. సం. వి. అ. పుం. పంపాసరోవరప్రాంతమునఁ గల పర్వతవిశేషము.

ఋష్య (శ్య) శృంగుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకముని, దశరథుని కూఁతు రగుశాంతభర్త.

## ౠ

ౠ. సం. ఒకానొక యక్షరము. వి. ౠ. పుం. 1. బంగారము. 2. పద్మము. 3. స్వర్గము. (దీనికి వ్యస్తప్రయోగము లేదు.)

## ఌ

ఌ. సం. ఒకానొక యక్షరము. వి. ఌ. పుం. 1. శివుఁడు. 2. స్వర్గము. 3. గజదంతము. (దీనికి తెలుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

## ౡ

ౡ. సం. ఒకానొక యక్షరము.

## ఎ

ఎ. ఒకానొక యక్షరము. యు. దే. 1. ప్రశ్నార్థకము. "క. జననుత యామ్రానిని నన్నును మఱి నీభ్రాతృవరులను జూచితె నీవు..." భార. ఆది. ౫, ఆ. ౨౫౦. 2. ప్రార్థనార్థకము లగు మధ్యమపురుష 'ముఁడు'ల కనుప్రయుక్త మగును :—రావె. 3. స్త్రీత్వమును దెలుపును. "శా. రావే సుందరి యేమెబోటి..." భాగ. ౧౦, స్కం. పూ. ౭౭౨. స. సమాసపూర్వపదముగా నున్న యత్క్రియార్థక మగు 'ఏ' అనుదానికి కొన్నిచోట్లవచ్చెడు ఆదేశము. "ఉ. ఎన్నినుగూర్చి యన్న..." ఆము. ౧, ఆ. ౧౪. అప. 'త' అను స్త్రీవాచక తద్ధితప్రత్యయము పరమగునపుడు కొన్నిశబ్దములచివర వచ్చెడి యాదేశము:—మాలెత, వై. అవ్య. (సం. ఏవ.) 1. అవధారణార్థకము. "గీ. వెంటనె తపోగ్ని ఘోరమై వెడలుట యును." దశా. ४, అ. ౭౩. 2. నిర్దేశార్థకము. "చ. హరుఁ డనె చిక్కె..." భార. అర. ౫,ఆ.౨౧౦. 3. అత్యల్పత్వద్యోతకము. "ఉ. పూనిముకుందునాజ్ఞఁ గనుబొమ్మనె కాంచి..." ఆము. ౧, ఆ. ४.

ఎంగిలి. దే.వి. (క.ఎంజలు.) 1. తినఁగా మిగిలిన పదార్థము,భుక్తశేషము. "క. మంగళ మనుచునువారల, యెంగిలి భక్షింతు వాస కెందకు నోడన్, ముంగల నిలుతును నియతిని, వెంగలిక్రియఁ జనుదు నురువివేకముతోడన్." భాగ. ౧,స్కం. ౧౦౫.

**2.** తినఁగా మిగిలినది తినుటవలనఁ గాని ముట్టుకొనుటవలనఁ గాని కలుగుదోషము. "సీ. అమృతసిక్తుఁడ నైతి నఖిలేశ గోవుల కెంగిలి లే దిందుఁ డెట్టు లమృత, మొసఁగు నట్టుల గోవు లొసఁగు దుగ్ధంబులఁ దద్వత్సపీతదుగ్ధంబు శుచియ." భార. అను. 3, ఆ. ౨౪. **3.** అపవిత్ర మైనపదార్థము. "సీ...ఎంగిలి వర్జించి యిలువడి ఘటశుద్ధి గలిగినకాంతలందు. గీ. నిల్తు..." భార. అను. ౧, ఆ. ౨౦౫. విశ. **1.** తినఁగా మిగిలినది. "ఉ...ఎంగిలికల్లు సల్లినన్, మన్ననఁ దప్పి వూఁచె..." కు. సం. ౯, ఆ. ౧౭౨. **2.** పరులచే ననుభవింపఁబడినది. "క. ఈమగువ దేవకామిని, గామి యెఱిఁగించెఁ గన్నుఁగవ యిదె యుద్యత్కామచరిత్రమున నెంగిలి, గామి యెఱిఁగింపఁ బెక్కు గల వూహింపన్." దశ. ౯, ఆ. ౪.

ఎంగిలించు. దే. స. క్రి. ఎంగిలి చేయు. "సీ. మొవ లావులించి వాసనసల్లఁ బసిగొని లేఁదేఁటిగము లెంగిలింపకుండ." కు. సం. 3, ఆ. ౧౦౪.

ఎంగిలికాయ. దే. విశ. (ఎంగిలి+కాయ.) పనికి మాలినవాఁడు. (ఆం. పదా.)

ఎంగిలిగావించు. దే. స. క్రి. (ఎంగిలి+కావించు.) బలవంతముగా రమించు, చెఱచు. "క. అంగనఁ బొదివి సగాఢా, లింగనముగఁ దామ్రచూడ లీలాచతురా, నంగక్రీడాసంగతి, నెంగిలిగావించె మదము నేర్తెఱ మిగులన్." నిర్వ. ౬, ఆ. ౭౪. **2.** ఎంగిలించు. (వ్యు.)

ఎంగుస. దే. వి. ఐదుకుంచముల పరిమాణము. (ఆం. పదా.)

ఎంగెస. దే. వి. ఒకజాతి పనవృక్షము. (శ.ర.)

ఎంచు. దే. స. క్రి. **1.** గణించు, లెక్కించు. వా:- పరులలోపము లెంచుట సులభము. **2.** ఉన్న దున్నట్లు వర్ణించు. "ఉ. ఎంచి నుతింప శక్యమె యహీశ్వరునంతటివాని కైన...శీతశైలమున్." హర. ౫, ఆ. ౨౧. **3.** పాటించు. "ఉ...నిజకార్యము లెంతుగె మిత్త్రతత్పరుల్." వసు. ౪, ఆ. ౯. **4.** నుతించు. "ఉ. వింతలు భూమినేమయిన వింటివె పౌరులు నన్నుఁగూర్చి నిందింతురో యెంతురో..." ఉ. రా. ౬, ఆ. ౧౯౩. **5.** మించు; సరసించు. "సీ. ముద్దునెమ్మొగము తమ్ముల నెంచు టేచోద్య మిందుబింబము చంద మెనసి యుండ." దశా. ౨, అ. ౨౬౯. **6.** తలఁచు. "సీ. ఒకవేళఁ దనయందు సకలప్రపంచంబు కల్పితం బని యెంచి కాంచి నవ్వు." సీతారా. 3, ఆ. ౧౭౯. **7.** ఊహించు; పన్ను. "ఉ...ఎట్లయిన శ్రీతరుణీమణి వచ్చునట్లుగా, నొక్కయుపాయ మెంచవలె..." దశా. ౨,ఆ. ౮౪. **8.** అనవసరముగా మోఁపు. "శా...తల్లీ నిన్ను శోధింపకే, నేరం బెంచితి వంతఁ జెందకుము .." ఉ. రా. ౧, ఆ. ౧౯౩.

ఎండ. దే. వి. ఆతపము. "గీ. కాలమృత్యువు వెసఁ దోలి కఱవ వెఱచు, నహిమరోచియు నెండగాయంగ నణఁగు, నగ్ని శంకించు నెఱమంట లప్పళింప, భూమి దానం బొనర్చిన పుణ్యుతముని." భీమ. ౫, ఆ. ౬౫. కాశీ. ౧, ఆ. ౧౨౪.

ఎండఁగట్టు. దే. స. క్రి. (ఎండన్+కట్టు.) **1.** ఎండలో నాఱవేయు. వా: — ఈ తడిబట్ట యెండఁగట్టుము. **2.** శుష్కింపఁజేయు, నిర్ద్రవము చేయు. వా: — ఆకుమడి నెండఁగట్టినారు.

ఎండఁగొట్టు. దే. స. క్రి. **1.** ఎండఁజేయు. (వ్యు.) **2.** బలహీనముగాఁ జేయు. వా:— పాలు విడువక దూడ నెండఁగొట్టినారు.

ఎండఁబడు. ద్వ. అ. క్రి. (ఎండన్+పడు.) ఎండ తగులు. "ఉ. దూరము వోయి యెండఁబడి దూపిలి వచ్చిన ప్రాణనాథునిన్, ద్వారకవాటగేహళులదాఁక నెదుర్కొని..." కాశీ. ౨, ఆ. ౮౧.

ఎండఁబాఱు. దే. అ. క్రి. (ఎండన్+పాఱు.) నిర్ద్రవమగు. "సీ. వైపరామఱక చొప్పడమిఁ బక్వము దప్పి పండఁబాఱినపాల పెండఁబాఱె." స్వా. 3, ఆ. ౧౨౯.

ఎండఁబెట్టు. దే. స. క్రి. (ఎండన్+పెట్టు.) **1.** ఎండలో నుంచు. వా:— వడియము లెండఁబెట్టుము. **2.** నిర్ద్రవము చేయు. (వ్యు.)

ఎండగొట్టు. దే. వి. (ఎండ+కొట్టు.) వడదెబ్బ, వడగొట్టుట. "సీ. త్రావ నీర్వ దని విస్తరదుస్తరపుఁ ద్రోవ నెత్తుపైనము నాఁటియొండగొట్టు." రా.వి. ౨, ఆ. ౯౫.

ఎండచాటుపుట్టువు. దే.వి. (ఎండ+చాటు+పుట్టువు.) ఛత్త్రము, గొడుగు. వేంక. స్థా. ౧౪.

ఎండదొర. దే. వి. (ఎండ+దొర.) సూర్యుఁడు. "గీ. విపులఖరకరభీతి నవ్విపినసీమ, యండఁగొని యొండదొరఁ బోరి కరయఁ బిలుచు, వీఁక ఘూకమహోర్భటుల్ వెలయుఁ జీమ, లైనఁ దూఱంగ రాని యక్కాన నధిప." శేష. ౨, ఆ. (శ. ర.)

ఎండపసుపు. దే. వి. (ఎండ+పసుపు.) నీరెండచే వస్తువులందు స్వల్పకాలము మాత్రమే యేర్పడు పసుపురంగు. "ఆ. పూఁతనీరు చెలఁది నేఁతమూటాయిటె, దూది యొండపసుపు తొట్టియక్క, రంబు మేను దీని రహిఁ బుణ్య మమ్ముట, కప్పురంబు వెట్టి యుప్పు గొనుట." ఆము. ౬,ఆ.౬౨.

ఎండమఱువు. దే. వి. (ఎండ+మఱువు.) ఛత్త్రము, గొడుగు. "సీ. ఎల్లిచుట్టువు గొడు గెండమఱువనంగ ఛత్త్రంబు దనరు..." సాం. ని. స్థా. ౬౨.

ఎండమావులు. దే. వి. బ. మృగతృష్ణ, ఎండలో గుఱ్ఱమువలె చలించుచుఁ గనఁబడుఛాయలు, మట్టమధ్యాహ్నమున బయళ్లయందు నీటివలెఁ దోఁచుసూర్యకిరణములు. (ఇవి క్షణములో నదృశ్యము లగుచుండును.) "సీ...ఎండమావులనీళ్లఁ గాచాదుల నన్యోన్యబుద్ధి దా నడరునట్లు. ఆ. త్రిగుణసృష్టి యొందు దీపించి సత్యము, భంగిఁ దోఁచు..." భాగ. ౧, స్కం. ౩౪; ఆము. ౨,ఆ.౪౬. "క. మఱిఁ దలఁపఁగ సంసారం, బతిచంచల మెండమావు లట్టుల సంప, త్ప్రతతు లతిక్షణికంబులు, గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్." భార. ఆది. ౫, ఆ. ౧౫౯.

ఎండఱేఁడు. దే. వి. (ఎండ+ఱేఁడు,) ఎండదొర, సూర్యుఁడు. "ఆ. ఎండఱేఁడు గ్రుంకుకొండ నడఁగె." ద్వా. ౧, ఆ. ౨౫౩.

ఎండవడు. ద్వ. అ. క్రి. (ఎండ+పడు.) ఎండలో ప్రయాణము చేయు. "చ...చల్లన విశ్రమింపుమో, తెరువరి యింత యొండవడి తేఁగలయట్టి విఁ కేమిభాగ్యముల్." గంధ. ౬౬.

ఎండించు. దే. స. క్రి. (ఎండు. ధా. ప్రే.) ఆర్చు, నిర్ద్రవముగాఁ జేయు. "గీ. విడిచి కాషాయవస్త్రముల్ బెట్టు విసరు, గాలి నెండించుకొనుచు నా కలమునందు." దశా. ౧, అ. ౧౨౫.

ఎండు. దే. అ. క్రి. 1. ఆఱు, నిర్ద్రవమగు. (చూ. ఎండించు) 2. నీరసించు, చిక్కు. వ్యవ:— జ్వరపడి వాఁడు చాల నెండి పోయినాఁడు.

ఎండుగులు = ఎండువులు. "చ. కలమపుటెండుగుల్ ద్రవిడకన్యలు ముంగిటఁ గాచి..." ఆము. ౧, ఆ. ౭౫.

ఎండుతెవులు. దే. వి. (ఎండు+తెవులు.) దేహము శుష్కించెడు వ్యాధివిశేషము. (శ. ర.)

ఎండుపుఁదట్ట. దే. వి. (ఎండు+తట్ట.) ఎండఁబోయుటకు వెదురుబద్దలు మున్నగువానితో నల్లినతట్ట, డాఁగర. (శ. ర.)

ఎండువులు. దే. వి. బ. ఎండఁబోసిన ధాన్యము. "క. ముంగిళ్ల నెండువులు గాఁనంగఁబడవు..." కేయూర. ౩, ఆ. ౧౪.

ఎండ్ర. దే. వి. ఛత్త్ర, తృణవిశేషము. ఆం. భా. ద్వి. ౭౬.

ఎండ్రకాయ. దే. వి. (క. ఎండ్రకాయ.) కర్కటకము, పీత. "సీ...ఎండ్రకాయ జలగ." హంస. ౪, ఆ. ౧౨౬.

ఎండ్రి. దే. వి. 1. ఎండ్రకాయ. "సీ. ఎండ్రికాలిఱిగిన నెగసి యొక్కించుక తొలఁగి శితత్రోటి దూఁటి తినుచు." ఆము. ౨, ఆ. ౫౩. 2. కర్కటకరాశి. "గీ. ఎండ్రి రవి చేర మూఁడవయొడకుఁ జేరు,తరణి ధరణిం బ్రమోదసుధాయి గాఁడె." ఆము. ౪, ఆ. ౭౭.

ఎండ్రిక = ఎండ్రి. "గీ. ఎండ్రి యన నెండ్రిక యనంగ నెండ్రకాయ, యనఁగఁ గర్కటకాభిధ యలరుచుండు." ఆం. భా. ప్ర. ౧౬౦.

ఎండ్రిమేఁతరి. దే.వి. (ఎండ్రి+మేఁత+అరి.) నక్క. (ఆం. పదా.)

ఎంత. వై. స. బొ. అనా. (సం. యావత్. క. ఎనితు.) 1. ఏపాటిది. (ఈయర్థమున నిది లుపర్ణాంతముగను ఆమ్రేడితరూపముతోడను గూడఁ గానవచ్చుచున్నది.) "గీ...ధర్మపు దప్ప యుధిష్ఠిరుండు, వడయ నోడఁబడఁ డయ్యింద్రపదవియైన, నుచితగతి యెంత వడసిన నల్ల సిల్లు." భార. ఉద్యో. ౧, ఆ. ౧౧౧. "ఉ. ఎంతటి విస్మయంబు..." పారి. ౧, ఆ. ౧౦. "చ...పుణ్యచరిత్రములన్ మహాత్ము లెం,తలు రమణీయవిశ్రుతపదంబుల కేఁగుదురు..." భార. ద్రో. ౨, ఆ. ౩౩౮. "గీ. సర్వపార్థివులును జరాసంధుఁ గూడి, యెంతలెంతలు సేసిరి..." హరి. ఉ. ౨, ఆ. ౯౭. 2. ఎంతకాలము. "మ. త్రిదివంబెంతటిదాఁక నేలు నెలమిన్ దేవేంద్రుఁ డందాక సమ్మద మొప్పారఁ దదీయమిత్త్రపదవిన్ ధన్యుండవై యుండు..." హరి. ఉ. ౫, ఆ. ౨౪౮. 3. ఎంతదూరము. ఉదా:—వారియిల్లు మనయింటి కెంతలో నున్నది? 4. ఎట్టిస్థితి. ఉదా:—పాపము వా నిగతి యెంతకు వచ్చినది! (ఇట్లే వివిధార్థములు సందర్భానుసారముగా గ్రహించునది.)

ఎంతదనుక = ఎందాఁక. (శ. ర.)

ఎంతదాఁక = ఎంతదనుక. "గీ. ఇలయు గిరులును శరధులు నెంతదాఁకఁ, గలుగు నంతకాలంబును వెలయుచుండు, శుకునికీర్తియు..." భార. శాం. ౬, ఆ. ౩౮౧.

ఎంతయు. ద్వి. విశే. ద్రు. (ఎంత+యు.) మిక్కిలి. "సీ. ఎంతయు సంయమవంతుఁడు సహదేవుఁ డధ్యాత్మవిద్య నారాధ్యుఁడు..." భార. సభా. ౨, ఆ. ౨౮౨. "గీ. ఎంతయును సంతసంబునఁ గుంతిదేవి." భార. ఆది. ౬, ఆ. ౬. క్రి. విశే. ద్రు. అత్యంతముగా. "సీ...తత్తపమున కెంతయు వెఱచి..." భార. ఆది. ౪, ఆ. ౩౬.

ఎంతే = ఎంతేని. ద్వి. విశే. "ఉ...ఎం,తేరుష ద్రొబ్బ..." ఆము. ౪, ఆ. ౧౦౭. క్రి. విశే. "శా. అనిష్టానిధి గేహసీమ నడురే యాలించిరన్ బ్రాయము నెం,తే నా గేశశయాన పుణ్యకథలున్..." ఆము. ౧, ఆ. ౭౪.

ఎంతేని. ద్వి. విశే. (ఎంత+ఏని.) మిక్కిలి. "శా. నీ కెంతే నిత్తఁ డాప్తుఁడో జనకుఁడో నెయ్యంపుఁ దోఁబుట్టువో." కళా. ౩, ఆ. ౭౭. క్రి. విశే. అత్యంతముగా. (చూ. ఎంతయు.)

ఎంతో. ద్వి. విశే. (ఎంత+ఓ.) మిక్కిలి. "ఉ... ఎంతో తడవుగ్..." ఆము. ౬, ఆ. ౯. క్రి. విశే. అత్యంతముగా. ఉదా:—తన్ను రక్షింపుమని వాఁడెంతో ప్రార్థించినాఁడు.

ఎందనుక = ఎందాఁక. (శ. ర.)

ఎందఱు. ద్వి. స. బ. (ఎంత+వారు.) ఎంతశబ్దమునకు మహన్మహత్త్వర్థకరూపము, ఎంతమంది. "ఉ. ఎందఱు చక్రవర్తులు మఱెందఱురాజులు పోయిరి..."

ఎందఱే = ఎందఱేని. "చ...వత్తు రెందఱే, వదలక..." ఆము. ౧, ఆ. ౭౩.

ఎందఱేని. ద్వి. స. బ. (ఎందఱు+ఏని.) అనేకమంది. "గీ. ఎత్తె మున్మున్న గుఱ్ఱాల నెందఱేని." పాండు. ౪, ఆ. ౨౬౭. (ఇట్లే: ఎందఱో, ఎంతమందో మున్నగునవి గ్రహించునది.)

ఎందలి. ద్వి. విశే. ఎక్కడనున్న. ఉదా:—ఈవస్తు వెందలిది?

ఎందాఁక. ద్వి. అవ్య. ద్రు. (ఎంత+దాఁక.) ఎంతవఱకు. "గీ. ధరణి యెందాఁక నుండు..." భార. శాం. ౨, ఆ. ౧౪౮.

ఎందు. దే. అవ్య. ద్రు. ఇది సందర్భానుసారముగ దేశవిషయాదికమును దెలుపును. 1. దేనిలో. 2. ఎచ్చోటు. 3. ఎక్కడను. (ఇట్లే సందర్భానుసారముగా వివిధార్థములు గ్రహించునది.) "మ. క్షితి నెందుం జరియించి..." భార. శాం. ౨, ఆ. ౬౬. (సర్వత్ర అని భావము.)

ఎందుకు = ఎందులకు. (దేనికి) "చ...ఎం,దుకు మరుఁ డుద్భవించిన..." పార్వ. ౪, ఆ. ౫౬.

ఎందుల = ఎందు. 1. దేనియందు. "క. విను బ్రహ్మానందము తెలిసినవాఁ డెందులను భయముఁ జెందఁడు..." దశా. ౧, అ. ౨౨౧. 2. ఎందలి, ఎక్కడనున్న. "ఉ. ఎందులదానవు..." భార. ఆది. ౪, ఆ. ౧౭౭.

ఎందులకు. దే. అవ్య. ద్రు. 1. ఏచోటికి. 2. దేనికి.

ఎంపలి = వెంపలి. దే. వి. అల్పవృక్షవిశేషము. "ఉ. ఏనుఁగు చిక్కెనేని మఱి యెంపలి చెట్టునఁ గట్టవచ్చునే." ద్వా. ౧౧, ఆ. ౨౭.

ఎంబన్న. దే. విశే. (ఎంబె+అన్న.) చేతకానివాఁడు. (శ. ర.)

ఎంబె. దే. వి. 1. తెలివితక్కువ. 2. జుగుప్స. (చూ. ఎంబన్న; ఎంబెఱికము.)

ఎంబెరు. దే. వి. (ఎంబెరుమానారుయొక్క సంక్షిప్త రూపము.) రామానుజుఁడు. "ఆ. ఎంబెరుమత మందు నెసఁగ మాంసము దిని..." వేమన. 3, భా. ౧౨౪.

ఎంబెరుమాళ్లు. దే. వి. ఎంబెరుమానారు, రామానుజస్వామి. (వా.)

ఎంబెఱికము. దే. వి. (ఎంబె+ఱికము.) 1. తెలివితక్కువ. 2. జుగుప్స, రోఁత. (ఆం. పదా.)

ఎఁడు. దే. ప్ర. పరిమాణార్థకము. ఉదా:—పుడిసెఁడు, పిడికెఁడు మొ. (ఈ ప్రత్యయము అంతమందుఁ గలపదములు అసమాసముల ఔపవిభక్తికములు. ఉదా:—జేనెంట, అడుగెంట.)

ఎక. వై. స. (సం. ఏకః. క. ఎక్క.) ఏకార్థకము. (వృత్తియందే కాని దీనికి వ్యస్తముగ ప్రయోగములు కానరావు. ఉదా:— ఎకకంటిరథము.)

ఎకఁదొట్టు. దే. అ. క్రి. ఎగఁదొట్టు, అతిశయించు. "మహాస్రగ్ధర...నిట్టూర్పెకఁదొట్ట దన్ని..." ఆము. ౫, ఆ. 3.

ఎకకంటిరథము. మి. వి. (ఎక+కన్ను+రథము.) ఏకచక్రరథము, సూర్యరథము. "కవిరాజ. ఎకకంటి రథంబు వెసఁ బఱచెఁ." కవు. ౨, ఆ. ౬౨.

ఎకతాళము. వై. వి. (సం. ఏకతాళః.) సంగీతశాస్త్రమందలి యొకానొకతాళము, ఏకతాళము. "మ. ఎకతాళంబున వీరమద్దెలరవం బేకంబుగా..." శ్రీరం. మా. ౪, ఆ. ౧౬౦.

ఎకరంగి. దే. వి. ఏకరంగి, ఒక్కరంగు గలమొకమాలు. "సీ. ఇంతపై కెక్కిన యెకరంగిపఱుపై కుంకుమపుటంబు పటపుడోయి." రా. వి. ౫, ఆ ౮౯.

ఎకరము. ఆం. వి. 4840 చదరపు గజముల విస్తీర్ణము గలనేల, ఏకరు.

ఎకరా. దే. వి. 1. ఏనుఁగుపు గట్టు మొగసాల. స్వా. ౧, ఆ. ౪౦. 2. ఎకరము. 4840 చదరపు గజముల విస్తీర్ణముగల క్షేత్రము. వా:—ఆతనికి ఎకరా నలుబదిసెంట్లభూమి కలిసినది.

ఎకసకియము = ఎకసక్కెము. (శ. ర.)

ఎకసకెము. దే. విశే. వంపు గలది, ఒక ప్రక్కకు వంగినది. "సీ. జడ లల్లి చొల్లియం బిడి యెకసకెముగా బాలేందుశకలంబుఁ బదిలపఱచు." కాశీ. ౨, ఆ. ౧౪౬. (వికట మని శ. ర, విషమ మని సూ. ని.) వి. = ఎకసక్కెము.

ఎకసక్కియము. దే. వి. పరిహాసము. "గీ. అనుచు నెకసక్కెము లాడువనజముఖులఁ, గాంచి నవ్వుచు గోపికాకాంతుఁ డనియె." దశా. ౮, ఆ. ౨, ఆ. ౧౫౩.

ఎకసక్కెము. దే. వి. (క. ఎక్కసక్క.) 1. పరిహాసము. "ఉ. జంకెలు తేఱిచూపు లెకసక్కెములున్..." భాగ. ౧౦. స్కం. ఉ. ౨౬౫. 2. అవమానము. "చ...ఇపుడు నీ విట వచ్చుట పారిజాతవార్త, సనఁ బ్రకటించి నాకు నెకసక్కెము చేయఁగాదె చెప్పుమా. పారి. ౧, ఆ. ౧౨౮. 3. మోసము. "ద్వి. అకట చేతికిఁ జిక్కినటుల మాటాడి, యెకసక్కెమె యొనర్చి యిచట నిల్వకయే, యిపు డొగిఁ జని యె నియ్యిందీవరాక్షి." విష్ణు. ఉ. ౪, ఆ. (శ. ర.) వి. ణ. 1. వంగినది. (చూ. ఎకసకెము.) 2. అసంగతము. "ఉ. చక్కెరవింటరాజ యెకసక్కె మదే మని కూర్చుకొంటివి..." విజ. 3, ఆ. ౪౫.

ఎకసర. దే. వి. మల్లవిద్యానైపుణ్యవిశేషము. "వ... ఎకసర పైసర...ఆదియా షోడశోపవీతంబుల రీతుల నేర్చి...హంస. ౧. ఆ. ౨౦౬.

ఎకసెకియము=ఎకసక్కెము. (శ.ర.)

ఎకసెకెము=ఎకసక్కెము. (శ. ర.)

ఎకసెక్కియము=ఎకసక్కెము. (శ.ర.)

ఎకసక్కెము. దే. వి. పరిహాసము. "చ...కొం,చెముగ హసించి యొక్కయెకసక్కె మటాడి... చమ. ౧, ఆ. ౬౨.

ఎకాయెకి. హిం. క్రి. విణ. ద్రు. ఒక్కమాఱుగా. "చ. కదన మపారమై పఱచెఁ గత్తులఁ గత్తులు నీఁటె పీఁటియల్, గదియ నెకాయెకిం బడి చెకాచెకలై తునియంగ...రంగా. 3, ఆ. ౧౯౭.

ఎకిమీఁడు. దే. వి. 1. రాజు, ప్రభువు. "సీ. జేజేల యెకిమీల...దశా. 3, అ. ౧౭౬. 2. శ్రేష్ఠుఁడు. "గీ. విటుల కెకిమీని...విప్ర. ౨, ఆ. ౭౮.

ఎకిరింత. దే. వి. వాహనము. "గీ. అగ్నిభట్టారకుఁడు నిచ్చ లచట నుండ, నతనియెకిరింత యేడిక... కళ. ౧, అ. ౧౫3.

ఎక్కటి. వై. స. ఏ. (సం. ఏకరి. క. ఎక్కటి.) 1. ఒక్కఁడు. "క...ఉర్వీరాజ్యం, బెక్కటి నేలొని తేజము, దిక్కుల వెలింగింపు...భార. ఆది. ౮, ఆ. ౨౭౦. 2. కేవలము. "గీ. కటికి చీకటి వెలుఁగు నెక్కటి వెలుఁగు. ఉ. రా. ౧, ఆ. ౭౦. 3. అనాథము. "ఉ.అక్కట నిర్నిమిత్తము ధరాత్మజకెంత యుపాధి వచ్చెఁ దా,నెక్కటినై తినంచు వెత నెక్కడఁ బ్రాణము వీడునోకదే. ఉ. రా. ౬, ఆ. 3౨౦. 4. ఒక్కొక్కటి. "క. ఎక్కటియిట్టివి దోషము, లొక్కొకమరి రెండు మూఁడు నొదవి..., భార. అశ్వ. ౧, ఆ. ౧౭౮. 5. నిరుపముఁడు. "ఉ...ఆపురిభటశిఖామణు లెక్కటియుక్కుతున్కలు... విజ. ౧, ఆ. ౧౦. 6. అధికము. "చ...మన్మథకేళిమీఁద నెక్కటి వడి...శుక. ౨, ఆ. 33౮. 7. ఒకానొకయతి. ఉదా:—ఎక్కటివడి. 8. ద్వంద్వము, ఒకనితో నొకఁడు చేయునది. ఉదా:—ఎక్కటికయ్యము=ద్వంద్వయుద్ధము. విక్ర. ౮, ఆ. ౯౭.

ఎక్కటికము. దే. వి. అక్కటికముయొక్క భ్రష్ట రూపము. "ఉ. ఏమృగిమీఁద నేమృగయుఁ డెక్కటికం బిడు రాఘవేశ్వరా. చం. రా. ౬, ఆ. ౮3. ("కోసామరామమృగయుర్దయతే

ఎక్కటీఁడు. వై. విణ. (ఎక్కటి+ఈఁడు. స్వార్థమున.) అసహాయుఁ డగుశూరుఁడు. "సీ. ఇగురుకై జీతపుటెక్కటీలకు గుజ్జుపఱపుమామిడి కట్టుబడిగఁ జేసి. చంద్రా. ౮, ఆ. ౭౮.

ఎక్కడ. దే. వి. ఏ. (ఏ+కడ.) వృత్తియందు లోప విభక్తికము. విభక్తిప్రత్యయము పరమగునపుడు అనా. ఉదా:—ఎక్కడివారు, ఎక్కడకు.) చూ. అక్కడ. (ఈపదమునకు సందర్భానుసారముగా ఏచోటు, అత్యంతభేదము, పొసఁగమి, అనాదరము, లోకవైపరీత్యము మున్నగు నర్థములు వచ్చును. ఉదా:— ఈవస్తువెక్కడిది, నేనెక్కడ వాఁడెక్కడ, వాఁడెక్కడ నాకిచ్చుట యెక్కడ, ఎక్కడి తుచ్ఛసౌఖ్యములు, బాలుఁడెక్కడ కొండయెత్తు టెక్కడ. మొ)

ఎక్కము. యు. దే. వి. 1. గనిమ. (శ.ర;) 2. పొలమునకు పొలమునకు నడుమ నేర్పఱచిన గట్టు. (బ్రౌ.) వై. స. (సం. ఏకమ్. ప్రా. ఎక్కమ్.) గుణకారపథకము. వా:—ఎక్కాలు వచ్చినవా? ఏ. ఒక్కటి. (శ. ర.)

ఎక్కలమ్మ. దే. వి. ఒకానొక గ్రామదేవత. శుక. 3, ఆ. ౮౯.

ఎక్కలి. దే. వి. 1. ఒకానొక గ్రామదేవత. శుక. ౨, ఆ. ౮౨౮. 2. ప్రవాహముతోఁ గొట్టుకొని వచ్చి క్రమ్ముకొన్న యిసుక (శ. ర.)

ఎక్కసకియము
ఎక్కసకెము
ఎక్కసక్కియము } =ఎకసక్కెము. (శ. ర.)

ఎక్కసెక్కెము. దే. వి. పరిహాసము. "ఆ. ఎలమి నూరకుండఁ డెక్కసెక్కెము లాడుఁ,బట్టి శాస్తి చేయు భంగి యెట్లు. భాగ. ౧౦ స్కం. పూ. 3౬౮.

ఎక్కసెకియము
ఎక్కసెకెము
ఎక్కసెక్కియము } =ఎక్కసక్కెము. (శ. ర.)

ఎక్కసక్కెము. దే. వి. పరిహాసము. "సీ. ఎఱసంజకెంజాయ నెక్కసక్కెం బాడుచికిబికిపల్లవెం(డ్రు

ఎక్కాడు. దే. స. క్రి. (ఎక్కి+ఆడు.) ఎక్కియాడు, స్వారిచేయు. (పురికొలుపు అని శ. ర.) "గీ...పులి పేదవడినఁ బసుల,వాండ్రె యెక్కాడి రనుకత వచ్చెనాకు. ఉ. హరి. ౪, ఆ. ౧౦౨. (వెక్కాడు అని పాఠాంతరము. అపుడు వెక్కిరించు అని చెప్పవచ్చును.)

ఎక్కించు. దే. స. క్రి. 1. ఎక్కఁజేయు. "సీ... వనజాక్షు నెక్కించుకొనియె. కాశీ. ౨, ఆ. ౧౦౮. 2. ఎత్తు. "మ. బొమ లెక్కించిన విల్లు వంచు...పాండు. ౧, ఆ. ౧౪౯. 3. కలిగించు. "క...తన, మనమున నెక్కించుకొనఁడు మద గర్వంబుల్. భార. శల్య. ౧, ఆ. ౪౯. 4. అధికము చేయు. "సీ. శుక్లపక్షంబున సొరిదిమై నెక్కించి బహుళపక్షంబునఁ బరఁగదించి. మల్హా. ౨, ఆ. ౭౩. ౮. ఎక్కుపెట్టు. "క. తిగిచి శరాసన మెక్కించి..." పారి. ౫, ఆ. ౫. 6. బెల్లించు. ఆం. భా. తృ. ౧౨౪.

ఎక్కికొను. దే. స. క్రి. (ఎక్కి+కొను. స్వార్థమున.) ఎక్కు, అధిష్ఠించు. "మ...మనో, జవనుం డైన ఖగేంద్రు నెక్కికొని విష్వక్సేనుఁ డొందేనియున్." కాశీ. ౪, ఆ. ౨౭౪.

ఎక్కిడు. దే. స. క్రి. (ఎక్కు+ఇడు) ఎక్కుపెట్టు. "ఉ...మనోభవుండు వి,ల్లెక్కిడి..."భార. విరా. ౨, ఆ. ౩౧౯.

ఎక్కిరింత. దే. వి. 1. ఎకిరింత, వాహనము. "వ... వెన్నుఁ డెక్కు టెక్కపక్కి రయెక్కి రింత...రామా. ౧, ఆ. ౧౫౩. 2. గుఱ్ఱము. వేంక. మాన. ౯౧. 3. వెక్కిరింత, ఆక్షేపణము. "సీ. వెలి ద్విజు లెక్కిరింతలు సల్పఁ దగినట్టి జలజసంభవు నియాచార మెంత." ుచలా. ౧,ఆ.౧౮. (ఇది మొదటి యర్థమున నుదాహరణము.)

ఎక్కిరింతమెకము. ద్వ. వి. (ఎక్కిరింత+మెకము) —వెక్కిరి చుమృగము—కోఁతి. వేంక. తిర్య. ౯౫.

ఎక్కిలి. వై. వి. ఔ. (సం. హిక్కా.) దప్పి మొదలగువానిచేఁ గలుగురోగవిశేషము. "గీ. గొంతు తడిలేయు నెక్కిటఁ గొంతతడవు." దశా. ౨, ఆ. ౧౩౬.

ఎక్కు. దే. అ. క్రి. 1. అధిష్ఠించు. "ఉ...గద్దియ మీఁద నెక్కి..." పారి. ౧, ఆ. ౮౯. 2. పైకి వెడలు. "సీ. ఇడఁ బింగళను గాలి యెక్కుడిగ్గు." కాశీ. ౨, ఆ.౧౨౧. 3. నచ్చు. "గీ... ఒరుచిత్తమున కెక్కునట్లు గాఁగ." భార. విరా. ౧, ఆ. ౮౪. 4. వృద్ధి యగు. "గీ. ఎల్ల వారును గడునాయు వెక్కి తెవులుఁ, జావు లేకుండ నున్నారు దేవదేవ." హరి. పూ. ౫, ఆ. ౬. 5. అగు. "శా...పరువడిన్ హర్షోదయం బెక్కఁగా..."రాఘవ. ౩, ఆ. ౫౦. 6. సిద్ధించు. "చ. జనని వీవు వేఁడుదటె సత్యము తండ్రికి నెక్కునట్టె..."భా.రా.అయో. ౩౬. 7. విదితమగు. "క. నినుఁ గీడు వొరయకుండఁగ, జనులకు నానిక్క మెక్క జననాయక నే, ననలంబుఁ జొచ్చి వెడలెద..." భార. ఆర. ౮ ఆ. ౧౬౦. 8. ఆవేశించు. "ఉ...వే,ల్పెక్కినభంగి..." భా. రా. అయో. ౭౯. స. క్రి. 1. ఆరోహించు. "గీ. ఎరకుఁ దెరువరిఁ గన శాఖ లెక్క..." ఆము. ౬, ఆ. ౧౯. 2. అధిష్ఠించు. "క...రథము లెక్కి..." భార.ఆది. ౬,ఆ.౬౪. వి. 1. వింటినారి. (శ. ర., బ్రౌ.) 2. వింటినారి కూర్పు. "గీ...కార్ముకంబు, లెక్కు లటు డించి..." భా. రా. ఆర. ౧, ఆ. ౧౧. 3. ప్రేరేపణ. (చూ. ఎక్కులువెట్టు.)

ఎక్కుకొను. దే. అ. క్రి. (ఎక్కు+కొను. స్వార్థమున.) ఎక్కు, అధిష్ఠించు. "సీ. కొఱచేసున మంచె నెక్కుకొని యున్న, కన్నియను గాంచి..." పార్వ. ౬, ఆ. ౭౫.

ఎక్కుడించు. దే. స. క్రి. 1. (ఎక్కు+డించు.) వింటినారికూర్పును దొలఁగించు. "చ. కని బాణాసన మెక్కుడించి..." భా. రా. ఆర. ౧, ఆ. ౩., భార. విరా. ౧, ఆ. ౧౬౯. 2. (ఎక్కుడు+ఇంచు.) వృద్ధి చేయు. "గీ...ధర్మంబు రూపయి కానరా దొ, కింత గలిగిన నది ఫలం బెక్కుడించు." హరి. ఉ. ౯, ఆ. ౩౨.

ఎక్కుడు. దే. వి. 1. ఎక్కుట. "ద్వి. కొమరు దలిర్ప నెక్కుళ్ల దిగుళ్ల." పండితా. పర్వ. ౩౪౩, పు. 2. వాహనము. "ఎక్కుడివా రొకో

గరుడుఁ డెక్కుడుగాఁ గలవారు..." ఉ. హరి. ౬, ఆ. 3౭. "క. తొడవులు చివికిన యెమ్ములు, గుడిముట్టు కపాల మిల్లుగుడి ముడియె ద్దెక్కుడు ..."కు.సం. ౭, ఆ.3౯. 3. ఆధిక్యము. "ఆ. ఒక్కరూప కాని యెక్కుడు డిగ్గను, గాన రాదు ..." నిర్వ. ౧, ఆ. ౪౪. విణ. 1. హెచ్చైనది. "చ...ఎక్కుడుముద మొప్ప..." భార. ద్రో. 3, ఆ.౨౫౦. 2. శ్రేష్ఠము. "ఉ...వీరపో, యెక్కుడువారు లోకులకు..." ఉ. హరి. ౬, ఆ. 3౭. 3. అధికము. "ఎవ్వఁడో కో లయాంతకునియెక్కుడుక న్నఱకాలఁ దన్నె..." భా. రా. అర. ౧, ఆ. ౧౫౪. క్రి. విణ. అధికముగా. "క. కడు నమ్మియునికియును నెక్కుడు నమ్మమియును ..." భార. శాం. ౨, ఆ. ౧౦౭.

ఎక్కుడుఁదీఁగ. దే. వి. (ఎక్కుడు+తీఁగ.) మానేరు, జ్యోతిష్మతి ✤. (శ. ర.)

ఎక్కుడుగాఁడు. దే. వి. (ఎక్కుడు+కాఁడు.) రౌఁతు. "చ. ఎలుకలరాచ తేజి నెఱయెక్కుడుగాఁడు..." రాజ. చ. ౧, ఆ. ౫.

ఎక్కుడుమెకము. ద్వ. వి. (ఎక్కుడు+మెకము.) మహామృగము, ఏనుఁగు. "సీ. ఎక్కుడుమెకపు పూట్లు..." అచ్చ. అర. ౪.

ఎక్కుతక్కులు. దే. వి. బ. (ఎక్కువ+తక్కువలు.) హెచ్చుతగ్గులు, ఎక్కువతక్కువలు. "ఉ...దావిప్రై, మక్కువ లెక్కుతక్కులును మాటలు పిక్కులు..." రాధికా. 3, ఆ. ౧౫౯.

ఎక్కుదీయు. దే. స. క్రి. (ఎక్కు+తీయు.) సజ్యముగాఁ జేయు. "చ...మరుండు తుంటవిల్, బలుపడి నెక్కుదీసె..." నీలా. 3, ఆ. ౪౪. ఇట్లే: ఎక్కుద్రోచు. భాగ. ౧౦, స్కం. ఉ. ౧౨౯౨.

ఎక్కుబావి. దే. వి. (ఎక్కు+బావి.) దిగుడుబావి. "గీ. ఇఱుకుమ్రాని పెరంటిలో నెక్కుబావి." శుక. ౨, ఆ. ౪౦౮.

ఎక్కులుపెట్టు. దే. స. క్రి. (ఎక్కులు+పెట్టు.) పురికొలుపు, ప్రోత్సహించు. "ఉ. ఎగ్గులు చూపి చంపు మని యెక్కులుపెట్టినవారి పల్కులే, లగ్గుగ నాత్మలోపలఁ దలంచి..." దశ. ౮, ఆ. ౪౬.

ఎక్కువ. దే. వి. ఆధిక్యము. "వ...ఎక్కువతక్కువలు నిరూపించి భీష్ములు దీని నిశ్చయింప నర్హులు..." భార. విరా. ౪, ఆ. ౧౮౫. విణ. అధికము. "చ...సద్ద్విజకోటికన్న నెక్కువ యగు..." చిత్రభా. ౧, ఆ. ౧౦౦.

ఎక్కువెట్టు. దే. స. క్రి. (ఎక్కు+పెట్టు.) 1. సజ్యము చేయు. "గీ...గాండీవ మేత్తెఱ నెక్కువెట్టి." భార. ఉద్యో. ౨,ఆ.౧3౦. 2. నారిని సంధించు. "క...నునుగాడ్పునకున్, భసలగుణ మెక్కువెట్టఁగఁ, గుసుమ శరాసనునివిల్లు కుసులకు విఱిగెన్." కకు. ౧, ఆ. ౧౭౯.

ఎగఁగట్టు. దే. స. క్రి. (ఎగన్+కట్టు.) 1. పైకిఁ గట్టు. వా:—బట్ట యెగఁగట్టి పనిచేయుము. 2. ముడివేయు. "క. తలవెంద్రుక లెగఁగట్టెడు కొలఁదిన యానృపకుమారకుఁడు కడిమిమెయిన్ ...లిఖించె జయశాసనముల్." నైష. ౧, ఆ. ౬౪.

ఎగఁగొట్టు. దే. స. క్రి. (ఎగన్+కొట్టు.) 1. ఎగురఁగొట్టు. "సీ. వీచి తన్నెగఁగొట్టు వెక్కసం బగు సుడిగాలి రక్కసుమీఁద లాలి యూఁగి." చమ. ౧, ఆ. 3౨. 2. ఎగవేయు. వా:—వాఁడు నాకీయవలసినసొమ్మెగఁగొట్టినాఁడు.

ఎగఁగ్రోలు. దే. స. క్రి. (ఎగన్+క్రోలు.) పీల్చు. "క. బలుమి నొక్కటి నోరన్, సలిలం బెగఁగ్రోలుచుండఁ జని రాచెలువల్." కళా. ౬, ఆ. ౧౦౬.

ఎగఁజల్లు. దే. స. క్రి. (ఎగన్+చల్లు.) పైకిఁ జల్లు. "చ. సెలఁతలు బాతిగట్టుకొని నీ రెగఁజల్ల..." వసు. 3, ఆ. ౧౫౭.

ఎగఁజేఁపు. దే. అ. క్రి. (ఎగన్+చేఁపు.) పశువు పాలీయక బిగఁబట్టు. (వా.)

ఎగఁజోపు. దే. స. క్రి. (ఎగన్+చోపు.) 1. పైకిఁ ద్రోలు. "సీ. ఒకవేళ డేగవేఁటకుఁ జని యెగఁజోపి..." కాళ. 3, ఆ. ౪౭. 2. విడుచు.

"రగడ. మగువ లెగఁజోపి రభిమానముల మానముల." రాఘవ. ౨, ఆ. ౬.

ఎగఁదట్టు. దే. అ. క్రి. (ఎగన్+తట్టు.) **1.** పైకి వచ్చు. వా:—శ్లేష్మ మెగఁదట్టినది. **2.** అతిశయించు. "చ. దళముగ వేఁడియూర్పు లెగఁదట్టఁగ..." చెన్న. ౪, ఆ. ౨౦.

ఎగఁదన్ను. దే. అ. క్రి. (ఎగన్+తన్ను.) **1.** పశువు పా లీయకుండు. (వా.) **2.** ఎదురుగాఁ బాఱు. వా:—ఏఱు ఎగఁదన్నినది. స. క్రి. పైకిఁ ద్రోయు. వా:—ఆవిరి మూఁత నెగఁదన్నినది.

ఎగఁదీయు. దే. స. క్రి. (ఎగన్+తీయు.) పైకెత్తు. "గీ. తిరిగి చూచుచు ద ట్లెగఁదీసికొనుచు." స్వా. ౪, ఆ. ౧౦౩.

ఎగఁదొట్టు. దే. అ. క్రి. (ఎగన్+తొట్టు.) అతిశయించు. "గీ. ఎదుటఁ బడకున్న ముఃకోటి వెదకి వెదకి, పట్టి భక్షించుఁ గ్రొ వ్వెగఁదొట్టి..." ఉ. రా. ౨, ఆ. ౧౪౮.

ఎగఁద్రోచు. దే. స. క్రి. (ఎగన్+త్రోచు.) పైకిఁ ద్రోయు. "వ...పరిధానం బెగఁ ద్రోచికొని..." భార. సభా. ౨, ఆ. ౮౬. ఇట్లే: ఎగఁద్రోయు. హర. ౭, ఆ. ౧౧౯.

ఎగఁబట్టు. దే. స. క్రి. (ఎగన్+పట్టు.) ఎత్తిపట్టు. "చ. బరు వయి తోఁచె నంత నెగఁబట్ట సమర్థుఁడు గాక..." శేష. ౫, ఆ. (శ. ర.)

ఎగఁబడు. ద్వ. అ. క్రి. (ఎగన్+పడు.) **1.** పరుగెత్తుకొని వచ్చు. "గీ. స్తనితముల కెగఁబడి వచ్చు శరభములను." కాళ. ౨, ఆ. ౭౦. **2.** మీఁదఁబడు. వా:—వారం దఱతని కెగఁబడిరి.

ఎగఁబాఱు. దే. అ. క్రి. (ఎగన్+పాఱు.) ఎగువకుఁ బాఱు. (శ.ర.)

ఎగఁబిల్చు. దే. స. క్రి. (ఎగన్+పిల్చు.) పైకి పిలుచు. వా:—వాఁడు గాలి యెగఁబిల్చుచున్నాఁడు.

ఎగఁబెట్టు = ఎగఁగొట్టు. (వా.)

ఎగఁబోఁత. దే. వి. (ఎగఁబోయు. ధా.) ఎగఁబోయుట. విణ. ప్రోత్సాహకరము, ప్రేరించునది. "ఉ. మంచితనాన వ ల్దనినమాటలు నీ కెగఁబోఁతలయ్యె..." రాధా. ౧, ఆ. ౭౫.

ఎగఁబోయు. దే. స. క్రి. (ఎగన్+పోయు.) అతిశయింపఁజేయు. "చ. అనఘ యపూర్వ మైన భవదాగమనంబు తలంప నొక్కచోఁ, బొనరిన కయ్య మిప్పు డెగఁబోయఁగ వచ్చినయట్లు తోఁచె..." శశాం. ౪, ఆ. ౧౯౧. **2.** ప్రేరేచు. "మ. అజహన్మత్సరవృత్తి చిత్త మెగఁబోయన్..." చం. రా. ౫, ఆ. ౪౯. అ. క్రి. దుర్బోధము చేయు. "చ..., మనలను జూడలేక నడుమంత్రపువాడు గుబారుచేసి గొబ్బున నినువంటిదాని నెగఁబోసిరి నాతలఁ బొప్పకుండఁగన్." రాధా. ౩, ఆ. ౭౮.

ఎగఁబ్రాఁకు. దే. అ. క్రి., స. క్రి. (ఎగన్+ప్రాఁకు.) పైకిఁ బ్రాఁకు. "సీ. తెఱగంటి దొరయింటి తెలిమ్రాఁకు లెగఁబ్రాఁకి..." నీలా. ౧, ఆ. ౭౫.

ఎగచు. దే. స. క్రి. **1.** తఱుము. "గీ...ఓడిపాఱె నబ్బలముఁ గడిమి, నెగచెఁ బ్రాగ్జ్యోతిషాధీశు డిభముఁ బఱపి." భార. భీష్మ. ౩, ఆ. ౩౬. నిర్వ. ౭, ఆ. ౧౦౮. "క. వేదండాదుల నొకనాఁ,డేదండలఁ బోవనీక యెగచెం బలిమిన్." భాగ. ౧, స్కం. ౪౫౩. (దీనికి ఎగవన్ అను రూపము." నిర్వ. ౩, ఆ. ౩౩., ౪, ఆ. ౪౮. లోను గానవచ్చుచున్నది.)

ఎగతాళి. దే. వి. (క. ఎగితాళి.) గేలి, పరిహాసము. (శ. ర. బ్రా.)

ఎగదిగ. దే. క్రి. విణ. ద్రు. **1.** క్రిందికి మీఁదికి. "గీ...తనకూఁతుసింగార మెల్ల జెక్కుమాఱు లెగదిగఁ గ్రేఁగంటఁ బాఱఁ జూచి." కళా. ౭, ఆ. ౬౭. **2.** ముందునకు వెనుకకు. "ఉ... చీ,కా కయి యూరకే యెగదిగం దలపోయుచు నున్నవారికిన్." రామా. ౭, ఆ. ౬౯.

ఎగదువ్వు. దే. స. క్రి. (ఎగన్+దువ్వు.) పైకి దువ్వు. "సీ. డిగజాఱుముంగురు లెగదువ్వ కైతవంబున నెమ్మొగంబుపై మోముఁ జేర్చి." కవిజ. ౩, ఆ. ౧౨౪.

ఎగనూఁదు. దే. స. క్రి. (ఎగన్+ఊఁదు.) 1. ఎగుర నూఁదు. 2. నిరసించు. "సీ. వాఁశికవంశి కావై భవం బెగనూఁదెఁ దాళికాధరకరతాళగరిమ." వసు. ౫, ఆ. ౬౯. (ఇది పై రెండర్థముల కుదాహరణమే.)

ఎగసెత్తు. దే. స. క్రి. (ఎగన్+ఎత్తు.) పై కెత్తు "సీ. అభివీక్షణేచ్ఛ నమ్రాననం బెగసెత్తి..." ప్రభా. ౫, ఆ. ౪౪.

ఎగపు. దే. వి. 1. ఎగసి పడుట. ఆం. భా. ద్వి. ౯౯. 2. గర్వము. (శ. ర.) 3. మండి పడుట. "ద్వి. బాగు మీఱిననాగబంధపు మొగపుఁతీఁగ దానికిఁ గల్గఁ దీఱదే యెగపు." ద్వి. భాగ. ౧౦, స్కం. (శ. ర.)

ఎగమీటు. దే. స. క్రి. (ఎగన్+మీటు.) పైకి మీఁటు. "మ...లేగవ్వమీటినసూటికిన్ బోట వ్రేలిగోట నెగమీటెన్..." వసు. ౧, ఆ. ౧౧౯.

ఎగమ్రింగు. దే. స. క్రి. (ఎగన్+మ్రింగు.) పూర్తిగా మ్రింగు. "క. యోషిద్రూపంబున నను, నేషణముఖ గహ్వరమున నెగమ్రింగి..." భాగ. ౬, స్కం. ౧౫౦.

ఎగయించు. దే. స. క్రి. (ఎగయు. ధా. ప్రే.) 1. ఎగయఁజేయు, ఎత్తు. "వ...మొగం బెగయించి..." భార. భీష్మ. 3, ఆ. ౧౭౪. 2. వ్యాపింపఁజేయు. "చ...గాడ్పు చేఁ, బొగ లెగయించి..." కాళ. ౪, ఆ. 3౪.

ఎగయు. దే. అ. క్రి. 1. ఎగురు. "క...తానుడు వీథి కెగసి..." ప్రబోధ. 3, ఆ. ౭౭. 2. వ్యాపించు. "క...శకుంతసమాజము కలకలము లెగసె..." జై. ౨, ఆ. ౧౦౧. 3. లేచు. "గీ. ఇమ్మహాసేన బరువున నెగయకున్నె." వరాహ. 3, ఆ. 3౦. 4. కలుగు. "ఉ...ఊర్పు లందుఁ గార్చిచ్చెగయంగ..." భాగ. ౧౦, స్కం. పూ. ౭౦౪. 5. వెడలు. "ఆ... భస్మ మెగయుబిధము." వరాహ. ౧౨, ఆ. ౨౬. 6. ఊడివచ్చు. "ఉ...చేతికిఁలం బ్రై,తో లెగయంగ వ్రేసి వెసఁ దోడ్కొని..." మార్క. ౧, ఆ. ౨3౦.

ఎగయుదెంచు. దే. అ. క్రి. (ఎగయు+తెంచు. స్వార్థమున.) నెగయుదెంచు, పైకి వచ్చు. "ఆ. విషకృశాను లదర వీచికానిక్షిప్త, మగుచు నెగయుదెంచె నహిశుబంబు." రామా. ౭, ఆ. ౧౧౦.

ఎగరొప్పు. దే. అ. క్రి. (ఎగన్+రొప్పు.) వగర్చు. "వ...దగల నెగరొప్పు..." ప్రబోధ. ౭౮౮. వి. వగర్పు. (శ. ర; బ్రౌ.)

ఎగరోఁజు = ఎగరొప్పు. (శ. ర; బ్రౌ.)

ఎగవిడుచు. దే. స. క్రి. (ఎగన్+విడుచు.) విడిచివేయు. "క...నీ, కెగవిడిచి పోయెపనె ప్రా, వగ నాకాణాచి యైనవలపులపంటన్." కళా. 3, ఆ. ౧౯౧.

ఎగవు. దే. వి. ఉడ్డీనము, ఎగురుట. (శ. ర.)

ఎగవేయు. దే. స. క్రి. (ఎగన్+వేయు.) 1. ఋణాదులను తీర్చకుండు; ఎగఁగొట్టు. (వా.) 2. చేసిన దోషము తప్పించుకొను. "ద్వి. ఎంత నేరమి చేసి యెగవేయఁగలదు, అంతకురాలిది యనియెడువారు." ద్వి. సారంగ. 3, ఆ. ౧౦౭, పు.

ఎగవైచు. దే. స. క్రి. (ఎగన్+వైచు.) ఎగుర వేయు. "ఉ. శైలము లెత్తి కందుకముచందముగా నెగవైచి నేలకున్, వ్రాలఁగనీక పట్టు..." రామా. ౫, ఆ. ౨౯౧.

ఎగసన. దే. విశే. అధికము. "గీ...ఏం డ్లెగస నైన, బుద్ధి దిగసన వచ్చెనో..." సిం. నార. ౧౯. క్రి. విశే. ద్రు. ఎగువగా. "సీ. అన్నపాత్రావలోకార్థమై దీపంబు శంభుసన్నిధి కెగసనఁ గఁద్రోసె." పానందో. ౫ ఆ, ౫3. ('శంభుసన్నిధి కేఁగె ననఁగఁ ద్రోసె' అని ముద్రి.)

ఎగసనఁద్రోచు. దే. స. క్రి. (ఎగసన+త్రోచు.) 1. పైకిఁద్రోయు. "చ...దృష్టదనాస్త్రపాపరున్,... మాయకట్టెచేఁ నెగసనఁద్రోచి..." కాళ. ౪, ఆ. 3౪. 2. పురికొల్పు. 3. పైకెదిద్దు. "సీ. తుది వ్రేల నెగసనఁద్రోచిన పుసియబొట్టురుఫాలపట్టిక నుల్లసిల్ల." భా. రా. ఆర. ౨ ఆ, ౮౨. ఇట్లే: ఎగసనఁద్రోయు. (వా.)

ఎగసిపడు. అ. క్రి. (ఎగసి+పడు.) 1. ఎగిరిపడు. 2. గర్వపడు. "క. తా నెంత యెగసిపడినం, గానీ దీనికుచములకుఁ గందుక మెనయే." రా. వి. ౩, ఆ. ౧౦౧. (రెండర్థములకు నుదాహరణము) 3. కోపపడుట. (చూ. ఎగసిపాటు.)

ఎగసిపాటు. ద్వ.వి. (ఎగసిపడు. ధా.) 1. ఎగిరిపడుట. 2. గర్వపడుట. "క. భసలమ నీ కింతయెగసిపాటేమిటికిఁ." రసిక. ౪, ఆ. ౧౭౧. (రెండర్థములకు నుదాహరణము.) 3. మండిపడుట. (శ. ర.)

ఎగాదిగ = ఎగదిగ. "సీ. కనురెప్ప వెట్ట కాతని నెగాదిగఁ జూచు..." శశాం. ౨, ఆ. ౭౭.

ఎగిరిపడు. ద్వ. అ. క్రి. (ఎగిరి+పడు.) 1. ఎగిసిపడు 2. గర్వపడు. "(గోర్వంకలార!)గీ...ఎగిరిపడఁగ. వలదు మనుఁ డింక సన్మార్గవర్తు లగుచు." రాధికా. ౩, ఆ. ౬౬.

ఎగు. దే. అ. క్రి. (క. ఎగు.) 1. పైకిఁ బోవు. "చ. కొలుచును జేవ వెట్టి కుచకుంభయుగం బెగడిగ్గఁ గన్నుఁ గ్రే, వలఁ బరికించు..." క్రీడా. ౧౦౬. 2. ఎత్తగు. "సీ. ఎగుబుజంబులవాఁడు..." విజ. ౨, ఆ. ౧౬౪. 3. ఎగురు. (చూ. ఎగుబోద.) 4. పూర్తియగు. (చూ. ఎగమ్రింగు.)

ఎగుచే. దే. స. క్రి. 1. తఱుము. "ఆ. వీరసేనసుతుఁడు వీరుండు హంసల...ఎగిచి యెగిచి యందు నెగయకుండఁగ నొక్క, హంసఁ బట్టుకొనియె..." భార. ఆర. ౨, ఆ. ౧౨. 2. త్రోలు. "చ. అనవుడుసూతుఁ డెంతయు రయమ్మునఁ దేరు వృకోదరాంతికం, బున కెగువంగ..." భార. కర్ణ. ౧, ఆ. ౧౫౯. 3. చోపు. "సీ. ఎగుచుకూఁతలు మట్టె యెత్తి బిట్టాలించి..." స్వా. ౪, ఆ. ౪౨.

ఎగుడు. దే. విశే. ఎత్తుగా నున్నది. (చూ. ఎగుడుదిగుడు.)

ఎగుడుదిగుడు. దే. విశే. (ఎగుడు+దిగుడు.) 1. సమము కానిది. ఉదా:—ఎగుడు దిగుడు నేల. 2. సంగతము కానిది. ఉదా:—ఎగుడుదిగుడు మాట.

ఎగుదల. ద్వ. వి. (ఎగువ+తల) 1. పైభాగము. (శ. ర.) 2. అభివృద్ధి. (శ. ర.)

ఎగుదు. దే. అ. క్రి. 1. పరుగెత్తు. "ద్వి. ఎగిది శివాలయం బింతిసొచ్చుడును." బస. ౬, ఆ. ౫౪౮. పం. 2. వచ్చు. "ద్వి. ఎగుదునొకో వత్తు లిప్పుడేట కనుచు." పండితా. పర్వ. ౩౨౮పు.

ఎగుబోద. ద్వ. వి. (ఎగురు+బోద.) ఎగురుటకు ఱెక్కలు వచ్చినపక్షిపిల్ల. "సీ. ఎగుబోద లయి గూఁడు దిగనాడి పెఱమ్రాఁకు లెక్క నారసి యుత్సహింప లేదు." వేం. పంచ. ౧, ఆ. ౨౮౭.

ఎగుమతి. దే. వి. 1. ఓడకు సరకు లెక్కించుట. (శ.ర.) 2. పరదేశములకు సరకు లంపుట. (వా. వ్యతి. దిగుమతి.)

ఎగుమతిచేయు. దే. స. క్రి. (ఎగుమతి+చేయు.) 1. ఓడకు సరకు లెక్కించు. (శ. ర.) 2. దేశాంతరములకు సరకులంపు. (వా.)

ఎగురు. దే. అ. క్రి. (క. ఎగరు.) 1. ఎగయు. "ఆ. మువ్వ గవల నత్తైములనుండి యెగురుచు." స్వా. ౪, ఆ. ౩౫. 2. పైకి లేచు. "సీ... కనుబొమ లెగుర వైచు." దశా. ౨, అ. ౩౦ 3. స. క్రి. ఎగురవేయు. "గీ... మోపుగట్టి, వాఁడిపండ్లు బిగించి చేవలఁతి యెగిరి, యెత్త మోపెత్త రాదయ్యె" హర. ౧, ఆ. ౨౦. వి. 1. ఎగురుట. (శ. ర.) 2. పొగరు. వా:—అతనియెగు రణఁగినది.

ఎగురులాడు. దే. అ. క్రి. (ఎగురులు+ఆడు.) దుముకులాడు. (శ. ర.)

ఎగువ. దే. వి. మీఁదు. "ఆ. ఎగువ నొక్కతోఁట యెద్దియో గలదు..." పరమ. ౩, ఆ. ౧౯౩. విశే. మీఁద నున్నది. "వ... దిగువదెస దొడ్డివల పన్ని యెగువ పొలిమేర బారాది యగుదూరం బేఁగ" స్వా. ౪, ఆ. ౩౭.

ఎగువు = ఎగుచు. (త్రోలు.) "ఆ... సూతు, నరద మెగువు తోలఁగ ననియె నధిప." భార. కర్ణ. ౨, ఆ. ౩౮౧.

ఎగ్గడి. దే. వి. 1. హెగ్గడి, అంతఃపురపుఁ గావలివాఁడు. "సీ...షండుఁ డొప్పు నెగ్గడి యనంగ

...” ఆం. భా. ద్వి. ౧౮౩. **2.** అంతఃపురపుఁ గావలికత్తె. (చూ. ఎగ్గడికత్తె.)

ఎగ్గడికత్తె. దే. వి. (ఎగ్గడి+కత్తె. స్వార్థమున.) అంతఃపురపుఁ గావలికత్తె. “గీ...ఎగ్గడికత్తె కేలి, చికిలి బెత్తంబు తఱు లింత చేసెఁ గాక.” బహు. ౨, ఆ. ౬౫.

ఎగ్గడికాఁడు = హెగ్గడికాఁడు. (రూ.)

ఎగ్గడీఁడు = హెగ్గడీఁడు. (రూ.)

ఎగ్గతము. వై. వి. (సం. ఏకాంతః.) ఏకాంతస్థలము. “గీ. ఎగ్గతంబునఁ దానుఁ గారగ్గిఁ గాలె.” భార. ఆశ్ర. ౨, ఆ. ౧౬౩. విణ. ఏకాంతమైనది. “గీ...అతఁ డెగ్గతంపుఁజోట, నరయ దిక్కెవ్వరును లేనియట్టితెగుట, నొందఁ గలవాఁడు...” భార. మా. ౨౫౭.

ఎగ్గించు. దే. స. క్రి. **1.** తప్పుగాఁ దలఁచు. “శా. ఏలా షట్పద యెగ్గు మావలన నీ కెగ్గింపఁగా నేటికిన్.” భాగ. ౧౦, స్కం. పూ. ౧౪౬౦. **2.** దూషించు. “సీ. అనుచు నెగ్గించిన నాకమలాకరుం డభిమానియై...” ద్వా. ౪, ఆ. ౧౭౩. **3.** అనాదరించు. “మ. తనరాజీవశరంబెఱుంగదు నిశాతత్త్వంబు లేఁగల్వతూ, పునకుం జాలదు వేగ లీల యని యాపూములుక్కు లెగ్గించి...” వసు. ౨, ఆ. ౪౮.

ఎగ్గు. దే. వి. **1.** కీడు. “వ...విశ్వసించినవారికిం దనకుఁ గుడుపంబెట్టినవారికి నెగ్గు సేయుట కడుం బాపంబు...” భార. అర. ౩, ఆ. ౩౮౫. **2.** అపకారము. “వ. ఇట్లు దుర్యోధనుండు భీమునకుఁ దనచేసినయెగ్గు లెల్లను గృతఘ్నునకుం జేసిన లగ్గులునుం బోలె నిష్ఫలంబు లైన సిగ్గుపడి...” భార. ఆది. ౫, ఆ. ౧౨౦. **3.** అపరాధము. “గీ..., ఎఱుఁగ కొనరించినట్టి నాయెగ్గు లెల్ల...కావుము...” కళా. ౫, ఆ. ౧౩౦. **4.** తప్పు. “క. కాముకులకు నెగ్గు సిగ్గుఁ గలవే యెందున్.” సా. ౨, ఆ. ౨౧౩. **5.** దుర్నిమిత్తము. “క. ఖలుఁ డీదుర్యోధనుఁ డెగ్గుల తోడన యుద్భవిల్లె...” భార. సభా. ౨, ఆ. ౧౭౮. **6.** భంగము. “చ...కలదె పల్కున కెగ్గు...” కళా. ౬, ఆ. ౫౦. **7.** అపకీర్తి “ఉ...ధర్మకీర్తులన్, బొగ్గులు సేసి జారు శశిఁ బొంది కటా కడు పేల తెచ్చుకొం, టెగ్గుఁ దలంపఁగా వలదె...” భాగ. ౯, స్కం. ౩౭౮. **8.** అమంగళపు మాట.” ఆం. భా. ప్ర. ౧౧౭. **9.** అవమానము. “క...నిన్ను, నెవ్వ రెగ్గు సేసి రెఱిఁగింపవే...” సా. ౨, ఆ. ౨౦౧. విణ. హానికరము. “క. అంతిపురముచుట్టఱికం, బెంతయుఁ గీ డంతకంటె నెగ్గు తదీయో, పాంతచర కుబ్జవామన, కాంతాదులతోడి పొందుకలిమి భటునకున్.” భార. విరా. ౧, ఆ. ౧౩౧.

ఎగ్గుగొను. దే. స. క్రి. (ఎగ్గు+కొను.) తప్పుగా భావించు. “క...నీవిభుఁ డాడినది యెల్ల నెగ్గుగొనక...” భార. కర్ణ. ౩, ఆ. ౮౩.

ఎచ్చిరిలు = ఎచ్చిరిల్లు. **1.** వర్ధిల్లు, వృద్ధిపొందు. “గీ. ఏయుపాయంబుచే నైన నెచ్చిరిలఁగ,నీక రాక్షసకులము రమేశ్వరుండు, దునుము...” కళా. ౬, ఆ. ౩౨. **2.** జాగరూకుఁ డగు. (చూ. ఎచ్చిరిల్లు.) **3.** చెలరేఁగు. (చూ. ఎచ్చిర్లు.)

ఎచ్చిరిల్లు. దే. అ. క్రి. **1.** జాగరూకుఁ డగు. “గీ...ఎచ్చిరిల్లి, కాన నిది వేళ...” శ్రీరం. మా. ౩, ఆ. ౧౪. **2.** వర్ధిల్లు. **3.** చెలరేఁగు.

ఎచ్చిర్లు = ఎచ్చిరిలు. (చెలరేఁగు.) “ఆ...దమజు, లెపుడు ప్రొద్దు గ్రుంకు నెపుడు మా కెచ్చిర్లఁ, గలుగు ననుచుఁ బోరు సలుపుచుండ.” రామా. ౮, ఆ. ౬.

ఎచ్చుఱు. దే. అ. క్రి. (క. ఎచ్చఱు.) **1.** వర్ధిల్లు. “చ...చంద్రహాసుఁ డెచ్చుఱినఁ బ్రమాద మా ననుచు...” జై. ౮, ఆ. ౯౩. **2.** సేదదేఱు. “వ...గిరిజ శిశిరగిరివరకరస్పర్శంబు శిశిరోపచారంబుగా నెచ్చుఱి...” కు. సం. ౫, ఆ. ౧౦౪. **3.** బాగుపడు. “చ...బుద్ధిహీనునకు నెంతయు బుద్ధులు చెప్పనేని యెచ్చుఱఁడు...” నా. పంచ. ౧, ఆ. ౫౦౨.

ఎచేటు = ఎచ్చోటు. ఉ. హరి. ౩, ఆ. ౨౯.

ఎచేరము = ఎచ్చరము. "సీ. ఒల్ల దు గోపించి యొం డుసెత్తము వన్న సెచరంబు నే ర్వని యెన్నుఁ గాని." ఉ. హరి. 3, ఆ. ౧౨౪.

ఎచేరించు = హెచ్చరించు. "గీ...వలఁతి యైన,వెజ్జు సెచరించి యరయించె విప్రసుతుని, గంట వత్తి డుకొని సైరికప్రభుండు." పాండు. 3, ఆ. ౫౬.

ఎచ్చోటు = ఎచ్చోటు. ఆము. ౧, ఆ. ౪౧.

ఎచ్చేరము. దే. వి. హెచ్చరిక. "వ...అయ్యెచ్చర లెచ్చరంబులకచ్చు పదలి..." కవిక. ౬,ఆ.౯౪. (శ. ర. పా.)

ఎచ్చేరించు. దే. స. క్రి. 1. పురికొలుపు. "ఉ... కోరికల్, పెచ్చుగ సెచ్చరింప..." మల్హ. ౨, ఆ. ౯౫. 2. స్మృతికిఁ దెచ్చు. "ఉ...జ, న్మాంతరవర్తనంబు హృదయంబున కిత్తఱి సెచ్చరించి..." ఆము. ౫, ఆ. ౭౭. 3. జాగరూకునిఁ జేయు. "చ. అతినికటంబు లగ్నమని యాంగిర సుం డపు డెచ్చరింప..." వసు. ౬, ఆ. ౮. 4. తెలియఁజేయు. "శా...విభీషణుఁ డెచ్చరింప..." దశా. ౭, అ. ౧౫౬.

ఎచ్చేరింత. దే. వి. (ఎచ్చరించు, ధా.) హెచ్చరిక. "ఉ. వింతకవుంగిలింతల నవీనగళధ్వని యెచ్చరింతలన్." పాంచాలీ. 3, ఆ. ౬౦.

ఎచ్చేరింపు = ఎచ్చరింత. "సీ. ఎచ్చరిం పెఱుఁగని యొడఁదబల్ తమకంబు..." చంద్రా. ౬, ఆ. ౧౪౮.

ఎచ్చేరిక. దే. వి. (ఎచ్చరికె.) 1. హెచ్చరిక, ప్రోత్సాహము. "వ...నిచ్చలంపు టెచ్చరిక చాలక ... పోరునిజయోధవీరులకు ..." రాఘవ. ౪,ఆ. ౧౫౨. 2. అవధానత, తదేకదృష్టి. "చ...నన్నుఁ గూర్చి యెచ్చరిక ధరింపఁ బోలు నన..." పాండు. ౨, ఆ. ౯౭. 3. ప్రభువుల జాగ్రత్తకై కంచుకు లుపయోగించు మాట. "క...అహో, యెచ్చరిక సామి యను రవ, మెచ్చఁగ..." ఉ. రా. ౭, ఆ. 3౯౮.

ఎచ్చేరికించు. దే. స. క్రి. 1. హెచ్చరించు, ప్రోత్సహించు. "ఉ...క, న్నిచ్చలు వచ్చుచేడియల సెచ్చరికించుచు." విక్ర. ౮, ఆ. ౨. 2. స్మృతికిఁ దెచ్చు. "సీ. మఱవక నే నన్నమాట యెచ్చరికించి..." శ్రీరం. మా. ౪, ఆ. ౪.

ఎచ్చు. దే. అ. క్రి. (క. ఎచ్చు.) 1. మిక్కుటమగు. "క...అహో, యెచ్చరిక సామి యను రవ, మెచ్చఁగ..." ఉ. రా. ౭, ఆ. 3౯౮. 2. విజృంభించు. "ఉ. దుర్మతు లెచ్చి సాధులకు ద్రోహము సేయుచునెడన్..." ఉ. రా. ౨, ఆ. ౧౧౦. వి. ఆధిక్యము. "గీ. నిచ్చలంబునఁ గడలఁ దా నెచ్చు గాంచి." నీలా. ౧, ఆ. ౪౨. విశే. 1. అధికము. "క. వచ్చినవారికి నాపద, వచ్చిన నది పరిహరించువాని ప్రభుత్వం, బెచ్చౌను..." దశా. ౨, అ. ౨౧౭. 2. ఉత్తమము. "గీ. ఇట్టివారలఁ గృపచూచు టెచ్చు గాదు." వేణు. ౨.

ఎచ్చోటు = ఎచ్చోటు. "మ...ఎచ్చోట లే దిట్టి కడానిచోఱ..." దశా. ౧, అ. ౨౭౮.

ఎచ్చో. దే. అవ్య. ద్రు. 1. ఏచోటు. "క...సూకరమార్గం, బెచ్చో వదలక..." విక్ర. ౨, ఆ. ౧3౭. 2. ఎప్పుడు. ఆము. ౪, ఆ. ౨౬౨.

ఎచ్చోటు. దే. వి. ఏ. (ఏ+చోటు.) ఏప్రదేశము. భా. రా. అయో. ౨౦౫.

ఎట. దే. వి. ఏ. ఎక్కడ. "క. ఏనెట నీ వెట..." భార. ఆది. ౪, ఆ. ౯౯.

ఎటవారె. దే. వి. కుందురికి, అందుకు ? (శ. ర.)

ఎటు. దే. అవ్య. 1. ఏవైపు. ఉ. రా. ౧,ఆ. ౧౭౯. 2. ఏరీతి. స్వా. ౬, ఆ. ౫౦. 3. పొసఁగమిఁ దెలుపును. (వా.)

ఎటులు = ఎటు. స్వా. ౪, ఆ. ౮3. ఇట్లే: ఎట్టులు. నీలా. ౧, ఆ. ౨3.

ఎటువంటి. దే. విశే. ఎట్టి. "చ. తన కెటువంటి వేడుకయొ..." కాళ. ౧, ఆ. ౯౯.

ఎటువలె. దే. అవ్య. ద్రు. ఎట్లు, ఏరీతి. "చ... ఒంటిమై, నెటువలె వచ్చి తమ్మ..." వసు. 3, ఆ. ౧౨౧.

ఎట్టకునేని. దే. అవ్య. తుదకు. "ఉ...ధృతి నెట్టకు నేనియుఁ బూని..." భా. రా. అయో. ౪౯.

ఎట్టకేని = ఎట్టకునేని. "గీ. ..పాంచాలి యెట్టకేని." భార. విరా. ౨, ఆ. ౧౧౨.

ఎట్టకేలకు. దే. అవ్య. ద్రు. (ఎట్టకున్+ఏలకు.) తుదకు. భార. విరా. ౫, ఆ. ౩౩౬. "క...ఇంటి కెట్టకేలకుఁ జనియెన్." జై. ౪, ఆ. ౭౪.

ఎట్టటు. దే. అవ్య. (ఎట్టు+అటు+అ.) ఎట్లేని. "క. ముద మొదవఁగ సుతుఁ డెట్టట, బ్రదికినఁ జాలు..." పరమ. ౨, ఆ. ౧౯౨.

ఎట్టన = ఎట్టటు. (అవశ్యము.) "క. పెట్టితిరి చిచ్చు గృహమునఁ, బట్టితిరి తదీయభార్యఁ బాడడవు లకుం, గొట్టితిరి వారు మనుపఁగ, నెట్టన భరియిం పవలెనె యీ ప్రాణంబుల్." భాగ. ౧, స్కం. ౩౧౨. (వావిళ్ల ప్రతిపా.)

ఎట్టపోగు. దే. వి. (క. ఎట్టెపోగు.) దండెత్తుటకు వచ్చుసైన్యము. "చ...విరహిప్రకరంబు నొంప దుష్కరగతి నెట్టపోగెనఁగఁ గైకొని వచ్చిన రీతి..." చంద్రా. ౩, ఆ. ౯౦. (శ. ర. పా. 'ఎట్టఁబోగు' ముద్రి.)

ఎట్టయెదురు. దే. వి. ఔ. (ఎదురు+ఎదురు.) మును ముందు. "గీ. ఇంత యొప్పునె యుడులోక మెట్ట యెదుర." కాశీ. ౮, ఆ. ౧౮౬.

ఎట్టా = ఎట్లు. (చూ. ఎట్టెట్టా.)

ఎట్టి. దే. విశే. (ఎట్టు+ఇ.) ఎటువంటి. భార. అది. ౫, ఆ. ౫౪.

ఎట్టిఁడు. దే. విశే. (ఎట్టి+వాఁడు.) ఎటువంటి వాఁడు. "క...విప్ర, ద్రోహంబున నెట్టిఁడైన మహాత్ముఁ బొందునే." మార్క. ౧, ఆ. ౧౧౯.

ఎట్టు = ఎట్లు. (శ. ర.)

ఎట్టువోలె = ఎటువలె. (శ. ర.)

ఎట్టూ. దే. అవ్య. ఏప్రకారము. ఆము. ౬, ఆ. ౫౮. కాశీ. ౭, ఆ. ౧౦౭.

ఎట్టెట్టా = ఎట్టూ. "శా. ఎట్టెట్టా శివుఁగల్చెనంటి ..." కు. సం. ౭, ఆ. ౧౯.

ఎట్టెట్టు = ఎట్లు. (వా.)

ఎట్లా = ఎట్లు. "క...మాబ్రతు, కెట్లా కడవెళ్లు నమ్మ యిట్లా గయినన్." రాధా. ౨, ఆ. ౨౦.

ఎట్లు. దే. అవ్య. 1. ఏరీతి. భార. ఆర. ౨, ఆ. ౨౮౭. 2. ఏవైపు. 3. పొసఁగమిఁ దెలుపును. శివరా. ౩, ఆ. ౭౬.

ఎడ. యు. దే. వి. (క. ఎడ. త. ఇడం.) 1. స్థానము. "ఉ...చూప జెల్లను, దద్దయు భీతి నచ్చటికిఁ దా నెడ గల్గఁగఁ బాఱి రొక్కఁడై." భార. ఆది. ౬, ఆ. ౩౦౦. 2. కాలవిలంబము. "క. ధరణీసురవరులకుఁ గడు, నెరవై నెడ నెఱిఁగి యెడయుఁ జేయుదురె మహా, పురుషులు..." భార. ఆది. ౪, ఆ. ౧౧౯. 3. సమయము. "క..., పోరఁ బరిమార్తుఁ గొంచెపు, వారై యున్నెడన..." భార. ఉద్యో. ౧, ఆ. ౧౮. 4. అనుకూల్యము. "క. రేయును బగలును విదురుఁడు, నీయొద్దనె యునికిఁ జేసి నేరము పలుకన్, మాయిష్టం బెఱిఁగింపఁగ, ధీయుత యెడఁ గంటె మిన్నిదివసంబులకున్." భార. ఆది. ౪, ఆ. ౧౪. 5. సందు. "వ...భవదీయవిభవం బుజ్జ్వలంబై యొరుల కెడ లేక చెల్లుచున్న నెంత యొప్పగునో..." భార. ఉద్యో. ౨, ఆ. ౪౯. 6. మినహాయింపు. (చూ. ఎడపెట్టు.) 7. నెత్తపలకపైఁ గలగడి. "సీ...ఎక్కుడాయంబుల యెడలు గడపి." దశ. ౫, ఆ. ౬౮. 8. ఎడము. "గీ. ప్రేలెఁ డెడ లేనియట్లు గ..." భార. భీష్మ. ౩, ఆ. ౮౧౧. 9. మధ్యము. "క...పార్థుఁడు...విశాలాస్య, ప్రపరము లడరింపఁ గుంభభవుఁ డెడఁ ద్రుంచెన్." భార. ద్రో. ౫, ఆ, ౧౦౬. 10. దూరము. "చ. తడ వగుచెంచె జమ్మికిఁ బ్రదక్షిణవృత్తిగఁ దేరు వోపని, మ్మెడ గలుగంగఁ బోయెఁ బసులు..." భార. విరా. ౫, ఆ. ౧౭౧. 11. విరామము. "క. ఎడ లేక కపురవాసన, లడరెడిబాగాలు..." ఉ. రా. ౮, ఆ. ౧౭౭. 12. తెఱపి. "గీ. మమ్ము నున్నారె యనుమాటమాత్రకైన, నెడ గలదె నీకు..." కళా. ౭, ఆ. ౨౦. 13. గడువు.

"క. ఎడ యిమ్ము నాశ్రోకించుచు..." హరి. ఉ. ౭, ఆ. ౧౧౧. **14.** వియోగము. "సీ. ఈచరాపు తో మన కెడ సేయ నేతెంచినదియొ..." కళా. **3,** ఆ. ౧౭౭. **15.** భేదము. "క. ఎడ యెఱింగియుఁ దమలోపల, నెడ యెఱుఁగక ధర్మపథసమేత స్థితికిన్, నడిమింటివార లై..." రామా. 3, ఆ. ౧౫౫. **16.** రాయబారము. "ద్వి. ఎడ మాట లాడ నాయినవంశుతోడఁ, గడఁకను హనుమంతు గలిగెనే నీకు." రం. రా. కిష్కిం. ౨౧౬, పు. **17.** ధనము. "సీ. తోడ వులు తోడఁ గట్ట నెడ లేక బెదరక యెరువు సొమ్ములు వెట్టి తిరుగువిటులు." మల్హ. ౨, ఆ. ౩౧. **18.** అవమానము. "చ. చిలుకలకొల్కి యెవ్వ రెడ సేసిరి నీకిటు లేల చింతిలన్." పారి. ౧, ఆ. ౧౧౭. **19.** లోకవ్యవహారము. "గీ. అబలఁ గడు నెడ యెఱుఁగని యాఁట దాన." కు. సం. ౫, ఆ. ౬౫. **20.** వై. వి. (సం. హృద్.) హృదయము. "చ. ఎడఁ బొలి పోనికోరికల నేడ్తెఱసొంపున నంతకంత కె, క్కుడగుమదంబు పేర్మి రతికోర్కులు గొమ్మలు పోవ..." నిర్వ. ౮, ఆ. ౭౩. విశే. **1.** దూర మైనది. "క. కడు నెడ గావున నది యిక్కడ వినఁబడదు..." కళా. ౪, ఆ. ౫౩. **2.** అన్యుఁ డు. సాం. ని. మాన. ౧౦. **3.** అధికము. (చూ. ఎడదవ్వు.) **4.** ఎడమ నున్నది. "సీ. పెరిఁగిన వింధ్యాద్రి పెంపెంత కలశజుఁ డెడగాల మె ట్టిన నడఁగె నట్టె." కు. సం. 3, ఆ. ౫. **5.** వ్యర్థము. "గీ...ఎడమాటలకుఁ బ్రొద్దు నిడివి లేదు." పిన. శకుం. 3, ఆ. ౮౩. **6.** అల్పము. "ఆ...విలువ మొదల నగులాభమును నెడ, వ్యయము గలుగుటయు శివప్రదములు." భార. అను. ౫, ఆ. ౭౫.

ఎడఁద. వై. వి. (సం. హృత్. క. ఎదె. త. ఇద యమ్.) **1.** హృదయము. "ఆ. అశ్వమేధము నకు నర్పితం బైనయా, యశ్వరాజు నిట్టు లప హరించి, ముచ్చు గొఱక యీసముద్రదేశం బున, నోట మెడఁద లేక యున్నవాఁడు." భార. అర. 3, ఆ. ౬౩. **2.** గుండె. "క...ఎడఁ ద దడదడ మనఁగా..." ఉ. రా. ౪, ఆ. ౨౦౩. **3.** అొమ్ము. "సీ...వెడఁదవాటంపుఁ జేరెడఁద వాని." చంద్రా. ౧, ఆ. ౮౫.

ఎడఁబడు. ద్వ. అ. క్రి. (ఎడన్+పడు.) విరామ ముండు. "క. ఎడఁబడక యహోరాత్రము, వడిగొని చదివింప నిట్లు వలయును..." భార. అర. 3, ఆ. ౨౩౮.

ఎడఁబాటు. దే. వి. (ఎడఁబాయు. ధా.) వియో గము. "సీ...రఘుస్వామి వెంటనె లక్ష్మణుం డెడఁబాటు లేకుండు..." అధ్యా. బాల. ౧౨, పు.

ఎడఁబాపు. దే. స. క్రి. (ఎడన్+పాపు.) **1.** తొలఁ గించు. "గీ. ఈ నిరోధంబు నెడఁబాపు నీక్షణ మున." ఉ. రా. 3, ఆ. ౮౮. **2.** వేఱుచేయు. (వ్యు.) **3.** తీర్చు. "ఉ...ఎన్నిజన్మమ్ములకైన నీతనిఋణం బెడఁబాపుకొనంగ నేర్తునే." ఉ. రా. ౫, ఆ. ౮౦.

ఎడఁబాయు. దే. అ. క్రి. (ఎడన్+పాయు.) దూర మగు. "ఉ...ఈ, దివ్యసరోజదామకము... దీనిఁ గన్న నెడఁబాయుఁ బ్రదోషములు..." వసు. ౫, ఆ. ౯౮. స. క్రి. వీడు. "క. ఆయమ్మ యాగ్రహం బెడఁ,బాయక..." సా. ౨, ఆ. ౨౭౨.

ఎడకట్టు. దే. అ. క్రి. (ఎడ+కట్టు.) ఆఱినపుండు మరలఁ జీముపట్టు. (శ. ర.; బ్రౌ.) స. క్రి. చేర్చు. "సీ. ఇంద్రనీలములతో నెడకట్టి గ్రుచ్చినరమణీ యతారహారము ధరించి." కాశీ. ౭, ఆ. ౯.

ఎడకత్తియ = ఎడకత్తె. ఆం. భా. ద్వి. ౧౧౦.

ఎడకత్తె. ద్వ. వి. (ఎడ+కత్తె.) దూతిక. "సీ...సృ గాలిక తా నెడకత్తె గాఁగ." దశ. ౬, ఆ. ౧౮౦.

ఎడకాఁడు. దే. వి. (ఎడ+కాఁడు.) తార్పుకాఁడు. వేంక. మాన. ౩౦.

ఎడకారు. ద్వ. వి. (ఎడ+కారు.) మాఘమాసము మొదలు జ్యేష్ఠమాసములోపల పండుపంట. (శ. ర., బ్రౌ.)

ఎడగడ్డ. ద్వ. వి. (ఎడ+గడ్డ.) ఒడ్డు. "సీ. జలరాసు లేమను గలఁగుండుకొని యెడగడ్డలపై దొరగడలు దొడర." హరి. ఉ. ౯, ఆ. ౨౨౦.

ఎడగర. దే. వి. శ్రమము. (చూ. ఎడగరపడు.)

ఎడగరపడు. ద్వ. అ. క్రి. (ఎడగర+పడు.) శ్రమపడు; అలయు. "సీ. . . నీవు డస్సియున్న వాఁడవు నిద్రయును లేక యున్న నీ వెడగరపడియె దీ యడవిలోన." భార. సౌ. ౧, ఆ. ౬౦. (ముద్రి. పా. 'వేగిరపడియెద వేల యింత' శ. ర. పా.)

ఎడగిల్లు. దే. అ. క్రి. వైతొలఁగు, తప్పుకొను. "క. . . ప్రాకృత పురుషుల కెడగిల్లి దూరమునకుం జను చున్." విప్ర. ౨, ఆ. ౩౧.

ఎడగొను. దే. అ. క్రి. (ఎడ+కొను.) సందు చేసికొను. "సీ. కెంగేల నతనికొఁగిలి యొఁగి యెడగొంచుఁ జేలాంచలముఁ బెఱచేతఁ దడవి, తెచ్చి . . ." ప్రభా. ౫, ఆ. ౫౩.

ఎడతాఁకు. దే. అ. క్రి. (ఎడ+తాఁకు.) 1. ప్రతిఘటించు. "సీ. ఒకనరుం డెడతాఁక నోర్చు బీరము లేక గిరిజాధినాథుండు క్రిందుపడియె." కృ. శకుం. ప్రీతి. ౮౩. 2. మిక్కిలిచేరు. "సీ. విడిచియు విడఁజాల కెడతాఁకు సిగ్గు మో మోరసింపుల యింపు దారసింప." అని. ౩, ఆ. ౯౫.

ఎడతీయు. దే. అ. క్రి. (ఎడ+తీయు.) ఎడతెగు. (శ. ర.)

ఎడతెంపి. దే. వి. (ఎడ+తెంపి.) 1. విచ్ఛిత్తి, విడిపోవుట. వ్యవ:—వారిద్దఱకు నెడతెంపు లైనవి. 2. తెఱపి, వ్యవధానము. (చూ. ఎడతెర్పి.)

ఎడతెగు. దే. అ. క్రి. (ఎడ+తెగు.) 1. విడిపోవు. "క. ద్రోణుడు రయమున నేసిన, బాణము లెడతెగక . . ." భార. విరా. ౫, ఆ. ౧౨౯. 2. వేఱగు. "క. . . ఇభయూథములో, నొక్కకరినాథుఁ డెడతెగి, చిక్కి . . ." భాగ. ౮, స్కం. ౩౭. 3. నశించు. "క. ఏడుదినంబులముక్తిం, గూడఁగ నేరీతి వచ్చు గురుసంసార, క్రీడన మేక్రియ నెడతెగు" భాగ. ౧స్కం. ౫౧౩.

ఎడతెఱపి=ఎడతెర్పి. (చూ. ఎడతెర్పి.)

ఎడతెర్పి. దే. వి. (ఎడ+తెర్పి.) వ్యవధానము. "చ. . . ఎడతెర్పిగఁ గొందఱు పాయవాఱఁగన్." భార. విరా. ౫, ఆ. ౬౧. (శ. ర. పా. ఎడతెంపిగ, ముద్రి. ఎడతెంపుగ. పాఠాం.)

ఎడత్రెవ్వు. దే. అ. క్రి. (ఎడ+త్రెవ్వు.) 1. తెగు, విచ్ఛిన్నమగు. "క. పెనఁకువ యెడత్రెవ్వక పదునెనిమిది దివసములు సెల్లె . . ." భార. శల్య. ౧, ఆ. ౩౪౮. 2. ఎడఁబడు; చెడిపోవు. "మ. . . కామినీకామి సం, తతికేలా యెడత్రెవ్వఁ గంతుకల హాస్వాదంబు లాప్రోలునన్." ఆము. ౨, ఆ. ౩౧. (ఎడత్రెచ్చు. ధా. అని. శ. ర. వేదం. పా.) 3. రాకుండు, ఆఁగిపోవు. "క. మడు వింకఁగఁ బాఱెడు నీ, రెడత్రెవ్విన నొండుచోటి కేఁగఁగ రాదే . . ." భార. శాం. ౩, ఆ. ౧౮౬.

ఎడదవ్వు. దే. వి. (ఎడ+దవ్వు.) మిక్కిలి దూరము. "గీ. కాశికాపురి కెడదవ్వు గలుగు నడవి." కాశీ. ౭, ఆ. ౧౯౭.

ఎడదూడ. దే. వి. (ఎడ+దూడ.) తఱపిదూడ, పాలు త్రాగ మానినదూడ. (బ్రౌ.)

ఎడనాడు. దే. స. క్రి. (ఎడన్+ఆడు.) దూఱు, నిందించు. "ఉ. ఆడదు పెక్కుభాష లెడనాడదు వాకిలి వెళ్లి కల్లమా, టాడదు . . ." భాగ. ౬, స్కం. ౨౭.

ఎడనీరు. ద్వ. వి. (ఎడ+నీరు.) 1. లేఁతటెంకాయలోని తియ్యనీరు. "చ. పలుచనియంబళుల్ చెఱకుపా లెడనీళ్లు రసావళుల్ . . ." ఆము. ౧, ఆ. ౭౧; ౬, ఆ. ౧౭. 2. ఎడనీటికాయ. "సీ. ఎడనీ రటంచన నగుఁ దచ్చలాటువు . . ." ఆం. భా. ద్వి. ౭౯. (శ. ర. పా. ఎలనీరు ముద్రి. ఎళనీరు పాఠాం.)

ఎడనెడ. దే. అవ్య. ద్వి. (ఎడన్+ఎడ.) 1. అక్కడక్కడ. "క. ఎడనెడఁ బఱపై యొప్పెడి, యడపులు . . ." భార. భీష్మ. ౧, ఆ. ౩౯. 2. అప్పుడప్పుడు. "సీ. . . ఎడనెడ నవ్వుచు నేడ్చుచుండు." జై. ౮, ఆ. ౧౪౩. మధ్యమధ్యమున. "సీ. ఇరుప్రొద్దు గుడుచుచు నెడనెడఁ గుడువక యుండునాతండు సదోపవాసి." భార. శాం. ౪, ఆ. ౩౬౮.

ఎడపఁదడప. దే. అవ్య. ద్రు. ('అడపాతడపా' అని వాడుక 'ఎడపదడప' అని శ. ర.) అప్పుడప్పుడు. "గీ. ఎడపఁదడపఁ దనూభవుం డెచట నుండుఁ, గానరాఁ డని గృహభర్త కాంత నడుగ." కాశీ, ౪, ఆ. ౧౯. వేం. పంచ. ౧, ఆ. ౪౩౪.

ఎడపక. దే. అవ్య. (ఎడపుధాతువుయొక్క వ్యతిరేకక్త్వార్థకరూపము.) **1.** ఎడతెగక, ఎప్పుడును. "చ. ఎడపక రేయును బగలు నెమ్మెల నమ్మలతాల్పుఁగూడి..." నీలా. ౧, ఆ. ౧౦౮. **2.** తప్పక. "క... ఈఱే, డుడుగుము వచ్చెదుపండువ, కెడపక యట కేఁగుదెంతు మిందఱ మనినన్." చెన్న. 3, ఆ. ౧౬౪. **3.** ఆలసింపక. "క. కడుఁ బెల్లగు నాఁకలి నా, యొడ లెరియింపంగఁ దొడఁగె నొక్కట జగముల్, పొడపొడిగా దరికొనియెడ, నెడపక యించుకయనుజ్ఞ యిమ్ము మహాత్మా." హరి. పూ. ౪, ఆ. ౧౧౯. **4.** హెచ్చుతగ్గులులేక. "క...పుణ్యభాగీరథి యిప్పుడమిఁ గలజనుల కెల్లను, నెడపక సేవ్యంబ కాక యిది నీయదియే." భారత. ఆది. ౭, ఆ. ౪౦.

ఎడపడు. ద్వి. అ. క్రి. (ఎడ+పడు.) **1.** విరామము కలుగు. "క...ఎడపడకయ, కురిసె మహావృష్టి..." కు. సం. ౬, ఆ. ౧౦౯. **2.** లోపము వచ్చు. "ద్వి. ఏ క్రియలందును నెడపడకుండ." రం. రా. బాల. ౧౬, పు. **3.** ఒకదాని తరువాత నొకటియగు. "ఆ...సౌఖ్యదుఃఖములు వచ్చు నెడపడి..." భారత. ఉద్యో. ౨, ఆ. ౭౯. **4.** దవ్వగు. "సీ...పరంబున కెడపడకుండుదు..." భారత. శాం. ౬, ఆ. ౧౭౪. **5.** జామీను దారుఁ డగు. "క. కుడిచినతఁ డరువకుండిన, నెడపడినయతండ యచ్చు టెఱిఁగి నృపతి యా, కుడిచినతనిఁ గనునప్పుడ, యెడపడినాతనికి రెట్టి యిప్పింపఁదగున్." విజ్ఞా. వ్యవ. ౮౮.

ఎడపరి. దే. విశే. (ఎడపు+అరి.) ఎడఁబాపునది. "ద్వి...అంగనలు..., ఎడపరుల్ మదవతులేవంపుఁబుట్టులు..." పండితా. పురా. ౧౧౬, పు.

ఎడపిల్ల. దే. వి. (ఎడ+పిల్ల.) పాలు విడిచినపిల్ల, తఱపిబిడ్డ. (వా.)

ఎడపు. దే. స. క్రి. **1.** (గడియ మొ.) తీయు, తొలఁగించు. "గీ...కవాటము గడె, యెడపి నంతనె..." హంస. ౯, ఆ. ౨౪౨. **2.** అంతరాయ మొదించు. "క. క్రతువంతరాయ మైనను, గ్రతుకర్త వినాశ మొందు ఘనపాపము చేఁ, గ్రతు వెడపకుండఁ జయ్యనఁ, గ్రతుపశువుం దెరవలయు..." భా. రా. బాల. ౬౨౧. **3.** వీడు. "సీ. తొడఁగినపని చలం బెడపక యతి దుష్కరం బైనఁ గడతేర్చు ప్రభువులార." భారత. విరా. 3, ఆ. ౨౧. **4.** నశింపఁజేయు. (చూ. ఎడయు.) వి. **1.** ఎడఁబాపుట. (చూ. ఎడపరి.) **2.** లేమి. "క. ఇమ్మెడపున నిజసర్వస్వమ్ముఁ గళత్రంబునైనఁ జను నీఁగ..." కు. సం. ౧౦, ఆ. ౧౯౨.

ఎడపెట్టు. దే. స. క్రి. **1.** విడిచిపెట్టు. "గీ...రెండును మూఁడు నాల్గు, నీక్రమంబున నోపిన క్లాక్కనట్టి, దినము లెడపెట్టి కుడుచుచు..." భారత. అను. ౪, ఆ. ౧౪౮. **2.** మినహాయించు, అడ్డుగా పెట్టు. (చూ. ఎడవెట్టు.)

ఎడప్రొద్దు. ద్వి. వి. (ఎడ+ప్రొద్దు.) సంజపొద్దు. "ద్వి. ఈ మునిపుత్త్రున కీవిధి మూఁడె, నీమహాటవిలోన నీయెడప్రొద్దు." ద్వి. హరిశ్చ. పూ. ౧౫౨౯.

ఎడబిడ్డ = ఎడపిల్ల. (వా.)

ఎడబెట్టు. దే. వి. దీనారభేదము, ఒకానొకనాణెము. ఆం. భా. ద్వి. ౨౭౪.

ఎడమ. దే. వి. (త. ఇడమ్.) వామభాగము. "గీ... కుడియెడమల, నడరి..." నీలా. 3, ఆ. ౧౯. విశే. డాపలిది. (దీనికి వృత్తియందు వికల్పముగా నంత్యవర్ణలోపము. ఉదా:—ఎడమకాలు, ఎడకాలు.)

ఎడమడుగు. దే. వి. (ఎడమ+అడుగు. త. ఇడైమడిక్కై.) **1.** భేదము. "క...ఏ, యెడమడుగు లేనినెచ్చెలిఁ, బొడగాంచుట చచ్చి మరలఁ బుట్టుట గాదే." భాగ. ౧౦, స్కం. పూ. ౨౦౨. **2.** విళంబము. "చ...తోడితెం, డెడమడు వేల యింక..." హరి. పూ. ౯, ఆ. ౮౭.

విణ. **1.** విరుద్ధము. "క...నీ, కొడుకు కని యా తని నెంతయు, నెడమడుగుగఁ జూపఁదె త్తె యిబదటు నగఁగాక్." భార. ఆది. ౪,ఆ.౧౦౦. **2.** కుటిలము. "క...తత్సేవనతాత్పర్యంబు తగ నెవంబిడి యే బ్రాహ్మ్యద్ధును నెడమడు గగుమదితో, ననువర్తింపంగ..." హరి. పూ. ౧, ఆ. ౮౩.

ఎడమడుగుపరువడి. దే. వి. (ఎడమడుగు+పరువడి.) ఒకానొక మల్లబంధము. హంస. ౧, ఆ. ౨౦౬.

ఎడమడుపు = ఎడమడుగు. దే. వి. **1.** భేదము. "క. ఎడమడు వొక్కింత లేక యిట్లను సతి తోన్." నిర్వ. ౮, ఆ. ౧౩౧. **2.** విలంబము. (చూ. ఎడమడుగు.) విణ. **1.** వ్యత్యస్తము. "క. నడిపింపఁగఁ బొడిపింపఁగ, నెడమడుపై కలఁగినప్పు డేర్పఱుపఁగ నేఁ, గడు నేర్తు..." భార. ఉద్యో. ౪, ఆ. ౨౧౪. **2.** విపరీతము. "క. నడుమ నొకబోయపల్లెం, గడువేడుకఁ గోడి పోరు గనుఁగొనియెడునం, దడిఁ దరియఁజొచ్చి కోళుల, నెడమడుపుగ విడుచుచున్నయెడ నిట్లం టిక్." దశ. ౯, ఆ. ౨౯.

ఎడము. దే. వి. **1.** నడిమిభాగము. "క...రెండు వీళ్లయెడమున విడిసెన్." హర. ౬, ఆ. ౧౦౧. **2.** సందు. "గీ...కా లూఁద నైనఁ గలదె, యెడము..." ప్రబోధ. ౨, ఆ. ౬౪. **3.** గడువు. "చ...ఇందు కాఱునెల లి మ్మెడము..." వెం. పంచ. ౧, ఆ. ౮౪. **4.** దూరము. "సీ...సిరి నెడఁబాసి...ఉంటి నింక యెడంబునం దుంచి యుండుట పాడి గాదు..." వెం. మా. ౬, ఆ. ౧౨. **5.** వ్యవధి. "క. విపరింప నెడము లేదిక ..." య. ౪, ఆ. ౮౬.

ఎడముకొను. దే. స. క్రి. (ఎడము+కొను,) ఆక్రమించు. "గీ...ఎడముకొనఁగ, బరఁగి నడతెంచెం బౌండ్రభూపాలుసేన." ఉ. హరి. ౩, ఆ. ౨౪. స. క్రి. అవకాశము చేసికొను. "వ...ముడించి యెడముకొని బడిబడిం బొడుచుచు..." కళా. ౩, ఆ. ౨౬౬.

ఎడయాడు. దే. అ. క్రి. (ఎడ+ఆడు.) **1.** తెరు గాడు, పరిభ్రమించు. "ఉ...వేడ్కతో నిషధ భూపతికై యెడయాడుదృష్టి..." నైష. ౯, ఆ. ౧౮౪. **2.** నడచుకొను. "చ...చానికే, ననుగుణమైనభంగి నెడయాడఁగఁ జొచ్చెద..." పశ. ౭, ఆ. ౯౨.

ఎడయించు. దే. స. క్రి. (ఎడయు. ధా. ప్రే.) ఖండించు, నఱకు. "వ...మెడ లెడయించియు మొకళ్లు గెడయించియు..." భాగ. ౬, స్కం. ౩౭౦.

ఎడయిక. దే. వి. (ఎడయు ధా.) వియోగము, ఎడఁ బాటు. (శ. ర.)

ఎడయు. దే. అ. క్రి. **1.** తొలఁగు. "సీ. ఎడసిన జిలుఁగుఁబయ్యెదతోడ..." అచ్చ. సుం. ౧౬. **2.** విముఖమగు. "క...నాపై స్వామిమతి యెడసి యున్నదొ..." ఉ. రా. ౬, ఆ. ౨౬౨. **3.** చెడిపోవు. "గీ. పీటమీఁదటి పెండ్లిండ్లు పెక్కు లెడసె." శుక. ౨, ఆ. ౧౯౩. స. క్రి. విడుచు. "క...ప్రియబాంధవ మిత్త్రామాత్యులు లేరే వా,రేమి కొఱత చేసి రెడసి యేగితి విభు కిక్." హరి. పూ. ౯, ఆ. ౧౪౭.

ఎడరు. దే. వి. (క. ఎడరు. త. ఇడరు.) **1.** యుక్త సమయము. "ఆ. ఎడరు వేచి..." భాగ. ౮, స్కం. ౭౨. **2.** కీడు. "ఆ. ఎడరుచోట నృపతి కీనాల్గువృత్తులుఁ, దగు..." భాగ. ౭, స్కం. ౪౧౦. **3.** అపమానము. "చ...ఇయ్యెడరు రాచకొమారుల కోర్చునట్టిదే." భార. ఉద్యో. ౧, ఆ. ౩౪౮.

ఎడల. దే. అవ్య. ద్రు. **1.** ఎడ, విషయమున. "వ. పద్మాసనునిశిల్పప్రయాసంబు లక్ష్మీనారాయ ణులయెడలను..." నైష. ౨, ఆ. ౯౭. **2.** పక్షము, స్థితిలో. "క. చెలియాకాంంతా మోదము, కలుగనియెడలన్ మహాళి కడిదియగు..." దశా. ౩, ఆ. ౧౩.

ఎడలించు. దే. స. క్రి. (ఎడలు ధా. ప్రే.) **1.** అప సరిల్లఁజేయు. "వ...ముసుంగు లెడలింప..." స్వా. ౩, ఆ. ౨౮. **2.** విసర్జించు; విసర్జింపఁ జేయు. "ఉ. సైనికు లెల్ల నంత రణసన్నహనం బెడలించి పాటిరన్." పారి. ౯, ఆ. ౧౮.

"శా...సైనికప్రోత్సాహం బెడలించి..." జై. ౧, ఆ. ౯౫. **3.** తీయు; (చిక్కు మొ.) వదలుచు. "గీ. నిర్గమద్వార మెడలించి..." శుక. ౩,ఆ.౩౩౩. "ఉ. చేవడి పీసౌమీటుటలుఁ జిక్కుడలించుటలున్ సరింబడన్." ఆము. ౧,ఆ.౬౨. **4.** నశింపఁజేయు. "క. హితలీల భవప్రయాస మెడలింపఁగదే." కాశీ. ౩, ఆ. ౧౨౮. **5.** బయలుచేయు. "సీ. వదినెఖఅందలివావులు కల్పించి పర్మంబు లెడలించి మఱుఁగుసేసి." భాగ. ౫, స్కం. ౩౧౫. **6.** నఱకు. "క...పులులన్, మెడ లెడలించెను బెడిదపుటడిదంబున..." య. ౨, ఆ. ౨౯. **7.** సడలించు, విడిపోఁజేయు. "సీ. కీలుకాఁడెడలింపఁ గెడపినబొమ్మలకైవడిఁ బటుతురంగ వ్రజంబు." భార. ద్రో. ౩, ఆ. ౬౨.

ఎడలు. దే. అ. క్రి. **1.** అపసరిల్లు, "మ. జిలుగుంబయ్యెద జీరువాఱె యెడలన్..." నైష. ౬, ఆ. ౬౭. **2.** సడలు. "ఉ...కీ లెడలుబొమ్మవిధంబున..." సా. ౩, ఆ. ౧౧౮. **3.** రాలు. "సీ... పల్లాకు లెడలెఁ దరుల." కు. సం. ౪, ఆ. ౫౯. **4.** చెడు, నశించు. "క. పడఁతికిఁ గన్యాధర్మం, బెడలిన..." భో. ౪, ఆ. ౨౨౪. "క. గురునలుక నాకు నస్త్రస్ఫురణ మెడలె నండ్రు..." భార. ఉద్యో. ౨, ఆ. ౨౬౬. **5.** చనిపోవు. "క... ఎ, క్కడిబ్రతుకు నాకు నాథం, డెడలిన..." భార. ద్రో. ౨, ఆ. ౩౪౯. **6.** భగ్నమగు. "క. కర్ణధారవి, హీనం బగుకలము జలధి నెడలిన భంగిన్." భార. ద్రో. ౧. ఆ. ౬౦. **7.** దూరమగు. "క. నీ రథమునకుం బౌరము, నోర్ఘమునకున్ భవత్తనుజు లెడలిరి..." చం. రా. ౪, ఆ. ౭౪. **8.** బయలగు. (చూ. ఎడలించు.) స. క్రి. విడుచు, త్యజించు. "ఉ...ఇ, ట్లుద్యోగం బెడలంగ నేమిటికి నీ కుర్వీశ...భార. భీష్మ. ౨, ఆ. ౧౩.

ఎడలుచు. దే. స. క్రి. (ఎడలు ధా. ప్రే.) ఊడఁదీయు. "క. ఒడలఁ గల తొడవు లన్నియు, నెడలిచి..." చిత్ర భా. ౪, ఆ. ౩.

ఎడల్చు. దే. స. క్రి. **1.** అపసరిల్లఁజేయు. "చ... పయ్యెదకొంగు లెడల్చి..." కువల. ౧, ఆ. ౫౫. **2.** ఊడఁదీయు. "గీ...గప్పసెన యెడల్చి..." చిత్రభా. ౩, ఆ. ౩౩. **3.** వెలికిఁ దీయు. "చ. దొనపయిఁ బాయ కెప్పుడును దూపు లెడల్చుచునున్నరీతి..." కళా. ౫, ఆ. ౧౨౨. **4.** (చిక్కు మొ.) తీయు. "గీ. తళుకుఁగొనగోర మీసల నులి యెడల్చు." కళా. ౮, ఆ. ౧౧౩.

ఎడలువాపు. దే. స. క్రి. (ఎడలు+పాపు.) ఎడఁబాపు. "ఆ. ఎంతపాపకర్మ మేఁ జేసియుంటినో, యెడలువాపె మనల నీశ్వరుండు." బ్రహ్మో. ౩, ఆ. ౮౧.

ఎడలుసేయు. దే. స. క్రి. (ఎడలు+చేయు) ఎడఁబాపు. "ఆ...ఉర్వశియు నృపాలుఁ డున్నయట్టి, చెలిమి గాంచి యెడలుసేయుటకై వేళ, గాచియుండి రప్రకాశవృత్తి." కవిరా. ౮,ఆ. ౨౪౧.

ఎడవడు. ద్వి. అ. క్రి. (ఎడ+పడు.) విరామము కలుగు. "వ...ఎడవడక పొగడు పొగడికల కలకలమ్ములును...స్వా. ౮, ఆ. ౭౧.

ఎడవల. దే. వి. (ఎడ+వల.) ఒకరకపు వల. "క. ఎడ వల కుంచెవల..." హంస. ౪, ఆ. ౧౫౮.

ఎడవాఁడు. దే. స. (ఎడ+వాఁడు.) అన్యుఁడు. పెంక. మాన. ౩౧.

ఎడవు. దే. వి. ఎడారి. "వ...ఎడవునఁ జలిపందిరిడిమొద మనియు..." ఆము. ౪, ఆ. ౮౩. (ముద్రి. 'ఎడ' శ. ర. పా.) విణ. దవ్వైనది. "గీ...తెరవు, లెడ వనుచు జాలిగొని సంశయించువేళ." ఆము. ౬, ఆ. ౧౫. (శ.ర.పా.)

ఎడవెట్టు. దే. స. క్రి. (ఎడ+పెట్టు.) **1.** మినహాయించు; మితివెట్టు. "ఆ. గురుని ప్రతిన వింటె 'వెరవునఁ బాపునఁ' జేసి దీని బొంకు సేయ వలయు, నెఱుఁగు మతఁడు నిన్ను నెడవెట్టి పలికిన వాఁడు గానఁ జెప్పవలసె నీకు." భార. ద్రో. ౧, ఆ. ౧౧౬; ౧, ఆ. ౧౧౨. **2.** త్యజించు విడుచు. (చూ. ఎడపెట్టు.)

ఎడవోవు. దే. అ. క్రి. (ఎడ+పోవు.) రాయబార మేఁగు. "క. కడు మెచ్చి యొడయనంబికి, నెడ వోయితిగాదె లంజెయింటికి రుద్రా." శివ. సా. ౪౦౭.

ఎడసంది. దే. వి. (ఎడ+సంది.) మధ్యము. "క... ఎడసందిని, బయ్యెదకొంగ డ్డమైనఁ బ్రాణము వెడలున్." భాగ. ౯. స్కం. ౪౦౧.

ఎడసను. దే. అ. క్రి. (ఎడ+చను.) వైతొలఁగు. "క... పతివ్రతారత్నము న, న్నెప్పు డెడస నక కంటికి, ఱెప్పవలెం గాచి తిరుగు రేయిం బవ లున్." శుక. ౧, ఆ. ౩౮౯.

ఎడసాల. ద్వ. వి. (ఎడ+సాల.) 1. ప్రత్యేకమైన గది. (శ. ర.) 2. ప్రత్యేకమైన యిల్లు. (బ్రౌ.)

ఎడసేయు. దే. స. క్రి. (ఎడ+చేయు.) 1. తిరస్కరించు. "చ. మునుకొని తండ్రియాజ్ఞఁ దలమోచి నిజోచితకృత్య మేమి వం, చినఁ దనశక్తియుక్తి నెడసేయక చేయుట..." భాగ. ౩. స్కం. ౩౬౮. 2. దూరము చేయు. "ఆ. ఏల వృద్ధ రాజు నెడసేసిరో పార్థ." భార. ఆది ౬, ఆ. ౧౪౨.

ఎడసొచ్చు. దే. అ. క్రి. (ఎడ+చొచ్చు.) పైఁబడు; ప్రవేశించు. "క. సతతాచార సమంచిత, మతియై సుజ్ఞానమునకు మరగెడు తఱి నా, యతగతి నాతని కంగజ, మతమై నవయౌవనాగమం బెడసొచ్చెన్." భాగ. ౬. స్కం. ౯౦.

ఎడాటము. దే. వి. (ఎడ+ఆట+ము.) 1. విషయము. "ఉ. అన్నలపట్లఁ దమ్ముల యెడాటమునన్ సముఁడు..." విజ. ౧, ఆ. ౨౭. వరాహ. ౨, ఆ. ౧౨౯. 2. ప్రణయకోపము. "ఉ...మాటల బోటికి నవ్విరించికిన్, బొందికలం దెడాటములు పుట్టిన మాన్తును వారు మెచ్చఁగన్." అహ. ౩, ఆ. ౭.

ఎడారి. దే. వి. చెట్లు చేమలు లేని విశాలపు నిర్జల భూమి. (శ. ర. వా.)

ఎడారె. ద్వ వి. (ఎడ+ఆరె.) చెప్పులు కుట్టెడుచిన్న సూది. (శ. ర.)

ఎడి=ఎడు. (భవిష్యత్తునకు) "క. పలికెడిది భాగవత మఁట..." భాగ. ౧, స్కం. ౧౮.

ఎడు. దే. అప. 1. తద్ధర్మాద్యర్థములందు, ప్రథమ పురుషైక వచన'ను' వర్ణకము పరమగునపుడు ఆగమముగను, తృవర్ణకార్థమునఁ బ్రత్యయముగను వచ్చును. ఉదా:—(వర్తమానకాలమునకు) "క. తగ్గెడుఁ గారణము లేక తడఁబడి పడగల్." భార. విరా. ౪, ఆ. ౮౭. (భవిష్యత్కాలమునకు.) "వ...జరత్కారువునకు జరత్కారుం డను మహామునికిం బుట్టెడువాఁ డధిక తేజస్వి..." భార. ఆది. ౨, ఆ. ౧౩౭. (భూతకాలమునకు.) "క. తడఁబడఁబడియెడు రవమును, బడి కాలెడురవము..." భార. ఆది. ౨, ఆ. ౨౧౫. (తాచ్ఛీల్యమునకు.) "క...ఎగ్గుల్, నొడివెడు వికత్థనుల్యుల, కడ నుండెడు సంతసంబెఁ గష్టము కలదే." భార. ఆది. ౩, ఆ. ౧౪౯. 2. ద్రు. ఆశీశ్శాప సంప్రార్థనములందు క్రియాప్రత్యయములకు వచ్చు ఆదేశము. (దీనికి అచ్చుపర మగునపుడు 'మ' వచ్చును.) 1. (ఆశీస్సునకు.) "వ...అం దపక్రమదోషంబు లేకుండెడు మని వరం బిచ్చి..." భార. ఆది. ౩, ఆ. ౧౬౯. 2. (శాపమునకు.) "క. పతిహీన లైనభామినులు ...మాంగల్య ర, హిత లయ్యెడు..." భార. ఆది. ౪, ఆ. ౨౨౯. 3. (ప్రార్థనమునకు.) ఉదా:—దేవా! నాకోరిక తీరెడు వర మిమ్ము.

ఎడ్డ=ఎడ్డ. వై. వి. హృదయము. "ఆ. పీనిపలనఁ గులము వెలుఁగు నంచును నెడ్డ, జాహ్నవీసుతుండు సంతసిల్లె." భార. ఆది. ౫, ఆ. ౧౫.

ఎడ్డమి. దే. వి. ఆపద. "ఉ. యెడ్డమి యైనయప్పటికి నెవ్వరుఁ జేరరు..." వి. పు. ౫, ఆ. ౧౦౨.

ఎడ్డము. దే. వి. (క. ఎడ్డ.) 1. అసౌఖ్యము, కష్టపాటు. "క. ఎడ్డము గాకున్నదే మృగేక్షణ యిం టన్." భాగ. ౮, స్కం. ౪౬౭. 2. అలభ్యత, దొరకమి. "ఉ. ఏడుదినంబు లన్నమున కెడ్డము పుట్టిన యంతమాత్రలో, నేడుచుచున్నవాఁడవు మునీశ్వర..." భీమ. ౨, ఆ. ౧౧౬.

ఎడ్డి. దే. విణ. అప్రస్తుతము, సందర్భములేనిది. (చూ. ఎడ్డిమాట.)

ఎడ్డిమాట. దే. వి. (ఎడ్డి+మాట.) అసందర్భ ప్రసంగము. "వ. అని యర్జునుఁడు పల్కిన నాగజ్జులాఁడు మోఱకంబున మొగ మడ్డంబు గదల్చి యీ యెడ్డిమాటలఁ బని లేదు..." హర. ౭, ఆ. ౬౧.

ఎడ్డియ = ఎడ్డె. (శ. ర.)

ఎడ్డె. వై. విణ. (సం. హేడకః.) 1. మూర్ఖుఁడు. "మ...అ, త్యనభిజ్ఞుం డగు నెడ్డెపజ్ఞ మదన తంత్రప్రౌఢ యౌదాని భా, ర్యనుగాఁ జేయు ..." అహ. 3,ఆ. ౧౪. 2. ముదక యైనది. "ఉ. మాసిన యెడ్డెదుప్పటియు..." శుక.౨,ఆ. 3౬౨. 3. వికార్యము. ఉదా:—ఎడ్డెపని.

ఎడ్డెఁడు. వై. విణ. మూర్ఖుఁడు. "ఉ...తా, సద్దయొనర్ప కవ్వలఁ బిశాచమువంటి గరాసుఁ గూడె నీ, యెడ్డెఁడు..." శుక. ౧, ఆ. ౫౨౭.

ఎడ్డెన. దే. వి. భోజనపాత్రము లుంచుకొనెడియెత్తుపీఁట. "గీ. పసిఁడి యెడ్డెనలను మించు పద్మరాగ, భాజనంబుల వడ్డించు బహుపదార్థ, వితతులు.." జై. ౪, ఆ. ౨౦౨.

ఎడ్డ. వై. వి. ఎడఁద. "ఉ. వి నొకపాపభావమును నెడ్డఁ దలంపక..." భార. ఆర. ౨,ఆ. ౨౧౪.

ఎడ్మ = ఎడమ. దే. విణ. డాపలిది. "మ...మురారి యెడ్మబరి ప్రేయన్..." పాండు. ౨,ఆ. ౧౦3.

ఎతఁడు. దే. స. వి. 1. వీపూజ్యుఁడు. 2. వీపురుషుఁడు.

ఎతుబరికాఁడు. దే. వి. ఎత్తుబరికాఁడు. (శ. ర.)

ఎత్తఁగొట్టు. దే. స. క్రి. (ఎత్తన్+కొట్టు.) పాఱఁద్రోలు. "సీ. సీమమట్టు ఫిరాదుచేసి దస్త్రాల్ వ్రాసి యేతంత్ర కపితాను నెత్తఁగొట్టె. ఆనంద. పీఠి. ౫౯.

ఎత్తనగోల. దే. వి. 1. బట్టినగోల, గోణ్యుద్ధారి దండము. ఆం. భా. ద్వి. ౨౬౭. 2. ఊఁతగా ఆనించినకోల. (శ. ర.)

ఎత్తనగోలు. దే. వి. 1. మొదలు. (శ. ర.) 2. ప్రారంభము. (శ. ర.)

ఎత్తరము. దే. విణ. (క. ఎత్తర.) ఎత్తైనది. "సీ. ఇలఁ జుట్టువడుతొండముల మించుపూర్వాంగ మెత్తరంబై పిఱుం దత్తమిల్ల." స్వా. ౫, ఆ. ౯౪. వి. ఎత్తు. "సీ. ఒక్కింతబటు వైనయుదుటు దెల్పెడిశ్రోణితటి పటంబునకు నెత్తరము సెఱప." దశా. ౪, అ. ౨౧౦.

ఎత్తరవు = ఎత్తరము. (శ.ర.)

ఎత్తళి. దే. వి. కొఱముట్టు, సాఘనము. (శ.ర.)

ఎత్తికొను. దే. అ. క్రి. (ఎత్తు+కొను.) 1. సిద్ధమగు. "గీ. ఒకనికై యిట్లు కుల మెల్ల నుక్కడంప, నెత్తికొనఁ జూచెదు..." భాగ. 3, స్కం.33. 2. యత్నించు. (శ. ర.) 3. కలుగు. వా:—వానికైశ్వర్య మెత్తికొన్నది. స. క్రి. 1. గ్రహించు; పుడిసిలితో గ్రహించు. "ఆ. ఆసుశర్మ...గదా, దండ మెత్తికొని..." భార. విరా. 3,ఆ. ౨౧౭. "వ. శాపజలంబు లెత్తికొని..." భార. ఆది. ౨, ఆ. ౧౭౧. 2. మోయు. "గీ..,తద్వాహనములు, భీష్మతే రెత్తికొని పాఱె..." భార. భీష్మ. ౨, ఆ. ౪౨. 3. దొంగిలించు. "క. ఆ యసుర నన్ను సూకరమై యప్పుడ యెత్తికొని రయంబునఁ జనుచోన్." భార. ఆది. ౧, ఆ. ౧33. 4. ఆరంభించు. "గీ. అభవుదేహార్థ మురవడి నాక్రమించి, కొనఁగఁ జువ్వె యాతపమెత్తికొనియె నగజ." కు. సం. ౭, ఆ. ౫౧. 5. చంకఁబెట్టుకొను. వా:—పిల్లవాని నెత్తికొనుము. 6. యాచించు. ఉదా:—బిచ్చ మెత్తికొను.

ఎత్తికోలు. దే. వి. (ఎత్తికొను ధా.) 1. కోరిక. "గీ. ధాత యెత్తికోల్ తుదిదాఁక కున్నె." నైష. ౧, ఆ. ౪౦. 2. యత్నము. "వ...పితామహు నెత్తికోలునకుఁ జిత్తంబు వికసిల్ల..." భార. భీష్మ. ౧, ఆ. ౧౦3. 3. సంకల్పము. "ఉ... నా, దయ్యము నెత్తికోలు దుదిదాఁకుట గాదె భుజంగనందనా." భార. ఉద్యో. 3, ఆ. ౬౭.

ఎత్తిపొడుచు. దే. అ. క్రి. (ఎత్తి+పొడుచు.) తప్పులు వెల్లడించి మనసు నొవ్వనాడు. "సీ. తలిదండ్రు లెఱిఁగినఁ దల లెత్త కుండును శేరా లెఱింగిన నెత్తిపొడుచు." భాగ. ౧౦, స్కం. పూ. ౯౭౮.

ఎత్తిపోవు. దే. అ. క్రి. (ఎత్తి+పోవు) 1. చెడిపోవు. "సీ...ఇల్లాండ్రయాలువు లెత్తిపోయె." వరాహ. ౭, ఆ. ౩౧. 2. పూర్తిగాఁ బోవు. వా:—వానిబాకీ యెత్తిపోయినది.

ఎత్తిలి. దే. అవ్య. 1. బిగ్గరగా. "ఉ. ఎత్తిలి కావు కావు రని యేడ్చి..." హరి. పూ. ౫, ఆ. ౧౫౦. 2. హాయిగా. "గీ. పాడి రెత్తిలి పిక కుహూపంచమమున." శివరా. ౨, ఆ. ౫౪.

ఎత్తివేయు. దే. స. క్రి. (ఎత్తి+వేయు.) 1. ఎత్తి క్రిందఁ బడవేయు. (వా.) 2. తేలికపఱచు. (శ. ర.) 3. తీసివేయు. వ్యవ:—మూలధనము లేక పాఠశాల యెత్తివేసిరి.

ఎత్తు. దే. అ. క్రి. (క. ఎత్తు.) 1. అతిశయించు. "ఉ. ఎత్తినవేడ్కఁ గంధరము లెత్తి..." భార. ఉద్యో. ౨,ఆ.౧౮౯. 2. కలుగు. "ఆ...వేఁదు లెత్తినట్టు, లుబ్బురేఁగి యున్న యుష్ట్రములును..." భా. రా. యు. ౫౮౯. 3. పూను. "క...ఎత్తు మాహవమునకుఁ." భార, ఉద్యో. ౪, ఆ. ౧౧౨. 4. దండెత్తు. "గీ...ఎవ్వరిఁ గొని యతండు, కౌరవులమీఁద నెత్తి రాఁగలుగువాఁడు." భార. ఉద్యో. ౨, ఆ. ౧౯౯. స. క్రి. 1. పైకి లేవఁదీయు. "ఉ. ఎత్తినవేడ్కఁ గంధరము లెత్తి..." భార. ఉద్యో. ౨, ఆ. ౧౮౯. 2. అర్పించు. "ఉ. ఆరతు లెత్తువేళ..." ఉ. రా. ౮, ఆ. ౩౮౯. 3. గ్రహించు; పుడిసిలితో గ్రహించు. "గీ. అతివ యతఁ డొండుకోదండమందిరొన్న, నఱకె వేఱె విల్లెత్తిన విఱుగ నేసె." ఉ. హరి. ౧, ఆ. ౧౬౫. "గీ. అర్ఘ్య మెత్తిన యాసమయంబునందు." కాశీ. ౩, ఆ. ౧౭౯. 4. నిలుపు. "సీ...తమ్మిరేకులబోరుతలుపు లెత్తి." భీమ. ౫, ఆ. ౧౦౦. 5. బ్రదికించు. "క...విగతాసులఁ దన, మృదువచనప్రశ్న మనునమృతమున నెత్తెఁ." భార. ఆది. ౬, ఆ. ౨౬౨. "చ...అంపఱుం దెగినఁ గ్రమ్మఱఁ బ్రాణము లెత్తు నంజనా, తనయుఁడు..." భా. రా. యు. ౧౮౯౦. (ప్రాణములెత్తు = బ్రదికించు.) 6. వెల్లగించు. "సీ...మూలంబు లెత్తు...వరాహమూర్తి." వసు. ౧, ఆ. ౬౮. 7. తోఁడు; పెట్టు. "క...పెఱమడి కెత్తినసీరును..." ఆము. ౪, ఆ. ౨౮౨. 8. చంక నిడుకొను. "సీ. ఏరాలిపట్టి బిట్టెత్తి చెక్కిలి నొవ్వఁ గఱచి..." పాండు. ౩, ఆ. ౬౨. 9. వహించు; ధరించు. "క. నామీఁదం గోప మెత్తినాఁడు..." భా. రా. కిష్కిం. ౪౫౨. "క...శివభక్తి తనువు లెత్తినపగిదిఁ." కాశీ. ౪, ఆ. ౮. 10. స్మరించు. "క. ఓసామి యింక నెత్తకుఁ, డీసుద్దులు..." పార్వ. ౫, ఆ. ౯౭. 11. వెల్లడిచేయు. "చ...మర్మము లెత్తుచు నత్త దిట్ట..." వరాహ. ౮, ఆ. ౧౩౬. 12. కడయు. "గీ... ఆసుశీల..., ఎత్తె మున్నున్న గుట్టల నెంద జేని." పాండు. ౪, ఆ. ౨౬౭. 13. చొంగిలించు. "మ. తనతోయం బినరశ్ము లెత్త..." ఆము. ౫, ఆ. ౮౩. 14. హెచ్చించు. "క. అక్షతిని నీతనయుం డెలుఁగెత్తి..." భార. భీష్మ. ౨, ఆ. ౩౭౨. 15. ప్రసరింపఁజేయు. "సీ... దిక్చక్రవాళ మెత్తిరి..." శివరా. ౧, ఆ. ౭౫. వి. 1. తూనిక. "క...ఎత్తు పటిగి వస్త్రయొక్క నెంతయు నెమ్మేను..." ప్రభా. ౪, ఆ. ౭౮. 2. మఱుంగులో నాలవభాగము. (వా.) 3. (కాగితము మొ. వానిపై నుంచు) బరువు. వా:...ఆ కాగితములపై ఎత్తు పెట్టుము. 4. ఎత్తుగా నుండుటకై పెట్టుబరువు. వా:—బల్లక్రింద ఎత్తు పెట్టుము. 5. పన్నుగడ. వ్యవ:—వానియెత్తులు నాదగ్గఱ సాఁగలేదు. 6. ఉద్ది. "గీ. ఎసఁగి వేవురుదైత్యులయెత్తు సెనయ, వచ్చె..." హరి. ఉ. ౪, ఆ. ౧౩౦. 7. ఉన్నతి. "వ...వి ల్లెత్తు పొడువు..." స్వా. ౪, ఆ. ౩౭. 8. గౌరవము. "క.తొత్తులఁ దగిలినవారికి, నెత్తు చెడుఁ..." మల్హ. ౨,ఆ.

౧౨౮. **9.** రీతి. "వ. పూవుటెత్తులమొత్తన సోఁగతీఁగలబాగున..." పాండు. ౩,ఆ. ౧౨౯. **10.** యుక్తి. ఆం. భా. ప్ర. ౧౧౩. **11.** మాఱు. "ఆ...ఇ, ద్దిక్కువారి నెల్ల నొక్కమొత్తు, గాఁగఁ బిలుకుమార్చు..." భార. ద్రో. ౫, ఆ. ౧౯౬. **12.** ఒకవిధ మగుపూలదండ. **13.** వలపుకత్తె విటున కిచ్చుధనము. "సీ. పద్మాస్య పురి ననుభవమున నీవ యెత్తులు వెట్టు దనఁగ రావలసె నిటకు." ఆము. ౨, ఆ. ౨౧. (పూర్వార్థమునకు నిదియె యుదాహరణము.) **14.** చదరంగములో కాయను నడపుట. (వా.) **15.** ఎత్తుట, లేవఁదీయుట. వ్యవ:—ఆ బస్తా నొకయెత్తు ఎత్తి క్రిందఁ బెట్టుము. విశే. **1.** ఉన్నతము, గొప్పది. "ఉ...చాల నెత్తయినవారికి నెందును బేరు తప్పునే.' వసు. ౫, ఆ. ౧౦౩. **2.** తూనికగలది. "సీ. తొలునాఁడు శోధ్యునిఁ దులఁ దూఁచి యాతనియెత్తైనయుట్టిక లెల్ల దాఁచి." విజ్ఞా. వ్యవ. ౧౧౭.

ఎత్తుకొను దే. అ. క్రి. (ఎత్తు+కొను.) సిద్ధపడు. "సీ. దయ యించుకలేక యెంతకు నెత్తుకొంటివి..." శుక. ౮, ఆ. ౮౨. స. క్రి. **1.** తీసికొను. "వ...ఆముద్దియకు బుద్ధిచెప్పి యెత్తుకొని వచ్చెదము..." ప్రభా. ౫, ఆ. ౧౮. **2.** దొంగిలించు. "మ...గిన్నె యెత్తుకొని బొంకుచు పల్కుచున్..." విప్ర. ౫, ఆ. ౧౫. **3.** కాపాడు. "గీ. ఎత్తుకొంటివి నాప్రాణ మేమి చెప్ప." విక్ర. ౨, ఆ. ౧౦౫.

ఎత్తుకోలు = ఎత్తికోలు. (శ. ర.)

ఎత్తుగడ. దే. వి. (క. ఎత్తుకడె.) **1.** యత్నము. (శ. ర.) **2.** ఉపాయము. (శ. ర.) **3.** కుటిలోపాయము. (వా.) **4.** ప్రారంభము. వా:—ఆపద్యములయెత్తుగడ బాగున్నది.

ఎత్తుగడ్డలు. ద్వ. వి. బ. (ఎత్తు+గడ్డలు.) ఎత్తుడు ప్రొయ్యిగడ్డలు. (శ. ర.)

ఎత్తుగల్లు. దే. వి. (ఎత్తు+కల్లు.) ఎక్కుట కెత్తుగాఁ బెట్టుకొన్నఱాయి. "ఉత్సాహ...అగ్గలిక ములకకాయ కెత్తుగల్లు గొనఁగ నేల.' కు. సం. ౨, ఆ. ౫౯.

ఎత్తుగీతము. దే. వి. (ఎత్తు+గీతము.) సీసపద్యానుబంధమగుగీతము. అప్ప. ౮,ఆ.౩౫౫. ఇట్లే: ఎత్తుగీతి.

ఎత్తుగున్న. ద్వ. వి. (ఎత్తు+గున్న.) ఏఁతయేనుఁగుపిల్ల. "గీ. అచటి యొకపాటి దొరమదహస్తులకును, నెత్తుగున్నలు దిక్కులమత్తకరులు." పాంచాలీ. ౧, ఆ. ౩౯.

ఎత్తుదెంచు. దే. అ. క్రి. (ఎత్తు+తెంచు. స్వార్థమున.) దాడెత్తివచ్చు. "వ. ద్రుపదుపై నెత్తుదెంచిన ద్రుపదుండును..." భార. ఆది. ౭,ఆ.౧౯౧.

ఎత్తుపడు. ద్వ. అ. క్రి. (ఎత్తు+పడు.) సిద్ధింపకపోవు, భగ్నమగు. "మ...ధర్ముఁడు శ్రద్ధయుం గలిసినన్ వేగంబె యబ్బున్ వివే, కునకున్ వాంఛితసిద్ధి యెత్తుపడుఁ గోర్కుల్ మోహభూభర్తకున్." ప్రబోధ. ౩, ఆ. ౬౮.

ఎత్తుబరికాఁడు. దే. వి. (ఎత్తు+బరి+కాఁడు.) చోరుఁడు, దొంగ. ఆం. సం.మాన. ౧౧.

ఎత్తులిడు. దే. స. క్రి. (ఎత్తులు+ఇడు.) ప్రోత్సహించు. "సీ. ఇరువంకఁ జెలు లెత్తులిడుచు నుబ్బింపఁగఁ జిఱునవ్వులోఁ గొంతసిగ్గు వదలి." కళా. ౭, ఆ. ౭౬.

ఎత్తులువెట్టు. దే. అ. క్రి. (ఎత్తులు+పెట్టు.) మోసగించు. "ఉ...ఎవ్వఁడే, నెత్తులువెట్టెనో..." వాల్మీకి. ౩, ఆ. ౭. స. క్రి. ప్రోత్సహించు. "చ. వెనుక రతీశ్వరుండు పదవే యని యెత్తులు వెట్ట..." శుక. ౧, ఆ. ౧౮౫.

ఎత్తువచ్చు. దే. అ. క్రి. (ఎత్తు+వచ్చు.) సాటియగు. "వ. భూపకుమారులతోఁ బసులకాపరు లెత్తువత్తురే." భాగ. ౧౦. స్కం. ఉ. ౩౦౦.

ఎత్తువడు. ద్వ. అ. క్రి. (ఎత్తు+పడు.) **1.** జవసత్త్వము లుడిగి పడిపోవు. (పసులు) "క...కొన్ని యతిసారదుస్తరబాధన్, బడి ప్రేవులు సిక్కఁ దునిసి, పడకుండునె యనఁగ నెత్తువడె నెల్లెడలన్." హరి పూ. ౬, ఆ. ౮౫. **2.** చెడిపోవు. "శా...దరిద్రుఁ డెత్తువడి శుష్కీభూతుఁడై..." భాగ. ౧౦, స్కం. పూ. ౩౯౮. **3.** ఎత్తఁబడు. "చ. ఇతరనగంబు లెత్తువడియెన్

గపివీరులచేత..." రామా. ౬, ఆ. ౧౪౫. రాఘ ౨, ఆ. ౩౯.

ఎత్తువెట్టు. దే. స. క్రి. (ఎత్తు+పెట్టు.) ప్రోత్సహించు. "చ. విలసిత మోహదాహపరి వేదన పొమ్మని యెత్తు వెట్టఁగా..." హంస. ౧, ఆ. ౧౧౪.

ఎత్తువేయు. దే. స. క్రి. (ఎత్తు+వేయు.) తూఁచు, తూనిక వేయు. (శ. ర. వా.)

ఎత్తువోవు. దే. అ. క్రి. (ఎత్తు+పోవు.) 1. పడిపోవు. "గీ. శిలఁ జిగురుఁబోఁడియై యుల్లసిల నొనర్చి, యెత్తువోయిన గౌతమునిల్లు నిలిపె." రామా. ౪, ఆ. ౫౬. (శ.ర.పా. 'ఎత్తిపోయిన' ముద్రి.) 2. తీసిపోవు. "క. అవియును నొకటొకటికి నెత్తువోవక పెనఁగినఁ గని..." ఉ. హరి. ౬, ఆ. ౧౬౦.

ఎత్తుసేయు. దే. అ. క్రి. (ఎత్తు+చేయు.) కపటము పన్ను. "గీ. క్రొత్తవారలఁ గనుఁగొన్న నెత్తుసేయు, మాటలనె తీయు ధన మెల్ల మదనసేన." మల్హ. ౨, ఆ. ౪౨.

ఎత్తెల. దే. వి. చేఁపలను బట్టుకొనుసాధనవిశేషము. "క. వెరవున నూఁతల నెత్తెలఁ, గరముల మత్స్యములఁ బట్టి..." భార. శాం. ౩, ఆ. ౧౯౩.

ఎత్తెలగొను. దే. స. క్రి. (ఎత్తెల+కొను.) ఎత్తెలతోఁ జేఁపల నవలీలఁగాఁ బట్టినట్లు పట్టుకొను, సులభముగా జయించు. "ఉ. ఎత్తెలగొందు దిక్పతుల నిందఱ..." నిర్వ. ౬, ఆ. ౧౪౭.

ఎద. యు. దే. వి. ఎద, పశుఋతువు. "వ. ఎదపడ మునకఁ బొదలుపెట్టలకు..." స్వా. ౪, ఆ.౩౭.
వై. వి. (సం. హృత్.) 1. హృదయము. "గీ. అనినఁ దద్భక్తికెద మెచ్చి..." ఆము. ౨,ఆ. ౯౨. 2. గుండె. "గీ. ఎఱిఁగి పైనెత్తిరా నెన్ని యెదలు గలవు." కు. సం. ౯, ఆ. ౪౨. 3. రొమ్ము. "శా. శ్రీవక్షోజకురంగనాభ మెదపైఁ జెన్నొంద..." స్వా. ౧, ఆ. ౧. 4. భయము. "సీ. ఎద డింది మద మొంది గద నంది..." ఛంద్రా. ౨, ఆ. ౭౭.

ఎదకందు. ద్వి. వి. (ఎద+కందు.) ఎదయందుఁ గందు కలవాఁడు చంద్రుఁడు. "సీ. చలువల దొర చందురుజాబిల్లి యెదకందుకలువలవిందు..." ఆం. పదా. సుర. ౨౩.

ఎదచూలి. ద్వి. వి. (ఎద+చూలి.) వాయువు, గాలి. "చ...ఎదచూలి గాడ్పు కర్వలి వినుకఁడు గాడుపన వాయువు..." ఆం. పదా. సుర. ౩౫.

ఎదపడు. వై. అ. క్రి. (ఎద+పడు.) భయపడు. "క. ఎదపడి పెదవులు దడుపుచు, సదవద నెద తాల్మి వదల..." ఉ. రా. ౬, ఆ. ౨౫౭.

ఎదపుట్టువు. ద్వి. వి. (ఎద+పుట్టువు.) వక్షోజము, చన్ను. "క...ఎదపుట్టు లనఁ గుచములకొ." ఆం. పదా. నర. ౭౭.

ఎదపోవు. దే. అ. క్రి. (ఎద+పోవు.) ఋతుసమయమునకు వచ్చు. వా:—ఆవు ఎదపోయినది.

ఎదవడు. వై. అ. క్రి. (ఎద+పడు.) 1. భయపడు. "క. అవ్వేళ దివ్యబాణము, లెవ్వియుఁ బనిసేయకున్న నెదవడి మదిలోఁ, గవ్వడి దూలఁగఁ గని.." జై. ౭, ఆ. ౪౨. 2. దీనత నందు. "క. ఇది యేమి నేఁడు మల్హణ, వదనాబ్జము సొంపు దక్కి వసివాడి కడుఁ, హృదయాంబు విన్నవోవుచు, నెదవడి యున్నాఁడ వింత యేటికి నని నన్." మల్హ. ౨, ఆ. ౧౧౧.

ఎదావు. దే. వి. (ఎద+ఆవు.) ఋతుకాలమునకు వచ్చినయావు. (శ. ర.; బ్రౌ.)

ఎది = ఏది. (శ. ర.)

ఎదిరి. దే. వి. విరోధి. "క. మ మ్మెఱుఁగు నెదిరి నెఱుఁగుదు..." భార. ఉద్యో. ౩; ఆ. ౩౪. విణ. అన్యుఁడు. "గీ. తానఁ దనయట్ల యెదిరిని గాన్పు కొన్పు, జీవులకుఁ దారతమ్యంబు సెప్పఁదగదు." కాశీ. ౬, ఆ. ౭౮.

ఎదిరించు. దే. అ. క్రి.,స. క్రి. ప్రతిఘటించు. "క... భగదత్తమహాశుండాలమునకుఁ దా నెదిరించెన్." రాఘవ. ౪, ఆ. ౧౩౮. "గీ. కొంచకెవ్వాఁడు ని న్నెదిరించువాఁడు." ఉ. రా. ౧, ఆ. ౩౨౫.

ఎదుగు. దే. అ. క్రి. 1. పెరుఁగు. "గీ. పేశలాకారియై మించి పెండ్లి కెదుగ." శుక. ౨, ఆ.

౧౫౨. 2. సమీపించు, "గీ. పొలఁతి కల్లన నీళ్లా డుప్రొద్దు లెదుగ." భాగ. ౧౦, స్కం. పూ. ౭౫. 3. అతిశయించు. "గీ. భీకరము లగువిధము లు పెక్కు సేయు, గర్వ మెదుగంగ నాదశ కంధరుండు." నిర్వ. ౪, ఆ. ౨౨. 4. ఈడు వచ్చు. ఉదా:—ఎదిగినపిల్ల. వి. వృద్ధి. వ్యవ:- వాని యదృష్టమున కేనాఁటికి నెదుగును లేదు, పొదుగును లేదు.

ఎదురగు. దే. అ. క్రి. (ఎదురు+అగు. స్వార్థమున.) ఎదురు, అభిముఖ మగు. వా:-నేను పోవుచుం డఁగా నామె యెదురైనది.

ఎదురాడు. దే. అ. క్రి. (ఎదురు+ఆడు.) 1. ఎదురు తిరుగు. "క...పనిముచ్చె, యెదురాడుచున్న వాఁ డని, మది నెంచుచుఁ బోడముకినుక మగుడ నడంచున్." శుక. ౨, ఆ. ౨౦౯. 2. ఎదురు మాట చెప్పు. "ఉ...ల, జ్ఞాపనతాస్య యాచు నెదురాడఁగ లేక పరిచె విప్రునిన్." ద్వా. ౬, ఆ. ౧౩౯.

ఎదురు. దే. అ. క్రి. (క. ఎదురు.) 1. ఎదు రగు, అభిముఖ మగు. "గీ...తరంగిణీరమణి నిత్య నిర్మలాకారకాంతి, ధార ధారున నెదిరినంతనె నగేంద్రు, గాఢతర ధైర్య మువ్వెత్తుగా హరిం చె." వసు. ౪, ఆ. ౧౧౦. 2. ఎదిరించు, మా ర్కొను, "క. పదివేవురురాజులు దన, కెదిరి పోలిసిరి..." భార. భీష్మ. ౧. ఆ. ౪౮. స. క్రి. ఎదిరించు, ప్రతిఘటించు. "శా...యుష్మద్గదా, వితతద్రావితు నన్ను నేఁ డెదురుమా వేతీర్తు నీ కోరికల్." భాగ: 3, స్కం. ౬౫౮. వి. ఔ. 1. ముందు, సమక్షము. "ఆ.. ఇందఱ, యెదుర నీవు గోరి తెవ్విధంబు." భార. శాం.౪,ఆ.౧౬౦. "గీ...దైవికము నెదుట, యుక్తులు ఫలింపవు..." ఆము. ౫, ఆ. ౧౪౭. 2. వలపుకత్తె వలపుకాని కిచ్చుధనము. "గీ. ఇటుల నజ్జారశేఖరుఁ డేలఁ బట్టి, యింటిలోనున్న వస్తువు లెదురు వెట్టె." హంస. ౨, ఆ. ౧౧౨. విణ. 1. అభిముఖమై నది. "సీ...ఎదురింటివారల కెదురుచుక్క." శుక. 3, ఆ. ౨౦. 2. ఒరుఁడు. "గీ...ఎదురు, గండతుండఁగఁ గొనునది కార్యఫలము." భార. ఉద్యో. ౪, ఆ. ౫౭. 3. సాటి. "క. అకృతా స్త్రుఁడ బాలుఁడ...కర్ణాదియోధవీరుల కెదురే." భార. విరా. ౪, ఆ. ౫౩. 4. బదులు. "క. ఈమాటకు నెదు రుత్తర, మే మైనను నియ్య వలయు..." వరాహ. ౧౧, ఆ. ౯౦. క్రి.విణ. 1. అభిముఖముగా. "గీ...అమ్మునీశ్వరున కర్థి, నెదురు వోయి తపస్విను లెరఁగుటయును." నిర్వ. ౯. ఆ. ౪౭. 2. సమానముగా. "వ. అనిన విని నదీసూనుఁడు దాను నెదురు శోకించి..." భార. భీష్మ. 3, ఆ. ౭౪. వ్యవహారమునందలి ప్రయో గవిశేషములు:—ఎదురీఁదు, ఎదురుండు, ఎదురు కెదురు, ఎదురుమేనఱికము, ఎదురుమ్రోయు, ఎదురువడ్డీ, ఎదురుసన్నాహము, ఎదురెత్తు, ఎదు రెదురగు, ఎదురేఁగు, ఎదురొర్చు మొ.

ఎదురుకట్టు. దే. వి. (ఎదురు+కట్టు.) ముందఱ. (ఈపదము తఱచు బహువచనాంతముగఁ బ్ర యోగములఁ గానవచ్చుచున్నది.) "క. అల్లంత నెదురుకట్టుల, నుల్ల మలరఁ గాంచి..." భో. ౫, ఆ. ౨౧౬. వి.పు. ౭, ఆ. ౧౩౭.

ఎదురుకుత్తుక. దే. వి. (ఎదురు+కుత్తుక.) అంకిళ్లు కట్టుకొనువ్యాధి విశేషము. (శ. ర.)

ఎదురుకొను. దే. స. క్రి. (ఎదురు+కొను.) 1. ఎదు రుగా వచ్చి యాహ్వానించు. "గీ. ఇంపు రెట్టింప నల్లుని నెదురుకొనియె." విక్ర. ౭, ఆ. ౭౪. 2. ప్రతిఘటించు. "సీ. ముజ్జగంబుల ముచ్చ ముడిఁగింపఁగాఁ జాలు నీఁదగాడుపులు బిట్టెదురు కొనిన." పాండు. ౪, ఆ. ౨౮. 3. జయించు. "గీ. తొడలె చాలును రంభలఁ దొడరి గెలువ, నుదురె చాలును శశిరేఖ నెదురుకొనఁగ." రాధికా. 3, ఆ. ౧౫౨. అ. క్రి. 1. ఎదురగు. "వ...ప్రతికూలమారుతంబు లెదురుకొన సరకు గొనక..." ఉ. రా. 3, ఆ. ౨౨౮. 2. ఆసన్న మగు. "గీ...వేసవి యెదురుకొనియె." విప్ర. ౨, ఆ. ౪౯.

ఎదురుకొలుపు. దే. స. క్రి. (ఎదురుకొను ధా. ప్రే.) స్మృతికిఁ దెచ్చు. "గీ...తనూభవప్రాక్చరిత్ర, మెదురుకొలిపెడు మదికి నిం దిగురుఁబోఁడి." చం. రా. ౫, ఆ. ౧౩.

ఎదురుకోలు = ఎదుర్కోలు. (ఎదురుగాఁ బోవుట.) "క. పురలక్ష్మి...హరికి నెదురుకోలు పఠించెన్." అని. ౫, ఆ. ౫౯.

ఎదురుగడ. దే. వి. (ఎదురు+కడ.) మాఱు వ్రాసిన యొడంబడిక లోనగునది. (ఉదా:—ఎదురుగడ యొడంబడిక, ఎదురుగడలెక్క.) (శ. ర.)

ఎదురుచే. దే. అ. క్రి., స. క్రి. ప్రతిఘటించు. "క...ఓటమి, యెదురుప లేరైరి కురుకులేంద్రుఁడు వారల్." భార. కర్ణ. ౨, ఆ. ౧౬౪.

ఎదురుచుక్క. దే. విశ. (ఎదురు+చుక్క.) ప్రతికూలము. "సీ...ఎదురింటివారల కెదురుచుక్క." శుక. 3, ఆ. ౨౦.

ఎదురుచూచు. దే. అ. క్రి. (ఎదురు+చూచు.) వేచియుండు. "గీ...నారాక కెదురుచూచు, నయనములు వేయి విరియించి నాకభర్త." నైష. ౪, ఆ. ౬౪. (దీనియామ్రేడితరూపము ఎదురెదురుచూచు. సురా. ౧౦౫.) స. క్రి. మించు; ఓడించు. "సీ. కమనీయ రూపరేఖావిలాసస్ఫూర్తి నేభర్త శ్రీభర్త నెదురుచూచు." ఆనంద. పీఠి. ౪౬.

ఎదురుతాఁకగు. దే. అ. క్రి. (ఎదురు+తాఁకు+అగు.) ఎదురుపడు. "క. ద్వైవికముగ రెండు నెదురుతాఁకై నిలువన్." జై. ౭, ఆ. ౧౪౪.

ఎదురుతిరుగు. దే. అ. క్రి. (ఎదురు+తిరుగు.) 1. ఎదుర్కొను. (వా.) 2. తిరుగఁబెట్టు. వా:—రోగ మెదురుతిరిగినది.

ఎదురుపడు. ద్వ. అ. క్రి. (ఎదురు+పడు.) 1. ఎదురగు. "క...జారశేఖరుఁ, డావేలఁదికి నెదురు పడియె..." హంస. ౨, ఆ. ౧౧౭. 2. ప్రతిఘటించు. "క...వారికి, నరసంపసుఁ డెదురుపడి గుణధ్వని నెలఁగన్." భార. భీష్మ. ౨,ఆ.౩౧౩.

ఎదురుపాటు. ద్వ. వి. (ఎదురుపడు ధా.) ఎదురుపడుట. (శ. ర.)

ఎదురులుచూచు = ఎదురుచూచు. "చ...నీ, కెదురులుచూచుచున్..." భా. రా. యు. ౫౮౬.

ఎదురులెక్కు = ఎదురెక్కు. (ఎదురుగాఁబోవు.) "ఆ. ...జహ్నుసంభవాంభోవేణి, కెదురు లెక్కు మీలకొదమ లనఁగ." స్వా. ౫, ఆ. ౮3.

ఎదురుసెలఁగు. దే. అ. క్రి. (ఎదురు+చెలఁగు.) ప్రతిధ్వనించు. "సీ. కులపర్వతావళి కులిశభయంబున బెదరి వాపోవున ట్లెదురుసెలఁగె. భార. ఉద్యో. ౪, ఆ. ౧౧౬.

ఎదురెక్కు. దే. అ. క్రి. (ఎదురు+ఎక్కు.) 1. ఎదురుగాఁబోవు. "మ...నాభిపు, కరుహక్రోడమిళిందబృంద మెదురెక్కున్...ఆము. ౧, ఆ. ౫. 2. బాధించు. "గీ.వజ్ర మెదురెక్కకుండంగ వరము పడసె." కకు. ౪, ఆ. ౧౪౫.

ఎదురొడ్డు. దే. అ. క్రి. (ఎదురు+ఒడ్డు.) 1. ఎదురు వ్యూహము పన్ను. "గీ. విడిసెఁ బతిసేన కెదురొడ్డి విమతసేన." కవిక. ౨, ఆ. ౧౪౭. 2. ప్రతిఘటించు. "క...నీకెదు, రొడ్డి విజృంభించె..." ఉ. రా. 3, ఆ. ౨3౭. స. క్రి. 1. ఎదురువేయు. "గీ...అతఁ డెదురొడ్డినట్టికరాళాయుధమును." కళా. ౮. ఆ. ౯౭. 2. ఎదురు పందెము పెట్టు. (వా.)

ఎదురొత్తు. దే. స. క్రి. (ఎదురు+ఒత్తు.) మాఱొత్తు "చ...చన్నుల నెదురొత్తి మక్కువ ననుం బిగి కౌఁగిటఁ జేర్ప వేఁటికే." పారి. ౧, ఆ. ౧౧౭. వి. బ. మాఱొత్తులు. "సీ...హితవొప్ప నెదు రొత్తు లిచ్చువైపు." రాధికా. 3, ఆ. ౧౧౭.

ఎదురొమ్ము. దే. వి. (ఎదురు+రొమ్ము.) రొమ్మునడిమి భాగము. "చ...నీదు పెద్దత, మ్మునియెదురొమ్ము నెత్తురు..." రాఘవ. ౪, ఆ.౧౧౧.

ఎదుర్కట్టు = ఎదురుకట్టు. "ఉ. ఎట్టు నుతింతు నల్పమతి నిల్వలమర్దన...తేపెదు, ర్కట్టున ముంగిటన్..." కాశీ. ౬, ఆ. ౨౬౨.

ఎదుర్కొను = ఎదురుకొను. (ప్రతిఘటించు.) "చ... శాత్రవు నెదుర్కొనఁ జేసి...ఉ. రా. ౨, ఆ. ౭౮.

ఎదుర్కోలు = ఎదురుకోలు. (ఎదురుగాఁ బోవుట.) "గీ. రమ యెదుర్కోలు సేకొనె..." భాగ. ౮, స్కం. ౧౪౦. 2. (ఎదురుసన్నాహము, ఆదు

పెండ్లివారు మగపెండ్లివారి నెదుర్కొనుట.) "సీ. ప్రేమ నెదుర్కోలు పెండ్లివారల కిచ్చి..." హంస. ౫, ఆ. ౪౦.

ఎదుర్చు = ఎదురుచు. "ఆ. అనఘ నీ కెదిర్చి యని సేయువాఁడ...భార. భీష్మ. ౧, ఆ. ౧౫౬. "చ...అ, గ్రహమున నేను దుంతిగణరాజు నెదిర్చితి మమ్మునీంద్రునిన్." కాశీ. ౭, ఆ.౩౦.

ఎదుర్చుక్క = ఎదురుచుక్క. "ద్వి. వ్యామోహ మదముల కతఁ డెదుర్చుక్క. ప్రభు. ౩. ఆ. ౧౦౨ పు.

ఎదుర్పడు = ఎదురుపడు. (ఎదురగు; చూచు.) "చ. తనుఁ గనుఁ బ్రామి యొండొకలతం బతి పైఁబొక తేఁటిబోటి పా, త్తున విరిదేనెఁ గ్రోలఁగ నెదుర్పడి..." పారి. ౩, ఆ. ౫౭. (ప్రతిఘటించు.) "చ...యవనజరాసుతాదులకు నాజి నెదుర్పడ లేక...భాగ. ౩, స్కం. ౯౨.

ఎదుర్పాటు = ఎదురుపాటు. (శ. ర.)

ఎద్దడి. దే. వి. 1. దారిద్ర్యము. ఆం. భా. ద్వి. ౭౧౦. 2. దుర్లభత్వము. వా:—నీటియెద్దడి. విణ. 1. దరిద్రము. (శ. ర.) 2. దుర్లభము. "క. పసులకు మే పెద్దడియై... హరి పూ. ౬, ఆ. ౧౨౭.

ఎద్దడినేల. దే. వి. (ఎద్దడి+నేల.) మరుభూమి, నిర్జల ప్రదేశము. "గీ. పరగు నెద్దడినే లన మరుధరిత్రి." ఆం. భా. ద్వి. ౫.

ఎద్దము. దే. వి. పట్టె తీరినయంచు. ఉదా:—ఎద్దపు చీర. (శ. ర.)

ఎద్ది = ఏది. భార. శాం. ౬, ఆ. ౫౪౭.

ఎద్దు. దే. వి. (క. ఎత్తు.) వృషభము. దీనిబహువచన రూపములు: ఎద్దులు, ఎడ్డులు, ఎడ్లు. "శా... స, త్సాంగత్యంబు నెఱుంగఁ డేని భువి నాశ్చర్యంబుగా వాలమున్, శృంగద్వంద్వము లేని యె ద్దతఁడు..." ద్వా. ౪, ఆ. ౧౭౨. "ఉ. ఏ రొకటబ్బె రాముసకు నెద్దు పొసంగవు చంద్ర మఃకళా, ధారికి నొక్క యెద్దది వితావిత సీరము లేమిఁ గావునన్..." శశాం. ౨, ఆ. ౭౦.

ఎద్దుతత్తడిజోదు. ద్వ. వి. (ఎద్దు+తత్తడి+జోదు.) వృషభవాహనుఁడు, శివుఁడు. అచ్చ, ఆర. ౫౯.

ఎద్దునాలిక. దే. వి. (ఎద్దు+నాలిక.) 1. ఎద్దుయొక్క నాలిక. 2. గోజిహ్వ, బెండ కూ. ఆం. భా. ద్వి. ౬౧.

ఎద్దుపట్టు. దే. స. క్రి. (ఎద్దు+పట్టు.) ఎద్దును ముష్కహీనముగాఁ జేయు. "వ. వానిం బట్టి కట్టింపు మొండె నెద్దుపట్టింపుము గాకున్న నరణ్యంబు సొర వెలువరింపుము..." హరి. పూ. ౬, ఆ. ౧౩౦.

ఎద్దుముట్టె. దే. వి. (ఎద్దు+ముట్టె.) ఒకజాతిదుంప. (శ. ర.)

ఎద్దుమొద్దు. దే. విణ. (ఎద్దు+మొద్దు.) రసవిహీనుఁడు. "చ... మోహనాంగిఁ దా, నిటువలె నెద్దుమొద్దునకు నేమిటికిం దగులంబు చేసె..." సురా. ౬౦.

ఎద్దుమొద్దువాఁడు = ఎద్దుమొద్దు. "ఆ. ఎద్దుమొద్దువానికేల శాస్త్రంబులు, ముద్దునాతి కేల ముసలి మగఁడు. వేమన. ౬౫౦.

ఎద్దురాసి. ద్వ. వి. (ఎద్దు+రాసి.) వృషభరాశి. (శ. ర.)

ఎద్రుచు. దే. అ. క్రి. వ్యతిరేక మగు. "చ. ఎద్రిచినకాలపాకమున నీగతి నీమదిఁ గ్రోధవల్లికం, బద్రిచినవారు..." ఉ. హరి. ౪, ఆ. ౧౦౯.

ఎన. దే. వి. (క. ఎణె. త. ఇణై.) ఈడు. 1. పోలిక. "క...దీనికి, నెన లేవుసుఁడీ తలంప నేధర్మంబుల్." భార. అను. ౨, ఆ. ౨౫౮. 2. జోడు. (చూ. ఎనవాయు.) విణ. సాటి. "క...ఈతనికి సమర మెన పెండిలికిన్." భార. ఉద్యో. ౪, ఆ. ౨౩౦.

ఎనఁబోలు. దే. అ. క్రి. (ఎనన్+పోలు.) సాటి యగు. "గీ...విద్రుమద్రుమవేదుల వెలయు నొక్క, పురముఁ గనె భోగవతి కెనఁబోలు దాని." భాగ. ౪, స్కం. ౭౪౪.

ఎనపు. దే. స. క్రి. ఎనుపు, కలిగించు. "రగడ. మదిర మది రహి మించ నుమిసిన మధురమధురస మెనపు బోటికి..." చంద్రి. ౪, ఆ. ౬౩.

ఎనశై = ఎనుబది. (వా.)

ఎనమంద్రుు. దే. వి. బ. ఎనిమిదిసంఖ్య గలజనులు. (ఎనిమిదికి మహన్మహత్యర్థకరూపము.) "క. వసువుల, నెనమంద్రం గాంచి...యొంతయు ప్రీతిఁ." భార. ఆది. ౪, ఆ. ౧౨౫.

ఎనమండ్రురు = ఎనమండ్రు. "క...ఎనమండ్రురు, వీరులు..." భార. ద్రో. 3, ఆ. ౨౧౬.

ఎనమంపుము. ద్వ. వి. (ఎనిమిది+తూము.) ఎనిమిది తూముల పరిమాణము. ఆం. భా. ద్వి. ౨౭౧.

ఎనమనూఱు. దే. స. శౌ. (ఎనిమిది+నూఱు.) ఎనిమిదివందలు. "ఆ. తొలుత నెనమనూట తొమ్మిది వైఁడిట్టి, కల..." జై. ౮, ఆ. ౧౭౬.

ఎనమన్నూఱు = ఎనమనూఱు. "వ...ఐదువేలు నెనమన్నూట యొనుబదినాలుగు శ్లోకంబులు..." భార. ఆది. ౧, ఆ. ౪౪.

ఎనయించు. దే. స. క్రి. (ఎనయు ధా. ప్రే.) 1. ఎనయఁజేయు, చేయు. "సీ. గిలిగింత లొకకొన్ని కలయంగ నెనయించి మోవినొక్కుమటంచు మొనసి నిలుచు." హంస. ౨, ఆ. ౧౦౪. 2. ఘటింపఁజేయు. "సీ. నేను నీ వనుమాట లెనయించె నెవ్వాఁడు..." వసు. ౧,ఆ.౯. 3. అతుకు. "క. అనలమునఁ గాఁచి లోహము, నెనయించినకరణి..." వేం. పంచ. ౨, ఆ. ౬3.

ఎనయిక. దే. వి. (ఎనయు ధా.) 1. పోలిక. (శ.ర.) 2. పొందిక. "క...సర్వతత్త్వముల కవి, యెనయిక బ్రహ్మమును గలయు టేకత్వ మగుఁ." భార. అను. ౪, ఆ. ౧౮౪.

ఎనయు. దే. స. క్రి. 1. పోలు. "ఆ. ఆకసమును హరియించు గంధాది, యగుగుణాళితోడ నఖిలభూతములును నిట్లు లయముఁ బొందిన గ్రసియించు, మనసు నాత్మగుణము నెనసి విభుఁడు." భార. శాం. ౫, ఆ. ౭౫. 2. కూడు; సంగమించు. "గీ. ఎనసి త్రైలోక్యమును వచ్చె నేని నిమ్ము, గలపు..." హరి. పూ. ౭, ఆ. ౧౮౨. "క. ఇంతయుపాయము గలిగిన, నింతీ చనవచ్చు జారు నెనయఁగ..." హంస. ౨, ఆ. ౬౬. 3. సోఁకు. "క...కమ్మవలపులు గొనుగా, డ్వెనయమికి..." వసు. 3, ఆ. ౧౪౯. 4. పుచ్చుకొను. "సీ. గాదెలధాన్య మెల్కలకయ్యె గుత్తకై యెనసినగ్రామంబు లెల్ల నెండె." శుక. ౨, ఆ. 3౬౦. 5. పొందు. "శా...సుధామయశుభ్రైకాయత్త చిత్తేశసం, జ్ఞావర్ణంబు లొకింత వీను లెనయఁ..." వసు. 3, ఆ. ౧౮3. అ. క్రి. 1. సమాన మగు. "క. ఈ నలువురభుజశక్తుల, తో నెనయఁగఁ జాలునట్టివార్వల మెందుఁ, గానము..." భార. విరా. 3, ఆ. ౧౧౪. 2. అగు. "క. అని తెల్పునెడఁ బ్రభాతం, బెనయుట..." శుక. ౧, ఆ. 3౦౮. 3. కాయు. "చ. ఎనసిననిండువెన్నెలలు నిం పగురాత్రుల ..." హరి. పూ. ౮, ఆ. 3౯. 4. కూడు; రమించు. "ఆ. ఇంద్రియములతోడ నెనయ బెరసి." "భార. శాం. ౪, ఆ. ౨౯౫. "సీ...రాధికతోడ నెనయఁడే నిన్న నీయనుఁగు బావ." శశాం. 3,ఆ. ౮౧. 5. పట్టుపడు. "క...నిదిధ్యాసకు బ్రహ్మం, బెనయును..." ఆము. 3,ఆ.౪౦. 6. ఒప్పారు. "సీ... సారాగకలితశీతశైల మెనయ."ఇందు. ౧,ఆ. ౧౦౬.

ఎనవచ్చు=ఎనఁబోలు. "సీ... అభిమన్యుఁ దర్జునవాసుదేవుల కెనవచ్చువాఁడు." భార. ఉద్యో. ౪, ఆ. ౨౬౦.

ఎనవాయు. దే. అ. క్రి. (ఎన+పాయు.) జోడు వీడు, వియోగమందు. "క. ానుచరి యగు మంత్రియతో నెనవాసిన నాదుజన్మ పేటికి ..."భా. రా. సుం. 3౦3.

ఎనవోలు = ఎనవచ్చు. "ఉ. ఇంతిమృదూక్తి మాధురికి నిక్షురసం బెనవోలఁ జాలక."వసు. ౨,ఆ.౪౬.

ఎని = ఎన్ని. (శ. ర.) (దీనికి హల్లుపర మగుచో వికల్పముగా నిత్యలోపము ఉదా:—ఎన్తలలు. (శ. ర.)

ఎనిక. దే. వి. 1. ఎన్నిక, గణనము. "గ. ప్రసమనము లోన నెంతట, ననుమానము తీఱ శుద్ధి యగునందాకన్, మను శౌచము చేయుట తగు, నెనికయుఁ గొలఁదియును వెదుక రెన్నఁడుఁ బెద్దల్." విజ్ఞా. ఆచా. ౪౦. 2. నాలుగు పోఁగుల నూలుదారము. (శ. ర.)

ఎనిమిది. దే. స. ఓ. ఏడునొకటి. "క. గిటగిట నెని మిది మలకలఁ, గుటిలీభావము భజించి కుండలి ప్రాఁకుక్. కాశీ, ౨, ఆ. ౧౨౭. "క...౨౦, డెనిమిదిటిఁ గూల్చె బాణము, లెనిమిది యెనిమి దుల నాతఁడే ద్రైర నధిపా. భార. కర్ణ. ౨, ఆ. ౩౪౭. ఇట్లే; ఎన్మిది. భార. ఆర. ౪,ఆ. ౩౭.

ఎనిమిదికాళ్లగిక్క. ద్వ. వి. (ఎనిమిది+కాళ్లు+రిక్క.) భాద్రపదానక్షత్రము. (పూర్వోత్తర భాద్రపదములు రెండిటికి రెండునాలుగు లెనిమిది పదము లగుట దీని కీపేరు వచ్చినది.)

ఎనిమిదికాళ్లరిక్కనెల. ద్వ. వి. (ఎనిమిది+కాళ్లు+రిక్క+నెల.) భాద్రపదమాసము. (శ. ర.)

ఎనిమిదియడుగులమెకము. ద్వ. వి. (ఎనిమిది+అడుగులు+మెకము.) శరభమృగము. వేంక. తిర్య. ౯౪.

ఎనియు. దే. అ. క్రి. 1. కలిసికొను. (శ. ర.) 2. ముద్ద యగు. ఉదా:—పప్పు ఎనిసినది.

ఎను. దే. అప. ద్రు. భూతార్థక ప్రథమ పురుషైక వచన ప్రత్యయము. ఉదా:—వచ్చెను, పో యెను.

ఎనుచు = ఎనుపు. (శ. ర.)

ఎనుపతేలు = ఇనుపతేలు: ఆం.భా.ద్వి. ౭౭.

ఎనుపమోఁకాలు. ద్వ. వి. ఒకానొకచెట్టు. (శ. ర.)

ఎనుపసరము. వై. వి. (ఎను+పసరము.) గేదె. ఆం. భా. ద్వి. ౨౬౪.

ఎనుపు = ఎనుచు. (శ. ర.)

ఎనుపుడు. దే. వి. ఎనుచుట. (శ.ర.బ్రా.)

ఎనుపెంటి = ఎనుపసరము. వేంక. తిర్య. ౯౭.

ఎనుపోతు. ద్వ. వి. (ఎనుము+పోతు) దున్నపోతు. భార. విరా. ౧, ఆ. ౭౩.

ఎనుబండ్రు = ఎనమండ్రు. (శ.ర.)

ఎనుబది. ద్వ. స. ఓ. (ఎనిమిది+పది.) ఎనిమిది పదులు. "క. ఎనుబది యెనిమిదివేవురు, దనుజుల కాధ్యుండు..." ఉ. హరి. ౪, ఆ. ౬. ఇట్లే: ఎన్బది. (రూ.)

ఎనుము. వై. వి. (సం. మహిషి.) గేదె. ఆం. సం. తిర్య. ౧౦. ఆము. ౪, ఆ. ౨౩.

ఎన్నఁడు. దే. వి. ఓ. 1. ఏదినము; ఏకాలము. "గీ. ఎన్నఁడే నుండుగాలంబుమిన్నుచక్కి, భూతము లు గ్రాలు నెన్నఁడేఁ బుట్టెనిండ్ల. కాశీ. ౨, ఆ. ౫౧. 2. ఎప్పుడును. "గీ. ఎన్నఁడును సేగి లేనట్టి యిమ్మహాశ్మశానమునయందు...కాశీ. ౨, ఆ. ౪౫. 3. ప్రతిదినము. "సీ. ఎన్నఁటివలె సప్త ఋషులు వేగిన వచ్చి విజయోత్సవటంచు దీవిం పశైరి. దశా. ౨, అ. ౫౧.

ఎన్నాళ్లు. దే. వి. బ. (ఎన్ని+నాళ్లు.) ఎన్నిదిన ములు. విజ. ౨, ఆ. ౧౪౭.

ఎన్ని. ద్వ.స.ఓ. ఎంతశబ్దమునకు అమహాదర్థకబహు వచనరూపము. 1. ప్రశ్నార్థకము. ఉదా:— నీకెన్ని యేండ్లు? 2. యావదర్థకము. ఉదా:— ఎన్నిలోకము లున్నవో అన్నిలోకములు చూచి తిని. 3. అనేకము. ఉదా:—ఎన్నివిధములఁ జూచినను నాకు వాఁడు కనఁబడ లేదు.

ఎన్నిక. దే. వి. 1. గణనము. "గీ. ఎన్నికకు రోమకూపంబు లెన్ని గలవు. కాశీ. ౨, ఆ. ౯౧. 2. కీర్తి. "క. ఈరేడుజగములం దిఁక, నేరీ నీరీతి గోతు లెన్నికగను నొ,య్యారీ..." రసిక. ౩,ఆ. ౭౧. 3. అపకీర్తి. "గీ. అది దిగుల్పడి నీవెట్టు లరుగుదెంతు, వెన్నికౌ నటుమీఁద..." శుక. ౩, ఆ. ౨౯౬. 4. తలపోఁత. "ఉ...అతండు విన్నా, కింతయు మాటవచ్చు ననునెన్నిక నయ్యధి కారి..." విప్ర. ౫, ఆ. ౪౩. 5. నిర్ణయము. "ఉ...నీ, యెన్నిక చిన్నవోవఁగ..." కువల. ౪, ఆ. ౯౦. 6. నాలుగుపోఁగులదారము. ఆం. భా. ద్వి. ౨౯౫. విశే. 1. శ్రేష్ఠము. "ఉ...పో, రెన్నిక యానె..." ఆము. ౩, ఆ. ౫౭. 2. ఉచితము. "క...ప్రాణాంతవ్యవసాయం బిది, యింతులకుం గాక నీకు నెన్నిక యగునే." ప్రబోధ. ౫, ఆ. ౧౩.

ఎన్ను. దే. స. క్రి. 1. లెక్కించు. "చ. అమలినతా రకాసముదయంబుల నెన్న...విధాతృనకైనను నేరఁబోలునే." భార. ఆది. ౧, ఆ. ౧౯. 2. సరకు చేయు. "గీ. ఆజ్యపటుముఖ్యలయ

మెన్నరు..." ఆము. ౪, ఆ. ౧౨౭. **3.** కీర్తించు. "దాడ...అప్పాజేఁ డట్టి రాయంచ వార్వంబుజో ౖదైన నోశార నగ్గింప లే రన్నచోఁ బిన్న లెట్లెన్నగాఁ జాలువారు..." సీలా. ౨ ఆ. ౪౧. **4.** నిందించు. "గీ. ఇంకఁ జుట్టలు నన్నేమి యెన్నువారొ." హరి. పూ. ౯,ఆ.౭౪. **5.** తలపోయు. "ఆ. ఉన్నవారి నింక నెన్న నేల." విక్ర. ౮,ఆ.౭౩. వి. కణిశము, సస్యాది మంజరి. "సీ. ఎన్నవఁగఁ గణిశ మలరు..." ఆం. భా. ద్వి. ౨౩౬. ఉ. రా.౧,ఆ. ౭౪.

ఎన్నుకొను. దే. స. క్రి. (ఎన్ను+కొను.) **1.** గ్రహించు. **2.** ఏఱుకొను. (వ్యా.)

ఎన్నువ. దే. వి. ఆఁడువా రేడ్చునపుడు అనుభవము నెంచి యెంచి పాటగా పాడెడు చచ్చినవారి చారిత్రము. (శ. ర.)

ఎన్నెమ్మ. దే. వి. **1.** పురిటిలోఁ బిల్లలను బీడించెడు భూతవిశేషము. (శ. ర.) **2.** పురుగురూపమున వచ్చుపైభూతము. (శ. ర.)

ఎపుడు = ఎప్పుడు. (చూ. ఎప్పుడు.)

ఎప్డు = ఎప్పుడు. (శ.ర.)

ఎప్పటి. దే. అవ్య. ఎప్పటివలె. "ఉ...,ఎప్పటివచ్చి చన్గుడుచు...భాగ. ౧౦, స్కం. పూ. ౩౦౨.

ఎప్పుడు. ద్వి. వి. వి. కొ. **1.** ఏసమయము. (వ్యా.) **2.** నిత్యము. "క. ఎప్పుడు హరిఁ గని రమరులు ..." ఆము. ౪, ఆ. ౧౨. **3.** ఎల్లప్పుడును. **4.** వెనుక. ఉదా:-ఎప్పటికరణి. దశా.౧,ఆ.౯౩.

ఎబ్బె. దే. అవ్య. **1.** రోఁతపడుటయం దుపయోగింపఁబడుమాట. (శ.ర.) **2.** ఏమియును లేదని చెప్పునపు డనుమాట. ఉదా:—ఏమిటది ? ఎబ్బె. ఏమియును లేదు. విణ. రోఁతయైనది. (చూ. ఎబ్బెతనము.)

ఎబ్బెట్టు. దే. విణ. విరసము. (చూ. ఎబ్బెట్టుతనము.)

ఎబ్బెట్టుతనము. దే. వి. (ఎబ్బెట్టు+తనము.) విరసత్వము. "గీ. దీని యెబ్బెట్టుతనము, లెల్ల నిదె తీఱు ..."రాధికా. ౩, ఆ. ౨౪.

ఎబ్బెతనము. దే. వి. (ఎబ్బె+తనము.) రోఁత, అసహ్యము. (బ్రౌ.)

ఎబ్బెరాసి. ద్వి. విణ. (ఎబ్బె+రాసి.) రోఁతపుట్టించువాఁడు; రోఁత పుట్టించునది. "ద్వి. ఈ క్రూర కర్మున కీయెబ్బెరాసి, కి..." ద్వి. హరిశ్చ. ఉ. ౮౯, పం., చెన్న. ౭, ఆ. ౨౪.

ఎబ్బెఱికము. దే. వి. (ఎబ్బె+ఱికము.) సిగ్గు, లజ్జ. (రోఁత అని శ.ర. సూ.ని.) "సీ. ఎబ్బెఱికము లేక యేలుచు నున్నాఁడు చెలికువిల్కానికిఁ జిక్కినాఁడు." ఉ. రా. ౬, ఆ. ౨౦౦.

ఎమకు. దే. స. క్రి. నెమకు, వెదకు. "గీ...వల్మీకబిలంబు, నెలుకకలుగును గాక మన్నెమకి పట్టి, యరుగునది కొచ మొనరింప నవనిసురుఁడు. కాశీ. ౫, ఆ. ౧౯౩.

ఎమిడిక. దే. వి. **1.** కడుపులోఁ బుట్టి పామువలె నుండుపురుగు. (శ. ర.) **2.** ఎఱ్ఱ, వానపాము. (శ. ర.)

ఎముక. దే. వి. అస్థి. ఆం. భా. ద్వి. ౧౩౩.

ఎముకబలియు. దే. అ. క్రి. (ఎముక+బలియు.) దృఢమగు, గట్టివాఱినయెముక గల దగు. "సీ... ఎలమి దధీచిచే నెముకబలిసి. నరస. ౧,ఆ.౧౧౬.

ఎముకయూట. దే. వి. (ఎముక+ఊట.) ఎమ్మూట, మజ్జ. "సీ...ఎముకయూట, చవిగొని యూనుచు ..." భార. స్త్రీ. ౨, ఆ. ౯.

ఎముకలపోగు. దే. వి. (ఎముకలు+పోగు.) అస్థిరాశి. విణ. మిక్కిలి చిక్కినవాఁడు; మిక్కిలి చిక్కినది. (వా.)

ఎముకలవట్టు. దే. విణ. (ఎముకలు+వట్టు.) వ్యాధిచే మిక్కిలి చిక్కినవాఁడు; మిక్కిలి చిక్కినది. (శ. ర.)

ఎముకలేఱు. దే. స. క్రి. (ఎముకలు+ఏఱు.) ఎముకలు లేనివానిని జేయు; బాధించు; చంపు. "సీ... కరుణలే కెముకలేఱిరి దధీచిఁ, బాతాళబిలమున బలిఁ గట్టిరైచిరి..." శైవ. ౭, ఆ. ౮౧.

ఎమ్ము. దే. వి. ఎముక. "సీ. మొగిని దధీచియెమ్మునఁ బుట్టదయ్యెనే వాసవాయుధ మైనవజ్ర మది యు. భార. ఆది. ౬, ఆ. ౫౯.

ఎమ్ముక = ఎమ్ము. "గీ. ఎమ్ముకలు చల్లినట్టిచో టెఱుఁగఁడయ్యె." కాశీ. ౫,ఆ. ౪౧.

ఎమ్ముకము = ఎమ్ముక. "సీ.చేపోయి కుఱుచయై చెవులు విల్వంకలై పూసటెమ్ముకములు బొందికట్ట." కాశీ. ౬, ఆ. ౪౧.

ఎమ్మూట = ఎముకయూట. "సీ...సెఱ వైనయెమ్మూట నెయ్యి గాఁగ." కవిక. ౨, ఆ. ౧౯౬. (శ. ర. పా.)

ఎమ్మె. దే. వి. 1. చక్కఁదనము. "సీ. సరిగంచు జిలుఁగు చందురుకావికుచ్చెల యడుగుఁదమ్ముల యెమ్మె ననుసరింప." కృష్ణ. ౪,ఆ.౪౭. 2. విలాసము. "ఉ...ఎమ్మెలఁ మీఱెఁ జంద్రుఁ డొక యింతికరం బవలంబనంబుగన్. శశాం. ౪, ఆ. ౧౬౯. 3. గర్వము. "క. తెమ్మెర నీ కెం తెమ్మెర..." విజ. 3, ఆ. ౪౮. 4. ప్రీతి. "క... నం, దునిచెంగటనుండి యెమ్మెతో నీకడకుం, జనుదెంచితి..."నీలా. 3,ఆ.౯౬. బ. 1. అధికప్రసంగములు. "క. ఎమ్మెలు నాముందఱినా, యమ్మక్కరో చెల్లవు..." రుక్మాం ౫, ఆ. ౮౮. 2. గర్వోక్తులు. "చ. బలిదనుజేంద్రుఁ గట్టి తని పల్కఁగ విందుము కాని నేఁడు మా, చెలియిదె పుష్పదామకముచే నినుఁ గట్టఁగఁ గంటి మింకనె, మ్మెలు పచరింపరాదు..." పారి. ౫,ఆ.౮౧. విశ. చక్కని. "చ...లవలీనవమల్లిక లెమ్మె సొమ్ము లై." స్వా. ౬, ఆ.౭౬.

ఎమ్మెకాఁడు. దే. విశ. (ఎమ్మె+కాఁడు.) విలాసవంతుఁడు. "సీ...చిమ్మచీఁకటి మ్రింగు నెమ్మెకాని, కి..." నరస... ౨, ఆ. ౯౭. 2. సుందరుఁడు. "సీ. ఏయెమ్మెకాని కీయింతి వాతెఱ లేనె లిచ్చి పైకొని రమియించునొక్కొ." ఉ. రా. ౪, ఆ. ౧౯౪. 3. ప్రియుఁడు. "ఆ. ఎమ్మెకాఁడ... బంటి నేఁగఁ దగునె." అచ్చ. అయో. ౭౦.

ఎమ్మెలాఁడి. దే. విశ. (ఎమ్మెలు+ఆఁడి.) విలాసిని. "సీ. పసులగోడలనైన వసుధ నిచ్చెన లేక యెక్కనేరని దేఁటియెమ్మెలాఁడి." శుక. ౧, ఆ. ౧౩౯.

ఎమ్మెలాఁడు. దే. విశ. (ఎమ్మెలు+ఆఁడు.) విలాసవంతుఁడు. "గీ. ఇట్టివలపులవెల్లి నీయెమ్మెలాని." శ్రీరాధా. ౪, ఆ. ౬3.

ఎయిదించు. దే. స. క్రి. (ఎయిదుధా. ప్రే.) ఎఱిఁగించు, తెలియఁజేయు. "క... అత్తెఱఁ గెఱిఁగి మనకు నెయిదించుటపు, ట్టినకార్యమునకుఁ దగి యెడు, పని..." భార. విరా. ౫, ఆ. ౨3౭.

ఎయిదు. దే. అ. క్రి. 1. ఇముడు. "ద్వి. కుడుపు నీకెయిదదే కొడుక యిట్లేల." బస. 3, ఆ.౯౯పు. 2. వచ్చు. (చూ. ఎద్దు.) 3. పోవు. ఆ...వెనుక నెయిది సంశప్తకులు..."భార. ద్రో. ౧, ఆ, 33౮. 4. నిలుచు. "గీ...ఇది తుదిదాఁక నెట్లు, నెయిద నేరదు... "కు. సం. ౬, ఆ. ౧3. 5. సరిపోవు. "ద్వి...నానావ్రతప్రకరసంజనిత. ఫలకోటు లొకపుష్పం బీశుఁ బూన్చు,ఫలములో వెయిపాళ్ల పాలికి నెయిద, వు..." పండి. దీక్షా. ౧౭, పు. స. క్రి. 1. ఎఱుఁగు, తెలిసికొను. (చూ. ఎయిదించు.) 2. వెంబడించు. "క. కడువడి నీ వరుగఁగ వడ, ముడియును నీవెనుక శీఘ్రమున నెయిదుం గ, వ్వడి..." భార. ద్రో. 3, ఆ. ౨౯౭. 3. పొందు. "క...నీదుపూన్కి పారం బెయిదక." భార. విరా. ౨, ఆ. ౨౮౨. 4. చేరు, సమీపించు. "ఆ...అమ్మృగంబు వెనుక సరిగి యరిగి, యెయిదలేక..." భార. అర. ౪, ఆ. 33౭.

ఎద్దు = ఎయిదు. దే. అ. క్రి. 1. పోవు. "ఉ... ఆతల కెద్దుట లేదు నేనియున్." భార. విరా. ౪, ఆ. ౧౯౨. 2. వచ్చు. "చ. పలువురు చుట్టుముట్టుకొని బాణకృపాణముఖాస్త్రశస్త్రపం, క్తులఁ గడు నొంపఁగాఁ దనకుఁ దోడ్పడు వారలు లేక...రిపువధంబున కెద్దుము తండ్రి...అని తాఁ బలుమాఱును జీరకుండునే." భార. ద్రో. ౨, ఆ. ౧౪౭. 3. ఎగురు. "చ. హరి గరుడుండు బ్రహ్మ కలహంసము నాఖచరేంద్రులుం గరం, బురవడి నద్రిపై కెగురనోపక తత్పృథుపాద పంక్తిపై, నిరవుగ నిల్చి నిల్చి తుద కెద్దిరి..." కు. సం. ౭, ఆ. ౧౪౪. స. క్రి. 1. పొందు. "ఉ...కడ యెద్దుట యెమ్మెయిఁ గల్గ నేర్చు

..." భార. విరా. ౨, ఆ. ౨౬౬. 2. వెంబడించు. "చ...మన పెద్దయక తక్కినం బశు, ప్రచయము దప్పిపోవు..." భార. విరా. 3, ఆ. ౧౪౧.

ఎయ్యాది. దే. స. (ఏ+అది.) 1. ప్రశ్నార్థకము. "ఉ. ఎయ్యాది జన్మభూమి..." భార. విరా. ౧, ఆ. ౧౯౦. 2. కాక్వర్థకము. (లే దని తాత్పర్యము.) "గీ. స్వాస్థ్య మెయ్యాది..." దశా. ౨, అ. ౭౫. 3. యచ్ఛబ్దార్థకము. "ఉ. ఎయ్యాది కారణంబుగ..." నైష. ౧, ఆ. ౫౧.

ఎయ్యెడ. దే. వి. (ఏ+ఎడ.) ఎక్కడ, ఏచోటు. (వా.) అవ్య. ద్రు. ఎల్లప్పుడును. (ఆం. పా.)

ఎర. దే. వి. (క. ఎరె. త. ఇరై.) 1. ఆహారము. "సీ...ఆఁకొని డస్సి నే నెరకునై యిట్టట్టు దిరుగుచుండ." నా. పంచ. 3, ఆ. 3౨౨. 2. బలి. "క. నరపతుల నెల్ల భీష్మున, కెరగా నొప్పింపఁజాల..." భార. భీష్మ. ౨, ఆ. ౫. 3. ఆఁకలి. ఆం. భా. తృ. ౬౪. 4. వ్యసనము. "చ. తిరుగుచుఁ బుట్టలం బొదలఁ ద్రిమ్మరు పాముల... డొల్లఁగ వ్రేయుచు వచ్చి వచ్చి య,న్యోర నొకడుండుభం బనునహిం గని వ్రేయఁగ..." భార. ఆది. ౧, ఆ. ౧౯౨.

ఎరఁగు. దే. అ. క్రి. 1. నమస్కరించు. "ఆ... అధికభక్తి, నెరఁగి..." భార. ఆది. ౭, ఆ. ౧౧౧. 2. ఉఱుకు. "సీ...మృగంబుపై కెరఁగు సింగము పోలె..." భార. శల్య. ౧, ఆ. ౩౭౯.

ఎరఁగుడు. దే. వి. (ఎరఁగు ధా.) నమస్కారము. ఆం. భా. ద్వి. ౧౭౯.

ఎరగలి. దే. వి. 1. దావాగ్ని. "క. ఎరగలి యొండిన యడవుల, దరికొనుచందంబు..." భా. రా. యు. ౧౩౨. 2. అగ్ని. "ద్వి. కఱకంఠు నెరగలి కనుచూపు మగుడ." ద్వి. పరమ. ౧౩౭, పు.

ఎరగలిచిచ్చు = ఎరగలి. (దావాగ్ని.) "చ. ఎరగలి చిచ్చు...రూపడంచిన విధంబున..." భార. భీష్మ. ౨, ఆ. ౯.

ఎరగలివడు. ద్వ. స. క్రి. (ఎరగలి+పడు.) దగ్ధము చేయు. (హాలాహలవిషము.) "వ...కులశిఖరిశిఖరంబుల నెరగలివడి గహనంబుల దహించి ..." భాగ. ౫, స్కం. ౨౧౬.

ఎరగొను. దే. అ. క్రి. (ఎర+కొను.) 1. ఆఁకలిగొను. "ద్వి. ఏపఱి యుండుటే యెరగొంట కాఁగ." రం. రా. యు. ౨౫౩, పు. 2. ఆఁకలితీఱు. "వ...ఎరగొని సుఖంచురాజహంసంబులు ..." మైరా. ౨, ఆ. ౭౪. స. క్రి. మ్రింగు. "క. ఉరగము నెరగొను గరుడుని, వెరపున..." ఉ. హరి. ౯, ఆ. ౨౬౧.

ఎరబిల్లపురుగు. దే. వి. క్షుద్రజలజంతు విశేషము. "సీ. నులిగుల్ల యెరబిల్లపురుగు...హంస. ౪, ఆ. ౧౫౬.

ఎరవలి. దే. వి. ఒరగలి. "క. అఱిముఱిని గుంకములపై, నెఱసంజను గ్రమ్మినట్టి యెరవలి నెగ..." య." ౯, ఆ. ౫. (రూ. ఎరవళి. చూ. ఎరవళులు వోవు.)

ఎరవళులువోవు. దే. అ. క్రి. (ఎరవళులు+పోవు.) దావానలముచే దగ్ధ మగు. "గీ. కనకభూషణజాలంబు కతన గజము, లెరవళులువోవు కొండల నెనసి యొప్పె." భార. భీష్మ. ౧, ఆ. ౫౩.

ఎరవు. దే. వి. (క. ఎరవు. త. ఇరవల్.) 1. కొంతకాలమే వాడుకొని తిరుగ నిచ్చుపద్ధతిపై నడిగి తెచ్చుకొను సొమ్ము, వస్తువు మొ. "క...ఎరవు సత మగునె...భార. ఆర. ౪, ఆ. ౩౪౭. 2. భేదము. "గీ. ఇంతకాలంబు నాతోడ నెరవు లేక, కూడియుండితివి..." వి. పు. ౨, ఆ. ౨౪౪. విశ. 1. అశాశ్వతము. "గీ...తనమేను నెరవ తనకు." భార. స్త్రీ. ౧, ఆ. ౩౩. 2. ఎరవైనది. "చ...గాండివం, బెరవుగ నిచ్చి..." భార. కర్ణ. ౩, ఆ. ౬౯. 3. అన్యము. "చ. ఎరవుగఁ జూడసాగె హరిణేక్షణ..." వసు. ౩, ఆ. ౧౦౨. 4. భిన్నము. "చ...అన్నదమ్ములును బొందిన నేరి కసాధ్య లెట్టుగా, కెరవయి నిల్చినం గెలని కెల్లిదమై పఱివోదు రెంతయున్. భార. ఉద్యో. ౨, ఆ. ౫౮. 5. విపరీతము. "మ...ఎరవై యున్నది చిత్తము..." భాగ. ౧, స్కం. ౩౩౩. 6. అసక్తుఁడు. "క. నరసా

యక నీయే లేదు, పురమున భూమికి మమత్వ బుద్ధి గలుగ కి, స్థిరమై యుండుటకుఁ గతం, బర యఁగ నెద్ది..." భార. అశ్వ. ౨,ఆ.౯౧.

ఎరవుపడు. ద్వ. అ. క్రి. (ఎరవు+పడు.) భేదము నొందు; కలహించు. "వ...మీలో మీ రెరవు పడఁదగునే..." భార. ద్రో. ౫, ఆ. ౩౭౧.

ఎరవుసేయు. దే.స. క్రి. (ఎరవు+చేయు.) అన్యథా భావించు, ఉపేక్షించు. "గీ. ఏను మీచెలి నిం తేల యెరవుసేయ." పిన. శకుం. ౨,ఆ.౭౫.

ఎరియఁబెట్టు. దే. స. క్రి. (ఎరియన్+పెట్టు.) 1. పోఁగొట్టు, నశింపఁజేయు. "వ...రఘుపుంగవుం డును దివ్య శరజ్వాలామాలికలచే రాకాసిమూఁ కలతోడన కూడం జీఁకటిబిట్టల నెరియంబెట్టఁ దొడంగిన..." రామా. ౬, ఆ. ౧౦. 2. మం డించు, కాల్చు. "గీ. హరులలాటాగ్నిలోపల నెరియఁబెట్టి." కు. సం. ౧౦, ఆ. ౧౭౦.

ఎరియించు. దే. స. క్రి. (ఎరియు. ధా. ప్రే.) బాధించు. "సీ. ఎవ్వఁడు నీచిత్త మెరియించు చున్నాఁడు..." హర. ౩, ఆ. ౪౪.

ఎరియు. దే. అ. క్రి. 1. మండు. (చూ. ఎరియఁ బెట్టు.) 2. పరితపించు. "గీ. హృదయమునఁ బాండవాంగన యెరియవలదె." భార. అర. ౫, ఆ. ౩౫౦. 3. నశించు. "తోదకవృత్తము. తమ తమతప్పులఁ దా రెరియంగా." భార. స్త్రీ. ౧, ఆ. ౭౧.

ఎరివు. దే. వి. 1. బాధ. "ద్వి. ఎరివు మాన్పింపవే యేమియు నొల్ల." బస. ౧, ఆ. ౩౮౧. పు. 2. మేషకరీషము. (ఆం. పా.)

ఎరువంటి. దే. వి. పంజెచెట్టు. (శ. ర.)

ఎరువాటు. దే. వి. ఎరువు. "సీ. సిరపుగ ప్రపుదమ్ము మరువపుఁబాదుల కెరువాటు వైచిన యింపు సొంపు. రా. వి. ౩, ఆ. ౭౧.

ఎరువు. దే. వి. (క. ఎరుబు. త. ఎరు.) 1. భూమిని సారవంతముగాఁ జేయుటకు వేయుపేడ ము న్నఁగు దోహదపదార్థము. "సీ. ఎలమిఁ గస్తురి కూదియెరువునఁ బెరిఁగిన సంపెంగ యున్న దే చంద్రవదన. విక్ర. ౫, ఆ. ౧౯. 2. అటకలి. "సీ. కస్తూరిఁ బోరపినగంధసారంబుతో నీకాయ యెరువున జీడ్డు విడిచి." హర. ౨, ఆ. ౧౦౮.

ఎరుస. దే. వి. దీనారభేదము, ఒకవిధ మగునాణెము. ఆం. భా. ద్వి. ౨౭౪.

ఎరుసు. వై. వి. (సం. ఈర్ష్యా.) అసూయ. "ఆ. సవతు లెరుసు లేక సతతంబు మెలఁగుచు, సవతు లేక యుండ్రు సమ్మదమున." రాజ.వి.౧,ఆ.౭౪.

ఎర్కు = ఎఱుకు. (కిరాతుఁడు.) "మ...అడవిం గాఁ జెర్కు చందంబునన్. హరి. పూ. ౯, ఆ. ౧౭౫.

ఎర్గు = ఎఱుఁగు. (తెలిసికొను.) "ద్వి. శాకంబు లోన గూర్చి జను లెర్గకుండ." బస. ౪, ఆ. ౧౧౫.

ఎఱ. వై. వి. (సం. అరుణః.) 1. వానపాము. "గీ. ఎఱలపెనుపట్టె నేలపైఁ గొఱలఁ జొచ్చె." విక్ర. ౪,ఆ.౨౭.2.ఎఱుపు."సీ...ఎఱనింగిఁ గడు మించె ..." హరి.పూ. ౭, ఆ. ౧౬౦. విణ. ఎఱ్ఱనిది. "ఉ...నేల యెఱనింగివిధంబున నుండె..." భార. ద్రో. ౨, ఆ. ౧౨౭.

ఎఱఁగు. దే. అ. క్రి. 1. ఉఱుకు. "క. విఱిగిన య లువులతునియలు, మెఱచుచు దివి కెగయఁ దొడఁగె మింటికి వడిఁ బొం, గెఱఁగెడు వీరుల వెనుచని, యెఱకలుగొని క్రమ్మఱింప నెగయు విధమునన్." కు. సం. ౧౧, ఆ. ౧౬౮. 2. వ్రాలు. "క. ఎఱఁగిన నప్పెను ద్రేఁగున, ధిఱుగు టయును..." భార. అను. ౧, ఆ.౨౩౭. 3. నమస్కరించు. "సీ...బ్రహ్మహితాత్ముఁ డెఱఁగి ..." భార. అను. ౪, ఆ. ౩౪౮. 4. సక్తత గను. "గీ. నెఱయ రసవంత మగుకృతి కెఱఁగ నేర, రల్పరసకృతి కెఱఁగుదురల్ప లెల్లఁ, జెఱకు విడిచినరసమున కెఱఁగి రాక, పిప్పి కరిగెడు నీఁగలపెల్లు వోలె." కు. సం. ౧, ఆ. ౩౦.

ఎఱక. దే. వి. (క. ఎఱకె.) 1. ఱెక్క. "చ...ఎఱ కలుగట్టుకొన్న మఱి యేండ్లును బూండ్లును బట్టు ..." స్వా. ౧, ఆ. ౭౩. కు. సం. ౧౧, ఆ. ౧౬౮. 2. పక్షిఱెక్క. "ఆ...వాయ సంబ..."

ఎఱకలేటి కిట్టు వెడలవిడువ. భార. కర్ణ. ౨, ఆ. ౭౨.

ఎఱగందు. ద్వ. వి. (ఎఱ+కందు.) నెత్తురుకందు, చిన్నబిడ్డ. "చ. కరుణ యొకింత లేక యెఱగం దుల దేవకి గన్న యూర్వురన్..." హరి. పూ. ౫, ఆ. ౧౦౭.

ఎఱగన్ను. ద్వ. వి. ఔ. (ఎఱ+కన్ను.) 1. ఎఱ్ఱని కన్ను. స్వా. ౬, ఆ. ౪౪. 2. శివుని మూఁడవ కన్ను. "చ. హరునెఱగంట మ్రందిన లతాంత శరున్..." వరాహ. ౧౧,ఆ.౩౭.

ఎఱగొను. ద్వ. అ. క్రి. (ఎఱ+కొను.) 1. అరుణిమ నందు. 2. బరిమీఁద నుండు. "ద్వి. ఎఱగొన్న పెనుబాము నేలఁ ద్రొక్కెఁదవు. రం.రా. ఆర. ౧౧౮౧ పు.

ఎఱగొయ్యి. ద్వ. వి. (ఎఱ+గొయ్యి.) ఎందుకును పనికిరాని తృణవిశేషము. హంస. ౫,ఆ.౪౫.

ఎఱచి. దే. వి. మాంసము. "గీ. తెవులుగొనియున్న మృగములఁ దివిరి యేయ, రెఱచి యాహారము గ మను నెఱుకులైన. భార. ఆది. ౫, ఆ. ౫౩. దశ. ౬,ఆ. ౧౧౦.

ఎఱచిదిండి. దే. వి. (ఎఱచి+తిండి.) రాక్షసుఁడు; రాక్షసి. అచ్చ. ఆర. ౧౨౧. ఇట్లే. ఎఱచిమే పరి మొ.

ఎఱచిపిడుక. దే.వి. (ఎఱచి+పిడుక.) చోరపుష్పి.♆. (శ. ర.)

ఎఱడాలు. దే. వి. బ. ధాన్యవిశేషము. (ఆం. పా.)

ఎఱబఱము. దే. వి. రోఁత. "సీ...ఎఱబఱంబు. గీ. నేయు కాయంబుతో నుంట సిగ్గుగాదె." వరావా. ౬, ఆ. ౩. విణ. రోఁత యైనది. "క. నిపుణుల చెవి కెఱబఱ మగు, నుపమలు..." కావ్యా. ౫. ఉ. ౧౩.

ఎఱబఱికము. దే. వి. 1. రోఁత. "క...సంశయించి యెఱబఱికమునన్." శశాం. ౪, ఆ. ౧౦. 2. భేదము. "చ...నీ, కెఱబఱికంబు లేక యిఁక నిచ్చట నున్న తపస్వికాంతలం,దఱు నుచితోప చారము లొనర్పఁగలారు వివేకశాలినుల్." ఉ. రా. ౬, ఆ. ౩౧౨.

ఎఱమట్టి. వై. వి. (ఎఱ+మట్టి.) జేగురుమన్ను. "సీ. ఎఱమట్టిపూఁతచే మెఱుగారుగోడల..." వైజ. ౪, ఆ. ౮౦.

ఎఱసంజె. వై. వి. (ఎఱ+సంజ.) సంధ్య. "క. అఱి ముఱిని గ్రుంకుమలపై, నెఱసంజను గ్రమ్మినట్టి యెరవలిసెగ..." య. ౫, ఆ.౮. రామా. ౫, ఆ. ౧౧౪.

ఎఱిఁగించు. దే. స. క్రి. (ఎఱుఁగు. ధా. ప్రే.) ప్రకటించు. "సీ. ఎవ్వానివిజయంబు లెఱిఁగించు శాసనస్తంభంబు లాశాంతశైలవితతు,లు..." పారి. పీఠి. ౧౨. 2. నేర్పు. "సీ. శబ్దప్రపం చంబుజాడ యెఱింగించి..." మల్హ. ౧, ఆ. ౭౫. 3. తెలుపు. జై. ౪, ఆ. ౩౪.

ఎఱుఁగు. దే. స. క్రి. 1. తెలియు, గ్రహించు. "క...ధర్మం, బెఱుఁగుచు..." భార. ఆది. ౩, ఆ. ౨౦౩. 2. నేర్చు. "క...ధను,ర్వేదము నెఱిఁగిరి..." వాసిష్ఠ. ౧, ఆ. ౮౫. 3. అనుభ వించు. "సీ...దుఃఖ మెఱుంగరు..." వి. పు. ౧, ఆ. ౫౧.

ఎఱుక. దే. వి. (ఎఱుఁగు. ధా.) 1. జ్ఞానము. "క. ఎఱుక గలవారిచరితలు, గఱచుచు..." భార. ఆది. ౩, ఆ. ౨౦౩. 2. మెలఁకువ. "ఆ. ఎల్లవారు నెఱుక లెడలి చొక్కి..." భార. విరా. ౫, ఆ. ౨౦౮. 3. గుర్తు. "క. పుర హార్మ్యవిహారిణు లగు, తరుణులవదనముల తోడఁ దడఁబడు ననిపం, కరుహాభవుఁ డెఱుక యిడెఁ గా, కరయం గందేల యుండునందు ఘటించున్," కేయూర. ౧, ఆ. ౫౩. 4. స్నే హము; పరిచయము. "గీ. ఎఱుక విడికేఁడు ధన మన్నగుఱుతుమాట, తథ్యమే కాదె..." కుచేల. ౧, ఆ. ౪౬. 5. సోదె; జోస్యము. "క...ఎఱు కుంజవరా లొక్కర్తు యెఱుకో యప్పా, యెఱు కని..." శుక. ౧, ఆ. ౯౫. "గీ. రాజునకుఁ గీడుపుట్టెడురాజ్య మడఁగు, ననుచు నెఱుక చెప్పెడుజ్యోతిషాధములను." విష్ణు.ప్రా. ౧౩౭.

ఎఱుకచేయు. దే. స. క్రి. (ఎఱుక+చేయు.) 1. తె లుపు. "ఆ...లోని కెఱుకచేసి..." భార.శాం.

౬, ఆ. ౨౬౩. 2. నిజ మనుకొను. "క...నీ, పది యెఱుకచేసికొని యలు, గుదువా..." వైజ. ౪, ఆ. ౫౯.

ఎఱుకత. దే. వి. (ఎఱుక+త.) సోదెచెప్పు స్త్రీ; ఎఱుకవాని భార్య. "క. ఎఱుకత యిట్లనియెను ..." వేం. మా. ౫, ఆ. ౯.

ఎఱుకపడు. ద్వ. అ. క్రి. (ఎఱుక+పడు.) 1. తెలియు. "ఆ. అమరవరుల కజున కైనయన్యోన్య సం, భాషణంబు లెఱుకపడఁగ వింటి." భార. ఆది. ౨, ఆ. ౧౩౫. 2. ప్రకట మగు. "క...తన చందం, బెఱుకపడంగా హజార మెలమిం గది సెఁ." శుక. ౧, ఆ. ౯౫. 3. బాధించు. "గీ. ఒనర భార్యాసమేతుఁడై యున్నవాని, కెంతలయ్యును నాపద లెఱుకపడవు." భార. అర. ౨, ఆ. ౭౩.

ఎఱుకపఱుచు. దే. స. క్రి. (ఎఱుకపడు. ధా. ప్రే.) 1. తెలుపు. "క. ఇది తెలిపిన నపుడే సం,పద వోవుం గాన నెఱుకపఱుపక యుంటిఁ." శుక. ౩, ఆ. ౨౭౦. 2. ప్రకటించు. "వ...ఇంగితం బెఱుకపఱుచుకొని..." ఆము. ౫, ఆ. ౫౫.

ఎఱుకసాని. ద్వ. వి. (ఎఱుక+సాని.) ఎఱుకత. "ఉ...ఈ యెఱుకసాని..." వీర. ౨, ఆ. ౧౭౯. ఇట్లే: ఎఱుకలసాని. వేం. మా. ౫,ఆ.౧౧.

ఎఱుకు. దే. వి. 1. కిరాతుఁడు. "గీ. ఎఱచి యాహారముగ మనునెఱుకు లైన." భార. ఆది., ౫, ఆ. ౫౩. భీమ. ౨, ఆ. ౩౫. 2. కిరాతభేదము. ఆం. భా. ద్వి. ౨౮౯.

ఎఱుకువ. దే. వి. (ఎఱుఁగు ధా.) 1. ఎఱుక, జ్ఞానము. (శ. ర.) 2. అనురాగము, మోహము. "వ...నావలన నిదియ నెఱుకువ గలిగియున్న తఱి నీ విట్లు చేసితి..." మార్క. ౨, ఆ. ౨౪౧.

ఎఱుకెత. దే. వి. (ఎఱుక+ఎత.) కిరాతి. "గీ...ఎఱుకెత యనఁ గిరాతి..." ఆం. భా. ద్వి. ౧౦౮.

ఎఱుపు. వై. వి. (సం. అరుణః.) ఎఱ్ఱన. (శ. ర.)

ఎఱ్ఱ. వై. వి. 1. వానపాము. (చూ. ఎఱ.) 2. ఎఱుపు. "చ...ఎఱ్ఱనవ్వు తనమో మనుతమ్మికి లేఁత యెండయై, చెలువము చెన్ను వింతలుగఁ జేయఁగ..." భార. అశ్వ. ,౪, ఆ. ౮. (ఎఱ్ఱనవ్వు = ఆనందాతిశయముచే ముఖ మెఱ్ఱఁబాఱునట్లు వచ్చు నవ్వు.) 3. రక్తము. ఆం. భా. ద్వి. ౧౩౨. విణ. ఎఱ్ఱనిది. "మ...ఎఱ్ఱని వింత చీకటులు వచ్చెం జూడరే..." స్వా. ౧, ఆ. ౩౮.

ఎఱ్ఱకాంచనము. ద్వ. వి. (ఎఱ్ఱ+కాంచనము.) వృక్షవిశేషము. ❦. హంస. ౪, ఆ. ౧౧.

ఎఱ్ఱగందము. ద్వ. వి. (ఎఱ్ఱ+గందము.) కుచందనము. (శ. ర.)

ఎఱ్ఱగడ్డ. ద్వ. వి. (ఎఱ్ఱ+గడ్డ.) నీరుల్లి ❦. (శ. ర.)

ఎఱ్ఱగన్నేరు. ద్వ. వి. (ఎఱ్ఱ+గన్నేరు.) చండకము❦. (శ. ర.)

ఎఱ్ఱగలిజేరు. ద్వ. వి. (ఎఱ్ఱ+గలిజేరు.) వర్షకేతువు ❦. (శ. ర.)

ఎఱ్ఱగిసె. ద్వ. వి. (ఎఱ్ఱ+అగిసె.) లాలసి ❦. (శ.ర.)

ఎఱ్ఱగురిజె. ద్వ. వి. (ఎఱ్ఱ+గురిజ.) కృష్ణల ❦. (శ.ర.)

ఎఱ్ఱగొల్ల. ద్వ. వి. (ఎఱ్ఱ+గొల్ల.) ఎఱ్ఱగా నుండు ఒకానొక గొల్లజాతి. (శ. ర.) బ. ఆ జాతివారు. (శ. ర.)

ఎఱ్ఱగోరంట. ద్వ. వి. (ఎఱ్ఱ+గోరంట.) కురవకము❦. (శ. ర.)

ఎఱ్ఱచిత్రమూలము. ద్వ. వి. (ఎఱ్ఱ+చిత్రమూలము.) ఒకానొక యోషధి. హంస. ౪, ఆ. ౧౦.

ఎఱ్ఱచీమ. ద్వ. వి. (ఎఱ్ఱ+చీమ.) రక్తపిపీలిక. ఆము. ౨, ఆ. ౭౦.

ఎఱ్ఱచేమంతి. ద్వ. వి. (ఎఱ్ఱ+చేమంతి.) రక్తసేవంతిక ❦. (శ. ర.)

ఎఱ్ఱతుమ్మ. ద్వ. వి. (ఎఱ్ఱ+తుమ్మ.) రక్తారిమేదము❦. హంస. ౪, ఆ. ౯.

ఎఱ్ఱతుమ్మి. ద్వ. వి. (ఎఱ్ఱ+తుమ్మి.) ఒకానొక కూరాకుచెట్టు. హంస. ౪, ఆ. ౧౦.

ఎఱ్ఱతుమ్మెద. ద్వ. వి. (ఎఱ్ఱ+తుమ్మెద.) గండోలిక. (శ. ర.)

ఎఱ్ఱతెగడ. ద్వ. వి. (ఎఱ్ఱ+తెగడ.) కాకనాసిక. ❦. (శ. ర.)

ఎట్టిదాసానము. ద్వ. వి. (ఎట్టి+దాసానము.) ఒక జాతిచెట్టు. హంస. ౪, ఆ. ౧౧.

ఎట్టిన. వై. వి. ఎఱుపు. (శ.ర.) విణ. ఎట్టినిది. "క. పుష్పా, నీకంబు లరయ నెట్టిన..." భా. రా. యు. ౧౬౦౦.

ఎట్టినివేలుపు. ద్వ. వి. (ఎట్టిన+వేలుపు.) 1. అగ్ని. (శ.ర.) 2. సూర్యుఁడు.

ఎట్టిపులుము. ద్వ.వి. (ఎట్టి+పులుము.) కుష్ఠభేదము. (శ. ర.)

ఎట్టిపోతమ్మ. ద్వ. వి. (ఎట్టి+పోతు+అమ్మ.) ఒకానొక గ్రామదేవత. ద్వా. 3, ఆ. ౨౧.

ఎట్టిపోల్కి. ద్వ. వి. (ఎట్టి+పోల్కి.) ఒకానొక చెట్టు. హంస. ౪, ఆ. ౧౧.

ఎట్టిప్రత్తి. ద్వ. వి. (ఎట్టి+ప్రత్తి.) రక్తకార్పాసము. ♣. (వా.)

ఎట్టిమన్ను. ద్వ. వి. (ఎట్టి+మన్ను.) ఎట్టిమట్టి. (వా.)

ఎట్టిమల్లె. ద్వ. వి. (ఎట్టి+మల్లె.) ముచుండ ♣. (శ. ర.)

ఎట్టిమీను. ద్వ. వి. (ఎట్టి+మీను.) రోహితము. (శ. ర.)

ఎట్టిమునుఁగ. ద్వ. వి. (ఎట్టి+మునుఁగ.) మధుశిగ్రువు ♣. (శ. ర.)

ఎట్టిలొద్దుగు. ద్వ. వి. (ఎట్టి+లొద్దుగు.) పట్టిక. ♣. హంస. ౪, ఆ. ౧౧.

ఎట్టివాఱు. ద్వ. అ. క్రి. (ఎట్టి+వాఱు.) 1. ఎట్టనగు. 2. కోపగించు. "సీ. ప్రతిఘటించు చిగుళ్లపై నెట్టివాఱినరీతి నున్నవి పీసి మృదుపదములు. స్వా. ౨, ఆ. 3౬. (ఇది రెండర్థములకు నుదాహరణము.)

ఎట్టాముదపుఁజెట్టు. ద్వ.వి. (ఎట్టి+ఆముదము+చెట్టు.) హస్తిపర్ణి. ♣. (శ. ర.)

ఎట్టింత. దే. వి. తుంగ. ♣. వేంక. స్థా. ౧౪.

ఎల. దే. విణ. (క. ఎళె. త. ఇళై.) 1. లేఁతది. "సీ. ఎలదీఁగ..." భార. విరా. ౨, ఆ. ౧3౯. 2. క్రొత్తది. "సీ. ఎలజవ్వనము..." భార. ఆది. 3, ఆ. ౨౭. 3. చిఱుతది. "చ...ఎలనవ్వు..." భార. శల్య. ౧, ఆ. ౧౯౬. 4. ఎడమది. "గీ... యోధు, లెలమి నెలవంక వలవంక బలిసి కొలువ." దశా. ౧, ఆ. ౧౨౭. 5. సాక్షి యైనది. "ఆ... అగ్గి యెల గాఁగఁ బెండిలి, యైన చెలిని..." అచ్చ. అయో. ౭౦. క్రి. విణ. స్వల్పముగా. "క...అతం డెల నగుచున్." జై. ౫,ఆ.౧3౨.

ఎలగోలు. దే. వి. 1. మొదటిపని. "గీ. ఆసుదక్షిణ కెమ్మోవి యమృతరసము, క్రోలుసన్నాహమున కెలగోలు గాఁగ. సుద. ౫, ఆ. ౧౫౪. 2. మొదటి యుద్ధము. "సీ...గీర్వాణచమూ సమూహములతో సేనాని యెలగోలుచేసి..." వరాహ. ౬, ఆ. ౧౧౪. 3. మొదటిప్రసారము. "గీ... మొదలి, గాలియెలగోలుచేఁ గొమ్మ కదలి..." ఆము. ౪, ఆ. ౧3౦. 4. మొదట నుండు సేన. 5. కోలాహలము. "చ...తలఁపఁ బలంపులోపల నె దర్పక కేతనపల్లవంబు లం, చలయెలగోలు... పైకొను..." పసు. ౨, ఆ. ౧౧౪. (నాలు గైదర్థములు రెండింటికి నిది యుదాహరణము.) విణ. ఘోరమయినది. "ఉ...అమరాసురసైన్యము లంత నెంతయుఁ గోపము లగ్గలింప నెలగోల్ జగడంబునఁ జేరి చేరి..." శశాం. ౫,ఆ. 2. ముందటిది. "సీ. ఎలగోలుజల్లు...ఆము. ౪, ఆ. ౯౧. క్రి. విణ. కోలాహలముగా; ఘోరున. "సీ. పుష్కలావర్తకాంభోధర వ్రాతంబు లెలగోలు వర్షించు నెన్నఁడేని." కాశీ. ౨,ఆ, ౫౧.

ఎలదోఁట. దే. వి. (ఎల+తోఁట.) ఉద్యానము. "సీ. ఏపట్టణమునకు నెలదోఁట నందనారామంబు చెలి చైత్రరథవనంబు." కాశీ. ౪, ఆ. ౧౬౨.

ఎలనాగ. దే.వి. (ఎల+నాగ.) యువతి; స్త్రీ. (సానుస్వార మని శ. ర; సూ. సి.) "క. రోగమున కోడి ప్రాణ, త్యాగము సేయుటకుఁ దొపు దలకొనుమదితో, నాగొంతమి కరఁగుచు నెల, నాగను బొడగంటి నొకవనస్థలి పొంకన్." భో. ౧, ఆ. ౧౨౭. "క. పొగలు దొడుగుక యొక యెల,నాగయుఁ దానును నభంబునం జని చని భూ, భోగంబున ముగురం గని, వేగంబున నవ

తరించి వినతుం డైనన్." షో. ౭, ఆ. ౩౫. శివలీ. ౧, ఆ. ౨౫. సాం. ని. మాన. ౭౦.

ఎలనీరు. దే. వి. (ఎల+నీరు.) లేఁత టెంకాయలోని నీరు. "సీ. ఎలనీటి బొండలాంబులువోలె..." ఆము. ౬, ఆ. ౧౨. ఇట్లే: ఎళనీరు. ఆం. భా. ద్వి ౨౮.

ఎలపొర. దే. వి. (ఎల+పొర.) లేఁజిగురు. "చ. ఎల పొర వోని మేను...నవయించియు" కు. సం. ౨, ఆ. ౪౧.

ఎలప్రాయము. మి. వి. (ఎల+ప్రాయము.) యౌవనము. "క. ఎలప్రాయ మిచ్చితిని నీ, కలషుమతీ." భార. అశ్వ. ౩, ఆ. ౨౬.

ఎలమావి. దే. వి. (ఎల+మావి.) తియ్యమామిడి. ఆం. భా. ద్వి. ౪౫. "చ. ఎలమిన పూరి మేసి నెల యేఱులనీరులు ద్రాగి మేలివెం, చల నెలమావి ఙొంపములచల్లనినీడల నిల్చి పొల్చి..." కు. సం. ౬, ఆ. ౫౦.

ఎలమి. దే. వి. 1. ఆనందము. "క. ఎలమియు నచ్చెరువును సని, నెలసి వొగలు మానసమున..." భార. విరా. ౧, ఆ. ౭౫. 2. కృప. "గీ. ఎలమి సన్నిధిసేసె సర్వేశ్వరుండు." భార. విరా. ౧, ఆ. ౧౭. 3. ప్రేమ. "సీ. ఎలమిన మ్మెలఁత నన్నెలయింప..." భార. విరా. ౭, ఆ. ౮౬. 4. వికాసము. "మ...పేరెలమిఁ బొల్పొందెం దె నంభోజముల్." భార. ఉద్యో. ౭, ఆ. ౧౧౦. 5. పెంపు. "క...రిపులయెలమిఁ గనియు నీ, మానసమున శోకింపమి..." భార. శాం. ౪, ఆ. ౪౭౩. 6. ధైర్యము. "గీ. ఇతఁడు గలయ నయ్యిరువుర కెలమి పచ్చు." భార. ద్రో. ౪, ఆ. ౧౩౧. 7. వివేకము. "గీ...మత్తుల కెలమి గలదె. దశా. ౧, అ. ౧౮౮.

ఎలమికాఁడు. దే. విశే. (ఎలమి+కాఁడు,) 1. వికాసవంతుఁడు. (శ. ర.) 2. సంతోషి. (వ్యా.)

ఎలము. దే. అ. క్రి. 1. వికసించు. "సీ. పంది కందిన నింత వఱలెడుముఖరోచు లెలమిన నెంత సల్లలిత మగునొ." కు. సం. ౨, ఆ. ౨. 2. ఒప్పు. "చ...పై, నెలమెడుపల్ల మోసులును నేర్పడు కెంపలిరాకుఙొంపమున్." కు. సం. ౬, ఆ. ౧౩౦. 3. చిగుర్చు; లేఁతయగు. "చ. ఎలమినపూరి మేసి..." కు. సం. ౬, ఆ. ౫౦.

ఎలయించు. దే. స. క్రి. (ఎలయు. ధా. ప్రే.) 1. తీసికొనిపోవు. "ఉ. చయ్యన నేఁగి యంబుజవిశాలవిలోచనఁ గాంచి...ఒక్కఁడై, నియ్యకొనంగఁజేసి యెలయించెద నిక్కడఁ దార్చి నేర్పునన్, శయ్యకుఁ దెచ్చెదం గుసుమసాయకుపూనికి నేఁడ తీర్చెదన్." భార. విరా. ౭, ఆ. ౭౪౫. 2. ప్రోత్సహించు. "సీ. కలికి రాయంచ బోదలనెల నెలయించి నడిపింప రేలొకో పడఁతులిపుడు." పారి. ౧, ఆ. ౧౦౬.

ఎలయించుకొను = ఎలయించు. (తీసికొనిపోవు.) "చ...యదువీరవరుం డెలయించుకొంచు..." వి. పు. ౮, ఆ. ౧౯.

ఎలయు. దే. అ. క్రి. 1. ఉత్సహించు. "క...కలహంబుల కెలయుట...నాకుఁ గాని పేరివి మగువా." భార. ఆర. ౫, ఆ. ౩౦౭. భార. అను. ౫, ఆ. ౬౬. 2. వశమగు. "సీ. ఇంద్రియార్థంబుల కెలసినపురుషుండు గాఢరాగంబునఁ గరఁగుచుండు." భార. ఆర. ౫, ఆ. ౮౧. 3. కలుగు. "క. అనిమిషరిపుమీఁదఁ బోరిఁ గటాక్షం బెలయన్." నిర్వ. ౨, ఆ. ౬౦. 4. ప్రవేశించు. "సీ...పూర్వదైహికము లన్నియు బుద్ధి నెలయుంవాఁడు, జాతిస్మరుం డనఁ జను..." భార. అను. ౫, ఆ. ౧౫౦. 5. మూఁగు. "సీ. ఏనికమదమున కెనయు లేఁటుల మొత్తముల..." భార. భీష్మ. ౧, ఆ. ౧౦౪.

ఎలరారు. దే. అ. క్రి. 1. కలుగు. "చ...ప్రసంగమునఁ జేటపడన్ వికసించె సీత కోమలతను లీలయద్దివిజమర్దనుఁడున్ హృదయంబునం గుతూహల మెలరార శీఘ్రగతి నయ్యెడ కేఁగె వియత్పథంబునన్." నిర్వ. ౧, ఆ. ౨౨. 2. అధికమగు. "క...క్రొవ్వెలరారంగ..." భార. భీష్మ. ౧, ఆ. ౭౩౭. 3. ప్రకాశించు. "సీ. ఎలరారు క్రొవ్విరు లెత్తులుగట్టి..." హరి. ఉ. ౪, ఆ. ౭౫౦. 4. పుష్పించు; వికసించు. "ఆ. ఎల్ల

బుతువులందు నెలరారి..." భాగ. ౧, స్క-ం. ౨౬౧.

ఎలరు. దే. వి. 1. అతిశయము. (శ. ర.) 2. వికాసము. (శ. ర.)

ఎలరుచే = ఎలర్చు. (శ. ర.)

ఎలరుపు = ఎలర్పు. (శ. ర.)

ఎలర్చు. దే. అ. క్రి. 1. అధిక మగు. "గీ. బలున కెప్పటికంటెను బల మెలర్చె." హరి. ఉ. ౧,ఆ. ౧౧౨. 2. ఆనందించు. "క. కురుజాతి యెల ర్పఁగ..." భార. ఉద్యో. ౪, ఆ. ౧౫౧. 3. ఒప్పు. "ఉ...ఎలర్చెఁ గార్తవీ, ర్యార్జున చక్రవర్తి..." వి. పు. ౬, ఆ. ౨౯3.

ఎలర్పు. దే. వి. (ఎలర్చు. ధా.) ఆధిక్యము. "ఉ... గరువంపు టెలర్పును..." భార. శాం. ౬, ఆ. ౫౭3.

ఎలిఁగించు. దే. అ. క్రి. 1. కూయు. "క. ఆపువ్వు టింటి మాటునఁ, బాపుఁబిక మొకటి చిగురు బండెఁడు దిని క్రొ, వ్వేపారఁ బ్రియముఁ జల ముం, జూపుచు నెలిఁగించెఁ గర్ణశూలము గాఁ గన్." శ్రీరాధా. ౨, ఆ. ౧౭3. 2. మొఱ పెట్టు. "వ...ఇంతకాలంబు నడపి కడపట దిగ విడుపవు వెడలఁ దిగువు మని యెలింగింపం దెలిసి ..." భాగ. ౧, స్క-ం. ౭౦౦.

ఎలిసె. దే. వి. వెలిసె, గోడకును ఇంటికప్పునకును నడుమ నుండు తెఱపిప్రదేశము. ఆం. భా. ద్వి. ౨౦.

ఎలుఁగించు. దే. అ. క్రి. కూయు. "క...పికము ప్రవాళమధ్యమున నెలుఁగించెన్." వరాహ. 3. ఆ. ౭౪. "సీ. కొక్కు-రో కో యని కోడియై యెలుఁగించి యమరనాయకుఁ డె ట్లహల్యఁ గలిసె." శివరా. ౨, ఆ. ౧౦౧.

ఎలుఁగిచ్చు. దే. స. క్రి. (ఎలుఁగు+ఇచ్చు.) పిలుచు. "గీ. తండ్రి నేమని యెలుఁగిచ్చె..." భా. రా. అయో. ౨౦౫. అ. క్రి. బదులు పలుకు. "క... అ, య్యా యని పిలిచిన నంబికి, నోయని యెలుఁ గిడె..." శివ. సా. ౧౧౭. ఇట్లే: ఎలుఁగులిచ్చు.

ఎలుఁగిడు. దే.అ.క్రి. (ఎలుఁగు+ఇడు.) మొఱుఁగు. "మ...ము, ద్రుగఁ బిల్వన్...ఎలుంగిడన్ జెవి కవల్ ఆక్కి-ంచు...దిస్స మొలవేల్పుంద త్తడుల్ మొత్తమై." రామా. ౨,ఆ. ౨౧.

ఎలుఁగు. దే. వి. 1. కంఠస్వరము. "చ...ఈరెలుం, గునఁ దమవానిఁ బిల్చుచు..." పారి. ౪, ఆ. ౨౨. 2. పిలుపు. "క...పి, ల్చినఁ బదియెలుఁ గుల కొకమరి, మునుకుచు..." భో. ౫, ఆ. ౬౬. 3. కూఁత. 4. భల్లూకము. "క...అల యుచుఁ బులుఁగుల, కులుకుచు...ఎలుఁగులఁ బులులం జూచి భయముగొని వగ వగచున్." భార. అర. ౨, ఆ. ౧౫. (మూఁడు నాలు గర్థములు రెండికి నిది యుదాహరణము.)

ఎలుఁగుగొడ్డు. దే. వి. (ఎలుఁగు+గొడ్డు.) భల్లూకము. (శ.ర.) ఇట్లే: ఎల్గుగొడ్డు. సా. ౧,ఆ.౭3.

ఎలుఁగుచేయు. దే. అ. క్రి. (ఎలుఁగు+చేయు.) ఎలిఁగించు, కూయు. "ఆ. ఎలుఁగుచేసెఁ బెద్ద పులుఁగు..." ద్వా. ౧, ఆ. ౨౧3.

ఎలుఁగుబంటు = ఎలుఁగుగొడ్డు. (శ.ర.వా.)

ఎలుఁగుసూపు. దే. అ. క్రి. (ఎలుఁగు+చూపు.) 1. పలుకు. "ఆ...అతిథి దాని నల్ల, నూరకుండు మనియె నువిదయు భూసుర, శాపభీతి నెలుఁగు సూపకుండె. భార. అను. ౧, ఆ. ౭౫. 2. హుంకరించు. "గీ. ఏచి దుర్యోధనుఁడు చేవీచి యెలుఁగు, సూపి పురికొల్పు నంతయు నేపు మిగిలి." భార. భీష్మ. ౨, ఆ. ౨౧. ఇట్లే: ఎలుఁ గులు సూపు. హరి. ఉ. ౬, ఆ. ౬౫.

ఎలుక. దే. వి. మూషికము. "చ...అతఁడు నేతి కుండపై, యెలుక..." నిర్వ. ౬, ఆ. ౨౦.

ఎలుకచెవి. ద్వ. వి. (ఎలుక+చెవి.) (క. ఇలికేలి.) ఎలుకజీడి, మూషికపర్ణి. (శ. ర.)

ఎలుకజీడి = ఎలుకచెవి. (శ. ర.)

ఎలుకమొక్క-. దే. వి. ఒకానొకచెట్టు. (శ.ర.)

ఎలువు = ఎలుఁగు. "ఆ. శతసహస్రకోటి సంఖ్యల యెలువులు, గొలుపజలదనీల ఘోరమూర్తి, జాం బవంతుఁ డతులసత్త్వుఁడై చనుదెంచె..." భార. అర. ౭, ఆ. 3౯.

ఎల్ల. దే. వి. 1. పొలిమేర. ఆం. భా. ద్వి. ౨౪. 2. మర్యాద. వేంక. మాన. ౪౩. అవ్య. (ద్రు.) సర్వశబ్దార్థకము. "మ. జను లెల్లం గడుసంభ్ర మింపఁగఁ...భార. ఆది. ౬, ఆ. ౨౮. "శా. ఎల్లన్ శిష్యులుఁ గొంచు వత్తునొ...భీమ. ౨,ఆ. ౧౨౦.

ఎల్లంకి. దే. వి. పక్షివిశేషము. "సీ. మానిపుక్కిటి గాఁడు జీనువ యెల్లంకి..." పార్వ. ౬,ఆ. ౭౭.

ఎల్లది. దే. స. (ఎల్లన్+అది.) సమస్తము. "క. సతి కిన్ బతిపనుపు సేయఁ జను నెల్లదియున్. భార. ఆను. ౧, ఆ. ౬౮. (ముద్రి. పా. "ఎల్లెడలన్" శ. ర. పా.)

ఎల్లపుడు. దే. వి. ఔ. (ఎల్లన్+అపుడు.) సర్వకాలము. ఇట్లే: ఎల్లప్పుడు, ఎల్లప్డు.

ఎల్లబోఁటి. దే. విణ. (ఎల్లన్+బోఁటి.) అందఱివంటి. "క. వీఁ డెల్లబోఁటిబాలుఁడు, గాఁడు..."హరి. పూ. ౫, ఆ. ౧౪౮.

ఎల్లమ్మ. ద్వ. వి. (ఎల్ల+అమ్మ.) ఊరిపొలిమేరయందుండునది—ఒకానొకగ్రామదేవత. (శ. ర.)

ఎల్లరు. దే. స. బ. అందఱు, ఎల్లవారు. రామా. ౨, ఆ, ౧౦౭. (దీని యేకవచనము ఎల్లవాఁడు. భార. సౌ. ౧, ఆ. ౪౫. ప్రతివాఁడు అని వాడుక.)

ఎల్లలువెట్టు. దే. అ. క్రి. (ఎల్లలు+పెట్టు.) అవధి యేర్పఱుచు. "సీ. తరుదీర్ఘతరశాఖఁ దలక్రిందు గాఁ గట్టి వరుస నెల్లలువెట్టి వైత మనుచు." దశ. ౨, ఆ. ౭౧.

ఎల్లాఁపి. దే. వి. (ఎల్ల+ఆఁపి.) ఊరి పొలిమేర నుండి దోఁచుకొనుదొంగ; దొంగ. (శ. ర.)

ఎల్లాఁపికత్తియ = ఎల్లాఁపికత్తె. (శ. ర.)

ఎల్లాఁపికత్తె. ద్వ. వి. ఊరిపొలిమేర నుండి దోఁచుకొనుస్త్రీ; దొంగతనము చేయుస్త్రీ. (శ. ర.)

ఎల్లి. దే. వి. గొడుగు. "ఉ. ఎత్తిరి టెక్కెయంబులును నెల్లులు..." కాశీ. ౬, ఆ. ౧౪౫. సాం. ని. స్థా. ౬౨. వి. ఔ. అనా. 1. ఱేపు. "గీ... కిరీటి యనికి, వచ్చు నేఁ డెల్లి యొందుఁ బో వచ్చు మీకు." భార. ఉద్యో. ౨, ఆ. ౧౩౦. 2. మరణానంతరము. "ద్వి. ఎల్లింటినరకంబు నే లెక్క సేయ. పండితా. పురా. ౧౨౦ పు.

ఎల్లిదము. దే. వి. 1. అవమానము. ఆం. భా. ప్ర. ౧౩౪. 2. పరిహాసము. "క. ఇపనెని యొఱుఁగక యుండం, దపణీసుఖ మనుభవింపఁ దలచినఁబడివే, పురకన్నులెపుటఁ బడితిని, సరివారెల్లిదము సేయ...ఉ. హరి. ౫, ఆ. ౧౯౭. విణ. 1. చులకనైనది. "ఉ...నీ, కింతభయంబు తే కడుఁగ నెల్లిద మైతివె మాటలేటికిన్. స్వా. ౨, ఆ. ౪౧. 2. గౌరవహీనము. "గీ. ఎల్లిదంబుగఁ దలఁచుచు నిట్టులనియె." భార. విరా. ౫, ఆ. ౩౧౩.

ఎల్లిదుఁడు. దే. విణ. అసమర్థుఁడు. "చ...పూని యొకటిం గడతేర్పఁ గడంగ లేక యొల్లిదు లగు వారికి..." నిర్వ. ౮, ఆ. ౭.

ఎల్లుండి. దే. వి. ఔ. అనా. ఱేపటికిఁ దరువాతి దినము. "వ. ఎల్లుండి..." దశ. ౧౨, ఆ. ౨౬. "వ...ఱేపట నెల్లి యెల్లుంట..." పిన. శకుం. ౩, ఆ. ౭౦. "ద్వి...ఎల్లుండినుండి...రం. రా. ఉ. ౧౮౦ పు. "క. ఎల్లింటినేఁటిలోపల..." విక్ర. ౭, ఆ. ౧౨౨.

ఎల్లెడ. దే. వి. (ఎల్ల+ఎడల.) అంతట, సర్వప్రదేశము. "ఉ...కడలి నెల్లెడ నిండి..." దశా. ౧, అ. ౨౮౧.

ఎవఁడు. దే. స. (ఏ+వాఁడు.) 1. యచ్ఛబ్దార్థకము. 2. కిమర్థకము. బ. అందఱు. "గీ. దొడ్డిపట్టుల నిల్వక త్రోవ నెవరి, నెదిరికొమ్ములఁ గ్రుమ్ముచు..." నీలా. ౨, ఆ. ౪౩.

ఎవత = ఎవ్వతె. (శ. ర.)

ఎవతి = ఎవ్వతె. (శ. ర.)

ఎవతుక. దే. స. ఏ. (ఎవత+ఉక. స్వార్థమున.) ఎవ్వతె. (శ. ర.)

ఎవతె = ఎవ్వతె. (శ. ర.)

ఎవయు = ఎగయు. (శ. ర.)

ఎవరిత, ఎవరితి, ఎవరితె, ఎవర్త, ఎవర్తి, ఎవర్తుక, ఎవర్తె. } = ఎవ్వతె. (శ. ర.)

ఎవి = ఎవ్వి. (ఆం. పా.)

ఎవుచు = ఎగుచు. "క...త, మ్రొదిచిన దనుజులను మనుకులేశ్వరశరముల్..." కకు. ౫, ఆ. ౩౭. నిర్వ. ౧, ఆ. ౩౯.

ఎవ్వ. దే. వి. 1. లేమి. 2. కష్టము. (ఆం. పా.)

ఎవ్వఁడు = 1. ఎవఁడు. (శ. ర.) 2. ఎంతవాఁడు. "మ...నే నెవ్వఁడ విన్నవింప..." ఉ. రా. ౬, ఆ. ౨౭౪. 3. ప్రతివ్యక్తి. "ఉ. ఎవ్వరు నట్టిపో నెరసు లెన్నక మానరు ప్రాణభర్తలన్." ఆము. ౫,ఆ.౫౬. 4. ఏయధికారముగలవాఁడు. "గీ. ఇంట నెవ్వారలును భిక్షమిడిన ముష్టి, వెట్టిన ...ఎగిరిపడి యిందులకు మీర లెవ్వ రనుచుఁ, బెద్దపులివోలె రొప్పు నాబిసరుహాక్షి." శుక. ౩, ఆ. ౩౪౯.

ఎవ్వత = ఎవ్వతె. భార. శాం. ౩, ఆ. ౧౪౪.

ఎవ్వతి, ఎవ్వతుక = ఎవ్వతె. (శ. ర.)

ఎవ్వతె. దే. స. వి. ఏస్త్రీ. స్వా. ౨, ఆ. ౩౯.

ఎవ్వరిత, ఎవ్వరితి, ఎవ్వరితె, ఎవ్వర్త, ఎవ్వర్తుక, ఎవ్వర్తె = ఎవ్వతె. (శ. ర.)

ఎవ్వల. దే. వి. (ఏ+వలను.) ఏవల, ఏవైపు. "ఉ...ముద్దులాడఁగా, నెవ్వలఁ బాటె పాటె...హరి. పూ. ౫, ఆ. ౧౯౧.

ఎవ్వాఁడు = ఎవ్వఁడు. (శ. ర.)

ఎవ్వి. దే. స. బ. (ఏ+అవి.) ఏవి, ఏయవి. (ఆం. పా.)

ఎస. దే. వి. 1. రీతి, విధము. "క...పాలు పొంగు నెస వికసిత మా, నెత్తమ్మికొలని చెలువున..." పాండు. ౪, ఆ. ౨౬౬. 2. ప్రేరణము, ప్రోత్సాహము. (చూ. ఎసకొలుపు.) క్రి. విణ. 1. మిక్కిలి. "మ...నమ్రమై, యెస సంక్రందన శాఖ డెందమున యందెక్కించు మందాక్షమున్." నైష. ౫, ఆ. ౧౫౬. 2. చక్కఁగా. "సీ. జనకుండు...ఎస మిథిలాపురి నేలుచుండి." వేం. మా. ౪, ఆ. ౧౧.

ఎసఁగించు. దే. స. క్రి. (ఎసఁగు. ధా. ప్రే.) కలుగఁజేయు. "సీ. ఇనకపసంప్రాప్తి నెసఁగించె నెవ్వాఁడు..." నసు. ౧, ఆ. ౯.

ఎసఁగు. దే. అ. క్రి. (ఈ పదము నిరనుస్వారయుక్తమని కొందఱు. కాని, కవిత్రయము వాని నిర్ధారక ప్రయోగములు కానరావు. క్రింది ప్రయోగములచే సానుస్వార మనుట యుక్తము. 1. అతిశయించు. "క...తాల్చెఁ దేజం, బెసఁగంగ విచిత్రవీర్యుఁడు..." భార. ఆది. ౪, ఆ. ౧౯౬. 2. కలుగు. "సీ...అభివృద్ధి యెసఁగుచుండె." భార. ఆది. ౫, ఆ. ౩. 3. ప్రవర్తిల్లు. "క...తనువు...చేష్ట నెసంగదు నత్సా." భార. శాం. ౬,ఆ.౩౮౩. 4. ఒప్పు. "ఉ...అర్థి నెసంగు మధూకసాలముల్." స్వా. ౩, ఆ. ౮౦. "గీ. కళుకు విడికెంపురసల చెక్కడపు మేడ, వలపటు నెసంగు శృంగార వనములోన." దశా. ౧, ఆ. ౧౦౬.

ఎసకము. దే. వి. 1. ప్రీతి. "చ. ఎసకము మీఱఁ గేళి నటియింపఁగ..." చెన్న. ౩, ఆ. ౨౪౯. 2. రీతి. "ఉ...వెండికొండపైఁ, గంధరఖండ మున్న యెసకంబున..." కాశీ. ౬, ఆ. ౧౮౫. 3. ఆధిక్యము. "గీ. చింతయెసకంబు వడిగొని చిక్కుపఱుప." భార. విరా. ౨,ఆ. ౨౯౨. 4. విజృంభణము. "క...పాంచాల, క్ష్మాపాలసుతుఁడు భీముఁడు, నేపారిరి నీదు సేనయెసకం బడఁగన్." భార. భీష్మ. ౨, ఆ.౩౭౮. విణ. 1. అధికము. "క...ఎసకపువర్షంబు..." భార.కర్ణ. ౩, ఆ. ౪౨. 2. ప్రియము; మనోహరము. "సీ. ఎందులసౌధంబు లిందిరాదేవికి నెసకంపుఁ బుట్టిన యిండు లయ్యె." దశ. ౨, ఆ. ౩.

ఎసకమెసఁగు. దే. అ. క్రి. (ఎసకము+ఎసఁగు.) 1. అతిశయించు. "గీ. ఇతఁడు పుట్టిన కొలెను నెసక మెసఁగు, దర్పమునన వర్తిల్లు..." భార. విరా. ౧, ఆ. ౩౪. 2. కలుగు. "గీ. ఏమికతమున సాధుత్వ మెసక మెసఁగు." భార. శాం. ౫, ఆ. ౫౬. 3. ఒప్పు. "ద్వి. బసవకుమారునిపాలికిఁ

బోయి, యెసకమెసఁగఁ గూఁతు నిచ్చి తా మ్రొక్కె." బస. ౧, ఆ. ౨౨ పు.

ఎసకరి. దే. వి. కిరాతభేదము. ఆం. భా. ద్వి. ౨౮౯.

ఎసకొను. దే. అ. క్రి. (ఎస+కొను.) పురిగొను. (చూ. ఎసకొలుపు.)

ఎసకొలుపు. దే. స. క్రి. ఎసకొల్పు. (శ. ర.)

ఎసకొల్పు. దే. స. క్రి. (ఎసకొను. ధా. ప్రే.) **1.** పురికొలుపు. "చ... మేలము లాడెడు సత్య బోట్ల స, న్నల నెసకొల్పుచుం గెలన నవ్విరి ధర్మజభీమఫల్గునుల్." పారి. ౫, ఆ. ౭౧. **2.** కలిగించు. "వ...పుండరీకంబుల పసకు మసమసక లెసకొల్పుమిసిమిగల భోగి భోగభాగంబునకు ..." ఆము. ౬, ఆ. ౫౭.

ఎసగొట్టు. దే. విశే. పనికిమాలినవాఁడు. (ఆం. పా.)

ఎసటిపోఁతలు. దే. వి.బ. (ఎసరు+పోఁతలు.) ఎసటఁ బోయఁదగినబియ్యము. ఆం. భా. ద్వి. ౨౫౪. కళా. ౬, ఆ. ౫౭.

ఎసపోయు. దే. స. క్రి. (ఎస+పోయు.) వినియోగించు, వ్యయించు. "... తొల్లి గలుగు ధనంబుల, బెల్లను నానావిధముల నెసపోసి..." దశ. ౧౧, ఆ. ౧౧౭.

ఎసరు. దే. అ. క్రి. ఏసరు, విజృంభించు. "క. ఈ సున నాసురపతి జం, భాసుర న ట్లెసరి రావణాసురు శీఘ్రం, బేసియు ప్రేసియు..." నిర్వ. ౬, ఆ. ౧౩౭. వి. ఔ. (క. ఎసరు.) వంటకై కాఁగఁబెట్టిననీరు. "సీ. కాఁగినయెసరుల కరణి ...భార. ఉద్యో. ౪, ఆ. ౧౧౬. ఆం. భా. ప్ర. ౧౫౩. విశే. మిగుల వేఁడిమి గలది. "క. హరి మీఁద మోహ మనుసా, గరమున మరుఁ డనెడు నెసరుగాడ్పున ధైర్యస్ఫురణ మనునోడ పగిలిన, గురుకుచ మన నసెడువర్తకుఁడు వడి మునిఁగెన్." శ్రీరాధా. ౧, ఆ. ౧౭౪.

ఎసరువెట్టు. దే. అ. క్రి. (ఎసరు+పెట్టు.) **1.** వంటకై నీరు కాఁగఁబెట్టు. "చ... నే, త నెసరువెట్టి వండుకలభోశపుఁగూడు..." పాండు. ౨, ఆ. ౭౬. **2.** కీడు మూఁడు. "సీ. అసురప్రాణంబున కెసరువెట్టినకుక్షి..." చం. రా. ౫, ఆ. ౧౬.

ఎసరేఁగు. దే. అ. క్రి. (ఎస+రేఁగు.) చెలరేఁగు, విజృంభించు; అతిశయించు. "గీ. ఎడప కెసరేఁగి నుతియించె దిచట నతని." హరిశ్చ. ౫, ఆ. ౧౪౨.

ఎసలారు. దే. అ. క్రి. (ఎసలు+ఆరు.) **1.** ఒప్పు. "క. అద్వైకకర్మంబులదెస, నెయ్యం బెసలార ..." భార. అను. 3, ఆ. ౩౦౬. **2.** అతిశయించు. (వ్యు.)

ఎసలిక. దే. వి. తీఱిక, అవకాశము. (శ. ర.)

ఎసవెట్టు. దే. స. క్రి. (ఎస+పెట్టు.) పురికొల్పు. "లయగ్రాహి...క,య్యాల కెసవెట్టుచును..." కళా. ౬, ఆ. ౨౩౧.

ఎళ్లము. దే. వి. (ఏడు+పలము.) ఏడుపలముల మానము. "గీ. ఉల్లసిలు సప్తపలినామ మెళ్ల మనఁగ." ఆం. భా. ద్వి. ౨౬౯. (శ. ర. పా. 'మెల్లము' ముద్రి.)

ఎళ్లు. దే. వి. బ. ఎడ్లుయొక్క మాఱురూపము. "సీ. బండ్ల మెట్టింపు పైబరువు లెక్కింపు మీఁదెళ్లను బూన్పు కావళ్ల నునుపు." హరి. పూ. ౬, ఆ. ౨౧. (శ. ర. పా. 'మీదళ్లను' ముద్రి.)

## ఏ

ఏ. ఉభ. ఒకానొక యక్షరము. యు. దే. అవ్య. **1.** ప్రశ్నార్థకము. "గీ...వార్చెనే సంధ్య యగ్ని, వేల్చెనే హోత్ర మొనరించెనే..." కాశీ. ౪, ఆ. ౭౬. **2.** ఆశ్చర్యప్రశంస దుఃఖపరిహాసాదులను కాక్వర్థమును దెలుపును. "క. చూచితిరే శ్రీహరిమాయా, చాతురి..." దశా. ౧, ఆ. ౨౦౧. "వ...అయ్యుధిష్ఠిరుండు పలికిన పచనంబు లింత యొప్పునే..." భాగ. ఉద్యో. ౨, ఆ. ౧౧౭. "గీ...పుట్టలఁ బడియుండి పులుఁగు మెకము, లఱవ మేల్కనుచుండిరే యక్కటకట." భార. ఉద్యో. 3, ఆ. ౧౮౩. "ఉ... భయద్రుతుఁడై వారు నవ్వఁగా ... డాఁగియుండెనే." రా. వి. ౫, ఆ. ౨౩. "మ...మామిదన్నసుతుఁ డేతన్మాత్రుఁడే చెప్పఁగాన్."

సైష. ౧, ఆ. ౨౭. **3.** ఆఁడుదానితోడి భాషణమునఁ బ్రయుక్తము. "సీ. వీఁ డటే..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౨౮౯. **4.** ప్రార్థనార్థకము లగు మధ్యమ 'ము,డు'ల కనుప్రయుక్తమగును. "శా. రావే యీశ్వర కావవే వరద ..." భాగ. ౮, స్కం. ౯౦. స. అవ్య. ఏమి యొక్క లుప్తశేషము. వై. స. (సం. యద్. ప్రా. క. త. ఏ.) **1.** యచ్ఛబ్దార్థకము. "క. ఏ కథలయందు...ఆ కథలు..." భాగ. ౮, స్కం. ౨౧. **2.** కిమర్థకము. "శా. ఏయేదేశములన్ వసించితిరి..." స్వా. ౧, ఆ. ౬౮. వై. అవ్య. (సం. ఏవ.) **1.** అవధారణార్థకము. (దీనికి 'ఏనా' 'ఏను' అను రూపములు గలవు.) "గీ... నీతోడిదే లోక మన్న." ఉ. హరి. ౪,ఆ.౩౦౦. "ఉ...పదునాల్గులోకులే,నా...ఇందు." ౧,ఆ. ౧౮౧. "చ...చం, చలసమ మేను మేను..." ముకుంద. ౧, ఆ. ౪౬ పు. **2.** తనంతట తానే. ఉదా:—నే పిలువలేదు. వాఁడే వచ్చెను. **3.** నిర్దేశమును దెలుపును. "మ. ఇతఁడే రామ నరేంద్రుఁడు..." భాగ. ౯ స్కం. ౩౨౫. **4.** అంతవాఁడు. (ఆధిక్యమును దెలుపును.) "సీ. కంకుల నొజ్జలే కాలంబు గడపంగ నూఁచ బియ్యంబు శిష్యులకుఁ గలవె." రామలిం. ౧౫.

ఏఁకట. దే. వి. **1.** మిక్కిలి యపేక్ష; అపేక్ష. "క. ఆఁకటిదూఁకట నలిఁగితి, రేఁకట వాయంగ భిక్ష లిడియెద రండీ." భీమ. ౨, ఆ. ౧౨౪. "సీ. నెలఁత చీఁకనరయిఆకలనెఱఁ దీర్చుజక్కవలు చందోయి కేఁకట యొనర్ప." భార. ఉద్యో. ౨, ఆ. ౧౧౨, స్వా. ౨, ఆ. ౭౪. **2.** బాధ. "ఉ. అన్న మొసంగఁ బాడి యగు నాఁకట నేఁకటఁ జెందువానికిన్." ధర్మ. ౪, ఆ. ౧౨౭.

ఏఁకటపడు. ద్వ. అ. క్రి. (ఏఁకట+పడు.) అపేక్షించు; వాఁచిపోవు. "వ...ఆఁకట నన్నంబున కేఁకటపడి..." వరాహ. ౧౨. ఆ. ౬౮.

ఏఁకరి = ఏకసరి. ఆం. భా. ద్వి. ౨౮౬. (శ. ర. పా. 'యేఁకరి' ముద్రి.)

ఏఁకరు. దే. అ. క్రి. **1.** ఉవ్విళ్ళూరు. "మ. లోలులం జేరెడుకడ్ల కేఁకరు దరిద్రుఁడు..." వల్ల. నీతి. ౩౬. "సీ. నీయూరుతీరున కేయేఁకరుచు నుండు రంభ ని న్నెనయ సారంభ యగునె." గాథే. ౨౩. **2.** భయపడు. "చ...ఇంచుకేని మది నేఁకర కుండఁగఁ జేసె వెన్నుఁడున్." పద్మ. ౯, ఆ. ౨౩౧. **3.** వాఁచిపోవు. "క... జలంబుల, కేఁకరి..." రుక్మాం. ౪, ఆ. ౧౩౪.

ఏఁకారు. దే. అ. క్రి. **1.** మిక్కిలి కోరు. "సీ... పాకారి యేఁకారి యిది మీకు నేల యనఁగ." కువల. ౨, ఆ. ౪౨. శుక. ౨, ఆ. ౧౬౦. **2.** సేవించు. "సీ. ఎచ్చోట క్షేత్రంబు లేఁకారుజనుల కిచ్ఛామాత్ర భోగ మోక్షప్రదములు." భీమ. ౩, ఆ. ౬౫. **3.** బాధపడు. "గీ. వెతల నేఁకారు ..." హంస. ౨, ఆ. ౧౦౪.

ఏఁగించు. దే. స. క్రి. (ఏఁగు. ధా. ప్రే.) **1.** నంపు. "ఉ...కాలుప్రోలి కేఁగించెద..." భార. ఆది. ౬, ఆ. ౨౬౪. **2.** ఉత్సవముతోఁ ద్రిప్పు. "మ...పురి యేఁగించి..." ఆము. ౪, ఆ. ౯.

ఏఁగు. దే.అ. క్రి. (క. ఏగు,త. ఏంగు.) **1.** పోవు. "క. గుము మగనాలి కేల యీ దుర్గుణముల్." భో. ౪, ఆ. ౧౪౮. "ఉ. లోఁగక వార లప్పనములో విహరించి రొకల్లొకళ్లకై, యేఁగుచు..." కళా. ౩, ఆ. ౧౫. "క. విని యతనిం దనపై నిడు, కొని యేఁగి నియమికిఁ దగిన ఘోరార్త్రి యొన, ర్చినవాఁడ మీకు..." రాఘవ. ౧, ఆ. ౨౮. **2.** కడచు; ముందుకు నడచు. "సీ... బహువత్సరాత్మకంబగుకాల మేఁగిన..." హరి. పూ. ౧, ఆ. ౫౩. "ఉ...ఒక్కఁడుగు నేఁగెడు దానికి నోర్వ..." భార. విరా. ౧, ఆ. ౧౪౮. **3.** చనిపోవు. "సీ...ఇంద్రుల మనువార లేఁగిరి ..." హంస. ౧, ఆ. ౧౯౦. **4.** ఉత్సవముతోఁ దిరుగు. "సీ. మనుచరిత్రం బందుకొనువేళఁ బుర మేఁగఁ బల్లకిఁ దనకేలఁ బట్టియెత్తె." (పెద్దన చాటువు.)

ఏఁగుడు. దే. వి. ఏఁగుట, యాత్ర. ఆం. భా. ద్వి. ౨౧౯.

ఏఁగుదెంచు. దే.అ. క్రి. (ఏఁగు+తెంచు.) **1.** వచ్చు. "సీ...ఉయ్యూర్వి జేని. ఆ. కడకు నేఁగుదెంచెఁ

గన్యలు..." భార. ఆది. 3, ఆ. ౧౮౨. కాశీ. ౬, ఆ. ౯. భీమ. ౨, ఆ. ౧౪౮. 2. పోవు. "చ...సవనాశ్వముతోఁ బురి కేఁగుదెంచి..." జై. ౨, ఆ. ౭౩.

ఏఁగుపెండ్లి. దే. వి. (ఏఁగు+పెండ్లి.) పెండ్లితుదను వధూవరుల నూరేఁగించునుత్సవము. ఆం. భా. ద్వి. ౧౭౮. వసు. 3, ఆ. ౧౦.

ఏఁజెల్ల. దే. అవ్య. (ఏను+చెల్ల.) సంతాపార్థకము. "ద్వి. ఎన్నఁడు నెుడకన్నెఱుఁగని శిశువు, గన్నుల ముత్యాలు గాఱనేడ్చెడిని, నేఁజెల్లయో యమ్మ..." ద్వి. హరిశ్చ. ఉ. ౯౨౬, పం. (శ. ర. పా. 'ఏచెల్ల' ముద్రి.)

ఏఁడాది. దే. వి. (ఏఁడు+ఆది.) పండ్రెండు మాసముల పరిమితి గలకాలము. "సీ. ఏఁడాదికుఱ్ఱఁడై యెగసి తృణావర్తు మెడఁ బట్టుకొని కూల్చి మృతునిఁజేసె." భాగ. ౧౦, స్కం. పూ. ౯౨౯.

ఏఁడి, ఏఁడీ. దే. స. (ఏఁడు+ఇ, ఈ.) ఎక్కడ నున్నాఁడు. "గీ. ఏఁడి జ్యోతిర్ముఖుఁడు నీలుఁ డేఁడి..." శతకంఠ. ౨, ఆ. ౫౫. "క...అతఁ డేఁ, డీ..." భార. ద్రో. ౧, ఆ. ౩౭౪. వి. నాఁగలి. (చూ. ఏఁడికోల.)

ఏఁడికోల. దే. వి. (ఏఁడి+కోల.) నాఁగటికొయ్య, ఈష. ఆం. భా. ద్వి. ౨౩౨. శుక. ౨, ఆ. ౪౦౮.

ఏఁడు. దే. వి. ఔ. (క. ఏఁడు.) 1. పండ్రెండు మాసముల కాలపరిమితి. "గీ. తలరి యమ్మునిఁ జెరఁ జూచి ధర్మరహితుఁ, డగుట యెవ్వరు నెఱుఁగనియట్లు గాఁగ, నేఁడుగాలంబు గడపిన నెఱిఁగి..." భార. ఉద్యో. ౧, ఆ. ౧౧౯. "వ ...ఏఁటేఁట నింద్రోత్సవంబు..." భార. ఆది. 3, ఆ. ౨౪. 2. ఆయువు. "క...యతికోమరు నేఁడు సమసెనె..." రాఘవ. ౧, ఆ. ౨౩. (ఈ యర్థమున బహువచనాంతముగా వాడుక, ఉదా:—పాపము వాని కప్పుడే యేండ్లు నిండి నవా?) స. 1. ఏపురుషుఁడు. "గీ...ఏనాజ్ఞ నింద్రియప్రతీతి నడుచు. భీమ. ౪, ఆ. ౮౩. "క...ఏరితో నే, మనువాఁడ..." శుక. ౧, ౨౦౫. 2. ప్రతివాఁడు. "మ...లత్తరుణీ శిల

తనుత్ర మేరికి నసాధ్యం బౌటఁగా కేశవా." ఆము. ౪, ఆ. ౩౦.

ఏఁడుడి. దే. వి. (ఏఁడు+ఉడి.) చనిపోయిన తరువాత సంవత్సరాంతమునఁ జేయుశ్రాద్ధము. (వా. 'ఆబ్దిక' మని శ. ర.)

ఏఁదర. దే. వి. స్వార్జితధనము. ఉదా:—వానికిఁ గొంతయేఁదర గలదు. విణ. స్వార్జితము. (శ. ర.)

ఏఁదుము. దే. వి. (ఏను+తూము.) ఐదుతూములు. ఆం. భా. ద్వి. ౨౭౦.

ఏఁబండ్రు. ద్వ. స. బ. (ఏను+పదుండ్రు.) ఏఁబదికి మహన్మహాత్మ్యర్థకరూపము, ఏఁబదిమంది. "సీ. పక్షుండు...ఏఁబండ్రసుతులఁ, బడసి..." కు. సం. ౧, ఆ. ౭౪.

ఏఁబది. ద్వ. స. ఔ. అసా. (ఏను+పది.) ఐదుపదులు. "గీ. స్కాందమునయందు నేఁబది ఖండములకు." కాశీ. ౧, ఆ. ౭౯.

ఏఁబలము. ద్వ. వి. (ఏను+పలము.) ఐదుపలములు. (ప్రస్తుత మీపదము ఏఁబుల మనియు పదిపలము లనియు వాడుకలో నున్నది.) ఆం. భా. ద్వి. ౨౬౯.

ఏకకుండలుఁడు. సం. వి. అ. పుం. 1. కుబేరుఁడు. 2. బలరాముఁడు. 3. ఆదిశేషుఁడు.

ఏకకుఁడు. సం. విణ. (అ. కికా. అ.) అసహాయుఁడు, ఒంటరి.

ఏకగురువు. సం. వి. ఉ. పుం. సమానగురువు కలవాఁడు, సతీర్థ్యుఁడు.

ఏకగ్రామము. సం. వి. అ. పుం. ఒకేయూరు, అభిన్నగ్రామము.

ఏకగ్రామీయుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఒకేయూరువాఁడు.

ఏకచక్ర. సం. వి. ఆ. స్త్రీ. ఏకచక్రము. "సీ... రక్షించె నేకచక్రాపురంబు..." భార. విరా. ౧, ఆ. ౭౪.

ఏకచక్రము. సం. వి. అ. న. భీముఁడు బకాసురునిఁ జంపినపురము. "సీ. కడుఁగ్రొవ్వి రేకచక్రంబున వారలు..." భార. ఆది. ౬, ఆ. ౨౯౫. పుం.

సూర్యరథము. విశే. (అ.ఆ.అ.) 1. ఒంటిచక్రము గలది; సర్వాధిపత్యము గలది.

ఏకచరము. సం. వి. అ. పుం. 1. ఖడ్గమృగము. 2. అడవిపంది. విశే. (అ. ఈ. అ.) 1. అసహాయము. 2. ఒక్కచారుఁడు గలది.

ఏకచారి. సం. విశే. (న్. నీ. న్.) 1. ఒంటరిగాఁ దిరుగునది. 2. ఒంటరిగాఁ దిరుగువాఁడు. "వ... మాండవ్యుఁ డనుబ్రహ్మర్షి తొల్లి మహీవలయంబునం గలతీర్థంబు లెల్ల నేకచారి యయి సేవించి ..." భార. అర. ౪, ఆ. ౨౬౨.

ఏకచ్ఛత్రము. సం. విశే. (అ. ఆ. అ.) ఒకేఛత్రము గలది ; ఒకేరాజు ఏలుబడిలో నున్నది ; "శా. శ్రీకంఠుండు త్రిలింగ భూవలయముల్... ఏకచ్ఛత్రముగా సమస్త భువనాధీశుఁడు పాలింప..." భీమ. ౫, ఆ. ౯౨.

ఏకజన్ముఁడు. సం. వి. న్. పుం. 1. రాజు. 2. శూద్రుఁడు. (వ్యతి. ద్విజన్ముఁడు.)

ఏకటస్సా. మి. గ్రా. ఏకటాకీ. (వా.)

ఏకటాకీ. మి. గ్రా. ఒకేమాదిరి. (వా.)

ఏకతమాడు. ద్వ. అ. క్రి. (ఏకతము+ఆడు.) రహస్యముగా మాటలాడు. "ఉ. కూరిమి మంత్రితోడ నలకూబరుఁ డేకతమాడి..." స్వా. ౫, ఆ. ౧౬.

ఏకతము. వై. వి. (సం. ఏకాంతమ్.) 1. నిర్జనప్రదేశము. "సీ. ఏకతంబున వసియించి యెప్పుడుఁ గండ్రు యోగీశ్వరేశ్వరుల్ యోగదృష్టి." హర. ౪, ఆ. ౬౩. 2. ఆలోచన. (శ. ర.) విశే. 1. ఒంటరిగా నున్నది. "సీ...ఏకతంపు, గుడిమ్రాని పొంతను..." భార. శాం. ౫, ఆ. ౩౯౩. 2. రహస్యముగా నున్నది. "క. స్త్రీయును బురుషుఁడు నేకత, మై యున్నెడ..." మార్క. ౧, ఆ. ౩౨. క్రి. విశే. 1. రహస్యముగా, "ఆ. తాను నతఁడు నేకతమ యుండి వాని కం, త యును జెప్పఁ దొడఁగె ధర్మవిదుఁడు. భార. ఆది. ౭, ఆ. ౨౫౪. 2. ఒంటరిగా. "క...

హయరత్నము...ఏకతమ యుచ్చైః శ్రవమ్మరు చున్నన్." భార. ఆది. ౨, ఆ. ౨౬.

ఏకతరము. సం. విశే. (అ. ఆ. అ.) రెండిటిలో నొక్కటి.

ఏకతానకుఁడు. సం. = ఏకతానుఁడు.

ఏకతానుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఒకేవిషయమున నాసక్తి గలవాఁడు, ఏకాగ్రచిత్తుఁడు.

ఏకతాళము. సం. వి. అ. పుం. 1. ఒకానొకతాళము ♣. 2. గీతవాద్యలయ సామ్యము.

ఏకదండి. సం. వి. న్. పుం. హంసుఁడు. (సన్న్యాసులు కుటీచకుఁడు, బహూదకుఁడు, హంసుఁడు, పరమహంసుఁడు నని నాలుగువిధములు. మొదటి రెండు తెగలవారు మూఁడుదండములను, హంసుఁ డొక దండమును ధరింతురు. పరమహంసునకు దండధారణము లేదు.)

ఏకదంతుఁడు. సం. వి. అ. పుం. వినాయకుఁడు. విశే. (అ. ఆ. అ.) ఒకదంతము గలవాఁడు. ఇట్లే: ఏకదంష్ట్రుఁడు.

ఏకదృక్కు. సం. వి. శ్. పుం. 1. శివుఁడు, 2. శుక్రాచార్యుఁడు. 2. కాకి. విశే. (శ్.) సర్వము బ్రహ్మమయ మగునొక్కటిగాఁ జూచువాఁడు, బ్రహ్మజ్ఞాని. 2. ఒకకన్ను గలవాఁడు, కాణుఁడు.

ఏకదృష్టి. సం. వి. ఇ. పుం. = ఏకదృక్కు. విశే. (ఇ.) = ఏకదృక్కు.

ఏకదేశము. సం. వి. అ. పుం. 1. ఒకచోటు. 2. అంశము.

ఏకధురము. సం. విశే. (అ. ఆ. అ.) ఒక్కబరువు మోయునది. (ఎద్దు మొ.) ఇట్లే: ఏకధురావహము, ఏకధురీణము.

ఏకన. దే. వి. అంచు. (శ. ర.)

ఏకపత్ని. సం. వి. ఈ. స్త్రీ. 1. పతివ్రత. 2. సవతి లేని స్త్రీ. 3. సవతి.

ఏకపత్నీకుఁడు. సం. వి. అ. పుం. ఏకపత్నీవ్రతుఁడు.

ఏకపత్నీవ్రతము. సం. వి. అ. న. 1. ఒక్కభార్యతోనే ఉండుటయను వ్రతము. 2. ఒక్క భర్త

తోనే ఉండుట యను వ్రతము. ("తామేకపత్నీ వ్రతదుఃఖశీలాం" సం. కు. సం. 3, స. 2, శ్లో.)

ఏకపది. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒక్కఁడు మాత్రము నడువఁ దగినత్రోవ, మార్గము. 2. ఒక్కపాతము గల బుక్కు.

ఏకపాటల. సం. వి. ఆ. స్త్రీ. పార్వతి.

ఏకపింగళుఁడు. సం. వి. అ. పుం. (పార్వతి శాపము వలన నెడమకన్ను పింగళవర్ణము కలిగిన) కుబేరుఁడు. ఇట్లే: ఏకపింగుఁడు.

ఏకమాత్ర. సం. వి. ఆ. స్త్రీ. ఒక్కత్రుటికాలము. "మత్త. ఏకమాత్రన ఫోరిల్లె వధించుచు..." భార. ఆర. 3, ఆ. 3౧౨.

ఏకము. సం. విశ. (అ. ఆ. అ.) 1. ఒకటి. 2. ముఖ్యము. 3. అన్యము. 4. సమానము. ఉదా:— ఏకోదరులు. 5. సత్యము. 6. అల్పము. 7. అసమానము. 8. ఒక్కొక్కటి. "క. చెలువలైనఁ జూడఁ బయ్యెద, దొలఁగుటకును సిగ్గువడు వధూజనతతి య, త్తలయెదురఁ నేకవస్త్రం, బులతో నంగములు వికృతిఁ బొందఁగ నడచెన్." భార. స్త్రీ. ౧,ఆ. ౯౯. ("ఏకవస్త్రధరా..." అని మూలము.)

ఏకయష్టి. సం. వి. ఇ. స్త్రీ. ఏకావళి, ఒక్కపేట గలహారము.

ఏకయష్టిక. సం. వి. ఆ. స్త్రీ. = ఏకయష్టి.

ఏకరంగి. మి.వి. ఒక్కరంగు గలమొకమాలు. "సీ... ఏకరంగికబాయి యింపు గులుక." దశా.౧,అ.౪౨.

ఏకరువు. మి. వి. (ఏక+రువ్వు.) ఒక్కవల్లె. "గీ. ఎల్ల పన్నంబు లేకరు విడి..." రా. వి. ౨, ఆ. ౧౬.

ఏకలము. ఉభ. దే. వి. (క. ఎక్కల.) అడవిపంది. ఆం. భా. ద్వి. ౧౨. శుక. ౧, ఆ. ౨౪౬. సం. వి. అ. పుం. అడవిపంది. రాఘవ. పీఠి, 3౯. విశ. (అ. ఆ. అ.) అసహాయము.

ఏకలీఁడు = ఏకలము. హ. స. ౨, ఆ. ౨౪.

ఏకవచనము. సం. వి. అ. న. ఏకత్వమును దెలుపు వ్యాకరణ ప్రత్యయము.

ఏకవీరము. సం. వి. అ. పుం. జొంక.

ఏకవీరుఁడు. సం. వి. అ. పుం. 1. కర్ణుఁడు. 2. రాముఁడు. 3. అర్జునుఁడు. 4. ఒకవీరుఁడు.

ఏకసర. దే. వి. మల్లబంధవిశేషము. "వ...ఏకసర వైసర..." ప్రబంధ. ౭౮.

ఏకసర్గము. సం. వి. అ. పుం. 1. ఏకాగ్రచిత్తము. 2. ఏకదృష్టి. విశ. (అ. ఆ. అ.) ఏకాగ్రచిత్తము గలది.

ఏకహాయని. సం. వి. ఈ. స్త్రీ. ఒకసంవత్సరము వయసు గలగోవత్సము.

ఏకాంగి. సం. వి. న్. పుం. సన్న్యాసి; భగవద్భక్తుఁడు. "క. కేవల నేకాంగులు రా..." ఆము. ౨, ఆ. ౯౬.

ఏకాండము. వై. విశ. (సం. అఖండం.) అఖండము. "గీ. మలిచి యేకాండముగ నొక్క మానికమున, వేడ్క నెద్దాని నిర్మించె విశ్వకర్మ." నైష. ౬, ఆ. ౯౪.

ఏకాంతము. సం. వి. అ. పుం. 1. రహస్యపుఁజోటు. 2. రహస్యము. 3. ఆధిక్యము. 4. అవయవము. విశ. (అ. ఆ. అ.) 1. రహస్యమైనది. 2. ఏకాగ్రము. 3. అధికము. 4. తూర్పు లేనిది. క్రి.విశ. 1. అవశ్యము. 2. అత్యంతము. 3. రహస్యముగా. 4. ఒంటరిగా.

ఏకాకి. సం. విశ. (న్. సీ. న్.) ఒంటరి.

ఏకాక్షము. సం.వి.అ.పుం.కాకి. విశ. 1. (అ.ఆ.అ.) ఒకయిరుసు గలది. 2. (అ.ఈ.అ.) ఒకకన్ను గలది.

ఏకాగ్రము. సం. విశ. (అ. ఆ. అ.) 1. ఏకాగ్రచిత్తము గలది. (మనుష్యాది.) 2. ఏకవిషయలగ్నము. (చిత్తము.)

ఏకాతపత్రము. సం. = ఏకచ్ఛత్రము.

ఏకాదశి. సం. వి. ఈ. స్త్రీ. 1. పక్షమున దశమి తరువాతితిథి. 2. పదునొకండుతంత్రులు గల వీణ.

ఏకావళి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. ఒకానొక యర్థాలంకారము. 2. ఒంటిపేట హారము.

ఏకాహము. సం. వి. అ. పుం. **1.** ఒకదినము. **2.** చనిపోయినవానికి పదునొకండవదినమున చేయు శ్రాద్ధము. **3.** ఏకదినోత్సవము.

ఏకీభవించు. సం. అ. క్రి. ఒక్కటి యగు, కలిసిపోవు. "సీ. పాయసాపూపసూపపదార్థనివహంబు లేకీభవించిన నేర్పరించి." కాశీ. ౭, ఆ. ౧౭౮; ౬, ఆ. ౧౩౮.

ఏకు. దే. స. క్రి. (దూది మొ.) విడిపోవునట్లు యంత్రముతో కొట్టు. ఉదా:—దూది యేకిరి. **2.** దూ దేకినట్లు విడఁగొట్టు. "క. కండలు తన వింట నేకి కాకుల కిచ్చెన్." కళా. ౫, ఆ. ౭౬. **3.** దోషములు ప్రకటించు. (వా.) వి. తూలకణిక. ఆం. భా. ద్వి. ౫౯౮.

ఏకుడు. దే. వి. (ఏకు ధా.) దూది యేకుట. ఆం. భా. ద్వి. ౫౯౮.

ఏకుదోఁక. దే. వి. (ఏకు+తోఁక.) ఏకువంటితోఁక గల ఒకానొకపక్షి. "సీ. ఏకుదోఁక చెమరుఁగాకి ...అనెడిపక్షులు..." పార్వ. ౬, ఆ. ౭౭.

ఏకులనారిగాఁడు = ఏకుదోఁక. "సీ...కోడి కారుకో డేకులనారిగాఁడు..." హంస. 3, ఆ. ౧౨.

ఏకె. ద్వ. స. ఏ. (ఏ+అక.) ఏమె. (శ. ర.)

ఏకైకము. సం. విశ. (అ. ఆ. అ.) **1.** ఒక్కొక్కటి. **2.** తదేకము.

ఏకోత్సవము. సం. విశ. (అ. ఆ. అ.) మహోత్సవభరితము. "క. ఏకోత్సవంబు లయ్యెఁ ద్రిలోకంబులు..." భార. అర. ౭, ఆ. ౧౫౩.

ఏకోదరుఁడు. సం. విశ. (అ. ఆ, ఈ. అ.) ఒకతల్లి కడుపునఁ బుట్టినవాఁడు, సోదరుఁడు.

ఏకోనము. సం. విశ. (అ.ఆ.అ.) ఒకటి తక్కువ యైనది. ఉదా:—(ఏకోనవింశతి = పందొమ్మిది.)

ఏకోను. దే. వి. (క. ఏకోను.) సమష్టి, మొత్తము. (శ. ర.)

ఏగాని. దే. వి. కానిలో సగమువిలువ గల రాగినాణెము. (శ. ర. వా.)

ఏగుడు. దే. విశ. (క. ఏగులు.) అసహ్యము. "ఆ. ఏగు డైనపెదవి తేగు డమృత మంచుఁ, గవులు వొగడఁ బేరు గలిగెఁ గాక." ద్వా. ౧, ఆ. ౬౯.

ఏగురు = ఏవురు. "క. ఏగురుపురుషులఁ గోరిన, యా గొంతియు ద్రౌపదియు మహాపుణ్యవతుల్, వేగురు బంధులఁజంపిన, యేగురుపాండవులు ధన్యు లీశ్వర కరుణన్." ద్వా. 3, ఆ. ౭. "క. గురువచనస్థితి మనకే, గురకును నిది సన్నిగాఁ దగుం గావున ..." భార. ఆది. ౭, ఆ. ౨౧౫. రామా. కిష్కి. ౨౪.

ఏగుస. ద్వ. వి. (ఏను+కుంచములు.) ఐదుకుంచముల మానము. ఆం. భా. ద్వి. ౨౭౧.

ఏచే. దే. విశ. **1.** వక్రము. (చూ. ఏచకంకటి చుక్క.) **2.** వికృతము. య. ౧, ఆ. ౧౦౨.

ఏచేకంకటిచుక్క. ద్వ. వి. (ఏచ+కంకటి+చుక్క.) వంకరమంచమువలె నుండుచుక్క, ఉత్తరాషాఢా నక్షత్రము. (శ.ర.)

ఏచు. దే. అ. క్రి. (ఈ పదము సకర్మక మైనపుడు సానుస్వార మని శ. ర., సూ. ని. కాని, ఏపరించు, ఏపులను బట్టి నిర్ధారకముగా నిదియు నిరనుస్వారమే.) **1.** అధిక మగు. "క. ఏచినబలములతో..." భా. రా. యు. ౧౪౩౮. **2.** పెరుగు. "మాలిని. ఏచి తనర్చి తలిర్చినక్రోవుల ..." భార. ఆది. ౪, ఆ. ౨౦. **3.** చెలరేఁగు. "క. చూచుచు నుండఁగ నద్దెస, రేచి భుజాబలము మెఱయ..." భార. విరా. ౫, ఆ. ౧౭౯. "క...మీ రేఁచి జగంబులు నొవ్వ రణము సేయఁగ నేలా." భార. ఉద్యో. ౧, ఆ. ౧౩౩. **4.** పొడచూపు. "క. ఆ చెలికి గర్భ చిహ్నము, లేచిన..." భాగ. 3, స్కం. ౪౭౬. స. క్రి. బాధించు. "చ...మరుసాయకముల్ దమ చిత్తవృత్తు లేఁచిన..." భార. విరా. ౨, ఆ. ౩౩౪.

ఏజనము. సం. వి. అ. న. **1.** చలనము. **2.** చలింపఁ జేయుట. **3.** ప్రకాశము. **4.** ప్రకాశింపఁ జేయుట.

ఏజితము. సం. విశ. (అ. ఆ. అ.) **1.** చలించినది. **2.** చలింపఁజేయఁబడినది. **3.** ప్రకాశించినది. **4.** ప్రకాశింపఁజేయఁబడినది.

ఏట. య. వై. వి. (సం. ఏడకః.) మేషము. "ద్వి. కాటకోటండు నాఁ గలఁ డొక్కఁగొల్ల, యేట పెంట్రిక తన కీశ్వరుఁ డనుచు." బస. ౨, ఆ. ౪౧౭. పం. దే. వి. పక్షము. (శ. ర.)

ఏటము. దే. వి. ప్రక్క. (చూ. ఏటవాలు.) విశ. 1. ముఖ్యము. "క...నృపతిధర్మం, బేటముగాఁ బాడి నిర్ణయింపఁగ వలయున్." విజ్ఞా. వ్యవ. ౨౭. 2. అధికము. "ద్వి. ఏటంపుసంపద లెం దేఁగె నింక. బస. ౪, ఆ. 3౫౧. పం.

ఏటలవి. దే. వి. ఏటున కందుదూరము. "క. ఆటోప మడఁగి యచ్చటి, మేటిమగలు ఱిచ్చవడిరి మెయిగలిఁ గర్ణుం, డేటలవికిఁ గవిసె ధను, ర్జ్యాటంకృతి సెలఁగఁ బాండవాగ్రజుఁ బెలుచన్." భార. కర్ణ. ౨, ఆ. ౧౮౬. "మ. హరిణం బొక్కటి కుక్కతండముఁ బుళిందానీకముం ద్రోచి యుఱ్వరఁ గాలూఁదక దాఁట నేట లవికిన్ వాహంబు నడ్డంబు నూకి..." స్వా. ౪, ఆ. ౪౪.

ఏటవాలు. దే. వి. (ఏటము+వాలు.) 1. వంపు. 2. పక్షపాతము. (శ. ర.) విశ. ఒఱిగినది. "రగడ. ఏట వాలైనయది యూ యరఁటి బాలెంత. స్వా. 3, ఆ. ౭౪. క్రి. విశ. వంపుగా. "సీ. ఎలగోలు జల్లు మున్ పెళపెళ నేటవాల్ పడి..." ఆము. ౪, ఆ. ౯౧.

ఏటిక. దే. వి. 1. వానపాము. "సీ...ఏటికల్ దిని వైచు నేకలంబు. కళ. ౧, ఆ. ౧౫౨. 2. కడుపులోఁ బుట్టి పామువలె నుండు పురుగు. (శ.ర.)

ఏటికోళ్లు. దే. వి. బ. నమస్కారములు. "వ...దైవంబుల కేటికోళ్లు..." భార. ద్రో. ౨, ఆ. 3౪౭. భీమ. ౨, ఆ. ౫౦.

ఏటిరింత = ఏట్రింత. "సీ...ఏటిరింతయు దాఁటె నెడమ దెసకు." ద్వా. ౧, ఆ. ౨3౧.

ఏటితేఁడు. దే. వి. (ఏఱు+తేఁడు.) సముద్రుఁడు. య. 3, ఆ. ౨౭.

ఏటు. దే. వి. బాణపుదెబ్బ; బాణప్రయోగము. "క. ఏటున వాటున ప్రేటునఁ, బోటున దశముఖుఁడు రౌద్రముగ నఱుముటయున్. నిర్వ. ౪, ఆ. ౪౭.

ఏటుకాఁడు. దే. విశ. (ఏటు+కాఁడు.) విలుకాఁడు. భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౫౬.

ఏటుపోటుకలు. ద్వ. వి. (ఏటు+పోటు+తలము.) యుద్ధరంగము. "ఆ...ఇవి, యేల గిత్తమాట లేటుపోటుకలను వచ్చి..." భార. కర్ణ. 3, ఆ. ౧౯౭.

ఏటులాడు. దే. అ. క్రి. (ఏటులు+ఆడు.) బాణప్రయోగములతోఁ బోరు; పోరు. "ఆ. ఏటులాడి యాడి యేత్తెఱఁ గవిసి గ, దాప్రవీణ బాహుదండుఁ డయిన, ధనవిభుండు ప్రేసె దశముఖశిరములు..." నిర్వ. ౪, ఆ. ౭౨. రామా. ౮, ఆ. ౨౨౨. ఇట్లే: ఏట్లాడు. య. ౧, ఆ. ౧౧౬. భార. విరా. ౫, ఆ. ౧33.

ఏట్రింత. దే. వి. భారద్వాజపక్షి. ఆం. భా. ద్వి. ౯౧. య. ౨, ఆ. ౨౪.

ఏడ. దే. వి. ఏ. (ఏ+కడ.) ఎక్కడ. భార. ఆర. ౨, ఆ. ౪౭. "సీ. ఏడఁ బోయెనొకదా మేడలో మంజిష్ఠి..." కాశీ. ౪, ఆ. ౧౦౮.

ఏడక. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుగొఱ్ఱె. ఇట్లే: ఏళక.

ఏడకము. సం. వి. అ. పుం. 1. మేషము. 2. అడవిమేఁక. ఇట్లే: ఏళకము.

ఏడగజము. సం. వి. అ. పుం. తగిరిస. ⚘.

ఏడది. దే. విశ. (ఏ+కడది.) ఎక్కడిది. "ఉ. పాపము గీప మేడది..." సానందో. ౨, ఆ. 33.

ఏడము. సం. వి. అ. పుం. గొఱ్ఱె. ఇట్లే: ఏళము.

ఏడమూకుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) 1. శ్రవణశక్తి గాని మాటాడుశక్తి గాని లేనివాఁడు. 2. మోసగాఁడు.

ఏడాకుమొలకలు. దే. వి. బ. ధాన్యవిశేషము. ప్రబంధ. ౧౧౨.

ఏడాకులనఁటి. దే. వి. (ఏడు+ఆకులు+అనఁటి.) సప్తపర్ణము. ⚘. శుక. ౧, ఆ. ౨౨౨. ఇట్లే: ఏడాకులరఁటి. స్వా. 3, ఆ. ౭౪.

ఏడాకులపొన్న. ద్వ. వి. (ఏడు+ఆకులు+పొన్న.) సప్తచ్ఛదము. ⚘. కాశీ. 3, ఆ. ౨౭.

ఏడాగోడము. దే. విశే. విరుద్ధము. (శ.ర.)

ఏడాటలాడించు. దే. స. క్రి. (ఏడు+ఆటలు+ఆడించు.) మిక్కిలిశ్రమపెట్టు. (శ.ర.)

ఏడి. ఉభ. వై. వి. (సం. ఏడకః.) మేషము, గొఱ్ఱె. "గీ. ఏడికదుపులు..." ప్రబంధ. ౧౩౫. సం. వి. ఈ. స్త్రీ. ఏడక. ఇట్లే: ఏళి.

ఏడిక = ఏడి. భార. ద్రో. ౨, ఆ. ౨౧౦. రామా. ౨, ఆ. ౧౬.

ఏడికవజీరు. ద్వ. వి. (ఏడిక+వజీరు.) మేషవాహనుఁడు, అగ్ని. ఆం. పదా. సుర. ౩౦.

ఏడిపించు. దే. స. క్రి. (ఏడుచు. ధా. ప్రే.) 1. రోదనము చేయించు. "గీ. మును శిశువు నేడిపింపక ముద్దు రాదు." సిం. నార. ౩౧. 2. బాధించు. (వా.) ఇట్లే: ఏడ్పించు. శివరా. ౨, ఆ. ౧౦౯.

ఏడు. దే. స. (క. ఏఱు.) ఆఱునొకటి. కాశీ. ౩, ఆ. ౧౨౬.

ఏడుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) చెవిటివాఁడు.

ఏడుకొండలరాయఁడు. ద్వ. వి. (ఏడు+కొండలు+రాయఁడు.) తిరుపతి వేంకటేశ్వరుఁడు. "గీ. అలికచకుచంబు లంటంగఁగలిగెనేని, ఏడుకొండలరాయని కేనుభక్తిఁ, గనకశిఖరము లెత్తింతు..." అహ. ౨, ఆ. ౧౪.

ఏడుకొండలు. ద్వ. వి. బ. (ఏడు+కొండలు.) 1. సప్తకుల పర్వతములు. "సీ. నేల గ్రక్కునఁ గ్రుంగ నిల్వరాదేరికిఁ దెగి యేడుకొండలుఁ దినకరుండు." య. ౩, ఆ. ౩౪. 2. తిరుపతి యందలి సప్తపర్వతములు. (చూ. ఏడుకొండలరాయఁడు.)

ఏడుగడ. దే. విశే. 1. నియంత. ఆం. భా. తృ. ౨౨. 2. రక్షకుఁడు. "క...మన కేడుగడ కమలకమనుఁడ..." పరమ. ౧, ఆ ౯౧. ఇట్లే: ఏడ్గడ. కాశీ. ౩, ఆ. ౨౦౫.

ఏడుగడయు. దే. అవ్య. ద్వ. (ఏడుగడ+యు.) సమస్తము. "ఆ. సతుల కేడుగడయుఁ బతుల చూవె." భార. ఆది. ౪, ఆ. ౬౫. కాశీ. ౧, ఆ, ౨. ఇట్లే: ఏడ్గడయు. హరిశ్చ. ౩, ఆ. ౩౬౪.

ఏడుగురు. దే. స. ఏడునకు మహన్మహత్వార్థకరూపము, ఏడుమంది. ఉ. రా. ౧, ఆ. ౮౯౭. ఇట్లే: ఏడ్గురు. కుచేల. ౧, ఆ. ౩౧.

ఏడుగుఱ్ఱాలజోదు. ద్వ. వి. (ఏడు+గుఱ్ఱాలు+జోదు.) సప్తాశ్వుఁడు, సూర్యుఁడు. సమీర. ౨, ఆ. ౨౧౯.

ఏడుచు. దే. అ. క్రి. రోదనము చేయు. (చూ. ఏడిపించు.) ఇట్లే: ఏడ్చు. "సీ...ఇది మీకు సంతోషకాలమే యేడ్తురుగా కార్వ నేల చెప్పుఁడ." భార. ద్రో. ౨, ఆ. ౨౫౪.

ఏడునూఱు. దే. స. (ఏడు+నూఱు.) ఏడువందలు. ద్వి. పరమ. ౯,ఆ.౬౯౨. పు. ఇట్లే: ఏడ్నూఱు. (చూ. ఏడ్నూఱు.)

ఏడుపు. దే. వి. (ఏడుచు. ధా.) రోదనము. భార. ఉద్యో. ౧, ఆ. ౩౪౭. ఇట్లే: ఏడ్పు. ఉ. రా. ౬, ఆ. ౨౭౬.

ఏడుమ్రొక్కులు. దే. వి. బ. (ఏడు+మ్రొక్కులు) అనేకనమస్కారములు. "ఆ. అనఘ యేడుమ్రొక్కులాబృహస్పతికి మ్రొక్కెద..." భార. అశ్వ. ౧, ఆ. ౭౫.

ఏడువురు. దే. స. ఏడుగురు. "గీ. గగనమును లేదు వుర..." హర. ౪, ఆ. ౪౧. ఇట్లే. ఏడ్వురు. భార. ఆది. ౪, ఆ. ౯౧.

ఏడ్చుకొను. దే. అ. క్రి. (ఏడ్చు+కొను. స్వార్థము న.) "ద్వి. తననాథుఁ బేరొక్కని తానేడ్చుకొనుచు." ద్వి. నల. ౪, ఆ. ౨౩౧. పు.

ఏడ్తెఱ. దే. వి. 1. పెంపు, అతిశయము. "ఉ. ఇమ్మహనీయరూపమున యేడ్తెఱఁ గన్గొని..." భార. విరా. ౧, ఆ. ౨౨౬. 2. విజృంభణము; ఎదిరింపు. "చ...ఏ, డ్తెఱ గలయష్ట శత్రు నవధీరితు జేయుట యొప్పు..." భార. శల్య. ౨, ఆ. ౪౯౭. 3. శక్తి, సామర్థ్యము. "ఉ... పెం, పెక్కినపాండునందనుల యేడ్తెఱఁ దొల్లియుఁ దారెఱుంగరే." భార. ఉద్యో. ౪, ఆ. ౪౫. 4. త్వర, వేగము. "క... మీరలు నేడ్తెఱఁ జని యందుండుఁడు..." నిర్వ. ౨, ఆ. ౯౦. 5. ప్ర

కాశము, కాంతి. "ఉ... నేల కెంపెక్కుచు వచ్చె దీవియలయేడ్డెఱ సోయఁగ మంచె..." భార. విరా. ౨, ఆ. ౩౧౯.

ఏడ్డుము. ద్వ. వి. (ఏడు+తూములు.) ఏడుతూముల పరిమితి గలమానము. ఆం. భా. ద్వి. ౨౭౧.

ఏడ్నూఱు. (ఏడు+నూఱు.) ఏడువందలు. "సీ. కాశికానగరోపకంఠదేశము డాసి యేడ్నూఱు నుఖములఁ నేఁగెజలధి. గీ. కిమ్మహానది..." కాశీ. ౫, ఆ. ౨౮౬.

ఏణము. సం. వి. అ. పుం. పెద్దకన్నులు గలనల్లయిఱ్ఱి.

ఏణి. సం. వి. ఈ. స్త్రీ. 1. పెద్దకన్నులు గలనల్లయాఁడులేడి. 2. ఒకానొకవిక్రమి.

ఏత. దే. వి. ఈడిగజాతి. ఉదా:—ఏతవాఁడు.

ఏతఁడు. దే. స. ఏ. (ఏ+అతఁడు.) ఎవఁడు. (శ.ర.)

ఏతద్. సం. స. (ద్) ఈ. "సీ. ఏతదర్థమకదా..." కాశీ. ౬, ఆ. ౨౨౧.

ఏతన్మాత్రుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సామాన్యుఁడు. భార. విరా. ౨, ఆ. ౨౦౯. నైష. ౧, ఆ. ౨౭.

ఏతము. ఉభ. వై. వి. (సం. యంత్రమ్.) నూయి మొదలగువానినుండి నీళ్లెత్తెడు యంత్రవిశేషము. ఆం. భా. ద్వి. ౨౯౩. సం. వి. అ. పుం. 1. ఇఱ్ఱి. 2. ఇఱ్ఱితోలు. 3. చిత్రవర్ణము. విణ. (అ.ఆ.అ.) చిత్రవర్ణము కలది.

ఏతరి. దే. విణ. 1. దుర్నయుఁడు. "ఉ. ఇందుకులావతంస మతఁ డేతటి నేతరి గాఁడు..." ఆము. ౨, ఆ. ౪౦. 2. గర్వి. "ఉ...అ, ట్లేతరులై ...నవతోయజనేత్రునిఁ జుట్టు ముట్టినన్." భాగ. ౧౦, స్కం. ఉ. ౧౧౧౯. 3. యథేచ్ఛ గలవాఁడు. "క. ప్రీతి వసంతము లాడిరి, యేతరులై సరసభాష లెసఁగన్ గొల్లల్." భాగ. ౧౦. స్కం. పూ. ౧౮౨.

ఏతరితనము. దే. వి. (ఏతరి+తనము.) పెద్దతనము, కుజనత్వము. "క. మీతరమువార లేతఱి, నేతరితనమునఁ దపస్విగృహకన్యకలన్, భీతభయవృత్తి వేఁడి కొన్నారో..." స్వా. ౬, ఆ. ౪౬.

ఏతా. దే. వి. అసత్యము. "శా. ఏతా గాక మరొం తకుండు గలఁడా యొంపైన..." ఒంటి. శ. ౧౦౪.

ఏతాదృక్కు. సం. విణ. (క్) ఇట్టిది.

ఏతాదృక్షము. సం.విణ. (అ.ఆ.అ.) } =ఏతాదృక్కు.
ఏతాదృశము.సం.విణ. (అ.ఈ.అ.) }

ఏతాము = ఏతము. (శ. ర.)

ఏతావత్. సం. విణ. (త్.) ఇంతమాత్రమైన. (ఇది తెలుఁగున సమాసపదముగానే యుపయుక్తము.)

ఏతు. దే. వి. (త. ఏతు.) 1. అనాదరము, తిరస్కారభావము. (ఉద్ధతి అని శ. ర. లోపము అని సూ. ని. హేతువు అని వేదం. వ్యా.) "గీ. తన కనిష్టంబు లగుకలిద్వాపరములు, కేతు సూపియుఁ బోలె ధాత్రీశ్వరుండు...త్రేత సేవించె..." నైష. ౮, ఆ. ౩౭. 2. ప్రగల్భము. "గీ. చూత మీతాపసుని పట్టియేతు లంచు, నృపతి విందారగింపంగ నియ్యకొనిన." వరాహ. ౪, ఆ. ౧౦౨. "ఉ...దుర్వినీతులై, యేతులఁ బోవుచున్ దిరుగునిప్పటిమంత్రులు తంత్రులు ..." పాండు. ౧, ఆ. ౭౩.

ఏతుల. దే. వి. 1. సామాన్యస్త్రీ. "గీ. ఏతుల యనంగఁ దగుపాటియింతి వెలయు." ఆం. భా. ద్వి. ౧౧౬. 2. చాఁప లల్లెడునొకానొకజాతి. "వ...ఏతులకోమలు..." ఆము. ౪, ఆ. ౩౫. విణ. సామాన్యము. "క...ఏతులవెలందు లీచెలి తులయే." విజ. ౧, ఆ. ౧౩౧.

ఏతెంచు. దే. అ. క్రి. (ఏఁగు+తెంచు.) 1. వచ్చు. "మ. అరదం బెక్కి ప్రమోద మేర్పడఁగ నయ్యక్రూరుఁ డేతెంచుచున్." వి. పు. ౭, ఆ. ౩౩౦. "క. ఆతురత నీవు నాకడ, కేతెంచినదానఁ జేసి ..." భార. శాం. ౩, ఆ. ౩౫౭. 2. డగ్గఱు. "సీ. ఇదె యెల్లి కల్యాణ మేతెంచుచున్నది..." నైష. ౮. ఆ. ౮౨. 3. కలుగు. "క...నంద మహీపతి, కేవేరపున బ్రహ్మహత్య యేతెంచె..." విక్ర. ౩, ఆ. ౩౪. 4. జరుగు. "క. కమలా

త్ముఁడు పల్కినట్లు కథ యెతెంచెన్." హరి. ఉ. ౬, ఆ. ౨౩౬.

ఏద. దే. వి. 1. అవధానము, ఎచ్చరిక. ఆం. భా. ప్ర. ౧౩౮. 2. వృక్షవిశేషము, ఒకానొకచెట్టు. (శ. ర., బ్రౌ.)

ఏదడి. దే. వి. ఒకజాతి యెలుఁగుగొడ్డు. (శ. ర.)

ఏది = ఎది. (శ. ర.)

ఏదీ. దే. స. (ఏది+ఈ.) ప్రశ్నార్థకము. నైష. ౪, ఆ. ౪౩.

ఏదు. వై. అ. క్రి. (సం. ఏధనమ్.) 1. చెడు. "శా. పెం పేదన్..." భార. ఉద్యో. 3, ఆ. ౧౦౩. భార. ఆది. ౬, ఆ. ౨౦౪. 2. పెంపొందు. "వ...చలువలబోదుల నిడినపంటవలంతి నెమ్మేన శృంగారరసం బుప్పొంగిన తెఱంగున..." ప్రబంధ. ౧౮౬. స. క్రి. 1. కాపాడు. "గీ. కాన శరణాగతులఁ బ్రోచుకంటెఁ బుణ్య మేది మేదినిలోన న న్నేది యింక, నాదిరాజన్య కీర్తులఁ బ్రోదిసేయు." దశా. ౧, ఆ. ౧౩౩. 2. పెంచు. "క...ఈగతి రఘుకుమారు నేదిరి దాదుల్." రామా. 3, ఆ. ౧౩౫. 3. పొందు. "మ...తుది యేదం గాంచు నీకోరికల్." హరి. ఉ. ౭, ఆ. ౧౧౨. వి. (క. ఏడు.) ముండ్లపంది. "గీ. ఇంటిలో నేదు ముల్లయ్యె నిందుముఖికి." ఆము. ౫, ఆ. ౮౪.

ఏదుకన్ను. ద్వ. వి. (ఏదు+కన్ను.) 1. ముండ్లపంది కన్ను. 2. అలభ్యపదార్థము. "ద్వి...సౌఖ్యములు నేదుకన్నును బులిజున్ను గలుగు." పండితా. ౩౫౯, పు.

ఏదుకజ్జిలు. దే. వి. బ. ధాన్యవిశేషము. హంస. ౪, ఆ. ౧౨౮.

ఏధ. సం. వి. ఆ. స్త్రీ. 1. వృద్ధి. 2. సమృద్ధి.

ఏధనము. సం. వి. అ. న. = ఏధ. ఆము. ౪, ఆ. ౧౯.

ఏధమానము. సం. విణ. (అ. ఆ. అ.) వర్ధిల్లుచున్నది. "వ. అట్లు పుండరీకాక్షుండు పాండవసంతానంబు గలిగించె నట్లప్పరమపురుషుచేతం బ్రత్యుజ్జీవితుండైన భవజ్జనకుం డేధమానవయ స్కుండగుకాలంది నొక్కపుణ్య దివసంబున." భార. అశ్వ. 3, ఆ. ౨౦౧.

ఏధము. సం. వి. అ. పుం. న్. న. 1. సమిధ. 2. వంటచెఱకు.

ఏధస్సు. సం. వి. స్. న. = ఏధము.

ఏధితము. సం. వి. అ. పుం. కొండకాలువ. న. అడవి. విణ. (అ. ఆ. అ.) 1. పెరిగినది. 2. పెంపఁబడినది.

ఏనస్సు. సం. వి. స్. న. 1. (క్షమాపణచేఁ బోవునది.) అపరాధము. 2. (ప్రాయశ్చిత్తముచేఁ బోవునది.) పాపము.

ఏనాఁడు = ఎన్నఁడు. "ఉ...నీ, నాఁడును బుణ్యసాధ్వికి గుణం బిది గా దని నే నెఱుంగుదున్." కళా. ౪, ఆ. ౧౧౩.

ఏనాదము. దే. వి. కదలియొద్దు. (శ. ర.)

ఏనాది. దే. వి. (త. ఏనాది.) ఒకానొక కిరాత జాతి. రా. వి. 3, ఆ. ౫౬. పార్వ. 3, ఆ. ౧౨౬.

ఏనాళ్లు. దే. వి. బ. (ఏను+నాళ్లు.) 1. ఐదుదినములు. (శ. ర.) 2. వివాహానంతరము వియ్యంకు లొకరి కొకరు పంపెడుసారె. (శ. ర.)

ఏని. దే. అవ్య. 1 చేదర్థకము. (ఇది పక్షాంతరము, వికల్పము, నిస్సందేహాదులఁ దెల్పును.) "క. ననుఁ దగిలెదు నతిథింగా, మనంబునఁ దలంచి నీవు మన్నించెద వే, నిని వచ్చెద నీపాలికి..." భార. కర్ణ. ౨, ఆ. ౨౮౬. "చ...తే జెనే, నిని బటుశోకవేగమున నిర్భరవేదనఁ జెందకుండునే." భార. సౌ. ౨, ఆ. ౧౮. "గీ. పాండుపుత్త్రుల కేను దప్పనిమనంబు, గలుగుదాననయేని..." భార. విరా. ౨, ఆ. ౧౦౭. 2. అప్యర్థకము. (ఇది ఉత్కర్ష, అపకర్ష మొ. తెలుపును.) "క...ప్రళయము మొందెన యే, నిని..." భార. శల్య. ౧, ఆ. ౫౮. "శా...ఆఁకటికి నే నేనిం గొనన్..." భార. శాం. ౨, ఆ. ౨౩౩. 3. అనిర్ధారకత తెలుపును. "చ...ఎట నేని బోయె..." భార. ఆది. ౮, ఆ. ౩౦౫.

4. వాక్యాలంకారముగా నుపయుక్తము. "శా. ఎందేడెందము కందళించు..." స్వా. ౨, ఆ. ౬౨. భార. ఆది. ౧, ఆ. ౭౭.

ఏనిక. వై. వి. (సం. అనేకపః.) ఏనుఁగు. "గీ. గజము నెక్కి తా నేనికకయ్య మైన, నేర్చు..." భార. ఉద్యో. ౪, ఆ. ౨౩౨. "క... పిడియేనిక పదుపు వొదువ..." హరి. పూ. ౮, ఆ. ౨౪.

ఏనికదిండి. ద్వ. వి. (ఏనిక+తిండి.) సింహము. కళా. ౩, ఆ. ౬౭.

ఏనికదోమ. ద్వ. వి. (ఏనిక+దోమ.) తొండపు దోమ, ఘోణిక. (శ. ర.)

ఏను = నేను. "గీ. ఏను నీయుంతియును గాని యెఱుఁగ రన్యులు .." భార. ఆది. ౪, ఆ. ౧౦౬. స. ఔ. ఐదు. దశ. ౯, ఆ. ౬౭.

ఏనుఁగడుగుగారెలు. ద్వ. వి. బ. (ఏనుఁగు+అడుగు+గారెలు.) భక్ష్యవిశేషము. "వ... ఏనుఁగడుగు గారెలు..." చంద్రా. ౬, ఆ. ౯౩.

ఏనుఁగడుగులు. ద్వ. వి. బ. (ఏనుఁగు+అడుగులు.) చిత్రవర్ణ వస్త్రవిశేషము. ఆం. భా. ద్వి. ౧౫౪.

ఏనుఁగు. వై. వి. ఏనిక, దంతి. "సీ. వరుస నేనుంగులు గురిసినదానధారావలి దగుకలయంపి గాఁగ." భార. విరా. ౩, ఆ. ౭౫. విశే. 1. పెద్దది. (చూ. ఏనుఁగుకలబావ.) 2. అధికము. (చూ. ఏనుఁగుపాఁడి.)

ఏనుఁగుకలబంద. ద్వ. వి. (ఏనుఁగు+కలబంద.) పెద్దదగు కలబంద ✿. (శ. ర.)

ఏనుఁగుకొమ్ములు. ద్వ. వి. బ. (ఏనుఁగు+కొమ్ములు.) ధాన్యవిశేషము. "సీ. ఇప్పపూరాజనా లేనుంగుకొమ్ములు..." హంస. ౪, ఆ. ౧౨౮.

ఏనుఁగుకోల. ద్వ. వి. (ఏనుఁగు+కోల.) అస్త్రవిశేషము. "సీ. జగములగొంగ యేనుఁగుకోలఁ బఱప..." అచ్చ. యు. ౫౨౧.

ఏనుఁగుగొంగ. ద్వ. వి. (ఏనుఁగు+గొంగ.) సింహము. (శ. ర.)

ఏనుఁగుజలగ. ద్వ. వి. (ఏనుఁగు+జలగ.) దీర్ఘశోణిక. (ఆం. పా.)

ఏనుఁగుతుమ్మ. ద్వ. వి. (ఏనుఁగు+తుమ్మ.) పెద్దతుమ్మ ✿. (ఆం. పా.)

ఏనుఁగుతోలుదాల్పు. ద్వ. వి. (ఏనుఁగు+తోలు+తాల్పు.) గజచర్మధరుఁడు, శివుఁడు. మృ. వి. ౧, ఆ. ౨౨.

ఏనుఁగుదాయ = ఏనుఁగుగొంగ. కకు. ౪, ఆ. ౫౭.

ఏనుఁగుదాహము. మి. వి. (ఏనుఁగు+దాహము.) అధికాశ, పేరాస. (వా.)

ఏనుఁగుపల్లేరు. ద్వ. వి. (ఏనుఁగు+పల్లేరు.) పెద్ద పల్లేరు ✿. (శ. ర.)

ఏనుఁగుపాఁడి. ద్వ. వి. (ఏనుఁగు+పాఁడి.) మహాదాతృత్వము. "ఉ... ఇచ్చెనా, యేనుఁగుపాఁడి ..." విజ. పీఠి. ౫౪.

ఏనుఁగుబీఱ. ద్వ. వి. (ఏనుఁగు+బీఱ.) మహాశాతకి ✿. (ఆం. పా.)

ఏనుఁగుమొగమయ్య. ద్వ. వి. (ఏనుఁగు+మొగము+అయ్య.) గజాననుఁడు, గణపతి." శుక. ౩. ఆ. ౪౬౨.

ఏనుఁగుమొగములసాహెబు. ద్వ. వి. (ఏనుఁగు+మొగములు+సాహెబు.) పంచముఖుఁడు, శివుఁడు. వేంక. దేవ. ౫.

ఏనుఁగుమొగముసామి = ఏనుఁగుమొగమయ్య. ఆం. భా. ప్ర. ౪౩.

ఏనుఁగుమొగసాల. ద్వ. వి. (ఏనుఁగు+మొగసాల.) మొదటిమొగసాల. నైష. ౩, ఆ. ౮౫.

ఏనుఁగురాకాసిగొంగ. ద్వ. వి. (ఏనుఁగు+రాకాసి+గొంగ.) గజాసురారి, శివుఁడు. (శ. ర.)

ఏనుఁగులసూడు. ద్వ. వి. (ఏనుఁగులు+సూడు.) ఏనుఁగుదాయ. నీలా. ౧, ఆ. ౪౫.

ఏనుఁగుసూడుమెకము. ద్వ. వి. (ఏనుఁగు+సూడు+మెకము.) ఏనుఁగుదాయ, సింహమృగము. వేంక. తిర్య. ౯౪.

ఏనుఁగుసొరము. వై. వి. (ఏనుఁగు+సొరము.) నిషాద స్వరము. (శ. ర.)

ఏనూటు. దే. స. (ఏను+నూటులు.) ఐదువందలు. భాగ. ౯, స్కం. ౫౦౪.

ఏన్నాళ్లు. దే. వి. బ. (ఏడు+నాళ్లు.) ఏడుదినములు. భీమ. ౪, ఆ. ౧౮.

ఏన్నూఱు. దే. వి. (ఏడు+నూఱు.) ఏడువందలు. బస. ౨, ఆ. ౮౯౭, పం.

ఏపడఁచు. దే. స. క్రి. (ఏపు+అడఁచు.) నశింపఁజేయు. "మ...ఏపడంపుము రిపుల్..." భార. కర్ణ. ౮, ఆ. ౩౦౨.

ఏపరి. దే. వి. ఉడుము. (ఆం. పా.)

ఏపరించు. దే. స. క్రి. (ఏపరు. ధా. ప్రే.) **1.** బాధించు. "ద్వి. ఏపరించుచుఁ బతి కెదురు భాషించు, పాపాత్మురా లూరఁబందియై పుట్టు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౧౭౦, పం. **2.** దుఃఖింపఁజేయు. "ద్వి. ఏపరింపుదు రె నన్నిట్లు మాయయ్య, నా పుత్రరత్నంబ నానిధానంబ." ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౭౨, పం.

ఏపారు. దే. అ. క్రి. (ఏపు+ఆరు.) **1.** అతిశయించు. "మ...ఏపారునే, నలయుద్రేకము రౌద్రముం బెనుప..." భార. ఉద్యో. ౮, ఆ. ౧౪౧. **2.** విజృంభించు. "క. ఏపారిరి నీదు సేన యొసకం బడఁగన్." భార. భీష్మ. ౮, ఆ. ౩౨౭. **3.** విలసిల్లు. "శా...ఈ రాజన్యకరంబు పోరులఁ గరం బేపారు..." నైష. ౫, ఆ. ౧౪౯.

ఏపి. దే. వి. శునకము, కుక్క. (ఆం. పా.)

ఏపు. దే. స. క్రి. (ఈపద మీయర్థమున సానుస్వార మని శ. ర. సూ. ని. కాని యది చింత్యము.) బాధించు. "ద్వి. పాపాత్ముఁ డనఁ దల్లి బట్టియీరీతి, నేపినకష్టు లేయెడ నైనఁ గలరె." నవ. ౮, ఆ. ౭౧. వి. **1.** బాధ. "క. శ్రీపతి భార్యలఁ గోల్పడి, యాపార్థుఁడు చిన్నపోయి యప్పుడు చనియెన్, ఏపున గోవులఁ గోల్పడి, గోపాలకుఁ డరిగినట్లు ఘోరాటవిలోన్." వి. పు. ౭, ఆ. ౮౨౯. "ఉ...మరు నేపులఁ బొల్పడుదాన నైతి నే." దశ. ౨, ఆ. ౧౦౭. **2.** ఆధిక్యము; గొప్పతనము. "సీ...వానయేపున..." భార. శాం. ౩, ఆ. ౩౧౦. "ఉ...అహంకారము లేనియేపు..." నరస. ౫, ఉ. ౧౦౬. **3.** ఉత్సాహము; విలాసము. "గీ... చింత నేపుదక్క." భార. ఉద్యో. ౪, ఆ. ౩౬౧. "గీ. జేపటికి నేటిప్రాయంపు టేపుగలదె." హంస. ౧, ఆ. ౧౦౦. **4.** ఔద్ధత్యము; విజృంభణము. "ఉ... దైత్యపతి యున్మదుఁడై పితృరాజు కింకరుల్, గ్రందుకొనంగ నే పడరగా సిగఁ జేసెఁ దదాజ్ఞ నెంతయున్." నిర్వ. ౫, ఆ. ౫౦. "ఉ... రణంబునందు నీయేపున కోర్వ దేవతల కేనియు దైత్యులకేని రాదు..." భార. శాం. ౮, ఆ. ౪౩౨. **5.** విధము. "... ని, క్షేపము గనినదరిద్రుని, యేపున..." హంస. ౮, ఆ. ౪౬. విశే. **1.** బాధకము. "... బుద్ధివిహీన, వ్యాపారదోషమున నీ, వేపుగ గర్భంబు దాల్తి వింతియుఁ బోలెన్." వి. పు. ౫, ఆ. ౧౧౮. **2.** తియ్యనిది. **2.** ప్రియము. "ఉ...ఏపుప్రాణ మెడగా నిడి యైన ఘటించి పెట్ట..." హర. ౮, ఆ. ౫. **3.** సాంద్రము, దట్టము. వా:—ఆ మొక్క లేపుగా పెరిగినవి. "శా. ఏపై చీఁకటి సూది మోపనెడ యీ కేర్పడ్డవేళన్..." మల్ల. శృం. ౯౪.

ఏపుమాపు. దే. స. క్రి. (ఏపు+మాపు.) **1.** మించు; జయించు. "ఆ. వెల్లదమ్మితోఁగల వీనికందోయితీ, రేపుమాపు బాపు రేపుమాపు." సా. ౮, ఆ. ౪౧. **2.** చంపు. "చ...సారథి నేపుమాపి..." విక్ర. ౪, ఆ. ౧౦౮.

ఏపుమిగులు. దే. అ. క్రి. (ఏపు+మిగులు.) **1.** విలసిల్లు; సరిపడు. "సీ. భగవంతుఁ డనియెడి భద్రశబ్దమునకు నెవ్వఁడర్థాకృతి నేపుమిగులు." భాగ. ౧, స్కం. ౪౫౧. **2.** ఉత్సహించు. "గీ...ఎంతయు నేపుమిగిలి, మనబలంబులు..." భార. భీష్మ. ౨, ఆ. ౮౭.

ఏపురేఁగు. దే. అ. క్రి. (ఏపు+రేఁగు.) **1.** విజృంభించు, చెలరేఁగు. "గీ. ఎగయుఁ ధరఁ ద్రవ్వ బోఁటియుగా నేపు రేఁగి." భాగ. ౩, స్కం. ౬౩౨. **2.** గడిమీఱు, విచ్చలవిడిగా విహరించు. "సీ. ఏపురేఁగిన ఆఁబోతు లెలదీఁగఁబోఁడులు..." వేం. పంచ. ౪, ఆ. ౨౪౦.

ఏపె. దే. వి. నల్లమద్ది. ♆. "చ...సురపొన్నలు నేపెలు నున్నతోఁటలో..." ద్వా. ౧౧, ఆ. ౨౦. ద్వ. స. ఏ. (ఏ+అప.) ఏపె. (శ.ర.)

ఏబిడ. దే. స. ఏ. (ఏ+బిడ్డ.) ఏపె. (శ. ర.)

ఏబ్రము. దే. వి. అసహ్యత. "గీ. దేవపూజావిధానంబుఁ దీర్పుమన్న, నేబ్ర ముదయించు నా బ్రాహ్మణబ్రువునకు." నిరం. ౨, ఆ. ౨౯.

ఏబ్రాసి. దే. విణ. (ఏబ్రము+రాసి. క. ఏబ్రాసి.) అసహ్యమును గలిగించువాఁడు. (బ్రౌ. వా.)

ఏభ్యరాసి = ఏబ్రాసి. "గీ. ఏభ్యరాసులఁ బొడగన్న నిచ్చగించు." మల్హ. ౩, ఆ. ౪.

ఏమట. దే. వి. నిలుకడ. (చూ. ఏమటసేయు.)

ఏమటసేయు. దే. అ. క్రి. (ఏమట+చేయు.) నిలిచిపోవు, ఆఁగు. "క. వచ్చెద నే నీవెంటను, నెచ్చోటికైనఁ గొంచు నేఁగుము లేదా, యిచ్చట నేమటసేయుము, పచ్చనివిలుకానిబారిఁ బడఁ జాలఁ జుమీ." మల్హ. ౩, ఆ. ౧౩౪.

ఏమఱ. దే. వి. ఏమఱిపాటు. "మ... ఏ, మఱ లే కర్థుల దాసులన్ సుజనులన్ మన్నింపుదే మైదలీ." భాగ. ౮. స్కం. ౪౬౩.

ఏమఱించు. దే. స. క్రి. (ఏమఱు ధా. ప్రే.) "ఆ. ఏమఱించి కృష్ణుఁ డిండ్లలోఁ జొరఁబడి, యున్న పాలు పెరుఁగు వెన్న నెయ్యి, కొల్లలాడుచుండ ..." రాధా. ౧, ఆ. ౧౮.

ఏమఱిక. దే. వి. (ఏమఱు. ధా.) ఏమఱిపాటు, పరాకు. ఆం. భా. ప్ర. ౧౩౮.

ఏమఱిపడు. ద్వ. అ. క్రి (ఏమఱు. ధా.) పరాకుపడు. (చూ. ఏమఱిపాటు.)

ఏమఱిపాట. దే. క్రి. విణ. ద్రు. 1. అకస్మాత్తుగా. "చ. అలుక జనింపఁ గౌశికమహాముని యేమఱిపాట భీమభంగులఁ జనుదెంచి..." హరిశ్చ. ౩, ఆ. ౧౫౮. 2. అనాలోచితముగా. "ఉ... ఇగురుఁబోఁడుల నేమఱిపాటఁ జూపినం, బేరును బెంపునుం గలదె..." భో. ౫, ఆ. ౧౦౬.

ఏమఱిపాటు. ద్వ. వి. (ఏమఱిపడు ధా.) పరాకు. ఆం. భా. ప్ర. ౧౩౮. క్రి. విణ. అకస్మాత్తుగా. "గీ... నూతి, నీటిలో నీడఁ జూడఁగ నెలఁతఁ జూచె, విష్ణుచిత్తుఁ డేమఱిపాటు వెనుకఁ గదిసి." పరమ. ౪, ఆ. ౬౧.

ఏమఱిలు. దే. అ. క్రి. పొరపడు. "సీ...ఏమంద ములయందు నేమఱిలక." కళా. ౧, ఆ. ౮. స. క్రి. మఱచిపోవు. "ఆ. కత్తి యేమఱిలునె కన్నగాఁడు." రామలిం. ౧౦౧.

ఏమఱు. దే. అ. క్రి. జాగరూకత లేకుండు. "ఉ. ఏమఱి రక్షసాలనిమృగేంద్రుని నక్కయుఁ గోలు పుచ్చు..." భార. భీష్మ. ౧, ఆ. ౮౦. భార. ఆది. ౬, ఆ. ౧౮౪. స. క్రి. 1. ఉపేక్షించు. "క... ఏమఱునొకో పుత్త్రులగావఁగ..." భార. ఆది. ౮, ఆ. ౩౧౪. "శా... నిత్యక్రియాజాలం బేమఱము..." భార. అర. ౪, ఆ. ౧౮౧. 2. మఱచు. "ఆ... నాదుపతులు వెరపు లావు, నలఘువిక్రమంబుఁ గలుగుగంధర్వులే, మఱరు నన్ను... భార. విరా. ౧, ఆ. ౩౨౩. పరమ. ౨, ఆ. ౩౪. (ఏమాఱు అని బిల్హ. ౧, ఆ. ౬౩.)

ఏమఱుచు. దే. స. క్రి. (ఏమఱు. ధా. ప్రే.) ఏమఱఁజేయు. (శ. ర.)

ఏమఱుపు. దే. వి. (ఏమఱు. ధా.) 1. ఏమఱిపాటు. 2. ఒకానొకకావ్యదోషము. ప్రబంధ. ౧౬.

ఏమి. దే. స. ఏ. జౌ. అనా. (ఇది వాక్యాంతమున నున్నప్పుడును హల్లుపరముగా నున్నప్పుడును దీనికి వైకల్పికముగా మివర్ణలోపము.) 1. ఏ; ఏది. "క. ఏమికులంబునవాఁడొకో... భార. విరా. ౧, ఆ. ౨౧౬. "క. ఏమిటి రూపగుఁ బురుషుం, డేమెయి రూపునెడు... భార. శాం. ౫, ఆ. ౩. 2. అశ్లీలార్థద్యోతకము. "శా...ఏకాంత నిద్రారతిన్, మోహింపం గలలోఁ గుమారుఁ డొకఁ డేమో చేసినన్..." ఉ. హరి. ౫, ఆ. ౮౪. 3. ఎంతటిది. "క. ఏమితపం బొనరించితి, భూమీశ్వర..." భార. ఆది. ౩, ఆ. ౨౦౮. 4. సందర్భముల ననుసరించి యనేకార్థము లిచ్చును. ఉదా: — వాని కేమి? (లోటు లేదని భావము.) వాఁడు నాకే మని తిరుగుచున్నాఁడు. (నిర్భయముగా నని భావము.) అవ్య. ప్రశ్నార్థకము.

"సీ. ఏమేమి త్రాఁగాక యిఁక నెవ్వ రున్నారు ..." దశా. ౧, అ. ౨౪౦.

ఏమీ=ఏమి.

ఏము = మేము.

ఏమె. ద్వ స. ఏ. (ఏ+అమ.) ఎవతె. (శ. ర.) అవ్య. ఓసి. "గీ... ఏమె యి దే మేమె..." నైష. ౬, ఆ. ౧౧౪. ఇట్లే: ఏమే. "శా. ఏమేజాహ్నవి ...దశా. ౧, అ. ౨౬.

ఏమొ. దే. అవ్య. 1. ఎందుచేతనో. 2. ఊహను దెలుపును. ఇట్లే: ఏమో.

ఏమోయగు. దే. అ. క్రి. (ఏమో+అగు.) చెప్పరాని రీతిని బరిణమించు. "క. ఏమి యని చెప్పుదును లో, పాముద్రాప్రాణనాథ ప్రజ్ఞా విభవం, బేమో యయి చెడిపోవఁగ..." భీమ. ౨, ఆ. ౧౦౪.

ఏయది=ఏది. (శ. ర.)

ఏయు. దే. స. క్రి. (క. త. ఏయ్.) 1. (బాణాదులను) ప్రయోగించు. "సీ. ఏసును గులిశాస్త్ర మేసి..." భార. అర. ౪, ఆ. ౬౮. 2. పడఁగొట్టు. "తరువోజ...ఈయస్త్ర మత్స్యంబు నేసినవాఁడ..." భార. ఆది. ౭, ఆ. ౧౯౬. 3. వైచు. "క...హనుమంతుని, యెదుర వెసన్ గుప్పిగంతు లేయుట సుమ్మీ." ద్వా. ౨, ఆ. ౪౯.

ఏర = ఏరా. (చూ. ఏరా.)

ఏరండ. సం. వి. ఆ. స్త్రీ. పిప్పలి ✾.

ఏరండపత్త్రిక. సం. వి. ఆ. స్త్రీ. నాగదంతి ✾.

ఏరండఫల. సం. = ఏరండపత్త్రిక.

ఏరండము. సం. వి. అ. పుం. ఆముదపుచెట్టు.

ఏరకము. సం. వి. అ. పుం. మేషము.

ఏరపకడ. దే. వి. దేవతాళము ✾. ఆం. భా. ద్వి. ౫౧.

ఏరా. దే. అవ్య. ఓరి. "శా...ఏరా తమ్ముఁడ..." పాండు. 3, ఆ. 33.

ఏరాది. దే. వి. (ఏకజాతి) పిల్ల. "గీ. అచటిమదపుటేనుఁగుల కమరకరటి, యెత్తుగున్న యచట నున్న యుత్తమాశ్వ, ములకు నేరాది లేఖర్షభునితురంగము..." చంద్రా. ౧, ఆ. ౪3.

ఏరాలు. దే. వి. ఔ. తోడికోడలు. "సీ. ఏరాలిఁబట్టి బిట్టెత్తి చెక్కిలి నొవ్వఁ గఱచి వాఁ డేడ్చినఁ గౌఁగిలించు." పాండు. 3, ఆ. ౬౨.

ఏరాళము. వై. విశ. (సం. హేరాళమ్.) పృథువు, పెద్దది. "మత్త...ఏ, రాళ మైనసిఱుంద..." భాగ. ౧౦, స్కం. పూ. ౨౧3. క్రి. విశ. అసంఖ్యాకముగా. "క. ఓరాజవదన యచటన, నీరాజన లబ్జనాభునికి నీ సున్నా, రేరాళము హరివల్లభ, లారామలఁ గొల్వవలఁగును నఁ..." ములకుఁ." పాండు. ౨, ఆ. ౧౨౫.

ఏరి = ఏరీ. "గీ. ఇంక శుద్ధాత్ము లగువేల్పు లేరి..." దశా. ౧, అ. ౨౫3.

ఏరీ. దే. స. (ఏరు+ఈ.) ఎక్కడ నున్నారు? "శా...వా రేరీ..." భాగ. ౮, స్కం. ౫౯౦.

ఏరు. దే. వి. ఔ. (క. ఏరు.) 1. నాఁగలి. "ఉ. ఏరొక టబ్బె రామునకు నెడ్లు పొసంగవు...ఏరులు నెడ్లు గల్గి సుసమృద్ధిగఁ బాడఱు లుందురప్పురిన్." శశాం. ౨, ఆ. ౨౦. 2. నొప్పి. "గీ...తలయేరు..." మార్క. ౨,ఆ. ౮౭. స. బ. ఎనుప. భార. శాం. ౪, ఆ. ౨౪.

ఏరుఁబ్రాలు. దే. వి. బ. (ఏరు+ప్రాలు.) ధాన్యవిశేషము. "శా..., అత్యయం బగు నేరుఁబ్రాల కల మాహారంబు..." భీమ. ౨, ఆ. ౧౪౨.

ఏరుకలప. దే.వి. (ఏరు+కలప.) ఐరగట్టు, హలోపకరణము. "సీ. కలప యనంగను హలమొప్పు నైరగట్టేరుకలప నాఁగఁ దనుప, కరణము..." ఆం. భా. ద్వి. ౨3౧.

ఏరుగు. దే. అ. క్రి. విష్ఠించు, మలమువిడుచు. (శ. ర.) వి. మలము. ఆం. భా. ద్వి. ౧3౪.

ఏరునేల. దే. వి. (ఏరు+నేల.) ఒకనాఁగలితో దున్నఁదగిన నేల; రెండుక్రోసులదూరము."ద్వి. త్రిపురారిగుడితూర్పుదెస నేరునేలఁ, గపిలేశ్వరం బందుఁ దపసియొక్కరుఁడు." బస. ౨, ఆ. ౪౭, పు. "ఆ. ఏరునేలకొలఁది నెడనెడ విడియుచు ..." భార. అశ్వ. 3, ఆ. ౧౫౮.

ఏరుపడు. ద్వ. అ. క్రి. ఏర్పడు, పంక్తులు దీఱు. "గీ. ఏరుపడి నాల్గుపోఁజులై యెప్పు డెప్పు, దుర దురం బనుచున్న వానరులఁ జూచి." రామా. ౮, ఆ. ౯౦. "సీ. పైఁడికుండల నేరు పడిన..." కువల. ౧, ఆ. ౬౧.

ఏరుపఱుచు. ద్వ. స. క్రి. (ఏరుపడు ధా. ప్రే.) నిర్ణయించు, ఏర్పాటుచేయు. "సీ. గ్రహతార నక్షత్రగతు లేరుపఱిచితి..." శివ. ౧, ఆ. ౬౫.

ఏరుపఱుపు. ద్వ. వి. (ఏరుపడు ధా.) 1. ఏరి బాగు చేసిన పదార్థము. (ఆం. పా.) 2. కడుగుడు. ఆం. భా. ద్వి. ౨౫౨.

ఏరుపాటు. ద్వ. వి. (ఏరుపడు. ధా.) 1. విభజనము. "సీ. ఉనికి నిచ్చుటె కాని వనజాత బాంధవుం డేరుపా టొనరింపఁజాలఁ డయ్యె." చంద్రా. ౧, ఆ. ౧౯. 2. భేదము. "వ...కాలు చేయి తల డొక్క యని యేరుపాటు లేక..." భార. భీష్మ. 3, ఆ. ౨౪౮.

ఏరువాక. దే. వి. దుక్కియొక్క ప్రారంభము. (శ. ర. వా.)

ఏరుసాగించు. దే.స.క్రి.(ఏరుసాగు ధా.ప్రే.) దుక్కి దున్నించు. (ఆం. పా.; వా.)

ఏరుసాగు. దే. అ. క్రి. (ఏరు+సాగు.) దుక్కి దున్ను. "ఉ. హాలికు లెన్నఁడుం దెగనియారుల చేలను జొకుమల్లెనుం, గా లలి నేరుసాగిరి..." ఆము. ౪, ఆ. ౧౨౪.

ఏర్చు. దే. అ. క్రి. నొప్పి కలుగు. "సీ. కస్తూరి తిలకంబు గాలి వాఱిన నేర్చు నొస లెట్లు నని చెనో భసితమునకు." పాండు. ౪, ఆ. 3. స. క్రి. 1. కాల్చు. "క. కార్చిచ్చు గవిసి మృగతతి, నేర్చుకరణి..." భార. భీష్మ. 3, ఆ. ౨౬౮. 2. బాధించు. "మ...ముకుమంబై యేర్చు నావల్..." ఆము. ౧, ఆ. ౯౨. 3. ధ్వంసము చేయు. "మహాప్రగ్రధర...వైచెన్ గదల్.. అది యచ్చెంతఁ గాంతార మేర్చెన్." స్వా. ౪, ఆ. ౯౯. 4. (మంచివి) ఎన్ను. "సీ. గోడిగజాతిలోఁ గొదమపెంటుల నేర్చి..." భార. విరా. ౧, ఆ. ౬౫. 5. [illegible]

స్వా. ౫, ఆ. ౩౨. 6. కూర్చు. "గీ. వింట న మ్మేర్చి..." పాండు. ౫, ఆ. ౬౫. 7. నిర్ణయించు. "సీ...సరణు లేర్చిరి నభస్వాంతము నకు." శివరా. ౧, ఆ. ౬౫. 8. పన్ను. "ఉ. అందఱు నింతకున్ వేనుకరై మొన లేర్చి చనంగ..." భార. విరా. ౪, ఆ. ౧౮౪. 9. పరిశీలించు. "సీ. శ్రుతిపురాణోపసంహిత లేర్చి..." ఆము. ౧, ఆ. ౧౩. 10. తొలఁగించు. "సీ. చందురుననుఁగాంతికం దేర్చి..." భార. విరా. ౨, ఆ. ౫౨.

ఏర్పడు = ఏరుపడు. 1. వేఱగు. "చ. నడుములు జంఘు లంఘ్రిలు లలాటము లంసము లాననంబు లే, ర్పడక పడన్..." భా. రా. యు. ౬౪౫. 2. తెల్లమగు. "వ...మహాభారతబం, ధనిరూపితార్థ మేర్పడఁ, దెనుఁగున రచియింపుము..." భార. ఆది. ౧, ఆ. ౧౬. 3. గోచర మగు. "గీ. ఊరుమూల మేర్పడఁగ..." భార. ఆది. ౪, ఆ. ౧౨౨. 4. ఉండు. "శా. ఏపై చీఁకటి సూదిమోప నెడయా కేర్పడ్డవేళన్..." మల్ల. శృం. ౯౪.

ఏర్పడుదెంచు. ద్వ. అ. క్రి. (ఏర్పడు+తెంచు. స్వార్థముస.) 1. వచ్చు, ప్రవేశించు. "వ... వసంతసమయంబు నఖిలజీవలోకానందజననంబై యేర్పడుదెంచిన..." భార. ఆది. ౫, ఆ. ౧౩౬. 2. స్పష్టముగాఁ గనుపించు, ప్రకటమగు. "సీ. వెడ వెడ నూఁగారి వింతరై యేర్పడుదేరనివళులలో నారు నిగుడ." భార. శాం. ౧, ఆ. ౨౪౮.

ఏర్పరించు. ద్వ. స. క్రి. 1. ఏర్పఱుచు, నిర్ణయించు. "క...అది యెల్లను నేర్పరిచి..." భార. విరా. ౧, ఆ. ౬౫. 2. విభాగించు. "శా. నీల్లం బాలును నేర్పరింపఁ గలపాండిత్యంబు..." మల్ల. నీతి. ౧౪. 3. ప్రకటించు, తెలుపు. "ఉ. అంతిపురంబు కన్యలఁట యాత్మ తెఱంగభి ధాప్రయుక్తి నొక్కింతయు నేర్పరింప రఁట..." ప్రభా. 3, ఆ. ౬౫. 4. నిర్మించు, కట్టు. "గీ. నేర్పుతో నాలవాలంబు లేర్పరించి." విప్ర. ౨, ఆ. ౨౧. 5. వ్యూహము పన్ను. "గీ. వెడలి మొన లేర్పరించి..." పారి. ౫, ఆ. ౨.

ఏర్పఱుచు. ద్వ. స. క్రి. (ఏర్పడు. ధా. ప్రే.) 1. విభాగించు. "క...అజుఁడు నోపని, వేదము లేర్పఱిచె నం(డు) వేదవ్యాసుఁడ్." కు. సం. ౧, ఆ. ౧౮. 2. నిర్ణయించు. "మ...శ్రుతి శాస్త్రజ్ఞానపారీణు లేర్పఱుపఁజాలక..." ఉ. రా. ౧, ఆ. ౨౮౦. 3. చూపు. "ఉ...అనంగ తంత్రవి, ద్యానిపుణత్వ మేర్పఱిచెదర్..." భార. విరా. ౨, ఆ. ౨౫౮. 4. చక్కఁజేయు. "క. నడిపింపఁగఁ బొడిపింపఁగ, నెడమడుపై కలఁగినప్పు డేర్పఱుపఁగ నేఁ, గడు నేర్తు..." భార. ఉద్యో. ४, ఆ. ౨౧४.

ఏర్పఱుపు = ఏరుపఱుపు. (ఆం. పా.)

ఏర్పాటు. ద్వ. వి. (ఏర్పడు. ధా.) 1. నిర్ణయము. "శా...అమర్త్యశ్రేణికే కాని మా, కేవంకం బని లేక యుండునటుగా నేర్పాటు గావించె..." దశా. ౧, ఆ. ౨४३. 2. విభాగము. (చూ. ఏరుపాటు.) విణ. 1. స్పష్టము. "శా. ఎట్టెట్టా విసమైతి మింక నోకమా యేర్పాటుగాఁ జెప్పుమా." కాశీ. ౭, ఆ. ౧౦౭. 2. నిర్ణీతము. "క. ఈ సీతిసమాకర్షస్థానము లేర్పాటు గాఁగ ..." దశా. ౨, ఆ. ౧౮३.

ఏర్పు. దే. వి. 1. మంట. (శ. ర.) 2. బాధ. ద్వి. పరమ. 3, ఆ. ౧౫౨, పు.

ఏర్వారువు. సం. వి. ఉ. పుం. నక్కదోస ౘ.

ఏఱు. దే. స. క్రి. 1. ఒకటొకటిగా చేతితో నెత్తు. "గీ...తృణధాన్య మల్ప, మేఱికొని వత్తు రాఁకలి దీఱుకుండు." భార. అశ్వ. ४, ఆ. ౨౨౦. 2. ఎన్ను. "సీ...సెరసు లేఱు మయ్య..." నైష. ౭, ఆ. ౯౦. "గీ. తత్తఱము మీఱఁ దొలంకటి తప్పు లేఱు." సావి. ౨, ఆ. ౫३. 3. నఱకు. "సీ...కొరవఁటితల లేఱి..." భార. ద్రో. ౧, ఆ. ౧౧౧. వి. బొ. నది. (బ. ఏర్లు, ఏళ్లు.) "సీ...ఏఱులజన్మంబు నెఱుఁగ నగునె." భార. ఆది. ౬, ఆ. ౫౯. "గీ. ఏళ్ల శీతలనొండె వేసీళ్లనొండె." మార్క. ౧, ఆ. ౨४౫. అచ్చ. బాల. ౧౧.

ఏఱుజాజి. ద్వ. వి. (ఏఱు+జాజి.) ధాతకి ౘ. (శ.ర.)

ఏఱునుగ్గు. దే. వి. (ఏఱు+నుగ్గు.) ఏఱుపిడుక. (శ.ర.)

ఏఱుపఱుచు = ఏర్పఱుచు. "సీ. గ్రహతార నక్షత్రగతు లేఱుపఱిచితి సరయు లేర్చితి నభస్వంత మునకు." శివరా. ౧, ఆ. ౭౫.

ఏఱుపిడుక. దే. వి. నేలం బడి యెండి పిడుక యగు పేఁడకడి. ఆం. భా. ద్వి. ౨౬౮.

ఏఱుపుచ్చె. దే. వి. (ఏఱు+పుచ్చ.) కళింగపత్త్రము ౘ. (శ. ర.)

ఏఱుమద్ది. దే. వి. (ఏఱు+మద్ది.) నదీసర్జము ౘ. "ద్వి. ఏనును జిరకాల మీయేఱుమద్ది, మ్రాని పెందలనుండి..." నవ. ४, ఆ. ౧౯౨ పు.

ఏఱుమల్లె. ద్వ. వి. వాసంతిక. (శ. ర.) బ. ధాన్య విశేషము. "వ...ఏఱుమల్లెలు మునిమనోహరాలు..." ప్రబంధ. ౧౧౨.

ఏఱువ. దే. వి. 1. విలాతి, దేశము. (శ.ర.) 2. సీమ. (ఆం. పా.)

ఏఱువంగ. ద్వ. వి. (క. ఏరువంగ.) గండీరము, ఒక జాతివంగ ౘ. (శ. ర.)

ఏఱువావిలి. దే. వి. సప్తల, ఒకజాతివావిలి ౘ. (శ.ర.)

ఏల. ఉభ.యు. దే. అవ్య. ఎందులకు. (శ.ర.) వై. వి. (సం. హేలా.) ఒకవిధ మైనపాట. ('జోల పాట' అని ఆం. పా.) ఆం. భా. ప్ర. ౧౨३. సం.వి.ఆ.స్త్రీ. 1. పెద్దయేలకి ౘ. 2. విలాసము. 3. నృత్తవిశేషము. 4. ఏలేఱు, పిఠాపురప్రాంత మందలి యొకానొకనది.

ఏలకి. వై. వి. (సం. ఏలా.) ఒకానొకలత. ఉదా:- ఏలకితీఁగ. బ. ఏలకిగింజలు. "సీ...ఏలకులు సొంటియును." ప్రబంధ. ౫౭.

ఏలకికాయ. ద్వ. వి. (ఏలకి+కాయ.) 1. ఏలకిచెట్టు ఫలము. 2. అట్టి భక్ష్యవిశేషము. ప్రబంధ. ౧౧౭. హంస. ౧, ఆ. ౧౦౫.

ఏలకూఁతలు. ద్వ. వి. బ. బాలక్రీడా విశేషము. "గీ...ఏలకూఁత, లాదిగా శైశవక్రీడలు..." వి. పు. ౭, ఆ. ౨౧౨.

ఏలకో. దే. అవ్య. ఎందుకో. "మ...ఆవేళ నేలకో యేతెంచి యశోద చూచి చనె నుల్లాసంబు సం ధిల్లఁగన్." దశా. ౮, ఆ. ౨౮౦.

ఏలకో = ఏలకో. (వా.)

ఏలపదము = ఏలపాట. శుక. ౨, ఆ. ౧౬౭.

ఏలపాట. ద్వ. వి. (ఏల+పాట.) ఏల, ఒకవిధ మగు పాట. బ. బాలక్రీడావిశేషము, పిల్ల లాడుకొను సొకానొకయాట. "గీ. ఏలపాటలు సరిబేసు లేలకూఁతలు..." వి. పు. ౬, ఆ. ౨౦౨.

ఏలబిలుఁడు. సం. = ఏలబిలుఁడు.

ఏలము. హిం. వి. 1. వేలము, అమ్ముటలో నొక విధము. (శ. ర. పా.) 2. కల్లు గీచువాఁడు తోఁటలో వేసికొను నడిగుడిసె. (శ. ర.)

ఏలవాలుకము. సం. వి. అ. న. 1. ఒకానొక సుగంధ ద్రవ్యము. 2. హరివాలుకము. ♆.

ఏలా = ఏల. "గీ.అతని సేవింప కున్న నేలా ఫలించు." భీష్మ. ౪, ఆ. ౮౮. భార. కర్ణ. 3, ఆ. 3౯3.

ఏలాటము. దే. వి. చెరలాటము. "సీ. ఏనుఁగుతో నేల దేలాట మాడంగ..." నీతి. 3౯.

ఏలాపత్త్రము. సం. వి. అ. న. తక్కోలము ♆.

ఏలాపర్ణి. సం.వి.ఈ.స్త్రీ. రాస్న, పిరంగిచెక్క. ♆.

ఏలావాలుకము. సం. = ఏలవాలుకము.

ఏలి. దే. విశే. 1. కపటము. "సీ. పాలుపంపని యీశ యేలిమాటలన మమ్మలుక దీర్చెదరు..." భార. ఉద్యో. 3, ఆ. ౫. 2. ఇచ్చకము. భార. శల్య. ౨, ఆ. ౧౨౯.

ఏలిక. దే. వి. 1. రాజు, ప్రభువు. "గీ. ఏలికయుఁ దమరాకడ యెఱుఁగఁ జెప్పి." నీలా. ౨, ఆ. ౪౬. 2. భర్త, మగఁడు. "క. సిరియేలిక యగునరకే, సరి..." భీమ. ౧, ఆ. ౭౬.

ఏలికరాజనాలు. దే. వి. బ. ధాన్యవిశేషము. "సీ. ఏలికరాజనా లీశ్వరప్రియములు..." హంస. ౪, ఆ. ౧౨౮.

ఏలికసాని. ద్వ. వి. (ఏలిక+సాని.) రాజ్ఞి; యజమానురాలు. "ఆ. ఎల లోకములకు నేలికసానివై, ప్రదికె దనుచు దిశలు పలికె నధిప." భాగ. ౮, స్కం. ౨౬౨.

ఏలిదము. దే. వి. 1. ఎల్లిదము, చులుకఁదనము. 2. ఉపేక్ష. "క. బాలుఁ డని నమ్మి రిపుతో, నేలిదమునఁ గలసియునికి యిది కార్యమె..." భార. ఆది. ౬, ఆ. ౧౧౬. ("బాలశ్శత్రురుపేక్షితః..." అని మూలము.) విశే. చులుకన. "ఉ...ఇంతయే, నేలిద మైతినే తమకు..." కు. సం. ౧౦, ఆ. ౧౪౯.

ఏలినవాఁడు. దే. వి. (ఏలు. ధా.) ప్రభువు. భార. సభా. ౧, ఆ. 33. బ. గౌరవవాచకము. (వా.)

ఏలినాతఁడు = ఏలినవాఁడు. "గీ. తల్లి దండ్రియు నేలినాతండు గాఁడె." విప్ర. ౫, ఆ. ౪౦.

ఏలీక. సం. వి. ఆ. స్త్రీ. చిట్టేలకి ♆.

ఏలు. దే. స. క్రి. 1. పరిపాలించు. "గీ. ఏలుమీ లోక మెల్ల..." భార. ఉద్యో. ౪, ఆ. ౫౯. 2. కైకొను. "క. పద్మాధరణుల నేలిన, పద్మాక్షుని లీల..." దశా. ౧, ఆ. 3౦. 3. శాసించు, ఆజ్ఞాపించు. (చూ. ఏలుదెంచు.)

ఏలుకోటి. దే. వి. (ఏలు+కోటి.) ఏలుబడికి లోఁబడినజనము. ఆం. భా. ద్వి. ౧౧౬.

ఏలుదెంచు. దే. స. క్రి. (ఏలు+తెంచు. స్వార్థమున.) శాసించు. "క...వాలుగుసోఁగల నేలుదెంచి." భార. విరా. ౨, ఆ. ౮3.

ఏలుబడి. దే. వి. పాలనము. "సీ. జడధినాయకు నేలుబడి గన్నయిల్లాలు..." శుక. ౧, ఆ. ౪౮౫. విశే. పాలనమున నున్నది. "సీ...పుష్పాడితిన్నెగము లేలుబడిగఁ జేసి." చంద్రా. ౪, ఆ. ౮౪.

ఏలొకో. దే.అవ్య. (ఏల+ఒకో.) ఏలకో. (ఆం.పా.)

ఏలొకో = ఏలకో. (ఆం. పా.)

ఏల్బడి = ఏలుబడి. (పాలనమున నున్నది.) "గీ. చక్ర మేల్బడికాఁబోలు జఘనరమకు." వసు. ౨, ఆ. ౬౦.

ఏవ. దే. వి. 1. అసహ్యము, రోఁత. "ఉ... కొంటి నే, వ నృపదండ యొక్క మగవాఁ డిడ నేను

దెలుఁగురాయఁడన్." ఆము. ౧, ఆ. ౧౪. 2. అవధానము, ఎచ్చరిక. ఆం. భా. ప్ర. ౧౩౮. 3. రోషము, మాత్సర్యము. ఆం. భా. ప్ర. ౪౬.

ఏవకాఁడు. దే. విణ. (ఏవ+కాఁడు.) దుష్టుఁడు,నీచుఁడు. "ఆ. ఎదరు వేచి చెఱచు నేవకాఁ డగువాని, కంటె మేలు సూవె కాలయముఁడు." భా. రా. యు. ౨౨౯౩.

ఏవగించు. అ. క్రి. రోఁతపడు. "గీ. ఏవగింపక యుచ్చిష్ట మిష్టలీలఁ, దగిలి కుడుచుచున్నంత..." భార. ఆది. ౭, ఆ. ౧౯౮. 2. అసూయ చెందు. "సీ... అచ్యుతార్జునులు దనకు, నెక్కుడు నా విన్న నేవగించుచు నుండు..." భార. కర్ణ. ౨, ఆ. ౩౧౮. స. క్రి. 1. నిరసించు, "ఆ... అది గర్భేశ్వరి, యయ్యు నేవగింప దయ్యోఁగృష్ణ." భార. ఆది. ౭, ఆ. ౨౨౬. 2. విడుచు. "మత్త...ఈతనిబుద్ధి మీ, రేవగింపక చేకొనుండు..." భార. సభా. ౨, ఆ. ౨౩౬.

ఏవగింపు. దే. వి. 1. రోఁత. (వా.) 2. అపవాద ము. ఆం. భా. ప్ర. ౧౧౯.

ఏవపడు. ద్వి. అ. క్రి. (ఏవ+పడు.) రోఁతపడు. "ఆ. కిల్బిషంబు గోశకృన్మూత్రముల కేవ, పడుట ..." భార. అను. ౩, ఆ. ౩౨.

ఏవమ్. సం. అవ్య. ఇట్టిది. (ఇది సమాసపూర్వపదము గానే తెలుఁగున నుండును.) పారి. పీఠి. ౨౯.

ఏవము = ఏవ. 1. రోఁత. "ద్వి. ఎంగిలిపాల్గాని యేవంబు లేక." బస. ౭, ఆ. ౩౨. పు. 2. దుర్వృత్తి, చెడుపడవడి. "క...మా, యేవము వెనుకటిది చూడ కీక్షింపు కృపన్." ఆము. ౬, ఆ. ౯౯. విణ. 1. రోఁత యైనది. "క... ఇట్టి యేవపుచందంబు..." భార. విరా. ౨, ఆ. ౪౫. 2. నీచము. "చ...ఏవపుఁగొలు వైన నాకు నిలువక మది గొల్పదు..." భార.విరా. ౧, ఆ. ౧౫౭.

ఏవల. దే. వి. బొ. అవ్య. (ఏ+వలను.) ఏప్రక్క. "క. ఏవలఁ జూచిన..." భార. భీష్మ. ౧,ఆ.౮౧.

ఏవాఁడు. దే. స. 1. ఎవ్వఁడు. ఆము. ౪, ఆ. ౬౭. 1. ఎక్కడివాఁడు. "క. నీవేల వచ్చి తిచటికి, నేవాఁడవు..." హరి. ఉ. ౪, ఆ. ౧౯౦. 3. ఎల్లవాఁడు. (శ. ర.)

ఏవి. దే. స. (ఏ+అవి.) యచ్ఛబ్దార్థక బహువచన జడవాచకము, ఏయవి. (ఆం. పా.)

ఏవురు = ఏగురు. "క...అయ్యేవురు నిత్యంబు నివేగింతురు దగ్గికి..." భార. ఆది. ౬, ఆ. ౨౩౭.

ఏష. సం. వి. ఆ. స్త్రీ. 1. కోరిక. 2. గమనము.

ఏషణ. సం. వి. ఆ. స్త్రీ. 1. కోరిక. (దారైషణ, ధనైషణ, పుత్రైషణ—ఏషణత్రయము.) 2. యాచన.

ఏషణము. సం. వి. అ. పుం. లోహమయబాణము.

ఏష్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందఁదగినది. 2. కోరఁదగినది. 3. రాఁదగినది. 4. తిథిత్రయము గలది.

ఏస. దే. విణ. 1. చిన్నది. "ఉ. ఏసవిరిం విరించి నొకఁనేటునఁ దామరపొన్నుపైఁ బడం, ద్రోసిన జోదు మన్మథుఁడు..." నైష. ౧, ఆ. ౮౨. 2. వికృతము. "గీ. ఏసమాటలు..." చంద్రా. ౨, ఆ. ౩౫. 3. వక్రము. "వ...ఏసగాఁ దివిసి తడపిండ్లు చేసి..." స్వా. ౨, ఆ. ౧౧. క్రి. విణ. మిక్కిలి. (చూ. ఏసరేఁగు.) వి. వంకర. (ఆం. పా.)

ఏసరు. దే. అ. క్రి. అతిశయించు. "ఉ...ఆలపోఁ, తేసర రేఁగె..." ఏక్నా. ౪, ఆ. ౩౫.

ఏసరేఁగు. దే. అ. క్రి. (ఏస+రేఁగు.) విజృంభించు; అతిశయించు. "గీ. ఇట్టివి సర పరివార మేస రేఁగి, పైచుచిచ్చుల..." పంమా. ౮,ఆ.౧౭౭. పాండు. ౪, ఆ. ౭౩.

ఏసరేయు = ఏసరేఁగు. "వ...ఏసరేసినయవియుం బోలె గర్జిల్లుచు..." హరి. ౨, ఆ. ౨౦. (ఓస రేసిన ముద్రి.)

ఏసి. దే. అవ్య. 1. చొప్పున. "చ...ఇనూర్లు, రేసి హయంబుల నిచ్చి..." భార. ఉద్యో. ౩, ఆ. ౩౧౭. 2. పరిమాణసూచకము. "మ.. ఇంతలేసి ధోరలు..." భార. ఉద్యో. ౩, ఆ. ౯౫. చేసి

అనునది దీని మొదటిరూపము. సంధివశమున నేసి యనురూపము నందినది. రెండునేసి మొదలగునవియే ప్రాచీనప్రయోగములం గన్పట్టును. ఉదా:—"వ...ఏనునేసి యమ్ములు..." భార. ఆది. ౬, ఆ. ౨౮. (ఏనునేసి = ఐదుచొప్పున.)

ఏసె. దే. వి. నార, పోచ. (ఆం. పా., వా.)

ఏహ్యము. వై. విణ. (సం. హేయమ్.) రోతయైనది. "ద్వి. నెలలుగా నేహ్యపునెలవులం బుట్టి." నవ. ౪, ఆ. ౧౯౭ పు.

## ఐ

ఐ. ఉభ. ఒకానొకయక్షరము. (తత్సమేతరపదములలోని 'అయి' కి 'ఐ' యును, 'ఐ' కి 'అయి' యును దఱచు వచ్చుచుండును. ఉదా:—అయిదు—ఐదు. ఐనది—అయినది.) దే. అవ్య. 1. అగుధాతువుయొక్క క్త్వార్థకరూపము. "వ... ఆదండదళాకంబులు ముందటిచందంబు విడిచి విల్లును నమ్మును నై యున్నం జూచి..." భార. ద్రో. ౨, ఆ. ౩౭౨. 2. చతుర్థీవిభక్త్యర్థకములగు 'కి' 'కు' లు చివరగలపదముల కనుప్రయుక్తమగును. "ఆ...ఏమిధర్మంబు నడపుటకై..." భార. శాం. ౧, ఆ. ౨౧౯. "క. పలుపనుం గూటికి నై..." పాండు. ౩, ఆ. ౭౧. 3. స్వయముగా. "క. ఏనై పేల్కొనునంతకు..." భార. అను. ౨, ఆ. ౩౦౧. సం. వి. ఐ. పుం. శివుఁడు. (దీనికి తెలుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

ఐంగుదము. సం. వి. అ. న. 1. గారపండు. 2. గారపువ్వు. విణ. (అ. ఈ. అ.) గారచెట్టునకు సంబంధించినది.

ఐందవము. సం. వి. అ. పుం. చాంద్రమాసము. న. 1. మృగశీర్ష నక్షత్రము. 2. చాంద్రాయణవ్రతము. విణ. (అ. ఈ. అ.) 1. చంద్రునకు సంబంధించినది. 2. చంద్రదేవతాకమైనది.

ఐందవాతపము. సం. వి. అ. పుం. వెన్నెల. "ఆ... అపూర్ణశరశర, దైందవాతపంబునందు ..." భార. ఆది. ౮, ఆ. ౮౨.

ఐందవి. సం. వి. ఈ. స్త్రీ. వాణి, సరస్వతి.

ఐంద్రజాలికుఁడు. సం. విణ. (అ.ఈ.అ.) 1. ఇంద్రజాలవిద్య నేర్చినవాఁడు. 2. మోసకాఁడు.

ఐంద్రము. సం. వి. అ. పుం. 1. జ్యేష్ఠానక్షత్రము. "ఉ...ఐంద్రనక్షత్రయుతుండుగా..." భార. ఆది. ౫, ఆ. ౯౪. 2. అడవియల్లము శ. విణ. (అ. ఈ. అ.) 1. ఇంద్రునకు సంబంధించినది. 2. ఇంద్రదేవతాకమైనది.

ఐంద్రాగ్నేయి. సం. వి. ఈ. స్త్రీ. ఇంద్రాగ్నులు దేవతలుగాఁగలది—విశాఖానక్షత్రము.

ఐంద్రి. సం. వి. ఇ. పుం. 1. జయంతుఁడు. 2. అర్జునుఁడు. 3. వాలి. 4. మాలకాకి. ఈ. స్త్రీ. 1. ఒకానొకబుడ్కు. 2. ఒకానొక దేవీమూర్తి. 3. తూర్పుదిక్కు. 4. జ్యేష్ఠానక్షత్రము. 5. శచీదేవి. 6. దౌర్భాగ్యదేవత. 7. చిట్టేలకి శ. 8. దోస శ.

ఐంద్రియకము. సం. వి. ఇ. పుం. ఒకానొకరోగము. విణ. (అ. ఆ, యికా. అ.) 1. ఇంద్రియసంబంధి. 2. ప్రత్యక్షము. (చూచినది, విన్నది మొ.)

ఐకకంఠ్యము. సం. వి. అ. న. ఏకకంఠముతో మాటాడుట, పెక్కుపమాట యొక్కటి యగుట.

ఐకమత్యము. సం. వి. అ. న. ఒకటేమాటి కలిగియుండుట, పెక్కుర దొక్కటే యభిప్రాయ మగుట.

ఐకాంతికము. సం. విణ. (అ. ఈ. అ.) తప్పక కలుగునది.

ఐకాగారికుఁడు. సం. వి. అ. పుం. దొంగ. విణ. (అ. ఆ. అ.) ఒక్కయింటిలో నుండువాఁడు.

ఐకాత్మ్యము. సం. వి. అ. న. ఏకాత్మత, అభేదము.

ఐక్యము. సం.వి.అ.న. 1. ఏకత్వము. 2. ఐకమత్యము.

ఐక్షురము. సం. వి. అ. న. చెఱకుపానకము.

ఐచ్ఛికము. సం. విణ. (అ. ఈ. అ.) స్వేచ్ఛచేఁ జేయఁబడునది.

ఐణేయము. సం. వి. అ. పుం. నల్లయిఱ్ఱి. న. ఒకానొక రతిబంధము. విణ. (అ. ఈ. అ.) ఆఁడులేడికి సంబంధించినది. "సీ. ఐణేయమైన యొడ్డాణంబు లవణిచే నక్కళించినపొట్ట మక్కళించి." స్వా. ౧, ఆ. ౫౯.

ఐతి. దే. విణ. అయితి, శక్యము. (శ. ర.)

ఐతిహ్యము. సం. వి. అ. న. 1. పారంపర్యముచే న గునుపదేశము. 2. ప్రత్యక్షముగాఁ జూచినవారు లేక పరంపరగాఁ జెప్పుకొనువార్త.

ఐద. దే. అవ్య. ద్రు. వెంబడి. (బ్రౌ.)

ఐదంపర్యము. సం.వి. అ. న. సారము, ముఖ్యతాత్పర్య ము.

ఐదంయుగీనము. సం. విశే. (అ. ఆ. ఇ.) ఈయుగ మం దున్నది.

ఐదు. దే. స. ఔ. నాలుగునొకటి. కాశీ. ౧, ఆ. ౭౪., భార. శాం. ౪, ఆ. ౨౨౨.

ఐదుకైదువులజంత.ద్వ.వి.(ఐదు+కైదువులు+జంత.) పంచబాణుఁడు, మన్మథుఁడు. చం. రా. ౯, ఆ. ౯౯.

ఐదుగురు. దే. స. ఐదుమంది. (శ. ర.)

ఐదుతెగలచూపుజోదు. ద్వ. వి. (ఐదు+తెగలు+ చూపు+జోదు.) మన్మథుఁడు. వేంక. దేవ. ౧౦.

ఐదుపదిసేయు. దే. అ. క్రి. (ఐదు+పది+చేయు.) 1. నమస్కరించు. (శ. ర.) 2. వెనుదీయు. "గీ. ఐదుపదిసేసె పలరాజునంతవాఁడు." నైష. ౭, ఆ. ౧౬౮. హర. ౭, ఆ.౧౪౨.

ఐదుమోములవేల్పు. ద్వ. వి. (ఐదు+మోములు+ వేల్పు.) పంచముఖుఁడు, శివుఁడు. (శ.ర.)

ఐదువ. ద్వ. వి. (ఐదు+వన్నెలు గలది. శ. ర.) జీ వద్భర్తృక, సౌభాగ్యవతి. "క. పసుపుల నలుగిడి రైదువ, బిసరుహలోచనలు..." స్వా. ౫, ఆ. ౫౬.

ఐదువతనము. దే. వి. (ఐదువ+తనము.) సువాసినీ త్వము. (వ్య.)

ఐదువత్రాడు. దే. వి. (ఐదువ+త్రాడు.) మంగళసూ త్రము. "ఉ. యామవతీవిలాసినికి నైదువత్రాడు ... సోముఁడు దోఁచెఁ దూర్పునన్." వరాహ. ౪, ఆ. ౧౩., అచ్చ. అయో. ౫౩.

ఐదువరాలు. ద్వ. వి. ఔ. (ఐదువ+ఆలు.) సౌభా గ్యవతి. "క... ఎటులైన నైదువ, రాలై మనప డుచు గాఁగ నమరినఁ జాలున్." శుక. ౨, ఆ. ౧౫౧.

ఐద్దాయులు. దే. వి. బ. (ఐదు+దాయులు.) వడ్ల కమ్మర కంచర అగసాలె కాసె వారలపనులు. (శ. ర. బ్రౌ.)

ఐన. దే. విశే. అగుధాతువుయొక్క భూతార్థకవిశేష ణము. ఉదా:—ఐనపెండ్లి. అవ్య. ద్రు. అగుధా తువుయొక్క చేదర్థకరూపము. 1. ఐనచో, అయి నయెడల. ఉదా:—పనియైన వాఁడికఁ గనఁబ డఁడు. 2. ఏని. "ఆ... పగనైన వగనైన..." భాగ. ౧౦ స్కం. పూ. ౯౩౨. 3. పూర్వో త్తరపదవైరుద్ధ్యముఁ దెల్పును. "క. వినుమైనను సాపత్న్యం, బనుదోషము గలదు..." భార. ఆది. ౪,ఆ.౧౮౪. 4. ఉత్కర్షమును దెలుపును. "గీ. పలుకఁ బూఁబోఁడి కైనను నలవిగాదు." నై ష. ౨, ఆ. ౯. భార. భీష్మ. ౨, ఆ. ౯౨. 5. ఉపకర్షమును దెలుపును. "శా... భూమిమ్మైఁ, దే రైనం గలదే..." భాగ. ౮. స్కం. ౫౯౦. 6. అనిర్ధారకతఁ దెలుపును. "క...ఎచ్చో, నైనన్ ..." భార. శాం. ౫, ఆ. ౫౦౫.

ఐనసము. సం. వి. అ. న. ఏనస్సు, పాపము.

ఐనిల్లు. దే. వి. ఔ. 1. నట్టిల్లు. (శ. ర. బ్రౌ.) 2. మంచికుటుంబము. ఉదా:—ఆమె యైనింటి బిడ్డ. (వా.)

ఐపమొక్క. దే. వి. తెల్లనియొన్నులు వేసినవరి మొక్క. "గీ...అంబరము మడికరణి నుండె, నైపమొక్కలపోలెఁ జుక్క లమరె..." వరాహ. ౪, ఆ. ౧౪౭.

ఐపు. దే. వి. (క. అయిబు.) 1. జాడ. వ్యవ:—వాఁ డైపు లేకుండఁ బోయినాఁడు. 2. తప్పు. (శ. ర.)

ఐపోవు=అయిపోవు. (శ.ర.)

ఐమూలము=అయిమూల. (శ.ర.)

ఐయు=అయ్యు. (రూ.)

ఐర. దే. వి. 1. ఒకానొకనేత్రరోగము. "సీ... అక్షిరోగవిశేష మైర యనఁగ." ఆం. భా. ద్వి. ౧౨౭, 2. తిన్నఁదనము. (చూ. ఐరకొను.)

ఐరకొను. దే. అ. క్రి. (ఐర+కొను.) 1. సరియగు. "క...మహా, ఘోషవృషకంబునకు నైరకొని శా ల్వచ్చెన్." వేం. పం. చ. ౧, ఆ. ౯౯. (శ. ర.

పా.) 2. పెరుఁగు. "గీ. పొదుగుటయు నైరణాని గొన్నిపూఁటలకును, బికిలె డింభంబులు..." వేం. పంచ. ౧, ఆ. ౭౫౦.

ఐరగట్టు. దే. వి. నాఁగలికనిముట్టు, హలోపకరణము. ఆం. భా. ద్వి. ౫౩౧.

ఐరావణము. సం. వి. అ. పుం. 1. ఐరావతము, ఇంద్రునియేనుఁగు. 2. నారింజ. ✤. 3. సుధ.

ఐరావతము. సం. వి. అ. పుం. 1. ఇంద్రునియేనుఁగు. 2. ఒకానొకసర్పము. 3. నారింజ. ✤. 4. గజనిమ్మ. ✤. 5. ఇరావతీ నదీప్రాంత ప్రదేశము. న. 1. వంపు లేనియింద్రధనుస్సు. 2. రక్తచందనము. 3. దేవయానము.

ఐరావతి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఐరావతముయొక్క భార్య, అభ్రముపు. 2. మెఱపు. 3. ఒకానొక నది.

ఐరిణము. సం. వి. అ. న. పాంశలవణము, పెట్లుప్పు.

ఐరేని. దే. వి. ఏ. రంగులతోఁ జిత్తరువులు వేసిన పెండ్లికుండలు. "సీ. ఐరేనిఁ గొనివచ్చి రైదువల్..." విజ. 3, ఆ. ౯౫. నీలా. 3, ఆ. ౭౯.

ఐరేనికడవలు = ఐరేని. "సీ. పైఁడికుండల నేరుపడిన ముత్తెపుమేడ లైరేనికడవలయంచ మొంద. కువల. ౧, ఆ. ౭౦.

ఐరేయము. సం. వి. అ. న. అన్నమద్యము. విణ. (అ. ఈ. అ.) అన్నసంబంధమైనది.

ఐలబిలుఁడు. సం.వి. అ.పుం. 1. ఇలబిలకొడుకు, కుబేరుఁడు. 2. దిలీపుఁడనురాజు.

ఐలము. సం. వి. అ. న. అన్నరాశి. విణ. (అ. ఈ. అ.) భూసంబంధ మైనది.

ఐలారము. దే. వి. మూలికావిశేషము. (శ.ర.బ్రా.)

ఐలేయము. సం. వి. అ. న. ఏలావాలుకము.

ఐవచ్చు. దే. అ. క్రి. అచ్చివచ్చు. ఆం. భా. 3, ఆ. ౯౪.

ఐశాని. సం. వి. ఈ. స్త్రీ. ఈశానుని పట్టణము.

ఐశి. సం. వి. ఈ. స్త్రీ. 1. దుర్గ. 2. రాజ్ఞి.

ఐశ్వర్యము. సం. వి. అ. న. 1. ప్రభుత్వము. 2. విభూతి. (అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము—అష్టైశ్వర్యములు.) 3. సంపద.

ఐషమస్తనము. సం. విణ. (అ. ఈ. అ.) ఈసంవత్సరపుది.

ఐషమస్త్యము. సం. విణ. (అ.ఆ.ఆ.) ఐషమస్తనము.

ఐహలౌకికము. సం. విణ. (అ. ఈ. అ.) ఇహలోక సంబంధమైనది. (వ్యతి.) పారలౌకికము.

ఐహికము. సం. వి. అ. న. ఇహలోక వ్యాపారము. విణ. (అ.ఈ.అ.) 1. ఇహలోక సంబంధమైనది. 2. ఇచ్చటిది. (వ్యతి. పారమార్థికము.)

## ఒ

ఒ. ఒకానొకయక్షరము. దే. అవ్య. (క. ఒ.) ఇది ప్రశ్నార్థకకాక్వర్థములనే కాక సందేహ, సంభావనా, ప్రార్థనాదులను దెలుపును. ఉదా:—ఇది చేసెదో అది చేసెదో చెప్పుము. (ప్రశ్నార్థకము.) "మ...నిను మన్నింపఁడో..." శారి. ౫, ఆ. ౫౪. (కాక్వర్థకము.) "క...పద్మహితుఁడో హిమకరుఁడో శచీ, గృహమేధియొ ...భార. విరా. ౧, ఆ. ౫౧౪. (సందేహము.) "క. నాకు వినిపింతు రొకతఱి, నీకేఁ జెప్పుదునొ యనుచు..." కళా. ౭, ఆ. ౩౭. (సంభావన.) తండ్రీ; నను రక్షింపవొ. (ప్రార్థనము.) ఎవ రిట్లు చేయరో వారు శిక్షింపఁబడుదురు. (ఆజ్ఞ.) (ఇట్లే: ఇతరార్థముల నూహించునది.)

ఒంక. దే. వి. కరాంబుక ✤. (కాద్యధశాస్త్రము అని బ్రా.)

ఒంకియ = ఒంకె. (శ. ర.)

ఒంకె. వై. వి. (సం. వక్యమ్. క. ఒంకి.) చిలుకకొయ్య, బట్టలు తగిలించుటకు గోడ కమర్చు యంత్రము. (శ. ర. వా.)

ఒంగు = వంగు. (బ్రా.)

ఒంచు = వంచు. (బ్రా.)

ఒంజిలి = ఒందిలి. (త. ఒంజిల్.) (శ. ర. బ్రౌ.)

ఒంజెలి. దే. వి. కార్యము, పని. "గీ...అక్కఱ పని, యొంజలియు జోలి యనఁ గార్య మొనరు..." సాం. ని. మాన. ౨౮.

ఒంజొ. దే. వి. మత్స్యవిశేషము. (బ్రౌ.)

ఒంటడుగు. దే. వి. (ఒంటి+[illegible]డుగు.) మల్లబంధ విశేషము. (ఆం. పా.)

ఒంటనివాఁడు. దే. వి. వైరి, శత్రువు. "సీ...వైరి. గీ. మనును నొంటనివాఁ డన..." ఆం. భా. ద్వి. ౧౮౫. విణ. గిట్టనివాఁడు. "సీ. ఒంటని వారిపై నోర్వఁజాలనివారు లేనినేరంబు గల్పించి రేని." విప్ర. ౫, ఆ. ౪౦.

ఒంటమి. దే. వి. వైరము, పగ. ఆం. భా. ప్ర. ౧౩౪. "క. ఒంటమిని లేనియొంటరి, మింటరములు పల్కు టుచితమే..." భార. ఉద్యో. ౪, ఆ. ౨౩౬. ('ద్వేషాత్' అని మూలము.)

ఒంటరమింటరములు. దే.వి.బ. 1. పరుషవాక్యములు. "క. ఒంటమిని లేని యొంటరి, మింటరములు పల్కు టుచితమే..." ఉద్యో. ౪, ఆ. ౨౩౬. ('వాక్శరైః' అని మూలము.) 1. ఎక్కువతక్కువలు. (ఆం. పా.)

ఒంటరి. ద్వ. వి. 1. ఏకవీరుఁడు, అసహాయుఁ డగు శూరుఁడు. ఆం.భా.ద్వి. ౧౮౫.,య. ౫, ఆ.౬౪. 2. అడవిపంది. (ఆం.పా.) బ. కాలిబంట్లు. (ఆం. పా.) విణ. ఏకాకి, ఒంటిగాఁడు. (శ. ర.)

ఒంటరికత్తె. ద్వ. విణ. (ఒంటరి+కత్తె.) 1. ఏకాకిని. (బ్రౌ.) 2. ఒక్కస్త్రీ. (ఆం. పా.)

ఒంటరికా(గా)ఁడు. దే. వి. (ఒంటరి+కాఁడు.) 1. అసహాయశూరుఁడు. "ఆ. యూణనాథుఁడనక యొంటరికాఁ డన, కాకసమున కసువు లప్పగింప." రామా. ౮, ఆ. ౪౬. ఉ. రా. ౬, ఆ. ౪౧౪. 2. పంది. "సీ. క్రమ్మి యొంటరికాని దొమ్మి నొంచు యశంబు బైటిపల్లెలు గూల్చు బలిమి కలిమి." చంద్రా. ౧, ఆ. ౨౦. విణ. ఏకాకి. "క. బొజ్జలు పెరిగినసెట్టులు, నొజ్జలును దడీక ద్రోవ లొంటరికాండ్రున్, లజ్జ యెఱుంగని విటులును, సజ్జకముగ వారసతుల జన్మఫలంబుల్." మల్హ. ౨, ఆ. ౧౪.

ఒంటరిపడు. ద్వ. అ. క్రి. (ఒంటరి+పడు.) ఏకాకి యగు. (చూ. ఒంటరిపాటు.)

ఒంటరిపాటు. ద్వ. వి. ఏకాకిత్వము. (శ. ర.)

ఒంటగివాఁడు = ఒంటరికాఁడు. (ఆం. పా.)

ఒంటరీఁడు. ద్వ. వి. (ఒంటరి+ఈఁడు స్వార్థమున.) ఏకవీరుఁడు. ఆం. భా. ద్వి. ౧౮౫. బ. పరిజనము. "చ...ఒక్కయందలమునందుఁ దగఁ జని యెఁ విభుండు క్రేవలఁ దగ నొంటరీలు గొలువం గరదీపతతుల్ వెలుంగఁగన్." శుక. ౧, ఆ. ౩౬౦. (చూ. ౧, ఆ. ౩౬౫.)

ఒంటి. దే. వి. (క. ఒంటి.) ఒంటరితనము. "గీ. ఒంటి నెచ్చోటి కరుగుట యుక్తి గాదు." కాశీ. ౨, ఆ. ౬౫. విణ. ఒంటరి. ఆం. భా. త్రు. ౬౫. "చ...పావఁడు కౌరవసేన యెడ యొం, టి సనుట యేడ..." భార. విరా. ౫, ఆ. ౨౩౪.

ఒంటింపు. దే. వి. 1. అనుకూల్యము, వీలు. (శ. ర. బ్రౌ.) 2. వీఁడు వీఁ డీపని చేయవలయు నని యేర్పఱచు నేర్పాటు. (శ. ర.)

ఒంటికంటిగాము. ద్వ. వి. (ఒంటి+కంటి+గాము.) శుక్రగ్రహము. (శ. ర.)

ఒంటికంటియురుమ. ద్వ. వి. చర్మవాద్యము. హంస. ౩, ఆ. ౨౯.

ఒంటికా(గా)ఁడు. దే. వి. (ఒంటి+కాఁడు. క. ఒంటిగాఱ.) పంది. "గీ...ఒక్క, యొంటిగాని మహీనాథుఁ డొదిఁగి యేయ. స్వా. ౪, ఆ. ౪౬. విణ. 1. ఒంటరి. "ఉ. ఆయన యొంటిగాఁడు వెలయాండ్రతగు ల్గలవాఁడు..." శుక. ౩, ఆ. ౧౫౦. 2. వే ఱొకఁడు. "ఉ...ఒంటిగాఁ, డే యధికారి గావలయు..." అను. ౪, ఆ. ౨౧౮. 3. వియోగి. "సీ. అనురక్తి రేఁచునూతనసారసాటోప మొంటికాండ్రకుఁ బెంపు లొసఁగు నెచట." హంస. ౨, ఆ. ౩౦.

ఒంటికొమ్ముదేవర. ద్వ. వి. (ఒంటి+కొమ్ము+దేవర.) ఏకదంతుఁడు, విఘ్నేశ్వరుఁడు. ఆం. సం. దేవ. ౧.౨. ఇట్లే: ఒంటికొమ్మువేల్పు, ఒంటిపల్లదేవర. సాం. ని. దేవ. ౪.

ఒంటిజందెమువాఁడు. ద్వ. వి. (ఒంటి+జందెము+వాఁడు.) వడుగు, బ్రహ్మచారి. "సీ. వడు గొంటి జందెమువాఁడు బమ్మచారి..." సాం. ని. మాన. ౭.

ఒంటిపడు. ద్వ. అ. క్రి. (ఒంటి+పడు.) అసహాయుఁ డగు. "మ. తనవా రెల్లరు వోవ నొంటి పడి..." కేయూర. 3, ఆ. ౨౯౭. ఇట్లే: ఒంటి వడు. భార. ఆశ్ర. ౨, ఆ. ౧౫.

ఒంటిపాటు. ద్వ. వి. (ఒంటిపడు. ధా.) ఏకాంతస్థితి. "గీ. ఒంటిపాటున నవ్వాలుఁగంటి నంటి, యంటుకొనఁ జూచి యోవరో యయుక్త మనుచు." శశాం. ౨, ఆ. ౭౯.

ఒంటిపోఁగు. దే. వి. (ఒంటి+పోఁగు.) ఏకకుండలుఁడు, బలరాముఁడు. "ఉ. సీరికి నొంటిపోఁగు ను విశేషము లే..." శశాం. ౨, ఆ. ౨౦.

ఒంటియ. = ఒంటె. (శ. ర.)

ఒంటియడుగు కత్తెర. ద్వ. వి. ఒకానొక మల్లబంధము. ప్రబంధ. ౭౪.

ఒంటీలు. దే. వి. బ. చెవిపోఁగులు, స్త్రీపురుషులు ధరించు కర్ణభూషావిశేషము. (బ్రౌ. వా.) "సీ. (శివుఁడు.) ... ఒంటీలుదాల్చి, విదియచందురు తురా గదియించి..." పార్వ. ౫,ఆ.౧౭౯.

ఒంటు. దే. అ. క్రి. (క. ఒంటు.) పొందు పొసఁగు. "మ...సర్వకాలంబు న, త్తతుఁగోడండ్రకు నొంటకుండెడును..." వరాహ. ౨, ఆ. ౧౫౦. స. క్రి. స్పృశించు, ముట్టు. "రగడ. కమలము లంటుచుఁ గలువల నొంటుచు, మలసె నుదారము మలయసమీరము." శశాం. ౨, ఆ. ౧౧౮. వి. గ్రామసమూహము. (శ. ర.) బ. కర్ణభూషా విశేషము. "సీ. చెవులయొంటులఁ జిక్క సవరించి ..." శుక. ౧, ఆ. ౧౧౬.

ఒంటుకొను. దే.స. క్రి. (ఒంటు+కొను. స్వార్థమున.) రమించు. "గీ. ఒంటిపాటున నవ్వాలుఁగంటి నంటి, యొంటుకొనఁ జూచి..." శశాం. ౨, ఆ. ౭౯.

ఒంటుబావిలి. దే. వి. కర్ణభూషావిశేషము, ఒంట్లు. (బ్రౌ.)

ఒంటె. వై. వి. (సం. ఉష్ట్రః. క. ఒంటె.) లొట్టిపిట్ట. ఆం. భా. ద్వి. ౨౬౫.

ఒంట్రింపు. దే. వి. ఒంటరీఁడు. ఆ. భా. ద్వి. ౧౪౫.

ఒంట్లు. యు. దే. వి. బ. (ఒంటు+లు.) కర్ణభూషా విశేషము. (శ. ర.) వై. అంకెలు. (శ. ర.)

ఒండు. యు. దే. వి. వరదనీరు తీసినపిమ్మట భూమిని బట్టుకొనిన బురద. (బ్రౌ. ఆం. పా. వా.) వై. స. ౘౌ. (సం. ఏకః.) 1. అన్యము. "ఉ...మీ, రొండువిధంబు సేయు టెది యుక్తమొ..." భార. ఆది. ౨, ఆ. ౪౪. 2. ఏకము. "సీ. ఒంటికాలనె నిల్చి..." సైమ. ౧, ఆ. ౯౪. 3. పరస్పరము. "గీ...ఒక్కటఁ గలసి యాఁడు, చున్న యెలుకలఁ బిల్లులు నొండు సహజ, వైరివర్గంబులయు సహవాస మపుడు, సూచి మునిశక్తి కెంతయుఁ జోద్య మంది." భార. ఆది. ౪, ఆ. ౨౩.

ఒండె. దే. అవ్య. ద్రు. పక్షాంతరమును దెలుపును. "గీ. అష్టమీభానువాసరంబందునొండె, నొండె నేని చతుర్దశి..." భీమ. ౬, ఆ. ౭౩.

ఒండెనేని = ఒండె. భీమ. ౬, ఆ. ౭౩.

ఒండేని = ఒండె. "సీ. అనుమతి నిచ్చిరో యావేల్పు లొండేని బలిమిఁ జేకొనియెనో పాడి దొఱఁగి." పారి. ౧, ఆ. ౩౬.

ఒండొండ. దే. అవ్య. (ఒండు+ఒండు+అ.) 1. క్రమముగా. "వ... నెత్తురొండొండవరఁగి పరశురాముశరీరంబుఁ జొచ్చిన..." భార. శాం. ౧, ఆ. ౨౨. 2. ఒకటితరువాత నొకటి. "గీ... ఇప్పు డొండొండ పొంగి, కలయఁబాఱుఁ బయోధులు..." భార. అర. ౪, ఆ. ౨౨౪.

ఒండొండు. దే. స. ౘౌ. (ఒండు+ఒండు.) పరస్పరము, అన్యోన్యము. "సీ...ధర్మార్థకామంబు లొండొంటి బాధింపకుండ..." భార. సభా. ౧,ఆ.౫౫. "గీ. ఉగ్రశస్త్రాస్త్రనికర మొండొంటిఁ దాఁకి." శు. సం. ౧౧, ఆ. ౧౧౩.

ఒండొక. దే. స. (ఒండు+ఒక.) వేఱొక. "క. దీపంబువలన నొండొక, దీపము పుట్టించినటు

...” భార. ఆది. ౪, ఆ. ౮౯. అవ్య. ఇంచుక. “శా. అన్నం బొండొక లేదు...” పాండు. ౪, ఆ. ౧౭౬.

ఒండొకఁడు. దే. స. (ఒండు+ఒకఁడు.) ఇతరుఁడు. “గీ. ఒక్కఁ డార్యులు గీత లొండొకఁడు...” ఆము. ౨, ఆ. ౭౪.

ఒండొకరుఁడు. దే. స. (ఒండు+ఒకరుఁడు.) పరస్పరము. “గీ...ఒండొకళ్లఁ, బిలిచికొనుచు...దేవాసురులు దుగ్ధవనధిఁ జేరి.” దశా. ౨, ఆ. ౧౮౩.

ఒండొరుఁడు = ఒండొకరుఁడు. “క...ఒం, డొరుఁ దాఁకి వీఁకఁ బొడిచిరి...” భార. ఆది. ౪, ఆ. ౧౯౪. సభా. ౨ ఆ. ౧౩౧.

ఒండొరువుఁడు = ఒండొరుఁడు. “క. ఇరువురు నొం డొరువుల...” భార. ఆది. ౪, ఆ. ౧౪౬.

ఒండ్లు. దే. విణ. అన్యులు. (ఆం. పా.)

ఒండ్లులు = ఒండొరులు. “గీ...పొలఁతు లొండ్లులవయంబుల కన్నింటి కపయమైన, పసదనంబులు నాల్కొల్పి భావ మెసఁగఁ, జేసి రమకు శృంగారంబు చెలువుమిగుల.” కు. సం. ౯, ఆ. ౧౩.

ఒందించు. దే. స. క్రి. (ఒందు. ధా. ప్రే.) కలుగఁజేయు. “ఆ...సిరుల నొందించు...” విక్ర. ౨, ఆ. ౧౫౩.

ఒందిక = ఒద్దిక. (శ. ర.)

ఒందిలి = ఒంజిలి. దే. వి. **1.** దుఃఖము. (చూ. ఒందిలిపడు.) **2.** ఆపద. (ఆం. పా.) విణ. దుఃఖితుఁడు. దీనుఁడు. “సీ. విడుతురు బంధు లవ్విధమున నొందిలియై చేయునది లేక...” భాగ. ౧౦, స్కం. ఉ. ౧౨౩౪.

ఒందిలిపడు. ద్వ. అ. క్రి. (ఒందిల్+పడు.) దుఃఖపడు; దైన్యమందు. “వ. సహాయరహితులై యొందిలిపడి...” హరి. ఉ. ౧, ఆ. ౮౮.

ఒందు. దే. అ. క్రి. (క. ఒందు.) **1.** కలుగు. “మ... ...పౌరచిత్తముల కత్యానంద మొందంగ...” భార. ఆది. ౮, ఆ. ౭౯. **2.** ఇంపగు, రుచ్యమగు. “ఉ...నా, కొందఁగ వండి పెట్టుము...” భార. ఆది. ౬, ఆ. ౧౮౬. స. క్రి. **1.** పొందు, పడయు. “చ...మీరు.... జననము నొందినారు ...” భాగ. ఆర. ౪, ఆ. ౧౮౧. **2.** ప్రవేశించు. “ఉ...తనమందిర మొంది...” కేయూర. **౩**, ఆ. ౨౭౪. **3.** కలియు, రమించు. “క. గురు విందఁ జైత్రుఁ డొందఁగ...” పారి. ౩, ఆ. ౪౮.

ఒంపు. దే. వి. **1.** వంపు, వంకర. వ్యవ:—ఆకట్టకు ఒంపులు తీసినాఁడు. (బ్రా.) **2.** సొంపు, సౌందర్యము. “గీ. ఒంపు గలదాని నొయ్యార మొలుకుదాని, నొక్కవిద్యాధరిని గాంచె యోగివరుఁడు.” దశా. ౨, ఆ. ౧౦.

ఒక. వై. స. (సం. ఏకః. ప్రా. ఏకో.) వృత్తియందు ప్రత్యయము లోపించినరూపము. ఒకండున్, కొండొక మున్నగునవి విశేషరూపములు. **1.** ఒక్కటి. భార. ఆది. ౪, ఆ. ౯౩. **2.** సామాన్యము. “క. నరుఁ డొకరథికుని యనుమతిఁ, జొరఁ దలఁచునె...” భార. ద్రో. ౪, ఆ. ౧౪౭. **3.** అన్యము, మఱియొకటి. “ఆ. నీ విదేమి చెప్పనేఁ డొకలాగున, గానిపించుచున్నదాన వబల.” కళా. ౭, ఆ. ౧౨౮. **4.** కొంత. “క...ఇరువురు, నొకపడి పోరాడి...” హరి. ఉ. ౧౦, ఆ. ౧౭౬. (ఇట్టి: ఈపద మనిర్వాచ్యా నిర్దేశాదులను తెలుపును. పారి. ౧, ఆ. ౧౫౬; భార. ఆది. ౫, ఆ. ౨౩౯.)

ఒకఁడు. వై. స. (సం. ఏకః.) ఒక్కటి. “క. మన కొకటం బాపము రా, కునికికి...” భార. ఉద్యో. ౩, ఆ. ౩౧. **2.** ఒక్కవ్యక్తి. “క. ఎల్లరు మెచ్చని మత్కృతి, నుల్లంబున మెచ్చుఁగాక యొకఁడు...” కవిక. పీఠి. ౨౦. **3.** ఇతరుఁడు. వా:—వాఁ డొకనిమాట వినఁడు. **4.** ఏకీభవించినవాఁడు. “ఉ. అగ్గణముఖ్యులోడ నొకఁడై ...” హర. ౧ ఆ. ౭౧.

ఒకట. వై. అవ్య. ద్రు. ఏకకాలమున. “గీ...కృష్ణుఁడు నాలుగుతూపు లొకట, నేసి...” హరి. ఉ. ౧, ఆ. ౧౭౦.

ఒకటి. వై. స. (సం. ఏకః.) **1.** ఏకము. “చ... పూని యొకటిం గడతేర్పఁ గడంగలేక యొల్లిదులగువారి కేటికి సలీలవిహారము వేడ్కఁ జేయఁగన్.” నిర్వ. ౮, ఆ. ౭. **2.** ఒక్కవిషయము.

... "గీ. ... ఒకటి ని న్నడిగి తెలియ, వలయు..." కళా. ౭, ఆ. ౬. 3. వేఱు. "క. నెలఁతా రత్నాంగి యొకటి నీ వొక్కటియే." సా. ౨, ఆ. ౧౦౯. 4. సమానము. వ్యవ:—ఈ విషయమున వారిరువురు నొకటియే. "సీ. ఒకటికి నెల వియ్య నుఱికి చీకటిదాఁకఁ పసులగాపరుల వెంబడిన పోఁడు. హంస. 3, ఆ. ౧౪౨.

ఒకత. వై. స. ఏ. ఒకతె, ఒకస్త్రీ. "క. నీ వొకత వేల..." భార. విరా. ౨, ఆ. ౨౫౬.

ఒకతి = ఒకతె. (శ. ర.)

ఒకతుక = ఒకతె. (శ. ర.)

ఒకతె. వై. స. ఏ. ఒకశబ్దముయొక్క మహన్మహత్త్వార్థకరూపము. 1. ఒకస్త్రీ. "సీ...చనియె నొకతె." కళా. ౭, ఆ. ౧౪౮. 2. మఱియొకస్త్రీ. ఉదా: ఒకతె వెళ్లి ఒకతె వచ్చినది. (వా.)

ఒకప్రొద్దు. వై. వి. (ఒక+ప్రొద్దు.) ఉపవాసము. "ఆ. కొఱ్ఱగింజ నోరఁ గొఱికియు నొకప్రొద్దు, నెఱపుకొన్న విభము..." కుచేల. 3, ఆ. ౫౨.

ఒకరిత. వై. స. ఏ. ఒకశబ్దముయొక్క మహన్మహత్త్వార్థక రూపము. 1. ఒక్కస్త్రీ. "గీ. వీణవాయింపఁ బొగడంగ విరులు గట్టి, నేర్చునట్టిది యొకరుత..." కాశీ. ౫, ఆ. 3౧౬. మఱియొకస్త్రీ.

ఒకరితి = ఒకతె. (శ. ర.)

ఒకరితె = ఒకతె. (శ. ర.)

ఒకరుఁడు. వై. స. 1. ఒకానొకఁడు. "చ. కలఁ డొకరుఁడు..." ఆము. ౬, ఆ. 3. 2. ఒక్కఁడు. "క. ఆవేళ నొకట్ల లేమి కష్మత మయ్యెన్." హర. ౨, ఆ. 3౮. 3. ఇతరుఁడు. "చ. ఒకరుని శేలిప్రోపును..." భార. ఉద్యో. ౨, ఆ. ౭౭. 4. ఏకాకి. "చ...ఒకరుండు వింధ్యభూధరమున కేఁగి..." విక్ర. ౨, ఆ. ౨.

ఒకరువుఁడు = ఒకరుఁడు. (శ. ర.)

ఒకర్త = ఒకరిత. (శ. ర.)

ఒకర్తి = ఒకరిత. (శ. ర.)

ఒకర్తు = ఒకరిత. కాశీ. ౫, ఆ. 3౧౬.

ఒకర్తుక = ఒకరిత. (శ. ర.)

ఒకర్తె = ఒకరిత. "గీ. చీరఁ గొంగేలఁ బూన నెచ్చెలి యొకర్తె." దశా. 3, ఆ. ౧౧౮.

ఒకానొక. వై. స. 1. ఒక్క. "మ...ఒకానొక మరుస్నారీశిరోరత్నముల్." స్వా. ౨, ఆ. ౨౫. 2. నిర్దిష్టమైన యొక్క. ఉదా:—ఏల—ఒకానొకనది. ఇట్లే: ఒకానొక్క. శుక. ౧, ఆ. ౪33.

ఒకింత. వై. స. (ఒక+ఇంత.) మిక్కిలి కొంచెము. భార. విరా. ౫, ఆ. ౧౪౧.

ఒకో = ఒక్కొ. 1. ప్రశ్నమును సూచించును. "క. ఒకభంగిఁ బాపికొనరా, దొకో మిథ్యానింద..." నిర్వ. ౮, ఆ. ౧౨౧. 2. సందేహమును దెలుపును. "క...భీముఁడొకో..." భార. ద్రో. ౨, ఆ. ౨౭౯. 3. ఊహను దెలుపును. "చ...సూర్యమండలమొకో..." భార. ఆది. ౫, ఆ. ౨౬. 4. కాక్వర్థకము. "శా. ఘంటాకర్ణుని మించు కర్మమొకో..." ఆము. ౬, ఆ. ౫౮. ఇట్లే: ఒకో.

ఒకోఁడు = ఒకఁడు. (శ. ర.)

ఒకోట = ఒకట. (శ. ర.)

ఒకోటి = ఒకటి. (శ. ర.)

ఒకోత = ఒకోతె. (శ. ర.)

ఒకోతి = ఒకోతె. (శ. ర.)

ఒకోతుక = ఒకోతె. (శ. ర.)

ఒకోతె. వై. స. ఏ. ఒక్కస్త్రీ; మఱియొకస్త్రీ. (శ. ర.)

ఒకోరిత = ఒకోతె. (శ. ర.)

ఒకోరితి, ఒకోరితె = ఒకోరిత. (శ. ర.)

ఒకోరుఁడు, ఒకోరువుఁడు = ఒకరుఁడు. (శ. ర.)

ఒకోర్త = ఒకత. (ఇదియుఁ గేవలార్థకైకార్థక నిర్దేశార్థకము. చూ. ఒక. శ. ర.)

ఒక్కంత. ద్వ. విశే. 1. ఒక్కపరిమాణము గలది, సమానము. "శ...గృహంబుం, గాంతార దేశమును నొక్కంతగ నిశ్చింతవృత్తి నత్యోభ్యుఁదగున్." భార. శాం. ౫, ఆ. 33౭. 2. ఖం

దము లైనది. "ఉ...చాప మొ, క్కంతగఁ ద్రుంచి..." జై. ౨, ఆ. ౭౪. 3. ఏక మైనది. "ద్వి. అన్నివాయువుల నొక్కంతగాఁ గూర్చి." రం. రా. ఉ. ౧౦, పు. 4. ఒక్కమాఱుగా. ఆం. భా. తృ. ౪౦.

ఒక్కఁడు = ఒకఁడు. (శ. ర.)

ఒక్కట. వై. అవ్య. ద్రు. 1. ఒక్కసారిగా. "గీ. పాండుసుతుల శిఖండియుఁ జాడశక్తి, మెఱయ నొక్కటఁ బైఁబడ్డ..." భార. భీష్మ. ౧, ఆ. ౫౪. 2. కూడ. భార. ఆది. ౭, ఆ. ౧౬౦. 3. ఒకచోట. ఆం. భా. తృ. ౭౯.

ఒక్కటి = ఒకటి. వై. స. ఏ. 1. ఏకము. భాగ. 3, స్కం. ౧౪౬. 2. వేయి. సా. ౨, ఆ. ౧౦౯. 3. ఏకీభవించినది. "క. నామన సొక్కటి య య్యెను..." భో. ౬, ఆ. ౬౨.

ఒక్కత = ఒక్కతె.
ఒక్కతి = ఒక్కతె. } (శ. ర.)
ఒక్కతుక = ఒక్కతె.

ఒక్కతె. వై. స. ఏ. ఒక్కశబ్దముయొక్క మహత్యర్థకరూపము. ఒకస్త్రీ; మఱియొకస్త్రీ. భార. ఆది. ౮, ఆ. ౩౧౩.

ఒక్కప్రొద్దు = ఒకప్రొద్దు. శశాం. ౨ ఆ, ౧౩౬.

ఒక్కము. వై. వి. ఏకసంఖ్య. (ఆం. పా.)

ఒక్కయుమ్మడి. వై. అవ్య. ద్రు. (ఒక్క+ఉమ్మడి.) ఏకకాలమున. మార్క. ౬, ఆ. ౧౭౦.

ఒక్కరతె = ఒక్కరిత. "చ. అలికులవేణి నొక్కరతె నంటఁగఁ బట్టి..." శ్రీరాధా. ౫, ఆ. ౨౧౫.

ఒక్కరిత. వై. స. ఏ. ఒక్కస్త్రీ; మఱియొకస్త్రీ. "శా. నే నింకొక్కరితన్ స్పృశింతు..." ఉ. రా. ౫, ఆ. ౨౪.

ఒక్కరితి = ఒక్కరిత. (శ. ర.)

ఒక్కరితె = ఒక్కరిత. (శ. ర.)

ఒక్కరుఁడు = ఒకరుఁడు. "గీ. ఒగి నిరాయుధహస్తుఁ డై యొక్కరుండు." వి. పు. ౮, ఆ. ౯౦.

ఒక్కరుత = ఒక్కరిత. "చ. చిలుకలకొల్కి యొక్కరుత..." అహ. ౧, ఆ. ౬౨.

ఒక్కరువుఁడు = ఒకరుఁడు. (శ. ర.)

ఒక్కర్త, ఒక్కర్తి, ఒక్కర్తు, ఒక్కర్తుక, ఒక్కర్తె = ఒక్కరిత. (శ. ర.)

ఒక్కసికొక్కు. దే. వి. బాలక్రీడావిశేషము, పిల్లలాడుకొను నొకానొకయాట. "సీ. గడ్డెనబోడి యొక్కసికొక్కు..." హంస. 3, ఆ. ౧౪౬.

ఒక్కాణము. వై. వి. (సం. వ్యాఖ్యానమ్.) వ్యాఖ్యానము, చెప్పుట. (చూ. ఒక్కాణించు.)

ఒక్కాణించు. వై. స. క్రి. వ్యాఖ్యానించు; చెప్పు. (ఆం. పా.)

ఒక్కాస్తి. ద్వ. విశ. (ఒక్క+ఆస్తి.) ఒక్కపరిమాణము గలది. రా. వి. ౨, ఆ. ౪౪.

ఒక్కుమ్మడి = ఒక్కయుమ్మడి. భార. ద్రో. ౨, ఆ. ౫౫.

ఒక్కెఱ. క్రి. విశ. హఠాత్తుగా. "చ. వఱలఁగ రాముఁ డంత..., అఱచుచు నున్నతల్లిని గృతాంతవశస్థితుఁ డైనతండ్రి నొ,క్కెఱఁ గని..." భార. ఆర. 3, ఆ. ౧౫౩. భార. ఆది. ౫, ఆ. ౨౫౬.

ఒక్కొ. వై. స. ఏ. ఒక. "సీ...అలరు లందిచ్చె నొక్కొలతానిభాత్యంత కోమలాంగి." వసు. ౫, ఆ. ౮౪. అవ్య = ఒకో. ఇట్లే: ఒక్కొ.

ఒక్కొఁడు = ఒకఁడు. (శ. ర.)

ఒక్కొక్కళ్లు. వై. స.బ. ఒకఁడొకఁడు. భార. ఆర. ౪, ఆ. ౧౩౧.

ఒక్కొట = ఒకట. భా. రా. అర. ౩౫.

ఒక్కొటి = ఒకటి. భార. విరా. ౨, ఆ. ౨౪౦.

ఒక్కొత, ఒక్కొతి, ఒక్కొతుక = ఒక్కతె. (శ. ర.)

ఒక్కొతె = ఒక్కత. (శ. ర.)

ఒక్కొమొగి = ఒక్కుమ్మడి. భార. కర్ణ. ౨, ఆ. ౩౫౨.

ఒక్కొరిత. వై. స. ఏ. ఒక్కొయొక్క మహత్యర్థకరూపము. ఒకస్త్రీ: మఱియొకస్త్రీ. (శ. ర.)

ఒకొ్కరితి, ఒకొ్కరితె = ఒకొ్కరిత. (శ. ర.)

ఒకొ్కరుఁడు = ఒకొరుఁడు. (శ. ర.)

ఒకొ్కరువుఁడు = ఒకరుఁడు. (శ. ర.)

ఒకొ్కర్త, ఒకొ్కర్తి, ఒకొ్కర్తు, ఒకొ్కర్తుక, ఒకొ్కర్తె = ఒకొ్కరిత. (శ. ర.)

ఒగరు. వై. వి. (సం. తువరః. క. ఒగరు.) కషాయరసము. (చూ. ఒగరెక్కు.) విణ. ఒగరైనది. ఉదా:—ఒగరుంజిగురులు. "క...య. ౪, ఆ. ౩౧.

ఒగరుచు = ఒగర్చు. (శ. ర.)

ఒగరుపు. దే. వి. (ఒగరుచు. ధా.) ఒగర్చుట. (ఆం. పా; వా.)

ఒగరెక్కు. ద్వ. అ. క్రి. (ఒగరు+ఎక్కు.) ఒగరగు. "మ. ఒగరెక్కం గడుతేఁతలై..." చిత్రభా. ౨, ఆ. ౧౦౦.

ఒగర్చు. వై. అ. క్రి. 1. ఒగరెక్కు. "సీ. నులివాఁడు నాచువల్లుల గొం తొగర్చి..." ఆము. ౨, ఆ. ౫౩. 2. ఆయాసపడు. (వా.)

ఒగర్పు = ఒగరుపు. (ఆం. పా.)

ఒగి. దే. అవ్య. ద్రు. 1. క్రమముగా. "మత్తాక్కర. తనజనకుండు నన్నప్రదాతయును భయత్రాత యును ననఁగ నింతులకు మువ్వు రొగిన గురులు." భార. ఆది. ౪, ఆ. ౪౮. 2. చక్కఁగా. ఆం. భా. తృ. ౬౭. 3. శ్రద్ధతో. "ఆ...అందయొగిఁ బిండమిడినవా, రనఘ పితృదయను గృతార్థు లగుదు, రు..." భార. అర. ౨, ఆ. ౨౭౫. 4. వాక్యాలంకారముగాఁ గొన్నియెడలఁ గాన నగును. "గీ. ఒగి నిరాయుధహస్తుఁడై యొక్కరుండు." వి. పు. ౮, ఆ. ౧౮.

ఒగుడు. దే. వి. జొన్న మున్నగువానియొక్క యెండినయాకు. (శ. ర. బ్రా.) "గీ. గాలిఁ బోయెడి యొగుడాకుగతిఁ గరంబు..." కుచేల. ౨, ఆ. ౭. (బ్రా. పా. 'పరుగాకు' ముద్రి.)

ఒగుడుకటచు. దే. అ. క్రి. (ఒగుడు+కటచు.) కృశించు, చిక్కు. (శ. ర.)

ఒగ్గము. దే. వి. 1. ఓదము. "క. ఒగ్గములు ద్రవ్వి..." భాగ. ౧, స్కం. ౪౫౪. 2. తలిమెన పెట్టెఁదగినవస్తువు కదలకుండ నుంచుపనిముట్టు. "చ...అంబుజబాంధవుఁ డియ్యకొన్న నా, తనికటుదీప్తి మండలి ముదంబున నొగ్గమునం దమర్చి వే, తుని యఁగఁ దర్చె..." హరి. పూ. ౧, ఆ. ౧౯౧.

ఒగ్గాళము. వై. విణ. (సం. ఉగ్రమ్.) ఉగ్రము, భయంకరమైనది. "సీ. కటికియొగ్గాళంపు గండకత్తెర వట్టి మిసిమింతులును గాక మ్రింగువారు." క్రీడా. ౧౪౨.

ఒగ్గు. దే. అ. క్రి. 1. లగ్నమగు, తగులుకొను. "క. దిగ్గజకుంభస్తనిపై, నొగ్గినభావంబు నూఁది యుడుపతి యుండెన్." శశాం. ౨, ఆ. ౧౦౯. 2. సిద్ధపడు; రతికి సిద్ధపడు. "గీ...పునారతికి నొగ్గు." దశా. ౮, ఆ. ౩౯. "క...అతలోదరి నాథుం, డని యొగ్గ నతఁడు తద్రతిఁ, దనిసి..." శుక. ౪, ఆ. ౧౯. 3. ఒప్పు, ఇష్టమగు. "ఉ...అతని కీపనికిన్ మన సొగ్గదో..." కువల. ౫, ఆ, ౨౭. 4. వశమగు, లోఁబడు. "చ...భావజుత్రిక్కుల నొగ్గి యొగ్గు సి, గ్గెఱుఁగక..." ఉ. రా. ౬, ఆ. ౨౧౦. స. క్రి. 1. ఉంచు, పెట్టు. "ఆ. ఆనెలంత మెడకు నడ్డంబుగా మెడ, యొగ్గె..." కళా. ౩, ఆ. ౧౧౯. 2. పట్టు. "చ. ...దోయి లొగ్గుచున్..." ఆము. ౨, ఆ. ౫౯. 3. ప్రవణముచేయు. "శా. ఆమాటల్ చెవియొగ్గితా వినియెనా..." పారి. ౧, ఆ. ౮౩. 4. ఒడ్డు; కన్ను. "సీ. పంచె నొగ్గిన..." కువల. ౨, ఆ. ౪౫. "క...బోనులు, నచ్చుట వెస నొగ్గి చనిన..." విక్ర. ౫, ఆ. ౨౧౨. 5. పంచు. బస. ౪, ఆ. ౧౦౮.

ఒగ్గుబల్ల. దే. వి. (ఒగ్గు+బల్ల.) తలిమెన పట్టెడుకొయ్యకాధారమైనబల్ల. (శ. ర.)

ఒచ్చెము. దే. వి. (క. ఒచ్చెయ.) 1. అవమానము. "క...ఒచ్చెమైనఁ బిమ్మట నగరే..." భార. ఉద్యో. ౩, ఆ. ౧౬౩. ('అవమానశ్చయత్ర స్యాత్' అని మూలము.) కాశీ. ౫, ఆ. ౩౨౪. 2. దోషము; లోపము. "ఉ. ఒచ్చెము లేనిచోఁ గదకు నొచ్చెములు..." విప్ర. ౧, ఆ. ౧౪.

"గీ. శివుని౯ దోడ్తేనియొక్క... యొచ్చెంబు కాని." కాశీ. ౨, ఆ. ౫౭. **3.** భంగపాటు. "క...కన్నెఱిక, మ్మొచ్చెము గన..." ఉ. రా. ౧, ఆ. ౧౯౪. **4.** హైన్యము. "సీ. యోగీంద్రవంద్యుం డయ్యును సుగ్రసేనుని నోలగించిననాఁటి యొచ్చె మొకటి." జై. ౧, ఆ. ౪౪. విణ. అవమానకరము. "ఉ...నైజ మగుహీనత గల్గినచెప్పు టొచ్చెము..." నైష. ౪, ఆ. ౫౪.

ఒచ్చెల. దే. అవ్య. ఓచెల్ల. (సంతాపాశ్చర్యాదులఁ దెల్పును.) "ఉ..., అచ్చుపు బ్రహ్మచర్యము ప్రయత్నమునం జరియించుచుండి నే౯, డొచ్చెల శైలాద్రభామినికి నువ్విళులూరి పక్షంబుఁ దప్పఁగా, వచ్చునె..." విక్ర. ౧, ఆ. ౧౫౦. ఆము. ౫, ఆ. ౧౩౨.

ఒచ్చెల్ల = ఒచ్చెల. భో. ౧, ఆ. ౧౮౨.

ఒచ్చెము. దే. వి. (క. ఒచ్చయ.) అవమానము. "గీ... ఇంతయెడరు నొంది, యున్నసాక కాకీయొచ్చెమొరుల కేమి, కారణము..." హరి. ఉ. 3, ఆ. ౧౦౫.

ఒచ్చెపడు. ద్వా. అ. క్రి. (ఒచ్చము+పడు.) అవమానపడు. "గీ. సిగ్గుపడి రొచ్చపడిరి..." హర. 3, ఆ. ౧౦.

ఒజ్జ. వై. వి. (సం. ఉపాధ్యాయః.) **1.** గురువు, ఉపాధ్యాయుఁడు. "సీ...పటువు లొజ్జల కొప్పగించిరి చదువు లెల్ల." స్వా. 3, ఆ. ౧౨౯. **2.** ఆదర్శప్రాయ. ఆదర్శప్రాయురాలు. "సీ... పడఁతుల కీపుణ్యభామ యొజ్జ." కేయూర. ౧, ఆ. ౩౬. **3.** పురోహితుఁడు; ఋత్విక్కు. "మ...ఒజ్జలు మంత్రంబులు సెప్ప..." శివరా. ౨, ఆ. ౫౯. "ఆ...వెఱపింత మొజ్జలు, తత్ప్రయోగవిధులు దప్పిపఱవ." భార. ఆది. ౨, ఆ. ౧౩౦. సా:— ఒజ్జలపుచ్చకాయవిశము = తాము పుచ్చకాయలు దినుచు నొరులను దిన వద్దని చెప్పుగురువుల విధము. "శా. ఆహా యొజ్జలపుచ్చకాయవిశమారా..." శశాం. ౪, ఆ. ౧౮౧.

ఒజ్జనము. ద్వా. వి. (ఒజ్జ+తనము.) ఒజ్జతనము; పురోహితకార్యము. "సీ...నాపసాని, యొజ్జన మొనరింప..." కళా. ౭, ఆ. ౮౩.

ఒజ్జబంతి. వై. వి. (ఒజ్జ+బంతి.) మేలుబంతి, ఒరవడి: ఆదర్శము. "సీ. తనకులాచారవర్తన వైష్ణవాచార పర్యాయముల కొజ్జబంతి గాఁగ." పాండు. ౧, ఆ. ౨౦.

ఒజ్జరి. ద్వా. వి. (ఒజ్జ+అరి.) పురోహితుఁడు; హీనవిప్రుఁడు. "క. ఒజ్జరులు౯ దడికద్రోపులు..." మల్హా. ౨, ఆ. ౧౪. (ఒజ్జల్లు ముద్రి.)

ఒజ్జఱికము = ఒజ్జనము. "ఉ...పాత్రక్షత్రియల కొజ్జఱికంబు వహించి..." చం. రా. 3, ఆ. ౪౬.

ఒజ్జసాని. ద్వా. వి. (ఒజ్జ+సాని.) ఉపాధ్యాయుని భార్య. ఆం. భా. ద్వి. ౧౦౭.

ఒజ్ఝ = ఒజ్జ. "ఉ...మీ, రొజ్ఝలు గాదు..." పాంచా. ౪, ఆ. ౨౫.

ఒట్టు. దే. అ. క్రి. **1.** కలుగు. "ఉ. ఒట్టిన భీతిమైనిటు పయోధిశరణ్యుఁడ వైతి..." భాగ. ౧౦, స్కం. ఉ. ౨౫౩. **2.** ప్రజ్వలించు. "ఉ..., అర్జునుం, డొక్కఁడ వైరిసేనలకు నొట్టినమాట..." భార. ఉద్యో. ౨, ఆ. ౧౯౪. స. క్రి. **1.** పెట్టు. "ఉ...లక్కయింటఁ జి, చ్చొట్టితి..." భార. శల్య. ౨, ఆ. ౧౩౪. **2.** కాల్చు. "...పెనుమంటలయుం, దొట్టుదు రొడల్లు..." భాగ. 3, స్కం. ౯౯౮. **3.** త్రాగు. "చ... సనలతేనియ యొట్టుచుఁ గూర్మిఁ బెట్టుచున్." బహు. ౨, ఆ. ౨౭. వి. (క. త. ఒట్టు.) **1.** ప్రతిజ్ఞ, శపథము. "క. ఒట్టిడుకొంటివిగద నీ, కెట్టిరహస్యంబు దాఁప నే నని..." ప్రభా. ౧. ఆ, ౧౨౩. **2.** శాపము. (చూ. ఒట్టువెట్టు.) **3.** నిషేధము. "ఉ. ఒట్టవు సత్యమాధరణి నొక్కఁడుఁ డున్నసు..." కాశీ, ౫, ఆ. ౨౭౧.

ఒట్టుగొను. దే. అ. క్రి. (ఒట్టు+కొను.) ఒట్టుపెట్టుకొను. "సీ...తల్లితోఁబుట్టువు పేరఁటా నొట్టుగొన్న." విజ్ఞా. ప్రా. ౬౦.

ఒట్టువెట్టు. దే. స. క్రి. (ఒట్టు+పెట్టు.) నిషేధించు; శపించు. "గీ. ఒట్టువెట్టినభంగి నేయుంగ్మలియును, బిలిచి యొకపట్టెఁ డన్నంబు వెట్టఁడయ్యె." కాశీ. ౭, ఆ. ౧౩౫. దశ. ౬, ఆ. ౫౪.

ఒడఁగూడు. దే. అ. క్రి. **1.** కలియు. "గీ. పాండవులతోడ నొడఁగూడి బ్రదుకవయ్య." భార. ఉద్యో. ౩, ఆ. ౩౪౧. **2.** కలుగు. "గీ. అబ్ధి కొడఁగూడె రత్నాకరాహ్వయంబు." కాశీ. ౩, ఆ ౧౧౭. **3.** ఒప్పు. "క. నడవడి యను మున్నిటిం, గడవం బెట్టంగ నోడకరణిం దగి తా, నొడఁగూడదు ననిన..." భార. ఉద్యో. ౨, ఆ. ౩౯. **4.** గుమిగూడు. "క...బ్రహ్మం, డముసం గలవా రెల్లం దొడంగూడంగాన్." భార. ఆది. ౫, ఆ. ౬౬. **5.** పీలగు. "గీ. కూర్చుకొని పోవ నీ కొడఁగూడె నేని." హర. ౨, ఆ. ౧౩౯. స. క్రి. పొందు, కూడు. "క. తన సూ దగుధనదదిశాం, గన నినుఁ డొడఁగూడఁ బోక గని యామ్యదిశాం, గన నొచ్చి..." కు. సం. ౪, ఆ. ౧౩౯.

ఒడఁగూర్చు. దే. స. క్రి. (ఒడఁగూడు ధా. ప్రే.) **1.** కలిగించు. "క...శుభం బైనదాని నొడఁగూర్పను..." భార. ఉద్యో. ౩, ఆ. ౬. **2.** కూర్చు. "గీ. గిరిజ నొడఁగూర్చి వరదుచే వరము వడయ, నోపుఁ బొమ్మని నమ్మి యే నున్నచోట, నెట్టి విడుమర వచ్చె నీ కెట్టిచావు, సంభవించెనె మనసిజ చక్రవర్తి." కు. సం. ౫, ఆ. ౭౩. **3.** సమకూర్చు. "సీ. దేవతార్చకు ధూపదీపాదు లొడఁగూర్చి..." హర. ౨, ఆ. ౧౨౩. **4.** ఫలింపఁజేయు. "మ...వేఁడు మభీష్టం బొడఁగూర్తు..." ఉ. రా. ౨, ఆ. ౨౦౩.

ఒడఁబడిక. దే. వి. (ఒడఁబడు ధా.) **1.** సమ్మతి. "గీ. బాళి పుట్టించుదాని కప్పధికు లెల్ల, నొడఁబడికమీఁదనే మిన్కు లొసఁగి రపుడు." శుక. ౪, ఆ. ౭. **2.** అంగీకార సూచక మగుపత్త్రము. (వా.)

ఒడఁబడు. దే. వి. (క. ఒడంబడు.) **1.** సమ్మతించు. "చ...ఎవ్విధం, బున నటరా నొడంబడము..." భార. ఆర. ౬, ఆ. ౧౧. "క...అటవో, నొడఁబడమివలికె..." భార. శాం. ౪, ఆ. ౧౩౯. **2.** అనుకూలించు. "మాలిని...యథావిధి పూజ లొడఁబడఁజేసి..." భార. ఆది. ౧, ఆ. ౯౧. **3.** సరిపోవు. "చ...నేఁడు పన్నగము నోరికి వీరికి నొక్కలంకెగా, నొడఁబడ నేల చేసె విధి ..." భాగ. ౧౦, స్కం. పూ. ౪౭౦. **4.** కుదురు, జరుగు. "చ. పుడమిఁ బుట్టెఁ డుర్ ధనాఢ్యుఁడును ...కాక యొడంబడ దశ్వమేధము..." కు. సం. ౧౧, ఆ. ౪౩. స. క్రి. సహించు. "ఉ... విధాత సిద్ధయు. నొడంబడునే కడువేఁడ్క పుల్, పెక్కుదినంబు లిక్కు..." భార. ద్రో. ౨, ఆ. ౨౪౦.

ఒడఁబర్చు = ఒడఁబఱచు. 'ద్వి...సిరియాలుఁడు తపసి, నొడఁబర్చి...' బస. ౪, ఆ.

ఒడఁబఱపించు. దే. స. క్రి. ఒడఁబడఁజేయు. "క. ఒకరుఁగ గన్నెఱికమునకు నొడఁబఱపింపన్." మల్హ. ౨, ఆ. ౩.

ఒడఁబఱచు. దే. స. క్రి. (ఒడఁబడు ధా. ప్రే.) ఒడఁబడఁజేయు. "క. దండిగ మన్మథునగరికి, పండుగు లొడఁబఱచు లంజెకల్లురె దొరలై...", మల్హ. ౨, ఆ. ౨౯. భాగ. ౧, స్కం. ౨౨౭.

ఒడఁబాటు. ద్వ. వి. (ఒడఁబడు ధా.) **1.** సమ్మతి "క. అనుచు నొడఁబాటు లేకున్నను..." భార. విరా. ౪, ఆ. ౧౪౪. హరి. ఉ. ౯, ఆ. ౪౧. **2.** సంధి. "ఆ...ఒడఁబాటు గావింపు, మెల్లభంగి మనకు నిదియ లెస్స." భార. ఉద్యో. ౩, ఆ. ౩౩.

ఒడగొను. దే. క్రి. (ఒడమి+కొను.) కొల్లగొట్టు. (చూ. ఒడగోలు.)

ఒడగోలు. దే. వి. (ఒడగొను ధా.) కొల్లగొట్టుట; చూఱ. (చూ. ఒడగోలుగొను.)

ఒడగోలుగొను. దే. స. క్రి. (ఒడగోలు+కొను.) చూఱగొను, కొల్లగొట్టు. "వ. మనుష్యుఁడు పుట్టినకాలె నిడుమలంబడి గడించినయొడమి పుడమిఱేఁ డలిగి గడియ తడవులోన నొడగోలుగొన శత్రుండు..." భో. ౩, ఆ. ౧౫౪.

ఒడదోలు. దే. వి. (ఒడలు+తోలు.) తోలుతో చేసిన కవచము. "సీ. మెడను బుల్కల పేరు మేటి తామరలుగాఁ దోలుదుప్పటి యొడదోలు గాఁగ." కాశీ. ౪, ఆ. ౧౭౦.

ఒడపి. దే. వి. గండి, రంధ్రము. "క...అఱితి యొడపినె యూర్పుల్, పఱవ..." ఆము. ౩, ఆ. ౨౩.

ఒడమి = ఒడమె. (సంపద.) "గీ...పడతులేపునఁ బద్మినియొడమి యెల్లఁ, జూఅగొని. కు. సం. ౯, ఆ. ౯౧.

ఒడమె. దే. వి. (క. ఒడమె.) **1.** సంపద. భో. ౬, ఆ. ౧౪౪. **2.** సగ. సాం. ని. మాన. ౪౮.

ఒడయఁడు. దే. వి. (క. ఒడెయ.) **1.** ప్రభువు. "గీ. శేషజనరక్ష కొడయనిఁ జేయవచ్చు. భార. సూ. ౩౮. **2.** భర్త. "సీ...అతఁ డొడయఁ డగు మాన్యపాత్రజకు..." భో. ౩, ఆ. ౨౬౧. **3.** ప్రధాన సేనాపతి. "సీ...అక్షోహిణీపతులఁ జూపి, వీరికిని సైన్యమునకును మీర యొడయ, లనుచు..." భార. ఉద్యో. ౪, ఆ. ౧౫౯. విశే. **1.** స్వామి, యజమానుఁడు. "క...ఒడయఁ డరుదెంచినవాఁ, డు..." ఉ. రా. ౬, ఆ. ౩౫౯. **2.** శ్రేష్ఠుఁడు. "గీ. అడుగుచూపరి జడదారియొడయ నింటి, కి...దశా. ౫, అ. ౨౬.

ఒడయుఁడు = ఒడయఁడు. దే. వి. **1.** భర్త. "గీ. యువతిమండలముల కొడయుఁడవు గమ్ము." జై. ౫, ఆ. ౧౧౭. **2.** అధికారి. "సీ...వైశ్య, తనయుండు రెండు శూద్రాతనూజుఁ, డొకపాలు గొనుటకు నొడయులు..." భార. అను. ౨, ఆ. ౨౩౫. విశే. స్వామి, యజమానుఁడు. "ఆ. ...గృహ, యుక్తుఁ డోషధులకు నొడయుఁ డగుట." భార. శాం. ౧, ఆ. ౩౧౨.

ఒడయురాలు. దే. విశే. (ఒడయుఁడు+ఆలు.) అధికారిణి. "సీ...తల్లితండ్రులును బాంధవజనులును, గారు నిన్నిగికిఁ గర్తలు విను నీవ యొడయురాలవు..." భార. అర. ౭, ఆ. ౩౩౭.

ఒడలిచూపొడయఁడు. దే. వి. (ఒడలి+చూపు+ఒడయఁడు.) ఒడలినిండ కన్నులు గలవాఁడు, ఇంద్రుఁడు. ఆం. సం. దేవ. ౧౭. ఇట్లే: ఒడలి చూపులఱేఁడు. పెద. శకుం. ౨, ఆ. ౨౧౪.

ఒడలు. దే. వి. బొ. (క. ఒడల్. త. ఉడల్.) శరీరము. "చ. ఒడలను బ్రాణముల్ గలుగ..." భార. ద్రో. ౧, ఆ. ౨౪౮. లక్ష్మీ. ౨, ఆ. ౩.

ఒడలెత్తు. దే. అ. క్రి. (ఒడలు+ఎత్తు.) జన్మించు, పుట్టు. "ఉ. ఈయఖిలాండసృష్టి నొడలెత్తిన ధన్యుల నెల్ల...హరి. ఉ. ౭, ఆ. ౧౧౫.

ఒడి. దే. వి. **1.** ఉత్సంగము, తొడ పైభాగము. "సీ. తమకించి యొడి నుంచి..." ఉ. రా. ౪, ఆ. ౨౧౭. **2.** వస్త్రపుటి, ఒడిపై ధరించుబట్ట. ఆం. భా. ద్వి. ౧౫౩. "ఉ. చిచ్చొడిఁ గట్టినట్టు..." ఉ. రా. ౪, ఆ. ౧౨౮. **3.** పశుయోని. (శ. ర.బ్రా.) **4.** ఒడుపు. "క. ఒడి దప్పినపాము వోలె..." ఉ. హరి. ౩, ఆ. ౧౦౩.

ఒడిఁబ్రాలు. దే. వి. (ఒడి+ప్రాలు.) క్రొత్తపెండ్లికూఁతునకు మంగళార్థ మొడిబట్టలోఁ గట్టు బియ్యము. (శ. ర. వా.) ఇట్లే: ఒడిబియ్యము. ద్వి. పరమ. ౫, ఆ.

ఒడికట్టు. దే. అ. క్రి. (ఒడి+కట్టు.) ఒడిపట్టు; అన్నిటికిని సిద్ధపడు. "చ...మాయల కొడికట్టి తెంతటి గయాళివి..." సా. ౩, ఆ. ౪౯. భా.రా.యు. ౧౩౩౫. వి. **1.** వస్త్రపుటి, ఒడిపై ధరించుబట్ట. "సీ. కుట్టినచెంగావిగుడ్డల యొడికట్లు..." కాళ. ౪, ఆ. ౫౪. **2.** ఒడ్డాణము. రాధికా. ౩, ఆ. ౧౧౨.

ఒడికము. దే. వి. **1.** అందము. "చ. కనుఁగవఁ గల్గు తేఁటియొడికంబును..." శుక. ౩, ఆ. ౧౦౫. **2.** ఉపాయము. "చ. ఒడికముతోఁ బ్రయత్నమున నొక్క మహాశిలఁ గొండమీఁదికిన్, గడపఁగ భారము..." నా. పంచ. ౧, ఆ. ౧౦౭. **3.** వాత్సల్యము. "క. తనయఁ గని గారవంబున,నను దినమును సావధానరై యొడికమునం, బెనిచి..." దశ. ౫, ఆ. ౧౭. విశే. **1.** ఇంపైనది. "చ. ఒడికపుసెజ్జ సేసి ప్రియుఁ డొయ్యన నందు శయింప..." భార. అర. ౫, ఆ. ౧౧. య. ౨, ఆ. ౪౬. **2.** తృప్తికరము. "ఉ...ఒకింత యూఁకటన్, గాయము డయ్యనీక యొడికంబుగ నన్నము వెట్టు..." ఉ. రా. ౧, ఆ. ౨౦౦. **3.** యుక్తము. "చ. గవ్వసెన దీసి...మెట్టు లొడికంబుగ నొత్తి..." ఉ. రా. ౬, ఆ. ౧౩౪.

ఒడికాఁడు. దే. విశే. (ఒడికము+కాఁడు.) సమయజ్ఞుఁడు, ఒడుపు గలవాఁడు. "ఉ...ఇచ్చినబాస దప్పె నిం,కం దనుఁ గన్న దెవ్వ నొడికాఁ డని కొంకెదఁ గాని యచ్యుతా." భార. అశ్వ. ౩, ఆ. ౧౮౧.

ఒడికారము. దే. వి. ఒడుపు. (ఉద్రేక మని శ. ర; సూ. ని.) "రగడ. కా రనకే యొడికారపుఁ గిం కను..." య. ౪, ఆ. ౨౯.

ఒడిత్రాడు. దే. వి. (ఒడి+త్రాడు.) వేఁటసాధన విశేషము. "స...ఒడిత్రాళ్లుఁ దలముళ్లు గొని..." కాళ. ౩, ఆ. ౪౬.

ఒడిదామర. ద్వ. వి. (ఒడి+తామర.) వృక్షవిశేషము. (శ. ర.)

ఒడిదారము. దే. వి. (ఒడి+దారము.) స్త్రీల మొల నూలు. "ద్వి. మొనసి సొన్నాటంకములయొడి దార, మునకుఁ దాఁ దగఁదె యమ్ముద్దియచీర." ద్వి. భాగ. ౧౦, స్కం. (శ.ర.)

ఒడిపిలి. దే. వి. ఒకవిధ మగుబియ్యము. (ఆహారవిశేష మని శ. ర.; బ్రౌ.) "క. ఓలింగమ విను నివ్వరి, ప్రాలును నొడిపిళ్లు గునుకుఁబ్రాలును..." కాళ. ౩, ఆ. ౬౭. "ద్వి. ఒడిపిలిపాసెంబు నుడుపనే తులును." బస. ౩, ఆ. ౬౬౦. పం.

ఒడియించు. దే. స. క్రి. (ఒడియు. ధా. ప్రే.) ఒడియఁజేయు, తీయించు. "గీ. ఎసఁగు నొడియించె నసఁగఁ దీయించె ననుట." ఆం. భా. తృ. ౧౩౨.

ఒడియు. దే. అ. క్రి. (క. ఒడి.) 1. వ్యాపించు. "క...వెన్నెల, జిలజిల దిక్కుల కునొడిసెఁ జీఁకటు లెడసెన్." రంగా. ౩, ఆ. ౧౮౭. 2. కాఱు. "ద్వి...విషము, లుడుగక ముఖమున నొడియ..." హరిశ్చ. పూ. ౧౯౭౯. పం. 3. ఒడుపు వేసికొని యుండు. "గీ. ఒడిసి తలపట్టి తిగిచి..." భార. విరా. ౨, ఆ. ౧౨౮. స. క్రి. 1. పాఱఁద్రోలు. "సీ...రత్నదీప్తులు తమిస్రంబు నొడియ." దశా. ౧,అ. ౨౦౬. 2. అవలీలగాఁ బట్టుకొను. "గీ...వాని ముందల నొడిసి తిగిచి." జై. ౩, ఆ. ౧౧౩. 3. పొందు. "సీ...బహుఫలోత్కరము లొడిసి." పాండు. ౨, ఆ. ౧౭.

ఒడిసియ = ఒడిసె. (శ. ర.)

ఒడిసె. దే. వి. 1. వృక్షవిశేషము. "వ...కొడిసెల నొడిసెల నందుగల నిందుగల..." పిన. శకుం. ౨, ఆ. ౧౪. 2. ఒడిసెగడ్డ. (శ. ర.)

ఒడిసెగడ్డ. దే. వి. (ఒడిసె+గడ్డ.) బిళ్లరోగము. (బ్రౌ.)

ఒడిసెప్రాలు. దే. వి. బ. అడవిలోఁ బండు ధాన్యవిశేషము. "ప...ఒడిసెప్రాలు దూసరిబియ్యంబు ...ఆదిగాఁగలుగు వన్యధాన్యంబులు..." పిన. శకుం. ౩, ఆ. ౧౨.

ఒడిసెల. దే. వి. పెద్దత్రాడు నడుమను మడఁచి నడుమఁ జిన్నరాయి యుంచుటకనుకూలముగా వెడలుపు గలుగున ట్లల్లి యందు రాయి నుంచి గిరగిరఁ ద్రిప్పి గిరవేటు వేయుటకై చేసిన సాధనము, క్షేపణి. "చ. ఒడిసెలరాతి చందమున..." సా. ౧, ఆ. ౯౩. కాళ. ౩, ఆ. ౧౦.

ఒడిసెలకాఁడు. దే. వి. (ఒడిసెల+కాఁడు.) ఒడిసెల వేయువాఁడు. "సీ...ఒడిసెలకాండ్రను నొడ్డుఁడు..." హరి. ఉ. ౧, ఆ. ౫౩.

ఒడుచు. దే. స. క్రి. 1. గెలుచు, జయించు. "గీ... లోని సహజ వైరివర్గంబు నొడిచినవాఁడ యొడుచు, నక్రమంబున వెలుపలియహితతతుల." భార. ఆది. ౩, ఆ. ౨౦౬. 2. నశింపఁజేయు, పోఁగొట్టు. "క...మనుజుఁ డొడుచు నఘంబుల్." భీమ. ౬,ఆ. ౩౨. 3. వేఁటాడు, చంపు. "వ... ఇద్దురంత కాంతారంబునం గలమృగసంతానంబు నొడిచి..." పె. శకుం. ౨,ఆ. ౧౧౮. 4. బలవంతముగా లాగు. "గీ...ఆశక్తి నీరజాక్షుఁ, డొడిచి కొనియెనె..." భార. ద్రో. ౫, ఆ. ౨౪౩. 5. గ్రహించు. "వ...ప్రసంగవాక్యంబుల నింగితంబు నొడిచి కొని..." కేయూర. ౪, ఆ. ౧౨౦.

ఒడుదొడుకు. దే. వి. 1. ఎగుడుదిగుడు; నిమ్నోన్నతత్వము. 2. కష్టము, సంకటము. "క. తరుణీమణిజఘనమునకు, దొన గాక తృణంబు పూని తుద లేక వసుం, ధర యొడుదొడుకులఁబడి మహీ, ధరములు చుట్టుపడి తావు దరలకయుండెన్." రసిక. ౨,ఆ.౯౮. (రెం డర్థములకు నిది యుదాహరణము.) విశే. 1. ఎగుడుదిగుడైనది, నిమ్నోన్నతము. "వ...అడవికడ కొత్తికొని నడచి యొడుదొడు కగుడు..." స్వా. ౪, ఆ.

౧౧౫. 2. ప్రమాదకరము; కష్టమైనది. వా:— వానిస్థితి యొడుదొడుకుగా నున్నది.

ఒడుపరి. దే. విణ. (ఒడుపు+అరి.) 1. మోసకత్తె; మోసకాఁడు. "ద్వి...మదవతు లేవంపుఁబుట్ట, లొడుపరుల్ ..." పండితా. పురా. ౧౧౬, పు. 2. తుంటరి. (ఆం. పా.)

ఒడుపు. దే. వి. 1. పట్టు. "వ...తనమీఁద వ్రాలు కేలుదోయియొడుపు దప్పించుకొనియె." నైష. ౨, ఆ. ౪౬. 2. మోసము. (చూ. ఒడుపరి.) 3. పట్టుకొనుట, మీఁదఁబడుట మున్నగువానికై పన్నిన యుపాయము. "ద్వి. ఒడుపు దప్పినయట్టి యురగంబపోలె." ద్వి. హరిశ్చ. పూ. ౪౬౬, పం. 4. లాభము. (శ. ర.)

ఒడ్డగ. దే. వి. జింకకొమ్ములు రెండు చేర్చి యలుగు లమర్చి డాకేలఁ బూను నాయుధము. ఆం. భా. ద్వి. ౨౦౬.

ఒడ్డగించు. దే. స. క్రి. వంచు, వ్రాలుచు. "ద్వి. ఓహో యనుచు గతు లొడ్డగించుచును." పండి తా. పర్వ. ౩౭౧, పు.

ఒడ్డగిలు = ఒడ్డగిల్లు. 1. ఒఱగు. (చూ. ఒడ్డగిల్లు.) 2. స్రవించు. "క...చన్నులతుదిపా, లొడ్డగిల ..." భాగ. ౧,స్కం. ౨౬౦. 3. విజృంభించు. "క... గెలుపునఁ గపివీరు లొడ్డగిల..." రామా. ౮, ఆ. ౫౪.

ఒడ్డగిల్లు. దే. అ. క్రి. ఒడ్డగిలు. (ఒఱగు.) "గీ. దొడ్డ వయసున శీతాంశుఁ డొడ్డగిల్లె." భీమ. ౨, ఆ. ౫౪.

ఒడ్డగెడవు. దే. విణ. తలక్రిందైనది, విపర్యస్తము. "ఆ. కెడసె హయము లొడ్డగెడవయ్యె రథము లు." భార. భీష్మ. ౨, ఆ. ౧౬౪., భాగ. ౮, స్కం. ౨౧౬.

ఒడ్డణము = ఒడ్డాణము. వై. వి. (క. ఒడ్డణ.) కాంచి. "సీ. పదివన్నియలకోట పసిఁడియొడ్డణము గా..." దశా. ౩, అ. ౧౧౬. ఆం., భా. ద్వి. ౧౫౦.

ఒడ్డనము. యు. దే. వి. 1. పణముగాఁ జేసినవస్తువు. "గీ...వాఁడిశరము, లార్జితాక్షము లసువులె యొడ్డనములు, గాఁగఁ బోరెదునీద్యూతకర్మ మందు." భాగ. ౬, స్కం. ౯౧౬. 2. వ్యూహము. ఆం. భా. ద్వి. ౨౧౧. దశ. ౧౨, ఆ. ౫౩. 3. వై.వి. (సం. అడ్డనమ్.) కేడెము. "చ...వాని నెల్ల నొడ్డనమున నాఁగి యాఁగి..." హరి. ఉ. ౨, ఆ. ౨౦౬. కు., సం. ౧౧, ఆ. ౭౦.

ఒడ్డరి. దే. విణ. (ఒడ్డు+అరి.) ఆశ చూపువాఁడు. (చూ. ఒడ్డరితనము.)

ఒడ్డరితనము. దే. వి. (ఒడ్డరి+తనము.) ఆశ పెట్టుట. "ఉ. న న్నడకించి యొడ్డరితనంబున నా దగు విద్య నీవు నై, కొన్న సహింప నేర్తునె..." భో. ౨, ఆ. ౧౬౬.

ఒడ్డాణము. వై. వి. (సం. ఓడ్యాణమ్. క. ఒడ్యాణ. త. ఒడ్డియాణం.) 1. కాంచి, స్త్రీలు నడుమున బిగికై ధరించుబంగరు మున్నగువాని యాభరణ విశేషము. "సీ. గగనసోదరవలగ్న ప్రదేశమున కోడ్యాణబంధంబె యొడ్డాణ మిడుట." పాం డు. ౫, ఆ. ౧౫౦. 2. యోగపట్టె. "సీ. ఐణే య మైన యొడ్డాణంబు లవణిచే నక్కళించిన పొట్ట మక్కళించి." స్వా. ౧, ఆ. ౫౯. 3. ఆసనవిశేషము, యోగబంధములలో నొకటి. "క. గొడ్డగపు జరావ్యాధుల, కడ్డమగున్... ఒడ్డాణపుబంధ మెలమి యోగీంద్రులకున్." శివయో. ౩, ఆ. ౭౪.

ఒడ్డారము. దే. వి. (త. ఒడ్డారం.) 1. వేళాకోళము. "సీ...వినతయు నేనును వేడ్క నరిగి, యచ్చ తెల్పునఁ గడు నభిరామ మగునొక్కయశ్వంబు గాంచితి మవ్వధూటి, కేవలధవళంబు నా విని యొడ్డారమునకు నే నది నల్లఁదనముఁ గంటె." గీ. వెనుకదెస నన్న వా దయ్యె..." భార. అను. ౧, ఆ. ౧౯౩. 2. పంతము. "సీ. ఒడ్డాణ మిది నాది యొడ్డార మేటికె యొడ్డా యయో దీని కువిద నీకు." బసవ. ౨, ఆ. ౬౭. 3. మాటెత్తు. "వ...ఒడ్డారంబు లొడ్డెనేని..." రామా. ౬, ఆ.౪౨. 4. వంకరమాట. ఆం. భా. ప్ర. ౧౧౮.

ఒడ్డారించు. దే. అ. క్రి. 1. పలుకు, మాటాడు. "క...కోదండ్రుడను మా, కొడ్డారింపక పడతు రె..." భాగ. ౯, స్కం. ౪౬౭. 2. సాహ

సించు. "క. ఒడ్డారించి విషంబున, కడ్డము చను దెంచి కావ నధికులు లేమిన్..." భాగ. ౮, స్కం. ౨౧౭. 3. ఎదిరించు. "సీ. ఏల యొడ్డా రించె నీపాపఁడు...?" నృసిం. ౪, ఆ. ౨౮.

ఒడ్డించు. దే. అ. క్రి. 1. వ్యతిరేకించు, విరోధించు. "మ...మే లయ్యె నొడ్డించి లంజియతో నుండఁగ వచ్చె..." కు. సం. ౮, ఆ. ౧౩౯. 2. నిరాకరించు. "సీ. తదితరక్షేత్రముల్ తమయందు నిలు మన్న నొడ్డించుటలువోలె నూర్పులెసఁగ." పాండు. ౨, ఆ. ౧౩౪. స. క్రి. ఒడ్డునట్లు చేయు. "క...ఆట మాని యొడ్డించుకొనం, గాపలసె..." ప్రభా. ౫, ఆ. ౧౬౩.

ఒడ్డిక. దే. వి. ఒకవిధ మగుపాత్ర. "మ. గంటెల్ గిండ్లును దట్ట లొడ్డికలు..." వరాహ. ౪, ఆ. ౧౧౨.

ఒడ్డియ = ఒడ్డె. (శ. ర.)

ఒడ్డియాణము = ఒడ్డాణము. "గీ. కత్తెరల నొడ్డియాణముల్ గత్తిరించి." ప్రబంధ. ౭౯౯.

ఒడ్డీ. దే. వి. ఒకజాతిపావురము. ఆం. భా. ద్వి. ౮౯., సా. ౧, ఆ. ౧౧౭.

ఒడ్డీఁడు. దే. వి. 1. ఓఢ్ర దేశపురాజు. 2. ఒకజాతి పావురము. "సీ. ఘన మైన కంఠక్రొవ్వునఁ బొఱితెంచిన యొడ్డీని వెనులావు లూడఁ దన్ని." హై. ౧, ఆ. ౫౪. (రెండర్థములకు నిది యుదాహరణము.)

ఒడ్డు. యుం.దే.స.క్రి. (క. త. ఒడ్డు.) 1. పందెమిడు. "వ...వివిధవస్తువాహనంబు లొడ్డి..." భార. అర. ౨, ఆ. ౬౨. సభా. ౨, ఆ. ౧౭౪. 2. (వల మొ.) పఱచు; పన్ను. "గీ. దాయ లొడ్డిన మాయ జూదంపుటురులఁ, బడి..." భార. విరా. ౨, ఆ. ౨౨౫. 3. చాఁచు. "గీ. ఒరులయాగికి నకట చేయొడ్డ కుండు, నట్టి నాకు..." భార. శాం. ౪, ఆ. ౧౫౮. 4. (చెవి) ఒగ్గు. "క. విని రోఁ జెవి యొడ్డి..." విక్ర. ౫, ఆ. ౨౧౬. 5. ఏయు. "ఉ. ఏ నలరమ్ము లొడ్డఁ బరమేశ్వరు చిత్తము...కరంగి..." కు. సం. ౪, ఆ. ౯౯. 6. అడ్డముగా నుంచు, అడ్డు. "ఉ...దుర్మద, క్రీడఁ జరించురాజు హరకేశవు లొడ్డినఁ గావఁ జచ్చుఁబో." భాగ. ౧, స్కం. ౪౭౩. 7. పడవైచు. "ఉ. దట్టముగా ధరాధరవితానము లొడ్డుచు..." భా. రా. యుం. ౨౭౨. వి. 1. తీరము. "సీ. ఒడ్లపైఁ బొఱచు నుండి నది..." రామలిం. ౩౬. 2. పందెపు సొమ్ము. "గీ. గెలుపు నాయదిగా నొడ్డు గెలువ నేర్చి." ద్వా. ౧౦, ఆ. ౮౮. 3. వ్యూహము. "వ...అభిమన్యుం డియ్యొడ్డు భేదించి..." భార. ద్రో. ౧, ఆ. ౩౯౪. 4. అడ్డు. "క...కావలివారల, యొడ్డు గడచి..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౪౦. 5. విధము. "మ...ఒక్కయొడ్డున బాష్పాంబుపూరంబు లుప్పతిలె..." స్వా. ౩, ఆ. ౧౩౬., 6. వెడలుపు. "వ...ఒడ్డునం బదివేల యోజనంబులు పొడవున ముప్పదివేల యోజనంబులునై చుట్టి పచ్చి..." వరాహ. ౧౦, ఆ. ౧౧౪. 7. బలము. "క. ఒడ్డును బొడవును రూపును, దొడ్డతనము గలిగి ప్రజ్ఞతో మెలఁగని యా, బిడ్డను గనుకంటెను సతి, గొడ్డైనను మేలు..." ద్వా. ౮, ఆ. ౧౩౭. విణ. 1. పెద్దది. "వ...ఒడ్డుచెఱువులచేతను..." భీమ. ౧, ఆ. ౧౧౯. 2. విశాలమైనది. "ద్వి. ఒడ్డుఱొమ్ములు వొడ్డయూరులు..." పండితా. పర్వ. ౭౪౪, పు. 3. అధికమైనది. "సీ...ఒడ్డుగా నిట్టూర్పు లొలయఁ బొగులు. స్వా. ౩, ఆ. ౧౨౩. వై. స. అన్యుఁడు; అన్యురాలు. "వ...ఒడ్లకొడుకుల కుం గాఁ దనకొడుకుల విడుచు దుర్బుద్ధులునుం గలరె..." భార. ఆది. ౬, ఆ. ౨౧౦. "ఉ. ఉత్పలగంధి నన్నుడుగు మొడ్లను బంపుము గల్లు దేర..." భార. విరా. ౨, ఆ. ౯౩. వి. ఒకఁడు, ఏకకుఁడు. (శ. ర.)

ఒడ్డుకొను. దే. అ. క్రి. (ఒడ్డు+కొను.) తప్పుకొను. "ఉ. వ్రేటున కెత్తినట్టి ప్రతివీరునికత్తికి నొడ్డుకొంట యొ, చ్చోటను గల్గినట్టిది..." కళా. ౮, ఆ. ౭౦. సిం. నార. ౫౦. స. క్రి. ప్రారంభించు; పూను. "గీ. ఇతరకాంతలఁ దనతోడ నిచ్చగించి, యుపరిసురతంబు సలుపంగ నొడ్డుకొన్న, యట్టి చోటులఁ గ్రాఁగినయట్టిలోహ, పాత్ర నెత్తుఁడు..." వల్హా. ౩, ఆ. ౩౫.

ఒడ్డుగుండ్లు. దే. వి. బ. (ఒడ్డు+గుండ్లు.) గండశైలములు, కొండమీఁదినుండి పడు పెద్దశిలలు. (ఆం. పా.)

ఒడ్డువిడుపు. దే. వి. బాలక్రీడావిశేషము. "సీ... ఒడ్డువిడుపు చెట్టుడుగాయ విండ్లమ్ములాటలు..." హంస. 3, ఆ. ౧౪౬.

ఒడ్డుసూపు. దే. స. క్రి. (ఒడ్డు+చూపు.) ప్రతిఘటించు. "గీ. ఒకరణమె చాలుఁ గనకాద్రి నొడ్డుసూప." దశా. ౧, అ. ౯౯.

ఒడ్డె. వై. వి. (సం. ఓడ్రః. క. ఒడ్డ.) ఓఢ్రదేశస్థుఁడు. (శ. ర.) 2. ఒకానొకజాతివాఁడు.

ఒడ్డోలగము. దే. వి. (ఒడ్డు+ఓలగము. క. ఒడ్డోలగ. త. ఒడ్డోలకం.) నిండుకొలువు. ఆం. భా. ద్వి. ౧౭౧. భార. విరా. ౫, ఆ. ౨౦౪.

ఒత్తగిలు = ఒత్తగిల్లు. దే. అ. క్రి. 1. ఒఱగు, ప్రక్కకొఱగు. "గీ...రతిదేవి పాలిండ్ల నొత్తగిలిన, యించు విలుకాని వ్రాసినా రిడుపునందు." నైష. ౭, ఆ. ౧౫౦. "మ. అలరున్ శయ్యకుఁ జేరి యొత్తగిలి..." దశా. 3, అ. ౭౭. 2. తొలఁగు. "సీ. వనధికన్యక కిన్క వక్షంబు డిగ్గి యొత్తగిలఁ జేవలగొనుదంటతనము." దశా. 3. అ. ౧౭౧. 3. అంటుకొను. "క. అంగన యొక్కొకమఱి యు, త్తుంగమణిస్తంభయష్టితో నొత్తగిలన్." కాశీ. ౪, ఆ. ౨౦౯.

ఒత్తగిల్లు = ఒత్తగిలు. 1. అంటుకొను. "సీ...ఉదరంబు వీఁపుతో నొత్తగిల్లి." కాశీ. ౬, ఆ. ౪౧. 2. చలించు. "ఉ...పంచబాణుచేఁ, జిత్తము లొత్తగిల్లి..." పద్మ. 3, ఆ. ౧౪3.

ఒత్తడము. దే. వి. (క. ఒత్తడ.) 1. ఒత్తుడు. "సీ. తారహారముల యొత్తడ మెఱుంగఁగరాని పరిరంభముల ప్రేమపరవశంబు." కవిరా. ౨, ఆ. ౧౬౫. 2. పీడనము. "సీ...ఒత్తడ మ్మొత్తు నాఁ బీడనమ్ము..." ఆం. భా. ప్ర. ౧౫౦.

ఒత్తడి. దే. వి. 1. రాయిడి. "వ. ఒండొరుల యొత్తడింబొడిపొడి యై." స్వా. ౬,ఆ.౭౧. 2. పీడనము. "సీ. పగఱ నొత్తడి నోర్వఁ బాడి..." అచ్చతెలుఁగుభారవి. ౨, ఆ. 3. కఱచుఁదనము.

"ఉ. ఎత్తులయొప్పుకంటు సర మెత్తుట యొప్పఁగఁ జొక్కి విల్వకా, అొత్తడిఁ బుష్పముల్ కొసర కూరక యున్కికి..." విక్ర. ౧,ఆ. ౯3.

ఒత్తరము. దే. వి. (క. ఒత్తర.) ఉద్రేకము, ముమ్మరము. "వ...అప్పుడమిఱేఁడు వెడంద వాఁడితూపుల నతనికాల్లు కత్తిరించి యయ్యుత్తరము నొత్తరముం గుఱుచపఱిచిన..." రామా. ౯, ఆ. ౧౫౪. విణ. ఉద్రేకించినది. "వ. ఇత్తెఱంగున నొత్తరంబై జగత్తు లుత్తలపడ..." రామా. ౯, ఆ. ౧౨౯.

ఒత్తరించు. వై. స. క్రి. (సం. ఉత్తృ. క. ఒత్తరిసు.) 1. మించు. "వ...తృతకగిరుల చఱుల సిరులనడరుపడఁతుల నడలకు గురువు లగుచు మెఱయుముటువుల నొత్తరించు మత్తేభంబులును..." భాగ. ౯, స్కం. ౪౪౭. భార. శల్య. ౨, ఆ. ౭౬౨. 2. ఉద్రేకము కలుగఁజేయు. "చ...రహస్యము చిత్తము నొత్తరింపఁగన్." జై. ౯, ఆ. ౫౯. 3. అతిశయింపఁజేయు. "చ...నభశ్చరమానసంబులన్, గుతుకము నొత్తరించుచు..." దశ. ౧౨, ఆ. ౬౪. 4. చిమ్ము, త్రోసివేయు. "వ...బాహుదండంబులు గత్తిరించియు బయల్లకు నొత్తరించియు..." ఉ. హరి. ౧, ఆ. ౧౪౯.

ఒత్తలించు. వై. అ. క్రి. పొంపొంపించు. "సీ... మేఁదిఁగమవ్వంబు మిగుల. ఆ. నొత్తలించుఁ దఱుమ నూకించుఁ దొలిమి, కగ్గలించు నెఱయ నప్పలించు." కు. సం. ౫. ఆ. ౪౧.

ఒత్తి. దే. అవ్య. గట్టిగా. "క...ఒత్తి యడిగిన..." భార. ఉద్యో. ౨, ఆ. ౫౧., ౧, ఆ. 3౪౬. నైష. ౫, ఆ. ౧౪౬.

ఒత్తినాడు. దే. స. క్రి. (ఒత్తి+ఆడు.) దూషించు. "వ...చెలికత్తియల మొత్తంబుల నొత్తియాడుచు..." నీలా. ౨, ఆ. ౧౧౯., చంద్రా. ౨, ఆ. ౧౭౨.

ఒత్తిలి = ఒత్తి. దే. అవ్య. 1. గట్టిగా. "ఉ...ఒత్తిలి నవ్వ..." భార. సౌ. ౧, ఆ. ౫. "క. ఒత్తిలి పొగడుచు..." భాగ. ౧, స్కం. ౫౦౯. 2.

మఱిమఱి. "సీ. వనిత యూర్పుల వాడి వత్త లైనపయోజ ముకుళంబు లొత్తిలి మూరుకొనుచు ..." పిన. శకుం. ౩, ఆ. ౨౦౯.

ఒత్తిలు = ఒత్తగిలు. 1. తప్పుకొను. "క. కుత్తుకకు నడ్డపడుసూ, రొప్పొత్తిలి పోనీక ..." భార. అశ్వ. ౧, ఆ. ౧౭౩. 2. చోటుతప్పు. "చ. తపనహిమాంశు లొత్తిలిరి తారలు డుల్లె..." రంగా. ౩, ఆ. ౫౪. 3. ఒత్తు, నొక్కు, "క...చెలికత్తెలతో, నొత్తిలి పలుకఁగ మ్రానపడు..." ద్వా. ౩, ఆ. ౨౯.

ఒత్తు. దే. అ. క్రి. (క. త. ఒత్తు.) 1. అధిక మగు. "క. కఱి పంతంతకు నొత్తఁగ...మనుజుల్, సుర సుర ప్రుక్కిరి..." కాళ. ౩, ఆ. ౧౫౫. జై. ౭, ఆ. ౫౦. 2. కేకవేయు. "శా..., ఒత్తెం జిన్నికుమార రార యని..." హర. ౨, ఆ. ౧౩౪. 3. మీఁదికి వచ్చు. "క. పగవా రొత్తిన యప్పుడ, జగ మెఱుఁగఁగఁ దెగుట యొండె నైరణ యొండెన్, పగు..." ద్వా. ౮, ఆ. ౧౧౯. 4. గ్రుచ్చుకొను. "గీ. హంసతూలికపాన్పుపై యలరుమొగ్గ, యొత్తునను మేను గల్గునీలోత్పలాక్షి." హర. ౪, ఆ. ౧౨. 5. పొడము. "సీ. సమ్మదంబునఁ గామిజనుల చిత్తంబులు చిగురొత్తఁ దరులందుఁ జిగురు లొత్తె." కు. సం. ౪, ఆ. ౮౯. 6. ఒఱగు. "చ. గరువున కొత్తఁ జెంగలువ కచ్చు ఘటించిన మాళిఁ జుట్టె...జిల్గుపాగ..." స్వా. ౫, ఆ. ౫౮. స. క్రి. 1. నొక్కు. "సీ...అవనిఁ బెట్టి యొత్తిన..." భార. విరా. ౨, ఆ. ౩౪౭. కళా. ౧, ఆ. ౬౦. 2. బాధించు. "ఉ...సుతునిం దగుపల్కుల నంత యొత్తెదే." భార. శల్య. ౨, ఆ. ౩౭౦. భా. రా. యు. ౭౭. 3. ఊఁదు; వాయించు. "ఉ. ఒత్తిరి శంఖకాహళములు..." కాశీ. ౬, ఆ. ౧౪౫. భాగ. ౧, స్కం. ౨౪౫. "సీ...లోలలోచన యొత్తు తాళ మొత్త." వాల్మీ. ౩, ఆ. ౧౨౧. 4. సవరించు. "గీ. జాఱుసిగ కేల నొత్తుచు..." దశా. ౩, ఆ. ౧౪౪. 5. పిసుకు. "సీ...కరము పాదము లొత్తి కరుణ వడసె." నైష. ౭, ఆ. ౧౯౨. 6. తుడుచు, అద్దు. "గీ. కన్నుఁగవ నశ్రుకణములు గ్రమ్ముదేరఁ, బాటతలమున నొత్తి..." భార. ద్రో. ౫, ఆ. ౩౩౮. నైష. ౨, ఆ. ౧౪౦. 7. గెంటు. "సీ. జిగివెంద్రుకల కప్పు జిష్ణునీలమహాంధకారపంక్తుల నైనఁ గడకు నొత్తు." పరమ. ౨, ఆ. ౩౭. 8. పరిహసించు. "గీ...ఎంత, తనదుతీవ్రత్వ మని తీవ్రధాము నొత్తు." కు. సం. ౧౦, ఆ. ౧౬౧. 9. బలిమి నాక్రమించు. "వ. కొందఱు కొందఱ నివేశనంబు లధికాభిలాషంబున నొత్తికొనుట కారణంబుగా వివాదంబు పుట్టిన..." భార. మహా. ౧౯. 10. పరీక్షించు. "ద్వి. మాట సందులు వట్టి మన సొత్తి చూడ." ద్వి. హరిశ్చ. పూ. ౪౦౦. వి. 1. నొక్కుడు. ఆం. భా. ప్ర. ౧౫౦. నైష. ౨, ఆ. ౪. 2. నొక్కుడు వలని యానవాలు. "గీ. యోగివంద్యుని సందిటి యొత్తులకును, రణితకేయూరమణులు కారణము గాఁగఁ, దలఁపుదురు కాని..." దశా. ౩, అ. ౧౪౮. 3. సాంద్రత. "వ...ఒత్తు గలపొదరుటడవులు..." స్వా. ౪, ఆ. ౩౭. 4. తుడుపు; అద్దుట. "ఉ...లేమిఁ జూచి తడియొత్తుల దోవతి నీఁడు..." పద్మ. ౧౦, ఆ. ౨౪౬. 5. మెత్త. "సీ. పసిఁడికుందియనలోపలఁ బట్టుపొత్తులయొత్తున నొఱఁగి కూర్చుండ నేర్చె." వి. పు. ౭, ఆ. ౧౨౫. 6. ఆక్రమణము; బాధ. "వ...పరులయొత్తు లేనిరాజ్యంబు పూజ్యమహిమం బరగు." భార. ఉద్యో. ౨, ఆ. ౮౯. 7. వ్రాయునపుడు కాకితమున కడుగున పెట్టు అట్ట మొ. (వా.) 8. ద్విత్వము. వా:—"క" ఒత్తు, "చ" ఒత్తు మొ. బ. 1. పిల్లలచేతులకు పెట్టెడు నాభరణ విశేషము. (శ. ర. వా.) 2. స్త్రీలయాభరణవిశేషము. "సీ...ఒత్తులతోడి కడియములును...గీ...వెలయ రతుల, బేరమాడుచుఁ గాఁపుగుబ్బెతలజోడు." శుక. ౨, ఆ. ౩౩౨. విణ. 1. సాంద్రము. "ఉ. ఒత్తుగ మాళిఁబింఛములు నుత్పలపత్త్రము కర్ణపాళి న్యాయత్తము చేసి..." గంధ. ౨౩౧. 2. మిక్కుటము. "ఉ. ఒత్తుగ మాంసముల్..., కుత్తుక బంటిగా మెసఁగి..." హరిశ్చ. ౧, ఆ. ౧౪౦. 3. అధా

ర మైనది. వా:—ఉత్తరము వ్రాయునపుడు డీపుస్తక మొత్తుగాఁ దీసికొనుము.

ఒత్తుకమ్మి. ద్వ. వి. (ఒత్తు+కమ్మి.) బొద్దులకు ప్రక్కల కమ్మివలె చేర్పఁబడెడు అవయవవిశేషము. (శ. ర.)

ఒత్తుకాఁడు. దే. వి. (ఒత్తు+కాఁడు.) సుతి పోయువాఁడు. "వ...ఆతండును గుణధ్వని తంత్రీనాదంబుగా సావిఁడ్లవా రొత్తుకాఱుగా గాండీవంబు వీణెగా వినోదంబు సలిపె." భార. విరా. ౫, ఆ. ౭౩. శుక. ౨, ఆ. ౧౦.

ఒత్తుకొను. దే. అ. క్రి. (ఒత్తు+కొను.) 1. త్రోసికొను. "క. ఒత్తుకొనుచు రాసిఁ జనదు..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౬౭. స్వా. ౪, ఆ. ౧౧౫. 2. ముమ్మర మగు. "వ. అవి యొండొరుల లేపికొని గోపిక లోపికలు లేనిచిత్తంబుల నెత్తిన తత్తఱంబు లొత్తుకొన నుదారంబు లగు శృంగారంబులతో నిండ్లు వెలువడి." భాగ. ౧౦, స్కం. పూ. ౧౮౫. స. క్రి. 1. అక్రమించుకొను. "క. వారు దెస లొత్తుకొనియుఁ ధరారాజ్యం బిచ్చి పోయిరా పోరా తా, రారణ్యా పీడఁ బడియును..." భార. ఉద్యో. ౨, ఆ. ౨౧౪. కు. సం. ౧౦, ఆ. ౧౬౯. 2. అద్దుకొను. "గీ. కన్నుఁగవ నొత్తుకొనుచు వక్షంబు చేర్చి." దశా. ౨, ఆ. ౧౮.

ఒత్తుడు. దే. వి. 1. అదుముడు. "ఉ...ఎవ్వతెం, బెట్టినవాఁడవో హృదయపీఠిక దానికి నొత్తుడౌఁ జుమీ." కవిక. ౪, ఆ. ౧౫౧. 2. వ్రాయునపుడు కాకితమున కడుగునఁ బెట్టునట్టి మెం. (శ. ర. వా.)

ఒత్తుదెంచు. దే. స. క్రి. (ఒత్తు+తెంచు. స్వార్థమున.) నొక్కు. "గీ. ఉరుకుచాగ్రంబు లొండొంటి నొత్తుదేర." కు. సం. ౯, ఆ. ౧౪౨.

ఒత్తుపడు. ద్వ. అ. క్రి. (ఒత్తు+పడు.) అదుముడు పడు. "గీ. ఒత్తువడి కాంచనాదిధాతూచ్చయములు, రసము చిప్పిలఁగా రత్నరాసు లొలుక." హరి. పూ. ౭, ఆ. ౧౭౭.

ఒత్తెదుపిల్లి. దే. వి. పునుఁగుఁబిల్లి, గంధిలము. "సీ... చట్టపుమెకము పునుఁగుఁ, గీ. బిల్లి యొత్తెదుపిల్లి నాఁ బేళ్లు వెలయు, గంధిలమునకు..." సాం. ని. తిర్య. ౮౨.

ఒత్తోరవు. దే. వి. (ఒత్తు+ఒరవు.) 1. ఒత్తుడు. "సీ. నిలుచు నొత్తోరవున వలచిన యప్పుడు గొనిపోవు నవలీలఁ గూలవైచు." భార. విరా. ౨, ఆ. ౧౫. 2. బాధ. "సీ. వృత్తులు సెల్లునే యొత్తోర వొందువలనఁ బుట్టదుకదా కలఁకు లందు." భార. ఉద్యో. ౧, ఆ. ౨౭౮.

ఒదకలి. దే. వి. సరసము. "గీ. అమరధేనువుల్ సురపురి కరిగి తమకుఁ, దార యతిమిలితోఁ జేపి తనుపుమిగుల, నభిమతార్థముల్ గురిసె దేవాలిమీఁద, నెలమి నొదకలి యాడెడు చెలువు వోలె." కు. సం. ౧౨, ఆ. ౧౯౬.

ఒదరు. దే. అ. క్రి. (క. ఒదఱు.) 1. వదరు, ప్రేలు. "గీ. ఒవరి విరహుల నులికింప నోపెఁ గాని,... అభి, సారికల శంకగొలుపంగఁ జాలవయ్యె, నూర్జితము లైనఘనకాల గర్జితములు." కవిక. ౬, ఆ. ౧౭. 2. గర్వించు, విఱ్ఱవీఁగు. "సీ. పలఁతులై నిగిడెడు పలుఁదతొండములచే నొదరి చేసాఁచు మృత్యువులువోలె." నృసిం. ౪, ఆ. ౪౬. కు. సం. ౧౨, ఆ. ౧౩౪. స. క్రి. దూషించు. "వ. దుర్యోధనుండు విదురుం దూల నొదరి..." భార. సభా. ౨, ఆ. ౨౦౫.

ఒదరుచు = ఒదర్చు. (శ. ర.)

ఒదర్చు. దే. స. క్రి. ఊడఁదీయు, పెఱుకు. "ఉ. కంటకముల్ పదాగ్రములఁ గాడ నొనర్చిన నొప్పిఁ గూయిడక్." ఆము. ౩, ఆ. ౩౩. (శ. ర. పా. 'కాడఁగదూసిన' ముద్రి.)

ఒదలు = పొదలు. దే. అ. క్రి. వర్ధిల్లు. "గీ. భూరినియమముతో నభిచారహోమ, మొదలఁ గావింప నగ్ని యథోచితముగఁ, జెలఁగి..." భాగ. ౧౦, స్కం. ఉ. ౫౩౨. (శ. ర. పా. 'ఒనరఁ గావింప' ముద్రి.)

ఒదవు. వై. అ. క్రి. (సం. ఉద్భవః. క. ఒదవు.) 1. ఒదవెడు తృష పెల్లిదమున..." భార. విరా.

౨, ఆ. ౮౯. జై. ౭, ఆ. ౧౨౦. 2. కాఱు. "గీ. ఒదవువృత్రరక్తమున బుద్బుదము లెసఁగి." భార. శాం. ౪, ఆ. ౪౩౩. 3. దొరకు. "క. ఇది దప్ప నిప్పు డిద్యోడ, నొదవదు..." భార. శాం. ౩. ఆ. ౨౮౬. 4. వినియోగపడు. "గీ...మీరు గలుగుటకును, ఫలము మీచేత నైనయాపని కొదవుట." ప్రభా. ౧, ఆ. ౧౧౧. స్వా. ౧, ఆ. ౬౬. 5. వచ్చు. "క...బెట్టిద మును బెండును నగుపలు, కొదవదు నీ నాలుకకు ..." భార. ఉద్యో. ౪, ఆ. ౩౬౩; ౨౪౩. 6. పెంపారు. "చ. ఒదవెడుజవ్వనంబు వెలి కొత్తఁగ..." ఆము. ౫, ఆ. ౨౧. 7. ఒప్పారు. "చ. ఒదవుపిశంగజూటమును నుజ్జ్వలదేహ మెలర్పఁ దోఁచె నా, రదుఁడు..." హర. ఉ. ౫, ఆ. ౧౦. 8. సిద్ధించు. "క...దైవయత్నము, బలవంతం బైన నెల్లపను లొదవు..." వేం. పంచ. ౩, ఆ. ౩౮౧. స. క్రి. ఇచ్చు. "సీ. ముది తకై యరమేని నొదవినకామారి..." దశా. ౩, అ. ౬౧.

ఒదవుబడి. ద్వ. వి. ఉపయోగము. (శ. ర.) విశ. ఉపయుక్తము. (శ. ర.)

ఒదిఁగిలి. దే. వి. (ఒదుఁగు ధా.) ఒదుఁగుట. (బ. ఒదిఁగిళ్లు. ఆం. పా.)

ఒదికిలఁబడు. ద్వ. అ. క్రి. (ఒదికిలన్+పడు.) ప్రక్కకొఱగు. "సీ. కడలచే నొదికిలఁబడుచు ..." దశ. ౧౦, ఆ. ౬౩.

ఒదికిలు. దే. అ. క్రి. 1. ఒత్తిగిలు. "చ. ఒదికిలి పాన్పుపైఁ బలికి నొయ్యన కేలు దలాఁపు చేపి ..." ఉ. హరి. ౫, ఆ. ౨౦౪. 2. ప్రక్కకొఱ గు. (చూ. ఒదికిలఁబడు.)

ఒదివిరిప్రాలు. దే. వి. బ. ఒకవిధ మగుధాన్యము. "సీ...క్రొత్తగోనియల యల బియ్యము పడ్లు నె మిలివడ్లు, నొదివిరిప్రాలును నొనరఁగఁ బోసి..." హాలి. పూ. ౬, ఆ. ౨౧. (శ. ర. పా.)

ఒదుఁగఁబడు. ద్వ. అ. క్రి. (ఒదుగన్+పడు. స్వార్థమున.) ఒదుఁగు, ముడుఁగు. "ఉ. కంటికి నిద్ర గాన కొదుఁగంబడి వేఁగెదము..." ఆము. ౩, ఆ. ౩౩.

ఒదుఁగఁబాఱు. దే. అ. క్రి. (ఒదుఁగన్+పాఱు.) ఒదుఁగు, తొలఁగు. "చ. పలికిన బ్రాహ్మణుం డొదుఁగఁబాఱక నిల్చి..." భార. అను. ౩, ఆ. ౨౬౧.

ఒదుఁగు. దే. అ. క్రి. (క. ఒదుగు.) 1. ముడుఁగు. "చ. గొరిజల ద్రొక్కనం బ్రిదిలి కుండలిభర్త యొదుంగ..." నృసిం. ౩, ఆ. ౩౬. 2. విధేయ మగు. "ద్వి...నీ వావధూమణికి, నొదుఁగుచు దాసివై యుండంగవలయు." రం. రా. అయో. ౭౭ పు. 3. వెనుదీయు, తొలఁగు. "చ. శిని మనుమండు నద్దనుజు శీఘ్రము నాలుగు నారసం బులన్, వెనుక కొదుంగఁజేసి..." భార. భీష్మ. ౨, అ. ౨౨౮. భార. శల్య. ౨, ఆ. ౬౧. 4. కలిసిపోవు. "క. మొదలఁ గలిగించి జగము లఁ, బదిలంబుగ నునిచి వానిఁ బదపడి తనయం దొదిఁగించి..." భార. శాం. ౬, ఆ. ౪౧౪. 5. దాఁగు. "ఉ...మధూత్సవవిహారము సల్పెను గౌరిదేవి తొల్పట్టి గణేశ్వరుండు సురభామిను లోలమునం దొదుంగఁగన్." భీమ. ౫, ఆ. ౧౧౯. నిర్వ. ౭, ఆ. ౨౦. వి. ఒదుఁగుట. (చూ. ఒదుఁగువడు.)

ఒదుఁగువడు. ద్వ. అ. క్రి. (ఒదుఁగు+పడు.) 1. తొలఁగు. "క. ఒదుఁగుపడ యోజనత్రయ, ము దళం బగువిమతసైన్యముల నీరీతిన్, మద మడఁచి..." నైష. ౫, ఆ. ౫౭. 2. అణఁగు, వశించు. "గీ. తదనుజుల సత్ప్రతాపంబు లొ దుఁగువడఁగఁ, గట్టువఱిచె..." రాఘవ. ౪, ఆ. ౧౨౬.

ఒదుఁగువాటు. ద్వ. వి. (ఒదుఁగుపడు. ధా.) ఒదుఁ గువడుట, తొలఁగుట. "గీ. ఓరచూపులఁ జెఱు నవ్వు లొదుఁగువాట్లు..., అలర కేళిక కరు డెంచె నల్లరంభ." పార్వ. ౫, ఆ. ౧౮౯.

ఒదుగు. దే. అ. క్రి. అధికమగు. "గీ. అఘ మొకిం త యొనర్చిన నది యొకపుడు, గాలములు గొఱ్ఱు నాఁటిదుఃఖములు దెచ్చు, నొదుగఁ జేసినఁ దల యేరు మొదలుగాఁగఁ, గలుగు తెవులుల వేదన

"గడలుకొలుపు." మార్క. ౧, ఆ. ౭౨. ('తత్ప్రభూతతరంగ స్థూలాం' అని మూలము.) వి. (సంగీతమున) సంగతులు పలుకుట. "శా. ఔరా రాగము బాపురే యొదుగు..." వాల్మీ. 3, ఆ. ౧3౬. విణ. అధికము. "క...ఆలర్కశాక మెదుగఁగఁ గొనుచున్." ఆము. ౪,ఆ.౯౫.

ఒదుగుబడి. దే. వి. (ఒదుగు+బడి.) 1. సమృద్ధి. (శ. ర.) 2. సంగీతమున సంగతులు పలుకుశక్తి. (వా.)

ఒదువు = ఒదుగు. 1. అధిక మగు. "చ...లంజెకుల ధన మొదువంగఁ బుచ్చికొని..." మార్క. ౯, ఆ. ౧౬౪. ('శుల్కమాదాయ బాధికం' అని మూలము.) 2. క్రమ్ము. "గీ...దేవిపై నుగ్రదివిజు, లొదువఁ జేర్కలఁ బెదవు లొండొండ యదర." మార్క. ౬, ఆ. ౧౯౦.

ఒద్ద. దే. వి. ఔ. అవ్య. దగ్గఱ. "క...వచ్చెను భృగునం, దనుఁడు... దానియొద్దకుఁ బ్రీతిన్." భార. ఆది. 3, ఆ. ౧౬౫. "గీ. ఒక్కపుణ్యాశ్రమంబునయొద్దయేట, విడిసి..." భార. ఉద్యో. 3, ఆ. ౧౪౬.

ఒద్ది. దే. వి. ఒకానొకచెట్టు. "సీ...నేలొద్ది యొద్ది." హంస. ౪, ఆ. ౧౧. పిన. శకుం. ౨, ఆ. ౧౪.

ఒద్దిక. దే. వి. (క. ఒద్దికె. త. ఒద్దిక్కై.) 1. మిత్రభావము. ఆం. భా. ద్వి. ౧౮౬. 2. ప్రేమము. "సీ. కలశపాథోరాశి కన్యకారత్నంబు నొద్దికతోఁ గూడియున్నవాని." వి. పు. ౫, ఆ. ౭౯. 3. సామ్యము. "వ...నిద్దంపుఁబసుపు ముద్దుల యొద్దికం దగువెద్దనిమ్మపండ్లును..." య. ౪,ఆ. ౧3. 4. ఒకవస్తువునకు సరిగా తూఁగెడురాయి మొదలగునది. "సీ. తొలునాఁడు శోధ్యునిఁ దులఁదూఁచి యాతని యెత్తుగనొద్దిక లెల్లదాఁచి." విజ్ఞా. వ్యవ. ౧౧౭. (శ.ర.పా. 'ఇట్టిక' ముద్రి.) 5. పొందిక; విలాసము. "సీ. ఒకమైఁడి ప్రతిమ యొద్దికతోడ గండూష మొనరింపఁ గాళాంచిఁ గొనుచు వచ్చె." దశా. ౭, అ. 3౨౦. విణ. అనుకూలము. "క...నే, నిద్దముగ దేశిఁ గొనియెద, నొద్దికగా నుండుఁ డనుచు నొనరిచి సఖులన్." వాల్మీ. 3, ఆ. ౧౨౨.

ఒద్దె. దే. విణ. విస్తారము, అధికము. (ఆం. పా.)

ఒనగూడు. దే. అ. క్రి. 1. సిద్ధించు; కలుగు. "ఉ. ...ప్రమదమున్ దృఢవిద్యయుఁ గల్గువారి కే, కోరికలైన వేగ మొనగూడు..." భార. స్వ. ౯౦. "క...దొడ్డచే టొనగూడెఁ." నీలా. ౧, ౫3. 2. కలియు. "క...మీకుఁ బూర్వసఖుఁ డఁట మీతో, నొనగూడి చదివినాఁడఁట..." కుచేల. ౧, ఆ. ౫౬.

ఒనగూర్చు. దే. స. క్రి. (ఒనగూడు ధా. ప్రే.) 1. సిద్ధింపఁజేయు; కలిగించు. "గీ...వాంఛితములఁ గరుణ నొనగూర్చు...ఉ. రా. ౪, ఆ. ౨౭. "సీ. పసిఁడిసలాకకుఁ బరిమళం బొనగూర్చి..." విక్ర. ౫, ఆ. ౧౨౭. 2. కూడఁబెట్టు; కూర్చు. "క...మాధుకరా, శన మొనగూర్చుచు..." రాఘవ. ౧, ఆ. ౪౭. "ఉ...శేల్, గుత్తపుఁజన్నుఁ దోయి నొనగూర్చి..." వసు. ౬, ఆ. ౧౪.

ఒనరారు. దే. అ. క్రి. (ఒనరు+ఆరు. స్వార్థమున.) ఒప్పు. "క...వారల్, సని యచటిచెట్లనీడల, నొనరారఁగ మెలఁగుచుండి రోలిమి వెలయన్." అచ్చ. అర. ౧౨౭.

ఒనరించు. దే. స. క్రి. 1. చేయు. "వ...శుశ్రూషణాదికంబు లభియుక్తంబు లయినం బుత్త్రునిచే నొనరింపించుచు..." భాగ. ౫, స్కం. ౧, ఆ. ౨౪౧. 2. ఇచ్చు. "క...దానం, బొనరించుట..." భీమ. ౬, ఆ. 3౯. 3. రచించు. "గీ. అట్టి నైషధసత్కావ్యము...ఒనరింపు..." నైష. ౧, ఆ. ౧౬. 4. నిర్మించు. "గీ...పురము లొనరింప..." భార. కర్ణ. ౧, ఆ. ౨౬౧. 5. నియమించు. "క...విప్రుల మంత్రులఁగా, నొనరించితె..." భార. సభా. ౧, ఆ. ౨౬.

ఒనరిక. దే. వి. పొందిక. "చ...వారిమాటలే, యొనరికఁ బొంచు లుండి విని..." రాధా. 3, ఆ. ౧౪౯.

ఒనరు. దే. అ. క్రి. 1. ఉండు; కలుగు. "క...శ్రద్ధ యొనరనిశుచి..." భార. శాం. ౫, ఆ. ౨౪౭. 2. ఒప్పు. "క...ఇనుఁ, డొనరఁగ నస్త్రాద్రి కేఁగ..." భార. ఆది. ౨, ఆ. ౧౫౯. 3.

పొసఁగు. "గీ...ఇదియు నదియు, నొనరు టె ట్లొక్కొ..." కళా. ౪, ఆ. ౧౬౨. విణ. ఇంపైనది. "సీ...తా మరలుదృష్టి. గీ. కొనరుగైకొని..." రాఘవ. ౩, ఆ. ౯౫. (భారతార్థమున.) వి. **1.** ఇంపు. రాఘవ ౩, ఆ. ౯౫. **2.** పొందిక. (శ. ర.)

ఒనరుచు. దే. స. క్రి. **1.** చేయు; సృజించు. "క...రోదన, మొనరిచె..." భార. ఆశ్ర. ౨, ఆ. ౧౫౪. "మ..చతుర్ముఖుం డొనరిచెం గాఁబోలు...ఈ చిగురుటాకుం బోఁడి నేత్రద్వయిన్." నైష. ౩, ఆ. ౧౬౫. **2.** నియమించు. "క..., ఒద్దికగా నుండుఁ డనుచు నొనరిచి సఖులన్." వాల్మీ. ౩, ఆ. ౧౨౨. **3.** ఇచ్చు. "క...అర్ఘ్యమ్ముఁ బాద్యము నొనరిచి..." భార. ఉద్యో. ౧, ఆ. ౧౯౯.

ఒనరుపడు. ద్వ. అ. క్రి. (ఒనరు+పడు.) పొందుపడు. (శ. ర.)

ఒనర్చు = ఒనరుచు. (ఒనరు. ధా. ప్రే.) **1.** చేయు. "క..., ఏ నేమి యొనర్తు..." భార. ఆది. ౬, ఆ. ౫౦. **2.** రచించు. "సీ...నవ్యకావ్యంబులు...ఒనర్చె." విక్ర. ౧, ఆ. ౫౦. **3.** నిర్మించు. "శా..., మాణిక్యాయతనం బొనర్చె..." వసు. ౩, ఆ, ౩౪. **4.** ఉంచు, పెట్టు. "సీ. కనకవల్లి యొనర్చు కస్తూరితిలకంబు..." నైష. ౨, ఆ. ౧౪౧. **5.** సిద్ధపఁజేయు. "చ...ఏ, తదభిమతంబు బొనర్చు టుచితంబు..." కళా. ౫, ఆ. ౧౧౬. **6.** కూర్చు. "సీ...రజనీశు గురుసతి రతి కొనర్చి..." విక్ర. ౫, ఆ. ౧౧. **7.** విభజించు. "ఉ...వాఁడి సూదిమొన యించుక మోపినయంత మాత్రమున్, భూమి యొనర్చి పాండునృపపుత్త్రుల కిత్తునె..." భార. ఉద్యో. ౩, ఆ. ౩౬౩.

ఒనవెట్టు. దే. వి. పొంచడము, పొంచియునికి. ఆం. భా. తృ. ౩౦.

ఒనవెట్టుకొను. దే. అ. క్రి. (ఒనరు+పెట్టు+కొను.) పొంచియుండు. "సీ. ఓగిరంబు హరింప నొనవెట్టుకొని యైన వేగువంతకుఁ జేసె జాగరంబు." కాశీ. ౪, ఆ. ౧౩౩.

ఒప్పందము. దే. వి. (క. ఒప్పంద. త. ఒప్పందం.) **1.** ఒప్పుదల. **2.** అమ్మెడువారు కొనెడువారు చేసికొను నేర్పాటు. (శ. ర; బ్రౌ.) **3.** ఒప్పించిన నిర్ణయము. (ఆం. పా.)

ఒప్పగించు. వై. స. క్రి. (సం. అర్పణమ్.) **1.** అప్పగించు, ఇచ్చు. "క...కానుక లొప్పగించి..." చంద్రా. ౨, ఆ. ౪౪. **2.** అధీనము చేయు. "ఉ...ఓషధీ, పాలున కొప్పగించె..." ఆము. ౨, ఆ. ౬౩. **3.** కంఠస్థము చేసి చదువు. వా:- పాఠము ఒప్పగింపుము.

ఒప్పగింత. వై. వి. (ఒప్పగించు. ధా.) అప్పగింత. (శ. ర.)

ఒప్పనచేయు. ద్వ. స. క్రి. (ఒప్పనము+చేయు.) **1.** అర్పించు. "ఉ. కప్పము లెల్లఁ దెచ్చి... ఒప్పనచేసి రానృపతు లుజ్జయినీపతికిం గ్రమంబునన్." ద్వా. ౭, ఆ. ౨౩. **2.** వశపఱచు. "క...ఒ, ప్పనచేసె మహీశు వీరబాహునకు..." హరిశ్చ. ౫, ఆ. ౪.

ఒప్పనము. వై. వి. (సం. అర్పణమ్.) ఇచ్చుట. "సీ. ఒఱఁగత్తి వెఱికి నీ కొప్పన మిదె యంచు సత్తికిఁ గత్తిచె య్యెత్తి మ్రొక్కి." కళా. ౩, ఆ. ౧౧౯.

ఒప్పనితనము. దే. వి. (ఒప్పు. ధా.) అపచారము, దోషము. "క...ఇ, ప్పని మనవారలయొప్పని, తనమున మూఁటె నని వంతఁ దలపోయకుఁడీ." భార. మా. ౧౨.

ఒప్పనివాఁడు. దే. వి. (ఒప్పు. ధా.) కిట్టనివాఁడు, విరోధి. "ఉ. ఒప్పదె కూడి మన్కి మన కొప్పనివారలయుక్కు దక్కఁగన్." భార. ఉద్యో. ౧, ఆ. ౩౭౧.

ఒప్పమి. దే. వి. (ఒప్పు. ధా.) **1.** కీడు. "ఉ... పతిదిక్కున బంధులవెంట భృత్యులం, దొప్పమి యేమి వాటిలుటకో వెఱపయ్యెడు నాకు లక్ష్మణా." నిర్వ. ౯, ఆ. ౬. **2.** పగ. ఆం. భా. ప్ర. ౧౩౪. **3.** తప్పు. "ఉ...నా, యొప్పమి యేమి సంఘటిలె నొక్కొ యటంచు..." కళా. ౪, ఆ. ౨౦౬. **4.** అవమానము. "ఉ...కులము శీలముఁ

గల్గినపుణ్యకాంత కృట్లొప్పమి సేయు టెల్ల..." భార. ఉద్యో. ౩, ఆ. ౩౬౮.

ఒప్పము. దే. వి. (క. ఒప్ప. త. ఒప్పమ్.) **1.** మెఱుగు. "క. ఒప్పము వెట్టినపసిండి యొఱపున మెఱయుర్.'' ద్వా. ౪, ఆ. ౧౯౭. **2.** అందము. "క...తిలకంబు లొప్పముగఁ బెట్టుచు..." దశ. ౧౦, ఆ. ౭. **3.** ఆజ్ఞ. "ఉ. ఒప్పముఁ జెల్లఁ జేసితిఁ బయోనిధివేష్టితభూమి నంతటన్." రఘునాథరామాయణము. ౨, ఆ. ౪౯. **4.** చేవ్రాలు. "సీ...వ్రాయసమువారిముదలకమ్మలకొప్పములు లిఖించి." కువల. ౨, ఆ. ౯.

ఒప్పరగించు. దే. స. క్రి. ఒప్పగించు. ఆం. భా. తృ. ౧౩౧.

ఒప్పరము. దే. వి. జలము పోవుదారి, తూము. ఆం. భా. ప్ర. ౧౫౪.

ఒప్పరికము. వై. వి. (సం. ఉపేక్షా.) ఉపేక్ష. (శ. ర.)

ఒప్పరికించు. వై. స. క్రి. ఉపేక్షించు. "గీ. పట్టిపాలార్చెదరు మీరు పాండుసుతుల, నీవు భీష్ముండు నలిగిన దేవతలకు, నైన మార్కొన వచ్చునే నేన నరుఁడు, నొంపఁగా నిట్టు లొప్పరికింపఁదగునె." భార. భీష్మ. ౨, ఆ. ౨౮౦. నిర్వ. ౬, ఆ. ౧౨౭.

ఒప్పఱి. దే. విశే. (ఒప్పు+అఱి.) కురూపి. "సీ. ధరలోనఁ గలుగునొప్పఱిమిండలకు నెల్ల..." దశ. ౫, ఆ. ౪౦. ('ఒప్పర' ముద్రి. 'అగ్రగణ్యా మనభిరూపాణాం' అని మూలము.)

ఒప్పఱు. దే. అ. క్రి. (ఒప్పు+అఱు.) చలించు. "క. అప్పొలఁతికురుల శివుమన, సొప్పఱి తనుఁదగులఁబెట్టునురు లన నెరులై." కు. సం. ౩, ఆ. ౧౩౯.

ఒప్పాచారము. మి. వి. (ఒప్పు+ఆచారము.) ఒప్పందము. (ఆం. పా.)

ఒప్పారు. దే. అ. క్రి. (ఒప్పు+ఆరు. స్వార్థమున.) ఒప్పు. భార. అర. ౪, ఆ. ౩౧౩. కాశీ. ౧, ఆ. ౩౯.

ఒప్పించు. వై. స. క్రి. **1.** ఇచ్చు. "మ. ఉరగాధీశువిమానంబులకు మే నొప్పింతు..." భాగ. ౧, స్కం. ౫౧౪. **2.** అధీనముచేయు. "క... మేరువనంబున నీ, కొప్పింతు గజమ్ముఁ బోద మనుడు...భార. ఆను. ౪, ఆ. ౬౪. "క...నీసుది రతి, కొప్పించెదొ నన్ను మరున కొప్పించెదవో." సమీర. ౩, ఆ. ౨౨౬. **3.** చెప్పు. "గీ. సోమమేని నొప్పించి సుమముల నుడికించి..." చంద్రా. ౪, ఆ. ౧౬౫. **4.** సమ్మతింపఁజేయు. సమీర. ౩, ఆ. ౨౨౬.

ఒప్పిదము. దే. వి. (ఒప్పు ధా.) **1.** అందము. "సీ. కాళ్లయొప్పిదమాఁడుక ట్టనుజ్జ్వలము సేయంగ..." భార.విరా. ౧, ఆ. ౨౨౮. **2.** శోభ. "గీ. పెండ్లికని పిల్వఁబంచినఁ బ్రియముతోడ, నేఁగు దెంచితి మిన్నాళ్లు నెల్ల యొప్పి, దములఁ జూచితిమి..." భార. ఉద్యో. ౧, ఆ. ౪౭. **3.** రీతి. "చ...సుఖసుప్తిభంగి ఘనపంక్తులు లేని వియత్తలంబు నొప్పిదము..." భార. శాం. ౬, ఆ. ౧౯౯. **4.** అలంకారము. "చ...ఒప్పిదములొనర్పఁ బంచితి... వీటికిన్." హరి. ఉ. ౩, ఆ. ౧౫౮. విశే. **1.** మనోజ్ఞము, (శ. ర.) **2.** యోగ్యము. "క...పతి శుభమందుట... కోరు టొప్పిదము సతికి శివా." భార. ఆను. ౫, ఆ. ౨౬౯, **3.** ఒప్పునది. "క...ఒప్పిదమై యేనవపర్వం, బిది..." భార. ఆది. ౧. ఆ. ౪౩.

ఒప్పు. దే. అ. క్రి. (క. ఒప్పు.) **1.** యుక్తమగు, మంచి దగు. "ఉ...ఆహవ మొప్పదు ధర్మసూతితో." భార. ఉద్యో. ౨, ఆ. ౧౬౫. **2.** శ్రేష్ఠమగు. "గీ. దీనికంటెను నొప్పెడువాని..." భార. ఆది. ౭,ఆ.౧౦౦. **3.** అందమగు. "క. తను వొప్పెడునది యౌవనమును నూతనము..." భార. శాం. ౬, ఆ. ౧౮౭. అ. క్రి. స. క్రి. "చ. చంచలనేత్ర యిట్లు వనసంగతి నొప్పుటఁ గాంచి..." కళా. ౩, ఆ. ౩౭. వి. **1.** సౌందర్యము. "మ...అవ్విభునొప్పు నర్మదకుఁ గామావేశముం జేసినన్." భార. ఆను. ౧ ఆ. ౪౪. **2.** కాంతి. "గీ. ధరణిఁ బడియుండియును నొప్పు దఱుగకున్న." భార. శల్య. ౨

౩౯౫. 3. విధము. "క...సింగంపుఁగొదమ యొప్పమరంగన్." నిర్వ. ౧౦, ఆ. ౫౯. 4. గుణము. "క...తప్పొప్పు మదిన్ భావించి..." రాఘవ. ౧, ఆ. ౫౪. 5. సత్పదార్థము. "క...జగంబులం గలయొప్పులం దెల్ల..." భార. అను. ౪, ఆ. ౪౨౫. విణ. 1. యుక్తము. "ఉ...కవితాసమయంబున గొప్పుగాదు..." కాళ. 3, ఆ. ౧౫౯. 2. తృప్తికరము. "ఉ. ఒప్పులుగా భుజించిరి బుభుక్షితము లాఁకటి చిచ్చుపెల్లునన్." భీమ. ౨, ఆ. ౧౪౦. 3. సమ్మఁదగినది. 4. అంగీకరింపఁదగినది. "ఆ...నామాట, యొప్పగుట గొకగుఱు తొసఁగు మనియె." రాఘవ. ౪, ఆ. ౨౦. (ఇది మూఁడునాలు గర్థముల కుదాహరణము.)

ఒప్పుకొను. దే. అ. క్రి. (ఒప్పు+కొను.) సమ్మతించు "సీ...ఒప్పికిఁ జనఁ జిత్త మొప్పుకొనదు." వేం. పంచ. 3, ఆ. ౧౨౨. స. క్రి. గ్రహించు, పుచ్చుకొను. "ఆ. ఒప్పుకొనుము వీని సుర్వీశ యని సుతు, నిచ్చి గంగ చనిన..." భార. ఆది. ౪, ఆ. ౧౬౮.

ఒప్పుకోలు. దే. వి. (ఒప్పుకొను ధా.) ఒప్పుకొనుట. ఆం. భా. ప్ర. ౧౦౪.

ఒప్పుమిగులు. దే. అ. క్రి. (ఒప్పు+మిగులు.) ఒప్పారు, ప్రకాశించు. "సీ. ఎవ్వాఁడు...పరంజ్యోతిస్స్వరూపుఁడై యొప్పుమిగులు." దశా. ౨, ఆ. ౧౭. ఇట్లే: ఒప్పుమీఱు, ఒప్పుమెఱయు, ఒప్పెసఁగు మొ.

ఒప్పులకుప్ప. దే. వి. 1. సౌందర్యరాశి. "ఉ...ఒప్పులకుప్ప నలుండు గాక యొం, డెవ్వఁడు..." నైష. ౧, ఆ. ౭౭. 2. అందగత్తె. "ఉ...ఈ యొప్పులకుప్ప సాధ్వి..." ఉ. రా. ౬, ఆ. ౨౦౪. విణ. మిక్కిలి అందముగలది. "సీ. గొప్పులై యొప్పులకుప్పలై పాలిండ్లు విరిబంతులకు వింతసరవిఁ గఱప." య. ౧, ఆ. ౭౪.

ఒప్పులాఁడి. దే. వి. (ఒప్పులు+ఆఁడి.) 1. అందగత్తె. 2. స్త్రీ. "ఉ...అచ్చరయొప్పులాఁడుల..." ఉ. రా. ౪, ఆ. ౧౬౩.

ఒబ్బట్లు. దే. వి. (త. ఒబ్బట్టు.) పోళికలు, భక్ష్యవిశేషము. "సీ...చాఁపట్లు మండెంగ లొబ్బట్లు వడలు." కళా. ౭, ఆ. ౮౧.

ఒబ్బిడి. దే. వి. 1. పంటనుకుప్పిడి. (శ. ర.) 2. చెదరియున్న వస్తువులఁ నొకచోఁ జేర్చుట; జాగ్రత్త చేయుట. (చూ. ఒబ్బిడిచేయు.) 3. నాశము. (శ. ర.)

ఒబ్బిడిచేయు. దే. స. క్రి. (ఒబ్బిడి+చేయు.) జాగ్రత్తపఱచు. "ద్వి. పాఁడి యొబ్బిడిచేయు బానయుఁ గొట్టి." అ. మ. క. ౧, ఆ.

ఒమ్మచ్చు. ద్వి. వి. (ఒమ్ము+అచ్చు.) మణులను పొదుగుటకు బంగారముతోఁ జేయు పీఠస్థానము. (శ. ర; బ్రౌ.)

ఒమ్మిక. దే. వి. (ఒమ్ము. ధా.) 1. పొందిక. ఆం. భా. ద్వి. ౧౮౬. 2. బాగు. "వ...శ్రీకారంబుల జోకయుఁ దొమ్మిదింటి లెక్కల యొమ్మికయు..." పాండు. 3, ఆ. ౧౭౯.

ఒమ్ము. దే. అ. క్రి. ఒప్పు, సరిపడు. (శ. ర; బ్రౌ.) వి. 1. స్థౌల్యము, బలుపు. "గీ. ఒమ్ము గాన్పించె పలుగజనిమ్మపండ్లు." శశాం. 3, ఆ. ౩౮. 2. కీడు, ఆపద. "చ. జనపతి విన్న నొమ్మనుచు..." చెన్న. ౨, ఆ. ౫౯౦. విణ. 1. స్థూలము, పెద్ద. "సీ. ఒమ్మైనబరువుగోతమ్ముల..." శశాం. ౨, ఆ. ౧౯. ఆం. భా. తృ. ౨౦. 2. విశాలము. "సీ. ఒమ్ముగా దిమ్ముగా బొమ్ము రావలె నంచు..." రాధికా. ౧, ఆ. ౬౧. 3. వికసితము. "సీ...ఒమ్ముతమ్ముల నుంచె నొక్కసరసి." రాధికా. 3, ఆ. ౭౮.

ఒమ్మువచ్చు. దే. అ. క్రి. (ఒమ్ము+వచ్చు.) ఒమ్ము, సరిపడు. (బ్రౌ.)

ఒయారము. దే. వి. 1. విలాసము. "ఉ. మించు నొయారమున్..." కళా. 3, ఆ. ౧౭. య. ౫, ఆ. ౩౦. 2. విధము. "వ...చుక్క తెగివడ్డ విధంబున...కప్పలిచొప్పునఁ గదలక నిల్చుచు నొక్కపరిఁ బైరిడేగ యొయారంబున..." కువల. ౪, ఆ. ౫౨. విణ. విలాసము గలది.

"ఉ...పుప్పుఁజప్పరమ్మున నొయారముగాఁ గయి సేసి..." విజ. ౧, ఆ. ౬౩. నీలా. ౨, ఆ. ౨౬.

ఒయారి. దే. వి. (ఒయారము+ఇ.) విలాసిని; ఆఁడుది. "శా...నావలనఁ దప్పేమే యొయారీ..." సా. ౨, ఆ. ౨౧౦. విశే. **1.** మనోహరుఁడు. "గీ. అన్నిట నొయారియై యుండునట్టి వాఁడు." సా. ౨, ఆ. ౯. **2.** విలాసము గలది. "ఉ. వ్రేలు నొయారి క్రొమ్ముడులు..." రామా. ౧, ఆ. ౨౦౭. **3.** అందము గలది. "సీ. వేలుపుఁబూఁబోండ్ల గేలిసేయునొయారి చెలువలు..." య. ౪, ఆ. ౧౭౯.

ఒయ్య. దే. అవ్య. ద్రు. **1.** మెల్లదిగా, చప్పుడు లేకుండ. "గీ. ఒయ్యఁ దలయంపి దిక్కున నొదిఁగి యుండె." హరి. ఉ. ౭, ఆ. ౧౩౬. **2.** తిన్నగా. "సీ...అగ్నిహోత్రగృహంబున కొయ్య వచ్చి." భార. ఆది. ౧, ఆ. ౧౭౯. **3.** స్పష్టముగా, వివరముగా. "మ...అంతయుం దెలియ నొయ్యం జెప్పురా..." రామా. ౬,ఆ.౨౩౧. **4.** నాఁటునట్లు, ఒత్తిడితో. "గీ. ధర్మనందను పలుకులు తనకు హృదయ, తాప మొనరింప మోమున దైన్య మొంద, నున్న పాంచాలి యిట్లని యొయ్యఁ బలికెఁ, గనలి శౌరితో గద్గదకంఠి యగుచు." భార. ఉద్యో. ౩, ఆ. ౧౦. (దీనియామ్రేడితరూపము ఒయ్యొయ్య. నైష. ౩, ఆ. ౪౭.)

ఒయ్యన = ఒయ్య. (క. ఒయ్యనె. ఒయ్యన్ + అ.) **1.** తిన్నగా. "సీ. ఒకనాఁడు నారదుం డొయ్యనఁ గంసునియింటికిఁ జనుదెంచి." భాగ. ౧౦, స్కం. పూ. ౫౭. **2.** వరుసగా. "క...విల్లు వంపనోపక, యుడిగిరి నృపసుతులు కొందఱొయ్యన లజ్జన్." భార. ఆది. ౭, ఆ. ౧౭౫. **3.** విలాసముగా. "చ...తరుణీమణి వచ్చె నొయ్యనన్." వసు. ౬, ఆ. ౨౩. (దీని యామ్రేడితరూపములు ఒయ్యనొయ్యనన్, ఒయ్యొయ్యనన్." నీలా. ౨, ఆ. ౨౫. భీమ. ౪, ఆ. ౯౫.)

ఒయ్యాఁక. దే. వి. (ఒయ్య+ఆఁక.) ఆపుదల. (చూ. ఒయ్యాఁక చేయు.)

ఒయ్యాఁకచేయు. దే. స. క్రి. (ఒయ్యాఁక+చేయు.) ఆఁపు, నిలుపు. "గీ. వీఁక సందఱి నచట నొయ్యాఁకచేసి." వైజ. ౪, ఆ. ౬౬.

ఒయ్యారము = ఒయారము. దే. వి. విలాసము. "క. ఆరాజు...ఒయ్యారంబున రాజవీథియందుఁ జరింపన్." కాశీ. ౧, ఆ. ౩౧. విశే. **1.** విలాసము గలది. "మ...సీ సొయ్యారమై వ్రాలఁగా." పారి. ౭, ఆ. ౧౧. **2.** మనోజ్ఞము. "సీ. హారముల్ మెఱయ నొయ్యారంబులుగ గ్రుచ్చి..." భార. విరా. ౧, ఆ. ౧౦౭. **3.** అయాచితము, కోరఁబడనిది. "మ. ఒకమాటెవ్వని పేరు కర్ణములలో సొయ్యారమై సోఁకినన్." భాగ. ౯, స్కం. ౧౪౭.

ఒయ్యారి = ఒయారి. దే. వి విలాసిని; స్త్రీ. "సీ... కనిమియొయ్యారి నోములఫలంబు..." ఉ. రా. ౧, ఆ. ౮౦ విశే. **1.** అందము గలవాఁడు. "శా...చేతోభవుం గన్న యొయ్యారిన్ శౌరి..." పరాహ. ౯, ఆ. ౨౮. **2.** కుశలుఁడు; విలాసవంతుఁడు. "సీ. త్రయ్యంతవాసనాగ్రహ బుద్ధి నొయ్యారి యొయ్యారి రామానుజయ్యగారు." పాండు. ౧, ఆ. ౪౭.

ఒర. దే. వి. (క. ఒరె. త. ఉరై.) **1.** ఒరగంటిగీటు. "సీ. పుత్తడికొండమూఁపుర మనునొరగంట నొరసి రా రా పాడు నొక్కమాటు." భాగ. ౩, స్కం. ౪౧౫. **2.** సాటి. "ఉ...పద్మాస్యన్న పసిండితోడ సొరవచ్చు నృపాలునియంగకంబులున్." భార. భీష్మ. ౨,ఆ. ౮౧. **3.** రాజకీయాలోచనము. "చ...ఒర ప్రాబలతో నిడుచుంట...మాన్పుకోఁదగున్." ఆము. ౪, ఆ. ౨౪౮.

ఒరకొను. దే. స. క్రి. (ఒర+కొను.) పరీక్షించు; ఒరగంటగీయు. "సీ. క్రమ్మఱ నొరకొన్న గవ్వలకమ్మించి..." ౧౦,ఆ.౧౦౫. (శ్రేష్ఠమైనగవ్వలకని భావము.)

ఒరగట్టు. దే. వి. (ఒర+కట్టు.) చుట్టగా చుట్టికట్టిన బట్టలకట్టు. "సీ. ఒరగట్టు పంచెలు..." నీలా. ౩, ఆ. ౪౯. (శ. ర. పా.)

ఒరగడుగు. దే. వి. (ఒర+కడుగు.) రెండవసారి కడిగినబియ్యమునీరు, తేఁట కడుగు. (శ. ర.)

ఒరగల్లు. దే. వి. ఔ. (ఒర+కల్లు.) **1.** గీటురాయి. "చ...మహేంద్రనీలభా, స్వర మగుదానవాంతకుని వక్షముపై నొరగంటఁ జక్కఁగా, నొరసిన హేమరేఖవలె నొప్పు రమారమణీలలామ..." వరాహ. ౧, ఆ. ౪. **2.** పరీక్షాస్థానము. "సీ. విన నేర వందునా విద్యలయొరగల్లు నీ వెఱుంగని పాటి నీతిలేదు." రాధా. ౧, ఆ. ౬౫. రామా. ౬, ఆ. ౭౨.

ఒరగాలు. దే. వి. ఔ. (ఒరగు+కాలు.) **1.** కుంటికాలు. "క. కప్పకు నొరగాలైనను..." సు. శ. ౨౭. **2.** ఒంటికాలు. "సీ...ఒరగాల దేవుచు నులికిపడుచు." దశ. ౬, ఆ. ౧౫౭.

ఒరగావించు = ఒరకొను. "మ. చరమాశానికషోపలాంచలమునన్ సంధ్యాప్రకాశోదయం, బొరగావించి..." నైష. ౮, ఆ. ౧౫౯.

ఒరగు. దే. అ. క్రి. **1.** వంగు. "గీ...ఎడమ కొక్కింత యొరగ." ఆము. ౫. ఆ. ౩౮. **2.** వ్రాలు. "చ...నిద్ర లేక తా, నొరగుచు లేచుచున్ వనట నొందుచు..." భా. రా. కిష్కి. ౩౭౭. (శ. ర. పా. 'ఒరలుచు' ముద్రి.) **3.** పడు. "క...అడుగులపై, నొరగెన్..." అచ్చ. యు. ౭౫. **4.** చచ్చు. "సీ ..శతమాయుఁ డొరగె సమసె వక్ర, నాసుండు..." మొ. రా. సుం. ౧౫౯. **5.** లేకపోవు. "క...కృప, యొరగిన చిత్తములవార లొండొరుతోడన్." కేయూర. ౩, ఆ. ౩౨౩. వి. **1.** ఒరగుదిండు. "సీ. ఒక్కకే లొరగుపై నునిచి..." శుక. ౧, ఆ. ౪౧౧. **2.** వంపు. (శ. ర.) **3.** లోపము. "సీ. భట్టియుగంధరప్రముఖులకృత్యంబు లొరగు లొత్తెడు మంత్రు లొక్కవంక." రాజ. చ. ౧, ఆ. ౧౧. విణ. వంకరైనది. (శ. ర.)

ఒరచాలుదుక్కి. దే. వి. (ఒర+చాలు+దుక్కి.) చాలు తేలికగాఁ బాఱినదుక్కి. (శ. ర.)

ఒరచు. దే. స. క్రి. నునుపుచేయు. (చూ. ఒరచుబద్ద.)

ఒరచుబద్ద. దే. వి. (ఒరచు+బద్ద.) చిత్రికగుల్ల, పలక మొ. నునుపుచేయు వడ్లవాని పనిముట్టు. (శ. ర. వా.)

ఒరపట్టు = ఒరపెట్టు. (వా.)

ఒరపదను. దే. వి. (ఒర+పదను.) కొంచెపుతడి. (శ. ర.)

ఒరపిడి. దే. వి. రాయిడి, సంఘర్షణము. "క. అన్నలు తమ్ములు గలుగుట, యున్నతుఁ జేయు నృపు నెంతయొరపిళ్లైనన్." భార. శాం. ౨, ఆ. ౩౫౬.

ఒరపు. దే. వి. ఒరపిడి; అదుముడు "సీ. మెండు మీఱెడుబండికండులయొరపునఁ జిలువల యెకిమీఁడు దలలు ముడువ." అచ్చ. యు. ౧౮౪.

ఒరపెట్టు = ఒరకొను. (వా.)

ఒరము. దే. స. క్రి. పొందు. (ఆం. పా.)

ఒరయిక. దే. వి. **1.** రాపిడి. "చ .. మేలిపసిండి ముద్దఁటుం, గర మన మింటితో నొరయికన్ గనుపట్టెడు..." చంద్రా. ౧, ఆ. ౮. **2.** మచ్చరము. "సీ. ఉరమెక్కుసిరితోడ నొరయిక శిరమెక్కుమహి యన హరినీలమకుట మొనర." చంద్రా. ౧, ఆ. ౭౧.

ఒరయు. దే. అ. క్రి. **1.** మచ్చరించు; పోటీకి వచ్చు. "సీ. ఉమరోమరాజితో నొరసి కేద్వడిన చందమున భూషాహులు తలలు వంప." వరాహ. ౬, ఆ. ౪౬. **2.** రాచు, తగులు. "చ...నితంబ చక్రములతో...పెన్జడ లొరయంగ..." పారి. ౪, ఆ. ౨౮. **3.** ఒరపిడి గలిగించు, బాధించు. "సీ. గురివెంద పూసపేరొరయ సందిటఁ గట్టి..." ౧, ఆ. ౮౧. స. క్రి. **1.** రాచు, సంఘర్షించు. "గీ...పాతాళ మొరసి హరి, సప్తసింధువు మున్నిటి సంక్రమించె." భీమ. ౬, ఆ. ౨౫. **2.** పరీక్షించు; పరిశీలించు. "సీ...మిమ్మింత నే నొరయంగ నర్హమే మీ పల్కులందు గలదె, యనుమానము..." కళా. ౨, ఆ. ౧౯౦. **3.** గోఁకు. "శా...క్రీ, గోటన్ మే యొరయున్..." కు. సం. ౧, ఆ. ౧౦౦. **4.** ఎదుర్కొను. "సీ...పందులు బిరుదేనుఁగుల నైన

నొరయఁ జూచు.” సా. ౧, ఆ. ౬౮. **5.** ఒరపెట్టు, ఒరగంట గీయు. “చ. ఒరసిరి నిన్నుఁ దర్కనికషోపలధారల...” ఉ. హరి. ౯, ఆ. ౧౧. **6.** పొందు. “సీ. దరి లేనిభంగపా టొరయఁ డావంతైన...” పె. శకు. ౧, ఆ. ౪౧. **7.** సమీపించు. “సీ...ఙురిరాట్తీర్థోపకంఠ మొరసి.” కాశీ. ౬, ఆ. ౧౭౨.

ఒరయుఁగడ. దే. వి. (ఒరయు. ధా.) ఒరపిడి, రాయిడి. “క. కోపించి సురల వెలువడఁ, ద్రోపించె సురారి బలిమి ధూర్జటి నీల్గన్, మోపించె విష్ణుఁ బసులన్, గాపించెను మీకు నొరయుఁగడఁ బ్రాపించెన్.” కు.సం. ౪, ఆ. ౭౯.

ఒరలు. దే. అ. క్రి. దొరలు. “గీ. ఒరలుమదకరులుర్విపైఁ బొరలుహారులు.” ఉ.రా. ౮,ఆ.౧౨౨.

ఒరవడి. దే. వి. **1.** విద్యార్థులకు అక్షరములు కుదురుటకై ఉపాధ్యాయుఁడు వ్రాసియిచ్చుపఙ్క్తి, మేలుబంతి. (శ. ర. వా.) **2.** దానిని చూచి విద్యార్థులు వ్రాయువ్రాఁత. (శ. ర. వా.)

ఒరసికొను. దే. స. క్రి. (ఒరయు. ధా.) తాఁకు, తగులు. “వ...ఆరథంబు నక్షత్రమండలం బొరసికొనుచుఁ జని...” హర. ౨, ఆ. ౧౧౬.

ఒరసికొనిపోవు. దే. అ. క్రి. (ఒరసి+కొని+పోవు.) పుండుపడు; నొక్కుడుపడు. (వా.)

ఒరసు. దే. వి. పోలిక, ఉపమ. “క. ఒరసు పరుసు నాఁగ నుపమ కొప్పున్ జెప్పన్.” కావ్యా. ౯, ఆ. ౧౬.

ఒరి. దే. వి. పగ, విరోధము. (చూ. ఒరిగట్టు.)

ఒరిగ. దే. వి. కైమోడ్పు, వందనము. “సీ. జోతలు కైటభాసురగర్వహరునకు నొరిగ బ్రహ్మాండ భాండోదరునకు.” రుక్మాం. ౧, ఆ. ౧౭౩. (శ. ర. పా. ‘ఒళిగె’ అని ముద్రి.)

ఒరిగట్టు. దే. అ. క్రి. (ఒరి+కట్టు.) పగగొను. “సీ. ఉగ్రుఁడై జమునికి నొరిగట్టి తన కెందుమాఱు లేదనుకేతుమాలి యితఁడు.” కు. సం. ౧౧, ఆ. ౧౦౦.

ఒరిజె. దే. వి. ఏనుఁగుమెడగొలుసు. “సీ...దేవకరిఁ బట్టి యొరిజ వైవక యెక్కనుదుటుఁడనము.” రా. వి. ౩, ఆ. ౪౬. చంద్రా. ౧, ఆ. ౩౭.

ఒరిమ. వై. వి. (ఒరిమె యని ముద్రితప్రతులం దున్నది.) **1.** మైత్త్రి, స్నేహము. “గీ...ఇదె కొంద ఱున్నారు గగనవీథి, నొరిమఁ గెడఁ గూడుకొని యెవ్వరో కొ వీరు.” కాశీ. ౩, ఆ. ౧౩౮. య. ౧, ఆ. ౨౯. **2.** కృప, కనికరము. “సీ...కాపాడు డొరిమతోడ.” ఉ. హరిశ్చం. ౭, ఆ. ౧౩౯. **3.** తమి, ఆసక్తి. “గీ. ఒరిమ నొండొంటిఁ జూచు నాభరణములును.” నైష. ౬, ఆ. ౬౧.

ఒరిమిఁడి. ద్వం. విశే. (ఒరిమ+ఇఁడి.) ప్రతికూలుఁడు, విరోధి. “ద్వి...ఒరిమిఁడివిప్రు, లఱితోడ శిగనాగమయ్య నిందింప.” పండితా. దీక్షా. ౨౩, పు.

ఒరిమిక. దే.వి. **1.** శ్రద్ధ. “క. ఒరిమికయు బత్తియున్ మదిఁ, గర మరలఁగఁ బూజచేసెఁ గన్నియ...” అచ్చ. ఆర. ౧౭౧. **2.** వినయము. (ఆం. పా.)

ఒరుఁడు. వై. స. **1.** ఇతరుఁడు. “క...వైదర్భి యొరున్, వరియింప నంత ధర్మేతరచరితయొ...” భార. ఆర. ౭ ఆ. ౧౮౪. **2.** ఒక్కఁడు. “సీ. ఘనుఁడు గదాయుద్ధమునను భీముఁడు బలదేవున కొరునకు దిగుదుకాని.” దశా. ౮, ఆ. ౧౯౦.

ఒరుదల. దే. వి. (ఒరు+తల.) పైశున్యము, కొండెకానితనము. “ఉ...ఒరుం డొరుదలన్ వినిపించినమాట డెందమునం, జెండ ముఖంబు దక్కఁ జెడఁ జేయఁడు...” ఆము. ౭, ఆ. ౪౦. విశే. పిశునుఁడు, కొండెకాఁడు. “సీ. ఒరుదలగా వచ్చి యొగి మఱుంగు పడంగఁ జెవి నిల్లు కట్టుక చెప్పరేని.” విప్ర. ౯, ఆ. ౪౦.

ఒరుదలకాఁడు. దే. విశే. (ఒరుదల+కాఁడు. స్వార్థమున.) ఒరుదల, పిశునుఁడు. “క. మొదలనె యొరుదలకానిం, జెదరంగా నాడక...” ఆము. ౪, ఆ. ౭౭౦.

ఒరుము. దే. అ. క్రి. **1.** చుఱుకగు. “గీ. ఖర్బుదుఁ జుఱుకయ్యె ననుమాట యొరిమె నన్నఁగ. ఆం.

భా. 3, ఆ. ౯౪. 2. తీక్ష్ణము. "క...జిగి, నొరిమె ననన్ రవియు మెఱసె నుడిగెన్ మొయిలున్." ఆము. ౪, ఆ. ౧౭౧.

ఒరువుఁడు. వై. స. ఒకరువుఁడు, అన్యుఁడు. "ఆ... ఒరువు, లనుభవింపఁ దెచ్చి కొనిన మాంసము ..." భార. అను. ౫, ఆ. ౯౯.

ఒఱ. దే. వి. (త. ఉఱై.) 1. కత్తి మొదలగువాని కోశము. "క. ఒఱలందు నాయుధంబులు, విఱిగిపడం దొడఁగె..." జై. ౮. ఆ. ౧౩౮. 2. గవుసెన, నిచోళము. (శ. ర.) 3. బావి యొఱ. "మ...తల్లియొఱ దాఁకం దేట నీ రొప్పు రక్ష్యల కూపంబుల..." ఆము. ౧, ఆ. ౫౭.

ఒఱకటము. ద్వ. వి. ఒఱగడ్డము, దుస్థితి "ద్వి. మెఱయ నీతఁడు వోవ మీఁదటఁ జాల, నొఱకటంబున నొత్తు రొగిఁ బ్రజలెల్ల." ద్వి. భాగ. ౧, స్కం. (శ. ర.) విణ. విషమము. (శ. ర.)

ఒఱకము. దే. వి. 1. పల్లము. "క. ఒఱకం బిది మెరకిది యని, యెఱుఁగన్ రాకుండఁ జేసె నిరులు ధరిత్రిన్." సురా. ౯. 2. నరకము, అధోలోకము. "గీ. ఏటినాకంబు పున్నియం బెడలి నష్టు, డొఱకమునఁ గూలవలయుఁ గీలూడినట్లు." కాశీ. ౨, ఆ. ౪౫. 3. కష్టసమయము, దుస్థితి. "గీ. అతిథి పంక్తికి రాకున్న నారగింపఁ, డొంటి నొకనాఁడుఁ బతి యెట్టియొఱకమునను." కాశీ. ౭, ఆ. ౬౭.

ఒఱగఁబడు. ద్వ. అ. క్రి. (ఒఱగన్+పడు. స్వార్థమున.) ఒఱగు. "చ. కలమము లుండుఁ బాడి యొఱగంబడి..." ఆము. ౧, ఆ. ౬౭.

ఒఱగడ్డము. ద్వ. వి. (ఒఱప+గడ్డ.) సంకటము, ఇబ్బంది. (శ.ర.) విణ. విషమము. (శ.ర.)

ఒఱగు. దే. అ. క్రి. 1. వంగు. "సీ. క్రముకంబు లును వరఖర్జూరనికరంబు నొగిఁ బండి వానిపై నొఱగి యుండు. కు. సం. ౭, ఆ. ౯౬. 2. వ్రాలు, పడు. "ద్వి. తఱిగిన కదళిచందంబున నేల, నొఱగి చేష్టలు దక్కి యొయ్యనఁ దెలిసి." ద్వి. హరిశ్చ. ఉ. ౧౮౦౮౬. భార. భీష్మ. ౧, ఆ. ౪౭. 3. పక్షపాతము చూపు. "క. నీవును మృత్యువుఁ బొపస, మావెలితమతుల రొఱఁగ నాడిన యంతం, బోవునె మీపై దోషము, లే వెఱతునె..." భార. అను. ౧, ఆ. ౭౯. భార. శాం. ౨, ఆ. ౩౭౪. వి. 1. వంపు. (చూ. ఒఱగువోవు.) 2. ఒఱగువింపు. (శ. ర.) విణ. వంపైనది. (శ. ర.)

ఒఱగుబిల్ల. దే.వి.ఒఱగుదింపు, ప్రగ్రీవము. (శ. ర.)

ఒఱగువోవు. దే. అ. క్రి. (ఒఱగు+పోవు.) ఒఱఁగఁబడు, వంగు. "సీ...ఒఱగువోయిన రొండి యుం బొక్కిళ్లొమ్ము." హరిశ్చ. ౪, ఆ. ౧౪౬. (శ. ర. పా.)

ఒఱగొడ్డెము. ద్వ. వి. 1. వఱగొడ్డెము, మేరమీఱిన మాట. "సీ...ఒఱగొడ్డెములఁ బల్కుచుండి నామొ." రంగా. ౨, ఆ. ౧౭౧. భాగ. ౧, స్కం. ౩౧౩. 2. ప్రగల్భము. "వ...అటుగాక యొఱగొడ్డెంబు లాడి నీపడ్డపాటు గొడ్డెఱుగా జిడ్డు పఱుప గలవారమె..." హర. ౨, ఆ. ౧౩౨. 3. వక్రోక్తి. (ఆం. పా.)

ఒఱటు. దే. విశే. 1. నిర్భాగ్యుఁడు. "వ. అలుబిడ్డ లొఱటు లై లేమిఁ గుందుచు .." భార. అను. ౫, ఆ. ౯౦. 2. దుష్టుఁడు: దుష్టురాలు. "గీ. ఉసుఱు సిరియును నొల్ల కిట్లొఱటుబొకి...ఇహ పరమ్ములు లేక యిట్లేఁగె..." హరి. పూ. ౯, ఆ. ౧౯.

ఒఱపరి. దే. విణ. (ఒఱపు+అరి.) 1. సుందరుఁడు, అందగాఁడు. "చ. ఒఱపరిఁగన్నఁ గూడఁ జను ... జార ధారుణిన్." జై. ౩, ఆ. ౨౦. 2. చతురుఁడు, ఉపాయకారి. "క...చిరకాల కాంక్షితాన్య జనాలిం, గనతయును దెల్పి యది నేఁ, డొనఁగూడెన్ నిన్ను వంటి యొఱపరి కత నన్." శుక. ౩, ఆ. ౫౩౫.

ఒఱపారు. దే. అ. క్రి. (ఒఱపు+ఆరు.) మధుర మగు. "చ...చెమట లూరఁగఁ గస్తురిబొట్టు జాఱఁగా, వరుసలు మీఱఁగా గళరవం బొఱపారఁగ మందనుండి శ్రీ, హరి ననునేలె..." రాధికా. ౨, ఆ. ౧౦౯.

ఒఱపిఁడి. దే. విశే. (ఒఱపు+ఇఁడి.) అధముఁడు, నీచుఁడు. "క...పెఱవారలబుద్ధి నాత్మఁ బెట్టునె యనఘుం, డొఱపిఁడి చాడ్పున..." విక్ర. ౩. ఆ. ౧౦౨.

ఒఱపు. దే. వి. 1. సౌందర్యము. "గీ. మకరకుండల మాణిక్య మండనంబు, లొఱపు వాటిల్లఁ గీలించె నొక్కయువిద." రామా. ౪, ఆ. ౧౦౨. 2. విలాసము. "క...మెయిఁ గల విలాసవిభ్రమలక్ష్మిల్, దక్కుటయును నొకయొఱపై నెక్కొన ధరణీశునెదుర నిలిచె వినీతిన్." స్వా. ౪, ఆ. ౬౯. 3. ఉపాయము. "క...పతిచిత్తము గొన, నొఱపు గలిగి మాన్యవృత్తి నుండుదురు దగన్." భార. విరా. ౨, ఆ. ౨౧. దశ. ౬, ఆ. ౧౧. 3. ఆదర్శము. "సీ. ఎవ్వనిచారిత్ర మెల్ల లోకములకు నొజ్జయై వినయంబునొఱపు గఱపు." భార. విరా. ౨, ఆ. ౧౯౧. 4. విధము. "క...పడగలుఁ జామరలు..., పడియెడు వారలకును ... మెత్తపఱపు నొఱపు వహించున్." కవిక. ౨, ఆ. ౧౯౯. 5. ఊహ; కల్పన. "చ...నీ యొఱపులో నిజమో తెలియంగఁ జెప్పుమా." విక్ర. ౮, ఆ. ౪౮. 6. తాపము, బాధ. "క...మన్మథు, నొఱపులఁ బడియెడు నితండు యువతీప్రీతిన్." భార. ఆర. ౨, ఆ. ౧౩౪. విశే. 1. యుక్తము, తగినది. "క. ఎఱిఁగించి మీకు నునికికి, నొఱపు..." నిర్వ. ౨, ఆ. ౮౦. 2. దృఢము, విడువనిది. "చ. ఒఱపుగఁ దక్కళేబరము నొందిన యుగ్రపుభూతము..." షో. ౪, ఆ. (శ. ర.) 3. విశాలము, వెడద యైనది. "క. ఒఱ పగనురమును..." భాగ. ౮, స్కం. ౨౫౭. 4. అధికము. "ద్వి. ఒఱపువెన్నెలఁ గాయునుదరంబు గలిగి." ద్వి. హరిశ్చ. పూ. ౭౨౧, పం.

ఒఱపుకాఁడు. దే. విశే. (ఒఱపు+కాఁడు.) 1. సుందరుఁడు, అందగాఁడు. 2. మొఱకు, మోటువాఁడు. "గీ...బుంగలయాసవంబు, నొడిచికొని తెచ్చుచున్నట్టి యొఱపుకాఁడు, విక్రమాఢ్యుం డు వారుణీవిక్రయుండు." సురా. ౫౨.

ఒఱపుమీఱు. దే. అ. క్రి. (ఒఱపు+మీఱు.) ఒప్పు. "సీ...ఒఱపుమీఱె. గీ. ధరిత్రీరుహాళి..." కృ. శకుం. ౧, ఆ. ౨౧.

ఒఱపులాఁడి. దే. విశే. (ఒఱపులు+ఆఁడి.) సుందరి, అందగత్తె. "వ...మెఱపుటొఱపులాఁడి నర్తన చమత్కృతికి నచ్చెరువంది..." చం. ___. ౬, ఆ. ౫౪.

ఒఱపులాఁడు. దే. విశే. (ఒఱపులు+ఆఁడు.) సుందరుఁడు, అందగాఁడు. "సీ. రతిదేవి జిగిమించు రారాపుఁజనుదోయి నొఱగుదిండులు సేయు నొఱపులాఁడు." సుద. ౫, ఆ. ౫౦.

ఒఱపెంకు. దే. వి. (ఒఱ+పెంకు.) నూతియొఱ. (శ. ర; బ్రౌ.)

ఒఱలు. దే. అ. క్రి. (క. ఒఱల్.) 1. విలపించు. "సీ. వారణకోటి తదారోసఁకులతోడ వివశమై యొఱలుచు ననని ద్రెళ్లె." భార. ఆర. ౭, ఆ. ౨౨౫. 2. అఱచు, ధ్వనిచేయు. "చ...కుఱుకుట్టుం చెడసంది బిట్టొఱలు నఘోరాహి..." నైష. ౮, ఆ. ౧౨౫. పారి. ౫, ఆ. ౩౧. 3. కలఁగు. "క...దాసపురాంధ్రు పలుకుపలుకుల్, చెవిఁ దాఁకి చుఱుక్కు మనినఁ జిత్తం బొఱలన్." రాఘ. ౬, ఆ. ౧౪౧.

ఒఱవ. దే. విశే. 1. వక్రము. "ఆ...పంగు వొఱవగఁ గాలునే, వితిచి సాధుజనులఁ బఱచినాఁడు." భార. అను. ౫, ఆ. ౧౦౦. 2. వికృతము. "క. అఱపొఱడు కుఱుచచేతులు, నొఱవశరీరంబు..." భార. ఆర. ౨, ఆ. ౧౩౪. 3. తాఱుమాఱు. "క...ఇట్టునట్టు నొఱవలుగా మైఁ, గప్పుకొని యాబృహన్నల..." భార. విరా. ౪, ఆ. ౩౯.

ఒఱవఁబడు = ఒఱగఁబడు. "చ...ప్రాణమర్మముల్, వదలి శతాంగయష్టి నొఱవంబడ..." జై. ౬, ఆ. ౨౩౦.

ఒఱవు = ఒఱగు. (చూ. ఒఱవఁబడు.)

ఒఱు = ఒట్టు. (చూ. ఒఱుబీజము.)

ఒఱుబీజము. మి. వి. (ఒట్టు+బీజము.) ఒకప్రక్కనండము వాచువ్యాధివిశేషము. (శ. ర.)

ఒట్టి. దే. వి. కారము. "గీ. పట్టికూడును వేసీట్ల పెట్టి యొట్టి, గలుగుపీడ్యంబు లిప్పించి..." పాండు. ౩, ఆ. ౫౬. విణ. కార మైనది. "సీ...ఒక కొన్ని విధనుల యొట్టి, చేరులు..." పాండు. ౪, ఆ. ౧౮౪.

ఒట్టిఁదనము. దే. వి. (ఒట్టి+తనము.) కారము, ఒట్టి. "గీ. ఆవపచ్చళ్ల చవి చూచి రాదరమునఁ, జుట్టు మని మూర్ధములు దాఁకి యొట్టిఁదనముఁ, బొగలు వెడలింప నాసికాపుటములందు." నైష. ౬, ఆ. ౧౩౦.

ఒట్టికసింద. ద్వ. వి. (ఒట్టి+కసింద.) కచ్ఛుర ✤. (శ. ర.)

ఒట్టిన. దే. వి. ఒట్టి. కారము. (శ. ర.) విశే. కార మైనది. "చ. చిలువసుధారసాధరల చెల్వపుఁ బుక్కిటితావిఁ దీయనై, వలపుల నందుకట్టి యుల వక్త్రవిషజ్వాలనోష్మ నొట్టినై." ఆము. ౫, ఆ. ౧౦౭.

ఒట్టియ = ఒట్టె. (శ. ర.)

ఒట్టె. దే. విణ. అపశము, లోఁబడనిది. "ద్వి. ఒట్టె యై తనక్రేపు నొల్లకపోవు, కుట్టికి లేఁగపై గూర్మిఁ బుట్టింతు." నవ ౧, ఆ. ౨౯, పు.

ఒలపక్షము. మి. వి. (ఒల+పక్షము.) ఒకపక్షము వహించుట, పక్షపాతము. "క. ఖలవృత్తి మత్త నూజల, నొలపక్షముచేసి పరుస లోసఁగక శోకాకులితల గాఁ జేసిన చంచలచిత్తుఁడ చెడు మటంచు శపియించుటయున్." వరాహ. ౭, ఆ. ౫౦.

ఒలయించు. దే. స. క్రి. (ఒలయు. ధా. ప్రే.) 1. కూర్చు, సంఘటించు. "క...శీల మది మేళ్లాన యించును దాన నుల్ల మూన్పుము పుత్త్రా." భార. శాం. ౩, ఆ. ౧౪౭. 2. విడుచు, నిగిడించు. "సీ. ప్రాక్సపత్నిఁ గరంచుభర్తఁ జూచి ప్రతీచి యొలయించువేఁడి నిట్టూర్పుగమియొ." కృ. శకుం. ౧, ఆ. ౩౦.

ఒలయు. దే. అ. క్రి. 1. ప్రవేశించు. "క. వారిజ నాభుని తేజం, బారాజోత్తముని యాత్మయం దొలయఁగ..." హరి. పూ. ౨, ఆ. ౩౦. నిర్వ. ౮. ఆ. ౫౭. 2. వ్యాపించు. "గీ. గమగమలఁ గపురకపువిడెంబుగంధ మొలయ." హంస. ౫, ఆ. ౩౭౦. స్వా. ౧, ఆ. ౧౨. 3. వీచు. "క. మగువపాలుపుఁ దెలుపునొక్క మారుత మొలసెన్." స్వా. ౨, ఆ. ౨౪. 4. కలుగు. "ఆ...ఉపవాసము నవివిధ శుభము లొలయు..." భార. అను. ౪, ఆ. ౧౪౭. 5. బయలుపడు. "గీ. చిలుక గుంపులు గండుఁ గోయిలలగములు, నొలయఁ జాలక చెట్లనె యొదుఁగఁ జొచ్చె." చిత్ర భా. ౩, ఆ. ౧౦౫; 6. ఇష్టపడు. "గీ...ప్రస్థానంబునకు మది యొలయ..." భార. మహా. ౪. 7. వ్రాలు; వ్రేలాడు. "చ...మదాళినీపరం, పరలు భవత్పదాబ్జములపై నొలసెన్..." ఉ. రా. ౬, ఆ. ౪౩. భార. ఆర. ౧, ఆ. ౧౦౭. 8. కలయు. "సీ. ఒకయింతి కెమరుగా నొలసి నాఁ డిక్కడ..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౨౮. "క...రైభ్యభరద్వాజులు..., ఒలసి తపం బొప్పఁ జేయుచుండిరి నెమ్మిన్." భార. ఆర. ౩, ఆ. ౧౫౨. 9. జ్ఞప్తికి వచ్చు. "క. మనమునఁ గుంతీవాక్యం, బును నొలసిన..." భార. ద్రో. ౪, ఆ. ౨౩౮. 10. ఒప్పు, అందమిచ్చు. "సీ...అసను నెన్నడుముల నారు లొలయ." ఉ. హరి. ౫, ఆ. ౨౭౬. స. క్రి. 1. కాంక్షించు. "గీ...రాక్షసవినాశ, మొలసి మనుమని వారింపకుండె నంత." భార. ఆది. ౭, ఆ. ౧౪౯. 2. అంటు. "చ...రామ నృప కుంజరు పాపయుగంబు మస్తకం, బొలయఁగ మ్రొక్కి..." ఉ. రా. ౭, ఆ. ౧౭౨. 3. దగ్గఱు. "ఆ...సురసిద్ధ, సాధ్యకన్య లట్టిసఖులు నూర్వ, రొలసి తన్నుఁ గొలుచుచుండఁగ..." భార. ఆర. ౨, ఆ. ౮. 4. పొందు. "ఆ...కోశ పంజరంబున జంతు, వుండి దానితోన నొలయు వృద్ధి." మార్కం. ౨, ఆ. ౫౫.

ఒలి. దే. వి. దోఁపుడు, ఒలుపు. (చూ. ఒలివడు.)

ఒలికి. దే. వి. 1. చితి. "ద్వి. ఒలికిలోపలిబూది..." ద్వి. హరిశ్చ. ఉ. ౨౨౬. 2. శ్మశానము, వల్లకాడు. "ఆ. ఘోరనుండ నొల్లఁ డొలుకులలోఁ గాని..., వెట్టివాఁడు శివుని వినవె చెపుమ." వీర. ౨, ఆ. ౨౭౪.

ఒలికించు. దే. స. క్రి. (ఒలుకు ధా. ప్రే.) ఒలుకఁ జేయు; క్రక్కు. "సీ. పటువిషం బొలికించు పాములతోనైనఁ జెలఁగి యింపుగఁ జెల్మి సేయ వచ్చు." మొ. రా. యు. ౧, ఆ. ౨౫.

ఒలికిబూడిద. దే. వి. చోరసాధన విశేషము. దశ. ౫, ఆ. ౭౨.

ఒలిదామర. దే. వి. (ఒలి+తామర.) ఒకానొకచెట్టు. (శ. ర.)

ఒలిపించు. దే. స. క్రి. (ఒలుచు. ధా. ప్రే.) ఊడదీయించు, విప్పించు. "గీ. అన్నదమ్ములు నెత్తం బులాడి సతులఁ, దలలు పట్టి సభాస్థలంబులకు నీడ్చి, చీర లొలిపింతురే..." భార. ఉద్యో. 3, ఆ. 3౬౭.

ఒలియు. దే. అ. క్రి. చర్మము ఊడిపోవు. "క... పవనజుఁ, డదయుం డయి వీపు లొలియ నందఱ నీడ్చున్." భార. ఆది. ౫, ఆ. ౧౬౫.

ఒలివడు. ద్వ. అ. క్రి. (ఒలి+పడు.) దోఁపుడు వోవు, చూఱయిచ్చు. "సీ. ఒలివడ్డ నెపమునఁ గలలేనిసిరిఁ జెప్పి చుట్టలపై దాడివెట్టువారు." ఆము. ౬, ఆ. ౧౫.

ఒలివోవు. దే. అ. క్రి. (ఒలి+పోవు.) దోఁపుడు వోవు, ఒలివడు. "సీ. ఒలివోయి యీలేక యొక పూఁటవెట్టెడు తామరచెలికట్టెఁ దడవనేల." య. ౧, ఆ. ౭౯.

ఒలుకు. దే. అ. క్రి. (త. ఒళుకు.) 1. కాఱు. "గీ. ఉచ్చిపోయిన యేటుల నొలుకు శోణితమున ..." భార. ఉద్యో. ౪, ఆ. 3౨౧. 2. ప్రకట మగు. "క...చెలువ మొలుకఁగఁ గొలువై..." సా. ౧, ఆ. ౧3౬. 3. కలుగు. "క. పులుఁగు నకై యెవ్వనిమది, నొలికినశోకము లకారయుత మైకవితా, కలనకుఁ దెరు వయ్యె..." ద్వా. ౧, ఆ. ౧. 4. కలఁగు, చలించు. "చ...వియ జ్ఝరం బొలికె..." కళ. ౧, ఆ. ౧33. 5. దగ్ధ మగు. "సీ. చెలికాఁడు తనమ్రోల నొలికి బూడి ద యైన నామని యేడ్చె నా వఱచినట్లు." హర. 3, ఆ. ౧౩. 6. ప్రోగువడు. "ఆ. దాని పొంత నొకఁడు మానియై జపముతోఁ, బాయ కుండ వెల్మి సేయుచుండు, నతని కెన్నియేఁడు లరిగెనో యొలికిన, హోమధూళి హిమనగోన్న తంబు." ద్వా. ౨, ఆ. ౯౯. స. క్రి. చల్లు. "గీ... పనితాజనంబు, నేస లొలుక..." భార. విరా. ౫, ఆ. ౨3౨. వి. ఒలుకుట. (చూ. ఒలుకులు వాఱు.)

ఒలుకులమిట్ట. దే.వి. (ఒలుకులు+మిట్ట) శ్మశానము, వల్లకాడు. (శ. ర.)

ఒలుకులువాఱు. దే. అ. క్రి. (ఒలుకులు+పాఱు. స్వార్థమున.) ఒలుకు, చిందు. "వ...బ్రహ్మవర్చసం బొలుకులువాఱ నలినియతిం దపంబు సలుపుచున్న సత్యతపునింగని..." వరాహ. ౧౨, ఆ. ౮3.

ఒలుచు. దే. అ. క్రి. 1. ఊడుచు, ఊడఁదీయు. (చూ. ఒలిపించు.) 2. పొట్టుదీయు, శుభ్రపఱచు. (చూ. ఒలుపు.) 3. దోఁచు; కొల్లవెట్టు. "గీ. సాతుఁగూడి చనంగఁ దస్కరులు దాఁకి, నలుగురం బట్టి ధనమెల్ల నొలిచికొనిరి." కాశీ. ౭, ఆ. ౨౫౦. "క. ఒకనాఁ డొగముదిపాఱుని, నొకచో నాతోడిబోయ లొలిచికొనంగా." దశ. 3, ఆ. ౧౨. 4. (పండు మొ.) తొక్క తీయు. వా:— నారింజ పండు ఒలుపుము.

ఒలుపు. దే. వి. (ఒలుచు. ధా.) 1. ఒలుచుట. ఉదా:— ఒలుపుఁబప్పు. 2. ఒకానొక కావ్యదోషము. "ద్వి. తలవిరు పసమగ్రత శిథిలబంధ, మొలు పసంబంధంబు గ్రామ్యోక్తి..." పండితా. దీక్షా. ౨౦, పు.

ఒలె. దే. వి. ఒల్లె, వస్త్రము. "సీ ..ఒలెల్ వైచు బారు." ఆము. ౬, ఆ. ౭౭.

ఒలెవాటు. దే. వి. (ఒలె+వాటు.) 1. వస్త్రధారణము, బట్ట కట్టుకొనుట. "లయగ్రాహి...సౌధములచోటులకుఁ గళలయలవాటులకు బాల యొలెవాటులకు రోసెన్." కాళిందీ. ౨, ఆ. ౫౦. 2. వల్లెవాటు. (శ.ర.) 3. ఒయ్యారముగా ధరించిన యుత్తరీయము. (ఆం. పా.)

ఒల్కి = ఒలికి. "ద్వి...ముందు నొల్కులఁ జేరి..." ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౨3, పం.

ఒలుకు = ఒలుకు. 1. (కాఱు.) "మ...మహాదేహ నిర్గత సాంద్రారుణపూర మొక్క మొగినొల్కఁగన్ ..." భార. ఆది. ౨, ఆ. ౨౪. 2. (చిందు.) "చ. పలికె లతాంగి లేనగవుపల్కులఁ గ్రప్పు బల్కు లొల్కఁగన్." దశా. ౭, ఆ. ౧, ఆ. ౧౦౭.

ఒల్చు = ఒలుచు. 1. (ఊడఁగీయు.) "ఉ...దురాత్ముచర్మపట మొల్వుఁడు..." కు. సం. ౨, ఆ. ౯౨. 2. (గొల్లగొట్టు.) "సీ. చామల నచట నచ్చట నొల్చికొనఁగ నాలోకించి..." భార. సూ. ౧౯౫. 3 (పెఱుకు.) "చ. ఖరతర వజ్రతుండములు కన్నుల నొల్వఁగ..." మార్క. ౨, ఆ. ౯౧.

ఒల్పు = ఒలుపు. "ఉ...ఒల్పుఁబ, ప్పను..." హర. ౨, ఆ. ౩౧.

ఒల్ల = ఒల్ల. (శ. ర.)

ఒల్లఁబడు. ద్వి. అ. క్రి. (ఒల్లమి+పడు.) ఒల్లమినందు. (చూ. ఒల్లఁబాటు.)

ఒల్లఁబాటు. ద్వి. వి. (ఒల్లమి+పాటు.) 1. ఒల్లమి. "ఆ...ఏది నీప్రాణములయందు, నొల్లఁబాటు నీకు నొలయఁజేసె." మార్క. ౮, ఆ. ౬౧. 2. ఉపేక్ష. "మ...ఉల్లంబున నొల్లఁబాటొలసె..." హరి. ఉ. ౫, ఆ. ౧౮౨. విణ. 1. అపేక్షింపఁబడనిది. "సీ. యాగాదిదుర్లభం బైనదేవత్వంబు నీకొల్లఁబాటయ్యె నేఁడుసూడ." నైష. ౪, ఆ. ౭౪. 2. వ్యర్థము, పనికిమాలినది. "క...ఉద్వృత్త క్షత్త్రియధర్మో, పాత్తం బగు తేజ మొల్లఁబాటై తోఁచెన్." భార. ఉద్యో. ౪, ఆ. ౩౨౨.

ఒల్లఁబుచ్చు. దే. స. క్రి. (ఒల్లఁబోవు ధా.) మూర్ఛపుచ్చు. "ఆ. ఒక్కమాటు సురల నొల్లఁబుచ్చు, వీరభద్రరణము..." వీర. ౪, ఆ. ౧౩౨.

ఒల్లఁబోక. దే. వి. (ఒల్లమి+పోక.) ఆదరింపమి, అనాదరము. "ద్వి. మెల్లనఁ దా వచ్చి మెచ్చి నాకీక, యొల్లఁబోకలు సేసె నొల్లఁబో నిన్ను." రం. రా. అర. ౧౩౪, పు. ౭, పం.

ఒల్లఁబోవు. దే. అ. క్రి. (ఒల్లమి+పోవు.) 1. మూర్ఛిల్లు. "చ. కలయఁగ మేన శోణితము గ్రమ్మఁగ లావఱి యొల్లఁబోయి...విహ్వలుఁ డయి తేఱి పై నొఱగువై శ్రవణుం గని..." నిర్వ. ౪, ఆ. ౭౪. 2. నిర్విణ్ణ మగు. "శా...వెడలె...రామ భూవిభుఁడు... ఒల్లంబోవఁగఁ జూచు పౌర సుజనవ్యూహంబు లాహా యనన్." చంద్రా. ౧, ఆ. ౨౪. 3. చేష్టలు దక్కు. "చ...నినిచెఁ గ్రూరశరంబు లురంబునందు గ్రుక్కన నతఁ డొల్లఁబోయి రథకూబర మూఁతగ నిల్చె సోలుచున్." భార. విరా. ౫, ఆ. ౧౭౬. 4. వాడు. "గీ...పగటిపేరెండఁ దాఁకి, యొల్లఁబోయిన లేబొండుమల్లె పొదల." ఆము. ౨, ఆ. ౫౬.

ఒల్లగిల్లు. దే. అ. క్రి. పాయు, క్షీణించు. "మ...ధృతివాయం బుములోట యొల్లగిల సుద్వేగం బఱన్..." హరి. ఉ. ౩, ఆ. ౯౦.

ఒల్లన. దే. క్రి. విణ. (ద్రు.) 1. తిన్నఁగా. "క...నీర జేక్షణుఁ డంతన్, వల్లవబలసంయుతుఁ డై, యొల్లన గోష్ఠంబు సేరె..." భాగ. ౧౦, స్కం. పూ. ౯౨౭. 2. మిక్కుటముగా. "మ...ఒక చపలాక్షి మోవిచవి నొల్లనఁ జొక్కననున్..." వరాహ. ౪, ఆ. ౧౧. నీలా. ౩, ఆ. ౧౦. 3. శీఘ్రముగా. "ద్వి. చల్లని జలము లచ్చటికుంటఁ ద్రావి, యొల్లన మరలి..." ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౦౩.

ఒల్లమి. దే. వి. (వలచు. ధా.) 1. ఇచ్ఛగింపమి. "క...సింగారములు ప్రవీణతఁ జెలులా, కాంతకుఁ జేసిరి లజ్జా, క్రాంతత నొల్లమి నటింప..." కళా. ౭, ఆ. ౯. 2. నిరాకరణము. "ఉ. ఒక్కొకవేళఁ బద్మముఖుఁ లొల్లమి సేయుదు రొక్కవేళఁ బెన్మక్కువ నాదరింతురు..." స్వా. ౩, ఆ. ౬౯. 3. అసహ్యత. "క. కోరిక లుడిగినవానికి, నూరక విశ్వంబుమీఁద నొల్లమి పుట్టున్." కవిక. ౫, ఆ. ౧౫౧. 4. విరోధము. (ఆం. పా.)

ఒల్లము. దే. వి. మూర్ఛ. (ఆం. పా.)

ఒల్లియ = ఒల్లె. 1. (పాగ.) "ఉ...వెల్లతలయొల్లియ మాళి దృఢంబుగా నమర్చెం గురునాథ

..." భార. కర్ణ. 3, ఆ. 3౨౭. 2. (పైబట్ట.) "సీ... మెఱుఁగుటొల్లియతోడి మేనివాని." భాగ ౧౦, స్కం. పూ. ౫౪౯. 3. (చీర) "సీ. అభిషేకవిధియోగ్య మగుమడుఁగొల్లియ నిర్ణాభిబిల ముగా నెఱిక గట్టి. గీ..., జలకమార్చిరి గారికి జలజముఖులు. హర. ౪. ఆ. ౯౧.

ఒల్లె. దే. వి. 1. వస్త్రము. "ఉ... ఒక్కపరిశుద్ధపు నైకపుటొల్లెఁ గట్టి..." ప్రభా. ౪, ఆ. ౧౪౧. 2. చీర. "గీ. వలిపయొంటొల్లెతో నుగ్గ స్తనులుఁ గూర్కు, ప్రియల..." ఆము. ౨, ఆ. ౬౧. 3. బాలిక ధరించు వస్త్రము, పరికిణీ. (ఆం. పా.)

ఒల్లెంక. దే. వి. ఒకవిధ మగు చేఁప. (శ. ర.)

ఒల్లెచీర. దే. వి. (ఒల్లె+చీర.) గర్భిణీస్త్రీలు కట్టుకొనుటకై యెఱుపు తెలుపునూల్లు కలిపి నేసిన చీర. (ఆం. పా.)

ఒల్లెవాటు = వల్లెవాటు. (శ. ర.)

ఒల్వు = ఒలువు. (చూ. ఒల్వుపడు.)

ఒల్వుపడు. ద్వ. అ. క్రి. (ఒల్వు+పడు.) ఒలువఁబడు, చీలు. "చ. చిరముగ నొల్వుపడ్డ సరసిహునికంటెను బెద్దవే..." కు. సం. ౪, ఆ. ౭౬.

ఒవ్వమి. దే. వి. (ఒవ్వు. ధా.) 1. విరోధము, గిట్టమి. "క. ఒవ్వమిఁ గౌరవులకుఁ గడు, ద వ్వళ్ళు..." భార. ఆది. ౭, ఆ. ౨౧౭. 2. దోషము. "ఉ... ఏ, యొవ్వమి లేదు నావలన..." కృ. శకుం. ౨, ఆ. ౯౫.

ఒవ్వు. దే. అ. క్రి. 1. గిట్టు, పొసఁగు. "ఉ. ఒవ్వనివారు నవ్వ..." భార. విరా. ౨, ఆ. ౨౯౬. ఆశ్వ. ౧, ఆ. ౨౦3. 2. రూపుచెడు, అందహీన మగు. "గీ. కుసుమముకుళసన్నిభరదాంకురము లింత, కంది యొవ్వెడు నే .." మార్క. ౧, ఆ. ౨౫౬. వి. వరి మొదలగువానిపన. (బ్రా.)

ఒసఁగు. దే. స. క్రి. (ఈపదము నిరనుస్వారమని కొందఱు. కాని, యందులకు నిర్ధారక ప్రయోగములు కానరాలేదు. చశా., పారి., స్వా. లను బట్టి సానుస్వార మనుటే యుక్తము.) 1. ఇచ్చు. "ఉ... ర్థి నొసంగె నభీప్సితార్థముల్." స్వా. ౪, ఆ. ౪౫. "సీ... మణికమండలు వొసంగి." పారి. ౫, ఆ. ౯౬. భార. శాం. ౬, ఆ. ౬౬. 2. నైవేద్యము పెట్టు. "గీ. పాకమొనరించి సడ్డింప భవున కొసఁగి, కుడుతు..." హర. ౨, ఆ. ౫3. 3. కలిగించు. "సీ... విశ్రాంతి యొసఁగ." నైష. ౫, ఆ. ౯. 4. ఒప్పగించు. "క... ముదిత నుపవనా, తనుపవనా హాతి కొసఁగెక..." వసు. 3, ఆ. ౧౭౬. 5. బహూకరించు. "గీ. తనయుపలాభమునకు బ్రమోదంబుఁ గాంచి, కనకకశిపుఁ డొసంగెను గనక కశిపు, మున్యనస్తంగ భూదేవ ముఖ్యులకును." పాణి. ౪, ఆ. ౧3౪. వి. 1. త్యాగము. "శా... మీ యొసఁగుఁ సప్పింపన్ .." ఆము. ౬, ఆ. 3౭. 2. బహుమతి. "గీ... సామాజికులు సమస్తమ్ము లెల్ల, నొసగుబుగ వైన..." ప్రభా. ౪, ఆ. ౧౦౧.

ఒసపరి. దే. విశే. 1. సుందరి; సుందరుఁడు. "క. నీ కాయొసపరి తగు..." చం. రా. ౫, ఆ. ౫౪. సా. ౧, ఆ. 3౯. 2. సుందరము; విలాసవంతము. "క. ఒసపరినడకలు..." వేం. పంచ. ౪, ఆ. ౧౪3. సా. ౧, ఆ. 3౯.

ఒసపరిగాఁడు. దే. విశే. (ఒసపరి+కాఁడు.) సుందరుఁడు; విలాసవంతుఁడు. "సీ. చివురువాతెఱ రచ్చ సేయుఁ బోటి యూరి యొసపరిగాని పల్లొత్తుకెంపు." వేం. పంచ. 3. ఆ. ౨౫౪.

ఒసపరితనము. దే. వి. (ఒసపరి+తనము.) అందము; విలాసము. "లయవిభాతి... నొసలిపయి ముంగురుల యొసపరితనంబునకు..." బహు. ౨, ఆ. ౫౫.

ఒసవు = ఒసఁగు. (ఇచ్చు.) "ఉ... వెన్నుఁడు మెచ్చి యెన్నఁడొసవెన్ వరముల్ ..." వి. పు. ౨, ఆ. ౫౦.

ఒసి = ఓసి. అం. భా. తృ. ౭౨. "ఉ... హా, బాగొసి యమ్మ..." పార్వ. ౨, ఆ. ౨౦.

ఒసీ = ఓసి. "క...తోడితెరవ లాసీ నీ, కెన్నె నెల లన..." పార్వ. 3, ఆ. ౮౭.

ఒసుకు. దే. వి. ఒకవిధ మగుగాలము. హంస. ౪, ఆ. ౧౮౪.

ఒసులు. దే. అ. క్రి. తప్పుకొను. "ద్వి. దెస వికృ్కనీ మన నొసిలి పోవంగ, నసమాన మీ కిది యర్హమే దేవ." పండితా. పురా. ౧౫౦, పు.

ఒహో. దే. అవ్య. 1. ఆశ్చర్యార్థకము. దశా. ౧, ఆ. ౧౬౯. 2. సంబోధనార్థకము. "మ... ఒహో కుమార యనుచున్ వ్యాసుండు చీరంగ..." భాగ. ౧, స్కం. ౫౫. 3. ప్రశంసార్థకము. (చూ. ఒహోహో.)

ఒహోహో. దే. అవ్య. ప్రశంసార్థకము. ప్రభా. ౧, ఆ. ౧౦౩.

ఒళగు = ఒళవు. (వీణాదండము.) "ఆ. చారు మూర్వి లేని చాపదండమునోజ, లలితతంత్రి లేని యొళగుఁ బోలె." భా. రా. అర. ౨, ఆ. ౨౭౫.

ఒళరు. దే. వి. 1. నేరము. 2. వ్యాజము. మిషు. అ. క్రి. తబ్బిబ్బు మాటలాడు. (ఆం. పా.)

ఒళవరి. దే. విణ. (ఒళవు+అరి.) మర్మజ్ఞుఁడు. (శ. ర.)

ఒళవు. దే. వి. 1. వీణాదండము. "ఆ. తివిచి చూడ లేద గవుసెన యెన్నండు, నొళవు దుమ్ము గప్పి యొప్పు డాఁగి, తంత్రు లూడి విన్నఁదన మొందె నిది యేమి, మహతి యున్నయునికి మానిచంద్ర." కళా. ౨, ఆ. ౪౫. 2. రహస్యము. "చ...నీ, వనుపమ దేవదానవమహాహవ నాటకసూత్రధారివై, ఘనముగ వీణె మీటు లయకాఁడవు నీయొళ వే నెఱుంగనే." శశాం. ౪, ఆ. ౯౧. విజ. ౨, ఆ. ౨౦౦. 3. వలపు. "సీ. నునుమోవిపైఁబోవి మను బింబనికురంబముల కేఁగురాచిల్క కొళవు లియ్య." కువల. ౪, ఆ. ౧౩౯.

ఒళ్లము. దే. వి. ఏడుపలముల యెత్తు. (ఆం. పా.)

ఒళ్లు. దే. వి. బొ. ఒడలు, దేహము. "ఉ...ఒళ్లు చెడ్డవాఁ, డెక్కటిదేవిమిండఁ డను టెల్ల యథార్థము పొందురాంగళా." రా. వి. ౪, ఆ. ౫౫.

ఒళ్లుచేయు. దే. అ. క్రి. (ఒళ్లు+చేయు.) 1. బలిష్ఠముగ శరీరము పెరుగు. వా:– ఆపిల్లకు ఒళ్లు చేసినది. 2. నిస్సత్త్వముగ శరీరము ఊరు. వా:—ఆమె కీమధ్య బాగుగా ఒళ్లుచేసినది. (ఒళ్లువచ్చు అనియు వాడుక.)

ఒళ్లుపెట్టు. దే. అ. క్రి. (ఒళ్లు+పెట్టు.) బలియు. (శ. ర.)

## ఓ

ఓ. ఉభ. యు. దే. అవ్య. 1. సంబోధనకు: బూర్వము హెచ్చరించుటకు వాడఁబడును. "ఉ. ఓ సదయాత్మ..." వరాహ. ౭, ఆ. ౭౫. 2. ప్రార్థనాద్యర్థకము. "ఉ...అడ్డపడరో సురలార..." భా. రా. యు. ౪౧. 3. అమ్మటను దెలుపును. "సీ...చల్లో చల్ల..." దశా. ౧, ఆ. ౧౨౫. 4. ఆర్తిని దెలుపును. ఉదా:– కుయ్యో, మొఱ్ఱో. 5. పిలిచిన పలుకుట కుపయుక్తము. "క...ఓ, యను దఁట పిలిచిన..." భాగ. ౧, స్కం. ౯౧. 5. సందేహముఁ దెలుపును. "మ...ఆర్యామహాదేవియుం, నను రక్షింప నెఱుంగునో యెఱుఁగదో నాభాగ్య మెట్లున్నదో." భాగ. ౧౦, స్కం. పూ. ౧౭౨౫. 7. ప్రశ్నముఁ దెలుపును. "చ...సమరంబె యొనర్చెదవో...జితోస్మి యంచు వచియించెదవో..." ఉ. రా. ౪, ఆ. ౪౨. 8. కిమర్థకము. ఆం. భా. కృ. ౭౦. 9. కాక్వర్థకము. "మ. గృహసమ్మార్జనమో జలాహరణమో..." ఆము. ౨, ఆ. ౯౧. 10. కాంబోలు అనునర్థమును దెలుపును. "శా. ప్రారంభించిన వేద పాఠమునకున్ బ్రత్యూహ మానంచునో..." పాండు. 3, ఆ. 33. 11. ఆక్షేప నిరసనా ప్రాచుర్యాదులఁ దెలుపును. వా:—ఓ. ఏమి యందము! ఎవఁడో దారిపోవువాఁడు. భీమ. ౧, ఆ. ౧౧౭. 12. సంఖ్యాధిక్యాదులను సూచించును. "శా...ఎన్నాళ్లనో యుండి..." పాండు. 3, ఆ. 33. ఇట్లే ఇతరము లూహించునది. వై. స. (సం. ఏకః.) ఒక. "శా. ఓరాత్రిం గనుజెప్ప వేయక..." కాశీ.

౫, ఆ. ౧౮౯. సం. వి. ఓ. పుం. బ్రహ్మ. (తెనుఁగున దీనికి వ్యస్తప్రయోగము లేదు.)

ఓంకారము. సం. వి. అ. పుం. **1.** ఓం అను ప్రణవాత్మకములు, ఓంకృతి. **2.** ప్రారంభము. **3.** సమ్మతి.

ఓంకృతి. సం. వి. ఇ. స్త్రీ. ఓంకారము. "గీ. మొదలి తుది యోంకృతులతోడ మూర్ధ మగుచు, వ్యాహృతులు మూఁటినాల్గింటి నధిగమించి, మంత్రరాజంబు గాయత్రి మహిమ నొప్పు." కాశీ. ౫, ఆ. ౨౧౦.

ఓంద్ర. దే. వి. గాడిదయఱపు. (చూ. ఓంద్రపెట్టు.)

ఓంద్రపెట్టు. దే. అ. క్రి. (ఓంద్ర+పెట్టు.) గాడిద యఱచు. "క...వీనుల్, బొడువడ నోంద్రపెట్టుచు, దుండగపు ఖగంబు..." వేం. పంచ. ౩, ఆ. ౫౩.

ఓంద్రించు. = ఓంద్రపెట్టు. (శ. ర.)

ఓఁక. దే. వి. పుల్లకలివె ✿. "సీ...ఓఁకపం క్తేకుక ...అప్ప. ౨, ఆ. ౧౯౭.

ఓఁకలివె. = ఓఁక. (శ. ర.) (ఓఁక+కలివె.)

ఓకణము. సం. వి. అ. పుం. యూకము, పేను.

ఓకణి. సం. వి. ఇ. పుం. పేను.

ఓకము. సం. వి. స్, అ. న. ఓకస్సు.

ఓకర. వై. వి. (సం. ఉద్గారః. క. ఓకరికె.) **1.** డోఁకు. "సీ. ఓకర బలిసెఁ జిట్టుములసందడి మించె..." వేం. పంచ. ౫, ఆ. ౬. **2.** రోఁత. (శ.ర.బ్రౌ.)

ఓకరించు. వై. అ. క్రి. **1.** డోఁకు వచ్చు. (శ. ర. బ్రౌ.) **2.** రోఁతపడు. (శ. ర. బ్రౌ.) **3.** డోఁకు. (ఆం. పా.)

ఓకరింత. వై. వి. **1.** ఓకరించుట. (శ. ర. బ్రౌ.) **2.** రోఁత. (శ. ర. బ్రౌ.) **3.** వాంతికి పూర్వము కలుగు వికారము. (ఆం. పా.)

ఓకస్సు. సం. వి. స్. న. **1.** ఇల్లు. **2.** ఆశ్రయము.

ఓకిలి. వై. వి. **1.** ఓకర, డోఁకు. "ద్వి. పడఁతి శీల పుఁజాలు భవిపాకములకు, నొడఁబడ కునికినోయోకిళ్లు వుట్టె." బస. ౧, ఆ. ౧౪, పు. **2.** రోఁత. (శ. ర.)

ఓకిలించు. వై. అ. క్రి. డోఁకు. "సీ...బిల్లఁ బెట్టకుఁ మని యోకిలించు." భా. రా. యు. ౨౨౧౬. స. క్రి. అసహ్యించుకొను. "గీ. ఉపనిషత్తన్న వీనుల నోకిలించు,...రాశిఁగాపున్ననరుఁడు మోక్షమునఁ దనిసి." కాశీ. ౫, ఆ. ౫౫. మల్హ. ౨, ఆ. ౬౭.

ఓకిలింత. వై. వి. (ఓకిలించు ధా.) **1.** ఓకరింత. "చ...ఓకిలిం, తలు పొడసూపె..." పె.శకుం. ౨, ఆ. ౫౭. **2.** రోఁత. (శ. ర.)

ఓకు. మి. గ్రా. వి. **1.** దుర్భిణియంత్రము, దూరదర్శినియంత్రము. (శ. ర.) **2.** అపకారము. (బ్రౌ.)

ఓగాత్యము. వై. విశే. అసంగళము. (శ.ర.బ్రౌ.)

ఓగితమగు. వై. అ. క్రి. (ఓగితము+అగు.) పాలుపడు, తగు. "ఉ...ఈ, యోజ ననాథుపాటు వడ నోగితమైతివ..." భో. ౫, ఆ. ౨౯౯.

ఓగితము. వై. వి. (సం. యుక్తమ్.) తగినది. "సీ... ఒరులమాటలఁ బడ నోగితముగ." నృసిం. ౨, ఆ. ౯౦.

ఓగిరము. వై. వి. (సం. ఆహారః.) **1.** ఆహారపదార్థము. "సీ. జీవితేశ్వరుఁడు డించిన యోగిరంబులు గుత్ససేయక భుక్తిగొనుట తగవు." కాశీ. ౫, ఆ. ౭౫. **2.** అన్నము. "ఉ...అరటాకుఁ జూచినన్, ఝల్లనె గుండె యోగిరము శాకములుం బొడగానరామికిన్." భీమ. ౨, ఆ. ౧౩౪. **3.** ఆహారము, తిండి. "సీ. పాలనీయ మశేషశైలసామ్రాజ్యంబు యాగహవిర్భాగ మోగిరంబు." హర. ౫, ఆ. ౨౦.

ఓగు. దే. వి. **1.** చెఱుపు. (బాగోగులు = మంచిచెడ్డలు.) **2.** కీడు. (శ. ర.) విశే. **1.** చెడ్డది; చెడినది. సా:—బాగు చేయఁ బోయిన ఓగైనది. **2.** దుష్టుఁడు, చెడ్డవాఁడు. "ఆ. ఓగు నోగు మెచ్చు..." వేమన. ౩౩. "సీ. ఓగు దూబర దిండి యోచవాఁడు..." హంస. ౫, ఆ. ౧౧౩.

ఓగులవాఁడు. దే. విణ. (ఓగులు+వాఁడు.) అధమా ధమ చిహ్నుఁడు, మిక్కిలిఁ తక్కువవాఁ డను గుర్తుగలవాఁడు. "గీ. పోరఁ దన కోడి పాఱు నీహారరోచిఁ, బట్టుకొనిపోయి దానవప్రభుఁడు పిఱికి, వారి కెల్లను నోగులవానిఁ గాఁగ, సుర ముపై జీడి నిఱ్ఱి యచ్చొత్తి విడిచె." కు. సం. ౮, ఆ. ౧౬.

ఓగులాడుచే. దే. అ. క్రి. (ఓగులు+పాడుచు.) దేవురించు, దైన్యపడు. (శ. ర.)

ఓఘము. సం. వి. అ. పుం. 1. సమూహము. 2. ప్రవాహము. 3. పరుస. 4. ఉపదేశము.

ఓచెల. దే. అవ్య. ఓచెల్ల. (శ. ర.)

ఓచెల్ల. దే. అవ్య. (ఓ+చెల్లెల.) ఆశ్చర్యసంతాపా దులఁ దెలుపుమాట. "ఆ. అడుగఁ దలఁచి కొంచె మడిగితి వోచెల్ల, దాతపెంపు సొంపుఁ దలఁప వలదె." భాగ. ౭, స్కం. ౯౬౭. "క. ఓచెల్ల విరహిణీవధ, మేచతురత నీకు..." స్వా. 3, ఆ. 3౬.

ఓచే = ఓగు. (చూ. ఓచవాఁడు.)

ఓచేవాఁడు. దే. విణ. (ఓచే+వాఁడు.) దుష్టుఁడు. హంస. ౯, ఆ. ౧౧3.

ఓజము. సం = ఓజస్సు. విణ. (అ.ఆ.అ.) విషమము, బేసి. (రాశి మొ.)

ఓజస్వంతుఁడు. సం. విణ. (త్. స్వతీ. త్,) ఓజస్వి.

ఓజస్వి. సం. విణ. (న్. నీ. న్.) ఓజస్సుకలవాఁడు.

ఓజస్సు. సం. వి. స్. న. 1. బలము. 2. ధాతుపుష్టి. 3. జ్ఞానేంద్రియపటిమ. 4. ఉత్సాహము. 5. ఎండ. 6. ఒకానొక కావ్యగుణము. (దీర్ఘ సమాసము లుండుట.)

ఓజిష్ఠుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) గొప్పయోజస్సు కలవాఁడు.

ఓజే. యు. దే. వి. 1. విధము, రీతి. "క. రాజో చిత ధర్మంబుల, యోజ విశదభంగిఁ జెప్పితి..." భార. శాం. ౮, ఆ. 3. 2. సన్మార్గము. "క. ఓజ చెడి నడుచుభక్తుల, నోజకు రాఁజేయ శివుఁడ యొడయఁడు..." శివ. సా. ౨౧౧. 3. నీతి, ధర్మము. "గీ. రాజవై నేఁడు కడపట నోజ కూలి, తెచ్చుకొంటివి పాయని తిట్టు రట్టు." వరాహ. ౭, ఆ. ౨౬. 4. ఆజ్ఞ. "గీ. వానరేంద్రులఁ బంపుము వలనుగాఁగ, నుదయవేళకుఁ జనుదేఱ నోజ చేసి." భా. రా. యు. ౨౬3౧. 5. ప్రకృతి, స్వభావము. సా. ౨, ఆ. ౧౧౯. 6. విధి. "క...అంతే, యోజన్ శాకద్వీపం, బిజుంబూ ద్వీపమునకు నినుమడి విరివిన్." వరాహ. ౧౦, ఆ. ౧౬౬. 7. భయము. "చ...పది శిరం బులు నోజ యొనర్పఁ జూడ్కికిన్." భా. రా. అర. ౨, ఆ. ౧౦౯. వై. వి. (సం. ఓజస్. క. ఓజె.) 1. వికాసము, శోభ. "వ...సరోజం బుల యోజయు సుధాకలశంబుల విలసనంబును ..." పాండు.3,ఆ.౧౭౯. 2. ఉత్సాహము."గీ ...ఏ నుండ వెఱపేల నాపగాత, నూజుఁ బోదు వుఁడు మీ రని యోజఁ జెప్పె, శక్రతనయుండు దనయోధజనుల కెల్ల." భార. భీష్మ. 3, ఆ. ౮౦౭. 3. తేజము. "ఉ...తాపసులు రాజు ఋషీంద్రుఁ డటంచుఁ బల్కఁగాఁ, దేజము నొంది యాహారిణదేహమునందలి ప్రీతిఁ జేసి నా, యోజ సెడంగ నేఁ జెడితి యోగిజనంబుల లోన బేలనై." భాగ. ౯, స్కం. ౧, ఆ. ౧౧౬. 4. నేర్పు. భార. విరా. ౨, ఆ. ౧౬. 4. (సం. ఉపాధ్యాయః. క. ఓజ.) ఉపాధ్యాయుఁడు. "గీ. రాజవై యీవు విరహాగ్ని రాఁజవైచు, నోజవైతె గణింపఁ బ మోజవైరి." రా. వి. ౮,ఆ.౮౬. భార. స్త్రీ. ౨, ఆ. ౧3౬.

ఓజెగొను. దే. అ. క్రి. (ఓజ+కొను.) సానుకూల మగు. "చ...శితగిరీశునిపాలి కేఁగి మత్ప్రతిఙ యకార్య మోజగొనఁబల్కి రయంబున రండు ..." కు. సం. ౭, ఆ. ౭౬.

ఓజెగొల్పు. దే. స. క్రి. (ఓజగొను ధా.) నేర్పు చూపు. "వ...వెలయాలికేసంబు లలవడ నోజ గొల్పుచు..." కు. సం. ౭, ఆ. ౧౮౧.

ఓజెపడు. ద్వ. అ. క్రి. (ఓజ+పడు.) చక్కఁబడు; సిద్ధించు. "వ...ప్రయోజనం బోజపడనేర దని యనసూయ శకుంతలం దగ్గఱి..." పిన. శకుం. 3, ఆ. ౯౯.

ఓజపఱచు. ద్వ. స. క్రి. (ఓజపడు ధా. ప్రే.) 1. అలవఱచు; సిద్ధముచేయు. "గీ...ఈ బాలు శిక్షించువార మింక, నొయ్యనొయ్యనఁ దెలివికి నోజపఱిచి, పెట్టఁదేర్తుము..." నృసిం. ౪, ఆ. ౫౯. 2. చేయు. "సీ...బ్రహ్మతేజము దివియగా నోజపఱిచి" విష్ణు. నా. 3, ఆ. ౨౭౯.

ఓజబంతి. వై. వి. (ఓజ+బంతి.) ఒజ్జబంతి, మేలుబంతి: ఆదర్శము. "సీ. ఉవిదల కీభామ యోజబంతి." చిత్ర. భా. ౧, ఆ. ౪౧.

ఓజు. దే. వి. (క. ఓజ.) 1. పనివాఁడు, శిల్పి. "సీ....పనివాని పేరుగా భాసిలు నో జన..." ఆం. భా. ద్వి. ౨౭౨. 2. శిల్పుల బిరుదాంకము. ఉదా:-కామోజు. మొ. 3. కంసాలి. (ఆం. పా.)

ఓట. దే. వి. 1. భయము. "ఆ. వీఁడె వచ్చుచున్నవాఁడు పార్థుఁడు మన, మేమిసేయు వార మీపుదక్క, నొరులు నిలువరింప నోపెడువారలే, రోట లేక తాఁకి యోర్వవలయు." భార. విరా. ౫, ఆ. ౧౭౧. 2. సంకోచము. "ఉ. ఓట యొకింతయేనియు సుయోధను చిత్తమునందు లేదు..." భార. ఉద్యో. 3, ఆ. ౧౦౪. 3. నేర్పు. "ఆ. మాట ప్రౌఢిం దెలిసి యోటమైనల్లన, చేరి కౌరవేంద్రు చిత్తవృత్తి, కనుగుణంబుగాఁగ నానతుం డగుచుఁ బ్రార్థించి యడుగకున్నఁ డాఁటుపడదు." భార. ఉద్యో. ౧, ఆ. ౨౧. 4. పరాజయము. "చ...పన్నిదంపు గెలుపోటలు దీర్పఁగ...ప్రభా. 3, ఆ. ౬3.

ఓటకండ. దే. వి. (ఓట+కండ.) 1. పిఱికికండ, భయస్వభావము. "సీ...కాలారి యను నోటకండ లేక." కు. సం. ౪, ఆ. ౬౧. 2. భయము. "శా. ఏమేమీమది నోటకండ సెడి దేవేంద్రాదులుద్వృత్తులై, నామీఁదం ననుదెంచిరే..." కు. సం. ౧౦, ఆ. ౧3౭.

ఓటమి. దే. వి. (ఓడు ధా.) 1. ఓడుట, పరాజయము. "క. గెలుపును నోటమియును ననిఁ, గలుగవె..." భార. ద్రో. ౪, ఆ. ౨౭౯. 2. అవమానము, పరాభవము. "క. కావున నీయోటమి నీ, కేవెరవునఁ బాయు..." కళా. ౭, ఆ. ౨౦౭. 3. భయము. "క. ఓటమితో సెల్లప్పుడుఁ, బాటవమునఁ బనులు సేసి..." భాగ. ౧, స్కం. ౧౦౪.

ఓటమిక = ఓటమి. (పరాజయము.) "ఉ...నాయెదుర నోడితి మే మనుఁడన్న మేదినీపాలుర...ఓటమిక మేకొని యట్టులచేసి రక్కఱన్." నిర్వ. ౫, ఆ. ౨౭.

ఓటమిపడు. ద్వ. అ. క్రి. (ఓటమి+పడు.) ఓడు. (చూ. ఓటమిపాటు.)

ఓటమిపాటు. ద్వ. వి. (ఓటమిపడు. ధా.) ఓటమి, పరాజయము. "శా. ఆటోపంబునఁ జిమ్ము బ్రొమ్మగల...నీరాటమున్ నీటిపో, రాట నోటమిపాటుఁ జూపుట కరణ్యాటంబు వాచాటమై." భాగ. ౮, స్కం. ౫౭.

ఓటమిపెట్టు. దే. స. క్రి. (ఓటమి+పెట్టు.) ఓడించు. "క. ఏటలవి సేసి చెంచెత, గౌనోటమిపెట్టఁ గడంగి యున్నట్టియెడన్. హర. ౭, ఆ. ౫౨.

ఓటము. దే. వి. 1. ఓట, భయము. "ఆ. అశ్వమేధమునకు నశ్చితం బైనయుం, యశ్వరాజు నిట్టులపహరించి, ముచ్చుగొఱక యీసముద్రదేశంబున, నోట మెడఁద లేక యున్నవాఁడు." భార. ఆర. 3, ఆ. ౬3. 2. ఓడుట, పరాజయము. "వ...గెలుపు నోటంబును సరిగా..." ఉ. హరి. 3, ఆ. ౧౫౯.

ఓటరి. దే. విశే. (ఓట+అరి.) పరాజితుఁడు, ఓడిపోయినవాఁడు. "సీ. భక్తుండు గెల్చె పరమేశుఁ డోటరి యనుటకు శ్వేతవాహనుఁడె సాక్షి." చెన్న. ౨, ఆ. ౧౫౭.

ఓటఱు. దే. అ. క్రి. 1. ఓడిపోవు. "ఉ. ఇంతకు మున్ను నీజనకుఁ డోటఱిపాఱె..." భార. ద్రో. ౨, ఆ. ౯౯. 2. బెదరు. "ఉ...హరు లోటఱి గ్రేళ్లవాఱఁగన్." భార. ద్రో. ౪, ఆ. ౧౬౫. 3. నిర్బలమగు, సత్త్వహీనమగు. "గీ. తోలి రోటఱిపోనీక దొడ్డి నాఁగి, బొడువ నడునను నలుదెసఁబొంచి యోడి." హరి. పూ. ౬, ఆ. ౧౨౮. "క. నరభోజను లిట్లోటఱి, నరునకు వెన్నిచ్చి తూలినం గని కోపా, తురు లగుచు..." కు. సం. ౧౨, ఆ. ౬3.

ఓటపడు. ద్వి. అ. క్రి. (ఓట+పడు.) 1. భయపడు. "వ...ఓటపడకుండ సార్థవాహులం గడపి పుచ్చి..." కాశీ. ౪, ఆ. ౬౪. 2. అవమానపడు. (చూ. ఓటపఱచు.)

ఓటపఱచు. ద్వి. స. క్రి. (ఓటపడు ధా. ప్రే.) పరిభవించు, అవమానించు. "గీ...ఇట్లతఁడు నిన్ను, నోటపఱచుట తగునె నీ కోర్వఁ దగునె." కళా. ౭, ఆ. ౨౦౬.

ఓటార్చు. దే. స. క్రి. ఓడించు. "సీ. దట్టించి పారిజాతముఁ దెచ్చె...వరుణు నోటార్చె..." ఉ. హరి. ౨, ఆ. ౬౪.

ఓటాఱు = ఓటఱు. (నిర్బలుండగు.) "క. వేటాక విలు గొని యెమ్ముల, గీఱ మెఱుఁగునారసములు గిఱికొలిపిన నో, టాఱి మెయి గ్రొన్నెత్తురు, వాఱ నతఁడు తేరిమీఁదఁ బడి మూర్ఛిల్లెన్." భార. ద్రో. ౫, ఆ. ౧౩౮.

ఓటాఱుచు. = ఓటార్చు. దే. స. క్రి. ఓడించు. (చూ. ఓటార్చు.)

ఓటిగుల్ల. దే. వి. నత్తగుల్ల. "ఉ...ఆణిముత్యముల్, పుట్టెడుతామ్రపర్ణి మఱి పుట్టకయుండునె దె యోటిగుల్లయున్." ప్రబంధ. ౬౭౯.

ఓటిల్లు. దే. అ. క్రి. ఓడు, సంకోచించు. "ద్వి...తనవీటిలోన, నున్నఁ జావుదు నని యోటిల కాడె." రం. రా. యు. 300, పు.

ఓటిల్లుచిందఱ. దే. వి. బాలక్రీడావిశేషము. కాశీ. 3, ఆ. 33.

ఓటు. దే. వి. 1. అపజయము. (చూ. ఓటుపడు.) 2. భంగము. (చూ. ఓటుచేయు.) 3. ఆం. ప్రజాస్వామిక ప్రభుత్వమున వ్యక్తికిఁ గల పౌరస్వత్వపుహక్కు; ఆహక్కు వినియోగించు పత్త్రము. అవ్య. ప్రశ్నమును దెలుపును. "ఉ. వింతలు భూమి నేమయిన వింటివె పౌరులు నన్నుఁ గూర్చి నిం, దింతురొ యెంతురో... వినకుండు వోటు విన్నంతయుం నీవు దాఁపక యథార్థముగా వివరింపు నావుడున్." ఉ. రా. ౬, ఆ. ౧౯౩. స్వా. 3, ఆ. ౪౧.

ఓటుచేయు. దే. స. క్రి. (ఓటు+చేయు.) అవమానించు, భంగపఱచు. "ఆ. పొన్నపువ్వుదీటు పోల్చులోకులమాట, నోటుచేసి వేల్పుబోటి నాభి, విస్తరిల్లె..." రసిక. ౬, ఆ. ౧౦౦.

ఓటుపడు. ద్వి. అ. క్రి. (ఓటు+పడు.) 1. ఓడిపోవు. "ఆ...కా, మోహభోగవిరతుఁ డోటుపడఁడె." భార. ఆది. ౭, ఆ ౬౨. కాశీ. ౬, ఆ. ౨౪. 2. వివశమగు; పరవశమగు. "వ...తదీయ రూపరేఖావిలాసంబులకు నోటువడి..." భాగ. 3, స్కం. ౧౦౦౭. 3. భ్రాంతిపడు, మోసపోవు. "చ...కామసుఖంబులో యంచు భావుకుల్, కనుఁగొన లగ్న నోటువడఁగాఁ గర మొప్పదు రప్పరాంగనల్." కు. సం. ౭, ఆ. ౧౨౬. "వ...గోమాయువు మృదుమధుర భాషణంబులకు నోటువడి..." నా. పంచ. ౪,ఆ.౪౮. 4. అచ్చెరువడు; నిశ్చేష్టులగు. "ఉ...ఉదగ్రత వారలు పోర వారిదోర్లీలలు సూచి రోటువడి రెండుబలంబుల యోధవీరులున్." భార. శల్య. ౧, ఆ. 3౨౨. స. క్రి. ఓడిపోయి పోఁగొట్టుకొను. "గీ. మున్ను దనోటుపడి మఱి నన్ను, నోటు, వడియెనో..." భార. సభా. ౨, ఆ. ౨౦౮.

ఓటుపఱచు. దే. స. క్రి. (ఓటుపడు. ధా. ప్రే.) ఓడించు. "గీ. లాటభూపాలముఖ్యుల నోటుపఱిచె." రాఘవ. ౧, ఆ. ౭. అచ్చ. ఆర. ౯౦.

ఓటుపాటు. ద్వి. వి. (ఓటుపడు. ధా.) అపజయము. "గీ. మొనసి నిశితాస్త్రములు వాని ముఖము నిండ, దీటు కొలిపిన వాఁ డోటుపాటు లేక." అధ్యా. యు. ౧, ఆ. 3౨౫.

ఓటుపుచ్చు. దే. స. క్రి. (ఓటు+పుచ్చు.) ఓడించు. "వ...రావణుఁ డింద్రు భంగించె హుతాశను నోటుపుచ్చె నంతకుఁ బఱపె..." భా.రా.యు. ౮౯౦.

ఓట్రించు. దే. స. క్రి. వంచించు; వర్ణించు. "మ. కవు లోట్రింతురు గాక చందురుఁడె వక్త్రంబు...త్వఙ్మాంసాస్థిరూపంపు మే, ను వితర్కింపఁగ దుర్వివేకులు రహిన్ భోగింత్రు రే

లెల్ల..." మల్ల. శృం. ౪౬. ("ప్రతారితమనాః" అని మూలము. 'వంచితచిత్తః' అని వ్యాఖ్య.)

ఓడ. వై. వి. (సం. హోడః. క. ఓడ.) కలము, నావ. "ఉ. నెట్టన ధర్మనందనుఁడు ని న్నపలంబము సేసి యోడతోఁ, గట్టిన యోడవోలె గతగౌరవుఁడై కడుఁ దూలె..." భార. సభా. ౨, ఆ. ౪౦. రామా. ౩, ఆ. ౬౧. ప్రభా. ౧, ఆ. ౯౪. సా: ఓడ దాఁటుదాఁక ఓడమల్లయ్య. ఓడ దాఁటినతర్వాత బోడిమల్లయ్య.

ఓడంగి. వై. వి. 1. ఓడవాఁడు; పడవవాఁడు. (శ. ర.) 2. దోనెకు లోతట్టువేసెడు దూలము. (శ. ర.)

ఓడకాఁడు. ద్వ. వి. (ఓడ+కాఁడు.) 1. నావికుఁడు. 2. ఓడపై సరకు లంపియుఁ దెచ్చియు వర్తకము చేయువాఁడు. "గీ. అతనినగరున నోడకాఁ డగుచు నొకఁడు, వెలయు వసుమంతుఁ డనుగౌర చెలువుమీఱ." శుక. ౧, ఆ. ౧౭౨.

ఓడకూలి. ద్వ. వి. (ఓడ+కూలి.) తరపణ్యము, కేవు. "ఆ. తురగమునకుఁ బణము పురుషున కరపణ, మాఁడుదాని కైన నంతుసగము, వ్రేఁగు ముట్టునందు వ్రేఁగు విడుపునందు, నోడకూలి గొనుట యుంచిత మండ్రు." విజ్ఞా. ప్రా. ౮౬.

ఓడపసుపు. ద్వ. వి. (ఓడ+పసుపు.) విదేశము నుండి యోడపై దిగుమతి యగు— మేలిమి రంగు గలపసుపు. "ఉ. పోఁకలు నాకు లోడ పసుపున్ గుడమున్..." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౬౬.

ఓడపోఁక. వై. వి. (ఓడ+పోఁక.) విదేశమునుండి యోడపై దిగుమతియగు శ్రేష్ఠమైన పోఁక. "రగడ. తీవి నలఖర్జూరములఁ బురుడించు నల్లవె యోడపోఁకలు, శ్రీ వెలయు గేదంగిరేకుల చెలువు గల నీపండుటాకులు." శుక. ౧, ఆ. ౨౨౨.

ఓడబేరము. ద్వ. వి. (ఓడ+బేరము.) ఓడపైఁ జేయు వ్యాపారము. "మ. నరనాథాశ్రయ మోడబేరమును బెన్మంత్రంబు సిద్ధించినన్, అరయన్ దొడ్డఫలంబు గల్గునదిగా కాకార్యమే తప్పినన్, సిరియుం బోవును బ్రాణహానియు నగున్..." కాశీ. ౪. ౧౧౧.

ఓడబేహారి. ద్వ. వి. (ఓడ+బేహారి.) ఓడపై వర్తకము చేయువాఁడు, ఓడకాఁడు. "సీ. అతనికి గీతాదిగతు లెల్ల వినిపించుచునవ్వేళ నోడబేహారి యొకఁడు." వైజ. ౪, ఆ. ౨౨.

ఓడరేవు. ద్వ. వి. (ఓడ+రేవు.) ఓడలు వచ్చి చేరునట్టియు మరల బయలుదేఱునట్టియు రేవు. "చ. ...అయ్యమునానది యోడరేవునన్." భార. ఆది. ౩, ఆ. ౩౬.

ఓడవము. సం. వి. అ. పుం. ఒకానొకరాగము.

ఓడవాఁడు. ద్వ. వి. (ఓడ+వాఁడు.) ఓడ నడపువాఁడు. ఆం. భా. ప్ర. ౧౫౮.

ఓడించు. దే. స. క్రి. (ఓడు. ధా. ప్రే.) ఓర్చు, ఓడునట్లు చేయు. "సీ...ప్రతివింధ్యుఁ డనువాని నోడించి..." భార. సభా. ౧, ఆ. ౨౨౮.

ఓడిక. ఉభ. దే. వి. (ఓడు. ధా.) 1. క్రిందికి ఓడెడునీరు. "సీ. తఱచుగాఁ జెక్కుటద్దముల నోడికపైన కన్నీరు దుడిచి మొగంబు గడిగి." వైజ. ౬, ఆ. ౮౫. 2. ప్రవాహము. "క. ఊడుకొనఁ బడు మధూలిక, యోడికలకు..." ఆము. ౫, ఆ. ౧౩౭. "శా...అమృతప్రవహం బోడికల్, గట్టన్..." స్వా. ౪, ఆ. ౬౮. హరి. పూ. ౭, ఆ. ౪౭. విణ. ప్రవహించునది. "చ...సురసింధుతోయములఁ గూడినయోడికవాఁగుకై వడిన్." వైజ. ౧, ఆ. ౯౯. సం. వి. ఆ. స్త్రీ. ధాన్యవిశేషము.

ఓడిగిలు, ఓడిగిల్లు. దే. అ. క్రి. 1. ప్రవహించు. "గీ. ఈప్సితార్థంబునకుఁ బాఱు హృదయరుచియు, నిమ్నమున కోడిగిలునీరు నిలుపరాదు." హర. ౪, ఆ. ౭. ("శ్లో. కఈప్సితార్థ స్థిరనిశ్చయం మనః, పయశ్చ నిమ్నాభిముఖం ప్రతీపయేత్." సం. కు. సం. ౫. ౫.) కాశీ. ౩, ఆ. ౧౦౧. 2. పరుగెత్తు. "క...వెన్నెల పడమటిదిక్కునకున్, బలపలనై యోడిగిలఁగఁ బలుకుల వేగెన్." వైజ. ౧, ఆ. ౧౩౬. (శ. ర. పా. "ఒడ్డగిలఁగ" ముద్రి. పా.) 3. స్రవించు. "గీ. ఓడిగిలి రక్త

బిందువు లుట్టిపడఁగ." కాశీ ౬, ఆ. ౧౯౪. ౪, ఆ. ౧౭౪.

ఓడు. దే. అ. క్రి. (క. ఓడు.) 1. పరాజయమందు. "క. విను కర్ణుని కే నోడితి..." భార. కర్ణ. 3, ఆ. 3౪. నిర్వ. 3, ఆ. 33. 2. భయపడు. "క. ఉడిగింతును సర్పయాగ మోడకుఁ డింకన్." భార. ఆది. ౨, ఆ. ౨౨౨. భార. ఆది. 3, ఆ. ౪౧. 3. వెనుదీయు. "ఉ...విధి యోడక సేయుఁగదయ్య క్రౌర్యముల్." భాగ. ౧౦, స్కం. పూ. ౪౭౯. 4. శక్తిహీన మగు. "చ...నీదగు పదంబున నే నిటు లుండ నోడుదున్, ఘనముగ నీవు నీపదము నైకొనవే యవికల్పభావనన్." భార. అర. ౨, ఆ. ౧౫౦ 5. వశమగు. "ఉ...నీదుపుత్త్రు లప్పాడికి నోడరు .." భార. భీష్మ. ౨, ఆ. ౨౬౦. 6. పాఱిపోవు. "చ. వెఱచి నిమీలితాక్షు లయి వెన్క కొదింగెదు పువ్వుఁబోఁడులన్, వెఱవకుఁ డోడకుం డనుచు ..." హరి. పూ. ౯, ఆ. ౪౬. 7. స్రవించు, కాఱు. వా:—నీ ళ్లోడుచున్నవి. స. క్రి. పోఁగొట్టుకొను. "వ...సీతనయుఁడు గుణనిధి నెత్తంబున నోడినవిత్తంబునకై యీయంగుళీయకంబు నా కిచ్చె..." కాశీ. ౪, ఆ. ౧౧౦. దశ. ౫, ఆ. ౬౫. వి. (వృత్తినిమాత్ర మాపవిభక్తికము. ఓటికుండ. "ద్వి. ఓడునఁ బోసినయుదకంబు లట్లు." బస. ౭, ఆ. ౯౭౬. పం.; శివ. సా. ౧౫౪. విశ. ఓటిది, పగిలినది. ఉదా:-ఓటికుండ.

ఓడుపడు. ద్వ. అ. క్రి. (ఓడు+పడు.) పగులు. (చూ. ఓడుపఱచు.)

ఓడుపఱచు. ద్వ. స. క్రి. (ఓడుపడు. ధా.) పగులఁగొట్టు; చిల్లులువుచ్చు. "వ...పగుల నడిచిన పట్టెలుం బైపడం దిగిచినపెట్టెలు నోడుపఱచిన చిందంబులు నొరగం ద్రోచిన దారబందంబులు ..." ఉ. హరి. ౧, ఆ. ౫3.

ఓడుబిళ్ల. దే. వి. (ఓడు+బిళ్ల.) ఇంటిపైఁ గప్పెడు పెంకు. "సీ. పిల్లికన్ రతనంపు బిగియోడుబిళ్లలు ..." అచ్చ. అయో. ౪. శకాం. ౪, ఆ. ౧౭౦.

ఓడుసేయు. దే. స. క్రి. (ఓడు+చేయు.) చిల్లులు వుచ్చు; ఓడించు. "చ...బలఘస్మరు నమ్ముల నోడుసేసి..." నిర్వ. ౬, ఆ. ౧౪౪. "క. నిలు నిలు విడువిడు మంచును, బలువిడిఁ గూడుకొని పిఱుఁదఁ బఱతెంచిన న,మ్ముల నోడుసేసి యందఱ, నిలిపె విజయలక్ష్మిసొంపు నెలకొన నెలమిన్." నిర్వ. ౭, ఆ. ౫౯.

ఓడ్రము. సం. వి. అ. పుం. (ఓఢ్రి మనియుం గొన్ని నిఘంటువులఁ గలదు.) 1. ఉత్కలదేశము. (ఒరిస్సా.) 2. దాసనము పూ. (త్రి. ని.)

ఓడ్రుఁడు. సం. వి. అ. పుం. ఓడ్రదేశస్థుఁడు.

ఓణి. దే. వి. ఉత్తరీయము. (ఆం. పా.)

ఓతము. సం. విశ. (అ. ఆ. అ.) 1. ప్రోతము, కుట్టఁబడినది. 2. అడ్డముగా నేయఁబడినది.

ఓతువు. సం. వి. ఉ. పుం. పిల్లి.

ఓదనము. సం. వి. అ. పుం. న. అన్నము. న. మేఘము.

ఓదము. వై. వి. (సం. అవపాతః.) అవపాతము, ఏనుఁగు మొదలగుమృగములను బట్టుకొనుటకై త్రవ్వెడుగొయ్యి. "క. వల యురి యోదము గాలము, గలిగగదా మృగముఁ బక్షి గజము ఝషము దక్షులు పట్టుదురు..." భార. శాం. ౪, ఆ. ౧౯౧. హరి. పూ. ౬, ఆ. ౧౨౯. ఉ. హరి. ౪, ఆ. ౨౯.

ఓదారుచు. దే. స. క్రి. ఊఱార్చు. (శ. ర. వా.)

ఓదార్చు = ఓదారుచు. (శ. ర. వా.)

ఓదియ = ఓదె. (శ. ర.)

ఓదె. దే. వి. పస, పరి మొదలగునవి కోసి యక్కడక్కడ నుంచెడుపోఁచలప్రోగు. "గీ...ఓదె యనఁగఁ దీర్ణయావనాళ, కాదులు చెలంగు..." ఆం. భా. ద్వి. ౨3౭.

ఓదెకొంగ. ద్వ. వి. (ఓదె+కొంగ.) కోఁతకాలమున నోదెలయొద్దఁ దిరుగుచు నానిని దిను— ఒకజాతికొంగ. (శ. ర. బ్రా.)

ఓదెకొఱకు. = ఓదెకొంగ. (శ.ర. బ్రా.)

ఓదెపడు. ద్వ. అ. క్రి. (ఓదె+పడు.) ఓదెలవలెఁ బడు, కుప్పగూలు. (చూ. ఓదెలుపడు.)

ఓదెపాటు. ద్వ. వి. (ఓదెపడు. ధా.) ఓదెవలెఁ బడుట, కుప్పగూలుట. "గీ...నీ వరుల నోదె, పాటు చేసితి వనుట యేపాటి..." విజ. పీఠి.౪౪.

ఓదెలువడు = ఓదెపడు. "క. ఇరుఁ గెలఁకులకపులుం దన, శరముల నోదెలువడంగ..." రామా. ౮, ఆ. ౧౬౬.

ఓనమాలు. = ఓనామాలు. (వా.)

ఓనామాలు. వై. వి. బ. ఓం నమః శివాయ మున్నగు నక్షరసముదాయము. (పిల్లలకు విద్యాభ్యాసారంభమున నివి నేర్పుదురు.) "సీ. న న్నయ్యవార లోనామాలు దిద్దుకొ మ్మనినచోఁ గడుపు నొ ప్పనుచు నేడ్చి." హంస. 3, ఆ. ౧౪౧.

ఓనికట్టు. దే. వి. కొండలనడిమి గొందిదారి.(శ. ర.)

ఓనేయు. దే. స. క్రి. తూఱునట్లువేయు. (ఆం.పా.)

ఓపమి. దే. వి. (ఓపు. ధా.) నింద. "క. పాపని పోయిన తెరు వే, నోపి యరసి చక్కఁ బెట్టకున్న జనము లారోపింతురు నాపై నొక, యోపమి..." హరి. ఉ. ౮, ఆ. ౧౪. 2. దౌర్బల్యము. "మ...నీ, నిడువాలుంగడగండఁ జూడ మనుచున్ నిలోపమిం బైచెఱం, గొడియక్ ..." పారి. ౧, ఆ. ౧౧౯. (నిలోపమి = తాళలేమి.)

ఓపిక. దే. వి. (ఓపు. ధా.) 1. శక్తి, సామర్థ్యము. ఆం. భా. ద్వి. ౨౭౧. విక్ర. ౧, ఆ. ౭౭. హరిశ్చ. ౫, ఆ. ౧౯౦. 2. క్షమ, ఓరిమి. "ఉ. ఓపిక లేక చచ్చినమహోరగమున్ గొని వచ్చి కోపినై, తాపసుమూఁపుపై నిడిన దారుణచిత్తుఁడ..." భాగ. ౧, స్కం. ౫౦౦.

ఓపు. దే. అ. క్రి. 1. సమర్థుఁ డగు, శక్తుఁ డగు. "ఆ...అర్జును, నోర్వ నమరులైన నోప రాజి." భార. ఆది. ౮, ఆ. ౨౩., ౧, ఆ. ౧౩౮. 2. ఇచ్చగించు, ఇష్టపడు. "ఉ...ఆనెడునాసవ మర్థిఁ దేరఁగా, నొక్కనికృష్టుఁ బంపుటకు నోపక..." భార. విరా. ౨, ఆ. ౯౮. 3. తుమున్నంతముల కనుప్రయుక్త మైనపు డిది తద్ధర్మార్థక మగును. ఉదా:—రానోపు = రావచ్చును, కానోపు = కావచ్చును. మొ. స. క్రి. సహించు, ఓర్చు. "గీ. ఎన్నఁడును మున్ను వారలయేపు నోపఁ, గానము..." భార. భీష్మ. ౨, ఆ. ౨౮౭. వి. ఓపిక, శక్తి. "ఉ...నీదునిలు పోపును జూతము గాక యిచ్చుటక్." భార. విరా. ౫, ఆ. ౯౩. ("అత్ర పశ్యామి తేబలమ్" అని మూలము.)

ఓపువాఁడు. దే. విశే. (ఓపు+వాఁడు.) సమర్థుఁడు. (ఆం. పా.)

ఓపె. దే. అవ్య. (ఓ+అపె.) ఓసి. "సీ. ఓపె యోపె యనంగ నొప్పు స్త్రీ సంబోధనార్థ మై..." ఆం. భా. తృ. ౭౨.

ఓమటి. దే. వి. అన్నము. "సీ...అన్నంబు వెలయు చుండు, బువ్వ యోమటి...నా..." ఆం. భా. ద్వి. ౨౫౭.

ఓమనగాయ. దే. వి. లేఁతకాయ. "క. మును జిగురునఁ బువ్వున నో, మనగాయల దోరపండ్ల మఱి యూరఁగఁ బం,డినపండ్ల..." ద్వా. 3,ఆ.౧౫౮. బ. ఓమనగుంటలాడుట కుపయోగించుచింత గింజలు మొ. "వ...ఓమనగాయలంగా నోముచు..." పాండు. ౨, ఆ. ౨౫.

ఓమనగుంటలు. దే. వి. బ. బాలికాక్రీడా విశేషము. "మ...ఓ, మనగుంటల్ కనుమూసి గంతనలుగంబాలాట లోనైనకేళీ, లనముక్..." కళా. ౬, ఆ. ౨౦౨. య. 3, ఆ. ౧౪౯.

ఓమనపీఁట. ద్వ. వి. ఓమనగుంటలాడుపీఁట. (శ. ర. వా.)

ఓమము. దే. వి. దీపకము, వాము. "సీ. చెంగల్వకోష్ఠును జెఱుతపిప్పలియును మంచియోమముఁ బోట్టు ప్రాసిపసుపు." అప్ప. ౨, ఆ. ౪౩౧.

ఓము. దే. స. క్రి. 1 కాపాడు, పోషించు. "ఆ. ...తనువు, నోమవలయు మర్త్యుఁ డేమిట నేమఱక..." భార.అశ్వ. ౧,ఆ. ౧౬౪. స్వా.౨, ఆ.౧౭. 2. దాఁచు, రహస్యముగా నుంచు. "సీ. నేరంబు లోమెడు నియతికానికి గట్టిమోఁగడ కానుకగాఁగ నిచ్చి." శుక. ౨, ఆ. ౫౫౭. 3. (పురుడు) పోయు. "సీ...విసుంగుపురు డోమ రానారఁ గొన..."కు. సం. ౮, ఆ. ౧౩౫. 4. తాల్చు, పొందు. "గీ. ఒఱపు గలచందురునిఁ

చంద మోము మోము." అని. ౘ.ఆ.౨౫. విజ. 3, ఆ. ౧౬౬.

ఓమె = ఓపె. ఆం. భా. కృ. ౭౨. నైష. ౬, ఆ. ౧౧౪.

ఓయన. దే. అవ్య. (దు.) ఒయ్యన, సత్యముగా. "క. ఈయగ్ని దేవుఁ డసురకు, నోయనఁ జెప్పుటయు ..." భార. ఆది. ౧, ఆ. ౧33. (చూ. సం. భార. ౫, ఆ. ౨౫, ౨౮. శ్లో.)

ఓయలపాట. దే. వి. ఏలపాట, శృంగారపుఁబాట. "ఆ. ఎలమిఁ జిలుకపిండు దోలు మేనఁ జేసిన, తపము పండఁ బండెఁ దరువనంబు, లవిద లింపు మిగుల నోయలపాటలు, పాడ మధుమపమునఁ బాఱె నలులు." కు. సం. ౪, ఆ. ౯౯.

ఓయారము. దే. విణ. ఒయారము, విలాసము. "క. ఆయంగన క్రీఁగన్నుల, యోయారపుఁగలికి చూపుటురులు బడినం, గాయజునిచిత్త మైనను, గాయజసంతాపవహ్నిఁ గరఁగక యున్నే." విక్ర. ౫, ఆ. ౧౭౦.

ఓయారి = ఒయ్యారి. (శ. ర.)

ఓయి. వై. అవ్య. (సం. అయి. క. ఓయి.) 1. పురుష సంబోధనార్థకము. "గీ. సంగతియె యోయి యి సుమంతతింగణావు." ఆము. ౪, ఆ. ౬౦. 2. ప్రార్థనాదులందుఁ గ్రియల కనుప్రయుక్త మగును. "క. నీయిచ్చయె మిన్నక పోవోయి..." ఆము. ౨, ఆ. ౯3.

ఓయిరము. వై. వి. (సం. ఆహారః.) ఓగిరము, అన్నము. "గీ...ముప్వురును లేక, యూయితం బగు నెబ్బంగి నోయిరంబు." కాశీ. ౫, ఆ. ౭౯౭.

ఓయీ = ఓయి. (శ. ర.)

ఓర. యు. దే. వి. (క. ఓర.) 1. అంచు. "వ... కేళాకూళి యోర పట్టి..." విజ. ౧, ఆ. ౨౦౦. 2. మర్యాద. "మ...ఓరలు పోనాడకు..." ఉ. హరి. 3, ఆ. ౧౨. నిర్వ. 3, ఆ. ౧౫. 3. వైపు. "సీ. ఒకయోరఁ బటుచారణకుమారఘటి తంబు లొకదండ నలిమాడలి కలగాన, ము..." వసు. ౨, ఆ. ౭. 4. క్రీఁగంటిచూపు. "సీ. తొలఁగి వెంటనె యోరఁ దళుకొత్తఁ గనుఁగొనుఁ గన్గొని వానిఁ జెంగటికిఁ బిల్చు." శశాం. ౨, ఆ. ౭౭. విణ. 1. తిర్యగ్వలితము, పెడ యైనది. "ఉ. సోరణగండ్లమార్గమునఁ జొచ్చిన సన్నని గాలి యొక్కయం, భోరుహ పత్త్రనేత్రనునుఁ బొంకపుఁ జన్నులమీఁది సన్నపుం, జీరచెఱంగు వాయగిలఁ జేసిన విశ్వధరాతలేశ్వరుం, డోర యొరర్చెఁ బాపభయ మొంది నిజాననచంద్ర బింబమున్. నైష. 3, ఆ. ౯౯. 2. అపసరిల్లినది. "చ...అతనిన్ భజించి నదియున్ వినయంబున నోరయై చనన్." వసు. ౨, ఆ. ౧౦౯. 3. అడ్డమైనది. "సీ. కంటికిఁ జే యోరగా నిల్పి ..." సా. ౧, ఆ. ౧౨౨. 4. కొంచెము మూయఁబడినది. "చ...కుచంబు లోరగా, వెలువడ ..."హంస. ౧, ఆ. ౨౧౭. స్వా. ౫, ఆ. ౬౯. అవ్య. సాచి, అడ్డముగా. "సీ. ఓరనా సాచ్యర్థ మొప్పు..." ఆం. భా. కృ. ౭౨. వై. (సం. అహోరా.) అహోరాత్రము. (చూ. ఓరంత ప్రొద్దు.)

ఓరంతప్రొద్దు. వై. వి. (ఓర+అంత+ప్రొద్దు.) 1. అహోరాత్రము. "సీ. అశన మబ్బక యున్న నైనను శివరాత్రి యోరంతప్రొద్దును నుపవసించె." కాశీ. ౪, ఆ. ౧33. భో. ౪, ఆ. ౧౨౦. 2. నిత్యము, ఎల్లప్పుడు. స్వా. ౫,ఆ.౧. 3. చిరకాలము. "ద్వి. ఉన్నతోన్నతబుద్ధి నోరంతప్రొద్దు, నన్నుఁ గాంచుటకుఁ గాననభూములందు, నిద్రవో వెన్నఁడు..." రం. రా. యు. ౪౯3. పు.

ఓరక(గ)న్ను. దే. వి. జో. (ఓర+కన్ను.) కడగంటి చూపు. "సీ. ఓరకంటనె కాని తేటి చూడవు కదా..." కవిరా. 3, ఆ. ౬3. "సీ. జాలమార్గికవజ్రజాల మంజుద్యుతిఁ గనుదోయిజిగి యోరగంటఁ జూడ." సా. ౨, ఆ. ౭౦.

ఓరకొప్పు. దే. వి. (ఓర+కొప్పు.) ఓరసిగ, వంక కొప్పు. "సీ. గమకించుచమరివాలములోనఁ గీలించి యుప్పరంబున నోరకొప్పు దిద్ది." వైజ. ౪, ఆ. 3౦.

ఓరగచ్చె. దే. వి. (ఓర+కచ్చ.) ఓరగాఁ జేసినకచ్చ, ప్రక్క కొదిగించిన కౌపీనము. "సీ. చనిచని

తోరగచ్చుగఁ జేసి నిలుచుండి కాల్మడి విడుచుఁ దక్కక చెలంగి." భల్లా. 3, ఆ. (శ. ర.)

ఓరగట్టు. దే. విణ. (ఓర+కట్టు.) ప్రతిస్పర్ధి, పోటి. "సీ. ఈయొప్పు గలనరుం డెందునుం గలుగంగ నేర్చునె కలిగిన నెలఁతపిండు, చూడ్కులు మన ములఁ జూఱగొలుగఁ గొని కాముసకతఁ డోర గట్టుగాఁడె." దశ. ౭, ఆ. ౬౦.

ఓరగించు. దే. స. క్రి. 1. ప్రక్కకు వంచు. "ద్వి...కొమ్ము, లోరగించుచు..." బస. ౫, ఆ. ౪౦౦, పం. 2. విడుచు. "గీ. ప్రాణనాయక మిత్త్రులు ప్రాణసఖులు, గాఁగ మది నెంచి విభు నకుఁ గానివారి, నోరగింపుచు..." సానందో. 3, ఆ. ౫3.

ఓరగిలు = ఓరగిల్లు. (తొలఁగు.) "గీ. కల్లు భూపాల కోటి మొగ్గరము ల్లెల్లఁ, గలఁగఁ దిరుగుడువడ నోరగిలఁగ..." భార. భీష్మ. ౧, ఆ. ౨౬౮.

ఓరగిల్లు. దే. అ. క్రి. 1. ఒఱగు. (శ. ర.) 2. తొలఁగు. (చూ. ఓరగిలు.)

ఓరచూపు. దే. వి. (ఓర+చూపు.) ఓరకంటిచూపు; విలాసపుఁజూపు. "గీ. కటకటా పద్మగర్భుఁ డెక్కడిరసజ్ఞుఁ, డింద్రనరకని కిటువంటి తీంద్ర వయసు, టోరచూపుల నెరహొంతకారిఁ దెచ్చి యాలుగాఁ గూర్చి పాపాత్ముఁ డాయె నహహా." సురా. ౫౯.

ఓరచ్చులు. ద్వ. వి. బ. (ఓర+అచ్చులు.) మడమ యుంచెడుచోట నెత్తుగా నట్టలు వేసి కుట్టెడు చెప్పులు. "క. మొల నీలికానెయును బద,ముల నోరచ్చులు ధరించి..." హరిశ్చ. ౫, ఆ. ౧౧౧.

ఓరడి. దే. వి. చలము, పట్టుదల. "చ. ఉడుగక యుద్ధ మొక్కనన కోరడిఁ బోరఁగ..." చమ. ౧, ఆ. ౭౫.

ఓరణము. దే. వి. ఒకజాతిడేగ. "క. బలువైన వేస డంబులు, జలకట్టెలు నోరణములు సాళ్వంబులు గిద్దులు మొదలుగఁ గలవిడివేఁ, టల పులుఁగులు పథనుతో మిటారింపంగన్." య. ౧, ఆ. ౧౧౨. ఆం. భా. ద్వి. ౯౦.

ఓరతలపాగ. దే. వి. (ఓర+తలపాగ.) ఒరగుపాగ. "సీ. తళుకుబంగరు బెఱంగుల యోరతలపాగ ..." దశా. ౧౦, ఆ. ౧౧౭.

ఓరపడు. ద్వ. అ. క్రి. (ఓర+పడు.) ఒరగు. (చూ. ఓరపాటు.)

ఓరపయఁట. దే. వి. (ఓర+పయఁట.) సగము కుచ ములు కనిపించునట్లు వేసికొను పయఁట; విలాస పుఁబయఁట. "ఉ. కమ్మజవాదివాసనలు గ్రమ్మఁగ నోరపయంట జాఱఁగా." శశాం. ౨, ఆ. ౭3.

ఓరపాక. దే. వి. (ఓర+పాక.) దోసపాక, పంచను దూలములు లేక గోడపై నుండి ప్రక్కకు వంచి కట్టినశాల. ఆం. భా. ద్వి. ౧౬.

ఓరపాటు. ద్వ. వి. (ఓరపడు. భా.) ఒరగుడు; ప్రక్క కొరగుట. "ఉ...సంక్రమముఖ దగ్గి గదాహతి మాణి భగ్నగాత్రిం నిలకించి గొట్టినఁ జలించి యతం డలమూర్తి యోరపాం, టొరగఁ దదాదిగా రఘుకులోత్తమ యాయనఁ బార్శ్వమాళినాఁ, జెంచె నభిఖ్య..." ఉ. రా. 3, ఆ. ౪౦.

ఓరపారము. దే. వి. (బ. ఓరపారములు.) 1. హెచ్చు తగ్గు. (ఆం. పా.) 2. ఓరపారలు, దోషము. "గీ. సత్కవీంద్రులు రచియించి చదువుపద్య, సమితియం దోరపారలు చక్క దిద్ది." కువల. ౨, ఆ. ౯. హంస. ౨, ఆ. ౧౧. 3. భేదాభిప్రాయము. "సీ. ఒండొరుమదులలో నోరపారలు లేక ప్రాపు దాపునసైన బలిమిచెలిమి." సుద. ౪, ఆ. ౬౭.

ఓరమోము. ద్వ. వి. (ఓర+మోము.) పెడమొగము. "శా...హా శ్రీహరీ, యంచున్ బ్రాహ్మణుఁ డోర మోమిడి..." స్వా. ౨, ఆ. ౬౮.

ఓరవాకిలి. దే. వి. ఔ. (ఓర+వాకిలి.) ఓరగా నున్నతలుపులు గల గుమ్మము. "సీ...ఓరవాకిట దేహ మొయ్యఁ జొనిపి." కాశీ. ౪, ఆ. ౧౨౧. విణ. 1. సగము తెఱవబడినది. "ద్వి...తలు పోరవాకిలి చేసి." పండితా. పురా. ౯౬, పు. 2. సగము తెఱచిన తలుపులుగల గుమ్మముగలది.

"చ...ఓరవ్రాకిలి యయి యున్నతల్లలితకేళి నిశాంతముఁ జేరి..." శుక. ౨, ఆ. ౨౨౦.

ఓరపుచ్చు. దే. స. క్రి. (ఓర+పుచ్చు.) ప్రక్కకుఁద్రిప్పు. "వ...సెమ్మొగం బోరపుచ్చుచు నటఁగడచి యప్పుడఁటి యెట్లు చనియె..." నైష. ౭, ఆ. ౧౦౩.

ఓరవోవు. దే. అ. క్రి. (ఓర+పోవు.) 1. ఒరగు. "గీ...నా మోము చక్కఁగాఁ జూడ కోర, వోవఁ జూచుచు దీనతఁ బొంది యునికి, గని..." భార. శల్య. ౨, ఆ. ౯. 2. వంగు. "సీ...పొలఁతి కన్బొమ లోరవోని విండ్లు." చంద్రా. ౬, ఆ. ౧౨౮. 3. తొలఁగు. వా. రా. ౧, ఆ. ౭.

ఓరసించు. వై. స. క్రి. (సం. అపసరః.) విడిచిపెట్టు; వైదొలఁగు. "చ...ఓరసిం, చినగతి నాన్పుపుం గడచి శీఘ్రగతిస్ మఱి వేఱయొక్కరా, ట్టనయునిచెంత నిల్వఁగ..." ఇందు. ౫, ఆ. ౧౪౩.

ఓరసింపు. వై. వి. (ఓరసించు. ధా.) పెడత్రిప్పు; పెడగాఁ బెట్టుట. "సీ. విడిచియుం విడఁజాల కెడ తాఁకు సిగ్గుమో మోరసింపులయింపు దారసింప." అని. ౩, ఆ. ౯౫.

ఓరసిలు. వై. అ. క్రి. (సం. అపసరః.) ఓసరిల్లు. "క. మగువలు మగ లని యెఱుఁగఁడు, మృగముల కోరసిలఁడు..." రామా. ౨, ఆ. ౧౧౩.

ఓరసిల్లు = ఓరసిలు. (శ. ర.)

ఓరసేయు. దే. స. క్రి. (ఓర+చేయు.) ప్రక్కకువంచు. "ద్వి. ఒకపడ గించుక యోరసేయుటయు." రం. రా. ఉ. ౧౦ పు.

ఓరి = ఓరీ. "చ. సట విట మానురోరి..." పారి. ౩, ఆ. ౩౨.

ఓరిమి. దే. వి. ఓర్పు, ఓమ. "గీ. కోరి యోరిమి నోరింబు గుడువ వేమి." నీలా. ౨, ఆ. ౭౭.

ఓరీ. దే. అవ్య. సంబోధనార్థకము. "శా. ఓరీ బ్రాహ్మణధూర్త..." ఉ. హరి. ౪, ఆ. ౧౮౭.

ఓరు. యు. దే.వి. 1. ఇంటితిన్నె గోడలయడుగునను మూలలను తీర్చెడు ఎత్తుమట్టిపట్టె." 2. ధ్వని. 3. వర్షవాయ్వాదిధ్వని. (ఆం. పా.) (శ. ర.) వై. ఉప. (సం. ఉరు.) పెద్ద. (చూ. ఓరగాలి.)

ఓరుఁగల్లు. దే. వి. జౌ. ఏకశిలానగరము. ఆం. భా. ద్వి. ౧౧.

ఓరుగాలి. ద్వ. వి. (ఓరు+గాలి.) పెద్దగాలి. "చ...ఓరుగాలి మొదలూడఁగఁ గూలెఁడు మ్రానికైవడిన్." పారి. ౫, ఆ. ౩౧.

ఓరుచు. దే. అ. క్రి. 1. సిద్ధమగు. (చూ. ఓర్చు.) 2. ఓపు. (చూ. ఓర్చు.) స. క్రి. ఓడఁజేయు, జయించు. (చూ. ఓర్చు.) అ. క్రి. స. క్రి. 1. సైఁచు, తాళు. "సీ...పారుష్యభారమున కోరుచుసె జిష్ణు." నైష. ౩, ఆ. ౧౩౦. శశాం. ౪, ఆ. ౨౭.

ఓరుతీయు. దే. అ. క్రి. (ఓరు+తీయు.) ఇంటితిన్నెగోడలయడుగునను మూలలను ఎత్తుమట్టితో పట్టెలు తీర్చు. (శ. ర.)

ఓరుపరి = ఓప్పరి. (శ. ర.)

ఓరుపు = ఓర్పు. "సీ. తాలిమి యోరుపు తాలిక నాఁగను క్షమకు నాహ్వయము లౌ..." ఆం. సం. మాన. ౬౯.

ఓరువమి = ఓర్వమి. (చూ. ఓర్వమి.)

ఓరెము = ఓగిరము. "సీ...పట్టెఁడోరెము మాకుఁ బెట్టు మనుచు." భాగ. ౧౦, స్క. ఉ. ౯౬౬. వేంక. మాన. ౪౪.

ఓర్చు. దే. అ. క్రి. 1. సిద్ధమగు. "ఉ...వారిమార్కొనుట కోర్చిలి నే నొకబ్రాహ్మణుండ నే." భార. ద్రో. ౫, ఆ. ౩౨. భార. కర్ణ. ౧, ఆ. ౨౧. 2. చాలు, ఓపు. "క...కిరీటి కొక్కని, కేనోర్వ నతండు శరము లెక్క డెఱుంగున్." భార. ఉద్యో. ౪, ఆ. ౧౪౯. కకు. ౧, ఆ. ౧౭౯. స. క్రి. జయించు. "క...భారద్వాజుండు నా కషాయము సేసెన్, ఘోరాజి నతసి నోర్చున, పారపగాక్రము సుపుత్త్రుఁ బడయఁగ వలయున్." భార. ఆది. ౭, ఆ. ౧౫. అ. క్రి. స. క్రి. సైఁచు, తాళు. "సీ. ధనువు నాఱంగంబులను

బరిణతులు దాఁ గోర్తురు పరులకు నోర్వరాని, కో_ర్తుల గలరు..." భార. ఉద్యో. ౪, ఆ. ౨౫౭. "ఉ...ఇంత కోర్తురే, యారయఁ బుష్ప కోమలులు..." విక్ర. ౨, ఆ. ౨౩౬.

ఓ_ర్త = ఓర్తు, ఒకర్తుక. (శ. ర.)

ఓ_ర్తి = ఓర్తు. (శ. ర.)

ఓర్తు. వై. స. ఏ. ఒకస్త్రీ; అన్యస్త్రీ. "సీ. పుష్పలావిక యోర్తు బూమెకత్తియ యోర్తు గంధవాహిని యోర్తొకర్తె లంజ." కాశీ. ౫, ఆ. ౩౧౬. నిర్వ ౫, ఆ. ౧౦౧.

ఓర్తుక = ఓర్తు. (శ. ర.)

ఓర్పరి. దే. విణ. (ఓర్పు+అరి.) శాంతుఁడు, క్షమకలవాఁడు." ఆం. భా. తృ. ౧౧

ఓర్పు. దే. వి. (ఓర్చు. ధా.) 1. క్షమ, సహనశక్తి. "ఉ. ఓ ర్పొకయింత లేని వికచోత్పలలోచన ..." పారి. ౧, ఆ. ౧౧౨. 2. ఓడించుట. "గీ. ఓర్పు గలవార లామీఁద దర్పితారి, యోర్పు గలవారు రాజకందర్పులార." పాంచా. ౪, ఆ. ౫౨. (ఇది రెండర్థములకు నుదాహరణము.)

ఓర్వమి. దే. వి. (ఓర్చు. ధా.) 1. ఈర్ష్య, అసూయ. ఆం. భా. ప్ర. ౧౩౪. 2. సహింపమి, నైఁపకపోవుట. "క...చేటున కోర్వమిఁ దుదిపరి, పాటించిన..." భీమ. ౫, ఆ. ౧౪౯.

ఓల. దే. వి. (క. ఓలు. త. ఓలమ్.) 1. జలక్రీడవేళ ప్రేరేచుటకై వాడుశబ్దము. ఆం. భా. ప్ర. ౧౨౨. "సీ. ఒండొరుఁ బేర్కొని యోల యోలని రేఁచి యదటున జల్లు ఫోరాడి యాడి. హరి. పూ. ౬, ఆ. ౯౬. 2. జలక్రీడ. "సీ. తామర కొలను కందర్పుని యోలకు వనిత నీవదనలావణ్యరసము." కవి. ౩, ఆ. ౭౯. 3. వ్యాజము, నెపము. వేంక. మాన ౪౫. సాం. ని. మాన. ౨౨.

ఓలగందము. ద్వ. వి. (ఓల+గందము.) పూఁతపసుపు; పసుపు. "సీ. అనుదినంబును బ్రాతరారంభవేళల నోలగందమ్ముతో నుదకమాడి." కాశీ. ౩, ఆ. ౨౧౨. క్రీడా. ౧, ఆ. ౧౩౪.

ఓలగము. దే. వి. 1. కొలువు, సేవ. "ఉత్సాహ. కానలో మృగంబు లోలగంబు సేయనుండున, మ్మాని మండలేశ్వరుండు..." రామా. ౨, ఆ. ౭౬. 2. కొలువుకూటము. "క...భోజునియోలగమునఁ గవి, రాజుల రాజులను దెలియ రాదెవ్వరికిన్." భో. ౨, ఆ. ౫౫. 3. సభ. "గీ. ఓలగం బుండె సకల నేత్రోత్సవముగ." చిత్రభా. ౩, ఆ. ౧౧౪. (ఓలగముండు = సభదీర్చు.)

ఓలగించు. దే. స. క్రి. (క. ఓలగిసు.) 1. కొలుచు, సేవించు. "గీ. ఉపనిషత్తులు బోటులై యోలగింప." స్వా. ౧, ఆ. ౫., జై. ౧, ఆ. ౪౪. 2. పరివేష్టించు, చుట్టియుండు. (ఆం. పా.) అ. క్రి. 1. సభదీర్చు. 2. ఒప్పారు. "సీ. సొగసు సూర్యపటంపు సురెపలు మైతళ్కు హారంబట్టు దట్టిపై నోలగింప." సా. ౧, ఆ. ౭౯. (రెండిటికి నిది యుదాహరణము.)

ఓలచెంగనాలు. దే. వి. బ. (ఓల+చెంగనాలు.) అపజయము. ఆం. భా. ద్వి. ౨౨౪.

ఓలమాసగొను. ద్వ. అ. క్రి. (ఓలము+ఆస+కొను.) దేహము దాఁచుకొనఁ గోరు, వెనుదీయు; పరాఙ్ముఖమగు. "ఆ...ఉభయ, బలముఁ బోటులాడెఁ జలమున నొక్కింత, యోలమాస గొనక యోవి నార్చి." నిర్వ. ౪, ఆ. ౬౦. భార. కర్ణ. ౨, ఆ. ౨౭౨. "క. అతిథి నినుఁ గోరనేనియు, మతిఁ గింకిరిపడక యోలమాసగొనక నీ, వతనికిఁ బ్రియంబు సల్పుము..." భార. అను. ౧, ఆ. ౬౯.

ఓలము. ఉభ. దే. వి. 1. మఱుఁగుచోటు. "ఉ... మధూత్సవవిహారము సల్పెను గాఁబెదవితోఁ,ల్పట్టి గణేశ్వరుండు సురభామిను లోలమునం దొడుంగఁగన్." భీమ. ౫, ఆ. ౧౧౯. భార. అను. ౩, ఆ. ౨౯౨. 2. చాటు; దాఁపరికము. "గీ. ఇంక నీసిగ్గుతెర యోల మేల నీకు." భార. విరా. ౨, ఆ. ౧౧౯. "చ...ఓలము మాని చెప్పుమా." కేయూర. ౩, ఆ. ౫౬. 3. జంకు, వెనుదీయుట. "క...మహాకాళసుత దితిసుతాగ్రణు, లోలములే కొదరి తాఁకి రొండొరుఁ గడిమిన్." కు. సం. ౧౨, ఆ. ౧౩౪. 4. భేదము

లిమఱిన. "ఉ. ఓలము లేదు కూర్చునని యూఱడి (గుండెగొం గూర్మి యెల్ల నే,డాలము నేసి..." స. స. ౧౧, ఆ. ౫౪. 5. దేహము, శరీరము. (చూ. ఓలమూసగొను.) అప్ప. ౪, ఆ. ౩౨౦. 6. మూలధనము. (ఆం. సా.) విశే. 1. సుఖ ప్రైనది. "సీ. ఇమ్మోల్యల మగు చోట నిండాక బెలుపుండు గాఢంబుగా సన్ను గొంగెదె." భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౩౩. 2. లోకైనది. "చ...పుష్పరోమ లుల మోలపు నాభుల లీనమయ్యెనో..." కవిక. ౪, ఆ. ౧౩౧. సం. వి. ౧. పుం. కంద ౪. విశే. (౧. ఆ. ౧.) తడిసినది.

ఓలలనాడు = ఓలలాడు. "క...ఓ,లలనా నీపలుకుల సో,లలనాడితి..." ఉ. హరి. ౫, ఆ. ౧౦౭.

ఓలలాట. దే. వి. (ఓలలాడు. ధా.) జలక్రీడ, ఓల లాడుట. "సీ. ఓలలాటలతమి నొండొరుం సటిము చెల్వలడాక కులుకక మెలంగి మెలంగి." ప్రభా. ౨, ఆ. ౧౦౬.

ఓలలాడు = ఓలాడు. "గ. కొలను...,ఆళీనిపహం బు లోలలాడెడి వేళల." స్వా. 3, ఆ. ౮౫. భార. ద్రో. ౧, ఆ. ౧౪౬.

ఓలలార్చు. దే. స. క్రి. (ఓలలాడు. ధా. ప్రే.) ఓలలాడించు. "ఆ...వసుమతీశు, భక్తి నోల లార్చి..." ఆము. ౪, ఆ. ౫. భార. భీష్మ. ౨, ఆ. ౧౬౬.

ఓలాకు. దే. వి. 1. అలయిక, క్రమము. (శ. ర.) 2. కలంత, క్షోభము. (చూ. ఓలాకుపడు.)

ఓలాకుపడు. ద్వి. అ. క్రి. (ఓలాకు+పడు.) 1. కలంక పడు, క్షోభించు. "వ...వేగిరంపుం బయనంబు లయ్యును బ్రజల నోలాకుపడనీక..." భార. విరా. 3, ఆ. ౧౩౨. 2. అలయు, శ్రమపడు. "వ...పంగ్వంధజరఠ ప్రముఖులు తృప్తి యో లాకుపడక..." హరి. పూ. ౬, ఆ. ౨౨.

ఓలాడు. దే. అ. క్రి. (ఓల+ఆడు.) 1. విహరించు; జలకమాడు. "గీ...కృతార్థుం డతండు..., చెలంగి యోలాడుచెవ్వని చిత్తవృత్తి, సచ్చిదానంద మయ సుధాసాగరమున." భీమ. ౫, ఆ. ౧౯౬. య. 3, ఆ. ౫౪. 2. నిండు. "సీ. మణియష్టిం గేలిబ్రహ్మణసజ్జసుధ వీను లోలాడం బ్రొద్దెక్క మేలుకాంచి." ఆము ౪, ఆ. ౧౩౫.

ఓలాయచు = ఓలార్చు. (చూ. ఓలార్చు.)

ఓలార్చు. దే. స. క్రి. (ఓలాడు. ధా. ప్రే.) ఓలా డంజేయు. "వంద...సౌఖ్యవారాశి నోలార్చవే ..." పాండు. 3, ఆ. ౩౮.

ఓలి. యు. దే. వి. ఊంకువ, కన్యాశుల్కము. ఆం. భా. ద్వి. ౧౭౯. వై. (సం. ఆళిః. ప్రా. ఓలీ.) 1. వరుస, క్రమము. "ఉ ..గ్రామ్యుం డజాత వైరికం, దోగినచెప్పుచున్న తఱి నొప్పుగ రోమ శుం డేంగుదెంచె..." భార. ఆర. ౨, ఆ. ౨౯౨. నిర్వ. ౫, ఆ. ౨౭. 2. వాక్యాలంకారము. "గీ. ఏల త్రోచితి దివినుండి యోలి నహుషు." కాశీ. ౨, ఆ. ౧౫౭.

ఓలిమి. దే. వి. 1. చాటు, మఱుంగు. ఆం. భా. ప్ర. ౭౬. 2. ఎడంబాటు, విరహావస్థ. "ఉ. ఓలిమిం జంద్రరోచు లిటు లుండునె చూడ్కికిం బ్రాణ నాయికా." మల్హ. 3, ఆ. ౯౮.

ఓల్లము. సం. = ఓలము.

ఓవము. దే. వి. ఓదము, అవపాతము. "సీ. ఎల యించి పెల్లుపెం డెక్కసేనుంగునైన నోవంబు లోపల ద్రోవఁగలము." నరా. ౪, ఆ. ౭౫. రా. వి. 3, ఆ. ౫౮.

ఓవరి. వై. వి. (సం. అపవరకః. క. ఓవరి.) 1. లో పలిగది. "ఉ. ఓవరిలోన గొందివెస నున్నవి యెన్నియొ యెన్నం బెద్దభాం, డావలి..." హరి. పూ. ౫, ఆ. ౨౧౬. 2. చంద్రశాల. "సీ. ఓవరిపైని నీ కునికిం గావించిరే బజగెడి యని దూఱు బాపగారు." శుక. 3, ఆ. ౨౯౧. 3. అంతఃపురము. "క...పతిచేతులు సుస్వరత విడిపించుకొని యో, వరిలోనికిం బాఱిపోయె వనజాక్షి వడిన్." ప్రభా. ౫, ఆ. ౧౦.

ఓవు. దే. అ. క్రి. ఒవ్వు, సరిపడు. "ఉ...నీ, వో వనివారిముందఱ సయో మగనిం గడకాలం ద్రోచి నేం, డీవసుధేశునిం గలయ నెంచితి వెట్లు..." శుక. ౧, ఆ. ౧౫౪.

ఓషధి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. ఫలింపంగనే నశిం చెడి యరంటిచెట్టు మొ. 2. మందున కుపయో

గించు మొక్క, తీఁగ, వేప మొ. 3. జ్యోతిష్మతి ౪.

ఓషధీశుఁడు. సం. వి. ఆ. పుం. చంద్రుఁడు.

ఓషను. సం. వి. అ. పుం. కాల్చుట.

ఓష్ఠము. సం. వి. అ. పుం. ఉష్ణాహారముచే కందునది—పెదవి.

ఓష్ఠి. సం. వి. ఈ. స్త్రీ. దొండతీఁగ.

ఓష్ఠ్యము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పెదవులయందున్నది. 2. పెదవులయందుఁ బుట్టినది. (ప ఫ బ భ మొ.)

ఓసరించు. వై. స. క్రి. 1. తొలఁగించు. "సీ. అసమచంద్రునియంకకర్దమ మొతపడ కోసరించినపాడవసంగ." పాండు. 3, ఆ. ౨౦౧. పశా. ౯, ౧. ౨౭౫. 2. విడుచు. "గీ. పంచముఖుపేట మేనోసరించె నేని." పాండు. ౧, ఆ. ౧౦౧. ఉ. హరి. ౧, ఆ. ౫౭. అ. క్రి. 1. తొలఁగు. "ఉ...నిజావయవంబులఁ దూల్చ దేవతా, పుంగవుఁ డోసరించుటయు బోరన నడ్డము సొచ్చె సైన్యముల్." పారి. ౫, ఆ. ౧౬. భాగ. 3, స్కం. ౬౭౨. 2. వంగు. "చ. పతగ విభుండు మిటెపము భంజలిరాముపశీసుడాలప, ల్గిశములరా నెదుర్పడిన ఖేచరవర్గము లోసరించి యు, ద్భృతముగ మ్రొక్క..." పారి. ౨, ఆ. ౧౦౨. 3. ఇష్టపడకుండు. "చ...నిజ సన్నుతి కోసరించునే, ర్పునఁ దల వాచి.." పసు. ౧, ఆ. ౧౨౨.

ఓసరింత. వై. వి. (ఓసరించు. ధా.) ఓసరించుట, విడిపడుట. "చ...నిచ్చన్ దనివి తీరనిముచ్చట లోసరింత లే,కలరెడికౌఁగిలింత లెడ లన్నది కన్నది విన్నది లేనికూర్మలున్." ఉ. రా. ౬, ఆ. ౧౬౫.

ఓసరిలు = ఓసరిల్లు. 1. (తొలఁగు.) "క. ఇంతయుఁ గనుఁగొనియును శ, త్రుంతపుఁ డోసరిల కాజిదోహల మలరం, గాంతేయుతోడఁ దలపడి, వింత లయిన కూర్మనఖరవిశిఖము లేసెన్." భార. విరా. ౫, ఆ. ౭౫. 2. (విరమించు.) "గీ. అరయ నిది యెంతపనిదైన నయ్యెఁ గాని, యోసరిల వచ్చునే..." హరిశ్చ. ౫, ఆ. ౨౨. 3. (తగ్గు.) "గీ. ఓసరిలెఁ దగ్గెఁ దఱిగె నా నొప్పఁ సక్కువాయె ననుమాట..." అం. శా. త్ర. ౯౬.

ఓసరిల్లు. వై. అ. క్రి. ఓసరిలు, తప్పుకొను. "సీ. ఎదురుగాఁ జనుదెంచు నింతిపరాకున గొయ్యనఁ దెరు విచ్చి యోసరిల్లు." హైమ. 3, ఆ. ౭౮. "క. పూవాకపూవో యని చే, కే నినఁ గొంపు నని యోసరిల్లెడునామై, జీవంబు నిలుపునే నినుఁ, బోవిడిచి..." కు. సం. ౬, ఆ. ౧౧.

ఓసరు. వై. అ. క్రి. (సం. అపసృ. క. ఓసగ.) తొలఁగు, ఓసరిల్లు. "చ...కుక్షిగర్భపర్వతమున నోక్షోమముల్లై తిరిగి తిరిగి చేసి కొంకుసి పొసి గుంపు..." ఆను. ౪, ఆ. ౩౫. ద్వి. ఎంగన. ౧, ఆ. ౧౭, పు.

ఓసి = ఓసీ. "ఉ. ఓసి పురాంగ్నురాల..." ౪, ఆ. ౭౨.

ఓసీ. దే. అవ్య. సంబోధనార్థకము. "గా. ఓసీ నీవాగామిరేయే యివి..." కళా. ౫, ఆ. ౨౧౬.

ఓహాటము. దే. వి. వెనుదీఁయుట. (చూ. ఓహాటించు.)

ఓహాటించు. దే. అ. క్రి. 1. వెనుదీయు. "గీ. అహవంబునఁ గాదు నీ వోహటించి, పోవ పడి పమ్మ్ సడికంటె: జావు మేలు." భా. స్త్రీ. ౧, ఆ. ౩౩. భాగ. ౭, స్కం. ౩౯౧. 2. భయపడు. "ఆ. మరుని కోహాటించి యుండెనాఁడు..." భార. విరా. ౨, ఆ. ౩౦౦. భార. కర్ణ. ౧, ఆ. ౧౩౩. 3. లయమగు. (చూ. ఓహాటిలు.) 4. ఓడిపోవు. "గీ. ఉవిదలజ్జాభరంబున కోహటించి, వైదుపడి నేసె పలరాజునంతఁ వాఁడు." హైమ. ౭, ఆ. ౧౬౭. కాశీ. ౪, ఆ. ౨౩౫.

ఓహాటిలు = ఓహాటిల్లు. దే. అ. క్రి. 1. భయపడు. "క...మునినాయకునితపస్థితి చెఱుకొ, టికి వజ్రికిదాన నోహాటిల నేమిటికిన్." చంద్రా. 3, ఆ. ౧౩౫. 2. లయ మగు. "గీ. ముదిత యొక్కండు హారుని నెన్నదుటికంట, నొకఁడు కంసారి కుడికంట నోహాటిలిరి. హైమ. ౭, ఆ. ౧౭౯. ('అయా లయం గచ్ఛతి' అని మూలము.)

ఓహాటిల్లు = ఓహాటిలు. (అలసిపోవు.) "క. ఓపిక లే కోహాటిల్లి యుండురుసు రనుచున్. సా. 3. ఆ. ౧౭౪.

ఔఘళము = అవఘళము. (1. అతిశయము, పెంపు.) "గీ. ఔర కరవాఁడి చూపుల యౌఘళంబు." పాండు. ౧, ఆ. ౧౧౭. 2. ఓటమి. (చూ. ఔఘళించు.)

ఔఘళించు. దే. స. క్రి. ఓడించు; క్రిందుపఱచు. "సీ. చూపుచేతనె కాదు రూపుచేతను గూడ హరిణీవిలాసంబు నౌఘళించు." రాధికా. ౧, ఆ. ౨౩. అ. క్రి. చలించు. (ఆం. పా.)

ఔచితి. సం. వి. ఈ. స్త్రీ. = ఔచిత్యము.

ఔచిత్యము. సం. వి. అ. న. ఉచితత్వము, యోగ్యత.

ఔజ్జ్వల్యము. సం. వి. అ. న. ఉజ్జ్వలత్వము, ప్రకాశించుట.

ఔజు = అవుజు. (చూ. అవుజు.)

ఔడవము. సం. వి. అ. పుం. అయిదు స్వరములు గల రాగము, ఓడవము. "మ... ఔడవషాడవంబులు తగన్ ...గాత్రమం దొడుగ నంతన్ వీణ వాయించినన్." స్వా. ౨, ఆ. ౨౪. విణ. (అ. ఈ. అ.) నక్షత్రసంబంధి.

ఔడు. వై. వి. (సం. ఓష్ఠః.) 1. అవుడు, పెదవి. (చూ. ఔడుగఱచు.) 2. దంతము. "సీ...అలరు దంతంబుపై రౌ డనంగ..." ఆం. శే. ౪౭.

ఔడుకొట్టు. ద్వి. అ. క్రి. (ఔడు+కొట్టు.) ఔడు గఱచు. (బ్రౌ.)

ఔడుగఱచు. ద్వి. అ. క్రి. (ఔడు+కఱచు.) 1. పెదవికఱచు. 2. (కోపముచే) పండ్లుకొఱుకు. "ఆ. అలిగి యౌడుగఱచి యాఁకటి పెలుచన, నిలువ నోప కసుర..." భార. ఆది. ౬, ఆ. ౨౬౪. "గీ. తనబలము నేలపాలైన యునికిఁ జూచి, యలిగి యనరణ్యభూపాలు డౌడుగఱచి." ఉ. రా. 3, ఆ. ౧౬౨. (ఇవి రెండర్థములకు నుదాహరణములు.)

ఔడుమాయు. ద్వి. అ. క్రి. (ఔడు+మాయు.) పెదవి దాఁటి వచ్చు; ఖండిత మగు. "సీ. అగ్ని నాలుక లేదు నౌడుమాసినయప్పు డుడురాజు పొట్టిగు జ్జులికినపుడు." భీమ. ౬, ఆ. ౪౫.

ఔత్కృష్ట్యము. సం. వి. అ. న. ఉత్కృష్టభావము.

ఔత్తరాహుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఉత్తర కాలమున నున్నవాఁడు. 2. ఉత్తరదేశమున నున్నవాఁడు.

ఔత్తానపాది. సం. వి. ఇ. పుం. ధ్రువుఁడు, ఉత్తానపాదపుత్రుఁడు.

ఔత్సర్గికము. సం. వి. అ. పుం. సామాన్యవిధి.

ఔత్సుక్యము. సం. వి. అ. న. 1. ఉత్సుకత్వము, ఉత్కంఠ. 2. తీవ్రేచ్ఛ.

ఔదకము. సం. వి. అ. న. నీటిరాష్ట్రము, నీళ్లపుట్టువు.

ఔదనికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) వంటవాఁడు. "సీ. కామధేనువులు గల్గఁగ నేమిటికి మఱి యౌదనంబులకునై యౌదనికులు." శా. 3, ఆ. ౨౦౧.

ఔదరికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) కేవలము తన పొట్ట పోషించుకొనువాఁడు.

ఔదల. దే. వి. (ఔ+తల.) 1. నెత్తురు, తల. "సీ ..బట్టయౌదలఁ గావి పాగ చుట్టి." హైమ. ౭, ఆ. ౯౩. ఉ. రా. ౧, ఆ. ౧౯౧. 2. శిరోగ్రము, ముందల. ఆం. భా. ద్వి. ౧౯౫. ఈ క్రింది ప్రయోగమున నిది సానుస్వారముగాఁ గన బడుచున్నది. "సీ. ఔఁదలఁ జదలేటి లేఁదరఁగలు బాలుఁ డగు చందమామ సుదుమ్మాలు లూఁప." హరి. ఉ. ౬, ఆ. ౩౮.

ఔదలఁదన్ను. దే. స. క్రి. (ఔదల+తన్ను.) తలఁదన్ను; మించు. "మ...గా, రలఘుశ్రీలౌదలల్ చ్చెంచచ్చుటముల్ త్రివిష్టపస్త్రీల నౌ, దలఁ దన్నన్..." కళా. ౧, ఆ. ౫౦.

ఔదాత్త్యము. సం. వి. అ. పుం. ఉదాత్తత్వము, మహానుభావత. "క. సత్యసుకస్వతి వరగు ణౌ, చిత్యవిశారదము నీదుచిత్తము నియమౌ, దాత్త్యంబు మెఱయ నాకు న, మాత్యుఁడవై పూని సడపు మత్సైన్యంబున్." భార. ఉద్యో. ౧, ఆ. ౯౫.

ఔదార్యము. సం. వి. అ. న. 1. ఉదారత్వము. 2. మహానుభావత. 3. ఒకానొక శౌర్యగుణము.

ఔదాసీన్యము. సం. వి. అ. న. 1. తాటస్థ్యము. 2. వైరాగ్యము.

ఔదాస్యము. సం = ఔదాసీన్యము.

ఔదు. దే. వి. 1. అపుడు, నీటిశాలువ. "ప...పలిమించుక్రొమ్మంచుటౌదు లీఁది యీఁది..." స్వా. 3, ఆ. ౨౦. 2. జలయంత్రముగల దిగుడుబావి. (ఆం. పా.)

ఔదుంబరము. సం. వి. అ. న. 1. రాగి. 2. కుష్ఠరోగవిశేషము. విణ. (అ. ఈ. అ.) ఉదుంబరవృక్షసంబంధమైనది.

ఔద్ధతి. సం. వి. ఇ. న. పుట్టతేనె.

ఔద్ధత్యము. సం. వి. అ. న. ఉద్ధతి. "క...సాహృదిబాహుబలములు సమరవిహారా, ద్ధత్యము వాచెదు..." భార. భీష్మ. ౧, ఆ. ౧౧.

ఔద్వాహికము. సం. విణ. (అ.ఈ.అ.) 1. వివాహకాలమున లభించినది. 2. వివాహకాలమున ఇచ్చినది.

ఔషసము. సం. వి. అ. న. (ఔషస్యము, పాలు. (ఔషస్య మని కొందఱు.) విణ. (అ. ఈ. అ.) పొద్దుగునకు సంబంధించినది. (పాలు.)

ఔసటి. దే. అవ్య. భార్యాదిసంబోధనార్థకము, ఓగసటి. "సీ. ఔసటే నైవేద్య మాయెనా..." పళా. ౬, ఆ. ౩౩.

ఔసు = ఔసే. (గ్రామ్యము.) హంస. ౫, ఆ. ౧౦౬.

ఔసే. దే. అవ్య. ఔను, ఔనౌసే. "మ. ఔసే యోసి దురాత్ముండ..." పళా. ౬, ఆ. ౭౩.

ఔరౌగదే = ఔరా! "వ...ఔరాగదే బాప్రు రే..." భాగ. ౭, స్క. ౨౧౩.

ఔగాసే = ఔసే. "శా. ఔగాసే వెలయాల..." పళా. ౭, అ. ౧, ఆ. ౭౯.

ఔన్నతి. సం. వి. ఇ. స్త్రీ = ఔన్నత్యము.

ఔన్నత్యము. సం. వి. అ. న. 1. ఎత్తు. 2. గొప్పతనము.

ఔపచారము. సం = ఔపచారికము.

ఔపచారికము. సం. విణ. (అ. ఈ. అ.) 1. గౌణము. (వ్యతి. ముఖ్యము.) 2. ఉపచారప్రయోజనముగాఁ గలది.

ఔపధర్మ్యము. సం. వి. అ. న. 1. ఉపధర్మము. 2. పాషండమతము.

ఔపధికుఁడు. సం. విణ. (అ.ఈ.అ.) మోసకాఁడు.

ఔపనిషదము. సం. విణ. (అ. ఈ. అ.) 1. ఉపనిషత్తులలోనిది. 2. ఉపనిషద్బోధితము. (బ్రహ్మము.) 3. ఉపనిషత్సంబంధమైనది.

ఔపపత్తికము. సం. విణ. (అ.ఈ.అ.) 1. ఉపపత్తి గలది. 2. తగినది, ఉచితము.

ఔపమ్యము. సం. వి. అ. న. 1. ఉపమ. 2. సామ్యము.

ఔపయికము. సం. వి. అ. పుం. న. ఉపాయము. విణ. (అ. ఈ. అ.) యుక్తము.

ఔపవన్యము. సం. విణ. (అ. ఈ. అ.) ఉద్యానమున నున్నది. "ఉ...కే, ళీలసదౌపవన్యలవలీసుమసిగ్ధళిబానవాంబు ధా, రాలసితంబు..." రంగా. ౧, ఆ. ౯౦.

ఔపవస్త్యము. సం. వి. అ. న. ఉపవాసము.

ఔపవాస్యము. సం. = ఔపవస్త్యము.

ఔపవిభక్తికము. సం. వి. అ. పుం. 1. ఉపవిభక్తి, ద్వితీయాద్యేకవచనములు పరమైనపుడు వచ్చెడు ఆగమాదేశరూప మైన 'టి,తి,ఇ' మొ. 2. ఉపవిభక్తులు చేర్పఁబడిన ప్రాతిపదికము. ఉదా:— కాలు, నీరు, నేయి మొ.

ఔపస్థ్యము. సం. వి. అ. న. 1. ఉపస్థవ్యాపారము, సురతము. 2. సురతసుఖము.

ఔపాసనము. సం. వి. అ. పుం. గృహ్యాగ్నియందు సాయంప్రాతస్సమయములఁ జేయుహోమము. విణ. (అ. ఈ. అ.) 1. ఉపాసనావిషయికమైనది. 3. గృహ్యాగ్నికి సంబంధించినది.

ఔబలము. దే. వి. ఉపబలము, మల్లవిద్యావిశేషము. "సీ...ఖల చుంచుఁ గొన్న నౌబలముఁ గొన్న." కుమా. ౭, ఆ. ౬౦.

ఔమీనము. సం. వి. అ. న. ఉమలు (అగిసెలు) పండు పొలము.

ఔర = ఔరా. (ఔను+ర.) ఆశ్చర్యాద్యర్థకము. "గీ. ఔర యన్చెద వని జను లనఁగ..." పళా. ౧, ఆ. ౨౮౫. ఇట్లే: ఔరా. ఉ. రా. ౪, ఆ. ౧౬౬. (దీని యామ్రేడితరూపము ఔరౌరా. ఉ. రా. ౫, ఆ. ౨౧౯.)

ఔరగము. సం. వి. అ. న. ఆశ్లేషానక్షత్రము.

ఔరభ్రకము. సం. వి. అ. న. ఉరభ్రసమూహము, గొఱ్ఱెలమంద.

ఔరసము. సం. విణ. (అ. ఈ. అ.) 1. ఉరస్సునఁ బుట్టినది. 2. ఉరస్సంబంధి.

ఔరసి. సం. వి. ఈ. స్త్రీ. అగ్నిసాక్షిగఁ బెండ్లాడిన భార్య యందుఁ బుట్టిన కూఁతురు.

ఔరసికము. సం. విణ. (అ. ఈ. అ.) ముఖ్యము; ప్రధానము.

ఔరసుఁడు. సం. వి. అ. పుం. అగ్నిసాక్షిగఁ బెండ్లాడిన భార్యయందుఁ గలిగిన కుమారుఁడు.

ఔరస్యుఁడు. సం. = ఔరసుఁడు.

ఔరు = అవురు. "ఉ. హారికి లెస్సఁడుం బెగసి యౌరులచేలును..." ఆము. ౪, ఆ. ౧౨౪.

ఔరుసౌరు. దే. విణ. (ఔరు+సౌరు.) అవురు సవురు, నశించినది. "సీ. ఘ్రాణేంద్రియజ్ఞానకళ యౌరుసౌరుగా జిహ్వావివేకంబు చిఱుతవోవ." కాశీ. ౧, ఆ. ౧౩౯.

ఔరుసౌరుపడు. ద్వ. అ. క్రి. (ఔరుసౌరు+పడు.) నశించు. "సీ. ధర్మశాస్త్రాభ్యాస తాత్పర్యమున నైన సంస్కారమెల్లౌరుసౌరుపడియె." శివరా. ౨, ఆ. ౧౦౯.

ఔర్ధ్వదేహికము. సం. = ఔర్ధ్వదైహికము.

ఔర్ధ్వదైహికము. సం. వి. అ. న. ఉత్తరక్రియ. విణ. (అ. ఈ. ఆ.) మరణానంతరము చేయఁబడునది. (కర్మము మొ.)

ఔర్వము. సం.వి.అ.పుం. 1. బడబాగ్ని. 2. పాంశులవణము. విణ. (అ. ఈ. అ.) 1. ఔర్వఋషికి సంబంధించినది. 2. ఉర్వికి సంబంధించినది.

ఔర్వవ్రతి. స. వి. న్. పుం. జలాహారమునఁ దపస్సు చేయువాఁడు.

ఔర్వశేయుఁడు. సం. వి. అ. పుం. ఊర్వశీపుత్త్రుఁడు. 1. అగస్త్యుఁడు. 2. ఆయువు. 3. వసిష్ఠుఁడు. "గీ. (విశ్వామిత్త్రుఁడు.) ఔర్వశేయునితోడి మంత్రాటగాఁడు." పిన. శకుం. ౨, ఆ. ౧౧౦.

ఔల. దే. వి. 1. అవుల, అవతల ప్రదేశము. "ద్వి. సారథి రథ మౌలఁ జనఁ దోల..." రం. రా. యు. ౪౫౨, పు. 2. పిమ్మట, ఆపైని. "గీ. కలరు స్వాధీన పతికయు ఖండితయును..., ఔల నభి సారికయుఁ గలహాంతరితయు." కావ్యా. 3, ఉ. ౫౬.

ఔలు. దే. అ. క్రి. అగులు, అవులు, ఊడు. (శ.ర.)

ఔలెమ్ము. దే. అవ్య. (ఔను+లెమ్ము.) ఔగాను. "మ...ఔలెమ్మిందు నే నున్కిఁ జెల్లగ..." పాం. ౧, ఆ. ౫౪.

ఔలే = అవులే, ఔలెమ్ము. (శ. ర.)

ఔశీరము. సం. వి. అ. న. ఉశీరముతోఁ జేయఁబడినది—1. శయ్య. 2. సీతము. 3. చామరము. 4. దండము. 5. లేపనద్రవ్యము. విణ. (అ. ఈ. అ.) 1. ఉశీరసంబంధి. 2. ఉశీరజన్యము.

ఔషణము. సం. వి. అ. న. 1. కారము. 2. ఊషణము.

ఔషధము. సం. వి. అ. న. 1. మందు. 2. ఓషధి. 3. ఓషధులమొత్తము. విణ. (అ. ఈ. అ.) 1. ఓషధీసంబంధమైనది. 2. ఓషధులనుండి పుట్టినది.

ఔషసి. సం. వి. ఈ. స్త్రీ. వేకువ, ప్రభాతము.

ఔష్ట్రకము. సం. వి. అ. న. ఉష్ట్రపంక్తి, ఒంటెల గుంపు.

ఔష్ఠ్యము. సం. విణ. (అ. ఈ. అ.) ఓష్ఠమునందుఁ బుట్టినది. (వర్ణము.)

ఔష్ణకు. సం. వి. అ. న. వేఁడిమి. విణ. (అ. ఈ. అ.) 1. ఉష్ణసంబంధమైనది. 2. వేఁడిది.

ఔష్ణ్యము. సం. వి. అ. న. 1. ఉష్ణము, వేఁడిమి. 2. ఉష్ణస్పర్శము.

ఔష్మ్యము. సం. వి. అ. న. తాపము; వేఁడిమి.

ఔసు = అవుసు. 1. సొగసు. 2. ఒయ్యారము. (చూ. ఔసుకాఁడు.)

ఔసుకాఁడు. దే. విణ. (ఔసు+కాఁడు.) పోకారుకాఁడు, సొగసుకాఁడు; విలాసవంతుఁడు. "సీ. ఎమ్మెకాఁ డౌసుకాఁ డన సొగసైనవాఁడు..." సాం. ని. మాన. ౧.

# అనుబంధము

## అ

అంకిలిపాటు. ద్వా. వి. (అంకిలిపడు భా.) అడ్డు, విఘ్నము.(వేముడు) చ."...అంకిలిపాటునుటెల్ల కుండ నకాపసిగొని ప్రోవుమయ్య." వృషాధిప శ. ౧౦౬. "ఉ. ధర్మవు తప్పి తాపస మతం బున నంకిలిపాటు నొనర్పు గ్రో, ధోర్మిహ తాత్మునై తపసు లొప్పగు నాశనిపక్షిణంపుఁ గేక్, నిర్మథనంబు సేసిన గనిం చెఁ బృసుం డను వాఁడు..." పాం. పూ. ౧ ఆ. ౬౩.

అంకుసు. దే. వి. కొండగీలు, అంకిలి. ఆం. భా. ద్వి. ౧౪౩.

అంకూరించు. సం. = అంకురించు. "సీ. మొగపలదిగి వీడు తొగల సంకూరించు కొత్తసెత్తావి మూ గన్న నుము సాఁకుసు...గీ..., తాపరవశమై చక్రవాకయుగము." కవిక. ౪ ఆ. ౭౧.

అంగదట్టము. మి. వి. 2. కౌపీనాంబరీయము. ఆం. భా. ద్వి. ౧౫౮.

అంగిరుఁడు. సం. = అంగిరసుఁడు.

అంఘుస్సు. సం. వి. స్. న. పాపము. "శ్లో...అంఘోవిఘాతమ్". సూర్యశతకము. ౬.

అంచెలవాఁడు. దే. వి. 2. చిత్రకారుఁడు. ఆం. భా. ద్వి. ౨౮౨.

అంజెమెడపట్టు. దే. వి. మల్లబంధవిశేషము. ఆం. భా. ద్వి. ౨౦౯.

అంటఁగట్టు. దే. స. క్రి. 1. అంటునట్టు కట్టు. భార. ఆది. ౫ ఆ. ౧౭౨. 4. పోఁగొట్టు, నశింపఁజేయు. "సీ. వరుణుని శౌర్యంబు వఱితిపా లుగఁ జేసి యనలునియుద్ధతి నంటఁగట్టి." భా. రా. యు. ౧౩౯౧.

అంటనిది. దే. విశే. (అంటని+అది), (అంటన్+రానిది) అంటరానిది, ముట్టుత. "క...పతిత సంటనిదాని నగ్నఁ జూడం, జనదు..." భార. అను. ౪ ఆ. ౧౧౬. ("ఉదక్యాదర్శనే తద్వన్న గ్నస్యాచమనం స్మృతమ్." అని మూలము.)

అంటనివేల్పు. దే. వి. (అంటని+వేల్పు) అగ్ని. ఆం. భా. ప్ర. ౪౭. ఇట్లే; అంటరానివేల్పు. అచ్చ. సుం. ౧౬౯.

అంటెలు. దే. వి. బ. ముడుపులు. ఆం. భా. తృ. ౨౯.

అంతరదామర. ఆకాశతామర (బ్రా.) "చ. అలయఁ బురంబుసం దొగల నంతరదామరఁ బ్రాదిఁ గప్రపుష్, పలపులుమీఁఱ...పురాతన తీర్థకుండ ముల్." అను. ౧ ఆ. ౭౧. ఆం. భా. ప్ర. ౧౬౫.

అంతర్భవము. సం. విశే. (బ. ఆ. అ) లోపలిది; లోపల నున్నది.

అంతర్భవించు. సం. అ. క్రి. లోపలఁజొచ్చియుండు. "వ... పినాకి...జ్యోతిర్లింగంబునం దంతర్భవించె..." కాశీ. ౬ ఆ. ౧౫౮.

అంతర్భావము. సం. వి. అ. పుం. 1. లోపలఁజొచ్చియుండుట. 2. మాఱుఁగుపడుట. 3. సహజభావము, నిసర్గత.

అంతిపురము. 1. అంతఃపురము. "ఉ. అంతిపురంబు లోనఁ గలయంగన లెల్లను..." భార. విరా. ౪ ఆ. ౫౮. 2. అంతఃపురస్త్రీలు. "క. అంతిపురము చుట్టఱికం, బెంతయుఁ గీడు...భటునకున్." భార. విరా. ౧ ఆ. ౧౩౧.

అందగింపు. "సీ...మాటలో నందగింపు." కువల. ౫ ఆ. ౫.

అందచెందము. దే. వి. సౌందర్యము, సొగసు. (వా) విశే. సుందరము, సొగసైనది. "గీ...అందచంద మగుచు, నొనరు నుచ్చైశ్శ్రవంబు నేత్రోత్సవ ముగ." దశా. ౨ అ. ౨౨౭.

అందపడు. "గీ...అందపడిన, పృథులరత్నంబు..." నా. పంచ. ౧ ఆ. ౩౧.

అందుబడి. దే. విశే. 3. సులభము; లభ్యము; ఫలప్రదము. "గీ. అవని నాబాలగోపాల మగు సమస్తజీవులకు నందుబడియైన దేవభూజ,

మస్యే నేదేవు: డట్టి మహానుభావు, నాని నర సింహదేవుని నాశ్రయించి." భా. కిరి. ౮౯.

అంబేవ. 2. మిక్కిలి పేదవాఁడు. "సీ. అరిభయంకర లంక యంబేవగొంపనే శోధించుకొనిపోఁ బ్ర కొఱవిఁ జూడ." రామా. ౭ ఆ. ౭. (అంబేవ కొంపఁ=పూరిగుడిసె)

అక్కజేము. వై. వి. ఆశ్చర్యము. "గీ...అన్యోన్య మైత్రి నక్కడఁ జరించు, పులుఁగూనలు జింక పిల్లలు మృగేంద్ర, పోతకంబులు సాలక్రేపు లును గడుపు గట్టుకొని కూడియాడ నక్కజముఁ జెంది." పిన. శకుం. ౨ ఆ. ౮౦.

అక్కటికించే. దే. అ. క్రి. జాలిగొను, దయ చూపు. "ఉ...నీజనని...బడల నక్కటికింప విదేమి పుత్త్రికా". శ్రీరం. మా. ౧౦ ఆ. ౭౯.

అగలించే. (భేదించు) "ఉ...నామనసుపాఁ తగ లించి వెలార్చినట్టియా, మాటలు...విక్ర. ౮ ఆ. ౧౦౪.

అగలు. 1. ఛేదిల్లు. "ఉ...మిన్నగల..."స్వా. ౫ ఆ. ౩౦. 3. నశించు. "చ...పొల్పగలన్..." భా. రా. యు. ౧౩౮౭. 4. కలఁగు; దుఃఖించు. "ద్వి. వగపులన్నియుఁ బాయ వరమిచ్చె దైవ, మగల నేటికి..." ద్వి. హరిశ్చ. ఉ. ౨౩౭౪ పు.

అగులు. దే. వి. బొట్టుపెట్టుకొనుటకై నూకలు, సగ్గుబియ్యము మున్నగునవి మాడ్చిచేయు పదా ర్థము. (చూ. అగులుబొట్టు.)

అగులుబొట్టు. దే. వి. (అగులు+బొట్టు.) అగులు తోఁ బెట్టుకొన్నబొట్టు. (వా.)

అచ్చేతుఁడు. వై. వి. (సం. అచ్యుతః.) అచ్యు తుఁడు; కృష్ణుఁడు. "క. అచ్చుతునిఁ దోడితెమ్మని, యచ్చిలుకను బనిచి రాధ యటమటపడఁగన్." రా. సా. ౮.

అటమటపడు. ద్వ. అ. క్రి. అటమటించు, కలఁగు. రా. సా. ౮.

అడబాలతనము. దే. వి. (అడబాల+తనము) సూప కారత్వము, వంటపని కొప్పుకొని చేయుట. "సీ...కపటికైయై భూపాలుగృహమున నడబాల తనమున నర్థిఁ గొలిచి, యుండఁడ వసిష్ఠున కుర్వీ శుఁ డొక్కనాఁ డన్నంబు సేయంగ నతనిఁ బనుప. గీ. వాఁడు మానవమాంసంబు వండి తెచ్చి, మునికి వడ్డింప..." భాగ. ౯ స్కం. ౨౩౭.

అధఃకరించే. 3. ఉపాలంభించు; నిందించు. "వ. ఈరీతి నానారీతిలసం బజ్జవైరి నసమతించినయు సలరువిల్తు నధఃకరించియుం...మూర్ఛిల్లిన..." కాళిం. 3 ఆ. ౧౩౦.

అనురోధించే. సం. స. క్రి. దూఱు. నిందించు. కాళిందీ. 3 ఆ. ౧౩౦.

అనువుపడు. ద్వ. అ. క్రి. (అనువు+పడు.) 1. ఒప్పు, శోభించు. "క...ఇ, ట్లనువుపడునె వళుల పేరనంగుళిరేఖల్." నైష. ౫ ఆ. ౧౬. 2. ఏర్పడు, సిద్ధమగు. "గీ. అసురజయలక్ష్మి రాఁ ద్రోవ యనువుపడఁగ." రామా. ౪ ఆ. ౩౪. 3. సానుకూలమగు; సిద్ధించు. "గీ. యత్న మొనరింతు నీకార్య మనువుపడఁగ." కాశీ. ౨ ఆ. ౧౦౦.

అనువుపఱచే. ద్వ. స. క్రి. (అనువుపడు ఈ. ప్రే.) 1. ఒప్పించు, శోభిల్లఁజేయు. "క. లీలాసంక్రమ వేళల, బాలా నీచరణలాక్ష ప్రగమ్రశిలా, జాలములఁ గృతకగైరిక, బాలాతపశంక ననువు పఱచుం గాతస్." నైష. ౫ ఆ. ౪౯. 2. దక్కిం చుకొను. "క. దనుజేంద్రుఁ డాశఁ బెదరి, గనుఁ గొని చొక్కెంబు నిముసఁ గ్రమ్మనఁ బైకొం, గనువు పఱచు గేడఁగిరేకు నఖంబులఁ జీఱుఁ గులుకుఁ గొరుక్కలఁ దేలన్." ఉ. హరి. ౧ ఆ. ౫౮. 3. వశపఱచుకొను. "సీ...అష్టాంగయోగంబు ననువుపఱచి." భీమ. ౫ ఆ. ౧౬౧. 4. సానుకూలప ఱచు, సిద్ధింపఁజేయు. "క...నాతలఁ-చినపని, యనువుపఱచి...వత్తున్." ఉ. హరి. ౨ ఆ. ౯౧.

అపరంజి. మేలిమిబంగారము "సీ. కనకశౌర్యశిఖి శిఖా తతికి జాంబూనదభూధరం బపరంజిపూదోగాఁగ" వసు. ౧ ఆ. ౧౧౬.

అపాకరించే. సం. స. క్రి. దూఱు, నిందించు. కాళిందీ. 3 ఆ. ౧౩౦.

అపురస్కరించే. సం. స. క్రి. దూఱు, నిందించు. కాళిందీ. 3 ఆ. ౧౩౦.

అబాసి. వై. విశ. (అబాస+ఇ.) దుష్టుఁడు, అబాసు చేయువాఁడు. "సీ...అబాసి కడుఁ బ్రేమ నడపి న్గ..."హంస. ౫ ఆ. ౧౧౩.

కొన్ని యుగమునఁ గానఁబడన్..." సా. 3 ఆ. ౪౮. 6. పరిహాసము. "గీ. అత్తపోషణవర్య లయ్యాగడమున, కాత్మలందుఁ గ్రోధానల మగ్గలముగ." భార. మా. ౮. 7. అన్యాయము. "క...వెన్నెలఁ జేఁద, ట్లాగడమున మెలఁగెడు మము, బాగుగఁ బొడగాంచి..." అచ్చ. బాల. ౧౪౭. విణ. 1. అన్యాయము చేయువాఁడు. "క...అయ్యా, గడపున్నపుం బాయుఁ జేవగల సైన్యంబుల్." వేం. పంచ. ౧ ఆ. ౫౧౯. 2. శిష్టాచార్తుఁడు. "క...మాటాడిన నీ, వాగడమగుదువు..." భాగ. ౧౦ స్కం. పూ. ౧౪౧౬.

ఆచరించు. 1. చేయు. "క. లోకత్రయైకసంరక్షా కల్పన మాచరింప..." భీమ. ౪ ఆ. ౭౮. 2. చదువు. "సీ. పంచాక్షరీమంత్రపాఠంబు నిత్యంబు నాచరించుచు నుండునతఁ డొకండు." భీమ. ౫ ఆ. ౧౪౯. 3. ఇచ్చు. "గీ. పలుఁదశశూలంబు ...,హస్తములకు విలాసంబు నాచరింప." ఉష. ౨ ఆ. ౭3. 4. చూచు. "వ...ఆక్షేత్రంబునం గల విచిత్రంబులు నేత్రప్రీణనంబుగా నాచరించుచు..." పాండు. ౫ ఆ. ౧౧౯.

ఆచరితము. సం. వి. అ. న. 1. ఆచారము. 2. ఋణగ్రహణోపాయము. (ధర్మము, వ్యవహారము, ఛలము, బలము, ఆచరితము నని యివి యైదు తెఱఁగులు.)

ఆచ్ఛాదించు. 1. మఱుఁగుపఱచు. "వ...అంధకారము బ్రహ్మాండమండలము నాచ్ఛాదించె..." కాశీ. ౪ ఆ. ౧౧౮. 2. కల్పించు. "వ. యోగీశ్వరులు మోహితులై భేదంబు నాచ్ఛాదించి ..." భాగ. ౧ స్కం. ౪౨౭.

ఆజ్ఞపడు. మి. అ. క్రి. (ఆజ్ఞ+పడు.)ఆజ్ఞాబద్ధుఁడగు; చిక్కుపడు. "సీ. తరళాక్షి చూడ్కులఁ దానాజ్ఞపడి యుండి ధరనాజ్ఞ చెల్లించుతగవు మఱచె." కేయూర. ౧ ఆ. ౭౦.

ఆజ్ఞయిడు. మి. స. క్రి. (ఆజ్ఞ+ఇడు) దండించు. "చ. కనికరమేది యాజ్ఞయిడె..." సా. 3 ఆ. ౨౨౦.

ఆజ్ఞవాఁడు. మి. విణ. (ఆజ్ఞ+వాఁడు) ఆజ్ఞాపాలకుఁడు. "గీ. అఖిల దిక్పాలకులు నీయాజ్ఞవారు." భీమ. ౪ ఆ. ౭౨.

ఆజ్ఞవెట్టు. మి. స. క్రి. (ఆజ్ఞ+పెట్టు) 1. శాసించు. "గీ. దట్టమెనట్టి కర్మబంధములనెల్ల, నాజ్ఞపెట్టెడువారు..." భాగ. ౬ స్కం. ౧౬౪. 2. శిక్షించు. "ఆ. పట్టి నిట్టు లాజ్ఞవెట్టఁ గట్టిడిసేసి ..." సా. 3 ఆ. ౨౩.

ఆజ్ఞాపించు. 1. శాసించు. "క. అపరసేంద్రవిభును నాజ్ఞాపింపఁగ..." పాండు. ౧ ఆ. ౧౫౪. 2. అనుగ్రహించు. "మ...సాక్షిప్తమా, హానుభర్తా వను సత్కథాశ్రవణ మాజ్ఞాపించి జన్మాంబుధిన్, దరణం బొందఁగఁజేయుచే..." ఉష. 3 ఆ. 3౦౨.

ఆటకత్తె. ఆం. భా. ప్ర. ౧౬౯.

ఆటగీము. ద్వి. వి. (ఆట+గీము) నర్తనగృహము. అచ్చ. బాల. ౬.

ఆటచేడియ. దే. వి. (ఆట+చేడియ) వెలికత్తె. నీలా. ౧ ఆ. ౪౦.

ఆటతెఱవ=ఆటచేడియ. పరమ. ౨ ఆ. 3౦.

ఆటది. దే. వి. వేశ్య "ఉ. ఆటదియన్న నూర్వశి..." అహ. ౧ ఆ. ౭౧.

ఆటపులుఁగు. దే. వి. (ఆట+పులుఁగు) నెమిలి. "వ... ఆటపులుఁగుల ననురోధించియు..." శాలింగీ. 3 ఆ. ౧3౦.

ఆటవిడుపు. "శా...ఆటవిడుపైన ట్లుండె..." ఉ. రా. ౧ ఆ. ౧3౭.

ఆటవెలఁది. (ఉపజాతి పద్యభేదము. కవిజనా. ౨3).

ఆడ. "సీ. మొదల నదీవేగమున రాడఁబాడకు సికతంబు గూడుచుఁ జెనరుచుండు." భాగ. ౬ స్కం. ౪౫౫.

ఆడిక. 1. "ఉ. ఆడికలైన నేమి మగఁడాఱడిఁ బెట్టిననేమి..." శకుం. ౪ ఆ. 3౭. 2. ప్రతిజ్ఞ, శపథము. "గీ. మనకు మనయాడికలు తప్పుటనికి చాలు." శివరా. 3 ఆ. ౭౭.

ఆడుకొను. (నిందించుకొను) "గీ. అమ్మలక్కలు మిన్నక యాడుకొంద్రు." రాధా. ౨ ఆ. ౬౧. 3. చెప్పుకొను. "గీ. ఏనఁ గక్కుర్తిమాటఁ దానాడుకొనెద." కుచేల. ౧ ఆ. ౪3.

ఆడెబలు = ఆడెలు. ఆం. భా. ప్ర. ౭3.

ఆడెలు. 2. మొగిలుదొంతి. ఆం. భా. ప్ర. ౭3.

ఆనవదగాలు. 2. నింద. "గీ. వాని దెవ్వకిని లేని యూరవదగాలు, నీపల స్ప్రెనె ధాన..." ఆగ. 3 ఆ. ౪౬. విశే. నిందింపదు; నిందింపగాలు. "గీ. ఎంత సియ్యంగ యూయదగాలైన యాను, నైతి నేరప తగువాని హత్తుకొన్న, నింతకన్నను నన్ను నీ రేమి సేయ, నేర్తు రని నెమ్మనంబున నిశ్చయించి." శుక. 3 ఆ. ౨౯౩.

ఆరగోల. వ్యా. వి. (ఆర+గోల) బరిగోల. ఆం. భా. ద్వి. ౧౯౫.

ఆర్జించు. "గీ. శిష్యుని... భిక్షచేసి యార్జించినపట్టి, ద్రవ్యము..." భీమ. ౫ ఆ. ౧౪౭.

ఆర్పనము. ఆం. భా. ద్వి. ౨౭౧.

ఆర్భటించు. సం. గా. క్రి. 1. ధ్వనిచేయు. 2. విజృంభించు. "గీ... హైరణ్యగర్భచమూ డార్భటించి." వేం. మా. ౧ ఆ. ౪౬.

ఆర్వ్వరు=ఆయిగురు. "ఉ. ఆర్వ్వరు చక్రవర్తులు..." విక్ర. ౨ ఆ. ౩౪.

ఆర్ష్టేయుడు. సం. విశే. (ఋ. సం. ...) ఋషుల సంతతి లోనివాడు.

ఆఱడి. క్రి. విశే. 1. ... "... ఆఱడి చావంగ నేల..." భార. ఉద్యో. ౪ ఆ. ౩౧౫. 2. నిరుపయోగముగా. "చ... ఆఱడి విప్రుల కేల యశ్వముల్." భార. అర. 3 ఆ. ౩౪౯. 3. దిక్కు లేకుండగా. "చ... అతడు నచ్చునె యాఱడి యేను గల్లగన్." భార. ద్రో. ౪ ఆ. ౨౭౦.

ఆఱడించు. దే. స. క్రి. క్రిందుపఱుచు, మించు. "సీ. గోరుచేతనె కాదు పొరుచేతనుగూడ దారాని నోదంబు నాఱడించు." రాధికా. ౧ ఆ. ౨౩.

ఆఱడిచేయు. దే. అ. క్రి. (ఆఱడి+చేయు) వ్యర్థపుచ్చు. "ఉ. అక్కట వాడు నాతగుల మాఱడి చేసి దయావిహీనుడై, చిక్కక త్రోచి పోయె..." స్వా. 3 ఆ. ౫.

ఆఱడిపోక. 2. నింద. "ఉ... నే, నచ్చుట రచ్చకెక్కుటకు నాఱడిపోకకు నోర్తు..." నిర్వ. ౯ ఆ. ౮౯.

ఆఱడిపెట్టు. దే. స. క్రి. (ఆఱడి+పెట్టు.) 1. వ్యర్థపుచ్చు. "ఉ... నామనసు మోహము నాఱడిపెట్టి నీవు నన్నొల్లక పీడ నాఱెపవు..." వి. పు. ౬ ఆ. ౨౨౩. 2. బాధించు. "సీ. నోరూరజేయుచు నాఱడి పెట్టెడు మోవి..." కవిరా. ౫ ఆ. ౨౧౦. 3. నిందమోపు, అవమానపఱుచు. "క. ఆఱడివెట్టెద నని మది, నాఱని చలమూని..." అచ్చ. యో. ౨౫.

ఆఱడివోవు. 1. వ్యర్థమగు. "చ... ఆఱడివోయెం బ్రయత్నమెల్ల..." భార. ఆశ్వ. 3 ఆ. ౫౯. 2. చెడు. "క... మీ...పాయ మాఱడివోవన్." భార. ద్రో. ౬ ఆ. ౨౩౪. 3. చచ్చు. "ఆ... కన్నుల డాఱడివోవునన..." భార. ఆశ్ర. ౧ ఆ. ౧౫౪.

ఆఱయు. దే. స. క్రి. విచారించి, "ఉ. ఆయురసంబులన్..." భార. విరా. ౧ ఆ. ౭౭. "క... ఉత్తరు నాఱయిట..." భార. విరా. ౫ ఆ. ౧౦౩.

ఆలుమూఁడుచేయు. 3. త్యజించు, విడుచు. "గీ... ... ... చేసి మఱచెను..." కలు. శ. ౬౯.

ఆలంబించు. 4. చేకొను, గ్రహించు. "శా. ఆలంబించె మరుండు శాస్త్రమున... పుండ్రేక్షు కోదండమున్." శివరా. 3 ఆ. ౯౩.

ఆలగొడుబాలగొడు. 2. అందఱు గలిసిచేయు సల్లరి. (బా.)

ఆలపుచ్చు. దే. స. క్రి. ఉపేక్షించు. "ద్వి. ఆచెన్న బసవన్న నాలపుచ్చితివా." పండితా. మహిమ. ౩౦౬ పు.

ఆలరి 2. అవివేకముగలది, మూర్ఖము. "ఉ... అ, య్యాలరియొల్కు గంతుగొనినంతనె తుత్తుము రయ్యె..." భో. ౪ ఆ. ౨౫. 3. వ్యర్థము, ఉల్లంఘితము. "క. కాలముఁ దప్పఁగనీయక, నీలగళ ప్రసాద మానునియమముగానక్, వ్రాలె దినకరుఁడు నియమము, బాలరి యగునో యటంచు నసువులఁ బాసెన్." చెన్న. 3 ఆ. ౨౬౪.

ఆలాపించు. (సంభాషించు; చెప్పుకొను) "శా. బాలుం డెక్కడ బంటి యెక్కడ... ఏమో... యంచు, చాలాపించుచు..." భాగ. ౧౦ స్కం. పూ. ౨౫౭. అ. క్రి. ఆలాపధ్వని చేయు. "సీ... మ్రోల నాలాపించు మొకరి తేఁటి." విన. శకుం. 3 ఆ. ౨౧౮.

ఆలితనము. దే. వి. (ఆలి+తనము) 1. హైన్యము, తక్కువతనము. "ఉ...ఇ, య్యాలితనంబు వాపెదఁ బ్రియం బొనరించెద నీకుఁ దండ్రికిన్." భార. శల్య. ౨ ఆ. ౩౫. 2. భార్యాత్వము, పెండ్లము అగుట. "ఆ... నేను బుంవ్యక్తులకు నాలి, తనముతో సమాఖ్య మనుచు చెప్పె." రాఘవ. ౨ ఆ. ౭౩.

ఆలుమగలయాట. దే. వి. (ఆలు+మగఁడు+ఆట) 1. సంభోగము, సురతము. (చూ. ఆల్మగలయాట.) 2. బాలక్రీడావిశేషము. "సీ. ఉత్తరకోడలియాట యాలుమగలయాట ..." పశా. ౮ ఆ. ౮౫.

ఆలువరి. దే. వి. అలంగము, వప్రము. "గీ. అనినఁ డిట్టిభుఁ డౌనంచు ననుచరింప, నాలువరిక్రింది త్రోవగా నరిగి..." క్రీడా. ౧౧౫.

ఆలోకించు. 2. వెదకు. "క. భీకరతరసంసార, వ్యాకులతఁ బడిసి దేహవర్జనగతి న్యాలోకించు నాకు. దక్షక, కాకోదరవిషము ముక్తికారణమయ్యెన్." భాగ. ౧ స్కం. ౫౦౨.

ఆల్మగలయాట = ఆలుమగలయాట. (సురతము, సంభోగము) "క. మనరాధ తెలిపె నేఁటికి, ననువుగ నాల్మగలయాట లాడకయున్నన్, మన సిజభూతము వెఱపుం, గనిపించు నటంచు వేగఁ గడియుద వబలా." రాధికా. ౧ ఆ. ౧౨౧.

ఆవ. 5. ఆవపిండితోఁ జేసిన ద్రవపదార్థము. "ఉ... ఆవ యింప్వత్తుగఁ ద్రావినట్లు..." పాండు. ౫ ఆ. ౧౭౬.

ఆవటిలు. 2. (కలుగు) ఆం. భా. తృ. ౬౮.

ఆవడ. 1. (చేఁదుబీఱ) ఆం. భా. ద్వి. ౬౦.

ఆవము. "గీ...కుమ్మరావమున రాగి, ముంత లేఱం గఁగలవె..." ఉ. హరి. ౩ ఆ. ౮౭.

ఆవరించు. 1. (చుట్టుకొను) "సీ. మధురాపురముఁ జతుర్విధజలౌఘములతో నావరించిన కాలయ వనసాల్వ, మగధభూపాలాదిమనుజేంద్రలోకంబు సైన్యయుక్తముగాఁగ సంహరించి." భాగ. ౩ స్కం. ౧౨౯. 2. (కప్పు) "గీ. స్థావరంబైన రూపంబు జలదవీథి, నావరించుచు మొదల నున్నట్లె యుండ." కాశీ. ౧ ఆ. ౬౩. 3. వ్యాపించు, చేరు. "గీ. పవనవశమునఁ బుష్పులపరిమళంబు, ఘ్రాణమున నావరించిన, కరణి..." భాగ. ౩ స్కం. ౬౬౩. 4. చేర్చుకొను. "గీ. అతులపుష్పాపచయఘనాయాస ముడుగ, నగజ పీఠిక శాంకరి నావరించు, త్రిపురమర్దను పుష్ప మంటపసమీప, వసుధ నిలిచిరి గంధర్వవర్యు లంత." ఉద్భ. ౧ ఆ. ౧౦౧.

ఆవర్తించు. 5. చేయు. "క. హరినామకీర్తనంబును, హరినామజపంబు నెవ్వఁ డావర్తించున్, నరక గుహాపేపన యన్నరుననుఁ బ్రాపింపఁడు..." [illegible]శి. ౩ ఆ. ౧౫౭. 6. క్రమ్ము. "మ...ప్లవంగ పుంగవులు...సర్వంసహా నావర్తింప..." భా. రా. కిష్కిం. ౫౮౩.

ఆవలి. సం. వి. ఇ. స్త్రీ. 1. పంక్తి, వరుస. 2. సమూహము, గుంపు.

ఆవలించు. 1. జృంభించు. "మ. ఒకనిట్టూర్పు పుచ్చి కన్నుఁగవ నీ రుప్పొంగఁగా నావలించి..." నిరం. ౮ ఆ. ౭౩. 2. బ్రద్దలగు. "సీ. ఫణిరాజ భూషణుపత్ని [illegible] నిల్పుయుతిఁ జూచి గుండియ లావలింప." చంద్రా. ౩ ఆ. ౭౫. 3. పోవు. "ఉ. కావునఁ బోయి నీ [illegible] దెచ్చి కూర్చితే, గావుము [illegible] కాయజుఁ డెంతయు [illegible] లించెఁ దమి సిగ్గు [illegible] మించె మైపుల [illegible] చలించె [illegible] ముంచెఁ గీరమా." రాధికా. ౨ ఆ. ౭౧.

ఆవలిమొన్న. ఆం. భా. ప్ర. [illegible].

ఆవలియెల్లుండి. ఆం. భా. ప్ర. ౬౧.

ఆవహిల్లు. 2. వ్యాపించు. "సీ. పుష్పవర్షములకుఁ బ్రోదియై వినువీథి దేవదుందుభినాద మావహిల్ల." హర. ౬ ఆ. ౭౭. [వాఁడు.

ఆవిర్భవిత. సం. విణ. (బు. త్రీ. బు) ఆవిర్భవించు

ఆవాహించు. సం. స. క్రి. ఆవాహనముచేయు; ప్రతిష్ఠించు. "శా. దేవేశుండు పరిగ్రహించుట నుమాదేవిన్ సఖుల్ దగ్గఱం, బోవం జూడఁగ నోడి రోటఁ దగదే పాల్పొందఁగాఁ బుత్త్రికల్, దేవార్థంబుగఁ జేసియున్నఁ గని బుద్ధిం జేక నావెల్వనం, దావాహించినమీఁద నెవ్వరికి డాయన్ మట్టఁగా వచ్చునే." కు. సం. ౬ ఆ. ౫౮.

ఆవిర్భవించు. సం. అ. క్రి. 1. పుట్టు. "సీ...వింధ్యాద్రిదరుల నావిర్భవించి, యత్యుచ్చముఖ ధూమమాకాశ మెల్లను గప్పిన..." భార. అర. ౮ ఆ. ౯౬. 2. ప్రవేశించు. "గీ. ... మించి మధుమాస మావిర్భవించె నపుడు." ఉద్భ. ౧ ఆ. ౭౪. 3. ప్రత్యక్షమగు. "గీ. కంకణాంగదవనమాలికావిరాజ, మానుఁ డసమానుఁ డంగుష్ఠమాత్రదేహుఁ, డొక్కఁ గదఁ జేతఁ దాల్చి నేత్రోత్సవముగ, విష్ణుఁ డావిర్భవించె నవ్వేళయందు." భాగ. ౧ స్కం. ౨౭౯.

ఆవిర్భావితుఁడు. సం. విణ. ([illegible] ఆ. [illegible]) ఆవిర్భవించువాఁడు.

ఆవిర్భూతి. సం. వి. ఇ. స్త్రీ. ఆవిర్భావము.

ఆవిష్కరించు. 3. నిరూపించు. "క...నాకు నీకును భేదం బావిష్కరింపవచ్చునె, యేవారికి నైనఁ బర్వతేశ్వరతనయా." కాశీ. ౪ ఆ. ౧౯౬. 4. సాగించు, నిగుడ్చు. "గీ. విబుధగంగాతరంగిణీవేణిమధ్య, సైకతోత్సవవేదికా సంప్రరూఢ, తరుణమంజులకుంజవేతసవుడుంగ, పీఠికలయందు దృష్టి యావిష్కరించి." కాశీ. ౨ ఆ. ౭౧.

ఆవు. (గోవు) "క. స్తుతి పూర్వముగఁ బ్రదక్షిణ, మతిభక్తి రచించు నెవ్వఁ డావుల కతనిన్, ధృతిఁ బొందునపుడు సకల, క్షితికిఁ బ్రదక్షిణము నియతిఁ జేసినఫలముల్." కాశీ. ౨ ఆ. ౨౩.

ఆవృష్టి. సం. వి. ఇ. స్త్రీ. వాన.

ఆవేది. సం. విణ. (న్. నీ. న్) ఆవేదకుఁడు.

ఆవేశించు. 4 కలకొను, నిండియుండు. "మ... మా, విజయుం జేరెడు పన్నగాఁడు మది నావేశించు నల్లప్పుడున్." భాగ. ౧ స్కం. ౯౧౮; 3 స్కం. ౯౭౨. స. క్రి. ఆక్రమించు, క్రమ్ముకొను. "మ. అని మెప్పించి మహర్షులెల్లవారును నత్యాశ్చర్య మొప్పన్ బ్రభా, వనిరూఢిం గొనివచ్చిరి...గోదావరీ వాహినిన్, వెనుకన్ముందటఁ బార్శ్వదేశముల నావేశించి సేవించుచున్." భీమ. ౪ ఆ. ౧౭౮.

ఆశీర్వదించు. "వ...యనంతరంబు బొడ్డు నివురుకొనుచుం బ్రాణాపానసమానోదానవ్యానంబులు దృప్తిం బొంది నాకు నానందం బొసంగుం గాక మని యాశీర్వదించుకొనునది..." కాశీ. ౫ ఆ. ౨౨౪.

ఆశ్రయించు. 1. ఆశ్రయము చేసికొను. "ఉత్సాహము...భీమనాథ దేవునిన్, దక్షవాటికాపురైక ధాము నాశ్రయించెదన్." భీమ. 3 ఆ. ౨౦౨. 2. చేరియుండు. "వ ..రాజదేహంబునందు వర్తించు నిన్ను నసత్యలోభ చౌర్య దౌర్జన్య దురాచార మాయాకలహ కపట కలుషాలక్ష్మ్యాది ధర్మేతర సమూహంబు లాశ్రయించు ..." భాగ. ౧ స్కం. ౪౩౪. అ. క్రి. వర్తిల్లు, ఉండు. "సీ. పాపోదకం బను ప్రసమతీర్థంబున నాదికేశవుఁ డన నధివసించుఁ, దద్దక్షిణమున శ్వేతద్వీపమున నేను జ్ఞానకేశవ సంజ్ఞ నాశ్రయింతు." కాశీ. ౬ ఆ. ౧౨౦.

ఆశ్లేషించు. 2. క్రమ్ము, కప్పు. "శా. స్నిగ్ధాష్టాపద శుంభదీప్తి రవి నాశ్లేషింప...సుధాంశో నాక కోదండ స, మ్యగ్ధామాశ్రయ తోరణ స్ఫురితులు నేత్రానందము జూపఁగన్." ఉద్భ. 3 ఆ. ౪.

ఆస. 1. (ఇచ్ఛ, కోరిక.) "ఉ...నా, యాస నిరాకరింపఁ దగవా కరుణాకర పాండునందనా." హర. ౭ ఆ. ౧౨౯. 2. (దిక్కు) ఆం. భా. ప్ర. ౭౧.

ఆసగొను. వై. అ. క్రి. (ఆస+కొను) ఆసించు, కోరు. "క. వాసాపవర్గకనంబుల, భాసిల్లెడు నీముఖంబు పలుమఱు నిపుడే, యాసలు పుట్టింపఁగ నే, నాసగొనెద నిన్నుఁ జూచి యంబుజనేత్రా." భాగ. ౫ స్కం. ౧ ఆ. 3౬; రాధా. ౨ ఆ. ౬౨.

ఆసగొలుపు. వై. స. క్రి. (ఆసగొను ధా. ప్రే.) ఆశింపఁజేయు. "సీ. [illegible]వఁ జూచినఁ దిట్టి పో[illegible] గిదేల వాదాడఁ జాల మటంచు నాసగొలిపి." శుక. ౪ ఆ. ౭. ఇట్లే: ఆసగొల్పు. "ఉ. జిత్తుల కత్తె లిచ్చకముఁ జేయుచుఁ బైకొని నాస గొల్పు..." రాధా. 3 ఆ. ౭౫.

ఆసచేయు. 2. ఆసపడు. "వ...వెండియుం గడుసరి దానవులు మిసిమిగల పసిఁడి కాసచేసి పడఁద్రోసి గాసిం బఱచిన ప్రాసాదంబులును..." ఉ. హరి. ౧ ఆ. ౫3.

# పద్యకావ్యములు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అప్పకవీయము, గిడుగు రామమూర్తిపంతుల విమర్శతో ... ... | 5 | 0 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) ... ... | 6 | 0 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము, (పోతనది, రెండు సంపుటములు) ... | 15 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము ... ... | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము ... ... | 7 | 8 |
| శాంతిసప్తకము ... ... | 7 | 8 |
| ఆంధ్ర శ్రీమద్రామాయణము—జనమంచి శేషాద్రిశర్మగారిది, 3 సంపుటములు ... | 15 | 0 |
| డిటో 7 సంపుటములు ... ... | 18 | 0 |
| ఉత్తరరామాయణము, చక్కవిమూర్తి ... ... | 6 | 0 |
| ఉత్తరహరివంశము ... ... | 3 | 8 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు ... ... | 15 | 0 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము ... ... | 1 | 12 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది ... ... | 1 | 8 |
| దశకుమారచరిత్రము, పద్యము, కేతనకవిది ... ... | 3 | 0 |
| దశావతారచరిత్ర ... ... | 3 | 0 |
| నిర్వచనోత్తరరామాయణము ... ... | 1 | 8 |
| పంచతంత్రము, నారాయణకవిది ... ... | 1 | 8 |
| డిటో వేంకటనాథ రాజకవికృతము ... ... | 2 | 0 |
| పల్నాటివీరచరిత్రము ... ... | 3 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము ... ... | 1 | 12 |
| పారిజాతాపహరణము, సాంధ్రటీకా తాత్పర్యము ... ... | 3 | 0 |
| భాస్కరరామాయణము ... ... | 8 | 0 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో ... | 5 | 0 |
| మార్కండేయపురాణము ... ... | 3 | 0 |
| భక్తిరసశతకసంపుటము I శతకములు ... ... | 3 | 0 |
| ,, II ,, ... ... | 3 | 0 |
| ,, III ,, ... ... | 3 | 0 |
| నీతిశతకసంపుటము ,, ... ... | 3 | 0 |
| రంగనాథరామాయణము, ద్విపద ... ... | 6 | 0 |
| వసుచరిత్ర, సటీకా తాత్పర్యము ... ... | 8 | 0 |
| వేమనపద్యములు, (2728) ఆంధ్ర తాత్పర్యముతో ... ... | 7 | 8 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది ... ... | 3 | 0 |
| సీతారామాంజనేయసంవాదము, సటీకా తాత్పర్యము ... ... | 6 | 0 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక ... ... | 5 | 0 |

ఇవిగాక సంస్కృతాంధ్రగ్రంథములు ఇంకెన్నియో కలవు.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.